# ఖాకీ బతుకులు

(నవల)

స్పార్టకస్



ప్రత్యూష పబ్లికేషన్స్

**P.B.No. 8.** తెనాలి - 522 201

గుంటూరు జిల్లా, ఆం.ప్ర

ఖాకీ బతుకులు (తెలుగు నవల)

రచయిత : జి. మోహనరావు (స్పార్టకస్)

---


రచనాకాలం : 1980 - 1983.

మొదటి ముద్రణ : 1996 అక్టోబర్, కాపీలు : 1000.
సైజ్: 1/8 క్రౌన్. పేజీలు : XIII + 805. (హేండ్ ప్రెస్)

రెండవ ముద్రణ : 1998 జనవరి, కాపీలు : 2000.
సైజ్:1/8 డెమ్మీ. పేజీలు : 114 + 458. (డి.టి.పి.)

ముఖచిత్రం,
అట్టవెనుక చిత్రం,
చివరిపేజీలోని
పోలీస్ రోబోట్ బొమ్మ : మోహన్. (హైదరాబాదు)

రచయిత ఫోటో : జి. భరత్ భూషణ్. (హైదరాబాద్)





వెల : సాధారణ ప్రతి రూ. 100-00లు. (పేపర్‌బాక్)
: మేలు ప్రతి రూ. 160-00లు. (హార్డ్ బౌండ్)

DTP : తేజస్వి గ్రాఫిక్స్, కొత్తపేట, తెనాలి-522 201.

ముద్రణ : డాన్‌బాస్కో ప్రింటింగ్ ప్రెస్, గుంటూరు.



రచయిత అడ్రసు : జి.మోహనరావు,
పోలీసు క్వార్టర్స్ C-8
కొత్తపేట, తెనాలి - 522 201. A P, INDIA
Ph : 08644-25148



ప్రతులకు : ప్రత్యూష పబ్లికేషన్స్,
PB No. 8.
తెనాలి - 522 201.

# పరిచయం.

ఇది నా తొలి రచన పుస్తకాలు చదివే అలవాటు నన్ను ఈ రచన చేయటానికి పురికొల్పింది నేను చదివిన తెలుగు పుస్తకాల్లో కొన్ని రచనలు నన్ను బాగా ప్రభావితం చేశాయి వాటిల్లో కొన్ని - గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కం , ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి , శ్రీశ్రీ మహాప్రస్థానం, దానికి చలం రాసిన ముందుమాట, రంగనాయకమ్మగారి స్వీట్‌హోమ్, ఏ బీ కే ప్రసాద్‌గారి విజ్ఞానదాయకమైన సంపాదకీయాలు , ఆర్టిస్ట్ మోహన్‌గారి అద్భుతమైన సామాజిక స్పృహతో నిండిన బొమ్మలూ మొదలయినవి

వీటితోపాటు తెలుగు అనువాదంలో వచ్చిన జాక్ లండన్ ఉక్కుపాదం, ప్రకృతి పిలుపు, ఎమిలీజోలా భూమి, చింగీజ్ ఐత్ మాతోవ్ తల్లి భూదేవి, జమీల్యా, టాల్‌స్టాయ్ అన్నాకెరినీనా, యుద్ధమూ శాంతి, ఆంతోనీ చెహోవ్ కథలూ, మార్క్‌ట్వేయిన్ టామ్‌సాయర్, హకల్ బెరీఫిన్

ఇవన్నీ ఒక ఎత్తయితే హోవర్డ్‌ఫాస్ట్ రాసిన స్పార్టకస్ , ఎలక్స్ హేలీ రాసిన ఏడుతరాలు (రూట్స్), హారియట్ బీషర్ స్తోవే రాసిన టామ్‌మామ ఇల్లు (అంకుల్ టామ్స్ కేబిన్), హోవర్డ్‌ఫాస్ట్‌దే ఇంకో నవల స్వేచ్ఛాపథం (ఫ్రీడమ్‌రోడ్), మక్సీమ్‌గోర్కీ అద్భుత రచన అమ్మ - ఇవి నన్ను బాగా కదిలించాయి

వీటిల్లో కూడా అంకుల్ టామ్స్ కేబిన్ నవల నన్నెంతగానో ప్రభావితం చేసింది ఆ నవలలోని సంఘటనలకు ఎన్నోసార్లు కళ్ళు చెమర్చాయి అది చదువుతుంటే అమెరికాలోని నీగ్రోల జీవితాలకూ, భారతదేశంలోని దళితుల జీవితాలకూ పెద్ద తేడా లేదనిపించింది ఆ నవలని అనువదించిన రంగనాయకమ్మగారు, ఆ నవల చివర్లో రాసిన 'చివరి మాట'లో, ఆ నవలా రచయిత్రి హారియట్ బీషర్ స్తోవేని గురించి రాసిన వివరాలు నన్నెంతో కదిలించాయి నిజానికి ఆ నవల చివరిమాటే నన్ను రచయితగా మార్చింది ఆ నవల అమెరికాలో ఎంతటి సంచలనానికి కారణమయ్యిందో తెలుసుకొని ఆశ్చర్యపోయాను 'నేనెందుకు అలా రచన చేయకూడదు ?' అని ప్రశ్నించుకున్నాను 'నా వృత్తిలో నాకు తెలిసిన నిజాలతో, పోలీసు కానిస్టేబులు యొక్క 'నిజ జీవితాన్ని' రచన ద్వారా ప్రపంచానికెందుకు చూపెట్టకూడదు ? అదీ ఒక దళిత పోలీసు కానిస్టేబులి బ్రతుకు ఈ కుల మతాల, దోపిడీ సమాజంలో ఎలా ఛిద్రమై పోతోందో ఎందుకు రాయకూడదు ?' అని మనస్సు తహతహలాడింది

ఈ దేశంలో అంటరానివారుగా పిలవబడుతున్న దళితులు శ్రమ చెయ్యకపోతే ఈ దేశ మనుగడే లేదు అయినా వాళ్ళ గురించి పట్టించుకున్న వాళ్ళు బహు అరుదు అలాగే పోలీసు లేకుంటే ప్రజాస్వామ్యమే (అలా అని ప్రచారం జరుగుతోంది) ఉండదు అయినా అంతటి ముఖ్యమయిన పోలీసు గురించీ, అతని సాధకబాధకాల గురించీ ఏ మేధావీ, కళాకారుడూ పట్టించుకున్న పాపానపోలేదు దేశంలో, ఆ మాటకొస్తే ప్రపంచంలో పోలీసు అవసరంలేని ప్రజలు ఏ కొద్దిమందో వుంటారు కాని అతని సమస్యను గురించి ఆలోచించే బాధ్యత ఎవ్వరూ తీసుకోరు

ఏ రచయితా పోలీసు కానిస్టేబులి జీవితంమీద దృష్టిపెట్టిన దాఖలాలు లేవు నాకు తెలిసినంత వరకు, కె యన్ వై పతంజలిగారు 'ఖాకీవనం' పేరుతో ఒక నవలిక రాశారు అంతకుమించి ఎవరూ పోలీసుని పూర్తిగా పట్టించుకున్న ఆనవాళ్ళు తెలుగులోనేకాదు, ఏ భారతీయ భాషలోనూ కనిపించలేదు

ఎవరో వస్తారనీ, తమ తరపున, తమకోసం ఏదో చేస్తారనీ ఎదురుచూసే రోజులు పోతున్నాయి స్త్రీలు రచనల ద్వారా తమ సమస్యలను ప్రపంచం ముందు పెడుతున్నారు దళితులు తమ బ్రతుకులకు అక్షరరూపం ఇస్తున్నారు

ఇలా ఎవరికి వాళ్ళు చైతన్యవంతులయి మేల్కొంటున్నప్పుడు పోలీసు మాత్రం ఇంకెంతకాలం తమ సమస్యలను తలుచుకుంటూ, తన నెవరోవచ్చి రక్షిస్తాడని ఎదురు చూస్తాడు ? తనే తన జీవితం ఎలా వుందో ప్రపంచానికి చెప్పుకోవాలనే చైతన్యంతో ముందుకు కదులుతున్నాడు

అందుకే ఆ జీవితం తెలిసిన నేను పోలీసు బ్రతుకుని ప్రపంచం ముందు వుంచాలనుకున్నాను ప్రజలకోసం పాటుపడే పోలీసు బ్రతుకిలా గెందుకుందని మేధావులని అడగాలనుకుంటున్నాను హరియట్ బీషర్ స్టౌవే జీవితం నాకా బాధ్యతను గుర్తుచేసింది పారకుణ్ణి ప్రభావిత పరచగల ఆ చివరిమాటను నవలతోపాటు ఇచ్చిన రంగనాయకమ్మగారి దూరదృష్టి నాకు ఆశ్చర్యం కలిగించింది దాని ప్రభావం నుండి తప్పించుకోలేకపోయాను తత్ఫలితంగా ఈ నవలా రచన కుపక్రమించాను

అప్పటివరకూ కనీసం ఒక్క వాక్యంకూడా ఏ సందర్భంలోనూ రాయని వాడిని కావటం వలన, నా ఉద్దేశ్యాన్ని తెలుపుతూ రంగనాయకమ్మగారికి ఉత్తరం రాయటం, ఆమె నన్ను ప్రోత్సహిస్తూ రచన చేయటానికి తగిన సూచనలూ, సలహాలూ అందజేయటం, నేను నవల పూర్తిచేయటం, వారికి రాతప్రతి చూపించటం, వారు మెచ్చుకుంటూ లోపాల్నీ, లొసుగుల్నీ వివరించటం జరిగింది అయితే ముద్రణాభాగ్యం ఈనాటికి కలిగింది ఎన్నో కారణాలు ఇంత ఆలశ్యానికి దోహదం చేశాయి

ఇక నవలలోని కథాంశం దగ్గరకొస్తే - సమకాలీన సమాజంలో పోలీసు కానిస్టేబులు చుట్టూ అల్లుకుపోయిన కుల, మత, ఆర్థిక, రాజకీయ సమస్యలతోపాటు అధికార్ల ఆగడాలనూ, ఉద్యోగ సమస్యలనూ, తన కళ్ళముందు జరిగే అన్యాయాన్ని ఏ మాత్రం ఎదిరించలేని కానిస్టేబులి అశక్తతనూ ఈ నవలలో చెప్పటానికి ప్రయత్నించాను భారతదేశంలోని 'పల్లె' జీవితాన్ని చాతనయినంతవరకు ఇందులో చిత్రించాను ఇందులోని ప్రధానపాత్ర ప్రకాశం 1940 ప్రాంతాల్లో, అంటే బ్రిటీష్ హయాంలో అతను పోలీసు కానిస్టేబులుగా ఉద్యోగంలోచేరి 1975 చివర్లో యమర్జన్సీ పీరియడ్‌లో ఉద్యోగం నుండి తొలగించబడటంతో ఈ మొదటిభాగం పూర్తవుతుంది ఈ నవలలోని కథానాయకుడు కానిస్టేబులు ప్రకాశం పాత్ర, నా తండ్రి జీవితం నుండి తీసుకొన్నదే నవలలోని మూడొంతుల కథనం ఆయన ఉద్యోగ జీవితం నుండి తీసుకున్నదే

ఈ నవలలోని మిగిలిన పాత్రలన్నీ కల్పితాలే ఎవరినీ ఉద్దేశించి రాసినవి కావు ఎవరినీ కించపరచటానికి రాసినవికావు

యజమానుల, అధికార్ల ఆగడాలనూ, దోపిడీని మంచిమాటలతో మార్చలేమనీ, ప్రకృతి ప్రసాదించిన అన్నిరకాల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనూ, హక్కులను పోరాడి సాధించుకోవాలేతప్ప ఇంకో మార్గం లేదన్న నగ్నసత్యాన్ని క్రీస్తుకు పూర్వమే ప్రాక్టికల్‌గా రుజువుచేసి చూపించాడు రోమన్ బానిసల నాయకుడు స్పార్టకస్ అవును, అదే సరయిన మార్గమనీ, ఇంకోమార్గం లేదనీ తరువాత రెండువేల సంవత్సరాలకు దాన్ని సిద్ధాంతపరంగా రుజువు చేశాడు కారల్‌మార్క్స్ పోరాడకుండా పోయిన హక్కులు రావని అన్నాడు డా॥ బి ఆర్ అంబేద్కర్ నేనూ వీరి ఈ ఆలోచనలతో ఏకీభవిస్తాను అందుకే నా కలానికి ఆ నిండుమనిషి 'స్పార్టకస్' పేరు పెట్టుకోవటానికి ఎంతో గర్వపడుతున్నాను

నవలని అత్యంత శ్రద్ధతో అచ్చువేసిన వాణీ ఆర్టు ప్రింటర్స్ అధినేత శివశంకరరావుగారికి, ఎంతో బిజీగా వుండికూడా, కోరిన వెంటనే నా నవలని చదివి చక్కటి ముఖచిత్రం వేసి యిచ్చిన నా అభిమాన చిత్రకారుడు మోహన్‌గారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు

తెనాలి
10-10-'96

జి. మోహనరావు
(స్పార్టకస్)

# రెండవ ముద్రణకు ముందుమాట.

సంవత్సరం కూడా తిరగకముందే ఖరీదయిన ఈ నవల కాపీలన్నీ అమ్ముడుపోవటం, ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కలిగించింది ఉత్తమాభిరుచిగల పాఠకులకు కొరత లేదనీ, అభివృద్ధికరమైన రచనలను ఆదరించే పాఠకులు ఎప్పుడూ వుంటారని రుజువయ్యింది

ఈ ముందుమాటలో నేను కొత్తగా చెప్పేది ఏమీలేదుగానీ, 'పరిచయం'లో చెప్పలేని, మినహాయించాల్సిన, భవిష్యత్తులో చెప్పే అవకాశం రావాలని కోరుకున్నవి ఇప్పుడు చెపుతాను అవేమిటో కాదు అప్పుడు నవల ప్రయోజనాల్ని గురించి అనుకున్న అంశాలు నిజమవటమే అవే యిప్పుడు చెప్పదలచుకున్నాను

ఈ నవలా రచన చేయటం ద్వారా నేను ఏయే ప్రయోజనాల్ని ఆశించానో అవి నెరవేరాయని భావిస్తున్నాను ఈ రచన ద్వారా నేను ముఖ్యంగా కోరుకున్నవి మూడు అంశాలు

అవి -

1 పోలీసు డిపార్టుమెంటులో మార్పులకు శ్రీకారం చుట్టే ఆలోచనలు పాఠకుల్లో ఆరంభం కావాలి

2 దళిత వ్యధను వీలయినంత విస్తృతంగా ప్రపంచంముందు వుంచాలి

3 వివిధ రంగాల్లోని వ్యక్తుల నుండి ఈ తరహా రచనలు రావటానికి ఈ రచన దోహదపడాలి

నో డౌట్ టోటల్లీ సక్సెస్

ఈ రచన ద్వారా -

1 చాలా ఎక్కువమంది పరిశీలించలేని కానిస్టేబుల్ నిజజీవితాన్ని సమాజానికి చూపాలనుకున్నాను ఈ మొదటి భాగంలో డిపార్టుమెంటులోని, చాలామంది, డియస్పీ స్థాయి వరకు అధికారుల నిజస్వరూప స్వభావాల్ని, వాస్తవాంశాల్ని, పాఠకుడి కళ్ళకు కట్టినట్లు చూపి, అతనిని ఆలోచింపజేసి, తద్వారా డిపార్టుమెంటులో మార్పులకు దోహదపడి, అది ఎక్కువమంది నిజమైన బాధితులకు వీలయినంత ఎక్కువ నిజాయితీతో సేవచేయటానికి వీలుగా మార్చాలనుకున్నాను నేను కోరుకున్నట్లుగానే ఆలోచనలు ప్రారంభమయ్యాయి ఈ నవల చదివాక చాలామంది పాఠకుల్లో -

ఇప్పటివరకూ కానిస్టేబులుపై తమకున్న అభిప్రాయాల్లో మార్పులు చోటు చేసుకుంటున్నాయనీ, 'అతనిపై మాకు కొంత సానుభూతి కలిగింద'నీ నూటికి నూరుమంది పాఠకులు నిజాయితీగా తమ అభిప్రాయాలు తెలియజేయటమే ఇందుకు నిదర్శనం

ఈ నవల వెలువడిన తరువాత డిపార్టుమెంటులో రావాల్సిన మార్పుల్ని సూచిస్తూ సంపాదకీయాలూ, రివ్యూలూ రావటం, చర్చాగోష్ఠులు నిర్వహించటం కూడా ఈ రచన ప్రభావాన్ని చాటుతున్నాయి

డిపార్టుమెంటులోని కొందరు అధికారులూ, కానిస్టేబుళ్ళూ, హెడ్‌కానిస్టేబుళ్ళూ నవల చదవటం ద్వారా నైతికబలాన్ని పొందినట్లూ, డిపార్టుమెంటులోని కొన్ని లొసుగులపై కనీసం స్వరం విప్పటానికి తగిన వూతం దొరికినట్లు ఉత్సాహంగా చెప్పారు

2 ఈ దేశంలోని సర్వసంపదల సృష్టికి ఏ దళితులయితే మూలకారకులో, అలాటి దళితుల జీవిత చిత్రణకు కావాల్సిన కాన్వాసు ఎంతో విశాలంగా వుండాలని అనుకునేవాడివి మొదటినుండీ

కూడా వారి బ్రతుకుల్లోని ఏదో ఒక చిన్న అంశాన్ని కవిత్వీకరించో, చిన్నకథ ద్వారా అరకొరగా అందించటమోకన్నా, చాతనయినంతవరకు సమగ్ర దళిత జీవన స్వరూపాన్ని ఆవిష్కరించటం ద్వారా దళిత బతుకుని వీలయినంత ఎక్కువగా సాధారణ పాఠకుడి ముందు పరచటానికి 'నవల' సరయిన ఆయుధంగా భావించాను ప్రపంచ సాహిత్యంలో నవల ప్రభావ మెంతటిదో అప్పటికే తెలుసుకోగలిగిన నేను, కష్టమయినప్పటికీ నవలా రచన ద్వారానే నేను ఎన్నుకున్న అంశానికి న్యాయం జరిగిద్దనే ధృఢ నిర్ణయానికొచ్చాను ఇది సరి అయిన ఆలోచనే అని కాలం నిరూపించింది మిగతావాళ్ళ కన్నా కూడా దళిత మేధావుల, రచయితల, కవుల, కళాకారుల స్పందనకూ, మన్ననకూ, అభిమానానికి నా నవలలోని దళిత ప్రపంచం పాత్రమవటం నా అభిప్రాయం సరైనదేనన్నదానికి నిదర్శనం

3 నవల కుండాల్సిన లక్షణాలను గురించి సాంప్రదాయవాదులు చెప్పే అంశాలు నా నవల కున్నాయని నేననుకోవటం లేదు ఆ శిల్పాలూ, శైలులూ మొదలయిన వాటి గురించి అతిగా ఆలోచించటం అనవసరమనిపిస్తుంది నాకు

ఈ శైలీ శిల్పాల భయమే అనేకమందిని జీవితాంతం పీడించి, వారిని కలం మూతలు విప్పకుండా సందిగ్ధంలో, ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సులో వుంచేసి, వారిని రచయితలుగా, కవులుగా మారకుండా చేసి, తద్వారా తగినన్ని ప్రజారచనలు రాకుండా నిరోధించి, తన వర్గ ఎత్తుగడని విజయవంతంగా నెరవేరుస్తోందని నా అభిప్రాయం

నడవని మనిషి దూరాన్నెలా అధిగమిస్తాడు ? చదివించే రచనల్లో శైలీ శిల్పాలు లేకుండా ఎలా వుంటాయి ? వాటినే పట్టుకుని వేలాడటమంటే విషయానికి ప్రాధాన్యతని తగ్గించటమే పూర్తిగా

'అంకుల్ టామ్స్ కేబిన్' నవలలో ఏముంటే అది అంత పాపులర్ అయ్యిందీ ? 'స్పార్టకస్' నవలలో వున్నదేమిటి ? 'స్వీట్‌హోమ్' లోని స్వీట్‌నెస్‌ని ఏ శైలీ శిల్పాలు తీసుకొచ్చాయి ? ఇలా ఎన్నో చెప్పొచ్చు వీటన్నిటిలో వున్నది జీవితం జీవన పోరాటం నిజాయితీతో నిండిన బ్రతుకులకు నిలువెత్తు నిలువుటద్దాలు ఇవి ప్రజారచనల్లో కనపడేది అదే కనపడాల్సింది కూడా అదే

నా ఆలోచన ఒక్కటే, రచనకు సంబంధించి నా రచన సామాన్య పాఠకుడిని కదిలించి, స్పందింపజేసి, ఆలోచింప జేయగలిగిందా లేదా ? ప్రజామేధావుల ప్రాపకం సంపాదించిందా లేదా ? అంతవరకే అదే గీటురాయి

కులమతాల కుళ్ళుతో, సవాలక్ష అవలక్షణాలతో నిండిన కుహనా మేధావుల మెరమెచ్చుల కోసం ప్రజారచయితలు ప్రాకులాడరు

నేను కోరుకున్న ఈ మూడో కోరిక - నా నవల వర్ధమాన రచయితలకు కొంచెమన్నా ప్రేరణ కలిగించాలి అంకుల్ టామ్స్ కేబిన్ నవల (తెలుగు పరిచయం) నా రచన కెట్లా మార్గదర్శకమయ్యిందో, అలాగే నా రచన కూడా కావాలని కోరుకున్నాను ఆ కోరిక కూడా నెరవేరినట్లే ఎంతోమంది మిత్రులూ, పాఠకులూ నన్ను కలిసినప్పుడు చాలా స్పష్టంగా ఈ అంశాన్ని గురించి ప్రస్తావించారు తమ సమస్యలనూ, తమ జీవిత స్థితిగతులనూ ఇలా ('ఖాకీ బతుకులు' లో లాగా) ఎందుకు అక్షరీకరించకూడదని, తాము ఈ నవల చదివాక అనుకున్నామనీ, కొందరైతే అప్పుడే ప్రయత్నాలు మొదలు పెట్టామని చెప్పారు

ఇలా ఈ రచన ద్వారా నా ఉద్దేశ్యాలు నెరవేరటం ఆరంభించాయని చెప్పటమే ఈ ముందు మాటలో నేను చెప్పదలచుకున్నది అంతే

ఇకపోతే - రెండవ ముద్రణకు ముందు మరోసారి నవలంతా చదివాను ఏదన్నా ఒక సన్నివేశాన్ని ఇంకా పండించటం కోసం అక్కడక్కడా కొన్ని వాక్యాల్ని చేర్చటం, కొన్నిటిని తీసివేయటం, స్పష్టత లేదనుకున్నచోట చిన్నచిన్న మార్పుల్ని చేయటం మినహా ఇంకేమీ చేయలేదు

ఈ నవలను ఇకపై కొత్తగా చదవబోయే పాఠకుడిని దృష్టిలో పెట్టుకొని, కేవలం అతనికి ఒక సమగ్ర సమాచారాన్ని అందించే ఉద్దేశ్యంతో, ఈ నవల వచ్చాక దీనిపై వచ్చిన స్పందనలన్నింటినీ యథాతథంగా ముద్రిస్తున్నాను అందువలన, ఈ నవల బయటకు రావటానికి నేను పడిన శ్రమలు, వచ్చాక దీనిపై స్పందనలు, అధికార్లు నన్ను పెట్టిన, పెడుతున్న ఇబ్బందులకు పాత్రికేయులు, ప్రజాస్వామ్యవాదులు తమ నిరసలను తెలియజేసిన విషయాలూ - ఇలా సమగ్ర సమాచారాన్ని విడివిడి హెడ్డింగుల కింద అందించటం బావుంటుందని మిత్రుల సలహా ఇది ఉపయోగకరమయిన పని అని నేను కూడా భావిస్తున్నాను రంగనాయకమ్మగారు పరిచయం చేసిన అంకుల్ టామ్స్ కేబిన్ నవలలోని చివరిమాటలా ఈ వివరాలు కూడా పాఠకుడికి ఉత్తేజం కలిగిస్తాయని అనుకుంటున్నాను

మొదటి ముద్రణ హేండ్ కంపోజ్‌లో చేయబడింది దానిని ఇప్పుడు డి టి పి లో, పుస్తకం సైజు పెంచి ముద్రించాము అందువలన పేజీలు తగ్గాయి అంతే

నమస్కారాలతో

తెనాలి
1-1-'98

**MOHAN**
**Dr Neeraj Raj Multimedia Studios,**
**Red Hills, Hyderabad - 500 004**

## ఆర్టిస్టుకీ పోలీసుకీ లింకేమిటి ?

తెనాలి పోలీసోడికీ హైదరాబాద్‌లో బొమ్మలేసుకునే వాడికీ లింకేమిటి? ఓ రోజు పొద్దుటే స్టుడియోకి ఫోన్ వచ్చినపుడు ఇదే అనిపించింది గంటసేపట్లో ఫోన్ మనిషి దిగాడు పోలీసంటే మేం కార్టూన్లలో గీసినట్లు బుర్రమీసాలూ, బొర్రా, యూనిఫాం, బూట్లు టకటక లాడించుకుంటూ ఉంటాడనుకుంటాం గదా ఈ మనిషి వెరీ ఆర్డినరీ గెడకర్ర చూడ్డానికి బావున్నాడు నోట్లో వేలుపెడితే కొరకలేనంత మంచి బాలుడు రాము టైపు నా బొమ్మలు చాలాకాలంగా చూస్తున్నాననీ అదిగా ఇదిగా ఉంటాయనీ ఇరవయ్యేళ్లుగా ఫలానా పత్రికలు చదువుతున్నాననీ వాటి ముఖచిత్రాలు చూస్తున్నాననీ ఆ రకంగా బోలెడు పరోక్ష పరిచయం, అభిమానం ఉందనీ చెప్పకొస్తున్నాడు ఓ కె ఎలాటి అభ్యంతరం లేదు కానీ నేను తెనాలి వెళ్లి ఇరవయ్యేళ్లు దాటిపోయింది అక్కడి పోలీస్ స్టేషన్ పరిధిలోగానీ, హైదరాబాద్‌లోగానీ బొమ్మలెయ్యడం తప్ప మరెలాంటి క్రైమ్ టాలెంట్ లేనోణ్ణి నా దగ్గరికి పోలీసెందుకు రావాల ? ఇంతకీ సంగతి చెప్పండన్నాను మెల్లగా ఓ తెనాలి బ్రాండ్ రెక్సిన్ హేండ్ బాగ్‌లోంచి దిండులాంటి పుస్తకం తీశాడు ఇది నా నవల అన్నాడు జడుసుకున్నాను సూర్యరాయాంధ్ర నిఘంటువుకీ, అండ్ క్వయట్ ఫ్లోస్ ది డాన్ నవలకీ మధ్యలో ఉన్నట్టుంది పట్టుకున్న వెంటనే ఆఖరి పేజీ చూశా 800 చిల్లర ఉంది టెర్రర్ ఇలా కవిత్వాలూ, కథలూ నవల్లూ తెచ్చినాళ్లందరిదీ ఒకటే స్టోరీ అది అచ్చయిన వెంటనే సకల ప్రపంచమూ బాంబు పడ్డట్టు షాక్ అయి లేస్తుందనుకుంటారు ఈ దెబ్బకి 'నేను' అంటే ఏంటో ముందు సాహిత్య ప్రపంచానికీ, తర్వాత ప్రజలందరికీ పూర్తిగా తెలిసొస్తుందనుకుంటారు పాఠకులొచ్చి 'సార్ ఫలానా నాలుగు లైన్లు రాసింది మీరేనాండీ' అంటూ కన్నీళ్లు పెట్టుకోవాలి సమీక్షలొస్తాయి సూపర్‌స్టార్ అవడం ఖాయం కానీ ఒకటే అడ్డు ఈ ఆర్టిస్టుగాడు అదంతా చదవాలి దాని ప్రాణం (లేకపోయినా) పట్టుకోవాలి (బాగా లేకపోయినా) బాగా పొగడాలి అర్థం చేసేసుకుని అర్జెంట్‌గా అత్యద్భుత అట్ట వేసెయ్యాలి మళయాళ మాంత్రికుడి ప్రాణం మర్రిచెట్టు తొర్రలోపలి చిలకలోనే ఉన్నట్లు అంతా అట్టలోనే ఉంది అదయ్యేవరకూ హైదరాబాద్ లాడ్జిలో తిష్టవేయాలి మీటర్ తిరుగుతుంటుంది ఈ కళాసృజనలో ఏమాత్రం లేటు జరిగినా లాడ్జి బిల్లు చివర్లో కట్టడానికేం మిగల్దు తిరుగు టపా ఛార్జిల సంగతి చెప్పక్కర్లేదు ఇలా చాలామంది మిత్రుల బిల్లులు కట్టిన అపారమైన అనుభవం సారం పిండిన నేను గంభీరంగా ఎక్కడ దిగారని అడిగా 'సికింద్రాబాద్ లాడ్జిలో' అన్నాడు చచ్చాను అర్థకుణ్ణి ఈ 800 పేజీల చాటభారతం చదవడం ఎన్ని జన్మలకి మహామహా టాల్‌స్టాయ్, డాస్టావిస్కీలవే సరిగ్గా చదవకుండా నిరక్షరాస్య చిత్రకార్స్‌గా మిగిలినోణ్ణి చేతిలో ఉన్న బొమ్మల బకాయీలు తీరడానికే చాల రోజులు పడుతుంది ఊళ్లో ఉన్నవాళ్లే వచ్చి పీకలమీద కూచోడం, కాలర్ పట్టుకోడం - పులిమీద పుట్రలా ఈ పోలీసు దౌర్జన్యం ఎలా ? మా క్రైమ్ రిపోర్టర్ ఎవడికన్నా ఫోన్ చేసి సికింద్రాబాద్ లాడ్జి మీద రైడింగ్ చేయించి, ఈ పోలీస్ రచయితని తెనాలి తరిమేస్తేగానీ ఈ జీవితానికి శాంతి లేదనిపించింది అయినా ప్రశాంత చిత్తముతో - చదవడానికి చాల టైమ్

పడుతుందనీ, అమాంతంగా ఆవిష్కరణ సభలు ప్లాన్ చేసుకోడం ఆరోగ్యానికి భంగకరమని ఉద్బోధించాను

అలాటిదేం లేదన్నాడు వాళ్ల ఊళ్లో చిన్న టిక్కీ లెటర్ ప్రెస్‌లో ఏడాది పాటూ కంపోజిటర్లు దీన్ని చేశారన్నాడు తన జీతం బతుకూ చెప్పాడు ఈ పుస్తకం పంపకం ఎట్లా ఏం చేయాలి అని కూడా అడుగుతున్నాడు ఇతను చిన్నవాడే కాదు చాల చితకవాడని అర్థమయింది ముందు ఆ సంగతి చూడండని తెలిసిన పిల్ల పబ్లిషర్ దగ్గరకి పంపాను డిస్ట్రిబ్యూషన్‌లో కమీషన్‌లు పోగా పుస్తకం రేటు పెట్టడంలాటి మాటలు విని గందరగోళంగా తిరిగొచ్చాడు అట్ట వెయ్యడానికి ఖర్చెంత అవుతుందో అదో బెంగ

సాయంత్రం మళ్లీ వచ్చాక టీలూ, కబుర్లూ మాకులాగా సిగరెట్లూ వేషాలూ ఏంలేవు మోహన్‌రావు చాల పద్ధతి మనిషి తండ్రి ఉద్యోగం, తన ఉద్యోగం ఏకరువు పెట్టాడు చాల ఇంటరెస్టింగ్‌గా ఉంది అవన్నీ ఓ పోలీస్ రాయడంలో న్యూస్‌మేకింగ్ ఎలిమెంట్ కూడా ఉంది కానీ ఉన్న ఉద్యోగం ఊడితేనో అదే చిక్కు ఏదేనా పేపర్లో ఇది నవల అనీ, సాహిత్య సంబంధమైనదనీ ఒక్కముక్క వస్తే ముందు ముందు తనేదన్నా కష్టాల్లో పడినా ఇది ఆదుకుంటుందన్నాడు ఇది నవలే గనకా, ఖాయంగా క్రియేటివ్ వర్క్ గనకా ఆ మాత్రం ఏ పత్రికలోనన్నా రాయించగలననీ, అవసరమయితే నేనే రాసేయగలననీ ధీమా ఇచ్చా

రాత్రికి నవలలో కొంతవరకూ చదివా మొదటి రచన అయినా సరే నాకేం కష్టమని పించలేదు నేరేటివ్ సాఫీగా నడిచిపోయింది కొన్నిపేజీల తర్వాత అసలెలా రాశాడు అనే స్పృహే లేకుండా సాగింది నాకు తెలీని, ఎన్నడూ పట్టించుకోని ప్రపంచం కావడం - ఏమో కారణాలు చెప్పలేనుగానీ పేజీలు దొర్లిపోయాయి ప్రథమ వీక్షణంలో మోహన్రావుని చూసిన జడుపు పోయింది బుక్కు అచ్చయ్యి అందరూ చదివితే బాగుండనిపించింది

మర్నాడు మళ్లీ కబుర్లు నా దగ్గరకొచ్చే జర్నలిస్టుల్నీ, ఆర్టిస్టులని పరిచయం చేశా కొందరు రచయితల దగ్గరకి తీసికెళ్లా మోహన్‌రావుకి కొంత ధీమా వచ్చినట్టుంది ఊరెళ్లి కొంతకాలానికి వచ్చాడు సగానికి పైగా చదివి కవర్ డిజైన్ పూర్తి చేశాను ఈలోగా నాకిచ్చిన డమ్మీ కాపీని చాలామంది మిత్రులు చదివారు మెచ్చుకున్నారు ఓ ఆదివారం అనుబంధం కవర్‌స్టోరీలో ఈ నవలలోని కొన్నిభాగాలు వచ్చాయి ఒక్క రివ్యూలో ఇది 'సాహిత్యమే సుమా' అని ఒక్క ముక్క రావాలనుకున్న మోహన్‌రావుకి పెద్దపెద్ద సమీక్షలొచ్చాయి, సంపాదకీయాలొచ్చాయి బొత్తిగా టైమ్ స్పేర్ చేయలేననుకున్నవాణ్ణి తెనాలి ఆవిష్కరణ సభకెళ్లొచ్చా మళ్లీ విజయవాడ సభకీ వెళ్లా **ఇదంతా నవల బలమే** తర్వాత ఈ నవల దుమారం తెలుగు తీరాలు దాటి హిందూ, ఔట్‌లుక్, వీక్, టెలిగ్రాఫ్, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ఇంకా దేశమంతా ఎన్నో పత్రికలకు చేరింది అమెరికా తెలుగువారు సకాలంలో జోక్యం చేసుకుని ముఖ్యమంత్రికి మెసేజ్‌లిచ్చారు అదంతా చరిత్ర

**ఇది రెండో ఎడిషన్ వస్తుందంటే బుక్ నేనే రాసినట్టు బోల్డు బడాయిగా ఫీలయిపోతున్నా.** తెనాలి పోలిసోడికీ, హైదరాబాద్ ఆర్టిస్టుగాడికీ లింకులు గొలుసులు గొలుసులుగా చుట్టుకున్నాయనీ, ఇవి ఇలాకాక మరోలా ఉండవనీ అర్థమయింది



# ఈ పుస్తకం చదవండి ! చదివించండి !!

# ఖాకీ బతుకులు (నవల)

రచన స్పార్టకస్

**నవంబరు 96లో మార్కెట్లోకి వచ్చిన ఈ నవల ఒక విశిష్ట రచన** దీని రచయిత జి మోహన్‌రావు గారు వీరి కలం పేరు 'స్పార్టకస్' 1940 ప్రాంతాల్లో, బ్రిటీష్ హయాంలో పోలీస్ కానిస్టేబుల్‌గా ఉద్యోగంలో చేరి 1975 చివర్లో ఎమర్జెన్సీ కాలంలో ఆ కానిస్టేబుల్ కంపల్సరీ రిటైర్‌మెంట్‌కు గురి కావటంతో ఈ మొదటి బాగం ముగుస్తుంది ఈ నవలలోని కదానాయకుడైన కానిస్టేబుల్ ప్రకాశం పాత్ర రచయిత తండ్రి జీవితం నుండి రూపుదిద్దబడినదే నవలలోని మూడొంతుల కదనం తన తండ్రి ఉద్యోగ జీవితచిత్రణే

పోలీసు కానిస్టేబులు జీవితంపై దృష్టి పెట్టి రాసిన రచనలు తెలుగులో అతి తక్కువ ఆ జీవితంతో ప్రత్యక్ష పరిచయం ఉన్న రచయిత పోలీసు బ్రతుకుని ఈ నవలలో చిత్రిస్తూ పోలీసు బతుకు ఇలాగే ఎందుకుందని మేదావులను అడుగుతున్నారు **సమకాలీన సమాజంలో పోలీసు కానిస్టేబులు చుట్టూ అల్లుకుపోయిన కుల మత ఆర్ధిక రాజకీయ సమస్యలతోపాటు అధికార్ల ఆగడాలనూ ఉద్యోగ సమస్యలనూ తన కళ్ళ ముందు జరిగే అన్యాయాలను ఏమాత్రం ఎదిరించలేని కానిస్టేబుల్ అశక్తతను ఈ నవలలో చెప్పటానికి రచయిత ప్రయత్నించారు**

యజమానుల అదికారుల ఆగడాలనూ, దోపిడీని మంచి మాటలతో మార్చలేమనీ ప్రకృతి ప్రసాదించిన అన్నిరకాల స్వేచ్ఛ స్వాతంత్ర్యాలనూ హక్కులనూ పోరాడి సాదించుకోవాలే తప్ప ఇంకొక మార్గం లేదన్న నగ్నసత్యాన్ని క్రీస్తుకు పూర్వమే ఆచరణలో రుజువు చేసి చూపించాడు రోమన్ బానిసల నాయకుడు స్పార్టకస్ అందుకే రచయిత తన కలం పేరు 'స్పార్టకస్'గా పెట్టుకున్నారు

1980-83 మధ్యకాలంలో రాసిన ఈ నవల రచనకు, రచయితను రంగనాయకమ్మగారు ప్రోత్సహిస్తూ సూచనలూ, సలహాలూ అందించారు పుష్కరం తరువాత ముద్రణకు నోచుకొని ఇప్పడు విడుదలైంది విజయవాడ మైత్రీ బుక్‌హౌస్‌లో కాపీలు దొరుకుతాయి వెల రు 79 00లు 800 పేజీలు ఖాకీ బతుకుల ఆవిష్కరణ సబ 6 డిసెంబర్ 1996, తెనాలి జిల్లా గ్రందాలయ శాఖా భవనంలో ఆవిష్కర్త చిత్రకారుడు మోహన్

ప్రజాసాహితి డిసెంబరు 1996-182వ సంచిక నుండి



# 1. నవల ఆవిష్కరణల సమాచారం.

## కానిస్టేబుల్ జీవితాన్ని ఎక్స్‌రే తీసిన 'ఖాకీ బతుకులు'

నేడు తెనాలిలో ఆవిష్కరణ

ప్రభాతవార్త తెనాలి సుప్రసిద్ధ సాహితీవేత్తలకు జన్మనిచ్చిన తెనాలి గడ్డ నుండి మరో కలం ఊపిరి పోసుకుంది సీరియస్ రచనా వైభవం మరుగున పడిపోతూ, ఆ ప్రాభవం గతచరిత్రగా మిగిలిపోతుందని దిగులుపడుతున్న తరుణంలో మరో కొత్త రచన ప్రాణం పోసుకుంది తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన ఎందరో రచయితల జీవగడ్డ తెనాలి కవిరాజు త్రిపురనేని, కొడవటిగంటి కుటుంబరావు, ఆలపాటి రవీంద్రనాధ్, శారద గోపిచంద్, బొల్లిముంత శివరామకృష్ణ, రావూరి భరద్వాజ, హితశ్రీల రచనలు తెలుగు సాహిత్యానికి ఒక పరిపూర్ణతను తెచ్చి పెట్టిన విషయం తెలిసిందే ఆ తరం తర్వాత కొందరు కమర్షియల్ రచయితలు ఉనికిని చాటుకుంటున్నా , సీరియస్ రచనా వ్యాసంగంలో తెనాలి ప్రాంతం ఒకరకంగా శూన్యదశలో ఉందని చెప్పొచ్చు ముఖ్యంగా 1970 తర్వాత ఆ తరహా రచనలు రానట్టే లెక్క దాదాపు రెండున్నర దశాబ్దాల విరామం తర్వాత ఆంధ్ర సాహితీ వేదికపై తెనాలి నుండి మరో కొత్త గొంతుక ఆవిష్కరించింది **కమర్షియల్ జిమ్మిక్కులు లేకుండా సజీవ వాస్తవికతను చిత్రిస్తూ ఒక రచన పాఠకలోకాన్ని పలకరించింది ఎనిమిదివందల పేజీల సుదీర్ఘమైన 'ఖాకీ బతుకులు' ఆ రచన పేరు** సమాజంలోని **అతి ముఖ్యమైన పోలీసు వ్యవస్థలోని అతికీలకమైన సాధారణ కానిస్టేబుల్ జీవితాన్ని కాచి వడగట్టింది** నవల

ఇందులో విశేషమేమంటే ఈ నవల రాసిన వ్యక్తి సాదాసీదా మనిషి రచనా వ్యాసాంగంలో ఆరితేరిన వ్యక్తి కాదు కథలూ కాకరకాయలూ రాసే అలవాటు లేదు ఎవరి జీవితాన్నయితే విశ్లేషించాడో అలాంటి వేలాదిమందిలో ఒకరు సాధారణ హెడ్ కానిస్టేబుల్ పేరు గంటినపాటి మోహనరావు కలం పేరు రోమన్ బానిసల తిరుగుబాటు నాయకుడు 'స్పార్టకస్' నవలలోని ప్రతి వాక్యంలో పోలీసు వ్యవస్థలోని అధికార జులుం, లంచగొండితనం, బానిసత్వం, వెట్టిచాకిరీల వాస్తవిక చిత్రం ప్రతిబింబిస్తుంది తెలుగులో కె ఎన్ వై పతంజలి 'ఖాకీ వనం' నవల మాత్రమే పోలీసుల పరిస్థితుల గురించి వచ్చింది పోలీసుల గురించి వచ్చిన సీరియస్ రచన అదొక్కటే అయితే 'ఖాకి బతుకులు'కు, దానికి ఎంతో తేడా ఉంది డిపార్ట్‌మెంటులో పనిచేస్తూ తనలాంటి వారి అనుభవాలను పుస్తక రూపంలో రచయిత చక్కగా పొందుపరిచారు కొందరు పోలీసు అధికారులు సీరియస్ సాహిత్యాన్ని సృష్టించినా కానిస్టేబుల్ జీవితాల్ని టచ్ చేయలేదని చెప్పొచ్చు

స్వాతంత్ర్యానికి ముందు నుండీ - ఎమర్జెన్సీ వరకు సాగిన 'ఖాకీ బతుకులు' నవలలో 'తెల్ల దొర' తనంలోను, నల్లదొరల పాలనలోను పోలీసు వ్యవస్థ తీరును మోహనరావు ఎక్స్‌రే తీశారు సాధారణ కానిస్టేబుల్ వెట్టిచాకిరి, ఆఫీసర్ల దొరతనం, కుల వివక్షత, అవినీతి విశ్వరూపం, ఆ వ్యవస్థలోని చిరుద్యోగుల్లో పేరుకు పోతున్న అసంతృప్తి, అలసట, తిరగబడాలనే ఆకాంక్షలు, క్రమశిక్షణా చర్యల కత్తివేట్లు, గత్యంతరంలేని సర్దుబాట్లు **ఇలా ప్రతి పార్శ్వాన్ని సజీవంగా చిత్రించాడు రచయిత ఎక్కడా రాజీలేదు మొహమాట పడలేదు** పోలీసు జీవితంలో వాస్తవమింత భయంకరంగా ఉంటుందా అని పాఠకుడికి అనిపిస్తుంది ఆ ఆశ్చర్యమే అంతలావు పుస్తకాన్ని

చివరి పేజీదాకా చదివిస్తుంది  ధర్మవీర కమిషను ప్రస్తావించిన **పోలీసులు, పోలీసులు ఎదుర్కొనే అనేక సమస్యలను ఈ నవలలో సోదాహరణంగా వివరించారు**  పరిమితిలేని పనిగంటలు, చాలీచాలని జీతాలు, సెలవు దినాలు, ఇతర ప్రభుత్వోద్యోగుల మాదిరి రాయితీలు లేకపోవటం వంటి ఎన్నో దుర్భర సమస్యలకు అతీతుడుగా 'పోలీసు'కు ఖాకీ యూనిఫారం కట్టబెట్టిన వాస్తవిక దృశ్యానికి ఇందులో అక్షర రూపం కల్పించారు  వాస్తవానికి ఈ రుగ్మతలన్నీ ఇటీవల కాలంలో చర్చకు వస్తున్నాయి

ఈ నేపథ్యంలోనే వ్యవస్థలోని కిందిస్థాయి ఉద్యోగస్తులైన కానిస్టేబుళ్ళనే కారణంగా చూపుతున్నారు అధికారులు, ప్రభుత్వం కూడా  దీనిలో భాగంగానే కానిస్టేబుళ్ళకు పునశ్చరణ తరగతులు 'మర్యాద కోర్సు' లాంటి చిట్కావైద్యాలను జపిస్తున్నారు  అయితే కానిస్టేబుల్ జీవితాన్ని పరికించినా, ధర్మవీర కమిషన్‌ను పరిశీలించినా సమస్యకు మూలం ఎవరూ పట్టించుకోవటం లేదు  బ్రిటిషుకాలం నుండి నేటికీ అమలవుతున్న పోలీసు సర్వీసు కండిషన్లలో ఎలాంటి ప్రజాస్వామిక మార్పులు తీసుకురావాల్సిన అవసరాన్ని గుర్తించటం లేదని అనిపిస్తుంది  రాజకీయాల్లో పెరుగుతున్న నేరప్రవృత్తి, పోలీసు అధికారులకు, రాజకీయ నాయకులకు ఉన్న అక్రమ సంబంధాలతో కానిస్టేబుల్ నిజాయితీగా ఉండటం అర్థం లేనిదిగా, బతకటం చేతకానట్టుగా ఉంటోంది

ధర్మవీర కమిషన్ సిఫార్సులను అమలుచేసి పోలీసుల సర్వీసు కండిషన్లను మెరుగుపరచాలని సీనియర్ ఐ పి ఎస్  అధికారి కిరణ్‌బేడి ప్రభుత్వాన్ని కోరటం గమనార్హం  **ఏదేమైనా పోలీసు వ్యవస్థలోని లోపాలను నగ్నంగా చిత్రీకరించిన మోహనరావు, 'ఖాకీ బతుకులు' ద్వారా కానిస్టేబుల్ జీవితాన్ని ప్రపంచానికి తెలియజేశారు**  దీని ఫలితంగా 'పోలీసు'కు ఏమాత్రం మేలు జరిగినా రచయిత కృషి ఫలించినట్టే

**- బి.యల్. నారాయణ**

**6-12-96**



# వాస్తవికతకు చేరువగా "ఖాకీ బతుకులు"

*ఆంధ్రప్రభ విలేఖరి, తెనాలి, డిసెంబర్ 7*  సాధారణ కానిస్టేబుల్ వెట్టిచాకిరి, ఆఫీసర్ల దొరతనం, కుల వివక్షత, అవినీతి విశ్వరూపం, ఆ వ్యవస్థలోని చిరుద్యోగుల్లో పేరుకుపోతున్న అసంతృప్తి, అలసట, తిరగబడాలన్న ఆకాంక్ష, క్రమశిక్షణా చర్యల పేరుతో కత్తి వేట్లు, గత్యంతరం లేక సర్దుబాట్లు, - ఇలా పోలీసు వ్యవస్థలోని క్రిందిస్థాయి కానిస్టేబుళ్ళ జీవితాలపై వెలువడిన 'ఖాకీ బతుకులు' పుస్తకాన్ని వాస్తవికతకు దగ్గరగా రచించిన జి  మోహన్‌రావుకు కృతజ్ఞతలు చెప్పక తప్పదని ప్రముఖ రచయిత బొల్లిముంత శివరామకృష్ణ పేర్కొన్నారు  'భిన్న స్వరాలు' సంస్థ ఆధ్వర్యంలో శుక్రవారం రాత్రి ఇక్కడ శాఖాగ్రంథాలయంలో ఏర్పాటుచేసిన ఖాకీ బతుకులు పుస్తకావిష్కరణ సభలో ఆయన పాల్గొని ప్రసంగించారు  సభకు ప్రెస్‌క్లబ్ అధ్యక్షుడు బి ఎల్ నారాయణ అధ్యక్షత వహించారు  పోలీసు జీవితంలో వాస్తవమింత భయంకరంగా ఉంటుందా! **పోలీసులు ఎదుర్కొనే అనేక సమస్యలు ఈ నవలలో సోదాహరణంగా వివరించటం పౌరహక్కుల సంఘాలవారు కూడా తప్పనిసరిగా చదవవలసి ఉందని జిల్లా ఏ పి సి ఎల్ సి  ప్రధాన కార్యదర్శి బి**

**చంద్రశేఖర్ అన్నారు** ప్రపంచంలో గొప్ప రచయితల రచనల సరసన నిలువదగ్గ అద్భుతమైన పుస్తకంగా ఖాకీ బతుకులను పేర్కొన్నారు కానిస్టేబుళ్ళ జీవితంపై సాదాగా లేకుండా నిర్దిష్టమైన దళిత కానిస్టేబుళ్ళ జీవితాన్ని ప్రతిబింబించినట్లు ఆయన చెప్పారు అరుణోదయ రాష్ట్ర అధ్యక్షులు దివికుమార్ మాట్లాడుతూ, పోలీసు వృత్తిలో చేరిన సగటు కానిస్టేబుళ్ళ దుఃఖాన్ని, ఆ వ్యవస్థ హింసను మోహన్‌రావు తన పుస్తకంలో చదివించే శైలిలో రాశారన్నారు నవలలోని సారాంశాన్ని తన కుంచె ద్వారా ముఖచిత్రంగా రూపొందించిన ప్రముఖ కార్టూనిస్ట్ మోహన్‌ను ఆయన ప్రశంసించారు

రచయిత జి మోహన్‌రావు ప్రసంగిస్తూ తాను 20 సంవత్సరాలుగా పోలీసుశాఖలో పనిచేస్తున్నాననీ పోలీస్ వ్యవస్థలోని సాధారణ జీవితాన్ని మాత్రమే ప్రజలు చూస్తున్నారనీ, నాణేనికి రెండో వైపున ఉన్న జీవితాన్ని వారు చూడటంలేదని అందుకే ఈ రచన చేశానని చెప్పారు అంతే కాదు ఎన్నో ఆదర్శాలు గల వ్యక్తులు కూడా ఈ శాఖలో చేరిన తర్వాత మారిపోతున్నారని పేర్కొన్నారు ప్రజాధనంతో బ్రతికే వీరు ప్రజాసేవ చేయటానికి రావటంలేదు అందుకే ఈ రచన చేశానని మోహన్‌రావు వివరించారు "అధికారులలోను చాలా ఉత్తములు ఉన్నారు, వారు సేవ చేయాలన్నా రాజకీయ నాయకులకు కొందరు అధికారులకు ఉన్న నేరప్రవృత్తి, అక్రమ సంబంధాలు నిజాయితీగా వీరిని పని చేయనివ్వటం లేదనే సత్యాన్ని చూపించానని చెబుతూ ఖాకీబతుకులు ద్వారా కానిస్టేబుల్ జీవితాన్ని ప్రపంచానికి తెలియజేశానన్నారు ఈ కార్యక్రమంలో ఎం డి సౌజన్య, కె రవిబాబు తదితరులు ప్రసంగించారు



# వాస్తవికతకు సజీవచిత్రణ 'ఖాకీ బతుకులు'

**తెనాలి, డిసెంబర్ 6 (ప్రభాతవార్త)** పోలీసు వ్యవస్థలోని కిందిస్థాయి కానిస్టేబుళ్ళ జీవితాలపై వెలువడిన 'ఖాకీ బతుకులు' పుస్తకాన్ని ప్రముఖ కార్టూనిస్టు మోహన్ ఆవిష్కరించారు 'భిన్నస్వరాలు' సంస్థ ఆధ్వర్యంలో శుక్రవారం రాత్రి ఇక్కడి శాఖాగ్రంధాలయంలో ఏర్పాటుచేసిన పుస్తకావిష్కరణ సభలో పలువురు రచయితలు పాల్గొని ప్రసంగించారు 'ఖాకీ బతుకులు' పుస్తకం నిజాయితీకి, వాస్తవికతకూ సజీవచిత్రణగా ప్రముఖ రచయిత బొల్లిముంత శివరామకృష్ణ అభిప్రాయం వ్యక్తం చేశారు పోలీసుల క్రౌర్యమే కాదు, వాళ్ళ జీవితాల్లోకి తొంగిచూసిన మంచి పుస్తకాన్ని చదివి ప్రోత్సహించాలని సూచించారు 'జనసాహితి' ప్రధాన కార్యదర్శి కొత్తపల్లి రవిబాబు తన ప్రసంగంలో రకరకాల వృత్తుల గురించి ఆంగ్ల రచనలను అనుకరిస్తూ తెలుగులో పలువురు కమర్షియల్ రచనలు చేశారు కాని మోహనరావు ఆ కోవకు చెందిన రచయిత కారని, సాధారణ కానిస్టేబుళ్ళ జీవితాలను కాచి వడపోసి తన నవలలో శక్తివంతంగా చిత్రీకరించారని చెప్పారు **ఎ పి సి ఎల్ సి జిల్లా కార్యదర్శి బి చంద్రశేఖర్ మాట్లాడుతూ ప్రపంచంలో గొప్ప రచయితల రచనల సరసన నిలువదగ్గ అద్భుతమైన పుస్తకంగా 'ఖాకీ బతుకులు'ను** పేర్కొన్నారు కానిస్టేబుళ్ళ జీవితంపై సాదాగా లేకుండా

నిర్దిష్టమైన దళిత కానిస్టేబుళ్ళ జీవితాల్ని ప్రతిబింబించినట్లు ఆయన చెప్పారు భుక్తికోసం పోలీసు వృత్తిలో చేరిన సగటు కానిస్టేబుళ్ళ దుఃఖాన్ని ఆ వ్యవస్థ హింసను మోహనరావు తన పుస్తకంలో చదివించే శైలిలో రాశారని అరుణోదయ' రాష్ట్ర అధ్యక్షుడు దివికుమార్ చెప్పారు నవలలోని సారాంశాన్ని తన కుంచె ద్వారా ముఖచిత్రంగా రూపొందించిన కార్టూనిస్టు మోహన్‌ను ఆయన అభినందించారు ప్రముఖ నవలా రచయిత ఎం డి సౌజన్య మాట్లాడుతూ ఒక మంచి పుస్తకాన్ని కొని చదవటం ద్వారా సాహిత్యాన్ని ఆదరించాల్సిందిగా కోరారు పుస్తకావిష్కరణ చేసిన మోహన్ తొలికాపీని బొల్లిముంత శివరామకృష్ణకు అందజేశారు విలేకరుల తరపున మోహన్ రచయిత మోహనరావును శాలువతో సత్కరించారు **పోలీస్ కానిస్టేబుల్ జీవితంలో ప్రజలకు తెలియని నాణేనికి మరోవైపునున్న నిజజీవితాన్ని ప్రజలకు తెలియజెప్పే ప్రయత్నమే తన చేత 'ఖాకీబతుకులు' రాయించినట్టు రచయిత మోహనరావు చెప్పారు** ప్రెస్‌క్లబ్ అధ్యక్షులు బి ఎల్ నారాయణ అధ్యక్షత వహించారు 'భిన్నస్వరాలు' తరపున జుగాష్‌విలి స్వాగతం పలుకగా శివయ్య వందన సమర్పణ చేశారు



# తెలుగు సాహిత్యంలో వినూత్న సంచలనం

### పోలీసు జీవితపు చీకటి వెలుగుల వాస్తవిక చిత్రణ

## ఖాకీ బతుకులు (నవల)

### రచన . జి. మోహనరావు (స్పార్టకస్)

### ఆవిష్కరణ సభ :

**టాగూర్ గ్రంథాలయంలో 28-12-96 శనివారం సా॥ 5 గం లకు (విజయవాడ)**

బలవంతుడు బలహీనుడిపై దౌర్జన్యం చేస్తే బలహీనుడికి పోలీసు సహాయం కావాలి ధనవంతుడు పేదవాడిని దోపిడీనో, మోసమోచేస్తే పేదకు పోలీసు అండ అవసరం నిజానికి పోలీసులంటే ప్రజలకున్న లోలోపల అభిప్రాయం ఏమిటి ? వారిని గౌరవిస్తున్నారా ? గౌరవింపబడాలనే పోలీసు వ్యవస్థ కోరుకుంటుందా ? లేక "భయం" వుంటే చాలనుకుంటోందా? ఎవరి పక్షాన ఉండాలో అలాగే వుంటున్నారా ?

కానిస్టేబుల్ నుండి ఐ పి యస్ అధికారి వరకూ అధికార నిచ్చెన మెట్లలో ప్రతీవాడూ కొందరికంటే ఎక్కువ, కొందరికంటే తక్కువ **భారత కుల వ్యవస్థను పోలివుండే పోలీసు వ్యవస్థను ఎలా సంస్కరించాలి ?**

సరాసరి రోజుకి 8 గంటలు (వారానికి 48 గం॥) కంటే ఎక్కువ పనిచెయ్యవలసి వస్తున్నా చేసిన పనికి న్యాయబద్ధ వేతనాలు ఇవ్వకపోయినా వెట్టిచాకిరి అనిపించుకుంటుంది పోలీసు శాఖలో పనిచేస్తున్న వారికి మిగిలిన ఉద్యోగస్తులకు లాగా పై న్యాయం ఎందుకు అమలు జరుగదు ? వేళకు కనీస విశ్రాంతి లేకుండా నైటు డ్యూటీలు, గార్డు డ్యూటీలు పోస్టు మార్టం శవాల కోసం గాలింపులు ఎస్కార్టులు, పై అధికారుల అదిలింపులు, వీటితో తమనేతాము తిట్టుకుంటూ, ప్రజలపై విసుగు, ఆగ్రహం, దౌర్జన్యం రూపంలో బయట పెట్టుకునే వ్యవస్థాగత పరిస్థితుల నుండి వారికి విముక్తి లేదా ? నేరస్తులతో గడపటం జీవితంలో ప్రధాన భాగంగా మారినవారు నేర మనస్తత్వాన్ని అలవర్చుకునే అవకాశం వుంటుందా ?

సమాధానాలు ఒకపట్టాన సంతృప్తిపరచలేనన్ని ప్రశ్నలే - ప్రశ్నలు వీటికి జవాబులన్నీ 'ఖాకీ బతుకులు" నవలలో కూడా దొరకవు కానీ మనం స్వయంగా ఎరుగని అనేక కటిక సత్యాలను వాస్తవికంగా ఈ నవల ప్రతిబింబిస్తుంది మనలో భ్రమలను పటాపంచలు చేస్తుంది పోలీసులను ఆత్మవంచన చేసుకోకుండా అంతర్ముఖులై తమను తామే "ఇంటరాగేట్" చేసుకునేట్టు చేస్తుంది

సాధారణ ప్రజానీకం ఎరగని పోలీసుల జీవితంలోని చీకటి వెలుగుల్ని ఈ నవల ప్రతిబింబిస్తోంది **తెలుగు సాహిత్యంలో బహుశా భారతీయ సాహిత్యంలోనే ఇంతటి విలక్షణమైన రచన రాలేదంటే ఆశ్చర్యం కాదు** పోలీసు వ్యవస్థనూ జీవితాన్నీ లోపలి నుండి చూసి వారి దైర్భాగ్యాన్నీ, దౌర్బల్యాన్నీ, ఆగ్రహావేశాల్నీ అణిగిమణిగి వుండటాన్నీ, పరిస్థితుల ప్రాబల్యానికి లొంగిపోయే బలహీనతలనూ, ఒకటేమిటి అనేక జీవిత పార్శ్వాలను కళ్ళకు కట్టేట్టు చూపిన రచన "ఖాకీ బతుకులు"

పోలీసు శాఖలోనే కానిస్టేబుల్‌గా పనిచేస్తూ ఎంతో లోతైన అధ్యయనంతో అవగాహనతో అనుభవాన్ని రంగరించిన రచన ఇది నూటికి తొంభై నవలలు బాధ్యతా రహితంగా జీవితాన్నీ వాస్తవాల్నీ విడిచి ఎక్కడెక్కడో సంచరిస్తున్న నేటి కాలంలో వాస్తవిక జీవిత చిత్రణకు నమూనాగా నిలిచిన ఖాకీ బతుకులు నవల ఆవిష్కరణ సభకు సాహితీ ప్రియులందరూ తప్పక హాజరు కావాల్సిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం

**పుస్తకావిష్కరణ సభ** సా॥ 5 గం లకు టాగూర్ గ్రంథాలయంలో

**సభాధ్యక్షత** శ్రీ దివికుమార్ (ప్రజాసాహితి సంపాదకవర్గ సభ్యుడు)

**పుస్తకావిష్కర్త** శ్రీ ఫణికుమార్ I A S (డిప్యూటీ కమీషనర్, ఇన్‌కంటాక్స్, కవి, రచయిత)

**నేపథ్యం** శ్రీ జి మోహనరావు (నవలా రచయిత)

**ఉపన్యాసకులు** శ్రీ సి రాఘవాచారి (సంపాదకులు - విశాలాంధ్ర)
శ్రీ తెలకపల్లి రవి (సంపాదకులు - ప్రజాశక్తి)
శ్రీ గుంటూరు లక్ష్మినరసయ్య (సాహిత్య విమర్శకులు)
శ్రీ కొత్తపల్లి రవిబాబు (ప్రధాన కార్యదర్శి - జనసాహితి)
శ్రీమతి చల్లపల్లి విజయ (ప్రగతిశీల మహిళా సంఘం - స్త్రీ విముక్తి)
శ్రీమతి రమ (సంపాదకులు, మాతృక)

నిర్వహణ
జనసాహితి (ఆం ప్ర )
శ్రీశ్రీ ప్రింటర్స్
సాంస్కృతీ సమాఖ్య (యువసాహితీ వికాసవేదిక)
ఆంధ్రప్రదేశ్

21-12-96
విజయవాడ



# వాస్తవికతను ప్రతిబింబించిన 'ఖాకీ బతుకులు'

## ఆవిష్కరణ సభలో వక్తల ప్రశంస

*విజయవాడ, డిసెంబర్ 28 (వి వి)* సాధారణ ప్రజానీకం ఎరుగని పోలీసుల జీవితంలోని చీకటివెలుగుల్ని ప్రతిబింబించే రచన 'ఖాకీ బతుకులు' నవల ఆవిష్కరణ సభ శనివారం స్థానిక రాఘూర్ స్మారక గ్రంథాలయం హాల్లో జరిగింది పోలీసుశాఖలోనే కానిస్టేబుల్‌గా పనిచేస్తూ ఎంతో లోతైన అధ్యయనంతో, అవగాహనతో అనుభవాన్ని రంగరించిన జి మోహనరావు (స్పార్టకస్) రచించిన 'ఖాకీ బతుకులు' నవలను ఇన్‌కంటాక్స్ డిప్యూటీ కమిషనర్, కవి, రచయిత, ఫణికుమార్ (ఐ ఎ ఎస్) ఆవిష్కరించారు ఇంకా పలువురు వక్తలు ప్రసంగించారు

శ్రీ ఫణికుమార్ ప్రసంగిస్తూ ఖాకీ బతుకులు వాస్తవికతను ప్రతిబింబించిన అమూల్యమైన నవలనీ, అందరిచేత చదివింపజేసే విషయం గల పుస్తకమని అన్నారు రచయిత జీవితం ఈ నవలలో ప్రస్ఫుటంగా కనిపిస్తుందని చెప్తూ ఈ నవలలో కథానాయకుని పాత్ర ఔచిత్యాన్ని ప్రశంసించారు విశాలాంధ్ర సంపాదకులు సి రాఘవాచారి మాట్లాడుతూ, ప్రజాస్వామ్యాన్ని **రక్షించాల్సిన పోలీసు శాఖలోనే అసలు ప్రజాస్వామ్యం కొరవడిందని, అటువంటి దుర్గమైన వ్యవస్థలో ఉన్న ఒక కానిస్టేబుల్ జీవితాన్ని రచయిత ఈ నవలలో చక్కగా వివరించారని అన్నారు** భిన్నమైన జీవన వ్యవస్థ ఈ నవలలో ఉట్టిపడుతుందన్నారు తన జీవితాన్ని నిజాయితీగా పుస్తక రూపంలో ఇచ్చిన రచయిత ప్రశంసనీయుడని అన్నారు పోలీసు వ్యవస్థలో 'లా' ఒక్కింతైనా రావాలని ఆశిస్తూ ఈ పుస్తకాన్ని రాసిన మోహనరావు అభినందనీయులని రాఘవాచారి రచయితను కొనియాడారు అంతకుముందు సాహితీ విమర్శకులు గుంటూరు లక్ష్మీనర్సయ్య మాట్లాడుతూ జీవితాన్ని చూసినంత తేలికగా ఈ పుస్తకాన్ని చదవవచ్చని, సొంత వ్యక్తిత్వం లేని, అనిశ్చితత్వం, అభద్రతాభావం, ఒత్తిడితో కూడియున్న పోలీసు జీవితాన్ని చాకచక్యం, సహజత్వం ఉట్టిపడేలా రచించారని అన్నారు రావిశాస్త్రి, పతంజలి, కరుణకుమార పోలీసు రచనలకు భిన్నంగా 'ఖాకీ బతుకులు' ఉందని, జీవితాన్ని చూసినంత తేలికగా ఈ పుస్తకాన్ని చదవవచ్చని అన్నారు **విభిన్నమైన ముగింపు ఈ నవల ప్రత్యేకతని అన్నారు** సభకు అధ్యక్షత వహించిన జనసాహితీ ప్రధాన కార్యదర్శి కొత్తపల్లి రవిబాబు ప్రసంగిస్తూ **రంగనాయకమ్మ శైలిలో కనిపించే ఈ నవల తెలుగు సాహిత్యంలో విశిష్టమైనది కాగలదని అన్నారు** ఈ నవలా రచయిత జి మోహనరావు (స్పార్టకస్) రచనా నేపథ్యాన్ని వివరించారు కానిస్టేబుల్ జీవితం సామాన్యునికి తెలియాలన్న తపన తనను ఉత్తేజపరిచిందని అన్నారు ఇంకా ఈ సభలో మాతృక సంపాదకులు శ్రీమతి రమ, ప్రగతిశీల మహిళా సంఘం - స్త్రీ విముక్తి జిల్లా కన్వీనర్ శ్రీమతి చల్లపల్లి విజయ, ఓ పి డి ఆర్ ప్రధాన కార్యదర్శి సి భాస్కరరావు, జర్నలిస్టు ప్రకాష్, తదితరులు ప్రసంగిస్తూ కొత్తకోణంలో ఈ నవల రచించారని, వాస్తవిక జీవిత చిత్రణకు నమూనాగా 'ఖాకీ బతుకులు' ఉందని ప్రశంసించారు అరుణోదయ కళాసంఘం వారు విప్లవ గేయాలు పాడి ఆహూతులను అలరించగా ఉదయ్ వందన సమర్పణ చేశారు



# పోలీసు జీవిత ప్రతిబింబం 'ఖాకీ బతుకులు'

## ఆవిష్కరణ సభలో పణికుమార్

*న్యూస్ ఫ్లాష్, విజయవాడ, డిసెంబర్ 28 వ్యక్తిత్వ వికాసం పొగడ్తల వల్ల రాదని, అందుకు వాస్తవిక దృక్పథం అవసరమని, వాణిజ్య పన్నుల శాఖ డిప్యూటీ కమీషనర్ ఫణికుమార్ అన్నారు శనివారం రాగూర్ గ్రంథాలయంలో జరిగిన కార్యక్రమంలో 'ఖాకీ బతుకులు' నవలను ఆయన ఆవిష్కరించారు ఈ సందర్భంగా మాట్లాడుతూ ప్రస్తుత కాలంలో కేవలం వాస్తవిక విధానం సరిపోదని, వాస్తవికతను ప్రతిబింబిస్తే పాఠకునికి, రచయితకు దూరం ఏర్పడుతుందని ఆయన అభిప్రాయపడ్డారు అయితే దీనికి భిన్నంగా ఈ నవలా రచయిత మోహన్‌రావు వాస్తవ విధానాన్ని అవలంభించి ఏకబిగిన నవలను చదివేలా చేశారని అభినందించారు ఈ నవలలో రచయిత ప్రకాశం అనే వెనుకబడిన వర్గానికి చెందిన వ్యక్తిని కథానాయకుడిగా చేసి తొలుత అసమర్థుడుగానూ, తరువాత నాయకుడిగా ఎదగడాన్ని చక్కగా వర్ణించారన్నారు ఈ విధంగా కథానాయకుడిని రెండు పాయలుగా విభజించారని, దీనిలో కారల్‌మార్క్స్, ఏంగెల్స్ ప్రస్తావనతో పాటు కథానాయకుడి పట్ల కుల వివక్షతను విపులంగా వివరించారన్నారు అలాగే ప్రభుత్వ శాఖలలో, ప్రైవేటు సంస్థలలో వ్యక్తులు ఏ విధంగా తమ వికాసాన్ని కోల్పోతారో కూడా వివరించారన్నారు* ***చాన్నాళ్ళ తరువాత చక్కటి నవల వెలువడిందని*** *ఆయన రచయితను అభినందించారు*

*విశాలాంధ్ర సంపాదకుడు సి రాఘవాచారి మాట్లాడుతూ, ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించవలసిన పోలీసు శాఖలో ప్రజాస్వామ్యం కొరవడిందన్నారు ప్రస్తావన అమూల గ్రంగా ఉండి, కానిస్టేబుళ్ళు దుర్భరస్థితిని ఎదుర్కొంటున్నారన్నారు ఏ కులం, ఏ మతానికి సంబంధం లేకుండా ఈ దేశంలో పుట్టే స్వాతంత్ర్యం ఎవరికి లేకుండా పోయిందని, పుట్టుకతోనే పాపం సంక్రమించే వ్యవస్థ ఇదని ఆయన ఆవేదన వ్యక్తం చేశారు ఉద్యోగాలలో క్లాస్ ఫోర్ వంటి ఉద్యోగాలు కేవలం ఎస్‌టి, ఎస్‌సిలకే పరిమితం అన్న విషయంపై మాట్లాడుతూ, నాలుగు వర్ణాలు వున్న సమాజంలో ఈ విధంగా ఉద్యోగాలలో విభజన చేసి ఉంటారని ఆయన విమర్శించారు ప్రభుత్వ దౌష్ట్యానికి, క్రౌర్యానికి పోలీసు శాఖ ప్రతీక అని ఆయన అన్నారు ఏ సంస్కృతిలో అయినా దళారీలు అవసరం లేదనీ, వారు కనుక ప్రవేశిస్తే ఆ సంస్కృతి విఫలంకాక తప్పదన్నారు పోలీసుల్లో 'లా'ఒక్కింతయినా రావాలని, ఇది రావడానికి కృషి చేస్తున్న రచయిత అభినందనీయుడని అన్నారు*

*సాహిత్య విమర్శకుడు గుంటూరు లక్ష్మీనర్సయ్య మాట్లాడుతూ,* ***పోలీసు వ్యవస్థలో దుఃఖం, ఘర్షణ, వత్తిడి, కులం మిళితమై వున్నాయన్నారు కానిస్టేబుళ్ళను క్రూరులుగా తయారు చేస్తున్న అధికార గణం పనితీరును నవలలో చక్కగా విశదీకరించారన్నారు తెలుగు సాహిత్యంలో నాలుగు తరాల పాటు ఈ నవల నిలిచి ఉంటుందన్నారు***

*నవలా రచయిత జి రామ్మోహన్‌రావు మాట్లాడుతూ, ప్రజాస్వామ్య వ్యవస్థలో పోలీసులు ప్రజాస్వామ్య బద్ధంగా పనిచేయడం లేదన్నారు అధికారం, డబ్బు, పలుకుబడి వున్న వారికే పోలీసులు పనిచేస్తున్నారన్నారు పోలీసులు ఈ విధంగా కాకుండా ప్రజలకు ఉపయోగపడాలన్నారు ఇదిలా ఉండగా ఇతర ప్రభుత్వోద్యోగులతో పోలిస్తే కానిస్టేబుళ్ళకు ప్రాథమిక సౌకర్యాలు లేవని, ఈ విషయాలు ప్రజలకు తెలియజెప్పే ఉద్దేశంలో ఈ నవలను రాసినట్లు చెప్పారు ఈ సభకు జనసాహితీ ప్రధాన కార్యదర్శి కొత్తపల్లి రవిబాబు అధ్యక్షత వహించగా, ప్రగతిశీల మహిళా సంఘం నాయకురాలు చల్లపల్లి విజయ, 'మాతృక' సంపాదకురాలు రమ, కార్టూనిస్ట్ మోహన్ కూడా ప్రసంగించారు*



# పోలీసు వ్యవస్థకు దర్పణం 'ఖాకీ బతుకులు'

*(ఆంధ్రప్రభ ప్రతినిధి) విజయవాడ, డిసెంబర్ 28* బాధితుల పక్షాన బాధితులు కానివారు **సాహిత్యాన్ని సృష్టించే శకం ముగిసిందని** విశాలాంధ్ర సంపాదకులు శ్రీ సి రాఘవాచారి అన్నారు హెడ్‌కానిస్టేబుల్ శ్రీ జి మోహనరావు రచించిన 'ఖాకీ బతుకులు నవల ఆవిష్కరణ కార్యక్రమం శనివారంనాడు రాఘూరు లైబ్రరీలో జరిగింది

ఈ కార్యక్రమంలో శ్రీ రాఘవాచారి మాట్లాడుతూ **పీడితులు, తాడితులు తమ బాధలను తామే అక్షర రూపంలో చెప్పుకోవడం ఆరంభించారని, దీనితో బాధితుల గురించి ఇతరులు సాహిత్య సృష్టి చేసే శకం ముగిసిందని అన్నారు** ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించవలసిన పోలీసుశాఖలోనే ప్రజాస్వామ్యం లేదని ఆయన అన్నారు అయితే, ఇప్పుడిప్పుడే పోలీస్ వ్యవస్థలో కూడా మార్పులు ప్రారంభమవుతున్నాయని అన్నారు ప్రభుత్వమనే వ్యవస్థలోని వ్యవస్థీకృత క్రౌర్యానికి, పాశవికతకు, అనాగరిక స్వభావానికి పోలీస్‌ను ప్రతీకగా మనం భావిస్తున్నామని ఆయన అన్నారు పోలీస్ వ్యవస్థలోని అప్రజాస్వామిక విధానాలను నిరసిస్తూ మరిన్ని పుస్తకాలు రావాలని ఆయన అన్నారు సాధారణ పోలీసుల జీవితాల చీకటి కోణాలను రచయిత ఈ పుస్తకంలో చక్కగా వివరించారని ఆయన ప్రశంసించారు

సాహితీ విమర్శకులు శ్రీ జి లక్ష్మీనరసయ్య మాట్లాడుతూ పోలీసు వ్యవస్థ గురించి ఇతరులు రాసిన పుస్తకాల్లో వాస్తవికత కనపడలేదని అన్నారు కానిస్టేబుల్‌గా విధినిర్వహణలో నిత్యం ఎదురవుతున్న కష్టనష్టాలను రచయిత ఈ పుస్తకంలో చక్కగా ఆవిష్కరించగలిగారని, పోలీసే, పోలీసు వ్యవస్థ గురించి రాయడం వల్ల అందులో వాస్తవికత కనబడుతోందని ఆయన అన్నారు **ఎవరి సమస్యల గురించి వారు రాస్తే, అది వాస్తవికతకు దగ్గరగా ఉంటుందనే వాస్తవాన్ని ఈ పుస్తకం సమాజం ముందు ఆవిష్కరించిందని** ఆయన అన్నారు పోలీస్ వ్యవస్థపై మరిన్ని పుస్తకాలు రావడం అవసరమని, అది ప్రజాస్వామ్యానికి మంచిదని ఆయన అన్నారు

మాతృక సంపాదకురాలు శ్రీమతి రమ మాట్లాడుతూ, **ఎవరినైనా కదలించి, వారి చేత చదివించగల శక్తి ఈ పుస్తకానికి ఉందని** అన్నారు ప్రజలమీద పోలీసులు పెత్తనం చేయడానికి దోహదం చేసే పలు అంశాలను వారిమీద ప్రభావం చూపే పరిస్థితులను ఈ పుస్తకం విపులంగా సమాజం ముందు ఆవిష్కరించిందని ఆమె అన్నారు

ప్రగతిశీల మహిళా సంఘం (స్త్రీ విముక్తి) నాయకురాలు శ్రీమతి చల్లపల్లి విజయ మాట్లాడుతూ, సాధారణ పోలీసు జీవితాలకు సంబంధించి వాస్తవాలను ఈ పుస్తకం విపులంగా చర్చించిందని ప్రశంసించారు

జనసాహితీ ప్రధాన కార్యదర్శి శ్రీ కొత్తపల్లి రవిబాబు ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు ఒ పి డి ఆర్ రాష్ట్ర నాయకులు శ్రీ సి భాస్కరరావు, పుస్తకం రచయిత శ్రీ జి మోహనరావు, సాంస్కృతిక సమాఖ్య సభ్యుడు శ్రీ బి ఆంజనేయరాజు సభలో ప్రసంగించారు

తొలుత 'ఖాకీ బతుకులు' నవలను వాణిజ్య పన్నుల శాఖ డిప్యూటీ కమిషనర్ శ్రీ ఫణికుమార్ ఆవిష్కరించారు



# 2. నవలపై వచ్చిన సమీక్షలు.

'వార్త'
తెలుగు జాతీయ దినపత్రిక
ఆదివారం 11, మే - 1997
"స ం పా ద కీ య ం"

## పీడిత పోలీసుల వ్యధార్ధ జీవనదృశ్యం "ఖాకీ బతుకులు"

"ఈ డిపార్టుమెంటులో ఇంతకాలం నేనున్నా, నాబోటివాళ్ళు ఎంత మందిమి ప్రయత్నం చేసినా ఇది (పోలీసు శాఖ) ఇలా ఎందుకుందో అర్థం చేసుకోలేకపోయాం ఇక నువ్వైనా ప్రయత్నించు నీ ఉనికికి దెబ్బతగలనంతవరకు ఒకచోట పనిచేసేవాళ్ళు ఎందుకు ఒకళ్ళ మీద ఒకళ్ళు చాడీలు చెప్పకుంటూ ఒకళ్ళనొకళ్ళు దొంగ దెబ్బ తీయాలనుకుంటూ ఉంటారో ఆఫీసర్లెందుకు తమకన్నా తక్కువ వాళ్ళను హీనంగా చూస్తారో కనుక్కోలేకపోయాను వ్యక్తిగతంగా ఎదురు తిరగడం ద్వారా అయిదు శాతం మార్చినా, నేను పూర్తిగా నష్టపోయాను నువ్వు చదువుకున్నవాడివి జీవితాన్ని ఎలా మలుచుకుంటావో ఇంతకన్నా చెప్పేదేమీలేదు మన క్షేమాన్ని కాంక్షించేవాళ్ళెవరూ ఈ సంఘంలో తారసపడలేదు ఇప్పటివరకూ నువ్వు తండ్రిచాటు బిడ్డవే ఈ లోకంలో ఎలా నెగ్గుకొస్తావో నీకు నువ్వే నిర్ణయించుకోవాలి"

**తెనాలి స్పెషల్ బ్రాంచి హెడ్ కానిస్టేబుల్ జి మోహన్రావు పోలీసు వ్యవస్థలోని అట్టడుగు వర్గాలైన అతి సాధారణ కానిస్టేబుల్స్, ఆర్డర్లీల బతుకుల గురించి వారి వ్యధార్ధ జీవిత యధార్ధ గాధల గురించి నిష్ఠతో చేసిన సాహిత్య సమారాధన ఫలితమే ఈ "ఖాకీ బతుకులు" నవల** చరిత్రలో స్పార్టకస్ బానిసల తిరుగుబాటుకు నాయకత్వం వహించినవాడు కాని "స్పార్టకస్" నవలాకారుడిగా మోహన్‌రావు మారుపేరుతో ఈ నవలా రచనకు ఉపక్రమించడం విశేషమేకాదు, సాహసం కూడా ఎందుకంటే, **సామాన్యుడు ఒక పోలీసు అధికారిని ఎదురు ప్రశ్నించలేనిచోట మోహన్‌రావు తన ఉద్యోగ భద్రతకు భిన్నంగా ముందుకు వెళ్ళి సామాన్య పోలీసులు జీవన సమరంలో ఎదుర్కొంటున్న అనేక ఈతిబాధల గురించి పోలీసు వ్యవస్థనూ, ఉన్నతాధికార గుణగణాల్ని ఇందులో ప్రశ్నిస్తున్నారు** పైన ఉదహరించిన ఒక అనుభవం ఈ నవలలోదే ఒకటి ఉద్యోగ నిర్వహణలో ఎదురవుతున్న సమస్యలు కాగా, వేరొక అంశం "కులం" వేస్తున్న వెర్రితలలు "ఖాకీ బతుకులు" లోని కథానాయకులలో ఒకరైన ప్రకాశం నవలాకారుడి తండ్రిలాంటివాడే ఆయన ముప్పయిదు సంవత్సరాల కానిస్టేబుల్ ఉద్యోగంలో ఉద్యోగరీత్యా, సాంఘికంగా పడిన అగచాట్లు, చివరికి ఇందిర "ఎమర్జెన్సీ" హయాములో ఉద్యోగం కోల్పోయిన వైనం ఈ నవలకు ప్రాధమికమైన పూర్వరంగం సమకూర్చింది ఒకప్పుడు ప్రసిద్ధ కధకుడు, నవలా రచయిత పతంజలి రాసిన "ఖాకీవనం" సంచలనం రేకెత్తించడమేకాక ఈనాడు ఉన్నత స్థానంలో ఉన్న ఒక పోలీసు అధికారి ఆ పుస్తకం తాలూకు వంద ప్రతులను కొని తన తోటి ఆఫీసర్లకు పంచిపెట్టారు! అయినా "ఖాకీ బతుకులు" రాసిన మోహన్రావుకు కొందరు ఉన్నతాధికారుల నుంచి ఉద్యోగం కోల్పోయే ప్రమాదం ఉందని,

సివిల్ సర్వీసు రూల్స్ పేరిట, అధికారుల అనుమతి లేనిదే రచన చేయకూడదన్న ఆంక్ష పేరిట ఈ ప్రమాదం ఉన్నట్టు వార్తలు వస్తున్నాయి కాని ఒక రచనను, లేదా ఒక కళాఖండాన్ని ఆస్వాదించడానికీ, ఆనందించడానికీ సంస్కారం కావాలి చిత్రకారుడు గీసిన ప్రతి రేఖలో లేదా బొమ్మలో నవలాకారుడు ప్రవేశపెట్టిన ప్రతీ పాత్రలో తన బింబ ప్రతిబింబాలను చూసుకొని బెంబేలుపడేవాడూ, భయపడేవాడూ పరమ అరసికుడి కింద సాహిత్య విమర్శకులు ఏనాడో జమకట్టారు ఈ లెక్కన ఏ సాహిత్య ప్రక్రియా (నవల, నాటకం, చిత్రలేఖనం, కవిత) తన ఉసురును కాపాడుకోలేదు రచనను అర్థం చేసుకోడానికి పెద్ద మనసు ఉండాలి మనం పెట్టుకున్న సంకుచిత మానసిక పరిధులను బద్దలుకొట్టి మనస్సును విశాలం చేసుకున్నప్పుడు రచనా పఠనం ద్వారా కలిగే ఆనందానుభూతి, రసార్ద్రత వేరు ఎందుకంటే, ఎన్నోకథలు, నేరకథలు, స్వీయ చరిత్రలు రాసిన, రాస్తున్న గౌరవనీయులైన పోలీసు ఉన్నతాధికారులు మనకు లేకపోలేదు రిటైర్డ్ ఉన్నతాధికారి సుబ్రహ్మణ్యం "కమ్యూనిజం ఈజ్ హ్యూమనిజం" అన్న పుస్తకం రాశారు అరవిందరావు నక్సల్స్ గురించి రాశారు వీరుగాక నేరకథలు, గాధలూ విమర్శనాత్మకంగా (అందులో పోలీసు పాత్రలు సహా) రమ్యంగా చిత్రిస్తున్న రామకోటి, సీతారామారావులాంటి చేయితిరిగిన పోలీసు ఉన్నతాధికారులూ ఉన్నారు సదాశివరావు ఎన్నో ఉత్తమ కథలు, సజీవ కథలూ రాస్తున్నారు అయినా హెడ్ కానిస్టేబుల్ మోహన్రావు రాసిన నవలకు అభ్యంతరం ఎందుకో అర్థంకాదు! సివిల్ సర్వీసు రూల్స్‌లోని 13వ నిబంధన ప్రకారం చూసినా "ఖాకీ బతుకులు" లోని పాత్రలు కల్పితాలు (తండ్రి ప్రకాశరావు జీవితం నవలాకారుడిపై ప్రభావం నెరపిన సందర్భం మినహా) ! కల్పితమూర్తి కానిస్టేబుల్ కావచ్చు, కరడు కట్టిన ఉన్నతాధికారీ కావచ్చు పైగా సాహిత్య కళాత్మక, శాస్త్రీయ సంబంధమైన సృజనశక్తితో చిత్రించిన పాత్రలున్న పుస్తకాలను తప్ప మరే ఇతర రచననయినా ప్రభుత్వోద్యోగి ముందుగా అనుమతి పొందిన తర్వాతనే ప్రచురించాలని 13వ రూల్ నిర్వచిస్తోంది నవలగాని, కథగానీ సృజనా సాహిత్యం అని ఆ నిబంధనే అంగీకరిస్తున్నది **సృజన రూళ్ళకర్రలకు లాఠీ కర్రలకు లొంగేదికాదు అంతర్మథనం వల్ల పుట్టుకొచ్చే సాహిత్యం, స్పందన సృజనకు జీవగర్ర** చేయని హత్యకు యావజ్జీవ శిక్షపడిన 'పాపిలన్'(హెన్రీ చారియెర్) జైలుకు వెళ్ళిన 42 రోజుల్లోనే పారిపోవలసి వచ్చింది స్వేచ్ఛను దారుణంగా కోల్పోయిన చారియెర్ పోలీసు, న్యాయవ్యవస్థలపై చరిచిన చరుపులే, అతని స్వీయ చరిత్రే తిరిగి "పాపిలన్" గ్రంథంగా విడుదలయింది అదే సృజన సుప్రసిద్ధ ఫ్రెంచి నాటక రచయిత యూజినీ అయోనెస్కో అంటాడు "పుస్తకాలు చదవనివాళ్ళు బ్రూట్స్ కింద లెక్క యుద్ధాలు చేయడంకన్నా రచన ద్వారా మానవుల మనసుల్ని సంస్కరించడం మేలు" అంటూ, "చావు మాత్రమే నన్ను మూగవాణ్ణి చేయగలుగుతుంది చావు మాత్రమే నా పెదాలను మూయ గలుగుతుంది" ("Only death can silence me/Only death can close my lips") అని గాఢ్గదిక స్వరంతో చాటాడు! అంతేగాదు తెలుగునాట ఒక పోలీసు ఉద్యోగిగా కుదురుకుని ఎన్నో అనుభవాలతో వృత్తి ధర్మంలోని ఎగుడుదిగుళ్ళ గురించి, న్యాయాన్యాయాల గురించి సందర్భా సందర్భాల గురించి రాసిన నవల "ఖాకీ బతుకులు" **సాధారణ పోలీసుల బతుకుల వెనక ఉన్న గుండె చప్పుళ్ళకు ఈ రచన స్పందన, ప్రతిస్పందన** సాధారణ పరిస్థితుల్లో అతను బహుశా రచయిత అయి ఉండకపోవచ్చు కాని తాను పుట్టి పెరిగిన వాతావరణంలో ఎదురైన చేదు నిజాల వడపోతగా ఈ నవలను భావించాలి సాల్ బెల్లో ("In my innocence I had decided

to become a writer") అన్నట్టు మోహన్రావు అమాయకత్వంతో కాకపోయినా అనుభవమే ఉచ్ఛ్వాసనిశ్వాసంగా రచన సాగించి ఉండ వచ్చు ఇటీవల రిటైర్డ్ పోలీస్ ఆఫీసర్ ఎం వి థామస్ రాసిన ఒక స్వీయ చరిత్రలో రాజకీయవేత్తల వ్యాపార వర్గాల ఉన్నతాధికారుల చేష్టలను ఎన్నింటినో 'జల్లెడ' పట్టాడు । **అనుభవం సృజనగా సృజన రచనగా రూపాంతరం పొందుతుంది** ఏ సృజనాత్మక రచనతోనూ నిమిత్తంలేని దర్మవీర అధ్యక్షతన ఏర్పాటైన "నేషనల్ పోలీస్ కమిషన్" సమర్పించిన నివేదిక యావత్తూ దేశంలో ఆచరణలో పోలీసు ప్రవర్తన గురించి వృత్తిదర్మ నిర్వహణలో లోటుపాట్ల గురించీ చేసిన బృహత్ సమీక్ష అని మరచిపోరాదు 1902 నాటి కమిషన్ సిఫారసుల చట్రంలోనే ఈ రోజుకీ కానిస్టేబుల్స్, ఆర్డర్లీల బతుకులు సాగుతున్నాయని శలించింది ఇంతకూ కానిస్టేబుల్స్ "నిపుణ కార్మికుల" (Skilled Labour) కిందకి వస్తారా లేదా ఒట్టి కార్మికుల కిందికొస్తారా అన్న సమస్యను ఇంతవరకూ ఏ కేంద్ర పే కమిషన్‌లూ తేల్చలేకపోయాయి **అందుకనే ధర్మవీర కమిషన్ పోలీసు వ్యవస్థలో అట్టడుగు స్థాయి అయిన కానిస్టేబుల్స్ ప్రవర్తన వారి స్పందన సక్రమంగా ఉన్నప్పుడే ప్రజల మనస్సులను ఆకట్టుకోగలుగుతారని చెప్పింది అయితే ఈ ఆకట్టుకోవడం అన్నది కానిస్టేబుల్స్ జీవనానికీ వారి వృత్తి గౌరవానికి అనుకూలమైన పరిస్థితులు కల్పించి నప్పుడు మాత్రమే సాధ్యం ఈ సాధ్యాసాధ్యాలను వితర్కించుకుంటూ పండించిన రచనే మోహన్‌రావు "ఖాకీ బతుకులు"।**

ఈ సంపాదకీయం మొదట్లో పేర్కొన్న వాక్యాలు కానిస్టేబుల్ "ప్రకాశం" తన వారసుడుగా అదే ఉద్యోగానికి వెడుతున్న తన కొడుకు "సూర్యం"కు అందించిన అనుభవం సారం రెండేళ్లకు మించి అంతకుముందు ప్రకాశం ఏ స్టేషన్‌లోనూ ఇమడలేకపోవడానికి కారణాలు ఒకటి కావు సవాలక్ష ప్రకాశం 'బావిలో కప్ప' జీవితమూ చూశాడు బావి వెలుపల జీవితమూ చూశాడు । కానిస్టేబుల్ వృత్తిలో ఉద్యోగ ప్రవేశం నుంచి ఉద్యోగం విడిచేదాకా 'పైవారి' చేతులు తడపడానికి ఎంత ఖర్చు చేయాల్సి వస్తుందో చెబుతాడు ట్రైనింగ్ పూర్తయిన తరువాత ప్రొబేషన్ రావడానికి, వచ్చిన ప్రొబేషన్‌ను నిలబెట్టుకోడానికి, ట్రాన్స్‌ఫర్ కావడానికి, దానిని ఆపించుకోడానికీ ఎంతెంత ఎవరికి చెల్లించాలో కూడా అనుభవ నైవేద్యం । ఈ వ్యవస్థలో పెద్ద చేప చిన్న చేపను ఎలా మింగుతుందో నవలా రచయిత తన పోలీసు జీవితమే కథా వస్తువుగా నిరూపించడానికి ప్రయత్నించాడు ఇందులో జీవితాన్ని రచయిత యథాతథంగా చూపుతూనే పరోక్ష పాత్రల ద్వారా నిజపాత్రదారుల పేర్లను మాత్రం వెల్లడికాకుండా కప్పిపెట్టాడు । అంతేగాదు, ఆర్థిక స్థితికీ, మానసిక స్థితిలో రావలసిన మార్పునకూ అవినాభావ సంబంధం ఉందన్న స్పృహ కూడా రచయితకు ఉండడం విశేషం అందరూ కష్టపడేవాళ్లే కుల విభజన కుళ్ళును పెంచింది చివరికి రైలు, బస్సు ప్రయాణాలు కూడా కులం కంపు కొడుతున్నాయంటాడు । కులాల్ని చెరిపివేసే ఉద్యోగ శాఖలలో పోలీసు శాఖ ఒకటి కాని అక్కడ కూడా కులం అడుగంటలేదు పోలీస్ బ్యారెక్సులలో 'అన్నం పళ్ళాలు' కూడా కులం చెబుతాయన్నాడు । ఉప్పులో, పప్పులో కూడా కులం చూసే వాళ్ళున్న చోట ఏ ప్రగతిని సాధిస్తాం అన్నది మోహన్రావు సూటి ప్రశ్న **ఈ రచనలో రిక్రూట్‌మెంట్ నుంచి, ట్రైనింగ్ పూర్తయ్యేదాకా సాధారణ కానిస్టేబుల్స్ ప్రొబేషన్ కాలంలోనూ, ఆ తరువాత పడే ఇబ్బందుల గురించీ, అవసరమైన అధికార వృత్తి చాకిరీతోపాటు ఆఫీసర్ల ఇళ్ళవద్ద చాకిరీ, వంట చాకిరీలో కూడా వాళ్ళు ఎలా నలిగిపోతూంటారో మానవీయంగా చిత్రించారు మోహన్రావు.** రిక్రూట్‌మెంట్, ట్రైనింగ్ శిక్షణా పరిభాష యావత్తూ - అందులో పరిచయం లేని వారందరికీ ఈ నవల ద్వారా వెల్లడవుతుంది దళితులకు

ప్రతినిధిగా ప్రకాశం ఎలన్ని గ్రామాలలో మోతుబరుల కుటుంబాలలో వస్తున్న మార్పునకు ప్రతినిధిగా గురవయ్య నిలుస్తాడు । ప్రకాశం దళితుడైనా క్రైస్తవాన్ని ఆశ్రయించడానికి ఇష్టపడడు ఎందుకని ? కొందరు ఫాదరీల మోసాలు దోపిడీ అతను తన ఊళ్లో కళ్లారా చూశాడు కాబట్టి అతని మాటల్లోనే చెప్పాలంటే "రోజూ పేర్దనకి చర్చికి రమ్మంటారు ఫాదరీ కాని ఆయన సెప్పేదేంటో సరిగా అర్దం కాదు పేర్దన ఏనప్పుడు కూడా రమ్మంటాడు ఆడికి పోయిం దగ్గర్నుంచి ఊపిరాడకుండా పనులు సెప్పుతూంటాడు మనం సెడు అన్నదాన్ని వాళ్ళు జౌనంటారేందో " ప్రకాశం గురవయ్య కులాలు వేరు అయినా ఇద్దరూ ఆర్థికంగా దరిద్రులే అందుకే వారిరువురూ ఒక నిర్ణయానికి రావడం 'కులానికీ స్నేహానికీ సంబంధం లేదు ఇపుడు మనిద్దరం స్నేహంగా ఉండాలంటే ఉంటాం అంతే మనుషుల మధ్య ఉండే భావాలు ఒకే రకంగా ఉంటే స్నేహం పెరుగుతుంది కులం అడ్డురాదు "వాస్తవానికి మనం అందరం దరిద్రులమే అందుకే ఈ నౌకరీకి వచ్చాం" అన్న జ్ఞానోదయం కలిగింది ఇరువురికీ

**మోహన్రావు ఈ నవలలో కొందరు భావిస్తున్నట్టు పోలీసు అధికారులను హేహ్యమైన పదజాలంతో తిట్టడానికి ప్రయత్నించలేదు** పైగా ట్రైనింగ్‌లో, రోజువారీ గొడ్డు చాకిరీతో సాధారణ పోలీసులు పడే చెప్పరాని బాధల్ని వర్ణిస్తూ రచయిత వారికి వకల్తాపడుతూ అసలు ఫిర్యాదును ఇలా బయటపెట్టాడు "శరీరానికి సంబంధించి ఇలాంటి బాధలన్నీ ఒక ఎత్తయితే, ఆఫీసర్లు వీళ్లని అనే మాటలు ఒక ఎత్తు మానవ సహజమైన చిన్న చిన్న పొరపాట్లకు కూడా బండబూతులు తిడతారు అరక దున్నేప్పుడు గొడ్లను తిట్టినట్టే తిడతారు ఆ తిట్లు మనస్సుకు ఎంతో బాధ కలిగిస్తాయి" అందుకే పోలీసు వ్యవస్థ కూడా ఇతర శాఖలతోపాటు మానవీయమై సంస్కారం పొందవలసి ఉంటుంది ఇందుకు పోలీస్ మాన్యువల్‌లో సంస్కరణ జరగాలి అందుకు ఈ నవల దోహదం కావాలి గాల్స్‌వర్దీ రాసిన "జస్టిస్" ఇంగ్లండ్ న్యాయ చరిత్రలో అమూల్యమైన సంస్కరణలకు నాంది పలికిందంటారు పోలీసు వ్యవస్థలోని ఉన్నతాధికార వర్గం మనస్సును పెద్ద చేసుకొని "ఖాకీ బతుకులు" లో అసంతృప్తి జ్వాలకు అందరూ అభిలషించదగిన సంస్కరణలతో పరిష్కారం వెదకగలరని విశ్వసిస్తున్నాం **రచనా శక్తినీ, సృజన శక్తినీ చంపరాదని, రచనలో అభ్యంతరకర అంశాలుంటే వాటికి చూడవలసిన పరిష్కారం వేరనీ సుప్రీంకోర్టు అనేక తీర్పుల్లో చెప్పింది** 1994లో జీవన్‌రెడ్డి బెంచ్ "ఆటోశంకర్" స్వీయచరిత్ర ప్రచురణకు ఆటంకం చెబుతూ (అందులో పోలీసు ఆఫీసర్ల పాత్ర గురించి కూడా ఉంది) వచ్చిన రిట్ పిటీషన్‌ను కొట్టి వేసింది విశ్వ సమాచార వ్యవస్థ శరవేగాన విస్తరిస్తున్న కొద్దీ పరువు నష్టం దావాలకు చెందిన 'డిఫమేషన్ లా' ను కూడా తిరగదోడవలసిన అవసరాన్ని ఆ బెంచ్ స్పష్టం చేసిందని మరవరాదు ఎందుకో మరి, ఈ సందర్భంగా బెర్నార్డ్ షా పోలీసు వ్యవస్థ గురించి తడిమిన రచన "మేజర్ బార్బారా", బైరాగి ప్రశ్నకు హెడ్ కానిస్టేబుల్ ద్వారా సమాధానం చెప్పిన గురజాడ "కన్యాశుల్కం" గుర్తుకొస్తున్నాయి "మీ ఇన్‌స్పెక్టర్‌కి సూపరెంటు పని కావాలని ఆశుంది తహశీలుదారికీ వాడికీ బలవద్విరోధం ఉంది ఆ విరోధమే, మధ్యలో నన్ను కొట్టేస్తుంది" అంటాడు హెడ్ । **బుద్ధి చెప్పేవాడు గుద్దితే మాత్రం తప్పేమిటన్నది మన వేమన వేదం।**

**ఎ.బి.కె. ప్రసాద్,**
ఎడిటర్-ఇన్-ఛీఫ్



'సుప్రభాతం
సామాజిక రాజకీయ పక్షపత్రిక
5 మే - 20 మే, 1997
"పుస్తక సమీక్ష"

# పోలీసూ మనిషే

1947 ఆగస్టు 15న మనదేశం బ్రిటిష్ వలస పాలకుల నుంచి స్వాతంత్ర్యం పొందిందని చరిత్ర చెబుతుంది అయితే మనదేశ పాలనకు అవసరమైన అన్ని వ్యవస్థలనూ అప్పటి బ్రిటీషు పాలకులు నిర్మించి, అంచెలంచెల సంబంధాలను స్థిరం చేసి ఉన్నారు

అన్ని వ్యవస్థల వలెనే పోలీసు వ్యవస్థలో కూడా ఈ అంచెలు పటిష్టంగా నిర్మితమయ్యాయి అందువల్ల పోలీసు వ్యవస్థలో పెద్ద పెద్ద ఉద్యోగులను 'దొర' అనే గౌరవంతో కలిపి ఉదహరిస్తుంటారు ఇందుకు ముఖ్యమైన కారణం, 'వలస పాలన'లో అలాంటి ఉద్యోగాలకు తెల్ల 'దొరలను' మాత్రమే నియమించడం అందుకే ఎస్పీదొర, డి ఐ జి దొర ఐ జి దొర

ఇక పోలీసు శాఖలో ప్రాథమికమైన ఉద్యోగి పోలీసు కానిస్టేబుల్ (పి సి అంటారు) ఇక్కడి అంచెలలో నేలమీద ఉన్న జీవి ఇలా ఉండగా, 76 ప్రాంతాల్లో తయారైన బ్రిటీష్ వారి 'భారతీయ నేరశిక్షా స్మృతి' (Indian Criminal Procedure Code) ఈ బడుగు జీవిని (పిసిని) నేరస్థుడుగానే చూసింది అతడు రక్షకభటుడే కాని పౌరునికి ఉండే కొన్ని హక్కులు ముఖ్యంగా, సాక్ష్యం చెప్పే హక్కు నిరాకరించబడ్డాయి ఈ కారణం వల్లనే పోలీసులు నేరాలను గుర్తించడానికీ, 'రుజువు చేయడానికీ' అమానుష మార్గాలు - పట్టడానికి - కారణమైందని జస్టిస్ చిన్నపరెడ్డి లాంటి వారు అభిప్రాయపడ్డారు రెండు సంవత్సరాల క్రితం ఒక రిటైరైన ఆంధ్ర డి జి పి గారు పోలీసులకూ పాలక రాజకీయ పక్షానికీ గాఢమైన సంబంధాలు ఏర్పడుతూ ఇందిరాగాంధీ కాలానికి స్థిరమయ్యాయని అభిప్రాయపడ్డారు (1995 తొలి భాగంలో 'హిందూ' పత్రికలో పడిందా వ్యాసం)

పోలీసు ఉద్యోగులు రచనలు చెయ్యడం కొత్త కాదు పూర్వకాలంలో రిటైరైన ఉద్యోగులు రాసేవారు ఉద్యోగకాలంలో కూడా రచనలు చేసే అధికారులున్నారు కె సదాశివరావు ఐ పి ఎస్ కొన్ని గొప్ప కథలు రాశాడు అనేక విదేశీ కవితలను అనువదించాడు అయితే 'ఖాకీ బతుకులు' నవల రాసింది ఒక సామాన్యమైన పోలీసు ఉద్యోగి (పి సి) "పోలీసు వాడైతే మనిషి కాదా ? మనసు లేదా ?" అని 'మనదేశం' (1949) సినిమాలో ఒక పాట ఉండేది 'మాలోని వాడవే నీవు' అని పోలీసును తట్టిన గేయం (చెరబండరాజు) బాగా ప్రసిద్ధం

**అందువల్ల 'స్పార్టకస్' అనే జి మోహన్‌రావు రాసిన 'ఖాకీ బతుకులు' పోలీసుల సాహిత్యకృషికి ఒక కొత్త మలుపు**

నవల సాధారణంగా ఒక ప్రయాణాన్ని, ఒక దీర్ఘ జీవిత ఖండాన్ని వివరిస్తుంది 'ఖాకీ బతుకులు' నవల ప్రకాశం అనే సామాన్య పోలీసు ఉద్యోగ యాత్రను గురించి వివరిస్తుంది పోలీసు శాఖకు సంబంధమున్న అన్ని అంశాలూ ఈ నవలలో మనకు తగుల్తాయి పోలీసు ఉద్యోగానికి యాదృచ్ఛికంగా ప్రయత్నించి పి సి గా జీవనగమనాన్ని సాగించి, కంపల్సరీ రిటైర్‌మెంటు ఆర్డరు పొందేవరకు ప్రకాశం ఒక పోలీసు ఆ తర్వాత అతని కొడుకు కూడా పోలీసు ఉద్యోగం ట్రెయినింగ్‌కు వెళ్లడంతో ఈ మొదటి భాగం ముగుస్తుంది

29 సంవత్సరాల పోలీసు సర్వీసు పూర్తి చేసి, కంపల్సరీగా ఉద్యోగ విరమణ చేసిన ప్రకాశం కళ్లతో చూసిన అమానుషీకరణ ఈ నవలకు వస్తువు 1940 దశకంలో ఇంకా

స్వాతంత్ర్యం కనుచూపుమేరలో ఉన్న సమయాన పోలీసు ఉద్యోగాలలో ఉన్నత వర్గాలవారు ఉన్నత కులాలవారు తక్కువగా చేరేవారు ఇప్పుడు పి సి గా చేరిన ప్రకాశం దళితుడు బయట భూస్వాముల, రైతుల పొలాలలో పనిచేసే దళితుడు పాలేరవుతాడు 'కూలివాడ' వుతాడు ఎంత పోలీసైనా ప్రకాశం తన జీవితమంతా అలా పాలేరుగానే, కూలివానిగానే జీవితం సాగించాడు

జరిగిన దొంగతనాలు, జరగని దొంగతనాలు రెండూ పోలీసులు ప్రతిరోజూ 'ఎదుర్కొనేవే' అమానుషంగా అమాయకులను లాకప్‌లో కొట్టి చంపిన సంఘటన ఈ నవలలో బీభత్సంగా మనకు ఎదురవుతుంది నిజం చెప్పడానికి రూల్సడ్డం వస్తాయి మర్యాద లడ్డం వస్తాయి అధికారం అడ్డం వస్తుంది రాజకీయ ఖైదీలు - ముఖ్యంగా 1948 - 50 నాటి కమ్యూనిస్టులు - ఆశయాలను వదలకుండా ప్రాణాలు వదలడం ఈ జైళ్ళల్లో మామూలు, బయట జరిగిన నేరాలకు రెట్టింపు - ఇంకా ఎక్కువ - పోలీసు అజమాయిషీలో జరిగిపోతాయి **అక్కడి చిన్న ఉద్యోగులు సహజమైన స్పందనను మరచిపోతారు లేదంటే శంకరగిరి మాన్యాలు పట్టిపోతారు ఇంకా కొన్ని సందర్భాలలో బికారులయి పోతారు తాగుబోతులవుతారు ఉన్న ప్రపంచం నుంచి విడిపోతారు**

పోలీసు వ్యవస్థలో ఒక వైరుధ్యం ఉంది అది సమాజ భద్రత కోసం (?) ఏర్పరచబడ్డ వ్యవస్థ కాగా అక్కడున్న బడుగు ఉద్యోగుల భద్రత క్షణక్షణం ప్రశ్నార్థకమే నిత్య దుఃఖమే ఇటీవలి కాలంలో కొంత మెరుగయ్యిందమో కాని, ఈ నవలలో వర్ణితమైన పోలీసు జీవితం "పంచదార లాంటి పోలీసెంకట సాములకు" చోటు చూపించదు

పోలీసు వ్యవస్థ పీడక వ్యవస్థ అని సామాన్యులకు తెలుసు అందులో పనిచేసే సామాన్యులకు కూడా ఆ విషయం తెలుసని ఈ నవల చదివితే అర్థమౌతుంది "అధికార యంత్రాంగంలో బాధ్యతలు ఎవరికీ ఉండవు పక్కవాడిని పైకి నెట్టివేయడమే అక్కడ ఆనవాయితీ" అది అట్టడుగు ఉద్యోగి నెత్తి మీద అగ్ని భాండంగా మారుతుంది **సమాజంలో జరుగుతున్న విధ్వంసం - మానసికంగా, మేధాపరంగా - పోలీసు వ్యవస్థలో నిర్లజ్జగా సాగడం ఈ నవలలో చూడవచ్చును**

ఈ నవల (ఖాకీ బతుకులు ) ఒక కాలపు చరిత్ర - మనకు అంతగా తెలియని అలిఖిత చరిత్రకు ఆర్కైవల్ సమాచారాన్ని సమకూర్చి పెట్టింది పోలీసుల దుర్మార్గాలనో, ప్రభుత్వ యంత్రాంగపు కుట్రలనో వెలికి తెచ్చిందని ఈ నవలను గుర్తించనక్కరలేదు 1975 నుంచీ ఇప్పటి వరకూ జరిగిన చరిత్రలో మనం చూసిన ఘట్టాలతో పోలిస్తే ఈ నవలలోని సంఘటనలు, దుర్మార్గాలు, కాఠిన్యం ప్రాథమిక స్థాయిలో ఉన్నాయని చెప్పవచ్చు అంటే ఇప్పటి వ్యవస్థలో వ్యక్తమౌతున్న దౌర్భాగ్యాలకు ప్రాతిపదిక ఈ నవలలో మనకు కనబడుతుంది

నవల అంటే ఏమిటి ? ఒక ఇతివృత్తమా ? కొన్ని పాత్రల ప్రతీకల జీవనగమనమా ? మానసిక, భౌతిక సంఘర్షణలా ? అన్నీ అంతేకాక, ఆయా వ్యక్తులు, ప్రతీకలు బతికిన వాస్తవ ప్రపంచం కూడా నవలలో ఉంటుంది **రచయితకు ఏ రాజకీయ అభిప్రాయాలు ఉన్నట్టు తోచదు కఠోరమైన జీవితాన్ని చూసి చలించిన, ఇంచుమించు 'పిచ్చివాడైపోయిన' ఒక పోలీసు కథ ఇది. అతడు మామూలుగా బతకాలనుకుని, అది కూడా సాధ్యం కాని - పరిస్థితుల్ని ఎదుర్కొనే సామర్థ్యం అసలేలేని ప్రాథమిక మానవుని అవస్థను ఈ నవల చిత్రించింది**

**మామూలుగా మనకు తెలియని పోలీసు జీవితాన్ని, సహజంగా చిత్రించిన ఈ నవలకు సాహిత్యంలో ఒక స్థానం ఉంటుంది** అన్నట్టు మన తొలి నవలలన్నింటికీ 'చరిత్ర' లనే పేర్లుండేవి (రాజశేఖర చరిత్రము) **ఇదీ చరిత్రే.. సజీవ చరిత్ర.**

**- హరి**



**'ప్రజాసాహితి'**
**సాహిత్య సాంస్కృతికోద్యమ మాసపత్రిక**
**(191) సెప్టెంబరు 1997**
**"పు స్త క స మీ క్ష"**

# "ఖాకీ బతుకులు" వెలిగేదెప్పుడు. ?

నేటికి పదిహేడేళ్ళ క్రితం నేను విజయవాడ వెళ్లినప్పుడు, అప్పటికే నాకు సుపరిచితుడూ, రచయితా, జర్నలిస్టు అయిన, అర్భకంగా అగుపించే ఓ "కుర్రాడు" తన తొలి నవల రాత ప్రతిని నా ముందుంచేడు

"ఇది రాసి ఏడాదయింది ఇన్నాళ్లూ 'ఆంధ్రజ్యోతి'లో పురాణం గారి వద్ద ఉండి పోయింది "బాగానే రాశావుగానీ, దీన్ని ఇలాగే అచ్చేస్తే కొంపలు మునుగుతాయి సుమీ! ఎడిట్ చేయటం కూడా కుదరదు " అని వాపస్ ఇచ్చేసేరాయన ! ఆయనే అలా అన్నాక, ఇతర పత్రికల మీద ఆశ ఏం పెట్టుకుంటాం ! మీరు చదివి "చతుర"లో వేసే అవకాశం ఉందేమో చూడండి" అన్నాడతను

ఆ మర్నాడు హైదరాబాద్‌కు బయల్దేరే లోగా ఆ నవలలో సగం చదివి, అలవాటుగా పురాణంగార్ని కలిసేను "పోలీసుల్ని గురించిన నవల గదా ! వాళ్లసలే రౌడీ వెధవలు అచ్చేస్తే చాలా గొడవలవుతాయి వాళ్ల జోలికి పోయి లేనిపోని తలనొప్పులు కొని తెచ్చుకోవటం ఎందుకు గురూ " అన్నారాయన హైదరాబాద్ చేరగానే మిగతా సగం చదివేను **"మనవాడు బాగా రాశాడే! దీన్ని అచ్చేసి నలుగురి ముందుకూ తేలేకపోతే మనం ఉత్త చేతగానివాళ్ల మన్నమాటే !"** అనిపించింది

మరి పురాణం గారలా ఎందుకు భయపెట్టారా ? అని ఆలోచించగా నవలలో పోలీస్ డిపార్ట్‌మెంట్‌కు నసాళానికి తగిలే అనేకానేకాంశాలూ, లీగల్‌గా చర్య తీసుకోవడానికి అవకాశమిచ్చే కొన్ని వర్ణనలూ ఉన్నట్లనిపించింది ఆ విషయంలోనే బయపడి ఉంటారు పురాణంగారు కనుక ముందు చూపుతో లాయర్ సలహా కూడా తీసుకున్నాన్నేను కానీ, లాయర్ గారు కూడా పురాణం గారిలాగే మాట్లాడేరు "ఎందుకొచ్చిన తలనొప్పులు అచ్చేయటానికి మీకు నవలలే కరువయ్యాయా ?" అనే అర్థంలో మాట్లాడేరాయన

**అయినా ఒకమంచి నవలను, రచయిత ఒక వ్యవస్థపట్ల తీవ్రమైన కసితో, భావావేశంతో, పటిష్టంగా మలిచి, తీర్చిదిద్దిన నవలను కాదనటానికి నా మనసంగీకరించలేకపోయింది** ఆ నవల రాతప్రతి నా చేతి కందిన అయిదవ రోజున అచ్చుకిచ్చేసేను

ఆ మరుసటి నెల "చతుర" మార్కెట్లో విడుదలవగానే పాఠకుల్లో గొప్ప ఆసక్తిని, పోలీస్ వర్గాలలో తీవ్ర సంచలనాన్ని రేకెత్తించిందా నవల మన చుట్టూ ఉన్న సమాజంలోని ఒక ముఖ్య వర్గాన్ని సాహిత్యంలో కెక్కించి, ఆ వ్యవస్థ స్వరూపాన్ని సంక్షిప్తంగానే అయినా సజీవంగా, శక్తివంతంగా మన ముందుంచిందా నవల ఆ ఒక్క నవలతో అది రాసిన "కుర్రాడు" సాహితీ రంగంలో ప్రసిద్ధుడూ, చిరాయువూ అయిపోయేడు నాటికి, నేటికి ఆ నవలకు సాటి రాగల మరో రచనేదీ రాలేదా అంశం మీద

ఆ నవల పేరు "ఖాకీ వనం", రచయిత పేరు కె ఎన్ వై పతంజలి



పోలీసులకు సంబంధించింది కాదు గానీ వాళ్ల కోవకే చెందిన సైనికుల జీవితం గురించి, అంతకు చాలా ముందే నేటికి దాదాపు నలబయ్యేళ్ల క్రితం నేనో బెంగాలీ నవలను తెలుగులో చదివేను ఆ బాషలో ఆ నవల పేరు "రంగ్రూట్" ఇంగ్లీషులో 'ది రిక్రూట్' తెలుగులో "సిపాయి"

రిఫరెన్సుకు కూడా ఇపుడెక్కడా లభ్యంకాని ఆ నవల రచయిత పేరు 'బరేన్ బసు' అనీ తెలుగు అనువాదకుడు మానేపల్లి తాతాచార్య అని జ్ఞాపకం

రచయిత స్వయంగా అనుభవించి మరీ రాశాడా అనిపించేలా కథనం కొనసాగిన ఆ నవల బ్రిటీష్ వారి చివర రోజులకు ముందు, భారతదేశంలోని వారి మిలిటరీ ట్రెయినింగ్ కేంద్రాల్లోని ఒక దాంట్లోని బారతీయ సైనిక రిక్రూట్ల శిక్షణా కాలపు జీవితాన్ని పాఠకుల ముందుంచుతుంది ఆనాటి సైనిక శిక్షణా జీవితసారం ఆంగ్ల పరిభాషలో రెండు 'డబ్ల్యు' లు (డబ్ల్యు + డబ్ల్యు = వైన్ అండ్ ఉమన్) తెలుగులో దీన్ని రెండు "సా" లుగా (సారా + సాని) ప్రామాణీకరించేరు అనువాదకులు

అవసరాన్ని బట్టి యుద్ధరంగంలో "వీరోచితంగా" చావటానికవసరమైన తెగింపును వంటబట్టించి, జీవితం అనేది అందుకే నన్నట్లుగా 'రిక్రూట్స్'ను యాంత్రికంగా మార్చేసే జీవనవిదానం ఆ సైనిక శిక్షణా కేంద్రాల సారాంశంగా మనకు అవగాహన నిస్తుందా నవల

ఆనాటికి అదే అలాంటి జీవితాల్ని మన ముందుంచిన ఏకైక బారతీయ నవల దుర్భర పరిస్థితుల్లో ఎలాంటి క్రమశిక్షణ గల వారూ కూడా తిరగబడగలరని చెప్పిన తొలి 'సైనిక నవల" కూడా అదే !

  

సైన్యంలోనూ, పోలీసుల్లోనూ 'రిక్రూట్స్' సాదారణంగా ఇతరత్రా బ్రతుకు తెరువు లేక, తప్పనిసరి జీవిత పరిస్థితుల్లో, కుల, మత, భాషా బేదాలకు అతీతంగా చేరే వారే అయినా, ముఖ్యంగా పోలీస్‌లో, అందునా బ్రిటీష్‌వారి కాలంలో వారిలో దళితుల శాతమే అత్యధికం పోతే, సైన్యంలో లాగా పోలీస్‌లో "చావుకు తెగించి" మరీ చేరాల్సిన అవసరం ఉండదు అంతే !

బ్రిటీష్‌వారి పాలనా కాలంలోనే, పోలీస్ ఆర్గనైజేషన్‌లో 'రిక్రూట్స్'తో మొదలై, స్వతంత్ర భారతదేశపు "ఎమర్జన్సీ" కాలందాకా కొనసాగిన పోలీసుల పోలీస్ జీవితాన్ని, కుటుంబ జీవితాన్ని, సాంఘిక సంబంద జీవితాన్ని మన ముందుంచుతూ ఒక 800 పేజీల **బృహత్ నవల** అచ్చయి వచ్చిందిప్పడు

రాసిన దశాబ్దమున్నర తర్వాత, 1996లో అచ్చయిన ఈ నవల, ఈ కొద్ది నెలల వ్యవదిలోనే పాఠకుల్నీ, సాహితీపరుల్నీ ఆకట్టుకుని, మేదావులను ఆకర్షించగలిగిందంటే, అందుకు కారణం ఆ జీవితాన్ని, అలాంటి జీవితాన్ని ఇంతకు ముందెవరూ, అందునా స్వయంగా అనుభవించిన సాధికారతతో చిత్రించి ఉండకపోవటం ప్రధాన కారణం అలాగే **ఈ నవలా రచనాశైలి, శిల్పం మరే చేయి తిరిగిన రచయిత సామర్థ్యానికీ తీసిపోనిదిగా ఉండటం మరో కారణం**

పాఠకుడిని ఒక కొత్త ప్రపంచంలోకి, తను కనీసం ఊహించలేని జీవనాంతర్భాగాల్లోకి తీసుకువెళ్లి చకితుడిని చేసే ప్రపంచమది

పసు నిత్యం చూస్తూ బయపడే అసహ్యించుకునే ద్వేషించే ఒక వ్యవస్థ అంతర్గత స్వరూప స్వబావాల్నీ ఆ వ్యవస్థకు మూలస్థంబాలయిన పోలీసుల జీవనగతినీ యదాతదంగా కళ్ల ముందుంచే ఈ నవల పేరు "ఖాకీ బతుకులు" రచయిత 'స్పార్టకస్ అనే పేరు పెట్టుకున్న పోలీస్ కానిస్టేబుల్ జి మోహనరావు ఈ నవల రాసినందుకు కాక, అచ్చేసి నలుగురి ముందూ ఉంచేందుకు అనుమతి తీసుకోనందుకు అతనిప్పుడు షోకాజ్ నోటీస్‌తో సత్కరింపబడి ఉన్నాడు అధికారులు అంతకు మించి ముందుకు పోవడానికి అవకాశం లేక, మరేదో చిల్లర కారణం చూపి ప్రస్తుతానికి ట్రాన్స్‌ఫర్ చేసి జీతం ఆపుచేశారు

  

ఈ "ఖాకీ బతుకులు" మోహనరావు రాయ తలపెట్టిన సుదీర్ఘ నవలలోని తొలిబాగం మాత్రమే రావలసి ఉన్న రెండవ బాగంలో "ఎమర్జన్సీ"కి తరువాత కాలపు పోలీస్ జీవితాన్ని రచయిత మన ముందుంచుతానంటున్నారు

బ్రిటీష్‌వారి కాలంలో పోలీస్ వ్యవస్థలో రిక్రూట్‌గా చేరిన కధానాయకుడు ఎమర్జన్సీలో సస్పెండవగా, అతని కొడుకు ఆ జీవితం వద్దనుకుంటూనే తప్పనిసరై తనూ పోలీస్ రిక్రూట్‌గా చేరటంతో నవల మొదటి బాగం పూర్తవుతుంది అప్పటి వరకూ సాగిన పోలీస్ జీవితంలోని "ముఖ్య భాగం" బ్రిటీష్‌వారి అంతిమ దినాలనాటి తొలి తరంతో పూర్తయింది మరి, రానున్న రెండవ బాగంలో మారిన పరిస్థితుల్లో ఆ వ్యవస్థలోని వాతావరణం, రాజకీయాలు, జీవన సరళి కాస్త "చదువుకున్న" రెండో తరం పోలీసులతో ఎలా కొనసాగుతాయనేది ఆసక్తికరమైన అంశం

  

మనం ఈనాడు 50వ "వార్షికోత్స"వాన్ని జరుపుకుంటూన్న ఈ స్వాతంత్ర్యం గురించి కమ్యూనిస్టులు అలవాటుగా అనే ఊతపదం ఏమంటే " తెల్లదొరలు పోయి నల్లదొరలు" వచ్చేరు, అంతే ! అని

ఈ మాట మింగుడు పడనివాళ్ళు కూడా ఈ 'ఖాకీ బతుకులు'లోని "పాలక వర్గ" స్వబావాన్ని గమనిస్తే "అవును, నిజమే" అని ఒప్పకోక తప్పదు **పోలీస్ వ్యవస్థకు సంబంధించినంత వరకూ బాసిజం బానిసిజం - రెండూ నాటికి, నేటికి యధాతధంగానే ఉన్నాయి పోలీస్ కానిస్టేబుల్‌ను అఫీషియల్‌గానైతే అతని పేరుతోగాక నంబరుతోనూ, ప్రైవేటుగానయితే "లంజకొడకా" లాంటి పారిభాషిక పద సంబోధనల్తోనూ పిలిచే సాంప్రదాయక పరిరక్షణను పోలీసాఫీసర్లు నియమబద్ధంగా పాటిస్తూనే ఉన్నారు**

ఈ సాంప్రదాయానికి మూలం మన ఫ్యూడల్ వ్యవస్థ నాటి వర్గ సంబందాలలోనే ఉన్నది భూస్వాములంతా "అగ్ర"కులాల వాళ్ళు ! పాలేర్లూ, వ్యవసాయ కూలీలూ "అధమ" కులాలవాళ్లు అనగా, మాల, మాదిగలు ఆనాటి వారి జీవన సరళిని బట్టి, నివాస ప్రాంతాలను బట్టీ, ఆర్థిక పరాధీనతను బట్టి వాళ్లు "అంటరాని" వాళ్లయారు వెలివేసినట్లుగా వాళ్లని దూరంగానే, వాసన కూడా తగలకుండా, ఊరి బయట ఉండమన్నారు

అయితే, ఈ "అధము"లూ, వారి శ్రమశక్తీ లేకుండా భూములుగల స్వాములకు కాలం గడవదు, కడుపులు నిండవు, పొలాలు పండవు, గాదెలు పెరగవు ! వాళ్లెంత "అంటరాని" వాళ్లయినా వాళ్లు తోడిన బావులలోని నీళ్లతో స్నానాలు చేయకుండా ఉండలేరు వాళ్లు

నారుపోసి నీరు పెట్టి పెంచి పండించి కోసి, నూర్చిన దాన్యాన్ని వాళ్ల ఆడవాళ్లు దంచగా వచ్చిన బియ్యంతో వండిన అన్నాన్నే వీళ్లు తినకుండా బతకనూ లేరు

కనుక, ఈ అవసరార్థ సాన్నిహిత్యపు అనుబంధంతో "ఏరా లంజకొడకా " అని ఆప్యాయంగా కూడా పిలుచుకునే ఫ్యూడల్ సంస్కారం ఆ కాలంలో ఉండేది ఆ ఆప్యాయతకు కారణం వీళ్లు తమకోసం కష్టపడుతున్నారనీ వీళ్ల శ్రమశక్తి తమకు అండగా ఉండకపోతే కాలం గడవదనే అవగాహన కనీసం మధ్యతరగతి రైతాంగంలోనైనా ఉండేదా రోజుల్లో అదే పిలుపు దనిక భూస్వామ్య వర్గాల్లో మరోలా ధ్వనిస్తుంది అందులో అధికార దర్పం, లేదా సాదారణ పరిభాషలో "మదం" ఖచ్చితంగా కనుపించేది

కనుక, ఈ "అదమ" వర్గాలు పల్లెల్ని వదిలి పట్నాల కెళ్లినా, ట్రెయినింగులయినా వాళ్ల పై ఆఫీసర్లు ఆ "దనిక", "మధ్య తరగతి" వర్గాల నుండి వచ్చినవారే కావటంతో పైపైన "రూపు" మారినట్లు కనపడినా ఆచరణలో వర్గ సంబందాలలాగే కొనసాగాయి

ఈ నవలలోని కదానాయకుడు ప్రకాశం పోలీస్ అంటే ఏమిటో, రిక్రూటింగ్ అంటే ఏమిటో తెలియని స్థితిలోనే - ఈ గడుపుతున్న పాలేరు బ్రతుకు కన్నా అన్యాయంగా మాత్రం ఉండదు గదా, కనీసం నెలకోసారి నాలుగు రూపాయలు జీతంగా చేతిలో పడుతాయి గదా అనే ఆశతోనే పోలీస్ రిక్రూట్‌మెంట్‌కు హాజరయ్యాడు

"జానెడు పొట్ట నిండటం ఎంత కట్టంగా ఉందో, దాని కోసం ఎన్నెన్ని పనులు సేయాల్సొత్తందో ! పోలీసుల్లో చేరితే బతుకేవన్నా బాగుపడొచ్చు ఇంత అద్దుమానంగా మాత్తర ముండదు ఆసామీకి చెపితే పోనిత్తాడా ? తెల్ల తుమ్మ సెట్టుకి కట్టి గొడ్డుని బాదినట్టు బాత్తాడు సెప్పా పెట్టకుండా ఎల్లిపోవాల ఎట్టాగయితే అట్టాగయిద్ది" అనుకునే తెగించాడు

అందుకు తగ్గట్టే రిక్రూట్‌మెంట్ సమయంలో "తెల్ల ఆఫీసరు నవ్వుతూ ప్రకాశం బుజం తట్టి ఏదో అన్నాడు, ఇంగ్లీషులో "

అదీ, ఈస్టిండియా కంపెనీవారి వారసుల వ్యాపారాప్యాయత వాళ్లకు కులగోత్రాలకన్నా తమ అవసరాలు ముఖ్యం తర్వాత "అక్కడ ఉన్న నల్ల ఆఫీసరు ప్రకాశాన్ని లైన్లో నిలబెట్టాడు వరుసలో ఉన్న వాళ్లని ఒక్కొక్కళ్లనే పరీక్షగా చూస్తూ పొట్టిగా, సన్నగా ఉన్నవాళ్లని చేతిలోని కర్రతో వెనక్కు నెట్టివేస్తూ లైను చివరిదాకా వెళ్లాడు "

ఎలా ఉందీ ఘట్టం ?

భూస్వామిగారు పొలంలోనో, "లంకంత" కొంపలో ఓ మూలనున్న కోళ్లగూడులోనో కోడికాళ్లూ, పొట్టా పట్టి చూసి, పాలేరుతో "కండ బాగానే పట్టిందిగానీ, కోసి, ఈకలు పీకి ఇంటికి పట్రారా !" అనే ఘట్టం గుర్తుకు రావటం లేదూ ?

"అల్ కబీర్" ఆటోమేటిక్ పశు వదశాలకు అమ్మకానికి తోలుకు వచ్చిన గేదెల్నీ, గోవుల్నీ అక్కడి వెటర్నరీ డాక్టర్లూ, దర కట్టే వాళ్లూ ఎన్నిక చేసి, వేరుచేసే తీరు కళ్లకు కట్టడం లేదూ?

అలా మొదలయిన "పోలీస్ రిక్రూట్" తర్వాతి శిక్షణాకాలం, ఉద్యోగ జీవితం ఎంత దుర్భరంగా, దయనీయంగా కొనసాగిందీ సూటిగా, యథాతథంగా వర్ణించేదీ "ఖాకీ బతుకులు" లో రచయిత జి మోహనరావు ఇందుకు నవలలోంచి ఎన్నయినా ఉదాహరణ లివ్వవచ్చు

నా సర్వీసులో నే నెంత కష్టపడ్డానో నాకే తెలుసు ఎన్ని వందల వేల నైటు బీటులు తిరిగానో ! తుపాకి పట్టుకుని చలిలో ఎండలో వానలో పగలనకా రాత్రనకా ఎన్ని సెంట్రీ డ్యూటీలు చేశానో ఎన్ని ఎస్కార్టు డ్యూటీలు చేశానో ఎన్ని శవాల్ని పోస్టుమార్టం చేయించి పాతిపెట్టించానో దిక్కూ మొక్కూలేని ఎన్ని శవాలకి నా జేబులోని డబ్బులు ఖర్చుపెట్టానో, నేను చేయని పొరపాట్లకు ఎన్ని పనిష్మెంట్లు తీసుకున్నానో, ఎన్ని ఇనస్పెక్షన్లు జరిగాయో ఎన్ని బందోబస్తులు చేశానో ఇవన్నీ లెక్కలేవు ప్రకాశం తలుచుకుంటే గుండె పగిలిద్ది ఇప్పుడయితే అట్టాంటి పనులూ, డ్యూటీలు చెయ్యగలనా అని నాకే బయమేసిద్ది నా ఇరవై సంవత్సరాల సర్వీసులో పట్టుమని వరుసగా నాలుగు రాత్రిళ్లు ఇంటికాడ పడుకున్నది లేదు'

ఇదీ పోలీస్ కానిస్టేబుల్స్ ఉద్యోగ జీవన సారాంశం

మరి వాళ్ల కుటుంబ జీవితం ఇంకెలా ఉంటుందంటే

"అప్పటికి రాత్రి రెండు గంటలు దాటింది నిద్ర కళ్లమీద కొచ్చి నిలబడింది హాయిగా ఇంటి దగ్గర నిద్రపోయి పది రోజులవుతుంది సుమారుగా లెక్క చూస్తే నెలకు మూడు రాత్రులయినా ఇంటికాడ పడుకుంటామో, లేదో అనుకున్నాడు ఆరు గంటలకు స్టేషనుకు వెళ్లి బీటు పుస్తకం స్టేషన్లో పడేసి ఇంటి కెళ్లాడు మళ్లీ ఏడు గంటలకే రోల్‌కాల్‌కు వచ్చినపుడు "ఖయిదీని కోర్టుకు ఎస్కార్టుకు తీసుకుపోవాలి " అన్నాడు రైటర్ ఇంటికి వచ్చి తొందరగా అన్నం వండమని చెప్పాడు ప్రకాశం ! బార్య వైపు చూశాడు 'బార్యతో సరదాగా మాట్లాడి ఎన్ని రోజులయిందో' అనుకున్నాడు ఆమె ముఖం నీరసంగా పాలిపోయినట్లు కనుపించింది "దానికి జోర మొత్తందిరా, నాలుగు రోజుల్నుండి నీకు చెపుదామంటే నువ్వసలు ఇంటికాడున్నదేడ ఆ డ్యూటీలతోనే సరిపోతాంది" అంది తల్లి

"ఒకే కొంపలో తగలబడుతూ, పెళ్లాం పిల్లల ఆరోగ్యాలు ఎట్టాగుంటన్నాయో కూడా తెలుసుకునేపాటి తీరిక కూడా దొరకని దరిద్రపు నౌకరయిపోయింది" అని తిట్టుకున్నాడు ప్రకాశం

అన్నింటికన్నా ముఖ్యమైన మరో అంశం బానిసిజం ఇది పూర్తిగా బానిసిజమే

"ఆ సాయంత్రం పూట యస్పీ దొరగారి పిల్లలు బంతి ఆట ఆడుతున్నారు వాళ్లకి బంతి అందివ్వటానికి అటు ఒకళ్లు, ఇటు ఒకళ్లు ఆర్డర్లీలు నిలబడి ఉన్నారు బంతి కోర్టు దాటి పోయినప్పుడల్లా దానికోసం ఆర్డర్లీ పరుగెత్తాలి ఏ ఆర్డర్లీ కూడా కాళ్లకు చెప్పులు వేసుకోగూడదు బంతికోసం చిన్నగా ముళ్లు చూసుకుంటూ నడవటానికి వీల్లేదు బంతి తేవటం ఆలస్యం అయితే దొరగారి పిల్లలకు కోపమొస్తుంది దొరకు కోపమొచ్చినా తట్టుకోవచ్చునేమోగాని, దొరగారి పిల్లలకు కోపమొస్తే తట్టుకోవటం కష్టమయిన పని ఒక ఆర్డర్లీ కుక్కలకు సబ్బుతో నీళ్లు పోస్తున్నాడు ఇద్దరు ఆర్డర్లీలు బావిలోంచి నీళ్లు తోడి చెట్లకు పోస్తున్నారు ఒకతను దొడ్లో బట్టలుతుకుతున్నాడు ఒకతను కోళ్లను కోసి బొచ్చు పీకి శుభ్రం చేస్తున్నాడు ఒక ఆర్డర్లీ పాకీదొడ్డి శుభ్రం చేసొచ్చి చేతులు కడుక్కుని కోళ్లఫారంలోని గుడ్లు బుట్టలోకి ఎత్తుతున్నాడు ఫోనుబల్ల వద్ద ఒకతను నిలబడి ఉన్నాడు ఒకడు వంట ప్రయత్నంలో ఉన్నాడు ఒకతను లోపల బల్లలు, కుర్చీలు, గోడలతో సహా గుడ్డతో తుడుస్తున్నాడు, శుభ్రంగా

దొరగారి దొరసానిగారి, పిల్లల బూట్లు అన్నీ ఒకతను పాలీష్ చేస్తున్నాడు డ్రైవర్ కారు తుడుచుకుంటున్నాడు అర్జంట్ తపాలు తీసుకెళ్లే ఆర్డర్లీ చెట్టుక్రింద నిలబడి ఉన్నాడు చావిట్లో ఉన్న గేదెల్ని కడిగి కుడితి పెడుతున్నాడు ఒక ఆర్డర్లీ "

ఇలా సుదీర్ఘంగా సాగిపోతుందో వర్ణన ఇందులోని 'దొర'గారు బ్రిటీష్‌వాడేగానీ ఆ తర్వాత కాలపు వాళ్లవర్ణనా ఇంతకు తక్కువ తిన్నదేమీ కాదు ఈ "ఆర్డర్లీ" లనబడే వాళ్లెవరో కాదు, ఆ డ్యూటీల్లో పడే పోలీస్ కానిస్టేబుల్సే

మరి ఇంత "పచ్చిగా" ఈ విషయాలన్నీ రాసేసి, డిపార్ట్‌మెంట్ పరువు బజారు కీడ్చిన, ఆఫ్టరాల్ ఈ కానిస్టేబుల్ రచయిత నెవరయినా ఎలా సహించగలరు ? పైగా ఇంకా తాజా తాజా వివరాలు కూడా ఈ నవల రెండో భాగంలో రాస్తానంటున్నాడాయె

**ఈ నవల స్వయంగా చదవాలి తప్ప, వివరించి చెప్పాలంటే ఇలాంటి సుదీర్ఘకొటేషన్లనేకం ఇవ్వాల్సుంటుంది సుధీర్ఘాలే అయినా ఒక వ్యవస్థను గురించిన సమగ్ర చిత్రం పాఠకుల ముందుంచేందుకు సవివరంగానే చిత్రించాడీ రచయిత**

ఈ నవల ఈ రచయిత తండ్రి తరంలో జరిగినట్టిది రెండో బాగంలో రచయిత స్వీయానుభవాలూ, ఈనాటి వ్యవస్థా స్వరూప, స్వభావాలూ రావలసి ఉన్నాయి ఇందులోనే రచయిత నిజాయితీ, నిబద్ధత ప్రతిఫలించవలసి ఉన్నది ఈ పనిని వాయిదా వేయటానికి రచయిత చెప్పే ఏ కారణం కూడా ఆమోదయోగ్యం కాజాలదు మొదటి భాగంతో మనందరి అభిమానానికి పాత్రుడయిన రచయిత బాధ్యతా, విద్యుక్త దర్మమూ అది

అదిగాక ఈ "ఖాకీ బతుకులు" మొదటి బాగంలోని కదానాయకుడు ప్రకాశం ఈ వ్యవస్థలోని దళిత వర్గపు మొదటి తరంవాడు అప్పటి పరిస్థితికీ, ఇతని కొడుకు పోలీస్ రిక్రూట్‌గా చేరిన నాటి పరిస్థితికీ తేడా ఉంది ఆ తరం - ఈ తరం ఆలోచనా రీతిలోనూ, స్వభావంలోనూ కూడా తేడా ఉన్నట్లు రచయితే వర్ణించాడు దానికి తోడు ఈ తరం కుర్రాడు రాడికల్ బావాలు కలిగిన వాడై, ఆ పోలీస్ వ్యవస్థలో కలసిపోయి, దానిలో మార్పులు తేవడానికై కృషి చేయటం కోసమే చేరుతున్నట్లుగా ధ్వనింపజేశారు, రచయిత కదాక్రమాన్ని బట్టి ఈ రచయితే ఆ కుర్రాడు

మరి, అలాంటివాడు పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో చేరాక, ఆ వ్యవస్థలో ఎలా ఇమిడాడు ? ఆ కఠిన "క్రమశిక్షణ" తిరుగులేని అదికారాల అదికార యంత్రాంగం ముందు అతనెలా నిలబడగలిగాడు ఖాకీ బతుకులలో మార్పుకు, వెలుగును తేవడానికి అతనేం చేశాడు ? చేయగలిగాడు ? లేదా చేయలేకపోయాడు ? ఎలా ? ఎందువలన ? లాంటి ప్రశ్నలకు ఈ రెండవ భాగంలో జవాబులు రావలసి ఉన్నాయి

  

ఈ "ఖాకీ బతుకులు" రాయటంలో రచయిత ఉద్దేశ్యం ఆ వ్యవస్థలోని "అధోజగత్సహోదరుల" బాధామయ జీవితాల్ని పాఠకుల ముందుంచి, సానుభూతి పొందటమే ఆ విధంగా రచయిత తొలి అంశాన్ని విజయవంతంగా నిర్వర్తించేరు ఇహ, "సానుభూతి" అనేది రెండో అంశం

"ప్రజల కోసం పాటుపడే పోలీసు బ్రతుకిలాగెందుకుందని మేధావులని అడగాలనుకుంటున్నాను" అంటున్నారీ రచయిత తన "పరిచయం"లో

కానీ మేదావులకూ, సామాన్యులకూ కూడా నేటి పోలీస్ వ్యవస్థ పట్ల "బయం", 'అసహ్యం" తప్ప సానుబూతిగాని గౌరవంగాని ఏ మాత్రం మిగిలి లేవనేది ఒక కఠోర సత్యం ఈ విషయంలో గతమే కాస్తన్నా నయమేమో నన్నంతగా నేటి పోలీస్-ప్రజా సంబందాలు అసలే రూపంలోనూ లేకుండా పోయాయి ఇందుకు కారణం పూర్తిగా పోలీసులే వారి కార్యనిర్వహణా తీరే ! ప్రజావసరాలు ప్రజా సంక్షేమం పట్ల వారికి గల నిర్లక్ష్య దోరణే !

పోలీస్ వ్యవస్థ అనేదున్నదే ప్రజల కోసం దానిని పోషిస్తున్నది తమ పన్నులలో పరోక్షంగా ప్రజలే ప్రత్యక్షంగానూ బాదిత ప్రజలే

సువ్యవస్థితంగా ఉండవలసిన సామాజిక జీవితంలో బాగంగా ప్రజా ప్రయోజనాల పరిరక్షణ కోసం ఉద్దేశించబడింది పోలీస్ వ్యవస్థ

కాని ఆచరణలో అలా జరగటం లేదు ఆ ప్రజలలోని 95% కోసంగాక, దనికులూ, పలుకుబడిగలవారూ నైన 5% మంది ప్రయోజనాల పరిరక్షణ కోసమే పోలీస్ అన్నట్లుగా ఉందినాటి పోలీస్ వ్యవస్థ పనితీరు

పైన ఒక కొటేషన్లో ఉన్న విదంగా ఒక కానిస్టేబుల్ "నా సర్వీసులో నేనెంత కష్ట పడ్డానో నాకే తెలుసు ఎన్ని వందల వేల నైటు బీటులు తిరగానో !" అని వాపోయే దాంట్లో అతిశయోక్తి ఏమీ లేదు అలాంటి వందలు వేలు, లక్షల కానిస్టేబుల్స్ కోట్ల కొద్దీ బీట్లు తిరుగుతూనే ఉన్నారు మరి, వాటి ఫలితాలేమవుతున్నాయి కొందరి అంటే 5% వారి విషయంలో చూపే శ్రద్దను, అందరి అంటే 95% ప్రజల విషయంలో నిజాయితీగా ప్రదర్శిస్తున్నారా ? ఒక సామాన్యుడి ఇంట్లో ఏదేనా జరిగి కంప్లయింటిస్తే, వచ్చిన పోలీసులు మొక్కుబడిగా వచ్చి, చూసి మాట్లాడి, వెళ్తూ "టీ తాగించరా సార్ " అనడిగి టీ టీకిగాక "మందు"కు చేయిజాచే పరిస్థితి ఎందుకు ఎదురవుతోంది ? "వీళ్లనసలు ఎందుకు పిలిచాంరా బాబూ " అని ఆ ప్రజలు విసుక్కునే, చీత్కరించుకునే దుస్థితి ఎందుకు వచ్చింది

అలాంటి ప్రజలకు ఇలాంటి పోలీసుల పట్ల సానుబూతి ఎలా ఉంటుంది ? ప్రజల కష్టాలు దారిని వారికి ఉండగా తమకు అక్కరకు రాని పోలీసుల కష్టాల పట్ల వారి కెందుకు ఆసక్తిగాని, సానుబూతిగాని ఉంటుంది?

ప్రజలకోసం చిత్తశుద్ధితో, బాద్యతాయుతంగా పని చేయనంతకాలం పోలీస్ పరిస్థితి అంతే ! ప్రజల నుండి ఎలాంటి సాయాన్నీ సానుబూతినీ వారు పొందలేరు గతంలో, దేశంలో ఒకటి రెండు చోట్ల పోలీసులు సామూహికంగానే తిరగబడ్డారు ఆయుదాగారాల్ని స్వాదీనం చేసుకుని సాయుదులై ప్రబుత్వంపై దాడికి సిద్దపడ్డారు కాని, వారికన్నా బలమైన సైనికుల చేతిలో ఓడిపోయి, బందీలయారు వారిని ఆదుకునేందుకు ప్రజలు ముందుకు రాలేదు ఏకాకులయిన వీరిని ప్రబుత్వాలు "క్రమశిక్షణ" పేరుతో నిరుద్యోగుల్ని చేయటమేగాక కఠిన శిక్షలకు గురి చేసేయి వారి (సైనికుల) వేళ్లతో వారి (పోలీసుల) కళ్లనే పొడిచేయి వాళ్ల ఓటమికి కారణం వాళ్లెంత ఆర్గనైజ్డ్‌గా ఉన్నా, ప్రజల మద్య ఒంటరివాళ్లూ, "అంటరాని" వాళ్లూ, పట్టించుకోనక్కర్లేని వాళ్లూ కావటమే

పోలీసుల్ని గురించి "ఆర్గనైజ్డ్ అండ్ లైసెన్స్‌డ్ గూండాస్" అనేమాట "మేదావుల"లో ప్రచారంలో ఉందనే సంగతి ఈ "ఖాకీ బతుకులు" రచయితకు తెలియదనుకోలేం లైసెన్స్‌డ్ గూండాస్ అనే మాటనలా ఉంచి "ఆర్గనైజ్డ్" గా ఉన్నవారు తమ ఉద్యోగ జీవితాల్ని దారికి తెచ్చుకుని, సాంఘిక జీవితాల్ని వెలుగులతో నింపుకోవడానికి "ఆర్గనైజ్డ్" గానే కృషి చేయవలసి

ఉన్నది ఆ పని ఎవరో వచ్చి చేసి ఉద్ధరించేది గాదు, వారే స్వయంగా అందుకు కదలవలసి ఉన్నది అందుకు నాందిగా ముందు వారు ప్రజలపట్ల తమ వైఖరిని బాధ్యతల్ని పునర్నిర్వచించు కోవలసి ఉన్నది చిల్లర మల్లర సంస్కరణలను గాక వ్యవస్థలోనే సమూలమైన మార్పులను వారు కోరుకోవలసి ఉన్నది

  

పోలీస్ వ్యవస్థ వలన అందరికన్నా ఎక్కువగా బాధలు పడినవారు బ్రిటీష్ అనగా ఈ "ఖాకీ బతుకులు" నవలా కాలంలో వారి కాలంలో కాంగ్రెస్ వారుగా ముద్ర పడిపోయున్న "దేశభక్తులు"కాగా, ఆ తరువాతి "నల్ల" వారి పాలనలో కమ్యూనిస్టులు । బహుశా కమ్యూనిస్టులకు తెలిసినంతగా ఈ పోలీస్ వ్యవస్థ స్వబావం మరెవరికీ తెలిసి ఉండకపోవచ్చు వారికి కలిగినంత నష్టం మరెవరికీ కలిగి ఉండకపోవచ్చు

ఆ కమ్యూనిస్టుల పార్టీ తరపున ఇంద్రజిత్ గుప్తా ఈనాడు కేంద్రంలో హోం మంత్రిగా ఉన్నాడు

ఇన్ని నెలల హోం శాఖా మంత్రిత్వంలోనూ, అడపా దడపా ఆయన ఏదేదో నోరు జారి, పత్రికలకెక్కి ప్రచారం పొందాడు తప్ప

తనే వ్యవస్థకు మార్గనిర్దేశం చేసేందుకుగాను మంత్రిగా ముందుకు వచ్చాడో, ఆ వ్యవస్థను గురించి, దాన్ని దారిలోకి తేవటాన్ని గురించి ఆలోచించిన జాడ నేటివరకూ లేదు అయినా, ఆయన పాపం, కమ్యూనిస్టే ఇదొక చారిత్రక విషాదం ।

**కనుక, ఎవరో వచ్చి ఏదో ఊడబొడుస్తారని చూడక పోలీసులు తమకోసం తామే నిలబడాల్సి ఉంది**

ఈ "ఖాకీ బతుకులు" ముగింపులో పోలీస్ రిక్రూట్‌గా వెళ్లిన కథానాయకుడు ప్రకాశం కొడుకు సూర్యం వారినలా నిలబెడతాడనీ నిలబెట్టగలగాలనీ రచయిత ఆశగా కనుపిస్తుంది అతని పేరు సూర్యం

వెలుగుకు మారుపేరు గదా అది ।

**- చలసాని ప్రసాదరావు**



'అరుణతార'
సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక
(188) జూన్, 1997
"పుస్తక సమీక్ష"

# పోలీసు బతుకిలాగెందుకుంది ?

'బూట్ పాలిష్ సరిగాలేదు దొంగనాకొడుకు రిమార్క్ చేస్తాడేమో ?"

"ఆడి గుండెల్లో 303 బయొనెట్ దించి అట్టాగే కాసేపుంచాలిరా అప్పడు గానీ కసి తీరదు'

పై ఆఫీసర్ల గురించి కానిస్టేబుళ్ళు మాట్లాడుకున్న ఈ సంభాషణలు "ఖాకీ బతుకులు" నవలలోనివి "చేతిలో తుపాకీ ఎత్తి తూటాలు అయిపోయిందాకా తూట్లు పడేట్లు ఆఫీసర్లను కాల్చి మనిషిగా పుట్టినందుకు వొక మంచిపని చేశామనే తృప్తితో చచ్చినా దిగుల్లేదనుకుంటారు కానిస్టేబుళ్ళు, హెడ్ కానిస్టేబుల్లు" ఈ వాక్యాలు చదివిన వెంటనే 1988లో హైద్రాబాదులో ఒక కానిస్టేబుల్ జీపులో తనముందు కూర్చున్న DSPని రివాల్వర్‌తో కాల్చేసిన ఘటన గుర్తుకొచ్చింది ఆ రోజు ఈ వార్త చూడగానే కస్టడీలో వున్న నాతో "బాగయ్యింది యింగ ఏ ఆఫీసరు నాకొడుకూ ఎక్కంద్రా జీపు అని గొర్రెల్లాగా మమ్మల్ను వెంట తీసుకపోయి అడ్డమైన చాకిరీ చేయించుకోరు" అని ఒక కానిస్టేబులు చేసిన వ్యాఖ్య గుర్తు కొచ్చింది పై ఆఫీసర్ల మీద ఎందుకింత కసి ? వాళ్ళ దుర్భర జీవితమా ? పోలీసు క్వార్టర్లతో ఏ కొద్దిపాటి పరిచయం వున్న వాళ్ళకయినా వాళ్ళ జీవితాలేమో తెలుస్తాయి బానిస వుద్యోగపు విషాదం, పేదరికం, జులాయిగా తిరిగే పిల్లలు రౌడీ గాంగుల్లో భాగమైన కొడుకులు, నిరుద్యోగులు - మహా అయితే వాళ్ళ పిల్లలు కానిస్టేబుళ్ళు మాత్రమే అయ్యారు కాని DSP లు, SPలు, CI లూ కాలేదు ఎందుకిలాగైందని రచయిత ప్రశ్నించాడు ?

  

తెలుగు సాహిత్యంలో కన్యాశుల్కం నుంచీ మనకు పోలీసు పాత్రలు తెలుసు అందులో బాగా గుర్తుండి పోయేవి రావిశాస్త్రి, కరుణకుమార్ కథల్లోనివి అట్లాగే పతంజలి "ఖాకీవనం' ' కూడా యివన్నీ చిత్రించింది పోలీసుల్లోని ఒక పార్శ్వాన్నే (పోలీసులు అని నేను అంటున్నది కానిస్టేబుళ్లను మాత్రమే ఆఫీసర్లను కాదు)

ఈ రచనల్లోని పాత్రలన్నీ సమాజంలోని పోలీసు స్వభావానికీ, ప్రవర్తనలకూ బైటినుంచి వచ్చిన ప్రతిస్పందనలు మాత్రమే

పోలీసు జీవితాన్ని యథాతథంగా, వ్యవస్థలో దాని స్థానాన్నీ, పోలీసు వ్యవస్థలోని ఆధిపత్యాన్నీ, అణచివేతనూ బాగా చిత్రించిన నవల జి మోహనరావు (కలం పేరు స్పార్టకస్) రాసిన ఖాకీ బతుకులు వృత్తిరీత్యా కానిస్టేబుల్ తండ్రి కూడా కానిస్టేబులే ఈ రెండు తరాల జీవితానుభవం నవలా వస్తువు

  

తెల్లదొరల పాలనలో (1940) మాలకులస్తుడూ పాలేయా 'సెకాచి పోలీసు ప్రకాశంగా వుద్యోగంలోకి చేరడంతో నవల మొదలౌతుంది "పల్లెల్లో ఆసాముల్లాగా కూలీకి గింజలు కొలవరు డబ్బులిస్తారు కూలీ కూడా ఎక్కువే ఆసాముల దగ్గర గొడ్డుచాకిరీకన్నా యిదే నయం" అనుకొని ప్రకాశం నౌకరీకి పోయాడు యింకా సెలక్షన్లు జరుగుతుండగానే అగ్రవర్ణాలవాళ్ళు దాడి చేయడంతో ఉద్యోగంలో కూడా 'కులం' తడాఖా ఏమిటో తెలిసింది అది మొదలు ఆఫీసర్ల యిండ్లలో, సరుకుల అంగట్లో, స్టేషను బయటా లోపలా కూడా వెంటాడిన ప్రశ్న "మీరేమిట్లు" ?

అప్పడు పోలీసుద్యోగాల్లో కూడా ఎక్కువమంది మాలమాదిగలే కొంతలో కొంత వెనుకబడిన కులాలు అగ్రవర్ణాల వాళ్ళు చాలా తక్కువ అదికూడా కూటికి గతిలేక వొచ్చిన బాపతే ఆ తరంలో టీచర్లుగా, డాక్టర్లుగా, కోర్టుల్లో, బాగా ఆదాయం గిట్టే రెవిన్యూ ఆఫీసుల్లో అగ్రవర్ణాల వాళ్ళు ప్రవేశిస్తే, సైన్యం, పోలీసులాంటి నెత్తుటికూటి నౌకర్లు శూద్రులకూ, మాలమాదిగలకూ పరిమితమయ్యాయి ఎందుకు ?

చొక్కాలు కూడా లేని తమదగ్గరకూడా లంచం గుంజడంతో, ట్రైనింగు కొచ్చిన మొదటిరోజే పోలీసు వ్యవస్థ ఎంత లంచగొండో ప్రకాశానికి అర్థమైంది ఇంక ట్రైనింగులో మాత్రం నేర్పించిందేముంది ?

"భయపడటం, ఆఫీసర్లకు భయపడడం, వాళ్ళు చెప్పినట్లు చేయడం" అంతే కాదు "రోజూ ఒక అధికారి యింట్లో ఆర్డర్లీగా వెట్టిచాకిరీ చేయడం" మొత్తానికి గవర్నమెంటు నౌఖరీనో, పాలేరు పనో ప్రకాశానికి అర్థం కాలేదు ట్రైనింగులో జాన్, గురవయ్య, CLI భార్యలాంటి మంచివాళ్ళ పరిచయంతో చదువు నేర్చుకున్నాడు ప్రకాశం పుస్తకాలు చదివి కొత్త ప్రపంచాన్ని తెరుచుకున్నాడు "జీవితాన్ని వీలయినంత ఎక్కువ తెలుసుకోవాలని" కాంక్షించాడు ఈ కలలన్నీ వుద్యోగంలో విధ్వంసం అయ్యాయి ట్రైనింగులో చెప్పిన చట్టానికీ వుద్యోగానికీ పొంతనే లేదు **పోలీసంటే యంత్రం మూర్ఖమైన డిసిప్లిన్, సబార్డినేషన్ తప్ప యింకేమీలేని గానుగెద్దు జీవితం** నైటుబీట్లు, బందోబస్తులు, గార్డులు, శవాలకు ఎస్కార్టు, ఖైదీల్ని కొట్టడం ఈ మూసబతుకులోని విసుగు యింట్లోకీ ప్రవేశిస్తుంది విసుక్కోవడం, తిట్టడం అంతకుముందు లేనట్టుగా కొట్టడంకూడా "పోలీసు ఆధిపత్యం" భార్యాభర్తల సంబంధాల్లోకి కూడా ప్రవేశిస్తుంది ఈ కష్టాలన్నిటికీ కారణం యింగ్లీషు వాడనుకున్నాడు ప్రకాశం మనకు స్వాతంత్ర్యం వస్తే కష్టాలు తీరతాయని ఆశించాడు కానీ స్వాతంత్ర్యం తరువాత కూడా మార్పేమీ కనిపించలేదు వూర్లో ఆసాములకు, ధనవంతులకూ మాత్రమే పోలీసులు వుపయోగపడటం చూసి తెల్లదొరలే మేలనిపించింది

వుద్యోగంలో చేరాక స్వంత వూర్లో తనకూ, తన కుటుంబానికీ గౌరవం పెరిగింది పాలేరుగా వున్నప్పుడు పీడించిన ఆసామీ యిప్పుడు యింటికి గింజలు కొలిచి పంపించాడు పోలీసు వుద్యోగం 'పవర్' ఏమిటో ప్రకాశానికీ అర్థమైంది ఒకవేళ వుద్యోగంలో నిజాయితీగా ఉందామనుకున్నా వుండలేని పేదరికం జీతం చాలక భార్యకు మందులు కొందామంటే డబ్బులు లేనప్పడు "ఈ రోజు స్టేషన్లో ఏమైనా డబ్బువస్తే బాగుండు" అనుకునే స్థాయికి దిగజారుస్తుంది

  

మన పోలీసు వ్యవస్థ బ్రిటీష్ నకలు మనం యిప్పటికీ వాడుతున్న A P పోలీసు మాన్యువల్ ఆనాడు తయారైన రూపమే అప్పటి చెడుగులతో సహా దాన్నే యధాతధంగా కొనసాగిస్తున్నాం స్వతంత్ర దేశంలో ప్రజాస్వామ్యాన్ని నిలబెట్టాల్సిన పనిగాకుండా - బ్రోతల్ హౌసులూ, బార్లూ సజావుగా నడవడానికి సహకరించడం, స్టేషన్లలో సారాయి అమ్మడం మట్కాలాంటి జూదాల్ని దగ్గరుండి నడిపించడం పోలీసుల పని అయ్యింది దొంగ కేసులు పెట్టి, దొంగ సాక్ష్యాలు యిప్పించి న్యాయ వ్యవస్థను ధ్వంసం చేసేవాళ్ళుగా, చివరకు పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ఉన్నత ప్రక్రియ అయిన ఎన్నికలను విచ్ఛిన్నం చేసి పాలక వర్గాన్ని గెలిపించే సాయుధ గూండాల స్థాయికి దిగజారారు యిది వాళ్ళకు అపరిమిత అధికారాన్ని యివ్వటమే కాదు, అవినీతిని అమలుచేసే లైసెన్సునూ యిచ్చింది ఈ తప్పుడు పనుల కన్నింటికీ పోలీసుల్ని వాడుకున్నారు కాబట్టి యింక దాన్ని నియంత్రించగలిగే సామర్ధ్యాన్ని శాసనవర్గం కోల్పోయింది

ప్రజాస్వామ్యం అవగాహన ప్రకారం రాజ్యంలో అధికారం బలం రెండూ ప్రజలకు చెందాలి ఈ రెంటినీ ప్రజలు మాత్రమే నియంత్రిస్తారు కానీ "స్వాతంత్ర్యం" తరువాత కూడా మన దేశంలో యిది జరగలేదు "ప్రజాస్వామ్యం" పాలకవర్గాల చేతిలో చిక్కి ప్రజలు నామమాత్రం అయ్యారు అధికారం-దోపిడీ చేయడానికీ, బలం-అణచివేయడానికీ దుర్వినియోగమైంది పాలకవర్గం ఈ రెంటినీ అమలు చేయడానికి సాధనాలు పోలీసులు

**యింతకుముందు చెప్పినట్టు పోలీసులు ఎక్కువ భాగం పేదవర్గం నుంచీ తక్కువ కులాల నుంచీ వచ్చిన వాళ్ళు వీళ్ళు చట్ట ప్రకారం డ్యూటీచేస్తే తప్పనిసరిగా తమ వర్గం వాళ్ళకే సహకరిస్తారు అట్లాకాకుండా వీరిని తమకుపయోగపడే సాధనాలుగా మార్చాలంటే ముందు పోలీసును అతని వర్గం నుంచి, కులం నుంచి వేరుచేయాలి కర్ర తప్ప కన్ను వుండకూడదు వేషం తప్ప వివేచన వుండకూడదు తుపాకీ తప్ప హృదయమూ వుండ రాదు ట్రైనింగులో క్రమశిక్షణ పేరుతో డిహ్యూమనైజ్ (De humanize) చేసే పని జరుగుతుంది.** పోలీసులు అంతరంగిక భద్రతను కాపాడతారంటే అర్ధం స్కాముల స్వాములకు రక్షణ కల్పించడం, నల్ల బజారును చూసీచూడనట్టు పోవడం, లంచగొండుల, ధనవంతుల, భూస్వాముల పక్షం వహించడం అని అర్థం చేయిస్తారు ఈ పనిని వొప్పుకోని ప్రకాశం లాంటివాళ్ళు డిపార్ట్‌మెంటులో ఎప్పుడైనా "అసమర్ధులు"గానే గుర్తింపబడతారు

ఈ లక్షణాలను సంతరించుకున్నందువల్లే 1955 నాటికే పోలీసుల పట్ల ప్రజల్లో భయం పోయి, అసహ్యమూ, ద్వేషమూ చోటుచేసుకున్నాయి

**పోలీసు వ్యవస్థది పాము స్వభావం డబ్బు, అధికారం కోసం అది తన పిల్లల్ని తానే మింగేయగలదు తమ అధికారం నిలుపుకోడానికి యింకొకర్ని బలి పెట్టిన ప్రయత్నాలు అనేక చోట్ల కనిపిస్తాయి** పోలీసు రాముల్ని చేయని నేరానికి బలిచేసి తాను సేవ్ (Save) కావాలనుకున్నాడు రైటరు ప్రకాశం లాంటి తలబిరుసు పోలీసులమీద చాడీలుచెప్పి SI, CI ల దగ్గర ప్రాపకం సంపాదించే లోకనాథాలు, కానిస్టేబుల్ కేసు తెస్తే తన పేరు రాసుకొని రివార్డు కొట్టేసే యస్సైలు నవల్లో కనిపించే ఉదాహరణలు ప్రతి ఒక్కర్నీ యింకొకడు తొక్కడానికి ప్రయత్నిస్తాడు ఈ సిస్టమ్‌కు ఎవడైనా ఎదురు తిరిగితే, అవకాశం చూసుకొని ఏదైనా లూప్‌హోల్‌లోకి లాగి యింక మళ్ళా లేవకుండా వెన్నెముక విరగ్గొట్టేస్తారు అందుకోసం కమ్యూనిస్టు సానుభూతిపరుడని నెపం పెట్టి జైలుకు పంపగలరు కూడా

ఈ రాగిపల్యాన్ని ఆమోదించనందుకే పనిష్మెంటుగా ప్రకాశంకు రిజర్వు పోలీసుకు బదిలీ అయ్యింది

అక్కడా యిదే పరిస్థితే యింతకు మించిన గొడ్డుచాకిరీనే తన ఉద్యోగ జీవితం పొడుగునా ఎక్కడా కొత్త విషయాలను జ్ఞానదాయకమైన విషయాలనూ తెలుసుకునే అవకాశం తీరిక వెసులుబాటు లేకపోవటం ప్రకాశంను నిరుత్సాహపరుస్తుంది పైగా ఈ యాంత్రిక బతుకువల్ల ట్రైనింగులో నేర్చుకున్న ఆ కాస్త చదువూ చట్టుబండలైంది **ప్రజాస్వామ్యం ప్రతి మనిషిలోని స్పృహనూ చైతన్యాన్ని, సృజనాత్మకతనూ బావుకతనూ వికసింపజేసే సామాజిక నిర్మాణరూపం ప్రకాశం లాంటి లక్షలాది పోలీసులు ఎటువంటి ఎదుగూ బొదుగూ లేకుండా వట్టిపోయిన ఆలోచనలలో ఉన్నారంటే పోలీసు వ్యవస్థలో ప్రజాస్వామ్యం లేదనేగా అర్థం --**

వాళ్ల జీవితం యింత దుర్భరమైనా ఎక్కడా అసంతృప్తి ప్రకటించకూడదు అధికార్ల వేధింపుల గురించి అర్జీలు పెట్టరాదు విన్నపానికి కూడా అవకాశం లేదు "అర్జీలు పెట్టే వాడంటే అధికారుల దృష్టిలో ప్రమాదకరమైన వ్యక్తి" **ప్రజాస్వామ్యాన్ని "నిలబెట్టే" పోలీసులకే హక్కులు లేవు।**

రిజర్వులో ఆర్నెల్లు యింటికి దూరంగా వుండి బందోబస్తు డ్యూటీ చేసొస్తే, వొచ్చినరోజు రాత్రికే గార్డు డ్యూటీ వేసినపుడు యింక ఘర్షణ తప్ప మరో మార్గం లేదని అర్థమైంది ప్రకాశంకు కింది అధికార్లను కాదని సమస్యను S P దృష్టికి తీసుకపోయి పరిష్కరించు కుంటారు తమను రిజర్వునుంచి సివిల్ పోలీసుకు బదిలీ చేయమని కోరుతూ కానిస్టేబుల్స్‌ను IGP ముందు ప్రత్యేకంగా ఫాలెన్ చేయించి కోర్కెను సాధించుకుంటారు యిటువంటి చర్యలు ఆనాటి పోలీసు చరిత్రలో మొదటిసారి ఈ రెండు సంఘటనలలో ప్రకాశంకు పోలీసుల్లో ప్రత్యేక గుర్తింపు వస్తుంది

వారానికొక దినం సెలవు కోసం మద్రాసు పోలీసులు సమ్మెచేస్తే, ప్రభుత్వం సెలవు దినం యిచ్చింది కానీ సమ్మెలో పాల్గొన్నవాళ్లను డిస్‌మిస్ చేసింది డిస్‌మిస్ అయిన వాళ్లను మిగతా పోలీసులు పట్టించుకోలేదు వాళ్ళు ఆర్థిక సహాయం కోరుతూ ప్రకాశం వున్న స్టేషను కొచ్చారు వాళ్ల పరిస్థితి చూశాక సమ్మెలన్నా యూనియన్లన్నా పోలీసులకు భయం పట్టుకుంది డిస్మిసల్ ద్వారా ప్రభుత్వం ఆశించిన ప్రయోజనమూ యిదే తెగించి ఎవరైనా సమ్మెకు దిగితే సి ఆర్ పినో, సైన్యాన్నో దించి వాళ్లను అణచేసిన ఉదాహరణలు అనేకం 1973లో లక్నో యూనివర్శిటీలో సైన్యం జోక్యాన్ని నిరశిస్తూ విద్యార్థులూ, పోలీసులూ కలిసి ఊరేగింపులు తీశారు కొందరు పోలీసులు తుపాకులు ఎత్తుకుపోయారు ప్రభుత్వం దింపిన సైన్యం వాళ్లను వెతికి వెతికి హింసించారు

**ఈ పరిస్థితుల వల్లనే పోలీసులకు యింతవరకు బలమైన యూనియన్ ఏర్పడలేదు పై అధికార్ల కనుసన్నలలో నడిచే సూడో యూనియన్లు ఉన్నా అవి పోలీసుల దిన దిన సమస్యల్ను పరిష్కరించలేవు**

తెలంగాణాలో పోరాటం మొదలైంది ప్రకాశంలాంటి పొగరుబోతు కానిస్టేబుళ్లను, ఆఫీసర్లనూ పనిష్మెంట్ కింద తెలంగాణాకు పంపారు ప్రకాశం టైఫాయిడ్ బారినపడి ఆ ప్రమాదం నుంచి తప్పకున్నాడు కానీ ఆ ముప్పు ఆగదు కోస్తా ప్రాంతానికీ వస్తుంది అక్కడా కమ్యూనిస్టులు తయారయ్యారు పోలీసుల బట్టలుతికే చాకలివాడు కమ్యూనిస్టు ఎలా అయ్యిందీ ప్రకాశానికి ఎంతకూ అర్థం కాదు కమ్యూనిస్టుల వల్ల తమ జీవితాలు కష్టాల్లో

(Risk) పడ్డాయని పల్లెలకూ అడవులకూ గాలింపులకు పోవడమూ వీటన్నిటికీ కారణం కమ్యూనిస్టులేనని పోలీసులు అనుకున్నారు కమ్యూనిస్టులు రాకముందు కూడా పోలీసుల జీవితం దుర్భర గానే వుండింది అట్లా ఉండటానికి కారణం ప్రభుత్వ వైఖరి సమాజంలో పోలీసులు నిర్వహిస్తున్న పాత్రపైన ఆధారపడి ఉంటాయిగానీ కమ్యూనిస్టుల పైన కాదు ప్రకాశంకైనా కమ్యూనిస్టుల పట్ల తెలియని వ్యతిరేకత వున్నా ' ఎవడు కష్టపడి పండించుకున్నది వాడే తినాలని వాళ్ళు చెప్పింది" బాగా నచ్చింది ఫాసిస్టు ప్రభుత్వానిక నువ్వు ఈ సమస్యల్ని పరిష్కరించలేవు అని ఎత్తి చూపితే కోపమొస్తుంది కమ్యూనిస్టుల మీద అదే కోపమొచ్చి "ఏరివేత ' కార్యక్రమం మొదలుపెట్టింది దీని పేరుమీద పల్లెల్లో ఆనాడు జరిగిన అణచివేత యిప్పటి తెలంగాణా అణచివేతను గుర్తు చేస్తుంది "ఎన్‌కౌంటర్" అసలు అర్థం ఆనాటి సంఘటనలూ చెప్పాయి

ఖర్చు పెట్టే డబ్బుకు అకౌంట్‌బిలిటీ లేకుండా ఉపయోగించే అధికారానికి జవాబుదారీ కాకుండా విచ్చలవిడిగా ప్రవర్తిస్తున్న యిప్పటి ఆంటీ నక్సలైట్ స్క్వాడ్స్ గ్రేహౌండ్స్ లాంటి వాటి బీజరూపాల్ని తెలంగాణా పోరాట కాలంనాటి టాస్క్ ఫోర్సు I D , స్పెషల్ పార్టీల్లో చూపాడు "తినడం, కొట్టడమే వాళ్ళ పని, డబ్బుల కోసం పీడించడం, యివ్వకపోతే కమ్యూనిస్టని కేసు బనాయించడం స్త్రీలపైన సామూహిక అత్యాచారాలు" -- చట్టాన్ని అతిక్రమించే ఈ విచ్చలవిడితనాన్ని ప్రభుత్వమే నేర్పింది వాళ్ళకు

పాలకవర్గాలు పేదలను దోచుకొని తమ స్వంత ఆస్తిని పెంచుకుంటాయి సంపదను కూడగట్టడం కోసం నేరాలు చేస్తాయి ఈ దోపిడీ వల్ల ఉత్పత్తి ఫలాలు అందరికీ సమానంగా దక్కవు ఫలితంగా అవినీతి, దరలు, దరిద్రమూ, అనారోగ్యం ఆకలిచావులు, నిరుద్యోగం ఆత్మహత్యలు నిరంతరం పెరుగుతూనే వుంటాయి అంటే పాలకవర్గాల దోపిడీ నేరం అయితే ఇది నేరమని వాళ్ళు అంగీకరించరు ఈ దోపిడీకి సమ్మతిని కూడగట్టడానికి (నేర) హంతక ప్రవృత్తిని భావజాలంగా ప్రచారం చేస్తుంది అందుకనే పాలకవర్గాల నేర ప్రవృత్తికి కొలత (measure) పోలీసు అత్యాచారాలు చాలామంది వాళ్ళ దుర్భర పరిస్థితుల వల్లే పోలీసులు అట్లా తయారయ్యారని వాదిస్తారు కానీ అది తప్పు పాలకవర్గం తమ హింసా ప్రవృత్తిని లెజిటిమేట్ చేసుకోడానికి, ఈ ప్రవృత్తిని భావజాలంగా పోలీసుల్లో ప్రచారం చేసి, ప్రోత్సహించి రాజ్యహింసకు ఒక సమ్మతిని కూడగడ్తుంది తెలంగాణా పోరాటంలోనైనా, యిప్పుడైనా జరుగుతున్నదదే ఈ భావజాలంతో కొంతమంది పోలీసులు identify అయ్యారు ఈ సమ్మతికి లొంగినవాళ్ళు ప్రమోషన్ల కోసం, రివార్డుల కోసం కూడా ఎన్‌కౌంటర్లు చేస్తున్నారు యిటువంటి వాళ్ళు స్పష్టంగా పాలక వర్గాల పక్షంలో చేరినట్టే లెఖ్ఖ **మామూలు పోలీసుల పైన వుద్యమకారుల కెప్పుడూ కోపం లేదు కానీ యిట్లా శత్రుపక్షం తీసుకున్న వాళ్ళపట్ల మాత్రం నిర్దాక్షిణ్యంగా వుండక తప్పదు** లేకుంటే వాళ్ళు తమ ప్రాణాలు కోల్పోడానికి సిద్ధపడాల్సి వుంటుంది

యిటువంటి పోలీసు వ్యవస్థలో యిమడలేనందుకే ప్రకాశం "అసమర్థుడిగా" గుర్తింపబడి ఎమర్జెన్సీలో కంపల్సరీ రిటైర్‌మెంట్‌కు గురి అయ్యాడు చచ్చినా తన కొడుకును ఈ పోలీసు ఉద్యోగంలోకి రానివ్వకూడదనుకున్నా, పరిస్థితులు కొడుకును పోలీసునే చేస్తాయి కొడుకు ట్రైనింగుకు బయలుదేరడంతో కథ ముగిసింది

  

నవల అంతటా కనిపించిన పోలీసు దుర్భల జీవితానికి కారణం సామాజిక వ్యవస్థ ఒక పోలీసు వ్యవస్థనేకాదు కార్యనిర్వాహక వర్గమూ, శాసనవర్గమూ కూడా అంతే భ్రష్టు పట్టాయి వీటిని సంస్కరించి మన జీవితాలను బాగుపరచుకోగలం ప్రజాస్వామ్యాన్ని నిలప గలం అనుకోవడం భ్రమ వీటిని బలవంతంగా కూలద్రోయక తప్పదు కమ్యూనిస్టులు దాన్నే విప్లవమంటారు

  

సామాజిక పరిస్థితులు భరించలేనివిగా అయ్యేకొద్దీ ప్రజల్లో అసంతృప్తి పెరుగుతుంది కాబట్టి ప్రజలకు పాలక వర్గాలతో ఘర్షణా పెరుగుతున్నది అప్పడు తప్పనిసరిగా మనుషుల్లో యింకొందరిని అణచివేసే సాధనాలుగా (సైన్యంగా, పోలీసుగా) వాడుకోవాల్సిన అవసరం పాలక వర్గాలకు ఏర్పడుతుంది అందుకనే మనదేశంలో ఏ ఉద్యోగాలకూ రిక్రూట్‌మెంట్ లేకపోయినా ప్రతియేటా పోలీసుకూ, సైన్యానికీ వుంటుంది

  

"ఆధునిక రాజ్యంలో ప్రభుత్వం అనేది మొత్తం బూర్జువా వర్గపు సమిష్టి వ్యవహారాలు చక్కబెట్టే కమిటీ మాత్రమే" - అని కమ్యూనిస్టు మానిఫెస్టో చెప్పింది

అంతకు మించి స్వతంత్రత లేదు దానికి, అటువంటి ప్రభుత్వ యంత్రాంగంలో భాగమైన పోలీసులు ఈ పాలకవర్గాలమీద ఎంతకాలం ఆధారపడ్డా, తమ జీవితాలు బాగుపడవని యిన్నేళ్ల అనుభవం ద్వారా తెలుసుకున్నారు

**ఒకవైపు పీడితులూ, యింకో వైపు దోపిడీదార్లు ఎదురెదురుగా రెండు విభిన్న ప్రపంచాలుగా మోహరించి వున్న ఈ చారిత్రక యుద్ధ సన్నివేశంలో ఏ పక్షం వహించాల్నో యింక తేల్చుకోవాల్సింది పోలీసులే** 1980 నుంచీ ప్రభుత్వం తెలివిగా పోరాట ప్రాంతాల్లో గిరిజనులనూ, మాలా, మాదిగ, వెనుకబడిన కులాల వాళ్లనే పోలీసులుగా రిక్రూట్ చేస్తున్నది ఫీల్డులో తుపాకులు గురిపెట్టి బూటకపు ఎన్‌కౌంటర్లు చేస్తున్నదీ వాళ్లే , చంపబడుతున్నవాళ్ళూ వాళ్లే తన వేలితో తన కన్నే పొడవడమంటే యిదే యింతవరకు పాలకవర్గాలు చంపిన దొడ్డి కొమురయ్య అయినా, కొరన్న మంగన్నలైనా, మామిడాల హరిభూషనైనా, చిత్తూరు మార్కండేయులైనా దళితులేనన్న విషయం గుర్తుంచుకుంటే వహించాల్సింది యే పక్షమో అర్థమౌతుంది ఆ దిశగా మొదలైన ప్రయాణానికి సూచిక నక్సల్బరీతరం విద్యార్థి సంఘంలో కార్యకర్త అయిన ప్రకాశం కొడుకు సూర్యం

**యిటువంటి వాస్తవ నవల రాసినందుకు ఈ రచయితను ప్రభుత్వం ఉద్యోగం లోంచి తొలగింపవచ్చు** ఈ నవల రాయటమంటేనే ఆ పోరాటానికి అతను సిద్ధమైనాడని అర్థం

"మాలోనివాడివే మావాడివే నీవు" -- చెరబండరాజు

  

యిది ఆయన తొలి నవల కాబట్టి లోపాల్ను మనం అర్థం చేసుకోవచ్చు సూచనగా కొన్ని

1) ఎడిటింగ్ బాగా జరగలేదు కొన్ని సంఘటనలను తొలగించి వున్నా నవలకు నష్టం కాదు రోజువారీ జీవితాన్ని నవలలో సుదీర్ఘంగా (800 పేజీలు) చిత్రించదలుచుకున్నప్పడు విషయం సాంద్రంగా వుండాలి రీడబిలిటీని కాపాడుకోవాలి నవల తొలి సగంలో ఉన్న బిగువు చివరికొచ్చేసరికి తగ్గింది

2) నవలలో మూడొంతుల బాగం కథాకాలం 1940-1955 మధ్య, వాచ్యంగా రెండు మూడు చోట్ల స్వాతంత్ర్యోద్యమ తెల్లదొరల ప్రస్తావన వచ్చింది కాబట్టి ఆ కాలం కతగా అర్థమైంది కానీ, నిజంగా ఆ కాలంనాటి సామాజిక వాతావరణ చిత్రణ నవలలో బలంగా కన్పించకపోవటం వొక బలహీనత

3) కొన్ని పాత్రలు వాటి చైతన్యాన్ని మించిన బావాలను పలికాయి వాటికి ఆ కాలపు చైతన్యాన్ని మించిన ఆలోచనలూ ఉన్నాయి 40 ఏళ్ల కిందటి కథను యిప్పుడు రాస్తే ఈ స్పృహ కలిగి ఉండాలి

4) వస్తువు కొత్తదన్న ఉద్దేశ్యంతో రచయిత బ్రాకెట్లలో, విడిగా మరీ విస్తృతంగా వివరాలు యిస్తూ పోయాడు యిది పాఠకుల స్థాయిని తక్కువగా అంచనా వేయటమే Too much details అవసరం లేదు

**- శ్రీనివాసమూర్తి**



**'చూపు'**
**అధ్యయన వేదిక**
**జనవరి - ఫిబ్రవరి, 1997**
**"పుస్తక సమీక్ష"**

## ప్రజలకు శతృవులు, అధికార్లకు బానిసలుగా కానిస్టేబుళ్ళ "ఖాకీ బతుకులు"

**ఒక మనిషిని, తనకేమాత్రం ఆసక్తిలేని పనిలోకి పరిస్థితులు బలవంతంగా నెడితే, తన జీవలక్షణానికి పూర్తిగా వ్యతిరేకమైన పని బతుకుతెరువు కోసం చేసితీరాల్సొస్తే ఎంత హింస పడతాడో అక్షరీకరిస్తే "ఖాకీ బతుకులు" నవలయ్యింది** గురజాడనూ, శ్రీశ్రీనీ, చలాన్నీ, రంగనాయకమ్మనూ, మార్క్సునూ అభిమానించే ఓ భావుకుడూ, హేతువాదీ, తిరుగుబాటు దారుడూ అయిన మోహనరావు ఉద్యోగరీత్యా పోలీస్ కానిస్టేబుల్ మరీ ముఖ్యంగా దళితుడైన పోలీస్ కానిస్టేబుల్ అందుకే పై ఆఫీసర్లు తనమీద చెలాయించే అధికారాన్నీ, దళితుడిగా ఎదుర్కొన్న అవమానాలనూ కలిపి అమెరికాలోని నల్లవాళ్ల సాహిత్యంలో తన ప్రతిబింబాన్ని చూసుకున్నాడు "స్పార్టకస్"గా రచయితయ్యాడు

1975 ఎమర్జెన్సీలో ఉద్యోగం నుంచి కంపల్సరీ రిటైర్మెంట్‌తో తొలగించబడ్డ ప్రకాశం అనే కానిస్టేబుల్ తన గతాన్ని నెమరువేసుకోవటంగా సాగుతుంది "ఖాకీ బతుకులు" నవల ఎనిమిది వందల పేజీల ఈ నవల్లో పై ఆఫీసర్లతో చీవాట్లు తినటం, ఆర్డర్లీగా అడ్డమైన చాకిరి చెయ్యటం, రాజకీయనాయకుల పర్యటనల కోసం గంటల తరబడి ప్రాణమున్న బొమ్మల్లా నిలబడటం, రాత్రింబగళ్ల డ్యూటీలతో తిండికీ, నిద్రకూ మొహం వాచిపోవటం, ఏ మాత్రం

ఎదురు తిరిగినా ట్రాన్స్ఫర్ ఆగదు చేతికి రావటం - ఇవే సన్నివేశాలు తిరిగి తిరిగి ఎదురవుతుంటాయి దొంగలు బ్రోకర్లు వేశ్యలు నైటబీటు కానిస్టేబుళ్ళు రికార్డు కోసం పోలీస్ స్టేషన్లకొచ్చిపడే బిచ్చగాళ్ళూ పిచ్చివాళ్ళూ చెయ్యని తప్పులకు చిత్రహింస లనుభవించే అమాయకులూ పేజీ పేజీలో ప్రత్యక్షమవుతూ మనల్ని చికాకుపరుస్తుంటారు కుళ్ళిన శవాల వాసన నవల పొడవునా వెంటాడుతుంటుంది మొత్తం మీద వాతావరణ మంతా చీదరగా బీభత్సంగా అసహ్యంగా వుంటుంది పోలీసు కానిస్టేబుళ్ళు వాళ్ళ బతుకుల్ని వాళ్ళే బూతులు తిట్టుకుంటుంటే మర్యాదస్తులకు మహా ఇబ్బందిగా వుంటుంది మోహనరావు లక్ష్యం కూడా మనల్నిలా ఇబ్బంది పెట్టటమే **ప్రజల దృష్టిలో శత్రువులుగా అధికారులకు బానిసలుగా బతికే కానిస్టేబుళ్ళ బతుకులు ఏ మాత్రం ఆహ్లాదకరంగా వుండవనే విషయాన్నే ఆయన చెప్పదల్చుకున్నాడు**

నవల్లో ప్రధానపాత్ర ప్రకాశం నిరుపేద దళితుడు పాలేరుగా రెక్కలు ముక్కలు చేసుకున్నా కడుపు నిండక ప్రభుత్వోద్యోగానికి ఆశపడతాడు నిరక్షరాస్యుడైనా అతని శారీరక అర్హతలకు అప్పటి బ్రిటీష్ ప్రభుత్వం ఇచ్చిన ఉద్యోగం పోలీస్ కానిస్టేబుల్ ఆ ఉద్యోగంలోకి వచ్చేముందు మానసికంగా ఘర్షణ పడతాడు ప్రకాశం 'గింజలకు బదులు నెలనెలా డబ్బులిచ్చే కూలీ పని" ఆ ఉద్యోగం అతని దృష్టిలో ఈ ఆర్థికభద్రత కంటే ఆకర్షించే అంశం మరొకటుంది అందులో పెద్దపెద్ద తుపాకులతో లాఠీలతో గంభీరంగా కన్పిస్తూ, ప్రజల్ని బయపెట్టగలిగే పోలీసులంటే అతనికెంత భయమో అంత ఆకర్షణ కూడా ఈ సున్నితమైన అంశాన్ని చాలా నేర్పుగా చెప్పాడు రచయిత ఒకవైపు పోలీసులూ, ఇన్ఫార్మర్లగానూ, మరోవైపు రాజ్య వ్యతిరేక పోరాటాల్లోనూ కూడా అత్యధిక సంఖ్యలో పేదలూ, దళితులే వుంటున్నారన్న వాస్తవాన్ని చెప్పి, కారణాలు ఆలోచించాల్సిన బాధ్యతని మనకు గుర్తు చేస్తాడు ఆర్థిక పరిస్థితులూ, తక్కువ విద్యార్హతలే కాక మానసికమైన మరో అంశం కూడా ఇందులో వుందని పరోక్షంగా చెప్తాడు

రాజ్యాన్ని ఎదిరించడటమో అందులో భాగమై పోవటమో తప్ప మధ్యరకంగా బతికే అవకాశంలేని దళితుల జీవనస్థితిని అద్భుతంగా చిత్రించాడు స్పార్టకస్ అందుకే ప్రకాశం పోలీసయితే చాకలి రోశయ్యా, గ్రామవెట్టిగా పనిచేసే మరో దళితుడూ కమ్యూనిస్టులయ్యారు ఇది వాళ్ళ ఆర్థికసమస్యే కాదు అస్తిత్వసమస్య కూడా

పాలేరుగా వున్నప్పుడు ప్రకాశం "మాలోళ్ళ కుర్రోడు" మాత్రమే ఆ కారణాలతో ఎదురయ్యే అవమానాలు అతని మనసుకంతగా పట్టలేదు కానీ ఉద్యోగస్థుడయ్యాక తననెవరయినా తక్కువగా చూస్తే బాధతో, అవమానంతో విలవిల్లాడి పోతాడు కానిస్టేబుల్ కూడా అధికారులకి పాలేరుతో సమానమేనని అర్థమయినా ఆ ఉద్యోగాన్ని వదల్లేకపోతాడు ఇంట్లో ఆకలి, అధికారులతో అవమానాలు తప్పకపోయినా ఖాకీ డ్రస్సులో వున్నంతసేపూ తననిచూసి జనం భయపడతారు, గౌరవిస్తారు, కనీసం గౌరవించినట్లు నటిస్తారు ఆ గుర్తింపే అతన్నా ఉద్యోగంతో కలిపివుంచే బలమైన లింకు చదువు, ఉద్యోగం అతనికి "ఆత్మగౌరవం" అనే కొత్త అంశాన్ని పరిచయం చేశాయి

కె ఎన్ వై పతంజలి "ఖాకీవనం'లో మొదటిసారిగా కానిస్టేబుల్ జీవితానికి రేఖాచిత్రం గీస్తే స్పార్టకస్ దాన్ని సమగ్రమైన చిత్రంగా మలిచాడు పతంజలి ప్రాతిపదికగా తీసుకున్న ఆర్థిక కోణానికి అదనంగా స్పార్టకస్కున్న దళిత చైతన్యం ఆయనకాశక్తి నిచ్చింది **రచయిత**

**చెప్పినట్టు కానిస్టేబులంటే ఒక రాబోట్ పై నుంచి స్విచ్చి నొక్కితే హత్యలూ అత్యాచారాలూ, దౌర్జన్యాలూ అవలీలగా చేస్తాడు యూనిఫాం వదిలేసి బయటికి రాగానే ఆకలి అవమానాలు అభద్రత అతన్ని చుట్టుముడతాయి ఒక అమానవీయమైన వ్యవస్థ అతని వ్యక్తిత్వాన్ని నిలువునా రెండుగా చీల్చేసింది ప్రకాశం లాంటి అతి కొద్దిమంది చదువూ సాహిత్యాభిరుచి ఆసరాగా అప్పుడప్పుడైనా తమలోకి తాము చూసుకోగలుగుతారు మెజారిటీ పోలీసులకు అదీ లేదు**

కానిస్టేబుళ్ళ బతుకుల్ని స్పార్టకస్ యింత వివరంగా చిత్రించిన ఉద్దేశ్యం బేషరతుగా వాళ్ళని సమర్థించమని అడగటం కాదు కానిస్టేబుళ్ళు ఏ సెక్షన్లనుంచి, ఏ పరిస్థితుల్లో ఆ ఉద్యోగాల్లోకి వస్తున్నారో, ఏ విషవలయంలో పడిపోయి క్రమంగా మానవత్వాన్నెలా పోగొట్టుకుంటున్నారో సహేతుకంగా ఆలోచించమని కోరుతున్నాడు ఆఫీసర్లనూ కానిస్టేబుళ్ళనూ వేర్వేరుగా అర్థం చేసుకోవాల్సిన అవసరాన్ని చెప్తున్నాడు మెజారిటీ కానిస్టేబుళ్ళు ఆ ఉద్యోగాల్లో ఇరుక్కుపోయినవాళ్ళే తప్ప, ఎంజాయ్ చేస్తున్నవాళ్ళు కాదనీ, వాళ్ళ అసంతృప్తులనూ, నిస్సహాయతనూ అధిగమించటానికీ, తమ లక్ష్యాన్ని వెతుక్కోనటానికీ సహకరించమని ప్రజాస్వామ్యవాదుల్ని కోరుతున్నాడు రచయిత **' పొట్టకూటికి నీవు పోలీసువైనావు" అని అప్పుడెప్పుడో ఓ మాట అనేసి చేతులు దులుపు కోవటం తప్ప కానిస్టేబుళ్ళమీదా ఇన్ఫార్మర్లమీదా ఆ మాటకొస్తే మధ్యతరగతి మీదా కూడ ప్రజావుద్యమకారులనే వాళ్ళ కివ్వాల్టికీ ఓ అంచనా లేదు** ఆ ప్రశ్నను గుర్తు చేశాడు స్పార్టకస్ కానిస్టేబుల్‌గా వుంటూ ఈ రచన చెయ్యటం, పోలీస్ డిపార్ట్‌మెంట్ లుగ్గులలకు స్కానింగ్ రిపోర్టు తయారుచెయ్యబూనటం నిజంగా సాహసమే రచయితకు అభినందనలు

సుదీర్ఘమైన నవల పొడవునా రచయిత పడిన ఘర్షణని అవలీలగా కొన్ని గీతల్లోకి కుదించి అద్భుతమైన కవర్‌పేజీ చేశారు మోహన్

**- కాత్యాయని**



'విశాలాంధ్ర'
1997 జూన్ 5, గురువారం
"గ్రంథావలోకనం"

# ఖాకీ బతుకులు

పోలీసుల జీవితపు లోతుల్లోకి చొచ్చుకొనిపోయి ఖాకీల బతుకుల్లోని వాస్తవాలను నిజాయితీగా ఆవిష్కరించిన మంచి నవల ఇది

పోలీసులంటే ప్రజలకు అసహ్యం,
పోలీసులంటే ప్రజలకు ఒళ్ళుమంట
వాళ్లంటే కసి, కోపం,
వాళ్లంటే ఈనాడు శత్రువులు -

సమాజంలో రక్షక బటులుగా ప్రజలను కాపాడాల్సిన పోలీసులు బక్షక భటులుగా, ఈనాడు ఎందుకు పిలువబడుతున్నారు ?

దొంగలతో దోస్తీ, నేరగాళ్లతో నేస్తం, వ్యబిచారుల చినిగిన బతుకుల విస్తరిలో మెతుకులపై ఆశ, రాజకీయ నాయకుల కనుసన్నల్లో లారీల పహారా, నిరుపేదల ఎండిన డొక్కలపై బూటుకాలి పెరేడ్, అదికారుల క్రమశిక్షణ సూత్రాల గొలుసుతో, కట్టివేయబడ్డ కావలి కుక్కల బతుకులు, న్యాయాన్ని గొంతు నులిమేందుకు కరకు నోట్ల మిరుమిట్లకు బానిస, లాకప్ హత్యలు, బూటకపు ఎదురు కాల్పులు ఇలా ఎన్నెన్నో పోలీసుల జీవితాల్లో నిత్య కృత్యాలెందుకయ్యాయి అందుకు కారణమేమిటి ?

పోలీసు జీవితంతో ముడిపడి ఉన్న అనేకానేక వాస్తవాలను ఈ నవలలో చూపించాడు **ఏ మనిషి స్వతహాగా చెడ్డవాడు కాదు చెడ్డవాడుగా తయారు చేయబడతాడు ఇది వాస్తవం**

**అలాగే పోలీసులు కూడా చెడ్డవారుగా తయారుచేయబడుతున్నారు** భక్షక భటులుగా తయారు చేయబడుతున్నారు అని, ఆ మూలాన్ని ఈ నవల్లో వివరంగా చెప్పారు **వారు చెడి పోవడానికి తప్పవారిది కాదు రాజ్యానిది రాజ్యయంత్రాంగానిది మొత్తానికి ఈ వ్యవస్థది కాబట్టి ఈ మూలాన్ని ఎత్తి చూపుతూ, పోలీసు జీవితాలపై సానుబూతితో, రాసిన నవల ఇది** ఓ ప్రజాకవి కూడా సానుబూతితో ఈ విధంగా అంటాడు

"నాసా కింద, మీసాకింద
నిన్ను జైల్లో పెట్టినారు,
నన్ను జైల్లో పెట్టినారు,
నీకు నాకు తేడా లేదన్నో ఓ పోలీసన్నా"

రాజ్యం, దాని యంత్రాంగం దాని దుర్మార్గాన్ని కాపాడలేనప్పుడు ఎవరి బతుకులైనా ఒకే విధంగా నిర్బంధాలకు గురౌతాయనే వాస్తవాన్ని చెప్పి పోలీసును నువ్వు ప్రజలతో మమేకం కావాలనే సానుభూతి ఇందులో కనబడుతుంది

రెండు సానుభూతుల్లో తేడా ఉంది ఇదెందుకు చెప్పాల్సిన అవసరమొచ్చిందంటే మోహనరావుగారు ఈ నవల్లో పోలీసు జీవితాన్ని ఎంతో చక్కగా చిత్రీకరించారు కాని దాని మూలాన్ని ఎంతో ఉన్నతంగా చిత్రీకరించారు కాని దాన్ని అంతటితో వదలివేశారు కాని

పోలీసు కానిస్టేబుల్ కూడా సమాజంలోని ఒక మనిషిగా నిలవాలంటే, ప్రజల్లో ఒక మనిషిగా తన్నుతాను నిలబెట్టుకోవాలంటే అనే దిశగా రచన కొనసాగిస్తే చాలా గొప్ప నవల కాగలిగేది

ఇందులో కథ, కథనం పాఠకులను ఆకట్టుకొంటాయి దళిత వాసన అన్ని రంగాల్లో ఉన్నట్లే ఇందులో కూడా ఉండడం పెద్ద ఆశ్చర్యం ఏం కాదు

ఇక కథాంశానికి వస్తే -

1940 ప్రాంతంలో బ్రిటిష్ కాలంలో ఉద్యోగంలో చేరిన ఒక దళిత యువకుడు ప్రకాశం ఆయన భూస్వాములకు పాలేరుగా గడిపిన జీవితం ఆ తర్వాత కానిస్టేబుల్‌గా రిక్రూట్ అయ్యి పోలీసుగా తాను అనుభవించిన బాధలు కష్టాలు అడుగడుగున అధికారుల ఆగడాలు, వేధింపులు కుటుంబ సమస్యలు, అంటరానితనం సమస్య ఆర్థిక సమస్యలు - ఇవన్నీ ప్రకాశం జీవితంలో అనుభవిస్తాడు ఉద్యోగంలో పద్ధతి కోసం ఎదిరించినందుకు సివిల్ పోలీసు నుండి, రిజర్వుడ్, అక్కడి నుండి సివిల్, దాన్నుండి ట్రాఫిక్ మళ్ళీ అక్కడి నుండి రైల్వే పోలీసుకు ట్రాన్స్‌ఫర్ చేయడం జరుగుతుంది ప్రకాశంను కేంద్ర బిందువుగా చేసుకొని ప్రతి విభాగంలోని పోలీసులు అనుభవించే జీవితాన్ని ఇందులో చూస్తాం

అంతే కాకుండా ప్రతి పోలీసు స్టేషన్‌లో అక్కడి వాతావరణం, నేరాలను ఒప్పుకోవడానికి అమాయకులను పెట్టే వేధింపులు, ఐ డి పార్టీ వారు సాగించే అఘాయిత్యాలను, అక్కడి రాక్షసకృత్యాలను ఈ నవల్లో చక్కగా విశ్లేషించారు

పోలీసులు లంచాలకు ఎందుకు అలవాటుపడుతున్నారు, అందుకు కారణం వారి చాలీచాలని జీవితాలు, పై అధికారులకు సమర్పించుకునే మామూళ్లు సమర్పించుకోవడమేనని ఇందులో చూపించారు వ్యభిచారుల దగ్గర డబ్బులు గుంజడంతోపాటు కొందరు పోలీసులు కూడా వ్యభిచారులుగా మారడం ఇందులో చూస్తాం ఐ డి పార్టీ వాళ్ళే దొంగలతో నేరాలు చేయిస్తూ నేరాలు పెరగడానికి కారణమౌతున్నారని చూపించారు హెడ్‌కానిస్టేబుల్ నుండి మొదలుకొని, ఎస్ ఐ , సి ఐ డి ఎస్ పి , ఎస్ పి ల వరకు పోలీసులను ఎంత హీనంగా చూస్తారో ఉన్నతంగా చూపించారు

మొత్తానికి ట్రైనింగ్ నుండి ప్రారంభిస్తే రిటైర్ అయ్యేవరకు పోలీసు జీవితాన్ని ఇందులో ఎక్స్‌రే తీసి చూపించారు **ఈ నవల చదివితే పోలీసు ఉద్యోగంపై సానుభూతి కలుగుతుంది**

1940లో ఇంగ్లీషు వారి హయాంలో ఉన్న పోలీసు జీవితపు దైన్యస్థితి, స్వాతంత్ర్యం వచ్చి, ప్రకాశం అనే (కథానాయకుడు) కానిస్టేబుల్ 1975 ఎమర్జెన్సీలో దిగిపోయే నాటికి ఎలాంటి మార్పు రాలేదని ఇందులో చూపించారు రచయిత

బ్రిటీష్ కాలంలో కమ్యూనిస్టులను ఎలా పోలీసులు అణచివేశారో, ఎలా కాల్చివేశారో కూడా ఈ నవల్లో రచయిత చూపించారు ఇంతవరకు పోలీసుల జీవితాలపై వివరంగా సాహిత్యం రాలేదు ఆ లోటును ఈ నవల తీరుస్తుంది **పోలీసుల జీవితపు వాస్తవాలు తెల్సుకోవాలంటే ప్రతి ఒక్కరు తప్పకుండా ఈ నవల చదవాల్సిన అవసరముంది**

**- వేల్పుల నారాయణ**



**'ఈనాడు'**
**The Largest Circulated Daily in Andhra Pradesh**
**బుధవారం మే 7, 1997**
**"క బు ర్లు"**

# మనకు తెలియని బతుకులు

**"నరుడా, జీవించు ! జీవించు ! జీవించటమే జీవితానికి సమాధానం !" అంటాడు, 'స్పార్టకస్' అనే రోమన్ బానిస తోటి బానిసతో !**

ఆ స్పార్టకస్ నాయకత్వంలో 'అప్రతిహతం' అని ప్రపంచమంతా అనుకునే రోమన్ సామ్రాజ్య పాలకులపై ప్రపంచ చరిత్రలో తొలిసారిగా తిరుగుబాటు చేసేరు రోమన్ల క్రింద పోగయిన వివిద జాతుల బానిసలు వాళ్లు బానిసలు కారు ! బానిసలుగా ఎవరూ పుట్టరు బానిసలుగా మార్చబడతారు, అంతే ! ఎక్కడయినా జరిగేదింతే!

మన దేశంలో "బానిసలు" అని పిలువబడే జాతి ప్రత్యేకించి లేకపోవచ్చు కాని, యదార్ధంలో నాడూ, నేడూ కూడా బానిసలున్నారు, బానిసల్లా చూడబడే వాళ్లున్నారు బానిసల కన్నా అన్యాయంగా బ్రతికే వాళ్లున్నారు

ఆ నానా జాతులకు, కులాలకు చెందిన వాళ్లనే ఒకప్పుడు గాంధీగారు 'హరిజను' లన్నారు ఇప్పుడు దళితులంటున్నారు

ఆ దళితులకు ఆదర్శం ఒకప్పుడు గాందీజీ ! ఆ తర్వాత అంబేద్కర్ !! అంతేగాని 'స్పార్టకస్' మాత్రం కాదు!

గాందీగారు ఈ 'హరిజన్' ముద్రతో దళితులను ఉన్నతులను చేయాలనుకున్న అరవయ్యేళ్ల తర్వాత కూడా దళితులనే వాళ్లింకా అలాగే ఉన్నారు అందుకు కారణం ఇదే !

మన మధ్య నలుగురో, నాలుగు వేలమందో నలభై లక్షల మందో "దళితులు" మనలాగానీ, మనకన్నా ఉన్నతంగా గానీ బ్రతుకుతూ ఉండవచ్చు సమాజంలో 'డబ్బు' తెచ్చిపెట్టిన ఉన్నత స్థానం వాళ్లకుండవచ్చు కానీ

దళితుల్లో వీళ్ల శాతం ఎంత ! అదలా ఉంచి మొత్తంగా చూస్తే, మనలో మాత్రం 'రేపు' గురించి బెదురు లేకుండా నిశ్చింతగా బ్రతకగలుగుతున్న వాళ్లెంత శాతం ? దళితుల కేమాత్రం తీసిపోనంత అన్యాయంగా, అధ్వాన్నంగా బ్రతుకీడుస్తున్న వాళ్లెంత శాతం ?

మరి, వీళ్లంతా, ఈ దళితులంతా ఇలా ఎందుకుండిపోయారంటే

వాళ్లకు, గాంధీజీ గురించి చెప్పారుగానీ, మార్క్స్ గురించి చెప్పలేదు

అంబేద్కర్ గురించి చెప్పారుగానీ, లెనిన్ గురించి చెప్పలేదు

కాన్షీరామ్ గురించి చెప్పారుగానీ, స్టాలిన్ గురించి చెప్పలేదు మావో గురించీ చెప్పలేదు

కనీసం 'స్పార్టకస్' గురించైనా వారికెవరూ చెప్పలేదు అలాంటి స్థితిలో, పరిస్థితుల్లో

"నా పేరు స్పార్టకస్ " అన్నాడో దళితుడు **నవ్వొస్తుంది మన తెలుగు వాడొకడు 'స్పార్టకస్' నని చెప్పకుంటే!**

కానీ, నేను స్పార్టకస్ ననలేదతను స్పార్టకస్ నా ఆదర్శం అన్నాడతను స్పార్టకస్ మనందరికి ఆదర్శం కావాలన్నాడతను 'స్పార్టకస్' అనే కలంపేరు పెట్టుకున్నాడతను

"పోరాటం మన ఊపిరి" అన్నాడు "బానిస" స్పార్టకస్ !

"ఈ ప్రపంచంలో మనకన్నా ఘనంగా పోరాడగల వారింకెవరూ లేరు" అన్నాడతను !

"పోరాట్టం కోసమే మనల్ని బానిసల్ని చేసేరు బ్రతకనిచ్చారు '

**"మనల్ని మనం హింసించుకోవటం కోసం చంపుకోవటం కోసమే మనకు ఆయుదాలిచ్చేరని మీరు గుర్తించండి" అన్నాడు స్పార్టకస్ ।**

**"అవును । మీరేమిటో, మీరిలా ఎందుకు ఎవరికీ పనికిరాని వాళ్లుగా కొందరికే ఉపయోగపడే వాళ్లుగా మారిపోయారో, ఉండిపోయారో అభివృద్ధి చెందారో, చెందుతున్నారో ఆలోచించండి " అన్నాడు మన తెలుగు స్పార్టకస్ । 'మమ్మల్నర్థం చేసుకోండి" అని మనల్నడుగుతున్నాడీ స్పార్టకస్ ।**

ఇతనూ పోరాట్టం ఎలాగో నేర్చినవాడే । నేర్పబడిన వాడే । కానిస్టేబులగా ట్రెయినింగయి, హెడ్‌కానిస్టేబుల్‌గా ఉన్నవాడే ।

అయితే వాళ్ల వాళ్లందర్లా కాకుండా మరోలా ఆలోచించేడతను ఉద్యోగ జీవితం అందించిన ఆయుదం అలా ఉంచి, మరో ఆయుదాన్నందుకున్నాడతను

"కత్తికన్నా కలం బలం గొప్పది" అనే ఓ సూక్తిని దాని అసలు బలం ఏమిటో తెలీకుండానే వల్లిస్తుంటారనేక మంది

నిజమే ।

కానీ, ఆ కత్తి ఎలాంటి వారి చేతిలో ఉంది ? దాన్నెవరి మీదకు, ఎందుకు విసరబోతున్నారు ? అనే దాన్ని బట్టి ఉంటుంది దాని విలువ ।

హిట్లర్ దాన్ని ఒకందుకు వాడేడు

స్టాలిన్ మరొకందుకు వాడేడు

కలం సంగతి కూడా అంతే ।

జేమ్స్‌బాండ్‌ను సృష్టించిన ఇవాన్ ఫ్లెమింగ్ ఆ కలాన్నొకందుకు వాడేడు స్పార్టకస్ చరిత్రను రోమన్ శిథిలాల నుండి వెలికి తీసి ప్రపంచం ముందుంచిన హోవార్ట్ ఫాస్ట్ అదే కలాన్ని మరొకందుకు వాడేడు

**హెడ్ కానిస్టేబుల్ చేతిలోని లాఠీకన్నా, తుపాకికన్నా ఆ వేషంలో ఉన్న జి మోహనరావు చేతిలోని కలం మరింత శక్తివంతమైనది అనుకున్నాడు మన తెలుగు స్పార్టకస్ ।**

ఈ కానిస్టేబుల్ తండ్రి మరో కానిస్టేబుల్ । బ్రిటిష్ వాళ్ల కాలంలో ట్రెయినింగయి, ఎమర్జన్సీ బారతదేశం దాకా నౌఖరీ చేసిన వాడతను

అదిగో ఆ బ్రిటిష్ వాళ్లతో మొదలై కొనసాగిన ఓ 'దళిత' కానిస్టేబుల్ జీవిత క్రమాన్ని పాఠకుల ముందుంచేడీ 'స్పార్టకస్'

ఆ తండ్రి ఒడిలో పెరిగిన వాడు ఆ తండ్రి నీడలో ఎదిగిన వాడు ఆ తండ్రి బ్రతుకును ప్రత్యక్షంగా, పరోక్షంగా అనుబవించిన వాడు చూడని వాటిని, చూడలేని వాటిని, ఆయన చెప్పగా విన్నవాడు

అన్నీ కలగలిపి "ఇదీ జీవితం । ఇదీ మా వాళ్ల జీవితం " అని చెప్పబూనుకున్నవాడు

ఆపని అతను విజయవంతంగా నెరవేర్చేడు ఎనిమిదొందల పేజీల నవలగా తీర్చిదిద్దేడు

**ఆ నవల చదివిన వాళ్లకు మనముందున్న వ్యవస్థలోని ఒక వర్గం సమగ్ర చిత్రం కళ్లక్కట్టినట్లు కనిపిస్తుంది మనం నిత్యం చూస్తూ అసహ్యించుకునే, ద్వేషించే ఆ మనుషుల నిజస్వరూపాన్నీ నవల మనముందుంచుతుంది**

"ఆ నిజ స్వరూపాన్నిలా ఎందుకు బట్టబయలు చేసేవు ? నీ బాబుగాడి కథే కాదు, రెండో భాగంగా నీ కథ కూడా రాస్తానంటున్నావు । ఎవడబ్బ అనుమతితో అలా చేసేవు ఇలా చేస్తానంటున్నావు ? నీకు ఉద్యోగం చేయాలని లేదా ?"

అని ఓ శ్రీముఖం అందజేశారతనికి ఆయన బాస్‌లు।

నిజమే ! వృత్తిరీత్యా తెలిసే సంస్థాగత రహస్యాల్ని బయట పెట్టగూడదు నిజమే !

కానీ

వృత్తిలోని హైన్యాన్నీ నైచ్యాన్నీ వృత్తి గత వ్యక్తి జీవితంలోని దుర్భరతనూ అణచివేతనూ బయట పెట్టగూడదని ఎవరైనా ఎలా అనగలరు ? అడగ్గలరు ?

ప్రెస్‌బిల్‌కు సవరణలూ, సరికొత్త సూత్రీకరణలూ చేయబోయే పాలకులున్న కాలంలో ఇదేమంత విశేషం ? అనీ సమర్ధించవచ్చు

మరయితే

రిటైరైన మరుక్షణం గుట్టుమట్లూ, తెరవెనుక సంగతులూ పుస్తకాలుగా రాసేసి సంచలనాలు తెచ్చిన ఆర్మీ జనరల్సూ, రాష్ట్రపతులూ, ఉపరాష్ట్రపతుల సంగతేమిటి ?

బ్రహ్మాస్త్రాలు పిచ్చుకల మీదనేనా ?

ఈనాటి "పిచ్చుక"లు ఆనాటి పిచ్చుకలు కావని రుజూ అవ్వాలా ?

సరే, చూద్దాం గాక !

**- చలసాని ప్రసాదరావు**



**'ఇండియా టుడే'**
**ఫిబ్రవరి 21 - మార్చి 5**
**"పు స్త క ప్ర పం చం"**

## కదలించే కథనం

## ఖాకీదుస్తుల అంతరంగం, సాధక బాధకాలే నవలకు ఇతివృత్తం

హత్యలు, దోపిడీలు, బలాత్కారాలు, బలవంతపు వసూళ్ళు, కిడ్నాప్‌లు, చిత్రహింసలు - ఈ లక్షణాలన్నీ కరడు కట్టిన నేరస్థుడిలోనే కాదు, పోలీసుల్లోనూ ఉన్నాయన్నది అత్యధిక సంఖ్యాకుల అభిప్రాయం **జనం దృష్టిలో నేరస్థుడికీ, పోలీసుకూ ఉన్న తేడా అల్లా ఖాకీదుస్తులే**

'స్పార్టకస్' అనే కలం పేరుతో జి మోహనరావు రాసిన ఖాకీబతుకులు నవల ఇతివృత్తం ఇది దేశానికి స్వాతంత్ర్యం రావడానికి ముందే కాకుండా, వచ్చిన తరువాత కూడా అత్యంత వివాదాస్పదంగా, మానవత్వానికి, విలువలకు అతీతమైన వ్యవస్థగా పేరు తెచ్చుకున్న పోలీసు వ్యవస్థ లోగుట్టును కళ్ళకు కట్టినట్లుగా, అనుభవపూర్వకంగా విడమరచి చెప్పిన నవల ఇది

ఇందులో ప్రకాశం పాత్ర మొత్తం నవలకు కేంద్ర బిందువు వ్యవసాయ కూలీగా భూస్వాముల ఇనుప గుండెల గునపపు పోట్ల కింద నలిగిన ప్రకాశం అనుకోని పరిస్థితుల్లో పోలీసు ఉద్యోగానికి ఎంపిక అవుతాడు ఆ వ్యవస్థలో మొదటగా అతని జీవితం ఆర్డర్లీగా ప్రారంభమవుతుంది వ్యవసాయ కూలీగా తాను సేవ చేస్తున్న యజమానికి, ఇప్పుడు పోలీసుగా తాను సేవ చేసిన పోలీసు అధికారికి మధ్య పెద్ద తేడా ఏమీ లేదని గ్రహించు కునేందుకు ప్రకాశానికి ఎంతోకాలం పట్టలేదు

సామాన్యుల మీద పోలీసులు, పోలీసుల మీద ఉన్నతాధికారులు, ఉన్నతాధికారుల మీద రాజకీయ నాయకులు, రాజకీయ నాయకుల మీద పారిశ్రామికవేత్తలు స్వారీ చేయడమంటే

ఏమిటో ప్రకాశానికి తెలిసివస్తుంది తనచుట్టూ ఎంత అరాచకం అలముకుని ఉన్నా చిరు దీపం లాంటి మానవత్వాన్ని తనలో కొడిగట్టకుండా కాపాడుకుంటూ ఉంటాడు ప్రకాశం ఇక అక్కడి నుంచి జీవితమంతా పోరాటమే

చివరికి అతని నిజాయితీకి మానవతకు ప్రతిఫలంగా పోలీసు శాఖ నుంచి అతనికి అందింది బలవంతపు పదవీవిరమణ ఇక తప్పనిసరి పరిస్థితుల్లో తన కుమారుని కూడా అదే శాఖలో చేర్చడంతో తన ఆశాదీపాన్ని కొనసాగేటట్లు చేస్తాడు

**చదివే ప్రతివారినీ ఆలోచింపజేస్తుందీ నవల ఈ పోలీసు వ్యవస్థ అసలు సిసలు రక్షకభట వ్యవస్థగా ఎప్పుడు మారుతుందోనని ప్రతిఒక్కరూ ఆలోచించడం ఖాయం** ఈ పోలీసు వ్యవస్థ ఇలా అశాంతి అవ్యవస్థల కేంద్రంగా మారడానికి దారితీస్తున్న రాజకీయ సామాజిక, ఆర్థిక పరిస్థితులను ఇందులోని పాత్రల ద్వారానే చెప్పించారు ప్రకాశం

కథాకథనాలలో 'స్పార్టకస్' ఈ పోలీసు వ్యవస్థ పట్ల, పోలీసుల విధుల పట్ల సమతూకంతోనూ నిష్పాక్షికంగానూ వ్యవహరించినట్లు కనిపించినప్పటికీ, 'పరిచయవాక్యం' లో మాత్రం పూర్తి పక్షపాతంతోనే వ్యాఖ్యానాలు చేశారనిపిస్తుంది "సమకాలీన సమాజంలో పోలీసు కానిస్టేబుల్ చుట్టూ అల్లుకుపోయిన కుల, మత, ఆర్థిక, రాజకీయ సమస్యలతోపాటు, అధికారుల ఆగడాలనూ, ఉద్యోగ సమస్యలనూ, తన కళ్ళ ముందు జరిగే అన్యాయాన్ని ఏ మాత్రం ఎదిరించలేని కానిస్టేబుల్ అశక్తతనూ ఈ నవలలో చెప్పడానికి ప్రయత్నించాను" అన్నారు రచయిత కానీ, 'ఒత్తిడి వల్లనో, విధి నిర్వహణలో బాగంగానో సామాన్య ప్రజానీకాన్ని వేధించడం సంగతి అటుంచి, తనకు తానుగా పుణికి పుచ్చుకున్న కాఠిన్యం, దమననీతి కూడా విస్మరించలేనిది ఈ వ్యవస్థ తనలోని అమానుషత్వాన్ని ఒక ప్రత్యేక నాయకత్వ లక్షణంగా బావిస్తూ, సామాన్య ప్రజానీకానికంటే భిన్నమైన వ్యవస్థగా కొనసాగుతోంది కనీస మానవ హక్కులను, ప్రజాస్వామ్య విలువలను ఏ మాత్రం గౌరవించరాదని గుర్తింపు తెచ్చుకుంది ఇందుకు ఎవరు బాధ్యులనేది ఆత్మవిమర్శ ద్వారా పొందవలసిన సమాధానం పోలీసు శాఖ ప్రజలకు ఏమాత్రం సన్నిహితం కాలేకపోతోంది బహుశా, పెరుగుతున్న జనాభా, పెట్రేగుతున్న నేరప్రవృత్తి పోలీసుల మీద ఒత్తిడి పెంచుతూండవచ్చు

"యజమానుల, అదికారుల ఆగడాలనూ, దోపిడీని మంచి మాటలతో మార్చలేమనీ, ప్రకృతి ప్రసాదించిన అన్నిరకాల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను హక్కులను పోరాడి సాదించకోవాలి తప్ప, ఇంకోమార్గం లేదన్న నగ్నసత్యాన్ని క్రీస్తుకు పూర్వమే ప్రాక్టికల్‌గా రుజువుచేసి చూపించాడు రోమన్ బానిసల నాయకుడు స్పార్టకస్" ఆ స్పార్టకస్‌ను స్ఫూర్తిగా చేసుకుని, ఆ పేరే తన కలంపేరుగా పెట్టుకుని హృద్యంగా ఈ నవలను రాశారు రచయిత

కొన్ని పాత్రల ద్వారా ఈ వ్యవస్థకు సంబంధించి చెప్పిన మాటలు ఆ పాత్రల స్థాయికి తగ్గట్లు లేవు ఆ ఒక్క లోపం తప్ప, మిగిలిన నవల యావత్తూ ఆద్యంతం ఆసక్తిగా, ఉత్కంఠగా చదివిస్తుంది

**- జి. రాజశుక**



**'యువత'**
**ఉత్తరాంధ్ర యువతరం వేదిక**
**మార్చి 1997**
**కవుల "కాలం"**

# "దాని కంట్లో నలక"
(కవిత)

'రాజ్యం' కుచ్చుటోపీ
నగిషీలు మీరు
ఇనుప బూట్ల
'నాడా'లు మీరు
నిరుద్యోగం లోంచి
మొలకెత్తినోళ్లారా!
మీ 'చూపు'ల్నీ
కొనితెచ్చుకున్న 'రూపు'ల్నీ,
కర్మశత్వపు
'ఖాకీ' నైజంగా
మార్చిందెవరు ?
'బానిస యుగం' లో
యజమాని 'బంట్లు'గా
'రాచరికం'లో
కోటల చుట్టూ 'కందకా'ల్లా,
'ఆధునిక యుగం'లో వాళ్ల
ఆస్తుల రక్షణలో
ఆయుధాగారంలా,
రిమోట్ కంట్రోల్
'రోబోట్' లుగా,
మిమ్మల్ని మాకెదురుగా
నిలబెట్టిందెవరు ?

'రాజ్యం' రాజ్యాధికారం
ఏమంటావ్! మిత్రమా
అవునంటావా! కాదంటావా ?
దాని దోపిడీ కోరల్ని
దహనం చెయ్యాల్సిందేగా!
**మీకూ మాకూ**
**ఉమ్మడి శత్రువున్నాడనే**
**నూరు పైసల నిజాన్ని చదవండి!**
గడచిన రెండుతరాల
'ఖాకీ బతుకుల్నీ'
చదవండి !!
మీ 'రాతల్ని' మీరుకూడా
చదువుకోండి!
**మీ చూపులు**
**చూడాల్సిన దిక్కుకే**
**చూస్తున్నాయ్!**
ఇప్పుడే
'దాని' కంట్లో
'నలక' పడింది

('ఖాకీ బతుకులు' నవల యువ కానిస్టేబుళ్ళు చదవడం చూసిన తర్వాత)

**- నవయువక**



'ఆంధ్రప్రభ'
సచిత్ర వారపత్రిక
9 జూన్, 1997
"కలం కన్ను"

## పోలీసు జీవితానికి దర్పణం 'ఖాకీ బతుకులు'

ఖాకీ అనేగానే 'కఱకు' అనే బావాన్ని స్ఫురింపజేసే రచనలను ఇంతకు ముందెన్నో చదివాము 'పోలీసు' అనగానే 'బఫూన్'ను కళ్లముందుంచే సినిమాల నెన్నింటినో చూశాము వీటికి భిన్నంగా పోలీసు జీవితాల్లోని లోతుపాతుల్ని చూపించే రచనలు చాలా అరుదుగా వచ్చాయి వాటిలో కూడా ఎక్కువ భాగం కాన్స్టబుల్ కన్నా పై స్థాయిలో ఉన్న ఉద్యోగుల సాధక బాధకాల్ని చర్చించేవే **పోలీసు కాన్స్టబుల్ జీవితాన్ని కథావస్తువుగా తీసుకుని, దాన్ని అన్ని కోణాల్లో మన ముందుంచుతూ 805 పేజీలు ఏకబిగిన సాగిన నవల స్పార్టకస్ 'ఖాకీ బతుకులు'**

1940 ప్రాంతాల్లో ప్రకాశమనే దళితుడు కూలీ జీవితాన్ని విడిచిపెట్టి, కాన్స్టబుల్ బ్రతుకు ప్రారంభిస్తాడు అప్పటి నుంచి 1975 వరకు అంటే అతనికి కంపల్సరీ రిటైర్‌మెంట్ వచ్చేంత వరకూ అతని 'ఖాకీ బతుకు' కు దర్పణం ఈ నవల ఇవి ఖాకీ బతుకులనీ మనకు చెబుతుంది

బందోబస్తు డ్యూటీలో ఉన్న ప్రకాశానికి అర్జెంటుగా పోలీస్ స్టేషనుకు రమ్మన్న సర్కిల్ ఇన్స్పెక్టరుగారి పిలుపుతో నవల ప్రారంభమవుతుంది అంత అర్జెంటుగా ప్రకాశాన్ని పిలిపించింది కంపల్సరీ రిటైర్మెంటు ఆర్డర్ని అందించడానికి ! హఠాత్తుగా ఆ ఆర్డర్ అందుకున్న ప్రకాశం చలించి పోతాడు మెలిపెట్టబడ్డ మనసులో దాదాపు ముప్పై సంవత్సరాల కాన్స్టబుల్ జీవితంలోని సంఘటనలు ముళ్లలా గుచ్చుకుంటూ గుర్తుకొస్తాయి

ఏడాది పొడుగునా వెట్టిచాకిరీ చేసినా, పండుగ పూట బేడ డబ్బులడిగితే ఇయ్యనంటాడు యజమాని చేతగాని కోపంతో బాధపడుతున్న ప్రకాశానికి వెంకటేశ్ వచ్చి తాలూకా కచేరీ దగ్గర తెల్లదొరలొచ్చి మన వాళ్లను పోలీసోళ్లుగా తీసుకుంటున్నారని చెబుతాడు ప్రకాశం అనిష్టంగానే సెలెక్షన్‌కు వెళ్తాడు, ఎన్నికవుతాడు

ఆ తర్వాత శిక్షణ - సాధక బాధకాలు, సర్వీసు - ఎదురు దెబ్బలు నిజాయితీ వేయించే మొట్టికాయలు, డిపార్ట్‌మెంట్‌లోని అన్యాయాలు - పోలీస్ కాన్స్టబుల్ ఎదుర్కొనే సమస్య లన్నింటినీ ఎటువంటి అరమరికలు లేకుండా మన ముందుంచడానికి చక్కటి ప్రయత్నం చేశాడు రచయిత ఈ ప్రయత్నంలో మనకు తెలీని, మనకు తెలీ కూడ దనుకునే విషయాల్ని ఎన్నింటినో చెప్పాడు పోలీసు జీవితంలో అటు డిపార్ట్‌మెంట్ నుంచీ, ఇటు ప్రజల నుంచీ, అధికారుల నుంచీ ఎదుర్కొనే సమస్యలతో పాటు అతని కుటుంబ సమస్యల్నీ మనసుకు హత్తుకునేట్లు రచించాడు

వయసు మళ్లుతున్నా, ఈ ఖాకీ జీవితాన్ని కొనసాగించలేనని మొరాయిస్తున్నా 'కూతురికి పెళ్లయి, కొడుక్కి ఉపాధి దొరికేంతవరకూ తప్ప'దని భారంగా రోజులు దొర్లించుకొస్తున్న ప్రకాశం, ఓ రోజు తలమీద దెబ్బ తగిలి స్టేషన్ కొచ్చిన ఓ ముసలామె మీద చూపించిన దయతో - లంచం తీసుకున్నాడన్న మాట పడతాడు దాంతో ఎస్సై మీద తిరగబడ్డందుకు ఫలితం అనుకోని కంపల్సరీ రిటైర్‌మెంట్ !

ఆర్థిక సంక్షోభం నుంచి బయట పడటానికి 'తనని అన్ని విధాలా అసమర్థుణ్ణి చేసిన' ఆ ఉద్యోగానికే తన కెంత మాత్రం ఇష్టం లేకపోయినా, కొడుకును పంపాలనుకుంటాడు కొడుకు పోలీసవుతాడు ఇది చట్ట ప్రకారం సాగుతున్న కట్టు బానిసత్వం 1975 తర్వాతి పోలీసు జీవితాల్ని ప్రతిబింబింపజేసేది కొడుకు కథ అది రెండవ బాగం

**పోలీసు జీవితాన్ని తెలుసుకోవాలనుకున్న వాళ్లందరూ తప్పక చదవాల్సిన రచన** ఆ డిపార్టుమెంటులో పనిచేస్తున్నాడు కాబట్టే అతనికి అన్ని విషయాలు తెలుసు **ఆత్మవంచన లేకుండా ఆత్మస్థైర్యంతో ఉన్నదున్నట్టుగా రాయగలిగిన స్పార్టకస్ అబినందనీయుడు**

**- వీ ఆర్టీ**



**'ఆంధ్రజ్యోతి'**
**తెలుగు జాతీయ దినపత్రిక**
**22 డిశంబర్, 1996**
**ఆ ది వా రం అ ను బం ధం**

## పోలీసుల నుంచి రెండు సంచలన పుస్తకాలు

హైదరాబాద్ నిజాం కాలేజీ మైదానంలో యిటీవల జరిగిన పుస్తక ప్రదర్శన వేలాది ప్రజలతో కిటకిట లాడింది వంట పాత్రలూ, ప్లాస్టిక్ సామాన్లూ, కాశ్మీరు శాలువలూ కొనుక్కోడానికి ఎగ్జిబిషన్‌కి వెళ్లినట్టే ప్రజలు పుస్తకాల కోసమూ వెళ్లారు ఆంధ్రులలో చదువు పట్ల పెరుగుతున్న ఆసక్తికి యిది నిదర్శనం కవిత్వం, కథలు, నవలలు, విమర్శనా గ్రంథాలు, పరిశోధనా పుస్తకాలు, వివిధ రంగాల సమాచార పుస్తకాలూ యిప్పుడు విరివిగా ప్రచురితం అవుతున్నాయి ఈ నేపథ్యంలోనే యిటీవల విడుదలైన రెండు పుస్తకాలు సంచలనంగా మారాయి రచయితలిద్దరూ పోలీసులు ఒకరు ఉన్నతాధికారి మరొకరు హెడ్ కానిస్టేబుల్ ఆంధ్రా నక్సలిజం అంతానికి పుట్టిన ప్రత్యేక పోలీసు దళం (గ్రేహౌండ్స్) ఐ జి అరవిందరావు తన అనుభవాన్నీ, అధ్యయనాన్నీ మేళవించి 'నక్సలైట్ టెర్రరిజం' అనే పుస్తకం రాశారు తీవ్రవాద విధ్వంసానికి సంబంధించిన సాధికారిక సమాచారాన్ని అందులో పొందుపరిచారు ఉద్యమం మీద విమర్శలు చేశారు పోలీసు శాఖలో హెడ్‌కానిస్టేబుల్‌గా పనిచేస్తున్న జి మోహనరావు 'స్పార్టకస్' అనే కలంపేరుతో 'ఖాకీ బతుకులు' నవల రాశారు కింది స్థాయి పోలీసుల దయనీయ జీవితాన్ని యీ నవల వెల్లడి చేస్తుంది **మొదటి పుస్తకం ఒక ఉద్యమం మీద వొక పోలీసు ఉన్నతాధికారి అవగాహన రెండవది వొక పోలీసు జీవితానుభవం** ఆదివారం ఆంధ్రజ్యోతి పాఠకుల కోసం ఈ రెండు పుస్తకాల్లోని కొన్ని ముఖ్యాంశాలను యథాతథంగా ముద్రిస్తున్నాం (వాటిని మేము ముద్రించటం లేదు ఇక్కడ)

  

"ఆ జీవితం తెలిసిన నేను పోలీసు బ్రతుకుని ప్రపంచం ముందు వుంచాలనుకున్నాను ప్రజల కోసం పాటుపడే పోలీసు బ్రతుకిలా గెందుకుందని మేధావులని అడగాలనుకుంటున్నాను

హారియట్ బీషర్‌స్టోవే జీవితం నాకా బాధ్యతను గుర్తుచేసింది  పాఠకుణ్ణి ప్రభావిత పరచగల ఆ చివరి మాటను నవలతో పాటు యిచ్చిన రంగనాయకమ్మగారి దూరదృష్టి నాకు ఆశ్చర్యం కలిగించింది  దాని ప్రభావం నుండి తప్పించుకోలేకపోయాను  తత్ఫలితంగా ఈ నవలా రచన కుపక్రమించాను "

  

పోలీసు కానిస్టేబుళ్ళ జీవితాల మీద తెలుగు సాహిత్యంలో వచ్చిన రెండో నవల 'ఖాకీ బతుకులు' 'స్పార్టకస్' రచయిత కలంపేరు  అసలు పేరు జి మోహనరావు  రచయిత స్వయంగా పోలీసు కావడం వల్ల ఎక్కడా ఎప్పుడూ గ్రంథస్థం కాని అనేక విషయాలు ఈ పుస్తకంలో మొదటిసారిగా కనిపిస్తాయి  **పోలీసులు పెట్టే చిత్రహింసల గురించి మనకందరికీ తెలుసుకానీ వాళ్లు పడే చిత్రహింసల గురించి మనకు తెలియదు**  ఈ రెండో కోణాన్ని THE OTHER SIDE OF POLICE గురించి చెప్పే ఈ పుస్తకం మొదటిభాగం మాత్రమే  1940-75 మధ్య నడిచిన కథ ఇది  అధికార వ్యవస్థ అడ్డుకోకపోతే రెండో భాగం కూడా రాయాలనే ఆలోచన రచయితకి వుంది"  ఈ పుస్తకం నుంచి కొన్ని భాగాలు చదవండి  (ఆ భాగాల్ని కూడా మేమిక్కడ ముద్రించటం లేదు)



**'Andhra Pradesh Times'**
**Sunday May 18, 1997. Hyderabad**
**"Literary Supplement"**

# BOOK AS THE ENEMY

*The paper ye may burn,*
*But what the paper holds ye*
*cannot burn*
*'tis safe within my breast*
*Where I remove, it goes with me,*
*Alights when I alight*
*And in my tomb will be*

***— Ibn Hazm,***
The ancient Arab poet-philosopher
reacting to the public outcry
that his books be banned

*G Mohana Rao's Telugu novel Khaki Batukulu, a scathing critique of hierarchy and fiefdom in police establishment, has incurred the wrath of the higher-ups who have hauled him up on disciplinary grounds  A profile of the writer and the book*

The establishment always wears the emperor's clothes and when a mirror reflects that naked fact, it strikes back with vengeance The erstwhile USSR did it to novelist Alexander Solzhenitsyn, Iran did it to Salman Rushdie, Bangladesh government did it to Taslima Nasreen and the Andhra Pradesh government did it to novelist Vasireddy Sita Devi in 1982 banning her novel Mareechika alleging that the novel had a negative influence on the youth It demoted her from the post of Deputy Director of Youth and Women's Welfare

The gutsy lady, a part of the very same government, fought the injustice valiantly and a full bench of the AP High court dismissed the state government's plea and restored the book to the reader and the post to the author Like the enlarged edition of the famous novel Ulysses by James Joyce which, after fighting the ban, reappeared with the court judgement, Sita Devi too has brought out a revised edition of her novel with the court judgement And now thanks to some top brass of the state police establishment, G Mohana Rao, a police constable who has written the novel Khaki Batukulu is finding himself being pushed into the roll-call of honour of harassed authors

**His novel is not a great work of literature by any standard, but it is an honest portrayal of the utterly miserable and degrading lives that police constables are forced to suffer from day one till they die, are dismissed or retire** The 805 page book (Pratyusha Publications, PB No 8, Tenali - 522201) published some six months ago has now made the establishment issue a memo asking the author to explain his daring to write a novel without prior permission, that too on the abominable state of affairs within the Kakhi-frame !

Surattu Venugopala Rao, a rare intellectural among the police officers, who was the first DG of Police in AP had during his stint at Delhi the trying experience of tasting the wrath of no less a person than Mrs Indira Gandhi, the then Prime Minister and he has recorded it along with the shenanigans of the then state leaders in and out of power, in his marvellous book 'Police Prasthanam' His 'Police Venkatswamy Kathalu' are delightful portrayals of the policemen in a lighter vein Ravulapati Seetaram Rao, K Sadasiva Rao, PBB Nair, K Subrahmanyam, Chava Ramakoti all high ranking officers of the state police, are creative writers of repute

Former IG MV Thomas's 'Tell all' is a service indictment of the murky side of the police-politician nexus, while K Arvind Rao's book on Naxalite violence tires to restore a certain needed balance in viewing the Naxal-Police war But in Mohana Rao's Khaki Batukulu, for the first time, perhaps in the literary history of India, a constable and a Dalit at that has dared to record the unmentionable ignominies that the constables suffer every hour of the day and every day of the year at the hands of their immediate superiors, the writer in the police station, the SI, the CI the sergeant and the DSP and has presented, to use an Americanese, the 'whole works'

which show the entire basement of the police mansion in all its ugliness and stink

The writer, a second generation constable in the family, his father (represented as Prakasam, the constable, in the novel) having been dismissed during Emergency has in a brief afterward to his novel (which incidentally is a part one only) said, 'I know this society of so-called intellectuals and superiors will not at all like the idea of a PC dipping his pen in the heart's blood of a constable'

**The novel is a true to life portrayal of the gradual dehumanisation of the constable where he is made to lick the boots of his superior, on the one hand and on the other brutally hitting and killing the accused even when he is aware of the man's innocence**

The constable trainee's enlightenment about the darkness of the system starts with the ADI at the first training centre demanding his usual 'money' as also the 'ground money' From there to training which can be turned into physical torture by a superior, to washing the dirty linen at the officer's homes and sometimes 'pleasing' the memsahib to pimping to sharing the spoils with the pickpocket and distributing the dough according to the unwritten ratio - it is nothing but corruption and brutalisation - which finds an outlet when the same PCs deal with public at large

Written on the basis of personal experience the novel covering the period 1940-75 has many heart rending scenes which should make every decent citizen hang his head in utter shame **If the authorities have the good of the system at heart, they should welcome this X-ray picture and benefit from its diagnosis instead of trying to stifle the voice of a courageous and creative pen among its ranks** John Galsworthy's play 'Justice' in Britain and Upton Sinclair's novel 'Jungle in America' are said to have helped reformation of the systems they attacked **It would be a tribute to the state police if they too use this book as the starting point for reforming the system instead of tilting the windmill of the rule book at the writer** That Justice Jeevan Reddy dismissed the objection about the portrayal of the police in Auto Shankar's autobiography should be an eye opener

Above all in a thriving democracy like ours while the cry for the right to information and the ending of official secrecy act is gaining momentum, rules which inhibit creativity should be erased at once

**A work of fiction written with anguish in heart and not accusing anyone or misrepresenting facts should be seen without wearing the glasses of disciplinary action If certain passages in the novel hurt someone somewhere, they should know it is the truth that is at work** After all does not our national motto declare "Truth shall triumph" ?

**– Vakati Panduranga Rao**

## Caste and Kulakdom in Khaki

Khaki Batukulu is the first work of Gantinapati Mohana Rao who is working in the special branch at Tenali town police station in Guntur district The novel's protagonist, Prakasam, a constable, is a witness to the transformation of the police force from the colonial masters into the hands of native leaders

Prakasam, a Dalit, himself experiences the metamorphosis of his community from a humble, suppressed and humiliated lot to that of a self confident and strong clan Prakasam runs away from his village unable to bear the trials of a feudal set up to be entrapped by a police recruitment school Being an ordinary police constbale, as well as a Dalit, Prakasam faces unending trauma in the closely knit cobweb of police hierarchy Khaki Batukulu is an account of the deformities in the police department

The story has a biographical colour as the life of the author's father Prakasa Rao, who spent 35 years in the department as constable and had lost his job during the emergency in 1975, serves as raw material for the novel The novel sketches events that unfolded right from the times of the last days of British rule in 1940s to those that took place in 1975 The connection of the plot with the real life of Prakash Rao is explicit from the dates

Mohana Rao started writing the novel in 1980 and completed it after four years But as no publisher came forward, he brought out the book under his own 'Pratyusha Publications' in the year 1996 His novel was released by Bollimunta Siva Ramakrishna at a function held in Tenali on December 6, 1996 Once it came out, it created a storm in the echelons of the police department Many reviewers described it as "a first of its kind narrative account on the hazards of a constable's life " Others called it "an insider's confession "

The Guntur SP issued a show cause notice to Mohana Rao in February In the notice it was maintained that under rule 13 of AP Civil services (conduct) rules a civil servant has to obtain prior permission from the government for writing a book The show cause notice has also charged Mohana Rao with demanding a bribe from some persons for verifying their passport applications However, Mohana Rao has denied the charges Talking to Andhra Pradesh Times, he said that police constables are facing untold miseries **He wants radical changes in the constabulary system and advocates a separate association exclusively for police constables This, according to him, helps constables to come out openly and give evidences against erring police officers and politicians With the support of the union, corruption can also be brought down, he added** Mohana Rao was very much inspired by Harriet Beecher Stowe's novel Uncle Tom's Cabin He said that it has made a long-lasting mark on him Mohana Rao has also brought out some translations of legal books and AP Police law guide He told Andhra Pradesh Times that at present he is working on the second part of Khaki Batukulu which will depict his own life Obviously here is a committed constable out to speak the truth at any cost

C SAI BABU
in Tenali

'Indian Express
March 8, 1997
"Book Review"

# A HISTORICAL FICTION

**If you want to master an art, go to a man who wins his bread through that art, they say And, if you want to know about a calling, don't rely on fiction written on it but trust a man who has been toiling in that profession**

Khakhi Batukulu (The life of cops) is such a work by Spartacus (pen name G Mohana Rao, a police constable) The story is about a constable, Prakasam, who is a witness to the transformation of the police force from the shackles of the colonial masters into the hands of native leaders

Prakasam, a Dalit, himself experiences the metamorphosis of his community-- from a humble, suppressed and humiliated lot to that of a self-confident and strong clan

**The writer simultaneously tackles two issues, the enslavement of a constable in the hands of his peers and upper caste hegemony over Dalits and its debilitating influence on their psyche**

Prakasam runs away from his village unable to bear the trials of a feudal tutelage only to fall into the trap of a police recruitment school There seems no end to his woes either after the completion of his training or probation

The story ends with the termination of Prakasam's service in 1975, the year of the emergency In reality, the story has not ended, for Prakasam handed over the baton to his son

As the writer admitted that it is almost a biographical work of his father, we can await the second part It would be certainly, an autobiography of the author

The bulk of the book (805 pages !), however, won't discourage you once you eare immersed in the story that is straight from the horse's mouth

**In a word, it is a historical fiction**

— **K.V. KURMANATH**



'The Hindu'
India's National News Paper
June 6, 1997 Metro - Hyderabad
"Review"

## THE WRITER IN KHAKI

*A constable-turned writer has stirred up a hornets' nest through his first novel of life in khaki His reward — harassment by superiors*

  

*EXPOSING A SYSTEM AND PAYING A PRICE FOR IT G Mohana Rao, the head constable, raised hackles in the police force*

Very few persons have the capacity to transform their experiences into creative writing It needs a lot of observation — the hallmark of excellence — to write a good book But turning out a magnum opus in the very first attempt is a rarity

Mr G Mohana Rao, a head constable in the Police Department, has done a double in fact **He has not only brought out a masterpiece of a novel — Khaki Batukulu (lives of policemen) — but has also stirred up a hornet's nest within the department**

Khaki Batukulu, though a work of fiction, has strong autobiographical streak in it as the central character of the theme Prakasam, a head constable, is moulded after the writer's father The book traces the life of a dalit, his struggles against the caste system and his attempts to gain respectability **The book bares the Police Department as no other book has done earlier** The oppression of constables, corruption in the department, the punishment meted out to those who do not fall in line with superiors etc

The book containing 805 pages is unputdownable despite a slight drag in some pages Reading the book makes one pause a little when he comes across a constable and sympathise with him

Such a book should bring only accolades to the writer Yet, the metamorphosis of the dalit in the novel from a poor labourer into a harassed and humiliated constable has brought no cheers to the writer The reward the department gave him was a transfer, harassment and a

case against him All this because he refuses to delete some portions of the novel which are not to the liking of his superiors and for not tendering an apology He even fears threat to his life now "I may be bumped off for sticking to my stand that I have done no wrong "

Talking about this, Mr Mohan Rao says "No rule prohibits a work of fiction or art So, why should they say that ? I explained as much in my reply to the show-cause notice too" He is hurt that a book which evokes only a positive response from the people towards the department is not liked by his superiors

This is only his first work It took three years between 1980 and 1983 for him to complete the novel Later on it was one long struggles for him to get it printed Refusal by publishers to bring out the book without preconditions made him bring out the novel on his own

Mr Mohana Rao says he was influenced at an early stage by the famous works of Gurajada, Unnava Lakshminarayana, Ranganayakamma and translations of books such as 'Roots', 'Uncle Tom's Cabin', 'Freedom Raod' and 'Maxim Gorki's Mother' It was 'Uncle Tom's Cabin' in particular, which had a profound impact on him and made him think about writing a book about constables' lives The parallels between the plight of the negroes of yesteryear in America and that of dalit here made him take up this venture

"As a constable I have seen it all As a child also I have seen my father's travails There is none who sympathises with us We are hated by one and all But do people know what goes behind the scenes ? It is enslavement of a different kind once you don the uniform It is this professional slavery and dehumanisation in the department that are striking That is why my first novel is on the lives of constables Readers have appreciated it Reviews are raving My conviction has only strengthened now", he says

Half a dozen novels are in the pipeline "Green Room" may be his next book It deals with the equation between people and money Mr Mohana Rao is different from the run of the mill writers because he prefers indepth study of the subject he is dealing with

Mr Mohana Rao says he likes to deal with varied professions in his novels "The wider the canvas, the better the challenge", he says Mr Rao, who is doing Law in an evening college at Guntur now, hopes things would improve in the department

Things may or may not improve in the department But after "Khaki Batukulu" was released on December 6, 1996 at Tenali his situation has worsened A passport agent lodged a complaint against him that he had misbehaved with women while conducting inquiry in case of a passport application Mr Mohana Rao, who was a head constable at Tenali Special Branch of Police, was transferred to Durgi despite a stay order on May 19 Earlier, a show-cause notice was issued to him for writing a book without seeking permission from higher-ups The writer has clearly stated in the foreword itself that the novel is a work of fiction and except the central character all other characters are fictitious and that he has no intention of hurting or demeaning anyone

"I wish writers' associations support me I know I am in a soup", he says

**What Mr Mohana Rao has achieved is simple About 80,000 constables and head constables of the Police Department in the State now know that those who have read the novel will never look down upon them "Khaki Batukulu" part Two is expected soon**

**— W. CHANDRAKANTH**

**Picture by : P.V. Sivakumar**



# 3. నవలా రచయితతో ఇంటర్వ్యూలు.

**'వార్త'**
**తెలుగు జాతీయ దినపత్రిక**
**ఆదివారం అనుబంధం, 29 జూన్ 1997**

## ఖాకీ 'గుండె' కథ !

**ఆయన అగ్రకులానికి చెందినవాడై ఇంగ్లీషు భాషలో ఆ పుస్తకం రాసి వుంటే అదీ పాటికి ఆయనకు కావలసినంత పేరు, డబ్బు సంపాదించి పెట్టేది** ఎప్పుడో 1980-1983 మధ్యకాలంలో ఆయన రాసిన ఆ పుస్తకం ఎన్నో ఒడిదుడుకులు ఎదుర్కొని గత సంవత్సరం వెలుగు చూసింది వెలుగు చూసిన తర్వాత నుండి ఆయన్ని ముప్పతిప్పలు పెడుతోంది ఆయన పేరు గంటినపాటి మోహనరావు కలం పేరు స్పార్టకస్ (స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని, హక్కుల్ని పోరాడి సాధించుకోవాలని నమ్మిన రోమన్ బానిసల నాయకుడి పేరే స్పార్టకస్) ఆ పుస్తకం పేరు 'ఖాకీ బతుకులు' ఆ పుస్తకాన్ని చదివిన సాహితీ విమర్శకులు వాస్తవాల్ని పాత్రలతో మమేకం చేసే నవలొకటి చాలా సంవత్సరాల తర్వాత దొరికినందుకు సంతోషించవచ్చు అంతర్గత సంబాషణతో ప్రదాన పాత్రలోకి దూరిన రచయితను వారు అబినందించవచ్చు కానీ నవలలోని కఠిన వాస్తవాలను జీర్ణించుకోలేనివారు మాత్రం గగ్గోలు పెడుతున్నారు పోలీసులంటే అందరికీ గుర్తుకొచ్చేది ఎర్రటోపీతో, చేతిలో లాఠీతో మానవహక్కులంటే అర్ధం తెలియని వ్యక్తి పోలీసు ఒక వ్యవస్థకు పేరు కావచ్చు కానీ ఆ పదం కానిస్టేబుల్‌కు మారుపేరయింది ఎందుకంటే పోలీసుల వలన జరిగాయనుకునే పరమ దుర్మార్గాలు, అన్యాయాలు అమానుషాలు చివరికి కానిస్టేబుల్స్‌కు చుట్టుకోవడమే అందుకు కారణం వారు మాత్రమే ఫలానా అన్యాయపు పని చేశారనే ప్రసార సాధనాల గోలకూడా ఇందుకు కారణం ఆ ఫలానా అన్యాయపు పనిలో నిస్సహాయ స్థితిలో బాగమైన కానిస్టేబుల్స్ చివరికొచ్చేసరికి ప్రజల దృష్టిలో ప్రదాన ముద్దాయిలవుతున్నారు అంటే ఒక వ్యవస్థలో భాగమైన వారు అక్కడ దళితులుగా మారిపోయారు **శ్రమకు మారుపేరైన దళితులు తరతరాలుగా ఎలా దోపిడీకి గురయ్యారో పోలీసు వ్యవస్థలోని కానిస్టేబుల్స్ అలాగే దోపిడీకి గురవుతున్నారు** ఇది ఆశ్చర్యంగా ధ్వనించవచ్చు సాధారణ ప్రజానీకానికి కానిస్టేబుల్ గుర్తుకొస్తే వెనువెంటనే క్రౌర్యం గుర్తుకొస్తుంది హింస గుర్తుకొస్తుంది ఇదెలా జరిగింది ? ఎందుకు జరిగింది ? వీటి మూల కారణాల్ని అన్వేషించటానికి, వాటిని ప్రపంచానికి చాటటానికి మోహనరావు ఎన్నుకున్న నవలా మార్గమే 'ఖాకీ బతుకులు'

'ఖాకీ వేధింపులకు యువకుడి ఆత్మహత్య' 'పోలీసు హింసకు బాలుని మృతి', 'ఖాకీల తొందరపాటు వల్లే కాల్పులు', 'కోర్టుప్రాంగణంలోనే ఖాకీల క్రౌర్యం' ఇంకా వీటితోపాటు రోజూ కనిపించే లాకప్ డెత్‌లు ఇవన్నీ చదివి చదివి, టెలివిజన్లలో చూసి చూసి మనం ప్రజాస్వామ్య ప్రభుత్వంలో వున్నామా ? లేక పోలీసుల పరిపాలనలో వున్నామా ? అని అనిపిస్తుంది దాంతో పోలీసు వ్యవస్థలోని అంచెలలో అట్టడుగున వుండి రోజూవారీ

జీవితంలో మనకి దగ్గరగా కనిపించే పోలీసు కానిస్టేబుల్‌ను అసహ్యించుకుంటాం ఈ అసహ్యాన్ని, కానిస్టేబుల్ బతుకులోని అవమానాన్ని స్వయానా కానిస్టేబుల్ అయిన మోహనరావు (ఇప్పుడాయన హెడ్ కానిస్టేబుల్) జీర్ణించుకోలేకపోయారు అసలు నిజాల్ని ప్రపంచానికి చాటడానికి తన తండ్రి జీవితాన్ని ప్రకాశమనే ప్రధాన పాత్రద్వారా 'ఖాకీ బతుకులు' నవలలో రికార్డు చేశారాయన నిజానికి ఈ నవల వ్యవస్థలోని చాలా లోపాలకు పరిష్కారం చూపుతుంది అంటే ప్రత్యక్షంగా ఇవీ పరిష్కారాలని సందేశాలివ్వడం కాదు ఎందుకీ సమాజం ఇలా తగలబడింది పోలీసు వ్యవస్థ ఎంతవరకు కారణమనేది చివరికి తెలిసొస్తుంది

ఏవో సూత్రాలు, సిద్ధాంతాలు, నియమాలు చదివి వాటిని ప్రణాళికలకు, బడ్జెట్‌లకు, పథకాలకు, వ్యవస్థలకు అన్వయించి అనుకున్న ఫలితాలు రాలేదని సిద్ధాంతకర్తలు, సామాజిక శాస్త్రవేత్తలు, ఆర్థిక శాస్త్రవేత్తలు గగ్గోలు పెడుతుంటారు కానీ మనిషి జీవితంలో ఒకదానికొకటి ముడిపడి వుండే అంశాల గురించి ఆలోచించరు **ఒక కాలంలో ఒక సమాజంలో నివసించే వివిధ కులాల వారిలో సమానమైన ఆర్థిక పరిస్థితులు నెలకొన్నపుడు ఆయా అట్టడుగు కులాలవారిలోనూ, కొంచెం ఆలస్యంగా పెద్దకులాల వారిలోనూ మార్పులొస్తాయనేది ఈ నవలలో అత్యంత సమర్థవంతంగా చిత్రీకరించాడు రచయిత** అంటే ఖచ్చితంగా సమానత్వం వస్తుందని కాదు నియమాల్ని సూత్రీకరణల్ని చేసే పెద్ద పెద్ద ఆఫీసర్ల వైఖరిలో మార్పు వచ్చి తద్వారా వ్యవస్థలోని మిగతా అంచెలలో మార్పులొచ్చి అందరూ ప్రజాసేవ చేయాలనే ఒకే ఒక నియమానికి కట్టుబడి వుంటే తదనుగుణంగా అన్నిరకాల లోపాలు ఒకటొకటే మాయమవుతాయనేది రచయిత తాపత్రయం అదే ఈ నవలలో చివరికి మనక్కనిపించే అంశం రోమ్ నగరాన్ని ఒక రోజులో నిర్మించలేమనే విషయం మోహనరావుకు బాగా తెలుసు

నవల్లో ప్రధానపాత్ర అయిన ప్రకాశం పాలేరు 1940 ప్రాంతంలో అంటే బ్రిటీష్ కాలంలో ఆ పాత్ర కానిస్టేబుల్‌గా ఉద్యోగంలో చేరుతుంది 1975 చివర్లో అంటే ఎమర్జెన్సీ కాలంలో ఆ పాత్ర ఉద్యోగం నుండి తొలగింపబడుతుంది ఆ తర్వాత ప్రకాశం కొడుకు సూర్యం పోలీసు కానిస్టేబుల్‌గా చేరడంతో ఈ నవల మొదటి భాగం ముగుస్తుంది **ఎనిమిది వందల ఐదు పేజీల ఈ నవలని వ్యవస్థలోని అంతర్గత లోపభూయిష్ట విషయాల గురించి ఆలోచించేవాళ్లు మటుకే చదవగలరు** అదే రచయితకు కూడా కావలసింది ఎందుకంటే ఆయన ఈ నవలని కొద్దిమందికి మాత్రమే ఉపయోగపడుతున్న ప్రస్తుత వ్యవస్థ మారడం కోసం రాశారు అంతే కాని పొద్దుపోక విలాసంగా నవలల్ని చదివే వారి కోసం రాయలేదు ఆసామి దగ్గర పనిచేస్తూ ఏ రోజుకారోజు గింజలు కొలిపించుకొని పనిచేయని రోజు పస్తులుండే ప్రకాశం నిరక్షరాస్యుడు అంతకు మించి దళితుడు అయినా శారీరక అర్హతల ప్రకారం అప్పటి బ్రిటీష్ ప్రభుత్వం అతనికి పోలీసు కానిస్టేబుల్ ఉద్యోగం ఇస్తుంది ఆసామి దగ్గర రోజూ గింజలు కొలిపించుకొని బతికే బతుక్కు, నెలనెలా జీతం తీసుకొని బతికే కానిస్టేబుల్ బతుక్కి తేడా తెలియక చదువులేని, లోకంపోకం తెలియని ప్రకాశం పాత్ర మొదట తబ్బిబ్బవుతుంది చదువుకొని, భాష మార్చుకొని, వ్యవస్థలోని లోపాల్ని ప్రశ్నిస్తూ సమానత్వం రాకున్నా కనీసం అవమానం లేని జీవితం లభిస్తే చాలనుకుంటుంది కానిస్టేబుల్ స్వయంగా కఠిన స్వభావాన్ని కలిగినవాడు కాదని, పరిస్థితుల ప్రభావం వలన గత్యంతరం లేని పరిస్థితుల్లో అలా మారాల్సి వస్తుందని నవలంతా చెబుతూ వస్తాడు ప్రతీ దృశ్యానికి కావల్సినంత అర్థమయ్యే నేపథ్యాన్ని

సమకూర్చుతాడు వ్యవస్థలోని కొంతమంది స్వార్థానికి చాలామంది ఎందుకు బలికావాల్సి వస్తుందో అతి సరళంగా దీనంగా దయగా కోపంగా నిస్సహాయంగా చెబుతాడు అర్థం చేసుకోండని 'పోలీసు దొర'ల్ని కోరతాడు

వలసపాలన కాలంనాటి అవశేషాలతో రాజకీయాలతో రోజు రోజుకు పోలీసు వ్యవస్థ ప్రజలకు దూరమవుతున్నది పోలీసు కానిస్టేబుల్‌గా చేరిన వెంటనే పైవాళ్ళ నుండి మొదలయ్యే లంచాల కార్యక్రమం క్రమక్రమంగా వారిని ఎలాంటి స్థితికి నెడుతుందనే విషయానికి 'ఖాకీ బతుకులు' ఒక అక్షర దర్పణం నిజానికి ఇది ఒక కాలపు చరిత్ర ఇందులో కొన్ని పాత్రలు ఎదురు తిరగాలనుకుంటాయి పళ్ళ బిగువున కోపాన్ని అణచుకొని ఎప్పటికప్పుడు రాజీపడుతుంటాయి మొత్తం మీద అస్తవ్యస్థంగా, అర్థంకాని విదంగా వుండే కానిస్టేబుల్ చిత్రంలోని అన్ని రంగులూ అర్థమయ్యేసరికి పాఠకుడికి కానిస్టేబుల్‌పై ఇంతకుముందు వున్న అసహ్యానికి బదులు, సానుభూతి కలుగుతుంది కానీ వ్యవస్థలోని ఏ అంశాలు ఎలా వుండాలనే విషయాల్ని నిర్ణయించే పై అదికారుల్లో అసలు సిసలు మార్పు రావాలి సానుభూతి కలిగిన పాఠకులు అంటే సంఘాలు కళాకారులు, రచయితలు, విమర్శకులు అంతటితోనే వూరుకుంటే ఇక నవలా ప్రయోజనమేముంటుంది ఒక దుర్భర దృశ్యాన్ని చూసిన తర్వాత అది అందమైన దృశ్యంగా మారడానికి ఎవరి వంతు సహాయం వారు చేస్తేనే కదా మార్పు వచ్చేది దాని కోసమే ఇపుడు మోహనరావు ఎదురు చూస్తున్నాడు తన జీవితాన్ని ఆదారం చేసుకొని ఖాకీ బతుకుల్లోని రెండవ భాగాన్ని ఆయనిపుడు రాస్తున్నారు

ప్రజాస్వామ్యంలో ప్రదాన బాగమైన పోలీసు వ్యవస్థపై స్వాతంత్ర్యం సిద్ధించిన సమయంలో ప్రజలకు ఎలాంటి దురభిప్రాయం వుందో అలాంటి అభిప్రాయమే స్వాతంత్ర్యం వచ్చి 50 సంవత్సరాలైనా ఇంకా ప్రజల్లో వుంది

ఇక పోలీసుల పిల్లల విషయానికి వస్తే తండ్రి పోలీసు అయినందుకు కొడుకును క్లాస్‌మేట్స్ ప్రత్యేకంగా చూస్తున్నారు కారణం క్రూరంగా, లావుగా, కోపంగా వుండే తండ్రంటే కొడుకు క్లాస్‌మేట్స్‌కున్న ఒక విదమైన ఏహ్యాబావం పోలీసులంటే అవినీతిపరులనేది వారి నమ్మకమట **పోలీసు రీసెర్చ్ అండ్ డెవలప్‌మెంట్ బ్యూరో పోలీసు పిల్లల మీద ఒక సర్వే నిర్వహించింది దాని ప్రకారం పోలీసుల పిల్లల్లో స్కూలు ఎగ్గొట్టేవాళ్ళు మత్తు మందులకు అలవాటుపడేవారు ప్రతీ సంవత్సరం ఎక్కువవుతున్నారట దీనికి కారణం నేరస్వబావాన్ని తుడిచిపెట్టేయాల్సిన పోలీసు క్రమక్రమంగా అందులోకి కూరుకుపోడం** రెండు రోజులు వరుసగా డ్యూటీ చేసి వచ్చిన పోలీసు విశ్రాంతి తీసుకుందామని పడక ఎక్కిన మరుక్షణమే పైవారి పిలుపునందుకొని డ్యూటీకి హాజరు కావల్సి వచ్చే సందర్భాలు సదరు పోలీసు జీవితంలో కోకొల్లలు ఇక భారతీయ సమాజాల్లో తండ్రి యజమాని అతను తీసుకొనే నిర్ణయాలు ఆ కుటుంబంపై ప్రబావాన్ని చూపుతాయి కుటుంబంతో ఉల్లాసంగా, ఉత్సాహంగా గడిపే క్షణాలు పోలీసులకు ఎక్కడివి ? ఇక ఆ వ్యవస్థలో అతి తక్కువవాడైన కానిస్టేబుల్ విషయం ఇంకా ఘోరాతి ఘోరం వారంలో కనీసం, మూడుసార్లు 24 గంటల కన్నా ఎక్కువ డ్యూటీ చేయాల్సి వచ్చే సందర్భాలు కానిస్టేబుల్ జీవితంలో సహజమే! ఇక 16 నుండి 18 గంటల వరకు విస్తరించే డ్యూటీలు వుండనే వుంటాయి క్రూరమైన నేరస్తుల స్వబావాలు, రాజకీయ నాయకుల ప్రమేయం, కొంతమంది పై ఆఫీసర్ల పొంతనలేని అబిప్రాయాలు, విరామమెరుగని పని వత్తిడి పోలీసుల్ని ప్రజోపయోగ పోలీసులుగా కాకుండా, ప్రజాపీడిత పోలీసులుగా మార్చేస్తున్నాయి అభివృద్ది చెందిన దేశాల్లో ప్రతి ఐదువందల మంది పౌరులకు ఒక పోలీసు వున్నాడు హింసలతో,

ప్రాంతీయ తేడాలతో, అసమానతలతో దారిద్ర్యంతో, వలసపాలనకాలపు వాసనలతో కునారిల్లుతున్న బారతదేశంలో మటుకు వేయిమందికి ఒక పోలీసు వున్నాడు ఇది పోలీసు ఉద్యోగం మీద ఎంతగానో వత్తిడి పెంచే విషయం ఇక కానిస్టేబుల్ సంగతి వేరే చెప్పాల్సిన పనిలేదు

**నలభై రెండు సంవత్సరాల గంటినపాటి మోహనరావు 'ఖాకీ బతుకులు' అనే నవలను అచ్చులో పేరు చూసుకోడానికో, కీర్తిని సంపాదించుకోడానికో డబ్బును సంపాదించుకోడానికో లేక సాహితీ పిపాస ఎక్కువయ్యో రాయలేదు** ఆయన కానిస్టేబుల్ జీవితాన్ని నవల్లో అలా పెట్టేశాడు **రాసిన మొట్టమొదటి నవలే అంత గొప్పగా వుండటానికి కారణం జీవితం నవలలో ప్రతిబింబించడమే ఈ నవల్లోని ప్రకాశం పాత్ర నగ్నసత్యాల్ని, జీవన సూత్రాల్ని అతి చిన్న ఉదాహరణలతో అత్యంత సులభంగా మన ముందుంచుతుంది** ఆయనతో జరిగిన సంభాషణలోని ముఖ్యాంశాలు

***మీ పై అధికారులు మీ నవలను హర్షించలేకపోడానికి కారణం ?***

వాళ్లు ఈ వ్యవస్థను ఇలాగే కొనసాగించాలనుకుంటున్నారు ఎటువంటి మార్పులు లేకుండా వుంటే ప్రస్తుత వ్యవస్థనుండి వాళ్లు వారి అనుయాయులు లాబపడతారు ఈ వ్యవస్థలో ఏ విదంగా చూసినా అతి తక్కువవార్రైన పోలీసు కానిస్టేబుల్స్ హక్కుల గురించి పని గంటల గురించి అడగడం మొదలు పెడితే అలా అడిగేవాళ్లలో వాళ్లూ చేరిపోతే తద్వారా వాళ్లూ మంచివాళ్లయిపోతే దోచుకొనేవారికి ఇబ్బందిగా వుంటుంది మంటగా వుంటుంది పెట్టుబడిదారీ వ్యవస్థలో పోలీసు కీ ఇస్తే కదిలే యంత్రంలాగా వుండాలి

***ఈ నవలను ఎందుకు రాశారు ?***

కొద్దిమందికి మాత్రమే ఉపయోగపడేలా వున్న ప్రస్తుత వ్యవస్థ మారాలి అందుకే ఈ నవలను రాశాను నిజమైన పోలీసు గురించి అందరికీ తెలియాల్సి వుంది పోలీసు ఎందుకు అలా తయారవుతున్నాడో తెలియాల్సి వుంది నాణేనికి రెండో వైపు తెలియకపోతే పూర్తి నిజం తెలిసినట్టు వుండదు

***పోలీసుల మీద ప్రజలకు సదభిప్రాయం లేదెందుకని ?***

ప్రభుత్వం నడవడానికి కొన్ని వ్యవస్థలు వుంటాయి అవి నడవడానికి విధి విదానాలు వుంటాయి వాటిలో లోపం వలన ఆయా వ్యవస్థల్లో కొంతమంది లాబపడుతుంటారు చాలామంది నష్టపోతుంటారు బాధపడుతుంటారు నిస్సహాయ పరిస్థితుల్లో కొట్టుమిట్టాడు తుంటారు అలాంటి పరిస్థితే పోలీసు వ్యవస్థలో వుంది ప్రధానంగా ప్రజలకు సహాయ సహకారాలు అందించే విధి విధానాలు లేవు వున్నా ఆచరణలో లేవు లోపభూయిష్టంగా వున్నాయి పది పదిహేను శాతం మంది సక్రమంగా వున్నా అది కూడా ప్రజల్ని మభ్యపెట్టడానికి మటుకే అది వాస్తవమైన సహాయం కాదు దీనికంతటికీ కారణం వ్యవస్థల వలన లాబపడే పదిశాతం మందికి ప్రభుత్వానికి పరస్పర సహాయ సహకారాలు వుండటమే ।

***మీ రచనా ప్రక్రియ గురించి***

రాయడం నాకు ఆనందం కలిగించే విషయం నా దగ్గర ప్రచురణకు నోచుకోని కొన్ని నవలలు వున్నాయి ఇతరులకు తమ బాదల్ని చెప్పకోడం ద్వారా కొంతమంది తమ బాధల్ని తగ్గించుకుంటారు వ్యవస్థను ఎదిరించడానికే నా ఆలోచనల్ని పేపరు మీద పెట్టాను పెడుతున్నాను పెట్టబోతాను మొదటినుండీ విపరీతంగా నవలల్ని చదవడం వలననే నవలా ప్రక్రియను ఎన్నుకున్నాను

***రాబోయే మీ నవలల గురించి చెప్పండి!***

నాటకాలు ఆడే వాళ్లు రంగులు పూసుకోడానికి డ్రెస్సులు మార్చుకోడానికి ఒక రూము ఉంటుంది దాన్ని 'గ్రీన్‌రూమ్' అంటారు **గ్రీన్‌రూమ్** పేరుతో ఒక నవలను రాస్తున్నాను మన ఇల్లు, సమాజం, ఆఫీసులు ఇంకా మొదలైనవి ఎక్కడికక్కడ గ్రీన్‌రూమ్‌లుగా మారిపోతున్నాయి స్వార్థంతో ఎక్కడికక్కడ సందర్భానికి తగిన రంగులు పులుముకోడం, కృత్రిమ నవ్వులు చిందించడం రోజు రోజుకు ఎక్కువవుతున్నది ఉదాహరణకు మనం తప్పు చేస్తున్నామనే విషయం తెలిసినా మన వలన పొందాల్సిన లాబం కొరకు, తప్పుల్ని ఒప్పులుగా పరిగణించే ఎదుటివాళ్లు ఎక్కువ కావడం మీద ఆ నవలను రాయాలనుకుంటున్నాను

అలాగే క్రైస్తవ సన్యాసినులు, ఫాదర్స్ మీద ఒక నవలను రాయాలనుకుంటున్నాను **మార్క్సిజాన్ని నేను నమ్ముతాను** రెండువందల సంవత్సరాల్లో మార్క్సిజంలో జయాలు, అపజయాలు వుండవచ్చు కొన్నిచోట్ల ఘోరమైన అపజయాన్ని పొంది వుండవచ్చు అప జయాలకు సంబంధించి సరైన విశ్లేషణ లేదు కానీ నాకు తెలిసినంతవరకు మార్క్సిజమే అసలు సిసలైనది మతం మత్తుమందులాంటిదని మార్క్స్ చెప్పాడు ఈ క్రైస్తవ సన్యాసినులు, ఫాదర్స్ ఆ మత్తుమందులను రోజుకింత ప్రజలకు ఇస్తున్నారు తమలో ఎన్ని లోపాలున్నా సమాజాన్ని మభ్యపెట్టడానికే చూస్తున్నారు విదిరాత కర్మ దేవుడు క్షమిస్తాడులాంటి మత సంబంధమైన పదాలు, వాక్యాలు, గ్రంధాలు ప్రజల్ని ప్రశ్నించకుండా తయారు చేశాయి ముఖ్యంగా దళితుల్ని అవి చేసే మోసం అంతా ఇంతా కాదు

***నేర స్వభావాన్ని పోలీసు కానిస్టేబుల్ సమర్థవంతంగా ఎదుర్కొని తమ మీద ప్రజలకున్న చెడు అభిప్రాయాన్ని తొలగించుకోవాలంటే ఏం చేయాలి?***

వారికిచ్చే శిక్షణా రీతుల్లో విప్లవాత్మకమైన మార్పుల్ని చేయాలి మూడు లేదా ఐదు సంవత్సరాలకు ఒకసారి మారుతున్న పరిస్థితుల్ని ఆకళింపు చేసుకోడానికి సరికొత్త శిక్షణను వారికిప్పించాలి ప్రస్తుతం వారికిచ్చే శిక్షణా కార్యక్రమం లోపభూయిష్టమైనది ఉదాహరణకు నక్సలైట్లును టెర్రరిస్టులనే పరిచయం చేస్తున్నారు అటువంటి ఫిల్ముు చూపిస్తున్నారు వాళ్ల మీద వీళ్ల మనస్సుల్లో వ్యక్తిగతమైన ద్వేషాన్ని పెంచుతున్నారు **కిరణ్‌బేడీలాంటి పోలీసు ఆఫీసర్సు అడుగుతున్న ధర్మవీర్ కమీషన్ సిఫారసుల్ని అమలు చేసిననాడు పోలీసు కానిస్టేబుల్ బాగుపడగలడు కానిస్టేబుల్స్‌కు, హెడ్ కానిస్టేబుల్స్‌కు కలిపి ఒక వెల్ఫేర్ అసోషియేషన్ వుండాలి** అప్పుడు వారికి ఉద్యోగ భద్రత లభిస్తుంది పై అదికారుల హింస, అన్యాయంగా జరిగే ట్రాన్స్‌ఫర్‌లు, సస్పెన్షన్‌లు, లాకప్ డెత్‌లు తగ్గుతాయి

***మీ భార్య ఈ నవల మీద ఎలా స్పందించింది?***

మా 20 సంవత్సరాల వివాహ జీవితంలో నా భార్య మేరీని పుస్తకాలు చదివేలా చేయడానికి శతవిదాలా ప్రయత్నించి ఘోరంగా విఫలమయ్యాను కానీ ఎనిమిది వందల పేజీల ఖాకీ బతుకులు ఆమె పూర్తి చేయగానే ఆమె స్వరంలో ఒక విధమైన మార్పు వచ్చింది "ఇన్ని సంవత్సరాలు మీతో కాపురం చేస్తూ మీ సమస్యల గురించి తెలుసుకోలేకపోయాను మీ ఉద్యోగాల వెనుక ఇన్ని బాదలుంటాయా?" అంటూ ఆమె ఏడ్చేసింది

## దూరతీరాల స్పందన ...

రోజువారీ జీవితంలో కానిస్టేబుల్స్ పడే బాధల్ని పోలీసు వ్యవస్థలోని అవినీతిని మోహనరావు నవలగా అక్షరీకరించినందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం బాధపడ్డది మోహనరావు చేయగూడని పని చేసినందుకు, వ్యవస్థలోని లోపాల్ని అంత బాహాటంగా బయటపెట్టినందుకు ప్రభుత్వం ఆయనకు షోకాజ్ నోటీసు జారీ చేసింది ఎ పి సి ఎస్ (కండక్ట్) రూల్ 13 (1964) ప్రకారం పై అధికారుల నుండి అనుమతి తీసుకోకుండా ఏకంగా ఎనిమిది వందల పేజీల నవలను రాసి పారేయడమేనా అని ప్రభుత్వానికి కోపమొచ్చింది ఫలితంగా ఆయన చేతికి గుంటూరు ఎస్పీ ఆఫీసులోని నక్సలైట్ల సమస్యల్ని చూసే సిఐడి బ్రాంచ్‌కు ట్రాన్స్‌ఫర్ అయినట్టు ఆర్డర్ అందింది ప్రభుత్వ ఉద్యోగుల బాధల్ని పరిశీలించే ఆంధ్రప్రదేశ్ అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్‌ను ఆశ్రయించి మోహనరావు స్టే ఆర్డర్‌ను సంపాదించి తాత్కాలికంగా ట్రాన్స్‌ఫర్ బాధ నుండి తప్పించుకున్నారు కానీ ఆయన్ను ఈ మధ్యనే గుంటూరులోని దుర్గి అనే ఓ చిన్న పోలీసు స్టేషన్‌కు ట్రాన్స్‌ఫర్ చేశారు నేనేమీ తప్పు చేయకుండానే ఇలాంటి శిక్షల్ని ఎందుకనుభవించాలని మోహనరావు ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తున్నాడు ప్రశ్నించడం మొదలయ్యే చోట అణచివేత వుంటుందని ఆయనకు తెలుసు అయినా ప్రయత్నం చేయడంలో తప్పులేదు కదా! అయితే గౌరవనీయులైన ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుకు **అమెరికాలో నివసించే భారతీయులు ఓ 37 మంది కలిసి 'ఖాకీ బతుకులు' రచయిత మోహనరావు విషయంలో జరుగుతున్న అన్యాయానికిగాను తమ నిరసనను తెలియజేస్తూ 1-6-1997న ఒక ఉత్తరాన్ని రాశారు** అందులో 'పోలీసు వ్యవస్థను, పరిపాలనను ఆధునికం చేసే క్రమంలో నియమాల్ని, విధుల్ని తిరగరాసి ప్రజాస్వామ్య వ్యవస్థను మరోసారి రక్షించాలనే తాపత్రయంలో వున్న ప్రభుత్వం మోహనరావు రచనను ఉపయోగించుకోవాల్సింది పోయి ఆయన్ను హింసించడమేంటి ? దీని గురించి మీరు పట్టించుకోండంటూ వారు ముఖ్యమంత్రికి రాశారు ఇంతవరకూ తెలుగులోని పుస్తకాలు నిషేధానికి గురయ్యాయి వివాదస్పదమయ్యాయి సదరు రచయితలకు ఇబ్బందులు తెచ్చిపెట్టాయి అటువంటి సమయంలో సమాజంలోని వివిధ వర్గాల నుండి ప్రతిస్పందనలు వచ్చాయి కానీ అమెరికాలో నివసించే బారతీయుల నుండి ఒక సృజనాత్మకమైన రచనపై ఇటువంటి స్పందన రావడం ఇదే ప్రథమం అయితే ఆంధ్రప్రదేశ్‌లోని కవులు రచయితలు కళాకారుల స్పందన మాత్రం ఈ నవలకు లబించడం లేదు అంటే నవలలోని శైలి శిల్పం ప్రతీకలపై కాదు సృజనాత్మక ప్రక్రియకు జరుగుతున్న అవమానంపై

## రచయితగా మారిన క్రమం ...

అంకుల్ టామ్స్ కాబిన్ (టామ్ మామ ఇల్లు) నవల మోహనరావును ఎంతగానో ప్రభావితం చేసింది ఆ నవలని తెలుగులోకి అనువాదం చేసిన రంగనాయకమ్మ ఆ పుస్తక రచయిత్రి హారియట్ బీషర్ స్తోవే గురించి, ఆ నవల చివర్లో రాసిన 'చివరి మాట' ద్వారా వివరిస్తుంది ఆ వివరాలు రావును కదిలించాయి నిజానికి ఈ చివరి మాటే ఆయన్ను రచయితను చేసింది ఆ నవలలోని అమెరికా నీగ్రోల జీవితాలకు, బారతదేశంలోని దళితుల జీవితాలకు పెద్ద తేడాలేదనే విషయాన్ని ఆయన గ్రహించారు అబివృద్ధికరమైన రచన, కానీ

రచన అంటూ రెండు రకాల రచనలు మాత్రమే వుంటాయని నమ్మే మోహనరావు తనకు తెలిసిన ప్రపంచమైన పోలీసు వ్యవస్థలోని దళితుల్ని అంటే పోలీసు కానిస్టేబుల్సును ప్రపంచానికి పరిచయం చేయాలనుకున్నాడు తెలుగులో ప్రముఖ రచయిత్రి అయిన రంగనాయకమ్మను ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా సంప్రదించాడు నవల రాసేందుకు తగిన సూచనల్ని, సలహాల్ని పొందాడు **అన్నిటికన్నా ఆయనలోని పట్టుదలే ఆ పుస్తకం ప్రస్తుత రూపంలోకి రావడానికి కారణం** నవలను బాగుందన్న కొన్ని పత్రికలు సీరియల్‌గా అచ్చేయడానికి భయపడ్డాయి కొన్ని మార్పుల్ని, చేర్పుల్ని చేస్తేనే అచ్చేస్తామన్నాయి కానీ నిజాల్ని కప్పి పెట్టేయడానికి ఏమాత్రం ఇష్టపడని రావు కూతురి పేరుతో స్వంత పబ్లికేషన్ ప్రారంభించి పుస్తకాన్ని గత సంవత్సరం చివర్లో ముద్రణారూపంలోకి తెచ్చాడు **తెలిసిన ప్రపంచాన్ని ఆవిష్కరించడంలో నిజాయితీ నిబద్ధత ఉంటే రచన చేయడంలో ప్రసవ వేదన వుండదనేది మొత్తం మీద 'ఖాకీ బతుకులు' నవలను చదవడం ముగించిన పాఠకుడికి కలిగే ఫీలింగ్** పది సంవత్సరాల క్రితమే పూర్తయి ఇప్పటికి వెలుగులోకి వచ్చిన ఈ రచన పోలీసు వ్యవస్థలోని అసలు సిసలు మార్పులకు శ్రీకారం కాగలదనడంలో ఎటువంటి సందేహం లేదనేది పలువురు మేధావుల అభిప్రాయం

**- చెమికల రాజశేఖరరెడ్డి**

**ఫోటోలు నోవా**



**'చూపు'**

**అధ్యయన వేదిక**

**మే - ఆగస్టు, 1997**

## "కానిస్టేబుళ్ళకూ మానవహక్కులు కావాలి" !

## "ఖాకీ బతుకులు" రచయిత స్పార్టకస్‌తో ఇంటర్వ్యూ

***ఈ నవల ద్వారా మీరు ముఖ్యంగా అడ్రస్ చేస్తున్నదెవర్ని ? డిపార్ట్‌మెంట్‌నా ? ప్రభుత్వాన్నా ? ప్రజల్నా?***

ముఖ్యంగా ప్రజల్ని డిపార్ట్‌మెంట్‌లోని కిందిస్థాయి ఉద్యోగుల - కానిస్టేబుళ్ల నిజజీవితమెలా వుంటుందో చెప్పాలని ఈ నవల చదివాక కానిస్టేబుళ్ల జీవితం మీద సానుభూతి ఏర్పడిందని ఎందరో చెప్తున్నారు జీవన పరిస్థితుల్లో కిందిస్థాయికి చెందిన వాళ్లయిన కానిస్టేబుళ్లను ఆ సామాన్య ప్రజల నుంచి దూరంగా వుంచటానికి ప్రభుత్వం, వ్యవస్థ ప్రయత్నం చేస్తుంది దాన్ని బయటపెట్టడం నా ఉద్దేశ్యం ఈ దోపిడీ వ్యవస్థ తన మనుగడకోసం తయారు క్రమంలో ట్రెయినింగ్ అంటారు ఇంకోటంటారు ఏ పేరుతోనైతేనేం ముఖ్యంగా వాళ్ల ఉద్దేశ్యం ఈ శాఖను ముఖ్యంగా లోయర్ కాడర్‌ని తన కవసరమైన యంత్రాల్లాగా తయారుచేసుకోవటం, ఆ విధానాన్ని గురించి, వాళ్లకేం తెలీకుండా, తెలిసినా

స్పందించటానికి ఎదిరించే హక్కుల్లేకుండా వాళ్లను బానిసల్ని చేశారు, బయబ్రాంతుల్ని చేశారు అదికారులకూ రాజకీయ నాయకులకూ ఉపయోగపడే యంత్రాలుగా తాము ఎలా వున్నారో చాలామంది కానిస్టేబుళ్లకు తెలీదు తెలిసినవాళ్ళు కూడా కావాలనే దాన్నలా వుంచుతున్నారు అది చెప్పటం నా ఉద్దేశ్యం

***ప్రజావుద్యమాలనేవాటికి పోలీసు అదికారుల్ని, కానిస్టేబుళ్ళనీ వేర్వేరుగా చూసే అవగాహన వుందంటారా ?***

లేదు ప్రజావుద్యమాలు నడుపుతున్న వాళ్ళు కూడా దీనిమీద సరైన అబిప్రాయం వుందనుకోవడం లేదు నేను దోపిడీ మేదావివర్గం ప్రయత్నపూర్వకంగానే పోలీసువ్యవస్థలో అదికారులనూ, కిందివాళ్లకూ వున్న వైరుద్యాల గురించిన అవగాహన కలగకుండా చూస్తుంది ప్రగతిశీల ఉద్యమాలు తమ సాహిత్యంలోనో, సైద్ధాంతికంగానూ కానిస్టేబుళ్ళు కూడా సామాన్య ప్రజలేనని చెప్తున్నా, ఆచరణలో ఆ బేదాన్ని అంతగా గుర్తించి ప్రవర్తించడం లేదు

***మొదటిభాగంలోని కథను రాయటానికి మీ ఫాదర్ నాటినుండీ ఈ డిపార్ట్‌మెంట్‌లో వున్న సంబంధం ఉపకరించిందా ?***

ప్రదానంగా నా జీవితంలోని అనుభవాలే ఈ నవలకు ఆదారం ఐతే మా ఫాదర్ జీవితం కూడా తెలీటం వల్ల, ఆ రోజుల్లో బ్రిటీష్ హయాంలో పోలీసులుగా వాళ్ల అనుబవాలూ, ఆలోచనలూ కూడా తెలుసుకోగలిగాను బ్రిటీష్‌వాళ్ళు పోతే తమ జీవితాలు మారుతాయని ప్రజలందరితోపాటు కిందిస్థాయి పోలీసులూ అనుకున్నారు వాళ్ల కష్టాలు పోలేదు, ప్రజల కష్టాలూ పోలేదు ఆనాడు బ్రిటీష్ పాలకులకు అనుకూలంగా వుండే యంత్రాలుగా పని చేశారు ఇప్పుడూ అదే పరిస్థితే తప్ప బ్రిటిష్ పోలీస్‌కంటే ఈ పోలీసులు ప్రజలకు మరింత శత్రువులుగా మారే పరిస్థితులే ఏర్పడ్డాయి తప్ప, మంచి మార్పులేమీ జరగలేదని చెప్పదల్చుకున్నాను

***పోలీసు వ్యవస్థలో సంస్కరణలు జరగాలని కొందరు ఐ ఏ ఎస్ , ఐ పి ఎస్ లూ, రాజకీయనాయకులూ ప్రతిపాదిస్తున్నారు మీరూ మీ నవల ద్వారా పోలీసువ్యవస్థలో మార్పులు జరగాలంటున్నారు ఈ రెండు మార్పులూ ఒక రకమైనవేనా ?***

మాటలు ఒకటే కానీ, లక్ష్యంలో తేడా వుంది రాజకీయ నాయకులూ, ఐ ఏ ఎస్ ఆఫీసర్లూ కోరే మార్పు ప్రజల కనుకూలదిశలో జరగాల్సిన మార్పు కాదు వాళ్లకు అంటే దోపిడీవర్గాలకు మరింత రక్షణ కలిగించేలా పోలీసువ్యవస్థ మారాలనేది వాళ్ల కోరిక అందుకనువుగా మరింత సాంకేతిక పరిజ్ఞానం, కమ్యూనికేషన్ సిస్టమ్, వైర్‌లెస్‌లు సరఫరా చెయ్యటం, అధునాతన ఆయుధాలనివ్వటం, వెహికల్స్ సప్లై చెయ్యటం, ఎక్కువ అధికారాలివ్వటంలాంటి మార్పులే వాళ్ళు కోరుకుంటున్నారు మౌలికంగా ఇవేం ప్రజలకు మేలు చేసేవి కాదు నేను కోరుకునే మార్పేమిటంటే ప్రజలనుంచి పన్నులరూపంలో వసూలు చేసిన డబ్బే పోలీసులకు జీతంగా అందుతోంది కాబట్టి పబ్లిక్ సర్వీస్ చేయాలి అంటే పేదప్రజలకు న్యాయం జరిగేలా చూడాలి అందుకు డిపార్ట్‌మెంట్‌లో రాజకీయనాయకుల జోక్యాన్ని నిరోధించాలి ఉదాహరణకు వరకట్నం నిషేధించటానికి చట్టం చేసింది అవినీతి నిరోధానికి చట్టాలున్నాయి అలాగే పోలీసు డిపార్ట్‌మెంట్ అటానమస్ బాడీగా వుండాలి నిధులిచ్చే పనివరకే ప్రబుత్వం చేయాలి దాని పరిపాలనలో జోక్యం చేసుకునేందుకు వీల్లేదు అందులో జరిగే లోపాలనూ, నేరాలనూ చట్టబద్ధంగానే విచారించాలి చట్టబద్ధమైన శిక్షలుండాలే తప్ప, రాజకీయ నాయకుల వ్యక్తిగత ఇష్టాలకోసం, పోలీసులమీద చర్యలు

తీసుకునే పద్ధతులుండకూడదు అలాంటివాటికి బలయ్యేది ప్రధానంగా కిందిస్థాయి పోలీసులే

పోలీసుస్టేషన్లలో ఎన్నో ఘోరాలు జరుగుతున్నాయి ప్రజలకు రక్షణ మృగ్యమైపోయిందన్నది నిజం దానికి రకరకాల సంఘాలనుంచి నిజనిర్ధారణ కమిటీలు ఏర్పడి విచారిస్తున్నాయి ఒక పోలీసు స్టేషన్లో వందమంది స్టాఫ్ వున్నారంటే, వంద మందీ ఆ స్టేషన్‌లో జరిగే నేరాలను సమర్థించేవాళ్ళు కాదు చాలామంది నిజానికి పేదవర్గాల నుంచే వస్తారు కాబట్టి, ప్రజల మీద దౌర్జన్యాలు చెయ్యటానికి మానసికంగా వ్యతిరేకులుగానే వుంటారు కానీ దాన్ని వ్యక్తం చెయ్యటానికి వాళ్ళకు అధికారాల్లేవు ఎవరయినా ఒక కానిస్టేబుల్ సాహసించి, "మా పోలీస్‌స్టేషన్లో ఒక అధికారి ఫలానా అమ్మాయితో అసభ్యంగా ప్రవర్తించాడు లేదా ఫలానా వ్యక్తిని ఏ రాజకీయ నాయకుడి ప్రయోజనం కోసమో హింసించి చంపాడు" అని బయటికొచ్చి బహిరంగంగా సాక్ష్యం చెప్పటానికి వీల్లేనిస్థితి వుంది తనకు తెలిసిన ఆ నిజాలను న్యాయస్థానం ముందుకో నిజనిర్ధారణ కమిటీ ముందుకో తీసుకెళ్ళినా, తనకేమీ హాని జరగదనే గ్యారంటీ వున్న పరిస్థితులుండాలి చట్టాలకే తప్ప వ్యక్తులకూ, అధికారులకూ భయపడాల్సిన అవసరం లేదని నమ్మకాన్నిచ్చే పరిస్థితులుండాలి తను చెప్పిన ఒక సాక్ష్యం వల్ల అతనిమీద అధికారులు కానీ, వాళ్ళద్వారా పలుకుబడిగల వ్యక్తులు కానీ కక్ష సాధింపు చర్యలు సాగించనిస్థితి వుండాలంటే పోలీసులకు యూనియన్ వుండాలి అతను తన ఉద్యోగానికి సంబంధించిన సమస్యలను పరిష్కరించుకోవాలన్నా, ప్రజలకు నిజంగా మేలు చెయ్యగలిగేలా వుండాలన్నా ఈ రకమైన మార్పులు రావాలి అలా కాకుండా పోలీసులకు నిక్కర్ల బదులు పాంట్లు ఇవ్వటమో, టోపీల్లో బూట్లల్లో మార్పులు చెయ్యటమో, వెహికల్స్ ఇవ్వటమో, అలవెన్సులు పెంచటమో ఇలాంటివి మాత్రమే ప్రకటించుకోవటం ద్వారా సంస్కరించటం సాధ్యం కాదు ఆ మార్పులు ప్రజలకూ, పోలీసులకూ కూడా మేలు చేసేవి కావు ప్రజలతో, పోలీసులకు నిజమైన మానవసంబంధాలనేర్పరచే మార్పుల్ని నేను కోరుకుంటున్నాను

**ఎపిసిఎల్‌సి వాళ్ళని కూడా నేనొకటి అడగదల్చుకున్నాను** వాళ్ళు పోలీస్‌స్టేషన్లలో పౌరహక్కులకు భంగం కలగటాన్ని ప్రశ్నిస్తున్నారు మంచిదే కానీ, కానిస్టేబుల్ కూడా ఈ సమాజంలో ఒక పౌరుడే ఐతే, ఆ విషయం అతనికి స్పృహలో కూడా లేనంతగా, యంత్రంగా, బానిసగా మార్చబడుతున్నాడు పౌరహక్కుల గురించీ, మానవ సంబంధాల గురించీ, వ్యక్తి స్వేచ్ఛ గురించీ, ఆత్మాభిమానం గురించీ అతనికి తెలీదు మనిషికి అవన్నీ అవసరమన్న స్పృహ అతనిలో చచ్చిపోతోంది తనకే తెలీని ఆ విలువల్ని, ఎదుటివ్యక్తికి అతనేం అందిస్తాడు? వాటికి భంగం కలిగితే ఏం స్పందిస్తాడు ? వాడికి సి ఎల్స్ లెవ్వు, పనిగంటల నియమాల్లెవ్వు భయంకరమైన, అవమానకరమైన పనిష్మెంట్లతో వ్యక్తిత్వం చచ్చిపోయింది, అతనిని పట్టించుకునేవాళ్ళు లేరు చట్టాన్ని కాపాడే ఉద్యోగం చేసే వాడికి చట్టమంటే ఏమిటో తెలీదు దాన్ని కూడా పౌరహక్కుల సంస్థలు ఆలోచించాలని నేను కోరుతున్నాను డిపార్ట్‌మెంట్‌లో అత్యధిక శాతంగా వుండే కానిస్టేబుళ్ళు మనిషి లక్షణాలే పోగొట్టుకునే చాకిరీలో వుండి మరో మనిషి హక్కుల్నేం గౌరవిస్తారు ? వాళ్ళూ మనుషులుగా బతికే పరిస్థితి ఏర్పడితే తప్ప, ప్రజలకూ, పోలీసులకూ సంబంధాలు మెరుగుపడవని నేననుకుంటున్నాను

***నవల ముందుమాటలో మీరు ప్రజాస్వామ్యాన్ని కాపాడుతున్న పోలీసును ఎవరూ పట్టించుకోరేమిటనిప్రశ్నించారు కానీ నవల మొత్తంలోరాసిన సంఘటనలన్నీ ఈ దేశంలోప్రజాస్వామ్యం లేదని నిరూపించేవే అసలు మీరు కోరే ప్రజాస్వామ్యం ఎలాంటిది ? పోలీసువ్యవస్థ మరికొంత సంస్కరించబడేదా ? పోలీసులు పూర్తిగా అవసరమే లేనిదా ?***

పోలీసు వ్యవస్థ లేనిదీ, పోలీసులతో అవసరం లేనిదే నేను కోరుకునే ప్రజాస్వామ్యం ప్రజలే ఆ విధుల్ని స్వచ్ఛందంగా నిర్వహించుకునే వ్యవస్థ కావాలి ఆ వాక్యంలో నేను ప్రజాస్వామ్యం అనే మాటని అంత ఖచ్చితమైన అర్థంలో వాడలేదు ఇప్పుడున్న పరిస్థితుల్లో నా వాదనను హేతుబద్ధంగా చెప్పటానికి వాడానంతే

***ప్రజలకూ, పోలీసులకూ మధ్య సంబంధాలను నిర్ణయించటంలో పోలీసుల పనివిధానానికి ఎలాంటి పాత్ర వుంటుంది ?***

ఆ రెంటికీ చాలా ముఖ్యమైన సంబంధమే వుంది ఉదాహరణకు బ్రిటన్‌లోని పోలీసును "ఫ్రెండ్లీ పోలీస్" అంటారు ఇతర దేశాలకంటే ఆ దేశంలో పోలీసులకూ ప్రజలకూ మంచి సంబంధాలుంటాయంటారు ఇది రెండురకాలుగా సాధ్యపడుతుందని నేననుకుంటున్నాను ఒకటి రాజ్యానికీ, ప్రలజకూ ఘర్షణ తీవ్రస్థాయిలో లేని సామాజిక, రాజకీయ పరిస్థితులుండటం, రెండు పోలీసులకూ, ఇతర ప్రజల జీవిత పరిస్థితులకూ ఎక్కువ అంతరం లేకపోవటం

మనదేశంలో వున్న సామాజిక అంతరాలు, కులంద్వారా, మతం ద్వారా ప్రజలను రాజ్యం కంట్రోలు చేసే పరిస్థితులూ బ్రిటన్‌లాంటి దేశాల్లో లేవు అందువల్ల సమాజంలో మనదేశంలో వున్నంత ఘర్షణ, అశాంతి, ఉద్యమాలూ లేవు దీనివల్ల పోలీసుల బ్రూటాలిటీని మనదేశ ప్రజలు అనుభవిస్తున్నంత దారుణంగా అక్కడి ప్రజలు అనుబవించటం లేదనుకుంటున్నాను అందువల్ల పోలీసులు ప్రజలతో కొంత స్నేహంగా వుండటం వీలవుతుందేమో

కానీ మనదేశంలో రాజ్యం, రకరకాల అణచివేత రూపాలను ప్రయోగిస్తుంది ప్రజలమీద వాటన్నిటినీ పోలీసువ్యవస్థ ద్వారా అమలు చేస్తుంది ఆ అణచివేతను ప్రతిఘటించటం ప్రజల తక్షణావసరమవుతుంటే దాని నుంచి ప్రజావుద్యమాలు పుడతాయి వివిధసెక్షన్ల ప్రజల రాజకీయ చైతన్యమూ పెరుగుతుంది అది పెరిగేకొద్దీ రాజ్య నిర్బంధమూ పెరుగుతుంది ఈ మొత్తం క్రమంలో పోలీసులు చాలా హింసాత్మకమైన పాత్ర నిర్వహించేలా చేస్తుంది రాజ్యం పోలీసులు అలా వుండటంకోసం వాళ్లలో వ్యక్తిత్వం ఎదగకుండా ఒక పథకాన్ని రూపొందిస్తుంది ప్రజల చైతన్యం పెరిగినట్టే పోలీసుచైతన్యమూ పెరుగుతుంటే ఇది సాధ్యపడదు కిందిస్థాయి పోలీసులకు కొంత తీరిక సమయమూ, మెరుగైన ఆర్థిక పరిస్థితీ, సామాజిక గౌరవమూ వుంటే వాడిదృష్టి సాహిత్యం మీదికీ, సామాజిక సమస్యలమీదికీ, ఇతర అభిరుచుల మీదికీ మళ్ళొచ్చు ఆ క్రమంలో సహజంగానే తనతోటి ప్రజల అంటే పేదల, దళితుల పోరాటాల మీద సానుభూతి కలగవచ్చు వాళ్లకు వ్యతిరేకంగా పనిచెయ్యలేకపోవచ్చు అందుకే ముందు జాగ్రత్తగా పోలీసునొక యంత్రంగా మారుస్తున్నారు మానవ సహజమైన ఏ అనుభూతులూ, విలువలూ తనకు మిగలకుండా ఇతరుల్లో గుర్తించలేకుండా తయారు చేస్తున్నారు తన ఆర్థిక అవసరాల కోసం, అధికారాన్ని ప్రదర్శించి, అహం తృప్తి పరుచుకోవటం కోసం ప్రజలమీద జులుం చేసేలాగా తప్పనిసరిగా మారేట్టుగా చెయ్యటం దోపిడీవ్యవస్థ ప్రయోగించే ఒక ఎత్తుగడ ఆఫీసర్లు చూపించే కోణంనించే ప్రజల్ని చూస్తారు కిందిస్థాయి ఉద్యోగులు వాళ్లకింకో ప్రపంచం తెలీదు ప్రజల ఉద్యమాలన్నీ ఒళ్ళు బలిసినవాళ్ళు చేసే దుర్మార్గాలని ఆఫీసర్లు పదేపదే చెప్పిందే వాళ్ల బుర్రల్లో నిండిపోయి వుంటుంది అందుకే తనలాంటి వాళ్లే అయిన పేదప్రజల ఉద్యమాలపై నిర్దాక్షిణ్యంగా దాడి చెయ్యగల యంత్రాలుగా ప్రవర్తిస్తారు

ఫలితంగా ప్రజల్లో ఆ వృత్తిమీద అసహ్యం పెరుగుతుంది కానీ, పెరుగుతున్న ఆర్థిక సంక్షోభంవల్లా నిరుద్యోగంవల్లా ఈ ఉద్యోగాల్లోకి రాకతప్పదు డబ్బున్నవాళ్ళెవరూ కిందిస్థాయి పోలీసులుగా రారు పేదవాళ్ళకు కూడా ఈ పనంటే వ్యతిరేకతే తప్పనిసరిగా మాత్రమే చేరుతారు ఇదంతా ఒక ప్లాను ప్రకారం జరుగుతుంది

***దళితకులాల నుంచీ, పేద కుటుంబాల నుంచీ వచ్చిన ఆఫీసర్లు అగ్రవర్ణాల ఆఫీసర్లకంటే కిందిస్థాయి ఉద్యోగులతో సానుభూతిగా వుంటారా ?***

ఏమాత్రం వుండరు మరింత క్రూరంగా, నిర్దాక్షిణ్యంగా వుండటం కూడా నాకు తెలుసు అంతవరకూ వాళ్ళల్లో ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌ని కొత్తగా దొరికిన ఈ అధికారం ద్వారా తీర్చుకోవాలనుకుంటారు దానికోసం ప్రభుత్వానికి మరింత విధేయులుగా మారాలి తాము వచ్చిన జీవిత నేపథ్యంనుంచి, తమను తాము వేరుచేసుకోవాలి అలా తమ విధేయతను నిరూపించుకునేందుకు మరింత నిర్దాక్షిణ్యంగా ప్రవర్తిస్తారు

***మీరు కోరుకునే చట్టపరమైన సంస్కరణలేమిటి ?***

ఐ ఏ ఎస్, ఐ పి యస్ ఆఫీసర్లు ఒక అన్యాయం చేసినప్పుడు దాన్ని కోర్టులో చాలెంజ్ చేసేలాగా చట్టాల్లో మార్పులు చెయ్యాలి రాజకీయ నాయకుల ప్రమేయాన్ని పూర్తిగా నిరోధించాలి ఒక ఎమ్ పి నో, ఎమ్ ఎల్ ఏ నో తలుచుకుంటో కానిస్టేబుల్ నించి ఎస్ పి స్థాయి ఆఫీసర్ వరకూ ట్రాన్స్‌ఫర్లకూ, ఇతర వేధింపులకూ గురవ్వాల్సిందే ఇతర డిపార్ట్‌మెంట్లలో యింత సులభంగా ఉద్యోగులమీద శిక్షలు విధించటం కుదరదు ఈ స్థితివల్ల ఎక్కువగా కానిస్టేబుళ్ళు కొన్నిసార్లు సిన్సియర్ ఆఫీసర్లు కూడా బలయిపోతున్నారు యాంత్రికంగా మారిపోతున్నారు

***నక్సలైట్లకూ, పోలీసులకూ మధ్యన చర్చలకోసం శాంతిసంఘం ఏర్పడాలన్న ప్రతిపాదన గవర్నర్ నుంచి వచ్చింది కదా ! అది సాధ్యపడుతుందంటారా ?***

సాధ్యమైతే కొంత ప్రయోజనం వుంటుంది పూర్తిగా ఘర్షణ ఆగిపోతుందని కాదు ఆర్థికంగా, రాజకీయంగా ఇవే పరిస్థితులు కొనసాగుతుండగా పూర్తిస్థాయి శాంతి కేవలం చర్చలతో సాధ్యపడదు ప్రభుత్వం చిత్తశుద్ధితో ప్రయత్నం చెయ్యాలి

***పోలీసుల హింసలో కానిస్టేబుళ్ళ వ్యక్తిగత బాధ్యత ఏమీ లేదా ?***

అందరు కానిస్టేబుళ్ళూ వ్యక్తిగతంగా ప్రజా వ్యతిరేకులు కాదు తను చేస్తున్న హింసను మనస్ఫూర్తిగా చేస్తున్నవాళ్ళు కాదు అతని ఉద్యోగ పరిస్థితులూ, తప్పనిసరిగా చెయ్యాల్సిన హింస, ఆర్థిక ఒత్తిళ్ళూ, ఏమాత్రం సున్నితత్వానికి చోటులేని వాతావరణం వాళ్ళను మొరటువాళ్ళుగా చేస్తున్నాయి చాలా దారుణమైన, అసహ్యించుకోదగిన పనులే చేస్తున్నారు ఫలితంగా ప్రజల కోపానికీ, అసహ్యానికీ గురై ఒంటరివాళ్ళవుతున్నారు ఆ నిస్పృహతో మళ్ళీ ప్రజలపై హింస చేస్తున్నారు ఇదో వలయం ప్రజలు పోలీసులను భయంగా చూస్తారు వాళ్ళ కుటుంబాలతో సంబంధాలకు ఇష్టపడటం లేదు సహజమే కానీ ఇదంతా ఒక పథకం ప్రకారం జరుగుతున్న కుట్ర

***లేడీ కానిస్టేబుల్స్ పరిస్థితి మరీ దారుణంగా వుంది కదా ! మగ కానిస్టేబుల్స్ కూడా వాళ్ళపై అధికారం చెలాయిస్తున్నారని ఆరోపణలున్నాయి మీరేమంటారు ?***

మగవాళ్ళే ఈ ఉద్యోగాల్లోకి గతిలేక వస్తున్నారంటే ఆడవాళ్ళ పరిస్థితి చెప్పనక్కరలేదు అతి పేద కుటుంబాలనుంచీ, దళితుల నుంచీ మాత్రమే ఆడపిల్లలు కానిస్టేబుల్ ఉద్యోగాల్లోకి వస్తారు కుటుంబ పరిస్థితులవల్లా, ఆడవాళ్ళుగా మొదటినుంచీ చిన్నచూపు చూడబడటంవల్లా, అప్పటికే ఆత్మవిశ్వాసం లోపిస్తుంది వాళ్ళలో ఆపైన ఈ డిపార్టుమెంట్‌లోని అధికారం ఎలాగూ వుండనే వుంది ఆడవాళ్ళను హీనంగా చూసేతత్వం ఇంటా, బయటా మొత్తం సమాజమంతటా వున్నట్టే, ఇందులోనూ వుంది ప్రజలు కూడా మగపోలీసుల్నిలాగా, ఆడపోలీసుల్ని లెక్క చెయ్యరు

***ఈ నవల రచనల వల్ల డిపార్ట్‌మెంట్‌నించి ఇబ్బందులు కలగలేదా ?***

వేధింపులు మొదలయ్యాయి అవి నేను ముందుగా ఊహించినవే నేనందులో కొందరు ఆఫీసర్లూ, అగ్రవర్ణాలవాళ్ళూ కూడా ఎంతో ప్రగతిశీల భావాలతో వుండటాన్ని చిత్రించాను అలాగే కొందరు చేసే దారుణాలూ చెప్పాను అన్నీ వాస్తవాలే వాటిని సరిగ్గా చూడగలిగితే అపార్థం చేసుకోవాల్సిన అవసరం రాదు నిజానికి

***కానిస్టేబుళ్ళ మధ్య ఐక్యతకోసం దళిత ఉద్యమాలూ, ఇతర, ప్రజాఉద్యమాలూ ఉపయోగపడతాయా?***

తప్పకుండా వుపయోగకరమే ఐతే ఒక సామాన్య పౌరుడిని చైతన్యవంతం చేసినంత త్వరగా కానిస్టేబుల్‌ని ఏ ఉద్యమాలూ చైతన్యవంతం చెయ్యవు వాళ్ళ మెదళ్ళు అలా కొన్ని చట్రాల్లో బిగిసిపోయి వున్నాయి కొత్త విషయాలని తెలుసుకునే తీరికా, ఓపికా, అభిరుచులూ మిగలవు ఏ టెన్త్ క్లాసో, ఇంటరో అయిపోగానే, చిన్న వయసులో చేరుతారు అప్పటినుంచీ ఒకే భావాలు నూరిపోస్తారు

***మీ ఉద్యోగ నిర్వహణలో బాగా డిస్టర్బ్ చేసిన సంఘటనలు ఏమయినా వున్నాయి ?***

నా మొదటి పోస్టింగ్ చిలకలూరిపేటలో చాలా చిన్న వయసు నాది ఆ వూరు వ్యభిచారానికి పేరు పడ్డది ఆడవాళ్ళను స్టేషనుకు తీసుకురావటం, అవమానించటం, వాళ్ళ దరిద్రం, ఆకలి దారుణంగా వుండేది చాలా బాధ కలిగేది

వ్యక్తిగతంగా నాకు ఎదురవకపోయినా, తోటి ఉద్యోగుల అనుభవాలు చాలా చూశాను కేవలం అనుమానంమీదో, రాజకీయ ఒత్తిళ్ళతోనో అమాయకులను ఆఫీసర్లు పిలిపించటం, హింసించటం యాంత్రికంగా అలా పిల్చుకురావటానికీ, కొట్టటానికీ మానసికంగా హింసపడిన ఎందరో సహోద్యోగులను చూశాను అవన్నీ నవల్లో చోటుచేసుకున్నాయి

***ఈ రచన చెయ్యటం గురించి మీ కుటుంబసభ్యులెలా ఫీలయ్యారు ?***

నా భార్య చాలా భయపడింది నన్ను అరెస్ట్ చేసి తీసికెళ్తున్నట్టుగా కలలొచ్చాయని నిద్రలో లేచి ఏడ్చేది మా అమ్మ కూడా ఇలాంటి పిచ్చిపన్లు చేస్తే చచ్చిపోతానని గొడవపెట్టేది నీకు పిల్లలున్నారు, పెళ్ళాం వుంది వాళ్ళనెట్లా బతికిస్తావు ? ఇదంతా నీకెందుకనేది వాళ్ళను మెంటల్‌గా ప్రిపేర్ చెయ్యటం కూడా నాకు అవసరమైంది ఇప్పుడు వాళ్ళూ అర్థం చేసుకున్నారు రచయితగా నాకో గుర్తింపు రావటం నా భార్యకు చాలా ఆనందం కూడా కలిగించింది

***పుస్తకానికి రెస్పాన్స్ ఎలా వుంది ?***

చాలా బావుంది నేను కోరుకున్న రెస్పాన్స్ వస్తోంది మీ నవల చదివాక కానిస్టేబుళ్ళ గురించి మా దృష్టిలో మార్పు వచ్చిందని చాలామంది చెప్తుంటే సంతోషంగా వుంది ఆఫీసర్లనూ కిందిస్థాయి ఉద్యోగులనూ వేరుచేసి చూడటానికి ప్రయత్నిస్తున్నామని చెప్తున్నారు రెండోభాగం రాసే ప్రయత్నంలో వున్నాను పోలీసు వ్యవస్థలో నేను కోరే కొన్ని మార్పుల్ని అందులో ప్రతిపాదించాలనుకుంటున్నాను నా కేడర్‌నించి నవలకు మద్దతు వున్నప్పటికీ, దాన్ని బహిరంగంగా వ్యక్తం చెయ్యలేని స్థితిలో వున్నారు వాళ్ళు

***ఈ రచనవల్ల ఇబ్బందులు ఎదుర్కొంటుంటే, రాసినందుకు పశ్చాత్తాపం లాంటిదేమన్నా కలుగుతోందా?***

లేదు నేను దళితుడినయినందుకూ, కానిస్టేబుల్‌నయినందుకూ నాలాంటి వాళ్ళ జీవితాల గురించి, వాళ్ళకేమాత్రమయినా ఆలోచన కల్గించగలగటం ఆనందంగా వుంది అది నేను నిర్వర్తించి తీరాల్సిన బాధ్యతనే అనుకుంటున్నాను

నేను చట్టబద్ధంగా ఏ తప్పూ చెయ్యలేదు దాన్ని నిరూపించుకోగలను కానిస్టేబుల్‌కి చట్టబద్ధంగా వుండే స్వేచ్ఛనూ, హక్కుల్నీ తెలియచేసే ఒక పుస్తకం రాయాలని కూడా అనుకుంటున్నాను పోలీసులు వాళ్ళ సమస్యల మీద పోరాడిన సందర్భాల చరిత్రను కూడా రాయాలనుకుంటున్నాను దానివల్ల నాలాంటి కిందిస్థాయి ఉద్యోగులకు నైతికంగా మద్దతు దొరుకుతుంది

***ఇప్పటికే పోలీసువ్యవస్థ ప్రజలతో దౌర్జన్యపూరితంగా వ్యవహరిస్తోందని మీరే అంగీకరిస్తున్నారు మీరు కోరుతున్నట్టు యూనియన్లేర్పడితే అది మరింత పెరిగే అవకాశం లేదా ?***

నిజమే కొన్ని సందర్భాల్లో వుండొచ్చు వాటిని చట్టబద్ధంగా విచారించి చర్యలు తీసుకోవాలి యూనియన్లను అలా ఉపయోగించుకునే అవకాశం లేని విధంగా కూడా చట్టాన్ని సవరించాలి మొత్తంమీద కొన్ని నష్టాలు వున్నప్పటికీ, సామాన్య పోలీసులకు ప్రాథమిక హక్కులయినా దొరకాలంటే యూనియన్లుండటం అనివార్యం

***నక్సలైట్లకూ, పోలీసులకూ మధ్య జరిగే పోరాటంలో భాగంగా ఆఫీసర్లకంటే ఎక్కువమంది కానిస్టేబుళ్ళే చనిపోవాల్సి రావటాన్ని ఎలా అర్థం చేసుకుంటున్నారు ? అలా చంపటం సరైందేనా ?***

దాని వెనకున్న పాలసీ గురించి నేనేం వ్యాఖ్యానించలేను కానీ, ప్రత్యేకమైన ఉత్సాహంతో ఎన్‌కౌంటర్లతో, లాకప్ హత్యలు చేసే పోలీసుల్ని ఆఫీసర్లయినా, కానిస్టేబుళ్ళనైనా ఐడెంటిఫై చేసి, వాళ్ళూ, వాళ్ళూ పోట్లాడుకోవటాన్ని అర్థం చేసుకోవచ్చు కానీ, ఏ హానీ చెయ్యని, అమాయకుల్నీ, నిరాయుధుల్నీ చంపటం సరైంది కాదు వాళ్ళు వర్గశత్రువులవుతారా అనేది మళ్ళీ ఆలోచించుకోవాలి

**- ఇంటర్వ్యూ, ఫోటోలు - మురళి**



'సుప్రభాతం'
సామాజిక రాజకీయ పక్ష పత్రిక
5. సెప్టెంబర్ 1997

# 'విముక్తి' కోసం ఓ పోలీస్ పోరాటం

**వర్తమాన సమాజంలోని పీడనను, దోపిడీని గురించి నవల రాసినందుకు పోలీస్ హెడ్‌కానిస్టేబుల్ జి మోహనరావు మరింత పీడనకు, వేధింపులకు గురవుతున్నారు ఉన్నతాధికారుల వేధింపు నుంచి విముక్తి కోసం న్యాయం కోసం పోరాడుతున్నారు**

పోలీసుల దైనందిన జీవనానికి అద్దం పట్టిన 'ఖాకీ బతుకులు' నవలా రచయిత జి మోహన్‌రావు (కలం పేరు స్పార్టకస్) తన తొలి నవలతోనే రాష్ట్ర వ్యాప్తంగా, ముఖ్యంగా పోలీసు వర్గాల్లో తీవ్ర సంచలనం కల్గించారు సాదారణ కానిస్టేబుల్ వర్తమాన పోలీసు వ్యవస్థ చట్రంలో ఇరుక్కుని ఎలా నలిగిపోతున్నాడో, అవమానాల పాలవుతున్నాడో 'ఖాకీ బతుకులు' నవలలో రచయిత కళ్ళకు కట్టినట్టు చిత్రించారు ఈ నవల పోలీసు వ్యవస్థ క్రమశిక్షణ నిబంధనలకు విరుద్ధమని పేర్కొంటూ, ఉన్నతాదికారులు రచయితకు షోకాజ్ నోటీసు ఇచ్చారు తర్వాత బదిలీ చేశారు 'ఖాకీ బతుకులు' కేవలం ఫిక్షన్ మాత్రమేనని, ఎవరినీ నొప్పించే ఉద్దేశంతో తను ఈ నవల వ్రాయలేదని పుస్తకం పీఠికలో వివరించినా, పోలీసు ఉన్నతాదికారులు తనను వేధింపులకు గురిచేస్తున్నారని మోహనరావు అన్నారు ఆయన గుంటూరు జిల్లా తెనాలిలో స్పెషల్‌బ్రాంచ్‌లో హెడ్‌కానిస్టేబుల్‌గా పనిచేస్తున్నారు ఇటీవలే ఆయనను 'దుర్గి'కి బదిలీ చేశారు

పోలీస్ బతుకుల మీద ఇంతకుముందు కొన్ని పుస్తకాలు వచ్చాయి సాధారణ పోలీస్ ఉద్యోగుల దైనందిన జీవితంలోని లోటుపాట్లను, దారిద్ర్యాన్ని, ఉన్నతాదికారుల దౌర్జన్యాలను, పీడనను, పోలీస్ కానిస్టేబుల్స్ హీనమైన బతుకులను ఈ పుస్తకంలో కళ్ళకు కట్టినట్టు చిత్రించారు ముఖ్యంగా కె ఎన్ వై పతంజలి రాసిన 'ఖాకీవనం' పోలీస్ చిరు ఉద్యోగుల వెట్టిచాకిరిని వివరంగా చిత్రించింది అలాగే ఇప్పడు మోహన్‌రావు నవలలో కూడా జీవితంలోని చేదువాస్తవాలను మనసుకు హత్తుకునేట్టు రాశారు ఈ నవల వాస్తవిక ధోరణిలో కళాత్మకంగా సాగింది నవలలో చిత్రించిన వివిద ఘట్టాలు పాఠకులను విపరీతంగా కదిలించాయి

**కళాత్మక విలువలతో రాసిన ఒక నవలను నవలగా చూడక పోలీస్ ఉన్నతాదికారులు అందులో ఏవేవో అర్థాలు వెతికి మోహనరావును వేధిస్తున్నారు అసలే అనారోగ్యంగా ఉన్న వ్యక్తిని కక్షసాధింపు చర్యలతో ఇబ్బంది పెడుతున్నారు మోహనరావు ఈ దురన్యాయాన్ని ఎదిరించి పోరాడుతున్నారు** వేధింపునకు స్వస్థి చెప్పాలని కోరుకుంటున్నారు బదిలీలు, ప్రత్యేక డ్యూటీల ఫలితంగా ఎన్నో అవస్థలు పడుతున్న మోహనరావును 'సుప్రభాతం' ఇటీవల కలిసింది ఈ సందర్భంగా మోహనరావు అనేక అంశాలు వివరించారు ఇక ఇంటర్వ్యూ చదవండి

***ఈ పుస్తకం రాయాలని ఎందుకు అనిపించింది?***

పోలీసులంటే ప్రజలకు గల అపోహలను తొలగించాలని, పోలీసులూ మనుషులేనని వారికీ అందరివలెనే సమస్యలు, బాధలు వుంటాయని ప్రజలకు తెలియజెప్పి, ప్రజల, పోలీసుల మధ్య సదవగాహన పెంపొందించాలన్న లక్ష్యంతో నవల రాశాను

***దీనికి ప్రేరణ ఎవరు ?***

నా తండ్రి ప్రకాశరావు పోలీసుగా పనిచేసి హెడ్‌కానిస్టేబుల్‌గా రిటైరయ్యారు ఆయనకు ఎదురైన అనుభవాలు పోలీసు ఉద్యోగంలో చేరాక నాకు ఎదురైన సంఘటనలు, ఇతరుల అనుభవాలు నన్ను ఈ పుస్తకం రాసేలా ప్రేరేపించాయి

***పుస్తకం రాసే ముందు అధికారుల అనుమతి తీసుకొన్నారా ?***

ఆంధ్రప్రదేశ్ సివిల్ సర్వీసెస్ (కాండక్ట్) నిబంధనల 13వ అంశం కింద స్పష్టంగా వుంది 'ఎవరైనా సాహిత్య కళారూపాలను రాయవచ్చు, అచ్చువేయవచ్చునని' పోలీసు అధికారులు నాయర్, అరవిందరావు రావులపాటి సీతారామారావు సదాశివరావు ఎస్ వేణుగోపాలరావు ప్రభృతులు చాలా పుస్తకాలు రాశారు అసలు పోలీసు శాఖ ఆధ్వర్యంలో నడుస్తున్న "సురక్ష" అనే మాసపత్రికలో ఎందరో అధికారులు రాస్తుంటారు కనుక రాయడం నిబంధనలకు విరుద్ధం కాదు

***అటువంటప్పుడు ఈ నిబంధనల కింద మీకు నోటీసు ఎలా ఇచ్చారు ?***

గుంటూరు జిల్లా ఎస్‌పిగా రాజీవ్ త్రివేది ఉన్నప్పుడు ఆ షోకాజ్ నోటీసు ఇచ్చారు దానికి నేను జవాబిస్తూ పై అంశాన్ని వారి దృష్టికి తెచ్చాను ఈ పుస్తకం నేను ఎవరినీ కించపరచడానికి వేయలేదు అదే వారికీ చెప్పాను

***ఈ పుస్తక రచన ఎప్పుడు ప్రారంభించారు ?***

1980లో ప్రారంభించి 1983లో పూర్తి చేశాను దాన్ని ప్రచురించడానికి 13 సంవత్సరాలు పట్టింది పుస్తక ప్రచురణలో ఓల్గా, రంగనాయకమ్మ సలహాలు ఇచ్చారు కొందరు ప్రచురణ కర్తల షరతులు నాకు అంగీకారం కాకపోవడంతో నేనే ప్రత్యూష పబ్లికేషన్స్ పేరిట అచ్చువేశాను ఈ పుస్తకావిష్కరణ 1996 డిసెంబర్ ఆరవ తేదీన ప్రముఖ రచయిత బొల్లిముంత శివరామకృష్ణగారి చేతుల మీదుగా జరిగింది

***తరువాత ఏం జరిగింది ?***

1997 జనవరి చివరి వారంలో గుంటూరులో జరిగిన స్పెషల్ బ్రాంచ్ కానిస్టేబుల్స్ మీటింగ్‌లో నా పుస్తకం ప్రస్తావన తెస్తూ, "నువ్వు రాసిన పుస్తకంలో అధికారులను కించపరిచావు చాలా మంది నిరసన తెలిపారు కనుక అభ్యంతరకరమైన భాగాలను తొలగిస్తానని పత్రికలో ప్రకటన ఇవ్వు" అన్నారు "నా పుస్తకంలో అభ్యంతరకరమైన అంశాలేమిటో చెప్పండి తొలగిస్తాను" అని జవాబిచ్చాను అప్పటి నుంచి నామీద కక్షసాధింపు చర్యలు ప్రారంభమయ్యాయి

***ఏ చర్యలు తీసుకొన్నారు ?***

మధుమేహ వ్యాధితో బాధపడుతున్న నన్ను మాచర్ల వెళ్లమన్నారు అక్కడ రాడికల్స్ కదలికలపై ఎప్పటికప్పుడు ప్రతి ఊరు నుంచి ఫోన్లు చేయమని ఆదేశించారు ఇలా రెండు నెలలు ఊళ్ళ వెంబడి తిరిగే డ్యూటీలు వేశారు చివరకు 1997 ఫిబ్రవరి 11వ తేదీన నాకు రేడియో మెసేజి ఇస్తూ, తెనాలి వెళ్లే పనిలేదు ఎ ఎస్ పి దగ్గర రిపోర్టు చేసి జిల్లా అంతా స్పెషల్ డ్యూటీ చేయమన్నారు ఇలా జిల్లా అంతా స్పెషల్ డ్యూటీ ఎవరికీ వేయరు నాకుమాత్రం వేశారు

***మరేం చేశారు ?***

ఫిబ్రవరి 18న హైదరాబాద్‌లో ట్రిబ్యునల్‌కు వెళ్ళి రేడియో మెసేజిపై ఫిబ్రవరి 21న స్టే తీసుకుని, ఆ మరునాడు స్టే ఆర్డర్ ఎస్‌పి గారికి ఇచ్చాను అయినప్పటికీ నర్సరావుపేట,

వినుకొండ మాచర్ల సర్కిల్స్‌కు వెళ్లమని ఆర్డర్ వేశారు స్టేను ఖాతరు చేయలేదు నేను 20 రోజులు అలాగే డ్యూటీ చేశాను ఆరోగ్యం సరిగా లేనందున తర్వాత సెలవు పెట్టాను

***మీపై అవినీతి ఆరోపణలున్నట్టు ఎస్ పి అంటున్నారు ?***

పాస్‌పోర్ట్ దరఖాస్తుదారుల వివరాల సేకరణ నా విధి 1997 జనవరి 2న నాతో ఘర్షణకు దిగిన కొందరు వ్యక్తులు నామీద కేసు పెట్టారు ఇందులో నేను అవినీతికి, లంచాలకు పాల్పడినట్టు పేర్కొన్నారు ఇది ఆరోపణ తప్ప వాస్తవం కాదు తర్వాత 1997 మేలో నన్ను దుర్గి బదిలీ చేశారు

***మీరేం చేశారు ?***

సెలవు కొనసాగిస్తూ మెడికల్ లీవ్‌లో ఉన్నప్పటికీ జీతం ఆపారు అడిషనల్ ఎస్ పి ని కలిశాను తర్వాత జీతం ఇచ్చారు ఈ వేదింపు చర్యలు వద్దని 20 మంది ప్రవాసాంధ్రులు ముఖ్యమంత్రికి లేఖ రాశారు అయినా సరే ఏ ఫలితం కనిపించలేదు ఆంధ్రప్రదేశ్ పోలీసు ఆఫీసర్ల అసోసియేషన్‌ను కలిసి అడిగాను కానీ వారేమీ పట్టించుకోలేదు

***బదిలీలు పోలీసుశాఖలో మామూలేకదా ?***

ఐదేళ్ల సర్వీసు పూర్తి కానిదే బదిలీ చేయరాదని నిబంధన వుంది పైగా నన్ను కక్షసాదింపు చర్య కింద బదిలీ చేయడం అన్యాయం బదిలీలపై నిషేదంవున్న సమయంలో నన్ను బదిలీ చేశారు 97 మే నెలలో ఈ నిషేదం తొలగించారు

***మీరు తెనాలిలో ఎన్నేళ్ళుగా ఉద్యోగం చేస్తున్నారు ?***

తెనాలి పట్టణంలోని వివిద పోలీసు స్టేషన్లలో తొమ్మిది సంవత్సరాలుగా మొదటి మూడేళ్ళు ట్రాఫిక్ విభాగంలో ఉన్నాను తర్వాత లా అండ్ ఆర్డర్ విబాగం మూడేళ్ల నుంచి స్పెషల్ బ్రాంచిలో వున్నాను వ్యవది ఇంకా రెండేళ్ళు వుండగానే పుస్తకం కారణంగా దుర్గి లా అండ్ ఆర్డర్‌కు బదిలీ చేశారు

***మీ భవిష్యత్ కార్యక్రమం ?***

హైకోర్టు ప్రదాన న్యాయమూర్తికి వాస్తవాలను వివరిస్తూ విజ్ఞాపన పత్రాన్ని పంపుకొందామనుకుంటున్నాను అలాగే మానవ హక్కుల కమిటీలోను, ఎస్ సి , ఎస్ టి లపై వేధింపుల నిరోధక విబాగానికి కూడా లేఖ లిద్దామని భావిస్తున్నాను

***పోలీసు వ్యవస్థలో మీరు కోరుతున్న మార్పులేమిటి ?***

పోలీసు శాఖలో అధికారుల వైఖరి మారి ప్రజలు పోలీసు శాఖ అంటే బద్రత కల్పించే శాఖ అని భావించే రీతిలో తీర్చిదిద్దాలి రాజకీయ జోక్యం నిరోదించాలి **హెడ్ కానిస్టేబుల్స్, కానిస్టేబుల్స్‌కు ఒక గుర్తింపు ఉన్న సంఘం వుండాలి** ఇలా చేస్తే లంచాలు, లాకప్ డెత్‌లు తగ్గుతాయి జీతభత్యాలు, పనిగంటలపై 'దర్మవీర్ కమీషన్' నివేదిక అమలు చేయాలి క్రమశిక్షణ పేరుతో, కింది స్థాయి పోలీసు ఉద్యోగుల్ని భయం గుప్పిటిలో ఉంచుతున్నారు పోలీసు అంటే చెప్పిన పని చేసే యంత్రంలా వుండాలని భావిస్తున్నారు ఇది మారాలి ఇలా జరిగితే ప్రజలకు, పోలీసు శాఖకు కూడా మంచి జరుగుతుందన్నది నా వ్యక్తిగత అభిప్రాయం

**- వుయ్యూరు వెంకటరావు**

**ఫోటో ముమ్మినేని నాగేశ్వరరావు నవభారత్ ఫోటోస్టూడియో, తెనాలి**



ఆంధ్రభూమి
తెలుగు దినపత్రిక
12, డిశంబర్ 1997
సా హి తి

# కమర్షియల్ రచయితల ఖ్యాతి కలకాలం నిలవదు

తెలుగు సాహితీవనంలో ఇటీవలనే వికసించిన ఓ పారిజాతం "ఖాకీ బతుకులు" నవల **మన రాజకీయ నాయకులూ, ఉన్నతాధికారులూ మాటల్లో ఎంత అభ్యుదయాన్ని పలికినా, చేతల్లో విశాల దృక్పథం లేనివాళ్లనే విషయాన్ని ఖాకీ బతుకులు నవలా రచయిత మోహనరావు విశదం చేసారు** సాహిత్యాన్ని గూర్చి రాజకీయాల్ని గూర్చి ఈ రచయితతో ఇష్టాగోష్ఠిగా సాగిన ఇంటర్వ్యూని క్లుప్తంగా ఆంధ్రభూమి పాఠకుల కోసం

***ప్ర 1983 మొదటి అర్ధభాగానికే పూర్తయిన నవల వెలుగు చూడడానికి పుష్కర కాలానికి పైగా పట్టింది కారణం ?***

***జ*** రాత ప్రతిని మిత్రులు చూడడానికే చాలాసమయం తీసుకుంది వారపత్రికల వాళ్లు పరిశీలించటానికి సంవత్సరాలు పట్టింది దాన్ని సీరియల్‌గా వెయ్యటానికి ఎన్నో అబ్జెక్షన్లు పెట్టారు కొందరు పబ్లిషర్స్ దగ్గర కూడా నెలల తరబడి వుండిపోయింది వాళ్లు సూచించిన మార్పులకు నేను అంగీకరించలేదు ఇక నేనే వేసుకోవాల్సి వచ్చింది అందుకు తగిన ఆర్థిక స్తోమతను పోగు చేసుకోవటమే ఒక యజ్ఞమైంది

***ప్ర అధికారుల వత్తిడివల్లనో, విధి నిర్వహణలో భాగంగానో పోలీసులు సామాన్య ప్రజానీకాన్ని వేధిస్తున్నట్లు చిత్రించారు కానీ, కానిస్టేబులు తనకు తానుగా పుణికిపుచ్చుకున్న కాఠిన్యం, దమననీతి మొ వాటిని గురించి రాయకుండా దాచిపెట్టారనే విమర్శ వచ్చింది కదా ! మీరేమంటారు ?***

***జ*** కానిస్టేబులు ప్రవర్తనను అనేక అంశాలు ప్రభావిత పరుస్తాయి వాటి ప్రభావానికి లోనైనవాళ్లు ఎవరైనా ఇంచుమించు అలాగే ప్రవర్తిస్తారు ఏ వ్యక్తీ కాఠిన్యాన్నీ, దమననీతినీ పుట్టుకతో తెచ్చుకోడు అలాటి ప్రవర్తన వాళ్లకు నేర్పబడిద్ది నేరస్థులు పుట్టుకతోనే నేరస్థులు కారనేది ఎంత సత్యమో ఇదీ అంతే ఆస్తిని పోగుచేసుకోమని చెప్పే వ్యవస్థ, ఆ వ్యవస్థలో జీవించే ప్రతి వ్యక్తికీ ఆ కాఠిన్యాన్నీ, దమన నీతినీ నేర్పుతుంది వ్యవస్థ స్వరూప స్వభావాలు తెలుసుకుని వాటిని ప్రతిఘటించేవారు వారివారి చైతన్య స్థాయినిబట్టి అలాటి కాఠిన్యతకూ, దమననీతికీ ఎరకాకుండా వుంటారు

***ప్ర అక్రమ సంపాదనపై ఆపేక్షే కానిస్టేబులు క్రూరత్వానికి కారణం పనివత్తిడీ, అధికారుల నిరంకుశత్వం అనేవి సెకండరీ కారణాలే మీరేమంటారు ?***

***జ*** అక్రమ సంపాదన అని మనం దేనిననాలో దాన్ని అనటం లేదు ప్రభుత్వం ఇచ్చే జీతం మాత్రమే సక్రమ సంపాదన అనుకుంటే పొరపాటు దోపిడీదారుడి సంపాదనే అక్రమ సంపాదన చిన్నచిన్న ఉద్యోగుల అక్రమ సంపాదన 'పీడన' క్రిందకు వస్తుంది ప్రజల్ని పీడించే స్థితికి ఈ ప్రభుత్వాలు క్రింది తరగతి ఉద్యోగుల్ని నెడతాయి ఈ క్రింది స్థాయి ఉద్యోగులకు అక్రమ సంపాదన ఆపేక్ష కాదు, అనివార్యం

***ప్ర ఈ రోజుకీ కులవ్యవస్థ డిపార్టుమెంటులో వుందా ?***

***జ*** ఎందుకు లేదు ? ఏ డిపార్టుమెంటులో లేదు ? ఈ సమాజంలో వున్న అన్ని అవలక్షణాలూ అన్ని డిపార్టుమెంటుల్లోనూ వుంటాయి కుల వివక్షతే కాదు పేద, ధనిక వ్యక్తుల పట్ల వివక్షత, స్త్రీ పురుషుల ఎడల వివక్షత, ఇలా ఎన్నో అన్నీ ఈ సమాజంలోని ప్రజల్లో వున్నయ్యే

***ప్ర దళిత దృక్పదంతో సాహిత్యం వెలువడటం, మన రాష్ట్రంలో ముఖ్యంగా 1985 కారంచేడు సంఘటన తరువాత ముందుకొచ్చింది చుండూరు సంఘటన తరువాత చెప్పుకోదగిన వ్యక్తిత్వంతో కనిపించింది. కాని 1980లలోనే మీరు దళిత దృక్పథంతోనే ఈ నవల ఎలా రాయగలిగారు ?***

***జ*** స్త్రీల సమస్యలు స్త్రీలకే సరిగా పట్టనిరోజుల్లో గురజాడ, చలంలు స్పందించారు ఒక సమస్యపై ఉద్యమాలు, ఆందోళనలు జరిగాక ఆ సమస్యలు ప్రస్ఫుటంగా సాహిత్యంలో ఫోకస్ అయ్యే మాట నిజమే కానీ సంఘ సంస్కర్తల, ప్రజాకళాకారుల విషయంలో వాళ్ల ఆలోచనలు సగటు సమాజపు ఆలోచనలకూ, దాని అడుగులకూ ముందే వుంటాయి 1941లోనే దళిత సమస్యను ప్రపంచం ముందు పరిచారు గుర్రం జాషువా

***ప్ర ఇలాంటి రచన చేసిన మీకు కమర్షియల్ రచన లెఖ్ఖలోనిది కాదు డబ్బు సంపాదనకీ, రచయితగా పేరు తెచ్చుకోవడానికీ అలాంటి రచనల ద్వారా ఇప్పుడు మంచి అవకాశాలు వున్నాయి కదా***

***జ*** ఇది వ్యక్తిత్వాలకు సంబంధించిన ప్రశ్న కమర్షియల్ రచయితలకు వచ్చే పేరు శాశ్వతమైనది కాదు ఆ డబ్బు కూడా ఆ రచన బ్రతికున్నంతవరకే అలాటి రచనల లైఫ్‌స్పాన్ చాలాచాలా తక్కువ తెలుగు సాహిత్యంలో చలం, కొకు, శ్రీశ్రీ రంగనాయమ్మ, రావిశాస్త్రి, గోపీచంద్, చాసో, జాషువా, గురజాడలు శాశ్వతపేర్లు సంపాదించుకున్న వాళ్లు వారి రచనలు తరతరాలుగా పునర్ముద్రిత మవుతున్నాయి అలా చూసినా కమ్మర్షియల్ రచయితల కంటే వీరి రచనలే ఎక్కువ డబ్బు సంపాదిస్తున్నాయి

***ప్ర డిపార్టుమెంటులో మీరు ఎలాటి మార్పుల్ని సూచిస్తున్నారు ?***

***జ*** నేను కొత్తగా ఏమీ సూచించడం లేదు పోలీసు డిపార్టుమెంటులో దేశవ్యాప్తంగా రావాల్సిన మార్పులను గురించి కమిషన్లు చెప్పాయి సుప్రీంకోర్టు సలహాలు ఇచ్చింది 'దర్మవీర' అధ్యక్షతన ఏర్పాటైన నేషనల్ పోలీస్ కమిషన్ సిఫార్సులను తక్షణమే అమలుచేయాలని కిరణ్‌బేదీలాంటి పోలీసు ఆఫీసర్లు ఎప్పటినుండో డిమాండ్ చేస్తున్నారు

పోలీసు డిపార్టుమెంటులో రాజకీయ నాయకుల ప్రమేయాన్ని నిరోధించాలంటే దాన్ని స్వయం ప్రతిపత్తి కలిగిన డిపార్టుమెంటుగా మార్చాలని సుప్రీంకోర్టు అమూల్యమైన సలహా ఇచ్చింది డిపార్టుమెంటులో అధికారుల నియంతృత్వాన్ని ఎదుర్కోడానికి క్రిందిస్థాయి ఉద్యోగులైన కానిస్టేబుళ్లు, హెడ్ కానిస్టేబుళ్లకు సెపరేట్ అసోసియేషన్ చట్టబద్ధంగా వుండాలి **పోలీసు కానిస్టేబులు తన స్వంత మెదడుని ఉపయోగించే పరిస్థితి రావాలి**

***ప్ర మీ నవలపై అధికారుల వైఖరి ఎలా వుంది ? కానిస్టేబుళ్ల స్పందన ఎలా వుంది ?***

***జ*** తుడిచిన అద్దంలో తమ ప్రతిబింబాన్ని చూసుకొని లోయర్ కేడర్ ఆలోచనలో పడింది అధికారుల్లోనూ ప్రజాస్వామ్య బావాలున్నవాళ్లు అభినందించారు కొందరు అధికారులు నన్ను కష్టాలకు గురిచేస్తున్నారు

*ప్ర మరి ఇంక మీ గురించి ఎవరూ పట్టించుకోలేదా ?*

*జ* మా అసోసియేషన్ గొడ్డుపోయినంత మాత్రాన దేశంలో స్పందన లేకపోలేదు పత్రికలూ పాత్రికేయులూ తమ బాధ్యతను మరిచిపోలేదు తెలుగు రచయితలూ కళాకారులూ వారి సంఘాలూ మేదావులూ సంపాదకులూ తమ నైతిక మద్దతు తెలిపారు

తమ నిరసనని నిర్భీతిగా వెల్లడించారు **అమెరికాలోని ముప్పయి ఆరుమంది తెలుగు సాహితీ ప్రియులు, స్వీడన్ నుండి అనేక రచయితల సంఘపు పన్నెండు మంది నాపై అధికారుల చర్యలకు స్పందిస్తూ తమ నిరసనను తెలియజేస్తూ సీయమ్‌కూ గవర్నర్‌కూ, సెంట్రల్ హోం మినిష్టరుకూ ఉత్తరాలు రాశారు**

***ప్ర మార్క్సూ, అంబేద్కర్ ఆలోచనలతో మీరు ఏకీభవిస్తున్నారని అన్నారు కదా మార్క్సిస్టులు కుల సమస్యను పట్టించుకోలేదనీ, అంబేద్కరిస్టులూ, వర్గ సమస్యను పట్టించుకోలేదనీ ఒకరినొకరు విమర్శించుకుంటున్నారు మీ అబిప్రాయం***

*జ* నిజమైన కమ్యూనిస్టులూ నిజమైన అంబేద్కరిస్టులూ అన్ని సమస్యలనూ పట్టించుకుంటున్నారు ఈ పేర్లతో ముసుగులు వేసుకున్న వ్యాపార మేదావులు పట్టించు కొంటున్నది దోపిడీదారుల ప్రయోజనాల్నే

***ప్ర దళితవాదం, స్త్రీవాదం అంటూ వస్తున్న వాదాలపై మీ అబిప్రాయం ?***

*జ* త్వరలో ఏ కులపువాళ్లు ఆ వాదాన్ని తీసుకొస్తారు ఎవరి సమస్యను వారు వినిపించడం మంచిదే కానీ సమస్యలకు మూల కారణాన్ని ఈ వాదులు పట్టించుకున్న దాఖలాలు చాలా అరుదుగా కనిపిస్తోంది **ఈ తరహా వాదాలు దోపిడీ వర్గాలకు మేలు చేకూరుస్తాయి**

**- కురగంటి రఘురామయ్య**



# 4. ఉత్తరాలు.

మద్దూరి నగేష్‌బాబు

కవి

నరసరావుపేట, గుంటూరు జిల్లా

20-2-1997

Dear నాగేశ్వరరావుగారూ

క్షేమం

మీరు కదా !

నిన్ననే ఖాకీ బతుకులు complete చేశా ఇక మోహన్‌గారికి ఉత్తరం రాయకుండా వుండటం నావల్లకాదు

ఆయన అడ్రసు తెలీదు

అందుకే మీకు పంపుతున్నా

దయచేసి ఆయనకు అందించగలరు

With kind regards

మద్దూరి నగేష్‌బాబు

ప్రియమైన మోహన్‌రావు గారికి -

'దళిత నవల' ఇంకా రాలేదన్న నా దిగులు తీరుస్తూ వచ్చిన 'ఖాకీ బతుకులు' ఈ రోజే చివరి పేజీలోంచి నన్ను బైటికి విసిరేసింది తెలుగులో ఒక Roots, ఒక అంకుల్ టామ్స్ కేబిన్ లేని లోటు ఖాకీబతుకుల్తో భర్తీ చేశేశారు మీరు

నవలంతా చదివాక నేను ఒక జీవితాన్ని ముగించినట్లయ్యింది ఒక జీవితాన్ని పరిపూర్ణంగా చెప్పగలగడం సామాన్యమైన పనేంకాదు - అలాగని ఖాకీబతుకులు ఒక జీవితానికో, ఒక పోలీసు దళితుల జీవితానికో మాత్రమే కాదు యావత్ దళిత ఉద్యోగుల బతుకుల్ని అక్షరీకరించింది

నవల చదివాక ఈ నవల మీ తొలినవలంటే చాలా విచిత్రంగా అన్పించింది మీ గుండెల్లోతుల్లో భగభగమంటున్న ఆవేదన పరిమాణం మీ నవల - సారీ మా నవల

'ప్రకాశం' ఇంతవరకూ ఏ ప్రగతివాద రచయితా చిత్రించలేని ఒక సజీవపాత్ర ఈ పాత్రమీద psychological Research చేయాల్సిన అవసరం ఎంతయినా వుంది ఒక అట్టడుగు స్థితినుండి ఉద్యోగిస్వామ్యంలో అట్టడుగు దశకి ఒక జాతి transform అయ్యేదశలో ఎదుర్కొన్న అనుభవాల్ని ఎక్కడా రాజీపడకుండా రాశారు భారత వ్యవస్థలో వేళ్లూనుకున్న 'కుల'పిచ్చ వికృతరూపాన్ని చాలా సమర్థవంతంగా చిత్రీకరించారు ఏ నవల రాయటానికైనా గొప్ప ప్రతిభ అవసరం లేదేమోగానీ ఇలాంటి నవల రాయటానికి మాత్రం ఎంతో ప్రతిభ కావాలి ! ఆ ప్రతిభ మీదికాదు, మీలో మిమ్మల్ని Crush చేస్తున్న కులపీడన తాలూకు సెన్సిటివ్ అనుభవాలది దళితులకు ప్రతిభ లేదనే వాడి మొకం మీద సీల దిగేసినట్లు ఖాకీ బతుకుల్లో ప్రతి అక్షరమూ వుంది

మరి ముఖ్యంగా పాత్రల భాష చదువుతుంటుంటే మా తాతలు మా అయ్యలూ మా పల్లెలూ అంటు మనసు ఒక్కసారిగా మన పల్లెలవైపు ఎగిరిపోయింది  దళిత కవులు మీనుండి భాష విషయంలో నేర్చుకోవాల్సింది చాలా వుంది

ఈ నవల చదివాక పోలీసులెవరూ క్రూరంగా కనపట్టం లేదు  ప్రతి కానిస్టేబులూ ఒక ప్రకాశంలాగే కనపడితే ప్రతి అధికారీ బహుదుర్నేర్గుడిలా కనిపిస్తున్నాడు

ప్రకాశం ట్రైనింగు మధ్యలో తన ఊరికెళ్లినప్పటి అనుభూతి హేలీ తన పూర్వీకుల్ని వెదుక్కుంటూ ఆఫ్రికా లోతుల్లోకి వెళ్లినప్పటికన్నీ చాలా గొప్పగా వుంది  ఇప్పటికీ నన్నూ నా ఉద్యోగాన్ని చూసి మెరిసే నా పల్లెకళ్లలో తళుకులా నేనొక ఉద్విగ్నతకు లోనైనా ఆ సన్నివేశం చదివి

అగ్రకులస్తుల్లో, తెల్లవాళ్లలో, పోలీసు అధికారుల్లో కూడా కొందరు మంచివాళ్లుంటారన్న మీ అభి ప్రాయం చాలా బాగుంది  అయితే పోలీసుని అంత కర్కోటకుడిగా మారుస్తున్న ఆర్థిక స్థితుల్ని చాలా గొప్పగా analyse చేశారు  ఇప్పటివరకూ సమాజంలో ఒక negative పాత్రగా ఉంటూ వచ్చిన పోలీసుకి otherside ఇంత దయనీయంగా వుంటుందా అన్న angle కొత్తది  ఖాకీవనం కొంత చూపగలిగినా ఇంత fresh గా లేదది  బహుశా పతంజలి outsider అవ్వడం మూలాన్నేమో !

నాగేశ్వరరావుగారి నుండి నవల అందగానే ముందు నేను చదవకుండా ఒక ఐదుగురి చేత చదివించి వాళ్ల అభిప్రాయాలు తీసుకున్నాను  వాళ్లు different sects of people  ఒకరు దళితులు, ఒకరు శూద్రులు, ఒక దళిత ఉద్యోగి, ఒక అగ్రకులస్తులు ఇంకొకతను ప్రగతివాది  అందరూ తమ తమ అభిప్రాయాలు చెప్పేశాక వాటినలా పక్కన పెట్టి నేను చదివాను  చదివాను అనేకన్నా అనుభ వించాను అంటే కరెక్ట్‌గా సరిపోతుంది

వాళ్లు చెప్పిన అనుభవాలు వాళ్లవాళ్ల basics లో నుండి వచ్చాయి  Even దళితులు కూడా నవలలో వున్న depth ని analyse చేయలేక పోయారు  (బహుశా నేను కూడా అంతగా పట్టించుకోలేనేమో ఎందుకంటే ఎవరి aesthetic limits వాళ్లకుంటాయి కదా !)

అయితే 800 పేజీల నవలలో ఎక్కడా bore కి తావులేకుండా రాయటం  అదీ ఇలాంటి Dry subject ని తీసుకు రాయగలగటమే నాకు చిత్రం అన్పించింది

కొంతమంది 'రచన' పలావు తిన్న తర్వాత వేసుకునే రామ్‌ప్యారీ, కొంతమందికి నిండనున్న పర్స్ మరికొంతమందికి రిస్క్  అయితే వీటన్నింటికీ భిన్నంగా మీరు జీవితాన్నే రిస్క్‌గా నిర్వహించుకుని చేసిన గొప్ప సాహసం ఈ నవల

పొగడ్తలకేం చాలామంది పొగుడుతారు  అయితే ఆ పొగడ్తలు తెచ్చే క్రియ ఎంతో Dangerous అయివుండి కూడా చేయడమే గొప్ప committment  ఆ కమిట్‌మెంట్ మీలో మీ నవల్లో వాక్యవాక్యాన కనిపిస్తుంది  **అతిశయోక్తి అనకుంటే తెలుగులో తొలి నవలా రచయిత మీరే !** ఇప్పటివరకూ నవలల పేర వచ్చిందంతా వట్టి చెత్త including రంగనాయకమ్మ and so on

తమదికాని జీవితం గురించి ఒకానొక transలో రాసే ఏదైనా అది తేలిపోతుంది  ఒక సామాజిక వాస్తవాన్ని Art చేయాలంటే అది అనుభవానికే సరిపోతుంది కానీ అనుభూతి, సానుభూతికీ అందదు

మీరు ప్రకాశం కాకపోవచ్చు - కానీ మీరు ప్రకాశమే !  బహుశా మీరు దళిత పోలీసు **అయివుండకుండా వుంటే తెలుగు సాహిత్యం ఇంత గొప్ప కృతిని miss అయ్యేదేమో !**

**ఖాకీ బతుకులు మీద చాలా పరిశోధన జరగాల్సి వుంది**  నేనే వీలుచూసుకుని ఒక రెండొందల పేజీల Socio-Pscyological thesis రాస్తాను  అది నా బాధ్యత  అయితే అలాగే రెండో భాగాన్ని అక్కడితో ఆగకుండా దళిత జీవన వాస్తవికతను ప్రతిబింబించే రచనలు regular గా చేయడం మీ

Dalit responsibility అని మాత్రం మర్చిపోవద్దు బహుశా 'ఖాకీ బతుకులు' మరికొన్ని దళిత నవలలు రావటానికి ఎంతో దోహదకారిగా మిగలవచ్చు ఈ నవల ఇచ్చే ఉత్తేజంతో దళిత రచయితలు ఒక కొత్త Expression అందుకుంటారు

మీ పుస్తకం చూసి తెలుగు రచయితలు సిగ్గుతో తలదించుకోవాలి, ఇది కేవలం తెలుగుకే కాదు - overall ప్రపంచ సాహిత్యంలో ఒక అద్భుతమైన work - దయచేసి మన తెలుగు ' ఏడుతరాల్లో' ఎవరైనా simplify చేస్తూ ఆత్మ చెడకుండా translate చేయగల అనువాదకులుంటే దయచేసి English లోకి translate చేయించండి - దాని publishing సంగతి నాకొదిలేయండి - లేదా ఆ publishing ద్వారా మీకు కొంత amount కూడా వచ్చే ఏర్పాటును చూస్తాను మీకా పరిచయాలుంటే ఏమీ పర్వాలేదు లేదా మన ఫ్రెండ్స్ పట్టుకు మనమే publish చేయొచ్చు మొత్తంమీద ఇది కేవలం తెలుగు పాఠకులకే పరిమితం కావడం నాకస్సలు ఇష్టం లేదు

ఇకపోతే ఖాకీబతుకులు కొన్ని negative approaches కలిగి వుంది Particularly in Dalit point of view

1) గోపాలం ఒకచోట లేచిన టైం బాగోలేదంటం

2) ప్రకాశం ఒకట్రెండుచోట్ల 'ఛండాలంగా' 'రాక్షసంగా' అనేపదాలు ప్రయోగించటం

అయితే పాత్రల స్థల, కాల, పరిమితులకు ఇవి exceptions కావొచ్చు అయితే Next part లో కానీ, మీ తర్వాత రచనల్లోగానీ అలాంటి పొరపాట్లు దొర్లకుండా జాగ్రత్త పడగలరు

ఇంత గొప్ప పనిచేసిన మిమ్మల్ని చూడాలని ఎంతో ఆశగా వున్న 'నవల' ఇచ్చే మీ రూపం చాలనిపిస్తోంది

నవల నిజానికి tragic ending కాకపోయినా నవలంతా ముగిశాక నేను ఒక గంట వెక్కిళ్ళు ఆపబట్టుకోలేకపోయాను Still that experience trembling my heart and my throat

జీవితం దేముంది -

కుక్కలాంటిది -

మనం 'ఛాయ్' అంటే తోక ముడుస్తుంది మనం భయపడితే గుర్రుమంటుంది

ఒరే మహారచయితా !

నీకూ, ఇంత గొప్ప రచన చేసిన నీ గొప్ప చేతులకూ నా ముద్దులు

రాసుకుపో - అలాగే వెనుదిరక్కుండా రాసుకుపో

ఈలోగా నీ ప్రతిభని చూసి బెంబేలెత్తిన బ్రాహ్మణవాదులు నీ character ని assassinate చేయాలని కుట్రలు పన్నుతారు

జర జాగర్తన్నా

నీ వాడు



డాక్టర్ కలశపూడి శ్రీనివాసరావు,
న్యూయార్క్, అమెరికా
13-7-1997

శ్రీ మోహన్‌రావుగారికి,

సాహితీరంగంలో కలకలం రేపినందుకు,
ప్రవాసాంధ్రులలో సంచలనం తెప్పించినందుకు,
ప్రశ్నించడం తెలియని ఖాకీల్లో ప్రశ్నలన్నీ కుప్పపోసినందుకు,
కృతజ్ఞతలు !
వాదాల, వివాదాల అగాధాలలో కూరుకుపోకుండా
వర్ణాల అంతరాల గాలానికి చిక్కుకుపోకుండా
మనిషిగా, మానవతావాద ఋషిగా, మమ్మల్ని కాపాడే పోలీసుగా
మీరు నిలబడాలని ఆశిస్తూ



దోనేపూడి మోహన్‌ప్రసాద్
కవి
రేపల్లె, గుంటూరు జిల్లా
10-12-1996

సాహితీ మిత్రులు శ్రీ జి మోహన్‌రావు (స్పార్టకస్) గారికి,

నమస్కారం మీరు అభినందనపూర్వకంగా పంపిన "ఖాకీ బతుకులు" ఆసాంతం చదివాను ఒక దశాబ్దం తరువాత ఇంత పెద్ద పుస్తకం చదవలేదు అసలు అంత తీరిక, ఓపిక నాకు లేవు. ఎనిమిది వందల పేజీల సైజులుకు వున్న మీ పుస్తకం ఆసాంతం చదివించింది అంటే మీరు రచయితగా మున్ముందుకే విజయం సాధించినట్లే! మీ రచన ద్వారా పోలీసు వ్యవస్థకు అద్దం పట్టారు ఆ శాఖలో పనిచేస్తూనే, దానిలోని లొసుగులన్నీ నిర్భయంగా చిత్రణ గావించిన మీ గుండె దిటవుకు జేజేలు

ముఖ్యంగా మీ రచన వాస్తవికతకు దర్పణం పట్టింది ఎన్నో సంఘటనలు సజీవంగా మీ రచన ద్వారా సాక్షాత్కరించాయి పల్లెలు, పల్లెపదాలు మీ రచనలో పరిపుష్టిత చెందాయి బిడ్డకు పాలు కుడపటానికి, కూలికెళ్ళిన తల్లికి వీలు కాకపోవడం, గుక్కపట్టిన బిడ్డ రోదనకు ఆ తల్లి యద పొంగి, పాలచుట్టలు చేలల్లో పడటం అనే మీ మధుర భావన నన్నెంతో ఆకట్టుకుంది అలాగే మాతృత్వపు మమకారం, భార్య వాత్సల్యం, బిడ్డల అనురాగం, స్నేహితుల ఓదార్పు వగైరా సన్నివేశాలు, సంభాషణలు నన్నెంతగానో ఆకర్షించజేశాయి 'ఖాకీ బతుకులు' కలకాలం వుండే రచనగా నేను భావిస్తున్నాను మీ

కృషి అభినందనీయం ఏదుగురు పాడింది పాట, ఏదుగురు నడిచింది బాట అలాగే చదివించగలిగేదే రచన, అని చెప్పక తప్పదు శృంగారం, బీభత్సం లాంటి వెకిలతనం లేకుండా అమ్మ తినిపించిన గోరుముద్దలాగా, ఆదిగురువు చెప్పిన పాఠంలాగా నైర్మల్యం లేని మీ రచనను నేను భావిస్తున్నాను అయితే ముగింపు ఎందుకో వెలితిగా కనిపించింది ఇది నా అవగాహన లోపమేమో।

"ఖాకీ బతుకులు" ఆవిష్కరణ సభా విశేషాలు పత్రికాముఖంగా చూశాను "వార్త" మంచి ప్రాధాన్యత యిచ్చింది సంతోషం ముందుగా తెలిస్తే సభకు వచ్చేవాడినే త్వరలో స్వయంగా కలిసి మాట్లాడుకుందాము మీకు హృదయపూర్వక అభినందనలు తెలుపుతున్నాను

ఇట్లు

మీ

[illegible]

---

శ్రీ రమణాశ్రమం

తమిళనాడు

27-9-1997

మోహన్‌రావ్,

మీ పుస్తకం ప్రారంభించాను చాలా గొప్పగా రాశావయ్యా గుండె తరుక్కుపోయే దిగులూ, దుఃఖం, పొట్ట పుబ్బేంత నవ్వూ - యీ రెండు భావాలతో నిండి వుంది పుస్తకం "ఏం గ్రంథం" ఇంత వుంది అని అడుగుతున్నారు రక్తంలేని, మాంసంలేని బొమికల గూళ్ళ చరిత్ర అన్నాను ఒక్కోచోట చదివితే, కోపంతో, ఒళ్ళు మండే వేడికి, హై ఫీవర్ వచ్చిందా అనిపిస్తోంది సుమా ఆ రోజు మీరు అంత శ్రమపడి యీ పుస్తకాన్ని యివ్వడం ఎంత బాగుందో వుండనా మరి

ఎప్పుడూ,

మీ నర్తకి

---

# 5. నవలపై అభిప్రాయాలు.

**'విశాలాంధ్ర'**
**దీపావళి ప్రత్యేక అనుబంధం**
**30, అక్టోబర్ 1997**

## సంచలనం సృష్టించిన 'ఖాకీ బతుకులు' నవల

గతంలో పతంజలి 'ఖాకీవనం' నవలిక యిలాగే సంచలనం సృష్టించింది ఆలోచనా, సమగ్రజీవన చిత్రణా ప్రదానాంశాలుగా భాసించే నవలా రూపంలో వస్తువు ఎప్పడూ ప్రముఖ స్థానాన్ని అక్రమిస్తుంది ఒక కథకో, కవితకో, నాటకానికో అయితే వస్తువు అసమగ్రంగానూ, నైరూప్యంగానూ ఉన్నా తమ శిల్ప చమత్కారంతో అవి రాణించగలవు కేవల శిల్ప చమత్కారంతో నవల రాణించటం దుర్లభం అందునా 800 పేజీల నిడివిగల 'ఖాకీ బతుకులు' వంటి (రచయిత జి మోహనరావు) నవలలో ఏ విషయం ఏ వివరాలతో ఏయేవర్గాల అభిరుచులను తాకుతూ సాగిందన్నది ఎవరికైనా ముఖ్యమైన సంగతే కేవలం వర్ణనలతోగాని, శైలి విన్యాసాలతోగాని, సరస భూయిష్ట చమత్కారాలతోగాని యింత పెద్ద నవల నడిపించటమూ, అవుననిపించటమూ జరగని విషయాలు వస్తు ప్రాదాన్యత యిలాంటి సందర్భాల్లో తిరుగులేని విషయమే

సమకాలీన జీవిత చిత్రణతో సాగే ఆదునిక నవలల్లో 'వస్తువు'లు అతి వాస్తవికంగా, అత్యంత సంఘర్షణాయుత చైతన్యంతో, విమర్శనాత్మక దృష్టితో ఆవిష్కరింపబడటం ఆశ్చర్యం కాదు అరుదుగా తాకబడే వస్తువులైతే అధిక ప్రాముఖ్యాన్ని సంతరించుకోవటమూ ఆశ్చర్యం కాదు పోలీసుల ప్రవర్తనా శైలిపైనా వారి పద్ధతులపైనా అడపాదడపా రావిశాస్త్రి లాంటి రచయితలు చెయ్యిచేసుకునే వున్నారు పతంజలి మొదటిసారిగా వారి ఆంతరంగిక నిర్మాణంలోని రహస్యాలు కొన్నింటిని బయటకు లాగటమూ అది కొందరికి కన్నెర్ర కలిగించటమూ జరిగింది ఇప్పడు మోహనరావు రాసిన 'ఖాకీ బతుకులు' మళ్ళీ సంచలనం సృష్టించింది

ఈ నవల కల్గించిన పాఠకలోక ఆసక్తికి వస్తువుతోపాటు మరిరెండు కారణాలున్నాయి రచయిత స్వయంగా పోలీసు కానిస్టేబులు ఉద్యోగం చేస్తూ రచన ద్వారా ప్రభుత్వంలోని ఉన్నతాదికారుల ఆగ్రహానికి గురవటం ఒకటీ, రచయిత దళితుడై పోలీసు వ్యవస్థతో దళితుని అదనపు కష్టాలను తొలిసారిగా ఏకరువు పెట్టటం మరొకటీ అయ్యాయి **రచయిత ఓం ప్రథమంగా రాస్తూనే యింతపెద్ద విషయాన్ని అంత నిడివిగల నవలగా రాయటం వలన కొన్ని శిల్పనిర్మాణపరమైన లోటుపాట్లు కూడా చోటుచేసుకున్నాయి** అవి ముందు చెప్పకోవటం ఎంతయినా అవసరం

1 ఉత్తమ నవలకు కావలసిన ఇతివృత్తంతోపాటు దాని ఆవిష్కరణకు కావలసిన పాత్రలనూ, సన్నివేశాలనూ, ప్రణాళికనూ సమకూర్చుకోలేదు తెలిసిన సమాచారం వరుసగా రికార్డు చేయబడింది

2 పోలీసు వ్యవస్థలోని లోటుపాట్లతో పాటు, ఆ వ్యవస్థను నడిపించే రాజకీయ హస్తం, ఉన్నతాధికారి విహంగ వీక్షణం, రాజ్యాంగ విధానం వంటి విషయాలను రచయిత స్పృశించలేదు

3 విషయం చివర తన శిల్పయాపాన్ని సంతరించుకోవటానికి సాహిత్య శిల్పంగా మలచటానికి వాడవలసిన జీవన మాధుర్యంలోని కొన్ని అంశాలను (ప్రేమ కరుణ లైంగికత మంచి చెడుల కలయిక మానవతాతత్వం ఆశయాలు) కలపవలసిన ప్రమాణంలో కలపలేకపోయాడు

4 నవలను అచ్చుకు ముందు సుప్రసిద్ధ రచయితలకు చూపించటం వలన వారి యిష్టాయిష్టాలమేర జరిగిన ప్రీ సెన్సారింగ్ ఫలితంగా కథ డాక్యుమెంటరీగా నడవటానికి దోహదం జరిగింది

ఈ నేపథ్యంలో ప్రకాశరావనే హరిజన కానిస్టేబుల్ జీవితమే నవలా యితివృత్తంగా తీసుకున్నాడు రచయిత కథను స్వాతంత్ర్య పూర్వరంగంలో నడిపించటం వలన ఆనాటికి యింకా జన్మించని రచయితకు నాటి సామాజిక వివరాలు కేవలం శృత సమాచారంగానూ, కొద్దిపాటి అధ్యయన సమాచారంగానే లభించాయి తప్ప అధికారం పొడసూపలేదు దరిమిలా హరిజనులపై నాటి పోలీసు వ్యవస్థలోని వివక్షకు తగినంత రూపురేఖలు కల్పించలేకపోయాడు కథాగమనం సాగి 1976 ఎమర్జన్సీని తాకినా యింకా ఆనాటికి పోలీసు వృత్తిలోకి ప్రవేశించని రచయితకు ఎమర్జెన్సీ వివరాలు కూడా స్థాలీపులాక న్యాయంగానే అందినట్లు కన్పిస్తుంది అయితే మౌలికమైన చిన్న పోలీసు అధికార్ల నిత్య జీవనం పూర్తిగా రచయితకు అవగాహన అయింది అయితే మొత్తం పోలీసు వ్యవస్థను స్పర్శించకుండా తన పరిధిలోని చిన్న ఉద్యోగుల (కానిస్టేబుల్, రైటర్, ఆర్డర్లీ, హెడ్ కానిస్టేబుల్, ఎస్ ఐ ) జీవనం ప్రధానాంశంగా నడిపించటం వలన నవలలో అసమంజసత్వమూ, అవాస్తవికతా కన్పించలేదు దాదాపు వారి సేవల వివరాలన్నీ స్పష్టంగా నమోదయ్యాయి కానిస్టేబుల్, అందునా హరిజన కులస్తుడు, నిరుపేదవర్గం నుండి వచ్చి చదువు రానివానిగా ప్రారంభించి చివరిదశలో బలవంతంగా ఉద్యోగం నుండి తొలగించబడటం వరకూ నవలలో చిత్రించటం జరిగింది 'మాలవాడివా' అంటూ అనునిత్యం ప్రజలూ, సహ ఉద్యోగులూ, పై అధికారులూ కించపర్చటం ఒక ఎత్తూ, చిన్న ఉద్యోగిని అధికారులు పెట్టే చిత్రవధ ఒక ఎత్తుగా ఇతివృత్తం సాగింది ఎడతెరిపి లేని డ్యూటీలు, తిండికి సైతం నోచుకోని రకరకాల ఉద్యోగధర్మాలు పెళ్ళాం బిడ్డలను వదలి నెలల తరబడి క్యాంపులూ, ప్రజలను చితకబాదే విద్యుక్త ధర్మాలు, నేరస్తులను చిత్రవధ చేసే నిర్బంధ కార్యక్రమాలు, చాలీచాలని జీతాలు, పై అధికారి అనే రాక్షసుడి క్రూర ఆదేశాల పరంపరలూ, తిరుగులేని 'డిసిప్లిన్' వ్యవహారాలు, అవసరమైనపుడు నిర్దాక్షిణ్యంగా బలియిచ్చే నోరులేని ఉద్యోగుల అసహాయ ఆర్తనాదాలు, ఉన్నతాధికారుల యిళ్ళల్లో వారి భార్యల బిడ్డల విచక్షణ లేని సేవా కార్యక్రమాలు, మానవత్వానికి చోటులేని పద్ధతులూ, నీతికి నిజాయితీకి రవ్వంత విలువలేని పోలీసు వ్యవస్థలోని సహజ లక్షణాలూ, వెరసి - క్రిందిస్థాయి పోలీసు జీవనాన్ని సవివరంగా, దాదాపు సమగ్రంగా, (కొండొకచో పునశ్చరన దోషంతో సహా) రచయిత చిత్రించగలిగాడు ఈ వ్యవస్థ ఎందుకిలా వుంది, ఎందుకు ప్రజాస్వామ్యయుతంగా, నాగరీకంగా సవ్యంగా వుండటం లేదు ఎందుకు ఎవరూ పట్టించుకోవటంలేదు ఈ బూతుల సర్వనామాల పిలుపులూ, యీ 'లకారాల' వీరవిహారాలు, 'దొర'గార్ల గౌరవ నామదేయాలూ అంతా యింకా బ్రిటీషు కాలంనాటి బానిసత్వ పద్ధతుల్నే అవలంభిస్తుంది ఈ వ్యవస్థ ఎందుకు బాగుపడదు అన్న ప్రశ్నను విజయవంతంగా లేవనెత్తాడు రచయిత సరిగ్గా అదే ఉన్నతాధికార్లకు కన్నెర్ర కావించింది వారిపై పెద్ద విమర్శ నవలలో లేకున్నా వారికి సున్నితంగా తగిలే ఒకటి రెండు అంశాలు చోటు చేసుకున్నాయి

1  ఉన్నతాధికారులు క్రింది ఉద్యోగులు అన్న విభజన నవల ఆసాంతం సాగింది ఉన్నతాధికారులకు విచక్షణ సమయానుకూలంగా రంగులు మారుస్తుంటుందన్నది ఒక అంశం

2  దినవారీ సేవల్లో వారు వారి కుటుంబాలు పోలీసు కానిస్టేబుళ్లను అమానుషంగా చూస్తుంటారన్నది రెండవ అంశం ఉన్నతాధికార్ల సతీమణుల్లో కొందరు నీతిరహితులూ, శీల రహితులూ అన్న సూచన మరొక ఆగ్రహ కారణాంశం

సర్వీసుల్లో ఉన్న కానిస్టేబుల్‌కు యిన్ని విషయాలు తెలియటం, పైగా దళిత వివక్షను స్పర్శించటం, ఏకంగా పోలీసు వ్యవస్థనే నిలదీస్తూ రాయటం, మధ్యమధ్యలో కమ్యూనిజం పట్ల తెలంగాణా పోరాటం పట్ల, అజ్ఞాతవాస పోరాటవాదుల పట్ల అభ్యుదయ ఉద్యమాల పట్ల సానుభూతి కనపర్చటం పుండుకు కారం రాసినట్లయింది పనిగట్టుకుని ప్రతి కానిస్టేబుల్‌నూ పరామర్శిస్తూ, వారిలో వివిధ వర్గాల బిన్నకులాల వారి కడగండ్లను ఏకరువు పెట్టటం అత్యంత అభ్యంతరకరంగా పై వారికి తోచటంలో ఆశ్చర్యం లేదు అందుకే రచయితను 'ఇక భరించటం సాధ్యం కాదని' నిర్ణయించుకున్నారు రచయితపైనా, రచన పైనా దాడిచేయ తలపెట్టారు నవల సంచలనానికి పరోక్షంగా కారణమయ్యారు

**- డా॥ చందు సుబ్బారావు**



**26-12-'97**
**University of Wisconsin,**
**Department of South Asian Studies,**
**Madison, Wisconsin, U S A.**

## ఈ నవల గురించి మరోమాట

ఒక చేపలవాడు ఒక బంగారపు ఉంగరం, రత్నాలు పొదిగింది, ఓ కంసాలి దగ్గరకు తెచ్చి అమ్మజూపుతాడు దానిమీద రాజుగారి పేరు చెక్కి ఉండటం చూసి, ఆ కంసాలి పోలీసులకి చెప్తాడు పోలీసులు ఆ జాలరిని పట్టుకుని వాణ్ణి చితక్కొట్టి ఈ వుంగరం నువ్వెక్కడ కన్నంవేసి తెచ్చావో చెప్పమంటారు వాడు మొత్తుకుంటాడు బాబోయ్ నన్ను కొట్టకండి, నేను దొంగని కాను, చేపలు పట్టుకొని బతికే జాలరివాణ్ణి, అని అతను ఇంకా ఏదో చెప్పబోతుంటే, పోలీసులు వాణ్ణి మాట్లాడనియ్యకుండా, 'దొంగ లంజాకొడకా, నీ కుల మెవడడిగాడురా, ఉంగరం ఎక్కడ దొంగతనం చేశావో చెప్పమంటే' అని మళ్ళీ కొడతారు ఓ పెద్ద పోలీసు అడ్డం వచ్చి, వాణ్ణి చెప్పనివ్వండి, వాడి కథేమిటో విందాం ముందు, అని అన్న తరువాత పోలీసులు వాడి మాటలు వింటారు వాడు చెప్పకుంటాడు ఓ రోజున చేపలు పడుతుంటే, ఒకపెద్ద చేప దొరికింది దాన్ని ముక్కలుగా కోస్తుంటే దాని కడుపులో ఈ

ఉంగరం దొరికింది ఇది అమ్ముకుని బతకొచ్చుకదా అని కంసాలి దగ్గరికొచ్చాను ఇంతకన్న నేనే నేరమూ చెయ్యలేదు - అని

వాడి మాటలు పోలీసులు వినరు చూడు నీ సంగతి తేలుస్తాం రాజుగారి దగ్గరకు పదమంటారు వాడి రెక్కలు విరిచి కట్టి రాజభవనానికి తీసుకెళ్తారు పోలీసుల కాపలాలో వాణ్ణి బయట నిలబెట్టి పెద్ద అధికారి ఉంగరం తీసుకొని లోపలకెళ్తాడు రాజుగారి అనుగ్రహం సంపాదించొచ్చనే పెద్ద ఆశతో ఆ అధికారి తిరిగి వచ్చే లోపల జాలరివాణ్ణి కాపలా కాస్తున్న పోలీసులు ఇంకవాడి చావు మూడిందనే నిశ్చయంతో మాట్లాడతారు అందులో ఒక పోలీసైతే, వాణ్ణి ఉరికంబానికి తీసుకెళ్లటానికి తయారు చెయ్యటానికి తన చేతులు తహతహ పడుతున్నాయంటాడు ఈ మాటలు విని ఆ అమాయకుడు తనని అన్యాయంగా బాబులు ఉరితియ్యకూడదని ప్రాధేయపడతాడు

జాలరి చెప్పిన కథ నిజం ఆ ఉంగరం చూసిన వెంటనే రాజుగారు ఏదో మరిచిపోయిన విషాద విషయం గుర్తుకు తెచ్చుకున్నవాడిలా కొంతసేపు గంభీరంగా ఉండిపోతారు ఆయన కళ్లల్లో కన్నీళ్ళు గూడుకట్టుకుంటాయి

రాజుగారు ఆ జాలరి వాడికి ఆ ఉంగరం దర బహుమానంగా పంపిస్తారు జాలరివాడి కట్టు విప్పేసి పోలీసులు ఇంక వాణ్ణి మంచి చేసుకోవటం ప్రారంభిస్తారు పోలీసులే తనకి ప్రాణదానం చేసినట్లు సంతోషపడిపోయి ఆ జాలరి తనకు రాజుగారిచ్చిన బహుమానంలో సగం పోలీసు అధికారికి సమర్పించుకుంటాడు ఎంతో ప్రేమగా ఆ చేపల వాణ్ణి తాగుడు దుకాణానికి తీసికెళ్ళి వాడి ఖర్చుమీద పోలీసులు తాగుతారు

ఈ కథ కాళిదాసు చెప్పాడు **అభిజ్ఞాన శాకుంతలంలో** శకుంతలా దుష్యంతుల ప్రణయ గాథనీ కాళిదాసు కవిత్వాన్నీ మెచ్చుకునే సహృదయులకి పట్టని సంగతి ఒకటి వుంది ఉంగరం దొరకటం పరమ రసనిర్భరమైన విషయమే కాని, ఆ జాలరివాడు ఎందుకు దెబ్బలు తిన్నాడు ? వాడు చెప్పిన మాట పోలీసులు - నమ్మకపోయినా - ఎందుకు విననేనా వినలేదు వాడు దొంగే అని ఎందుకు ఏ విచారణా లేకుండ ఎందుకు నిర్ధారణకి వొచ్చారు ? వాణ్ణి ఉరి దియ్యటానికి ఎందుకు సిద్ధపడి పోయారు ? వాణ్ణీ, వాడి కులాన్నీ ఎందుకు నానాహీనమైన మాటల్తో అవమానించారు ? రాజుగారు బహుమానంగా ఇచ్చిన డబ్బులో చాలాభాగం పోలీసులు ఎలా వాడి దగ్గర్నుంచి గుంజుకోగలిగారు ?

కాళిదాసు కవిత్వాన్నీ, ఆ మహాకవి నాటక నిర్మాణ దక్షతనీ మెచ్చుకున్న రసజ్ఞుల కెవరికీ ఈ ఘట్టం ప్రత్యేకమైనదిగా కనిపించలేదు దాదాపు రెండువేల ఏళ్ళ తరవాత మోహనరావుగారు రాసిన **ఖాకీబతుకులు** చదివితే, పోలీసు వ్యవస్థ అప్పటికీ ఇప్పటికీ అలాగే వుందనీ, మహా ధర్మబద్ధంగా పరిపాలించిన దుష్యంతుడి రాజ్యం కావచ్చు లంచగొండితనానికి మారుపేరుగా మారిన ప్రజాస్వామ్య స్వాముల ప్రభుత్వం కావచ్చు - ఏదైనా పోలీసులు చేసేపని ఒకలాటిదేననీ స్పష్టంగా తెలుస్తుంది

**మోహనరావుగారి నవల కాళిదాసు కథకన్నా చాలా పెద్దది చాలా వివరంగా చాలా జీవితాల్ని గురించి ఎనిమిది వందల పేజీల పాటు చెప్పేది.** ఇందులో నవల అవసరాల కోసంలాగా ఒక కథానాయకుడున్నాడు అతని పేరు ప్రకాశం అతను మాలవాడు పల్లెటూళ్లో పొలం పనులు చేస్తే, యజమాని ఇచ్చే డబ్బులు చాలక, కడుపునిండా తిండి లేక, పోలీసు ఉద్యోగంలో చేరతాడు అవి బ్రిటీష్ వాళ్ళు పరిపాలించే రోజులు తెల్లదొరలు నల్లవాళ్ళని అన్యాయంగా పాలిస్తే, ఆ నల్లవాళ్ళు తమచేత కింది నల్లవాళ్ళని ఇంకా అన్యాయంగా

పాలిస్తారు  తొడుక్కోడానికి చొక్కా లేక తినడానికి తిండి లేక రైలెక్కి పోలీసాఫీసుకి వెళ్ళడానికి టిక్కెట్టు డబ్బులు లేక పోలీసు ఉద్యోగం ఇచ్చేవాళ్ళు ఏం చెప్తున్నారో అర్థం చేసుకునే చదువు లేక గొడ్లసాలలో పశువుల్ని చూసినట్టు పోలీసు ఉద్యోగంలో చేరిన మనుషుల్ని చూసే పై ఆఫీసర్లని ఎదిరించే సత్తువ లేక - ప్రకాశం - క్రమంగా తలిపేదయిన పోలీసవుతాడు  అతను పోలీసు ఉద్యోగంలో చేరడం మొదలుకొని చివరికి ఎమర్జెన్సీ రోజుల్లో బలవంతంగా రిటైరు చెయ్యబడి అతని కొడుకు పోలీసు ఉద్యోగంలో చేరేవరకూ నడిచిన కథ ఇది

**కాని, ఈ కథని ఇలా క్లుప్తంగా చెప్పడం అన్యాయం  ఇలాకాని మరింకెలా కాని తిరిగి చెప్పడానికి వీలయింది కాదు - ఈ నవల**

మామూలుగా ఒక కథానాయకుడు ఒకరో ఇద్దరో నాయికలూ, మరొక దుష్ట పాత్ర, వాళ్ళ మధ్య రకరకాల సంఘర్షణల వైనం, చివరికి కథ సుఖాంతంగానో దుఃఖాంతంగానో ముగియడం - ఇలాంటి నవల అయితే ఇందులో కథ చెప్పడం తేలిక అయి వుండేది

కాని ఇది ప్రకాశం కథ కాదు  ఈ నవలకి నాయకుడు లేడు  మరొక రకంగా చెప్పాలంటే, ఈ కథలో నాయకత్వం పోలీసు వ్యవస్థది  ఇందులో ప్రకాశం ఒక పేరులేని పోలీసు  మరో వందల వేలమంది పోలీసులకి అనామక ప్రతినిధి

**ఈ నవలలాంటి నవల ఇంతవరకూ రాలేదు**

ఒక ప్రత్యేక వ్యక్తికి నాయకత్వం ఇచ్చి, కథ నడపడం చాలా ప్రాచీన కాలం నించీ ప్రపంచ సాహిత్యమంతటా అలవాటయిన పద్ధతి  ఆ ప్రత్యేక వ్యక్తి ఒక కాలంలో మహావీరుడు, మరోకాలంలో సాదా మనిషి, తక్కువ కులం మనిషి ఆడ మనిషీ అలగా జాతి మనిషి కూడా కాని ఏమయినా కథ నడిపే మనిషి ఈ మనిషే  ఈ వ్యక్తికి గుర్తించదగిన లక్షణాలుంటాయి చెప్పకోదగిన వ్యక్తిత్వం ఉంటుంది  మళ్ళీ ఈ మనిషి సమాజంలో ఒక తరహా వ్యక్తుల సమూహానికి, ఒక సామాజిక వాస్తవానికి, ప్రతినిధిగా కూడా ఉంటాడు - లేదా - ఉంటుంది అలాంటి వ్యక్తిని నవలల్లో చిత్రించిన రచయితల్ని గొప్ప రచయితలుగా పొగుడుతాం  ఆ రచయితల పాత్రల వ్యక్తిత్వాలని గురించి విమర్శకులు వ్యాసాలు రాస్తారు  తరుచు ఈ ప్రత్యేక వ్యక్తిని మిగతావాళ్లెవ్వరికీ లేని విశేష గుణగణాలతోనే చిత్రించడం చాలాదేశాల రచయితలకి అలవాటు  వాళ్ళు ప్రవర్తించే తీరులోనో కనిపించే రూపంలోనో, చేసే పనుల్లోనో, ఆలోచనల్లోనో వాళ్ళు మామూలు మనుషులు కారు సుమా అని కొట్టొచ్చినట్టు తెలుస్తుంది  అందుకని వాళ్లు కదానాయకులు, లేదా కదానాయకురాళ్ళు  వీళ్ళని కేవలం అసమర్థులుగా, అమాయకులుగా, పిరికివాళ్ళుగా, పిచ్చివాళ్ళుగా చిత్రించిన నవలలు కూడా వీళ్ళ నాయకత్వాన్ని తగ్గించవు  వీళ్ళ అసామాన్యత్వాన్ని తుడిచెయ్యవు  వీరేశలింగం నించి వీరేంద్రనాథ్ దాకా, తెలుగులో వచ్చిన మంచి, మధ్యరకం, చెత్త నవలలు ఎన్నేనా చూడండి, ఈ పరిస్థితికి అపవాదం కనిపించదు

కమ్యూనిస్టులు రాజ్యం చేసిన దేశాలలో సోషలిస్టు వాస్తవికత అనే పేరుతో ఒక రచనా విధానం అమలులోకి తీసుకురావటానికి ప్రయత్నించారు

అందులో కథా పాత్రల ప్రత్యేక వ్యక్తిత్వం వుండి, అయినా ఒక సామాజిక వర్గానికో, సమూహానికో వాస్తవ ప్రతినిధులుగా వుంటాయి  రష్యాలో స్టాలిన్ కాలంలో సోషలిస్టు వాస్తవికత పేరుతో సోషలిజమూ లేని, వాస్తవికమూ లేని చచ్చు నవలలు చాలా వచ్చాయి కాని వాటిలో కూడా ఎవరికో ఒకరికి కథానాయకత్వం వుంది

**కాని ఈ నవల మనకింతవరకూ అలవాటయిన ఏ నవల లాంటిదీ కాదు** ఇది ఎలాటి నవలో చెప్పటానికి ఒక కథ చెప్తాను

అనగా అనగా ఒక రాజు
ఆ రాజుకి ఏడుగురు కొడుకులు
ఏడుగురూ వేటకెళ్ళారు
ఏడుచేపలు తెచ్చారు
ఎండబెట్టారు
అందులో ఒక చేప ఎండలేదు
చేపా ! చేపా ! ఎందుకెండలేదు ?

ఈ కథ బాగా తెలిసిన కథే అంచేత పూర్తిగా చెప్పక్కర్లేదు ఇందులో ఒక విలక్షణమైన నిర్మాణం వుంది దీనికి ఒక మొదలూ, ఒక సమస్యా, ఒక ముగింపూ ఉన్నాయి మొదటి ఐదు వాక్యాలూ కదని మొదలుపెట్టి సజావుగా నడిపిస్తాయి అంతవరకూ బాగానే వున్నదన్నా, "అందులో ఒక చేప ఎండలేదు" అనడంతో కద - చిక్కులో పడుతుంది చిక్కులేకపోతే కథే లేదు ఆ తరవాత రకరకాల పరిష్కారాన్వేషణలు మొదలవుతాయి చివరికి మీకు తెలుసు కద ఎలా అంతమవుతుందో అది ముగింపేనా ? పరిష్కారమా ?

ఇంత పకడ్బందీగా నిర్మాణం వున్న ఈ కదలో మనం పట్టుదలగా చూస్తేకాని కనిపించని మరో విశేషం వుంది ఈ కదలో నాయకుడు లేడు (నాయకురాలూ లేదు) - వ్యవస్థే వుంది రాజు కొడుకు కావచ్చు, వాడి తాత కావచ్చు చేప ఎండదు గడ్డి దుబ్బు తనపని అది చేసుకుని పోతుంది పశువుల వాడు - అవ్వ అన్నం పెట్టకపోతే - ఆవుని విప్పడు పిల్ల ఏడిస్తే అవ్వ వాడికి అన్నం పెట్టదు తన కన్నంలో ఎవరు వేలు పెట్టినా, చీమ కుట్టి తీరుతుంది ఇది ఇంతే ఇది నిరాఘాటమైన, నిత్య కర్కశమైన ప్రపంచం ఈ ప్రపంచంలో ఎవరూ దేనికీ బాధ్యత వహించరు కథని ఇంకో రకంగా తిప్పరు చీమ కన్నంలో వేలుపెట్టిన చిన్నపిల్లకి బాధ్యత అంటే ఏమిటో తెలియదు ఇది సుఖాంతమూ కాదు, దుఃఖాంతమూ కాదు చిన్నపిల్లలకి ఇది విస్మయాంతం వాళ్ళు చీమ చెప్పిన జవాబు విని, అందులో ప్రశ్నార్థక వాక్య విన్యాసానికి నవ్వుతారు పెద్దవాళ్ళకయితే, ఇది విషాదాంతం పరిష్కారం లేకుండా ముగిసింది కాబట్టి

అమాయికంగా, అనామకంగా కనిపించే ఈ అనగా అనగా కద ప్రపంచ సాహిత్యంలో చెప్పకోదగ్గ కథ మిగతా కథలు పట్టుకి దొరికిపోతాయి ఈ కథ దొరకదు ఇది ప్రపంచమంత విశాలమైనది జీవితమంత అగాదమయినది

**ఈ చిన్న కథ ఎలాంటిదో, మోహనరావుగారి ఖాకీ బతుకులు కూడా అలాంటిదే** ఇందులోనూ నాయకుడు లేడు, వ్యవస్థే వుంది అందులో ప్రవర్తించే వ్యక్తులున్నారు రకరకాల వ్యక్తులు చాలామంది పోలీసులు వాళ్ళ పైన చిన్నా, పెద్దా పోలీసు అధికార్లు, కథానాయకుడిలా కనిపించే పోలీసు ప్రకాశం ఈ ప్రకాశం చదువు రాకపోతే అక్షరాలు నేర్చుకుంటాడు పుస్తకాలు చదువుతాడు తెల్లవాళ్ళు వెళ్ళిపోతే, దేశంలో అన్నీ బాగుపడతాయని నమ్ముతాడు దేవుడన్నవాడు లేడని తెలుసుకుంటే చాలు - అన్ని సమస్యలూ వాటంతట అవే పరిష్కారమైపోతాయని ఒప్పకుంటాడు పోలీసు ఉద్యోగంలో మనిషిని మనిషగా చూడని నిర్బంధాల్లో అన్ని కష్టాలూ పడతాడు చదువుకున్నవాడు కాబట్టి ఆలోచిస్తాడు ప్రశ్నిస్తాడు

పోలీసు వ్యవస్థ మనుషుల్ని పట్టుకుని వాళ్ళల్లో ఏ మాత్రం మనుష్యత్వం లేకుండా చావగొట్టేసి మోటుబార్చి ఏ అభిమానాలూ ఏ ఆలోచనలూ లేని అమానుష జంతువుల్లా తయారు చేస్తుందనీ, అదే పోలీసు వ్యవస్థకి బలం అనీ బోధపరుచుకుంటాడు అయినా పోలీసుగానే వుంటాడు అధికార్లు చెప్పిన పనులన్నీ చేస్తాడు లాకప్పులో పెట్టిన అమాయకుల్ని ఆజ్ఞాబద్ధుడై చితగ్గొడతాడు లాకప్పులో పోలీసు దెబ్బలకి చచ్చిపోయిన మనిషి శవాన్ని ఎక్కడో పొలాల్లో పారేసి వస్తాడు సబిన్స్పెక్టరు లేనప్పుడు అతని భార్యకి తోడుగా వాళ్ళ ఇంటికి కాపలా పడుకోవటానికి వెళ్ళి, ఆవిడ కామాన్ని ఆజ్ఞానుబద్ధుడై తీరుస్తాడు పోలీసు స్టేషనుకి తీసుకొచ్చిన అమాయకులైన పడుపుకత్తెల కష్టాలు గ్రహిస్తాడు వాళ్ళని చెరిచే పోలీసాఫీసర్లనీ అసహ్యించుకుంటాడు లంచాలు తీసుకోకుండా వుండటానికి ప్రయత్నిస్తాడు అయినా "అవసరం కాబట్టి" తీసుకుంటాడు నక్సలైట్‌ని కాల్చి చంపుతాడు తనపై అధికార్ల దుర్మార్గాన్ని అసహ్యించుకుంటాడు అయినా పోలీసుగానే వుంటాడు పోలీసు పనులే చేస్తాడు

ఈ కదలో ఏదో ఒక జాగాలో ఇండియాకి స్వతంత్రం వస్తుంది తెల్లవాళ్ళు వెళ్ళిపోతారు నల్లవాళ్ళు రాజ్యానికి వస్తారు అయినా పోలీసులు అలాగే వుంటారు పోలీసు జులుం అలాగే వుంటుంది పై అధికార్లు కిందివాళ్ళని హింసిస్తారు అందులో కొందరు తక్కువ కులాలనించి పైకి వొచ్చిన వాళ్ళుకూడా వుంటారు అయినా వాళ్లూ కింద వాళ్ళని అందరు పై అధికారుల్లాగే హింసిస్తారు వ్యవస్థలో ఏ మార్పూ వుండదు ప్రకాశం లాంటి వాళ్ళు బోలెడు ఆలోచనలు చేసినా వాళ్ళ ప్రవర్తనలో ఏ తేడా వుండదు

ఈ నవలలో ఒకచోట జైలు గురించి చాలా వివరమైన వర్ణన వుంది అందులో ఖైదీలూ, వాళ్ళ కష్టాలూ పోలీసులూ, వాళ్ళ కష్టాలూ అన్నీ వున్నాయి చటుక్కున ఆ వివరాలన్నీ చదివాక ఒక తేడా తెలుస్తుంది పోలీసుల కాపలా లేకపోతే, ఖైదీలు పారిపోతారు కాని పోలీసులు పారిపోరు పోలీసు వ్యవస్థ వాళ్ళని కాపలా అక్కరలేని ఖైదులో పెట్టింది ఈ వ్యవస్థలో ఖైదీలే కాపలాదార్లు ఖైదీలు తమ కొడుకులు ఖైదులోకి వెళ్ళాలని కోరుకోరు కాని పోలీసులు తమ కొడుకులు పోలీసులయితే సంతోషిస్తారు

**ఎనిమిది వందల పేజీల నవల సాధించే మరో గొప్ప ప్రయోజనం వుంది** అసహ్యాలూ, అవమానాలూ, హత్యలూ, లంచాలూ దుర్మార్గాలూ, లాకప్పులో అమాయకుల్ని చితగ్గొట్టి చంపి బయట శవాల్ని పారెయ్యడాలూ, లైంగిక హింసలూ, లాలూచీలూ, మనుషుల్ని జంతువుల కన్నా హీనంగా అవమానించడాలూ, పై అధికార్ల దగ్గిర వొంగి వొంగి సలాం చెయ్యడాలూ, బలహీనతలూ, భయాలూ, నంగితనాలు - ఇవన్నీ పేజీ తరవాత పేజీ విడుపు లేకుండా చదివాక, ఇంక వాటికి మనస్సు చలించడం మానేస్తుంది ఒకరకమైన అలవాటుకి లోబడిపోయి, హత్యహత్యలా కనిపించదు హింస హింసలా అనిపించదు

అది ఈ నవల్లో ఉన్న ఇంకో గొప్పతనం ఇంత దారుణంగా, ఇంత అమానుషంగా, ఇంత అసహ్యంగా, నీచంగా, క్రూరంగా ప్రవర్తించే మనుషులు - యూనిఫారాలు వేసుకుని, రాజ్యం తరపున రాజ్యం చేస్తూండకపోతే - జైళ్ళల్లో వుండి, తాము ఏ అమానుషాలు చేస్తున్నారో వాటికి గురి అయ్యేవారు అప్పుడు ఇలాంటి అమానుషాలు చేసేవాళ్ళు - వీళ్ళల్లాంటి వాళ్ళే - ఇంకోళ్ళు ఉండేవాళ్ళు అంటే, వీళ్ళు రాజ్యానికి అవసరం వీళ్ళు లేకుండా రాజ్యం నడవదు అది దుష్యంతుడి రాజ్యమైనా, దుర్మార్గుల రాజ్యమైనా - రాజ్యం రాజ్యమే

ఇంతవరకూ చట్టప్రకారం ఏర్పరచబడిన ఏ పోలీసు వ్యవస్థా, ఏ దేశంలోనూ చట్టప్రకారం ప్రవర్తించలేదు అభివృద్ధి చెందిన ప్రజాస్వామ్య దేశాలు - అమెరికా, ఫ్రాన్స్, ఇంగ్లండు -

ఇలాటివి కావచ్చు, అభివృద్ధి చెందుతున్న ప్రజాస్వామ్య దేశాలు - ఇండియా లాంటివి కావచ్చు పోలీసుల ప్రవర్తనలో తేడా లేదు తేడా అల్లా, వాళ్ళు ఎవరిని హింసిస్తున్నారనేదే నియంతలు పరిపాలించే దేశాలలో పోలీసు వ్యవస్థ నిరంకుశంగా వుంటుంది కాబట్టి, వాటితో మనకి పోలిక తెచ్చుకో అఖ్ఖరలేదు అక్కడ పోలీసు హింస స్పష్టంగా పైకి కనిపిస్తుంది

కాని ప్రజాస్వామ్య దేశాలలో హింస పైకి కనిపించకూడదు హింసలా అనిపించకూడదు పోలీసు స్టేషన్ల లాకప్పు గదుల్లో జైలుగోడల వెనకాతల, వూరికి దూరంగా అడవుల్లో మూడోకంటి వాడికి తెలియకుండా జరగాలి, న్యాయస్థానాలకి దొరక్కుండా జరగాలి

ప్రతి రాజ్యంలోనూ ఎవర్ని హింసిస్తే అది హింసగా గుర్తించబడదో, అలాటివాళ్ళు కొందరుంటారు అమెరికాలో నల్లవాళ్ళు, ఇండియాలో పేదవాళ్ళు, తక్కువ కులంవాళ్ళు వీళ్ళమీద విరుచుకుపడితే అది హింసలా పై వాళ్ళకు తట్టదు

పై వాళ్ళంటే మనం ఈ పుస్తకం చదివే వాళ్ళం పేజీలకొద్దీ హింసలూ, అన్యాయాలూ చదివాక అవి అలవాటయిపోయినట్లనిపించి మనస్సు చలించడం మానెయ్యగానే కొరడాతో కొట్టినట్లు తెలుస్తుంది నిత్యజీవితంలో ఈ పోలీసు హింస మనకి పట్టక పోవటానికి కారణం - ఈ హింస పడేవాళ్ళం మనం కాం - వాళ్ళు - వాళ్ళు వేరే వున్నారు - అని వాళ్ళు మనం కామా? నిజంగా వాళ్ళు వేరే వున్నారా ? నిజంగా ? లేరని తెలిసాక మనం మనుషులుగా బతకలేం **ఈ పుస్తకం చదివాక, చదవనట్లు ఉండటం కష్టం**

ఈ పుస్తకం అయిపోతుంది

ప్రకాశం కొడుకు కమ్యూనిస్టు అవుతాడు కులాన్ని దాటి అవమానాల్ని దాటి ఒక అమ్మాయిని ప్రేమిస్తాడు ప్రకాశం కూతురు కూడా చదువుకుంటుంది పల్లెటూరిలో పేద మాల కుటుంబంలో చదువులేక తక్కువ కులాల వాళ్ళని పెట్టే అన్ని హింసలూ పడిన ప్రకాశం ఆధునిక మధ్య తరగతి స్థాయికి తను వొచ్చి, తన పిల్లల్ని తీసుకొస్తాడు తనతోపాటే తన భాష కూడా మారుతుంది ఒకప్పటి తక్కువ కులాల యాసపోయి, కులంలేని మధ్యతరగతి బాషలోకి వొస్తుంది నవల

ఇది మార్పేనా ? అభివృద్దేనా ?

కాదని భయంకరంగా జ్ఞాపకం చేస్తుంది కథ ప్రకాశం కొడుకు పోలీసు ఉద్యోగానికి వెళ్తాడు అతనికి ఆ ఉద్యోగం వొచ్చినందుకు తండ్రి సంతోషిస్తాడు

**ఈ కథ అయిపోదు**

**- వేల్చేరు నారాయణరావు**



''ఇదిగో ఆర్డరు యస్పీ దొరగారి ఆఫీసునుండి వచ్చింది తీసుకొని, ఇదిగో ఈ కాపీమీద సంతకం చెయ్యి యస్పైతోపాటువెళ్ళు'' అంటూ ఆర్డరు కాగితాన్నీ, దాని డూప్లికేటు కాపీనీ యస్పై చేతికందించి, జేబులోంచి చేతిగుడ్డ తీసుకొని ముఖం తుడుచుకున్నాడు ఆ కాగితాలు తీసుకొని యస్పై, సి ఐ కి సెల్యూట్‌చేసి రైటరు రూంలోకి వెళ్ళాడు

ప్రకాశం అలాగే నిలబడి వున్నాడు ఇంకా ఏదో లోకంలో వున్నట్లు

''నువ్వింక వెళ్ళొచ్చు'' అన్నాడు సి ఐ

ఉలిక్కి పడ్డట్టుగా చిన్నగా శరీరం కదిలింది ప్రకాశానికి ఈ లోకంలోకివచ్చినట్లు చూశాడు సి ఐ ఏమి అన్నాడో కూడా అర్థంకాలేదు కానీ తనను ఇక వెళ్ళమన్నాడని అతని ఇంగితం చెప్పింది ముప్పై మూడు సంవత్సరాలుగా అసంకల్పిత చర్యలకు అలవాటుపడిన అతని కుడిచెయ్యి, అతని ప్రమేయం లేకుండానే సి ఐ కి బట్ సెల్యూట్ చేసింది నీరసంగా వెనుదిరగబోతుంటే సి ఐ స్వరం వినిపించింది, ''నీ సర్వీసెంత?'' ఏదో కావాలని అడిగినట్లు అతని స్వరం చెపుతోంది

''ముప్పై మూడు పూర్తయ్యింది సార్'' మాటసరిగా పెగలటం లేదు

'అలాగా' అన్నట్లు తలూపి, ''వెళ్ళి ఆర్డరుకాగితం తీసుకో'' అంటూ టేబిలుమీది పేపరువెయిట్‌ని చేతిలోకి తీసుకొని అటూ ఇటూ తిప్పుతూ వుండిపోయాడు సి ఐ

ప్రకాశం కుడిచెయ్యి సి ఐ కి మళ్ళీ బట్ సెల్యూట్ చేసింది చిన్నగా కాళ్ళీడ్చుకుంటూ బయటకువచ్చి రైటరు రూంలోకి వెళ్ళాడు అక్కడ రైటరూ, యస్పై, ఇంకొంతమంది పీసీలు నిలబడివున్నారు అంతా ఓసారి ప్రకాశంవైపు చూచి చూపులు తిప్పుకున్నారు గాఢమైన నిశ్శబ్దం ఆ గది అంతా ఆవరించింది యస్పై ఆ కాగితాన్ని రైటరు బల్ల మీద వుంచి, లేచి, సి ఐ కూర్చున్న గదిలోకి వెళ్ళిపోయాడు రైటరు ఆ కాగితాల్ని ప్రకాశంకు అందించాడు తుపాకిని గోడకు ఆనించి, తూటాలపెట్టె బెల్టునుండి తీసి రైటరు బల్లమీద పెట్టి, అతనందించిన కాగితం తీసుకున్నాడు ఇంగ్లీషులో టైపుచేసివున్న ఆ కాగితంలోని అక్షరాలు నీళ్ళు నిండిన ప్రకాశం కళ్ళకు మసక మసకగా కనిపించాయి రెండో కాగితం మీద సంతకంచేసి చిన్నగా వెనక్కి తిరిగి బైటకొచ్చాడు బల్లమీదపెట్టిన బెడ్డింగు తీసుకుని రోడ్డుమీదకు వెళ్ళాడు అడుగులు భారంగా పడుతున్నాయి కళ్ళు గట్టిగామూసి తెరిచాడు కళ్ళల్లోని నీటిబొట్లు ముడతలుపడ్డ బుగ్గలమీదకు జాలువారాయి మనస్సు పిండివేస్తున్నట్లువుంది చెప్పలేని నిస్సత్తువ ఆవరిస్తోంది ఎదురుగా కనపడ్డ కిళ్ళీకొట్టు దగ్గరకువెళ్ళి బల్లమీద కూర్చున్నాడు రోజూ లాగానే కిళ్ళీకొట్టతను పలకరించాడు ఆ పిలుపు ప్రకాశంకు వినిపించలేదు శూన్యంలోకి చూస్తున్న ప్రకాశాన్ని అతను మళ్ళీ పిలిచాడు ''ఏంసార్ అట్లాగున్నారు? '' అన్నాడు

ఈ లోకంలోకి వచ్చినట్లు తలతిప్పి చూచి, ''ఏం లేదు '' అని చిన్నగా జవాబుచెప్పి భారంగా లేచి అడుగులు వేశాడు ప్రకాశం

''సార్, మీ బెడ్డింగండీ '' కొట్టతను వేసిన కేకకు వెనక్కి తిరిగి వెళ్ళి బల్లమీదపెట్టిన బెడ్డింగు తీసుకున్నాడు అతనికి ఇంటికెళ్ళాలంటే బాధగావుంది ఎక్కడికెళ్ళాలో, ఏంచేయాలో తోచలేదు అతని ప్రమేయం లేకుండానే అతనికాళ్ళు దూరంగావున్న బ్రాందీషాపువైపు దారితీశాయి అతని మెదడు మొద్దుబారిపోయేవుంది ఇంకా హృదయం భారంగా మూలుగుతోంది షాపులోకి అడుగుపెడుతూవుంటే ఎవరో తెలిసిన మనిషిపలకరించాడు కానీ ప్రకాశానికి వినపడలేదు కొంతమంది అతన్ని అదో రకంగా చూశారు వెళ్ళి ఒక మూలగా

కూర్చున్నాడు తలమీది టోపీ తీసి బల్లమీద పెట్టాడు

కుర్రవాడువచ్చి, ''ఏంకావాలి సార్'' అన్నాడు

ఏం కావాలో తెలియదు అతనికి ''ఏదో ఒకటి పట్రా'' అన్నాడు చిన్నగా ఆ కుర్రవాడు అతనివైపు క్షణకాలం చూసి లోపలికెళ్ళి, ఏదో మత్తుపానీయపు సీసాతెచ్చి బల్లమీద పెట్టాడు గ్లాసుతెచ్చి సీసా మూతతీసి కొంచెం పోశాడు

''వాటర్ కలపమంటారా?'' అన్నాడు ప్రకాశం ఏమీ మాట్లాడలేదు అతని కళ్ళల్లో నీళ్ళు వూరుతున్నాయ్ మెదడులో రక్తం గడ్డకడుతున్నట్లుగా వుంది శరీరంనిండా నిస్సత్తువ ఆవరిస్తోంది ఆ కుర్రవాడు వెళ్ళిపోయాడు క్షణాలుకొన్ని నిశ్శబ్దంగా గడిచిపోయాయి గ్లాసు చేతిలోకి తీసుకుని చిన్నగా ఒక్కగుక్క తాగాడు గొంతు కాలిపోయినట్లు అనిపించింది వాసన ఘాటుగా వేసింది రెండునిముషాల్లో కడుపులో సన్నని మంట ప్రారంభమయినట్లు తోచింది కొద్దిసేపట్లోనే అతన్నొక రకమైన మత్తు ఆవరించింది అప్పటికే అతనికి వెగటు కొట్టింది చేసిన పనికి సిగ్గువేస్తున్నట్లు అనుభూతి కలిగింది చేతిలోని గ్లాసు బల్లమీద పెట్టాడు ఆలోచనలకు అంచు దొరకటంలేదు ఓ పావుగంట తరువాత జరిగిన ఘటన అతనికి గుర్తువచ్చింది

'అది నిజంగా జరిగిందా? లేకపోతే కలా?' అనుకున్నాడు అనుమానంగా జేబు తడుము కున్నాడు రిటైర్‌మెంటు కాగితం చేతికి తగిలింది తీసిచూశాడు ఇంగ్లీషు రానందువలన అందులోని విషయాలు తెలియవు 'అందులోని విషయం తనను బలవంతంగా రిటైర్‌చేసినట్లు వుందన్నమాట' అనుకున్నాడు కాగితాన్ని మడిచి జేబులో పెట్టుకున్నాడు నిముషాలు గడిచేకొందీ మత్తు ఎక్కువవుతున్నట్లు అనిపిస్తోంది

బేరర్ కుర్రవాడువచ్చి, ''తింటానికేమన్నా కావాలా సార్'' అన్నాడు 'వద్ద'న్నట్లు తలూపాడు ప్రకాశం అతని దృష్టి తనకెదురుగా బల్లమీదవున్న తన టోపీ మీద పడింది నీళ్ళు నిండిన అతని కళ్ళకు అది రక్తం ఓడుతున్న యర్రటి మాంసపు ముద్దలా కనపడింది

'అయిపోయింది' చిన్నగా తనలోతనే గొణుక్కున్నాడు 'తన జీవితం అయిపోయింది ఈ బ్రతుక్కి సూర్యాస్తమయం అయ్యింది' అనుకున్నాడు మళ్ళీ కళ్ళుమూసుకుని బాధగా కుర్చీకి జేరగిలబడ్డాడు షుమారు ముప్పై మూడు సంవత్సరాల అతని పోలీసు కానిస్టేబులు జీవితం లీలగా అతని మనోపథంలో మెదిలింది గతించిన జ్ఞాపకాలను గుర్తుచేసుకుంటూ ముప్పైమూడు సంవత్సరాల వెనక్కు వెళ్ళాడు ప్రకాశం

  

తెల్లారితే సంక్రాంతిపండగ అప్పుడే 'అరక్కు' పోయివచ్చి పడుకున్నాడు ప్రకాశం కొద్దిసేపు మంచంమీద అటూ ఇటూ పొర్లాడు అతనికంతా చికాగ్గావుంది లేచికూర్చుని గోడమీద కాంద్రించి వూశాడు 'ఛీ, ఏదవబతుకులు ఎదవబతుకులని' గొణుక్కున్నాడు

'నాకొడుకు ఏడాదిపొడుగూతా శాకిరీ సేయించుకుంటాడు పండగపూట బేడాడబ్బులు ఇయ్యడు కావాలంటే గింజలు కొలుత్తాడంట' అనుకుంటూ పళ్ళుకొరికాడు లేచి నీళ్ళగాబు దగ్గరకువెళ్ళి ముఖం కడుక్కున్నాడు

''వచ్చి బూపెటు'' అన్నాడు కాస పెద్దగా భార్యకు వినపడేలా గుడిసెలోకెళ్ళి,

నిల్చాడికానుకుని కూర్చున్నాడు చేస్తున్నపని ఆపి లోపలికొచ్చింది ప్రకాశం భార్య మాణిక్యమ్మ

''డొబ్బులడిగావా?'' అంది సత్తుపళ్ళెం కడుగుతూ

''ఆఁ ఇయ్యనన్నాడు నాకొడుకు సేతిలోని గొడ్డలితో అట్నాగే యాధ్దావనిపించింది ఈడెమ్మని '' బూతులు తిట్నాడు

పళ్ళెంలో జొన్నసంగటి, చింతకాయపచ్చడి వేసి తీసుకొచ్చి ప్రకాశం ముందు పెట్టింది ఆమె సంగటిలో చింతకాయపచ్చడి కలిపి పిసికాడు ప్రకాశం అతనికి కోపంగావుంది ఆసామిమీద పళ్ళుకొరుక్కున్నాడు ఇంతలో బయటనుండి వెంకటేశం కేకవినబడింది 'ఒరే పెకాసిగా' అని, వెంటనే ప్రకాశం తల్లిని, ''పెకాశం లేడత్తా'' అని అడుగుతూ గుడిసెదగ్గరకు వచ్చాడు వెంకటేశం

''బూ తింటన్నాడు'' అంది ప్రకాశం తల్లి మళ్ళీ ఆమే, ''ఎందుకురా?'' అంది

''కూత్తంత పనుందిలే'' అంటూ గుడిసెలోకి తొంగిచూచి, ''యీడున్నావంట్రా'' అంటూ లోపలికొచ్చి ప్రకాశం పక్కనే కూర్చున్నాడు

''యేందిరా యెంకటేశా?'' అన్నాడు ప్రకాశం తలెత్తకుండానే

ఏదో రహస్యం చెపుతున్నట్లు, మెడ ముందుకుచాచి, చిన్నగా, ''నువ్ తొరగా బూ తినహే, వక రకచ్యం సెపుతా'' అన్నాడు వెంకటేశం

''యేందదీ, సెప్పు'' అన్నాడు ప్రకాశం తలతిప్పి వెంకటేశంవైపు ఆలోచనగా చూస్తూ

యినకొండ తాలూకా కసేరికాడికి తెల్లదొరలొచ్చి వనోల్లని పోలీసుల్లోకి తీచుకుంటన్నారంట ఏసోబుగాడు సెప్పాడు ఆడు తెల్లారకట్టే ఎల్లాడు నేనూ పోతన్నా మరినువ్వుగూడా కానియ్'' అన్నాడు

ప్రకాశం సంగటి మింగటం ఆపి కళ్ళుచిట్లించి చూశాడు వెంటనే అతనికేం అర్థంకాలేదు కొద్దిసేపున్నాక, ''పోలీచులంటే యర్రబుట్టలు పెట్టుకొని, కర్రసేత్తో పట్టుకుని బత్తీలో వుంటారే, ఆల్లేనా?'' అన్నాడు అనుమానంగా

''ఆఁ ఆల్లే బత్తీలోవుండేటోల్లే ఓతూరి, పోయినేడు, అంకాల్లమ్మ కొలుపుకి, మన మునసబుగోరి సిన్నోన్ని కరనంగోరి మడుసులు వాయగొట్టినప్పుడు మనూరు వచ్చేరు సూడూ, ఆల్లన్నమాట అప్పుడు మనవంతా ఆల్లువూల్లోంచి పోయిందాక బయమేసి పొలాల్లోనే దాక్కున్నాం గుర్తుందా ఆల్లే పోలీచులంటే''

''మనకెందుకది?'' అమాయకంగా అడిగాడు ప్రకాశం పోలీసులు గుర్తొచ్చేసరికి అతనికి కొంచెం భయం వేసింది

''ఎందుకేందిరా మొద్దునాకొడక నౌకరీసేసుకుని ఆయిగా బతక్క ఎందుకంటావేంది?''

''నౌకరా! ఏం నౌకరు? పోలీసు నౌకరు మనకొత్తదా? మనకచ్చురం ముక్కరాదు నాకొద్దురా అది'' అని భార్యని కేకేసి, ''యేయ్, పుల్నీలు పోసిపోయె'' అన్నాడు

''ఓరి యెర్రిమొగమా, ఆ నౌకరీకి సదువుతో పనిలేదురా కూలీ ఎక్కువిత్తారంట ఆల్లు గింజలు కొలవరు డబ్బులిత్తారు ఏందనుకుంటన్నావో'' అని ఆశగా చూశాడు ప్రకాశంవైపు వెంకటేశం నవ్వుతూ

ప్రకాశం పుల్లనీళ్ళుతాగి, చిన్నగా తేపి, పళ్ళెంలో చేయికడుక్కుని, మట్టిముంత పైకెత్తి నీళ్ళు గడగడాతాగి, కొద్దిసేపున్నాక చిన్నగా అన్నాడు ''నేన్రాన్రా ఆల్లని సూత్తేనే నాకు బయ్యం నూ పో''

ఆ మాటకు వెంకటేశం ప్రకాశంవైపు విసుగ్గాచూశాడు ''సరే నీ కరమ'' అనిలేచి, చినిగి పీలికలైన పైపంచె దులిపి భుజాన వేసుకుని బైటకెళ్ళాడు ప్రకాశం లేచివెళ్ళి కలబందనారతో అల్లిన వెదురుబొంగుల మంచంమీద కూర్చున్నాడు

మాణిక్యమ్మ బైటకొచ్చి పళ్ళెం కడుగుతూ, ''ఇంకోతూరి అడిగిరాపో డొబ్బులు ఇత్తాడేమో ఈ తూరన్నా'' అంది

ఆ మాటకు ప్రకాశానికి కోపం వచ్చింది ''ఆడియ్యడే, దొంగనాకొడుకు ఇంగనేనడగను ఆడిని'' అని భుజం మీది పైపంచెతీసి తలకింద మెత్తగా వుండటానికి తలవైపు పెట్టుకొని మంచంమీద పడుకున్నాడు అతని ఆలోచనలు వెంకటేశంపైకి మళ్ళాయి

'ఆ నౌకరీకిపోతే కూలికింద డబ్బులిత్తారంట ఎంతిత్తారో? అసలు ఆ నౌకరీ తమకిత్తారా?' ఆలోచించాడు తనలోతను ఓసారి 'ఈ గొడ్డుశాకిరీకన్నా అది నయం గుంటదేమో' అనుకున్నాడు మళ్ళీ 'అయినా తాలూకా కసేరీ కాడ ఏంసేత్తారో సూద్దాం' అనుకుని లేచాడు జారిపోయిన గోచీ దోపుకుంటూ, ''నే బత్తీకెలతన్నా'' అన్నాడు తల్లితో

''ఇప్పుడెందుకురా?'' అంది తల్లి

''పొద్దాలేసరికి వత్తాలే'' అంటూ వెంకటేశం గుడిసె దగ్గరకు వెళ్ళి అతన్ని కేకేశాడు వెంకటేశంలేడు 'అయితే ఈడు ఎల్లాడన్నమాట' అనుకున్నాడు గబగబా నడక సాగించాడు

ఆ వూరినుండి బస్తీ అయిదు మైళ్ళుంటుంది అప్పుడు మధ్యాహ్నం రెండు గంటలయ్యింది తలగుడ్డ చుట్టుకొని గబగబా నడిచాడు

'అచలే పోలీచులంటే తగని బయ్యం తనకి ఆల్లని సూత్తే అందరూ బయపడతారు ఆల్లు తెగబాదుతారంట' అనుకున్నాడు

ఎండవేడికి వళ్ళు చుర్రుమంటోంది వెన్నుపూసగాడిలో చిన్న సెలయేరులాగా చెమట కారుతోంది బండ్లడొంకలోని కాలే దువ్వ, చెప్పుల్లేకుండా చిన్నప్పటినుండీ నడకకు అలవాటుపడ్డ అతని పాదాల్ని ఏమీ చెయ్యలేక పోతోంది వినుకొండ తాలూకా ఆఫీసు దగ్గరకు సాయంత్రం నాలుగు గంటలలోపే చేరుకున్నాడు ఆఫీసు దగ్గర చాలామందివున్నారు ఆదుర్దాగా గబగబా అక్కడకు వెళ్ళాడు దూరంగావున్న పెద్దమర్రిచెట్టుకింద ఇద్దరు బ్రిటిష్ పోలీసాఫీసర్లు కుర్చీల్లో కూర్చుని వున్నారు వాళ్ళు టోపీలు పెట్టుకుని చేతుల్లో చిన్న చిన్న కర్రలు పట్టుకొని ఏదో మాట్లాడు కుంటున్నారు వాళ్ళ ముందు చిన్న టేబిలు వేసివుంది దానిమీద తెల్లటిగుడ్డ పరచివుంది రెండు కప్పులు, సాసర్లు వున్నయ్ ఆ టేబిలుమీద వాళ్ళకి కొంచెం ఎడంగానిలబడి నలుగురు నల్ల ఆఫీసర్లు కూడా వున్నారు పోలీసుల్లో చేరటానికి వచ్చిన వాళ్ళను కొంతమంది నల్ల ఆఫీసర్లు వరుసగా నిలబెడుతున్నారు పిల్లలు కొంత మంది దూరంగా నిలబడి చూస్తున్నారు వింతగా తెల్లవాళ్ళు ఎక్కివచ్చిన గుర్రాలు ఒకచెట్టుక్రింద కట్టేసివున్నయ్ ప్రకాశం దూరంగా ఒకచెట్టు నీడన నిలబడ్డాడు వరుసలో నిలబడ్డ వాళ్ళల్లో ఏసోబూ, వెంకటేశం కూడా వున్నారు మొత్తం ఇరవై అయిదుమందిదాకా వుంటారు అలాచూస్తుంటే ఒకరకంగా వుంది ప్రకాశానికి అలాచూస్తూ వుండిపోయాడేగానీ వెళ్ళి వాళ్ళతోపాటు కలిసి నిలబడే ధైర్యం లేకపోయింది కొద్దిసేపుగడిచాక ఆఫీసులోనుండి వచ్చిన ఒక నల్ల ఆఫీసరు తెల్లవాళ్ళతో ఏదో చెప్పాడు తెల్లవాళ్ళిద్దరూ లేచి వరుసగా నిలబడ్డ వీళ్ళ దగ్గరకు వచ్చారు వాళ్ళలో ఒకతను దూరంగావున్న ప్రకాశాన్నిచూచి రమ్మనమన్నట్లు చేతిలోని కర్రవూపుతూ సైగచేశాడు ప్రకాశానికి భయమేసింది

క్షణకాలం ఆగి , తటపటాయిస్తూ తలగుడ్డ చుట్టుకుంటూ ఆ తెల్ల ఆఫీసరు దగ్గరకు వెళ్ళాడు చేతులు కట్టుకుంటూ భయం భయంగా వరుసలోవున్న వాళ్ళందరి దృష్టి ప్రకాశంమీద పడింది తెల్ల ఆఫీసరు నవ్వుతూ ప్రకాశం భుజంతట్టి ఏదో అన్నాడు ఇంగ్లీషులో అక్కడవున్న నల్ల ఆఫీసరు ప్రకాశాన్ని లైన్లో నిలబెట్టాడు వరుసలోవున్న వాళ్ళని ఒక్కొక్కళ్ళనే పరీక్షగాచూస్తూ, పొట్టిగా, సన్నగా వున్నవాళ్ళని చేతిలోని కర్రతో వెనక్కు నెట్టివేస్తూ లైను చివరిదాకా వెళ్ళాడు తెల్ల ఆఫీసరు సెలక్టయిన వాళ్ళల్లో వెంకటేశం కూడా వున్నాడు వెనక్కు నెట్టివేయబడినవాళ్ళను అవతలకు వెళ్ళిపొమ్మన్నాడు నల్ల ఆఫీసరు వాళ్ళల్లో ఏసోబుకూడా వున్నాడు అతను ఎత్తులేడు సెలక్టయిన వాళ్ళందరినీ ఒక వరుసలో నిలబెట్టారు తరువాత నల్ల ఆఫీసరు తెల్ల ఆఫీసరు దగ్గరకు వెళ్ళి ఇంగ్లీషులో ఏదో చెప్పాడు తెల్ల ఆఫీసర్లు అతనికి ఏదో సమాధానం చెప్పి లేచారు దూరంగా నిలబడివున్న ఒక కానిస్టేబులు పరిగెత్తుకుంటూ వచ్చి, చెట్టుకింద కట్టేసివున్న గుర్రాల్నివిప్పి తీసుకొచ్చాడు వాళ్ళ దగ్గరకు వాళ్ళిద్దరూ గుర్రాలెక్కి వెళ్ళిపోయారు నల్ల ఆఫీసరు సెలక్టయిన వాళ్ళందరి పేర్లూ వ్రాసుకున్నాడు తరువాత వాళ్ళతో, ''మీరందరూ ఇళ్ళకు వెళ్ళిపోయి రేపీపాటికి మళ్ళీ ఇక్కడనే వుండాలి రేపు మీ అందరినీ జిల్లా హెడ్క్వార్టరుకు పంపిస్తారు అక్కడ మీకు వైద్యపరీక్షలు జరుగుతాయి కాబట్టి రేపు మీరంతా ఇక్కడేవుండాలి అందరూ రావాలి ఇంక వెళ్ళండి'' అన్నాడు వరుసలో వున్నవాళ్ళు ఒకళ్ళమొహాలు ఒకళ్ళు చూసుకున్నారు, కాని ఎవరూ కదలలేదు వాళ్ళని చూచి నల్ల ఆఫీసరు చిన్నగా నవ్వుకున్నాడు

''ఇంక మీరంతా వెళ్ళండి ఇళ్ళకువెళ్ళి రేపీపాటికి వచ్చెయ్యండి'' అని అతను తాలూకా ఆఫీసువైపు నడిచాడు

వరుసలో వున్నవాళ్ళు చిన్నగా కదిలారు అప్పటికి పొద్దువాలుతోంది

''ఏరా పెకాసిగా, రానని వచ్చావే'' నవ్వుతూ అడిగాడు వెంకటేశం

''అదికాదశా అసలేందో సూద్దావని వశ్చా నేనుకూడా పోలీసుల్లోకి పోయినట్టేగా'' అన్నాడు ప్రకాశం అమాయకంగా

''అవున్రా ఇంకా ఏంది నీ అనుమానం నువ్వు కూడా మరి'' అన్నాడు వెంకటేశం ''మరింక బైదెల్లు ఇంటికి'' అన్నాడు మళ్ళీ అతనే

ప్రకాశానికి ఏమిటో ఉత్సాహంగా వుంది చెట్లకిందనుండి నడుస్తూ తాలూకాఫీసు గేటులో నుండి బయటకొచ్చారు కొద్దిసేపు ఎవరూ ఏమీ మాట్లాడలేదు

''పద నడు గబగబా పొద్దుబోతంది'' అన్నాడు వెంకటేశం ఇద్దరూ నడక వేగం పెంచారు చీకటి పడుతోంది

ప్రకాశం ఆలోచిస్తున్నాడు కొద్దిసేపున్న తరువాత తలతిప్పి వెంకటేశం వైపు చూస్తూ అన్నాడు ''అరే, అయితే మనకి కూలికింద డబ్బులిత్తారా లేకపోతే మామూలుగానే గింజలే కొలుత్తారా?''

ఆ మాటకు వెంకటేశం ఫక్కున నవ్వాడు ''ఓరీ తెలివి తక్కువ దద్దమ్మా! ఆల్లు గింజలు కొలవడానికి మనవేవన్నా కూలి పనికి పోతన్నావంట్రా అయితే నీకింకా అసలు ఇసయం అరదం కాలేదనుకుంటా పోలీసు నౌకరంటే అసలు ఏందనుకున్నావు? అహ్ అసలు నాకు తెలవకడుగుతా ఏందో సెప్పు, నీకు తెలిసిందేందో సెప్పు'' అన్నాడు

ప్రకాశం వెంకటేశం వైపు అయోమయంగా చూశాడు

''యేందిరా అట్టా సూత్తావ్, ఏందో సెప్పు''

''నాకేంతెలవదు నువ్వంటుంటేనూ, 'మ నా సావిలాగా గింజలు కొలవరు, డబ్బులిత్తారు' అనీ, అందుకొచ్చా'' అన్నాడు ప్రకాశం

''ఆహా పర్లేదురోయ్ నువ్వు పోలీసు నౌకరంటే సరకారోళ్ల కింద నౌకరన్నమాట ఆళ్లు మనకు డబ్బులు రూపాయలు ఇత్తారు తెలిసిందా'' అని ప్రకాశంవైపు ఎగాదిగాచూస్తూ, ''అరే మీ ఆసామి నడుక్కునీ ఓ పాతసొక్కా అన్నా అడుక్కుని తొడుక్కుని రాకూడదంటరా అట్టాగే ఒట్టొంటితో ఒచ్చావు'' అన్నాడు వెంకటేశం, చినిగిపోయి పీలికలయిన తన చొక్కావైపు చూసుకుంటూ వెంకటేశం తొడుక్కున్నది పేరుకు చొక్కయేగాని, మూడొంతులకుపైగా శరీరం బయటకు కనపడుతోంది

''ఓ యెన్నిసార్లు అడిగాననీ! ఆయనసలు ఇయ్యడ్రా సినిగి పీలికలై పోయిందికూడా యియ్యడు ఆళ్ళ చంటోడి ముడ్డికింద ఏత్తారు అన్నీ ఎప్పుడడిగినా యియ్యడు పిల్లలు లేకముందు కూడా ఒక్కసారన్నా ఒక్క పాతసొక్కా కూడా యియ్యలా'' అన్నాడు ప్రకాశం

''మా ఆసావి అట్టాంటోడుగాదు దెరమరాజు పాతసొక్కాలు నే నడక్కుండానే ఇత్తాడు ఆయన పెల్లాం కూడా మంచిదేరాపాపం పాతకోకలు యిత్తది నాపెల్లాంకి'' అన్నాడు వెంకటేశం

''మా ఆసాం పెల్లాం మంచిదేరా కాని ఆడే మంసోడుకాదు ఓసారి సినిగిబోయిన పాత కోక, ఆవ నాకిత్తే సంకన పెట్టుకుని తెచ్చుకుంటన్నా తెల్లారితే ఉగాది పండగ నా పెల్లానికి మరీ ఒక్క కోకే పండగపూట ఇది కట్టుకుంటదిగదా అనుకున్నా ఆడు యాడుండి సూసేడో గాని, నాకాడకొచ్చి సంకలో కోక వూడబీక్కున్నాడు అట్టాంటోడు''

వాళ్ళ సంభాషణ అనేక విషయాల మీదకు మళ్ళింది అప్పటికి బాగా చీకటి పడింది ఆకాశంలో నక్షత్రాలు మిణుకు మిణుకు మంటున్నాయి చంద్రుణ్ణి మేఘాలు కమ్మేస్తున్నాయి మసక వెలుగులో వడి వడిగా అడుగు లేస్తున్నారు అలవాటయిన దారిలో నడక అది డొంకపక్క జిల్లేడు పొదలున్నాయ్ వెంకటేశం రెండు జిల్లేడు ఆకులు తెంపుకొచ్చుకున్నాడు బొడ్లోనుండి ఎండిపోయిన పొగాకుతీసి దాన్ని మెత్తబడేటట్లు చెయ్యటానికి నోట్లో పెట్టుకుని చిన్నగా వూదాడు కొద్దిసేపటికి అది మెత్తబడింది కొంచెం పొగాకు తుంపి జిల్లేడు ఆకులోచుట్టి, మిగిలినదాన్ని మళ్ళీ బొడ్లో దోపుకున్నాడు రెండోవైపు బొడ్లోనుండి చిన్న గుడ్డసంచి తీసి, దానిలోనుంచి కొంచెం జమ్ముదూది, చెకుముకిరాళ్ళుతీసి నిప్పు పుట్టించి, మండుతున్న దూదిని చుట్టకంటించి గట్టిగా రెండు దమ్ములులాగాడు సంచిని మళ్ళీ బొడ్లో దోపుకుని, నోట్లోంచి చుట్టతీసి, పుసుక్కున వూశాడు కొద్దిసేపు ఇద్దరూ మౌనంగా నడిచిన తర్వాత, ''రేపు మద్దినాలకల్లా మనం యీడుండాలి, సరేనా'' అన్నాడు

''రేప్పొలానికి ఎరువు తోలాలిగా యీడకొత్తే వూరుకుంటాడా ఆసామి?'' అన్నాడు ప్రకాశం అమాయకంగా

''ఓరి యదవనాకొడకా! యెరువూలేదూ గిరువూలేదు యెగ్గొట్టి రాటమే ఓహో! నీకింకా సరకారోళ్ల నౌకరంటే అరదం కావటం లేదే ఇంకా అసలూ ''

''మమ్మ వద్దంటదేవోరా ఆడు యేసోబుగాడు సెపుతాడేమో మనం ఆసామి కాడ ఇంకోమడిసినిపెట్టి రావాలిగా మరి మన బదులు మనం మానుకుంటే యింగా ఇప్పటికిప్పుడు మనకోడు దొరుకుతాడు'' అన్నాడు ఇంకా అదే ధోరణిలో ప్రకాశం

''ఒరే పెకాసిగా, ఇప్పుడయన్నీ కానిపనులు మన విప్పుడేడ మడిసిని సూత్తాం సెప్పు

ఇట్టాంటియన్నీ పెట్టుకుంటే మనకీ నౌకరీ రాదు బతికినంతకాలం గొడ్డుశాకిరీ, జొన్న సంగటి, పుల్లనీల్లే గతి అరదమయ్యిందా? నువ్వెగ్గొట్టిరా ఆడే సూసుకుంటాడు ఇంకోడ్ని ఆడికి పాలేల్లే దొరక్కపోరులే ఇంకా నీకరదం కాకపోతే నీకరమ'' అన్నాడు వెంకటేశం

ప్రకాశం వింటూ వూరుకున్నాడు

''ఇంకోమాట'' మళ్ళీ వెంకటేశం అన్నాడు ''యీ యిసయాలన్నీ మనం అయ్యోల్లకీ, అమ్మోల్లకీ సెపితే ఈల్లసలు వొప్పుకోరు నీకు తెలవదు నే సెప్పినట్టు సెయ్యి నూ తెల్లారకట్ట మామూలుగానే లేసి, బూతాగి, పన్లోకిపోయి, పొలం కాడి నుండి అట్నుండి అటు రా నే నిటునుండి ఇటొత్తా అరదం సేసుకో మల్లీ''

వూకొడుతూ నడుస్తున్నాడు ప్రకాశం అతనేమి సమాధానం చెప్పలేదు అప్పటికి వాళ్ళు వూరి పొలిమేరల్లోకి వచ్చేశారు ఆకాశంలో మబ్బులు చెదిరిపోయి వెన్నెల చిక్కగా కురుస్తోంది దూరంగా చింతతోపు అక్కడక్కడ వున్న తాటిచెట్లు మసక మసకగా కనపడుతున్నయ్ ఊళ్ళో కుక్కలు మొరుగుతున్నయ్ ఊరు దగ్గరపడేకొందీ మనుషుల మాటలు స్పష్టాస్పష్టంగా వినపడుతున్నయ్ ప్రకాశం చిన్నగా నిట్టూర్చాడు వళ్ళంతా చెమటపట్టి వుంది డొంక బాటలోనుండి చీలి మాదిగపల్లి మీదుగా మాలపల్లి పోయే కాలిబాట దగ్గరకొచ్చారు ''ఈ దారిన పోదాంరా'' అన్నాడు ప్రకాశం వెంకటేశం ఏమీ మాట్లాడలేదు ఒకళ్ళ వెనక ఒకళ్ళు నడుస్తున్నారు కాలిబాట వెంట వెన్నెల వెలుగులో మాదిగపల్లి గుడిసెలు స్పష్టంగా కనపడుతున్నయ్ బాటకు కొంచెం దూరంలో ఒక పశు కళేబరం పడివుంది కుక్కలు కొన్ని దాని మాంసాన్ని పీక్కు తింటున్నాయి పల్లె దగ్గరయ్యేకొద్దీ అలవాటయిన వెగటుకొట్టే వాసన వాళ్ళ ముక్కుల్ని తాకింది ఆ పల్లెలో పదిహేను ఇరవై కన్నా ఎక్కువ గుడిసెలు వుండవు మాదిగపల్లెకీ, మాలపల్లెకీ మధ్య ఓ ఫర్లాంగు దూరం వుంటుంది పొలాలనుండి పశువులతోపాటు మనుషులూ తిరిగి వస్తున్నారు

దారి పక్కన వున్న పెద్ద పెద్ద గుంటల్లో వర్షపు నీరు నిలబడివుంది ఆ నీటిలో గోగునార కోసం నానబెట్టిన గోగుకాడల మూలంగా నీరంతా మురిగి, భరించలేని దుర్గంధం వస్తోంది కాలిబాట నానుకునే కొంతమంది పిల్లలు దొడ్డికి కూర్చుంటున్నారు దారికిరువైపులా జపాన్ తుమ్మచెట్లు దట్టంగా పెరిగివున్నయ్ యిద్దరూ యిళ్ళకు చేరేసరికి బాగా పొద్దుపోయింది మాలపల్లి గుడిసెల్లో ఆముదపు ప్రమిదలు మసక మసకగా వెలుగుతున్నయ్ పొయ్యిల్లో నుండి వస్తున్న తెల్లటి పొగ పూరిగుడిసెల కప్పుల్లోనుండి చిక్కగా బయటకు వచ్చి గాలిలో కలిసిపోతూవుంది గుడిసెల పక్కన దట్టంగా పెరిగిన పిచ్చిముళ్ళ చెట్లు గాలికి వూగుతున్నయ్ ప్రకాశం ఇంటికి వెళుతూనే భార్యని కేకేశాడు భర్త కేక విని పొయ్యి దగ్గరనుండి లేచి వచ్చింది మాణిక్యమ్మ

''నీల్లుతోడు ఆకలేత్తాంది'' అన్నాడు ప్రకాశం

మాణిక్యమ్మ వెళ్ళి పొంతలోని నీళ్ళు కుండలో తోడుకొచ్చి బయటపెట్టింది చూరు లోంచి గోచిగుడ్డ తీసుకొని, భార్య అందించిన మట్టిముంత తీసుకొనివెళ్ళి స్నానంచేసి వచ్చాడు గుడిసెలో ఆముదపు ప్రమిద మందంగా వెలుగుతోంది నీళ్ళు పోసుకున్నాక మళ్ళీ అదే పంచె కట్టుకొని వచ్చి గోడకానుకొని కూర్చున్నాడు ప్రకాశం మల్లో కడిగి, సజ్జ సంకటి పెట్టి, చింతతొక్కు వేసి తీసుకొచ్చి ప్రకాశం ముందు పెట్టింది మాణిక్యమ్మ మట్టి ముంతతో కుండలోని నీళ్ళు ముంచుకొచ్చి యిచ్చింది

''ఏడ కీ పూట పోయింది?'' అడిగింది మాణిక్యమ్మ

''యాడకి లేదులే మిరగాయుంటే ఒకటియ్'' అన్నాడు ప్రకాశం మాణిక్యమ్మ వెళ్ళి రెండు పచ్చిమిరపకాయలు తెచ్చిచ్చింది

''నేను రేపు మద్దినాల మల్లీ పట్నం పోవాల'' అన్నాడు మిరపకాయ కొరుక్కుంటూ

''ఎందుకు? రోజా ఏం పని? ఆసామి పొమ్మన్నాడా పనిమీదా? అయితే వుప్పుడు పట్టనం పోయత్తన్నావన్నమాట!'' అంది ఆమె

''కాదులే, నీకు తెలవదులే, రేపు సెపుతాలే '' అన్నాడు

ఆమె ఇంకేమీ మాట్లాడలేదు అన్నం తిని బయటకొచ్చి కొద్దిసేపు నిలబడ్డాడు ప్రకాశం ఇంతలో భార్య గుడిసెలో మంచం వాల్చింది వెళ్ళి పడుకున్నాడు అతని ఆలోచనలు రకరకాలుగా సాగుతున్నయ్ 'పోలీసు నౌకరీలో సేరితే కూటికన్నా లోటులేకుండా సాగిపోతే బాగుండు' అనుకున్నాడు 'జానెడు కడుపు నిండటమే కనాకట్టంగా వుందే ఎంతకాలం ఇట్టా' అనుకున్నాడు మళ్ళీ అతని అలోచనలు గతం వైపు తిరిగాయి

అతనికి వూహ వచ్చిందగ్గరనుండీ గమనిస్తూనే వున్నాడు కడుపునిండా అన్నం తిన్నరోజు లేదు వేకువఝామున లేచింది మొదలు భూస్వామి గొడ్ల చావిట్లోనో, పొలాల్లోనో, ఎండనకా వాననకా, పగలూ రాత్రీ ఆ భూస్వామి గొడ్లల్లో ఒక గొడ్డులాగా చాకిరీ చేసినా కడుపునిండా తిండి లేదు ఆ గొడ్లే నయం తిన్నంత తిండి వాటికి వీళ్ళు తినే తిండి ప్రాణాల్ని కొనవూపిరితో నిలబెట్టటానికే సరిపోతుంది యజమాని కొలిచిన సజ్జలో, కొర్రలో, జొన్నలో తెచ్చుకొని, వాటిని తొక్కి, ఉడకేసుకొని, తాగి, కాస్త కునుకు తీసి పిడుగులు పడుతున్నా సరే పన్లోకి పరిగెత్తాలి మళ్ళీ లేకుంటే భూస్వామి వూరుకోడు ఆ గంజికూడా దొరకదు పుట్టిందగ్గర నుండీ చచ్చేంతవరకూ అదే బ్రతుకు

కలబందనారతో అల్లిన మంచంమీద అటునుండి ఇటు దొర్లాడు ప్రకాశం నిద్ర పోవటానికి ప్రయత్నిస్తున్నట్టు కళ్ళు మూసుకున్నాడు కానీ ఆ రోజు అతనికి నిద్ర రావటం లేదు మనస్సులో జరుగుతున్న కల్లోలం అతనిని కుదురుగా పడుకోనివ్వటం లేదు కొత్తపనికి పోయే విషయంలో భయం, పాతదాన్ని వదిలెయ్యాలనే ఉద్దేశ్యం మధ్య ఘర్షణ జరుగుతోంది వెల్లకిలా పడుకున్నాడు మళ్ళీ గుడిసె కప్పుకు వున్న కంతల్లో నుండి ఆకాశంలోని నక్షత్రాలు మిణుకు మిణుకు మంటూ కన్పిస్తున్నాయి వెన్నెల వెలుగు పొడలు పొడలుగా గుడిసెలో పడుతోంది తలాతోకాలేని ఆలోచనలు చికాకు కలిగిస్తున్నాయి ఎవరిమీదనో తెలియని విసుగుదల గట్టిగా నిట్టూర్చి కాళ్ళు తన్ని పడుకున్నాడు

'జానెడు పొట్ట నిండటం ఎంత కట్టంగా వుందో, దానికోసం ఎన్నెన్ని పనులు సేయాల్సొత్తందో' అనుకున్నాడు 'పోలీసుల్లో సేరితే బతుకేవన్నా బాగుపడొచ్చు ఇంత అద్దుమానంగా మాత్తరముండదు ఆసామికి సెపితే పోనిత్తాడా? తెల్ల తుమ్మసెట్టుకి కట్టి గొడ్డుని బాదినట్టు బాత్తాడు సెప్పా పెట్టకుండా ఎల్లిపోవాల ఎట్టాగయితే అట్టాగయిద్ది' అనుకున్నాడు మళ్ళీ ఒక నిర్ణయాని కొచ్చినట్లు పక్కకు ఒత్తిగిలి పడుకున్నాడు ఎప్పటికో చిన్నగా నిద్రలోకి జారి పోయాడు

బాగా పొద్దెక్కిన తరువాత లేచాడు నిదానంగా కాలకృత్యాలు పూర్తి చేసుకున్నాడు ఆందోళనగా వుంది భార్య పెట్టిన సద్దన్నం తిన్నాడు ఆసామి ఇంటికి వెళ్ళాడు జారిపోతున్న

గుండెను దిటవుపరచుకుంటూ, తనకు తాను ధైర్యం చెప్పుకుంటూ గొడ్లచావిట్లోకి అడుగుపెట్టాడు మామూలుగా అయితే ఆ టైముకు పనంతా అయిపోవాలి ఆసామి అలవాటుగా తిట్టాడు ప్రకాశాన్ని కాని అవేవీ ఇతను పట్టించుకోలేదు పనంతా పూర్తిచేసి, ''నే పోతన్నా'' అని, ఆసామికి వినపడేలా కేకేసి ఇంటికొచ్చాడు తను ఇలా వెళుతున్నానని భార్యకూ, తల్లికీ చెప్పాలని అతని మనస్సులో పీకుతోంది కాని చెపితే పోనివ్వరని తెలుసు ఆందోళన అతన్ని కుదిపివేస్తోంది భర్త పనీ, మాటా పరధ్యానంగా ఉండటం భార్య గమనించింది కానీ ఏమీ అడగలేదు భర్త అలాగెందుకున్నాడోనని ఆలోచిస్తోంది అన్నం తింటూ భార్యవైపు చూశాడు హృదయంలో బాధ కలిగింది తల్లి ఏం చేస్తోందోనని చూశాడు ఆమె బయట వేపచెట్టు నీడలో కూర్చుని కచ్చికతో పళ్ళు తోముకుంటోంది వెంకటేశం కేక కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు అన్నం తిన్నచోటే గోడకానుకుని

''యేందీ అట్టాగున్నా?'' అంది భార్య ఎంగిలి మెతుకులు తీస్తూ ఇక ఆగలేక

''యట్టాగున్నా?'' అన్నాడు ఎదురుప్రశ్న వేస్తూ సమాధానంగా

''మీ ఆసామేమన్నా అన్నాడా ఆలిశ్యమయినందుకు?''

''ఏం లేదులే'' అని లేచి బొంగుల మంచంమీద కూర్చున్నాడు

రెండు నిముషాలు గడిచాక బయటనుండి వెంకటేశం కేక వినపడింది ఆ కేకలో కూడా ప్రకాశానికి ఆందోళన కనపడింది గబుక్కున లేచి బయటకొచ్చాడు గబగబా అడుగులు వేశాడు

''అయ్యా! యాడికిరా?'' అంటున్న తల్లి మాటలకు సమాధానం చెప్పలేకపోయాడు బాధ, ఆందోళన, దుఃఖం అతన్ని చుట్టుముట్టాయి ప్రకాశం రాకను చూచి వెనక్కు తిరిగి నడక సాగించాడు వెంకటేశం భార్య గబగబా గుడిసె బయటకొచ్చి, తల్లి మాటకు జవాబు చెప్పకుండా హడావిడిగా వెళుతున్న అతనిని ఆశ్చర్యంగా చూడటం ప్రకాశం గమనించలేదు తడబడుతున్న అడుగులతో అతను పల్లెదాటి డొంకలో అడుగుబెట్టాడు వెంకటేశం పదిగజాల ముందు గబగబా నడుస్తున్నాడు అతని మానసిక స్థితికూడా అలాగేవుంది ఒక్కసారి ఆగి వెనక్కి తిరిగి పల్లెవైపు చూశాడు ప్రకాశం నిరాశ నిండిన పల్లె ముఖాలు ఎండకు ఎండి వానకు తడిచి బిరుసెక్కిన శరీరాలు దారిద్ర్యం తాండవిస్తున్న గుడిసెలు వెక్కిరిస్తున్నట్లు పల్లెనిండా వున్న మొండిగోడలు అంతామాములుగానే, దరిద్ర దేవత ఉద్యానవనంలా వుంది కళ్ళల్లో నీళ్ళు వూరాయి తలతిప్పి నడక ప్రారంభించాడు తాలూకా ఆఫీసు దగ్గరకు వెళ్ళేవరకు ఎవరూ మాట్లాడలేదు

అక్కడి వాతావరణం వీళ్ళ ఆలోచనలను అటు తిప్పింది తమలాగే వచ్చినవాళ్ళు అక్కడ కొంతమంది కనిపించారు నల్ల ఆఫీసరు వచ్చిన వాళ్ళందరినీ ఒకసారి లెఖ్ఖపెట్టాడు నలుగురు రాలేదు వచ్చిన వాళ్ళ పేర్లు చదివి పిలిచాడు ఆ పేర్లువున్న కాగితాన్ని మడిచి జేబులో పెట్టు కుంటూ, వీళ్ళందరినీ జిల్లా ఆఫీసు దగ్గరకు రమ్మన్నాడు ''తెల్లారి ఏడింటికల్లా అక్కడుండాలి ఎనిమిది గంటలకల్లా వైద్య పరీక్షలు చేయిస్తారు'' అని ఆఫీసులోకి వెళ్ళిపోయాడు వీళ్ళంతా ముఖముఖాలు చూసుకున్నారు

ఆ కొద్దిసేపు తాత్కాలికంగా ఇళ్ళ గురించి మరిచిపోయారు అంతా

''ఏరా, ఇయ్యాలే మనల్ని టైనింగుకి పంపిత్తారన్నావ్ మరి ఈయనేందేందో సెపుతున్నాడు ఏందీ?'' అన్నాడు ప్రకాశం

''నాకు మాత్తరం ఏం తెలుసు నేనట్టాగే అనుకున్నా నిన్న ఆల్లు అట్టాగే సెప్పారుగా ఆల్లే

అందరినీ బండెకిత్తారనుకున్నా ఇయ్యాలేమో ఇట్టా గంటుండే చర్లేగానీ, నువ్వింటో నీ పెళ్లానికి సెప్పావా?'' అన్నాడు వెంకటేశం

''వూహుఁ నేనెందుకు సెవుతా సెపితే ఆల్లు యేడుపుకి లంకించుకోరూ మన బాదలు ఆల్లకేం తెలుసు పోలీసు నౌకరంటే అదేందో అంత బయ్యం ఆల్లకి మనమేమో, యీ కూలినాలికన్నా కాత్త ఎక్కువిత్తారని విందులోకి పోతన్నాం ఆల్లకియ్యన్నీ పట్టినియ్యా'' అన్నాడు ప్రకాశం బింకంగా కాని వాళ్ళ మనుస్సుల్లో బాధ సుడులు తిరుగుతోంది

ఆ మాటలు వెంకటేశంకు కొంచెం వూరట కలిగించాయి విని మెదలకుండా వున్నాడు వాళ్ళకేం తోచలేదు అక్కడున్న అందరి పరిస్థితీ ఇంచుమించు అలాగేవుంది ఎవరి ఆలోచనల్లో వాళ్ళు మునిగిపోయారు అందరివైపూ పరిశీలనగా చూశాడు ప్రకాశం కొద్దిసేపువున్నాక తనలో తను గొణుకుంటున్నట్లు, 'పోలీచాపీచు కాడికి పోయేటప్పుడన్నా వంటిమీద సొక్కాలేదు' అన్నాడు అతని మాటల్లో తీవ్రమయిన బాధ కనిపించింది ఆ మాటలు వెంకటేశానికి వినపడ్డాయి

ప్రకాశం పుట్టి పెరిగిన తరువాత, చినిగి పీలికలయిన చొక్కాలు తొడుక్కున్న రోజుల్ని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు ఆ మాటకొస్తే పల్లెల్లోని మగ వాళ్ళందరి పరిస్థితీ అంతే రవికలు తొడుక్కున ఆడవాళ్ళు కూడా మనకి పల్లెల్లో కనిపించరు భూస్వాముల లెక్కప్రకారం వీళ్ళకు ఒంటిమీద బట్టలక్కరలేదు గొడ్లకు మల్లే తమ పొలాల్లో తిరిగే గొడ్లల్లో లెక్కే వీళ్ళు

అక్కడ వున్నవాళ్ళల్లో ఎంతమంది తనలాగే చొక్కాల్లేకుండా వున్నారో పరిశీలిస్తున్నాడు ప్రకాశం చాలామందికి లేవు చొక్కాలు తొడుక్కున్న వాళ్ళ చేతుల్లో గుడ్డసంచుల్లో ఏవో వున్నయ్

''జిల్లా ఆపీచుకాడ మనం ఎన్ని రోజులుండాలి? బువ్వ ఆల్లే పెడతారా?'' అడిగాడు వెంకటేశాన్ని

ఆ మాటకు వెంకటేశం చిరాగ్గా చూశాడు ''నాకు మాత్తరం ఏం తెలుసురా అన్నీ నన్నడుగుతావ్ నేనూ అదే ఆలోసిత్తన్నా'' అన్నాడు ఏమి పాలుపోనట్టు దిక్కులు చుస్తూ

ప్రకాశం విని మెదలకుండా వూరుకున్నాడు

వాళ్ళకు కొంచెం దూరంలో, ఇందాకటి నుండి నిలబడి వున్న ఒకతను వాళ్ళ సంభాషణ విన్నాడు అతను వాళ్ళతో, ''జిల్లా ఆపీసుకాడికి వోరి తిక్కెట్లు ఆల్లే కొనుక్కుని బండెక్కిపోవాలంట ఆడ బువ్వ ఎవురికి ఆల్లే సూసుకోవాలి అప్పుడే ఆల్లు పెట్టరంట'' అన్నాడు

ఆ మాటలు విని ఇద్దరూ అతనివైపు చూశారు మనిషి నల్లగా వున్నాడు రేగేడు పండులా ముఖం గుండ్రంగా వుంది తలకు పైపంచె చుట్టుకొని, ముతక చొక్కా తొడుక్కొని, ముతక పంచె కట్టుకున్నాడు చేతిలో సంచి వుంది ఏమీ మాట్లాడకుండా అతన్ని అనుమానంగా చూస్తూ వుండిపోయారు వీళ్ళిద్దరూ

''మీదేవూరు'' అడిగాడు అతనే

చెప్పాడు ప్రకాశం

''యేమిటోల్లు''

వీళ్ళిద్దరూ మాట్లాడకుండా ముఖముఖాలు చూసుకున్నారు ఆ ప్రశ్నతో యిద్దరి మనస్సులు చివుక్కుమన్నాయి

''యేంది యేవిట్లు మీరు?'' మళ్ళీ అడిగాడు చిన్నగా అతను

జంకుతూ జవాబు చెప్పాడు వెంకటేశం ఆ జవాబు విని అతను చిన్నగా నవ్వాడు ''మేం గూడా మాల్లోల్లమేలే'' అన్నాడు

ఆమాట విని మళ్ళీ వీళ్ళిద్దరు ముఖముఖాలు చూసుకున్నారు తమ కులంలో ఆ పాటి మనుషుల్ని వాళ్ళు చాలా అరుదుగా చూశారు అతని మాట నమ్మలేనట్లు అతనివైపు చూశారు

కొద్దిసేపు నిశ్శబ్దం తర్వాత అతనే అన్నాడు మళ్ళీ ''మీరేమీ తెచ్చుకోలేదట్టుకుందిగా'' అని

''యేం తెచ్చుకోలేదు తెచ్చుకోటానికి మాకేవన్నా వుంటేగా'' అన్నాడు వెంకటేశం

అతను వీళ్ళిద్దరినీ మార్చి మార్చి చూశాడు ''మరి ఏం తెచ్చుకోకపోతే, ఆపీచుకాడెన్ని రోజులుండాలో, మరెట్టా సేత్తారూ ఆడ?!'' అన్నాడు అతను

ఆ మాట విని వాళ్ళు కొద్దిసేపు మౌనంగా వున్నారు ''మా కిట్టాంటి య్యేమీ తెలవ్వు అయినా తెచ్చుకోడానికి మాదగ్గర యేవీ లేవు తొడుక్కోటానికి సొక్కా కూడా లేదు అంతా ఆ కోటయ్యసామి దయ'' అన్నాడు ప్రకాశం పైకి తలెత్తి దండం పెడుతున్నట్లు చేతులు జోడించి

దేవుడిమాట ఎత్తగానే వెంకటేశం ఆలోచనలు చర్చిఫాదర్ మీదకు మళ్ళాయి చిన్నగా అన్నాడు ''ఒక పాత దుప్పటన్నా దయసేయి సామీ అని సెరిసి సాములోర్ని అడిగా ఇయ్యలా అయనగూడా ఎప్పుడూ ఒక్కటి కూడా ఇయ్యడ్రా రోజూ పేర్దనకి మాత్రం రమ్మంటాడు ఆయన సెప్పేదేందో సరిగా అరదం కాదు పేర్దన లేనప్పుడు కూడా రమ్మంటాడు ఆడికి పోయిందగ్గరనుండీ వూపిరాడకుండా పనులు సెపుతాడు ఒకసారి మా ఆసామిని ఆయనకాడ తిట్టా సిన్నగా అట్టా ఆసాముల్ని తిట్టగూడదంట ఆసామి నాకు తండ్రిలాంటోడంట నేను పాపం సేత్తున్నట్టంట నేను సేసిన తప్పుకు కీస్తువారిని పార్దించాలంట నాకు మా సికా కొశ్చింది మనం సెడు అన్నదాన్ని వాల్లు ఔనంటారేందో నాకరదం కాదు అప్పట్నుంచి పోటం మానేశా గుడికి ఎప్పుడన్నా ఆదారం పోతా''

''నేనూ అంతే'' అంటూ వుత్సాహంగా మొదలు పెట్టబోయాడు ప్రకాశం ఇంతలో ఆ కొత్త అతను అన్నాడు

''మీ సాములోరు తెల్లదొరా? నల్లోడా?''

''తెల్లాయనేనండీ ఏనుకొమ్ములాగా తెల్లగా వుంటాడు రోజూ సాంబువ్వతో (వరి అన్నం) కోడికూరతో తింటాడంట ఎండపొడ వంటిమీద పడనియ్యడు'' అన్నాడు ప్రకాశం

''రెండు రోజుల కొకసారి యాటకార్జం పట్నం నుండి తెప్పిత్తాడంట'' మధ్యలో మాట అందుకుని అన్నాడు వెంకటేశం ''మన పాములుగాడు లేడూ, ఆడు సెప్పాడు'' అన్నాడు మళ్ళీ

''ఆడు ఆడేగా వుండేది'' అన్నాడు ప్రకాశం

''ఆడి పని బావుంది రోజూ ఆడు సాంబువ్వేనంట తినేది రొండురోజుల కొకసారన్నా కోడికూర మిగిలిద్దంట అదిసరేగానీ మన కరణంగోరి సిన్నకోడల్ని, ఆ పాదరీగోరు ''

''సు షు మనకెందు కూరుకోరోయ్'' అన్నాడు ప్రకాశం వెంకటేశం మాట్లాడటం ఆపి, అటూ ఇటూ చూశాడు

''సరేలే అయ్యి అన్నిసోట్లా వున్నయ్యేలేగానీ, ముందు మన సంగతి ఆలోసించండి'' అన్నాడు ఆ కొత్తతను

మళ్ళీ వాళ్ళిద్దరి ఆలోచనలు ఇటు తిరిగాయి

''ఆలోసించటానికి ఏముంది'' అన్నాడు ప్రకాశం

ఆ మాటవిని ఆ కొత్తతను కొద్దిసేపు ఆలోచించాడు ''సరే, నా కాడ ఒక చొక్కావుంది పాతది నువ్వు తీసుకో ఏదయితే అదయిద్ది'' అన్నాడు సంచిలోంచి చొక్కాతీసి ప్రకాశాని కిచ్చాడు

వూహించని ఆ సంఘటన ప్రకాశాన్నీ, వెంకటేశాన్నీ ఆశ్చర్యంలో ముంచేసింది క్షణకాలం తబ్బిబ్బయ్యారు అతనిచ్చిన చొక్కాని అబ్బురంగా పట్టుకొని తీసుకున్నాడు ప్రకాశం అతని కళ్ళల్లో ఆనందం తళుకులీనింది వెంకటేశం వైపూ, ఆ కొత్తతనివైపూ మార్చిమార్చి చూశాడు వెంకటేశం కూడా సంతోషపడ్డాడు గభాలున ఆ కొత్తతని వైపు తిరిగి, ''అయ్యగారూ, తవరి పేరేంటోగానీ, మా వాడికి మంచి సొక్కా ఇచ్చారు సావీ దండంబాబూ'' అన్నాడు రెండుచేతులు జోడించి దండం పెడుతూ ప్రకాశంకూడా గభాలున చేతిలోని చొక్కా చంకలో పెట్టుకొని అతనికి దండం పెట్టాడు వాళ్ళ ప్రవర్తనకు అతను కంగారుపడ్డాడు కొద్దిగా నవ్వాడు చిన్నగా

ఆ చొక్కా తొడుక్కోవటానికి ప్రకాశానికి కొంచెం టైం పట్టింది దాత సహాయంతో చిన్నగా తొడుక్కున్నాడు అతని ఆనందానికి అవధులు లేవు వళ్ళంతా చల్లగా హాయిగా వుంది చొక్కా జేబులో చెయ్యిపెట్టి తడిమాడు విచిత్రంగా రంధ్రంలోకి వేలుపోయింది కొద్దిసేపటి వరకు ఈ ప్రపంచంలోకి రాలేదు

వీళ్ళు చూపిన కృతజ్ఞతకు దాత సంబరపడ్డాడు బాగా కొద్దిసేపు వాళ్ళతో మాట్లాడిన తరువాత, ''యీ రాత్తిరికి నేను తెచ్చుకున్న సద్ది ముగ్గురుం తిందాం రేపు మద్దినాలకి జిల్లా ఆపీసుకాడ యట్టా కుదిరితే అట్టా సేద్దాం'' అన్నాడు

సరేనన్నట్లు చూశారు వాళ్ళు అతనిపై ఆరాధనాభావం కలిగింది ఆనందంతో కళ్ళు చెమర్చాయి ''అయ్యగారూ తవరి పేరేంది?'' అన్నాడు ప్రకాశం

''నా పేరు జాన్'' అన్నాడు అతను

విని వూరుకున్నారు అతని పరిచయం వాళ్ళ దిగుల్ని పోగొట్టింది కొంతవరకు

''మరింక మనం ఇప్పుడేం సేద్దాం?'' అడిగాడు జాన్

''మాకేం తెలవదు అంతా నీ యిట్టం నువ్వెట్టా సెపితే అట్టాగే'' అన్నాడు వెంకటేశం అప్పటికే వాళ్ళమధ్య అంతరంతరాల్లో పరిచయం పెరిగిపోయింది

''సరే మనకి బండి తెల్లారగట్ట వుంది మనవిప్పుడు రేలు టేసను కాడికెల్లి, బూ తిని, ఆడనే పడుకుందాం తెల్లారకట్ట బండెక్కిపోదాం'' అన్నాడు జాన్ దానికి వాళ్ళిద్దరూ సరేనన్నారు

ముగ్గురూ నడుస్తూ రైల్వేస్టేషను దగ్గరకు వచ్చారు పొద్దుగూకుతోంది

''దచ్చినాది బండి వచ్చే యాలయ్యింది జనం శానామందున్నారు'' అన్నాడు జాన్ స్టేషన్ అవతల కొన్ని ఇళ్ళున్నయ్ అటువైపు చేయిచూపిస్తూ, ''ఆ యిల్లకాడికిపోయి బువ్వ తినొద్దాం యీడ నీల్లుండవ్‌మరి పొద్దు పోతాంది'' అన్నాడు అతనే మళ్ళీ

తలలూపారు ఇద్దరూ సరేనన్నట్లు ముగ్గురూ రైల్వేలైను దాటి వెళ్ళి ఒక ఇంటి ముందు నిలబడ్డారు

''అమ్మగారూ '' చిన్నగా కేకేశాడు జాన్ కొద్దిసేపటికి ఒక ముసలమ్మ బైటకొచ్చింది ఆమెను చూచి, ''అమ్మగారూ కాసిని నీల్లు పోయండమ్మా, బువ్వతింటాం'' అన్నాడు

ఆమె వీళ్ళని ఎగాదిగా చూచి, ''ఏమిట్లు'' అంది

జాన్ జవాబు చెప్పాడు

''ఏవూరు? యీడెందుకున్నారు?''

''తాలూకా కచ్చేరీకాడికి పనుండి వచ్చాం ఈ తెల్లారకట్ట బండికి పోతాం బువ్వ తిందామని యీడకొచ్చాం'' అన్నాడు జాన్

''సరే అటు కూర్చోండి'' అని గొడ్ల చావిడివైపు చేయిచూపించి లోపలికి వెళ్ళింది చావిట్లో నేలంతా గొడ్లపేడతో, ఉచ్చుతో రొచ్చుగా వుంది కొద్దిగా పొడిగా వున్నచోటు చూసి బొంతు కూర్చున్నారు ముగ్గురూ ఎదురెదురుగా సంచిలో నుండి సద్దిమూట బైటకుతీసి విప్పదీశాడు జాన్ వరిగన్నం, గోంగూరపప్పు, కొద్దిగా ఎర్రమిరపకాయల పచ్చడి ఆ అన్నం చూడగానే వీళ్ళిద్దరికీ నోట్లో నీళ్ళు ధారగా వూరాయి

'వరిగ బువ్వ తిని ఎన్నిరోజులయ్యిందో' అనుకున్నాడు వెంకటేశం చిన్నగా గుటకవేస్తూ అన్నం, పప్పు కలిపి పెద్దపెద్ద ముద్దలు చేశాడు జాన్ ఇద్దరికీ దోసిళ్ళలో చెరొక ముద్ద పెట్టాడు వాటిని కొద్ది కొద్దిగా కొరుక్కు తిన్నారు వాళ్ళు చిన్నగా

''మా మూలకంగా నీకీపూట అరదాకలితో గడిసింది'' అన్నాడు ప్రకాశం ఆ మాటకు జాన్ చిన్నగా నవ్వాడు కొంచెం సేపటికి ముసలమ్మ ఇంట్లో నుండి పెద్ద ఖాళీ ఇత్తడి చెంబుతో బయటకు వచ్చి, చావిట్లో గొడ్లకోసం పెట్టిన నీళ్ళ తొట్లో చెంబు ముంచి, నీళ్ళు తెచ్చింది అప్పటికి వీళ్ళు అన్నం తినటం పూర్తిచేసి లేచి నిలబడ్డారు ఆమె వాళ్ళకు దూరంగా నిలబడి దోసిళ్ళల్లో నీళ్ళు ఎత్తిపోసింది ముగ్గురూ కడుపునిండా తాగారు

''దండం తల్లా'' అన్నాడు జాన్ మిగిలిన ఇద్దరు కూడా దండం పెట్టారు రైల్వేస్టేషను కొచ్చారు చీకటి పడుతోంది స్టేషన్‌లో చెట్ల మీద పక్షులు అరుస్తున్నయ్ చలిగాలి బాగా వీస్తోంది ఒక చెట్టుకింద చోటు చూసుకొని కంబళి పరిచాడు జాన్ దానిమీద ముగ్గురూ పడుకున్నారు జాన్ తన సంచి తలకింద పెట్టుకున్నాడు

కొద్దిసేపు ఎవరి ఆలోచనలలో వాళ్ళు వుండిపోయారు 'తెల్లారేసరికి వంటినిండా రెట్టలేత్తయ్యేమో పిట్టలు' అనుకున్నాడు ప్రకాశం

''మీకు బాగా పొలం వున్నట్టుంది'' అన్నాడు వెంకటేశం నిశ్శబ్దాన్ని చెదరగొడుతూ

''అగును మాకు నాలుగెకరాల పొలం వుంది, మెట్ట మేం నలుగురుం అన్నదమ్ములం'' అన్నాడు జాన్ తరువాత ఎవరూ మాట్లాడలేదు

ప్రకాశం ఆలోచనలు ఇంటిమీదకు మళ్ళాయి 'యింటికాడ సెప్పా పెట్టకుండా వశ్చా ఆల్లు నా కోసం ఎదురు సూత్తుంటారు సెప్పి రావలసినమాట' అనుకున్నాడు 'యిట్టా సంగతి పోలీసు నౌకరీ సేత్తానికి పోతన్నాను అని సెపితే బాగుండేది' అనుకున్నాడు మళ్ళీ 'సెప్పకపోటమే మంచిదయిందిలే సెప్పినకాడ నుండి ఒకటేగోల ఇంతకు ముందొకసారి, పోయినేడాదనుకుంటా, యర్ర బాలిగాడు మిలటరీ కెలతానంటే, ఆల్ల యింటో పిల్లాజల్లా అంతా ఒకటే ఏడుపు 'తిన్నా సచ్చినా మాకళ్ళముందుండాల్సిందే, అది నెత్తుటికూటి నౌకరు ఆడికిపోయి దిక్కుమాలిన సావు సావాలను కుంటన్నావా?' అని నానా గొడవచేసి ఆడిని మిలిట్రీలోకి పోకుండా జేసేరు పోలీసు నౌకరీకూడా ఆల్ల దుట్టిలో అట్టాంటిదే ఆల్లకే కాదు, తనకి కూడా భయంగానే వుంది, ఏదో జనంతో కలిసిపోతుండబట్టి గానీ' అనుకున్నాడు మళ్ళీ

కటిక నేలమీద పడుకోవటం అలవాటే అయినా, కొత్తచోటు కావటం వలన అతనికి నిద్ర రాలేదు జాన్, వెంకటేశం అప్పుడే నిద్రలోకి జారిపోయారు జాన్ గురించి ఆలోచించాడు

ప్రకాశం 'తను బుద్ధి ఎరిగాక సొక్కా తొడుక్కోనట్టే నిజంగా ఈయనగారు బకు దొడ్డమడిసి ఏపైనా కులపోల్లు కులపోల్లు ఒకటవుతారుగానీ పరాయోల్లు ఎందుకిత్తారు' అనుకుంటూ అదే విషయం ఆలోచిస్తూ నిద్రపోయాడు

తెల్లవారుఝామున దూరం నుండి వినిపించిన రైలుకూతకు వులిక్కిపడిలేచారు ముగ్గురూ తలకింద పెట్టుకున్న పైపంచెతీసి దులిపి భుజాన వేసుకున్నాడు ప్రకాశం వదులయిన గోచీని బిగించుకున్నాడు గబగబావెళ్ళి కాలుమడుచుకొని వచ్చాడు గుడ్డలమీద పడిన పిట్టల రెట్టలు ఎండిపోయి అంటుకుపోయాయి కనపడినంత వరకు గీకి తీసివేశాడు ఇంకా చీకటిగానే వుంది బాగా

''మనకి టిక్కెట్లో మరి?!'' అడిగాడు వెంకటేశం జాన్ని

''టిక్కెట్లకి డబ్బులేడున్నయ్ మనకాడ? బండెక్కటమే ఓరన్నా పట్టుకుంటే, ఇసయం సెప్పి దండం పెడతవే'' అన్నాడు జాన్

ప్రకాశానికి ఏమీ అర్థంకాలేదు అతనికి హుషారుగా వుంది చుట్టూ చూస్తున్నాడు నిన్న ఉదయం తమతోపాటు తాలూకాఫీసు దగ్గరున్న వాళ్ళు చాలామంది వచ్చారిప్పుడు ఇంతలో బండి కూత దూరం నుండి వినపడింది మళ్ళీ అందరిలో ఆదుర్దా చోటుచేసుకుంది కొద్ది సేపటికి భారంగా వచ్చి స్టేషన్లో ఆగింది రైలు అందరూ ఎక్కారు బండెక్కుతుంటే ప్రకాశానికి భయమేసింది అతనంతకుముందు ఎప్పుడూ రైలెక్కలేదు ఎక్కి, ముగ్గురూ ఒక బల్లమీద కూర్చున్నారు పెట్టెల్లో లైట్లు గుడ్డిగా వెలుగుతున్నాయ్ కంపార్టుమెంటు అంతా ఇంచుమించు ఖాళీగా వుంది కూతవేసి చిన్నగా బయలుదేరింది రైలు బండివేగం పుంజుకుని వెళుతున్నప్పుడు ఆ ప్రయాణం వీళ్ళకెంతో ఆనందం కలిగించింది ఒకళ్ళని చూచి ఒకళ్ళు చిన్నగా నవ్వుకున్నారు ప్రకాశం, వెంకటేశం జాన్ కిటికీ పక్కన కూర్చుని బయటకు చూస్తూ ఏదో ఆలోచనలో మునిగిపోయాడు చిన్నగా వెలుగురేఖలు అంతటా వ్యాపిస్తున్నాయి పచ్చటిచేలూ, ఎగురుతున్న పిట్టలూ, చెట్లు, పుట్టా అన్నీ వెనక్కి పరిగెడుతున్నట్లు అనిపిస్తున్నయ్ ఆ ప్రయాణం వారికెంతో ఆనందం కలిగించింది చాలా స్టేషన్లలో బండి ఆగింది మూడు గంటల ప్రయాణం తరువాత రైలు జిల్లాహెడ్క్వార్టరు గుంటూరు చేరింది మిగతావాళ్ళతోపాటు వీళ్ళుకూడా దిగారు వీళ్ళకంతా కంగారుగా వుంది చాలాసేపు స్టేషన్లోనే ఇటూ అటూ చూస్తూ తిరిగారు అక్కడ వాళ్ళకు చాలా రైళ్ళు కనిపించాయి ప్రకాశానికి చాలా సంతోషంగా, హుషారుగా వుంది చాలాసేపటి తరువాత బయటకు వచ్చారు. వాళ్ళనెవరూ టిక్కెట్లు అడగలేదు స్టేషను బయటకొచ్చి చూచి ఆశ్చర్యంతో నోరెల్లబెట్టాడు ప్రకాశం వెంకటేశం పరిస్థితి కూడా అలాగే వుంది పెద్దపెద్ద విశాలమైన రోడ్లు, వాటిమీద సైకిళ్ళు, రిక్షాలు అప్పుడప్పుడు బస్సులు తిరుగుతున్నాయ్ వాటిని చూస్తూ వుంటే ప్రకాశంకు చాలా సంబరంగా వుంది కథల్లో చెప్పుకునే స్వర్గలోకం గుర్తొచ్చింది అతనికి

దారిలో కనపడ్డ వాళ్ళని అడుగుతూ జిల్లా పోలీసు ఆఫీసు దగ్గర కెళ్ళారు తమతోపాటు తాలూకా ఆఫీసు దగ్గర వున్నవాళ్ళు కొంతమంది అప్పటికే అక్కడకు వచ్చివున్నారు అందరూ, ఆఫీసు ముందున్న పెద్ద మర్రిచెట్టు కింద నిలబడ్డారు టైము పదికావస్తోంది కడుపులో ఎలుకలు పరిగెత్తుతున్నయ్ అందరికీ వాళ్ళని గురించి పట్టించుకున్నవాళ్ళు లేరు చాలామంది యూనిఫారాలు వేసుకుని తిరుగుతున్నారు అక్కడట్లా ఎంతసేపు వుండాలో ఎవరికీ అర్థంకాలేదు అటూ ఇటూ యూనిఫారం వేసుకుని తిరుగుతున్న వారిని అడగటానికి ఎవరికీ ధైర్యం చాలలేదు

పరిసరాల్ని పరిశీలిస్తూ వుండిపోయారు ఇంతలో తాలూకాఫీసు దగ్గర మాట్లాడిన నల్ల ఆఫీసరు కనిపించాడు వీళ్ళవైపే వస్తున్నాడు అతని రాకనుచూచి కూర్చున్నవాళ్ళు లేచి నిలబడ్డారు

''అంతా వచ్చారా?'' అడిగాడు నల్ల ఆఫీసరు అక్కడకు వస్తూనే నిలబడ్డ వాళ్ళందరినీ లెఖ్ఖపెట్టాడు ''ఇంకా చాలామంది రావాలిగా'' అన్నాడు ''ఇంకొంచెంసేపు చూస్తా, వస్తే వస్తారు లేకపోతే వున్నవాళ్ళనే గవర్నమెంటు ఆసుపత్రికి తీసుకుపోతాం రెడీగా ఉండండి అంతా'' అంటూ వెళ్ళిపోయాడు

అతను వెళ్ళినవైపే చూస్తూ, ''నాకు తెగ ఆకలేత్తంది'' అన్నాడు ప్రకాశం

''నాక్కూడా'' అన్నాడు వెంకటేశం

''నాక్కూడా ఆకలిగానే వుందిమరి ఏంచేద్దాం?'' అన్నాడు జాన్

''మనమెట్టాగూ ఆసుపత్రి కాడికి ఎల్లేసరికి పొద్దెక్కిద్దిగా ఇంతలో అటుపోయి నాలుగిల్ల కాడ నాలుగు ముద్దలు అడుక్కొని, కడుపు నింపుకోకపోతే పేనంపోయిద్ది, లాబంలేదు'' అన్నాడు వెంకటేశం

వెంటనే మరో ఆలోచన లేకుండా ముగ్గురూ కదిలారు ఎదురుగా, దూరంగా వున్న ఇళ్ళ వైపు వెళ్ళారు తిరిగి ఒక అరగంటలోపే పై పంచెలో అన్నంతో తిరిగొచ్చారు ఆఫీసు దగ్గరవున్న పంపుదగ్గరకెళ్ళి, రెండుసార్లు నీళ్ళు పుక్కిలించివూసి, ముఖాలు ఆదరాబాదరా కడుక్కుని, అడుక్కొచ్చుకున్న అన్నం తిన్నారు అక్కడేకూర్చుని ప్రాణం కుదుటపడింది పది నిముషాలకు చిన్నగా చెట్టుకింద కొచ్చారు అప్పటికి అక్కడకు చాలామంది చేరారు

''అందరూ వచ్చినట్టున్నారు'' అన్నాడు జాన్

''సద్దిబువ్వయినా వరిబువ్వ దొరికింది యీడుండే వోల్లెవురూ జొన్న సంగటొండు కోరు గాబోలు'' అన్నాడు వెంకటేశం

కడుపులో ఆకలిమంట తగ్గేసరికి హుషారుగా వున్నాడు ప్రకాశం అంతలో నల్ల ఆఫీసరు అక్కడకు వచ్చాడు వస్తూనే హడావిడిగా, ''అందరూ వరుసలో నిలబడండి'' అన్నాడు అంతావరుసగా ఒకళ్ళ పక్కన ఒకళ్ళు నిలబడ్డారు కాగితం,కలం తీసుకొని అందరిపేర్లూ రాసుకున్నాడు ఎవరిపేరు కెదురుగా వాళ్ళవాళ్ళ తండ్రులపేర్లూ, కులం రాసుకున్నాడు వాళ్ళని చూచి తనంతటతనే ఉజ్జాయింపుగా వాళ్ళ వయస్సులు వేసుకున్నాడు ఇంతలో తెల్ల ఆఫీసరు అక్కడకు వచ్చాడు నల్ల ఆఫీసరు కలం కాగితం జేబులో పెట్టుకొని, గిరుక్కున వెనక్కు తిరిగి, రీవిగా చేతులు వూపుకుంటూ నడిచివెళ్ళి తెల్లదొరముందు రక్కున ఆగి హుందాగా సెల్యూట్ చేశాడు దొరకూడా నల్ల ఆఫీసరుకు అలాగే సెల్యుట్‌చేశాడు పేర్లు రాసిన కాగితాన్ని తెల్లదొరకు అందిచ్చి ఏదో చెప్పాడు నల్ల ఆఫీసరు తెల్లదొర ఏవో ఇన్‌స్ట్రక్షన్స్ జారీ చేశాడు అవి విని తిరిగి సెల్యూట్‌చేసి గిరుక్కున వెనక్కు తిరిగి వీళ్ళ దగ్గరకు వచ్చాడు నల్ల ఆఫీసరు నిలబడ్డ వాళ్ళంతా ఆత్రుతగా అతనివైపు చూశారు ఏమి చెపుతాడో అని

''ఇప్పుడు మీరంతా గవర్నమెంటు ఆసుపత్రికి రండి అక్కడ మీకు మెడికల్‌టెస్ట్ జరిగిద్ది'' అని వెళ్ళిపోయాడు

అప్పటికివరకూ బొమ్మల్లా నిలబడ్డవాళ్ళు కదిలారు చిన్నగా ఆసుపత్రికి దారి తెలిసినవాళ్ళు ముందు నడుస్తుంటే మిగిలినవాళ్ళు వాళ్ళని అనుసరించారు

ఇందాక నల్ల ఆఫీసరు పేర్లు రాసుకున్నప్పుడు ఒకరి కులం ఒకరికి తెలిసిపోయింది అక్కడున్న

వాళ్ళల్లో ఎక్కువమంది తక్కువకులం వాళ్ళే ఇద్దరు ముగ్గురు ముస్లింలు కూడా వున్నారు ఆసుపత్రికి బయలుదేరేటప్పుడు వాళ్ళు ఏ కులంవాళ్ళు ఆ కులపోళ్ళల్లో కలిసిపోయి, జట్లుగా విడిపోయారు మొత్తం మీద అందరూ దరిద్రులే బ్రతుకులో కొంతైనా మెరుగుదల వుంటుందనే ఆశతో వాళ్ళు ఈ నౌకరీ చెయ్యటానికి వచ్చారు

తక్కువకులం వాళ్ళు వెనక నడుస్తున్నారు వాళ్ళల్లో చాలామంది జిల్లాకేంద్రం ఎప్పుడూ చూడలేదు ముందు నడుస్తున్న వాళ్ళల్లో కూడా చాలామంది ఎప్పుడూ పట్టణానికి వచ్చినవాళ్ళు కాదు అంతా కొత్తగా, వింతగా వుంది వాళ్ళకు ముందు నడుస్తున్న వాళ్ళల్లో ఒకతను గిరుక్కున వెనక్కు తిరిగి, వెనక గుంపులో నడుస్తున్న ఒకతని దగ్గరకు వచ్చి, ''నీ పేరేంటి?'' అన్నాడు అతను అలా ఆగి హఠాత్తుగా వెనక్కివచ్చి అడిగేసరికి అందరూ ఆగిపోయి అతన్నే చూస్తున్నారు

అడిగిచ్చుకున్నతను తన పేరు 'చంద్రయ్య' అని చెప్పాడు భయంగా

''నువ్వు మాలోడివా, మాదిగోడివా?'' అన్నాడు మొదటతను కోపంగా

''మాలోల్ల కుర్రోన్ని'' అన్నాడు చంద్రయ్య భయంభయంగా అంతే అతను సమాధానం చెప్పీ చెప్పకముందే మొదటి అతను చంద్రయ్యని బలంగా గుద్దాడు ముఖంమీద, పిడికిలి బిగించి ఆ దెబ్బకు చంద్రయ్య తూలి వెనక్కు పడ్డాడు అంతలో ముందు గుంపులోని వాళ్ళు కొంతమంది వచ్చి కొట్టినతన్ని పట్టుకున్నారు వూహించని సంఘటన అంతా క్షణాల్లో జరిగిపోయింది

''అరే వీరయ్యా! ఈడి సంగతి తరవాత చూద్దామనుకున్నాంగా, అంతలోనే వూరక తొందర పడతావే'' అన్నాడు ఒకతను దెబ్బకొట్టినతనితో దెబ్బతిని కిందపడిన చంద్రయ్య ముక్కులో నుండి ధారగా రక్తం కారుతోంది పక్కనే వున్న ఒకతను గభాలున పైపంచతో చంద్రయ్య ముక్కుని అదిమిపట్టాడు చంద్రయ్య చొక్కా ముందుభాగం నెత్తురుతో తడిచింది అతన్ని అలాగే ఆసుపత్రికి తీసుకుపోయారు మిగతావాళ్ళు ఆసుపత్రి వరండాలో అంతా జట్లు జట్లుగా నిలబడ్డారు

జాన్, ప్రకాశం మిగిలిన వాళ్ళు చంద్రయ్య చుట్టూచేరి రకరకాల ప్రశ్నలు వేస్తున్నారు ''మీకింతకు ముందు ఏదన్నా గొడవ జరిగిందా?, ఆయన నీకింతకు ముందే తెలుసా?'' అడిగాడు వెంకటేశం

''నాకేం తెలవదు అసలెందుకు కొట్టాడో కూడా తెలవదు'' అన్నాడు బాధగా చంద్రయ్య ఆ మాట విన్న వీళ్ళకు కడుపు మండిపోయింది జాన్ గబగబా అవతలివాళ్ళ దగ్గరకు వెళ్ళాడు అతన్ని నలుగురయిదుగురు అనుసరించారు

''మావాడేం చేశాడని మీరు కొట్టారు?'' అన్నాడు కొంచెం ఉద్రేకం నిండిన స్వరంతో

ఆ మాట విని గుంపులో నుండి ఒక అడుగు ముందుకు వేశాడు వీరయ్య జాన్ వైపు చూపుడువేలు చూపుతూ, ''యింగా మాట్లాడితే బొమికలు యిరగదంతా, నాకొడకల్లారా మాల మాదిగ నా కొడుకులకు యెంత బొగరు యేం సూసుకునిరా మీకంత యిది? అప్పుడే మీపని అయ్యిందనుకో మాకండి బైటికెల్లాక మీ రకతాలు కల్ల సూత్తాం నా కొడకల్లారా మీ యమల్ని పెల్లాల్ని అక్కల్ని ''

ఆ మాటలకూ, తిట్లకూ ప్రకాశంకు వళ్ళుమండిపోయింది వుద్రేకంతో వూగిపోయారు వీళ్ళు జాన్ ఏదో అనబోయేలోపు గేటులోంచి, గచ్చుమీద టకటకా బూట్లు శబ్దం చేసుకుంటూ నల్ల ఆఫీసరు వస్తూ కనిపించాడు కోపాన్ని బలవంతంగా దిగమింగుకున్నారు వీళ్ళు జాన్ ఏమీ

మాట్లాడకుండా వుండిపోయాడు నల్ల ఆఫీసరు వస్తూనే అందరినీ వరుసగా నిలబడమన్నాడు అలా అంటూనే చొక్కా అంతా రక్తంతో తడిచిపోయిన చంద్రయ్యని చూచి, ''యేం జరిగింది, యేం జరిగింది?'' అంటూ దగ్గరకొచ్చాడు కొంచెం ఆత్రుతగా

''అల్లదిగో, ఆయనగారు కొట్టాడండి బాబుగారూ నేనేం సెయ్యలేదు గావాల్నంటే య్యాల్లందరినీ అడగండి'' అన్నాడు చంద్రయ్య, నెత్తురుబొట్లు కారకుండా గుడ్డతో ముక్కు ఒత్తిపట్టుకుంటూ

నల్ల ఆఫీసరు చటుక్కున తలతిప్పి అవతలి గుంపువైపు చూశాడు అతనికి కోపంతో నొసలు ముడిపడింది

''ఇతన్ని కొట్టిందెవరు?'' అడిగాడు కోపంగా

''నేనే'' అంటూ వీరయ్య గుంపులో నుండి బయటకు వచ్చాడు నల్ల ఆఫీసరు ఏదో అడగబోయే లోపలే వీరయ్య గట్టిగా, ''యీాడేం సేశాడో తమరికేం తెలుసు '' అన్నాడు

''ఏం చేశాడు?'' అడిగాడు గద్దిస్తున్నట్లు నల్ల ఆఫీసరు

''రాతిరి యీ మాల నా కొడుకు నాతోపాటు రైలెక్కి నాకెదురుగా బల్లమీద నాతో సమానంగా కూకుంటాడా? ఆడేందీ, ఆడి కులమేంది? కాత్త ఎర్రగా వుంటేనూ ఏరే కులపోడనుకున్నా పొద్దినాల తవరు అందరి కులాలు అడిగినప్పుడు బయటపడ్డాడు రాత్తిరే, ఆడికులం తెలిసుంటే, ఆడే, బండిలోనే ఇరగదీసి కిందకి దోసేవాడిని ఈడికెన్ని గుండెలుండాలి ఆసామి కెదురుగా బల్లమీద కూకుంటానికి దొంగనాకొడుకు, యీడిని '' ఇంకా ఏదో అనబోయాడు వీరయ్య

''ఇంక నోర్ముయ్'' గట్టిగా కేకవేశాడు నల్ల ఆఫీసరు అతని గద్దింపుకు మిగిలినవాళ్ళు బిత్తరపోయిచూశారు ''రైలుబండి నీ బాబుదా?'' అన్నాడు కోపంతో వీరయ్య కళ్ళల్లోకి సూటిగా చూస్తూ ఆ చూపుల్ని తట్టుకోలేకపోయాడు వీరయ్య వూహించని పరిణామానికి నిర్ఘాంత పోయాడు ఏంచెప్పాలో తోచలేదు తలదించుకున్నాడు గొంతు పొడిబారింది

''మాలా మాదిగలు నీలాగా ప్రయాణం చెయ్యగూడదా రైల్లో? రైలు నువ్వు కొనేశావా?'' నల్ల ఆఫీసరు కళ్ళలోకి రక్తం ఎగజిమ్మింది అతని కోపానికి అడ్డుకట్ట వేస్తున్నట్లు తెల్ల ఆఫీసరు లోపలి నుండి వచ్చాడు నల్ల ఆఫీసరు తెల్ల ఆఫీసరు దగ్గరకు స్మార్ట్‌గా నడుచుకుంటూ వెళ్ళి సెల్యూట్‌చేసి, దెబ్బ తిన్న చంద్రయ్యవైపు చెయ్యి చూపిస్తూ విషయం చెప్పాడు విషయం విని తెల్ల ఆఫీసరు నల్ల ఆఫీసరుకు ఏదో చెప్పి లోపలికి వెళ్ళాడు నల్ల ఆఫీసరు వెనక్కు తిరిగివచ్చి వీరయ్యతో, ''నిన్ను లిస్టులోనుండి తీసివెయ్యమన్నారు దొరగారు, నువ్వెళ్ళిపోవచ్చు'' అని కోపంగా చూస్తూ లోపలి కెళ్ళాడు

ఆ మాట వినటంతోనే నీరుగారి పోయాడు వీరయ్య అతని తోటివాళ్ళు ఆదుర్దాగా అతనిచుట్టూ చేరారు వాళ్ళల్లో ఒకతను వీరయ్యని ఉద్దేశించి, ''నేను ముందే చెప్పానుగదా! ఆ నా కొడుకు పని ఇప్పుడు కాదు తరవాత చూద్దాం అంటే ఇనకుండా తొందరపడ్డావు ఇప్పుడు సూడు ఏమయ్యిందో'' అన్నాడు అతని పేరు శీతారామయ్య

''అయినా దెబ్బ కూడా ఏమంత పెద్దదికాదు. వూరికే ముక్కు బెదిరి, నెత్తురొచ్చింది ఆ మాత్రం కొట్టే అక్కు మనకులేదా?!'' అన్నాడు ఇంకొకతను

''అయినా నాకు తెలవకడుగుతా, దానికీ దీనికి ఏంది సంబందం ఆ మాల నా కొడుకుని కొట్టినంత మాత్రాన ఈడి పేరు లిట్టులోంచి తీసెయ్యటం యేంది? ఇది శానా అన్నేయం''

అన్నాడు ఇంకొకతను

ఆ మాట విన్న మిగిలిన వాళ్ళల్లో చాలామంది ''అవును ఇది శానా అన్యాయం'' అన్నారు

ఈ తతంగం అంతా మొదటి నుండీ గమనిస్తున్న అదే బేచ్చీలోని ఒకతను వుండీ వుండీ ఇప్పుడు గొంతు విప్పాడు ''ఎవుడ్రా ఆ మాట అంది? అన్నాయం, అన్నేయం అనేవాళ్ళు ఆయనగారి దగ్గరకు పోయి ఆ మాట అడగొచ్చుగా'' అన్నాడు

ఆ మాటలు విని మిగిలిన వాళ్ళు అతని వైపు ఎగాదిగా చూశారు ''అయితే యిదేందంటావ్ అన్నేయం కాదంటావా? నీకు కళ్ళు కనపడతన్నయ్యా?! జరిగిందంతా సూసికూడా నువ్వు అట్టా మాట్టాడుతున్నావు అంటే ఎంతన్నాయం పైగా ఈడు మనోడు'' అన్నాడు ఒకతను ఆవేశంగా

''మనోడు కాబట్టే సెబుతున్నా అసలీడు అతన్నెందు క్కొట్టాలి? వాళ్ళు రైళ్ళెక్కి బెంచీలమీద కూర్చోకూడదని ఎక్కడన్నా రాసుందా వీడికేం అక్కుందని అతన్ని అంతాలావు దెబ్బకొట్టాలి? అదే దెబ్బ అతను వీణ్ణి తిరిగి కొడితే వీడెక్కడుండేవాడు? మనూళ్ళల్లో, మనిళ్ళల్లో ఆళ్ళని సూచినట్టు ఈడగూడా సూత్తే ఇట్టాంటియ్యే జరుగుతాయి ''

అతని మాటలు పూర్తి కాకుండానే శీతారామయ్య అందుకొని, అయితే మనిల్లకాడ కొట్టొచ్చుగానీ, ఇట్టాంటిసోట వద్దనేగా, అదేగా నువ్వనేది'' అన్నాడు వెటకారంగా ఆ మాటలకు మొదటతను చిరాగ్గా చూశాడు

''నువ్వేట్టాగన్నా అనుకోగానీ, నేననేదేంటంటే ఎవురన్నాయంగా పెవర్తించినా వూరుకొనే రోజులు పోయినియ్యి దాన్ని బట్టి మసులుకోండని సెపుతున్నా ఈ తెల్లదొర ఇంకా మంచోడనే సెప్పుకోవాలి అదే ఇంకోడయితే ముందు మనోడ్ని ఏడు కడ్డీ లెనక్కి నెట్టేవాడు ఆనిక్క, నిదానంగా యవ్వారం చేసేవాడు మీకు పెపంచం తెలియదు ఆ వూళ్ళూ ఆ పల్లెలే ప్రపంచం '' అన్నాడు అతను

ఆ మాటలకు ఒకతను విసురుగా ఇవతలి కొచ్చాడు ''అరే గురవయ్యా, నువ్వు అయిస్కూల్లో నాలుగచ్చరం ముక్కలు నేర్సుకున్నావని, నీకు పెరపంచకమంతా తెలుసున్నట్టు, మాకేం తెలవదన్నట్టు మాట్టాడమాక నీబోటోళ్లుండబట్టే ఈళ్లకింత కొమ్ము లొత్తన్నయ్ '' అన్నాడు ఉద్రేకంగా,

అతని మాటలకు చిరాగ్గా చూశాడు గురవయ్యే మళ్ళీ ''మీ ఖర్మ'' అన్నాడు

ఇంతలో ఆసుపత్రిలో నుండి ఇద్దరు మనుషులు వచ్చి దెబ్బ తగిలిన చంద్రయ్యను లోపలకు తీసుకుపోయారు వీళ్ళమధ్య ఇంక ఏమీ సంభాషణ జరగలేదు తరువాత కొద్దిసేపటికి ఇద్దరు కానిస్టేబుళ్ళు అక్కడకు వచ్చారు. వాళ్ళు అటూ ఇటూ చూచి, రహస్యం చెపుతున్నట్లు, ''మరి ఆసుపత్రిలో డ్యాక్టరుగారికీ, ఇంకా చాలామందికి మామూళ్ళు యియ్యాలి లేకపోతే అందరినీ అన్‌పిట్టు చేస్తారు మనిషికి ఒక రూపాయి సొప్పున యియ్యండి నల్ల ఆపీచరుగారే సెప్పారు తొందరగా కానియ్యాలి'' అన్నారు, ఒకళ్ళ మాటకు ఇంకొకళ్ళు గొంతు కలుపుతూ

కొంతమంది ఇచ్చారు చాలామంది దగ్గర లేక ఇవ్వలేదు మొత్తం ఎంతమంది ఇచ్చిందీ లెఖ్ఖ పెట్టుకున్నారు వాళ్ళు అవి తీసుకుని లోపలకు వెళ్ళిపోతూ, ''మీలో వీరయ్య అంటే ఎవరు?'' అని అడిగారు

''ఈడేనండీ'' అని ఒకతను వీరయ్యను చూపాడు

''నువ్వు కూడా రూపాయి యిచ్చావా?'' అని వాళ్ళు వీరయ్యని అడిగారు

'ఇచ్చాన'ని తలూపాడు వీరయ్య వెంటనే ఒక కానిస్టేబులు రూపాయిబిళ్ళ వీరయ్య కిచ్చివేస్తూ, ''నిన్ను లిస్టులోనుండి తీసివేశారంట, నువ్వు ఎల్లిపోవచ్చు'' అన్నాడు ఆ మాట చెప్పి వాళ్ళు వెళ్ళిపోయారు అంతా ఆ వెళుతున్న వాళ్ళవైపూ, వీరయ్యవైపూ చూస్తూ వుండిపోయారు ఒక పావుగంట తరువాత తిరిగొచ్చి వీరయ్యను మినహా మిగిలిన వాళ్ళను లోపలకు తీసుకువెళ్ళారు ఆ కానిస్టేబుళ్ళు

డబ్బు లివ్వనందున అన్‌ఫిట్ చేస్తారేమోనని ప్రకాశానికి భయంగా వుంది డబ్బు లివ్వని వాళ్ళందరి స్థితీ అలాగే వుంది కాని ఎవరూ పెదవి విప్పలేదు ఆసుపత్రి లోపలి వాతావరణం వాళ్ళకు కొత్తగా వుంది అందరికీ మెడికల్ టెస్ట్ అయ్యేసరికి మూడుగంటలు పట్టింది అందరూ ఫిట్ అయ్యారు ఆరోజు సాయంత్రానికల్లా అందరికీ యూనిఫారం, కిట్టుపెట్టెలు,[10] లారీలూ అన్నీ ఇచ్చారు నల్ల ఆఫీసరు అందరినీ పిలిచి, ''రేపు మిమ్మల్ని విజయనగరం పంపిస్తారు అందరూ సిద్ధంగా వుండండి'' అన్నాడు

అంతకుముందు మాట్లాడుకున్న ప్రకారం, జాన్ ఈ గ్రూపువాళ్ళ అందరి తరపున నల్ల ఆఫీసరు దగ్గరకు వెళ్ళి, ''అయ్యగారూ, మాకు దినబత్తాలకు డబ్బులు లేవయ్యా'' అన్నాడు కాని ఆ మాటలవల్ల ప్రయోజనం లేకుండా పోయింది

''ముందుగా ఎవరికీ జీతాలు ఇవ్వరు నెలాఖరుకు జీతాలు అప్పటి దాకా మీ ఖర్చులకు మీరే ఎలాగో తంటాలుపడాలి రేపు ఉదయం మీతోపాటు ఒక హెడ్ కానిస్టేబులు వస్తాడు విజయనగరం అందరూ సిద్ధంగా వుండండి మీ ఖర్చులకు డబ్బులు మీరే చూసుకోవాలి ట్రైనింగు స్కూల్లో మాత్రం భోజనం వాళ్ళే పెడతారు నెలాఖరున మీ జీతంలో కట్ చేసుకుంటారు అంతా సిద్ధంగా వుండండి'' అని చెప్పి వెళ్ళిపోయాడు

ఆ మాటలు విని అంతా మౌనంగా వుండిపోయారు ఆ రాత్రి చాలామంది ఆకలి కడుపులతో పడుకున్నారు జిల్లా పోలీసు ఆఫీసు ఆవరణలో డబ్బులున్నవాళ్ళు పూటకూళ్ళమ్మ ఇంటికెళ్ళి భోంచేసి వచ్చారు

'ఇట్టాంటి పత్తులు నాకు కొత్తగాదుగా ఒక్కపూట తిండిలేకపోతే సచ్చిపోనులే' అనుకున్నాడు ప్రకాశం అతని ఆలోచన మధ్యాహ్నం జరిగిన సంఘటన మీదకు మళ్ళింది

'ఆడికి మంచి శాత్తి జరిగింది తెల్లదొరగోరు మంచిపని చేశారు పెపంచకంలో ఇట్టాంటి మకానుబావు లుండబట్టే కాత్తలో కాత్తన్నా నేయం వుంది లేకపోతే ఏముంది' అనుకున్నాడు 'ఆయ నెవురోగానీ అల్లల్లో మడిసయినాగాని నేయం మాట్టాడాడు' అనుకున్నాడు గురవయ్యను గూర్చి తన కిచ్చిన యూనిఫారం, కిట్టుబాక్సు, బూట్లు, లారీ, టోపి, బెల్టు- ఇలా అన్నిటి గురించి ఆలోచించాడు 'తనిప్పుడు నౌకరీలో, పోలీసు నౌకరీలో జేరిపోయినట్టే ఆసాముల కుర్రోల్లతోపాటు తనకిప్పుడు అన్నీ ఇచ్చారు నేను మాలోల్ల కుర్రోన్నని ఏమీ తగ్గించలేదుగా' అనుకున్నాడు జరిగిన సంఘటనలు అన్నీ కలలో జరిగినట్టుగా అనిపించాయి ప్రకాశంకు

ఆలోచనలు ఇంటిమీదకు మళ్ళాయి 'చెప్పాపెట్టకుండా వచ్చా వాల్లెంత బయపడతన్నారో' అనుకున్నాడు ఆలోచిస్తూ నిద్రలోకి జారిపోయాడు.

మరుసటిరోజు సాయంత్రం ఏడుగంటలకల్లా అంతా రైల్వేస్టేషనుకు చేరారు ప్లాట్‌ఫారం మీద కిట్టుబాక్సులు వరుసగా పెట్టుకున్నారు కులాల్నిబట్టి గుంపులు గుంపులుగా కూర్చొనీ,

నిలబడీ కబుర్లు చెప్పుకుంటున్నారు ఇంకొద్ది సేపట్లో రైలు వస్తుంది అంతా నిన్న జరిగిన సంఘటన గురించీ, 'ట్రైనింగు స్కూల్లో పరిస్థితులు ఎట్లా వుంటాయో' అనేదాన్ని గురించీ, ముచ్చటించుకుంటున్నారు చంద్రయ్య నిన్నటి చొక్కాయే ఉతుక్కుని తొడుకున్నాడు అయినా నెత్తురు మరకలు స్పష్టంగా కనపడుతూనే వున్నాయి

''మరిప్పుడూ, బండొచ్చాకా, వాల్లూ మనం ఒక పెట్టెలోనే యెక్కాలా?'' అడిగాడు సందేహంగా వెంకటేశం

''ఏం ఎక్కితే?!'' అన్నాడు జాన్ అనుమానం వ్యక్తంచేస్తూ

''ఎక్కితే ఏం అంటావేంది ? అట్టా ఎక్కబట్టేగా వాడిని అంతలావు దెబ్బకొట్టింది ''

దానికి ప్రకాశం ఏదో చెప్పబోతుంటే మధ్యలో జాన్ అందుకున్నాడు '' ఒరే , నే సెప్పేది జాగరత్తగా ఇనండి రైలుబండి రాంగానే మనందరం ఎక్కిన పెట్టెలో కాకుండా ఆల్లు ఏరే పెట్టె ఎక్కారనుకో, అసలు బాదే లేదు అట్టాగాకుండా ఆల్లూ మనం ఒకే పెట్టె యెక్కాల్సొచ్చిందనుకోండి, ఆల్లతోపాటు అందరం సుబ్బరంగా బెంసీలమీద కూసోవాల్సిందే సరకారు నౌకరీలో అట్టాంటి తేడా యేంలేదు యీడ అందరం వక్కటే నిన్న సూశారుగా మన సెంద్రంగాడిని కొట్టినందుకు ఆడి నౌకరీ వూడ బీకారు మల్లా మనమీద వోడన్నా అన్నేయంగా సేయిసేసుకుంటే ఆడి నౌకరీ కూడా అంతే మనతోపాటు ఎడ్డుకానిట్టేబులుగారు కూడా వత్తన్నారు మనకేంది ఇంగ బయ్యం మనం మాత్తరం వక్కటే మాట మీదుండాల'' అన్నాడు

''ఆ అంతే అట్టాగే వుంటాం'' అన్నారు కొందరు

అదే సమయంలో అవతలి గ్రూపు వాళ్ళు కూడా అదే విషయం గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నారు వాళ్ళంతా వీళ్ళ మీద కక్ష తీర్చుకోవాలని చూస్తున్నారు ఆ విషయం గురించే వాళ్ళు రకరకాలుగా ఆలోచిస్తున్నారు కాని వాళ్ళతో గురవయ్య మాత్రం ఏకీభవించటం లేదు అతను వాళ్ళమాటల్నీ, ఆలోచనల్నీ విని చిన్నగా అన్నాడు

''అబ్బాయిలూ నేనొకమాట చెపుతా వినండి మీకంటే చిన్నవాడినయినా నాకు తోసింది చెపుతా నిన్న జరిగింది మరిచిపోండి మనం ఆసాముల కొంపల్లో పుట్టినంత మాత్రాన ఇంకొకళ్ళని కొట్టే హక్కు మనకులేదు ఆ విషయం ఈపాటికి అందరికీ తెలిసే వుంటుంది మనం పేరుకు ఆసాములమే కానీ పొలంపుట్రా, ఆస్తీపాస్తీ ఇషయంలో వీళ్ళకన్నా ఏం ఎక్కువవాళ్ళం కాదు అందరు ఆసాముల్లాగా కాస్తోకూస్తో పొలం వుంటే ఈ నౌకరీకి మనం రావాల్సిన పనేలేదు నిజం చెపితే నిట్టూరమన్నట్టు ఏదో ఇంత బువ్వన్నా కడుపునిండా దొరికిద్దనే ఉద్దేశంతోనే మనమంతా యీడకొచ్చాం మనం మూరకంగా పెవర్తిత్తే మనకే నష్టం తరువాత మీ యిష్టం''

గురవయ్య చిన్నగా అన్న ఆ మాటలు వాళ్ళమీద బలంగా పనిచేశాయి అందరూ రకరకాలుగా ఆలోచిస్తున్నారు అనవసరమయిన పనుల్లో తలదూర్చి ఉన్న ఉపాధిని పోగొట్టుకోవటం ఎవరికీ ఇష్టంలేదు ఇంటి దగ్గరి ఆర్థికబాధలు అందరికీ గుర్తువస్తున్నాయి అయినా తరతరాల నుండి వంశ పారంపర్యంగా వాళ్ళ ఆలోచనలతోపాటు కలిసి వస్తున్న అహంకారం వాళ్ళ మనస్సుల్లో బుసలు కొడుతూనే వుంది

వాళ్ళ ఆలోచనలకు అంతారాయం కలిగిస్తూ హెడ్ కానిస్టేబులు అక్కడకు వచ్చాడు వాళ్ళనుద్దేశించి, ''అబ్బాయిలూ, బ[illegible] టైం అయ్యింది మీరంతా ఒకేపెట్టెలో ఎక్కాలి మీ యిష్టమొచ్చినట్టు తలా ఒక పెట్[illegible]క్కితే నేనూరుకోను నేనందర[illegible] లెక్ఖ మూసుకో[illegible]

ముందు కొంతమంది గబుక్కున ఎక్కి సీటులు ఆపుకోండి మిగిలినోల్లు కిట్లు బాక్సులు లోపల పెట్టండి జనానికి అడ్డం లేకుండా పెట్టుకోండి తెలిసిందా'' అన్నాడు కొంచెం పెద్దగా

ఆ మాటలు విని జాన్ అందరివైపూ చూశాడు ''యిన్నారుగా ఓరూ కింద కూసోవద్దు గుండె నిబ్బరం అలవాటు సేసుకోండి'' అన్నాడు వాళ్ళంతా అతని మాటలు విన్నారు

'ఈల్లేం మనల్ని పెట్టి పోసించే ఆసాములు కాదుగదా! యీాల్లకు మనమెందుకు బయపడాలి? మనమెందుకు తగ్గాలి?' అనుకున్నాడు ఒకతను

'ఆల్లతోపాటు సమానమైన నౌకరీ సేత్తన్నాం, ఆల్లకన్నా మనకి తక్కువ కూలీ యియ్యరు మరి యింగట్నాంటప్పుడేంది?!' అనుకున్నాడు ఇంకొకతను

'బతికినతకాలం వొదిగి వొదిగి బతికాం అట్టా బతికినంతకాలం కడుపు నిండలేదు యిప్పుడు సరకారు నౌకరీకొచ్చాం సరకారోడికితప్ప ఇంగొకరికి తలొంచాల్సిన పని లేదు ఏదయితే అదయ్యిద్ది అనగసరంగా ఓరి జోలికీ పోవద్దు వోరన్నా మన జొలికొత్తే వూరుకునేది లేదు' అనుకున్నాడు ఒకతను

ఇలా ఎవరి ఆలోచనలలో వాళ్ళు మునిగిపోయారు సమానమయిన ఆర్థిక పరిస్థితులు వారి గతకాలపు ఆలోచనలనూ, భావాలనూ మార్చి వేస్తున్నాయి ఆ మార్పును వాళ్ళల్లో కొంతమంది గమనించగలిగారు తమ ఆర్థికస్థితి మారటంతోనే తమ ఆలోచనల్లో ఇలాంటి మార్పులు రావటం వాళ్ళకెంతో ఆనందాన్నీ, ఆశ్చర్యాన్ని కలిగించింది

అందరూ ఒకే పెట్టెలో ఎక్కాలనేమాట అవతలి వాళ్ళకు మింగుడు పడలేదు మనస్సులు కుతకుత వుడుకుతున్నయ్ కానీ జరగబోయే పనిని నిరోధించగల శక్తి ఎవరికీ లేదు ఏం చేయాలో పాలుపోని స్థితిలో, ఆలోచనలలో మునిగిపోయారు

కొద్దిసేపటికి బండివచ్చి ప్లాట్‌ఫారమ్ మీద ఆగింది జనం బిలబిలా పోగయ్యారు క్షణాల్లో వీళ్ళల్లో కొంతమంది వెళ్ళి సీట్లు ఆపారు మిగిలిన వాళ్ళు కిట్లు బాక్సులు లోపలకు చేర్చారు ప్రకాశం, మిగిలిన వాళ్ళు బెంచీకి నలుగురు చొప్పున ఫ్రీగా కూర్చున్నారు ఒకళ్ళిద్దరు ముస్లిం కుర్రాళ్ళు వచ్చి వాళ్ళ పక్కన కూర్చున్నారు

అవతలి వాళ్ళల్లో కొంతమందికి సీట్లు దొరకలేదు సీట్లుదొరకని ఆసాముల కుర్రవాళ్ళల్లో గురవయ్య కూడా వున్నాడు అతను కంపార్ట్‌మెంటు అంతా తిరిగి బెర్త్ ఒకటి ఖాళీగా కనపడితే పైపంచె తీసి పరుచుకొని పడుకున్నాడు హెడ్‌కానిస్టేబుల్ వచ్చి అందరినీ లెఖ్ఖపెట్టుకున్నాడు అతనికోసం ఖాళీగా వుంచిన సీట్లోకూర్చున్నాడు. కొద్దిసేపటికి బండి బయలుదేరింది సీట్లు దొరక్క నిలబడిన ఆసాముల కుర్రవాళ్ళు కూర్చున్న వీళ్ళవైపు చూస్తున్నారు ఆ చూపుల్నుండి తమ చూపుల్ని తప్పించుకుంటూ బిక్కుబిక్కుమంటూ కూర్చున్నారు వీళ్ళు కొంతమంది లేని ధైర్యాన్నీ, గంభీరాన్నీ తెచ్చిపెట్టుకుంటున్నారు

తరతరాలుగా నరాల్లో పేరుకుపోయిన భయం, ఆత్మగౌరవంలేనితనం, మెతకదనం లాంటి వాటిని జయించటానికి ఒకరోజు, ఒక సంఘటన చాలదు కానీ అంతకుముందు వరకూ తెలియకుండా వున్న ఒక నగ్న సత్యాన్నీ, ఒక వాస్తవాన్నీ, మొదటిసారిగా చూచినప్పుడు, గుర్తించినపుడు ఆ విషయం తాలూకు ఆలోచన, చైతన్యం ఆ వ్యక్తికి నూతన బలాన్ని కలిగిస్తుంది. అక్కడ కూర్చున్నవాళ్ళ పరిస్థితి ప్రస్తుతం అలాగే వుంది తామంతా కూర్చుని వుండటం, ఆసాముల కుర్రోళ్ళు నిలబడి వుండటం తరతరాల సాంప్రదాయానికి పూర్తి విరుద్ధంగా తోచింది

నిలబడీ కబుర్లు చెప్పుకుంటున్నారు ఇంకొద్ది సేపట్లో రైలు వస్తుంది అంతా నిన్న జరిగిన సంఘటన గురించీ, 'ట్రైనింగు స్కూల్లో పరిస్థితులు ఎట్లా వుంటాయో' అనేదాన్ని గురించీ, ముచ్చటించుకుంటున్నారు చంద్రయ్య నిన్నటి చొక్కాయే ఉతుక్కుని తొడుక్కున్నాడు అయినా నెత్తురు మరకలు స్పష్టంగా కనపడుతూనే వున్నాయి

''మరిప్పుడూ, బండొచ్చాకా, వాల్లూ మనం ఒక పెట్టెలోనే యెక్కాలా?'' అడిగాడు సందేహంగా వెంకటేశం

''ఏం ఎక్కితే?!'' అన్నాడు జాన్ అనుమానం వ్యక్తంచేస్తూ

''ఎక్కితే ఏం అంటావేంది ? అట్టా ఎక్కబట్టేగా వాడిని అంతలావు దెబ్బకొట్టింది ''

దానికి ప్రకాశం ఏదో చెప్పబోతుంటే మధ్యలో జాన్ అందుకున్నాడు '' ఒరే , నే సెప్పేది జాగరత్తగా ఇనండి రైలుబండి రాంగానే మనందరం ఎక్కిన పెట్టెలో కాకుండా ఆల్లు ఏరే పెట్టె ఎక్కారనుకో, అసలు బాదే లేదు అట్టాగాకుండా ఆల్లూ మనం ఒకే పెట్టె యెక్కాల్సొచ్చిందనుకోండి, ఆల్లతోపాటు అందరం సుబ్బరంగా బెంసీలమీద కూసోవాల్సిందే సరకారు నౌకరీలో అట్టాంటి తేడా యేంలేదు యీడ అందరం వక్కటే నిన్న సూశారుగా మన సెంద్రంగాడిని కొట్టినందుకు ఆడి నౌకరీ వూడ బీకారు మల్లా మనమీద వోడన్నా అన్నేయంగా సేయిసేసుకుంటే ఆడి నౌకరీ కూడా అంతే మనతోపాటు ఎడ్డుకానిట్టేబులుగారు కూడా వత్తన్నారు మనకేంది ఇంగ బయ్యం మనం మాత్తరం వక్కటే మాట మీదుండాల'' అన్నాడు

''ఆ అంతే అట్టాగే వుంటాం'' అన్నారు కొందరు

అదే సమయంలో అవతలి గ్రూపు వాళ్ళు కూడా అదే విషయం గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నారు వాళ్ళంతా వీళ్ళ మీద కక్ష తీర్చుకోవాలని చూస్తున్నారు ఆ విషయం గురించే వాళ్ళు రకరకాలుగా ఆలోచిస్తున్నారు కాని వాళ్ళతో గురవయ్య మాత్రం ఏకీభవించటం లేదు అతను వాళ్ళమాటల్నీ, ఆలోచనల్నీ విని చిన్నగా అన్నాడు

''అబ్బాయిలూ నేనొకమాట చెపుతా వినండి మీకంటే చిన్నవాడినయినా నాకు తోసింది చెపుతా నిన్న జరిగింది మరిచిపోండి మనం ఆసాముల కొంపల్లో పుట్టినంత మాత్రాన ఇంకొకళ్ళని కొట్టే హక్కు మనకులేదు ఆ విషయం ఈపాటికి అందరికీ తెలిసే వుంటుంది మనం పేరుకు ఆసాములమే కానీ పొలంపుట్రా, ఆస్తీపాస్తీ ఇషయంలో వీళ్ళకన్నా ఏం ఎక్కువవాళ్ళం కాదు అందరు ఆసాముల్లాగా కాస్తోకూస్తో పొలం వుంటే ఈ నౌకరీకి మనం రావాల్సిన పనేలేదు నిజం చెపితే నిట్టూరమన్నట్టు ఏదో ఇంత బువ్వన్నా కడుపునిండా దొరికిద్దనే ఉద్దేశంతోనే మనమంతా యీడకొచ్చాం మనం మూరకంగా పెవర్తిత్తే మనకే నష్టం తరువాత మీ యిష్టం''

గురవయ్య చిన్నగా అన్న ఆ మాటలు వాళ్ళమీద బలంగా పనిచేశాయి అందరూ రకరకాలుగా ఆలోచిస్తున్నారు అనవసరమయిన పనుల్లో తలదూర్చి ఉన్న ఉపాధిని పోగొట్టుకోవటం ఎవరికీ ఇష్టంలేదు ఇంటి దగ్గరి ఆర్థికబాధలు అందరికీ గుర్తువస్తున్నాయి అయినా తరతరాల నుండి వంశ పారంపర్యంగా వాళ్ళ ఆలోచనలతోపాటు కలిసి వస్తున్న అహంకారం వాళ్ళ మనస్సుల్లో బుసలు కొడుతూనే వుంది

వాళ్ళ ఆలోచనలకు అంతారాయం కలిగిస్తూ హెడ్ కానిస్టేబులు అక్కడకు వచ్చాడు వాళ్ళ నుద్దేశించి, ''అబ్బాయిలూ, బ [illegible] టైం అయ్యింది మీరంతా ఒకే పెట్టెలో ఎక్కాలి మీ యిష్టమొచ్చినట్టు తలా ఒక పెట్టె [illegible] క్కితే నే నూరుకోను నే నందర [illegible] లెఖ్ఖ చూసుకో [illegible]

లోపలకు వెళ్ళాడు హెచ్ సీ వాళ్ళందరినీ ఒకరివెనుక ఒకరుగా నడిపించుకుంటూ ఆరెస్సై ఆఫీసు దగ్గరకు తీసుకువచ్చాడు ఆరెస్సై నల్లవాడే కుర్చీలో కూర్చుని వున్నాడు అందరినీ బైట నిలబెట్టి లోపలకు వెళ్ళి ఆరెస్సైకి సెల్యూట్ చేశాడు హెచ్ సీ ఆరెస్సై కూడా సెల్యూట్ చేసినట్లు చెయ్యి కొంచెం పైకెత్తాడు

''ఏ జిల్లా ?'' అడిగాడు ఆరెస్సై

''సార్, గుంటూరయ్యా'' అన్నాడు హెచ్ సీ, తన చేతిలోని పాస్‌పోర్టును ఆరెస్సైకి అందజేస్తూ

ఆ పాస్‌పోర్టుని ఒకసారి చూచి దానిమీద వాళ్ళు వచ్చిన టైమూ, తిరిగి హెచ్ సీ బయలు దేరే టైమూ వేసి సంతకం చేశాడు ఆరెస్సై తరువాత కుర్చీలో నుండి లేచి బయటకు వచ్చి, వరుసగా నిలబడ్డ వీళ్ళ అందరి వైపూ చూచి, హెచ్ సీ వైపు తిరిగి, ''ప్రిన్సిపాల్‌గారు చూశారా అందరినీ?'' అని అడిగాడు

''అయ్యా! మొదట అక్కడకే తీసుకెళ్ళి తమ దగ్గరకు తీసుకొచ్చానయ్యా'' అన్నాడు హెచ్ సీ

ఆరెస్సై వాళ్ళందరినీ లెఖ్ఖపెట్టి, పక్కనున్న పాత కుర్రవాణ్ణి పిలిచి, ''నువ్వు మెస్ ఇన్‌చార్జి సబ్ ఇనస్పెక్టరుగారి దగ్గరకు వెళ్ళి, కొత్తగా ముప్పై అయిదుగురు వచ్చారనీ, మధ్యాహ్నానికే వాళ్ళకు రేషన్ వెయ్యమని చెప్పు'' అన్నాడు

ఆ కుర్రవాడు సెల్యూట్‌చేసి వెళ్ళిపోయాడు

ఆరెస్సై ఇంకొక కుర్రవాణ్ణి పిలిచి, ''నువ్వు వీళ్ళందరినీ తీసుకు వెళ్ళి నాలుగో నెంబరు బేరక్ చూపించు'' అని చెప్పి లోపలకు వెళ్ళాడు

ఆ కుర్రవాడూ, ఈ హెచ్ సీ కలిసి వీళ్ళని వరుసగా నడిపించుకుంటూ వాళ్ళు పెట్టెలు దించుకున్న చెట్టు దగ్గరకు తీసుకెళ్ళారు అక్కడ వాళ్ళతో హెచ్ సీ, ''అబ్బాయిలూ నేను వెళుతున్నాను మీరు జాగ్రత్తగా ట్రైనింగు పూర్తి చేసుకొని రండి తిరిగి మనం మన జిల్లాలో కలుద్దాము ఉంటామరి ఇక్కడ మీరు చాలా డిసిప్లైన్‌గా వుండాలి ప్రిన్సిపాల్ దొరగారు అసలే మంచోడు కాడు జాగ్రత్తమరి నేను వస్తాను'' అన్నాడు

''జాగ్రత్తగా పోయిరాండి సార్'' అన్నారు కొంతమంది హెచ్ సీ వెళ్ళిపోయాడు

ఎవరి పెట్టెలు వాళ్ళు నెత్తిన పెట్టుకొని బేరక్ దగ్గరకు నడిచారు అంతా ఆ కుర్రవాడు వాళ్ళకొక బేరక్ చూపించి, ''ఇదే నాలుగోనెంబరు బేరక్ మీరంతా వరుసగా కిట్ బాక్సులు పెట్టుకోండి ఇందులో ట్రైనింగు అయిపోయిందాకా మీరు ఇందులోనే వుండేది'' అన్నాడు

వీళ్ళకు ఇదంతా కొత్తగా, ఒక రకమయిన కంగారుగా వుంది పరిచయమున్న ఆ ఒక్క హెచ్‌సీ కూడా వెళ్ళిపోయాడు అంతా కొత్త కాళ్ళూ చేతులూ ఆడనట్లు వుంది వెంట వచ్చిన ఆ కుర్రవాణ్ణి తలా ఒక ప్రశ్న వేశారు ఆ కుర్రాడు అందరి ప్రశ్నల్నీ సావధానంగా విని, ''మీరిక్కడేం కంగారు పడాల్సిన పనిలేదు రేపీవేళకు మీకు అంతా అర్థమయ్యిపోతుంది మధ్యాహ్నం అదిగో ఆ మెస్ దగ్గర అందరికీ భోజనాలు పెడతారు తిరిగి రాత్రికి భోజనం ఉంటుంది. తెల్లవారుఝామున అయిదుగంటలకు లెగవాలి ఆరుగంటల నుండి ఎనిమిదింటి వరకు పేరెడ్[12] వుంటుంది తరువాత తొమ్మిదిగంటల నుండీ అంటే డ్రిల్లు చేసి వచ్చిం దగ్గర నుండీ కాస్త టిపిన్ చేసి రెస్టు తీసుకున్నాక 'లా'[13] క్లాసులుంటాయి ఆ క్లాసులు పన్నెండు గంటలదాకా జరుగుతాయి

తరువాత భోజనం తిరిగి నాలుగు గంటలకు మళ్ళీ పేరెడ్ అయిదున్నరకు పేరెడ్ గ్రౌండ్ నుండి వచ్చి, స్నానాలూ అవీ చేసి, రాత్రి ఎనిమిది గంటలకల్లా భోజనాలు పూర్తిచేసుకుని, తొమ్మిది గంటలకు నైట్ రోల్‌కాల్[14] కు వెళ్ళాలి మళ్ళీ ఉదయం నాలుగున్నరకల్లా బిగిలర్ బిగిల్ వూదుతాడు ఐదుగంటలకు ఐదు నిముషాలు ముందే గ్రౌండ్‌లో వుండాలి ఆలశ్యమయినా, ఆబ్సెంటయినా ఎగస్ట్రా డ్రిల్లు ఇస్తారు అంటే పనిష్మెంట్ అన్నమాట అదీ సంగతి నేను వెళుతున్నాను'' అని చెప్పి ఆ కుర్రవాడు గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు అప్పటివరకూ ఆ కుర్రవాడి చూటుమ్మా వుయాగి, అతను చెప్పేది రెప్పవేయకుండా వింటున్న వాళ్ళకు ఒక్కసారిగా నీరసం ఆవహించింది చిన్నగా ఎవరి పెట్టెలు వాళ్ళు ఎత్తుకుపోయి బేరక్‌లో వరుసగా పెట్టుకున్నారు

ఎదురుగా మూడో నెంబరు బేరక్ దగ్గర ఒకతను వున్నాడు అతను వీళ్ళనే చూస్తున్నాడు అతను బూట్లు, నిక్కరు, పి టి బన్నీను[15]తో, తలమీద టోపీతో, చేతిలో లాఠీతో బేరక్ వరండాలో అటూఇటూ నడుస్తున్నాడు అతనలా నడుస్తుంటే బూట్లకువున్న ఇనుప నాడాల వలన పెద్దగా శబ్దమవుతోంది వీళ్ళంతా అతన్నే చూస్తూ కూర్చున్నారు కొద్దిసేపు ఆ కుర్రవాడు వీళ్ళని గమనించి, వీళ్ళు పెట్టే బేడా సర్దుకున్నదాకా వుండి వీళ్ళ దగ్గరకు వచ్చాడు వస్తూనే వీళ్ళను చూస్తూ ''ఏ జిల్లా అప్పా'' అన్నాడు

చాలామంది ఒక్కసారిగా సమాధానం చెప్పారు

''మీదే జిల్లా?'' అడిగాడు గురవయ్య

''మాది చిత్తూరప్పా'' అన్నాడు అతను

''ఇక్కడి విశేషాలు ఏమిటో కాస్త చెప్పండి మాకు మేమంతా కొత్త మాకేందో ఒకరకంగా వుంది'' అన్నాడు గురవయ్య

ఆ మాటలకు ఆ కుర్రవాడు చిన్నగా నవ్వాడు

''కొత్తేం లేదు ఒక్కరోజులోనే అంతా అర్ధమయ్యిద్ది మీకు ఈ బేరక్ చూపించిన కుర్రవాడు అంతా చెప్పాడు కదా అంతే మీకు మధ్యానానికి రేసన్ సెప్పింర్రా?'' అన్నాడు

''రేసనేందీ? మాకోరూ సెప్పలా'' అన్నాడు వెంకటేశం వీళ్ళకంతా గమ్మత్తుగా వుంది

''రేషనంటే మద్దినాల బువ్వకి గింజలు కొలిచిత్తారు, మడిసి కింతని అదే రేషనంటే'' అన్నాడు గురవయ్య మిగిలిన వాళ్ళనుద్దేశించి

''ఆఁ అదేనప్పా అదే అదేమరి ఆరెస్సైగారు ఆర్డరేశారా?''

''ఆఁ మేం రాగానే అందరినీ లెఖ్ఖపెట్టి రేసనెయ్యమని చెప్పి పంపించాడు ఆయన'' అన్నాడు గురవయ్య

''చెప్పి పంపించాడు అనగూడదప్పా చెప్పి పంపించారు అనాలి ఇది పోలీసు డిపార్టుమెంటు ప్రతి పనీ డిసిప్లెయిన్‌గా, అంటే క్రమశిచ్చణతో జరగాలి ప్రెతి మాటా తూచి మాట్లాడాలి ప్రెతి అడుగు చూచి జాగరత్తగా ఎయ్యాలి ఎక్కడా, ఎప్పుడు ఏ విషయంలో కూడా నోరుజారకూడదు. ఎక్కడిదక్కడ మరిచిపోవాలి లేకపోతే రొండో నిముసానికల్లా ఆపీసర్ల చెవికి చేరిద్ది ఇట్టాంటియ్యే చానా వున్నయ్ అయ్యన్నీ మీకు రోజులు గడిచేకొద్దీ తెలుత్తాయిలే'' అన్నాడు ఆ కుర్రవాడు అతను మాట్లాడేది తెలుగే అయినా అదోరకం యాసతో ప్రతి పదానికీ చివరనున్న అక్షరాన్ని దీర్ఘంతీస్తూ మాట్లాడాడు కొద్దిసేపు అందరూ నిశ్శబ్దంగా వుండిపోయారు

''అయితే మరి మీరు యేందీ యీడున్నారూ, అందరూ ఆడ చెట్లకింద వుంటే ?''
అడిగాడు జాన్

''రోజుకొకల్లు బేరక్‌కి సెంట్రీ[16]గా వుంటారు ఈ రోజు మా బేరక్‌కి నేను సెంట్రీని మీరు కూడా రేపటినుంచి రోజుకొకళ్ళు బేరక్‌కి సెంట్రీగా వుండాలి అంటే మీరు డ్రిల్లుకీ, లా క్లాసులకూ పోయివచ్చిందాకా ఆ సెంట్రీ మీ పెట్టెలకూ, సామానులకు కాపలా అన్నమాట అట్లా సెంట్రీగా వున్నప్పుడు ఆపీచర్లు చెకింగుకి వత్తారప్పో శానా జాగత్తగా వుండాలి'' అన్నాడు

అలా వాళ్ళు చాలాసేపు మాట్లాడుకున్నారు అప్పటికి టైము పన్నెండు గంటలయ్యింది అప్పటివరకూ చెట్లక్రింద కూర్చుని 'లా' చదువుకున్న కుర్రవాళ్ళంతా బేరక్‌లకు వచ్చేస్తున్నారు వీళ్ళంతా వాళ్ళనే చూస్తూ నిలబడ్డారు వీళ్ళ బేరక్‌మీదుగా పైకి వెళ్తున్న పాత వాళ్ళు వీళ్ళని అడిగే మొదటి ప్రశ్న, ''ఏ జిల్లా?''

పాతవాళ్ళంతా బావి దగ్గరకు పోయి,ముఖాలు కడుక్కొని, చెంబుల్తో నీళ్ళు తీసుకొని, పళ్ళాలు పట్టుకొని మెస్‌కు వెళుతున్నారు ఈ కొత్త వాళ్ళల్లో కూడా కొంతమంది పళ్ళేలు,చెంబులు తీసుకొని బావి దగ్గరకు వెళ్ళి ముఖాలు కడుక్కొని మెస్ దగ్గరకు వెళ్ళారు ప్రకాశానికీ, వెంకటేశానికీ ఇంకా కొంతమందికి పళ్ళేలూ, చెంబులూ లేవు ఏం చేయాలో తోచలేదు ఇందాక వీళ్ళతో మాట్లాడిన కుర్రోడు కనపడితే అదే విషయం చెప్పారు దానికతను, ''ఆఁ, ఏం ఫరవాలేదప్పా అన్నాలుతిన్న వాళ్ళదగ్గర తీసుకొని, తిరిగి పని కాంగానే వాళ్ళయి వాళ్ళ కిచ్చెయ్యండి నెలాకరుదాకా ఇట్లాగే చిన్నగా గడుపుకుంటే, జీతం తీసుకోంగానే మనకు ముఖ్యంగా కావలసినియ్యి కొనుక్కోవచ్చు నేను అన్నం తిన్నాక నా పల్లెం ఒకరికిత్తా మిగతావోల్లు కూడా ఇట్లాగే ఓరినన్నా అడుక్కోండి'' అన్నాడు

అతని మాటలు వాళ్ళకు ఆశ్చర్య మేసినయ్ 'ఒకల్లు తినే పల్లెం ఇంకొకల్లకు, వాల్ల దే కులమైనా సరే ఇయ్యటం, తీసుకోవటం, చానా ఆశ్చ్రెంగా వుందే తవని తాకితేనే మయిలపడి పోతారనుకునేవాళ్ళే ఇక్కడ ఇంతగా మారిపోతారా?' అనుకున్నాడు ప్రకాశం ఆ విషయం వాళ్ళు కళ్ళతోనే చర్చించారు ఆ కుర్రవాడు భోజనం చేసి రావటం చూసి పళ్ళెం తెచ్చుకోవటానికి అతని దగ్గరకు వెళ్ళాడు ప్రకాశం ప్రకాశం వచ్చిన విషయం అర్థమై, పళ్ళెం ఇవ్వబోతూ, ''మీరేమిట్లు?'' అన్నాడు అతను ప్రకాశంతో

ఆ ప్రశ్నతో సగం చచ్చిపోయాడు ప్రకాశం చెప్పలేక చెప్పలేక చెప్పాడు చిన్నగా

ప్రకాశం చెప్పిన మాటవిని ఆ కుర్రవాడు కోపంగా చూశాడు ''మీవోల్లు శానామందున్నారూ, పోయి ఆల్లకాడ అడుక్కో పల్లేలూ సెమ్ములు అడగబోయేముందు, వోరు వోరో తెలుసుకోప్పా, లేకపోతే తన్నులు తింటావు'' అన్నాడు

ఆ కుర్రవాడి మాటలకు ప్రకాశంకు తల తిరిగిపోయింది మాట పెగల్లేదు వూహించని సంఘటనతో దిమ్మరపోయాడు మాట్లాడకుండా బయటకొచ్చాడు జరిగిన విషయం జాన్‌కు చెప్పాడు. జాన్ ఆ విషయాన్ని పెద్దగా పట్టించుకోలేదు

''చరే చేచేదేముంది మెచ్‌కాడికిపోయి మనోలెవురన్నావుంటే, ఆల్లకాడ పల్లేలు తీసుకుందాం రాండి రేపు నేను ఒక మల్లకొంటా యీడ ఓరికాడా మల్లలు కనపట్టంలా ఒకటి కొనుక్కుంటే మనకు యిబ్బందుండదు. యియ్యాల్టికి మాత్తరం యెట్టాగో తిప్పలు పడదాం ఈ కులం లేనిసోటు ఈ బూ పెపంచకంలో యీడా లేదనుకుంటా'' అన్నాడు

ముగ్గురూ మెస్ దగ్గరకు వెళ్ళారు మెస్ లోపలికి వెళ్ళే ద్వారం ముందు పాతవాళ్ళంతా ఒకచేత్తో పళ్ళెం, రెండోచేత్తో నీళ్ళ చెంబులూ పట్టుకొని వరుసగా వున్నారు లోపలకు వెళ్ళిన వాళ్ళు రెండో ద్వారంలో నుండి బయటకు వస్తున్నారు వచ్చే ప్రతివారి ప్లేటులో ఒక్కొక్క అన్నపు ముద్ద, పప్పుచారూ వున్నయ్ మెస్‌ముందు చిన్న చిన్న రావిచెట్లు రెండున్నయ్ వాటిపక్కన పెద్ద మర్రిచెట్టు వుంది ఆ చెట్ల నీడన కూర్చొని రిక్రూట్[17] కుర్రవాళ్ళు 'అన్నాలు' తింటున్నారు వాళ్ళల్లో ఎవరు ఎవరై వుంటారో అంచనాలు వేస్తున్నారు రంగుల్ని పరిశీలిస్తూ, ఆకారాల్ని అధ్యయనం చేస్తూ వీళ్ళు అన్నం తిని పళ్ళెం కడిగి నీళ్ళు పారబోస్తున్న ఒక కుర్రవాడిని పళ్ళెం అడిగాడు జాన్ భయం భయంగా

ఆ కుర్రవాడు జాన్‌వైపు ఎగాదిగా చూశాడు ''యియ్యాలొచ్చిన కొత్త బేచ్చీవాల్లా మీరూ?'' అన్నాడు ఔనన్నట్లు తలూపాడు జాన్

''మేం మాలోల్లం'' అన్నాడు అతను ఆమాట కొంచెం వూరట కలిగించింది జాన్‌కు

''మేం గూడా'' అన్నాడు

ఆ కుర్రవాడు జాన్‌కు పళ్ళెం అందిస్తూ ''సెమ్ము గూడా తీసుకో యేజిల్లా? నీ పేరేందీ? నీ నెంబరెంత?'' అంటూ ప్రశ్నలు వేశాడు

జాన్ అన్నిటికీ సమాధానాలు చెప్పాడు చిరునవ్వుతో

''నేను, అదిగో ఆ బ్యారెక్‌లో వుంటాను తినంగానే తెచ్చియ్యి'' అన్నాడు ఆ కుర్రవాడు

'అలాగే' అన్నట్లు తలూపి, అతనితో, ''ఇంగా మనోల్లు యిద్దరున్నారు, ఆల్లకి కూడా కూసింత గిన్నె లిప్పించండి మీకు తెలిసినోల్లు ఓరన్నా వుంటే'' అన్నాడు

ఆ మాటకు ఆ కుర్రవాడు, భోంచేసి బ్యారక్‌లకు వెళుతున్న కుర్రవాళ్ళని ఇద్దరిని కేకేసి పిలిచి రెండు పళ్ళాలు ఇప్పించాడు ''జాగర్తగా మల్లీ మాయి మాకు తెచ్చియ్యండి'' అన్నాడు

జాన్ సంతోషంగా తలూపి వెళ్ళాడు ప్రకాశానికీ, వెంకటేశంకూ చెరొక పళ్ళెం, చెంబూ యిచ్చాడు ముగ్గురూ వరుసలో నిలబడి వంట గదిలోకి వెళ్ళారు గదిలో వెలుగులేదు పొయ్యిలోని పొగ ఇంకా వస్తూనే వుంది గది అంతా పొగచూరి అసహ్యంగా వుంది ఒక కుర్రవాడు స్టూలుమీద కూర్చుని భోజనానికొచ్చినవాళ్ళ జిల్లా, వచ్చిన కుర్రవాడి నెంబరూ నోట్ చేసుకుంటున్నాడు అతని ప్రక్కనే కింద గచ్చుమీద అన్నం ముద్దలు వరుసగా వున్నయ్ వాటి ప్రక్కన ఒక కుర్రవాడు కూర్చొని వున్నాడు అతని ప్రక్క పెద్ద గంగాళం నిండా పప్పుచారు వుంది పెద్ద చెంబు ఒకటి పట్టుకొని ఒక కుర్రవాడు నిలబడి వున్నాడు ఆ గంగాళం ప్రక్కన జిల్లాపేరూ, నెంబరూ చెప్పి ముందుకు అడుగెయ్యగానే అన్నం ముద్దలముందు కూర్చున్న కుర్రవాడు పళ్ళెంలో ఒక ముద్ద పడేశాడు ఇంకొక అడుగు ముందుకు వెయ్యగానే గంగాళం లోని పప్పుచారుని చెంబుతో ముంచి పళ్ళెంనిండా పోశాడు ఆ పని కోసం అక్కడున్న కుర్రవాడు

ముగ్గురూ బైటకొచ్చారు వాళ్ళకెందుకో నవ్వాగటం లేదు ఒకళ్ళని చూచి ఒకళ్ళు నవ్వుకున్నారు అలా నవ్వుకుంటూనే, కూర్చోవటానికి ఎక్కడ జాగా వుందోనని చూచివెళ్ళి, రావిచెట్టు మొదట్లో ఖాళీగా వుంటే అక్కడ కూర్చున్నారు కడుపులో ఎలుకలు పరుగెత్తుతున్నయ్ [illegible] అన్నం ముద్దలు అప్పటికే చారులో కరిగి పోయాయి పళ్ళెంనిండా చిక్కటి జావ [illegible]య్యింది ఆతృతగా తిన్నారు పూర్తిగా రెండు నిముషా[illegible] కూడా పట్టలేదు ఉప్పదనం [illegible] ఇంకేగు[illegible] వాళ్ళకు తెగ[illegible]లేదు అన్నంలో తెల్లటి పొడవాటి పురుగులు వున్నయ్ కనపడ

వాటిని ఏరివేశారు చెట్లమీద కాకులు అరుస్తున్నయ్ కొన్ని అన్నంతినే వాళ్ళచుట్టూ వాలుతున్నయ్ తోలుతున్నా పోకుండా కుక్కలు తోకలాడించుకుంటూ నిలబడ్డయ్ పదిహేను ఇరవై అడుగుల దూరంలో, తిన్నపళ్ళేలు కడుక్కునే చోట పందులు అరుస్తూ ఒకదాన్ని ఒకటి తోసుకుంటూ తిరుగు తున్నయ్

''యండా కాలంలోనే యిట్టాగుంటే, ఇంగ వానాకాలమైతే యాడకూసుంటా(రా?'' అన్నాడు జాన్

ముగ్గురూ అన్నాలు తిన్నారు సగం కడుపుకూడా నిండలేదు ఎవరికీ

''ఇంకోముద్ద పెడతారంటావా?'' అనుమానంగా అడిగాడు వెంకటేశం

''సూడబోతే పెట్టేలాగా కనపడతంలా యీల్లెవురూ రెండోముద్ద ఏయించుకోటంలా'' అన్నాడు జాన్

కడుపునిండా నీళ్ళు తాగారు అదోరకమయిన నీరసం అందరిలో చోటు చేసుకుంది కూర్చున్నవాళ్ళు చేతులు కడిగిన నీళ్ళు పారబోయటానికి లేస్తుంటే ప్రకాశం నెత్తిన కాకి రెట్ట వేసింది పైకిచూచి ఒక బూతు తిట్టు తిట్టాడు

''ఇంగా నయ్యం బూ తినేటప్పుడు గిన్నెలో ఎయ్యలా'' అన్నాడు జాన్

ఆ మాటకు మిగతావాళ్ళు నవ్వారు అర్ధాకలితో కదిలారు పళ్ళేలూ చెంబులూ తీసుకెళ్ళి ఇచ్చేసి తమ బేరక్‌కు వచ్చారు అప్పటికే బేరక్‌లోని చాలామంది తమతమ పెట్టెల్ని, సామానుల్ని సర్దుకున్నారు వీళ్ళంతా ఒకపక్కగా, ఆసాముల కుర్రోళ్ళంతా రెండో పక్కగా పెట్టెల్ని పెట్టుకున్నారు గవర్నమెంటువాళ్ళిచ్చిన కంబళ్ళు బయటకు తీసి పరచుకొని నడుంవాల్చారు అంతా జాన్, ప్రకాశం, వెంకటేశం ఒకరి పెట్టె పక్కన ఒకళ్ళు పెట్టుకున్నారు

''పెతిరోజూ ఇంతే పెడతారంటావా బువ్వ?'' అనుమానంగా అడిగాడు జాన్‌ని ప్రకాశం.

''ఆఁ, సూడబోతే అట్టాగే వుంది'' అన్నాడు జాన్

''ఇట్టాగయితే యీ ఆరునెలల్లో మనపేనాలు కాలీ యీడనుంచి మన యిల్లకు మన చవాలు ఎల్లాల్చిందే'' అన్నాడు వెంకటేశం అతని మాటలు వింటున్నవాళ్ళకు నవ్వు తెప్పించాయి జాన్ సంచిలోనుండి పొగాకు తీసి చుట్ట చుట్టుకుంటూ బయటకెళ్ళాడు రాత్రంతా ప్రయాణంలో నిద్రలేనందువల్ల అందరికీ నిద్ర ముంచుకు వస్తోంది రెండు నిముషాల్లో అందరూ నిద్రలోకి జారిపోయారు సరిగా పది నిముషాలు కూడా గడవకముందే బయటనుండి కేక వినపడింది

''ఎవురయ్యా ఈ పూట గుంటూరునుండొచ్చిన కొత్తోల్లు? తొందరగా బైటకురాండి, డిప్పలు కొట్టాలి'' అంటూ అరుస్తున్నాడు ఒకతను తమ జిల్లా పేరు వినపడేసరికి వస్తున్న నిద్ర ఎగిరిపోయింది బయటకొచ్చారు కొందరు

''మీరేనా యీ పూటొచ్చిన కొత్తోల్లు, గుండూరోల్లు? తొందర్రాండి బాయికాడికి'' అని వీళ్ళని చూచి అన్నాడు అతను తరువాత ముందుకు కదిలాడు అతని వెనక యింకా ఇద్దరు మంగలివాళ్ళు వున్నారు వాళ్ళ చేతుల్లో క్షవరం చేసే కత్తులు చుట్టిన గుడ్డ సంచులు వున్నయ్

అంతకు ముందు పళ్ళేలు అడిగి తెచ్చుకున్న వాళ్ళదగ్గరకు వెళ్ళి ఒక బక్కెట్టు అడిగి తెచ్చాడు జాన్ వీళ్ళు ముగ్గురూ బావి దగ్గరకు వెళ్ళేసరికి మంగలివాళ్ళు వరుసగా క్రాపులు మొదలుపెట్టి చేసేస్తున్నారు

''మనకికూడా వాల్లే చేత్తారంటావా?'' అనుమానంగా చిన్నగా అడిగాడు ప్రకాశం అతని

స్వరంలో భయం తొంగి చూసింది

''ఏమో మరి మాలామాదిగోల్లకి మంగలోల్లు కాపులూ గడ్డాలు సెయ్యటం యాడాలేదు ఇంతమటుకు మరి యీడ సంగతి తెలవదుగా'' అన్నాడు జాన్ చిన్నగా

ఆ మాటకు ఎవరూ ఏమీ మాట్లాడలేదు క్రాపులు చేస్తున్న వాళ్ళనీ, చేయించుకుంటున్న వాళ్ళనీ చూస్తూ వుండిపోయారు క్రాపుచేస్తున్న మంగలి వాళ్ళల్లో ఒకతను, గబుక్కున ఏదో గుర్తొచ్చినట్టు చుట్టూ నిలబడివున్న వాళ్ళవైపు చూచి, ''అబ్బాయ్‌లూ, మీలో ఎవురన్నా మాలా మాదిగోల్లుగానీ, యింగా అట్టాంటోల్లు ఎవురన్నా వుంటే, అయిగో ఆడున్న కత్తీ, కత్తెరా, అంటకత్తెర ఏసుకోడానికి మిసినూ తీసుకొని మీరే ఒకల్లకొకల్లు సేసుకోండి మేం సెయ్యం'' అని తన పనిలో మునిగి పోయాడు ఆమాటలకు వీళ్ళు ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు వాళ్ళ ముఖాలు నల్లగా మాడిపోయాయి అవమానంతో హృదయాలు బరువెక్కాయి అతను ఆమాట అన్నప్పుడు ఆసాముల కుర్రోళ్ళు కిసుక్కున నవ్వారు వాళ్ళు తమని కావాలని పనిగట్టుకొని అవమానపరుస్తున్నట్లు అనిపించింది వీళ్ళకు కొద్దిసేపు అలాగే నిలబడిపోయారు

తరువాత కొద్దిసేపటికి, తేరుకున్నట్టు కదిలాడు ప్రకాశం ముందుగా వెళ్ళి కత్తెర, గడ్డం చేసే కత్తీ తీసుకొని వచ్చాడు దువ్వెన లేదు ప్రకాశం, జాన్ ఒకరికొకరు క్రాపులు చేసుకున్నారు వీళ్ళు ఇలా ఒకళ్ళకొకళ్ళు క్రాపులు చేసుకోవటం పూర్తి చేసేసరికి ఆసాముల కుర్రోళ్ళు బావి దగ్గరకెళ్ళి స్నానాలు పూర్తి చేసుకొని వెళ్ళిపోయారు తరువాత వీళ్ళు వెళ్ళి , వున్న ఆ ఒక్క బక్కెట్‌తో ఒకరి తర్వాత ఇంకొకళ్ళు స్నానాలుచేసి బేరక్‌కు చేరారు అప్పటికి సాయంత్రం నాలుగు గంటలు కావచ్చింది

ఆరెస్సై ఆఫీసునుండి ఒక రిక్రూట్ కుర్రవాడు వీళ్ళ బేరక్‌కు వచ్చి, సాయంత్రం పేరేడ్‌కి అందర్నీ రమ్మన్నారనీ, పేరేడ్ డ్రెస్ వేసుకొని రమ్మన్నారనీ చెప్పి వెళ్ళాడు అంతా చిన్నగా లేచి కిట్టుబాక్సులు తెరచి బూట్లూ, మేజోళ్ళూ, వాటిమీద కట్టుకునే పట్టీలూ, నిక్కరూ, పీటీ బనియన్లూ బయటకు తీశారు బూట్లు వేసుకుని వాటిమీద పట్టీలు చుట్టుకున్నారు అలవాటు లేనందువలన ఆ పనికి కొంత టైం పట్టింది పీటీ బన్నీను వేసుకొని నిక్కర్లు తొడుకున్నారు ఇచ్చిన నిక్కర్లు ఇచ్చినట్లు సైజు చేయించకుండా తొడుక్కున్నందువలన, అవి మోకాళ్ళు దాటి కిందకొచ్చి, లూజుగా వేళ్ళాడుతూ చూసే వాళ్ళకు నవ్వు తెప్పిస్తున్నాయి అలా వాళ్ళు ఆ నిక్కర్లు చూసుకొని విరగబడి నవ్వుకున్నారు వాళ్ళ తలలు వాళ్ళకే నవ్వు తెప్పిస్తున్నాయి జులపాలూ ముడులూ పోయి సమ్మర్ క్రాపులకన్నా అధ్వాన్నంగా తయారయ్యాయి తలచుట్టూ కత్తెరతో క్రాపు చెయ్యకుండా కత్తితో సుబ్బరంగా గీకటం వలన, తెల్లటి శరీరం వున్నవాళ్ళని చూస్తుంటే నెత్తిమీద నల్లటి మూకుడు బోర్లించినట్టు కనపడుతోంది అలా చేయడంకన్నా సుబ్బరంగా గుండుచేస్తే కనీసం ఆ ముఖాల్ని చూడబుద్దన్నా వేసేది అంత బరువు బూట్లు వేసుకొనేసరికి కాళ్ళకు పెద్ద బండరాళ్ళు కట్టినట్లుంది ముతక బూట్లు కావటం వలన అప్పుడే కొందరికి పాదాలు ఒత్తుకుంటున్నాయి బాగా నడుముకు సరిపడేటట్లు బెల్టులను ఎడ్జెస్ట్ చేసుకోవటానికి చాలా సమయం పట్టింది వాళ్ళకు

ఇంతలో బిగిలర్ బిగిల్ వూదాడు, పేరేడ్‌కి టైం అయ్యిందన్నట్లు అన్ని బేరక్‌లలోని పాతవాళ్ళు బిలబిలా బయటకువచ్చి పేరేడ్ గ్రౌండ్ వైపు నడక సాగించారు కొత్తగా వచ్చి-

వీళ్ళుకూడా చిన్నగా కదిలి బేరక్ బైటకు వచ్చారు వీళ్ళ ఆకారాలూ, నిక్కర్లు చూచి పాతవాళ్ళు విరగబడి నవ్వుతున్నారు బూట్లు అలవాటులేని ఈ కొత్తవాళ్ళకు అడుగు అనుకున్నచోట పడటం లేదు తమ నడక తమకే నవ్వు తెప్పిస్తోంది

చిన్నగా గ్రౌండ్‌కు చేరారు

పాత బ్యాచ్‌ల కుర్రోళ్ళు వారివారికి కేటాయించిన స్థలల్లో ఫాలెన్ అయ్యారు గ్రౌండ్‌లో ఈ కొత్తవాళ్ళంతా ఒకచోట రెండు జట్లుగా నిలబడ్డారు పాత బ్యాచ్‌లకు ప్రతిదానికీ ఒక అసిస్టెంట్ డ్రిల్ ఇన్‌స్ట్రక్టరు ( ఏ డి ఐ ) వున్నాడు బేచ్‌లులేని కొంతమంది ఏ డీ ఐ లు ఒకచోట నిలబడి వున్నారు విడిగా ప్రతి బేచ్‌లోని లీడరు, బేచ్‌లోని వారందరినీ లెఖ్ఖపెట్టి, వాళ్ళ బేచ్ ఏ డీ ఐ కి రిపోర్టులు ఇస్తున్నారు కొత్తవాళ్ళు ఆ వాతావరణాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తున్నారు వాళ్ళకు ఇదంతా కొత్తగా, వింతగా, ఆనందంగా వుంది. విశాలమైన ఆ గ్రౌండునంతా కలియచూస్తున్నారు ఇంతలో అక్కడకు ఛీఫ్ డ్రిల్ ఇన్‌స్ట్రక్టరు (సి.డి ఐ ) వచ్చాడు ఏ డీ ఐ లు అంతా అతనికి సెల్యూట్‌లు చేశారు సీ డీ ఐ ఈ కొత్త బ్యాచ్‌ని చూశాడు బేచ్‌లు ఏమీ లేకుండా ఖాళీగా నిలబడ్డ ఏ డీ ఐల వైపు చూచి, ఒకతనిని పేరుపెట్టి పిలిచాడు అతను పరుగెత్తుకుంటూ వచ్చి సీ డీ ఐ కి సెల్యూట్ చేశాడు సీ డీ ఐ కొత్త బేచ్‌వైపు వేలు చూపిస్తూ, ''నువ్వు ల బ్యాచ్‌ని తీసుకో'' అన్నాడు ఆ ఏ డీ ఐ తిరిగి సీ డీ ఐ కి సెల్యూట్ చేసి, ఆ బేచ్ దగ్గరకు మార్చింగ్ చేసుకుంటూ వెళ్ళాడు బేచ్‌లోని అందరినీ పరిశీలనగా చూశాడు వాళ్ళుకూడా అతన్ని అలాగే చూశారు

''ఏ జిల్లా?'' అడిగాడు ఏ డి ఐ

''గుంటూారు, గుండూారు'' ఒక్కసారే పది పదిహేనుమంది చెప్పారు ఉత్సాహంగా

ఏ డీ ఐ వాళ్ళవైపు నొసలు చిట్లించి చూశాడు ''గుంటూరు, గుంటూరు కాదు గుంటూరు సార్ అనాలి ప్రతి మాటకూ ముందూ వెనుకా కూడా సార్ అనాలి ఏదన్నా అడిగితే దానికి ఒక్కొక్కళ్ళే సమాధానం చెప్పాలి అంతేగానీ అందరూ ఒక్కసారే గొర్రెల్లాగా అరవకూడదు ఇప్పుడు మీరు మామూలు జనంకాదు పోలీసు ఉద్యోగం ఇది మిగతా డిపార్టుమెంట్లకూ దీనికీ చాలా తేడావుంది ప్రతిమాటా, ప్రతిపనీ డిసిప్లైన్‌గా జరిగిపోవాలి అంటే అంతా మాన్యూల్ ప్రకారం జరగాలి లేకపోతే చాలా హార్డుపనిష్మెంటు తీసుకోవాల్సి వస్తుంది జాగ్రత్త '' ఇంకా ఏదో చెప్పుకు పోతున్నాడు ఏ డీ ఐ కానీ ఇంతలో గ్రౌండులో వున్న మిగిలిన సీనియర్ బేచ్‌ల కుర్రాళ్ళు డ్రిల్లు చెయ్యడం మొదలుపెట్టేసరికి వీళ్ళదృష్టి అటుపడింది వెంటనే ఏ డీ ఐ ఒక్క గావుకేక వేశాడు ''రేయ్ యూజ్‌లెస్ ఫెలోస్ ''

ఆ అరుపుకి అందరూ బిత్తరపోయి ఇటు తిరిగారు ఏ డీ ఐ లేని కోపాన్ని తెచ్చుకొని, నొసలు ముడివేసి, పళ్ళుకొరుకుతూ, ''ఏం, నేనిక్కడ మాట్లాడుతుంటే మీరటు చూస్తున్నారు? తాట ఒలుస్తా నా సంగతి మీ కింకా తెలియదు నేను మిగతా వాళ్ళలాంటి వాడినికాదు ఎగస్ట్రా డ్రిల్లు ఇచ్చానంటే అల్లాడతారు ఇది ఫస్ట్ వార్నింగ్ తెలిసిందా యూజ్‌లెస్ ఫెలోస్ '' అంటూ ముందున్న వాళ్ళవైపు ఎగాదిగా చూశాడు కోపంగా

ఆ మాటల్లో చాలా మాటలు వాళ్ళకు అర్థంకాకపోయినా, అందరూ అతని ముఖం చూచి భయపడ్డారు వాళ్ళ యిళ్ళదగ్గర, వూళ్ళల్లో అలాటి మాటల్ని వాళ్ళెప్పుడూ వినలేదు లంతకుముందు అతనలా ఎగాదిగా చూస్తుంటే ముందున్న వాళ్ళు కొంతమంది తలలు

వంచుకున్నారు వెనకున్న వాళ్ళు ముందువాళ్ళ తలల్ని చాటుచేసుకున్నారు శ్వాస పీల్చడం కూడా మరిచిపోయినట్లు నిలబడ్డారు వాళ్ళు ఏ డీ ఐ చూపిన కృత్రిమ కోపానికే వాళ్ళు అలా అయిపోయారు

''జాగర్త నేనిటు చెపుతూంటే మీరటు లెఖ్ఖ లేకుండా '' మళ్ళీ మొదలుపెట్టాడు అతని ఆకారం చూస్తే కోపం ఆపుకోలేక, ముందు వరుసలోని వాళ్ళల్లో నెవరినన్నా కొడతాడేమోనని భయంవేసింది వాళ్ళకు

''యూజ్‌లెస్ ఫెలోస్ అందరూ వరుసగా ఒకళ్ళ వెనుక ఒకళ్ళు నడుచుకుంటూ రావాలి తెలిసిందా?'' అని, ''ఆఁ ముందు నువ్వు, ఆ కనపడే చెట్టుకిందకు పద'' అని ముందునిలబడ్డ ఒక కుర్రవాడికి చెప్పాడు. ''మీరంతా ఇతని వెనకాల పదండి ఊ, కదలాలి, త్వరగా '' అన్నాడు

అందరూ ఒకళ్ళ వెనుక ఒకళ్ళు నడుస్తూ ఒక పెద్ద మర్రిచెట్టు నీడకు వెళ్ళి, అక్కడ అంతా అలాగే వరుసగా నిలబడ్డారు అలా నిలబడ్డ వాళ్ళందరినీ నాలుగు వరుసలుగా ఒకళ్ళ వెనుక ఒకళ్ళు వుండేలాగా నిలబెట్టాడు ఏ డీ ఐ అందరినీ పరీక్షగా చూచి వాళ్ళల్లో ఒకతన్ని పిలిచాడు అతను వరుస మధ్యలోనుండి బయటకు వచ్చాడు ''నువ్వు వీళ్ళందరికీ లీడర్‌వి. తెలిసిందా?'' అని మిగిలిన వాళ్ళవైపుచూసి, ''మీరంతా ఇతను చెప్పినట్లు వినాలి ఎవరన్నా ఇతని మాటకు ఎదురు చెప్పారో, పనిష్మెంటు తీసుకుంటారు'' అని ఆ కుర్రవాడివైపు తిరిగి, ''నీ పేరేంటి?'' అన్నాడు

''యంకన్న'' అన్నాడు అతను

''యంకన్న కాదు వెంకన్న సార్ అనాలి సార్ అనాలని చెప్పలేదూ మీ కిందాక? ఏ మాట మాట్లాడినా సార్ అనాలి గుర్తుంచుకో మీరుకూడా తెలిసిందా? పేరేడ్ గ్రౌండునుండి బేరక్‌కు వెళ్ళేటప్పుడు నువు నా దగ్గరకు రా నీతో ఒక విషయం మాట్లాడాలి తెలిసిందా?'' అన్నాడు ఏ డీ ఐ. తెలిసినట్లు తలూపాడు వెంకన్న

''తలవూపకూడదు అలా తెలిసింది సార్, అలాగే సార్ అనాలి'' అన్నాడు ఏ డీ ఐ

''తెలిచింది చార్'' అన్నాడు వెంకన్న

''వెళ్ళు నీ చోట్లో నిలబడు మీరంతా ప్రతిరోజూ గ్రౌండులో ఫాలెన్ అయ్యేటప్పుడు ఇలాగే నిలబడాలి ఈ రోజు ఎవరి పక్కన ఎవరున్నారో గుర్తుంచుకుని, ఎవరెవరు ఏ వరుసల్లో వున్నారో గుర్తుంచుకొని అలాగే రోజూ నిలబడాలి అంతేగాని ఎవరిష్టం వచ్చినట్లు వాళ్ళు నిలబడగూడదు తలల ఎత్తులన్నీ లెవల్‌గా వుండాలి అంటే పొట్టివాళ్ళు ఎడమవైపుకీ, పొడుగువాళ్ళు కుడివైపుకి. తెలిసిందా?'' అన్నాడు

ఆ మాటకు కొంతమంది తలలు వూపబోయి మానుకున్నారు అంతకుముందు విడివిడిగా వున్న గ్రూపుల వాళ్ళు ఇప్పుడు ఒకళ్ళపక్కన ఇంకొకళ్ళు నిలబడటం మూలాన చాలామందికి ఇబ్బందిగా వుంది.

''ఆఁ ఇక ఇప్పుడు మీకు డ్రిల్లు మొదలు పెడతాను'' అంటూ వాళ్ళకు డ్రిల్లు నేర్పటం ప్రారంభించాడు మొదటి రోజు కావటం మూలానా అందరూ హుషారుగా వున్నారు కాని ఓ అరగంట గడిచేసరికి కడుపులో ఎలుకలు పరిగెత్తటం ప్రారంభించాయి మధ్యాహ్నం వాళ్ళకు పెట్టిన నూకల అన్నపు ముద్ద వాళ్ళకు ఏ మూలకూ సరిపోలేదు కొంతమందికి కళ్ళు తిరుగుతున్నట్లు వుంది అందరినీ నీరసం ఆవహించింది కొత్త బూట్లు విపరీతంగా ఒత్తుకొని నొప్పిపుడుతున్నాయి. తరువాత ఒక అరగంటకు బిగిలర్ బిగిల్ వూదాడు. డ్రిల్లు ఆపాడు

ఏ డి ఐ

''ఇక్కడనుండి బేరక్‌లకు వెళ్ళేటప్పుడు అందరూ ఒరుసలో వెళ్లాలి వరస తప్పినా, మధ్యలో మాట్లాడినా పనిష్మెంటు వస్తుంది'' అని వెంకన్నవైపు తిరిగి, ''వెంకన్నా, నువు మాత్రం ఇక్కడేవుండు తరువాత వెళుదువుగానీ'' అని మిగతావాళ్ళను వెళ్ళమన్నాడు అందరూ వరసగా నడిచి వెళ్ళారు మిగతా బేచ్చీల లాగానే గ్రౌండులో ఏ డి ఐ, వెంకన్నా మిగిలారు

తమరి నెవరన్నా గమనిస్తున్నారేమోనని అటూ ఇటూ చూశాడు ఏ డీ ఐ ఎవరూ గమనించటం లేదని నిర్ణయించుకున్నాక, వెంకన్న వైపు తిరిగి చిన్నగా, ''ఇక్కడ మామూలుగా వుండే అలవాటే ఇది కొత్తగా వచ్చిన ప్రతి బాచ్చీ కూడా గ్రౌండ్‌లోకి దిగేటప్పుడు గ్రౌండు మామూలు వుంటుంది మనిషికి ఒక అణా చొప్పున ఇస్తారు ప్రతి బ్యాచ్చీలీడరు ఆల్ల బేచ్చీలోని అందరి దగ్గరా వసూలు చేసి యిచ్చేయాలి నువ్వు ఈ రాత్రికి అందరి దగ్గరా వసూలుచేసి వుంచు నైటు రోల్‌కాల్ అయిపోయిన తరువాత నేనొచ్చి తీసుకుంటాను ఎవరన్నా యివ్వటానికి పేచ్చీ పెడితే వాళ్ళ నెంబర్లు నాకు చెప్పు వాళ్ళ సంగతి డ్రిల్లులో నేను చూస్తా గ్రౌండులోసొంగ పడిద్ది నా తడాఖా చూపిస్తా మరి ఈ విషయం వాళ్ళకు చెప్పు ఇది చాలా సీక్రేటు ఆఫీసర్లకు తెలిస్తే ఉద్యోగాలుపోతయ్ ముందు నీ ఉద్యోగం పోయిద్ది జాగ్రత్త'' అని మళ్ళీ అటూ ఇటూ చూశాడు తమర్ని ఎవరూ గమనించటం లేదని రూఢిపరచుకున్నాక, ''ఆఁ ఇంక నువ్వెళ్ళు నేను చెప్పింది గుర్తుందిగా నైటు రోలుకాలు అయిపోయిన తరువాత వస్తాను'' అన్నాడు

వెంకన్నకు ఆ విషయం అర్థం కావటానికి కొంచెం టైం పట్టింది అతనికి విషయం సరిగా అర్థం కాలేదు గాబోలు అనుకున్నాడు ఏ డీ ఐ ''ఏంటీ? నేను చెప్పింది అర్థమైందా?'' అన్నాడు

వెంకన్న అర్థమైనట్లు తలూపాడు అతను నోటితో జవాబు చెప్పకుండా, అలా తల వూపినందుకు ఏ డీ ఐ కి చటుక్కున కోపం వచ్చింది కానీ ఇప్పుడు వెంకన్నతో పని వుంది, కాబట్టి కోపాన్ని దిగమింగుకున్నాడు ''వూఁ సరే వెళ్ళు'' అని అతను ఆఫీసువైపు నడిచాడు వెంకన్న చిన్నగా బేరక్ వైపు అడుగులు వేశాడు

సూర్యుడు పడమరకు వాలిపోతున్నాడు వెంకన్న ఆలోచిస్తూ బ్యారక్‌కు వెళ్ళాడు ఏ డీ ఐ చెప్పిన విషయం కొద్దిసేపటి తరువాత పూర్తిగా అర్థమయ్యింది ట్రైనింగు స్కూలు వ్యవహారాలు ఇప్పుడిప్పుడే తెలుస్తున్నాయి అందరూ కలిసి పక్కపక్కన నిలబడి డ్రిల్లు చేయటం ఏమీ బాగాలేదు అతనికి ఆ విషయం ఏ డీ ఐ కి చెప్పాలనుకున్నాడు తనని లీడర్‌ని చేసినందుకు కించిత్తు గర్వం, ఆనందం కలిగాయి ఆలోచిస్తూ బ్యారక్‌లోకి అడుగుపెట్టాడు అతన్ని చూచి అంతా గుమికూడారు

''ఏంది ఆయన నీకు సెప్పింది?'' అడిగాడు ఒకతను వెంకన్న రహస్యం చెపుతున్నట్లు అటూ ఇటూ చూశాడు అందరూ అతనివైపే చూస్తున్నారు తను చెప్పబోయేది అందరూ ఆలకించబోతున్నారని అనుకున్నాడు

''మనందరం తలకొక అణా సొప్పున గెవుండ్ మామూలు ఇయ్యాలంట ఏ డీ ఐ కి అందరికాడ డొబ్బులు నన్నొసూలు సెయ్యమన్నాడు రాత్తిరి పొద్దుపోయినాక మన బారక్‌కి వత్తానన్నాడు యెవురన్నా డబ్బులు యియ్యకపోతే పనిచ్మెంటు ఇత్తానన్నాడు'' అని దూరంగా నిలబడి వింటున్న ప్రకాశం వాళ్ళవైపు చూస్తూ, ''ఆఖ్ఖా యీఖ్ఖా అని లేదు అందరూ యియ్యాల్సిందేనంట వోరి డొబ్బులు ఆల్లు తెచ్చి నా సేతి కియ్యండి'' అని తన కిట్టు బాక్సుమీద

కూర్చున్నాడు ఆ మాటలు విని అక్కడున్నవాళ్ళంతా ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు

''సుట్ట పుగాక్కి గతిలేక అల్లాడతంటే, ఇది బాగానే వుందే'' అన్నాడు వెంకటేశం జాన్‌తో

ఆ మాట విన్న జాన్, ''ష్, అరవమాక దాన్ని గురించి మనం ఏం మాట్లాడగూడదు పైకి నువ్వేం మాట్లాడగాక యీడ డబ్బులున్నవోళ్ళు వోరూ లేరు తొందరపడి యెందుకు నువ్వు నోరు జారతావు'' అన్నాడు ఆ మాట విని వెంకటేశం ఏమీ మాట్లాడలేదు ఎవరి ఆలోచనలలో వాళ్ళు మునిగిపోయారు కొంతమంది బక్కెట్లు తీసుకొని బావి దగ్గరకు వెళుతున్నారు అప్పటికి బాగా చీకటిపడింది పాతవాళ్ళ బేరక్‌లలో కోడిగుడ్డు కిరసనాయిలు బుడ్లు మిణుకు మిణుకు మంటున్నాయి ఆసాముల కుర్రోళ్ళు స్నానాలకు వెళ్ళివచ్చిన తరువాత మిగతావాళ్ళు వెళ్ళారు మధ్యాహ్నం ఇచ్చిన కుర్రవాళ్ళ దగ్గరకు వెళ్ళి పళ్ళేలు అడుక్కొచ్చుకున్నారు వీళ్ళు మెస్ దగ్గరకు వెళ్ళి అన్నం, పప్పుచారు పెట్టించుకొని ఆ చీకట్లోనే వంటగది పక్కన కూర్చుని తిన్నారు

''పొగులైతే పురుగులు కనపడేయి ఏరుకోటం ఆలిస్సమయ్యేది ఇప్పుడా యిబ్బంది లేదు'' అన్నాడు జాన్ నవ్వుతూ ఆ మాటకు అందరూ నవ్వేరు

''వరి బువ్వని సంకలు కొట్టుకున్నాం గానీ, మన సజ్జ సంగటే నయం కడుపులో ఎత్తుగా వుండేది ఇది కాత్తంత రుసేగానీ నాబంలేదు'' అన్నాడు వెంకటేశం ''రొండో పూటకే యీ బువ్వ యగటు కొట్టిందహె'' అన్నాడు మళ్ళీ

''యేందో మన బతుకులు యింటికాడకన్నా యీడేదో యిరగబొడవచ్చని వత్తే చివరికి పురుగుల బువ్వ, సరిగా కాళ్ళు జాపి పడుకోవటానికి కూడా సాలని యిరుకు, సీకటి కొంపలు ఏందో బలే నీరసంగా వుంది ఒక్క రోజుకే యిట్టా వుంది యీ ఆరు నెలల్లో మనలో మిగిలేది యెంతమందో? ఆడ యిల్లకాడ ఆడోల్లు యెంత కిందా మీదా అవుతున్నారో'' అన్నాడు ప్రకాశం

అతని మాటల్లో బాధ కనిపించింది ఆ మాటలు విన్న తరువాత మిగతావాళ్ళని కూడా నీరసం ఆవహించింది ఒక్కరోజులోనే ట్రైనింగు మొహం మొత్తింది చుట్టూ ఎంతమందివున్నా ప్రతి వాళ్ళకూ ఒంటరిగా వున్నట్లు మనసులో బాధ ఇంటివద్ద షడ్రసోపేతమైన భోజనం చెయ్యకపోయినా, కనీసం వుప్పూ, కారం వున్న పప్పుచారుతోనో, పచ్చడి మెతుకులతోనో తృప్తిపడేవాళ్ళు ఆ రోజూ ఈ రోజూ అనకుండా రోజూ సలసలా మసిలే నీళ్ళు పోసుకొనేవాళ్ళు కష్టపడ్డ వంటికి ఆ స్నానం హాయిగొలిపేది ట్రైనింగు అయిపోయిందాకా ఇక్కడ బావిలోని చన్నీళ్ళతోనే స్నానం రోగిష్టి మనిషికి పెట్టే, రుచీ పచీ లేని తిండి తింటున్నట్లు అనిపించింది వాళ్ళకు

అన్నాలు తిని, పళ్ళేలు ఇచ్చేసి బేరక్‌కు వచ్చేసరికి బారక్‌లో ఏ డీ ఐ వున్నాడు

అందరూ అతని చుట్టూ గుమికూడారు వెంకన్న ఏ డీ ఐ పక్కనే వున్నాడు ఏ డీ ఐ జాన్‌ని చూచి ''నీ పేరేంటి?'' అన్నాడు

''జాన్ చార్'' అన్నాడు జాన్

''ఏమిటి మీరు ? ఇదంతా నాకు చిరాకుపుడుతుంది నేనేమీ మిమ్మల్ని కొత్తగా అడగటం లేదే ఇది మామూలే. ఇక్కడకు వచ్చిన అన్ని జిల్లాల వాళ్ళూ గ్రౌండు మామూలు ఇస్తారు ఇది అన్నిచోట్లా వున్నదే అనంతపురం, హైదరాబాదు అన్ని చోట్లా ఇంతమందిలో నలుగురేనా ఇచ్చేది మీ వాళ్ళందరి దగ్గర నుండి నువ్వు వొసూలు చెయ్యి'' అన్నాడు

జాన్ ఏదో చెప్పటానికి తటపటాయించాడు

''ఏమిటి? ఏమిటో చెప్పు ఫరవాలేదు'' అన్నాడు ఏ డి ఐ

''డబ్బులు వోరికాడా లేవు చార్ మాకూ యియ్యాలనే వుంది మేవేవన్నా ఒందలూ, ఏలూ ఇత్తన్నామా? విద్దె నేర్పే గురూకి అణా డబ్బులు కూడా యియ్యలేని యిబ్బందుల్లో వున్నాం మాకు తింటానికి మల్లలు కూడా లేక యీ పక్క బేరక్కోల్లని అడిగి పల్లేలు తెచ్చుకుంటన్నాం చార్'' అన్నాడు

ఏ డీ ఐ కొద్దిసేపు ఏమీ మాట్లాడలేదు ఏదో ఆలోచిస్తున్నట్లు వుండిపోయాడు తరువాత చిన్నగా అన్నాడు ''సరే, ఒక పని చెయ్యండి జీతాలు తీసుకున్నాక ఒక్కసారే గ్రౌండు మామూలూ, నెల మామూలూ రెండూ కలిపి యివ్వండి నేను అన్నీ వెంకన్నకు చెప్పాను చాలా సీక్రెట్ విషయాలు ఇవి పాపం, డబ్బులు లేనప్పుడు మిమ్మల్ని ఇబ్బంది పెట్టటం కూడా బాగుండదు'' అంటూ సానుభూతి చూపుతున్నట్లు మాట్లాడి, వెంకన్నవైపు చూచి, ''వెంకన్నా, అన్ని విషయాలు నువ్వు చెప్పు నేను వస్తాను మరి మీరంతా భోజనాలు చేసినట్లేగా అసలు రోల్‌కాల్ అయినాక వద్దామనుకున్నా ఎందుకులే పనిలోపని అని ఇప్పుడే వచ్చా సరే వస్తాను మరి'' అన్నాడు వెళ్ళటానికి లేస్తూ

''చేశాం సార్'' అన్నారు చాలామంది ఒక్కసారే

''ఆఁ మంచిది, మంచిది సరే నే వస్తా మరి మీరంతా నేను చెప్పింది మరిచిపోవద్దు'' అంటూ వెళ్ళిపోయాడు

అంతా ఎవరి ఆలోచనలలో వాళ్ళు మునిగి, ఎవరి పెట్టెలమీద వాళ్ళు కూర్చున్నారు పక్క బేరక్‌లలో వున్న సీనియర్స్ కొందరు పెట్టెలమీద దరువులు వేస్తూ, గోలగోలగా పాటలు పాడుతున్నారు ఎవరో ఒకతను పద్యం పాడుతున్నాడు భోజనానికి మెస్ దగ్గర కెళుతున్న కొంతమంది పళ్ళేల్ని తప్పెటల్లాగా దరువు వేస్తూ వెళుతున్నారు భోజనాలు చేసి వస్తున్నవాళ్ళు చెంబులతో నీళ్ళు తెచ్చుకుంటున్నారు వీళ్ళ బేరక్‌లో తప్ప మిగిలిన వాళ్ళంతా హుషారుగా వున్నారు ఈ కొత్తవాళ్ళకి ఆ వాతావరణం కొత్తకావటం, అందరికీ ఇంటి దగ్గరి మనుషులు గుర్తుకు రావటం వీళ్ళ విచారానికి కొంత కారణం అందరి మనసులూ గుబులు గుబులుగా వున్నాయ్ ఎవరి ఆలోచనలలో వాళ్ళు మునిగిపోయారు పక్కవాళ్ళతో మాట్లాడటానికి ఏమీ కబుర్లు లేనట్లు వుండిపోయారు అంతా

''నెల మామూలు ఏంది మల్లీ?'' అన్నాడు వెంకటేశం ఆ మాట తనలో తాను అనుకొంటున్నట్లు

నిశ్శబ్ద వాతావరణంలో ఆ మాట చాలా మందికి వినపడింది కానీ ఏవరూ ఏమీ మాట్లాడలేదు

''ఇంగా అయిదు నెలల ఇరవై తొమ్మిది రోజులు గడవాలి ఎట్టా గడుత్తాయో'' అన్నాడు ఒకతను

''ట్రైనింగు శానా కట్టమన్నారే?'' అన్నాడు ప్రకాశం నిశ్శబ్దాన్ని భంగంచేస్తూ.

దానికి జవాబుగా జాన్ ఏదో అనబోయేలోపుగా, దూరంగా పెట్టెమీద కూర్చునివున్న గురవయ్య, ''అప్పుడే ఏమయ్యింది ముందుందీ ముసళ్ళ పండగ మనం వచ్చి ఒక్కరోజేగా ప్రకాశం'' అన్నాడు

''అగును'' అన్నాడు జాన్, గురవయ్య మాటలకు వంత పాడుతున్నట్లు

''ఇక్కడేందో అంతా గుంబులు గుంబులుగా వుంది ఏందో దిగులుగా వుంటున్నది, నీకెట్లాగుందో గాని'' అన్నాడు ప్రకాశం

''అందరికీ అట్లాగే వుంటది మరి కొత్త కాబట్టి అందులో, మనం ఎవరికి వాళ్ళం ఒకళ్ళతో ఒకళ్లు కలవకుండా, ఎవరి మటుకు వాళ్ళం మౌనంగా కూచుంటే ఇంకా బాధగా వుంటుంది మంచో, చెడో ఏదో ఒక విషయాన్ని గురించి మాట్లాడుకుంటుంటే మనసు కొంచెం తేలికగా వుంటుంది'' అన్నాడు గురవయ్య

ఆ మాటకు జవాబుగా, ''ఆఁ మనకేం ఇసయాలుంటాయి మాట్లాడుకోటానికి?'' అన్నాడు ప్రకాశం

''అట్లా అనమాకు ప్రకాశం మనం ఏదో ఒక ఇషయం మాట్లాడుకోవచ్చు మనల్ని గురించీ, మనూరి గురించీ, మన కష్ట సుకాలు గురించీ ఇట్లా శాలా వున్నయ్యి మాట్లాడుకోటానికి ఇసయాలకేం కర్మ'' అన్నాడు గురవయ్య

అతను ప్రకాశంతో అట్లా ఫ్రీగా మాట్లాడటం అతని మనుషులకు విసుగ్గా, కోపంగా వుంది అసహనంగా అతని మాటల్ని వింటూ వుండిపోయారు

గురవయ్య మాటలకు ప్రకాశం ఏమీ జవాబు చెప్పలేదు కొద్దిసేపు నడిచిన వాళ్ళ సంభాషణ అనంతరం తిరిగి నిశ్శబ్దం ఆవరించింది అంతటా అప్పటివరకూ వాళ్ళ మాటలు వింటున్న మిగతావాళ్ళు తిరిగి వాళ్ళ వాళ్ళ ఆలోచనలలో మునిగిపోయారు. తరువాత కొద్దిసేపటికి, నైటు రోల్‌కాల్‌కు టైం అయ్యిందన్నట్లు, పెద్దగా బిగిల్ శబ్దం నిశ్శబ్దాన్ని చీల్చుకొని వచ్చింది అంతా నీరసంగా లేచి, చీకట్లో తడుములాడుకుంటున్నట్లు చిన్నగా ఒకరివెనుక ఒకరు వెళ్ళి గ్రౌండులో నిలబడ్డారు వాళ్ళ ఏ డీ ఐ వచ్చి అందరినీ ఒక క్రమంలో, అంటే సాయంత్రం డ్రిల్లు చేయించబోయే ముందు నిలబెట్టినట్లు నిలబెట్టాడు వెంకన్నను పిలిచి ఆ బేచ్చీకి ముందు నిలబెట్టాడు ''మీరు ప్రతి రాత్రి ఇక్కడే ఇలాగే నిలబడాలి'' అని వెంకన్నవైపు తిరిగి, ''నువ్వు అందరినీ ఇలా రోజూ ఫాలెన్ చేసి, రానివాళ్ళ నెంబర్లు నాకు చెప్పాలి తెలిసిందా?'' అన్నాడు

తెలిసిందన్నట్లు తల వూపాడు వెంకన్న

''అలా తలవూపకూడదని ఎన్నిసార్లు చెప్పాలి? ఇంక తడవ తడవకు చెప్పను ఒక్కసారి ఒక విషయం చెపితే దాన్ని జీవితాంతం గుర్తుంచుకోవాలి'' అన్నాడు ఏ డీ ఐ విసుగ్గా, కోపంగా ఆ మాటలకు జడుసుకున్నాడు వెంకన్న

''తెలిచింది చార్'' అన్నాడు డ్రామాలో కొత్తగా నటిస్తున్న నటుడు భయపడుతూ చెప్పిన డైలాగులాగుంది అతనన్న మాట

''ఊఁ అందరినీ లెఖ్ఖపెట్టు ఆబ్సెంటయిన వాళ్ళ నెంబర్లు ఇవ్వు మీ బేచ్చీలోని అందరి నెంబర్లూ నువ్వు గుర్తుంచుకోవాలి'' అన్నాడు ఏ డీ ఐ.

''అట్లాగే చార్'' అన్నాడు వెంకన్న. వెనక్కి తిరిగి అందరినీ లెఖ్ఖపెట్టి, మళ్ళీ ముందుకు తిరిగి, ఏ డీ ఐ తో, ''అందరూ వున్నారు చార్'' అన్నాడు.

''సరే అందరూ నిశ్శబ్దంగా వుండండి ఆరెస్సైగారు వస్తున్నారు'' అన్నాడు ఏ డీ ఐ

గ్రౌండు అంతా వెన్నెలతో నిండిపోయింది ఆరెస్సై ఆఫీసు ముందు పెట్రోమాక్సు లైటు వేలాడుతోంది ఈ కొత్తవాళ్ళంతా దిక్కులు చూస్తూ నిలబడ్డారు ప్రతి బ్యాచ్చీ ముందువున్న

లీడర్లు ఆ యా బ్యాచ్చీలలో ఆబ్సెంటయిన వారి నెంబర్లు వాళ్ళవాళ్ళ ఏ డి ఐ లకు ఇస్తున్నారు ఆ కార్యక్రమమంతా పూర్తి కావటానికి ఐదు నిముషాల టైము పట్టింది ఇంతలో ఆరెస్సై వచ్చాడు పాత బేచ్చీలవాళ్ళు అంతకు ముందు వరకూ గుసగుసలుగా మాట్లాడుతున్నారు ఆరెస్సై వచ్చే సరికి అంతా నిశ్శబ్దమై పోయింది

ఆరెస్సై గట్టిగా రెండుసార్లు 'అటెన్షన్', 'స్టాండ్ ఎట్-ఈజ్' చెప్పాడు కొత్తవాళ్ళు కొంచెం తడబడ్డారు తరువాత ''రిపోర్ట్'' అన్నాడు

అన్ని బేచ్చీలముందు వున్న ఏ డీ ఐ లు మార్చ్ చేసుకుంటూ వెళ్ళి, ఆరెస్సై ముందు హాల్ట్ అయ్యారు స్మార్ట్‌గా సెల్యూట్‌లు చెయ్యకుండా, చేతులు బిగించి, కొద్దిగా తలలు వంచి, కాలిమడాలు పైకెత్తారు ఆరెస్సై కూడా అలాగే చేశాడు యూనిఫారం లేనప్పుడూ, తలపై టోపీ లేనప్పుడు సెల్యూట్ చేసే విధానం అది ఏ ఏ బ్యాచ్చీలో ఎంతమంది ఆబ్సెంట్ అయ్యారో ఏ డీ ఐ లు చెప్పారు వరుసగా

''వీళ్ళందరికీ ఐదేసి గంటల చొప్పున ఎగస్ట్రా డ్రిల్లు ఇవ్వండి రేపటి నుండి'' అన్నాడు ఆరెస్సై

''అలాగే సార్'' అన్నారు ఏ డీ ఐ లంతా ఒక్కసారే తిరిగి మళ్ళీ ఇందాకటిలాగే సెల్యూట్స్ చేసి, గిరుక్కున వెనక్కు తిరిగి స్మార్ట్‌గా నడుస్తూ వాళ్ళ వాళ్ళ బేచ్చీల ముందుకు వచ్చి నిలబడ్డారు

''డిస్‌బర్స్'' అన్నాడు ఆరెస్సై

అన్ని బేచ్చీలూ, ఒకరివెనుక ఒకరు నడుచుకుంటూ బ్యారెక్‌లకు బయలుదేరారు కొత్త వాళ్ళకి అంతా గమ్మత్తుగా వుంది ప్రకాశం గ్రౌండంతా పరికించి చూశాడు. వెన్నెల పుచ్చపువ్వులా కాస్తోంది విశాలమైన మైదానం మీదనుండి గాలి మృదువుగా వీస్తోంది ఆ ప్రకృతి వాతావరణం అతనికెంతగానో నచ్చింది అంతా చిన్నగా బేరక్‌లకు చేరారు వీళ్ళ బేరక్ అంతా చీకటి చిన్నగా అలాగే తడుముకుంటూ పెట్టెలు తెరిచి, కంబళ్ళు తీసి వరుసగా పరచుకొని పడుకున్నారు పాతవాళ్ళ బారక్‌లలో గోలగోలగా మాటలు వినపడుతున్నాయి. సమయం గడిచేకొందీ శబ్దాలు సద్దుమణుగు తున్నాయి. చీకటిలో పడుకోవటం అలవాటయినా, కొత్త ప్రదేశం కావటానా, కొత్త మనుష్యుల మధ్య పడుకోవటానా, పడక కుదరనట్లూ, ఊపిరి ఆడనట్లు అనుభూతికి లోనయ్యాడు ప్రకాశం ఎవరి ఆలోచనల్లో వారు మునిగిపోయారంతా 'ఇట్టాంటి నౌకరీలో సేరిపోతాననీ, ఇట్టాంటి దేశంకాని దేశానికి టైనింగుకి వత్తాననీ యేనాడన్నా అనుకున్నానా? ఇంకా ఎన్నిరకాల పనులు సెయ్యాల్లో, బయిసత్తులో . ' అనుకున్నాడు ప్రకాశం అతని ఆలోచనలు ఇంటిమీదకు మళ్ళాయి 'అమ్మా, అదీ ఎంత అల్లాడుతున్నారో ఎంకటేశంగాడి పెల్లాం సెప్పిద్దిలే ఇసయం ఆడు సెప్పొచ్చా నన్నాడు నన్నేమో ఇంటికాడ సెప్పి రావద్దన్నాడు ఆడేమో పెల్లానికి సెప్పొచ్చాడు దొంగనాకొడుకు అన్నిటికీ ఆ పైవాడున్నాడులే . ' అనుకున్నాడు మళ్ళీ తల నిమురుకుంటూ తల గుర్తుకు రాగానే అతనికి తెయకుండానే నవ్వొచ్చింది 'ఇట్టా సూత్తే నన్ను పల్లెలో ఓరూ గుర్తుపట్టలేరు వూల్లో కూడా ' అనుకున్నాడు మళ్ళీ

ఆలోచనలతో పాటు నిద్రలోకి జారిపోయాడు వాళ్ళందరి ఆలోచనలూ ఇంచుమించు ఇళ్ళవైపే వెళ్ళాయి కొంతమందికి చాలాసేపటి వరకు నిద్ర పట్టలేదు

పోలీసు ట్రైనింగు స్కూల్లో మొదటిరోజు అలా గడిచింది వాళ్ళకు

మర్రోజు తెల్లవారురఝాము నాలుగున్నర గంటలయ్యింది కొత్త బేచ్చీలోని వాళ్ళంతా

గాఢనిద్రలో వున్నారు ఆరెస్పై ఆఫీసు దగ్గర నిలబడి, బేరక్‌ల వైపు తిరిగి బిగిలర్ బిగిల్ వూదుతున్నాడు నిశ్శబ్ద వాతావరణంలో ఆ శబ్దం కర్ణకఠోరంగా చెవుల్ని తాకింది వులిక్కిపడి కళ్ళు తెరిచారు కొద్ది క్షణాలసేపు వాళ్ళెక్కడుందీ, ఏమిటీ, ఆ చీకట్లో ఏమీ అర్థం కాలేదు అర్థమయ్యేసరికి నీరసం ఆవహించింది కళ్ళు మండుతున్నాయి వళ్ళు తమ స్వాధీనాల్లో లేవు చికాకూ, విసుగూ చోటు చేసుకున్నాయి బాధగా అటూ ఇటూ ఒత్తిగిల్లారు ఒకళ్ళిద్దరు ఇంకా నిద్ర పోతూ గురక పెడుతున్నారు ఒకొక్కళ్ళే బాధగా లేచి కూర్చున్నారు కళ్ళు మూసుకు పోతున్నాయి పాత బ్యాచ్చీల వాళ్ళ బేరక్‌లలోంచి మాటలు వినపడుతున్నాయి పావుగంటలో అంతా లేచారు ఒకళ్ళొకళ్ళే ఒకటికి వెళ్ళి వచ్చారు కాలకృత్యాలు తీర్చుకోవటానికి నీళ్ళు తీసుకుపోవటానికి చెంబులు లేవు మళ్ళీ పాత బాచ్చీవాళ్ళ దగ్గర కెళ్ళి, వాళ్ళు కాలకృత్యాలు ముగించుకొనేంతవరకూ వుండి, చెంబుల్తో నీళ్ళు తీసుకొని వెళ్ళి పనులు పూర్తి చేసుకొని వచ్చారు అప్పటికే టైం చాలా గడిచింది చాలా మంది వట్టి నీళ్ళతోనే ముఖాలు కడుక్కున్నారు బేరక్‌కు వచ్చి, పీ టీ బన్నీన్లు వేసుకొని నిక్కర్లు తొడుక్కున్నారు. వాటిమీద బెల్టు పెట్టుకొని, బూట్లు చేత్తో పట్టుకొని గ్రౌండుకు పరిగెత్తారు బూట్లన్నీ వరుసగా పెట్టి, వెళ్ళి, నిన్న నిలబడ్డట్లు గ్రౌండులో నిలబడ్డారు వీళ్ళ బేచ్చీ బాగా లేటయింది

''ఈ రోజు మొదటిరోజు కాబట్టి వదిలిపెడుతున్నా రేపటినుండి ఇలా లేటుగా వస్తే పనిష్మెంటిస్తా'' అన్నాడు ఏ డీ ఐ అందరివైపూ పరిశీలనగా చూస్తూ

ఎవరూ ఏమీ మాట్లాడలేదు

''మీరంతా కాన్వాస్ షూష్ కొనుక్కోవాలి అవి గవర్నమెంటు ఇవ్వదు పేరేడ్ టైంలో ముందు ఒక అరగంట ఫిజికల్ ట్రైనింగు వుంటుంది తరువాత పేరెడ్ జీతాలు రాగానే ముందు కాన్వాస్ షూస్ కొనుక్కోండి గ్రౌండు నిండా బూట్ల సీలలు వుంటాయి వట్టి కాళ్ళతో పీ టీ చేస్తే అవి గుచ్చుకుంటాయి సెప్టిక్ అయిద్ది కాళ్ళు తీసేసెయ్యాల్సిందాకా వస్తుంది తరువాత మీ యిష్టం'' అన్నాడు ఏ డీ ఐ

''ముందు చెంబులు కూడా కొనుక్కోవాలి చార్ అయ్యిలేకే యియ్యాల ఇంత ఆలిచ్చమయింది శానా ఇబ్బంది గూడా పడ్డాం'' అన్నాడు వెంకన్న చిన్నగా నవ్వుతూ అతనికి ఏ డీ ఐ దగ్గర కొంచెం చనువు ఏర్పడింది అతని మాటలకు అందరూ చిన్నగా నవ్వారు.

ఏ డీ ఐ కూడా నవ్వేడు ''అన్నీ ముఖ్యమే నేను రాత్తిరి చెప్పిన విషయం మరిచిపోగాకండి అది అయిన తరువాతే మిగతా విషయాలన్నీ'' అని అందరివైపూ చూచాడు వాళ్ళేమీ మాట్లాడలేదు ఇంతలో దూరం నుండి ప్రిన్సిపాల్ వస్తూ కనిపించాడు ''జాగ్రత్తగా వుండండి ప్రిన్సిపాల్ దొరగారు తప్పకుండా మీ దగ్గరకు వస్తాడు కొత్త బేచ్చీ గాబట్టి ఏవన్నా అడుగుతాడు ఆయనకి తెలుగు సరిగా రాదనుకోండీ అర్థమయితే చెప్పండి లేకుంటే మౌనంగా వూరుకోండి ఆయనకు వూరకే కోపం వచ్చిద్ది సీరియస్ పనిష్మెంటు ఇస్తాడు స్కూలు నుండి వెళ్ళిందాకా ఈ మాట గుర్తుంచుకోండి'' అన్నాడు

అంతా విని మౌనంగా నిలబడ్డారు అయితే ప్రిన్సిపాల్ వాళ్ళ దగ్గరకు రాలేదు ఆరెస్పై వెళ్ళి ప్రిన్సిపాల్‌కు సెల్యూట్ చేశాడు ప్రిన్సిపాల్ తిరిగి ఆరెస్పైకి సెల్యూట్ చేసి, ఏదో చెప్పాడు ఆరెస్పై తిరిగి ప్రిన్సిపాల్‌కు సెల్యూట్ చేసి వెనక్కి తిరిగి విజిల్ వేశాడు అన్ని బేచ్చీల ఏ డీ ఐ లు వాళ్ళ వాళ్ళ బాచ్చీలను ఫిజికల్ ఎక్సర్‌సైజులు చేయించటం మొదలుపెట్టారు అలా అరగంట

చేశారు అప్పటికే కొత్త వాళ్ళకు కళ్ళు తిరగటం ప్రారంభమయింది పీ టీ అయిపోయిన తరువాత వెళ్ళి బూట్లు తొడుక్కొని వాటిపై పట్టీలు చుట్టుకొని వచ్చారు నిన్న సాయంత్రం బూట్లు వేసుకున్నందువలన చాలామందికి పాదాలమీద ఒత్తుకుపోయి బొబ్బలు వచ్చాయి ఈ పూట అవి పగిలి పుండ్లుపడి బాగా నొప్పిగా వున్నాయ్ కొంతమంది అడుగు ముందుకు వెయ్యలేక పోతున్నారు 'నీరసంతో కళ్ళు తిరిగి పడిపోతామేమో' అనుకున్నారు కొంతమంది కాళ్ళు బరువుతో అనుకున్నచోట పడటంలేదు డ్రిల్లు పూర్తయ్యేసరికి తాతలు దిగివచ్చినంత పని అయ్యింది టైం అయిపోగానే బిగిలర్ బిగిల్ వూదాడు బ్రతుకుజీవుడా అనుకుంటూ అంతా కాళ్ళీడ్చుకుంటూ తూలుతూ బేరక్‌లకు బయలుదేరారు భారంగా చేరి ఎవరిపెట్టెలమీద వాళ్ళు కూలబడ్డారు, గోడలకానుకొని నీరసంగా వళ్ళంతా చెమటతో తడిచిపోయింది బూట్లు విప్పుకునే ఓపిక కూడా లేదు

''ఆలస్యం చేస్తే 'టిపిన్' అయిపోయిద్దంట, సీనియర్లు చెప్పారు'' అన్నాడు ఒకతను ఆమాట వినేసరికి వాళ్ళకు గుండెలు గుభేలుమన్నయ్ లేని ఓపిక తెచ్చుకొని, గబగబా బూట్లు విప్పుకొని మెస్ దగ్గరకు పరిగెత్తారు అంతా అంతవరకూ బరువులు కట్టినట్లున్న కాళ్ళు, బూట్లు విప్పేసరికి తేలికగా అయిపోయాయి బూట్లు వేసుకున్నప్పుడు అనుకున్నచోట అడుగుపడలేదు బరువుకి బూట్లు విప్పాక కూడా అనుకున్నచోట అడుగు పడలేదు బరువులేక నిన్నటి అనుభవమే ఈ రోజూ కలిగి నవ్వుకున్నారు

''ఇందాక బరువుకి ఎయ్యాల్సిన సోట పడలేదు కాళ్లు ఇప్పుడేమో అసలు కాళ్లే లేనట్లున్నయ్'' అన్నాడు ప్రకాశం మిగతావాళ్ళు ఆ మాటకు నవ్వారు గబగబా వెళ్ళి మెస్ దగ్గర వరుసలో నిలబడ్డారు పాతవాళ్ళందరి చేతుల్లో చెంబులూ, గ్లాసులూ వున్నయ్ నిన్న తీసుకున్న వాళ్ళనడిగి జాన్ చెంబు తీసుకున్నాడు లోపలికి వెళ్ళారు వరుసగా నిన్నటిలాగానే నెంబర్లు నోటు చేసుకున్నాడు ఒక కుర్రవాడు చిన్న చిన్న ముద్దలుగావున్న పదార్థం ఒక్కొక్క ముద్ద చొప్పున వాళ్ల చేతుల్లో పెట్టారు మసకగా, చీకటిగా, నల్లగా పొగబారివున్న ఆ చీకటి వంటగదిలో, ఆ చేతిలో పెట్టిన పదార్థమేమిటో ముందు వాళ్ళకు అర్థం కాలేదు ఏదో జావలాంటి పదార్థం చెంబునిండా పోశారు బయటకొచ్చి చూశారు నూకల్ని మెత్తగా సంగటిలాగా ఉడకబెట్టారు సమాన నిష్పత్తిలో మట్టిగడ్డలున్నయ్ నీళ్ళకంటే పలుచగావున్న రాగిజావ చెంబు నిండా వుంది వాటిని చూసేసరికి కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి వాళ్ళకు బాధతో మనస్సు పిండినట్లయింది అవమానంగా భావించారు కొద్ది నిముషాలు ఎవరూ ఏమీ మాట్లాడుకోలేదు అలాటి తిండి తినవలసివచ్చినందుకు ఏడుపు వచ్చింది చేతిలోని వుముద్దను విసిరి నేల కేసి కొట్టి వెళ్ళిపోవాలనిపించింది ప్రకాశంకు 'ఛీ ఈ నౌకరీ వద్దు ఈ బతుకూ వద్దు ఇంటికాడే ' అతని ఆలోచన ఇంక ముందుకు సాగలేదు ఇంటిదగ్గరి గతజీవితం గుర్తు వచ్చింది ఆవేశం కొంత తగ్గింది తమాయించుకోవటానికి ప్రయత్నం చేశాడు. ఆకలి దహించి వేస్తోంది చుట్టూ చూశాడు చాలా మంది ఆవురావురుమని ఆ సంగటి ముద్దల్ని కొరుక్కుతింటున్నారు ఎక్కడివాళ్ళక్కడ నిలబడి వెంకటేశం అబ్బా తింటూ కనిపించాడు చెట్టునీడన నిలబడి జాన్ తిని,చెయ్యి కడుక్కోవటానికి వెళుతున్నాడు డబ్బులున్న కొంతమంది సీనియర్స్, వాళ్ళ 'టిఫిన్' ముద్దల్ని, దూరంగా నిలబడి ఆశగా చూస్తున్న అడుక్కుతినే పిల్లల గిన్నెల్లో వేసి, పక్కనే అమ్ముతున్న 'అట్లు' కొనుక్కొని తింటున్నారు. అక్కడ అమ్ముతున్న అట్లు చూస్తే చాలామంది

కొత్తవాళ్ళకి నోర్లూరాయి దూరంగా నిలబడి తమవైపే చూస్తున్న ఆ అడుక్కుతినే పిల్లలు ప్రకాశం దృష్టిలో పడ్డారు వాళ్ళని పరీక్షగా చూశాడు దారిద్ర్యానికి ప్రతిరూపాలుగా వున్నారు వాళ్ళు ఒక్కళ్ళ వంటిమీదకూడా గుడ్డల్లేవు 'ఇక్కడి పల్లెలోని పిల్లలనుకుంటా' అనుకున్నాడు వాళ్ళమీద నుండి దృష్టి మరల్చాడు చేతిలోని ముద్ద గాలికి ఎండిపోతున్నట్లు అనిపించింది కాని ఆ మట్టి ముద్ద తినటానికి మనస్కరించలేదు 'ఆ పిల్లలకు ఏద్దాం ఒక్కపూట ఏమీ తినకపోతే చస్తానా' అనుకున్నాడు మళ్ళీ చుట్టూ చూశాడు అతని దృష్టి, తననే చూస్తూ నిలబడ్డ గురవయ్యమీద పడింది అట్లు తింటూ నిలబడ్డ గురవయ్య ప్రకాశంను రమ్మనమని చేత్తో సైగ చేశాడు ప్రకాశం సంశయిస్తూ గురవయ్య దగ్గరకు వెళ్ళాడు

''ఆ ముద్ద తినటం కష్టంగానీ, అట్లు తీసుకో నాలుగు'' అన్నాడు గురవయ్య బాగా పరిచయమున్న మనిషితో మాట్లాడినట్టు మాట్లాడాడు అతను అతని చొరవకు ఆశ్చర్యమేసింది ప్రకాశానికి కానీ తన దగ్గర డబ్బులు లేవు ఆ మాట అనలేక పోయాడు

''పరవాలేదులేండి చార్ తినే వాళ్ళందరి కన్నా నేక్కువా ఏంది'' అంటూ చిన్నగా నసిగాడు అతనికి తెలియకుండానే 'సార్' అనే మాట అతని నోటిలో నుండి వచ్చింది

''ఈ మాటలకేమిటిల్లేగానీ, డబ్బులు నేనిస్తాలే'' అని పక్కకు తిరిగి అట్లమ్మే ముసలామెతో, ''ఈయనికి నాలుగట్లియ్యి'' అన్నాడు

''వద్దులేండి ఎందుకులే చార్'' అన్నాడు ప్రకాశం సిగ్గు పడుతున్నట్లు

''ఫరవాలేదులే తీసుకో ప్రకాశం వూరికే యిప్పించటం లేదులే జీతాలు తీసుకున్నాక నా డబ్బులు నాకు యిద్దువు గానిలే ఆకలి బాధ అందరికీ ఒకటే యిల్లకాడైతే పొద్దున్నే గిన్నెడు సద్ది బువ్వ తినేవోళ్లం అట్టాంటోళ్లకి యీ గుప్పెడు ముద్ద ఏం సరిపోయిద్ది పైగా మూడొంతులు మట్టిగడ్డలు, నోట్లో పెట్టుకోవటానికి యీలు లేకుండా'' అన్నాడు

ఇంతలో అట్ల ముసలమ్మ నాలుగట్లు ఆకులో పెట్టి, చెట్నీ వేసి ప్రకాశానికి అందించింది వాటిని చూస్తే నోట్లో నీళ్ళూరాయి

ప్రకాశం ఇంకేమీ మాట్లాడలేదు తన చేతిలోని ముద్దని, దూరంగా నిలబడి చూస్తూ వున్న పిల్లవాడిని పిలిచి, ఆ పిల్లవాడి దోసిట్లో వేశాడు అట్టు తుంచి చెట్నీలో ముంచి నోట్లో పెట్టుకున్నాడు

''మనకిక్కడ అమ్మా, అయ్యా ఎవరున్నారు మనమంతా స్నేహంగా వుండాలి డబ్బులు లేని వాళ్ళందరికీ మనం అప్పు పెట్టలేమనుకో కాని నువ్వంటే నాకెందుకో కొత్త ఇది అంతే'' అన్నాడు గురవయ్య

ప్రకాశం విని ఆనందపడ్డాడు ఏమీ మాట్లాడలెదు ఆశ్చర్యం కూడా వేసింది ఆ రోజు జిల్లా ఆఫీసు దగ్గర జరిగిన సంఘటన దగ్గర నుండీ, ఆసాముల కుర్రోళ్ళకు మినహా మిగిలిన వాళ్ళకు గురవయ్యంటే మంచి అభిప్రాయం ఏర్పడింది ఈ పూట ఇక్కడ ఈ సంఘటనతో అతనిమీద గౌరవం ఏర్పడింది ప్రకాశానికి

''మనమంటే మీరూ, మేమూ సేహంగా యట్టా వుంటాం మీరు యేరే కులమాయె మేమేమో ఎట్టా కుదిరిద్ది'' అన్నాడు కాస్త అయోమయంగా ప్రకాశం

ఆ మాటకు గురవయ్య చిన్నగా నవ్వాడు ''కులానికీ స్నేహానికీ సంబంధం ఏమీలేదు ఇప్పుడు మనం ఇద్దరం స్నేహంగా వుండాలంటే వుంటాం అంతే మనుషుల మధ్య వుండే భావాలు

ఒకేరకంగా వుంటేనే స్నేహం పెరుగుతుంది అంతే దానికి కులం ఏమీ అడ్డం రాదు'' అన్నాడు

''అయితే మావాళ్ళు మీతో, మీ వాళ్ళు మాతో ఎందుకు సేహంగా వుండరో సెప్పు''

''యేం సచ్చారో అదంతా ఒకరకమయిన భేషజం అంతకు మించి నా కేమీ కనిపించదు మీరు మాలో కలవలేకపోవటానికి కారణం మిమ్మల్ని మీరు తక్కువ చేసుకోవటం మేము మీలో కలవలేకపోటానికి మీకంటే మేము గొప్పవాళ్ళ మనుకోవటం వాస్తవంగా అందరం దరిద్రులమే అందుకే ఈ నౌకరీకి వచ్చాం'' అన్నాడు గురవయ్య తనకు తెలిసినంతవరకు ఆలోచిస్తూ

''అంతేనంటావా?'' ఆశ్చర్యంగా చూశాడు ప్రకాశం 'వ్యక్తుల మధ్య ఇంతటి వ్యత్యాసానికి కారణం ఇంత తేలిక విషయమా?' అన్నట్లు చూశాడు

''అంతేమరి ఇవన్నీ మనం సృష్టించుకున్నవే అంతేగాని కులాల వలన మనుషుల విలువలు పెరగవు ఇప్పుడు చూడరాదూ, నువ్వూ ఉద్యోగానికి వచ్చావూ, నేను వచ్చాను ఇద్దరికీ సమాన జీతం ఇస్తారు గానీ, నీకు తక్కువా, నాకు ఎక్కువా ఇస్తున్నారా? అంతా అంతే'' అన్నాడు గురవయ్య

అతని మాటలు విచిత్రంగా వున్నట్టు తోచాయి ప్రకాశానికి ''ఐతే మా కులాల్ని మేమే, అంటే మా తాత ముత్తాతలే సృష్టించుకున్నారంటావా అట్టయితే'' అడిగాడు

''అంతే మరి అందులో సందేహమేం లేదు''

''ఏమోనబ్బా నాకు నమ్మకం లేదు ఎవడయినా తనంత తాను తనని తక్కువవాడిగా చూసుకుంటూ, వూరికి దూరంగా, అంటరానివాడినని సెప్పుకుంటూ బతుకుతాడా? నాకు నమ్మకం కుదరట్లా''

ఆ మాటకు గురవయ్య ఏమీ సమాధానం చెప్పలేకపోయాడు కాసేపు తటపటాయించి, ''సరే, యిదంతా ఎందుకుగానీ,నాకు తెలిసినంతమటుకు ఈ కులాలు, గిలాలు అన్నీ పోవాలంటే అందరూ బాగా చదువుకోవాలి మీవాళ్ళింకా ఎక్కువగా చదువుకోవాలి అప్పుడుగాని యీ కులాలన్నీ పోయి, అందరూ సమానం కారు'' అన్నాడు

''సదుంకుంటే యట్టా సమానమౌతారు?'' అడిగాడు ప్రకాశం

''చదూకుంటే యట్టా సమానవయ్యేదేంది? చదూకుంటే అందరూ ఉద్యోగాలు చేసుకోవచ్చు అప్పుడు కులాలన్నీ వాటంతట అవే పోతయ్యి'' అన్నాడు గురవయ్య

గురవయ్య చెప్పిన మాటల్లో నమ్మకం కలగకపోయినా, కులాలు వుండటానికి గల కారణాల్లో చదువు లేకపోవటం కూడా ఒక కారణం అనుకున్నాడు ప్రకాశం ఇద్దరూ పంపు దగ్గరకెళ్ళి చేతులు కడుక్కొని నీళ్ళు తాగారు గురవయ్య అట్లావిడకి డబ్బులిచ్చాడు ఇద్దరూ బేరక్కు బయలుదేరారు

''మరి నాకు సదుం రాదు యీ వయసులో నే నేడకిపోయి సతుంకోను? మీరంటే బాగా సదుంకున్నోల్లు సర్లేకానీ, నువ్వెన్నో కాసు దాకా సదుంకున్నా?'' అడిగాడు ప్రకాశం

ఆ ప్రశ్నకీ, ఆ మాట తీరుకీ చిన్నగా నవ్వాడు గురవయ్య ''ఇస్కూలు ఫైనల్ పేసయ్యాను నాకు ఇంగ్లీషు కూడా వచ్చు నువ్వు నేర్చుకుంటానంటే రోజూ చెపుతా'' అన్నాడు

గురవయ్య మాటకు సిగ్గుపడుతున్నట్లు నవ్వాడు ప్రకాశం కానీ ఎందుకో సంతోషం కలిగింది అతను అదోరకంగా గురవయ్య వైపు చూశాడు ఆ చూపు గురవయ్యకు నవ్వు తెప్పించింది ప్రకాశం సిగ్గుపడుతున్నట్లు గ్రహించాడు గురవయ్య ఏదో అనబోయే లోపలే ప్రకాశం

అన్నాడు

''అసలు తెనుగచ్చురం ముక్కలకే గతిలేదుగానీ, ఇంగా నా ముకానికి ఇంగిలీచు గూడానా'' అన్నాడు

ఆ మాటకు గురవయ్య నవ్వేడు ''ఇంగ్లీషు కాదు తెలుగు నాకు ఇంగ్లీషు కూడా వచ్చని చెప్పా అంతే నీకు తెలుగు నేర్పుతా నువ్వేం సిగ్గుపడాల్సిన పనిలేదు ప్రకాశం నెలాఖరుకు జీతం తీసుకున్నాక పలకా, పుస్తకం కొనుక్కో నీకు చదువొచ్చిద్ది'' అన్నాడు

ప్రకాశం వింటూ నడిచాడు అతని కేమిటో గమ్మత్తుగా వున్నయ్ ఆ మాటలు ఏమీ సమాధానం చెప్పలేదు గురవయ్య కూడా మళ్ళీ ఏమీ మాట్లాడలేదు ఇంతలో బేరక్ దగ్గర కొచ్చారు ఇద్దరూ లోపలికి వెళ్ళి ఎవరి పెట్టెల మీద వాళ్ళు కూర్చున్నారు

వీళ్ళు కలిసి అట్లు తినటం, కలిసి రావటం చూచిన జాన్, 'ఏమిటన్నట్లు' చూశాడు జరిగిన విషయం చెప్పాడు జాన్‌కూ, వెంకటేశానికీ ప్రకాశం

''సదూ నేరుసుకోటం మంచిదేగా'' అన్నాడు జాన్

''ఆః ఇప్పుడు సదువేం వొచ్చిద్ది నా బొంద'' అన్నాడు వెంకటేశం నవ్వుతూ ఆ మాటకు జాన్ ఏదో చెప్పబోయాడు అంతలో బైటనుండి ఒక కుర్రవాడు బేరక్ లోకి వచ్చాడు అంతా అతనివైపు చూశారు

''కొత్త బేచ్చి లీడరెవరు?'' అడిగాడా కుర్రోడు

''నేనే'' అంటూ లేచి వచ్చాడు వెంకన్న

''మిమ్మల్నంతా 'లా' క్లాసుకు రమ్మన్నారు గోపాలరావు ఏ ఏల్ ఐ గారు మీకు లా క్లాసు తీసుకుంటారట తొమ్మిదింటికల్లా క్లాసులో వుండాలంట ఆరెస్సైగారు చెప్పి రమ్మన్నారు'' అని వెళ్ళిపోయాడు

ఆ కుర్రవాడు వెళ్ళిపోయిన కొద్దిసేపటికి అంతా 'లా' క్లాసుకు బయలుదేరారు వెళుతూ దారిలో అనుకున్నాడు ప్రకాశం 'పోలీసుల్లోకి రావటం ఏందీ!, ఈ లా కాసులేందీ, సదుం లేోళ్ళకి లా ఏం వత్తది? ఈోళ్లలో సదుం వొచ్చిన వోళ్లెందరో? సదుం నేరుసుకోవా లెట్టాగన్నా కట్టపడి అన్నిటికీ ఆ పై వోడే వున్నాడు'

వరుసగా వున్న మర్రిచెట్ల కింద, బేచ్చిలు, బేచ్చిలుగా నేలమీద కూర్చున్నారు రిక్రూట్ పోలీసు కానిస్టేబుళ్ళు అవే లా క్లాసులు ఒక్కో చెట్టు కింద ఒక్కో బేచ్చి వుంది ఒక్కో సబ్ ఇనస్పెక్టరు ఒక్కో బ్యాచ్చికి లా చెపుతున్నాడు సబ్ ఇనస్పెక్టర్లను పోలీసు ట్రైనింగు స్కూల్లో అసిస్టెంట్ లా ఇన్‌స్ట్రక్టర్లు అంటారు వీళ్ళమీద ఒక ఛీఫ్ లా ఇన్‌స్ట్రక్టరు వుంటాడు అతను సర్కిల్ ఇనస్పెక్టరు

ఆ చివరవున్న మర్రిచెట్టు కింద ఏ యల్ ఐ గోపాలరావు కూర్చుని వున్నాడు ఇనుప కుర్చీలో కొత్త బేచ్చివాళ్ళంతా వెళ్ళి ఆయన దగ్గర నిలబడ్డారు కూర్చోమన్నాడు ఆయనకు ఎదురుగా అందరూ కూర్చున్నారు వాళ్ళ కెదురుగా గ్రౌండు కనపడుతోంది నిన్న రాత్రి రోల్‌కాల్‌కు ఆబ్సెంట్ అయినవాళ్ళు ఎగ్స్ట్రా డ్రిల్లు చేస్తున్నారు గ్రౌండులో ఫుల్ యూనిఫారం వేసుకొని, తుపాకీ తీసుకొని, వాళ్ళు డ్రిల్లు చేస్తున్నారు వాళ్ళ వీపుకు సంచి కట్టి, దానిలో బరువు కోసం ఇటుకరాళ్ళు వేశారు అప్పటికే ఎండ తీవ్రత పెరుగుతోంది వాళ్ళు వేసుకున్న యూనిఫారం చెమటతో తడిచిపోయింది మోచేతులమీద దోకుతూ వెళ్ళటం వలన మోచేతులు కొట్టుకుపోయి నెత్తురు వస్తోంది ఎగ్స్ట్రా డ్రిల్లు మొదలుపెట్టిన అరగంటకే వాళ్ళ శరీరాల్లోని సత్తువ

హరించుకుపోయింది వాళ్ళల్లో కొందరి పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుంది సన్నగా పీలగా వున్న వాళ్ళ శరీరాలు, తుపాకీ బరువుకీ, ఇటుకరాళ్ళ బరువుకీ తూలిపడబోతున్నాయి వాళ్ళతో అలా డ్రిల్లు చేయిస్తున్న ఏ డీ ఐ వాళ్ళని క్షణకాలంపాటు కూడా నిలబడనివ్వటం లేదు వీలయినంత తీవ్రంగా ఆ శరీరాల్ని హింస పెడుతున్నాడు తుపాకుల్ని చేతుల్తో పైకెత్తించి, వాటిని అడ్డంగా పట్టుకోమని చెప్పి పరిగెత్తిస్తున్నాడు గ్రౌండుకి ఆ చివరనుండి ఈ చివర వరకూ పరిగెత్తించిన తరువాత, తిరిగి మళ్ళీ మోచేతులమీద ఒంగోబెట్టి దోకిస్తున్నాడు అలా దోకుతూ దోకుతూ ఒక కుర్రవాడు పైకి లేగవలేకపోయాడు మిగతావాళ్ళు అతి కష్టం మీద లేచారు వాళ్ళ కళ్ళ వెంట కారే నీరు ముఖం మీది చెమటతో కలిసి చొక్కాలో ఇంకిపోతోంది ముఖంమీది చెమటను తుడుచుకునేందుకు కూడా వీలులేదు సూర్యకాంతికి మెరుస్తున్న గ్రౌండులోని ఇసుక వెలుగు కళ్ళల్లో పడి, కళ్ళు బైర్లు కమ్ముతున్నట్లు వెలుగుని చూడలేకపోతున్నారు

చెపుతున్న డ్రిల్లు ఆపి పడిపోయిన కుర్రవాడి దగ్గరకు వెళ్ళాడు ఏ డీ ఐ ఆ కుర్రవాడి కాళ్ళూ చేతులూ వణుకుతున్నయ్ చేతి వేళ్ళు తుపాకీని పట్టుకోలేక పోతున్నయ్ ఎండకు గ్రౌండులోని ఇసుక కాలిపోతోంది ఆ ఇసుక వేడికి బూట్లలోని పాదాలు ఉడికిపోతున్నాయి

''ఇంకా పది నిముషాల టైవుంది లెగవకపోతే ఇవ్వాల్టి ఈ గంట ఎగ్స్ట్రాడ్రిల్లు మురిగిపోయిద్ది మళ్ళీ మామూలుగానే అయిదు గంటలు ఎగ్స్ట్రాడ్రిల్లు చెయ్యాలి నాటకాలు వెయ్యమాకనా దగ్గర నా సర్వీసులో నీ బోటి వాళ్ళను చాలామందిని చూశా నీ తల్లోని జేజేమ్మ చేత డ్రిల్లు చేయిస్తా, వూఁ లెగు'' అంటున్నాడు ఏ డీ ఐ

పడిపోయిన ఆ కుర్రవానితో ఏ డీ ఐ మాట్లాడిన ఆ ఒక్క నిముషం, మిగిలిన వాళ్ళకు రెస్ట్

''ఊఁ లెగవాలి ఇంకెక్కువ టైమివ్వను ఇప్పటికే నీ మూలంగా వీళ్ళకు రెండు నిముషాలు రెస్ట్ దొరికింది'' అన్నాడు ఏ డీ ఐ కోపంగా

పడిపోయినతను తన శరీరంలోని శక్తినంతా కూడగట్టుకొని లేచి నిలబడ్డాడు నీళ్ళు నిండిన అతని కళ్ళకు అంతా మసక మసకగా కనపడుతోంది అతను తూలుతూ తుపాకీ ఆసరాతో నిలబడ్డాడు

''వూఁ పోయి వాళ్ళల్లో జాయినవ్వు'' దబాయించాడు ఏ డీ ఐ

తూలుతూ వెళ్ళి మిగిలినవాళ్ళ ప్రక్కన నిలబడ్డాడు అతను అవమానంతో వాళ్ళు కుంగిపోతున్నారు మళ్ళీ డ్రిల్లు మొదలుపెట్టాడు ఏ డీ ఐ

''చూస్తున్నారా? మీ గతి కూడా అంతే వళ్ళు దగ్గర పెట్టుకొని వుండండి ఇక్కడ వున్నంతకాలం'' అన్నాడు ఏ ఎల్ ఐ

అప్పటివరకూ గ్రౌండువైపు చూస్తున్నవాళ్ళు, ఏ యల్ ఐ మాటలతో ఇటు తిరిగారు ఉలిక్కిపడి

''అసలదేం పనిష్మెంటు? మేము ట్రైనింగులో వున్నప్పుడయితే ఎగ్స్ట్రాడ్రిల్లు చేసినవాడు, డ్రిల్లు పూర్తిచేసి రావడమంటే ఇంకో జన్మ ఎత్తినట్లే లెఖ్ఖ ఎగ్స్ట్రాడ్రిల్లు అంటే పనిష్మెంటు డ్రిల్లన్న మాట ఎగ్స్ట్రాడ్రిల్లంటే అట్లా వుండాలిగానీ, ఇట్టాంటివాటికి మీరు మాటింటారా అసలు'' అన్నాడు ఏ ఎల్ ఐ

అతని మాటల్ని భయంగా వింటూ కూర్చున్నారు ''రేపటినుండి ...రా' చెపుతాను అందరూ నోట్సులు తెచ్చుకోండి మీలో ఎంతమందికి చదువొచ్చు ? ... టే చదవటం

రాయటం చేతులెత్తండి'' అన్నాడు

అంతమందిలో ముగ్గురు చేతులెత్తారు ఆ ముగ్గురిలో స్కూలు ఫైనల్ వరకు చదువుకున్నది గురవయ్య ఒక్కడే ''మీ లీడర్ ఎవరు?'' అన్నాడు ఏ యల్ ఐ

వెంకన్న చేయి ఎత్తాడు

''చదువుకున్నవాళ్ళని వదిలిపెట్టి చదువురాని వాడిని లీడర్‌గా పెట్టిందెవరు?'' అడిగాడు ఏ ఎల్ ఐ

''ఏ డీ ఐ గారు చార్'' అన్నారు అంతా

''ఎవడా ఏ డీ ఐ ?''

''అప్పలచామి ఏ డీ ఐ గారు చార్''

''వాడి బొంద ఆ అప్పలస్వామి గాడికి చదువు రాదు చదువొచ్చిన వాళ్ళని చూస్తే వాడికి భయం ఇప్పటినుండీ నువ్వు లీడర్‌గా వుండు'' అన్నాడు గురవయ్య వైపు వేలు చూపిస్తూ

''అట్లాగే సార్'' అన్నాడు గురవయ్య ఆ రోజు లా క్లాసు అంతా పిచ్చాపాటి కబుర్లతోనే గడిచిపోయింది డ్రిల్లు కన్నా అదే బావున్నట్లు అనిపించింది మధ్యాహ్నం పన్నెండు గంటలకు ఆఫీసులో బెల్లు కొట్టారు అంతా లేచి ఏ యల్ ఐ కి సెల్యూట్ చేసి బేరక్‌కు వచ్చారు పళ్ళేలు వున్నవాళ్ళు గబగబా మెస్ దగ్గరకు వెళ్ళారు లేనివాళ్ళు పళ్ళేల కోసం నిలబడ్డారు

''అంతా బాగానేవుంది గానీ బువ్వకాడి కొచ్చేసరికి ప్రేనం పోతాంది'' అన్నాడు వెంకటేశం

''నిన్నటికన్నా యియ్యాల పురుగు లెక్కువగా వున్నట్టున్నయ్'' అన్నాడు ప్రకాశం

''తప్పేదేముంది అట్టాగే కళ్ళు మూసుకొని చూత్తే తినలేం '' అన్నాడు జాన్

వాళ్ళకి కొంచెం దూరంగా కూర్చుని అన్నం తింటున్న గురవయ్య వాళ్ళ మాటలు విని ఇటు తిరిగాడు ''ఇంటికాడ కన్నా యీడ ఏం బాగుంది? అడ పడే కట్టం కన్నా యిక్కడ ఎక్కువ కట్ట పడుతున్నాం నెత్తి మీత తట్ట పెట్టుకొని మోయకపోయినా ముందు ముందు గవర్నమెంటు వారికి ఉపయోగపడటం కోసం కసరత్తులూ, కవాతులు చేసి కండలు గట్టిపరుచు కుంటున్నాము ఈ కండలు మనియ్యికాదు ఇక గవర్నమెంటు ఉప్పు, పులుసు తిన్నాక వాళ్ళకి శాకిరీ సెయ్యటానికే ఈ శరీరాలు ఇంటికాడ కడుపు నిండా తినకపోయినా పెళ్లాం పిల్లలతో సంతోసంగా వుండేవాళ్ళం ఇక్కడ తినటానికి సరిపడా పెట్టరు ఆ పెట్టేది కూడా ఆపీసర్ల బంగలాల్లోని కుక్కలు దీనిలోమూతిపెట్టటం కాదు గదా కనీసం వాసనగూడా సూడవ్'' అన్నాడు అసహనంగా.

''మరి అట్టాంటప్పుడు ఈల్లంతా, ఈడ, ఇన్ని కట్టాలు పడుతూ ఎందుకుంటున్నట్టు? నాకు తెలవకడుగుతున్నా కూసింత సెప్పు, సూద్దాం'' అన్నాడు వెంకటేశం

ఆ ప్రశ్నకి గురవయ్య ఏం జవాబు చెపుతాడోనని చెవులు రిక్కించారు మిగిలిన వాళ్ళంతా

గురవయ్య వెంకటేశం వైపు చూశాడు చెంబులోని మంచినీళ్ళు రెండు గుక్కలు తాగి చెంబు కిందపెట్టి, ''దానికి సమాధానం నేను తరవాత చెపుతా గానీ, ముందు నీ సంగతి చెప్పు నువ్వెందుకు ఈ నౌకరీలోకి వచ్చావు?'' అన్నాడు

ఆ ప్రశ్నకు వెంకటేశం నీళ్ళు నమిలాడు తనిందులోకి ఎందుకొచ్చిందీ తెలుసు కాని ఆ విషయాన్ని చెప్పటం అతనికి చేతకాలేదు ''ఆ కూలీ బతుక్కన్నా ఇది కూసంత సుకంగా వుంటదనీ, బత్తీలో పోలీసుల్ని సూత్తన్నాం గదా, అందుకని, కూసింత సుకపడొచ్చునీ'' అన్నాడు

''ఆఁ అదేమరి అందరూ అంతే మనం ఇళ్లకాడ పాగులూ, రేత్తిరీ కష్టపడ్డా కడుపు నిండటం అంతంత మాత్తరమే గదా దాని కన్నా ఇది కాస్త మెరుగు అక్కడ ఆసామికాడ తప్పు చేస్తే వాడూరుకోడు ఈళ్ళు కూడా అంతే పొద్దున్న సూళ్ళా ఎగస్ట్రా డ్రిల్లూ''

''ఏమైనాగానీ, దానికన్నా ఇది నయమేగదా?!'' అన్నాడు వెంకటేశం

''ఆఁ అదేగా మరి'' అన్నాడు గురవయ్య లేచి చిన్నగా బేరక్‌లకు నడిచారు

పెట్టెలముందు వరుసగా కంబళ్ళు పరచుకొని నడుములు వాల్చారు సాయంత్రం నాలుగున్నరకు గ్రౌండుకు బయలుదేరారు

అలా ఓ వారం రోజులు గడిచిపోయాయి అప్పటికి ట్రైనింగు స్కూల్లోని విషయాలన్నీ అర్థమయిపోయాయి యించుమించు అందరికీ బేరక్, గ్రౌండ్, లా క్లాసు, మెస్ ఇంతకు మించి ట్రైనింగు స్కూలు సరిహద్దులు దాటి బయటకు వెళ్ళటానికి వీలులేదు ఆ రోజు జిల్లా ఆఫీసు నుండి వచ్చేటప్పుడు, ట్రైను దిగి స్కూలుదాకా నడుస్తూ వస్తూ వీధులు చూస్తూ రావటమే తప్ప అంతకుమించి వూరు తెలియదు స్కూలు సరిహద్దులు దాటి ఎవరన్నా బయటకు వెళ్ళి, ఏ ఆఫీసరు కళ్ళల్లో పడ్డా ఆ రిక్రూట్ కానిస్టేబులికి పనిష్మెంటు ఇస్తారు ఏ డీ ఐ లు చూచినా ఆరెస్సైకి చెపుతారు ఒదివ ఎంనాదు డ్రిల్లూ, లా క్లసూ వుండవు కానీ మూడుసార్లు రోల్ కాల్‌కు హాజరు కావాలి గ్రౌండులో పెరిగే పిచ్చి మొక్కల్ని పీకివేస్తూ గ్రౌండు బాగుచేయటం, బేరక్‌ల చుట్టూ శుభ్రం చేయటం, ఆఫీసర్లందరి ఇళ్ళల్లో చెట్లకు నీళ్ళు పోయటం, వాళ్ళుండే క్వార్టర్లు బాగుచేయటం, ఇలాటి పనుల్తో ఆదివారం గడిచిపోయిద్ది

వర్షం కురిస్తే ఏ బేరక్‌లో కూడా అంగుళం మేర పొడి కనపడదు రెండు రోజుల కొకసారన్నా ఏదో ఒక బేరక్‌లో ఎవరికో ఒకరికి తేలు కుట్టిందనో, లేకపోతే కాళ్ళజెర్రి కుట్టిందనో, పామునో, మండ్రగబ్బనో చంపారనో వార్తలు వినవస్తాయి ప్రతిరోజూ రాత్రుళ్ళు పడుకోబోయే ముందు, ఆ రాత్రికి ఏ తేలూ కుట్టకుండా ఏ పామూ కరవకుండా కాపాడమని దేవుడికి దండం పెట్టుకుంటారు అంతా అయినా ఎవరికో ఒకళ్ళకి తప్పదు చుట్టూవున్న ప్రదేశమంతా రాళ్ళూ రప్పలతో, పిచ్చి మొక్కలతో, పొదలతో నిండి, పురుగూ పుట్రకు బాగా అనుకూలంగా వుంటుంది చీకటి పడితే అంతా గాఢాంధకారం పున్నమిరోజుల్లో కొంచెం భయం తక్కువ బ్యారక్‌లలో నలుగురయిదుగురి దగ్గరవుండే కోడిగుడ్డు దీపాలు మినహా ఇంకే లైటూ ఎక్కడా వుండదు

శరీరానికి సంబంధించి ఇలాటి బాధలన్నీ ఒక ఎత్తయితే, ఆఫీసర్లు వీళ్ళని అనే మాటలు ఒక ఎత్తు మానవ సహజమైన చిన్న చిన్న పొరపాట్లకు కూడా బండ బూతులు తిడతారు ఆ తిట్లు మనస్సుకు ఎంతో బాధ కలిగిస్తాయి అధికార్లు ఎన్ని మాటలు అన్నా మౌనంగా తలవంచుకొని నిలబడవలసిందే ఎవరన్నా తలెత్తి, బూతులు తిడుతున్న ఆఫీసరువైపు చూశాడంటే అతనికి ఆ రోజు మూడినట్లే ఎగస్ట్రా డ్రిల్లు ఇస్తారు తగినంత కారణం లేకపోయినా తిడతారు చాలామంది అధికార్లు ఏదో ఒక బూతుపదం ఉపయోగించకుండా పలకరించరు రిక్రూట్ కానిస్టేబులి ఉద్యోగానికి ఏ భద్రతా లేదు చీదితే వూడిపోతుంది అందుకే అంత అలుసు అధికార్లకి ఎన్నన్నా బానిసల్లా పడి వుంటారని ధీమా గొడ్లని తిట్టినట్లు వీళ్ళని తిడతారు ఆ మాటలు భరించలేకా, ఆ డ్రిల్లు చేయలేకా పారిపోయేవాళ్ళు కూడా అడపాదడపా ఉంటారు ఈ ఆరు నెలలూ ఎలాగో ముక్కు మూసుకుంటే, వాళ్ళ వాళ్ళ జిల్లాలకు వెళ్ళవచ్చనీ, అక్కడ

స్టేషన్ డ్యూటీల్లో ఇంత కష్టముండదనీ అనుకుంటూ, ఎండమావుల్లాంటి ఆశలతో రోజులు లెఖ్ఖ పెట్టుకుంటూ జీవచ్ఛవాల్లా కాలం దొర్లిస్తుంటారు కాలం అసలు కదలనట్లు అని పిస్తుంటుంది వాళ్ళకు మసిబొగ్గుతో రోజుకొక గీత చొప్పున ఎన్ని రోజులు గడిచాయో గుర్తుగా ఎవరి పెట్టె కెదురుగా వాళ్ళు గోడలమీద గీతలు గీస్తుంటారు

ఆ బేచ్చీవాళ్ళు అక్కడకొచ్చి దగ్గర దగ్గర నెల కావొస్తోంది ఇంకొక రెండు రోజుల్లో జీతాలిస్తారని అందరూ అనుకుంటున్నారు అందరికీ ఆనందంగా వుంది ఒక్కొక్కళ్ళు దోసెడు రూపాయలు తీసుకోబోతున్నారు అంత డబ్బు వాళ్ళెప్పుడూ జీవితంలో చూడలేదు రుపాయికెన్ని కాణీలో, అణాలో, అర్థణాలో తెలియనివాళ్ళు వాళ్ళల్లో చాలామంది వున్నారు ప్రకాశంకు చాలా ఆనందంగా వుంది జీవితం ఒక మలుపు తిరిగిందని అతనను కుంటున్నాడు జీతం తీసుకున్నాక ఏమేం కొనాలో లెఖ్ఖలు వేస్తున్నాడు అప్పుడప్పుడు 'ముక్యతా పలకా, బలపం కొనుక్కోవాలి' అనుకున్నాడు చాలాసార్లు 'ఆ సదువుండబట్టేగా గురవొయ్య గోరు లీడ రయ్యింది' అనుకున్నాడు ఎన్నో సార్లు

గత రెండు రోజుల్నుండీ అధికార్ల ప్రవర్తనలో హఠాత్తుగా మార్పు వచ్చింది కొత్తగా వచ్చిన ఈ బేచ్చీ వాళ్ళకు అదేమిటో అంతుబట్టలేదు ఏ డీ ఐ డ్రిల్లు చాలా తేలికగా చేయిస్తున్నాడు చిన్న చిన్న మాటల్తో నవ్విస్తున్నాడు పది నిమిషాలకు ఒకసారి రెస్ట్ ఇచ్చి నిలబెడు తున్నాడు గ్రౌండులోని అన్ని బేచ్చీల పరిస్థితీ అలాగే వుంది సీ డీ ఐ గ్రౌండులో నిలబడి చూస్తూ వున్నాడేగాని, అలా డ్రిల్లు చేయించకుండా నిలబెట్టి రెస్ట్ ఇస్తున్నందుకు ఏ డీ ఐ ల మీద కోప్పడటంలేదు లా క్లాసులో ఏ యల్ ఐ ఎవ్వరినీ తిట్టటం లేదు ఆరెస్పై దారిలోగానీ, ఆఫీసు ముందుగానీ కనపడితే చిరునవ్వు ఒలక బోస్తున్నాడు ఎప్పుడూ ధుమ ధుమ లాడుతూ వుండే సి యల్ ఐ చిన్న ఎత్తు మాటకూడా అనటం లేదు హఠాత్తుగా వచ్చిన ఈ మార్పుని కొత్త బ్యాచ్చీ వాళ్ళు అర్థం చేసుకోలేకపోయారు అదే విషయం సీనియర్స్‌ని అడిగితే, వాళ్ళు నవ్వుతూ, ''రేపు జీతాలు వస్తాయికదా మనకు'' అన్నారు

''వస్తే?!'' ఆశ్చర్యంగా అడిగారు కొత్త వాళ్ళు

''వస్తే, అంటే, మనకొచ్చిన జీతంలో ఏ డీ ఐ కీ, సీ డీ ఐ కీ, సి యల్ ఐ కీ, ఆరెస్పైకీ లంచాలివ్వాలి వీటిని వీళ్ళు మామూళ్ళంటారు'

''పోయిన పాత ప్రిన్సిపాల్ అయితే ఆయన కూడా లంచం తీసుకొనేవాడు ఆయనిప్పుడు అనంతపురం స్కూలు ప్రిన్సిపాలు అక్కడి రిక్రూట్‌లను చంపేస్తున్నాడని తెలిసింది'' అన్నారు వాళ్ళు

ఆ మాటకు ఆశ్చర్యపోయారు వీళ్ళు ''మనం లంచాలెందుకివ్వాలి?'' అన్నాడు ప్రకాశం కొద్దిగా కోపంగా

''ఏందుకియ్యాలంటే దానికొక కారణం అంటూ ఏమీలేదు ఇవ్వాలి అంతే ఇవ్వకపోతే మన చావు కుక్కచావే ఇవ్వనివాడు స్కూలు వదిలిపెట్టి పోవాల్సిందోనీ ట్రైనింగు పూర్తి చేసుకొని పోలేడు అందుకే ఇవ్వాలి మనకొచ్చే జీతంలో ఇంచుమించు సగం వీళ్ళ లంచాలకే సరిపోయెద్ది ఇంక మిగిలినదాన్లో మెస్ బిల్లూ, నెలంతా తిన్న అట్లా ఖాతా, ఇట్టాంటియన్నీ పోతే తల సవురుకి కూడా డబ్బులు మిగలవు ఇదింతే'' అన్నారు

''ఎంత అన్యాయం'' కసిగా అన్నాడు ప్రకాశం మిగిలినవాళ్ళంతా వింటూ నిలబడ్డారు కానీ

ఎవరూ ఏం మాట్లాడలేదు ప్రకాశం అన్న మాటకు అతనివైపు చూశారు అందరికీ కోపం వచ్చింది విన్న విషయానికి కాని ప్రకాశం ఒక్కడే బైటకు పొంగాడు

''చేసేదేముందీ అందరితోపాటే మనం కూడా'' అన్నాడు పాతతను

అతను చెప్పినట్లే జీతాలు వచ్చిన మరుసటి రోజు గురవయ్య అందరి దగ్గరా మామూళ్ళు వసూలుచేసి అధికార్లందరికీ వాళ్ళ వాటాల చొప్పున పంచి యిచ్చాడు వచ్చిన కొత్తలో గ్రౌండు మామూలు ఇవ్వనివాళ్ళ దగ్గర గ్రౌండు మామూలు కూడా వసూలు చేశాడు ఏ డీ ఐ జీతం ఇచ్చేటప్పుడే మెస్ భోజనానికి డబ్బులు మినహాయించుకున్నారు అన్నీ పోగా చేతికివచ్చింది తొమ్మిది రూపాయలు నెలంతా గురవయ్య డబ్బుల్తో తిన్న అట్లకు డబ్బులు ఇచ్చేశాడు ప్రకాశం నిక్కర్లు సైజుచేసి కుట్టిన టైలరుకు కుట్టుకూలీ ఇచ్చాడు పెట్టెకు తాళం లేనందువలన మిగిలిన డబ్బుల్ని పొట్లంకట్టి భద్రంగా వుంచుకున్నాడు జేబులో

అతను పుట్టి పెరిగిన,తరువాత అన్ని రూపాయల్ని చూడటం అదే ప్రథమం జీతాలు తీసుకున్న రాత్రి ఆ బ్యాచ్చిలోని చాలా మందికి నిద్ర పట్టలేదు 'ఎంత కాలం ఆసామికాడ పాలేరుపని సేత్తే మాత్తరం ఆడిన్ని రూపాయిలిత్తాడు?' అనుకున్నాడు ప్రకాశం

టౌన్‌లోకెళ్ళి కావాల్సిన వస్తువులు కొనుక్కొని తెచ్చుకోవటానికి మరుసటి రోజు పర్మిషన్ ఇచ్చారు అందరూ టౌనులోకి వెళ్ళారు ముఖ్యంగా తినటానికి పళ్ళెం, చెంబు, పెట్టెకు తాళం కొన్నాడు ప్రకాశం ముగ్గురిమీద కలిపి ఒక బక్కెట్టు, చాంతాడు కొనుక్కున్నారు బజార్నుండి తిరిగొచ్చేటప్పుడు ఒక పలకా, బలపాలూ, రెండు పోస్టుకార్డులూ కొన్నాడు ప్రకాశం చాలామందితోపాటు తను కూడా చిన్న కోడిగుడ్డు లైటు కొనుక్కున్నాడు ఒక సవాసేరు మిరాయి కొనుక్కొచ్చుకొని పెట్టెలో పెట్టుకున్నాడు గురవయ్యచేత ఇంటికి ఉత్తరం రాయించాడు అందులో అన్ని విషయాలూ వివరంగా రాయించాడు తనూ, వెంకటేశం పోలీసు నౌకరీలో చేరినట్లూ, మొదటి నెల జీతం తీసుకున్నట్లూ, విజయనగరం ట్రైనింగు స్కూల్లో వున్నట్లూ, ఇంకోనెల పోయిన తరువాత తనుగానీ, వెంకటేశంగానీ నాలుగు రోజులు సెలవుపెట్టి ఇంటికి వస్తామని రాయించాడు దాని మీద జాగ్రత్తగా అడ్రస్ రాసి, తీసుకెళ్ళి ఆఫీసు దగ్గర వున్న పోస్టుడబ్బాలో వేసి వచ్చాడు

ఆ మర్నాడు ఇంకొక బేచ్చివాళ్ళు కొత్తగా ట్రైనింగు స్కూలుకు వచ్చారు వాళ్ళది నెల్లూరు జిల్లా అని చెప్పారు వాళ్ళు కూడా రెండు బ్యాచ్చిలుగా నిలబడి వుంటే, ''ఎందుకలా రెండు జట్లుగా నిలబడ్డారు?'' అని అడిగాడు ప్రకాశం

''అల్లంతా ఆసాముల బిడ్డలు మేమేమో '' అతని మాటల కర్థం తెలిసిపోయింది

'ఈ కుల పిశాచం పెరపంచకమంతా వుంది' అనుకున్నాడు

రెండో నెల మొదలయ్యింది మామూళ్ళు తీసుకొన్న మరుసటి రోజునుండీ మళ్ళీ మామూలుగానే వండించసాగారు అధికారులు రెండో నెల నుండి ఆర్డర్లీ పని మొదలు అయ్యిద్దంట డ్రిల్లు కష్టంగా వుంది బూతులు మామూలు అయిపోయాయి

ఆర్డర్లీ ఉద్యోగమంటే ఏమిటో మొదట అర్థం కాలేదు ప్రకాశానికి తరువాత్తరువాత తెలిసింది ఆర్డర్లీ అంటే 'కట్టుబానిస' అని అర్థమైపోయింది అధికార్ల యిళ్ళల్లో అడ్డమైన చాకిరీ చేయాలి ఉదయం ఇళ్ళు వూడ్చి కళ్ళాపీ చల్లటం దగ్గరనుంచీ, పిల్లలకు దొడ్డికి కడగటం, గేదెల్ని కడిగి కుడితి పెట్టటం, పేళ్ళు పగలగొట్టి, బట్టలుతికి, బజారు పని చేసుకురావటం కొందరి ఇళ్ళల్లో

అయితే వంట కూడా చేయటం, పిల్లల్ని బడికి తీసుకుపోయి తీసుకు రావటం, వాళ్ళకు తిండి పెట్టి వాళ్ళంతా తిన్నాక కంచాలు తీయటం, పక్కలు వేయటం, కొంతమంది దుర్మార్గపు అధికార్లకూ వాళ్ళ పెళ్ళాలకూ కాళ్ళు పట్టటం, ఇలా ఇంకా ఎన్నో చెప్పుకోలేనివీ, చెయ్యలేనివీ

మెస్‌లో తిండి తిని, అధికార్ల యిళ్ళల్లో పని చేయాలి ఆఫీసర్ల పెంపుడు కుక్కలు ఇంట్లో వెచ్చగా పడుకుంటాయి అర్డర్లీ పంచలో చలిలో, గచ్చుమీద చాప వేసుకొని పడుకోవాలి పిలిస్తే పలకాలి ఏవేళప్పుడయినా ఎక్కడకు వెళ్ళమంటే అక్కడకు వెళ్ళిరావాలి

ఈ విషయాలన్నీ అనుభవ పూర్వకంగా చెయ్యకుండానే, సీనియర్లు చెప్పుకొనేవి విని ఒక నిర్ణయాని కొచ్చాడు ప్రకాశం అయినా ఇంకా ఎవరేం చెపుతారోనని ఒక సీనియర్‌ని అడిగాడు అతను, ''ఆర్డర్లీ అంటే ఏమిటీ?'' అని

ఇతను సమాధానం చెప్పటానికి ముందు రెండు నిముషాలు ఆలోచించాడు ''ఇప్పుడు మనూళ్ళల్లో ఒక్కో కులపోడు ఒక్కోరకమైన పని చేస్తాడు కదా అంటే చాకల్లోల్లు గుడ్డలుతకటం, పాకీవోల్లు పెంటెత్తెయ్యటం ఇట్టా వుంటయ్ కదా! ఆర్డర్లీ అంటే ఆ పనులన్నీ ఒకడే సెయ్యటం అన్నమాట ఆపీచరు గారి బూట్లు పాలీసు చెయ్యటం కాడనుండీ ఆల్ల పిల్లలికి ముడ్లు కడిగి, ఆల్ల పెల్లాల ముట్టుగుడ్డలుతికే కాడినుండి, అవసరమయితే ఆల్ల పెల్లాలకి ఆ సేవగూడా సెయ్యాలి అయ్యగారు లేనప్పుడు'' అని నవ్వాడు అతను అదోరకంగా

ఆ మాటకు ప్రకాశం ఆశ్చర్యంగా చూశాడు

''అందరూ కాదనుకో ఒకళ్ళిద్దరుంటారు అట్టాంటి మహా పెతివతలు నూటికి''

ఆ మాటల్ని గురించి చాలాసేపు ఆలోచించాడు ప్రకాశం 'తాను ఆసామి దగ్గరున్నప్పుడు ఈ పనులన్నీ చేసినవాడే అయితే అప్పుడు గతిలేక చేశాడు ఇప్పుడు ఈ నౌకరీలో ఆ పనులు చేయాల్సిన అవసరం లేదు భేషుగ్గా కాకీ యూనిఫారం వేసుకొని ప్రభుత్వం వారి నౌకరీ సెయ్యటమే అంతేగానీ యియ్యేం పనులు నీచంగా' అనుకున్నాడు ఆ మాటే అతనితో అన్నాడు

''ఏం వీల్లేదు ప్రతివాళ్ళూ టరన్ ప్రకారం ఆపీచర్ల కొంపలకి పోవాల్సిందే అట్టా ఎల్లనివాడ్ని ఉద్యోగంలోంచి ఊడబీకుతారు అది రూలు నువ్వట్టా అంటున్నావుగానీ, కొంతమందైతే అచ్చంగా చరివీసంతా ఆర్డ ర్లీ గానే వుంటామంటారంట తెల్సా కారణం, ఈ డ్రిల్లు చెయ్యలేకా, ఈ దూటీలు సెయ్యలేకా, ఇట్టా ఎన్నెన్నో కాత్తో కూత్తో కండగలిగిన మనకే ఈ డ్రిల్లు అదిరిపోతావుంటే, మరి బక్కసిక్కిన వాల్ల సంగతేంటి? దానికితోడు ఎండుగడ్డి కన్నా హీనంగా వున్న, సారంలేని ఈ సప్పిడి తిండికి సత్తువ యాడనుండొచ్చిద్ది? నెలాకరుకు మెస్ బిల్లు మాత్తరం రోజూ పలావు పెట్టినంత వసూలు సేత్తారు మన సేతుల్లో ఏమీ లేదు'' అన్నాడు అతను బాధగా

అతను చెప్పిన మాటల్ని ఆశ్చర్యంగా విన్నాడు ప్రకాశం ''ట్రైనింగులోనే కాక టేసన్లలో కూడా ఈ డ్రిల్లు వుంటదా?'' అన్నాడు

''ఆఁ చచ్చిందాకా తప్పదు''

''ఎవురెవురింటికి ఎల్లాలి మనం?''

''బేచ్చీలోని వాళ్ళంతా వరుసగా రోజుకొక ఆపీచరింటికెల్లాలి.మొదట ప్రిన్సిపాల్ దొరగారి ఇంటికి, తరువాత స్కూల్ డాక్టరుగారింటికి, ఒకరోజు సీయల్లై గారింటికి, ఒకరోజు ఏయల్లై గారింటికి, ఒకరోజు సీ డీ ఐ, ఒకరోజు ఆరెస్సై ఇట్టా ఏ డీ ఐ లంతా హెడ్ కానిస్టేబుళ్ళు కాబట్టి వాళ్ళకి ఆర్డర్లీలని ఇయ్యాలని రూలు లేదు కాని వాళ్ళు కూడా వాళ్ళ వాళ్ళ బేచ్చీల

కు(ర్రోళ్ని బెదిరించో, జడిపించో పనులు చేయించుకుంటారు''

ప్రకాశం ఆ మాటలు విని మౌనంగా వూరుకున్నాడు దీర్ఘంగా నిట్టూర్చాడు 'రామేశరం పోయినా శనేశరం తప్పలేదని ఏదో సామెత సెప్పినట్టుంది' అనుకున్నాడు ఆ సంభాషణ అయిపోయిన తరువాత ఎవరి బేరక్‌లకు వాళ్ళు వెళ్ళిపోయారు

బేరక్‌కు వెళుతూ చిన్నగా గొణుక్కున్నట్లు అనుకున్నాడు, 'ఏదెట్టా జరగాలని రాసుంటే అట్టా జరిగిద్ది ఏదేమైనా ఈ నౌకరీ పోకుండా జాగత్తగా చూసుకోవాలి'

రోజులు భారంగా గడుస్తున్నట్లు అనిపిస్తుంది ట్రైనింగులో వున్న వాళ్ళకు ప్రకాశం గురవయ్య దగ్గరకెళ్ళి అక్షరాలు రాయించుకొని దిద్దటం చూచి కొంతమంది ఎగతాళి చేశారు వాళ్ళు ఎగతాళి చేసినప్పుడల్లా నిరుత్సాహం కలిగేది పైగా రెండు రోజుల పాటు వీలుకాక అక్షరాలు దిద్దటానికి పడక పోతే నేర్చుకున్న అక్షరాలు గుర్తు రావటం లేదు అలాటప్పుడు బాగా విసుగు పుట్టేది 'ఎందుకిప్పుడిది, ఏం వుద్ధరించటానికి' అనుకునేవాడు కానీ గురవయ్య చెప్పే విషయాలు వింటూ తిరిగి ఉత్తేజం పొందేవాడు

'పట్టుదల వున్న మనిషి సాధించలేనిది ఏమీ లేదు' అనేవాడు పదే పదే గురవయ్య అప్పుడప్పుడు 'విద్య లేనివాడు వింత పశువు' అనేవాడు అతని మాటలు జారిపోతున్న ఉత్సాహాన్ని ప్రకాశంలో తిరిగి నిలబెట్టేవి రోజులు గడిచేకొందీ అక్షరాలన్నీ బాగా గుర్తుంటున్నాయి అతనిలోని ఆ అభివృద్ధిని అతని కళ్ళకే చూపెట్టేవాడు గురవయ్య ఎగతాళి చేసినవాళ్ళు ఇప్పుడేమీ మాట్లాడటం లేదు ఇవన్నీ ప్రకాశంలో పట్టుదలని పెంచాయి

'కనీసం చదవటం, రాయటం కూడా చాతకాకపోతే ఎందుకు మడిసై పుట్టాక' అనుకునేవాడు ఎన్నోసార్లు రాత్రుళ్ళు అంతా నిద్రపోయాక కిరసనాయులు బుడ్డి వెలుగులో అక్షరాలు దిద్దేవాడు వచ్చినా ఇంకా బాగా రావాలని రాసిన వాటినే మళ్ళీ మళ్ళీ రాయించేవాడు గురవయ్య, 'పునాది ముఖ్యం' అనేవాడు

అక్షరాలన్నీ రాయటం, చదవటం రావటానికి దాదాపు నెల రోజులు పట్టింది

''నెల రోజుల్లో అసలెవరూ నేర్చుకోలేరు తెలుసా నీలో నీకు తెలియని పట్టుదల వుంది'' అన్నాడు గురవయ్య

ఆ మాటలు ప్రకాశానికెంతో ఆనందం కలిగించాయి ఈ ఉద్యోగం రావటం కన్నా, గురవయ్యతో పరిచయం కావటం, ఈ చదువు రావటం తన అదృష్టంగా భావించాడు ప్రకాశం తనకు తెలియకుండానే గురవయ్య మీద అభిమానం మనస్సులో గూడు కట్టుకుంది ప్రకాశంలోని ముక్కుసూటితనం, నిర్మలత్వం గురవయ్యని ఆకర్షించాయి వాళ్ళిద్దరి పరిచయం చిన్నగా స్నేహంగా మారటం ఆ బేచ్చిలోని చాలా మందికి కంటకింపుగా వుంది

ఒకరోజు గురవయ్య టౌనులోకి వెళ్ళి వస్తూ 'పెద్ద బాలశిక్ష' కొనుక్కొచ్చి ప్రకాశంకు ఇచ్చాడు

ఆ పుస్తకం చూచి ప్రకాశం చాలా సంబర పడ్డాడు కళ్ళు చెమర్చాయి రెండు మూడుసార్లు పేజీల్ని సర్రున తిప్పాడు అతని ముఖంలోని ఆనందం చూచి గురవయ్య హృదయం పులకించింది

''నేను ఈ పుత్తకం అంతా సదుంతానా?'' అన్నాడు ఆశ్చర్యంగా ప్రకాశం

''అక్షరాలన్నీ చదవగలగలా? ఆ అక్షరాలేగా ఇందులో వుండేది నువ్వు చదవకపోతే మన బేచ్చిలో ఇంకెవరున్నారు?''

ప్రకాశం మాట్లాడలేకపోయాడు అతని జీవితంలో అటువంటి ఆనందకరమైన క్షణాలు ఎ-్నతకువుయుండెప్పుడూ దొర్లివుండవు రెండు చేతులెత్తి గురువుకు నమస్కరించాడు ప్రణమిల్లుతున్నట్లు రెండు అరచేతుల మధ్యలోని ఆ పుస్తకం అతని శరీరంలోకి విద్యుత్కిరణాలను ప్రసరింపజేస్తున్నట్లు అనుభూతి పొందాడు కన్నీటి చుక్కలు బుగ్గలమీదకు జారాయి

గురవయ్య ఆప్యాయంగా భుజం తట్టాడు

కొద్దిసేపు ఎవరూ ఏం మాట్లాడలేదు ప్రకాశం చూపిన ఆ కృతజ్ఞతకు గురవయ్య హృదయం వుప్పొంగింది

ఆ ఉద్వేగం నుండి స్థిమిత పడటానికి ప్రకాశానికి కొద్ది సమయం పట్టింది

హఠాత్తుగా గుర్తొచ్చినట్లు, తనంతవరకూ ఆ విషయం గూర్చి మాట్లాడనందుకు సిగ్గు పడుతున్నట్లూ, ''పుత్తకం ఎంత?'' అన్నాడు పేజీలు తిప్పుతూ, గురవయ్య వైపు చూస్తూ

ఆ పుస్తకం వెల పుస్తకం మీద ఎక్కడ వుంటుందో కూడా ప్రకాశానికి తెలియదు

''ఏం అక్కర్లా నేను నీకా బుక్ ప్రెజంట్ చేస్తున్నా అంటే బహుమతిగా ఇస్తున్నా'' అన్నాడు గురవయ్య

''అహో అట్టా ఒద్దు మీరు కూడా మనకి డబ్బులికి ఇబ్బందిగా వున్నప్పుడు అది బాగాదు ఎంతో సెప్పండి '' అన్నాడు నట్లు కొడుతూ కానీ గురవయ్య ఒకమాటంటే దానికి తిరుగుండదని ప్రకాశానికి తెలుసు కానీ ఇది ఇలా ఉచితంగా తీసుకోవటం అతనికి ఇష్టం లేదు అయినా చిన్నగా అన్నాడు మళ్ళీ ''నేను ఇప్పటికే మీకు శానా రునపడ్డా ''

''ఏం లేదు నువ్వేం దీన్ని గురించి మాట్టాడొద్దు నువ్వు కూడా లేకపోతే ఈ అడవి మనుషుల మధ్య నేను ఒంటరిగా గడపాల్సొచ్చేది'' అన్నాడు గురవయ్య ప్రకాశం ఇంకేమీ మాట్లాడలేదు చాలాసేపు అయినా డబ్బుల కిబ్బంది పడుతున్న రోజుల్లో అలా గురవయ్య పుస్తకానికి డబ్బులు ఖర్చుపెట్టటం ప్రకాశంకు ఇష్టంలేదు అందుకే చివరి ప్రయత్నంగా చిన్నగా నసిగాడు

''అది సరే అసలు ఎంత ఇది?''

''ఎంతాలేదు గింతాలేదు నువ్వికదాన్ని గురించి మాట్లాడమాక పద ,మెస్ టైం అయ్యింది'' అన్నాడు

ప్రకాశం చిరునవ్వుతో గురవయ్యను అనుసరించాడు

ఆ పెద్ద బాలశిక్షని పూర్తిగా చదివేశాడు ప్రకాశం సంఖ్యలూ, కూడికలూ, తీసివేతలూ, ఇలా అన్నీ నేర్పాడు గురవయ్య

ప్రతి రోజూ సాయంత్రం పూట వాళ్ళిద్దరే కలిసి తిరిగేవాళ్ళు చెట్లకిందో, గ్రౌండులోనో కూర్చుని అనేక విషయాలు మాట్లాడుకునేవాళ్ళు గురవయ్య వలన ప్రకాశం ఎన్నో విషయాలు తెలుసుకోగలుగుతున్నాడు గురవయ్య బజారుకు వెళ్ళేవాడు తరచూ అతను బేచ్చికి లీడరు కావడం వలన అతనిమీద అంతగా నిషేధాలు వుండేవి కావు వెళ్ళినప్పుడల్లా దినపత్రిక తెచ్చేవాడు అందులోని విషయాలు చదివి చెప్పేవాడు ప్రకాశం చదివితే తను వివరించేవాడు 'మనుషులుగా పుట్టాంగాబట్టి వీలయినంత ఎక్కువ ప్రపంచాన్ని తెలుసుకోవాలి అందుకు విద్యే మార్గం' అనేవాడు వాళ్ళ స్నేహం చూచి చాలామంది ఈర్ష్య పడేవాళ్ళు కానీ ఎవరూ బయటపడేవాళ్ళు కాదు గురవయ్య మనస్తత్వం అందరికీ అర్థమయ్యింది పైగా అతను ఆ బేచ్చికి లీడరు ఏ డీ ఐ దగ్గరా ఏ యల్ ఐ దగ్గర అతని మాటకు విలువుంది దాన్ని అలుసుగా తీసుకొని అతని

కులస్థులంతా చిన్నగా ఒకసారి, ''మాల మాదిగోల్లూ మనం కలిసి ఒకరి పక్క వొకరు నిలబడి డ్రిల్లు సెయ్యటం చానా ఇబ్బందిగా వుంది ఎట్టాగయినా మనలో వాల్లు కలవకుండా సూడాలి నువ్వు లీడర్‌వి ఏ డీ ఐ కి సెప్పి ఎట్టాగయినా ఈ ఏర్పాటు చేయించు'' అన్నారు దాని గురించి శీతారామయ్య చాలా పట్టుదల గా వున్నాడు

ఆ మాటకు వాళ్ళవైపు అసహ్యంగా చూశాడు గురవయ్య కొద్దిసేపు మౌనంగా వున్న తర్వాత ''ఉద్యోగాల మీద ఆశలేకపోతే ఆ పని చెయ్యాలి సగం ట్రైనింగు అయిపోయినా మీలో మార్పురాలేదు'' అన్నాడు ఆ మాటకు వాళ్ళు ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు ఆ సంఘటన గురించి ఒకసారి ప్రకాశంకు చెప్పాడు గురవయ్య ప్రకాశం నవ్వి వూరుకున్నాడు

ప్రకాశానికి చదవటం, రాయటం బాగా వచ్చేసింది ఈ చదువువల్ల మాట్లాడే భాషలో కూడా కొద్దిపాటి మార్పు చోటుచేసుకుంది

ట్రైనింగు స్కూలుకు వచ్చాక ప్రతి పనికీ ఒక నిర్ణీత సమయం ఉండటం వలన, అన్ని పనులూ ఒక టైం ప్రకారం జరిగిపోతుండేవి కొద్దిపాటి క్రమశిక్షణ కూడా అలవాటయింది వ్యక్తిగత పనుల్లో ఏ మాత్రం టైం దొరికినా పుస్తకం పట్టుకోవాలనిపిస్తోంది ప్రాణం

ట్రైనింగు స్కూల్లోని అతి బాధాకరమైన అంశాల్లో ఒకటి, అధికార్ల ఇళ్ళకు ఆర్డర్లీగా వెళ్ళటం మొదటిసారి ప్రకాశాన్ని స్కూలు డాక్టరు ఇంటికి పంపించారు

అంతకుముందు అక్కడకు వెళ్ళివచ్చిన వాళ్ళు, వాళ్ళ వాళ్ళ అనుభవాల్ని చెపుతుంటే వినేవాడు ఆ మాటలు వింటుంటేనే భయమేసేది టరన్ ప్రకారం ఆ రోజు ప్రకాశం డాక్టరు ఇంటికివెళ్ళాలి ఉసూరుమంటూ వెళ్ళాడు చిన్నగా అడుగులువేసుకుంటూ

గడపదగ్గర నిలబడి, ''అమ్మగారూ'' అని పిలిచాడు చిన్నగా డాక్టరు భార్య చాలా లావుగా వుంటుందని విన్నాడు ఇప్పుడు కళ్ళారా చూశాడు ఇద్దరు మనుష్యులు ఈజీగా కూర్చోవటానికి ప్రత్యేకంగా చేయించినట్లున్న కుర్చీలో కూర్చొని పేపరు చూస్తోంది ఆమె ప్రకాశం పిలుపు వినపడలేదనుకుంటా తలతిప్పలేదు అంతలావు మనిషిని అంతకు ముందెప్పుడూ చూచిన జ్ఞాపకం లేదు ప్రకాశానికి ఇటు ప్రక్క మంచాల మీద పిల్లలు ఇంకా నిద్రపోతూనే వున్నారు

ఈసారి ఇంకాస్త పెద్దగా పిలిచాడు ఆ పిలుపుకు తలతిప్పి చూచింది ''ఇంకాస్త ముందుగా రాకూడేదూ?'' దీర్ఘం తీస్తూ ప్రకాశాన్ని ఎగాదిగా చూచింది

''ఇప్పుడేనమ్మ రోల్‌కాల్ అయిపోయింది'' అన్నాడు ప్రకాశం

''ఆఁ ఏం రోల్‌కాలో నా బొంద మీ రొచ్చిందాకా ఆ అంట్లు అట్లా ఎండిపోవాల్సిందే. మీ అయ్యగారికి ఏడయ్యేసరికి కాఫీ కావాలి మరి తొందరగా వాటి పనిచూడు నా కసలే నీరసంగా వుంది, హమ్మయ్యా '' అంటూ దీర్ఘం తీసింది మూలుగుతున్నట్లు తల వెనక్కువాల్చి పేపరు చూడటంలో మునిగిపోయింది

ప్రకాశం వంటగది వైపు వెళ్ళాడు వంటగది నానుకొనే భోజనాలు చేసే గదివుంది భోజనాల గదిలో రాత్తిరి తిన్న ఎంగిలి ప్లేట్లన్నీ అలాగే వున్నయ్ బల్లమీద కూరలూ, అన్నం బల్లమీద చిందర వందరగా పడి బల్లంతా అసహ్యంగా వుంది అక్కడక్కడ బొద్దింకలు తిరుగుతున్నయ్ అలా చూసేసరికి చీదరేసింది ప్రకాశానికి 'ఆ ఎంగిలి కంచాలన్నీ తను తోమాలన్నమాట' అనుకున్నాడు మనసొప్పలేదు కానీ చెయ్యగలిగింది ఏమీలేదు తటపటాయిస్తూ నిలబడ్డాడు ఒక క్షణం ఇంతలో అమ్మగారి కేక ఖంగుమని వినిపించింది

''తొందరగా కానీవోయ్ ఏం చేస్తున్నావ్ అసలు అలికిడే లేదు ఆ దొడ్లో వున్న తొట్లో నీళ్ళున్నయ్ చూడు వాటితో అంట్లు తోమేసెయ్ తరువాత తొట్టికి నీళ్ళు తెద్దువుగాని''

'మనిషికి తగ్గ గొంతే' అనుకున్నాడు తనలో తను ''అట్టాగేనమ్మా'' అన్నాడు పైకి

గచ్చుమీద పడివున్న అరటి తొక్కలూ, అన్నపు మెతుకులూ తీసి ఎంగిలి పళ్ళేల్లో వేశాడు పళ్ళాలన్నీ దొడ్లోకి తీసుకు వెళ్ళాడు అక్కడ ఒక మట్టి చిప్పలో వున్న బూడిదతో అంట్లన్నీ సుబ్బరంగా తోమాడు. పాలేరు పనే దీనికన్నా సుఖమనిపించింది ఆ క్షణంలో

'ఛీ దీనమ్మ బతుకుని ' తిట్టుకున్నాడు మనసులో పాలేరుగా వున్నప్పుడు అతనలాంటి పనులు చేశాడు అప్పుడు బాధనిపించలేదు కానీ ఇప్పుడు చాలా అవమానంగా భావిస్తున్నాడు ఈ నౌకరీలో చేరిన తరువాత తనూ ఒక ఉద్యోగస్తుడనే భావం, తననీ మిగిలిన వాళ్ళు గౌరవించాలనే వూహ అతనికి తెలియకుండానే అతని మనస్సులో చోటు చేసుకున్నాయి

ఆలోచనలతోనే అంట్లు తోమి, అన్ని గదులూ శుభ్రంగా వూడ్చాడు ఇత్తడి బిందెలన్నీ చింతపండుతో తళతళా తోమి, తొట్టి నిండా దూరంగావున్న బావి దగ్గరనుండి నీళ్ళు తెచ్చి పోశాడు అప్పటికి ఎనిమిదయ్యింది

''నీళ్ళు పోయటం పూర్తయ్యిందా?'' అంటూ గదిలో నుండి దొడ్లోకి వస్తూ అడిగింది

తలెత్తి చూశాడు ఒక్కక్షణం ఆ ఆకారాన్ని చూసేసరికి గుండె ఝల్లుమంది ఇందాక కుర్చీలో కూర్చున్నప్పుడు చూసి ఎంతో లావను కున్నాడు కానీ ఇంతనుకోలా

''అయిపోయిందమ్మా'' అన్నాడు రెప్ప వెయ్యకుండా చూస్తూ

''వూ అయితే ఆ బాయిలర్ వెలిగించి, నువ్వు పోయి తొందరగా టిఫిన్ చేసి రా'' అంది

అలవాటు లేనందువల్ల బాయిలర్ వెలిగించటానికి చాలా సేపు పట్టింది పొగతో కళ్ళు పోయినంత పని అయ్యింది అది బాగా రగులు కున్నాక బయటకొచ్చి టిఫిన్ కోసం మెస్ దగ్గరకు వెళ్ళాడు. అప్పటికే అక్కడ టిఫిన్ ముద్దలు అయిపోయాయి ఆకలితో కడుపు నకనకలాడు తోంది తొట్టెడు నీళ్ళు తెచ్చేసరికి చేతులు సచ్చుపడ్డాయి నాలుగట్లు తీసుకొని తిని బేరక్కు వెళ్ళి నడుం వాల్చాడు కంబడి పరచుకొని అంతా లా క్లాసులకు వెళుతున్నారు ఈరోజు ఎప్పుడు గడిచిద్దా అని ఎదురుచూస్తూ, ఒక గంట తరువాత డాక్టరు ఇంటికి వెళ్ళాడు నీరసంగా.

''ఇప్పటిదాకా ఏం చేస్తున్నావోయ్, నిన్ను వెంటనే రమ్మంటే '' గద్దించింది డాక్టరు భార్య

''మెస్‌లో ఈరోజు టిఫిన్ ఆలశ్యమయ్యిందమ్మా'' చటుక్కున అబద్ధమాడేశాడు

''సరేలే. అందరూ చెప్పే మాటే ఆ డబ్బాలో వున్న బియ్యం చాటలో పోసుకొని త్వరగా ఏరు పది నిముషాల్లో అయిపోవాలి'' అంది

నోట్లో నోట్లో తిట్టుకుంటూ పనికి ఉపక్రమించాడు ప్రకాశం బియ్యం ఏరి డబ్బామీద పెట్టాడు చాట వెనక్కు తిరగబోతుంటే ఆమే, ''బియ్యం ఏరటం అయిపోయింది కదా! అదిగో ఆ రెండు బక్కెట్లలో బట్టలున్నయ్ సబ్బు అరిగిపోకుండా జాగ్రత్తగా ఉతుకు బట్టలు శుభ్రంగా తెల్లగా వుండాలి బండకేసి బాదకూడదు సుమా'' అంది పొడవాటి గ్లాసులోని కాఫీని చిన్నగా సిప్ చేస్తూ

''అట్లాగేనమ్మా'' అన్నాడు పైకి 'గుడ్డల్లో దేన్నో ఒకదాన్ని చించకపోతే అప్పుడు చూద్దువుగానిలే' అనుకున్నాడు తనలో తను

అతని మనసులోని మాటను ఆమె పసిగట్టినట్లు, ''కొంతమంది వాళ్ళ బలమంతా బట్టలమీద

చూపిస్తారు బట్టలెప్పుడూ జాగ్రత్తగా వుతకాలి'' అంది

విని వూరుకున్నాడు ప్రకాశం చిక్కటి కాఫీ వాసన అతని ముక్కుల్ని సోకింది చాట స్టూలు మీద పెట్టి, వెనక్కు తిరిగి బాత్‌రూంలోకి వెళ్ళాడు రెండు బక్కెట్ల బట్టలు వుతికేసరికి అతని తలప్రాణం తోకకొచ్చింది పిండిన బట్టల్ని ఆరవేయటానికి బయటకు వస్తున్నప్పుడు, ఆమె చీరవిప్పి, లంగా జాకెట్టుమీద, ఇస్త్రీ బట్టల్ని చేత్తో పట్టుకొని అతని ముందు నుండి చిన్నగా నడుస్తూ స్నానాల గదిలోకి వెళ్ళింది ఏమీ బెరుకుపడకుండా ఆమెనలా చూసేసరికి కళ్ళు చెదిరాయి ప్రకాశంకు తమాయించుకున్నాడు కష్టం మీద తడబడే అడుగులతో వెళ్ళి బట్టలు ఆరవేశాడు పంచలోకొచ్చి నిలబడ్డాడు ఆలోచనలు చూసిన దృశ్యాన్నే గుర్తు చేస్తున్నాయి గతంలో తను పాలేరుగా వున్నప్పుడు, ఆసాముల ఇళ్ళల్లో చూచిన రక రకాల దృశ్యాలు కళ్ళముందు మెదిలాయి పది నిముషాలపాటు రకరకాల వూహలు చుట్టుముట్టాయి ఆ ఆలోచనలకు ఆనకట్ట కట్టకపోతే ఇబ్బంది పడాల్సొస్తుందనుకున్నాడు ఏదన్నా పని మొదలుపెడితే మనస్సు మారిద్దనుకున్నాడు ఏం చేయాలో తోచలేదు అటూ ఇటూ చూశాడు బాత్‌రూంలో స్నానం చేస్తున్న చప్పుడు స్పష్టంగా వినపడుతోంది ముసిరే ఆలోచనలను తోలటం అసాధ్యమనిపించింది గోడకు జేరబడి సర్దుకుని కూర్చున్నాడు షుమారు అరగంట తరువాత ఆమె బయటకొచ్చింది ఆమెతోపాటు మంచి వాసన ఆ ప్రాంతాన్ని చుట్టుముట్టింది. గబగబా రెండుసార్లు పీల్చి వదిలాడు లేచి నిలబడ్డాడు ఆతృత లేకుండా అతని కళ్ళు ఆమెని తేరిపార చూశాయి

''ఆరెయ్యటం అయిపోయిందా?'' అంది ఆమె చాలా మామూలుగా

''అయిపోయిందండీ'' అన్నాడు 'అయిపోయిందమ్మా' అని అనలేకపోయాడు

''అయితే స్నానాల తొట్టి ఖాళీ అయింది, దాని సంగతి చూడు'' అంది బట్టలుతికినందున ఒక తొట్టి అంతకుముందే ఖాళీ అయ్యింది రెండు తొట్లనీ నీళ్ళతో నింపేసరికి వెన్నుపూస విరిగి పోయినట్లయింది 'ఇంకా ఏం పని ఎదురు చూస్తుంటుందో' అనుకుంటూ పంచలోకొచ్చి నిలబడ్డాడు. అతను అనుకున్నంతా అయ్యింది

ఆమె బయటకొచ్చింది ఏదో తింటూ ప్రకాశాన్ని చూస్తూ, ''మబ్బు పట్టింది వర్షం వస్తుందేమో ఆ కట్టెలన్నీ పగలగొట్టి లోపల పేర్చు'' అంది తల తిప్పి అటు చూశాడు అతని కోసం బండెడు సరివి కట్టెలు ఎదురు చూస్తున్నాయి వాటిని చూచేసరికి గుండెలు జారి పోయాయి అప్పటికి మధ్యాహ్నం పన్నెండు గంట లయ్యింది. ఎంత లేదన్నా కనీసం మూడు నాలుగు గంటలు పట్టేద్ది ఆ పనికి

''అన్నం తినొచ్చి పగలేత్తానండీ'' అన్నాడు నసుగుతూ

ఆమె ఏ ధ్యాసలో వుందోకాని, ''వూఁ సరే తొందరగా రా ఆ గది కాస్త వూడ్చిపో'' అంది

శుభ్రంగా ఊడ్చిన గదుల్ని పిల్లలు కాగితాలు చించి చిందరవందర చేశారు ఆ పిల్లల్ని చూస్తే చికాకేసింది ఒకటే అల్లరి గది అంతా శుభ్రపరచి ఒక్క ఉదుటున బయటపడ్డాడు

'మహాతల్లి, ఏధ్యాసలో వుందో కాదు ఇప్పుడే పేళ్ళు పగలెయ్యమంటే చావుకొచ్చేది' అనుకున్నాడు

మెస్ కెళ్ళి, భోంచేసి, బేరక్‌కి వచ్చాడు ఆ క్వార్టర్‌కి వెళ్ళాలంటే భయంగా ఉంది తటపటాయించాడు. 'ఏదయితే అదయ్యిద్ది ఒకగంట సేపు పడుకోవాలి' అనుకున్నాడు కంబడి పరుచుకొని మధ్యాహ్నం మూడు గంటల వరకూ పడుకున్నాడు తర్వాత లేచి అడుగులో అడుగు

వేసుకుంటూ చిన్నగా వెళ్ళాడు కడుపులో భయంగా వుంది

డ్వాక్టరు భార్య హాల్లో పడుకొని ఏదో తింటూ, పుస్తకం చదువుతూ, రేడియో వింటోంది పనిపిల్ల బయట పంచలో కూర్చుని ఉతికిన నవ్వారుని చుట్టగా చుడుతోంది ఆ అమ్మాయి నడిగి గొడ్డలి తీసుకొని, దొడ్లోకెళ్ళి పేళ్ళు పగలగొట్టే పనిలో మునిగిపోయాడు పనయిపోయే లోపల 'అమ్మగారు' రెండుసార్లు బైటకొచ్చి చూచి వెళ్ళింది చేతులు బొబ్బలు పోయాయి ప్రకాశంకు వెన్నులో తీవ్రంగా నొప్పి మొదలయ్యింది చెమటతో బట్టలు ముద్దయిపోయాయి

బెరుకుగా పనిపిల్లని మంచినీళ్ళడిగాడు జర్మన్‌సిల్వర్ కూజాతో నీళ్ళు తెచ్చిచ్చింది పని అమ్మాయి తాగేలోపు లోపలికెళ్ళి ఖాకీ సంచీ, డబ్బులు తెచ్చిచ్చి ఏమేం కూరగాయలు ఎన్నెన్ని తేవాలో చెప్పింది టౌనులోకెళ్ళే అవకాశం వచ్చినందుకు సంతోషించాడు ప్రకాశం చెప్పిన వాటిని జాగ్రత్తగా గుర్తు పెట్టుకున్నాడు చిన్నగా బయటకు నడిచాడు 'మంచినీళ్ళడిగినప్పుడు పనిపిల్ల కులం అడిగిద్దామనుకున్నా, ఏందబ్బా యిచిత్రం' అనుకున్నాడు 'ఈ ఆడర్లీ పని అచయ్యంగా వున్నా ఇట్టా రోజూ టౌనులో కెల్లొచ్చు' అనుకుని నవ్వుకున్నాడు

ప్రకాశం తిరిగొచ్చేసరికి పొద్దు గుంకుతోంది లెఖ్ఖలు చెప్పి మిగిలిన చిల్లర ఇచ్చాడు

''నీళ్ళయిపోయినియ్ చూడు'' అంది డ్వాక్టరు భార్య ఆ మాట వినటంతోనే ప్రకాశం గుండెలు జారిపోయాయి పని అలవాటు తగ్గినందున, కట్టెలు పగలగొట్టేసరికి అరచేతుల్లో బొబ్బలు వచ్చాయి అవి ఇప్పుడు బాగా నొప్పి చేశాయి చెయ్యగలిగిందేమీలేక రెండు కడవలు తీసుకొని బావి దగ్గరకు బయలుదేరాడు కోపంతో నొసలు ముడిపడింది తనమీదా, తన ఉద్యోగం మీదా, తన బ్రతుకుమీదా అసహ్యం వేసింది గట్టిగా కాండ్రించి వుమ్మేశాడు 'అసలిది పాలేరుపనా గొవర్నమెంటు నౌకరీనా?' అని తర్కించుకున్నాడుతనలో తను ప్రపంచ జ్ఞానం అంతగా లేని అతని బుర్రకు సమాధానం దొరకలేదు రెండు తొట్లూ నింపేసరికి బాగా పొద్దు పోయింది బజారు కెళ్ళినప్పుడు ఆరిపోయిన వంటిమీది బట్టలు మళ్ళీ చెమటతో తడిచి ముద్దయిపోయి, వాసన వేస్తున్నాయి చేతుల్లోని బొబ్బలు చితికి వంటలు పుడుతూ ఏ వస్తువునీ పట్టుకో నివ్వటంలేదు

గోడలమీద కెక్కి గోలగోలగా అరుస్తున్న కోళ్ళను పట్టుకొని గంపలకింద కప్పెట్టి, అందరికీ మంచాలేసి, వాటిమీద పక్కలువేసి, దోమ తెరలు కట్టేసరికి రాత్రి ఎనిమిది గంటలు కావస్తోంది ఆకలి దహించి వేస్తోంది వళ్ళు అలసిపోయింది ఇంకా ఎంత పనుందో అని భయపడుతూ, చిన్నగా అన్నాడు, ''నే పోతున్నానండీ'' అని

ఆ మాటవిని డ్వాక్టరు భార్య బయటకొచ్చింది

''అప్పుడేనా? అప్పుడేపోయి ఏం చేస్తావోయ్ మేం భోజనాలు చేసిందాకా వుండరాదూ! మీ అయ్యగారింకో అరగంటలో వస్తారు'' అంది

ప్రకాశం గుండె ఝల్లుమంది

''తల పగిలిపోతందండీ'' అన్నాడు తడుముకోకుండా ఈరోజు ఇది రెండో అబద్ధం

''అయితే వుండు టాబ్లెట్లిస్తాను'' అని వెళ్ళి బీరువా తీసింది బీరువానిండా మందులు వున్నయ్ ఆమె ఇచ్చిన టాబ్లెట్లు తీసుకొని వెనక్కు తిరిగాడు

''రేయ్'' గట్టిగా వినపడింది ఆమె స్వరం ఆ పిలుపు భయం కలిగించింది వెనక్కు తిరిగాడు చటుక్కున

''వెళ్ళేటప్పుడు సెల్యూట్ చెయ్యాలని తెలియదా నీకు? ఈడియట్'' కోపంగా అంది ఆమె ఆ మాటకు బిత్తరపోయాడు తడబడ్డాడు

''మర్చిపోయానమ్మా'' అన్నాడు వెంటనే సెల్యూట్ చేశాడు

''ఊ! అదీ కాస్త మర్యాదనేర్చుకో'' అంది ఆమె వెళ్ళి కుర్చీలో కూర్చుంది మళ్ళీ సెల్యూట్ చేసి, గిరుక్కున వెనక్కు తిరిగి బయటకొచ్చాడు చరచరా చేతిలోని టాబ్లెట్లు విసిరి నేలకేసి కొట్టాడు తిట్టిన తిట్లు తిట్టకుండా తిడుతూ బేరక్‌కి వచ్చాడు హడావిడిగా పళ్ళెం కడుక్కుని మెస్ దగ్గరకు పరిగెత్తాడు అప్పటికే అన్నం అయిపోయింది. నీరసంగా కాళ్ళీడ్చుకుంటూ బేరక్‌కి వచ్చాడు తాడూ, బక్కెట్టూ తీసుకుని బావి దగ్గర కెళ్ళి స్నానం చేసొచ్చాడు

జరిగిన సంగతులన్నీ గురవయ్యకు చెప్పాడు అంతావిని, అతను, ''కొంతమంది అంతే ఇంతకు ముందువున్న డ్క్టరు భార్య చాలా మంచిదంట వాళ్ళింటికి అర్డర్లీగా వెళ్ళటానికి అంతా పోటీపడే వాళ్ళట కొంత మంది మంచివాళ్ళుంటారు అందరూ ఇట్టాంటి మహాతల్లులే అయితే దేశం ఏనాడో బూడిదై పోయి వుండేది'' అన్నాడు

''ఆమె సొమ్మంతా పోయినట్టు ఎనక్కల్లా పిలిచి సెల్యూట్ చేయించుకుంది'' అని కసిగా తిట్టాడు ప్రకాశం

చిన్నగా నవ్వాడు గురవయ్య ''జరిగింది మర్చిపో ఎక్కడికక్కడ మర్చిపోకుండా, నీ అక్కసంతా ఎవరి ముందన్నా వెళ్ళగక్కితే, నువ్వంటే గిట్టనివాళ్ళు ఒకటికి నాలుగు కలిపి, అక్కడకు చేరవేస్తారు ఎందుకొచ్చింది ఎంతనుకున్నా మనకివి తప్పవు'' అన్నాడు

ఆ మాట విని ప్రకాశం మెదలకుండా వూరుకున్నాడు కొద్దిసేపు

''కానీ, అబ్బా, ఆల్లింట్లో రేడియో పాడిద్దండీ ఆబ్బో, బోసానం పెట్టంత వుంది'' అన్నాడు ప్రకాశం

''అవును మనోల్లు చాలామంది సెప్పారు''

''ఎంతయిద్దో?!''

''మనం ఏం కొంటాం ఆల్లంటే ఒకపక్క పెద్దపెద్ద జీతాలొచ్చే ఉద్దోగాలూ, సొంతూళ్ళో భూమీ పుట్రా, పై సంపాదనా, ఇట్టా ఎన్ని'' అన్నాడు గురవయ్య

ప్రకాశం విని వూరుకున్నాడు. 'ఎట్టాగయినా సరే, అట్టాంటి రేడియో కొనుక్కోవాలి' అనుకున్నాడు మనస్సులో దృఢంగా

తిరిగి మూడోరోజు ప్రిన్సిపాల్ ఇంటికి పంపించారు ప్రకాశాన్ని అక్కడ కొంతమంది సీనియర్ ట్రైనింగ్ రిక్రూట్ కానిస్టేబుళ్ళు పరమనెంట్‌గా వుంటున్నారు పనులు చేయటానికి అయినా కొత్తగా వచ్చిన వాళ్ళతో కూడా పనులు చేయిస్తున్నారు వాళ్ళు పనులు పురమాయించేది వాళ్ళే ప్రకాశం అక్కడకు వెళ్ళగానే మొదట కుక్కకు స్నానం చేయించమన్నారు దానికి నీళ్ళు పోసేసరికి ప్రకాశంకు తాతలు కనిపించారు అది పంపు కింద కుదురుగా వుండేది కాదు పట్టుకోబోతే కరవబోయేది వూరక అదేపనిగా తోక ఆడిస్తుండేది అది అలా తోక ఆడిస్తుంటే దాని తోకకున్న సబ్బు నీటి చుక్కలు కళ్ళల్లో పడి మంట పుట్టేవి కళ్ళు తుడుచుకొని చూసేసరికి అది పంచలోకెళ్ళి నిలబడి వుండేది ఈ అవస్థ చూస్తూ సీనియర్ రిక్రూట్‌లు పగలబడి నవ్వుతుండేవారు ప్రతిరోజూ వాళ్ళకదొక వినోదం దాన్ని కడిగాక సుబ్బరంగా గుడ్డతో తుడవాలి. తరువాత బక్కెట్టుతో పూల మొక్కలకు నీళ్ళు పోస్తే ఆ పూటకు పని అయిపోయినట్టే ప్రిన్సిపాల్

కాబట్టి ఎంతమంది ఆర్డర్లీలనయినా పెట్టుకోవచ్చు తలా ఒకపని చేస్తారు కాబట్టి కొత్తవాళ్ళకు పని తక్కువ ప్రిన్సిపాలింట్లోని సీనియర్ రిక్రూట్స్‌ని అధికార్లుకూడా చూచీ చూడనట్లు వూరుకుంటారు ఆ రిక్రూట్లు టౌన్‌లోకెళ్ళి సరదాగా తిరిగొస్తుంటారు అడపాదడపా సినిమాలకు కూడా వెళుతుంటారు రోల్‌కాల్స్‌కూ, డ్రిల్లుకూ, లా క్లాసులకూ రాకపోయినా అడిగేవాళ్ళు లేరు అందువలన వాళ్ళు ఆ ఆర్డర్లీ పని పోకుండా చూసుకోవటానికి శతవిధాల ప్రయత్నిస్తుంటారు ప్రిన్సిపాల్ దొరకు కొద్దికొద్దిగా తెలుగువచ్చు దొరసానమ్మకు అసలు రాదు అయితే తెలుగు మాట్లాడటానికి బాగా ప్రయత్నం చేసేది ఆమె తెలుగు ఉచ్చారణ వింటుంటే ఆర్డర్లీలకు పొట్ట చెక్కలయ్యే నవ్వు వచ్చేది కానీ నవ్వకూడదు వాళ్ళకు కోపం వచ్చిందంటే ఉద్యోగం పోయినట్లే లెక్క

తరువాత మూడు రోజులకు సీ యల్జె ఇంటికి ఆర్డర్లీగా వెళ్ళవలసి వచ్చింది ప్రకాశంకు అతను ముందుగా విన్నట్లుగానే సీ యల్జె భార్య చాలా మంచిది ఆర్డర్లీని బాబూ అని సంబోధించటం విని చాలా ఆశ్చర్యపోయాడు ప్రకాశం వాళ్ళింట్లో అతను చేసిన పని నీళ్ళు తేవటం మాత్రమే ఇద్దరు చిన్నపిల్లలు వున్నారు వాళ్ళు కూడా చాలాబుద్ధిమంతుల్లా కనిపించారు ఆ ఇంటి పరిస్థితి చాలా ఆశ్చర్యమేసింది ప్రకాశంకు నీళ్ళపని పూర్తి చేసి వచ్చి పంచలో నిలబడ్డాడు ప్రకాశం ప్లేటునిండా ఉప్మా తెచ్చి బల్లమీద పెట్టింది ఆమె ఆశ్చర్యంతో, మొహమాటపడుతూ వద్దన్నాడు ప్రకాశం ''ఫరవాలేదు తీసుకో ఆ మెస్‌లో టిఫిన్ దారుణంగా వుంటుందట మరీ'' అంది ఆమె

ఆమెని ఒకసారి పరీక్షగా చూశాడు ఎంతో సంస్కారం కనిపించింది ఎక్కడలేని గౌరవ భావం కలిగింది కట్టూబొట్టూ హుందాగా వున్నాయి

తను అక్కడవుంటే అతను బిడియపడుతున్నాడని భావించి, ''తిను, ఆలశ్యమయితే చల్లారిపోతుంది'' అని ఆమె లోపలికెళ్ళింది

ఉప్మాతిని పంపుదగ్గరకెళ్ళి నీళ్ళు తాగి, ప్లేటు కడుక్కొచ్చి బల్ల మీద పెట్టాడు అంత రుచికరమైన ఉప్మా అతనెప్పుడూ తినలేదు అంతకు ముందు

ఆమె బయటకొచ్చింది ప్లేటువైపు చూచి, ప్రకాశంవైపు చూచి చిన్నగా నవ్వింది ఆ నవ్వు అతనికెంతో ఆహ్లాదాన్ని కలిగించింది అలాటి నవ్వు ప్రకాశాన్ని చూచి వాళ్ళ అమ్మ నవ్వేది ఆ నవ్వు చూడగానే ప్రకాశానికి తల్లి గుర్తొచ్చింది తనూ చిన్నగా నవ్వాడు

''ఇంక నువ్వు చేసే పనులేమీ లేవు వీలయితే సాయంత్రం వచ్చి ఒక జోడు నీళ్ళు పోసిపో మొక్కలకు'' అంది ఆమె ఆ మాటలకు అతను ఆశ్చర్యపోయాడు ఎక్కడి పని అక్కడేవుంది దొడ్లో బక్కెట్లో ఉతకవలసిన బట్టలున్నయ్. పని అంతా ఆమే చేసుకుంటోంది చెయ్యెత్తి సెల్యూట్ చెయ్యబుద్ధి కాలేదు రెండు చేతులెత్తి నమస్కరించాడు

''మంచిది'' అంది ఆమె

బేరక్‌కు వచ్చాడు. అలవాటుగా గురవయ్యకు ఆ పూట జరిగిన సంగతి చెప్పాడు ఆమె పేరు సుశీలమ్మ అని గురవయ్య చెప్పాడు. ఆమెని గురించి చాలాసేపు మాట్లాడుకున్నారు ఎంతో గౌరవంతో. ''ఎళ్ళమనంగానే వచ్చేశా. ఎంత పని వుంది ? ఛీ, నా మట్టి బుర్రకు చురుకుదనం లేదూ పాడులేదు ఆ రెండు బక్కెట్ల బట్టలన్నీ వుతికేస్తే ఆమెగారికి కొంచెం పని తగ్గేది కదా'' అన్నాడు ప్రకాశం

ఆ మాటలకు గురవయ్య నవ్వాడు

''ఆల్లు ఏవిటోల్లో?'' అన్నాడు ప్రకాశం

''బేమ్మలు నిజమైన బ్రాహ్మలు'' అన్నాడు గురవయ్య అంతటితో ఆ సంభాషణ ఆగిపోయింది

ఆ సాయంత్రం నీళ్ళు పోయటానికి వెళ్ళాడు ప్రకాశం రెండు జోళ్ళకన్నా ఎక్కువ నీళ్ళు పట్టలేదు ఆమె గదిలో కూర్చుని ఏదో చదువుకుంటోంది పిల్లలు కూడా ఏవో చదువుతున్నారు పుస్తకాలమీదకు వంగి చెట్లకూ, మొక్కలకు నీళ్ళుపోసి పంచలోకి వచ్చాడు ''నీళ్ళు పోయటం అయిపోయిందమ్మా'' అన్నాడు ఆ మాటకు ఆమె తలతిప్పి చూచింది బయటకొచ్చి కుర్చీలో కూర్చుంది చేతిలో పుస్తకముంది అట్లాగే

''పనేం లేదు ఇంక కొద్దిసేపు కూర్చో'' అంది ప్రకాశం అక్కడే బల్లకానుకుని కూర్చున్నాడు గచ్చుమీద

''నీపేరేంటి?'' అంది ఆమె

''ప్రకాశమమ్మా''

''ఏ జిల్లా?''

''గుంటూరమ్మా''

కులమేమిటని అడిగిద్దేమోనని అతని మనస్సు వ్యాకుల పడుతోంది

''ఈ ఉద్యోగంలోకి రాకముందు ఏం చేసేవాడివి?''

''మాకేం పొలం పుట్రా లేవమ్మా కూలిపనికి పోయేవాడిని''

''పెళ్ళయ్యిందా?''

అయ్యిందన్నట్లు తలవూపాడు సిగ్గుతో

''మరి ఏమన్నా చదువుకున్నావా?''

చటుక్కున తలెత్తి ఆమెవైపుచూశాడు క్షణకాలం వెంటనే మళ్ళీ తలదించుకున్నాడు ''లేదమ్మా కాని యీడ కొచ్చాక మా బేచ్చీ లీడరు, గురవయ్య నాకు సదవటం, రాయటం నేర్పాడమ్మా ఇప్పుడిప్పుడే చిన్న చిన్నగా చదువుతున్నా'' అన్నాడు

''నిజంగా?! వెరీగుడ్'' అంది ఆమె సంతోషంగా ''ఈ స్కూలుకొచ్చి చదువుకున్న వాళ్ళల్లో నీవు రెండోవాడివి నాకు తెలిసినంత మటుకు ఇంతకుముందు ఒక కుర్రవాడు, మీ జిల్లావాడే, నీలాగే ఇంటరెస్టుగా చదువుకున్నాడు ఏదీ ఈ పుస్తకం చదువు, చూస్తాను'' అని తన చేతిలోని పుస్తకం అందించింది

సిగ్గుపడుతూ తీసుకున్నాడు పుస్తకం తెరచి, భయపడుతూ చిన్నగా చదివాడు ఒక పేరా చదివి తల ఎత్తి ఆమెవైపు చూశాడు

''వెరీగుడ్, బావుంది చాలా చక్కగా చదువుతున్నావు'' అంది ఆమె ప్రశంసా పూర్వకంగా సిగ్గుపడుతున్నట్లు తలదించుకున్నాడు పిల్లలు కూడా అతనివైపే చూస్తూ వుండిపోయారు బయటకొచ్చి

''ఇంకా బాగా ప్రాక్టీసు చెయ్యి రోజూ ఒక గంట చదివితే చాలు. బాగా వస్తుంది ఆ పుస్తకం తీసుకెళ్ళి చదువుతావా? మంచి పుస్తకం చదివిన తరువాత తెచ్చి యివ్వు'' అంది ఆమె ఆ మాటలకు అతనికెంతో సంబరమేసింది 'అలాగే' అన్నట్లు తలూపాడు

''టైం వేస్టు చేసుకోకుండా చదువుకుంటూ వుండు సరే వెళ్ళు'' అంది

''అట్బాగేనమ్మా'' అని లేచి, నమస్కరించి, బేరక్‌కు వచ్చాడు

డ్రిల్లూ, లా క్లాసూ అయిపోయిన వెంటనే పుస్తకం తీసుకొనేవాడు అది ఒక నవల దాని పేరు 'విధి విలాసం' దాన్ని గురవయ్యకు చూపించాడు

''నువ్వు చదివిన తరువాత నాకూ ఒక సారియ్యి చదివిస్తా'' అన్నాడు గురవయ్య

'అలాగే' అన్నట్లు తలవూపాడు ప్రకాశం

తిరిగి మూడో రోజు ఏ యల్ఐ ఇంటికి ప్రకాశం ఆర్డర్లీగా వెళ్ళాల్సి వచ్చింది ఏ యల్ఐ భార్య ఆర్డర్లీకి పని చెప్పటంలో డాక్టరు భార్యని మించిపోయింది ఆర్డర్లీని 'అరే' 'ఒరే' అని తప్ప ఇంకొకరకంగా పిలవదు ఆ రోజంతా కూడా 'ఎప్పుడు పొద్దుగుంకిద్దా' అని ఎదురు చూడటంతోనే సరిపోయింది ఆ రోజు అసలు ఒక్క పేజీ కూడా చదవటానికి వీలు దొరకలేదు తరువాత రెండు రోజులు మధ్యాహ్నం పూట చదువుకోవటానికి వీలయ్యింది

తిరిగి మూడో రోజు ఇంకో ఏ యల్లై ఇంటికి ఆర్డర్లీగా వెళ్ళాడు వాకిట్లో అడుగు పెట్టీ పెట్టకముందే ఆ ఏ యల్లై భార్య అడిగిన మొదటి ప్రశ్న ''మీరేవిట్లు?''

ఆ ప్రశ్న వినటంతోనే సగం చచ్చిపోయాడు ప్రకాశం చెప్పలేక చెప్పలేక చెప్పాడు అతని సమాధానం విని కుర్చీలో కూర్చుని వున్న ఆమె ఒక్క వుదుటున లేచి నిలబడింది ఆమె ముఖం కోపంతో ఎర్రబడింది ''ఎవడు నిన్ను పంపింది? ఎవడు మీ లీడరు? వాడికి ఉద్యోగం మీద ఆశ లేదా? మా బంగళాకి అంటరాని వెధవలని ఆర్డర్లీలుగా పంపకూడదని ఆ వెధవకి తెలియదా? రానియ్యి మీ అయ్యగారిని రానియ్, ఆ వెధవని డిస్మిస్ చేయిస్తాను ఫో ఇంకా నిలబడ్డావే దరిద్రగొడ్డు ఏడుపు ముఖమూ నువ్వూనూ ఫో వెధవా ఇప్పటికే ఆలస్యమయింది ఆ వచ్చే వెధవ ఎప్పటికి తగలడతాడో ఫో నువ్వు ''

అడ్డూ అదుపూలేకుండా వస్తున్న ఆమె మాటలకు ప్రకాశం వణికిపోయాడు ఇంకొక్క క్షణం అలాగే నిలబడివుంటే చేతికి ఏది దొరికితే అది తీసుకొని విసిరేసిద్దేమో అన్నట్లు వుంది ఆమె వుగ్రరూపం వెంటనే తేరుకుని ఈ లోకంలోకి వచ్చాడు

చటుక్కున వెనక్కు తిరగబోయి, నాలిక కరుచుకొని, ''అట్బాగేనమ్మా'' అని సెల్యూట్ చేసి బయటపడ్డాడు, 'బ్రతుకు జీవుడా' అనుకుంటూ

''ముఖం చూసే అనుకున్నా ఆ భాషచూడు ఎంత చక్కగా వుందో అట్బాగేనమ్మా అంట అట్బాగేనమ్మా అని డర్టీరోగ్స్'' ఆమె చీదరించుకుంటూ అంటున్న మాటలు ప్రకాశం మనస్సుకి సూలాల్లాగా గుచ్చుకున్నాయి అవమానంతో అతని ముఖం నల్లగా మాడిపోయింది హృదయాన్ని కలిచివేశాయి ఆమె మాటలు బాధతో వెళ్ళి, జరిగిన విషయం గురవయ్యకు చెప్పాడు ఆ మాట విని నాలిక్కరుచుకున్నాడు గురవయ్య

''నే మరిచే పోయా'' అన్నాడు బుర్రగోక్కుంటూ ఇంకోకుర్రాణ్ణి పిలిచి, ఏ యల్లై ఇంటికి పంపించాడు ప్రకాశం బేరక్‌కు వెళ్ళాడు జరిగిన సంఘటన బాధ కలిగిస్తున్నా, చదువుకోవటానికి వీలుదొరికినందుకు కించిత్తు సంతోషం కలిగింది పుస్తకమైతే తెరిచాడుగానీ, ఆమె అన్నమాటలు చెవుల్లో గింగురుమంటూ అతన్ని స్థిమితంగా వుండనియ్యటంలేదు

'నా బాస అంత అసియ్యంగా వుందా?'' అని తనలో తను తర్కించుకున్నాడు 'ఇంతకాలం ఈ బాస ఇసయం ఆలోచించలేదు ఇదీ ఒకందుకు మంచికే వొచ్చిందేమో ఏదేమైనా సరే,

బాసకు పదునుపెట్టాలి' అనుకున్నాడు

' 'ఈ పెపంచకం ఎంత దురమారగంగా వుందో! బగిసత్తులో ఇంకా ఇట్టాంటియ్యి ఎన్ని కొత్త కొత్త ఇసయాలు తెలుత్తాయో' అనుకున్నాడు 'ఈటెమ్మని ఈ లంజల్ని పాపం లేదు కసిగా తిట్టాడు చాలా సేపటికిగానీ వుద్రేకం చల్లారలేదు

ఆ మధ్యాహ్నం లా క్లాసులో ఏ యల్లై గురవయ్యనిఇష్టమొచ్చినట్లు తిట్టాడు క్లాసుకు వస్తూనే గురవయ్యని చూస్తూ, ''ఏం అప్పుడే పొగరెక్కిందా?'' అన్నాడు గురవయ్యకు విషయం అర్థమయ్యింది పొరపాటయ్యిందనీ, క్షమించమని వేడుకుందామని నోరు తెరవబోయాడు కాని అతనికి ఆ అవకాశం ఇవ్వలేదు ఏ యల్లై ''ఉదయం మా యింటికి ఎవరిని పంపించావ్?'' అన్నాడు గురవయ్యని ఆపాదమస్తకం పరిశీలనగా చూస్తూ

''పొరపాటయ్యింది సార్'' అన్నాడు గురవయ్య నీళ్ళునములుతూ లేచి నిలబడ్డాడు ముద్దాయిలాగా

''వళ్ళు దగ్గర పెట్టుకొని ప్రవర్తించు నే తల్చుకుంటే, నీన్నూ, మా యింటికి వచ్చినవాడినీ, ఇద్దరినీ యిళ్ళకు పంపిస్తా ఇంటికెళ్ళి మళ్ళీ పేడ తట్టలు మోయాలనుకుంటున్నావా? చెప్పు - జాగ్రత్త ఒక్క కలం పోటుతో డిస్మిస్ చేయిస్తా నా చేతిలో అరడజనుమంది అయిపోయా రిప్పటికి కావాలంటే ఎంక్వయిరీ చేసుకో''

ఆ మాటలకు గురవయ్య ముఖం వాడిపోయింది అవమానంతో కోపం ముఖంలో గూడు కట్టుకుంది ముఖంలోని భావాలు ఏ యల్లై కు కనపడకుండా తల దించుకున్నాడు పూర్తిగా అతన్ని అలా తిడుతుంటే ప్రకాశానికి ముచ్చెమటలు పోశాయి ఎదుటి మనిషిని చాటు చేసుకుని వుండిపోయాడు ఏ యల్లై కి కోపం ఇంకా తగ్గలేదు

''ఎవడ్రా ఉదయం మా యింటి కొచ్చింది?'' అన్నాడు కూర్చున్న వాళ్ళవైపుతీక్షణంగా చూస్తూ ఆ ప్రశ్నతో ప్రకాశానికి పై ప్రాణాలు పైనే పోయినట్లనిపించింది నీళ్ళు నములుతూ లేచి నిలబడ్డాడు ''ఏం? నీకన్నా ఎక్కడ బుద్ధిలేదు? అన్నం తింటంలా? నీలాంటి వెధవలంతా కాలు పెట్టటానికి మా యిల్లేమన్నా శూద్రుల కొంపనుకున్నారా? మా వంశం మొదటినుండీ సత్సంప్రదాయాలతో విలసిల్లుతున్నది ఇలాటి సంఘటన ఇంకోసారి నా నోటిసులోకి వచ్చిందంటే, తాట వలుస్తా'' అన్నాడు

తరువాత కూడా ఏ యల్లై చాలాసేపు చిర్రు బుర్రు లాడుతునే వున్నాడు ఇంచుమించు టైం అయిపోయిందాకా వాళ్ళిద్దరూ అలా నిలబడే వున్నారు అవమానంతో వాళ్ళనలా తిట్టినందుకు ఆసాముల కుర్రోళ్ళకి ఆనందంగా వుంది కానీ వాళ్ళకు కూడా ఆ ఏ యల్లై ఇంటికి ఆర్డర్లీగా వెళ్ళాలంటే భయమే ఆయనకన్నా ఆమె మరీ దుర్మార్గురాలు వాళ్ళ దృష్టిలో

లా క్లాసు టైం అయిపోయేముందు, జీతాలు రావటానికి ఇంకా రెండు రోజులే వుందన్న విషయం గుర్తొచ్చింది ఏ యల్లై కి హఠాత్తుగా వెంటనే అతని ముఖంలో రంగులు మారటం అతన్ని దొంగచూపులు చూస్తున్న కొంతమంది గమనించారు ప్రకాశం తిట్టిన తిట్టు తిట్టకుండా మనసులో తిడుతున్నాడు ఏ యల్లైని గురవయ్య కూడా ఆ పనిలోనే నిమగ్నమయ్యాడు

''వూ, కూర్చోండి'' అన్నాడు ఏ యల్లై వీళ్ళిద్దరూ కూర్చున్నారు ''ఏమిటోయ్. నువ్వు చదువుకున్నవాడివికూడా అలా చేస్తే యెలా?'' అన్నాడు అనునయంగా మళ్ళీ గురవయ్య తలెత్తి చూశాడు ''యూ మస్ట్ యూ మస్ట్ '' తరువాత ఏమనాలో తెలియక ఆపేశాడు

ఏ యస్లై
''యస్ సర్ ఐ మస్ట్ బి వెరీ కేర్‌ఫుల్ సర్'' అన్నాడు గురవయ్య సందర్భోచితంగా

అతను ఇంగ్లీషు మాట్లాడటంతో కళ్ళు పెద్దవి చేసి చూశాడు ఏ యస్లై ఆశ్చర్యంతో క్షణంలో మళ్ళీ అవమానంతో కనుబొమలు ముడివేశాడు మళ్ళీ కోపమొచ్చింది గురవయ్య ఇంగ్లీషు మాట్లాడినందుకు కానీ జీతాల తేదీ గుర్తొచ్చింది అయితే ఏమీ మాట్లాడకుండా వుంటే బాగుండదన్నట్లు, ''యస్ దటీజ్ గుడ్'' అన్నాడు తడబడుతూ మళ్ళీ గురవయ్య ఇంగ్లీషులో మాట్లాడతాడేమోనని కించిత్తు భయమేసింది అందుకని గురవయ్యకు ఆ అవకాశం ఇవ్వకుండా వేరే విషయాన్ని ప్రస్తావించాడు రెండు నిముషాల తరువాత మాట్లాడకుండా వుండిపోయాడు

లా క్లాసు టైం ఎప్పుడయిపోయిద్దా అని అంతా ఎదురుచూస్తూ ఎవరి ఆలోచనల్లో వాళ్ళు మునిగిపోయారు చాలామంది ఆలోచనలు ఆ ఏ యస్లై ఇంటికి ఆర్డర్లీలుగా వెళ్ళినప్పుడు పడే బాధల మీదకే మళ్ళాయి

ఆ ఏ యస్లై ఇంటికి పోవడమంటే వాళ్ళకు నరకానికి వెళ్ళినంత దుఃఖం కలిగిద్ది ఆ యింట్లో వున్నంతసేపూ ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని బిక్కుబిక్కుమంటూ వుండాల్సిందే చిన్నచిన్న పొరపాట్లకు కూడా ఆ ఏ యస్లై ఆర్డర్లీని గొడ్డుని బాదినట్లు బాదుతాడు ఒక సంఘటన గుర్తొచ్చింది ప్రకాశంకు

ఒకసారి ఒక కుర్రవాడు బక్కెట్టుతో నీళ్ళు తెస్తూవుంటే, వంటగదిలో రెండు చుక్కలు ఒలికాయనే కారణంతో, నేలమీదపడ్డ ఆ నీళ్ళని పాత గుడ్డతో తుడుస్తున్న ఆ కుర్రవాణ్ణి ముఖం మీద బూటుకాలితో తన్నాడు ఈ ఏ యస్లై ఆ దెబ్బకు ఆ రిక్రూట్ కుర్రోడు వెల్లికిలా పడిపోయాడు పై పన్ను ఒకటి విరిగిపోయింది పెదవి చిట్లి రక్తం ధారకట్టింది అతను ఆ బాధతో విలవిల్లాడుతుంటే, ఆ ఏ యస్లై భార్య వచ్చి అక్కడపడ్డ రక్తపు చుక్కలు చూచి ఉగ్రురాలైపోయింది కోపంతో మండిపోయింది రక్తం చుక్కలు పడినందున ఇల్లంతా మైలపడిపోయిందని శాపనార్థాలు మొదలు పెట్టింది 'అరే దరిద్రుడా, నువు లేచి అవతలకెళ్ళు ముందు' అని గర్జించింది అతను అరచేత్తో పెదవి వత్తిపట్టుకొని బైటకొచ్చాడు బాధతో అతని కళ్ళవెంట నీళ్ళు కారుతున్నయ్ ఆమె కూడా అతనితోపాటు బైటకొచ్చి వాకిట్లో నిలబడి శాపనార్థాలు మొదలు పెట్టింది 'ఏం, ఏం కొంపలు మునిగిపోయాయని ఏడుస్తున్నావు దరిద్రగొట్టు మొహమా ఫో నీ ముఖం మాకు చూపించగాక ముందు ఆ గది సుభ్రంచెయ్' అంది కేకలు పెడుతూ అతను చొక్కతో పెదవి అదిమి పట్టుకొని లోపలికొచ్చి రెండు బక్కెట్లు నీళ్ళుపోసి ఆ గదంతా సుభ్రంగా కడిగాడు

'నువ్వుపోయి అర్జంటుగా ఇంకొకడ్ని పంపించు' అంది ఆమె అతను కన్నీళ్ళు తుడుచు కుంటూ వెళుతుంటే, కోపంగా కేకవేసి వెనక్కి పిలిచింది

'ఏరా, దొంగవెధవా వెళ్ళేటప్పుడు సెల్యూట్‌చెయ్యాలని తెలియదా? పళ్ళు విరిగేలా తన్నినా నీకు సిగ్గురాలేదా?' అంది

అతను వెక్కిళ్ళు పెడుతూనే సెల్యూట్‌చేసి బయటకెళ్ళాడు దెబ్బవలన కలిగిన బాధకన్నా వాళ్ళనే మాటలకు దుఃఖం ఆగలేదు

కాంపౌండు దాటినవాడిని మళ్ళీ కేకేసి వెనక్కు పిలిచాడు ఏ యస్లై మళ్ళీ ఏం పొరపాటు జరిగిందో అర్థంకాక బిక్కుబిక్కు మంటూ వెళ్ళి, ఏ యస్లై ముందు నిలబడ్డాడు సెల్యూట్

చేసి 'నేను తన్నినట్లు ప్రిన్సిపాల్‌కుగానీ, ఇంకా ఎవరికైనా చెప్పావా, నీ ప్రాణం తీస్తా, జాగ్రత్త ఫో' అన్నాడు

ఆ కుర్రవాడు ఆయనకు సెల్యూట్ చేసి, బేరక్‌కి వెళ్ళి, విషయమంతా గురవయ్యకు చెప్పాడు గురవయ్య ఇంకొక కుర్రవాడిని ఏ యల్లె ఇంటికి పంపించి, ఇతన్ని ఆసుపత్రికి తీసుకెళ్ళాడు ఇంకొంతమంది రిక్రూట్ కుర్రాళ్ళు వీళ్ళతోపాటు ఆసుపత్రికి వచ్చారు దెబ్బను చూస్తూ, 'ఎలా తగిలింది?' అన్నాడు డాక్టరు

ఆ కుర్రవాడు జరిగిన సంగతి చెప్పాడు అంతా విని, డాక్టరు, 'మంచిపని చేశాడు అలాటి వాళ్ళు లేకపోతే డిపార్టుమెంటు నాశనమైపోతుంది మీ పొగరు అణచాలంటే అలాటి వాళ్ళే కావాలి తేరగా తిని పందుల్లా బలుస్తున్నారు' అని, చిన్న కొబ్బరిపుల్లకు దూది చుట్టి, దాన్ని ఏదో ద్రవంతో ముంచి పన్నూడినచోట అద్దమని చెప్పి ఇచ్చాడు దాన్ని తీసుకొని మౌనంగా బయటకొచ్చారు

'ఇప్పుడయినా తెలుసుకున్నారా?' అన్నాడు గురవయ్య తమతోపాటు ఆసుపత్రికి వచ్చిన వాళ్ళను చూస్తూ ఆ మాట అర్థంకానట్లు చూశారు మిగతావాళ్ళు

'మాలా మాదిగల్నేకాదు అందర్నీ పశువుల్లాగానే చూస్తున్నారు వీళ్ళు ఇక్కడ వీళ్ళ దృష్టిలో మనమంతా పశువులమే'

'ఈ విషయం మనం ప్రిన్సిపాల్ దొరకి రిపోర్టు చెయ్యాలి' అన్నాడు ఒకతను

'ప్రిన్సిపాల్ ఆ ఏ యల్లై ని ఏం చేస్తాడంటా?' అనుమానం వెలిబుచ్చాడు ఇంకొక అతను

'ఎందుకు చెయ్యడు? ఆ రోజున మనం మన జిల్లా ఆఫీసుకాడ, మనోడు, చంద్రిగాడ్ని కొడితే, అట్టాకొట్టినందుకు మనోడిని ఉద్యోగంనుండి వూడబీకలా? అట్టాగే ఈ ఏ యల్లై గాడి నౌకరీకూడా వూడబీకుతారు' అన్నాడు ఒకతను ఆవేశంగా

'మనోడ్ని కొట్టే అక్కు ఆ ఏ యల్లై కి వుండే వుంటుంది లేకపోతే ఎందుకు కొడతాడు? మాలోడ్ని కొట్టే అక్కు మనకుండబట్టే ఆ రోజు మనోడు ఆ చంద్రంగోడిని కొట్టాడుకదా ఈ రోజు అట్టాంటి అక్కు లేకపోతే ఈడిని ఈ ఏ యల్లై ఎందుకు కొడతాడు?' అన్నాడు ఒకతను

ఆ మాటలకు మిగిలినవాళ్ళు అతనివైపు చూశారు 'మన తెలివి తేటలు ఇట్లాగుండబట్టే మన పళ్ళురిగినియ్యి ఇప్పుడు మాలోళ్ళి కొట్టే అక్కు మనకు లేదు మనల్ని కొట్టే అక్కు ఏ యల్లై కి లేదు' అన్నాడు ఒకతను

అప్పటివరకూ వాళ్ళ సంభాషణ వింటున్న గురవయ్య ఆ మాటలకు సంతోషించాడు 'ఇప్పటికైనా మాలామాదిగల్ని కొట్టకూడదనీ, అసలు ఒకళ్ళు ఇంకొకళ్ళని కొట్టే హక్కులేదని తెలుసుకున్నారు ఏదైనా అనుభవంలోకి వస్తేగాని బుర్రకు ఎక్కదు' అనుకున్నాడు

'ఏందీ! ఏం చెప్పవ్ ఏందీ? మనోడివి నువ్వు మనోడికి అన్యాయం జరిగితే సూత్తా వూరుకుంటామా? చెప్పు పైగా నువ్వు మా లీడర్ వి' అన్నాడు ఒక కుర్రవాడు గురవయ్యతో

గురవయ్య అటూ ఇటూ ఒకసారి చూచి చిన్నగా అన్నాడు వాళ్ళతో 'ఇది అన్యాయమే మనమిప్పుడు ప్రిన్సిపాల్‌కి రిపోర్టు చేస్తే, ఆయన ఆ ఏ యల్ ఐ కి ఏదో ఒక పనిష్మెంటు ఇవ్వవచ్చు అంతే కానీ వాడి వుద్యోగం మాత్రం వూడబీకడు అయితే ఈ విషయాన్ని మనసులో పెట్టుకొని ఈడు మనల్ని బాధపెడతాడు ఈడే కాదు ఈడితోపాటు సీ డీ ఐ, సీ యల్ ఐ మిగిలిన ఏ యల్ ఐ లు అంతా ఒకటౌ మన మీ ఆరునెలలూ ఈడి క్లాసులో వుండాల్సిందే 'లా' లో అందర్నీ తప్పిస్తాడు ఇంకో నెలపాటు ఇక్కడే వుంచినా ఉంచొచ్చు చూస్తున్నాంగా

మన పాత వాళ్ళని అధికారమంతా వాళ్ళ చేతుల్లో వుంది అయితే ధైర్యంచేసి రిపోర్టు ఇస్తే ఇలాటి దుర్మార్గాలు కొంతవరకు తగ్గుతాయి కాని ఈ ప్రిన్సిపాలు వాళ్ళ మాటలకే విలువిస్తే, వాడు చెప్పిన అబద్ధాలే నమ్మితే, ఈ డాక్టరులాగా మాట్లాడితే మన బ్రతుకు ఇంక కుక్కబతుకే అంతకుమించి నేను చెప్పేది ఏమీలేదు ఎవరికి వాళ్ళే తేల్చుకోండి' అన్నాడు

'ఛీ, దీనమ్మ అరిటాకు బతుకయ్యింది మనది' అన్నాడు ఒకతను ఉద్రేకంగా ఎవరూ ఏమీ మాట్లాడలేదు చిన్నగా కాళ్ళీడ్చుకుంటూ ఎవరి బాక్సుల దగ్గరకు వాళ్లు వెళ్ళారు అంతటితో ఆ సమస్య చప్పబడిపోయింది

ఆ విషయమంతా గుర్తుకొచ్చింది ప్రకాశానికి దీర్ఘంగా నిట్టూర్చాడు

ఇంతలో బెల్ మోత వినపడింది చిన్నగా బ్యారక్‌లకు చేరారు

ఆ రోజుతో ఆ నవల చదవటం పూర్తిచేశాడు ప్రకాశం చివరి పేజీలోని 'శుభం' అనే అక్షరాలు అతన్ని అభినందిస్తున్నట్లు కనిపించాయి తనలో తను చిన్నగా నవ్వుకున్నాడు గర్వంగా అతనికి ఎంతో ఆనందంగా వుంది తను ఇప్పుడు చదవగలడు, రాయగలడు అతని కీ ఉద్యోగం వచ్చినప్పుడుకూడా అంత సంతోషం కలగలేదు గట్టిగా గాలి పీల్చి వదిలాడు పుస్తకం పేజీలు టపటపలాడించాడు తలెత్తి చూశాడు అటూ ఇటూ తిరుగుతూ చాలామంది కన్పించారు 'వీళ్ళందరి కంటే నేను గొప్ప' అనుకున్నాడు కించిత్తు గర్వం అతని మనస్సులో చోటుచేసుకుంది గురవయ్య గుర్తొచ్చాడు అతనిపై ఎప్పటికన్నా ఎక్కువగా ఆరాధనా భావం కలిగింది ఆలోచనలు తను చదివిన కథవైపు కదిలాయి

అతని కర్థమయినంతవరకు ఆ కథలోని సారాంశం ఏమిటంటే, 'మంచీ చెడూ ఏదీ కూడా మనిషి చేతిలో లేదు చావు పుట్టుకలకు గానీ, కష్టనష్టాలకుగానీ, మంచి చెడ్డలకుగానీ మనిషి బాధ్యుడు కాడు ఈ కనపడే సర్వ సృష్టికి మూలవిరాట్టు ఒకడున్నాడు ఈ సమస్త ప్రపంచం ఆ మూలవిరాట్టు ఆజ్ఞ ప్రకారం నడుస్తోంది ఒకడు గొప్పవాడుగా వుండటానికీ, ఇంకొకడు తక్కువ కులంలో పుట్టటానికీ కారకులు వాళ్ళు కాదు ఇదంతా ఆ సృష్టికర్త లీల ప్రాణులన్నీ ఆయన చేసిన బొమ్మలు మనం నిమిత్త మాత్రులమే ఆయనని నమ్ముకుంటే లాభం వుంటుంది'

పుస్తకం పూర్తయినందుకు ఆనందం కలిగినా, పుస్తకంలోని విషయం నచ్చలేదు ప్రకాశంకు ఎందుకనో

గురవయ్య చాలా త్వరగా చదివేశాడు తరువాత దాన్ని తీసుకెళ్ళి సి యల్ ఐ భార్యకు ఇచ్చాడు ప్రకాశం ఆమె పుస్తకం వైపూ, అతనివైపూ చూచి, ''చివరికి కథ ఏమౌతుంది?'' అంది చిన్నగా నవ్వుతూ

చెప్పటానికి మొదట సిగ్గుపడ్డాడు తన కర్థమయినంత వరకు చెప్పాడు మాట్లాడుతుంటే మాటలు తడబడ్డాయి

''ఊఁ పూర్తిగా చదివేశావ్ వెరీగుడ్ ఇంకొక పుస్తకం ఏదన్నా ఇవ్వమంటావా?'' అడిగింది ఆమె ఇవ్వమన్నట్లు సంతోషంగా తల వూపాడు

''ఈ సారొక పిల్లల కథ ఇస్తాను ఇది చాలా బావుంటుంది పూర్తయిందాకా వదిలిపెట్టవు'' అంటూ బీరువాలోనుండి ఓ పుస్తకం తెచ్చిచ్చింది అది చాలా లావుగా వుంది ఆతృతగా దానిమీది పేరు చూశాడు ఆ పేరు వెంటనే చదవటానికి నోరు తిరగలేదు రెండు మూడుసార్లు గొణుక్కుని నాలుగోసారి పైకి చదివాడు చదివి ఆమె వైపు చూశాడు

''అది ఒక పిల్లవాడి పేరు ఆ పిల్లవాడు చేసిన చేష్టలన్నీ అందులో వుంటాయి ఇంగ్లీషు నవలని తెలుగులోకి అనువదించారు చాలా బాగుంటుంది'' అంది ఆమె

ఆమె చెప్పిన మాటలు విని, ''ఎల్తానమ్మా'' అని ఆమెకు నమస్కారించి బేరక్‌కు వచ్చాడు వస్తూ, తను 'ఎల్తానమ్మా' అని అన్న మాటను గుర్తుకు తెచ్చుకున్నాడు 'ఎల్తానమ్మా కాదు ఎల్లొస్తానమ్మా అనాలి ఇంకా బాగుండాలంటే వెళ్ళొస్తానమ్మా అనాలి బాసలో, కాదు కాదు, భాషలో మార్పు తెచ్చుకోవటం చాలా ముఖ్యం' అనుకున్నాడు తనలో తను గట్టిగా

బేరక్‌కు వచ్చి పుస్తకాన్ని గురవయ్యకు చూపించాడు

పుస్తకం ప్రారంభించినప్పుడు మొదట్లో కొంత అర్థం కాలేదు ఆ పేర్లూ అవీ కొత్తగా గమ్మత్తుగా వుండి, కొంత తికమక పెట్టాయి పది పేజీలు పట్టుదలగా పూర్తిచేసేసరికి బండి దారిన పడింది అందులోని బొమ్మలు కూడా చాలా నచ్చాయి అతనికి

ఇంతకు ముందు చదివిన పుస్తకం కన్నా ఇది చాలా పెద్దది అయినప్పటికీ చాలా త్వరగా పూర్తి చేశాడు ఆ కథలోవున్న గమ్మత్తేమిటోకానీ చివరిపేజీ పూర్తయిందాకా దాన్ని వదిలిపెట్ట బుద్ధికాలేదు

ఆ కథంతా నిజంగా జరిగిందో లేకపోతే అభూతకల్పనో, ఎటూ నిర్ణయించుకోలేక పోయాడు రాత్రిళ్ళు పొద్దుపోయిందాకా కోడిగుడ్డు లైటు వెలుగులో చదివేవాడు

తను చదివేశాక గురవయ్య కిచ్చాడు ఇద్దరూ మధ్యాహ్నం పూట అన్నాలు తిన్నాక, దూరంగావున్న మర్రిచెట్టు కింద, పచ్చికలో కూచుని, ఆ పుస్తకంలోని విషయాల గురించి చర్చించుకునేవారు గురవయ్య చదువుతుంటే ప్రకాశం వింటుండేవాడు దీక్షగా గురవయ్య చదివే తీరు బాగుండేది అర్థయుక్తంగా చదివేవాడు ఉచ్చారణ స్పష్టంగా వుండేది అతనిలాగా తనూ ఉచ్చరించాలని ఆశపడ్డాడు వెంటనే ఆచరణలోకి అడుగుపెట్టాడు పట్టుదలగా

ఆ పుస్తకమంతా పిల్లల గురించే ఆ నవలలోని పిల్లలు రకరకాల పనులూ, సాహసాలూ చేస్తుంటారు చీకూచింతా లేకుండా తిరుగుతారు గొప్ప సాహసాలు చేస్తూ చేస్తూ అంతులేని నిధినిక్షేపాలను కనుగొంటారు దాంతో వాళ్ళంతో ధనవంతులయిపోతారు

ఇంగ్లీషు భాషలోంచి తెలుగులోకి ట్రాన్స్‌లేట్ చేసినాయన చాలా బాగా చేశాడు పేర్లూ, ప్రాంతాలూ ఇంగ్లీషు వాళ్ళవే అయినా అచ్చం తెలుగు నవలంత చక్కగా, సాఫీగా సాగింది అనువాదం

''నిజంగా పిల్లలు అటువంటి పనులు చెయ్యటానికి ఈలవుతుందా?'' అడిగాడు ప్రకాశం అనుమానంగా గురవయ్యని

'కాద'న్నట్టు తలవూపాడు గురవయ్య ''అయినా అట్లాంటివి ఆ దేశంలోని పిల్లలు చేసినా ఆశ్చర్యపోవలసిన పనేమీలేదు మనకీ ఆ దేశపు పిల్లలకీ తేడా వుంది ఇది అమెరికాలోని పిల్లల్ని గురించి రాసిన నవల మన జీవితాలకూ వాళ్ళ జీవితాలకూ తేడా వుంది'' అన్నాడు గురవయ్య

''యేంది ఊహు ఏమిటీ ఆ తేడా?'' అడిగాడు ప్రకాశం తన ఉచ్చారణా దోషాన్ని సిగ్గు పడకుండా సరిచేసుకుంటూ

''వాళ్ళది సంపన్నమయిన దేశం అక్కడ వాళ్ళంతా కష్టపడి పనిచేస్తారు వాళ్ళకక్కడ ఎవ్వరికీ తిండికీ, గుడ్డకు కొరత ఉండదు'' అన్నాడు గురవయ్య

''మరి మన దేశం?''

''మం... దేశమా? మనది కూడా మంచిదేశమేకానీ, ఇక్కడ కష్టపడే వాళ్ళు తక్కువను

కుంటా '' అని సగంలో మాట ఆపి, తన సమాధానం తనకే నచ్చనట్లు మాట మార్చాడు ''ఎక్కడయినా కష్టపడేవాడికి దేనికీ కొరత ఉండదు'' అన్నాడు

ఆ సమాధానం విని అనుమానంగా చూశాడు ప్రకాశం తరువాత ఏదో గుర్తు వచ్చినట్లు, ''ఆడకూడా రకరకాల కులాలున్నయ్యా ?'' అన్నాడు

''లెవ్వక్కడ అక్కడ కులాలు లెవ్వు'' అన్నాడు గురవయ్య ప్రకాశం ఆశ్చర్యంగా చూశాడు ఆమాట విని

తరువాత ఆ సంభాషణ చాలాసేపు నడిచింది

రాత్రి భోజనాలు చేసి పడుకున్నాక ఆ నవలలోని విషయాల్ని గురించి ఆలోచించాడు ప్రకాశం ఆ నవలలోని పిల్లల జీవితాలకూ, ఇక్కడి పల్లెల్లోని పిల్లల జీవితాలకు తేడా కొట్టొచ్చినట్టు కనపడింది 'ఆ మాటకొత్తే ఆసాముల పిల్లలకీ, మాకూ అసలు పోలికేడుంది?' అనుకున్నాడు ఆలోచనలు బాల్యంవైపు తొంగిచూశాయి

అతనికి జ్ఞానం వచ్చింతర్వాత తెలిసింది జ్ఞానం రాకముందటి బాల్యం గురించి పల్లెలో తల్లి అయిన ఆడదానికి ఆ ఆనందం అట్టేకాలం వుండదు ఆమాటకొస్తే పల్లెలో ఎవరికీ జీవితం ఆనందంగా గడవదు పూట గడవని బ్రతుకుల్లో సంతోషం ఎక్కడ నుండి వస్తుంది ? తరతరాలు తిన్నా తరగని ఆస్తులున్న ఆసాములకి బ్రతుకంతా ఆనందమే

తల్లి కడుపులోనుండి ప్రాణంతో బయటపడ్డ దగ్గర నుండీ, ఆపల్లె ప్రాణికి జీవితం ఎంత దుర్భరంగా సాగిపోయేదీ ప్రకాశం గమనించాడు అంతకన్నా మిన్నగా తన బాల్యం మాత్రం ఎందుకు సాగివుంటుంది? పల్లెలో బాలింత, పట్టుమని పదిరోజులుపాటు, ప్రసవించినాక ఇంటి దగ్గర వుండే వీలేలేదు నాలుగురోజులపాటు ఆమెని ఇంటిదగ్గరేవుంచి రెండుపూటలా ఆమెకింత తిండి పెట్టగలిగితే అదెంతో గొప్ప సంగతి కేవలం మగవాడి సంపాదనతో ఇల్లు జరిగే పరిస్థితి అతనికి తెలిసినంత వరకూ ఏ పల్లెలోనూ కనపడలా ఏడెనిమిదేళ్ళు నిండిన పిల్లాడితో సహా ఇంటిల్లపాదీ పనికి పోతేనే అందరి కడుపులూ నిండటం అంతంతమాత్రం అలాటి పరిస్థితుల్లో పుట్టిన బిడ్డకోసంగానీ, బాలింత విశ్రాంతి కోసంగానీ, ఇంటిదగ్గర వుండే అవకాశమే లేదు కుటుంబంలోని ఏ మనిషి పనికి పోకపోతే ఆ మనిషికి తిండిలేనట్లే ఇంటి మగమనిషి ఆసామి దగ్గర ఎంత వళ్ళు విరుచుకొని పనిచేసినా, ఆ ఆసామి కొలిచిన గింజలు ఒక్క మనిషికి రెండుపూటలా సరిపోవు అలాటప్పుడు బాలింతగానీ, పండుముసలిగానీ పనికి పోకపోతే తిండేది?

అడుగు వేయలేనంత నీరసంతో వున్నా, వున్న ఓపికనంతా కూడ దీసుకొని పనికి పోవాల్సిందే పనిచేసేచోట ఏ తుమ్మ చెట్టుకో, ముళ్ళ చెట్టుకో పాత పంచె కట్టి, ఆ వుయ్యాల్లో పసిగుడ్డుని పడుకోబెట్టి పనిలో వంగితే, మధ్యాహ్నం అన్నం వేళ వరకూ ఆ వుయ్యాలవైపు తలతిప్పి చూడటానికి వీలులేదు ఆ తల్లికి ఆకలికీ, ఎండపోడకీ ఆ పసికందు గుక్కపెట్టి ఏడ్చీ, ఏడ్చీ అలిసి అలా నిదురపోవాల్సిందే బిడ్డ ఏడుపు విని చేసేపని వదిలి బిడ్డ దగ్గరి కెళితే ఆసామి వూరుకోడు హృదయవిదారకంగా వినిపించే బిడ్డ ఏడుపుకి, అచ్చాదన అంతగాలేని తల్లి రొమ్ముల్లో పాలు వుబికి బొట్లు బొట్లుగా కారి ఆసామి పొలంలో పడుతూవుంటే, బాధతో కన్నీరు కార్చటం మినహా ఆ తల్లులు చేయగలిగింది ఏమీలేదు ఇటువంటి సమస్యకు పరిష్కారంగా పుట్టిన నెల రోజులకే, బిడ్డ గొంతులో ఇంత నల్లమందు వేసి పడుకోబెడితే ఏ సాయంత్రానికో మత్తుగా కళ్ళు తెరుస్తాడు తన పనికి ఆటంకం లేకుండా వుండేందుకుగాను ఆసామే పట్నం నుండి నల్లమందు

తెప్పించి 'ఉచితంగా' ఇస్తాడు కనీస పోషకాహారం లేకపోగా, నల్లమందుతో పెరిగిన ఆ బిడ్డల శరీరాలు సహజంగానే ఎంతో బలహీనంగా తయారవుతాయి

సజ్జ సంగటో జొన్న సంగటో పెట్టి, పనులకు పోలేక కాటికి కాళ్ళు చాచుకున్న ముసలోళ్ళతోపాటు ఈ ఎడ పిల్లల్ని ఇంటి దగ్గర వదిలిపెట్టి పనుల కెళతారు పెద్దవాళ్ళు ఆ పిల్లలకు ఆకలయినప్పుడు, ఆ ముసలోళ్ళు చిన్నగా లేచి, ఉట్టిమీద పెట్టిన గిన్నెలోంచి, రాత్రి వండిన సంగటి కాస్త మట్టి మూకుడులో వేసి, రెండు ముద్దలు పెడితే ఏడుపు కొంచెం సద్దు మణిగేది ఆకలితోపాటు

తల్లిదండ్రులు పని నుండి తిరిగొచ్చేసరికి, దువ్వలో పొర్లాడి, దొడ్డికి కూర్చుని, అలాగే వుండిపోయేవాళ్ళు ఓపికలేని ముసలాళ్ళు ఈ బిడ్డల గురించి పట్టించుకోలేరు రాత్రి బాగా పొద్దుపోయినాక, ఆసామి కొలిచిన ముడి గింజలు తెచ్చుకొని వాటిని బాగుచేసుకొని పొయ్యిమీద పడేసి, అప్పుడు బిడ్డల కోసం ఆలోచిస్తారు కటికనేలమీద పడి నిద్రపోయే కూనల్ని లేపి, చెంబుడు నీళ్ళతో వళ్ళు కడిగి, నిద్రకు తూలుతున్న వాళ్ళను కసురుకుంటూనో, బతిమాలుతూనో, వండిన ఆ సంగటి రెండు ముద్దలు తినిపించి, ఇన్ని నీళ్ళు తాపి, నిద్ర పుచ్చితే, తిరిగి వాళ్ళు తెల్లారి నిద్ర లేచేసరికి పెద్దవాళ్ళు పనులకెళ్ళిపోతారు సంవత్సరం మొత్తం మీదా ఒక రోజో, అర రోజో పనికి పోకుండా ఇంటి దగ్గరుండే అవకాశం వస్తే ఆరోజు వాళ్ళకి పండగ అప్పుడే పల్లెలోని ప్రతి తల్లికీ తన బిడ్డను తనివితీరా ఎత్తుకోవటానికీ, ముద్దాడటానికి వీలయ్యేది ఆ ఒక్క రోజుతోనే బిడ్డ ఎంతో చేరువయ్యిపోయేది తల్లికి మర్రోజు నిద్ర లేచేసరికి అమ్మ కనపడకపోయేసరికి బిడ్డ తల్లడిల్లిపోయేది అదే వేదన అక్కడ ఆసామి దగ్గర పనిచేస్తూ తల్లి అనుభవించేది తరతరాలనుండి పల్లె బ్రతుకుల్లో ఇలాటి సంఘటనలు సర్వసాధారణమై పోయాయి

కానీ అదంతా తమ ఖర్మ అనే, తమ బ్రతుకులు ఇంతే అనే, బాధపడి ప్రయోజనం లేదనే, నిరాశామయ నమ్మకాలతో రోజులూ, నెలలూ, సంవత్సరాలూ, తరాలూ గడిచిపోతాయి

అలా పెరిగిన బిడ్డ నాలుగయిదేళ్ళు వచ్చేసరికి గుడిసెని కాసుకొని వుండటం, దొడ్లవెంటా, తోపుల్లో, డొంకల్లో తిరిగి పొయ్యిలోకి పుల్లలు ఏరుకు రావటం, తమకన్నా చిన్న వాళ్ళని ఆడిస్తూ పొద్దు గుంకిందాకా తల్లిదండ్రుల కోసం ఎదురుచూడటంతో ఆ వయస్సు అలా గడిచిపోతుంది

పల్లెల్లో నలుగురు పిల్లలు కలిసి కేరింతలు కొడుతూ ఆడుకోవటం బహు అరుదయిన సంఘటన ఆడుకోవటానికి కావలసిన సత్తువ వున్న వాళ్ళు కూడా అంతంత మాత్రమే లెఖ్ఖ పెట్టటానికి వీలయినంత స్పష్టంగా వాళ్ళ శరీరాల్లోని ఎముకలు పలుచటి చర్మం క్రింద కనపడుతుంటయ్ లోపలకు పీక్కుపోయి, మసిబారిన గాజు పెంకుల్లా వెలవెల బోతూ ఎటో సూన్యంలోకి చూస్తున్నట్లుంటాయి వాళ్ళ కనుగుడ్లు చింపిరి జుట్టుతో, పుల్లల్లాంటి కాళ్ళతో, పూచిక పుల్లల్లాంటి చేతులతో, గుడిసెకొకళ్ళూ ఇద్దరు చొప్పున దిష్టిబొమ్మల్లాగా నిలబడో, ఆ దుమ్ములో చతికిలబడో వుంటారు ఏడెనిమిది సంవత్సరాల వయస్సు వచ్చిందాకా ఆడపిల్లలకు సైతం మొలచుట్టూ కనీసం గోచిపాత కూడా ఉండదు పెద్దపెద్ద పొట్టలూ, చీమిడితో అలికి అట్టలు కట్టిన ముక్కులూ, ఈగలు ముసిరే శరీరాలూ, గుడిసెల చుట్టూ తిరిగే పందులు, దొంగతిండి కోసం గుడిసె గుడిసెకూ పరిగెత్తే కుక్కలూ పల్లెల్లో సర్వసామాన్యంగా కనపడే దృశ్యాలు

వాళ్ళకుతోడు గుడిసె కొకళ్ళ చొప్పున నలభయేళ్ళ వయసుకే శరీరంలోని సత్తువ వుడిగిపోయి,

పళ్ళూడిపోయి, కంటిచూపు తగ్గి, వ్యాధిగ్రస్తులై, వెంట్రుక లూడిపోయి, రేపో మాపో అన్నట్లు, కటిక నేలమీద సజ్జ చొప్ప పరుచుకొనో, ఈత చాప మీద నడుం వాల్చి, బాధగా అటూ ఇటూ దొర్లుతూ, మృత్యువు కోసం ఎదురుచూస్తూ, గతించిన చేదుబ్రతుకు లోని చెదురుమదురు తీపి స్మృతుల కోసం తడుముకుంటూ, అనారోగ్య కారణంగా కలిగిన మతిమరుపు వల్ల ఏమీ గుర్తురాక, దగ్గుతూ, మూల్గుతూ, కాండ్రించి పక్కనే వూసుకుంటూ, తమతోపాటు ఆ గుడిసెలో చిన్నగా అటూ ఇటూ తిరుగుతున్న నాల్గైదేళ్ళ దిష్టి బొమ్మల్ని చూస్తూ, 'ఈ బతుకు లింతే' అని గొణుక్కుంటూ నీరసంగా కళ్ళు మూసుకొని పడుకునుంటారు అకాల వార్ధక్యం వచ్చిన వృద్ధులు వాళ్ళెంతగానో ప్రయత్నించే జ్ఞాపకాల్లో గతం అప్పుడప్పుడూ తొంగిచూస్తుంది మసకగా

వర్తమానంలోకి వస్తే వాళ్ళతోపాటు పెరిగిన, వాళ్ళ వయస్సే కలిగిన ఆసాముల కుర్రాళ్ళు ఇంకా సుబ్బరంగా తిరుగుతున్నారు 'ఆల్లెందు కుండరూ? పాడీ, పంటా వోరి సేతిలో వుంటే ఆల్లు బాగానే వుంటారు' అని గొణుక్కుంటారు ఆసాముల కుర్రోళ్ళు గుర్తొచ్చినప్పుడల్లా వీళ్ళు

అలా సాగుతున్న ప్రకాశం ఆలోచనలు తెగటం లేదు నిద్రరావటం లేదు ఒత్తిగిల్లి పడుకున్నాడు మళ్ళీ పల్లె బ్రతుకు కళ్ళముందు కదిలాడింది

పల్లెలోని వాళ్ళకు మాత్రం నలభై ఏళ్ళ వయస్సు రావటమే గొప్ప విషయంగా, అదృష్టంగా భావిస్తారు అప్పటికే వాళ్ళకు నూరేళ్ళు నిండిపోతాయి పుట్టిన తరువాత అయిదేళ్ళ వయస్సు వచ్చేవరకు బతికే పిల్లలు పల్లెల్లో చాలా తక్కువమంది అట్లా తట్టుకొని నిలబడినవాళ్ళు గండం గడిచి బతికి బయటపడ్డవాళ్ళకింద లెఖ్ఖే ఎనిమిదేళ్ళు నిండేసరికి ఏ ఆసామి దగ్గరో గొడ్లు కాయటానికో, ఇంట్లో పాచి పనులు చేయటానికో కుదురుతారు అట్లా కొన్ని సంవత్సరాలు గడిచిపోతాయి వ్యవసాయపు పనులు నేర్చుకోవటం అయిపోతుంది ఇక పాలేరుగా బ్రతుకు ఆరంభమవుతుంది లేకపోతే కూలీనాలీ చేసుకొని తన పొట్ట తను నింపుకోవటం జరుగుతుంది యుక్తవయస్సు వచ్చిందనుకున్నప్పుడు పెళ్ళి, పిల్లల్నికనటం, నలభై ఏళ్ళలోపే బతుకు ముగించటం ఇదీ క్లుప్తంగా పల్లె జీవితం ఈ బతుకుల్లో ప్రతిక్షణం తిండిగింజల కొరకు చేసే ఆలోచనే తప్ప ఇంకో ఆలోచనకు చోటుండదు ఏపూట కాపూట జానెడుపొట్టని నింపడం కోసం శరీరంలోని శక్తినంతా కూడగట్టుకొని పోరాడాలి తిండి కోసం చేసేపోరాటంతోనే రోజులూ, వారాలూ, నెలలూ, సంవత్సరాలు గడిచిపోతాయి, జీవితాలు ముగిసిపోతాయి ఇలాటి బ్రతుకులకీ, ఆ నవలలోని పిల్లల బ్రతుకులకీ సంబంధం ఎక్కడుంది అసలు ? ఏ విషయంలో పోలికుంది ?

ఆలోచనలతో ఎప్పటికో నిద్రలోకి జారిపోయాడు ప్రకాశం తెల్లవారింది నిరాసక్తితో నిండిన ట్రైనింగు రోజు మొదలయ్యింది మళ్ళీ అక్కడ ఒక్కరోజు గడవటమే దుర్భరంగా వుంది

అలా ట్రైనింగు స్కూల్లో రోజులు భారంగా కదిలిపోతున్నాయి అప్పటికి ట్రైనింగు స్కూలుకొచ్చి మూడు నెలలు పూర్తి కావచ్చాయి ఈ మూడునెలల కాలం వాళ్ళ జీవితాల్లో చాలా మార్పులు తెచ్చింది ముఖ్యంగా ప్రకాశం ఆలోచనల్లో ఎన్నో మార్పులూ, చేర్పులూ చోటు చేసుకున్నాయి ఆ మార్పుల్ని అతను చాలా జాగ్రత్తగా గమనిస్తున్నాడు

ఆరోజు గురవయ్య చెపుతుంటే సెలవు చీటీ రాసి క్రింద సంతకం చేశాడు ప్రకాశం దాన్ని చూస్తుంటే గర్వం కలుగుతోంది వెళ్ళి ఆరెస్సైకి కనపడి సెలవు తీసుకున్నాడు గురవయ్యతో

కలిసి టౌనులోకి వెళ్ళాడు తల్లికీ, భార్యకూ చెరొక జత చీరలూ వాటితోపాటు రవికగుడ్డలూ కొన్నాడు మరుసటిరోజు ఉదయం బండికి ఇంటికి బయలు దేరాడు ఎంతో ఆనందంగా వుంది టిక్కెట్టుకొని బండెక్కి సీటు మీద కూర్చున్నా గుండె పీచుపీచు మంటూనేవుంది 'అలా ఎందుకు భయం కలుగుతోందో' అని తనకు తను ఎన్నోసార్లు తర్కించుకున్నాడు ధైర్యాన్ని కూడగట్టుకోవటానికి ప్రయత్నించాడు రకరకాల ఆలోచనలు అతనిలో చోటు చేసు కుంటున్నాయి

బండి ఆగిన ప్రతి స్టేషనులోనూ ఆ వూరి పేరు రాసివున్న బోర్డులు చదివేవాడు బండి ఎక్కి దిగేవాళ్ళని పరిశీలనగా చూసేవాడు అక్కడక్కడ కొన్ని స్టేషన్లలో ఎక్కిన కొంతమంది, కిందనో లేకపోతే తలుపు దగ్గర నిలబడో స్టేషను రాగానే గబుక్కున దిగిపోయేవారు వాళ్ళ ప్రవర్తన చూచీ, భయం నిండిన వాళ్ల చూపులు చూచీ, ఒదిగి ఒదిగి కూర్చునే వాళ్ళ తీరు చూచి వాళ్ళు అంటరానివాళ్ళేమో అనుకునేవాడు వాళ్ళతో తనని పోల్చుకొని, తనలో ఎంత తేడా వచ్చిందో అంచనా వేయటానికి ప్రయత్నించేవాడు మూడు బండ్లు మారి వినుకొండ చేరాడు ప్రకాశం అప్పటికి పొద్దు గుంకింది బాగా

'ఇంక గట్టిగా నడిస్తే గంటన్నర మావూరు కొండ్రముట్లపాలెం' అనుకున్నాడు ఆకలేస్తోంది అయినా దాన్ని గురించి అంతగా పట్టించుకోలేదు మూడునెలల క్రితం జిల్లా ఆఫీసు దగ్గర ఆకలికి తట్టుకోలేక నాలుగిళ్ళకు వెళ్ళి అడుక్కుతిన్న సంఘటన గుర్తు వచ్చింది తనలో తను నవ్వుకున్నాడు మిరాయికొట్టు దగ్గరకెళ్ళి రకరకాల మిరాయిలు కొన్నాడు దారిలో తినటానికి తనకోసం ఓ సోలెడు సెనగపప్పు కొనుక్కున్నాడు నడక సాగించాడు తాలూకా కచ్చేరీ మీదగా కొండ్రముట్ల పాలెం పోయే బాటలోకి వచ్చాడు గతం ఎందుకో తరచూ గుర్తుకొస్తూ వుంది ప్రయాణంలో కనపడిన రకరకాల వూళ్ళనీ, మనుషుల్నీ గుర్తు చేసుకున్నాడు ఎందుకో శనగపప్పు తినబుద్ధి కాలేదు ఒకళ్ళతో పని లేకుండా తనొక్కడే ప్రయాణం చేసి వచ్చాడు ఎంతోదూరం చేతిలోని సంచి బరువనిపిస్తే చెయ్యి మార్చుకున్నాడు ఊరు దగ్గరపడుతున్న కొద్దీ ఎవరన్నా తెలిసినవాళ్ళు కనపడతారేమోనని చూస్తున్నాడు ఎంతో ఉద్వేగంతో నిండిపోయింది అతని మనస్సు తెలిసిన వాళ్ళెవరూ తారసపడలేదు 'అమ్మ ఎట్లా వుందో ? అదెట్లా వుందో' అనుకున్నాడు 'నే నెళ్లినాక వూళ్లోని ఇశేషాలు ఏమిటో' అనుకుంటూ వూరిని సమీపించాడు పల్లెలోకి వెళ్ళే చీలిక బాట దగ్గరకొచ్చాడు పరిచయమైన వాతావరణం ఎదురయ్యింది దూరంగా వూళ్ళో కుక్కల అరుపులు, మనుషుల మాటలు వినపడుతున్నయ్ పొలాల్నుండి తిరిగొచ్చే బుడ్డోడు ఒకడు పౌరాణిక నాటకాలలోని పద్యాలు పాడుతున్నాడు బిగ్గరగా మాదిగ పల్లె కిరువైపులా పశువుల కళేబరాలు పడేసివున్నయ్ మామూలుగానే ఆ వాసనకు ముక్కులు మూసుకున్నాడు అనాలోచితంగా తనలో వచ్చిన ఈ మార్పుకు తనే ఆశ్చర్యపోయాడు

పల్లెలోకి ప్రవేశించాడు వంటిమీద గుడ్డల్లేని పిల్లలు, పడిపోయిన మొండి గోడలు, కప్పుల్లేనిగుడిసెలు అంతా అలవాటయిన వాతావరణం అంత ఆనందంలోనూ చిన్నగా నిట్టూర్చాడు బాధగా వెన్నెల కాస్తోంది అక్కడక్కడా గుడిసెల్లోంచి చిక్కటి తెల్లటి పొగ సుడులు తిరుగుతూ పైకి పోతోంది పిల్లల ఆకలి ఏడుపులూ, తల్లుల విసుగు కేకలూ గుడిసెల్లోంచి వినపడుతున్నయ్

తెల్లటి పంచె, బారుచేతుల చొక్కా, భుజం మీద సిల్కు పైపంచె, చేతిలో పెద్ద సంచీ, కాళ్ళకు

టకటకలాడే కంపెనీ చెప్పులూ, నున్నగా చేసిన గడ్డం, సమ్మర్ క్రాఫ్ 'ఎవరో పొరుగూరి పెద ఆసామి' అనుకుంటూ ఒదిగి ఒదిగి పక్కకు తప్పుకుంటూ దారి ఇస్తున్నారు ఎదురయిన వాళ్ళంతా

మారిపోయిన వేషంతోపాటు మసక చీకటి మూలంగా ప్రకాశాన్నెవరూ గుర్తు పట్టలేదు మొత్తల కానుకొని చుట్టపీకలు కాలుస్తున్న వాళ్ళు అతన్ని చూచి లేచి నిలబడుతున్నారు అలా తనని చూచి ఒదిగొదిగి నిలబడుతున్న వాళ్ళని చూచి, నవ్వుకున్నాడు తెలిసినవాళ్ళు కనపడ్డారు 'కాని ముందు ఇంటికెళ్ళాలి' అనుకున్నాడు

గొంది మలుపు తిరిగేసరికి గుడిశ కనపడింది తల్లీ, భార్యా జొన్నలు కాబోలు దంచు కుంటున్నారు అంతదూరం నుండే ''అమ్మా'' అంటూ కేకేశాడు కేకతో పాటు పరుగులాంటి నడకతో రోలు దగ్గరకు చేరుకున్నాడు వాళ్ళు అతని పిలుపువిని రోకళ్ళు కిందపెట్టి ఇటు తిరిగేసరికి అతను వాళ్ళను సమీపించాడు రెండే రెండు క్షణాలు ఒకళ్ళ నొకళ్ళుచూసుకున్నారు తల్లి చటుక్కున ముందుకు వచ్చి కొడుకు భుజం మీద చెయ్యి వేసింది

''అయ్యా! అయ్యా! పెకాచవా '' అంతకుమించి ఆమెకు గొంతు పెగల్లేదు మసక వెలుగులో ఆమె కళ్ళల్లో నీళ్ళు మందంగా మెరిశాయి వళ్ళంతా అలికినట్లు తడిమింది ఆమె చేతులు వెచ్చగా వున్నయ్ చిన్నగా వణుకుతున్నయ్ ఆ పిలుపులో ప్రేమా, ఆ చేతి స్పర్శలో వాత్సల్యం అతనికి కొట్టొచ్చినట్లు కనపడ్డాయి ఆనందంతో కళ్ళు చెమర్చాయి కొద్దిసేపు ఏమి మాట్లాడలేకపోయాడు

రెండు నిముషాలు తరువాత తల్లే అంది ''అయ్యా! ఎంత చిక్కిపోయావురా''

ఆ మాటకు చిన్నగా నవ్వాడు అలాగే గుడ్లప్పగించి చూస్తున్న భార్యతో, ''ఏందే పిచ్చి మొకమా అట్టా సూత్తావ్! ఇదిగో'' అని చేతిలోని సంచి అందించాడు ఆమె రెండు చేతుల్తో సంచి అందుకుంది భారంగా తీసికెళ్ళి గుడిసెలో పెట్టొచ్చింది

వేపచెట్టు కింద వాల్చివున్న కుక్కి మంచంమీద కూర్చున్నాడు ప్రకాశం అతని పక్కనే తల్లి కూర్చుంది

ప్రకాశం వచ్చిన వార్త పల్లెంతా నిముషాల్లో పాకిపోయింది చాలామంది వచ్చారు చూసిపోవటానికి మంచం చుట్టూ పిల్లలు గుమికూడారు వెంకటేశం తల్లీ, తండ్రీ, భార్యా వచ్చారు అన్ని విషయాలూ వివరంగా చెప్పాడు అతను మాట్లాడుతుంటే నోళ్ళు తెరిచి వింటూ వుండిపోయారు అంతా రామయ్య తాత కర్రపోటు వేసుకుంటూ వచ్చి ప్రకాశం పక్కన కూర్చున్నాడు బొంగుల పాత మంచం కిర్రుమంది.

''అయ్యా పెకాచం .'' వణికే చేతుల్తో ప్రకాశం వంటిని తడిమాడు ఆ ముసలాయన ఆనందం చూచి ప్రకాశం చలించిపోయాడు

''ఒరే అయ్యా! ఈ గడ్డ పుట్టినాక సరకారోరి నౌకరీకి పోయినోల్లు మీ యిద్దరేరయ్యా పోనీలే ఆ నారాయణ మూరితి సామి దయతో మీకన్నా కడుపునిండా యింత గంజి దొరికితే అంతేసాలు అదే పదియేలు మా కాలం అయిపోయింది ఇంగ మా బతుకుల్లో ఏముంది? మీ తరమన్నా కొత్త ఆనందంగా, యాలకింత తింటానికి దొరికితే అదే చంతోసం మనకు మనులొద్దూ మాన్యాలొద్దు బువ్వకు కరువు రాకుండా వుంటే సాలు '' అన్నాడు రామయ్య తాత ప్రకాశం ఏం మాట్లాడలేదు ఆ మాటలకు మనస్సు కరిగిపోయింది

''అయ్యా ! మా యంకటేచం రాలేదేయ్యా?'' అడిగాడు వెంకటేశం తండ్రి

''వాడు వచ్చే నెల్లో వత్తాడు మామా అందరికీ ఒకేసారి సెలవియ్యరు'' అన్నాడు ప్రకాశం

''అయ్యా నీ బాసలో శానా తేడా వచ్చిందిరా ఆసాముల్ని మించి మాట్టాడతన్నావు యట్టాగయినా సరకారోల్ల నౌకరీలోకి పోతే అంతేగా మరి'' అన్నాడు ఆయనే

''ఒక్క బాచేందహె మడిసిలో, కట్టులో, నడకలో అసలు అన్నిటిలోనూ నే నచలు ముందు గుర్తే పట్టలా '' అన్నాడు ప్రకాశం ఈడతను ఒకతను

ఆ మాటకు ప్రకాశం నవ్వాడు

''అయ్యా, నువు పోయినాక అమ్మా, నీ పెల్లాం శానా కట్టాలు పడ్డా(రా మీ ఆసామొచ్చి రోజా గొడవచేసి పోయేవాడు నీకాడనుండి ఉత్తరమొచ్చింది దానిలో ఇసయాలు వూల్లో అందరికీ తెలిసిపోయినియ్యి ఆడింక నోరెత్తలేదు తరవాత'' అన్నాడు వెంకటేశం తండ్రి

ప్రకాశం చిన్నగా నవ్వి వూరుకున్నాడు

అలా చాలాసేపు ఎన్నో విషయాలు ముచ్చటించుకున్నారు

''యింతకీ మానిక్కమ్మ అదృట్టవంతురాలు'' అంది ఒకామె ప్రకాశం భార్యవైపు చూస్తూ

''సరే అయ్యా! ఒక ముద్ద తిను నీల్లు పోసుకొని దూరాబారం పెయానం మనం రేపంతా మాట్టాడుకోవచ్చు మీరంతా పదండే ఆడిని కాసింత గాలి పీలుసుకోనీండి'' అంది వెంకటేశం తల్లి

అంతా చిన్నగా కదిలారు

మంచం తీసుకెళ్ళి గుడిసెలో వేసింది ప్రకాశం భార్య మాణిక్యమ్మ వెళ్ళి లోపల కూర్చున్నాడు ఆముదపు ప్రమిద వెలుగులో తల్లిని చూశాడు బాగా నీరసించి కనపడింది ఆమెనలా చూస్తుంటే కడుపుతరుక్కుపోయింది భార్యకూడా బాగా చిక్కిపోయింది బాధగా నిట్టూర్చాడు గుడిసెని కలియజూశాడు పైకప్పు లేచిపోయింది చాలావరకు

''లేసి కాల్లు కడుక్కో'' అంది మట్టిముంతతో నీళ్ళందిస్తూ భార్య

ఆ నీళ్ళతో కాళ్ళూ, ముఖం కడుక్కుని వచ్చాడు మట్టి కుండలో నీళ్ళు పోసి పొయ్యిమీద పెట్టి చితుకులు ముట్టించింది తల్లి, కొడుకు కోసం

''మరీ యిట్టా పీనిగిల్లాగా అయిపోయారేందే'' అన్నాడు బాధగా

''ఇంకా నయం కదయ్యా! నిన్ను సూట్టానికి పేనాలతోనన్నా వున్నాం నువ్వు సెప్పా పెట్టకుండా పోయావా, ఆసామి మేం చేసిన పనికి కూడా గింజలు కొలవలేదు నువ్వట్టా మద్దెలో ఎగ్గొట్టిపోయినందుకు ఆయన శానా నట్ట పోయాడంట ఆ డేయేయో అన్నాడు గింజలు కొలవలేదు ఇంకోపని కేడకన్నా పోదావంటే పనులులేని రోజులయ్యే మూడు రోజుల కొకపూటన్నా తిండి దొరకలా దానికితోడు నీ దిగులు ఒకటి నీకాడనుండి ఉత్తరం వొచ్చినాక కొత్త మనుసులమయ్యాం ఇది యాడవని రోజు లేదు'' అంది తల్లి కోడలివైపు చూస్తూ మళ్ళీ ఏదో గుర్తొచ్చినట్లు చూచి, ''అమ్మా, రోట్లో జొన్నలున్నయ్యే కుక్కలు మూతి పెడతయ్యేమో పోయి తోడుకురా'' అంది

మాణిక్యమ్మ బయటకెళ్ళి జొన్నలు కడుక్కుని వచ్చింది

జరిగిన విషయాలు పూసగుచ్చినట్లు చెప్పాడు వాళ్ళకు మాట్లాడుతూనే జొన్న సంగటి వం చేసింది తల్లి ''ఇంక మనకి బువ్వగింజలకు దిగుల్లేదు ఇంకో మూడు నెలలు ఆగితే ఆయిగా

బతుకుతాం'' అన్నాడు అతని మాటలకు వాళ్ళిద్దరూ ఎంతో సంతోషించారు గొప్ప పెన్నిధి దొరికినంత సంబరపడ్డారు

''నాయినా! మన కంతకంటే ఏం గావాలి బూగింజలకు దిగుల్లేకపోతే సాలు'' అంది తల్లి ''లే నీళ్ళు పోసుకో, బూ తిందువుగాని'' అంది ఆమే మళ్ళీ

ప్రకాశం వెళ్ళి స్నానం చేసొచ్చాడు చాలా రోజుల తరువాత తిరిగి వేడినీళ్ళ స్నానం భార్య వచ్చి వీపు రుద్దింది

''పంచా, సొక్కా వోరిచ్చారు? నౌకరీకి పోతే ఇత్తారా?'' అంది భార్య ఆ మాటకు ప్రకాశం నవ్వాడు

''నౌకర్లో పంచా, సొక్కా ఇయ్యరు డెస్సిత్తారు కాకి డెస్సు ఇయ్యి నేను కొనుక్కున్నాయే జీతం డబ్బుల్తో'' అన్నాడు ఆమె కెక్కువ అర్థం కాలేదు ఆ మాటలు

అన్నం తినటానికి గోడకానుకుని కూర్చున్నాడు జొన్న సంగట్లో చింతతొక్కు వేసింది తల్లి నాలుగు ముద్దలు కష్టంగా మింగాడు చెయ్యి కడుక్కుని లేచాడు మిగిలిన సంగటి ఆడవాళ్ళిద్దరూ చెరో రెండు ముద్దలు తిని నీళ్ళు తాగారు అతని రాక వాళ్ళ ఆకల్ని చంపేసింది ప్రకాశం కడుపునిండా తినినట్లయితే వాళ్ళ కదికూడా ఉండేదికాదు

కుక్కి మంచం లేపి గోడకానించి, బొంగు నిట్టాడి కానుకుని కూర్చున్నాడు ప్రకాశం ''ఆ సంచి ఇటు తేవే'' అన్నాడు భార్య వెళ్ళి మూలన పెట్టిన సంచి తెచ్చింది ఆ సంచిలోంచి వాళ్ళకోసం తెచ్చిన బట్టల ప్యాకెట్ బయటకు తీశాడు ఆ చీరల్ని చూచి వాళ్ళు ఎంతగానో సంబరపడ్డారు ఆనందంతో నోటివెంట మాట రాలేదు చీరల్నీ, రవిక గుడ్డల్నీ అటూ ఇటూ తిప్పిచూశారు గుడ్డి వెలుగులో వాటి రంగుల్ని సరిగా పోల్చుకోలేకపోయారు అది వాళ్ళిద్దరి జీవితాల్లో ఎంతో సంతోషం నింపిన రోజు కలేమో అనిపించిది ప్రకాశం భార్యకు వాళ్ళ ఆశ్చర్యం నుండి తేరుకోకముందే మిఠాయి పొట్లం బయటకు తీశాడు అది విప్పుతుంటే ఏముందో అనే ఆతృత వాళ్ళని కుదురుగా కూర్చోనివ్వలేదు పొట్లం విప్పి, ప్రమిద వెలుగులో అదేమిటో అర్థమయ్యేసరికి ఆనందంతో నోట్లో జివ్వున నీళ్ళూరాయి పెద్దపెద్ద గడ్డలు తుంచి ఇద్దరి దోసిళ్ళల్లో పెట్టాడు కొద్ది సేపు ఆ పనిలో నిమగ్నమయి మాటలు మరిచిపోయారు ఆడవాళ్ళు ఇద్దరూ వాళ్ళవైపు తృప్తిగా చూస్తూ తనూ ఒక పలుకు నోట్లో వేసుకున్నాడు

''నే నిట్టాంటి మిఠాయి ఒకసారి తిన్నానయ్యా మాకు పెల్లయిన కొత్తలో అప్పుడు నువ్వు కడుపున పడ్డావు'' అంది తల్లి ఆ మాటకు కొడుకు నవ్వి వూరుకున్నాడు మసక వెలుతురులో వాళ్ళ ముఖాల్లో కనిపించిన సంబరం అతనికి ఆనందం కలిగించింది

''మొత్తం తినండి'' అన్నాడు పొట్లం వాళ్ళముందు పెట్టి

''నాకింక సాలయ్యా నువు ఇంకా తినవే కూసింత వుంచు రేపు పిల్లకాయలకి పెడదాం ఆడు దెరమయ్యగాడి పనోడు ఎప్పుడూ మనింటికాడే ఆడతాడు'' అంది తల్లి కోడలితో

''ఏయ్ పోయి, తడిక దగ్గరకేసి రావే'' అన్నాడు ప్రకాశం భార్యతో

'ఎందుకూ' అన్నట్లు చూచింది మాణిక్యమ్మ

''పోయే నే సెపుతాగా, పో'' అన్నాడు నవ్వుతూ, సంచిలో చెయ్యి పెడుతూ ఆమె ఒక్క అంగలో పోయి తడిక వాకిలి దగ్గ కు నెట్టి వచ్చింది సంచిలోనుంచి చిన్న గుడ్డసంచి తీసి, అందులోంచి డబ్బులు తీశాడు

''అమ్మా, ఆ మిరాయిగడ్డ అటుపక్కన పెట్టవే కాతికంమీద దోసిడి పట్టు'' అన్నాడు

తింటున్న మిరాయి ఉండ పక్కన పెట్టి దోసిలి పట్టింది తల్లి

తన గుప్పిటలోని రూపాయి బిళ్ళల్నీ, కొంత చిల్లర్నీ తల్లి దోసిట్లో పోశాడు గుప్పిట్లోవి అయిపోయినాక గుడ్డసంచిలోవి దోసిట్లో పోశాడు ఖాళీ సంచి పక్కన పడేశాడు నిశ్శబ్ద వాతావరణంలో వెండి రూపాయలు ఘల్లుమంటూ శబ్దం చేశాయి దోసిలి నిండి రెండుమూడు నాణేలు కిందపడ్డాయి భార్య ఏరి అత్త దోసిట్లో వేసింది వాటినలా చూసేసరికి ఆడవాళ్ళ ఆనందానికి పట్టపగ్గాలు లేకుండా పోయాయి అవి దోసిట్లో వుంటే ఆమె కేమిటో గొప్ప అనుభూతి కలిగింది ఆనందంతో కన్నీరు జలజలా రాలాయి ప్రమిద వెలుగులో ఆమె కళ్ళల్లో ఆనందం మందంగా మెరిసింది

''నేనసలు ఇట్టాంటియ్యి ఇంతమటుకు సూడలేదు'' అంది ప్రకాశం భార్య సంబరంగా

''ఇక నుంచి సూద్దువు గానిలే'' అన్నాడు ప్రకాశం

''అయ్యా, ఇయ్యేంతరా ?'' అంది తల్లి ఆనందంతో

''ఇయ్యి మొత్తం ఏడు రూపాయల పద్నాలుగణాలు ఇయిగో ఇయి రూపాయి బిల్లలు ఇయ్యేమో బేడాలు ఇయ్యి అనాలు, ఇయ్యన్నర్థణాలు ఇయిగో యియ్యిన్నాయి చూశావా, రాగియ్యి, ఇయ్యి దమ్మిడీలు, కానీలు, ఇయ్యి బొక్క కానీలు '' అన్నాడు ప్రకాశం తల్లి దోసిట్లో వాటిని వేటికవి తీసి కింద పెడుతూ

''అయి నాకు తెలుసు కానీలూ, దమ్మిడీలు అయి నేను శానా సార్లు సూశా'' అంది భార్య

''అయ్యా అట్టా కింద పెట్టమాకయ్యా లచ్చిదేవిని అట్టా గింద బెట్టగూడదు ఆ సంచిలోనే పొయ్యి'' అంది తల్లి

ఆమె మాటకు నవ్వాడుప్రకాశం అన్నీ లెఖ్ఖ పెట్టి గుడ్డసంచిలో పోసి, ఆ సంచికున్న తాటితో దాని మూతి కట్టి తల్లి కిచ్చాడు ''నీ దగ్గరే వుంచుకోమ్మా బొడ్డులో దోపుకో'' అన్నాడు కొడుకు మాటలూ, డబ్బుల గలగలలూ ఆమెకు హాయి గొలుపుతున్నాయి

అర్ధరాత్రి గడిచిందాకా తన నౌకరీ విశేషాలు చెపుతూనే వున్నాడు ప్రకాశం మిరాయి కొంచెం వుంచారు శెనగపప్పూ, ముంత ఖర్జూరం అన్నీ అయిపోయాయి మాటల్లో ప్రకాశంకు నిద్ర ముంచుకు వస్తోంది ప్రమిదలోని ఆముదం అయిపోవస్తోంది వత్తి కొరుడుకడుతోంది

''అయ్యా, ఇంగ పడుకోండి రేపొద్దున కబుర్లు సెప్పుకుందాం నేను ఎంకటేశంగాడి గుడిసెలో పడుకుంటాలే'' అని ప్రకాశం తల్లి ఈత చాప తీసుకొని బయటకు వెళ్ళింది

ప్రకాశం నిద్రపోయేసరికి తెల్ల తెల్లగా తెల్లవారుతోంది

అతను లేచేసరికి పన్నెండు గంటలు కావస్తోంది మధ్యాహ్నం గాఢమైన నిద్ర పట్టింది ముఖం కడుక్కొని స్నానం చేశాడు కోమటి కొట్టుకు వెళ్ళాడు వెళ్ళినంత దూరం అందరూ అతన్ని వింతగా చూస్తున్నారు ప్రేమగా పలుకరిస్తున్నారు నెలకు సరిపోయే తిండి గింజలూ, పప్పులూ, సీసాలో మంచి నూనె ఇంకా ఏవేవో కొని తెచ్చాడు అతని పరిస్థితి వూళ్ళోవాళ్ళకు రెండు రోజులపాటు చర్చనీయాంశమైంది పల్లె జనంతోపాటు ఆహార లోపం వలన వచ్చిన అనారోగ్యం ఆ నాలుగు రోజుల్లోనే చాలావరకు పోయింది ప్రకాశం తల్లికి కొత్త బట్టలు కట్టుకొని వాళ్ళు పల్లెలో తిరుగుతుంటే అంతా నోళ్ళు వెళ్ళబెట్టుకొని చూశారు ఓ రోజు బెల్లంతో అరిసెలు చేశారు అత్తా కోడలు చేసినవాటిల్లో మూడొంతులు పైగా పల్లెలో వాళ్ళకి పంచి పెట్టింది ప్రకాశం తల్లి

''అయ్యా! ఆ నారాయణ మూరితి మనమీద దయ సూపించాడు ఇంత కాలానికి కోటయ్య సామి కొండ కొత్తానని మొక్కుకో'' అంది కొడుకుతో

ఆ మాటల్ని ప్రకాశం పెద్దగా పట్టించుకోలేదు మరుసటి రోజు భార్యనీ, తల్లినీ తీసుకొని టౌనుకెళ్ళాడు అన్నం, కూరలు వండుకోవటానికి జర్మన్‌సిల్వర్ తపేళాలూ, తింటానికి మూడు పళ్ళేలు, గుడిసెకు వెయ్యటానికి ఒక తాళంకప్పా కొన్నాడు రవిక ముక్కల్ని టైలరుకు ఇచ్చాడు

మ(ర్రో)జు, తను పాలికి చేసిన ఆసామి నాలుగు మానికలు జొన్నలు పంపించాడు ఓ కుర్రాడితో వచ్చిన కుర్రాడు ప్రకాశంతో, ''ఆయన నిన్ను ఒకచారి రమ్మనాడు'' అన్నాడు

''రానన్నానని చెప్పు ఆ గింజలు కూడా తీసుకుపో'' అని వెనక్కి తిప్పి పంపించాడు ప్రకాశం

ఆ నాలుగు రోజులూ సంబరంగా గడిపాడు తను వూరు వదిలిన దగ్గర నుండీ ఈ రోజు వరకూ జరిగిపోయిన అన్ని విషయాలూ పూసగుచ్చినట్లు చెప్పాడు అడిగిన వాళ్ళందరికీ

''చదవటం రాయటం కూడా నేర్చుకొన్నాను'' అన్నాడు గర్వంగా భార్యతో

అర్ధం కానట్టు చూచింది ఆమె నవ్వి వూరుకున్నాడు ''మీకు టైనింగులో అసలేం నేర్పిత్తారు?'' అంది

ప్రకాశం ఆ ప్రశ్నకు కొంచెంసేపు ఆలోచించాడు ''భయపడటం ఆఫీసర్లకు భయపడటం ఆళ్ళు చెప్పినట్లు చెయ్యటం'' అన్నాడు

ఆమె కర్ధం కాలేదు ''నీకర్ధం కావాలంటే చానా టైం పట్టేద్ది'' అన్నాడు

ఆ నాలుగు రోజులూ ఎక్సర్‌సైజు లేకపోవటం వలన వళ్ళంతా బద్ధకంగా, మత్తుగా వున్నట్లు అనిపించింది అతను తిరిగి బయలుదేరబోయేముందు, చిల్లరకొట్టుకెళ్ళి, తనవాళ్ళకు కావాల్సిన సరుకులు ఇవ్వమనీ, నెలాఖరుకు తను డబ్బులు పంపిస్తాననీ చెప్పాడు ఆ కొట్టతను తెచ్చిపెట్టుకున్న అభిమానంతో ''అట్టాగే, అట్టాగే'' అంటూ తలూపాడు

మరుసటిరోజు చీకటితోనే లేచి, భోంచేసి, కొంచెం అన్నం మూట కట్టుకొని, అందరికీ చెప్పి బయలుదేరాడు ప్రకాశం

బండిలో కూర్చుని ఆలోచించాడు 'ఎంత మార్పు?!' అనుకొని ఆశ్చర్యపోయాడు 'తనకిప్పుడు నలుగురిలో కొంత గౌరవం వచ్చింది ఈ మార్పుకి కారణం తనకిప్పుడు ఉద్యోగం వుంది అంటే కాస్తో కూస్తో డబ్బు సంపాదించగలుగుతున్నాను కాబట్టే గౌరవిస్తున్నారు తనని పశువు కన్నా హీనంగా చూచిన తన ఆసామి కూడా గింజలు పంపాడు ఈ మార్పుకు కారణం ఉద్యోగం రావటమే ఈ లెఖ్ఖన ఈ తక్కువ కులాలోళ్లందరికీ గనక ఉద్యోగాలుంటే అప్పుడుగాని ఈళ్లు గవురవించరు' అనుకున్నాడు ఈ ఆలోచన వచ్చిన తరువాత అతనికొక అనుభవం కలిగినట్లూ, ఒక జీవిత వాస్తవం తెలిసినట్లూ అనుభూతి కలిగింది ఈ దేశంలోకి కులా లెలా వచ్చాయో తెలియలేదుగానీ, అవి పోవాలంటే మాత్రం ఏం చేయ్యాలో అర్ధమయినట్లు అనుభూతి చెందాడు అయితే ఉద్యోగాలు చేస్తున్నా అధికార్లలోని కులాల పట్టింపు గుర్తొచ్చింది ఏయుల్లై భార్య కళ్ళముందు కనపడింది 'కేవలం ఉద్యోగం ఉన్నంత మాత్రాన కులాల పట్టింపు పోదు' అనుకున్నాడు మళ్ళీ బుర్రలో గజిబిజి ఆలోచనలు చోటు చేసుకుని చికాకు వేసింది 'అయినా అందరికీ ఉజ్జోగాలు ఓరిత్తారూ, యాడనుండి తెత్తారు?' అనుకున్నాడు

రకరకాల ఆలోచనలతో, బండిలోకి ఎక్కే దిగే ప్రయాణీకులతో సంభాషణలతో ప్రయాణం పూర్తయ్యింది ఎలాటి ఇబ్బందీ లేకుండా విజయనగరం చేరుకున్నాడు బండిదిగి బేరక్కు వెళ్ళే

సరికి వెంకటేశం ఎదురొచ్చాడు విశేషాలు చెప్పాడు ప్రకాశం గురవయ్య వస్తూనే కుశల ప్రశ్నలు వేశాడు ''మీ అమ్మా, మా అమ్మాయీ అంతా బావున్నారా?'' అన్నాడు

ఆనందంగా, అభిమానంగా తలూపాడు ప్రకాశం బావున్నారన్నట్లు తను పాలికున్న ఆసామి గింజలు పంపించాడని చెపితే నవ్వాడు గురవయ్య

''అంతే ప్రకాశం లోకం తీరు అటు డబ్బో, ఇటు ఉద్యోగమో ఏదో ఒకటి లేకపోతే మనిషికి విలువలేదు'' అన్నాడు గురవయ్య

ప్రయాణ విశేషాలూ, ఇంటి దగ్గరి ముచ్చట్లతో చాలాసేపు గడిపారు వాళ్ళు

తెల్లవారిం దగ్గర నుండీ మళ్ళీ మామూలు ట్రైనింగ్‌లో మునిగి పోయాడు ఎంత టైం లేకున్నా, వీలయినప్పుడల్లా సి య్యై ఇంటికి వెళ్ళి సుశీలమ్మగారి నడిగి పుస్తకాలు తెచ్చుకోవటం మానలేదు ప్రకాశం తెలుగు రాయటం, చదవటం నీళ్ళ చెల్లాట మయ్యింది ఇంటికి తనే ఉత్తరం రాశాడు అలా రాస్తున్నప్పుడు అతనికొక ఆలోచన వచ్చింది తన యోగక్షేమాల్ని ఎవరో ఒకళ్ళు ఇంటి దగ్గరి వాళ్ళకు చదివి చెపుతారు కానీ వాళ్ళ యోగక్షేమ సమాచారం తనకు తెలియజేసే వాళ్ళు లేరు తను ట్రైనింగు పూర్తిచేసుకుని వెళ్ళినాక తన భార్యకు కూడా చదవటం రాయటం నేర్పాలను కున్నాడు 'అది బలే చురుకైంది ఇట్టే నేర్చుకుంటది' అనుకున్నాడు భార్యని గుర్తు చేసుకుంటూ తన సెలవు అయిపోయి, తను తిరిగి ట్రైనింగు స్కూలుకు బయలుదేరినప్పుడు తనతోపాటు భార్య వూరి బయటదాకా వచ్చింది నీరసంవల్ల తల్లి ఇంటి దగ్గరే వుండిపోయింది

''సరే నువ్వింక వుండు జాగ్రత్త'' అని తను భార్యతో అంటున్నప్పుడు ఆమె కళ్ళవెంట నీళ్ళు జల జల రాలాయి నవ్వొచ్చింది తనకు

''ఎందుకు? ఇంక మూడు నెల్లేగా తరువాత ఇంకే ఇబ్బందీ వుండదు'' అన్నాడు భార్య బుగ్గలమీది కన్నీటిని తుడుస్తూ

''మద్దెలో ఇంకోసారి రా'' అంది అమాయకంగా, ఆశగా

మళ్ళీ నవ్వాడు ''సెలవు లియ్యరు ఆఫీచర్లు అయినా తడవ తడవకు అంతా దూరంనుండి రావటమంటే మాటలా చార్జీలే బోలెడు అవుతాయి ఎవురు తిన్నట్లు? ఆ చార్జీలు పెట్టుకుంటే మీకు ఇంకో జత కోకలు కొనచ్చు'' అన్నాడు

''మా కింకేం వద్దు నువ్వు కొనుక్కో సిలుకు సొక్కా'' అంది నవ్వుతూ ''పొద్దినేల రోజా అట్లు తిను ఆ సంగటి ముద్దొద్దు డబ్బులయిపోతాయని తినకుండా ఉండమాక అచలే మడిసివి బాగా సిక్కావు'' అంది

మళ్ళీ నవ్వాడు ప్రకాశం ''కావాల్సినియ్యి శెట్టికొట్లో తెచ్చుకోండి వుండింక'' అన్నాడు

ఆమె ఏమీ మాట్లాడలేదు పమిటతో కళ్ళు తడుచుకుంది తను డొంక మలుపు తిరిగిందాకా అలాగే చూస్తూ వుండిపోయింది

ఆ సంఘటన గుర్తొచ్చి అతని మనస్సు పులకరించింది 'రాయటం చదవటం నేర్పాలి' అనుకున్నాడు మళ్ళీ

అదే మాట గురవయ్యతో అన్నాడు సిగ్గుపడుతూ ఆమాట విని గురవయ్య చిన్నగా నవ్వాడు

''చూడు ప్రకాశం ఆడవాళ్ళకు చదువు సంధ్యలు కావాలని కొంతమంది అంటూ వుంటారు గానీ, నా ఉద్దేశ్యం అనవసరమని దానివల్ల వాళ్ళకుగానీ, మనకుగానీ ఒరిగేదేమీ లేదు. నీకు చదువుంటే ఉద్యోగానికి ఉపయోగపడుతుంది ఆళ్ళేమన్నా ఉద్యోగాలు చేస్తారా, ఊళ్ళేలతారా''

అన్నాడు

ప్రకాశం ఆ మాటలకు ఆశ్చర్యపోయాడు 'తనను బలవంత పెట్టి, ఒత్తిడిచేసి చదువు నేర్చుకొనేలాగా చేసిన ఈయన ఆడవాళ్ళ విషయంలో ఇట్లాగంటాడేంది?' అనుకున్నాడు అయినా ఏం మాట్లాడలేదు 'సరేలే, ట్రైనింగు అయిపోయిన తరువాత సంగతిగదా అప్పుడాలోసించ వచ్చులే' అనుకున్నాడు

రోజులు దొర్లిపోతున్నాయి

'ఇంకా రెండు నెలలు గడవాలి' అనుకున్నాడు ప్రకాశం అలవాటుగా ఆ రోజుకూడా ప్రతి రోజూ రాత్రి పడుకోబోయే ముందు ఒక్కసారన్నా గడిచిపోయిన రోజుల్నీ, గడవాల్సిన రోజుల్నీ లెఖ్ఖపెట్టుకునేవాడు ఆ ట్రైనింగు అతనికొక జైలుశిక్షలా తోచింది అయితే ఆ ట్రైనింగులో అతను సాధించింది ఒక్కటే చదువు గురవయ్య పరిచయం కావటం, సియుల్టై భార్య సుశీలమ్మగారు ప్రోత్సహించి పుస్తకాలివ్వటం అతను తన అదృష్టంగా భావించాడు 'మంచి పుస్తకాల వల్ల పెరపంచకాన్ని చాలా వరకు అర్థం చేసుకోవచ్చు' అనుకున్నాడు చాలాసార్లు కానీ కొన్నికొన్ని పుస్తకాల్లో రాసున్న విషయాలు వాస్తవ విరుద్ధంగా వున్నట్లు తోచాయి అతనికి 'కాబట్టి పుస్తకాల్లో రాసేయన్నీ నిజాలు కాదు అబద్ధాలే ఎక్కువగా వున్నట్లున్నయ్' అనుకునేవాడు 'పుస్తకాల్లో వర్ణించే సుందరమైన ప్రకృతిగానీ, అబ్బాయిల అమ్మాయిల మధ్య ప్రేమలుగానీ, రెండు కులాల మధ్య పెళ్ళిళ్ళుగానీ, పెద్దకులాలవాళ్ళూ, ధనవంతులూ ఎంతో ఉదారంగా ప్రవర్తించటంగానీ, ఇయ్యన్నీ ఎక్కడ జరుగుతున్నయ్ నిజంగా?!' అని తనను తను ప్రశ్నించుకునేవాడు 'తను చూచిన ప్రపంచం చాలా చిన్నదే అయినా, ఆ కొద్ది ప్రపంచంలో తను చూచిన బీదరికం, దారిద్ర్యం, ఆకలీ, మానవులమధ్య ఎక్కువ తక్కువలూ, ఈర్ష్యాసూయలూ ఆ పుస్తకాల్లో ఎక్కడా తనకు తగల్లేదు బహుశా నేను చదివిన పుస్తకాలు చాలా తక్కువ కావటం ఒక కారణం కావచ్చు లేకుంటే ఇంత ఎక్కువగా కనపడే ఈ విషయాల్ని గురించి ఎవరో ఒకరు ఎందుకు రాయరు?' అనుకున్నాడు కాని తనకెప్పుడూ అనుభవంకాని ప్రేమలూ, ధనవంతుల ఔదార్యాలూ, వాళ్ళు బీదవాళ్ళని ప్రేమించడాలూ, వాళ్ల ధనధాన్యాలు ప్రేమతో బీదవాళ్ళకు పంచడాలూ ఇలాటివే తను చదివిన పుస్తకాల్లో కనపడ్డాయి 'వాస్తవ ప్రపంచం గురించి రాసిన పుస్తకాలేమన్నా దొరికితే బావుండు' ననుకున్నాడు

తను ఇప్పటివరకు చదివినవి చాలా తక్కువ పుస్తకాలు మాత్రమే అయితే మానవ జీవిత విధానాన్ని గూర్చిన చర్చలూ, మనిషిగా పుట్టినవాడు జీవితాన్ని ఎలా గడపాలి అనే అంశాలూ, జీవితమంటే ఏమిటి అనే ప్రశ్నలూ తనకి చాలా ఆసక్తినీ, ఆలోచననూ రేకెత్తించినట్లు గ్రహించాడు

బ్రతికినంతకాలం ఇతరులకు ఎలాటి హాని చేయకుండా, ఎలాటి వ్యసనాలకూ లోనవ్వకుండా, చేతనయినంతవరకు ఇతరులకు సహాయం చేస్తూ జీవితాన్ని ఆనందంగా వెళ్ళబుచ్చాలని ఆ యా రచయితలు తమ అభిప్రాయం వెలిబుచ్చేవారు అది తనకూ నచ్చింది అలా చేస్తే అంతా స్వర్గలోకానికి చేరతారనీ, అక్కడ అన్ని సుఖాలు అనుభవించవచ్చనీ రాసేవారు

కాని వాస్తవ ప్రపంచంలో అలా నడుచుకుంటున్నవాళ్ళు ప్రకాశానికెవరూ తారసపడలేదు దానికి గురవయ్య చెప్పిన జవాబులూ అంతగా రుచించలేదు అయితే ప్రకాశం ఆలోచనాధోరణీ, ప్రతి విషయంపట్లా అతని ఉత్సుకతా, ప్రతి విషయాన్నీ వీలయినంత వివరంగా ఆలోచించటానికి అలవాటు పడుతున్న అతని మెదడూ, చదువుతోపాటు భాషను చక్కగా మాట్లాడాలని చేస్తున్న

కృషీ అతనికి తెలుస్తూనే వున్నాయి ఆ పరిశీలనే ట్రైనింగ్ గురించి కూడా ఆలోచింపచేస్తోంది

ట్రైనింగు స్కూల్లో ప్రతి అంశమూ బాధాకరమైనదే మెస్‌లో భోజనం, ఆర్డర్లీ విధానం, ఆఫీసర్ల బూతులు, కులాల పట్టింపులు, ఇలా అన్నీ ఈ అంశాలన్నీ వాళ్ళను ట్రైనింగు ఎప్పుడు పూర్తయిద్దా అని ఎదురు చూసేలా చేస్తాయి

'ఈ తిండి పీడ ఎప్పటికి విరగడయ్యిద్దో' అనుకునేవాళ్ళు అంతా మెస్ దగ్గరకు వెళుతూ ఆ తిండి తినటం ఇష్టంలేక ఎవరైనా, ఏ పూటైనా తినకపోతే పనిష్మెంటు ఇస్తారు అన్నం అని పిలవటానికి ఏమాత్రం వీలులేని ఆ తిండి ఎంత ప్రయత్నించినా గొంతు దిగదు అన్నం తినకపోతే ఎందుకు తినలేదో సంజాయిషీ యివ్వాలి లేకుంటే పనిష్మెంటు ఎగస్ట్రా డ్రిల్లు

ఆ పనిష్మెంటుకి భయపడకపోయినా, ఎంతకాలం తిండి లేకుండా ఉండగలరు? తినకపోతే నీరసం, తింటే విరోచనాలు, కడుపులో నొప్పి, వాంతులు ఇలా ఏదో ఒహటి తప్పదు

ఎవరన్నా ఏపూటన్నా తినకపోతే, ఆకలి లేదనో, విరోచనాలనో, జ్వరం తగులు తున్నదనో- ఇలా ఏదో కారణం రాసివ్వాలి అలాకాకుండా భోజనం బాగాలేనందు వలన తినలేదంటే ఎగస్ట్రా డ్రిల్లు అదే డిసిప్లైన్

'ట్రైనింగు నుండి బయట కెళ్ళినాకే సుఖం అప్పుడే నాలుగు డబ్బులు మిగిలేది' అనుకునేవారు అంతా ట్రైనింగు నుండి ఎలాగో బయటపడితే మిగతా ఉద్యోగ జీవితంలో కాస్త సుఖం ఉంటుందనే ఆశతో కాలాన్ని బహుకష్టంగా వెళ్ళదీస్తుండేవారు

ట్రైనింగు నాలుగు నెలలు పూర్తయ్యింది అయిదో నెల నుండి రైఫిల్ షూటింగ్ నేర్పుతారు పోలీసు స్టేషన్లలో చెయ్యాల్సివచ్చే గార్డు డ్యూటీలు ఇప్పుడు మొదలవుతాయి అయిదవ నెలలో ఎవరికీ సెలవు లివ్వరు అందువలన ప్రకాశం ఇంటి కెళ్ళొచ్చిన పది రోజులకు వెంకటేశం కూడా ఇంటికెళ్ళి వచ్చాడు అలాగే గురవయ్యా, జాన్ ఇలా అంతా వెళ్ళి వచ్చారు

రైఫిల్ డ్రిల్లు ప్రారంభించబోయే ముందు తుపాకీలోని అన్ని భాగాల్ని గురించి చెపుతారు అలా చెప్పేటప్పుడు, ఒక రోజు ఏ డీ ఐ అటూ ఇటూ చూచి చిన్నగా అన్నాడు వీళ్ళతో ''ఇవి ఉండబట్టే తెల్లోడు ఇంతమందిని అదుపు చెయ్యగలుగుతున్నాడు మనల్ని అంతేగానీ వీడి సూటూ బూటూ చూసి ఎవరూ భయపడరు అరవై డెబ్భై వూళ్ళకు ఒక పోలీసు స్టేషను పెట్టి, పదిమంది పీసీలతో లా అండ్ ఆర్డర్ మెయిన్‌టైన్ చేస్తున్నాడంటే, తెల్లోడి చేతిలో ఇయ్యి వుండ బట్టే ఇయ్యి లేకపోతే ఆడి పప్పులేం వుడకవు''

ఆ మాటలు చాలామందికి నిజమనిపించాయి

రైఫిల్ ట్రైనింగులో చివరి భాగంగా, అందరినీ వూరి బయట కొండల దగ్గరకు తీసుకువెళ్ళి, మనిషికి ముప్పై అయిదు బుల్లెట్ల చొప్పున ఇచ్చి, ఫైర్ చేయిస్తారు దాంతో ట్రైనింగు పూర్తయినట్లే

ట్రైనింగు పూర్తిచేసుకుని వెళుతున్నామనే ఆనందంతో, వివిధ జిల్లాల వ్యక్తులతో కలిగిన పరిచయాల కిక తెర దిగుతున్నందుకు విచారంతో చివరి రోజులు గడుస్తాయి

''తిండి బాగావుంటే ఎంతకాలమైనా ఇక్కడ వుండొచ్చు'' అన్నాడు వెంకటేశం

''తిండి ఒక్కటేనా ? మిగిలిన దంతా బాగుందా?'' ఎదురుప్రశ్న వేశాడు ప్రకాశం

''బాగా లేదనుకో ముఖ్యంగా బువ్వ సరిగా వుంటే మిగతా వోటిని యట్టాగో కట్ట నెట్టుకు పోవచ్చుగా'' అన్నాడు వెంకటేశం

''బువ్వకాదు, భోజనం అను'' అన్నాడు ప్రకాశం

''నువ్వు సతకటం మా చావు కొచ్చిందిరా'' అన్నాడు వెంకటేశం అతని మాటలకు గురవయ్య, జాన్ నవ్వారు

''అన్నీ సక్రమంగా వుంటే ఇక జీవితం ఏముంది? చేదు, తీపి, వగరు కలిస్తేనే జీవితం ఇక్కడ అనుభవించింది చాలు ఇక స్టేషన్లలో మిగతా జీవితం'' అన్నాడు గురవయ్య ఆ మాటకు ఔనన్నట్లు తలూపాడు జాన్

ట్రైనింగు స్కూల్లో ఆరోనెల అసలు గడవనట్లూ, కాలం స్తంభించిపోయినట్లూ వుంటుంది ఆరునెలలూ పూర్తి చేసుకొని వెళ్ళే బ్యాచ్చీలను చూస్తూ, ఆరోజు కోసం ఎదురు చూస్తూవుంటారు జూనియర్ రిక్రూట్లు చివరకు ఎదురుచూచిన రోజు రానే వస్తుంది

ఆ రోజుతో అయిదు నెలల ఇరవై తొమ్మిది రోజులు పూర్తయ్యాయి

ఇంక రెండు రోజుల్లో అంతా ట్రైనింగు నుండి జిల్లాకు బయలుదేరతారు ఆ చివరి రాత్రి ఎవరికీ నిద్రపట్టలేదు సరిగా తాటాకు చాపలూ, గోనె పట్టాలూ అన్నీ తగలేసి చలి కాచుకున్నారు పాటలతో, పద్యాలతో కాలక్షేపం చేశారు మిగతా జిల్లాల్లోని పరిచయస్తులను పలకరించి వచ్చారు చేంతాళ్ళూ, బక్కెట్లూ కొత్తగా వచ్చిన బ్యాచ్చీల వాళ్ళకు చౌకగా అమ్మేశారు ఆఫీసర్ల పర్మిషన్‌తో టౌనులోకి వెళ్ళి ఎవరికి కావాల్సిన వస్తువుల్ని వాళ్ళు కొనుకొచ్చుకున్నారు ఆరు నెలల నుండీ ఎదురు చూస్తున్న రోజు రానే వచ్చింది

ఆ రోజు బయలుదేరబోయే ముందు సుశీలమ్మగారికి చెప్పి రావటానికి వెళ్ళాడు ప్రకాశం అతన్ని చూస్తూనే ఆమె ఆప్యాయంగా పలకరించింది ''ఏమిటి ప్రకాశం, ఈరోజు బయలుదేరుతున్నారటగా'' అంది ఆ ఆప్యాయమైన పిలుపుకు, అంతరంగంలో ఆమెపై వున్న గౌరవానికీ, అతనికి తెలియకుండానే కళ్ళల్లో నీళ్ళునిలిచాయి చేతులు జోడించి నమస్కరించాడు

కూర్చోమని చెప్పి లోపలికెళ్ళింది పంచలోవున్న బల్లమీద కూర్చున్నాడు చొక్కా అంచుతో కళ్ళు తడుచుకున్నాడు కొద్దిసేపటికి ఆమె బయటకు వచ్చింది ప్రకాశం లేచి నిలబడ్డాడు ఆమె చేతిలోవున్న పింగాణీ ప్లేటులో రెండు సున్నివుండలు వున్నయ్

''కూర్చో ఇవి తిను'' అంది ప్లేటు బల్లమీద పెడుతూ

''ఎందుకమ్మా ఇప్పుడేగా మెస్‌లో భోజనం చేసొచ్చింది'' అన్నాడు

''ఏం ఫరవాలేదు తీసుకో ప్రకాశం'' అంది

నిలబడే తిన్నాడు అతను తింటుంటే, ఆమె లోపలికి వెళ్ళి, మంచి నీళ్ళు తెచ్చి, గ్లాసు బల్లమీద పెట్టింది

''చదువు విషయం నిర్లక్ష్యం చెయ్యొద్దు ప్రకాశం'' అంది

''అలాగేనమ్మా'' అన్నాడు అతను తలూపుతూ

''నీవు ట్రైనింగుకు వచ్చినప్పటికీ, ఇప్పటికీ భాషలో చాలా తేడా వచ్చింది ఇంకా ఇంప్రూవ్ చేసుకోవాలి చదువుకుంటే ప్రొమోషన్ వస్తుంది'' అంది

విని తలూపాడు పంపు దగ్గరకెళ్ళి ప్లేటూ, మంచినీళ్ళ గ్లాసూ కడుక్కొచ్చి బల్లమీద పెట్టాడు రెండు నిముషాలు నిశ్శబ్దంగా వున్నాక, ''వస్తానమ్మా'' అన్నాడు నమస్కరిస్తూ

ఆమె ఆప్యాయతగా చూసింది ''మంచిది ప్రకాశం జాగ్రత్తగా చేసుకో వుద్యోగం నీ భార్యనీ, తల్లినీ అడిగినట్లు చెప్పు'' అంది

అలాగే అన్నట్లు తలూపాడు ''వెళ్ళొస్తానమ్మా సెలవిప్పించండి అయ్యగారికి నమస్కారం

చెప్పండమ్మా'' అన్నాడు

ఆమె తలూపింది ''మంచిది ప్రకాశం వెళ్ళిరా'' అంది

మళ్ళీ ఒకసారి నమస్కరించి బయటకు నడిచాడు అతని హృదయం భారంగా తయారయ్యింది ఆమెను గురించి ఆలోచించాడు 'ఆమెగారు ఇచ్చిన కొద్దిపాటి ప్రోత్సాహం, గురవయ్య ఇచ్చిన కొద్దిపాటి ధైర్యం నా బ్రతుకులో ఎంత మార్పు తెచ్చిందో, ఎంత ఆశ్చర్యకరమయిన విషయం?!' అనుకున్నాడు తెలిసిన వాళ్ళందరికీ చెప్పి వచ్చాడు

ఇద్దరు కుర్రోళ్ళు టౌన్‌లోకెళ్ళి రెండు ఒంటెద్దు బండ్లను పిలుచుకొచ్చారు కిట్టు బాక్సుల్ని వాటిలో పెట్టి వాటి వెనక నడక సాగించారు రైల్వేస్టేషను దాకా అందరూ

'అప్పుడు ట్రైనింగుకు వచ్చేటప్పుడు బండికి డబ్బులు లేని వాళ్ళు, వాళ్ళవాళ్ళ పెట్టెల్ని తలలమీద పెట్టుకొచ్చుకున్నారు కాని ఈ రోజు పరిస్థితి ఇలా గుండటానికి కారణం డబ్బు' అనుకున్నాడు ప్రకాశం

అదేమాట గురవయ్యతో అన్నాడు

''అంతే ప్రకాశం డబ్బుంటేనే తప్ప ఈ ప్రపంచంలో మనిషికి విలువ లేదు డబ్బు లేనివాడు ఏ కులంలో వున్నా వాడి ముఖం ఎవ్వరూ చూడరు'' అన్నాడు ప్రకాశం భావాలతో ఏకీభవిస్తూ

స్కూలుని విడిచిపోవటం ఎంతో బాధనిపించింది చాలామందికి విశాలమైన గ్రౌండు, బేరక్‌లు, ఆఫీసులూ, పరిచయస్థులూ అన్నీ గుర్తొచ్చాయి

రైలుబండిలో ఇంచుమించు అందరూ కలిసే కూర్చున్నారు ఈ ఆరు నెలల కాలం వాళ్ళ ప్రవర్తనలో కొంత మార్పు తెచ్చింది

బండి ఆగిన కొన్ని చోట్ల చిరుతిళ్ళు కొనుక్కొని తింటూ జిల్లా ఆఫీసుకు చేరారు

---

జిల్లా ఆఫీసుకు చేరిన మరుసటి రోజు జిల్లా యస్పీ వాళ్ళందరిచేతా డ్రిల్లు చేయించి చూశాడు అందరికీ ఇచ్చిన కిట్టు బాక్సుల్నీ, ఇచ్చిన వస్తువుల్నీ తనిఖీ చేయించాడు మర్రోజు వాళ్ళకు ట్రాన్స్‌ఫర్ ఆర్డర్లు వస్తాయని చెప్పారు

ఆ రాత్రి పూటకూళ్ళ ముసలమ్మ ఇంటికి పోయి భోజనాలు చేశారు

ప్రకాశంవాళ్ళు బయట పంచలో కూర్చుని భోజనాలు చేయాలనీ, వాళ్ళ ఆకుల్ని వాళ్ళే తీసేయ్యాలని ఖచ్చితంగా చెప్పింది ఆమె

అలాగే కూర్చున్నారు వాళ్ళ విస్తళ్ళల్లో వడ్డించే అన్నాన్నీ, కూరల్నీ ఇంతెత్తునుండి వేసింది వాళ్ళకోసం ప్రత్యేకంగా పెట్టిన గ్లాసుల్ని తీసుకొమ్మని చెప్పింది వాళ్ళవి తెచ్చుకున్నాక ఒక సత్తు తపేళాతో నీళ్ళు తెచ్చి అక్కడ పెట్టింది భోంచేసి ఆకులు తీసి బైటపడవేశారు డబ్బులు లెఖ్ఖపెట్టి బల్లమీద పెట్టారు వాటిమీద నీళ్ళు చిలకరించి తీసుకుంది వాళ్ళ ముఖాలు నల్లగా మాడ్చుకొని బైటకొచ్చారు చాలాసేపు ఆమెని తిట్టాడు వెంకటేశం

''ఈళ్ళెప్పటికి మారి సస్తారో'' అన్నాడు గురవయ్య కోపంగా ప్రకాశం ఏం మాట్లాడలేదు

మరుసటిరోజు అందరికీ ట్రాన్స్‌ఫర్ ఆర్డర్లు వచ్చాయి తలా ఒక స్టేషన్ వేశాడు యస్పీ ఆ బేచ్చిలోని ఏ ఇద్దరికీ ఒకే స్టేషను పడలేదు ఏ స్టేషను ఎలాగుంటుందో అనీ, ఏ స్టేషనులో రెస్ట్ దొరికిద్దో అనీ, ఏ స్టేషన్లో బేడా డబ్బులు వస్తాయో అని వాకబులు చేశారు

అప్పటివరకూ కలిసిమెలిసి వున్నవాళ్ళంతా ఇంకో పూటలో విడిపోతారు తనకూ గురవయ్యకూ ఒకే స్టేషను పడితే ఎంతో బాగుండుననుకున్నాడు ప్రకాశం కాని జిల్లాలోని ఆ

చివరి స్టేషనుకు గురవయ్యనూ, ఈ చివరి స్టేషనుకు ప్రకాశాన్నీ వేశారు ఆ సాయంత్రం అందర్నీ రిజర్వ్ ఇనస్పెక్టరు ఫాలెన్ చేశాడు పేరుపేరునా పిలిచి డి వో పాస్‌పోర్టులు చేతికిచ్చాడు ఆయన ఆరునెల్ల క్రితం తాలూకా ఆఫీసు దగ్గర వీళ్ళందరినీ సెలక్టు చేసి ట్రైనింగుకు పంపాడు నల్ల ఆఫీసరుగా ఆయన అందరికీ బాగా పరిచయమే వీళ్ళని ఉద్దేశించి ఆయన రెండు మాటలు మాట్లాడాడు ''అబ్బాయ్‌లూ, మీ అందరినీ నేనే సెలక్టు చేశాను మీరంతా కష్టపడి ట్రైనింగు పూర్తి చేసుకొని వచ్చారు చాలా సంతోషం ఇంతకుముందు చాలా బ్యాచీల్ని ట్రైనింగుకు పంపాను కానీ వాళ్ళు తిరిగొచ్చేటప్పుడు నలుగురయిదుగురన్నా తక్కువ వస్తారు మీలాగా అందరూ తిరిగి వచ్చిన బేచీలు లేవు మీ అందరికీ ఇప్పుడు నా చేతిమీదుగా ఈ డీ వో పాస్‌పోర్టులు ఇస్తున్నాను కొంతమందికి మంచి స్టేషన్లు పడ్డాయి కొంతమందికి కొంచెం కష్టమయిన స్టేషన్లు పడ్డాయి ఎవరద్రుష్టం ఎట్లా వుంటే అట్లా అయ్యిద్ది కష్టమయిన స్టేషన్లు పడ్డవాళ్ళు బాధపడవద్దు ఏ స్టేషనూ ఎవరికీ శాశ్వతం కాదు సర్వీసులో ఎన్నో స్టేషన్లు చెయ్యాలి మీరంతా కష్టపడి పైకి రావాలనీ, ప్రమోషన్లు సంపాదించుకోవాలనీ కోరుకుంటున్నాను అంతా జాగ్రత్తగా వెళ్ళి రండి'' అన్నాడు

అందరూ ఆయనకు సెల్యూట్‌లు చేశారు స్మార్ట్‌గా

జిల్లా పోలీసు ఆఫీసునుండి, తమకు వేసిన పోలీసు స్టేషనుకు వెళ్ళి డ్యూటీలలో జాయిన్ అవ్వటానికి ప్రతి ఒక్కరికీ వారం రోజులు టైముంది ప్రకాశానికీ,గురవయ్యకూ, వెంకటేశానికీ కాస్త మంచి స్టేషన్లే పడ్డాయి కొంతమంది సీనియర్స్ కనపడి, అవి మంచి స్టేషన్లనీ, అణా డబ్బులు దొరికే స్టేషన్లనీ చెప్పారు జాన్‌కు పడిన స్టేషన్ డ్యూటీలు కష్టమనీ, ఏరియా అంతగా బాగుండదనీ అన్నారు జాన్‌కు అలాటి స్టేషన్ పడ్డందుకు బాధవేసింది మిత్రులు ముగ్గురికీ

తనకు పడిన స్టేషన్‌కు వెంటనే వెళ్ళి, కిట్టు బాక్సు స్టేషన్లో వుంచేసి, దొరికితే క్వార్టర్‌గానీ, క్వార్టర్ దొరకకపోతే రెండు రోజులు తిరిగి అద్దె ఇల్లు చూసుకొని ఆ జాయినింగ్ వీక్ లోనే ఇంటికెళ్ళి తల్లినీ, భార్యనూ తీసుకొని వెళ్ళాలనుకున్నాడు ప్రకాశం అదే విషయం గురవయ్యతో అన్నాడు

''అదే మంచిది డ్యూటీకి రిపోర్టు చెయ్యకముందే మనం ఈపని చేసుకోవాలి రిపోర్టు చేసినాక సెలవియ్యకపోతే చాలా ఇబ్బంది'' అన్నాడు గురవయ్య

''అరే, ఈగెంటదాకా పెతి చిన్నదానికీ గురవయ్యని సలకా అడుగుతున్నావు ఇంక రేపుట్నుండి టేసన్లో ఎట్టా సేత్తా? ఎవుర్నడుగుతా?'' అన్నాడు నవ్వుతూ వెంకటేశం ఆ మాటకు బాధతో కూడిన నవ్వు నవ్వాడు ప్రకాశం

''అన్నిటికీ ఆ కోటయ్యసామి ఉన్నాడు'' అన్నాడు తరువాత మౌనం రాజ్యమేలింది వాళ్ళ మధ్య చాలాసేపటివరకు ఎవరూ మాట్లాడుకోలేదు అప్పటివరకూ కలిసి మెలిసి వున్నవాళ్ళు విడిపోవాల్సి రావటం ఒకపక్క బాధగా, కొత్త పోలీసు స్టేషన్లో తమకే సమస్యలు ఎదురవుతాయో అనే ఒకపక్క భయంతో మౌనంగా వుండిపోయారు స్నేహితులంతా ఒకరికొకరు వీడ్కోలు చెప్పుకుంటున్నారు చాలాసేపటివరకు గురవయ్య, ప్రకాశం మాట్లాడుకోలేదు

''అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూవుండు ప్రకాశం'' అన్నాడు గురవయ్య అతని గొంతులో బాధ ధ్వనించింది ప్రకాశం ఏం మాట్లాడలేదు అతని కళ్ళల్లో నీళ్ళూరుతున్నయ్ తననొక మనిషిలా తీర్చిదిద్దిన ఆత్మీయుడు దూరం కావటం వేదన కలిగిస్తోంది తను చదివిన పుస్తకాల్లోని

ఆత్మీయతా, ప్రేమ అనే పదాల కర్థం ఇప్పుడు అనుభవంలోకి వస్తోంది ప్రకాశం పరిస్థితిని వూహించగలిగాడు గురవయ్య

''మనం ఎంత దూరమైనా ఈ జిల్లాలోనే కదా వుండేది ఎప్పుడో ఒకచోట, ఏ బందోబస్తులోనో కలుసుకుంటాం బాధపడమాక'' అన్నాడు ప్రకాశం విని మౌనంగా వున్నాడు గొంతు పెగిలిస్తే దుఃఖం పెల్లుబికిద్దేమోనని మౌనంగా వుండిపోయాడు రెండు నిముషాల తరువాత కొంచెం కుదుటపడ్డాడు

వెలుగురేఖలు పలుచబడుతున్నాయి ఒక్కరొక్కరే కిట్లుబాక్సుల్ని రిక్షాల్లో పెట్టుకొని వెళ్ళిపోతున్నారు మిత్రులు వీడ్కోలు తీసుకుంటున్నారు

''నువ్వు పొద్దున్నే బయలుదేరతావు కదా'' అన్నాడు గురవయ్య

'ఔను' అన్నట్లు తలూపి, ''ఇప్పుడు నాకు సరాసరి బస్సూ లేదు, బండీ లేదు మధ్యలో ఆగిపోవాలి పొద్దున్నే అయితే సరాసరి బస్సు కెళ్ళొచ్చు'' అన్నాడు ప్రకాశం

''అదే మంచిది సరేమరి నే బయలుదేరతా బస్సు మిస్సయ్యిందంటే ఇబ్బంది పడతా వెంకటేశానికి కూడా బస్సుంది'' అని ప్రకాశం చేతిని తన చేతిలోకి తీసుకొని చిన్నగా నొక్కాడు ''నేను వెళ్ళిన వెంటనే ఉత్తరం రాస్తాను నువ్వు కూడా రాయి'' అన్నాడు

అలాగే అన్నట్లు తలూపాడు ప్రకాశం

వెంకటేశం వెళ్ళి రిక్షాని కేకేసుకు వచ్చాడు ఇద్దరి కిట్లు బాక్సులూ రిక్షాలో పెట్టి దాని వెనకే నడక సాగించారు బస్టాండుకు గురవయ్యా, వెంకటేశం

''ఒరే, నేను రేపు చాయింత్రానికల్లా మనూరొత్తా, నువ్వో మరి?'' అన్నాడు వెంకటేశం

''నేను, ఇల్లూ అదీ చూసుకొని వస్తా మమ్మకు చెప్పు'' అన్నాడు ప్రకాశం

చేతులూపుకొని వీడ్కోలు తీసుకున్నారు వాళ్ళు కనుమరుగయ్యేంత వరకు చూసి, వెనక్కు తిరిగాడు ప్రకాశం చీకటి పడింది బాగా దూరపు స్టేషన్లు పడ్డవాళ్ళు ప్రకాశంలాగే నలుగురయిదుగురు మిగిలారు జాన్ కూడా వుండిపోయాడు వెనక్కివచ్చి ఆఫీసు ముందు వున్న వరండాలో నాపరాయి బల్లమీద కూర్చున్నారు ఇద్దరూ ఎవరి ఆలోచనల్లో వాళ్ళు మునిగిపోయారు మనస్సు బరువుగా వుంది ప్రకాశానికి మొదటిసారి ఎడబాటుని అనుభవించాడు భార్యనీ, తల్లినీ వదిలిపెట్టి పోలీసు ఉద్యోగంలోకి వెళ్ళినప్పుడు కూడా అతనికి అంత బాధ కలగలేదు ముడిపదార్థంగా పడివున్న అతనికి ఒక రూపమిచ్చాడు గురవయ్య రక్తసంబంధాన్ని మించిన ఆత్మీయత వాళ్ళమధ్య చోటు చేసుకుంది స్నేహమంటే ఏమిటో అర్థం చెప్పాడు ప్రకాశం ఆలోచనలు చాలాసేపు గురవయ్య చుట్టూ తిరిగాయి

'ఈ ప్రపంచంలో మంచోళ్ళున్నారు తాలూకా ఆఫీసు దగ్గర తనకెందుకు చొక్కా యిచ్చాడు జాన్ తనను చదువుకోమని ఎందుకు ప్రోత్సహించింది సీ యల్టై భార్య సుశీలమ్మగారు తనకెందుకు చదువు నేర్పి తన నీ స్థితికి తెచ్చాడు గురవయ్య తనెటుపోతే వీళ్ళకెందుకు? ఎందుకు ఇతరుల్ని గురించి వీళ్ళు పట్టించుకుంటారు? నిజంగా గొప్పవాళ్ళు ఎక్కడో లేరు మనమధ్యే వున్నారు ఇతరుల్ని గురించి ఆలోచించేవాళ్ళే, ఇతరుల మంచి కోరేవాళ్ళే, ఇతరుల అభివృద్ధిని కాంక్షించేవాళ్ళే నిజమైన మనుష్యులు' అనుకున్నాడు

ఆలోచనలతో చాలాసేపు గడిపాడు మనస్సు అంతా దిగులుగా వుంది జాన్‌తోపాటు కలిసివెళ్ళి భోంచేసి వచ్చాడు

తెల్లారింది గబగబా ముఖాలు కడుక్కొని టిఫిన్ చేసి వచ్చారు ఇద్దరి డబ్బులూ ప్రకాశమే ఇచ్చాడు రిక్షాలో కిట్బు బాక్సుల్ని పెట్టుకొని బస్టాండు కెళ్ళారు ప్రకాశం వెళ్ళే బస్సు బయలుదేరటానికి సిద్ధంగా వుంది కండక్టరు నమస్కారం చేశాడు కిట్బుబాక్సుని క్లీనర్‌తో పైన వేయించాడు కండక్టరు ముందు సీటు ఖాళీచేయించి కూర్చోమన్నాడు జాన్ దగ్గర సెలవుతీసుకొని బస్సెక్కాడు ప్రకాశం జాన్ బయలుదేరే బస్సుకు ఇంకా టైం వుంది మూడుగంటల ప్రయాణం తరువాత ప్రకాశం దిగవలసిన వూరు వచ్చింది కిట్బు బాక్సుని క్లీనర్ నెత్తిన పెట్టి, ''అయ్యగారితోపాటు పోయి స్టేషన్లో పెట్టిరా'' అన్నాడు కండక్టరు డ్రైవరూ, కండక్టరు ప్రకాశంకు నమస్కారాలు చేశారు ఆ మర్యాదకు ఆశ్చర్యపోయాడు ప్రకాశం

స్టేషనుకు చేరేసరికి పదిగంట లయ్యింది పెట్టె దించి స్టేషన్ వరండాలో పెట్టి, నమస్కారం చేసి వెళ్ళిపోయాడు క్లీనరు కుర్రవాడు స్టేషను ముందు సెంట్రీ తుపాకీ పట్టుకొని నిలబడి వున్నాడు అతనికి సెల్యూట్ చేశాడు ప్రకాశం

''ఏమిటి? ఇక్కడకు డీ వో పడిందా?'' అడిగాడు సెంట్రీ ప్రకాశాన్ని

''అవును సార్'' అన్నాడు ప్రకాశం స్టేషన్‌ను పరిశీలనగా చూస్తూ

స్టేషనంతా శిథిలావస్థలో వున్నట్లు కనిపించింది ప్రవేశ ద్వారానికి సరిగ్గా పైన సాలెపురుగు పెద్ద గూడు కట్టింది దానిమీద ప్రకాశం దృష్టి పడింది ఆ గూటి చివర్లో ఒక ఈగ చిక్కుకొని గిజగిజాతన్నుకుంటోంది రెండో చివరనుండి పెద్ద సాలె పురుగు చిన్నగా అడుగులేస్తూ ఈగని సమీపిస్తోంది ఆ సాలెగూడు కంటుకుని, చచ్చిన ఈగలు చాలా వున్నయ్ ఎందుకో ఆ దృశ్యం అతనికి కలవరం కలిగించింది

''ఏం పేరు?'' సెంట్రీ పీ సీ అడిగిన ప్రశ్నకు, తన దృష్టిని సాలెగూటి మీదనుండి మరల్చాడు ప్రకాశం

''ప్రకాశం సార్ రైటరుగారున్నారా?'' అన్నాడు

''లోపలున్నాడు వెళ్ళు'' అన్నాడు సెంట్రీ పీ సీ

మళ్ళీ సెంట్రీ పీ సీ కి సెల్యూట్ చేసి, లోపలకు అడుగు పెట్టాడు ప్రకాశం అడుగు పెడుతుండగానే అదోరకమైన, అసహ్యకరమైన వాసన అతని ముక్కుల్ని తాకింది కొత్తకావటం మూలాన గుండె వేగంగా కొట్టుకుంది చిరుచెమట పోసింది ఎదురుగా చెక్క కుర్చీలో కూర్చొని వున్నాడు ఒకతను పాతకాలపు చిన్న చెక్క టేబిలు అతని ముందు వుంది దానిమీద కొన్ని కాగితాలూ, పుస్తకాలూ వున్నయ్

''నమస్కారం సార్'' అన్నాడు ప్రకాశం అతన్ని సమీపిస్తూ, అతనే రైటర్ అనే ఉద్దేశ్యంతో 'నమస్కారం' అన్నట్టు అతను తల పైకీ కిందకూ వూపాడు ప్రకాశాన్ని పరీక్షగా చూస్తూ రెండడుగులు ముందుకు వేస్తూ, ''నేనిక్కడకు కొత్తగా వచ్చాను సార్'' అన్నాడు ప్రకాశం

''ఇక్కడకు డీ వో పడిందా?'' అడిగాడు అతను చేతిలోని కలం టేబిలుమీద పెట్టి వెనక్కువాలి, కుర్చీకి అనుకుంటూ

''అవును సార్ రైటరుగారికి కనపడదామని ''

''నేనే ఏదీ నీ పాస్‌పోర్టు ?''

మళ్ళీ ఒకసారి సెల్యూట్ చేశాడు ప్రకాశం జేబులోంచి డీ వో పాస్‌పోర్టు తీసి అందించాడు ఆ పాస్‌పోర్టుని సాంతం చదివి, ''ఇప్పుడే రిపోర్టు చేస్తావా డ్యూటీకి ? ఇంకా వారం రోజులు

ట్రైముందిగా మంచి రోజు అదీ చూసుకున్నావా?'' అన్నాడు రైటరు

''ఇప్పుడు రిపోర్టు చెయ్యను సార్ పెట్టె పెట్టుకొని, ఇల్లు తీసుకొని, వెళ్ళి మా అమ్మనీ, నా భార్యనీ తీసుకొచ్చుకుంటాను సార్'' అన్నాడు ప్రకాశం

''అట్లాగయితే సరే ఇదిగో నీ పాస్‌పోర్టు జాగ్రత్తగా వుంచుకో రిపోర్టు చేసేటప్పుడు ఇవ్వు లైను హట్స్‌లో నాలుగు ఇళ్ళు ఖాళీగా వున్నాయ్ నీ యిష్టమొచ్చినదాంట్లో దిగు ఎలాగూ వచ్చావు కాబట్టి ఒకసారి అయ్యగారికి కనపడిపో'' అన్నాడు రైటరు

పాస్‌పోర్టు కాగితాన్ని మడిచి జేబులో పెట్టుకుంటూ, అర్థం కానట్లు చూశాడు ప్రకాశం

''లోపల యస్సైగారున్నారు పోయి ఒకసారి కనపడు'' అన్నాడు రైటరు మళ్ళీ

ప్రకాశం యస్సై రూంలోకి వెళ్ళాడు స్మార్ట్‌గా సెల్యూట్ చేశాడు

మందపాటి కళ్ళద్దాల లోంచి ప్రకాశాన్ని ఎగాదిగా చూశాడు యస్సై ఆ అద్దాల్లోంచి యస్సై కళ్ళు యర్రగా, లావుగా, భయంకరంగా కనపడ్డయ్

''నెంబరెంత?'' అడిగాడు బొంగురు గొంతుతో యస్సై చెప్పాడు ప్రకాశం

''ఎక్కడా ట్రైనింగు ? అనంతపురమా, విజయనగరమా ?''

''విజయనగరంసార్''

''అందుకే అంత దరిద్రంగా తగలబడింది అసలు నీలో స్మార్ట్‌నెస్ లేదు వూఁ సరే వెళ్ళు'' అన్నాడు విసుక్కున్నట్టు ప్రకాశం మనస్సు చివుక్కుమంది తిరిగి సెల్యూట్ చేశాడు స్మార్ట్‌గా బైటకొచ్చాడు రైటరుబల్ల దగ్గరకు కొద్దిసేపు అక్కడే నిలబడ్డాడు రైటరు ఏదో రాసు కుంటున్నాడు స్టేషనంతా కలయ చూశాడు ప్రకాశం మొత్తం మూడు గదులు యస్సైకొక రూము రికార్డులూ, తుపాకులూ పెట్టటానికి ఒక చిన్న గది వాటికెదురుగా చిన్నహాలు లాంటిది దానిలోనే ఒక మూల రైటరుబల్లా, కుర్చీ వాటి పక్క పుస్తకాల స్టాండు ఆ హాలు కానుకొని ఖయిదీల కోసం చిన్న సెల్ బయట వరండా ఆ వాతావరణం చూస్తుంటే అతనికి ఏవగింపు కలిగింది దుర్వాసనతో, వెలుతురు లేకుండా, ఎక్కడ పడితే అక్కడ దుమ్ము పేరుకుపోయి, పెంకుతో కప్పిన ఆ స్టేషనంతా బూజుతో నిండివుంది వెలుగుకోసం కప్పుకు అమర్చిన అద్దం ధూళితో నిండివుంది లాకప్‌లో నుండి ఎవరిదో మూలుగు వినపడుతోంది

కొద్దిసేపటికి రైటరు తలెత్తి ప్రకాశాన్ని చూశాడు ''సరే నువ్వెళ్ళు ఇవతలి లైనులో ఆ చివరి నాలుగిళ్ళు ఖాళీగానే వున్నాయ్ నువ్వు ఏదో ఒకటి సెలక్టు చేసుకో'' అన్నాడు ఆ మాట విని రైటరుకు సెల్యూట్ చేసి బయట కొచ్చాడుప్రకాశం

సెంట్రీ పలకరించాడు ''అయ్యగారికి కనపడ్డావా?'' అన్నాడు

''ఆఁ కనపడ్డాను సార్ క్వార్టర్లు ఖాళీగా ఉన్నాయంటగా చూసొస్తాను'' అన్నాడుప్రకాశం సెంట్రీతో మాట్లాడుతూనే అనాలోచితంగా పైకి చూశాడు సాలెపురుగు ఈగని కాళ్ళతో పట్టుకుంటోంది ఈగ తన్నుకుంటోంది ఆ దృశ్యం అతనికెందుకో కలతని రేపింది మనస్సుని కలిచి వేసింది బలవంతంగా దానిమీద నుండి దృష్టిని మళ్ళించి బయట కెళ్ళి పోయాడు

క్వార్టర్సు రెండు లైన్లుగా ఎదురెదురుగా వున్నయ్ రైటరుచెప్పిన నాలుగిళ్ళూచూశాడు గచ్చులుపగిలిపోయి, కప్పులు సరిగాలేవు కొన్నిటికి తలుపులూ, కిటికీలూ వూడిపోయి వున్నయ్. ఎవ్వరూ కాపురం వుండనందున పిల్లలు రాళ్ళూ రప్పలు వేసి చిందర వందర చేశారు. ఒక ఇంటి వసారాలో పిడకలు గుట్ట పోశారు పక్కింటి వాళ్ళు నాలుగిట్లోనూ కాస్త సుబ్రంగా వున్న చివరి

ఇంట్లో దిగాలనుకున్నాడు స్టేషనుకొచ్చి పెట్టె తీసుకెళ్ళి, ఆ యింట్లో పెట్టి, పెట్టెకివున్న తాళం తీసి ఇంటి తలుపుకి వేశాడు ఎదురు ఎదురుగా వున్న ఆ రెండు లైన్ల మధ్య చాలా స్థలం వుంది విశాలంగా 'ఇక భోంచేసి ఇంటికి బయలుదేరాలి' అనుకున్నాడు పూట కూళ్ళ ఇల్లు ఎక్కడో కనుక్కోవటానికి స్టేషనుకు వెళ్ళాడు అప్పటికి మధ్యాహ్నం పన్నెండు గంటలు దాటింది సెంట్రీ మారాడు ఇతను కూడా సీనియర్ కానిస్టేబులే

''నమస్కారం సార్'' అన్నాడు ప్రకాశం వినయంగా

''వూఁ ఎవరు నువ్వు?'' అన్నాడు సెంట్రీ ప్రకాశాన్ని గుచ్చి గుచ్చి చూస్తూ

''నే నిక్కడకు కొత్తగా వచ్చానుసార్ భోంచెయ్యటానికి పూట కూళ్ళ ఇల్లు ఎక్కడో కనుక్కుందామని ''

''ఏం పేరు ? నా పేరు విశ్వనాధంలే''

''ప్రకాశం సార్''

''వేరీ గుడ్ అదృష్టవంతుడివి మంచి స్టేషనుపడింది ఇక్కడ యస్సైగారు మంచోడు సార్జెన్‌గారు మంచోడు రైటరుగారు మంచోడు స్టాఫ్‌కూడా మంచోళ్ళే ఏవూరు మీది ?''

చెప్పాడు ప్రకాశం

''ఏవిట్లు ?''

ప్రకాశం భయపడినంతపనీ అయ్యింది చిన్న గా చెప్పాడు బెరుకుబెరుకుగా ప్రకాశం చెప్పిన సమాధానం విని అతను అదోరకంగాచూశాడు అతని ముఖ కవళికలలో తేలికభావం ద్యోదక మయ్యింది.

''నేనట్లా అనుకోలేదు సుమీ నీ రంగూ, ముక్కూ మొఖం తీరు చూస్తే ఎవరూఅనుకోరు మీ వాళ్ళు కూడా చాలా మంది వున్నారులే పూటకూళ్ళ యింటికి, ఇదిగో ఇటు సరాసరి వెళ్ళి, కుడిచేతివైపు తిరిగి పది గజాలు పోయాక అడుగు ఎవరైనా చెపుతారు పెద గజలక్ష్మి ఇల్లని అడుగు'' అన్నాడు.

ప్రకాశం గిరుక్కున వెనక్కు తిరిగాడు సెల్యూట్ చెయ్యబుద్ధి కాలేదు 'కులాల పట్టింపు లేని చోటు ఈ బూ ప్రెపంచకంలో యక్కడా లేదు' అనుకున్నాడువందోసారి కాండ్రించి వుమ్మేశాడు వెయ్యోసారి

భోజనం చేసి, బస్సు దొరికి, ఇంటికెళ్ళేసరికి బాగా పొద్దు పోయింది ఇంటికెళుతూ కాయలూ, పూలూ, మిఠాయి కొనుక్కెళ్ళాడు

మర్రోజు వెంకటేశం ప్రకాశం దగ్గర కొచ్చాడు స్టేషనుకెళ్ళిన సంగతి చెప్పాడు ప్రకాశం

''ఎల్లుండి మంచిదంట. దూటీకి రిపోర్టు సేద్దాం'' అన్నాడు వెంకటేశం

''నీ యిష్టం నేనుమాత్తరం సెలవంతా సుబ్బరంగా వాడుకొని ఆఖరి రోజున రిపోర్టు సేత్తా నాకన్నీ మంచిరోజులే. పోలీసుల్లో సెలవే దొరకదు దొరికిన సెలవుకూడా వాడుకోకపోతే ఎట్టా?'' అన్నాడు ప్రకాశం.

''నీ చాదస్తకం నీదే. ఎల్లుండి ఒక్కరోజే మంచిదంట. తరవాత పదిరోజులదాకా మంచిరోజు లేదంట. సుబమా అని తొట్ట తొలిసారిగా దూటీకి రిపోరుటు సేత్తన్నాం కూత్త మంచీ సెడూ సూసుకోవాలి మన మింకా ముప్పై అయిదు సంవత్సరాల సరివీసు సెయ్యాల నే సెప్పేది యినుఁ'' అన్నాడు వెంకటేశం

ప్రకాశం ఏమీ మాట్లాడలేదు

ఆరోజు కోడిని కోసి, సజ్జ రొట్టెలు చేసింది ప్రకాశం తల్లి వెంకటేశాన్ని కూడా భోజనానికి పిలిచారు భోజనానికి వస్తూ కొంచెం సారాయితాగి వచ్చాడు వెంకటేశం మాటలు యిష్టమొచ్చినట్లు దూసుకు వస్తున్నాయి ''ఒరే పెకాశంగా, మన మిప్పుడు అచ్చమైన మొగాళ్ళంరా మన కెదురుందా ఈ వూల్లో మనం గవుర్నమెంటోల్లం అశ మన కత్తికి ఎదురేంది ఒరే ఆ ఏ యల్లై పెల్లాన్నీ, ఆ డ్యాక్టరు పెల్లాన్నీ, లంజల్ని '' బూతులు తిట్టాడు ప్రకాశం నవ్వుతున్నాడు

''సరే ఇంక బూ తిను'' అంది ప్రకాశం తల్లి

''అత్తా నువ్వేనా కూరొండింది ?'' ముక్కలు నములుతూ అడిగాడు వెంకటేశం

''మాణిక్యంరా '' అంది ప్రకాశం తల్లి

''ఓల్‌రైట్ మా అమ్మాయి వండింది గాబట్టే ఇంత రుసిగా వుంది అదుబుతం''

భోజనం పూర్తవటానికి షుమారు గంట పట్టింది

మరుసటిరోజు వెంకటేశం కుటుంబంతో సహా బయలుదేరాడు ప్రకాశాన్ని మళ్ళీ హెచ్చరించాడు

''నీ ఉద్దేశ్యాన్ని మారుసుకోలేదంటరా?'' అన్నాడు

''నే నాఖరి రోజే రిపోర్టు చేత్తా''

''పో, నీ యిట్టం ఏదెట్టా జరగాలని వుంటే అట్టానే జరిగిద్ది నీ పట్టే నీది నా మాట యినవు గదా ఈ మాటే గురవయ్య సేపితే యినే వాడివేగా?'' అన్నాడు

ఆ మాటలకు ప్రకాశం నవ్వాడు ''ఏదెట్లా జరగాలని వుంటే అట్లాగే జరిగిద్దని అనుకున్నప్పుడు మనమీ మంచీ చెడుల గురించి ఆలోచించట మెందుకు?'' అన్నాడు ప్రకాశం

''పోరాయదవ నీతో మాట్టాడటం కట్టంరా నీ యిట్టం కాలికేత్తే ఏలికి, ఏలికేత్తే కాలికేత్తావ్ నీ యిట్టమొచ్చినప్పుడు డూటీ కెల్లు'' అన్నాడు

ప్రకాశం ఆ మాటకు ఏమీ మాట్లాడలేదు తరువాత వాళ్ళు రకరకాల విషయాలు ఉద్యోగానికి సంబంధించినవి మాట్లాడుకున్నారు తరువాత వెంకటేశం బయలుదేరి వెళ్ళిపోయాడు

ఇంక రెండు రోజులు సెలవుందనంగా ప్రకాశం బయలుదేరాడు వండుకునే తపేళాలూ, ఒక పుచ్చిపోయిన చెక్కపెట్టె తప్ప, సామానంటూ వేరే ఏమీ లేదు ఉన్న ఆ ఒక్క బొంగుల మంచం కూడా నులక పూర్తిగా పాడయిపోయి అవసాన దశలో వుంది దాన్ని గుడిసెలోనే వుంచేశాడు. కొద్దిగా సుబ్రంగా వున్న ఈతాకుల చాపని చుట్టి తాడుకట్టాడు తడిక తలుపుని దగ్గరకు లాగి, గుడిసెలోకి కుక్కలుపోయి పాడు చేయకుండా వుండటానికి తాడు కట్టాడు

''ఆ తడికాగిద్దా? కుక్కలు, పందులు రేపీపాటికి గుడిసెలోపలంతా గుల్లసెయ్యవూ'' అంది తల్లి

''పోనియ్ మనం ఏం సేద్దాం మనం వచ్చి కాపురముంటామా ఇప్పట్లో బతికి బాగుంటే ఎన్నేళ్ళకో'' అన్నాడు ప్రకాశం

ముగ్గురూ చీకటితోనే పల్లెంతా తిరిగి అందరికీ చెప్పారు సూర్యోదయమైతే అంతా పనుల కెళతారనీ, పల్లెలో ఎవరూ వుండరనీ చీకటితోనే చెప్పొచ్చారు

బరువెక్కిన హృదయాల్తో బయలుదేరారు తపేళాలూ, మట్టి పిడతలు వున్న మూట తను చేత్తో పట్టుకున్నాడు గుడ్డల మూట తల్లి నెత్తిన పెట్టుకుంది అక్కడికి వెళ్ళిన వెంటనే వంటకు

వీలుకాదని జొన్నన్నం వండి, గోంగూర పచ్చడి చేసి, మూటకట్టి పట్టుకొంది ప్రకాశం భార్య ప్రకాశం ముందు నడుస్తుంటే ఆడవాళ్ళు అతన్ని అనుసరించారు వూరుదాటినాక వెనక్కు తిరిగి చూచింది ప్రకాశం తల్లి ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి ఎన్నో జ్ఞాపకాలు ఆమెని చుట్టుముట్టాయి

తాలూకా దాకా నడిచి అక్కడ బస్సెక్కారు ఆడవాళ్ళకి ఆ అనుభవం కొత్త బస్సు వెళుతుంటే భయమేసింది ప్రయాణం సంతోషం కలిగించింది పొద్దుగుంకేవేళకు వూరు చేరుకున్నారు వళ్ళంతా హూనమయ్యింది ఆడవాళ్ళకు

క్వార్టరులోని తలుపు తాళం తీసి, లోపలికెళ్ళి కోడిగుడ్డు దీపం వెలిగించాడు ప్రకాశం ఆడవాళ్ళకు ఆ వాతావణం పూర్తిగా కొత్త తెచ్చుకున్న అన్నం తింటానికి ముందు మంచినీళ్ళు కావాలి ఎవరిని అడగాలో అర్థంకాక సంశయించాడు ట్రైనింగు స్కూల్లో జరిగిన అవమానం గుర్తొచ్చింది కొద్దిసేపు ఆలోచించాడు 'ఎవరు ఎవరో?' అనుకున్నాడు 'సరేకానీ తప్పేదేముంది' అనుకున్నాడు మళ్ళీ పంచలోకి వచ్చి చూశాడు తన యింటికి నాలుగిళ్ళ అవతల ఒకామె నిలబడి వుంది పంచలో పంచలో లాంతరు వేలాడదీసివుంది ఎర్రగా బుర్రగా వుంది ఆమె ఇంకెవరూ బయట కనపడలేదు అనుమానంగానే వెళ్ళి ఆమెని నీళ్ళు అడిగాడు జంకుతూనే

ఆమె అతన్ని చూచింది పంచలో కట్టిన హరికెన్ లాంతరు వెలుగులో ఇద్దరూ ఒకర్ని ఒకరు చూసుకున్నారు ''మాయింట్లో కూడా నీళ్ళయి పోయాయి అదిగో ఆ ఎదురు లైన్లో మూడో యింట్లోగానీ, ఇదిగో ఈ పక్కవాళ్ళని గానీ అడుగు వాళ్ళు మీ వాళ్ళే'' అంది ఆ మాటకు అతని ముఖం చిన్నబోయింది కాని, ఎన్నడూ లేనిది చాలా కోపంగా ఆమెవైపు చూశాడు

'హుఁ ఎంత దారుణం తన బ్రతుకంతా ఇట్లాంటి అవమానాలతోనే గడిచిపోతూ వుంది అనుక్షణం కులం పేరుతో తనని హీనంగా చూస్తూ అవమానిస్తున్నారు ఎప్పటికి ఇది నశించేది' అనుకున్నాడు కోపంతో అతని కనుబొమ్మలు ముడిపడ్డాయి ఆ మాట అని ఆమె అక్కడే అలాగే నిర్లక్ష్యం నిండిన పద్ధతిలో నిలబడి వుంది ఆమెని మింగేశాలాగా చూశాడు కాని తనని తాను తమాయించుకున్నాడు కాండ్రించి వూసి వెనక్కు తిరిగాడు ఆమె చెప్పిన ఇండ్లవైపు చూశాడు ఒక యింటి ముందు ఆడమనిషి సరిగ్గా అప్పుడే బయటకు వచ్చింది ఈమె ప్రకాశంతో అన్నమాటలు ఆమె విన్నది ప్రకాశం అటు తిరగంగానే చటుక్కున ఆమె ఇవతల కొచ్చి, ''నేనిస్తా రండి అన్నయ్యగారూ'' అంది చిన్నగా కేక వేసినట్లు

జరిగిన అవమానంలోనుంచీ, కోపంలో నుంచి తేరుకోక మునుపే, ఆ సంబోధనతో ఆశ్చర్యంలో మునిగిపోయాడు ప్రకాశం తనని కాదేమోనని అటూ ఇటూ చూశాడు ఆమె ఇంతలో లోపలికెళ్ళి, నీళ్ళ బిందెతో తిరిగొచ్చింది వెళ్ళి నీళ్ళబిందె అందుకున్నాడు కృతజ్ఞతగా ఆమెవైపు చూశాడు ఏం మాట్లాడటానికీ తోచలేదు ''ఇప్పుడే తెచ్చిస్తానమ్మా'' అన్నాడు

''ఏం ఫరవాలేదు రేపే యివ్వండి'' అంది ఆమె

ప్రకాశం బిందె మోసుకొని వచ్చాడు భోజనాలు చేసిన తరువాత బిందె తీసుకెళ్ళాడు బయట నిలబడి చిన్నగా పిలిచాడు ''అమ్మా'' అని

ఒకతను బయటకొచ్చాడు ప్రకాశం పిలుపు విని ఏమిటన్నట్లు చూశాడు ప్రకాశం వైపు ''బిందె ఇచ్చిపోదామని వచ్చాను సార్ నేనిక్కడకు కొత్తగా వచ్చాను అన్నాలు తింటానికి నీళ్ళు లేకపోతే ఇందాక అమ్మాయి నీళ్ళిచ్చింది '' అన్నాడు ప్రకాశం

''ఓహో నువ్వా నీ పేరు ప్రకాశం కదూ స్టేషన్లో చెప్పారు రా కూర్చో'' అని పంచలో

వున్న ఓ కుర్చీ చూపించి, తనూ ఒక కుర్చీలో కూర్చున్నాడు ప్రకాశం సంకోచిస్తూ వెళ్ళి కూర్చున్నాడు కుర్చీలో

''నాపేరు గోపాలం నేనిక్కడ కొచ్చి మూడో సంవత్సరం నాకు మొత్తం పద్దెనిమిదేళ్ళ సర్వీసుంది నువ్వు ఇక్కడకు కొత్త ఆ మాట కొస్తే ఉద్యోగానికే కొత్త నీకు పోలీసు స్టేషన్లలో వుండే రాజకీయాలూ, అంటే కుల రాజకీయాలు తెలియవు ట్రైనింగులో నేర్చుకున్నదానికీ ఇక్కడ ఉద్యోగాలకూ సంబంధం వుండదు నువ్విందాక నీళ్ళడిగావంటగా ఒకామెని వాళ్ళు నీళ్ళివ్వరు ఎందుకంటే వాళ్ళు బ్రాహ్మణులు కానీ వాళ్ళకేదన్నా అవసరమొస్తే మాత్రం ఎటువంటి పట్టింపులూ పాటించకుండా పట్టుకెళతారు ఇతరుల కేదన్నా సహాయం చేసే విషయంలోనే ఈ పట్టింపులన్నీ సరే, యీ విషయాలన్నీ నీకు తరవాత్తరవాత తెలుస్తాయిలే ఇకపోతే, నీకు పెళ్ళయ్యిందా? ఏ వూరు? పిల్లలు ఎంతమంది?''

''అయ్యింది సార్ మావూరి పేరు బోడెపూడివారి పాలెం దాన్నే కొండ్రముట్లపాలెం అనికూడా అంటారు వినుకొండకి అయిదు మైళ్ళు తూర్పున పిల్లలింకాలేరు సార్ పెళ్ళయ్యి మూడేళ్ళే''

''మెమ్మా, నాన్నా వున్నారా?''

''మయ్యలేడు సార్ నా సిన్నప్పుడే సచ్చిపోయాడు మమ్మొంది ఇద్దరినీ తీసుకొని ఇందాకనే వచ్చా''

''సరే బాగుంది నీకొక ముఖ్య విషయం చెప్పాలి నేను కూడా సరిగ్గా ఇలాటి పరిస్థితుల లోనే స్టేషనుకు వచ్చి రిపోర్టు చేశాను అప్పుడు నేను ఎన్ని బాధలు పడ్డానో నాకు తెలుసు మనకి జీతాలు రావటానికి ఇంకా పదిరోజుల టైముంది మరి నీ దగ్గర డబ్బులున్నయ్యో లేవో డబ్బులుంటే సరేసరి లేకుంటే నన్నడుగు ఇస్తా బిందెలూ, తపేళాలూ అన్నీ వుంటే సరేసరి లేకుంటే మీక్కావలసినవి తీసుకెళ్ళి వాడుకోండి పదిరోజులపాటు మొహమాట పడమాక మీ లైను వెనకే బావి అందరం ఆ నీళ్ళే కులాలు గిలాలు ఏమీ లేవు అక్కడ నువ్వు దేనికీ సంకోచించ వద్దు ఇక్కడున్న స్టాపులో నలుగురైదుగురు మంచోళ్ళున్నారు మిగతా వాళ్ళంతా దొంగ నాకొడుకులు నేనున్నాను నీకేం భయం లేదు రేప్పొద్దున నీకు కావలసిన సరుకులు ఇప్పిస్తా తీసుకుందువుగాని జీతం రాంగానే ఇచ్చేసెయ్యి మన రైటరు, సార్జెను, యస్సై అందరందరే దొంగలు దొంగలు వూళ్ళు పంచుకున్నట్లు, ఈ నా కొడుకులు ఎవురికి దొరికింది వాళ్ళు గుటకాయ స్వాహా''

''వాళ్ళంతా మంచోళ్ళేనని చెప్పాడే విశ్వనాధం'' అన్నాడు అయోమయంగా ప్రకాశం

''వాడా! వాడి మాటలు నమ్మితే రెండు చేతుల్తో తింటాం వాడి పెళ్ళామే ఇందాక నీకు మంచినీళ్ళు లెవ్వని చెప్పింది సరే వాస్తవలన్నీ తెలుస్తాయిలే తొందరలో మరి డ్యూటీకి ఎప్పుడు రిపోర్టు చేస్తావు?''

''ఎల్లుండి సార్''

''రోజులూ అవీ అంటే తిథీ, వార, నక్షత్రాలూ, మంచీ చెడూ అన్నీ కనుక్కున్నావా?''

''లేదు సార్ నా కట్టాంటియ్యేమీ తెలియదు'' అన్నాడు ప్రకాశం

అతని మాటలు విని గోపాలం నవ్వేడు బిగ్గరగా భార్యని కేకేశాడు ''పార్వతీ ఇట్రారా తొందరగా'' అన్నాడు అతనలా ఎందుకు నవ్వాడో అర్థం కాలేదు ప్రకాశానికి ఆమె చేస్తున్న పని

వదిలిపెట్టి చేతిని పవిటకు తుడుచుకుంటూ వచ్చింది గోపాలం భార్యవైపుచూస్తూ, ''మనోడు మన పార్టీయే నాస్తికుడే తిథీ వారాల పట్టింపు లేదంట'' అన్నాడు

ఆ మాటలు విని ఆమె చిన్నగా నవ్వింది ''పట్టింపులు లేవన్నాడా? లేకపోతే అలాటివి తెలియదన్నాడా?'' అంది

''అవును, నిజమేనేవ్'' అని ప్రకాశం వైపు చూస్తూ, ''నువ్వు ఆస్తికుడివా? నాస్తికుడివా?'' అన్నాడు గోపాలం

ఆ మాటలు ప్రకాశానికి అర్థం కాలేదు చిన్నగా నవ్వి వూరుకున్నాడు తలొంచుకుని అతని స్థితిని గమనించిన గోపాలం, ''అసలు ఆస్తికులంటే ఎవరో, నాస్తికులంటే ఎవరో తెలుసా?'' అన్నాడు

తెలియదన్నట్లు తల వూపాడు ప్రకాశం

''ఆస్తికులంటే దేవుళ్ళున్నారు, దెయ్యాలున్నాయి, కర్మలూ, పునర్జన్మలూ ఇలాటివన్నీ వున్నాయనేవాళ్ళు నాస్తికులంటే వాటిని వేటినీ నమ్మనివాళ్ళు మన కంటికి కనిపించేవాటినీ, మన అనుభూతిలోకి వచ్చే వాటిని మాత్రమే విశ్వసించేవాళ్ళు అర్థమయ్యిందా'' అన్నాడు

సరిగా అర్థం కాకపోయినా, అర్థమయినట్లు తలూపాడు ప్రకాశం

''ఇంకా చెప్పాలంటే '' ఏదో చెప్పబోతుంటే, అతని మాటలకు మధ్యలోనే అడ్డొచ్చింది అతని భార్య

''ఇప్పుడవన్నీ ఎందుకులే గానీ, ఆ అన్నయ్యని పోయి పడుకోనివ్వండి పాపం పాపం ఉదయం నుండీ ప్రయాణం చేసి వచ్చి వుంటారు మీకు సమయం సందర్భం లేదు కొత్త మనిషి దొరికితే చాలు, మీ నాస్తిక సిద్ధాంత ప్రచారం మొదలుపెడతారు'' అంది చిన్నగా నవ్వుతూ ఆ మాటకు గోపాలం కూడా చిన్నగా నవ్వాడు

''సరే రేపు మాట్లాడుకుందాంలే వెళ్ళు ఎక్కడికి పోతావ్ ఇంక'' అన్నాడు నవ్వుతూ

ప్రకాశం కూడా నవ్వి , చిన్నగా ఇంటికొచ్చాడు

జరిగిన విషయం తల్లికీ, భార్యకూ చెప్పాడు

''ఆత్తికులూ, నాత్తికులు అంటే?'' భార్య అడిగింది

''ఏందో నాకూ సరిగా అర్థం కాలా ఆత్తికులంటే దేవుడున్నాడు, దెయ్యాలున్నయ్యి అనే వాళ్ళంట. నాస్తికులంటే దేవుడు లేడూ గీవుడులేడూ అనే వాళ్ళంట ఈ లెక్కన గోపాలంగారు నాస్తికులన్నమాట'' అన్నాడు

ఆ మాట విని ఆడవాళ్ళు మెదలకుండా వూరుకున్నారు.

గవర్నమెంటువాళ్ళిచ్చిన కంబడి పరచుకొని వరుసగా పడుకున్నారు ముగ్గురూ

''అయితే యీళ్లు దేవుడు లేడంటారా? బాగానే వుంది ఆ కోటయ్య సామి లేకపోతే మనమంతా యాడనుండి వశ్చామంట?'' అంది ప్రకాశం భార్య నవ్వుతూ

''మీ అయ్యకి దెయ్యాలు ఎన్ని చార్లో అగపడ్డాయి పొలంకాడ గోరీల్లోపడి వత్తా వుంటే ఒకసారి ఆడ దెయ్యం ఎంటపడిందంట దాన్ని రానిచ్చి రానిచ్చి గభాలున జుట్టు పట్టుకొని, ఎడం కాలి సెప్పుతో మాడు మీద మాడు మీద జవిరొదిలి పెట్టాడు అది పెడబొబ్బలు పెడతా వురికిందంట. దెయ్యాలెందుకు లెవ్వూ! అయితే అయి అందరికీ అగపడవంట'' అంది తల్లి

''సింగన్న మావకు కూడా ఒకసారి రేత్తిరిపూట ఆ ల్లాసామి సేనుకి కాపలా వున్నప్పుడు

కొరివి దెయ్యం కనపడితే, ఆయన ఆ దెబ్బకు ఆరు లంకనాలు సెయ్యాలా ఆ వూరేవూరో తీసుకెళ్లి అంత్రం కట్టించుకొచ్చాక గదూ మళ్లీ మడిసయ్యింది'' అంది భార్య ''దెయ్యాలికి కాళ్ళు ఎనక్కి తిరిగుంటాయంట, మయ్య సెప్పేడు'' అంది ఆమే మళ్ళీ

ప్రకాశంకు ఈ మాటలు అంతగా రుచించలేదు విశ్వనాథం భార్య అన్న మాటలే ఇంకా చెవుల్లో గింగురుమంటున్నాయి

''సరే ఇంక పండుకోండి రేప్పొద్దున్నేపోయి, ఇంటోకి కావలసినయ్యి అన్నీ తెత్తా ఏమేం కావాలో సెప్పండి'' అన్నాడు

''డబ్బు లేడియ్యి?'' అంది అతని భార్య

''గోపాలంగారు అప్పిప్పిత్తానన్నాడు కోమటోడి కాడ మరి లేకపోతే జీతాలు వచ్చిందాకా ఎట్టా? వున్న డబ్బులు కర్సులకే సరిపోతయ్యి''

''ఆయన మంచోడే పాపం కాని దేవుడు లేడంటం నాకేం నచ్చలా'' అంది తల్లి

''ఏం అంటే దానివల్ల మనకేంది నష్టం వాళ్ళు మంచోళ్ళా కాదా అనేదే మనకు కావాల్సింది అంతే'' అన్నాడు ప్రకాశం

తరువాత వాళ్ళు చాలాసేపు మాట్లాడుకున్నారు పిచ్చాపాటి ఎప్పటికో నిద్రపోయారు

మరుసటిరోజు ఉదయం గోపాలంతో కలిసి చిల్లరకొట్టు కెళ్ళాడు కొట్టుతను గోపాలానికి నమస్కరించాడు గోపాలం కొట్టుతనికి ప్రకాశాన్ని పరిచయం చేస్తూ, ''ఇతను ఇక్కడకు కొత్తగా వచ్చాడు డబ్బుల్లేవు సరుకు లివ్వండి జీతం తీసుకోగానే ఇచ్చేస్తాడు నేను హామీ'' అన్నాడు

ఆ మాటకు కొట్టుతను బొంగురు గొంతుకతో, ''దానికేం భాగ్యం అట్టాగే పట్టుకెళ్ళండి'' అని కూర్చోమని బల్ల చూపించాడు తరువాత ప్రకాశం వైపు చూస్తూ, ''అయ్యగారూ, తమరి పేరు '' అంటూ ఆగిపోయాడు

''నా పేరు ప్రకాశం'' అన్నాడు ప్రకాశం కొట్టుతను ఇంకేదో అడగబోతున్నాడు కులం అడుగుతాడేమోనని ప్రకాశం మనస్సు కొట్టుకుంటోంది షావుకారు మాటలకు అడ్డు వస్తూ, ''ఇంక మిగిలిన వివరాలు మీ కనవసరం పేరు చెప్పాడు చేస్తున్నది పోలీసు కానిస్టేబులు వుద్యోగం నేను హామీ ఇంక మీరు సరుకులు కట్టవచ్చు'' అన్నాడు గోపాలం గంభీరత నిండిన స్వరంతో

ఆ మాటకు బిత్తరపోయాడు షావుకారు కాని ఆ మాటతో విషయం అర్థమయినట్టు నవ్వాడు

''ఆఁ ఆఁ అట్టాగే నేనింకేమీ అడగబోవటం లేదు'' అంటూ లోపలికి వెళ్ళాడు

''వెధవ లంజాకొడుకులు కులం అడిగిందాకా మనస్సు కుదుటపడదు'' తిట్టాడు కోపంగా గోపాలం ప్రకాశం నవ్వాడు సరుకులు తీసుకొని ఇంటి కొస్తుంటే దారిలో విశ్వనాథం కనిపించాడు

''ఎక్కడినుండీ రాక?'' నొసలు ముడివేస్తూ అడిగాడు

''ఆఁ ఇక్కడనుండే గోపయ్యోళ్ళ కొట్టు దగ్గరనుండి'' అన్నాడు గోపాలం

''మంచిది, మంచిది'' అంటూ వెళ్ళాడు విశ్వనాథం వడివడిగా

''దొంగ నా కొడుకులు అందరందరే నువ్విక్కడ చాలా జాగ్రత్తగా వుండాలి కొద్ది రోజులంటే అన్నీ అర్థమవుతాయి నీకే పరిస్థితి అంతా తెలిసిద్ది ఇంత దరిద్రపు స్టేషను జిల్లాలో లేదు నేను చాలా స్టేషన్లు చేశానుగానీ, ఇంత వెధవలున్న చోటు చూడలేదు నువ్వు మాత్రం ఎక్కడ విన్న విషయాలు అక్కడే మర్చిపో ఎక్కడా నోరు జారమాక నీకు బాగా గ్యాసు

కొడతారు నీచేత ఏవేవో అనిపిస్తారు అవన్నీ మోసుకెళ్ళి యస్సైకి చాడీలు చెపుతారు'' అన్నాడు ప్రకాశం వింటూ తలూపాడు

మరుసటిరోజు ఉదయం చద్దన్నం తిని యూనిఫారం వేసుకొని డ్యూటీకి రిపోర్టు చేయటానికి బయలుదేరాడు అలా డ్రస్సులో వున్న ప్రకాశాన్ని ఆశ్చర్యంగా, ఆనందంగా కళ్ళార్పకుండా చూశారు భార్యా, తల్లి ఇంట్లో నుండి బయటికొచ్చేటప్పుడు తల్లి అంది, ''అయ్యా! కోటయ్య సామికి దణ్ణం పెట్టుకొని పో'' అని

ఆ మాటలు విని చిన్నగా నవ్వాడు ప్రకాశం ఉదయం ఎనిమిది గంటలయ్యింది స్టేషనుకు వెళ్ళాడు యస్సై ఇంకా రాలేదు హెడ్ కానిస్టేబులూ, రైటరూ మిగిలిన పోలీసు కానిస్టేబుళ్ళూ వచ్చారు

అందరూ రైటరు వుండే చిన్న హాలులోనే ఒకపక్కగా నిలబడి ఏదో పిచ్చాపాటి మాట్లాడు కుంటున్నారు బైట గేటు దగ్గర సెంట్రీ తుపాకీ పట్టుకొని నిలబడి వున్నాడు సెంట్రీ ప్రకాశాన్ని చూస్తూనే, ''నువ్వేనా కొత్తగా వచ్చిన రిక్రూట్‌షి'' అన్నాడు

ఔనన్నట్లు తల వూపాడు ప్రకాశం

''ఉహూ! ఇవ్వాళ రిపోర్టు చేస్తున్నావా? ఇవ్వాళ మంచిదేనా? మంచిరోజా అదీ చూసుకున్నావా? ఈరోజు ఆదివారం అనుకుంటా మంచిదేనా?'' ప్రశ్నల వర్షం కురిపించాడు అతని మాటల్ని బట్టి అతను ముస్లిం కాబోలు అనుకున్నాడు ప్రకాశం అతని ప్రశ్నలకు జవాబు చెప్పేలోగా లోపల్నుండి గోపాలం చెయ్యి వూపితే లోపలకు వెళ్ళాడు ప్రకాశం

''ఏంటి అబ్దుల్లా అంటున్నాడు?'' అన్నాడు గోపాలం

''ఏం లేదు మంచిరోజేనా, ఇవ్వాళే రిపోర్టు చేస్తావా అని అడుగుతున్నాడు'' అంటూ రైటరు దగ్గరకెళ్ళి సెల్యూట్ చేసి పాస్‌పోర్టు ఇవ్వబోయాడు

''ఉంచు, నీ దగ్గరే ఉంచు యస్సైగారికి ఇద్దువుగాని రోజీపాటికి వచ్చేవాడే ఈపూటెందుకో ఆలశ్యమయ్యింది'' అన్నాడు రైటరు చిన్నగా గొణుగుతున్నట్టు పాస్‌పోర్టు జేబులో పెట్టుకొని, తిరిగి రైటరుకు సెల్యూట్ చేసి, మిగిలిన పీ సీ లంతా నిలబడ్డచోటుకి వెళ్ళాడు ప్రకాశం మల మూత్రాల దుర్గంధం వేస్తోంది అక్కడ అక్కడున్నవాళ్ళంతా తలా ఒక ప్రశ్న వేశారు ప్రకాశాన్ని అందరికన్నా ప్రత్యేకంగా కాస్త దూరంలో నిలబడి మాట్లాడుతున్నాడు విశ్వనాధం పదిమందీ పది ప్రశ్నలు వేశాక తిరిగి తమ ధోరణిలో పడిపోయారు అంతా వాళ్ళు ఏదో కేసు గురించి చర్చించుకుంటున్నట్లు తోచింది ప్రకాశానికి ఆసక్తిగా ఆలకించాడు

''ఇప్పుడొచ్చిన జడ్జి మంచోడంట ఆయన చేతిలో పడితే ఈడికి వురిశిక్ష తప్పదు'' అన్నాడు ఒక కానిస్టేబులు

''ఆఁ ఇట్లాంటియ్యి మన సర్వీసులో ఎన్ని చూడలేదూ ఇది వూరికే ఎగిరిపోయిద్ది అసలు ఐ ఇట్‌నెస్ ఏది? నేనంటున్నానుగా, కావాలంటే చూస్కో'' అన్నాడు ఒకతను

స్టేషనంతా ఓసారి మరలా కలియజూశాడు ప్రకాశం రైటరు బల్ల కెడమవైపున పెద్ద చెక్క బీరువా వుంది దానిపక్కనే నేలమీద మూడు బెడ్డింగులు వున్నయ్ 'గార్డు పీసీలు పడుకునేదిక్కడే కాబోలు, అబ్బా ఎంత దారుణం' అనుకున్నాడు అలవాటయిపోవటం వలన కాబోలు వాసన అంత ఎక్కువ అనిపించలేదు ఆ కాసేపటికే రెండడుగులు ముందుకువేసి లాకప్పు గది దగ్గరకు వచ్చి నిలబడ్డాడు లాకప్పు లోపల చీకటిగా వుంది అక్కడనుండే దుర్వాసన వస్తున్నది లాకప్పు

గది తలుపుకు రెండు గజాల దూరంలో నాలుగు తుపాకులు నిలబెట్టే స్టాండు వుంది దానికి రెండు చుట్టిన పాత ఈత చాపలు ఆనించి వున్నయ్ లాకప్పు లోపలకు తొంగి చూశాడు భరించలేనంత ఘాటు వాసన వస్తున్నది మలమూత్రాలు కలిసిన ఆ వాసనకు అక్కడ నిలబడలేకపోయాడు లోపల ఒక అతను పంచెకట్టుకొని, పైపంచె నేలమీద పరచుకొని నిద్ర పోతున్నాడు ముఖం సరిగా కనిపించలేదు బాగా గడ్డం పెరిగి వుంది అతన్ని అలా చూచేసరికి ప్రకాశానికి భయమేసింది కారణం తెలియలేదు వాసనకు ఇక అక్కడ నిలబడలేక ఇవతలకు వచ్చాడు అంతలో యస్సై వస్తున్నట్లు బయట నిలబడి వున్న సెంట్రీ చిన్నగా కేకవేసి చెప్పాడు ఆ కేక విని అంతా ఎలర్ట్ అయిపోయారు చొక్కా గుండీలు సర్దుకొని, టోపీలు సరిగా పెట్టుకొని నిలబడ్డారు అంతా

యస్సై వచ్చే సమయంలో బయటవున్న సెంట్రీ తుపాకిని భుజాన పెట్టుకొని కుడి అరచేతితో తుపాకి బట్ మీద ఛట్‌మని కొట్టి, బట్ సెల్యూట్ చేశాడు యస్సైకి యస్సై కూడా చెయ్యెత్తి సెంట్రీకి సెల్యూట్ చేశాడు యస్సై లోపలకు రాగానే లోపలున్న వాళ్ళంతా అతనికి సెల్యూట్‌లు చేశారు ఒక్కసారే కానీ అతనెవరికీ సెల్యూట్ చెయ్యలేదు వెళ్ళి తన గదిలో కూర్చున్నాడు సార్జెన్, స్టేషను రైటరూ యస్సైని అనుసరించారు రెండు నిముషాల తరువాత, ''రోల్‌కాల్'' అని కేకవేశాడు రైటరు పీసీ లందరూ యస్సై రూములోకి వెళ్ళి వరుసగా నిలబడ్డారు

అందరివైపూ ఒకసారి పరిశీలనగా చూశాడు యస్సై అతని దృష్టి ప్రకాశం మీద నిలబడింది ''డ్యూటీ కొచ్చావా?'' అడిగాడు బొంగురు గొంతుతో

''సార్'' అన్నాడు ప్రకాశం

''ఉద్యోగం జాగ్రత్తగా చేసుకో మిగిలినవాళ్ళతో కలిసి తిరిగి చెడిపోగాకు కష్టపడి పని నేర్చుకుంటే బాగుపడతావ్'' అని రైటరు వైపు తిరిగి, ''ఎవరైనా గైరుహాజరు అయ్యారా?'' అన్నాడు

''లేదు సార్, అందరూ ప్రజెంటే'' అన్నాడు రైటరు

రఫ్‌డ్యూటీరోష్టరు పుస్తకాన్ని యస్సై టేబిలుమీద పెట్టాడు రైటరు ప్రకాశం యస్సై గదినంతా కలియ జూశాడు గోడకు కొట్టిన మేకులకు బేడీలు వేలాడుతున్నయ్ ఒకపక్క వాటిపక్క పొడవాటి చైను వేలాడుతోంది కుర్చీకి పక్కగా ఒక చెక్కపెట్టె వుంది పైకప్పు అంతా బూజు పట్టివుంది

''ఈరోజు కోర్టు ఏమన్నా వుందా?'' రైటరు నడిగాడు యస్సై

''వుంది సార్ క్రైం నెంబరు ముప్పై ఏడు సార్ ఈరోజే వాయిదా సార్'' అన్నాడు రైటరు

''సరే'' అని, నిలబడివున్న పీసీల వైపు చూస్తూ, విశ్వనాథం మీద దృష్టి నిలిపి, ''కోర్టుకు నువ్వెళ్ళు'' అన్నాడు యస్సై

వరుసలోనుండి ఒక అడుగు ముందుకువేసి, సెల్యూట్‌చేసి, ''అట్లాగే సార్'' అన్నాడు విశ్వనాథం

''మిగిలినవాళ్ళంతా వెయిటింగ్‌లో వుండండి'' అన్నాడు యస్సై

అంతా సెల్యూట్‌లు చేసి బయటకు వచ్చారు మళ్ళీ ఇందాక నిలబడ్డ చోటుకు చేరి కబుర్లు మొదలు పెట్టారు యస్సైకి వినబడతాయన్నట్లు చిన్నగా గుసగుసలాడుతున్నారు విశ్వనాథం

రైటరు బల్లదగ్గర నిలబడి కోర్టుకు తీసుకు వెళ్ళవలసిన సి డీ ఫైలు (కేసు డైరీ ఫైలు) తీసుకొని, పాస్‌పోర్టు రాయించుకొని వెళ్ళాడు విశ్వనాథం పోయిన వైపుకు చూస్తున్న వాళ్ళకు పీ సీ నర్సింహారావు లోపలకు వస్తూ కనిపించాడు

''చిన్న యస్సైగారు వస్తున్నాడు'' అన్నాడు గోపాలం మిగతా వాళ్ళు అంతా ఆ మాటకు నవ్వారు నర్శింహారావు లోపలకు వస్తూనే రైటర్ని చూచి నవ్వాడు సింహం కుందేలు పిల్లని చూచి నవ్విన నవ్వులాగా తోచింది రైటరుకు ఆ నవ్వు తరువాత నరసింహారావు యస్సై గదిలోకి వెళ్ళాడు

''రైటరుకు సెల్యూట్‌కూడా చేయడువాడు'' అన్నాడు ఒక పీసీ

''రైటరే వాడికి సెల్యూట్ చెయ్యాలి వాడి పని ఇప్పుడట్లావుంది వాడు తలుచుకుంటే రైటర్ని మూడు చెరువుల నీళ్ళు తాగిస్తాడు మొన్నటిదాకా కోటేశ్వరరావు, వాడు పోయినాక వీడు ఆ పోస్టులో చేరిపోయాడు ఆ ఆర్డర్లీ పోస్టు సంపాదించటానికి వీడు ఎన్ని తంటాలు పడ్డాడని మగోడిలాగా ఉద్యోగం చెయ్యాలిగానీ, అదేందిరా ఆడముండల వుద్యోగం'' అన్నాడు ఒక పీసి అతని పేరు డేవిడ్ అందరూ డేవిడ్ వైపు చూశారు

ఆ మాటకు గోపాలం నవ్వాడు

''నువ్వన్నది నిజమే ననుకో డేవిడ్ కానీ కోటేశ్వరరావు ట్రాన్స్‌ఫర్ అయిపోయినాక, యస్సై గారింట్లో ఆర్డర్లీగా చేరాలని, ఎవరెవరు ఎంతెంత తంటాలు పడ్డారో మనకు తెలియనిది కాదుకదా'' అన్నాడు ఆ మాటకు డేవిడ్ నవ్వాడు కొంతమంది పీసీలు ముఖాలు దించుకున్నారు

''వాడూ, వాడి యవ్వారం, పొద్దున్నే లేచి ముప్పై మంది దేవుళ్ళకు దండాలు పెట్టి ఇంత బొట్టు పెట్టుకొని ఇంట్లో నుండి బయలుదేరతాడు ఏ అర్ధరాత్రికో తిరిగి కొంపకు చేరేది ఈలోపు వాడు చెయ్యని వెధవపని లేదుకదా ఏదో సామెత చెప్పినట్టు, చేసేది శివపూజ ''

గోపాలంమాట పూర్తి కాకముందే, ''ఇట్టాంటోళ్ళని బట్టే అట్లాంటి సామెతలు పుట్టేది మహానుభావుడు, రైటరుగారికి ఏం కబురు తెచ్చాడో '' అన్నాడు ఒక సీనియర్ పీసీ అతని పేరు గురుమూర్తి

''ఆఁ ఏముంటుంది అమ్మగారు కోడినో, కుక్కనో తెమ్మనుంటుంది అయ్యగారికి తెలవకుండా ఏదీ జరగకూడదు కదా!'' అన్నాడు డేవిడ్

''అవును ఇట్టాంటి కోళ్ళూ కుక్కల విషయాలు అయ్యగారికి తెలియకుండా జరగవులే కాని అసలియ్యి, పెద్దపెద్దయ్యి మాత్రం మూడో కంటికి తెలియకుండానే జరిగిపోతయ్ గదా'' అన్నాడు గోపాలం ఆ మాటకు అందరూ నవ్వారు

''ష్ చిన్నగా గోడలకు చెవులుంటాయి అది సరేలే అది బహిరంగ రహస్యమేలేకానీ అది ఒదిలెయ్యండి నర్శింహంగాడు స్టేషనుకు రాంగానే రైటరు ముఖం ఏంది కందగడ్డలాగా మారిపోయింది ? పాపం తెగరాస్తున్నాడు రికార్డు తలెత్తకుండా'' అన్నాడు డేవిడ్ నవ్వుతూ

''కందగడ్డ కాక ఏముంది? అయ్యగారిప్పుడు ఏం తెప్పిచ్చ మంటారో అమ్మగారు ఏం బురు చేసిందో? అక్కడికి రైటరుకు డబ్బు లొత్తాయనే పేరేగానీ, అయ్యగారు పైసా గల్చడుగదా రైటరు ఆళ్ళనోళ్ళూ, ఈళ్ళనోళ్ళు కొట్టి సంపాదించేదీను, అయ్యగారి మొకాన రబోసేది అట్టాంటప్పుడు ఏడుపుగాక ఏముంటుంది అయ్యగారి కేమో చానా ఆనెస్టని పేరు నికయినా తెలివుండాలి మరి'' అన్నాడు గోపాలం వాళ్ళనుకున్నట్లుగానే యస్సై గదిలో నుండి

రైటరు దగ్గర కొచ్చి టేబిలు మీద చేతులానించి నిలబడ్డాడు నరశింహం

'ఏమిటన్నట్లు' చూశాడు రైటరు నరశింహం వైపు

''అమ్మగారు, మాంచి కోడిపెట్టని, కన్నెకోడిపెట్టని తెమ్మంది అయ్యగారు సెప్పమన్నారు మసాలా మాత్రం ఇంటిలోనే వుందంటలేండి ఈసారికి'' అన్నాడు నరశింహం

రైటరు కోపంగా చూచి తల దించుకున్నాడు అతని ముఖం మాడిపోయింది కోపంతో గుటకలు మింగాడు కాగితంమీద ఏవో గీతలుగీస్తూ చాలా సేపు ఉండిపోయాడు అలాగే నరశింహం తనవైపు చూస్తున్న పీసీలవంక చూచి, రైటరు అవస్థని ఎగతాళి చేస్తున్నట్లు నవ్వాడు వెకిలిగా పీసీలంతా కూడా అతని నవ్వులో శృతి కలిపారు నిశ్శబ్దంగా వాళ్ళ వైపు నుండి దృష్టి మరల్చి, ''ఏంసార్, కోడిపెట్ట సంగతి'' అన్నాడు నరశింహం రెట్టిస్తున్న ధోరణిలో రైటరు తలెత్తి నరశింహం వైపు చూశాడు కోపంగా

''ఇంక నేను చెప్పేదేంది కోళ్ళ కోటమ్మ దగ్గరకుపోయి తీసుకుపో'' అని పీసీల వంక చూచి చటుక్కున తల దించుకొన్నాడు వుడుకుమోతుతనం అతనిలో కనపడింది నరశింహం స్టాఫ్‌వైపు చూస్తూ, నవ్వుతూ బైట కెళ్ళాడు

'నా కొడుకులకు కోళ్ళూ కుక్కలు కావాలి మా కొంపల్లో పప్పుచారుకు దిక్కులేదు' చిన్నగా గొణుక్కున్నాడు ఎవరికీ వినపడకుండా రైటరు అతని కడుపు మండిపోతోంది యస్సైని కసిగా తిట్టాడు తననితాను కొద్దిసేపు తిట్టుకున్నాడు తన ఉద్యోగాన్ని కొద్దిసేపు తిట్టుకున్నాడు

''రై రర్'' యస్సై కేకేశాడు చిన్నగా, 'ర' ని ఒత్తి పలుకుతూ

ఆ కేకకు ఉలిక్కిపడి చూచి, గభాలున టేబిలుమీదున్న టోపీ తీసుకొంటూ, ''సార్'' అని జవాబిచ్చాడు రైటరు క్షణాల్లో ముఖానికి నవ్వు పులుముకొని యస్సైరూంలోకి అడుగుపెట్టి, అతివినయంగా సెల్యూట్ చేశాడు యస్సై, రైటరు ముఖాన్ని క్షణంలో సగం సేపు చూచి చదవటానికి ప్రయత్నం చేశాడు నరశింహం వచ్చిపోయిన సందర్భంగా రైటరులో వచ్చిన మార్పుని అంచనా వేయటానికి ప్రయత్నించాడు 'ఏం ఫరవాలేదు వీడేమీ యాడవటం లేదు కోడికి డబ్బు లిచ్చినందుకు' అని నిశ్చయించుకున్నాక, ఏదో అడిగాడు అప్రస్తుత విషయం

యస్సై అన్న వాటికన్నిటికీ ''యస్ సార్' అంటూ వంతపాడి, తిరిగి సెల్యూట్‌చేసి బయట కొచ్చాడు రైటరు మరుక్షణంలో వూసరవెల్లికి మారినట్లు అతని ముఖంలో రంగులు మారాయి మనసులోనే తిట్టుకుంటూ, పీసీల వంక చూచి, ''మీరెల్లండి అంతా ఇళ్ళల్లోనే ప్రెజెంట్‌లో వుండండి అవసరమొస్తే పిలిపిస్తా'' అన్నాడు అంతా అతనికి సెల్యూట్‌లు చేసి బయటకు వచ్చారు

ప్రకాశం ఇంటికెళ్ళి భోజనం చేసి పడుకున్నాడు 'ఒక మంచముంటే బాగుండు వచ్చే జీతం తీసుకోంగానే వెదురుబొంగుల మంచ మొకటి చేయించాలి ముందు' అనుకున్నాడు తిరిగి సాయంత్రం అయిదు గంటలకు రోల్‌కాల్‌కు స్టేషనుకు వెళ్ళాడు ఇంటికి తిరిగి వచ్చేసరికి ఆరుగంట లయ్యింది రాత్రి ఎనిమిది గంటలకు నైటు బీటుకు వెళ్ళాడు ఆ రాత్రి బీటు ఆ వూళ్ళోనే సర్వీసులో ఇదే మొదటి నైటుబీటు ప్రకాశానికీ, విశ్వనాధానికీ కలిపివేశారు విశ్వనాధం ఇంటినుండి వస్తూ లాంతరు తెచ్చుకున్నాడు వెంట

''నీకు లాంతరు లేదా?'' ప్రకాశాన్ని అడిగాడు

''లేదుసార్'' అన్నాడు ప్రకాశం

''సరేలే ఒక లైటు చాలులే ఇద్దరికీ వుంటే మంచిదనుకో'' అన్నాడు విశ్వనాధం బీటు పుస్తకం తీసుకొని స్టేషన్‌నుండి ఎనిమిది గంటలకు బయలు దేరారు ఇద్దరి దగ్గరా లారీలు వున్నయ్ ''ఈ బీటు పుస్తకం జేబులో పెట్టుకొని, ఈ లాంతరు పట్టుకో'' అన్నాడు విశ్వనాధం

వీధుల్లో పహారా మొదలు పెట్టారు జనసంచారం తగ్గిపోయింది దూరంగా ఎక్కడో కుక్కలు మొరుగుతున్నయ్

''అయితే మీ దేవూరన్నావ్?'' అడిగాడు ప్రకాశాన్ని విశ్వనాధం

ప్రకాశం జవాబు చెప్పాడు ఒకదాని తరువాత ఇంకొక ప్రశ్న చొప్పున రకరకాల ప్రశ్నలు వేశాడు విశ్వనాధం జవాబులు చెప్పాడు ఓపిగ్గా ప్రకాశం

''నాకు కులాల పట్టింపు ఏమీ లేదు నువ్విక్కడ చాలా జాగ్రత్తగా వుండాలి ఉద్యోగం జాగర్తగా చేసుకో మాబోటివాళ్ళకు ఉద్యోగం పోయినా బాధలేదు ఇంటిదగ్గర సచ్చినంత పొలం వుంది నేను వ్యవసాయం చెయ్యాల్సిన పనే లేదు మా అన్నయ్య వాళ్ళున్నారు నేనేదో సరదాగా వుద్యోగం చేస్తున్నా నువ్వంటే మరి నీకు సెంటు భూమికూడా లేదంటున్నావుగా మరి అట్లాంటప్పుడు ఈ ఉజ్జోగం చాలా జాగ్రత్తగా చేసుకోవాలి '' చెపుతున్న మాటలు ఆపి, ఒక పెంకుటింటి వైపు వేలు చూపిస్తూ, ''ఇది మునసబుగారి ఇల్లు ఇక్కడ మనం సంతకం పెట్టి పోవాలి పాయింటు పుస్తకం వుంది'' అని ఆ ఇంటి తలుపు మీద లారీతో కొట్టి, ''మునసబుగారూ'' అని పెద్దగా పిలిచాడు

కొద్దిసేపటికి తలుపు తెరుచుకుంది ఒక ముసలాయన బయటకు తొంగిచూచి, ''ఎవరూ, విశ్వనాధం, నువ్వేనా?'' అని ప్రకాశం వైపు పరిశీలనగా చూచి, ''ఎవరో కొత్త అతను లాగున్నాడే'' అన్నాడు దీర్ఘంతీస్తూ

''అవునండీ ఈరోజే కొత్తగా వచ్చాడు ట్రైనింగునుండి ఇక్కడికే రావటం ఇదే మొదటి డ్యూటీ'' అన్నాడు విశ్వనాధం, లోపలికి అడుగుపెడుతూ

మునసబు లోపలకి నడుస్తూ, ''అట్లాగా అయితే నీతోనే మొదటి సారి దూటీ పడిందన్నమాట మంచిది నౌకరీలోని మెలుకువలన్నీ నేరుపు'' అన్నాడు ఆ మాటకు విశ్వనాధం నవ్వాడు

మునసబు తెచ్చిన పాయింటు పుస్తకం, కలం తీసుకొని పాయింటు పుస్తకంలో సంతకం చేశాడు విశ్వనాధం ఆ సంతకం చేసే తీరు చూస్తుంటే పాళీ ఎక్కడ విరిగిపోతుందో అనే అనుమానమేసింది ప్రకాశానికి తను సంతకం చేసి, ప్రకాశానికి పాయింటు పుస్తకం అందిస్తూ ''ఏలుముద్దరేగా?'' అన్నాడు

''సంతకం పెడతా''

''ఊహూ అయితే పర్లేదు సంతకం వరకన్నా నేర్చుకున్నావ్'' అని పాయింటు పుస్తకం, కలం ప్రకాశానికి అందించి, ''ఇదిగో ఇక్కడ సంతకం పెట్టు'' అన్నాడు

లైటు వెలుగులో విశ్వనాధం పెట్టిన సంతకాన్ని పరీక్షగా చూశాడు ప్రకాశం అదేం సంతకమో, ఏం పేరో, ఎంతసేపటికీ అర్ధం కాలేదు తను సంతకంపెట్టి పుస్తకాన్ని విశ్వనాధానికిచ్చాడు మునసబు వీళ్ళ దగ్గరున్న బీటు పుస్తకంలో సంతకం పెట్టి, విశ్వనాధం తిరిగి యిచ్చిన పాయింటు పుస్తకం తీసుకొని చూస్తూ, ''ఏం పేరూ'' అంటూ ప్రకాశం పెట్టిన సంతకం చూసి, ''ఊఁ చక్కగానే పెట్నావే ఏం చదువుకున్నా వేందీ?'' అన్నాడు

''అయిదో క్లాసు సార్'' అన్నాడు ప్రకాశం తటపటాయిస్తూ విశ్వనాధం వెంటనే అందుకున్నాడు

''చాలు అంతకన్నా ఎందుకు? చదువుకున్నవాళ్ళు అంతకన్నా పొడుస్తున్నారా?'' అంటూ ప్రకాశాన్ని పొగుడుతున్నట్లు మాట్లాడుతూ, మునసబువైపు చూస్తూ, ''కుర్రోడు నెమ్మదైనవాడు, మంచివాడు, మాలోళ్ళకుర్రోడులేండి'' అన్నాడు ఆమాట విన్న వెంటనే మునసబు ప్రకాశం వైపు అదోరకంగా చూశాడు అవమానపరిచే ఆ పరిచయమైన చూపు, మసక వెలుతురులో ప్రకాశానికి చురుక్కున గుచ్చుకుంది తలవంచుకున్నాడు

''వస్తామండీ మునసబుగారూ పడుకోండింక రోజూ మీ కిదొక డ్యూటీ నిద్రలేకుండా'' అంటూ బయటకు నడిచాడు విశ్వనాధం అయిష్టంగానే మునసబుకు నమస్కారం చేసి విశ్వనాధాన్ని అనుసరించాడు ప్రకాశం

వీధులన్నీ నిర్మానుష్యంగా వున్నయ్ ఆకాశంలో చంద్రుడు మబ్బులచాటున మసగ్గా వెలుగుతున్నాడు అంతవరకూ వుల్లాసంగా వున్న ప్రకాశం మనస్సు బాధతో నిండిపోయింది దానికి తోడు ఎక్కడా కూర్చోకుండా తిరుగుతూ వుండటంమూలాన కాళ్ళు మొద్దులయి పోయాయి శరీరం విశ్రాంతి కోరుతోంది నిద్ర కళ్ళమీద కొచ్చి నిలబడింది విశ్వనాధం అదేపనిగా ఏదేదో మాట్లాడుతున్నాడు ఆ ఒక్కపూటతోనే అతనంటే అసహ్యం కలిగింది ప్రకాశానికి తెల్లవారుఝాము అయిదు గంటలకు నైటు బీటు నుండి స్టేషనుకు చేరారు బీటు పుస్తకంలో సంతకం చేసి దాన్ని స్టేషన్లో పెట్టి ఇంటికెళుతుంటే, ''కాలకృత్యాలు ముగించుకొని ఏడు గంటలకల్లా రోల్‌కాల్‌కు రావాలి, తెలుసుగా'' అన్నాడు విశ్వనాధం 'అలాగే' అన్నట్టు తల వూపాడు ప్రకాశం 'నైటు బీటు చాలా కష్టమైన డ్యూటీ' అనుకున్నాడు ఇంటికెళుతూ ఏడు గంటలకల్లా స్టేషను కెళ్ళాడు విశ్వనాధం ఇంకా రాలేదు మిగతావాళ్ళు వచ్చారు

''రాత్రి బీటు విశేషాలు ఏమిటి?'' అన్నాడు గోపాలం

రాత్రి జరిగిన సంభాషణ యావత్తూ చెప్పాడు ప్రకాశం

''వాడికి పొలం వుందంటనా? వాడి బొంద కనీసం నీకన్నా పూరిదో బూరిదో కొంపన్నా వుంది వాడి కామాత్రం కొంప గూడా లేదు ఒక విషయం గుర్తు పెట్టుకో వాడియ్యన్నీ కోతలే ఒక్కటీ నిజం కాదు'' అన్నాడు

వాళ్ళు ఆ విషయాలు మాట్లాడుకుంటుండగానే రైటరు వచ్చాడు అందరూ సెల్యూట్‌లు చేశారు ఎవరి డ్యూటీ ఏమిటో చెపుతూ ప్రకాశంతో, ''ఇవ్వాల్టి నుండీ నీకు గార్డు డ్యూటీ పీ సీ నాగులుని రిలీఫ్ చెయ్యి మూడో 'పహారా'[18] ఎక్కాలి'' అన్నాడు

''అలాగే సార్'' అన్నాడు ప్రకాశం

కొద్దిసేపటికి యస్సై వచ్చాడు అందరూ రోల్‌కాల్‌కు యస్సై గదిలోకి వెళ్ళారు సుబ్బారెడ్డిని చూస్తూ, ''ఏమిటి గడ్డ చేసుకోలేదు?'' అని అడిగాడు యస్సై ఆ మాటకు కంగారుపడ్డాడు రెడ్డి

''ఇది రెండోసారి చెప్పటం ఈసారి చూస్తే, నెల రోజులు సబ్‌జైలు గార్డుకు పంపుతా'' అన్నాడు యస్సై రెడ్డి ఏం మాట్లాడలేకపోయాడు అట్లాగే గుడ్లప్పగించి చూస్తూ నిలబడ్డాడు ముఖమంతా చెమటలు పట్టింది అందరికీ డ్యూటీలు చెప్పిన తరువాత బయటకు వచ్చారు

''గార్డు ఎన్ని రోజులు చెయ్యాలి'' అడిగాడు ప్రకాశం

''వారం రోజులు'' అన్నాడు గోపాలం

''ఇక్కడ గార్డు డ్యూటీ అంటే ఎట్లాగో ఏమిటో కాస్త చెప్పండి మాకు ట్రైనింగులో చెప్పారనుకోండీ అయినా అక్కడికీ ఇక్కడికీ తేడా వుంటుందికదా, అందుకని'' అన్నాడు ప్రకాశం గోపాలం దగ్గర అతనికి చనువేర్పడింది కొద్దిగా

''అవును, అక్కడికీ ఇక్కడికీ తేడా వుంటుంది'' అన్నాడు గోపాలం ''ఇక్కడ నీకు తుపాకీ, తూటాలు ఇస్తారు అక్కడ ఒట్టి తుపాకే కదా గార్డులో నలుగురు పీసీ లుంటారు ఒక ఇన్‌చార్జి వుంటాడు ఒక్కొక్క పీసీ పగలు మూడు గంటలూ, రాత్రి మూడు గంటలూ సెంట్రీ డ్యూటీ చెయ్యాలి అంటే పహారా చెయ్యాలి అంటే తుపాకీ పట్టుకొని స్టేషన్‌కి కాపలా కాయాలి అన్నమాట పగలు మాత్రం పహారా మూడు గంటలు చేసిన తరువాత మూడు గంటలు రెస్ట్ వుంటుంది తరువాత స్టేషన్ కొచ్చి వెయిటింగ్‌లో వుండాలి అంటే ఆ మూడు గంటల రెస్ట్ పోతే, రోజుకు ఇరవై ఒక్క గంటలు డ్యూటీ అన్న మాట వెయిటింగ్ పీసీలు ఖయిదీలను సాయంత్రం, ఉదయం కాలకృత్యాల కోసం బయటకు తియ్యటం, మధ్యాహ్నం పూట భోజనానికి తీయటం, సాయంత్రానికి మళ్ళా దొడ్డికిగానీ, స్నానానికిగాని తీయటం ఇలా వుంటాయి ఇవి ఎక్కువగా సబ్‌జైలు గార్డు పీసీలు చేస్తుంటారనుకో మనకి సబ్‌స్టేషనులో ఖయిదీలుండరు పెద్దగా ఇక్కడ వెయిటింగ్‌లో వుండే పీసీలు యస్సైగారి, సార్జెన్‌గారి పనులూ, రైటరు చెప్పే పనులూ చేస్తూ వుండటం, ఎక్కడికన్నా హడావిడిగా పోవాల్సివస్తే పోయి రావటం, ఇలా రకరకాల పనులు వెయిటింగ్ పీసీలు చేస్తుంటారు గార్డు డ్యూటీ అంటే స్టేషన్ నీ, స్టేషన్‌లోని ప్రతిదాన్నీ కాపాడటం అలాటిది ఈ డ్యూటీ దీనిలో ఆబ్సెంటయితే పెద్ద పనిష్మెంటు ఇస్తారు ప్రొబేషనరయితే ఉద్యోగం ఊడబీకినా అడిగే దిక్కులేదు కాబట్టి ప్రొబేషను పూర్తయిందాకా జాగ్రత్తగా వుండాలి ఖయిదీలనెప్పుడూ ఒంటరిగా బయటకు తీయకూడదు రాత్రుళ్ళు అసలు లాకప్పు తాళం తీయకూడదు అది బాగా గుర్తుంచుకో దొంగవెధవలు కడుపులో నొప్పి వస్తుందనీ, అర్జంటుగా దొడ్డికి వస్తుందనీ ఫోజులు పెడతారు ఖయిదీ పారిపోయాడా, ఆఫీసర్లు మన ప్రాణం తీస్తారు వాడు పారిపోవటానికి మనం సహాయం చేశామనీ, వాడి దగ్గర మనమేదో కాజేసే ఉద్దేశ్యంతో ఆ పని చేశామనీ, వాడు పారిపోకపోతే ఎన్నో కేసుల్లో ఎంతో ప్రాపర్టీ రికవరీ చేసేవాళ్ళమనీ జిల్లా ఆఫీసర్లకు మనమీద అనేక అబద్ధాలు చెప్పి, మనల్ని ఏదో ఒక విధంగా ఇంటికి పంపించే ఏర్పాట్లు చేస్తారు ఈ విషయాల్లో చాలా జాగ్రత్తగా ఉండాలి ఏదీ నీ అంతట నీవు స్వంతంగా చెయ్యాకాక అన్నీ నీకే తెలుస్తాయనుకో తరువాత తరువాత'' అన్నాడు

''సబ్‌స్టేషను కాకుండా ఇంకా ఏ స్టేషన్లుంటాయి'' అన్నాడు ప్రకాశం

''సబ్‌స్టేషన్లుకాకుండా, టౌను స్టేషన్లని వుంటాయి అవి టౌన్‌లలో వుంటాయి అక్కడ స్టేషన్ ఇలాకా ( ఏరియా ) ని బట్టీ, ఆ స్టేషన్లలో ఒక సంవత్సరంలో రిపోర్టయ్యే నేరాల సంఖ్యని బట్టి కానిస్టేబుళ్ళ సంఖ్య వుంటుంది ఒక స్టేషన్లో ముప్పైమంది పిసి లుంటే ఇంకోదానిలో నలభై, ఇంకోచోట యాభై ఇట్లా వుంటారు అంతేకాని, ప్రతి పోలీసు స్టేషన్లో ఇంతమందే వుండాలనే లెఖ్ఖ ఏమీలేదు టౌన్ స్టేషన్లో 'సెక్షన్ డ్యూటీలు' అని వుంటాయి అంటే రోజులోని ఇరవై నాలుగు గంటల్ని మూడు భాగాలు చేసి ఒక్కో సెక్షన్ ఎనిమిది గంటల చొప్పున ఉద్యోగం చెయ్యాలని నిర్ణయించారు కానీ ఏ టౌను స్టేషన్లోనూ ఆ ప్రకారం జరగదు ఎప్పుడూ ఏదో ఒక హడావిడి వుంటుంది కాబట్టి అన్ని సెక్షన్ల వాళ్ళనీ ఇరవై నాలుగుగంటలూ స్టేషనులోనే 'స్టాండ్

టూ'లో వుంచుతారు టౌన్ స్టేషన్లలో కూడా గార్డు డ్యూటీలు మాత్రం మామూలే ఇరవై నాలుగు గంటలూ దానికి ఎనిమిది గంటల ఉద్యోగం అంటూ ఏమీలేదు ఇకపోతే మన స్టేషనులాంటి స్టేషన్లని సబ్ స్టేషను లంటారు వీటిలో పీసీలు ఇరవై మంది కన్నా మించి వుండరు ఎక్కడాకూడా కొన్ని చోట్ల పోలీసు ఔట్‌పోస్టులని పెడతారు అక్కడ ఒక హెచ్ సీ, నలుగురు పీసీలు వుంటారు అది ఏదో ఒక పోలీసు స్టేషను ఆధీనంలో వుంటుంది ఆ స్టేషనుకు సంబంధించిన వాళ్ళే ఆ ఔట్ పోస్టులో వుంటారు ఆ స్టేషను నుండి అంతా టరన్ ప్రకారం ఓ పీ కి వెళ్ళి ఒక్కో సంవత్సరంపాటు డ్యూటీ చేసి వస్తుంటారు అలా విభజించారు పోలీసు స్టేషన్లని అర్థమయిందా?'' అన్నాడు గోపాలం

అర్థమయినట్లు తల వూపాడు ప్రకాశం

ఆ రోజు ఉదయం తొమ్మిది గంటలకు 'సెంట్రీ రిలీఫ్ పుస్తకం'లో సంతకం పెట్టి పారా(పహారా) ఎక్కాడు ప్రకాశం మూడు గంటలపాటు అటూ ఇటూ కదలకుండా నిలువు కాళ్ళమీద నిలబడేసరికి కాళ్ళు లాగుతున్నయ్ రాత్రంతా నిదుర లేకుండా తిరిగి, ఈపూట గార్డు కొచ్చేసరికి శోష వచ్చినంత పనయ్యింది 'పన్నెండు ఎప్పుడయ్యిద్దా' అని ఎదురుచూశాడు పన్నెండు గంటలకు తుపాకినీ, తూటాల్నీ తర్వాత ఎక్కే సెంట్రీకి అప్పగించి, రైటరుకు సెల్యూట్ చేసి బయటకు వచ్చాడు

''మూడింటికల్లా వెయిటింగ్‌కు రావాలి లేకపోతే ఆబ్సెంటు రాస్తా జాగ్రత్త'' అన్నాడు రైటరు ప్రకాశం తలూపి బయటకు వచ్చాడు ఇంటికెళ్ళి, బూట్లూ పట్టీలు విప్పి, కాళ్ళూ ముఖం కడుక్కొని భోంచేసేసరికి ఒంటిగంట అయ్యింది నిద్ర ముంచుకొస్తూ వుంది

''కాస్సేపున్నాక లేపమ్మా'' అని తల్లికి చెప్పి నిద్దరలోకి జారిపోయాడు ఒక గంట గడిచేసరికి తల్లి అతన్ని లేపింది ఉలిక్కిపడి లేచాడు కళ్ళు మండుతున్నయ్ 'టైం ఎంతయిందో? మూడు దాటిందేమో? పొద్దు తెలియటం లేదు ఆలశ్యమయితే ఆబ్సెంటు రాస్తాడు' అనుకుంటూ, తిట్టుకుంటూ లేచిపోయి ముఖం కడుక్కొని, యూనిఫారం వేసుకొని స్టేషనుకు వెళ్ళాడు సెంట్రీ పీసీ అరుణ గిరి పలకరించాడు

''ఏంది అప్పుడే వచ్చావ్ ఇంకా గంట టయిముందిగా'' అన్నాడు

''టైం తెలియలేదు మూడు గంటలు దాటిందేమో అనుకున్నా ఎక్కడ ఆబ్సెంటు రాస్తాడో అని పరిగెత్తుకుంటూ బయలుదేరి వచ్చా'' అన్నాడు ప్రకాశం

''నిద్ర సరిపోలేదనుకుంటా, కళ్ళు ఎర్రగా వున్నయ్ నాపక్క గుడ్డలు రైటరుగారి కుర్చీ పక్కనున్నయ్ ఏసుకొని పడుకో'' అన్నాడు అరుణ గిరి

సంకోచిస్తున్నట్టు చూశాడు ప్రకాశం అతని చూపుని గ్రహించినట్టు, ''ఏం ఫరవాలేదు మనకేంది ఆ పట్టింపులు'' అన్నాడు అరుణ గిరి ప్రకాశం లోపలకు వెళ్ళాడు లోపల హెడ్ కానిస్టేబులు రాజారావు కూర్చుని ఏదో పని చేసుకుంటున్నాడు అతనికి ప్రకాశం సెల్యూట్ చేశాడు

''కొత్తగా వచ్చావా?'' అన్నాడు హెచ్ సీ

''అవును సార్ గార్డ్ డ్యూటీలో వున్నానిప్పుడు'' జవాబిచ్చాడు ప్రకాశం

''సెంట్రీ పారా దిగిపోయావా?''

అవును సార్''

''మరి అప్పుడే వచ్చావే?''

''టైం తెలియలేదు సార్''

''సరే ఎలాగూ వచ్చావు కాబట్టి, నీకు మునసబుగారి యిల్లు తెలుసా? '' అని, ప్రకాశం తెలుసనో, తెలియదనో చెప్పకముందే, ''అక్కడికెళ్ళి నేను చెప్పానని చెప్పి నాలుగొందలు పిడకలు తీసుకురా పొయ్యిలోకి అసలు లేవంట వాళ్ళ పాలేరుతో మోయించుకొచ్చి మా యింట్లో పడేయించు'' అన్నాడు

సరేనన్నట్లు తలవూపి బయటకు వెళ్ళాడు ప్రకాశం నిద్రపోదామని అనుకుంటుంటే ఈ పని తగిలినందుకు చికాకు కలిగింది మునసబుకి విషయం చెప్పాడు ప్రకాశం

''అదిగో, ఆ గోతం తీసుకొని నాలుగొందలు లెఖ్ఖ పెట్టుకొని తీసుకు పో పాలేర్లెవరూ లేరు'' అన్నాడు మునసబు ఏం చెయాలో తోచలేదు ప్రకాశానికి ఇంక తప్పదనుకొని నాలుగొందల పిడకలు గోతానికి వేసుకొని భుజంమీద పెట్టుకొని తీసుకొచ్చి సార్జెన్ ఇంటిలో పడేశాడు అప్పటికి సాయంత్రం నాలుగయ్యింది ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది నిన్న రాత్రి పదింటి నుండి రెస్ట్ లేకపోవటం చేత ఒళ్ళంతా నొప్పులుగా వుంది చిన్నగా తలపోటు ప్రారంభమయ్యింది స్టేషనుకు వెళ్ళేసరికి సార్జెన్ నిద్రపోతూ కనిపించాడు మూడు గంటలకు పహారా దిగి వెళ్ళిపోయాడు అరుణగిరి ప్రకాశం అడుగుల శబ్దానికి కళ్ళు తెరిచి చూశాడు రాజారావు సార్జెన్

''ఇంటికి పంపించి వచ్చావా?'' అన్నాడు

''అక్కడెవరూ లేరు సార్ నేనే మోసుకొచ్చి తమరింట్లో వేశాను'' అన్నాడు ప్రకాశం ఆ మాటకు చిన్నగా నవ్వాడు సార్జెన్

''ఊఁ సరేలే ఇంతసేపా ఒక పనికిపోయి వుండేది ఎక్కడికీ పోగాకు యస్సైగారు వస్తారు'' అని పక్కకు ఒత్తిగిలి పడుకున్నాడు సార్జెన్ ప్రవర్తన బాధ కలిగించింది

''ఇంటికెళ్ళి కాస్త ముఖం కడుక్కొని వస్తాను సార్ ఒళ్ళంతా మరీ జిడ్డుగా వుంది'' అడగలేక అడిగాడు ప్రకాశం

''ఇప్పుడెట్లా వెళతావు గార్డు వెయిటింగ్ కదా'' అన్నాడు సార్జెన్ పడుకొని

''ప్రకాశం ఇంకేమీ మాట్లాడలేదు 'గార్డు వెయిటింగ్ చేత వీళ్ళ స్వంత పనులు చేయించుకోవచ్చు గానీ, మొఖం కడుక్కొని రావటానికి మాత్రం వీల్లేదన్నమాట' తిట్టుకుంటూ పక్కన గచ్చు మీద కూర్చున్నాడు గోడకానుకొని

నరాలు జివ్వున లాగుతున్నయ్ క్షణాల్లో నిద్ర ఆవహించింది

''ప్రకాశం, ఏయ్ ప్రకాశం'' రైటరు దబాయింపుతో ఉలిక్కిపడి లేచాడు కళ్ళు మండుతున్నయ్

''ఏమిటోయ్ అయిదయ్యింది లోపలున్నవాళ్ళను బయటకు తియ్యండి''

ప్రకాశం భారంగా రైటరుకు సెల్యూట్ చేశాడు లాకప్ తాళం తీసి లోపలున్న వాళ్ళని బయటకు రమ్మన్నాడు ఒకతను వచ్చాడు రెండో అతను లోపలే వుండిపోయాడు దగ్గుకుంటూ లాకప్పులోంచి బయటకు వచ్చిన అతని దగ్గర భరించలేనంతటి దుర్వాసన వచ్చింది మిగిలిన వెయిటింగ్ పీసీతో కలిసి, అతన్ని దొడ్లోకి తీసుకెళ్ళారు

'ఒక అరగంటసేపు పడుకున్నానన్న మాట' అనుకున్నాడు ప్రకాశం

''ఎంతసేపురా దొడ్డిలో వుండేది దొంగ లమ్డీ కొడకా'' దొడ్లోవున్న ఖయిదీని బయటనుండి

తిడుతున్నాడు రెండో వెయిటింగ్ పీ సీ గురుమూర్తి ఆ దబాయింపు విని ప్రకాశం నవ్వాడు

''మనం తొందరచెయ్యకపోతే తొందరగా బయటకు రారు'' అన్నాడు గురుమూర్తి యస్సై లోపలకు వస్తూవుంటే దొడ్డి దగ్గరే వుండి సెల్యూట్‌లు చేశారు ఇద్దరూ

''మనం రోల్‌కాల్‌కు పోవాలా?'' అడిగాడు ప్రకాశం

''గార్డు డ్యూటీ వాళ్ళకేం రోల్‌కాలు ఎప్పుడూ స్టేషన్లో వుండే వాళ్ళకు రోల్‌కాల్ ఏంది?'' అన్నాడు గురుమూర్తి తరువాత ఖయిదీని తీసుకొచ్చి లోపల వేశారు

''వీళ్ళని స్నానానికి తీసే పనిలేదా?'' అడిగాడు ప్రకాశం లాకప్పు తాళం వేస్తూ

''స్నానమా ఇంకేమన్నానా? అట్లాంటివేమీ ఉండవు ఖయిదీలకు ఈళ్ళిద్దరూ స్టేషనుకొచ్చి ఎన్ని రోజులవుతోందో!'' అని చిన్నగా నవ్వాడు

'తను ట్రైనింగు స్కూల్లో వున్నప్పుడు ఏ యల్టై చెప్పిన 'లా' లో, ఏ ఖయిదీని గూడా ఇరవై నాలుగు గంటలకన్నా ఎక్కువ కాలం లాకప్‌లో వుంచకూడదనీ, కోర్టులో హాజరు పరచాలనీ చదువుకున్నాడు మరి వీళ్ళని ఇలా వుంచటం ఏమిటి? తను నేర్చుకున్నది వేరు చూస్తున్నది వేరు' అనుకున్నాడు ప్రకాశం అదే విషయం గురుమూర్తిని అడగబోతుంటే రైటరు కేక వేశాడు

''ఏయ్ ప్రకాశం ఇటు రా ఈపూట స్వీపరు నా కొడుకు రాలేదు గానీ, ఈ లైటు తీసుకెళ్ళి కిరసనాయిలు పోయించి సుబ్బరంగా తుడిచి తీసుకొని రా'' అని లైటూ, డబ్బులు యిచ్చాడు రైటరు ఆ హరికెన్‌లైటు తీసుకొని బైటకెళ్ళి పాతగుడ్డతో సుబ్రంగా దాన్ని తుడిచి కిరసనాయిలు పోయించుకొచ్చాడు రైటరు సెంట్రీని మారుస్తున్నాడు అప్పుడు

'ఆరయ్యిందన్నమాట' అనుకున్నాడు ప్రకాశం అది చూచి

లైటు వెలిగించి టేబిలు మీద పెడుతుంటే లోపల్నుండి యస్సై రైటర్ని కేక వేసి ''కాఫీ ఒకటి తెప్పించవోయ్'' అన్నాడు

జేబులో నుండి డబ్బులు తీసి ప్రకాశాని కిచ్చాడు రైటరు లైటు వెలుగులో రైటరు పెదాలు యస్సైని బూతులు తిడుతూ కనపడ్డయ్ ''ఒక కాఫీ తీసుకొచ్చి తగలబెట్టు'' అన్నాడు చిన్నగా

''కాఫీ హోటలు ఎక్కడో తెలియదు సార్'' అన్నాడు ప్రకాశం బిడియంగా

రైటరు ప్రకాశం వైపు కోపంగా చూశాడు ''ఎక్కడుందో తెలుసుకోవాలి నువ్వు చేసేది పోలీసు ఉద్యోగం ఏదెక్కడుందో తెలుసుకోవాలి తెలియదంటే కుదరదు ఇంకెప్పుడు తెలుసుకుంటావు? పో పోయి తీసుకురా'' అని గదిమాడు యస్సై మీది కోపం అలా వెళ్ళగక్కాడు రైటరు

ప్రకాశం మారుమాటాడకుండా బైటకెళ్ళాడు వెళుతూ బయటవున్న సెంట్రీని అడిగాడు సెంట్రీ చెప్పిన ఆనవాళ్ళు పట్టుకొని కాఫీ హోటలని పిలవబడే చిన్న పాక దగ్గరకెళ్ళాడు అప్పుడక్కడ కాఫీ లేదు ఒక ముసలతను కుక్కి మంచం మీద కూర్చుని చుట్ట తాగుతున్నాడు ప్రకాశం కాఫీ అడిగితే లేవన్నాడు లేచి నిలబడి

''యస్సైగారు తెమ్మన్నారు ఇంకొక హోటలుందా ఇక్కడా?'' అన్నాడు ప్రకాశం

''ఇంకే ఓటలూ లేదు యస్సైగారికయితే వుండు పాలు ఏడిచేసి యిత్తా ఆయనెప్పుడు పంపిత్తే అప్పుడు కాఫీ పెట్టాలి మా బాధలు ఆయనకేం తెలుసు ఆయన పంపినప్పుడు కాఫీ లేదంటే ఆయనకి కోపం'' నిష్ఠూరంగా అంటూ లోపలికెళ్ళాడు

అతను కాఫీ పెట్టి, ప్రకాశానికి ఇచ్చీ, ప్రకాశం తెచ్చేసరికి చాలా టైము పట్టింది

''ఎంతోసేపు తెచ్చేది?'' కోపంగా అడిగాడు రైటరు

''హోటల్‌లో కాఫీ లేవు సార్ తయారుచేయించుకొని తీసుకొస్తున్నాను సార్ అందుకని కొంచెం ఆలశ్యమయ్యింది సార్'' అన్నాడు ప్రకాశం వినయంగా

''ఆ మాటే ఆయనతో అను ఏడుసార్లడిగాడు ఇప్పటికి పాపం పుట్టిం దగ్గరనుండీ కాఫీల తోనే పెరిగినట్టు లోకుల సొమ్ముతో కాఫీలూ, టిఫిన్లు తినటానికి సిగ్గు లేకపోతే సరి'' అన్నాడు రైటరు చిన్నగా

ప్రకాశం కాఫీతో యస్సై రూంలోకి వెళ్ళాడు సెల్యూట్ చేసి బల్లమీద పెట్టాడు కాఫీ గ్లాసు

''ఎంతసేపురా కాఫీ తెచ్చేది, వెధవన్నర వెధవ'' తిట్టాడు యస్సై

ఆ మాటకు మనస్సు చివుక్కుమంది

''చెయ్యటం ఆలశ్యవయ్యింది సార్'' అన్నాడు వినయంగా

''నోరు మూసుకో ఇంకా వాగుతున్నావ్ పో బయటకు తరువాతొచ్చి గ్లాసు తీసుకు పో తాగుతుంటే ఎదురుగా ఎందుకురా నువ్వు దరిద్రపు మొకం నువ్వూనూ'' అన్నాడు గ్లాసు అందుకుంటూ యస్సై సెల్యూట్ చేసి బయటకు వెళ్ళాడు ప్రకాశం అతని ముఖం, హృదయం రెండూ ముడుచుకుపోయాయి అవమానంతో చిన్నగా నడుస్తూ స్టాఫ్ నిలబడ్డ దగ్గరకు వెళ్ళాడు తలెత్తి ఎవరివైపూ చూడలేకపోయాడు అవమానంతో కృంగిపోయాడు అతన్నలా చూచి అందరూ మౌనంగా వున్నారు కొద్దిసేపు

''బాధపడమాకు'' భుజం మీద చెయ్యేసి అన్నాడు అబ్దుల్లా ''బాధపడి లాభం లేదు భాయ్ నీకు ట్రైనింగులో అనుభవమయ్యే వుంటుంది ఈ నౌకరీ అంతే వాళ్ళు తిడతా వుంటారు మనం పడుతూ వుండాల్సిందే అల్లా మన మొకాన అట్టా రాసి పెట్టాడు ఇది అంతే దీన్ని మార్చటానికి వీలులేదు'' అన్నాడు అబ్దుల్లా

ప్రకాశం ఏమీ మాట్లాడలేదు కొద్దిసేపున్నాక చిన్నగా అన్నాడు, ''అదికాదు సార్ తప్పేదన్నా వుంటే, తిట్టినా బాధ లేదు ఉత్త పుణ్యానికి ''

''తప్పా? మన బతుక్కు తప్పులు చెయ్యటం కూడానా? ఎంతో జాగ్రత్తగా వుంటేనే మనకీ తిట్లు తప్పటం లేదు ఇంకా తప్పులు చేస్తే మనల్ని బతకనిస్తారా ఈ ఆఫీసర్లు '' అన్నాడు డేవిడ్

''ఔనౌను'' అన్నాడు అబ్దుల్లా వంతపాడుతున్నట్టు

ప్రకాశం గట్టిగా నిట్టూర్చాడు

''నువ్వు గార్డులో వున్నావుగా పోయి స్నానం చేసి భోంచేసిరా మరి తొమ్మిదింటికల్లా పారా ఎక్కాలి కదా'' అన్నాడు గోపాలం

ప్రకాశం రైటరుకి చెప్పాడు ఇంటికెళ్ళి వస్తానని

''తొందరగా రా ఎనిమిదింటికల్లా పోతూ ఆ గ్లాసు తీసుకెళ్ళి ఓటలోడికిచ్చి పో'' అన్నాడు యస్సై రూంలోకి వెళ్ళాలంటే భయమేస్తోంది ప్రకాశంకు

ప్రకాశం యస్సై రూంలోకి వెళ్ళేసరికి, సార్జెన్ రాజారావు యస్సైతో ఏదో గుసగుస లాడుతున్నాడు సార్జెన్ చెప్పే మాటలకు యస్సై చిరునవ్వు నవ్వుతున్నాడు ప్రకాశం రాకతో ఇద్దరూ ఇటు చూశారు ఏమిటన్నట్టు కళ్ళతోనే అడిగాడు యస్సై

''గ్లాసుకోసం సార్'' అన్నాడు సెల్యూట్ చేసి భయంగా ప్రకాశం

''వూ తీసుకెళ్ళు చెప్పాపెట్టకుండా లోపలికి రాకూడదు'' అన్నాడు యస్సై ప్రకాశం

తలూపి, గ్లాసు తీసుకొని, సెల్యూట్ చేసి బయటకెళుతుంటే, సైగచేసి పిలిచాడు రైటరు ప్రకాశం రైటరు దగ్గరకు వెళ్ళాడు

వాళ్ళిద్దరూ ఏం మాట్లాడు కుంటున్నారు?''

''ఏదో చిన్నగా మాట్లాడుకుంటున్నారు సార్ వినపడలేదు''

''సరే పో ఒక అరగంటలో వచ్చేసెయ్యి'' అన్నాడు రైటరు ప్రకాశం వెళ్ళి హోటలతనికి గ్లాసు ఇచ్చి, ఇంటికెళ్ళి స్నానం చేసి భోంచేశాడు

''పొద్దుటి నుండీ యాడకెళ్లావురా?'' అంది తల్లి

''డ్యూటీ అమ్మా స్టేషన్లో గార్డు డూటీ'' అన్నాడు

కొడుకు బాగా అలిసిపోయినట్లు కనిపించాడు ఆమెకి కోడల్ని ఉద్దేశించి, ''ఆ కంబడన్నా ఏయమ్మా పడుకుంటాడు'' అంది తల్లి

''స్టేషను కెల్లాలి ఇంట్లో పడుకోటానికి యీల్లేదు, గార్డు డ్యూటీ వారం రోజులూ'' అన్నాడు

''వారం రోజులా? ఈ వారం రోజులూ ఇంటికాడ పండుకోవా?'' అంది తల్లి

''వూహూ''

''యిదేం దూటీరా బాగానే వుంది అయితే'' అంది ఆమె

శరీరం విశ్రాంతి కోరుతోంది వళ్ళంతా పులిసినట్లు వుంది 'పెందలాడే పోయి, కాసేపు ఒత్తిగిల్లితే బావుండు మల్లీ తొమ్మిదింటికి పారా ఎక్కాలి' అనుకుని, ఒక దుప్పటి కంబడిలో చుట్టుకొని యూనిఫారం వేసుకొని స్టేషనుకు వెళ్ళాడు ఉదయం నుండీ చెమటకు తడిచిన యూనిఫారం వాసన వేస్తోంది అతనిమీద అతనికే విసుకుగా వుంది చుట్టూ కలియ జూశాడు ఎక్కడా సరయిన చోటు లేదు లాకప్పులోని ఖయిదీల మల మూత్రాల వాసన సర్వత్రా వ్యాపించి, తిన్న తిండి బయటకు వచ్చేలా వుంది నిముషాలు గడిచేకొందీ ఆ వాసనకు ముక్కులు అలవాటు పడుతున్నయ్ లాకప్‌కి వీలయినంత దూరంగా కంబడి పరచి శరీరాన్ని వాల్చాడు హాయిగా వుంది వంటికి 'ఒక గంటకు పైగా పడుకోవచ్చు' అనుకున్నాడు రెండు నిముషాలు గడిచాయి రైటరు కేక వేసినట్లు పిలిచాడు కోపమొచ్చింది ప్రకాశానికి వినపడనట్లు వూరుకున్నాడు మళ్ళీ పిలిచాడు రైటరు విసుగ్గా లేచి వెళ్ళాడు ఏమిటన్నట్లు చూశాడు

''అయ్యగారింటి కర్జంటుగా వెళ్ళి, అమ్మగారితో చెప్పు అయ్యగారు సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారి దగ్గరకు అర్జంటుగా పోతున్నాడని చెప్పి, భోజనానికి రాడని చెప్పిరా'' అన్నాడు

యస్సైగారిల్లు ఎక్కడో తెలియదని అందామనుకున్నాడు ప్రకాశం కానీ అంతకు ముందు కాఫీకి పొమ్మన్నపుడు, ఆ మాట అనటం వల్ల వచ్చిన ఇబ్బందిని గుర్తు చేసుకున్నాడు బైటకెళ్ళి సెంట్రీని అడిగాడు అతను చెప్పిన గుర్తులు పట్టుకొని యస్సై ఇంటికి బయలుదేరాడు దారిలో గోపాలం కనిపించాడు ఎక్కడికో వెళ్ళి వస్తూ అతనికి నమస్కారం చేసి పలకరించాడు ప్రకాశం

''ఎక్కడిదాకా ఇటు ?'' అన్నాడు గోపాలం

''యస్సై గారింటికి సార్ '' అని గోపాలం మాట్లాడకముందే, ''అది సరేగాని సార్, మన ఉద్యోగాలకు ఒక రెస్ట్ అంటూ ఏమీ లేదా? మనం గవర్నమెంటుకు నవుకర్లమా లేకపోతే ఈ రైటర్లకూ సార్జెన్‌లకూ యస్సైలకా ? వీళ్ళ నోటిలో నుండి వచ్చిందే వేదంలాగుందే వాడేం మాట్లాడితే అదే డ్యూటీలాగుందే'' అన్నాడు కోపంగా

ఆ మాటకు గోపాలం నవ్వాడు ''వాళ్ళేది చెపితే అదే డ్యూటీ 'ఆ పని ఎందుకు చెప్పావు?' అని వాళ్ళని అడిగేవాడు లేడు'' అన్నాడు గోపాలం

ఆశ్చర్యంగా చూశాడు ప్రకాశం ''మళ్ళీ కలుస్తా'' అన్నాడు

అసహనంగా ముందుకు కదిలాడు కొద్దిసేపటికి యస్సై ఇంటి దగ్గరకొచ్చాడు పెద్ద పెంకుటిల్లు చుట్టూ ప్రహరీ వుంది గేటు దగ్గర నిలబడి ఆర్డర్లీ నరసింహాన్ని కేకేశాడు రెండు మూడు కేకలకు యస్సై భార్య బయటకు వచ్చింది ''ఎవరూ ?'' అంటూ

''అయ్యగారు సర్కిల్ ఇనస్పెక్టరు గారి దగ్గరకు అర్జంటుగా పోతున్నారమ్మా భోజనానికి రావటానికి కుదరదని చెప్పమన్నారు'' అన్నాడు

''ఊఁ సరేలే నువ్వు కొత్తగా వచ్చావా ?'' అడిగింది ఆమె ప్రకాశాన్ని పరిశీలనగా చూస్తూ

''అవునమ్మగారూ'' అన్నాడు వినయంగా

''ఈపూట వాడు నరసింహం రాలేదుగానీ రెండు కడవలు నీళ్ళు తోడిపో'' అంది

ఏం సమాధానం చెప్పాలో అర్థం కాలేదు కాదనలేకపోయాడు తనలో తను తిట్టుకుంటూ వెళ్ళాడు బావి దగ్గరకు టోపీ తీసి పక్కన పెట్టి తాడు, కడవ కోసం వెదికాడు మసక వెలుగులో తాడు ఎక్కడుందో, కడవెక్కడుందో కనిపించలేదు తీరా అవి దొరికి బావి దగ్గరకొచ్చి పక్కనున్న తొట్టిని చూసేసరికి గుండె జారిపోయింది తనని తను తిట్టుకుంటూ నీళ్ళు తోడాడు తొట్టి నిండేసరికి తిన్నది కాస్తా అరిగిపోయింది చేతులు సచ్చుబడిపోయినియ్యి తోడటం పూర్తి చేసి వెళ్ళి, ''అమ్మగారూ! నీళ్ళు తోడానమ్మా!'' అన్నాడు మళ్ళీ ఏం పని చెప్పిద్దో అనే భయం మనసులో పీకుతోంది ట్రైనింగు స్కూల్లో డాక్టరు భార్య గుర్తొచ్చింది

''నీ కళ్ళకు నేను అమ్మలాగా, అమ్మమ్మలాగా కనపడుతున్నానా? అండీ అని అనలేవూ ? ప్రతి వెధవా అమ్మా, అమ్మా బాగా అలవాటయ్యింది నీళ్ళు అయిపోయినయ్యండీ అనలేవూ'' అంది యస్సై భార్య చిరుకోపంగా ప్రకాశానికి ఏం జవాబు చెప్పాలో అర్థం కాలేదు

''అట్లాగేనండీ'' అన్నాడు నట్లుకొడుతూ

''పట్టుమని పాతికేళ్ళు లేవు నాకు ఎట్లా పిలవాలో తెలియదా'' మళ్ళీ అంది ఆమె అదో రకంగా నవ్వుతూ అయిపోయిన విషయాన్ని కావాలని తిరగదోడుతున్నట్లు అనిపించింది ప్రకాశానికి అతను మౌనంగా నిలబడిపోయాడు అటెన్షన్‌లో

''నీ పేరేంటి ?''

''ప్రకాశమండీ''

''సరే, వెళ్ళు''

బ్రతుకుజీవుడా అంటూ బైటపడ్డాడు గేటు తీసుకొని బయటకు వస్తూ వుంటే నరశింహం ఎదురయ్యాడు ''ఏడకొచ్చి పోతున్నావ్?'' అన్నాడు ప్రకాశం వచ్చిన పని చెప్పాడు

''పొరా ఎక్కో టైమయ్యింది, వస్తా'' అని గబగబా నడిచాడు ఆమె మళ్ళీ వెనక్కు ఎక్కడ పిలిచిద్దో అనే భయం మనసులో పీకుతుంటే, గబగబా అడుగులు వేశాడు స్టేషన్‌కు వెళ్ళేసరికి యస్సై వెళ్ళిపోయాడు

''ఎంతసేపూ యస్సై ఇంటికి వెళ్ళొచ్చేది ?'' దబాయించాడు సార్జెన్

''అమ్మగారు తొట్టినిండా నీళ్ళు తోడి పొమ్మన్నారు సార్ నరశింహం ఎక్కడికో పోయాడంట సార్'' అన్నాడు ప్రకాశం చేతులు పిసుక్కుంటూ

''పోతే పోయాడు వాడి ఉద్యోగం నువ్వు చేస్తూ కూర్చుంటే, నీ వుద్యోగం ఎవరు చేస్తారిక్కడ? నన్ను చేయమంటావా ? వళ్ళు దగ్గర పెట్టుకొని వుద్యోగం చెయ్యి చెప్పిన పని వరకు చేసుకొని రావాలి ఇది మొదటి వార్నింగు'' అన్నాడు సార్జెన్ అలా మాట్లాడుతుంటే అతని ముఖం వికృతంగా కనపడింది ఆ మాటలకు ప్రకాశం హృదయం కుచించుకుపోయింది

''అట్లాగే సార్'' అన్నాడు బలవంతంగా, బాధగా

''ఊఁ పో వుద్యోగం పోతే అడుక్కు తింటానికి కూడా పనికి రారు'' అన్నాడు సార్జెన్ కుర్చీలో కూర్చుంటూ అతని మాటలూ, చేతలూ బలవంతంగా తెచ్చిపెట్టుకొన్నట్లున్నయ్ ఆ మాటలకు పళ్ళు పటపటా కొరికాడు ప్రకాశం చురుక్కున సార్జెన్‌వైపు చూశాడు అసహనంగా వెళ్ళి గోడకానుకొని కూర్చున్నాడు శరీరమంతా ఉద్రేకంతో వణుకుతోంది వళ్ళంతా చెమటలు పోశాయి రాత్రి నుండీ కలిగిన శారీరక శ్రమ కంటే ఈ మాటలు ఎక్కువ బాధ కలిగించాయి క్షణాల్లో తీవ్రమైన తలనొప్పి వచ్చేసింది కణతలు నొక్కుతున్నట్టు బాధ కలిగింది

సెంట్రీ లోపలకొచ్చి, సార్జెన్‌తో, ''పారా వెయ్యండి సార్'' అన్నాడు ప్రకాశం గబగబా లేచి బూట్లు తొడుక్కుని, వాటిమీద పట్టీలు చుట్టుకున్నాడు తూటాల పెట్టెల్లోని తూటాలు లెక్క పెట్టుకొని, బెల్టుకు పెట్టుకున్నాడు తుపాకీ తీసుకొని, 'సెంట్రీరిలీఫ్‌పుస్తకం'లో సంతకం చేసి, బైట గేటు దగ్గరకెళ్ళి నిలబడ్డాడు

మనస్సు బాధతో మూలుగుతోంది ఆలోచనలు గజిబిజిగా సాగుతున్నయ్ 'డ్యూటీకి రిపోర్టు చేసిన వేళ మంచిది కాదనుకుంటా' అని తనని తాను సమాధానపరచుకోవటానికి ప్రయత్నించాడు కానీ ఆ సమాధానం అతనికే నచ్చలేదు 'వీళ్ళిట్లా ప్రవర్తించటానికీ, మాట్లాడటానికీ, తను డ్యూటీకి రిపోర్టు చేసిన టైముకీ సంబంధం ఏమిటి ?' అని తనని తను తర్కించుకున్నాడు మళ్ళీ 'తిథీ, వార, నక్షత్రాలు చూసి రిపోర్టు చేసిన వెంకటేశానికి అక్కడెట్లా వుందో ? ఇక్కడ ఆఫీసర్లు మంచివాళ్ళని చెప్పాడు విశ్వనాథం ఇదేనా వీళ్ళ మంచితనం ? ఈరోజు తను రైటరు చేతా, సార్జెన్ చేతా, యస్పై చేతా, చివరకు ఆయన భార్యచేత కూడా తిట్లూ, చీవాట్లు తిన్నాడు ఏ ఒక్కరి విషయంలోనూ, తను ఎలాంటి పొరపాటూ చెయ్యలేదు మరి వాళ్ళెందుకట్లా ప్రవర్తించారు ? తన పై అధికారులంతా ఈ రోజు తనని తిట్టారు తన తోటివాళ్ళూ, తన వాళ్ళూ తన నేమీ అనలేదు తన పై వాళ్ళు తన నన్ని మాటలన్నా పడివున్నాడు డ్యూటీ విషయం చూస్తే నిన్న సాయంత్రం నుండి, ఇప్పటిదాకా అంటే షుమారు ముప్ఫై గంటలు ఎలాంటి రెస్టూ లేదు వంటిమీది యూనిఫారం విప్పలేదు ఉదయం 'నైటు బీట్లు' కష్టమనుకున్నాడు కాని గార్డు డ్యూటీ కన్నా, అది వంద రెట్లు నయంగా కనపడుతోంది ఇప్పుడు అందులో ఒక్క శరీర కష్టం మాత్రమే వుంది దీనిలోలాగా ఇరవై నాలుగు గంటలూ ఆఫీసర్ల సమక్షంలో వుండాల్సిన పనీ, తిట్లు తినాల్సిన పనీ లేదు గోపాలం చెప్పినమాట నిజం ఆఫీసర్లెవరూ ఇక్కడ మంచివాళ్ళు లేరు మెత్తటివాళ్ళను చూస్తే అందరికీ లోకువే ఇంకా ఈ గార్డు ఆర్రోజులు చేయాలి ' అనుకున్నాడు ఆ మాట అనుకుంటే గుండె జారిపోతోంది

'ఈ రకమైన సమస్యలు నాకేనా లేక అందరికీ వున్నయ్యా ? నేనేమన్నా పద్ధతులు మార్చుకోవాలా ? ఎలాగయితే ఈ పరిస్థితులలో నెట్టుకు రాగలను ?' అని ఆలోచించాడు గార్డులో లేని వాళ్ళు కూడా ఎవ్వరూ పెద్దగా కొంపల్లో వున్నట్లు లేరు అందరికీ ఏవో పనులు చెపుతూనే వున్నారు ప్రతివాళ్ళూ కొద్దో గొప్పో తిట్లు తింటూనే వున్నారు 'ఈ చేసే పనుల్లో

గవర్నమెంటు డ్యూటీ ఎన్నోవంతో?' అనుకున్నాడు

అసహనంగా ఆకాశం వైపు చూశాడు నక్షత్రాలు మిణుకు మిణుకు మంటున్నాయి అలసిన శరీరం చల్లటి గాలికి మత్తుగా మూల్గుతోంది కూర్చోవాలనిపిస్తోంది 'సర్వీసంతా ఈ గాడిద చాకిరేనా ? లేకపోతే ప్రొబేషను అయిపోయిందాకానేనా ? ఏదేమైనా ప్రొబేషను అయిపోయిందాకా ఓపిక పట్టాలి ప్రొబేషను డిక్లేరయితే యింత కష్టముండదులే' అనుకున్నాడు 'ట్రైనింగులో వున్నప్పుడు ఆ సమస్యలు, బాధలు అన్నీ ఆ ట్రైనింగులోనే అనుకున్నాడు తరవాత స్టేషనులో ఉద్యోగం సుఖంగా వుంటుందనుకున్నాడు స్టేషను కొచ్చాక బాధలూ, బాధ్యతలు పెరిగాయి ప్రొబేషను అయిపోయేంతవరకూ ఇవి తప్పవని అనుకుంటున్నాడు ఇప్పుడు కాని ప్రొబేషను అయిపోయిన తరువాత కష్టాలు పోతాయనే గ్యారంటీ ఏమీలేదు తనూ, ఇంకా ఇద్దరు మినహా మిగిలిన పీసీలంతా ప్రొబేషను పూర్తయినవాళ్ళేగా వాళ్ళేం సుఖపడుతున్నారు ?'

అతని ఆలోచనలు గురవయ్య మీదకు మళ్ళాయి 'అక్కడ డ్యూటీలు ఎలాగున్నయ్యో? గురవయ్య తెలివయినవాడు ఎక్కడున్నా అతన్ని అనేవాళ్ళు లేరు పైగా చదువుకున్నవాడు ప్రతి విషయాన్ని గురించీ అతనికి కొన్ని అభిప్రాయాలు వున్నయ్' అనుకున్నాడు

పన్నెండు అయ్యేసరికి యుగాలు గడచినట్లు అనిపించింది పహారా దిగి, ఎక్కడ పడుకోవలా అని చూశాడు స్టేషనంతా దుమ్మూ, దుర్వాసన ఓ మూల కెళ్ళి కంబడి వేసుకొని పడుకుంటే క్షణాల్లో నిద్ర వచ్చేసింది తెల్లవారుఝామున అయిదు గంటలకు సెంట్రీ లేపాడు ''ఆరింటికి పారా ఎక్కాలి కదా! పోయి కాలకృత్యాలు తీర్చుకొని రా!'' అన్నాడు

సగం నిద్రతో కళ్ళు మండుతున్నయ్ తూలుతూ లేచి, పక్క చుట్టి పక్కన పెట్టి, ఇంటి కెళ్ళి కాలకృత్యాలు తీర్చుకొని వచ్చేసరికి ఆరయ్యింది సెంట్రీ రిలీఫ్ పుస్తకంలో సంతకం పెట్టి తుపాకీ తీసుకొని వెళ్ళి గేటు దగ్గర నిలబడ్డాడు నీరసంగా వుంది కడుపులో ఎలుకలు పరిగెత్తు తున్నయ్ నైటుబీటు పీసీలు వచ్చి బీటు పుస్తకాలు స్టేషన్లో పడేసి పోయారు ఎవరిలోనూ వుత్సాహం కనిపించటం లేదు వారి ముఖాల్లో విసుగుదల కొట్టొచ్చినట్లు కనపడుతోంది ఏడు గంటలకు అందరూ స్టేషనుకొచ్చారు రోల్‌కాల్‌కు సబ్ ఇన్‌స్పెక్టరు లేడు ప్రకాశం తొమ్మిది గంటలకు పహారా దిగి ఇంటికెళ్ళాడు అన్నం పెట్టమని కేకవేశాడు అన్నం తిన్నాక నిద్ర వచ్చింది

'మళ్ళీ పన్నెండు గంటలకు స్టేషనుకు వెళ్ళాలి ఇప్పుడు పడుకుంటే మెలుకువ రాదేమో వెయిటింగ్‌లో లేనని ఆబ్సెంటు రాస్తారేమో' అనుకున్నాడు ఒక రకమయిన టెన్షన్‌కు లోనవుతున్నాడు క్రమంగా

అతనికి తెలియకుండానే స్లో పాయిజన్‌లాగా భయం అతని శరీరాన్ని ఆక్రమిస్తోంది

'పోయి స్టేషన్లో పడుకుంటే ?' ఆ ఆలోచన అతనికి భయం కలిగించింది 'ఒక్క క్షణం నిలకడగా కూర్చుండనిస్తారనే నమ్మకం లేదు'

డ్యూటీలో వున్నంతసేపూ రెస్ట్ దొరికితే బావుండుననే తపన, దొరికిన రెండు మూడు గంటల విశ్రాంతి కూడా అనుభవించే ప్రాప్తం లేకుండా ఆందోళన ఇక లాభం లేదనుకొని, తల్లిని కేకేసి, ''ఒక గంట తరువాత లేపమ్మా'' అన్నాడు

''గంటసేపంటే ఎంతసేపయ్యా?'' అంది ఆమె

''గంటంటే కాసేపు వున్నాక ఒక నిద్దర తీశాక లేపు'' అని పడుకున్నాడు, ఏదయితే అదయిద్దన్నట్లు మొండిగా

ఆమె లేపిన తరువాత, మళ్ళీ కొంచెం అన్నం తిని స్టేషన్ కొచ్చేసరికి పన్నెండయ్యింది స్టేషన్లో రైటరున్నాడు అతనికి సెల్యూట్ చేశాడు ప్రకాశం

''ఏమోయ్, కరెక్టుగా పన్నెండు గంటలకే రాకపోతే, కాస్త ముందొస్తే నీ సొమ్మేం పోయింది ఇటు రా పనుంది'' అంటూ రికార్డు రూం తాళం తీసి లోపలకు తీసుకెళ్ళాడు అక్కడ పాత సీడీ ఫైళ్ళు చిందరవందరగా పడేసి వున్నయ్ వాటితోపాటు పాత రికార్డు అంతా అస్తవ్యస్తంగా వుంది దాన్నంతా శుభ్రంగా సర్దిపెట్టమన్నాడు ప్రకాశం ఏమీ మాట్లాడలేదు 'రెండో వెయిటింగ్ పీసీ లేడు ఎక్కడికో పంపించి వుంటాడు' అనుకున్నాడు ప్రకాశం 'దీనమ్మ ఉద్యోగాన్ని ' బూతులు తిట్టాడు చిన్నగా 'మనిషి కనపడితే పని పుట్టిస్తారు, వీళ్ళమ్మని ' తిట్టుకున్నాడు

చిన్నగా పని ప్రారంభించాడు పాత పుస్తకాల కట్టలన్నీ దులిపి శుభ్రం చేస్తున్నాడు గాలీ, వెలుతురూ రాని ఆ గదిలో చెమటతో యూనిఫారం తడిచిపోయింది చెమట నిండిన వంటిమీద దుమ్మూ, బూజూ పడి అంటుకుపోతోంది రికార్డు రూము శుభ్రపరిచేసరికి సాయంత్రం అయిదు గంటలయ్యింది అప్పటికతని శరీరాకారం పూర్తిగా మారిపోయింది అప్పటికే రోల్‌కాల్‌కు రావలసిన పీసీలంతా స్టేషనుకొచ్చారు ప్రకాశం రికార్డు రూంలోనుండి బయటకొచ్చేసరికి అతని ఆకారం చూసి మిగతా వాళ్ళు నవ్వారు ప్రకాశాన్ని అలా చూచి రైటరు తిట్టాడు ''పని నీట్‌గా చెయ్యటం నేర్చుకో వంటినిండా దుమ్ము కొట్టుకొని వస్తే కష్టపడ్డావని అనుకుంటా రనుకుంటున్నావేమో'' అన్నాడు ఆ మాటకు తల తిరిగిపోయింది కోపంతో రైటరు వైపు చూశాడు మింగేద్దామన్నంత ఉద్రేకం వచ్చింది కాని అతి కష్టం మీద తమాయించుకొన్నాడు అంత పని చేసినా అనిపించని బాధ, రైటరు అన్న ఆ ఒక్కమాటతో కలిగింది బాధతో తలలోని నరాలు తెగుతాయేమో అనిపించింది వేదనగా కళ్ళు మూసుకొని గోడకు జారబడ్డాడు అతని పరిస్థితిని గమనించిన గోపాలం అతని దగ్గరకు వచ్చాడు

''పోయి స్నానం చేసిరా మళ్ళీ ఆరు గంటలకు పారా ఎక్కాలి కదా'' అన్నాడు తలెత్తి గోపాలం వైపు చూశాడు ప్రకాశం ఇంటికెళ్ళొస్తానని రైటరుకు చెప్పటానికి మనస్సు అంగీకరించలేదు అసలతని ముఖం చూడటానికే మనస్సు ఒప్పలేదు కానీ తప్పదు చెప్పకుండా గార్డు డ్యూటీలో వున్నవాళ్ళు స్టేషను వదిలిపెట్టి పోవటానికి వీలులేదు చెప్పకుండా పోతే కొనుక్కొచ్చుకున్నట్లే గట్టిగా నిట్టూర్చాడు మనస్సుని దిటవు పరచుకొని రైటరు దగ్గరకు వచ్చి బలవంతంగా మాటలు పెకలించుకొని అడిగాడు

''నీళ్ళు పోసుకొని వస్తాను సార్''

''ఊ'' అన్నాడు రైటరు తలెత్తకుండా అతనివైపు కోపంగా చూచి గబగబా బయటకు వచ్చాడు తలస్నానం చేసి, భోంచేసి, తిరిగి బూట్లూ, యూనిఫారం వేసుకొని స్టేషనుకు వచ్చాడు

గంటల తరబడి బూట్లూ పట్టీలు విప్పకుండా వున్నందువలన రక్తప్రసరణ సరిగా లేక కాళ్ళు మొద్దుబారి పోతున్నాయి గాలి తగలక, చెమట పోసి మోకాళ్ళ వరకూ చర్మం ఒకటే దురద నిలబడితే పాదాలు నొప్పులు పుడుతున్నాయి

సెంట్రీ పుస్తకంలో సంతకం పెట్టి, తుపాకీ తీసుకుపోయి బయట నిలబడ్డాడు వీళ్ళు ఎందుకిలా మాటల్తో బాధిస్తారో అర్థం కాలేదు అతనికి ఎంత ఆలోచించినా 'మొదటి నుండీ వీళ్ళ స్వభావాలు ఇంతేనా ? లేక ఆ హోదా అలా అనిపిస్తుందా ? ప్రతి ఆఫీసరూ తన క్రిందివాళ్ళని ఇలాగే చూస్తాడా ? ఎదుటి మనిషి బాధపడతాడనే ఆలోచన వీళ్ళకు రాదా ? ఎకరాలు ఎకరాలు

పొలాలున్న ఆసామికీ, ఈ ఆఫీసర్లకూ తేడా ఏమిటి ? వీళ్ళంతా ఇతరులమీద పెత్తనాలు చెయ్యాలని చూస్తున్న వాళ్ళే ఆమాత్రం తనూ మాట్లాడగలడు ఎదురు తిరిగి మాట్లాడటానికి క్షణం పట్టదు కానీ వాళ్ళు ఆఫీసర్లు ఏమైనా చేయగలరు పుటుక్కున ఉద్యోగాని కేమన్నా అయితే ?'

పాత జీవితం కళ్ళ ముందు కనిపించింది 'జానెడు పొట్ట నింపుకోవడం కోసం ఎన్ని బాధలు పడాల్సి వస్తున్నదో ? తన పాలేరు జీవితానికీ దీనికీ తేడా ఏమీలేదు కాకపోతే దీనిలో పెళ్ళాం పిల్లలు కాస్త సుఖపడతారు వేళకింత కూడు దొరుకుతుంది ఇది కాదనుకొని పోతే మళ్ళీ పాతబ్రతుకు నలుగురిలో నగుబాటు అట్లాగని ఆత్మగౌరవం లేకుండా జీవచ్ఛవాల్లా ఎంతకాలం ఇట్లా ?' అసహనంతో, జవాబులు దొరకని ప్రశ్నలతో అతనిమీద అతనికే కోపం వస్తోంది లోపల రైటరు ఎవరినో కేకలు వేస్తున్నాడు దీర్ఘంగా నిట్టూర్చాడు ప్రకాశం

ఆకాశంలో చంద్రుడు అతనిలాగానే వెలవెల బోతున్నాడు తొమ్మిదింటికి పహారా దిగి పడుకునే వరకు అతని ఆలోచనలు అలాగే సాగాయి అన్నీ ప్రశ్నలే జవాబులు లేవు పడుకున్నాక నిద్ర పట్టలేదు చాలాసేపటి వరకు అతని హృదయంలో కదిలే తుఫాను నిద్రను దూరం చేసింది 'ఏదేమైనా తొందర పడకూడదు పేదవాని కోపం పెదవికి చేటు' అనుకున్నాడు తరువాత ఎప్పటికోగాని నిద్ర రాలేదు

ఆ గార్డు డ్యూటీలో వున్న వారం రోజుల్లో వంట్లో సత్తువ సగం హరించుకుపోయింది జ్వరం తగిలి లంకణాలు చేసిన మనిషిలా తయారయ్యాడు శారీరక శ్రమ కన్నా మానసిక వేదనతో మనిషి సగమయ్యాడు గార్డు దిగినరోజు పగలు మాత్రం కొంచెం విశ్రాంతి దొరికింది ఆ పగలు గాఢంగా నిద్ర పోయాడు సాయంత్రం నిద్ర లేచేసరికి ప్రాణం కాస్త హుషారుగా వుంది సాయంత్రం రోల్‌కాల్‌కు వెళ్ళాడు ఆ వారం పదిరోజుల్లో అందరితో బాగా పరిచయాలు ఏర్పడ్డాయి ఎవరి మనస్తత్వం ఎలాంటిదో పూర్తిగా కాకపోయినా చాలావరకు అర్థం చేసుకున్నాడు స్టేషన్లోని పీసీలు ఒకళ్ళతో ఒకళ్ళు కలవరు చాలా అంశాల్లో పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు ఇళ్ళల్లో వాళ్ళ ఆడవాళ్ళ పరిస్థితి కూడా అంతే మగవాళ్ళనిబట్టే ఆడవాళ్ళూ అంతేగానీ వాళ్ళకూ స్వతంత్రమైన ఆలోచనలు లేవు కాని అందరిలోనూ గమ్మత్తయిన విషయం ఒకటి గమనించాడు ప్రకాశం ఎవరిబుద్ధులెట్లా వున్నా డ్యూటీలూ, వాటి సంబంధమయిన సమస్యల విషయంలో అందరూ ఒకటవుతున్నారు వాటిని గురించి మాట్లాడుకునేటప్పుడు అందరూ ఒకటే అవి వదిలిపెట్టి మిగతావాటి దగ్గర కొచ్చేసరికి ఎవరి అభిప్రాయాలు వాళ్ళు యధేచ్ఛగా ప్రకటిస్తారు ఎవరి ఆచారాలు వాళ్ళు ఖచ్చితంగా పాటిస్తారు ఆ విషయాలన్నీ అతను గమనించాడు

ఆ రాత్రి నైటుబీటు అబ్దుల్లాతో పడింది ఇద్దరూ భోజనాలు పూర్తి చేసుకొని బయలుదేరారు అప్పటికే ఊరంతా సద్దుమణిగింది అబ్దుల్లా తెచ్చిన లాంతరు ప్రకాశానికిచ్చి పట్టుకోమన్నాడు ఇద్దరి చేతుల్లో లాఠీలు వున్నయ్ బీటు పుస్తకం జేబులో వుంది

''సార్ మీకెంత సర్వీసు ?'' అడిగాడు ప్రకాశం 'కబుర్లు చెప్పుకుంటుంటే అదొక కాలక్షేపం సీనియర్ల సర్వీసులోని అనుభవాలు తనకి ఉపయోగపడతాయి' అనే ఉద్దేశ్యంతో ఆ మాట అడిగాడు

''చాలా వుంది ఇరవై ఏళ్ళు ఎందుకు ? మా సర్వీసూ గాడిద సర్వీసూ ఒకటేగా'' అన్నాడు అబ్దుల్లా అతని మాటల్లో నిరాసక్తత ధ్వనించింది

''అదేంది సార్ అట్లా గంటారు ఇంత సర్వీసులో ఎంతో అనుభవం సంపాదించి వుంటారు దేశాన్ని ఎంతో చూశారు''

ఆ మాటకు చిన్నగా నవ్వాడు అబ్దుల్లా ''ఎందుకు ప్రకాశం ఎంత అనుబగం వుండీ ఏం లాభం చెప్పు? మన సర్వీసూ అనుభగాలూ ఎవరికి ఉపయోగపడతాయి ఎవరు మన గుడ్ సర్వీసుని చూసి మనకి రివార్డు లిస్తారు ఎక్కడేసిన గొంగళి అక్కడేవున్నట్టు, ఎంత సర్వీసున్న వాడినైనా, ఓ మొద్దాడని తక్కువ చేస్తారు ఒకేరకంగా చూస్తారు మన ఆఫీసర్లు మనం కూడా మనుషుల మనే వూహ వాళ్ళకు కలగదు కడుపు చేత పట్టుకొచ్చుకున్న వాళ్ళం అన్నిటికీ సహించి పడుండాలి, తప్పదు'' అన్నాడు

''ఆఫీసర్లంటే ఎవరెవరు ?'' అడిగాడు ప్రకాశం అబ్దుల్లా చెప్పే దానికీ తను అడిగినదానికీ పొంతనలేని ప్రశ్న వేశాడు అబ్దుల్లా ఆలోచనలని వేరే విషయం మీదకు మళ్ళింప చేయాలని అట్లా అడిగాడు ప్రకాశం

''ఎవరంటే ?! మనరైటరు దగ్గర నుండీ, వాడెవడో వుంటాడు చూడు పోలీసు డిపార్టుమెంటులో అందరికీ పెద్ద, వాడిదాకా అందరూ మనకి మొగుళ్ళే అందరూ మనల్ని పురుగుల్ని చూసినట్టే కానీ అంతకు మించి ఏముంది ఇంకొంతకాలం పోతే నీకే అన్నీ అర్థమవుతాయి''

''అదేలేండి ట్రైనింగులో చూశాను నేనిక్కడకు వచ్చి పదిరోజులు కావస్తున్నది కదా! ఇప్పుడిక్కడ చూస్తున్నాను''

''నువ్వేం చూశావూ ? నా సర్వీసులో నేనెంతో కష్టపడ్డానో నాకు తెలుసు ఎన్ని వందల, వేల నైటు బీటులు తిరిగానో నాకు తెలుసు తుపాకీ పట్టుకొని చలిలో, ఎండలో, వానలో పగలనకా రాత్రనకా ఎన్ని సెంట్రీ డ్యూటీలు చేశానో, ఎన్ని ఎస్కార్టు డ్యూటీలు చేశానో, ఎన్ని శవాల్ని పోస్టు మార్టం చేయించి పాతి పెట్టించానో, దిక్కూ మొక్కూ లేని ఎన్ని శవాలకి నాజేబులోని డబ్బులు ఎన్ని ఖర్చుపెట్టానో నేను చెయ్యని పొరపాట్లకు ఎన్ని పనిష్మెంట్లు తీసుకున్నానో ఎన్ని ఇనస్పెక్షన్లు జరిగాయో, ఎన్ని బందోబస్తులు చేశానో, ఇవన్నీ లెఖ్ఖలేవు ప్రకాశం తలుచుకుంటే గుండె పగిలిద్ది ఇప్పుడయితే అట్లాంటి పనులూ, డ్యూటీలు చెయ్యగలనా అని నాకే భయమేసిద్ది నా యిర్వై సంవత్సరాల సర్వీసులో పట్టుమని వరుసగా నాలుగు రాత్రుళ్ళు ఇంటికాడ పడుకున్నది లేదు వారం రోజుల కొకరోజు ఇంటికాడుంటే ఎంతో అదృష్టం ఆ లెఖ్ఖన ఇర్వై ఏళ్ళలో ఇంటికాడ పడుకున్న రోజులెన్నో లెఖ్ఖపెట్టు కాని చివరకు ఏమిటి మిగిలింది ? ఎంత కష్టపడ్డా, ఎంత విశ్వాసంగా వున్నా ఆఫీసర్లతో తిట్లు తప్పవు ఎన్నోసార్లు ఉద్యోగం వదిలిపెట్టి పోవాలనుకున్నాను ఆ మాటలు అంత బాధ కలిగించేవి నాకేకాదు, ఎవరికైనా సరే కానీ పెళ్ళాం పిల్లలకోసం, వాళ్ళకింత గంజిపొయ్యటం కోసం అట్లాగే రోజులు దొర్లిస్తున్నా నిజం చెప్పాలంటే మనస్సు రాయి చేసుకొని బతుకుతున్నాను ఈ వయసులో ఇది వదిలి పెట్టిపోతే ఏ పనీ చెయ్యలేమనీ, పిల్లల నోటి కాడి కూడు తియ్యటమే అయిద్దనీ, పైగా ఇప్పుడు నేనొక్కడినే కష్టపడుతున్నా ఇది వదిలిపెట్టిపోతే అందరం కష్టపడాలి పిల్లలు కష్టానికి అలవాటు పడ్డ వాళ్ళు కాదు కాస్త సుఖంగా పెరిగిన వాళ్ళు చేసినంతకాలం చెయ్యటం చెయ్యలేని రోజున 'అల్లా' వున్నాడు'' అని ఆపేశాడు అబ్దుల్లా చివరిమాటలు మాట్లాడుతున్నప్పుడు అతని గొంతు పూడిపోతున్నట్లు మాటలు చిన్నగా వచ్చాయి వేదాంతిలాగా కనిపించాడు

కొద్దిసేపు మౌనం రాజ్యం చేసింది వాళ్ళమధ్య

''అంటే ఇంక ఈ బ్రతుకులిట్లా గడిచిపోవాల్సిందేనా?'' అన్నాడు ప్రకాశం అబ్దుల్లా అలా చెపుతుంటే తన సమస్యలనే అబ్దుల్లా నోటివెంట వింటున్నట్లు అనిపిస్తోంది

''ఆఁ ఇట్లాగే గడిచిపోతాయ్ చేసేది మాత్రం ఏముంది ఈ సమస్యలకు పరిష్కార మార్గం ఏదన్నా ఉందేమోనని నేను చాలాసార్లు దీర్ఘంగా ఆలోచించాను ఈ కష్టాలకు అంతులేదనీ, అల్లా మన ముఖాన ఎట్లా రాస్తే అట్లా జరిగిద్దని సరిపెట్టుకున్నాను''

''అంతేనంటారా?''

''అంతకాక ఇంకేంది నువ్వు చెప్పు కాస్తోకూస్తో చదువుకున్న వాడివి చూట్టానికి తెలివయినవాడిలాగానే కనపడుతున్నావ్ నీకు తోచిన పరిష్కారమేందో చెప్పు'' అన్నాడు ఆ మాటకు ప్రకాశం ఏమీ మాట్లాడలేదు

''నాకు తెలుసు నువ్వే కాదు, ఎవరూ చెప్పలేరు ఎవరి ముఖాన ఎట్లా రాసుంటే అట్లా జరిగిద్ది దీనినెవరూ మార్చలేరు దాని గురించి ఆలోచిస్తూ కూర్చుని మనస్సు ఇంకా బాధ పెట్టుకోవటం మినహా మరేమీ లేదు దాన్ని గురించి ఆలోచించటం అనవసరం'' అన్నాడు

''మరింక అన్నీ మన ముహాన అల్లా రాస్తే, ఎట్లా జరిగేది అట్లా జరిగిద్ది అనుకుంటే ఇంక బాధపడట మెందుకు'' అన్నాడు ప్రకాశం

అతని మాటలకు అబ్దుల్లా తలతిప్పి చూశాడు

''ఎట్లా జరిగేది అట్లా జరగాలని వున్నా, కష్టమొచ్చినప్పుడు బాధపడటం, సుఖానికి సంతోషించటం మానవ లక్షణం అట్లాంటివేమీ లేని వాడే అల్లా మన ముకాన రాసివున్నంత మాత్రాన మన బాధల్ని గురించి ఇంకొకళ్ళకు చెప్పుకోకుండా, బాధపడకుండా వుండలేము కదా'' అన్నాడు

ఆ మాటలకు ప్రకాశం ఏమీ మాట్లాడలేదు అబ్దుల్లా చెప్పిన సంగతులు ఆలోచించ దగ్గవిగానే వున్నయ్ 'తనలాగే చాలామంది ఆలోచిస్తున్నారన్న మాట అందరి ఆలోచనలూ 'కర్మ' వైపు మళ్ళుతున్నయ్ అందరూ 'రాత' ని నమ్ముతున్నవాళ్ళే ఎవరి నొసటన ఎట్లాగుంటే అట్లా జరిగిద్దని అందరి నమ్మకం' అనుకున్నాడు

అప్పటికి రాత్రి రెండు గంటలు దాటింది నిద్ర కళ్ళమీద కొచ్చి నిలబడింది కాళ్ళు పీకుతుంటే ఒక యింటి అరుగుమీద కొద్దిసేపు కూర్చున్నారు ఎప్పుడు తెల్లవారిద్దా అని ఎదురు చూస్తున్నాడు ప్రకాశం 'హాయిగా ఇంటిదగ్గర నిద్రపోయి పదిరోజు లవుతోంది సుమారుగా అబ్దుల్లా అన్నట్టు లెక్కచూస్తే నెలకు మూడు రాత్రులయినా ఇంటికాడ పడుకుంటామో లేదో' అనుకున్నాడు రెండు నిముషాలు ఆగింతర్వాత, 'అవును, ఇవన్నీ ఆలోచించకుండా ఉండలేము కదా' అనుకున్నాడు మళ్ళీ తరువాత వాళ్ళు చాలా విషయాలు మాట్లాడుకున్నారు ఐదు గంటలకు స్టేషనుకు వెళ్ళి, బీటు పుస్తకం స్టేషన్లో పడేసి, ఇంటికెళ్ళారు

ఏడు గంటలకు రోల్‌కాల్‌కు వచ్చినప్పుడు, ''ఖయిదీని కోర్టుకు ఎస్కార్టు తీసుకుపోవాలి, నువ్వూ డేవిడ్'' అన్నాడు రైటరు ప్రకాశంతో

ఇంటికొచ్చి, తొందరగా అన్నం వండమని అన్నాడు ప్రకాశం భార్యతో

''ఏందయ్యా అడావుడి ?'' అంది తల్లి

''ఏం లేదు కోర్టుకెల్లాలి నేను పడుకుంటున్నాగానీ, అన్నం కాగానే లేపు'' అని చెప్పి

పడుకున్నాడు వంటగదిలోంచి దొడ్లోకి తిరుగుతున్న భార్యవైపు చూశాడు 'భార్యతో సరదాగా మాట్లాడి ఎన్ని రోజులయ్యిందో' అనుకున్నాడు ఆమె ముఖం వైపు చూశాడు నీరసంగా పాలిపోయినట్లు కనిపించింది

''యేందే అట్టాగున్నావ్?'' అడిగాడు

కానీ ఆమె ఏమీ సమాధానం చెప్పలేదు దొడ్లో, బొగ్గుతో పళ్ళు తోముకుంటున్న తల్లి అతని ప్రశ్న విని లేచివచ్చింది ''దానికి జెరమొత్తందిరా, నాలుగు రోజుల్నుండీ నీకు సెపుదామంటే నువ్వసలు ఇంటి కాడున్నదేడ ఆ దూటీలతోనే సరిపోతాంది నిన్న ఆ గోపాలం పెల్లాం వచ్చింది మనింటికి అవ యేందో బిళ్లిచ్చింది ఆ మాత్తరేసుకున్నాక ఈ పూట కాత్త పరవాలేదులే'' అంది

'ఒకే కొంపలో తగలబడుతూ, పెల్లాం పిల్లల ఆరోగ్యాలు ఎట్టా గుంటున్నాయోకూడా తెలుసుకొనేపాటి తీరికకూడా దొరకని దరిద్రపు నౌకరయిపోయింది' అని తిట్టుకున్నాడు

ఉద్యోగంలో చేరిన కొద్దిరోజులకే ఆ ఉద్యోగమంటే మొహం మొత్తింది అతనికి కళ్ళు మూసుకుంటే నిద్రరాలేదు కానీ నీరసంగా వుంది బాగా

ఈ నీరసం రాత్రి తెల్లవార్లూ బీటు తిరగటంవల్ల వచ్చిందికాదు ఈ స్టేషన్లో డ్యూటీకి రిపోర్టు చేసిం దగ్గరనుండీ ఎదురయిన సంఘటనలవల్ల కలిగిన మానసిక అశాంతికి ప్రతిరూపంగా ఈ నరాల నీరసం ఏర్పడినట్టు గ్రహించాడు అతను ఎలాగంటే- ఇక్కడకన్నా ఎక్కువ శరీరకష్టం చేశాడు భూస్వామిదగ్గర కాని ఇట్లా నీరసంతో బాధపడలేదు 'ఈ నీరసం తన విషయంలో శరీరకష్టానికి సంబంధించినది కాదు మానసిక వేదనకు సంబంధించింది' అనుకున్నాడు ఆలోచిస్తుంటే బుర్ర వేడెక్కుతోంది 'ఈ పరిస్థితి ఇలాగే కొంతకాలం కొనసాగితే పిచ్చెక్కుద్దేమో' అనుకున్నాడు మళ్ళీ ఆలోచనలను పక్కనపెట్టి కొంచెంసేపు ప్రశాంతంగా పడుకోవాలనుకున్నాడు ఆలోచనలు స్వంత వూరిమీదకు మరల్చాడు బలవంతంగా అలాగన్నా కాస్త శిరోవేదన తగ్గుతుందేమోనన్న ఉద్దేశ్యంతో

'వూరు వూరికి దూరంగా పుట్టిపెరిగిన మాలపల్లె దానికి కొంచెం దూరంలో మాదిగ పల్లె పల్లెల్లో పూరి గుడిసెలు ఊరి చుట్టూ పొలాలు తూర్పు మంచినీళ్ళ చెరువు దానిపక్కన భూస్వాముల గొడ్లు మేసే విశాలమైన బీళ్ళు, బీళ్ళల్లో పశువుల్ని మేపే పాలేరు బుడ్డోళ్ళు పల్లెల్లో కాంతి లేని కళ్ళతో, శుష్కించిన అవయవాలకు చింపిరి గుడ్డలు చుట్టుకొని, భయాన్ని శరీరాల్నిండా నింపుకుని సంచరించే మనుషులు సందేవేళ కుక్కల ఏడుపులు, భూస్వాముల ఆగడాలు 'ప్చ్' చిన్నగా నిట్టూర్చాడు. అతనికొక విషయం అర్థం కానట్లు మళ్ళీ గుర్తుకు తెచ్చుకున్నాడు 'తింటానికి తిండి లేకపోయినా, ఈ పల్లెల్లోని జనం ప్రతి చిన్న విషయానికి కూడా తగాదాలు పెట్టుకొని తలలు పగలగొట్టుకుంటుంటారు ఆ రెండు పల్లెల్లో తగాదాలు లేని రోజూ, తన్నుకోని రోజు ఉండదు. సరయిన కారణం ఏమీ కనిపించదు మళ్ళీ నాలుగు రోజుల్లో కలిసిపోతారు పగవాడికైనా కష్టమొస్తే 'అయ్యో' అంటారు ఆసామి లట్టాకాదు ఆళ్ళు పెద్ద పెద్ద ఇసయాలకే తగాదాలాడుకుంటారు. ఆస్తిపాస్తులకాడే ఆల్లకి తగాదా' అనుకున్నాడు.

ఆలోచనల మధ్య నిద్ర రాక లేచి గోడకానుకొని కూర్చున్నాడు ఈ వూరు వచ్చిన తరువాత కొడుకు ఆ మాత్రం తీరుబడిగా కూర్చోవటం ఇప్పుడే చూచింది తల్లి

''అయ్యా! ఈడ నువ్వు నౌకరీ సేసేకాడ అందరూ మంచోళ్ళేనా?'' అంది

''ఆఁ అందరూ మంచోళ్ళలాగానే కనపడతన్నారు అయినా అప్పుడే ఏం తెలిసిద్ది ఇంకా కొంతకాలం గడవాలి గదా'' అన్నాడు ప్రకాశం

''అంతేలే అప్పుడే ఏం తెలిసిద్ది వోరెట్టాంటోరైతే మనకేంలే గానీ, నువ్వు ఓరితోనూ తగాదా పెట్టుకోగాక అసలే నీకు ముక్కు మీద కోపం'' అంది ఆ మాటకు ప్రకాశం నవ్వాడు

''మనం ఎందుకు పెట్టుకుంటాం తగాదా? ఎవురయినా అనగసరంగా మనల్నంటే వూరుకొనేది లేదు'' అన్నాడు

''ఇయ్యన్నీ మనకెందుకు ఎవురేమన్నా, మనల్ని కాదని తలొంచుకొని పోతే, ఆల్ల దురమారగం ఆళ్ళనే తింటది నౌకరీ జాగత్తగా చూసుకోఅయ్యా! మనకిది లేకపోతే కూడు లేనట్టే'' అంది ఆ మాటలంటున్నప్పుడు ఆమె గొంతులో భయం వినపడింది గత జీవితం కన్నా బాగా మెరుగయిన ఈ జీవితానికి దెబ్బ తగలనీయకుండా, దీన్ని ఒదులుకోవటం ఇష్టం లేనట్లు కొడుకును హెచ్చరించింది

''సరేలే'' విసుక్కున్నట్లు అన్నాడు వేడివేడి అన్నం గోంగూర పచ్చడితో తిని స్టేషనుకొచ్చాడు తల్లి అన్న మాటలు గుర్తుకొచ్చాయి 'నిజమే ఉద్యోగం రాకముందు వున్న ఆర్థిక స్థితి వేరు ఇప్పుడు ఉద్యోగం పోయి, తిరిగి ఆ వూరు పోతే, భుక్తిమాట అటుంచి విలువేమన్నా వుంటుందా? అసలు ఉద్యోగం పోయేంత పరిస్థితి ఎందుకొస్తుంది?'

అతను స్టేషను కెళ్ళేసరికి డేవిడ్ ఇంకా రాలేదు 'అధికారులెవ్వరూ లేరు' అనుకున్నాడు, రైటరు, సార్జిన్, యస్పైలు లేకపోవటం చూచి గార్డు వెయిటింగ్ పీసీ పడుకొని వున్నాడు అతన్ని చూస్తూ 'నిద్దరకు మొహంవాచిపోవాల్సిందే ఈ నౌకర్లో' అనుకున్నాడు

ఎస్కార్టు తీసుకెళ్ళవలసిన ఖయిదీ లాకప్‌లో వున్నాడు లాకప్పు వైపు చూశాడు ప్రకాశం సన్నటి పొడి దగ్గు లాకప్పులో నుండి వస్తున్నది లాకప్పు గది దగ్గరకు వెళ్ళాడు దుర్వాసన ముక్కుల్ని ఘాటుగా తాకుతోంది ముక్కుకు చేయి అడ్డు పెట్టుకొని లోపలకు చూశాడు తను ఈ స్టేషనుకు రాకముందు నుండీ అతను ఆ లాకప్‌లో వుంటున్నాడు ఈ మధ్య మరీ ఎక్కువగా దగ్గుతున్నాడు అతన్నెప్పుడూ పరీక్షగా చూడలేదు తను అసహ్యం కలిగించే ఆ లాకప్పు దగ్గరకు ఎవ్వరికీ వెళ్ళబుద్ధి కాదు తప్పని పరిస్థితిలో, గార్డులో వున్నప్పుడు, అతన్ని రెండుసార్లు బయటకు తీశాడు కాలకృత్యాల కోసం లాకప్పులోని అతను తల వంచుకొని గోడ కానుకొని కూర్చొని వున్నాడు అతన్నలా చూసేసరికి ఓ రకమయిన భయం కలిగింది ఎందుకో పోలీసు నౌకరీలోకి రాకపూర్వం పోలీసులంటే భయం అంతకన్నా దొంగలంటే ఇంకా భయం పోలీసు స్టేషన్లో ఖయిదులో వుండే వాళ్ళంతా దొంగలని రకరకాల కథలు విన్నాడు స్టేషనుకొచ్చి ఇన్ని రోజులయినా ధయిర్యంగా ఆ లాకప్పు దగ్గర కొచ్చి, లోపలున్న వాళ్ళెవరో పరిశీలించలేక పోవటానికి ఆ భయం ఎక్కడో ఓ మూల అతని గుండెల్లో వుంది పోలీసులకు దొంగలు భయపడతారనే సంగతి తెలిసినా, అతనికా పిరికితనం పోలేదు లోపల కూర్చుని వున్న అతన్ని కొద్దిసేపు చూచేసరికి తన వూహలు నిజం కానట్టు తోచింది ఇంకో అడుగు ముందుకు వేసి, లాకప్పు తలుపు కడ్డీల్ని పట్టుకొని నిలబడ్డాడు 'జైలు తలుపుకి కటకటాలు ఏడుంటాయంటారు కదా' అనుకొని తలుపు కున్న కడ్డీల్ని లెఖ్ఖపెట్టాడు తొమ్మిదున్నయ్

లోపల్నుండి వచ్చే వాసనకు వాంతి అయ్యేలా వుంది రెండు నిముషాలకే తనకలా వుంటే లోపలున్న అతని పరిస్థితి ఏమిటి ? నెలల తరబడి అతను అందులోనే మగ్గిపోతున్నాడు లోపలున్న

అతని మీద సానుభూతి కలిగింది బూట్ల శబ్దానికి తల తిప్పి చూశాడు అతను ప్రకాశాన్ని చూచి చిన్నగా తలదించుకున్నాడు రెండు మోకాళ్ళ చుట్టూ చేతులు చుట్టి, వాటిపై గడ్డం ఆనించి ఎదురుగా గోడవైపు చూస్తూ వుండిపోయాడు లోతుకు పీక్కుపోయి, గుంటలు పడ్డ అతని కళ్ళు వెలవెలబోతూ కనిపించాయి పెరిగిన గడ్డం మాసిపోయి వుంది బాగా సగానికి పైగా నెరసిన అతని తల దుమ్మూ, ధూళితో నిండిపోయి గోధుమ రంగుకు మారింది మొలకు, చిరిగి మాసికలేసిన మురికి పంచె మినహా వంటి మీద వేరే గుడ్డ లేదు శరీరం నల్లగా వుంది మనిషి చిన్నగా వణుకుతున్నట్లు గమనించాడు ప్రకాశం అతన్ని పరిశీలనగా చూశాడు ఇంతవరకూ, ఇన్ని రోజుల్నుండి కూడా అతన్ని గురించి పట్టించుకోలేదు ప్రకాశం క్షణమైనా తీరికలేని అతనికి ఆ ఖయిదీని గురించి పట్టించుకొనే వీలు కూడా కలగలేదు లాకప్‌లోని వాళ్ళని చూడాలనే కోరిక వున్నా, ఓ రకమయిన భయం అతన్ని అందుకు దూరంగా వుంచింది లాకప్ గదిని పరిశీలించినట్లు లోపలంతా కలియజూశాడు బయట ఎంత ఎండగా వున్నా లాకప్‌లో మాత్రం చీకటిగా వుంది షుమారు ఎనిమిది అడుగుల వెడల్పు, పది అడుగుల పొడవుంది ఆ గది ఒక మూల మలమూత్ర విసర్జనకుగాను బయటకు చిన్న కంత వుంది ఓ పక్క నీళ్ళకోసం గాబోలు చిన్న కుండ వుంది గదంతా చెమ్మగా వుంది గాలి వచ్చే అవకాశం లేదు పగలే దోమలు ఎగురుతూ జుమ్మని శబ్దం చేస్తున్నాయి ఎత్తుగా ఒక వెంటిలేటరు దానికున్న లావుపాటి ఇనుప చువ్వలకు సన్నటి తీగ జల్లెడ అల్లి వుంది సంవత్సరాలుగా పేరుకుపోయిన బూజు, దుమ్ముతో ఆ వెంటిలేటరు మూసుకుపోయింది గదిలోని వాతావరణం చూచి చిన్నగా నిట్టూర్చాడు ప్రకాశం ఇవతలకొచ్చి నిలబడ్డాడు గట్టిగా గాలి పీల్చుకున్నాడు డేవిడ్ కోసం ఎదురుచూస్తూ ఆలోచనల్లో మునిగిపోయాడు అతని మనస్సంతా తీవ్రమైన వేదనతో నిండిపోయింది

'మనిషి చచ్చింతర్వాత స్వర్గానికో, నరకానికో పోతాడంటారు కాని ఇక్కడే నరకం అనుభవిస్తున్నాడు ఈ ఖయిదీ' అనుకున్నాడు ప్రకాశం 'ఇంతకీ అతనేం చేశాడో ?' తెలుసుకోవాలనే కుతూహలం కొద్దీ, తిరిగి లాకప్ రూం దగ్గర కొచ్చాడు ఈసారి బూట్ల శబ్దానికి ఆ ఖయిదీ తలతిప్పి చూడలేదు అంతకుముందులాగే గోడవైపు శూన్యంలోకి చూస్తున్నాడు అతను కనురెప్పకూడా వేయటం లేదు అతని కళ్ళల్లో నుండి ధారగా కారుతున్న కన్నీరు సొట్టలుపడ్డ బుగ్గలమీదుగా జారి, మాసిన గడ్డంలోకి ఇంకిపోతున్నాయి బరువుగా గాలి పీలుస్తున్నాడు అతన్నలా చూస్తూ చాలాసేపు నిలబడ్డాడు ప్రకాశం ఆ ఖయిదీ మీద జాలి కలిగింది చిన్నగా పిలిచాడు అతను పలకలేదు కనీసం తల తిప్పి కూడా చూడలేదు ''ఏవూరు మీది?'' అని ఈసారి కాస్త గట్టిగా పిలిచాడు

చిన్నగా తల తిప్పి చూశాడు అతను ప్రకాశం అడిగిన ప్రశ్న వినపడనట్లు చూశాడు మళ్ళీ అడిగాడు ప్రకాశం ''మీది ఏవూరు?''

అతను భయం భయంగా ప్రకాశం వైపు చూశాడు చేతులు రెండూ జోడించి ''దండం బాబయ్యా'' అన్నాడు బొంగురుపోయిన గొంతులో నుండి చిన్నగా వినపడ్డాయి ఆ మాటలు అతని కళ్ళల్లో భయం కొట్టొచ్చినట్టు కనపడుతోంది పెదవులు అదురుతున్నయ్ శరీరంలో వణుకు ఎక్కువయింది ''నన్నింక కొట్టొద్దు బాబయ్యా! నేనింక బతకను నన్ను చంపొద్దు '' దీనాతిదీనంగా అతని గొంతులో నుండి వస్తున్న మాటల్ని ఏడుపు మింగేసింది రెండు చేతుల్లో ముఖం దాచుకొని అతను వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు

అతన్నలా చూస్తుంటే, తన హృదయాన్నెవరో పిండుతున్నట్లు, బాధతో మెలికలు తిరుగుతున్నట్లూ ఫీలయ్యాడు ప్రకాశం లాకప్పు తలుపు చువ్వల్ని పట్టుకొని గట్టిగా కళ్ళు మూసుకున్నాడు కొద్దిసేపు చిన్నగా కళ్ళు తెరచి అతనివైపు చూశాడు మళ్ళీ

''నేను నిన్ను కొట్టను'' అన్నాడు

సన్నటి వెక్కిళ్ళ మధ్యనుండి అతను ఆ మాటకు తల తిప్పి చూశాడు అతని ముఖంలో ప్రకాశం మీద అనుమానం, అతని కళ్ళల్లో తను విన్నది నిజమేనా అనే ఆశ్చర్యం కనిపించాయి చిన్నగా లేవటానికి ప్రయత్నించాడు కాని లేవలేకపోతున్నాడు అతి కష్టంమీద గోడను పట్టుకొని నిలబడ్డాడు రెండు చేతులూ జోడించి ప్రకాశానికి దండం పెట్టాలనే ప్రయత్నంలో, కాళ్ళమీద నిలబడలేక బిల్లబీటుగా పడిపోయాడు తల గోడకు కొట్టుకుంది 'అమ్మా' అంటూ తల పట్టుకొని అలాగే వుండిపోయాడు

''అరే అయ్యో, అయ్యో!'' అన్నాడు ప్రకాశం ఆదుర్దాగా, అనాలోచితంగా అతని పరిస్థితిని ఆతృతగా చూస్తూ వుండిపోయాడేగాని ఏం చెయ్యాలో, ఏం మాట్లాడాలో పాలుపోలేదు చిన్నగా పిలిచాడు ''మంచినీళ్ళు తాగుతావా? ఇయ్యనా?'' అన్నాడు అతను వద్దన్నట్లు తలవూపాడు తరువాత కొద్దిసేపటికి అతను లేచి కూర్చున్నాడు ప్రకాశం వైపు చూశాడు మళ్ళీ అడిగాడు ప్రకాశం

''మీదేవూరు ? నీ పేరేంది ? ఏం చేశావు ? కూర్చో ఫరవాలేదు నీరసంగా వుందా ?''

అవునన్నట్లు తలవూపాడు అతను ప్రకాశంవైపు చేతులు జోడించాడు గొణుకుంటున్నట్లు చిన్నగా అన్నాడు ''మాదీవూరే సామీ''

''ఏం చేశావు ?''

ఆ ప్రశ్నకు అతనేమీ సమాధానం చెప్పలేదు నిలబడటానికి ప్రయత్నం చేశాడు మళ్ళీ

''మళ్ళీ పడతావు లెగవమాకు కూర్చో ఫరవాలేదు కూర్చొనే చెప్పు'' అన్నాడు ప్రకాశం కానీ అతను వినలేదు 'ఏం ఫరవాలేదు' అన్నట్టు తల తిప్పాడు గోడకు చేతులు ఆనించి నిలబడ్డాడు తిండి లేక అతని పొట్ట లోపలకు పీక్కుపోయి వెన్నుపూసకు అతుక్కుపోయింది లేచి నిలబడేసరికి ఆయాసం వచ్చింది ఉచ్ఛ్వాస, నిశ్వాసాలకు పక్కటెముకలు ఎగిరెగిరి పడుతున్నయ్ చిన్నగా గోడకు చేతులానించి లాకప్పు తలుపు దగ్గరకు వచ్చి నిలబడ్డాడు అతని కాళ్ళు వణుకుతున్నయ్ అతని దగ్గర భరించలేని దుర్వాసన వేస్తోంది ప్రకాశం అనాలోచితంగా ఒక అడుగు వెనక్కు వేశాడు అతను బాధగా దగ్గి, తలుపు చువ్వల్ని పట్టుకొని నిలబడ్డాడు అతని కళ్ళు ప్రకాశం వైపు అభ్యర్థిస్తున్నట్లు చూస్తున్నాయి చిన్నగా పెదవి కదిల్చాడు

''బాబుగారూ తవరు దేవుడు '' ఆయాసం మాటల్ని బయటకు రానీయటం లేదు ''ఇంత దయగా నన్నింతవరకూ ఏ జవాను బాబూ పలకరించలేదు తవరు '' దగ్గు తెర మాటల్ని మింగేసింది

''అది సరే నువ్వేం చేశావో సెప్పు నిన్ను ఎందుకు తెచ్చారు?'' అడిగాడు ప్రకాశం

''అదే దొరా అదే సెపుతున్నా'' అన్నాడతను అతని కళ్ళల్లో సన్నగా నీళ్ళు వూరుతున్నయ్ అతని ముఖంలో కనపడే మార్పులు అతని బాధను వ్యక్తపరుస్తున్నయ్ గతాన్ని గుర్తు చేసుకుంటున్నట్లు కళ్ళు మూసుకున్నాడు కళ్ళల్లోని నీళ్ళు కనుకొలుకుల్లో నిలబడ్డాయి చిన్నగా

మాట్లాడాడు ''మాకు పెల్లయ్యి ముచ్చటగా మూడు రోజులు కాలేదు బాబా మునసబుగోరి పెద్దబ్బాయి మూడోరోజు రాత్రి మా గుడిసె దగ్గరకు వచ్చాడు ''

అతనేం చెపుతున్నాడో చప్పున అర్థం కాలేదు ప్రకాశానికి అయినా ఆలకించాడు

''అప్పుడే మే విద్దరం సద్ది బూ తాగి, వూసులాడుకుంటూ కూకున్నాం గుడిసె దగ్గరకొచ్చి పిలిశాడు నేను ఉలిక్కిపడి లేసి, బయటకెల్లి సేతులు కట్టుకు నిలబడ్డా నా పెల్లాం కూడా గుడిసెలోంచి బయటకొచ్చి ఒక వారగా నిలబడ్డది ఆ దొరకాడ సారాయి వోసన గుప్పు మంటోంది నాకెందుకో ఎన్నడూ లేంది గుండె గుబగుబ లాడింది 'ఏంది సిన్నదొరా' అన్నా సిన్నగా''

'తూరుప్పొలంలో గొడ్డు పడ్డాయంట, పోయి సూసిరారా' అన్నాడు ''నేను కూసేపు ఎనకా ముందూ ఆలోసించా అరదమైపోయింది ఆడు నా పెల్లాం కోసం వచ్చాడు ''

ఇప్పుడు ప్రకాశానికి విషయం కాస్త అర్థమయింది ఆసక్తిగా వూ కొట్టాడు

''ఇంకంతే నేనేం సెయ్యాలి ? పల్లెల్లోని శానామంది ఆడోల్లకి మల్లే, నా పెల్లాన్ని కూడా ఆడికి బలియ్యాలి ఆ దొర కాల్ల మీద పడ్డా బతిమాలా కాని ఆ దొర మనసు కరగలేదు ఆల్ల కసలు మనసుంటేగా ఏదైతే అద్దైద్దని గుండె రాయి సేసుకున్నా గుడిసె కడ్డం నిలబడ్డా లోపల నా పెల్లాం గువ్వలా ముడుసుకు కూకుని గజగజ వనుకుతోంది ఆడు నన్ను డొక్కలో తన్నాడు అమ్మా అని కేక పెట్టి ఎల్లికిలా పడ్డా ఆడు ఎవుర్నో కేకేశాడు నాతోపాటు ఆడి పొలాల్లో పన్చేసే లచ్చిగాడూ, భీముడూ వచ్చారు నన్ను రెక్కలు పట్టుకొని బరబరా పొలంలోంచి ఈడుసుకు పోయారు నేనెంత పెనుగులాడినా, ఏడిసినా లాబం లేకపోయింది నే తిట్టే తిట్ల మద్య నా పెల్లాం పెట్టే గావుకేకలు సిన్నగా ఇనపడ్డయ్ నన్ను ఒక సెట్టుకు కట్టేశారు ఆల్లని బతిమలాడుకున్నా 'ఏరా మీ పెల్లాల్ని కూడా ఈడు ఇట్టాగే సేశాడు గదా మీక్కూడా నామీద దయ లేదంట్రా నన్నిట్టా సెయ్యకపోతే నా గొంతుకో తాడేసి ఈ సెట్టుకి ఏలాడదియ్యండ్రా' అన్నా ఆల్లేమీ మాట్టాడలా ఆ సీకట్లో లచ్చిగాడి ఏడుపు సిన్నగా ఇనపడ్డది ఎక్కిల్లు పెడతన్నాడు అట్టా ఎంతసేపు గడిచిందో నాకు తెలివి తప్పింది నేను కల్లు తెరిసేసరికి గుడిసెలో నా పెల్లాని కెదురుగా పడున్నా అదీ యేడుత్తా కూసుని వుంది ఒకల్ల నొకల్లం వాటేసుకొని ఏడిశాం కాని ఏం సెయ్యాలి? మూడుదినాలు గుడిసెలోంచి బయటకు రాలేదు తిండి లేక కల్లు తిరుగుతున్నయ్ మాకేం పాలుపోలేదు ఏడిసే ఓపిక కూడా లేదు ఇద్దరం బాయిలో దూకి సద్దామనుకున్నాం కాని దెయిర్యం సాల్లేదు ఎవుడూ మా గుడిసెకాడి కొచ్చి మమ్మల్ని పిలవలేదు మునసబు దొర దగ్గరకెల్లి గింజలడిగి తెచ్చుకోటానికి మొకం సెల్లలా నాలుగోరోజు బాగా పొద్దు పోయినాక, అదే మట్టిపిడత తీసుకొని మునసబు గారింటికెల్లింది 'మూడు రోజుల్నుండీ పనికి రాకుండా ఇయ్యాల బూ కోసం వచ్చావా?' అని దొరసాని దాన్ని బాగా తిట్టిందట. అది అట్టాగే ఏడుత్తా నిలబడితే మునసబు పెద్దకొడుకు, ఆడే, ఆ లంజాకొడుకే నా పెల్లాన్ని సెరిసింది ఆడే ఇంత జొన్న అంబలి పోయించాడంట తీసుకొచ్చింది అది తాగి పడుకొని తెల్లారిలేసి పని కెల్లాను అవమానంతో నాతల కొట్టేసినట్టైంది ఒరిముకం సూడలేను ఒరితోనూ మాట్టాడలేను ఆయాల మద్దినాల లచ్చిగాడు పలకరించాడు 'ఎందుకురా అట్టా గున్నావూ?' అన్నాడు నేనేమీ మాట్టాడలేదు 'అరేయ్, ఇట్టాంటి అవమానం నీ కొక్కడి కేనా, మనందరికీ ఇంతే గదా నొసటిరాత ఓరు తప్పిత్తారు. నాకు మాత్తరం తప్పిందా సెప్పు ఆల్లమోపేతి నీళ్ళు

తాగుతున్నాం సూడు, ఇంత జరిగినా, నువ్వు మూడు రోజుల్నుండి తిండి లేకుండా పడున్నా, నాలుగోరోజు ఆల్ల దగ్గరకే రావాల్సొచ్చింది ఆల్ల గంజినీల్లు తాగాల్సొచ్చింది ఆల్ల వుప్పు తిని పెరిగిన యీ శరీరాలు ఆల్లకే బలియ్యాలి' అన్నాడు నేనేం మాట్లాడలేదు జరిగిపోయిన పని నాకల్లల్లో కనపడతాంది ఆడే మల్లీ అన్నాడు 'మునసబు దొరగారి పెద్దకోడలు యియ్యాల రాత్తిరికి నన్ను రమ్మంది' తలెత్తి వాడివైపు చూశా వాడు చెప్పుకుపోతున్నాడు 'ఆవ శానా కోపంగా వుంది 'పెల్లయ్యాక నీకు పొగరెక్కిందిరా' అంది నన్ను ఇయ్యాలగనక పోకపోతే నా పని కాలీ అయిపోయిద్ది మాతల్లి కంటోపడ్డోడూ, కాదన్నోడూ ఎవుడు బతికి బట్టకట్టాడు అడిగో, ఆడు ముసలినాకొడుకు వత్తన్నాడు' అని మునసబు దొర వత్తంటే పక్కకెల్లాడు నేనూ పక్కకు తొలిగాను ''

అతను చెప్పే విషయం విసుగు పుట్టిస్తోంది ప్రకాశానికి అతను పోలీసు స్టేషన్‌కు రావటానికీ, అతను చెప్పిందానికీ సంబంధం కనపడలేదు కాని ఓపిగ్గా అడిగాడు ''ఇదంతా ఎప్పుడు జరిగింది?''

''అయ్యా పదకారు, పదిహేడు ఏల్లయ్యింది దొరా'' అన్నాడు అతను

ఆ మాటకు ప్రకాశంకు చిరాకేసింది ''అది సరే, నిన్నిక్కడకు ఎందుకు తెచ్చారో చెప్పమంటే అదంతా ఎందుకు ?'' అన్నాడు అతని స్వరంలో అసహనం తొంగిచూచింది

''అదే దొరా, అదే, అదే సెపుతున్నా అది జరిగిన మరుసటేడు ఒక ఆడబిడ్డ పుట్టింది బాబా '' గబగబా అన్నాడు తను చెప్పే విషయాన్ని పూర్తిగా ఆలకించకుండా ప్రకాశం వెళ్ళిపోతాడేమోనని అతను ఆత్రుతపడుతున్నాడు తన వ్యధనంతా ప్రకాశం ముందు వెళ్ళబోయాలనే తపన అతని గుండెల్లో గుబగుబ లాడింది

''వూఁ చెప్పు''

''అది నా పెల్లానికే పుట్టినా, ఓరి రకతానికి పుట్టిందో అన్నేం పున్నేం ఆ దేవుడికే ఎరిక నా బిడ్డకు నాలుగో ఏడు వచ్చింకాడ నుంచి ఆసాముల ఇల్లల్లో ఆల్ల గొడ్లతోపాటు శాకిరీసేత్తా పెరిగి పెద్దదయ్యింది దాన్ని ఎవురిసేతుల్లోనన్నా పెట్టాలనుకుంటన్నా ఒకరోజు ఆడు మల్లీ నా గుడిసెకాడకొచ్చాడు నేనూ నా బిడ్డా బయటకొచ్చాము ఆడు ఇంకో కందుకు రాడు ఇంక దేనికీ ఆడు మా గుడిసెలకాడికి రాడు ఆడు సెటుక్కున నా బిడ్డ సేయి పట్టుకొన్నాడు గుడిసెలోకి ఒక్క తోపు తోశాడు బాబూ నా బిడ్డ ఎల్లికిలా, బిల్లబీటుగా పడిపోయి కెవ్వున కేకేసింది దొరా '' ఏడుపు అతన్ని మాట్లాడనివ్వలేదు జరిగిపోయిన సంఘటనని కళ్ళముందు చూస్తున్నట్లు రెండు నిముషాలు మౌనంగా వుండిపోయాడు కానీ తన వ్యధనంతా ఎవరికో ఒకళ్ళకి చెప్పుకోవాలనే తపనతో తిరిగి మొదలుపెట్టాడు

''నేను ఒక్క అంగలో ఆడికిపోయా ఆడు నామీద కల్లురిమాడు ఎగిరి డొక్కలో తన్నాడు నాబిడ్డమీద పడ్డాడు అప్పుడు నాబిడ్డ ఏసిన యెర్రికేక ఇంకా నా సెవుల్లో మోగుతోంది దొరా నా రకతం సలసల కాగింది పక్కనే వున్న ముల్లుకర్ర తీసుకొని వాడిని గొడ్డుని బాదినట్టు బాదా ఆడు కేకలు పెడతా పరిగెత్తాడు ఆ రాత్తిరి మాకు నిద్దరలేదు తెల్లారేసరికి నన్ను కాజేత్తారనుకున్నా ఆల్ల యిట్టాని కెవు రద్దమొచ్చినా ఆడిపని ఆ గంటతో అయిపోయిద్ది కాసేపటికి నా పెల్లాం వచ్చింది ఇప్పట్లోనో ఇంకాసేపట్లోనో వాడి మనుసులు వత్తారు నన్ను నిలువునా సంపేత్తారు నా పెల్లాం, నాబిడ్డ, నన్ను పారిపొమ్మన్నారు అట్టా పారిపోయినోల్లు తరవాతైనా చత్తారు నాబతుకు

కూడా అంతే ఏదేమయినా నాకు చావు తప్పదు నేను సచ్చేలోగా ఆల్లల్లో ఒకడిని కాజేయ్యాలి మనసు గట్టిపరుసుకున్నాను సూరులోంచి కొడవలి తీసి, గుడిసె బయట కూసున్నాను ఆ పని వద్దని నాపెల్లాం నాకాల్లా ఏల్లా పడింది 'నువ్వు ఆపని సేత్తే తరవాత మా గతేంకాను ఈ గంజినీల్లు కూడా దొరక్క మలమల మాడిసావాలి మేము' అంది నేనొప్పుకోలా 'ఇప్పుడు మాత్తరం మనం కడుపునిండా తింటన్నామా ? మనుసుల్లాగా బతుకుతున్నామా ? ఎప్పుడయినా సచ్చేవాల్లమేగా మీరు నన్నాపొద్దు' అన్నాను మేమిట్టా మాట్లాడుకుంటన్నామో లేదో ఆడు మనుసుల్ని తీసుకొచ్చాడు ఆల్లు పదిగజాల దూరంలో వుండగానే నేను లేసి నిలబడ్డా పెద్దగా అరిశా 'అరే నాకొడకల్లారా, మీలో పేనాలమీద ఆశలేనోడు ఈడికి రండి నేనెట్టాగూ పోతాను నాతోపాటు మిమ్మల్ని తీసుకుపోతా' అన్నా ఆ మాట విని అందరూ ఎనక్కి తగ్గారు ఏంచెయ్యాలో అరదం కాలా వాడికి లావాటి గులకరాయి యిసిరేశాడు బలంగా అదొచ్చి నాబిడ్డకు ఎదుర్రొమ్మున తగిలింది ఆ సీకట్లో 'అమ్మా' అని కేకపెట్టి యిరుసుకు పడిపోయి తన్నుకుంది ఆ రాయే శాతపట్టుకొని సత్తువకొందీ యిసిరేశా ఎవుడిదో తల పగిలింది ఆడు ఏసిన కేకకి మిగిలినోల్లు పారిపోయారు తెల్లారింది నా బిడ్డకు తెలివిరాలా ఎదుర్రొమ్మంతా కవిలిపోయి నెత్తురుసెమ్మ వత్తాంది ఆడు మనుసుల్ని తీసుకొచ్చాడు కాని నా దగ్గరకు రాలేకపోయాడు ఎల్లిపోయాడు మద్దినాలకు నా బిడ్డకు ఆగమేగాలమీద జొరం వచ్చింది కలవరించటం మొదలేసింది గుడిసెలో కుండలో నీల్లు కూడా అయిపోయాయి ఆటికోసం బాయి కాడికి పోయినా మమ్మల్ని సంపేత్తారు నా పెల్లాం పోయి తెత్తానంది 'మునసబుగారింటి కాడికిపోయి ఇంత గంజి తెచ్చి బిడ్డకు పొయ్యకపోతే అది బతకదు' అంది నేనొప్పుకోలేదు నేనొకటే మాటన్నాను 'ఎప్పుటికయినా సచ్చేవోల్లమే అందరం కలిసే సద్దాం సచ్చేలోగా ఆడిని నరకాలి మిగతావాల్లకయినా కూసింత బుద్దొత్తది' అన్నా అదేం మాట్లాడలేదు ఆ రాత్తిరికే నాబిడ్డ సచ్చిపోయింది ఆ గుడిసెలో నాబిడ్డ శవాని కెదురుగా నా పెల్లాం, గుడిశ బయట నేనూ రెండు రోజులట్టాగే వున్నాం నా బిడ్డ శరీరం వాసనేత్తాంది మాకేం సెయ్యాలో పాలుపోలా నన్ను సంపటానికి ఆల్లకి యీలుకాలేదు నేను ఆరింట్లో దొంగతనం సేసేనని పోలీసులకి సెప్పారంట ఆల్లు వచ్చారు నా గుడిసె కాడికి అప్పటికే నా పెల్లాం సోసొచ్చి పడిపోయింది నాకూ కూసునే ఓపిక కూడా లేదు కల్లు బైరులు కమ్మి దెగ్గిరి వొత్తువులు కూడా కనపడటంలా సరిగా నడిసే ఓపిక కూడా లేనప్పుడు నన్ను టేసనకు తీసుకొచ్చారు బాబూ మూడు మాసాలు దాటిందనుకుంటా నేనీడకొచ్చి నా వంటో యిరగని బొయిక లేదు దెబ్బ తగలని సోటులేదు నా పెల్లాం ఏమయ్యిందో, నేను సెప్పేదెవరూ అసలు ఇనిపించుకోలేదు దొంగతనం సేసిన బంగారపు వడ్డానం యేడ పెట్టావని కుల్లబొడిశారు ఇంతమంది జవానుబాబుల్లో ఒకల్లిద్దరు పలకరించారు అంతే ఇయ్యాల మాత్తరం నన్నిట్టా పలకరించిందీ, నాగోడు ఇన్నదీ మీరొక్కరే దొరా'' అంటూ ప్రకాశం వైపు చేతులు జోడించాడు

ప్రకాశం కొద్దిసేపు మాట్లాడలేదు అతని మనస్సు బరువెక్కింది కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి చాలాసేపు మౌనంగా వుండిపోయాడు ఆలోచనగా అతనివైపు చూశాడు ''ఇయ్యాల నిన్ను కోర్టుకు తీసుకుపోతున్నాము అక్కడ నీకు జరిగిన అన్యాయం సెప్పుకో'' అన్నాడు

అతను ఆ మాటలు అర్థం కానట్టు చూశాడు ప్రకాశం మళ్ళీ చెప్పాడు ''మునసబు నీకుచేసిన అన్యాయాన్ని అక్కడ కోర్టులో చెప్పుకో ఆయన నిన్ను వదిలిపెట్టి వాళ్ళకు శిక్ష వేస్తాడు

వున్నదున్నట్లు ఇప్పుడు నాకు చెప్పినట్లు చెప్పుకో'' అన్నాడు అతను అయోమయంగా తల వూపాడు ప్రకాశం వెళ్ళి స్టూలు మీద కూర్చున్నాడు 'ఈ బ్రతుకులు ఎప్పటికి మారతాయో ఎంతన్యాయం పోలీసులు ఎంతో న్యాయవంతులు అనుకుంటున్నారు జనం పోలీసుల్ని చూస్తే జనంలో ఎంత భయం, భక్తి న్యాయాన్ని రచ్చించాల్సిన పోలీసులు కూడా ఇట్టా చేస్తున్నారేమిటి? స్టేషన్లో మూడు నెలల నుండీ భయంకరంగా దెబ్బలు తింటూ ఒక మనిషి వుంటున్నాడంటే అది ఎంత బాధ కలిగించే విషయం తను నేర్చుకున్న చట్ట ప్రకారం ఇక్కడ ఏమీ జరగటం లేదేమిటి ? న్యాయమేది ?' అనుకున్నాడు

ఆలోచనలలో కూరుకుపోయిన అతను డేవిడ్ రాకను గమనించలేదు డేవిడ్ వచ్చి, కోర్టుకు తీసుకుపోవాల్సిన కాగితాలు రైటరు టేబిలు సొరుగులో వెతుకుతూ ప్రకాశం వైపుచూశాడు ప్రకాశం చటుక్కున స్టూలుమీద నుండి లేచి నిలబడ్డాడు అతనివైపు డేవిడ్ కొరకొరా చూశాడు ''సీనియర్ పీసీలకు రెసుపెక్టు ఇయ్యాలని తెలియదా?'' అన్నాడు

ఆ ప్రశ్నలో ప్రకాశం ఆలోచనలు చెదిరిపోయాయి నీళ్ళు నమిలాడు ''పరధ్యానంగా వున్నా సార్ అందుకని '' అన్నాడు

''అంత పరధ్దేనంగా వుండేవాడివి సర్వీసు ఏం చేస్తావు ఇంకా ముప్పై అయిదేళ్లు సెయ్యాలి ఆ లాకప్పు తీసి వాడిని బయటకు తియ్యి అదిగో, ఆ గోడకు తగిలించి వున్న బేడీలు ఆడి సేతులకెయ్యి కోరుటు టైం అయ్యింది'' అన్నాడు

ప్రకాశం మౌనంగా వెళ్ళి లాకప్ తాళం తీసి అతన్ని బయటకు రమ్మన్నాడు అతను చిన్నగా తూలుతూ బయటకు వచ్చాడు అతనింకో అడుగు వేయగలిగిన స్థితిలో లేడు సరిగా నిలబడలేక పోతున్నాడు అతని చేతులకు బేడీలు వేస్తే అసలు నడవలేడు వాటి బరువుకే తూలి పడిపోతాడు అదే విషయాన్ని ఆలోచిస్తున్నాడు ప్రకాశం డేవిడ్ ప్రకాశంతో, ''బేడీలు వెయ్యి నా కొడుక్కి లేకపోతే పారిపోతాడు మనం పట్టుకోలేం'' అన్నాడు ప్రకాశం డేవిడ్ వైపు చూశాడు నొసలు చిట్లించి గోడ కానుకొని నిలబడ్డ ఖయిదీ చేతులకు బేడీలు తగిలించాడు అతన్ని బస్సు ఎక్కించి, టౌనుకు, కోర్టుకు తీసుకు వెళ్ళేలోగా రెండుసార్లు తూలి పడిపోయాడు రెండవసారి పడ్డప్పుడు ముక్కు బెదిరి నెత్తురు కారింది నొసలు దోక్కుపోయింది ఇంకొక అడుగు కూడా ముందుకు వేసే స్థితిలో లేడు అతను చేతులకు వేసిన బేడీలు అతను సరిగా నడవకుండా ఆటంకపరిచాయి రెక్క పట్టుకొని కోర్టుదాకా నడిపించుకుపోయి చెట్టు కింద కూర్చోపెట్టాడు ప్రకాశం అతని వంటిమీద పేరుకున్న మట్టి, బంకలు సాగుతూ ప్రకాశం చేతులు నిండా అంటింది రోజుల తరబడి స్నానం లేక ఆ శరీరం నుండి దుర్వాసన వస్తోంది కోర్టు దగ్గరకు సబ్ఇనస్పెక్టరు వచ్చాడు

''ఏమిట్రా వాడి ముక్కూ, మొహం?'' అతనివైపు చూస్తూ అన్నాడు యస్సై

''నడవలేక పోయాడు సార్ పడ్డాడుసార్ ముక్కు బెదిరి నెత్తురు కారింది సార్'' అన్నాడు డేవిడ్

''ఓరి గొడ్డు అది కడిగించు మేజిస్ట్రేటు ముందు అట్లాగే ప్రొడ్యూస్ చేస్తే మన తాట వలిచేస్తాడు'' అన్నాడు యస్సై కోపంగా అతన్ని లేపి పంపుదగ్గరకు తీసుకెళ్ళి ముఖం సుబ్బరంగా కడిగించారు తరువాత అతని చేతికి వున్న బేడీలు తీసి కోర్టులో మేజిస్ట్రేటు ముందు హాజరు పరచటానికి తీసుకెళ్ళారు

నల్లరాళ్ళతో కట్టబడి ధృడంగా చిన్న కోటలాగా వుంది ఆ కోర్టు ప్రకాశం అంతా పరిశీలనగా

చూశాడు మేజిస్ట్రేటు కూర్చునే చోటు ఎత్తుగా వుంది ఆయన కెదురుగా బెంచి గుమస్తా, కాస్త ఇవతలగా ప్లీడర్లు కూర్చోవటానికి కుర్చీలు, టేబిళ్ళు ముద్దాయిలను హాజరుపరచటానికి చెక్కలతో చేసిన బోను బయట వాకిలి దగ్గర తలకు పెద్ద కండువా చుట్టుకొని ప్యూను యస్సై వచ్చి మేజిస్ట్రేటుకు సెల్యూట్ చేసి కుర్చీలో కూర్చున్నాడు మేజిస్ట్రేటు తెల్ల దొర ప్రకాశం, డేవిడ్ అతన్ని తీసుకెళ్ళారు కోర్టు వరండాలో కొద్దిసేపు నిలబడిన తరువాత ప్యూను ఆ ముద్దాయి పేరు పిలిచాడు పెద్దగా మూడుసార్లు ప్రకాశం, డేవిడ్ అతన్ని చెరొక రెక్క పట్టుకు తీసుకెళ్ళి బోనులో నిలబెట్టారు మేజిస్ట్రేటుకు ఇద్దరూ సెల్యూట్‌లు చేశారు మేజిస్ట్రేటు, బోనులో నిలబడి తనవైపు చేతులు జోడించిన అతనివైపు ఓసారి చూచి, తల తిప్పి, తన చేతిలోని కాగితాలు చూడటంలో మునిగిపోయాడు బెంచీ గుమస్తా ముద్దాయి వైపు చూస్తూ ''నీ పేరు బోడియ్యా కదూ?'' అన్నాడు

ఆ మాట సరిగా వినపడలేదు అతనికి తల వూపాడు అయోమయంగా

''నువ్వు మీవూరి మునసబుగారైన రంగారాయుడిగారి ఇంట్లో బంగారు వడ్రాణం దొంగతనం చేసినట్లూ, నీతోపాటు అక్కడ పాలేరుగా వుంటున్న లక్ష్మయ్య వురఫ్ లచ్చిగాడు అనే అతను నువ్వు దొంగతనం చేస్తుంటే చూసినట్లున్నూ, ఆ దొంగ వస్తువుని పోలీసులు నీ గుడిసెలో మట్టి ముంతలో వుండగా స్వాధీనం చేసుకున్నట్లున్నూ, నీమీద కేసు దానికి నువ్వేం చెప్పుకుంటావు?'' అన్నాడు బెంచీ గుమస్తా

అసలే దిబ్బుళ్ళు పడ్డ బోడెయ్య చెవులకు ఆ మాటలు సరిగా వినపడలేదు కానీ, వినపడ్డంతవరకు వాళ్ళు తనని దొంగ కింద జమకట్టి, తను దొంగతనం చేసినట్లు చెపుతున్నారు బోడియ్యా ఏం మాట్లాడలేదు మేజిస్ట్రేట్‌వైపు దీనంగా చూస్తూ నిలబడ్డాడు చేతులు జోడించి అతని కాళ్ళల్లో వున్న ఆ కొద్దిపాటి సత్తువ కూడా కరిగిపోతోంది మేజిస్ట్రేటు తల తిప్పి బోడియ్యా వైపు చూశాడు ''దొరా, నా బిడ్డ, నా ఇంటిది '' గొణుగుతున్నట్టు అన్నాడు బోడియ్యా నీళ్ళు నిండిన అతని మసక కళ్ళ ముందు కన్నబిడ్డా, కట్టుకున్న భార్య తప్ప ఇంకేమీ కనిపించటం లేదు మేజిస్ట్రేటు తల తిప్పుకున్నాడు బోడియ్యా బోనులోనే కూలిపోయాడు సబ్ ఇనస్పెక్టరు ఆజ్ఞ మీద ప్రకాశం, డేవిడ్ అతన్ని లేపి నిలబెట్టారు బలవంతంగా ఈ సారి బెంచీ గుమస్తా పెద్దగా అన్నాడు ''నువ్వేమన్నా చెప్పుకుంటావా?''

'ఏమీ లేద' న్నట్టు తల వూపాడు బోడియ్యా తరువాత అతన్ని టౌనులోనే వున్న సబ్‌జైలుకు తీసుకుపోయి అప్పగించారు పీసీ లిద్దరూ అతనికి జైలు శిక్ష వేశాడు మేజిస్ట్రేటు

ప్రకాశం, డేవిడ్ ఇళ్ళకు చేరేసరికి రాత్రి పన్నెండయ్యింది నిద్ర పోయేంతవరకు కూడా ప్రకాశం బోడియ్యా గురించే ఆలోచించాడు 'ఎంత న్యాయం? పోలీసులు న్యాయం చేయలేకపోయినా, కోర్టులోనన్నా అతనికి న్యాయం జరిగిద్దనుకుంటే అక్కడా అంతే అయ్యింది వీళ్ళని పట్టించుకొనే దిక్కు ఎక్కడ? పుట్టిం కాడ నుండీ సచ్చిందాకా ఆసాములకు తమ జీవితాల్ని బలిసేత్తూ, ఏమాత్రం అన్యాయాన్ని ఎదురుకోవటానికి ప్రయత్నం చేసినా వాళ్ళని పురుగుల్ని నలిపినట్లు నలిపేత్తున్నారు తమకు వీలుకాని పక్షంలో ఇట్టా పోలీసుల ద్వారా, కోర్టుల ద్వారా వీళ్ళని శిక్షిస్తున్నారు వాస్తవం ఇది మరింక ఇంతకాలం ట్రయినింగులో నేర్చుకున్న దానికి అర్థం ఏమిటి?'

బోడియ్యా రూపం కళ్ళల్లో కదిలింది 'ఒకవేళ అతను తనకి చెప్పిందంతా అబద్ధమనుకుంటా'

అనుకున్నాడు ప్రకాశం 'లేనివాడికి వుద్యోగమన్నా వస్తే ఈ అన్నేయాలూ ఏమన్నా తగ్గుతాయా? తన పరిస్థితి ఏమిటి? ఉద్యోగంలో కొంత భుక్తి దొరికింది అంతకుమించి తనకింకేమీ లేదు' ఆలోచనలు అలా సాగాయి

ఎక్కడో దూరంగా కుక్కలు ఏడుస్తున్నయ్ తెల్లారితే మళ్ళీ మామూలే ఏడు గంటలకు రోల్‌కాల్ ఆమాట అనుకుంటే భయమేసింది నిద్ర పోవటానికి గట్టిగా కళ్ళు మూసుకున్నాడు చిన్నగా నిద్రలోకి జారిపోయాడు చాలా సేపటి తరువాత

ఉదయం ఏడు గంటలకు స్టేషనుకు వెళ్ళాడు అప్పటికే పీసీలంతా వచ్చారు సెంట్రీ బయట నిలబడి వున్నాడు పీసీలంతా లోపల నిలబడి పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు వాళ్ళ దగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు వాళ్ళేదో విషయాన్ని చర్చిస్తున్నారు

''నీ ఖచ్చితంగా తెలుసా?'' అన్నాడు ఒక పీసీ

''ఆఁ బోడియ్యగాడి కేసులో అయ్యగారికి యాభై రూపాయలు ముట్టినియ్య'' అన్నాడు డేవిడ్

''నలభయ్యే నంటగా'' అన్నాడు అబ్దుల్లా

''నరసింహంగాడి నడిగితే గాని ఖచ్చితంగా తెలియదు ఇట్టాంటి యవహారాలన్నీ ఇంటి దగ్గరేగా అయ్యగారు చూసేది'' అన్నాడు ఒక పీసీ

''అయినా, ఈ కేసులో డబ్బులు వచ్చే యీలెక్కడుంది యెవురిత్తారు?'' అన్నాడు చింపిరయ్య ఆ మాటకు అందరూ అతనివైపు చూశారు

''సూడు సింపిరయ్యా నీ బుర్ర శానా మందకొడిగా పనిచేసిద్ది నీకు పెండ్లీ పెటాకులు లేవు తింటం తిరగటం తప్ప ఇంకేదీ పట్టదు నీకొచ్చే జీతం డబ్బులే నీకెక్కువ మాకేమో పెల్లాం పిల్లల్ని పోసించుకోటానికే సాలవు ఎక్కడన్నా ఓ అణా, బేడా దొరికిద్దేమోనని కనిపెడతా వుంటాము కాబట్టి ఆ వివరాలన్నీ మాకు తెలుత్తా వుంటయ్ ఆ బోడియ్యగాడి మీద పెట్టిన కేసు అబద్ధపు కేసేగా బోడియ్యగాడికి బయపడి ఆ మునసబుగాడి కొడుకు ఆడినేం సేయలేక మనకి రిపోర్టిచ్చాడు మనోళ్ళు ఆడికి పోయి సూసేసరికి బోడియ్యగాడి కూతురు సచ్చిపడుంది. మునసబుగాడి పెద్ద కొడుకుని మర్డర్ కేసులో ఇరికిత్తాననీ, జెయిలకు పంపిత్తాననీ బెదిరించి యప్పై డబ్బులు గుంజాడు తరవాత ఈ బోడియ్యగాడినేమో జయిలకు పంపాడు ఆ కేసులో వచ్చినియ్య, మనకేమన్నా ఎంగిలి చెయ్యన్నా ఇదిలిత్తాడేమోనని అదీ సంగతి'' అన్నాడు డేవిడ్ చింపిరయ్యను ఎగతాళిచేసి మాట్లాడుతూ

''ఇది చాలా అన్నాయం డేవిడ్. అల్లా చెమించడు ఎవుడికన్నా మేలుచేసి ఆడు సంతోషంగా ఇస్తే తీసుకోవచ్చుగాని, ఇట్టా కాపురాలు నాశనం చేసి, మడిసి పానాలతో ఆట లాడకూడదు'' అన్నాడు అబ్దుల్లా కోపంగా

ప్రకాశం ఆ సంభాషణ ఆసక్తిగా విన్నాడు

''అట్టా సేస్తే ఆ సేసినోడి కాపురం కూడా నాశనమయిద్ది నా కొడుక్కి ఎంతవున్నా ఆశ సావదు'' అన్నాడు ఇంకొక పీసీ కూడా కోపంగా

''అన్నాయం సేసే నా కొడుకుల్ని పాతేయాలి'' అన్నాడు అబ్దుల్లా

''ఎవరు? ఎవరు సేస్తా రాపని? ఇట్టాంటి బోడియ్యగాడి లాంటి కేసులు మనమెన్ని సూశామో సెప్పు ఈ సర్వీసులో ఆయ్యగారు ఇట్టాంటోళ్ళ మీద ఎంతమంది మీద తప్పుడు కేసులు

పెట్టాడు ఆయన చెప్పినప్పుడు మన మెంతమందిని కొట్టాం, తిట్టాం మనం ఏమన్నా చెయ్యగలిగామా? చెప్పింది చెయ్యకపోతే ఉద్యోగం ఊడిద్ది ఎవుడి బయం వాడిది మరింకట్టాంటప్పుడు అన్నేయాలు ఆగేదెట్టా?'' అన్నాడు డేవిడ్

''అన్నాయం లేదూ గిన్నేయం లేదు నోరున్నోడిది రాజ్యం, బలమున్నోడిది నేయం మన బోటోల్లం పురసెయ్యడ్డం పెడితే ఇయ్యన్నీ ఆగుతియ్యా! ఎట్టా జరగాలని రాసుంటే అట్టా జరిగిద్ది మనం మన పనేదో సూసుకొని పక్కకు తొలగాలి ఇయ్యన్నీ ఆలోచించకూడదు మనం, మన పెల్లాం పిల్లలు, ఆల్ల బగిసత్తు సూసుకోవాలి ఇయ్యాల్టి డూటీలేందో సూడండి ముందు'' అన్నాడు గురుమూర్తి

''అది సరేలే ఆ డూటీల భాగవతం ఎప్పుడూ వుండేదేలే బ్రతికినంత కాలం ఉద్యోగం, కొంపే అనుకుంటే ఎట్లా? అసలీ అన్యాయం మన దేశంలో జరగటానికి కారణం ఈ ఇంగ్లీషువాళ్ళు ఆళ్ళ మూలకంగానే అది ఇట్లా జరుగుతోంది మనమంటే ఆ తెల్లోల్ల కసలు ఇష్టం లేదు అందుకే అన్యాయంగా పరిపాలిస్తున్నారు అసలు కిరస్తానీ వాళ్ళకు న్యాయం ఏం తెలుసు?'' అన్నాడు విశ్వనాథం

మిగిలినవాళ్ళంతా ఆశ్చర్యంగా చూశారు అతనివైపు

''ఆల్లెట్లా అన్నాయం సేపిత్తున్నారు?'' అన్నాడు డేవిడ్ మిగిలిన వాళ్ళంతా ఆసక్తిగా వింటున్నారు

''చేపియ్యక పోవటమేమిటి? వీళ్ళిట్లాంటి అన్నాయాలు సేపిస్తున్నారు కాబట్టే మన గాంధీగారు వీళ్ళమీద అహింసా యుద్ధం చేస్తున్నారు వాళ్ళని వాళ్ళ దేశం పొమ్మంటున్నది అందుకే వీళ్ళింకా చాలా అన్నాయాలు చేస్తున్నారంట పవిత్రమైన మన మతాన్ని కూడా నాశనం చేస్తున్నారంట కూడా''

''వీళ్ళది ఏ దేశం అంటావ్?'' అడిగాడు అబ్దుల్లా

''ఇంగలాండనీ చాలా దూరం సముద్రం మీద మూడు నెలల తరబడి ప్రయాణం చెయ్యాలి వీళ్ళు మనకి చాలా నష్టం కలిగిస్తున్నారు కాబట్టే గాంధీగారు వాళ్ళని వెళ్ళి పొమ్మంటున్నారు''

''ఎప్పుడెళ్ళి పోతారు?'' అన్నాడొకతను

''ఏమో ఎప్పుడెళ్ళిపోతారో అదంతా పెద్ద కథ మన గాంధీగారు అహింసా యుద్ధం చేసి వాళ్ళని ఓడిస్తే తప్ప వాళ్ళంతట వాళ్ళే వెళ్ళేలాగా కనపడటం లేదు అప్పటిదాకా ఈ అన్యాయాలు ఇంతే అంతదాకా ఎందుకు ? మన జీవితాలు ఇలాగుండటానికి కూడా కారకులు వాళ్ళే మనచేత గొడ్డు శాకిరీ చేయించుకొంటున్నారు మనకేమో తక్కువ జీతాలు ఇస్తున్నారు వాళ్ళు ఇక్కడి నుండి వెళ్ళిపోయి మనదేశాన్ని మనం పరిపాలించుకుంటున్నప్పుడు మాత్రమే మన బతుకులు బాగుపడతాయి న్యాయం నాలుగు కాళ్ళమీద నడుస్తుంది ''

మిగిలిన వాళ్ళంతా అతను చెప్పిన విషయాన్నే ఆలోచిస్తున్నారు

''అదికాదు సార్ నాకు తెలియక అడుగుతా మన బోడియ్య కేసులో ఆ మునసబు అట్లా చెయ్యటానికీనూ, మన అయ్యగారు ఆ మునసబుతో లాలూచి అయ్యి అతన్ని ఇరగ కొట్టి తప్పుడు కేసు పెట్టటానికీ, ఆ తెల్లదొరలకు సంబంధమేంది ?'' అన్నాడు ప్రకాశం

మిగతా వాళ్ళంతా అతనివైపు చూశారు ప్రకాశం అన్నమాటకు ఏం సమాధానం చెప్పాలో

తోచలేదు విశ్వనాథంకు ''అదంతే లేవయ్యా, నీకంత తేలిగ్గా అర్థమయితే ఇంక మేమంతా దేనికి? వీటినే రాజకీయాలంటారు ఇంతింత సర్వీసున్న మాకే అవి ఓపట్టాన అంతుబట్టటం లేదు ఏమంటావు గోపాలం ?'' అన్నాడు విశ్వనాథం గోపాలాన్ని కలుపుకొస్తూ అతని సమాధానం ఎవరికీ అతికినట్లు కనిపించలేదు

కొద్దిసేపు ఎవరూ మాట్లాడలేదు గోపాలం విశ్వనాథం వైపు చూచి మెదలకుండా వూరుకున్నాడు కొద్దిసేపు తరువాత, ''అది కాదులే కానీ, మొత్తంమీద తెల్లోళ్ళు మనదేశాన్ని అక్రమంగా పరిపాలిస్తున్నారు వాళ్ళని ఈదేశం నుండి తరిమేసే కార్యక్రమం గాంధీగారు చేపట్టారు మనకైతే ఆ వివరాలు సరిగా తెలియవు కానీ, రోజూ పేపరు చూసేవాళ్ళకు బాగా అర్థమవుతాయి గాంధీగారు అహింసా సిద్ధాంతంతో పోరాటం చేస్తున్నారంట ఆ పోరాటం ఇటు మన దక్షిణ భారతదేశంలోకన్నా కూడా అటుబాగా వుంది'' అన్నాడు గోపాలం

వాళ్ళా విషయం చాలాసేపు మాట్లాడుకున్నారు ఎవరికీ దాన్ని గురించి సరిగా తెలియనందున, కాసేపటికి విసుగుపుట్టింది

''ఇవ్వాల్టికి డ్యూటీలు ఏమీ లేవనుకుంటా'' అన్నాడు డేవిడ్ అందరి ఆలోచనలు మళ్ళీ అటుమళ్ళాయి తరువాత కొద్దిసేపటికి యస్సై వచ్చాడు రోల్‌కాల్ తీశాడు

'ఈ పూట పగలు డ్యూటీ ఏమీ తగలకుండా వుంటే బావుణ్ణు, కంటినిండా నిద్రపోవచ్చు' అనుకున్నాడు ప్రకాశం

అతను అనుకున్నట్లుగానే రోల్‌కాల్ తరువాత అందరినీ ఇళ్ళకు పొమ్మన్నాడు రైటరు ''అందరూ ఇళ్ళదగ్గరే వుండండి అవసరమైతే పిలిపిస్తా'' అన్నాడు

ప్రకాశానికి ఆనందమేసింది అక్కడ కొచ్చి డ్యూటీకి రిపోర్టు చేసిన తరువాత ఇన్నిరోజులకు కాస్త విశ్రాంతి దొరికింది ఇంటికెళ్ళి యూనిఫారం విప్పి మేక్కు తగిలించి కంబడి పరచుకొని పడుకున్నాడు ఇన్నిరోజుల తరువాత ఇప్పుడు కొడుకు కాస్త విశ్రాంతిగా ఇంటిదగ్గర పడుకోవటం గమనించింది తల్లి భార్య పొయ్యి దగ్గర వుంది తల్లి అడుగుతున్న అనేక ప్రశ్నలకు సమాధానం చెపుతూ నిద్రపోవటానికి ప్రయత్నం చేశాడు ప్రకాశం గచ్చు నేలమీద పక్క కుదరటంలేదు

సంభాషణ వూరి మీదకు మళ్ళింది వూరిలోని వాళ్ళని పేరు పేరున గుర్తు తెచ్చుకొని మాట్లాడుకున్నారు ఇంతలో పోస్టుమేన్ వచ్చి ప్రకాశాన్ని కేకేశాడు ప్రకాశం లేచి పోస్టుమేన్ అందించిన ఉత్తరం తీసుకున్నాడు

''కొత్తగా వచ్చారా మీరు?'' అడిగాడు పోస్టుమేన్ ప్రకాశంవైపు చూస్తూ

తలూపాడు ప్రకాశం అతను వెళ్ళిపోయాడు ఆత్రుతగా చింపి చూశాడు గురవయ్య రాశాడు అతని కెంతో ఆనందమేసింది చాలా పెద్ద ఉత్తరం రాశాడు లోనికెళ్ళి గోడకానుకొని కూర్చుని చదవటం ప్రారంభించాడు

మిత్రుడు ప్రకాశానికి, గురవయ్య వ్రాయుట ఇక్కడ మేమంతా దేవుని దయవలన క్షేమము మీరునూ క్షేమంగా ఉండాలని ఆ భగవంతుని ప్రార్థించుచున్నాము ముఖ్యముగా వ్రాయుట ఏమనగా ఇక్కడ మా స్టేషన్లో డ్యూటీలు చాలా కష్టంగా వున్నయ్ అసలు విశ్రాంతి లేదు నేనిక్కడకు వచ్చిం దగ్గరనుండీ నీకు ఉత్తరం వ్రాద్దామనుకుంటున్నాను కాని ఇప్పటికి వీలయ్యింది ఇది కూడా గార్డు డ్యూటీలో వుండి రాస్తున్నాను చాలా రోజుల్నుండి నిద్రలేదు నిద్రకు కరువాసి పోయాను గార్డు వెయిటింగ్‌లో దొరికిన కొద్ది టైంలో ఈ వుత్తరం రాస్తున్నాను ఇక్కడ మా

రైటరు, యస్సై మమ్మల్ని వేపుకు తింటున్నారు డ్యూటీల్ని సృష్టించటంలో మా రైటరుని మించినవాడు ఇంకొకడు వుండడని అనుకుంటున్నాను చచ్చేటప్పుడు ఈ నా కొడుకు ఎట్టాంటి చావు చస్తాడో కాని డ్యూటీలు చెప్పేటప్పుడు వాడి ఫోజులు చూడాలి వాడూ, వాడి మొహం, ఆ ఫీలింగు అదోరకంగా ప్రవర్తిస్తాడు తనే తన స్వంత డబ్బుతో స్టాఫ్‌నంతా పోషిస్తున్నట్టు, మేమంతా తన ఎస్టేటులో పనిచేసే కూలీల్లాగా చూస్తాడు ప్రతిమాటలో అధికారం ధ్వనిస్తుంది ప్రతి పనీ కృత్రిమంగా వుంటుంది వాడు మనస్ఫూర్తిగా నవ్వటం నేనీ పదిరోజుల్లో చూడలేదు అయినా వాడికంత కాళ్ళు తెచ్చింది యస్సై యస్సై స్టాఫ్ యొక్క కష్టసుఖాల్ని పట్టించుకొనే వాడైతే వాడికంత పొగరెక్కేది కాదు కేసుల్లోని డబ్బు రైటరుగాడి ద్వారా యస్సైకి ముడుతోంది వీడికి మళ్ళీ దమ్మిడీ యివ్వడు యస్సై ఆ విషయం మాతో చెప్పి ఏడ్చేటప్పుడు మాత్రం మాలో ఒకడిగా మారిపోతాడు రైటరుగాడు ఆ కొద్దిసేపూ ఎంతో ఆత్మీయతా ఒలకబోస్తాడు అంతే మళ్ళీ మరుక్షణంలో వాడి ధోరణి మామూలే వాడి పీడ ఎలా వదిలించుకోవాలో మాకు అర్థం కావటం లేదు ఒక్కమాటలో చెప్పాలంటే వాడు మనిషి కాడు అలాగని కనీసం మృగం కూడా కాదు ఉదయం ఏడు గంటలకు రోల్‌కాల్‌కు వెళితే పదిన్నర పదకొండు, ఒక్కోసారి పన్నెండు గంటలదాకా డ్యూటీలు చెప్తడూ, ఇంటికి పోనివ్వడు ఎవడన్నా సీనియర్ పీసీ ఇదేమిటని ధైర్యం చేసి అడిగితే, అతనిమీద వెంటనే యస్సైకి చాడీలు చెపుతాడు యస్సై గాడు స్టాఫందరి మీదా విరుచుకు పడతాడు అడిగిన కానిస్టేబులుకు అప్పటికప్పుడు పాస్‌పోర్టు రాసి వారం పదిరోజులు సబ్‌జైలు గార్డుకు టౌనుకు పంపిస్తారు ఆ విషయాన్ని తరువాత ఇనస్పెక్టరుకు తెలియజేసి ఆమోదముద్ర పొందుతారు మనం ఉద్యోగాల్లోకి రాకముందు మనం కష్టం చేసిన చోట్ల ఆసాములు ఈ ఆఫీసర్ల కన్నా నయం అనిపిస్తారు వీళ్ళల్లో మానవత్వమనేది కానీ, కనీసం పాపభీతి అనేది కానీ లేదు ఈ ఉద్యోగం మానుకొని పోదామని ఎంతో ఆలోచించాను కానీ వీలు కాలేదు కేవలం నెలకు సరిపోయే తిండిగింజలు ఒక్కసారిగా కొనుకొచ్చుకొంటాము ఇక్కడ ఆడ ఆసామి నడుక్కోని ఏపూట కాపూట గింజలు తెచ్చుకొంటాం ఇందులో తిండికి దిగులు లేదు ఒకరకంగా జీవితానికి కొంత భద్రత ఏర్పడిందని చెప్పవచ్చు అంతే తేడా అక్కడ కన్నా ఇక్కడ మనం సుఖం పడుతున్నది శారీరకంగా ఏం లేదు ట్రైనింగు స్కూల్లోనే ప్రాణానికి సుఖంగా వుంది

ప్రకాశం! నీకక్కడ పరిస్థితులు ఎలాగున్నాయ్ ? వుత్తరం రాయి నా పరిస్థితి మాత్రం పెనం మీద నుండి పొయ్యిలోకి దొర్లినట్లుంది ట్రైనింగు స్కూలు నుండి స్టేషనుకు రావటం నీ యోగక్షేమాలు రాయి ఏదో విషయాలు రాద్దామని కూర్చుని అన్నీ సమస్యలను వర్ణించి వూరుకున్నాను అయినా ఇంతకుమించి విశేషాలు మాత్రం ఏమున్నాయిగనక నీ ఉత్తరం కోసం ఎదురు చూస్తుంటాను వెంటనే ఉత్తరం రాయి మీ అమ్మను, మా అమ్మాయిని అడిగినట్లు చెప్పు ఉంటామరి నీ స్నేహితుడు గురవయ్య

ఉత్తరం మడిచి, చిన్నగా నవ్వుకున్నాడు

''ఏందయ్యా ! ఏం రాచాడు ?'' అంది తల్లి

''ఏముంది వాళ్ళ స్టేషను విశేషాలు రాశాడు చానా కట్టంగా వుందంట దూటీ ఉత్తర మంతా అయ్యే రాశాడు''

''అన్నిసోట్లా అట్టాగే ఉందన్నమాట'' అంది తల్లి

''అన్నిచోట్లా అంతే '' అని ఇంకా ఏదో మాట్లాడబోయేంతలో బైట నుండి కేక

వినపడింది పీ సీ చింపిరయ్య కేకేశాడు ప్రకాశం లేచి బయటకెళ్ళాడు

''రైటరుగారు నిన్నూ, సుబ్బారెడ్డిని రమ్మంటున్నారు'' అన్నాడు చింపిరయ్య

''ఎందుకూ?'' అడిగాడు ప్రకాశం

''ఏమో మరి తొందరగా రమ్మంటున్నాడు'' అని చెప్పి ఎదురు లైనులో వున్న సుబ్బారెడ్డిని పిలవటానికి వెళ్ళాడు చింపిరయ్య కేకకు నిద్రపోతున్న సుబ్బారెడ్డి లేచి బయట కొచ్చాడు ప్రకాశంతో చెప్పినట్లే సుబ్బారెడ్డికి కూడా చెప్పాడు చింపిరయ్య

ప్రకాశం అడిగినట్లే అతనూ అడిగాడు ''ఎందుకూ?'' అని

''తెలియదు మరి ఎందుకో'' అన్నాడు చింపిరయ్య

సుబ్బారెడ్డి అక్కడ నుంచే ప్రకాశాన్ని చూస్తూ ''స్టేషనుకు పోదాం పద'' అన్నాడు

తరువాత చింపిరయ్య వెళ్ళిపోయాడు ఇద్దరూ యూనిఫారం వేసుకొని స్టేషను కెళ్ళారు అప్పటికే రైటరు పాస్‌పోర్టు రాసి వుంచాడు ''ఏంది సార్ పిలిపించారు?'' అడిగాడు సుబ్బారెడ్డి

''మీరిద్దరూ బోడిపల్లి పోవాలి అక్కడ ఒక ఆడమనిషి బావిలో పడి చనిపోయిందంట మునసబు రిపోర్టు పంపించాడు అక్కడకు యస్సైగారూ, సార్జిన్‌గారూ వచ్చిందాకా గార్డుగా వుండండి తొందరగా పోండి శవాన్ని ఎవరూ తియ్యకుండా, తీసుకుపోకుండా చూడండి'' అన్నాడు పాస్‌పోర్టు ఇస్తూ

ఆ మాట వినటంతోనే సుబ్బారెడ్డి ముఖం మాడిపోయింది ''నా కెప్పుడూ ఈ శవాల డ్యూటీలు తప్ప, ఇంక వేరే డ్యూటీలు లేవా సార్ ఇంక స్టేషన్లో మెన్ లేనట్లు ఎప్పుడూ నేనేనా'' అన్నాడు కోపంగా

రైటరు సుబ్బారెడ్డి వైపు కొరకొరా చూశాడు సుబ్బారెడ్డి గిరుక్కున వెనక్కి తిరిగి బైటకు నడిచాడు తిట్టుకుంటూ ప్రకాశం అతన్ని అనుసరించాడు లైను దగ్గరకు వచ్చిన తరువాత ప్రకాశంతో, ''తొందరగా అన్నం తిను అక్కడ కూడు దొరికిద్దో లేదో, ఆరుమైళ్ళు నడిచిపోవాలి ఎండమాడి పోతున్నది'' అన్నాడు

ఇద్దరూ గబగబా నాలుగు మెతుకులు తిని, యూనిఫారం వేసుకొని, లాఠీలు తీసుకొని బయలుదేరారు ఎండ మాడ్చేస్తోంది వూరు దాటేసరికే చెమటతో యూనిఫారాలు తడిచి పోయాయి సుబ్బారెడ్డి కోపంగా వున్నాడు రైటరుని బూతులు తిడుతున్నాడు

''ఈ నా కొడుకు నామీద కచ్చె పెట్టుకొని ఈ డూటీలు వేస్తున్నాడు పోయిన్నెల్లో నేనూ ఈడూ కలిసి చిన్న కేసొకటి కామ్‌గా డిస్‌పోజల్ చేశాం దానిలో వాటా అడిగాననీ, వాడిచ్చినంత తీసుకోలేదనీ, అప్పటి నుండి నామీద వాడు దాడి ప్రారంభించాడు కానీయ్ నా కొడుక్కి నా వుసురు తగలకుండా పోయిద్దా'' అన్నాడు సుబ్బారెడ్డి

ప్రకాశానికి ఏం మాట్లాడాలో తోచలేదు ఆ నిముషంలో ఏదో ఒకటి మాట్లాడాలన్నట్లు, ''బాయిలో పడింది ఆడ మనిషా, మగోడా?'' అన్నాడు

''ఆడదే బాయిలో పడి సచ్చిందంట ఈ దొంగ లంజాముండలు ఒకటి మన పేనానికి'' అని ప్రకాశం వైపు చూస్తూ, ''ఈ సచ్చే నా కొడుకులు సావక బతికున్న మనల్ని సంపుకు తింటారు ఇయ్యాల సూస్తావుగా ఆ బాధ'' అన్నాడు

''కష్టమా?''

''కష్టమేగా మరి ? ఆ మాటకొస్తే మనం చేసే డ్యూటీల్లో కష్టం లేనిది ఏది ? నువ్వు

చెప్పు?'' అన్నాడు సుబ్బారెడ్డి ప్రకాశం కొద్దిసేపు ఏమీ మాట్లాడలేదు నడుస్తుంటే దుమ్ము లేస్తోంది కాలిబాటలో సుబ్బారెడ్డికి కోపం కాస్త తగ్గింది కొద్దిసేపటికి

''ఈళ్లిట్లా సచ్చి సాధించేదేంది ? చాతకాని పనులు కాకపోతే'' అన్నాడు ప్రకాశం

ఆ మాటకు సుబ్బారెడ్డి చిన్నగా నవ్వాడు ప్రకాశం వైపు చూచి చిన్నగా నిట్టూర్చాడు ''నీకు అన్ని విషయాలలోనూ అనుభవం తక్కువ ఉద్యోగానుభవం లేదు జీవితానుభవం లేదు ప్రపంచానుభవం తక్కువ కాదంటావా ? నువ్వన్న మాట అట్లా వుంది మరి నేను ఇట్లాంటి కేసులు చాలా చూశాను బావిలో పడి చచ్చిపోయిన వాళ్ళూ, వురి వేసుకున్న వాళ్ళూ, విషం తిన్నవాళ్ళూ, నిప్పంటించుకొన్న వాళ్ళూ ఎంతోమంది ఇట్లా ఎంతో విలువైన ప్రాణాల్ని బలవంతంగా తీసుకుంటున్నారంటే, దానికి బలమైన కారణం ఏమీ లేకుండా ఎట్లా వుంటుంది? నా సర్వీసులో ఇట్లాంటి చావులు ఎన్నో చూశాను అభిమానవతి అయిన ఆడది ఈ ప్రపంచంలో బ్రతకటం కష్టం అని తెలుసుకున్నాను రోషం వున్నవాడు ఈ డిపార్టుమెంటులో నెట్టుకురావటం ఎంత కష్టమో అట్లా అన్నమాట '' అని రెండు నిముషాలాగాడు మాట్లాడకుండా

ప్రకాశం అతనివైపు చెప్పమన్నట్లు చూశాడు

సుబ్బారెడ్డి తిరిగి చెప్పటం ప్రారంభించాడు ''ఆడది చావటానికి ఎన్నో కారణాలు పెళ్ళయిన ఆడదానికి అత్తమామల, ఆడపడుచుల వేధింపులు తట్టుకోవటం మాటలు కాదు ఆ బాధ దానికే తెలుసు మగోడు ఏనాటికీ ఆడదాని బాధ అర్థం చేసుకోలేడు పోలీసోడి మానసిక శారీరక వేదనల్ని కనీసం ఆడిపెళ్ళాం గూడా అర్థంచేసుకోలేనట్లే ఇది కూడా సరే ఇదిట్లావుంచు ఆడదాని విషయంలో అత్తా ఆడబడుచులతోపాటు మొగుడు కూడా దాన్ని హింస పెట్టేవాడైతే ఇక అది బ్రతికుండీ చచ్చిన దానితో సమానమే 'ఈ బాధంతా ఎందుకు?' అనుకున్న అభిమానవతి, 'ఎప్పుడో ఒకప్పుడు చావాల్సిందేగా' అనుకుంటే, ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటుంది పెళ్ళయ్యాక ఆడదానికి అత్తవారిల్లేగా అంతా బతికినా, చచ్చినా అక్కడే కన్నవారింటికి చుట్టపుచూపుగా రావటమేగానీ కష్టకాలంలో రావటానికి వీల్లేదు వాళ్ళు రానివ్వరు ఇక మెట్టినిల్లే అంతా పెళ్ళయిందాకా తల్లిదండ్రుల అండతో, పెళ్ళయ్యాక మొగుడి అండతో, ముసలితనంలో కొడుకుల, లేకపోతే అల్లుళ్ళ నీడలో బతకాల్సిందే అభిమానాన్ని చంపుకొని బతికే పరిస్థితి తప్ప, ఒకళ్ళ కింద బతుకుతూ సొతంత్రంగా జీవించటానికి వీలు ఎక్కడుంటుంది? మనం ఎట్లా వుంటున్నామో ఇందులో, ఆడది కూడా అక్షరాలా అంతే కనీసం తన విషయంలో కూడా తను ఒక స్వతంత్ర ఆలోచన చెయ్యటానికి అవకాశం లేదు అన్ని విషయాల్లోనూ ఆడది మగాడి మీద ఆధారపడి రోజులెల్ల దీయాల్సిందే కాని ఇంకోడి కష్టాన్ని అది తినటం లేదు నువ్వు గూడా చూసే వుంటావ్ బాగా ఆడదానికి కొద్దిగా పనిచేసే వయస్సొచ్చింతర్వాత ఏదో ఒక పనికి పోతానే వుంటది లేకపోతే కొంపలో గాడిద శాకిరీ సేత్తా వుంటది తను కాయకష్టం చేసి, తనకు కావాల్సిన తిండిని తను సంపాదించుకుంటున్నట్టేగా ఆ లెక్కకొస్తే ఇంకా ఎక్కువ సంపాదించుకుంటన్నట్టే నేను చెప్పేది కూలీనాలీ సేసుకొనేవాడి పెల్లాం సంగతే కాదు, బాగా వున్న మోతుబరి రైతు పెల్లాం కూడా ఇంటి పనీ వంట పనీ చెయ్యాల్సిందే అంటే కష్టపడాల్సిందే ఆసాముల్లాగా కాలుమీద కాలేసుకుని కూసునే ఆడోళ్లు, ఏ జమీందారీ కుటుంబాల్లోనో వుంటారు సరే ఇంత కష్టపడ్డా ఆడది తినటం తినకపోవటం అనేది మగోడి ఇష్టం మీద ఆధారపడి వుంటుంది ఈడు పెట్టే శరీర కష్టాన్ని కొంత కాలం భరించగలదుగానీ, మానసిక వేదనను ఎంతోకాలం

తట్టుకోలేదు మగోడికి ఎదురు తిరిగి బతకటం అయ్యేపని కాదు అట్లాంటప్పుడు మిగిలేది ఆత్మహత్యే కదా నా అనుభవంలో నేను చూసిన చావులన్నీ అట్లాంటియ్యే'' అన్నాడు సుబ్బారెడ్డి

ప్రకాశం వింటూ వుండిపోయాడు అప్పటివరకూ నిప్పులు చెరిగిన సూర్యుణ్ణి మేఘాలు అడ్డుకున్నాయి పొలాల మీదినుండి వచ్చే గాలి చల్లగా తగులుతోంది చెమట పోసిన శరీరాలకు వేగంగా నడవలేక చిన్నగా నడుస్తున్నారు ఇద్దరూ ప్రకాశం సుబ్బారెడ్డి మాటల్ని జాగ్రత్తగా విన్నాడు 'తెలివయినవాడే మొత్తంమీద' అనుకున్నాడు

''అయితే బాగానే వుంది మీరు చెప్పింది కాని అభిమానం చంపుకొని బ్రతకటం వెంటనే కాకపోయినా రోజులు గడిచేకొద్దీ అలవాటు కాదా?'' అడిగాడు ప్రకాశం

ఆ మాటకు 'కాదు' అన్నట్టు తల వూపాడు సుబ్బారెడ్డి ''ఎక్కడి దాకానో ఎందుకు మన ఉద్యోగాల సంగతే చూడు మనల్ని పురుగుల్లాగా కూడా చూడరు మన ఆఫీసర్లు నాకు పాతిక సంవత్సరాల సర్వీసుంది నేను కూడా నీలాగే కొత్తలో అట్లాగే అనుకున్నాను రోజులు గడిచే కొందీ పరిస్థితులకు అనుకూలంగా మారిపోతాననీ, ఉడుకు రక్తంలో ఈ అభిమానం సహజమనీ, వయస్సుడిగాక నేను మానసికంగా అంతగా బాధ పడననీ అనుకున్నా కానీ ఏమాత్రం మార్పులేదు ఇప్పటికి కూడా అప్పటికన్నా ఇప్పుడే ఇంకా బాధ ఎక్కువగా వుంటోంది ఎక్కువ మానసిక క్షోభ అనుభవిస్తున్నా నేనొక్కడ్నే కాదు ఎవడో నూటికి కోటికి ఒక్కడు సీమూ, నెత్తురు లేనోడు మినహా మిగిలినవాళ్ళంతా కూడా, ముఖ్యంగా డిపార్టుమెంటులోని క్రిందిస్థాయి ఉద్యోగులంతా కూడా, ఈ రకమైన బాధ అనుభిస్తున్న వాళ్ళే ఎంత ఓర్చుకుందామన్నా మనస్సు వుండబట్టదు మనమీద వాళ్ళ దౌర్జన్య పూరితమైన అధికార చలాయింపులను ఏమాత్రం సహించలేము కారణమేమిటి ? అభిమానమనేది మన రక్తంలోనే వుంటుంది మనిషి చచ్చిపోయినప్పుడు మాత్రమే అది వాడితోపాటు పోతుంది అంతవరకూ అంతే ఒక మనిషి మీద ఇంకొకడు పెత్తనం చలాయించటం ఎవడూ సహించడు అలా సహిస్తూ పడి వుంటున్నా మంటే మన పరిస్థితులే కారణం ఆడదానిలాగానే మనం కూడా ఆఫీసర్ల దయాదాక్షిణ్యాల మీద బ్రతుకులు వెళ్ళమారుస్తున్నాం మనం కష్టపడకుండా మనకెవరూ ఉచితంగా జీతాలు ఇవ్వడం లేదు అయినా మన తిండి, మన సుఖం, మన ఆనందం మన చేతుల్లో లేవు మన బ్రతుకులే మన ఇష్ట ప్రకారం వెళ్ళదీయలేకపోతున్నాం కేవలం అభిమానాన్ని చంపుకొని బ్రతికే విషయమే కాదు ఇంకా చాలా విషయాలు అంతే ఎవడినన్నా స్టేషనుకు తీసుకువస్తే వాడు కాస్తో కూస్తో ఉన్న వాడైతే వాడి జోలికి పోము అదే మనలాగా బీదా బిక్కీ గనక అయితే వాడి ప్రాణాలు తీస్తాం వాడిని నానా యాతన పెడతాం వాడిని కొట్టే దెబ్బల్లో ఒక్క దెబ్బ మనల్ని యెవడన్నా కొడితే మనం ఓర్చుకోగలమా ? కానీ, లేనివాడిని కొడుతూనే వున్నాం దానివల్ల మనకు ఒరిగే దేమిటి ? వాడినుండి రికవరీ చేసిన సొమ్ములో మనకి దమ్మిడీ వంతయినా దక్కనిస్తున్నారా ? కష్టపడేది మనము పాపం మూట కట్టుకొనేది మనం ప్రజలందరిచేతా అమ్మల్నీ, అక్కల్నీ చివరకు పెళ్ళాల్నీ కొనేది మనం ప్రజల దృష్టిలో చెడ్డవాళ్ళుగా ముద్రవేయించుకొనేదీ మనమే తద్వారా ప్రజల మధ్య నిర్భయంగా తిరగలేక అనుక్షణం మానసిక వేదన అనుభవించేది మనం ఇన్ని సమస్యలకు మనల్ని గురిచేస్తున్నది ఎవరు ? మన ఆఫీసర్లు సబ్ ఇనస్పెక్టరు దగ్గర నుండి ఆపై వాళ్ళంతా మనల్ని అడ్డం పెట్టుకొని బతికే నా కొడుకులే జనంకూడా ఇంత ఇవరంగా ఆలోచించరు పోలీసులు చేసే ప్రతిపనికీ పోలీసు కానిస్టేబులు ఎంతవరకు బాధ్యుడు అని

ఆలోచించేవాడు ఏడి? మనల్ని ఒక యంత్రం లాగా వాడుకుంటూ, ఆ యంత్రం మీద బాగుపడే యజమానుల్లాగా మన ఆఫీసర్లు బాగుపడి పోతున్నారు ఈ డిపార్టుమెంటులోని అర్థంలేని డిసిప్లైన్ మనల్ని ప్రాణం లేని యంత్రాల కన్నా హీనంగా మార్చింది మనల్ని దోచుకోవటానికే ఈ డిసిప్లైన్''

మాట్లాడటం ఆపేశాడు అతను నడవటం వలన కలిగిన అలసటతో మాట్లాడలేక పోయాడు చెమటకు చొక్కాలు తడిచిపోయాయి నడుస్తూంటే గసపుడుతోంది

ప్రకాశం ఆకాశం వైపు చూస్తూ ''సాయంత్రంనికల్లా వానోచ్చేలాగుందే యవ్వారం చూత్తంటే'' అన్నాడు

ఆ మాటకు తలెత్తి సుబ్బారెడ్డి నాలుగు దిక్కులూ చూశాడు నడుస్తూనే ''రావచ్చు'' అన్నాడు మళ్ళీ విషయంలో పడ్డారు పదడుగులు వేశాక

''అయితే మన కానిస్టేబుళ్ళంతా మనలాగే పాపభీతితో వుంటున్నారా ? ఎంత దేవుడూ దెయ్యం అన్నా, పాపం పుణ్యం అన్నా, ఒకొకళ్ళు ఖయిదీల్ని ఎంత దారుణంగా హింసిస్తారో మనం చూస్తూనే వున్నాంగా, దానికేమంటావు ?'' అన్నాడు ప్రకాశం

ఆ మాటకు సుబ్బారెడ్డి కొద్దిసేపు ఏమీ మాట్లాడలేదు తరువాత ''నువ్వనేది నిజమే ప్రకాశం నువ్వన్నట్లు చాలామంది పీసీలు అలాగే ప్రవర్తిస్తారు దానివెనుక కారణం ఏదో నాకు తెలిసినంత వరకు చెపుతాను విను డిపార్టుమెంటులో చేరిందగ్గర నుండీ ఆఫీసర్ల బాధలు పడలేక వాటిని వ్యతిరేకించలేకా, వ్యతిరేకించటానికి కావలసిన 'సంఘ' బలం లేక, తవని అర్థం చేసుకొనే వాళ్ళు లేకా, ఆఫీసర్ల నుండి ఎలాటి సానుభూతీ పొందలేకా, దానికి తోడు పరిస్థితుల్ని సక్రమంగా అర్థం చేసుకోలేని ప్రజల నిరాదరణకు గురై, తన బాధల్నీ, సమస్యల్నీ పట్టించుకొనే దిక్కులేక, తమలో పెరుగుతున్న కసిని ఆ విధంగా అట్లా తీర్చుకుంటున్నారు అనుకుంటా నేను కొంతమంది పీసీలయితే స్టేషన్లో అవమానాలకి గురైన సందర్భంలో ఆ కోపమంతా ఇంట్లో ఆడవాళ్ళ మీద చూపిస్తారు ఎప్పుడయినా ఏదయినా ఒక విషయంలో ఆఫీసరుగనక ఏ పీ సీ నయినా కొంచెం మెచ్చుకుంటే చాలు, ఆ రోజు వాడు ఇంట్లో ఎంతో ఆనందంగా గడుపుతాడు అది మానవ సహజం'' అన్నాడు.

ప్రకాశం సుబ్బారెడ్డిని గురించీ, అతను చెప్పిన సంగతులు గురించీ ఆలోచిస్తున్నాడు 'నిజంగా ఇతనికి చాలా విషయాలు తెలుసు' అనుకున్నాడు అతని కింతవరకూ పరిచయమయిన వాళ్ళల్లో గురవయ్య, గోపాలం మాత్రం తెలివయినవాళ్ళు అనుకునేవాడు 'సుబ్బారెడ్డి డిపార్టుమెంటుని గురించి బాగా లోతుకుపోయి ఆలోసిత్తన్నాడు' అనుకున్నాడు ప్రకాశం

మళ్ళా సుబ్బారెడ్డి అన్నాడు ''అంతెందుకు, మన నరశింహంగాడి విషయం చూడు వాడు ఆర్డర్లీగా అక్కడ వుంటున్నాడంటే ఎట్లాంటి పరిస్థితుల్లో ఆ పనికి సిద్ధపడ్డాడో ఆలోచించు , ఈ మానవ శరీరం రోజులో కొద్ది గంటలు మాత్రమే కష్టపడగలదు దానికీ విశ్రాంతి అవసరమేకదా దానినీ ఆరోగ్యంగా పోషించవలసిన పనిలేదా ? కాని మన శరీరాలు విశ్రాంతి అనేది ఎప్పుడయినా ఎరుగునా ? నువ్వు చెప్పు యంత్రాలకన్నా కొంత రెస్ట్ దొరుకుతుంది కాని మన శరీరాలకు రెస్ట్ లేదు. మానవ శరీరం అది చెయ్యగల పని కన్నా ఎక్కువ చెయ్యవలసి వస్తే దాని గతి ఏమవుతుంది? అలాటి పరిస్థితుల్లోనే మనవాళ్ళు ఆర్డర్లీలుగా చేరుతున్నారు ఖచ్చితమయిన పనిగంటలు లేక సరయిన వైద్యం లేక, స్వంతపనులు చేసుకొనే టైంలేక బానిసలకన్నా

హీనంగా పనిచేస్తూ ఈ శరీరాల్ని ఆరోగ్యంగా ఎంతకాలం వుంచగలం ? ఆరోగ్యం క్షీణించి ఉద్యోగానికి పనికిరాకుండా పోయినా, లేక చనిపోయినా అతనిపైన ఆధారపడ్డ వారి బ్రతుకులు ఏం కావాలి ? అన్నివిధాలా ఆరోగ్యంగా వున్న మనకే ఈ ఉద్యోగాల వలన అకాల వార్ధక్యం సంభవిస్తుంటే, ఇంక అనారోగ్య వంతుల సంగతి ఏం చెప్పాలి ? ఈ కష్టమైన ఉద్యోగాలు చెయ్యలేకా, ఉద్యోగం మానుకొని పోలేకా, కొద్దిగా తేలికగా వుండే పనికోసం ప్రయత్నం చేసే సందర్భంలో ఈ ఆర్డర్లీ పోస్టు ఒకటి అందుబాటులో కనపడుతుంది అంతేకాని, ఆ ఆఫీసర్ల ఇళ్ళల్లో వాళ్ళ ముట్టు గుడ్డలు వుతుకుతూ, వాళ్ళ పిల్లలకు ముడ్లు కడుగుతూ, వాళ్ళు తిన్న కంచాలు తీస్తూ, వాళ్ళకు పక్కలు వేస్తూ, వాళ్ళ గజ్జికుక్కలకు నీళ్ళు పోస్తూ రోజులు గడపటానికి ఎవరూ ఇష్టపడరు అంత చీమూ, నెత్తురూ లేని మనుషులు ఎవరూ లేరు, ఉండరు అభిమానాన్ని చంపుకొని వాళ్ళు అలా బ్రతకటానికి గల కారణాల్ని వదిలిపెట్టి, మనం, వాళ్ళు అలా నీచంగా బ్రతుకుతున్నారనే విషయాన్నే మాట్లాడుకుంటే ఎట్లా? పరిస్థితులు అలాగున్నప్పుడు ఎవరైనా ఏం చేయగలరు నువ్వాలోచించు ఆ పరిస్థితులకు తగ్గట్టు అతను మారిపోతున్నాడు అతన్ని అలా మారుస్తున్న ఆ పరిస్థితుల్ని మనం అనుకోవాలిగానీ, అది వ్యక్తుల తప్పు కాదు ఒకవేళ ప్రభుత్వం ఈ ఆర్డర్లీ విధానాన్ని తీసివేసినా, ఈ పని పరిస్థితులు ఇలా వున్నంతకాలం ఆర్డర్లీలుగా వెళ్ళేవాళ్ళు వుంటూనే వుంటారు'' అన్నాడు సుబ్బారెడ్డి

''అది సరె నువ్వు చెప్పింది బాగానే వుంది పరిస్థితుల్ని బట్టి మనిషి మారుతున్నాడు కాని ఈ ఆర్డర్లీలుగా చేరిన వాళ్ళంతా మిగతా వాళ్ళమీద ఆఫీసర్లకు రకరకాల చాడీలు చెప్పటం ఎందుకు? మిగిలిన కానిస్టేబుళ్ళని ఇబ్బంది పెట్టటం ఎందుకు? వాడి ఏడుపేదో వాడు యాడవ్వొచ్చుగా'' అన్నాడు ప్రకాశం

ఆ మాటకు సుబ్బారెడ్డి నవ్వాడు ''డిపార్టుమెంటులోకొచ్చి కొద్ది రోజులైనా చాలా విషయాలు గమనించావు నువ్వు ఎట్లాగయినా తెలివయిన వాడివి'' అని, ''అదికాదు ప్రకాశం పదిమంది లోంచి ఒకడు ఆర్డర్లీగా వెళ్ళాడూ అంటే, నేనిందాక చెప్పిన కారణాలే ముఖ్యమయినవి వాడిలాగానే మిగిలిన వాళ్ళల్లో కూడా చాలామంది ఆర్డర్లీలుగా వెళ్ళటానికి ప్రయత్నాలు చేస్తుంటారు ఎందుకంటే, ఆ నరసింహం గాడు ఆర్డర్లీగా వెళ్ళటానికి ఎలాటి పరిస్థితులు కారణమో, వీళ్ళు కూడా అలాటి పరిస్థితుల్లోనే వున్నారు కదా అందుకనీ, సహజంగా అటువంటి పోస్టుకి పోటీ పెరుగుతుంది మరి అట్లాంటప్పుడు ప్రస్తుతం ఆ పోస్టులో వున్నవాడు ఆ పోటీని తట్టుకోవటానికీ, తన స్థానాన్ని స్థిరపరచుకోవటానికీ, మిగిలిన వాళ్ళను ఆ పోస్టులోకి రాకుండా నిరోధించటానికీ వాళ్ళ మీద చాడీలు చెప్పటం, వాళ్ళమీద ఆఫీసరుకు ద్వేషం పుట్టించటం, తద్వారా తన స్థానాన్ని స్థిరపరచుకోవటం జరిగిద్ది ఆ కుమ్ములాటలో గెలవలేనివాడు నష్టపోతాడు'' అన్నాడు సుబ్బారెడ్డి

''అట్లా తన స్థానం కోసం ఇతరుల మీద లేనిపోని చాడీలు చెపుతుంటే ఆఫీసర్లు ఆలోచించ వద్దా? మంచీ చెడూ విచారించవద్దా?''

''అంత దీర్ఘంగా ఆలోచించే ఆఫీసరు ఎవుడున్నాడు చెప్పు మనలాగే వాళ్ళు కూడా స్వంత వ్యక్తిత్వాలతో ఏ పనీ చేయలేరు వాళ్ళుకూడా వాళ్ళ పై ఆఫీసర్ల ఇష్టా ఇష్టాలతో బ్రతకాల్సిందే చాలావరకు తన సంపాదనకు ఏమాత్రం అడ్డు వస్తాడనుకున్నా వాడిని ఏదో ఒకరకంగా తమ దారికి అడ్డు లేకుండా చేస్తుంటారు ఈ ఆర్డర్లీల విషయం వస్తే, వీళ్ళు తమ ఆర్డర్లీ స్థానా...

పదిలపరచుకోవటానికి మిగతావాళ్ళ మీద చాడీలు చెప్పటం, మిగిలిన వాళ్ళందరితో శతృత్వం తెచ్చుకోవటం జరిగిద్ది ఒక్కసారి ఆ వూబిలోకి దిగినాక ఒక ఇవతలకు వచ్చి మిగిలినవాళ్ళతో కలిసి పని చెయ్యలేడు అందుకని ఇక దానిలో చావాల్సిందే'' అన్నాడు సుబ్బారెడ్డి

ప్రకాశం వింటూ వుండిపోయాడే గాని, ఏమీ మాట్లాడలేదు ఎండకు కళ్ళు మంటలు పుడుతున్నయ్ ఇంకా రెండు మైళ్ళు నడవాలి దప్పికతో నాలుక పిడుచ కడుతోంది డొంక దారిలోని దువ్వ మోకాళ్ళ వరకూ కొట్టుకొని, కాళ్ళు అసహ్యంగా కనపడుతున్నయ్ తరువాత చాలాసేపు ఇద్దరూ నిశ్శబ్దంగా వున్నారు సుబ్బారెడ్డి అన్న మాటలు ప్రకాశం చెవుల్లో ఇంకా వినపడుతున్నయ్

'పరిస్థితులు అలాగున్నప్పుడు ఎవరేం చేస్తారు?' ఆ మాటలే మననం చేసుకుంటున్నాడు తరువాత కొద్ది సేపటికి వాళ్ళు ఆ వూరు చేరుకున్నారు పోలీసుల్ని చూచి జనం దూరంగా తప్పుకుంటున్నారు ఆడవాళ్ళు తలుపుల చాటున నిలబడి దొంగచాటుగా వీళ్ళిద్దరినీ చూస్తున్నారు సరాసరి మునసబు ఇంటికి వెళ్ళారు వీళ్ళు మునసబు ఇంటిలో లేడు శవమున్న బావి దగ్గరే వున్నాడని తెలిసి అక్కడకు వెళ్ళారు బావి చుట్టూ జనం మూగి వున్నారు మునసబు వీళ్ళని చూచి లేచి వచ్చాడు

''మునసబుగారూ ఏమిటి విశేషాలు?'' అన్నాడు సుబ్బారెడ్డి

''ఏముంది సార్ రిపోర్టు రాసి పంపానుగా'' అన్నాడు కొంచెం దూరంగా నిలబడి వినయంగా మునసబు అతని వెనుక వెట్టి, మోతాదులు నిలబడి వున్నారు చేతులు కట్టుకొని

''వూఁ అది సరే యస్సైగారూ వాళ్ళూ వస్తున్నారు వెనక '' అన్నాడు సుబ్బారెడ్డి

''అదే, అందరికీ బువ్వలు తయారు చేయిస్తున్నాను తవరు ముందుగా బువ్వతింటారా? యస్సైగారు వచ్చాక అందరూ కలిసే తింటారా?'' అడిగాడు మునసబు

''మేం అన్నం తినే వచ్చాం'' అని ప్రకాశం వైపు తిరిగి, ''నువ్వన్నం తింటావా?'' అన్నాడు ప్రకాశం వద్దన్నట్లు తల వూపాడు

''కొంచెం సల్ల తెప్పించండి'' అన్నాడు సుబ్బారెడ్డి

మునసబు వెట్టతని వైపు తిరిగి, ''అరే సుబ్బా, నువ్వు మనింటికాడికెల్లి రెండు పెద్ద సెంముల్తో సల్ల తీసుకురా'' అని సుబ్బారెడ్డి వైపు తిరిగి, ''వుప్పు వేయించమంటారా?'' అన్నాడు సుబ్బారెడ్డి తల వూపాడు ''ఆఁ, వుప్పు కూడా మోయినంగా వేయించి తీసుకురా వెస్సైగారు వస్తున్నారని సెప్పి, బువ్వ తొందరగా కానియ్యమని సెప్పు'' అన్నాడు వెట్టతను వెళ్ళిపోయాడు

మునసబు శవం వున్న బావి దగ్గర వున్న ఒక చావిట్లో మంచం వేయించాడు చుట్టూ జనం దూరంగా నిలబడి వీళ్ళని చూస్తూ వున్నారు. శవం తాలూకు తల్లీ దండ్రి కాబోలు పెద్దగా ఏడుస్తున్నారు బావి దగ్గరకు వెళ్ళి తొంగి చూశారు సుబ్బారెడ్డి, ప్రకాశం బావిలో నీళ్ళు బాగానే వున్నయ్ స్త్రీ శవం బోర్లాపడి తేలుతూ వుంది బాగా వుబ్బినట్లుంది ఎర్రరంగు చీర, ముదురు నీలం రంగు రవిక తొడుక్కొని వుంది చీరంతా నడుం మీదకు వచ్చి పిరుదులు నగ్నంగా కనపడుతున్నయ్ రెండు పిరుదుల మధ్య నుండి సన్నటి బుడగలు పైకి వస్తున్నయ్ ఇద్దరూ వెళ్ళి మంచం మీద కూర్చున్నారు మునసబు వాళ్ళకు కొంచెం దూరంగా నిలబడ్డాడు

''ఇటు వచ్చి కూర్చోండి మునసబుగారూ'' అన్నాడు సుబ్బారెడ్డి

''పరవాలేదులెండి సార్'' అంటూ నవ్వుతూ వచ్చి కాళ్ళకట్టవైపు కూర్చున్నాడు రెండో

వెట్టిని ఉద్దేశించి, ''అరే నువ్వు పోయి, అయ్యగార్లకు సల్ల తొందరగా తెమ్మని సెప్పు. ఆడేంది పోయినోడు అట్నాగే పోయాడు'' అని పని పురమాయించాడు.

''ఇప్పుడేం తొందర, అంత అర్జంటు లేదులేండి'' అన్నాడు సుబ్బారెడ్డి. ప్రకాశం అక్కడలా కూర్చున్నాడే కాని, అతని మనసులో భయం కదులుతోంది. మునసబు తనని గురించి ఆరాలు అడుగుతూ, తన కులం ఎక్కడ అడుగుతాడో అని అతను భయపడుతున్నాడు. ఆ భయం అతన్ని నిశ్చింతగా కూర్చోనివ్వడం లేదు. అతను అనుకున్నట్లే కొద్ది సేపటికి మునసబు ప్రకాశాన్ని గురించి సుబ్బారెడ్డిని వివరాలు అడిగాడు.

చివరకు ఇంక ఒకే ప్రశ్న మిగిలినట్లు ''ఏమిట్లు?'' అన్నాడు.

ఆ ప్రశ్నకు సుబ్బారెడ్డి చిన్నగా నవ్వాడు. ''ఏమిట్లయినా పోలీసుల్లోకి వచ్చిన తరువాత పోలీసు కులమే, ఇంక వేరే కులమెందుకు'' అన్నాడు.

ఆ మాటకు మునసబు ఇబ్బందిగా నవ్వి, ''అంతే, అంతేగా'' అన్నాడు విషయం తెలిసిపోయినట్లు.

ప్రకాశం చిన్నగా నిట్టూర్చాడు.

''అది సరే. ఈ అమ్మాయి ఎవరూ, ఎందుకు బావిలో పడ్డట్లూ, ఆత్మహత్యా ? హత్యా ? మీకేమన్నా తెలిస్తే చెప్పండి'' అన్నాడు సుబ్బారెడ్డి.

మునసబు సర్దిగ్గా కూర్చున్నాడు. ''హత్యా పాడా. ఆ పిల్లే దూకింది'' అన్నాడు.

''ఎందుకు, ఏమంత ముంచుకొచ్చింది ఆ పిల్లకు. ఎన్నేళ్ళుంటయ్ ?'' అడిగాడు సుబ్బారెడ్డి.

''దాని మొగుడు రోజూ తాగి రావటం, దాన్ని గొడ్డును బాదినట్టు బాదటం. అది మాత్రం ఎంతకాలం ఓర్చుకుంటుంది ? పాపం ఇంటెడు శాకిరీ అదే సేసిద్ది. గొడ్డులాగా పని సేసేది'' అన్నాడు.

''ఎందుకు కొట్టటం రోజూ ?''

''ఎందుకేముందీ, పొగరు. ఆడీ మద్దిన తాగుడుకు అలవాటు పడ్డాడు. ఆ అత్తగూడ అంతే. రాకాసి ముండ. ఆ పిల్లను వేపుకు తినేది. లేనిపోని రంకు అంటగట్టి కొడుకు సేత తన్నిచ్చేది. నిజానికా పిల్ల అట్టాంటిది కాదు. మా కందరికీ తెలుసు కదా'' అన్నాడు.

సుబ్బారెడ్డి ప్రకాశం వైపు చూశాడు. వెట్టతను తెచ్చిన మజ్జిగ తాగారిద్దరూ.

''ఆ పరిస్థితిలో ఆ అమ్మాయికి అంతకు మించిన మార్గం లేక పోయింది. అంతకంటే మంచి పరిస్థితులే వుంటే ఆ అమ్మాయి చావాల్సిన పని లేదు. అంతేనంటారా మన లెక్క ప్రకారం'' అన్నాడు ప్రకాశం చిన్నగా నవ్వుతూ.

''కరెక్ట్'' అన్నాడు సుబ్బారెడ్డి తనూ చిన్నగా నవ్వి. వాళ్ళా విషయం గురించి మాట్లాడు కుంటూ వుండగానే యస్సై, సార్జెన్‌లు సైకిళ్ళ మీద వచ్చారు. వాళ్ళు కూడా భోజనం చేసి వచ్చారు. వీళ్ళు లేచి వాళ్ళకు సెల్యూట్‌లు చేశారు.

ఒక నులక మంచాన్ని వెల్లికిలా వేసి నాలుగు వైపులా గట్టి చేంతాళ్ళు కట్టి, బావిలోకి దింపారు. ఒక వెట్టతను నడుంకు తాడు కట్టుకొని బావిలోకి దిగి శవాన్ని మంచం మీదకు చేర్చాడు. శవాన్ని బయటకు తియ్యటానికి ఓ గంట సమయం పట్టింది. పెదవులూ, కళ్ళు వుబ్బి భయంకరంగా వుంది. శవాన్ని చూచి చాలామంది భయపడి దూరంగా జరిగారు. ఆ శవం తాలూకు తల్లిదండ్రులు కూడా రావటానికి భయపడ్డారు. శవాన్ని వెల్లకిలా తిప్పారు. అరకాళ్ళా

అరిచేతులు తెల్లగా పాలిపోయి వున్నాయి నీళ్ళతో నిండిన కడుపు బాగా వుబ్బి వుంది రవిక ముడి వూడిపోయి వక్షోజాలు వుబ్బినట్లు బిరుసుగా కనపడుతున్నయ్ కొద్దిగా తెరుచుకొన్న నోటిలో నుండి చుక్కలు చుక్కలుగా నీరు కారుతోంది తీవ్రమైన ఎండ వేడికి శవం మీది బట్టలు ఎండిపోయాయి కొద్దిసేపటికే

టైం గడిచేకొద్దీ వాసన వస్తోంది శవం శవ పంచాయితీ పూర్తి చేసేసరికి సాయంత్రం అయిదు గంటలు దాటింది ఈగలు ముసురుతున్నయ్ వాసనకు కడుపులో తెములుతోంది ప్రకాశానికి శవాన్ని ఆసుపత్రికి పోస్టుమార్టంకు పంపటానికి బండి కట్టించటానికి తల ప్రాణం తోకకు వచ్చింది వాళ్ళకు శవాన్ని తీసుకెళ్ళటానికి ఎవరూ బండి కట్టనన్నారు అదిరించో, బెదిరించో బండి కట్టించారు చివరకు యస్సై, మునసబులు అప్పటికి పొద్దు గుంకుతోంది వాతావరణంలో మార్పు వచ్చింది చల్లటి గాలులు వీస్తున్నాయి ఆకాశం మేఘావృతమై వుంది రెండు ఈత చాపలు తెచ్చి శవాన్ని వాటిలో చుట్టి ఒంటెద్దు బండిలో పెట్టించారు దాన్నిప్పుడు పది మైళ్ళ దూరంలో వున్న ప్రభుత్వ ఆసుపత్రికి తీసుకెళ్ళాలి ఇద్దరు వెట్టివాళ్ళను తీసుకొని చిన్నగా బయలుదేరారు రెడ్డీ, ప్రకాశం బండి వూరు దాటేసరికి బాగా చీకటి పడింది బండతను కోడిగుడ్డు లైటు వెలిగించి బండికి కట్టాడు శవం మీది నుండి వస్తున్న వాసన భరించలేనట్లుగా వుంది ఆ వాసనకు కుక్కలు బండి వెంట మొరుగుతూ వస్తున్నాయి వెట్టివాళ్ళిద్దర్నీ బండి వెనక నడవమని చెప్పి, వీళ్ళిద్దరూ బండి ముందు నడవటం మొదలుపెట్టారు చిన్నగా తుప్పర ప్రారంభమయ్యింది ఈదురు గాలికి లైటు ఆరిపోయింది రెండు నిముషాల్లో వర్షం పెద్దదయింది అంతా సుబ్బరంగా తడిచిపోయారు దారిలో ఎక్కడన్నా నిలబడటానికి చెట్టన్నా లేదు పది నిముషాల్లో డొంకలో నీళ్ళు పారటం మొదలయ్యాయి బండి చక్రాలు మెత్తటి బురదలో కూరుకుపోతున్నాయి వెట్టివాళ్ళు తడవ తడవకు బండి చక్రాల్ని బురదలో నుండి లాగి బండిని నెడుతున్నారు వర్షం పడుతున్నంతసేపూ శవం వాసన అంతగా వెయ్యలేదు వాతావరణం అలా మారిపోయినందుకు బూతులు తిట్టాడు సుబ్బారెడ్డి తనకాడ్యూటీ వేసినందుకు యస్సైని, రైటర్నీ తిట్టాడు వాళ్ళకు ఆకలి కరకర మంటోంది కొద్దిసేపటికి వర్షం వెలిసింది ఆసుపత్రికి తమ స్టేషను వున్న వూరిమీదగానే వెళ్ళాలి రాత్రి పది గంటల ప్రాంతంలో స్టేషను వున్న వూరి దగ్గరకు చేరారు వూరి బయట బండిని ఆపమన్నాడు రెడ్డి ''ప్రకాశం, నువ్విక్కడే వుండు, నేను ఒక వెట్టతన్ని తీసుకుపోయి, అతనిక్కాస్త అన్నం పెట్టించి, నేనూ భోంచేసి వస్తా తరువాత నువ్వు పోయి వద్దువుగాని జాగ్రత్త రేపు ఉదయందాకా మనకు తినటానికేమీ దొరకదు లేకపోతే'' అన్నాడు

ప్రకాశం సరేనన్నాడు సుబ్బారెడ్డి ఒక వెట్టతన్ని వెంటబెట్టుకొని వెళ్ళాడు ఇంటికెళ్ళి స్నానం చేసి, భోజనం చేసి, వెట్టతనికి భోజనం పెట్టి వస్తూ బండతనికి ఇంత అన్నం కట్టించుకొచ్చాడు అతనొచ్చాక ప్రకాశం రెండో వెట్టతన్ని వెంటపెట్టుకొని తీసుకెళ్ళాడు యూనిఫారం విప్పేసి, స్నానం చేసి భోంచేశాడు వెట్టతనికి భోజనం పెట్టాడు బండతనికి తను కూడా కొంచెం అన్నం తీసుకొచ్చాడు తిరిగి వాళ్ళు నడక సాగించేసరికి అర్ధరాత్రి ఒంటిగంట అయ్యింది ఆరిపోయిన లైటు వెలిగించారు చిన్నగా నడక సాగించారు అలసిపోయిన శరీరాలు విశ్రాంతి కోరుతున్నాయి దూరంగా పొలాల్లో నక్కలు అరుస్తున్నయ్ ఆకాశంలో చంద్రుడు మసగ్గా వెలుగుతున్నాడు నిద్రతో కళ్ళు వాలి పోతున్నాయి అడుగులు భారంగా పడుతున్నయ్ తెల తెల వారుతుండగా ఆసుపత్రికి చేరారు ఆసుపత్రికి దూరంగా వున్న శవాల గది దగ్గర బండిని నిలబెట్టి పక్కనే వున్న

వేపచెట్టు క్రింద కూర్చున్నారు క్షణాల్లో వాళ్ళు అక్కడే నిద్రకు పడ్డారు తెల్లగా తెల్లవారిన తరువాత లేచారు వాళ్ళంతా హూనమైపోయింది వేప పుల్లలు విరిచి పళ్ళు తోముకున్నారు పక్కనే వున్న దిగుడు బావి దగ్గరకు వెళ్ళి ముఖాలు కడుక్కొని వచ్చారు ఒకళ్ళ తరవాత ఒకళ్ళుగా వెళ్ళి ఇడ్లీలు తిని వచ్చారు ప్రకాశం పోస్టుమార్టం గది దగ్గర వుంటే, సుబ్బారెడ్డి వెళ్ళి డాక్టరుకు రిక్విజేషన్ కాగితాలు ఇచ్చి వచ్చాడు డాక్టరు మధ్యాహ్నం రెండు గంటలు దాటిన తరువాత పి యమ్ రూము కొచ్చాడు నిదానంగా పి యమ్ అయిపోయేసరికి మూడు దాటింది తరువాత శవాన్ని, ఆ శవం తల్లిదండ్రులకు అప్పజెప్పారు ఆసుపత్రికి వెళ్ళి డాక్టరుచేత పాస్‌పోర్టు మీద దాఖలాలు వేయించుకొని బయిలుదేరేసరికి సాయంత్రం ఆరు గంటలు దాటింది శవం మీది బట్టలూ, తాళిబొట్టు తాడూ, కాలివేళ్ళకున్న మెట్టెలూ, చేతి గాజులూ తాటాకు బుట్టలో పెట్టి గట్టిగా తాడు కట్టారు బస్సు అంది స్టేషనుకి చేరేసరికి రాత్రి పది గంటలు దాటింది స్టేషనులో వాటన్నిటినీ అప్పగించి, ఇంటికొచ్చి స్నానం చేసి భోంచేసి పడుకోనేసరికి పన్నెండు కావొచ్చింది భోజనం చేస్తుంటే అదే వాసన వస్తున్నట్టు అనుభూతి కలిగింది ప్రకాశంకు ఉదయం ఏడు గంటలకల్లా స్టేషను కొచ్చారు అప్పటికే అంతా వచ్చేశారు యస్సై ఇంకా రాలేదు పీసీ లంతా నిలబడివున్న చోట కెళుతూ లాకప్‌లో ఎవరో వుండటం గమనించాడు ప్రకాశం 'అతనెవర' ని సుబ్బారెడ్డిని అడిగాడు

''నిన్న మనం పి యమ్ కు వెళ్ళామే, ఆ అమ్మాయి మొగుడు'' అన్నాడు రెడ్డి యస్సై వచ్చాడు కొద్దిసేపటికి రోల్‌కాల్ తీశారు తరువాత అందరూ యస్సై రూంలోనుండి బయటకొచ్చారు లాకప్పులోని మనిషి తాలూకు వాళ్ళు రైటరుతో ఏదో మాట్లాడుతున్నారు పీసీలంతా మామూలుగా ఒక మూలకు చేరి కబుర్లలో పడ్డారు ప్రకాశం లాకప్పు దగ్గరకు వెళ్ళి లోపలున్న అతన్ని పిలిచాడు అతను ప్రకాశం వైపు చూశాడు

''నీ పేరేమిటి?''

''చలమయ్యండి'' అన్నాడు లోపలతను అతని కళ్ళు తడిగా వున్నయ్

''ఇప్పుడెంత మొత్తుకొని ఏం లాభం నువ్వు చేతులారా సేసుకున్నావ్'' అన్నాడు ప్రకాశం అతను తలొంచుకొని తలుపు చువ్వల్ని పట్టుకొని, నుదురు చువ్వల కానించి నిలబడ్డాడు ఏడుస్తున్నాడు చిన్నగా

''అసలేం జరిగింది ఇంత దూర మెందుకొచ్చింది?''

అతను పంచెతో కళ్ళు తుడుచుకున్నాడు గట్టిగా చీది వేళ్ళని గోడకు తుడుచుకున్నాడు తలొంచుకునే చిన్నగా అన్నాడు ''అంతా నా కరమ ఏం చెప్పమంటారు?''

''ఫరవాలేదు చెప్పు మీ యిద్దరికీ గొడవెందుకు వచ్చింది చెప్పు కష్టపడి తెచ్చుకున్నది వుడకేసుకొని తినక గొడవలెందుకు ? ఇప్పుడు చూడు, నీకిద్దరు పిల్లలు కూడా వున్నారంటగా వాళ్ళ అతీగతీ ఎవరు చూస్తారు చెప్పు'' అన్నాడు ప్రకాశం

ప్రకాశం మాట్లాడేసరికి అతనికి మళ్ళీ ఏడుపు ముంచుకొచ్చింది పిల్లలు గుర్తొచ్చారు స్టేషన్లో ఇంతమందున్నా తనని ఆ మాత్రం పలకరించిన ప్రకాశం మీద అతనికి అభిమానం కలిగింది పోలీసులన్నా, పోలీసు స్టేషనన్నా అతనికున్న భయాన్ని ప్రకాశం తన మాటలద్వారా కొద్దిగా తగ్గించాడు

''అది అట్లా చేసిద్దని అనుకోలా'' అన్నాడు

''ఆరోజు మీ మధ్య ఏం గొడవ జరిగిందో చెప్పు'' అన్నాడు ప్రకాశం

''ఆ ఒక్కరోజే కాదండీ పెతిరోజూ మాయింటో తిరనాలే నేను సేనుకాడినుండి వచ్చేసరికి పెతిరోజూ అత్తాకోడల్ల మధ్య ఏదో ఒక గొడవే పెల్లయిన కొత్తలో ఎంతో ఓరుపు సూపించాను రోజురోజుకు యిల్లు నరకంగా తయారయింది మాకు నాలుగెకరాల పొలం వుంది మా అయ్య నా సిన్నప్పుడే పోయాడు పెల్లిల్లు కావాల్సిన ఇద్దరాడ పిల్లలున్నారు నాకన్నా సిన్నోళ్ళు నేను నా భార్య సేతిలో యాడ కీలుబొమ్మ నవుతానో అనీ, తననీ, చెల్లెల్లనీ సరిగా సూడనేమోనని మా అమ్మ భయం నేను పెద్దగా సదుంకోపోయినా నాకూ అన్నీ తెలుసు నా పెల్లాం మీద లేనిపోని చాడీలు చెప్పేవాళ్ళు నాకు దాన్ని సూటీపోటీ మాటలు అనేవాళ్ళు ఇదేమో మాటపడేదికాదు నేను మా అమ్మ మాటలు విని, తనని తిడుతున్నాననీ, కొడుతున్నానని ఏడ్చేది రోజురోజుకీ గొడవలు పెరిగిపోయాయి పొలం నుండి ఇంటికి పోదామంటే భయం ప్రతిరోజూ ఎవరో ఒకళ్ళు ఏదో ఒక చిన్న విషయానికి అలిగి అన్నం తినేవాళ్ళుకాదు తల్లిని ఏమన్నా అంటే చూసేవాళ్ళంతా పెళ్ళాన్ని వెనకేసుకొచ్చి తల్లిని తిడుతున్నానని అనుకునేవాళ్ళు కొంపలో శాంతనేది కరువై పోయింది ఆ బాధ తట్టుకోలేక తాగుడుకు అలవాటుపడ్డా నాకు పెల్లయ్యాక నేను తాగుడు నేర్చుకున్నాననీ, నా పెల్లాం నన్ను నాశనం చేసిందని దాన్ని నానా మాటలనేది మా అమ్మ అది మా యింటికి వచ్చిన గడియ నష్టపు గడియని నలుగురికీ చెప్పేది నాకు అది మరులు మందు పెట్టిందనికూడా మా అమ్మ పెచారం చేసింది చివరకు దానికి రంకుతనం కూడా అంటగట్టింది అన్నిటినీ ఎట్టాగో సయించిన నా పెల్లాం ఇంక సయించలేకపోయింది నన్నూ నా బిడ్డల్ని అన్యేయం సేసిపోయింది '' అతనింక మాట్లాడలేకపోయాడు అతని కళ్ళవెంట నీళ్ళు జలజలారాలాయి ప్రకాశం చిన్నగా నిట్టూర్చాడు వెనకపక్క అలికిడి అయితే తలతిప్పాడు రెడ్డి నిలబడి ఆలకిస్తున్నాడు

''నేను చెప్పిందే కరెక్టు కదా?'' అన్నాడు రెడ్డి అవునన్నట్లు తల వూపాడు ప్రకాశం ఇద్దరూ ఇవతలకు వచ్చారు

''స్త్రీ ఎంత కష్టపడి సంపాదిస్తున్నా, ఇంకొకళ్ళ కష్టార్జితాన్ని ఆశించకపోయినా, మగోడి ఇష్టప్రకారం జీవించవలసి వస్తోంది పురుషుడి నీడలో బతికే పరిస్థితులు వున్నప్పుడు ఆ స్త్రీ తల్లిగానీ, భార్యగానీ ఎవరయినా సరే, తన వునికిని కాపాడుకోవటానికీ, తన స్థానాన్ని భగ్నం చేస్తుందనుకొన్న తన శత్రువుని దెబ్బతీయటానికి ప్రయత్నిస్తుంది ఇతని విషయంలో జరిగింది అదే ఆమె భర్త చనిపోయాడు కొడుకుమీద, అంటే చెలమయ్య మీద ఆధారపడాల్సొచ్చింది ఆస్తిమీద ఆమెకేమీ అధికారం లేదు కొడుక్కి పెళ్ళీడు వచ్చింది లోకం తనని విమర్శించకుండా వుండేటందుకు పెళ్ళి చేసింది అప్పటివరకూ తండ్రినీడలో బ్రతికిన ఆ అమ్మాయికేమో ఇప్పుడేమో భర్త అండ కావాల్సొచ్చింది తండ్రినుండి తనకేమీ ఆస్తి రాలేదు తనకోసం తన పిల్లలకోసం, భర్త అభిమానాన్ని తను పొందటానికి ప్రయత్నించింది తన బ్రతుకుకోసం, పెళ్ళి కావాల్సిన తన కూతుళ్ళ బ్రతుకు కోసం తన కొడుకు అభిమానాన్ని పొందేందుకు ఆ తల్లి ప్రయత్నించింది ఈ ఇద్దరి మధ్య ఆస్తి కలిగివున్న ఆ మగోడు పొందే మానసిక వేదన అంతా ఇంతా కాదు ఏరోజూ అతనికి సుఖం వుండదు కొడుకు తనని చూడకపోతే తానేం కావాలి తనకు ఆస్తి లేదు అది తల్లి బాధ భార్యకూడా అంతే ఆస్తివుంటే గదా తను స్వతంత్రంగా బ్రతకటానికి అదిలేదు కాబట్టే ఇద్దరూ ఎవరికి చేతనయినంత, వాళ్ళు తమ స్థానాన్ని

భద్రపరచుకోవటానికి ప్రయత్నించారు ఆమె చనిపోయింది కాబట్టి అమాయకురాలని అనటం లేదు ఆమె కూడా తన శక్తినంతా ఉపయోగించి తన ప్రత్యర్థిని ఎదుర్కోవటానికి ప్రయత్నం చేసే వుంటుంది కాని ఆమె బలం చాలలేదు శారీరక వేదనకన్నా మానసిక వేదన మానవుడు భరించలేనిది అట్లా ఆమె చనిపోయిందీ అంటే తన శత్రువు ముందు తలవంచటం ఇష్టం లేదనే కదా అర్థం'' అన్నాడు

''అవును మీరు చెప్పిందే నిజం చాలా తెలివయిన వాళ్ళండీ మీరు '' అన్నాడు ప్రకాశం ప్రశంశా పూర్వకంగా నవ్వుతూ ఆ మాటకు రెడ్డి ఆనందంగా నవ్వాడు

''ప్రకాశం '' కేకవేశాడు రైటరు వాళ్ళ ఆలోచనలకు అంతరాయం కలిగించింది ఆ కేక వెళ్ళి రైటరు టేబిలు దగ్గర నిలబడ్డాడు ప్రకాశం

''ఇదిగో, ఈ సమను తీసుకొని గోకవరం వెళ్ళి అమలు జరుపుకొని రా'' అని పాస్‌పోర్టు రాసి యిచ్చాడు రైటరు ఆ సమను ఎట్లా అమలు జరపాలో అర్థంకాక గోపాలాన్ని ఉడిగాడు ప్రకాశం

''ఇది కోర్టు నుండి వచ్చిన సమను రేపు ఏడో తారీకున వాయిదా ఒక కేసులోని సాక్షికి ఇది సమను ఈ రెండింటిలో ఒకదాన్ని అంటే ఒరిజనల్‌ను సమనుదారునికి ఇచ్చి, ఈ డూప్లికేటు మీద అతని సంతకంగాని, వేలిముద్రగానీ వేయించుకో అంటే నువ్విచ్చిన సమను అతనికి ముట్టినట్లన్నమాట'' అని ఆ సమను మీద రాసున్న మనిషి పేరూ, వూరి పేరు చదివి, ''అబ్బో చాలా దూరం నడవాలి పోను తొమ్మిది మైళ్ళు, రాను తొమ్మిది మైళ్ళు నడవాల్సిందే బస్సు రూటు కాదు భోంచేసి వెళ్ళు ఒకవేళ సమనుదారుడు వూళ్ళో లేకపోతే మునసబుతో లేడని వ్రాయించుకొనిరా'' అన్నాడు గోపాలం

ప్రకాశం ఇంటికెళ్ళి, గబగబా నాలుగు ముద్దలు అన్నం తిని బయలుదేరాడు ఉదయం పది గంట లయ్యింది ఎండ చిరచిర లాడుతోంది గబగబా నడవటం మొదలు పెట్టాడు కొద్దిసేపటికే నోరు పిడచ కట్టింది దారిలో చేలల్లో పనిచేస్తున్న వాళ్ళనడిగి తాటేటికాయల్లోని నీళ్ళు పోయించు కొని తాగాడు ఎండకు తల తిరుగు తున్నట్లుగా వుంది చెమటతో యూనిఫారం తడిచిపోయింది ఆ వూరు చేరేసరికి శరీరంలో సత్తువ అయిపోయింది తీరా అక్కడకు చేరుకొనేసరికి సమనుదారుడు లేడు పొలం వెళ్ళాడని తెలిసింది అతను తిరిగి వచ్చేసరికి పొద్దు పోయిద్దని తెలిసింది అతను వచ్చిందాకా వుంటే తిరిగి చీకట్లో ప్రయాణం చేయాల్సిందే ఒక కుర్రవాణ్ణి వెంటబెట్టుకొని సమనుదారుడు ఉన్న పొలం దగ్గరకు వెళ్ళాడు అతను సమను తీసుకోవటానికి ఒప్పుకోలేదు మొదట ఆ కేసేమిటో, తను ఎందుకు సాక్ష్యం చెప్పాలో అతనికి తెలియలేదు అతన్ని నయానో భయానో ఒప్పించి సమను ఇచ్చి ఎడమచేతి బొటన వేలుకి సిరారాసి వేలిముద్ర వేయించుకొన్నాడు తిరిగి ఇంటికి వచ్చేసరికి వళ్ళంతా పచ్చిపుండయ్యింది

'ఈ రాత్రికన్నా కంటినిండా నిద్ర పోవాలి' అనుకున్నాడు ఆ డొంకబాటలో నుండి నడిచి రావటం మూలాన మెత్తటి దువ్వ చెమటతోనిండిన శరీరానికి దట్టంగా అంటుకు పోయింది ఆకలితో కడుపు నకనక లాడుతోంది చిన్నగా వూళ్ళోకి ప్రవేశించి వీధులు చూస్తూ నడిచాడు ఆ వూరు వచ్చి అన్ని రోజులైనా ఇంకా వూరు కొత్తగానే వుంది 'ఇన్ని రోజులకు గాను ఈ పూటే కాస్త పెందలాడే ఇంటికి చేరుతున్నది' అనుకున్నాడు స్టేషను కెళ్ళి అమలు జరిపిన సమను రైటరుకిచ్చి, పాస్‌పోర్టు కాగితం తీగకు గుచ్చి, ఇంటికెళ్ళబోతుంటే రైటరు పిలిచాడు బయటకు

వెళ్ళబోతున్న వాడల్లా ఆగి భయంగా వెనక్కు చూశాడు ప్రకాశం

''నువ్వు నీళ్ళు పోసుకొని, అన్నం తిని, యస్సై గారింటికెళ్ళాలి ఇవ్వాళ అయ్యగారింటికి చుట్టాలొచ్చారంట నరసింహారావు ఒక్కడితో కాదు తొందరగా వెళ్ళు'' అన్నాడు ఆ మాటతో ప్రకాశానికి నీరసం అవహించింది కోపంతో పళ్ళు గిట్ట కరిచాడు

''అట్లాగే'' అన్నాడు తన నిరసనని ఆ మాటలో ప్రదర్శించటానికి ప్రయత్నిస్తూ ఇంటికెళ్ళి, యూనిఫారం విప్పి దండెం మీద వేసి, కంబడి మీద చతికిలపడ్డాడు సన్నగా తలనొప్పి ప్రారంభమయ్యింది నీరసం అతన్ని చుట్టుముట్టింది కళ్ళు మూసుకున్నాడు

''అయ్యో ఏందిరా అట్లాగున్నావు వల్లెచ్చబడిందా?'' అంది తల్లి ఏమీలేదన్నట్టు తల వూపాడు కూర్చునే ఓపిక లేనట్టు ఒత్తిగిల్లాడు తన శరీరపు చెమట వాసనకు తనకే అసహ్యమేసింది మోకాళ్ళవరకూ వున్న దుమ్ముని చూస్తే వాంతి వచ్చేటట్లు అనిపించింది కానీ లేచి కాళ్ళు కడుక్కోవలనే వుద్దేశాన్ని నీరసం నీరసపరచింది

''నీళ్ళు బాగా మసలబెట్టు తొందరగా'' అన్నాడు భార్యతో

''మన మీడకొచ్చాక నువ్వు బాగా సిక్కిపోయావయ్యా'' అంది తల్లి ఆమెకు కొడుకు అలా తగ్గిపోవటం గురించి ఆందోళనగా వుంది కొడుకు పోలీసు నౌకరీకి వచ్చినాక తమకు తిండికి తిప్పలు తప్పిపోయాయి కోడలిప్పు డిప్పుడే వళ్ళు చేస్తోంది తనకి కూడా వంట్లోహుషారుగానే వుంటోంది కాని కొడుకు రోజు రోజుకి తగ్గిపోతున్నాడు ఎందుకో ఆమెకు అర్థం కాలేదు 'బువ్వ బాగానే తింటన్నాడు ఇంతకు ముందు జొన్న సంగటి, వున్నీళ్ళు తాగినప్పుడే బాగున్నాడు' అనుకుంది

భార్య నీళ్ళు తోడి ప్రకాశాన్ని కేకేసింది చిన్నగా లేచి వెళ్ళి స్నానం చేసొచ్చాడు బుర్ర వేడెక్కింది తలపోటుగా వుంది బాగా ఆకలి వేస్తోంది వెళ్ళి కంచం ముందు కూర్చున్నాడు రెండు ముద్దలు తినేసరికి ఆకలి చచ్చిపోయింది ఇంతలో బయటనుండి గోపాలం కేకవేశాడు ప్రకాశం గోపాలన్ని లోపలకు రమ్మనమని పిలిచాడు ''ఇప్పుడు కాదులే తరవాత వస్తా కాని, రైటరు నిన్ను యస్సై గారింటికి పొమ్మన్నాడంటగా అక్కడనుండి మనిసొచ్చాడంట మళ్ళీ నిన్ను తొందరగా పొమ్మన్నాడు రైటరు'' అన్నాడు

''అట్లాగే అన్నం తింటన్నా'' అన్నాడు ప్రకాశం గోపాలం వెళ్ళిపోయాడు గబగబా రెండు ముద్దలు తిని యూనిఫారం వేసుకొని, యస్సై ఇంటికెళ్ళాడు ప్రకాశం యస్సై బయట వరండాలో కూర్చుని బంధువులతో గాబోలు మాట్లాడుతూ ప్రకాశాన్ని చూశాడు కోపంగా యస్సైకి సెల్యూట్ చేశాడు ప్రకాశం యస్సై ముఖం భయం కలిగించింది

''ఏరా, ఎప్పుడు కబురు చేస్తే నువ్వెప్పుడు వస్తున్నావు?'' అన్నాడు కోపంగా యస్సై

'సార్ నేనింతకు ముందే ప్రాసెస్ డ్యూటీ మీద వెళ్ళి ''

''నోరుముయ్ ఇంకా ఎదురు చెపుతున్నావు ఇంటికి పంపిస్తే జాగ్రత్తా ఫో లోపలికి వెధవని, వెధవ'' అని బంధువుల వైపు తిరిగి, ''ఒక్కడూ ఒళ్ళొంచి ఏపనీ చేయడండీ బావగారూ పోనీలే అని నేనెవరికీ ఏమీ పనులు కూడా చెప్పను అక్కడ స్టేషన్లో కూడా ఎవ్వడికీ అదనంగా డ్యూటీలు చెప్పను ఫుల్ రెస్ట్ ఎప్పుడన్నా కాస్త అవసరమని పిలిపిస్తే ఇదీ వరస'' అన్నాడు

''అంతే మరి మీ మంచితనం వల్లనే వాళ్ళలా తయారవుతున్నారు'' అన్నాడు బావగారు బాధగా

ప్రకాశం సెల్యూట్ చేసి లోపలకు వెళ్ళాడు తనని ఈడుతుంటే అక్కడ కూర్చుని వున్న ఆడా మగా, పిల్లా జెల్లా అంతా చూస్తూ వున్నారు విచిత్రంగా ప్రకాశం ముఖం నల్లగా మాడి పోయింది కత్తివేటుకునెత్తురు చుక్కలేదు డోర్లో నరసింహారావు అంట్లు తోముతూ కనిపించాడు ఏం చేయాలో, ఎక్కడకెళ్ళాలో తోచక నరసింహం దగ్గరకెళ్ళి నిలబడ్డాడు ప్రకాశం ఆ టైమప్పుడు అంట్లు తోమటమేమిటో అతనికి అంతుబట్టలేదు అతన్ని చూశాడు నరసింహం

''ఆ నాకొడుకు అంతేలేరా'' అన్నాడు నరసింహం నరసిహం యస్సైనలా తిట్టేసరికి ఆశ్చర్యంతో నోట మాట రాలేదు ప్రకాశానికి తనని యస్సై తిట్టిన తిట్లు తాత్కాలికంగా మరిచిపోయాడు టోపీ తీసి పక్కన బండ మీద పెట్టి వెళ్ళి నరసింహం పక్కన కూర్చున్నాడు

''ఏందీ అంతలావు మాట అన్నావు?'' అన్నాడు

''అంతలావని చిన్నగా అంటా వేమిటి? నా కొడుకుని నరకాలి ఈడి యమ్మని '' వ... ఒక బూతు మాట వాడాడు ''ఈడి గురించి తరనాత చెపుతాలేకాని '' అని చేతిలోని తప్పే... ఎత్తి అవతలకు విసిరాడు అలా విసిరేసి ప్రకాశం వైపు తిరిగి నవ్వాడు తప్పేలా సొట్ట పోయింది పెద్దగా శబ్దమొచ్చింది

''సరే, నువ్వియ్యి తోముతూ వుండు నేను మిగతా పనులు చేస్తా లోపల ఆ పనులు నీకు తెలియవు పిల్ల నాకొడుకులు చెప్పే పనులకు నువ్వు తట్టుకోలేవు వాళ్ళకి నేనే మొగుణ్ణి'' అని చేతులు కడుక్కొని, తడి చేతుల్ని నిక్కరుకి తుడుచుకుంటూ లోపల కెళ్ళాడు

వంట గది లోంచి మసాలా వేపుడు వాసన వస్తోంది ఇంటి దగ్గర పచ్చడి మెతుకులు గొంతు దిగక, అర్ధాకలితో లేచి వచ్చాడు ప్రకాశం ఇక్కడ మసాలా వాసనకు ఆకలి వేస్తోంది కాని అతని హృదయం అవమానంతో కుతకుత వుడుకుతోంది ఆ వేళప్పుడు అన్ని అంట్లు ఎందుకున్నయ్యో అర్థం కాలేదు ఆ పని పూర్తయ్యేసరికి లోపల్నుండి కేక వినపడింది గబగబా చేతులు కడుక్కొని లోపలకు వెళ్ళాడు

ఇల్లంతా పిల్లా, పెద్దలతో గందరగోళంగా వుంది నరసింహానికి పనితో దుంపతెగుతోంది చెప్పేవాడికి చేసేవాడు లోకువ అన్నట్లు ప్రతి వాళ్ళూ వీళ్ళిద్దరికీ పనులు చెప్పేవాళ్ళే అందరూ అధికారం చెలాయించేవాళ్ళే చిన్నపిల్లలు కూడా అరే, ఒరే అంటుంటే ప్రకాశం మనస్సు బాధతో కృంగిపోయింది కట్టలు తెంచుకొనే ఉద్రేకాన్ని అతి కష్టం మీద దిగమింగుకొని పనులు చేస్తున్నాడు చిన్నా, పెద్దా స్నానాలు అయ్యేసరికి తాతలు కనపడ్డారు ప్రకాశానికి ఒక్కొక్కళ్ళు స్నానం చెయ్యగానే వాళ్ళకు తుండుగుడ్డలు అందించటం, వాళ్ళు విడిచిన డ్రాయర్లు పిండి వేయటం, మళ్ళీ నీళ్ళు తోడటం ఆ కార్యక్రమం అయిపోయిన తరువాత అంతా తిండికి కూర్చున్నారు తిండి తింటున్నంతసేపూ అన్నం, కూరలూ, నీళ్ళు సరఫరా చేయటంతో వాళ్ళిద్దరి నడుములు విరిగిపోయాయి ప్రతివాడూ విసుక్కునేవాడే చేతిలోని అన్నం ప్లేటు విసిరి వాళ్ళ ముఖాన పడేసి వెళ్ళిపోదామన్నంత కోపమొచ్చింది ప్రకాశంకు కాని తమాయించుకున్నాడు

వాళ్ళు తినే తీరు చూస్తే తను కథల్లో చదివిన రాక్షసులు గుర్తుకొచ్చేరు పళ్ళేల చుట్టూ నలగని ఎముకలు కుప్పలు పెట్టారు 'బ్రేవ్' మని తేపుతూ లేచి వెళ్ళారు ఒక్కొక్కళ్ళే వాళ్ళిద్దరి పొట్టల్లోని పేగులు ఆకలికి అరుస్తున్నయ్ ఆ ఆహార పదార్థాలు చూస్తుంటే నోట్లో నీళ్ళూరాయి తపేళాలో వున్న సోలెడు నెయ్యా అడుగంటింది అన్నం, కూర కలిపి అలాగే వదిలిపెట్టి లేచారు పిల్లలు పళ్ళాలు, విస్తళ్ళు తీసి వంటగది అంతా శుభ్రం చేసేసరికి పదకొండు గంటలు కొట్టింది

గోడగడియారం చెమటకు తడిచిపోయి వంటికి అంటుకుపోయింది చొక్కా తడిగుడ్డతో గచ్చు అంతా శుభ్రంగా తుడుస్తున్నప్పుడు, బయట వరండాలో నుండి 'అమ్మగారి' కేక కంచు గంటలా వినపడింది

''ఏం చేస్తున్నార్రా? ఎక్కడ చచ్చారు ? వచ్చి పక్క లెయ్యండి అర్ధరాత్రి దాటుతోంది''

నరసింహం ముతక తిట్లు తిడుతున్నాడు చిన్నగా ఆ తిట్లు వింటుంటే అంత విసుగులోనూ ప్రకాశానికి నవ్వు వస్తోంది అందరికీ మంచాలు చాలలేదు మిగతావాళ్ళకి చాపలు వేశారు తిండ్లు తిన్న వెంటనే ఎక్కడ పడితే అక్కడ పడి నిద్రపోయిన కొంతమంది పిల్లల్ని మంచాల మీద వేశారు తీసుకొచ్చి అడిగిన వాళ్ళకు మంచినీళ్ళు, విసనకర్రలు అందించారు పని అయిపోయిం దనిపించుకొనే సరికి అమ్మగారు హుకుం జారీ చేశారు హుకుం ప్రకారం వెళ్ళి గోడలమీద, చూరుమీద, బీరపందిరి మీద కూర్చునివున్న కోళ్ళనన్నిటినీ వెదికి పట్టుకొని, గంపలకింద కప్పిపెట్టారు గేదెలకు గడ్డి వేశారు తొట్టెలనిండా నీళ్ళు నింపారు పని పూర్తిచేసి వచ్చి యస్సై కెదురుగా నిలబడ్డారు అలా నిలువుకాళ్ళమీద ఒక అరగంటన్నా నిలబడి వుంటారు యస్సై వాళ్ళ వైపు కనీసం తల తిప్పి కూడా చూడలేదు అవమానంతో ప్రకాశం మనస్సు కుతకుత వుడుకుతోంది ఇక లాభం లేదనుకొని నరశింహం అతి ధైర్యంగా ఒక అడుగు ముందుకు వేసి, సాహసించి సెల్యూట్ చేసి, ''అయ్యా! మేం వెళుతున్నాం సార్'' అన్నాడు

యస్సై వాళ్ళవైపు చూచి, పక్కన పడుకుని తమలపాకులు నవులుతున్న అతనితో ''బావగారూ! కాళ్ళేమన్నా పట్టించుకుంటారా?'' అన్నాడు అతను అగ్గిపుల్లతో గారపట్టిన పళ్ళు కుట్టుకుంటూ, 'వద్దు' న్నట్టు తల అడ్డంగా వూపాడు

వాళ్ళకు కొంచెం దూరంలో పడుకున్న నడివయస్సు ఆమె, యస్సై భార్యతో, ''నాకు ఒళ్ళంతా నొప్పులుగానే వుంది వదినా దూర ప్రయాణం కదా! కాని మగోళ్ళతో కాళ్ళేం పట్టించుకోనూ!'' అంది సిగ్గుపడుతున్నట్టు

ఆ మాటకు యస్సై భార్య అదోలా నవ్వి, ప్రకాశం వైపు తిరిగి ''సరే మీరు పోండి'' అంది

'హమ్మయ్య' అనుకొని ఒక్క అంగలో ఇద్దరూ బైట కొచ్చేశారు చల్లటిగాలి శరీరానికి తగులుతూ వుంటే చెమటపట్టిన వంటికి హాయిగా వుంది కాని వళ్ళంతా బంకగా వుంది గడపదాటిన దగ్గర నుండీ తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టాడు నరశింహం ఆ తిట్లల్లో అతని క్రోధం అంతా నిండి వుంది ప్రకాశం మౌనంగా వున్నాడు కొద్దిసేపటికి నరశింహం కూడా మౌనంగా వుండిపోయాడు వాళ్ళ మౌనాల వెనక బాధా, కసీ తొంగి చూస్తున్నాయి వాళ్ళు వీధిమలుపు తిరిగేటప్పుడు నరశింహం చటుక్కున ప్రకాశం భుజంమీద చెయ్యివేసి, ''ఇప్పుడే వస్తా నిక్కడే వుండు'' అని పక్కనే వున్న పాకలోకి వెళ్ళాడు

అతని చర్య ప్రకాశానికి అర్థం కాలేదు విసుగ్గా నొసలు చిట్లించి, అతను వెళ్ళిన వైపు అసహనంగా చూస్తూ నిలబడ్డాడు ఇంటికెళ్ళటానికి ప్రకాశం ఆతృతగా వున్నాడు నరశింహం ఎక్కడికెళ్ళిందీ అర్థం కాలేదు కడుపులో ఎలుకలు పరిగెత్తుతున్నయ్ విసుగ్గా నుదుటికి పట్టిన చెమటను తుడుచుకున్నాడు చెయ్యి, నెయ్యి వాసన వేసింది 'ఇప్పటి వరకూ గడిచిన బ్రతుకులో, మొత్తం మూడుసార్లో, నాలుగుసార్లో నేతిబొట్లతో అన్నం తినింది ఈ పూట యస్సై ఇంట్లో, ఒక పిల్లాడు, ఎక్కువై వదిలేసిన అన్నంలో కలిపిన నెయ్యి అంతలేదు తను జీవితంలో తిన్న నాలుగుసార్లూ కలిపి దేనికైనా పెట్టిపుట్టాలి' అనుకున్నాడు విసుగ్గా నరశింహం కోసం చూశాడు

నిద్ర వస్తోంది చేతిలోని టోపీని నెత్తిన పెట్టుకున్నాడు నరశింహం పాకబయట కొచ్చి గట్టిగా కేకరించి వుమ్మేశాడు బర్రున చీది చెయ్యి నిక్కరుకు రాసుకున్నాడు ప్రకాశం దగ్గరకొచ్చి వెకిలిగా నవ్వాడు సారాయి వాసన గుప్పుమంది ఆ వాసన ప్రకాశానికి వెగటుగా తోచింది అనాలోచితంగా చేత్తో ముక్కు మూసుకున్నాడు సారాయి వాసనతోపాటు నేతి వాసన వచ్చింది ముక్కులకి

''నేను పోయే వాడ్నిగా నన్నెందుకు నిలబడమన్నావ్?'' అన్నాడు ప్రకాశం నొసలు చిట్లించుకుంటూ అతని మాటల్లో విసుగుదల కన్పించింది

ఆ మాట విని నరశింహం చిన్నగా నవ్వాడు ''వెళుదువుగాని లేవోయ్ అల్లుడూ అదేనా నీకు తెలిసిందీ?'' అన్నాడు అప్పుడే అతని మాటలు ముద్దగా వస్తున్నాయ్

ప్రకాశం ఏమీ మాట్లాడలేదు నరశింహం చేసిన పనికి కోపంగా వుంది వళ్ళంతా చెమటతో, కడుపులో ఆకలితో అతను అసహనంగా, చిరాగ్గా వున్నాడు ఓ పక్క నిద్ర వస్తోంది రాత్రి ఒంటిగంట దాటుతోంది యస్సై మీది కోపం ఇప్పుడు నరశింహం మీదకు మళ్ళింది గుటకలు మింగి మౌనంగా నడవటం ప్రారంభించాడు నరశింహం అతన్ని అనుసరించాడు కొద్ది దూరం నడిచాక, ప్రకాశం భుజం మీద చెయ్యి వేశాడు నరశింహం అతనేదో విషయాన్ని గురించి దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు

''ఇంటికి పోగానే నీకు వేడి నీళ్ళతోడి, అన్నం పెట్టిద్ది కదూ మా అమ్మాయ్?'' అడిగాడు హఠాత్తుగా నరశింహం

''ఊఁ'' అన్నాడుప్రకాశం, నరశింహం ఆ ప్రశ్న ఎందుకు వేశాడో ఆలోచిస్తూ

''అన్నం తిన్నాక, పక్కవేస్తారు పడుకోవటానికి అవసరమొస్తే కాళ్ళు పట్టిద్ది నీ భార్య ఎంత అదృష్టవంతుడివో'' అన్నాడు నరశింహం అతని స్వరంలో బాధ ధ్వనించింది దీర్ఘంగా నిట్టూర్చాడు ఏదో విషాదం అతన్ని ఆవహించింది వాతావరణం గంభీరంగా వుంది దూరంగా కుక్కలు అరుస్తున్నాయ్ చల్లటి గాలికి అలసిన వంటితో పాటు కళ్ళు కూడా మూతలు పడుతున్నయ్

''మాకు మంచాలు లేవూ పక్కలూ లేవు అందరం కింద పడుకోవాల్సిందే'' అన్నాడు ప్రకాశం ''అయినా నేనిందాకే అన్నంతినొచ్చా పోయి పడుకోటమే'' అన్నాడు మళ్ళీ

''పండుకోవటానికి మంచాలు, తింటానికి కంచాలు లేకపోవచ్చు కాని, నీవు ఎవరికోసమూ బాధపడే పనిలేదుగా నాలాగా'' అన్నాడు అతని మాటల్లో బాధ ధ్వనించింది హఠాత్తుగా ప్రకాశం వైపు తిరిగాడు ''స్టేషనులో అందరూ నన్ను గురించి ఏమనుకుంటారో నాకు తెలుసు అందరికీ నేనంటే అసహ్యమే కాదా?'' అన్నాడు నరశింహం

అతనలాగా ఎందుకంటున్నాడో ప్రకాశానికి అర్థం కాలేదు ''నువ్వనేది నాకర్థం కావటం లేదు'' అన్నాడు

''నేనంటే నీ కిష్టమేనా చెప్పు అందరిలాగానే నువ్వూ నన్ను ద్వేషిస్తున్నావా?'' అడిగాడు నరశింహం

''ఎందుకిష్టం లేదు?'' నరశింహం ప్రవర్తన అలాగెందుకుందో అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తూ అన్నాడు ప్రకాశం

''నీ కొక్కడికే నేనంటే ఇష్టం కానీ, ప్రకాశం! అందరూ నన్ను చూచి చాటుగా తిట్టుకుంటారు అందరికీ నేనంటే కోపమే నా బ్రతుకలా అయిపోయింది ప్రకాశం నామీద

ఎవ్వరికీ సానుభూతి లేదు నా పరిస్థితిని ఎవ్వరూ అర్థం చేసుకోరు '' అతని గొంతు జీర పోయింది గట్టిగా ముక్కుచీది, చొక్కా అంచుతో తుడుచుకున్నాడు అతని ప్రవర్తన వింతగా తోచింది ప్రకాశంకు నరశింహానికి మాటలతోపాటు అడుగులు తడబడుతున్నాయ్ చటుక్కున ప్రకాశం రెక్క పట్టుకున్నాడు ''ఇటురా ఈ అరుగుమీద కాసేపు కూర్చుందాం నువ్వు చిన్నవాడి వయినా నేను చెప్పేది విను నిజానిజాలు చెప్పు నాకోసం పది నిముషాలు కూర్చో ఈడ అంతకు మించి నిన్ను ఒలవంత పెట్టను నీ భార్య నీకోసం ఎదురు చూస్తుంటుందని నాకు తెలుసు'' అని చెయ్యిపట్టి లాక్కెళ్ళి ఒక యింటి అరుగుమీద కూర్చోబెట్టాడు బలవంతంగా ప్రకాశానికి అతని ప్రవర్తన విసుగు కలిగిస్తోంది కానీ అతనడిగిన తీరు చూస్తుంటే ఏమీ మాట్లాడలేక పోయాడు వెళ్ళి అతనికి దూరంగా అరుగుమీద కూర్చున్నాడు

''మేం బంగారప్పని చేసేవాళ్ళం '' అంటూ మొదలుపెట్టాడు దూరంగా శూన్యంలోకి చూస్తూ నరశింహం అతని మాటల్ని బట్టి అతను తన గతజీవితం గురించి చెపుతున్నాడని అనుకున్నాడు ప్రకాశం అరుగు మీద కుదురుగా కూర్చున్నాడు వినటానికి ఉద్యుక్తుడవుతూ గాలికి చొక్కా వంటి మీదే ఆరిపోతోంది

''నాకు ఇరవై సంవత్సరాల వయస్సు వచ్చింతరువాత మా నాన్న చనిపోయాడు ఆయన చచ్చిపోవటానికి కారణం దిగులు మేం నలుగురం అన్నదమ్ములం మానాన్న రెక్కల కష్టం మీద మమ్మల్ని బతికిచ్చుకొచ్చాడు మూడెకరాల పొలం కూడా కొనగలిగాడు మావూళ్ళో నాంచారయ్య అని పెద్ద మోతుబరి ఆసామున్నాడు వూళ్ళో చాలామంది ఆయన పొలాల్లో పనిచేసి బతికేవాళ్ళే ఆయనింట్లో పెళ్ళికి, మా నాన్న దగ్గర బంగారు వస్తువులు చేయించాడు వాడు చెప్పిన వస్తువులు చెయ్యాలంటే వాడిచ్చిన బంగారం చాలదు మాయింట్లో వూళ్ళోవాళ్ళది పది శవర్ల దాకా బంగారం వుంది పెళ్ళి కాగానే పట్నం వెళ్ళి బంగారం కొని తెచ్చిస్తాననీ, ఇప్పుడు వెళ్ళే టయిము లేదనీ, ఆ పది శవర్ల బంగారాన్ని అతనిచ్చిన బంగారంతో కలిపి వస్తువులు చేసియ్యమని చెప్పాడు చెయ్యక తప్పలేదు వూళ్ళోవాళ్ళ వస్తువులు వాడి కంటపడటం పాపం అయిపోయింది పెళ్ళయ్యి పోయింది వాడు బంగారం మాట ఎత్తలేదు మానాన్న కాళ్ళావేళ్ళా పడ్డాడు కాని లాభం లేకపోయింది 'తెప్పిచ్చి ఇస్తాన' నే మాటేగానీ, తెప్పించలేదు అంతకన్నా గట్టిగా అడిగితే శాల్తీ గల్లంతయ్యిద్ది వున్న మూడెకరాల పొలం అమ్మి బంగారం కొనుక్కొచ్చి ఎవుళ్ళది వాళ్ళకిచ్చాడు మా తండ్రి ఆ దిగులుతో మంచం ఎక్కాడు పొలంలో పండే గింజల్తో, నగా నట్రా చేస్తే వచ్చే కూలీ డబ్బుల్తో అప్పటివరకూ దిగుల్లేకుండా గడిచిన మా సంసారం బజార్న పడింది మాకు జరిగిన అన్యాయాన్ని గురించి ఎవరూ పట్టించుకోలేదు ఆఖరి ప్రయత్నంగా పోలీసు ఠాణాకు పోయి ఫిర్యాదు చేశాడు మానాన్న ఆ సంగతి తెలిసిన ఆ భూస్వామి ఆ రాత్రే వాడి మనుషుల్ని మా యింటి మీదకు తోలాడు మా నాన్నను కొట్టారు అడ్డం పోయిన మమ్మల్ని కొట్టారు ఆ రాత్రికి రాత్రే మేమంతా మళ్ళీ పోలీసు స్టేషను కెళ్ళాము మమ్మల్ని వాళ్ళు ఆసుపత్రికి పంపించారు కేసు రిజిష్టరు చేశామన్నారు వాయిదాలకు కోర్టు చుట్టూ తిరిగాము

తింటానికి తిండిలేదు చెయ్యటానికి పని లేకుండా పోయింది మా కెవ్వరూ వస్తువులు చెయ్యమని ఇవ్వటం లేదు వూళ్ళోవాళ్ళు కొంత మంది రహస్యంగా రాత్రిళ్ళు మా యింటి కొచ్చేవాళ్ళు వాళ్ళంతా వాడంటే గిట్టనివాళ్ళే వాడి చేతిలో అన్యాయమయిపోయినవాళ్ళు ఎక్కువ మంది కొంతమంది డబ్బులు, గింజలు సహాయం చేసేవాళ్ళు కాని ఎవరూ బయటపడేవారు

కాదు ఆ వూరికి గడ్డెత్తినాక, వాడి కుటుంబం మీద కోర్టులో కేసు నడిచింది మాతోనే కాని కేసు కొట్టేశారు సాక్ష్యాలేవి ? అంతే నెల తిరిగీ తిరగక ముందే మా నాన్న చచ్చిపోయాడు నేనే పెద్దవాడిని ముగ్గురు తమ్ముళ్ళు, ముసలి తల్లి ఎట్లా పోషించాలి అంత కుటుంబాన్ని దారీ తెన్నూ కనపడలేదు వూళ్ళో అందరికీ మా మీద సానుభూతి వుంది కాని తలెత్తుకొని తిరగలేకపోతున్నాం జరిగిన ఆర్థిక నష్టానికన్నా ఎక్కువగా అవమానంతో నలిగిపోయాం రోజులు గడవటం కష్టమైపోతోంది పస్తులు ప్రారంభమయ్యాయి మా అమ్మ మంచాన పడింది చిన్నోడ్ని ఎక్కడన్నా పాలికి పెడదామనుకున్నాను కాని వీలు కాలేదు వాడికి భయపడి ఎవరూ వీడిని పనిలో పెట్టుకోలేదు కూలి పనులు అలవాటు లేనందువలన కూలికెళ్ళిన మొదట్లో చాలా బాధపడ్డాము రోజులు గడిచేకొద్దీ అలవాటయినా, పనులు రోజూ వుండేవి కాదు మా మీద అభిమానం వున్న కొంతమంది మేం పడే బాధలు చూడలేక మమ్మల్ని వూరొదిలిపెట్టి పొమ్మన్నారు బతికి చెడ్డ బతుకులు మావి ఏం చేయాలో అర్థం కాదు మేమిన్ని కష్టాలు పడటానికి కారణం ఆ భూస్వామిగాడే కోర్టులో బీదవాడికి న్యాయం జరగదు వాడిమీద మాకు అంతులేని కక్ష వాడిని నరకాలని గండ్రగొడ్డలి తయారు చేసుకున్నాను ఒంటరిగా ఎక్కడ దొరుకుతాడో అని ఎదురు చూస్తున్నా రోజులు గడిచేకొద్దీ వాడిమీద పగ పెరిగి పోయింది కానీ ఒక దిగులు పీడిస్తోంది వాడిని చంపుతా బాగానే వుంది వూళ్ళో వాళ్ళంతా నన్ను మెచ్చుకుంటారు చచ్చి స్వర్గాన వున్న నా తండ్రి ఆత్మ శాంతిస్తుంది కాని, తరవాత నా కుటుంబ పరిస్థితి ఏమిటి ? ముసలి తల్లికి మనక్షోభం ప్రపంచ జ్ఞానం తెలియని తమ్ముళ్ళకు దిక్కెవరు ? అసలు నా కుటుంబంలోని వాళ్ళు ఆ పని తరవాత ఎవరెంత కాలం బ్రతుకుతారో బంధువు లెవ్వరూ ఆదుకొనేవారు లేరు దీర్ఘంగా ఆలోచించిన తరువాత ఆ వూరు వదిలి వేరేవూరు కెళ్ళాలని నిశ్చయించుకొన్నాము తాతలనాటి మిద్దె అమ్మేశాము ఆ భూస్వామి గాడి మనుషులే కొన్నారు చిల్లర మల్లర బాకీలు తీర్చి ఇంకో వూరి కొచ్చాము అప్పటికే మా అమ్మ ఆరోగ్యం బాగా క్షీణించింది ఆమె అవసాన దశలో కనీసం ఒక్క పూటన్నా కడుపు నిండా తిండి పెట్టలేకపోయాం తిండి లేకనే ఆమె సగం అయ్యింది మా అందరి పరిస్థితీ అంతే కాకపోతే వయస్సులో వున్నాం కాబట్టి రోజులు నెట్టుకొస్తున్నాం పెతిరోజూ ఉదయాన్నే ఇడ్లీలు చేసేవాళ్ళం నేనింట్లో వుండేవాడిని ముగ్గురు తమ్ముళ్ళల్లో పెద్దోడు వూళ్ళోకెళ్ళి ఇడ్లీ లమ్ముకొచ్చేవాడు మిగిలిన ఇద్దర్నీ ఒక కామందు దగ్గర పాలికుంచాను ఆ ఇడ్లీల కొచ్చిన జొన్నల్తో బువ్వ గడిచేది ఇడ్లీల్లోకి చేసిన చెట్నీగాని, కారప్పొడి గానీ మిగిలితే అదేసుకొని తినేవాళ్ళం రోజుల తరబడి జొన్నలు దంచి, అవి కడిగి, ఆ కడుగు నీళ్ళకు బదులుగా మా యిల్లు గల్లోళ్ళు కాసిని సల్ల పోసేవాళ్ళు రోజులట్టా గడుస్తున్నయ్ పాలికి కుదిరిన ఇద్దరు తమ్ముళ్ళు అక్కడే తిని, అక్కడే పడుకొనేవాళ్ళు ఎప్పుడోగాని ఇంటికి వచ్చే వాళ్ళు కాదు మా అమ్మకు ఆరోగ్యం కొంచెం కుదుటపడ్డట్టు కనపడింది రెండేళ్ళు గడిచాయి ఒకరోజు రాత్రి బాగా పొద్దు పోయినాక రెండో తమ్ముడు నచ్చాడు వాడెందుకో వణుకుతున్నాడు నాకు అనుమానం వేసింది జరిగింది భయపడుతూ చెప్పాడు వాడు పాలికున్న ఆసామి కూతురూ, ఈడు కలిసున్నప్పుడు ఆసామి చూశాడంట పారిపోయొచ్చాడు ఏం చేయాలో తోచలేదు నాలుగు దినాలు ఇంటి దగ్గరే వున్నాడు అయిదో రోజు ఆసామి పెద్ద పాలేరొచ్చి పిలుచుకుపోయాడు ఓ నెల గడిచింది ఏమీ కాదులే అనుకున్నా ఒరోజు వాడి శవం వూరి బయట కాలవలో తేలుతూ కనపడింది ఆ సంగటన జరిగిన రెండు నెలలకు మా అమ్మ

కన్ను మూసింది ఆ దిగులుతో ''

చెప్పటం ఆపాడు చిన్నగా నిట్టూర్చాడు కళ్ళు తుడుచుకున్నాడు అతని మీద జాలి కలిగింది ప్రకాశంకు మళ్ళీ చెప్పటం మొదలుపెట్టాడు నరసింహం

''ఆ ఆసామి కూతురు పొట్టన పెట్టుకున్నవాళ్ళల్లో యీడు మూడో వాడంట అసలు నిజానికి వాడికంత వయసు కూడా లేదు ఆ ఆసామి కొడుకొకడున్నాడు ఆడు ఆ వూళ్ళో ఎంతమంది ఆడకూతుళ్ళని నాశనం చేశాడో, ఆడి మూలంగా కడుపులు తెచ్చుకున్నోళ్ళు ఎంతమంది నిండు పేనాల్ని తీసుకున్నారో లెక్కలేదు ఆళ్ళు ఆడింది ఆట, పాడింది పాట తరవాత నెల రోజులకు మూడో తమ్ముణ్ణి పనిలోంచి తీసేశారు రావాల్సిన డబ్బులు ఇయ్యలేదు ఏం చెయ్యగలం కడుపులో మంట వుంది కాని ఆర్థిక బలం లేదు అంగబలం లేదు అరగజం భూమి లేనోణ్ణి నేను ఆడు ఆగర్భ శ్రీమంతుడు ఆ వూరి కిందున్న పొలాలన్నీ ఆడియ్యే ఆడిని నేనేం చేయగలను 'మాకేదో శని చుట్టుకుంది లేకపోతే ఏమిటిది?' అనుకునేవాడ్ని మేవుంటున్న ఇంటికి కొంచెం దూరంలో కోమిట్లు ఇడ్లీలు, అట్లు ఏసి అమ్మటం మొదలుపెట్టారు మా బేరం దెబ్బ తింది ఏదో వేళకింత తింటున్నామనుకుంటే అది కూడా చిన్నగా దూరమయ్యింది వాళ్ళలాగా బాకీలు పెట్టలేము వాళ్ళలాగా వసూలు చేసుకోలేము అట్టాంటి పరిస్థితుల్లోనే గత్యంతరం లేక కడుపు కింత తిండన్నా దొరికిద్దనే ఉద్దేశ్యంతో పోలీసుల్లో చేరాను ఫరవాలేదు వేళ ప్రకారం కాకపోయినా తిండికి దిగుల్లేదు కాని ఇంత భాదకవ్ నౌకరీ, ఇంకొకటి లేదు ప్రపంచంలోని కష్టాలన్నీ ఈ డిపార్టుమెంటులోనే వున్నయ్ నీకు తెలియనిదేముంది సరే నా తరవాతోడికి చేసినాక, నేనూ వేసుకున్నా పెళ్ళి నేను అప్పుడు ఒక సబ్ స్టేషన్లో పని చేస్తున్నా ఆ వూళ్ళో కనీస సౌకర్యాలు కూడా లేవు ఆరోజు బందోబస్తు డ్యూటీ వేశారు నా భార్య ప్రసవించే రోజులు అవి వాళ్ళమ్మ వచ్చి వుంది యస్సై గారికీ, రైటరు గారికి చెప్పుకున్నా ఎంత బ్రతిమిలాడినా వాళ్ళు ఒప్పుకోలేదు స్టేషన్లోనే వుండే గార్డు డ్యూటీ వెయ్యమని ఎంత రిక్వెస్టు చేసినా వాళ్ళు వెయ్యలేదు కోపంతో నా కడుపు మండింది కాని ఏం చెయ్యగలం నాకెందుకో మనస్సు కీడు శంకించింది కూడా బందోబస్తు నుండి తిరిగొచ్చేసరికి అంతా అయిపోయింది నా భార్య ప్రసవించింది ఆడపిల్ల కాని ప్రసవంలోనే నా భార్యకు గుర్రపువాతం వచ్చింది డాక్టరు లేడు ఆసుపత్రి లేదు అసలప్పుడు ఆ యింట్లోవాళ్ళకు మగదిక్కే లేదు రాత్రి పూట అప్పటికీ పాపం ఇరుగుపొరుగు వచ్చారు వాళ్ళకు చేతనయినంత చేశారు కానీ నా భార్య బ్రతకలేదు ఆఖరు చూపుకు కూడా నేను నోచుకోలేదు జీవితంలో ఎన్నో ఎదురుదెబ్బలు తిని తట్టుకోగలిగిన నేను, ఆ దెబ్బను తట్టుకోలేక పోయాను ఆ బాధ నన్ను దహించివేసి నా బిడ్డను తండ్రిని కూడా లేని వాడుగా చేస్తుందనే భయంతో, గతాన్ని కొంతవరకైనా మరచిపోగలనేమోనని, ఇదిగో, దీనికి, ఈ తాగుడుకి అలవాటు పడ్డాను కాని ఇదీ లాభం లేకుండా పోయింది దీనికి నేను బానిసనయ్యాను అప్పటివరకూ ఆత్మాభిమానాన్ని చంపుకోకుండా బ్రతకటానికి ప్రయత్నమున్నా చేస్తున్నానని అనుకుంటున్న నేను, అన్నింటినీ ఆ నారాయణమూర్తి పైన వేసి, నా బిడ్డ కోసం, నాబిడ్డను కనిపెట్టుకొని ఉండటం కోసం నన్ను నేను చంపుకొని, ఈ అంట్లు తోమే పనికి కుదరాల్సి వచ్చింది ఇంక దీనిని పోగొట్టుకోకుండా మాసుకోవటం కోసం నానాగడ్డి కరిచి, నలుగురిలో చెడ్డవాడినని అనిపించుకోవాల్సి వచ్చింది'' చెప్పటం ఆపాడు నరసింహం

ప్రకాశం మనస్సంతా బరువెక్కింది గాఢంగా నిట్టూర్చాడు 'పెతి మనిసీ ఈ బూ కామందుల కిరాతకానికి బలయినవాడే అన్నమాట' అనుకున్నాడు నిముషాలు కొన్ని నిశ్శబ్దంగా నడిచిపోయాక ఇద్దరూ లేచారు అరుగు మీద నుండి ప్రకాశంకు నరసింహం మీద సానుభూతి కలిగింది ఏం మాట్లాడాలో తోచలేదు ''చిన్నగా దీన్నుండి దూరం కావటానికి ప్రయత్నించు'' అన్నాడు ప్రకాశం నరసింహం చొక్కా అంచుతో కళ్ళు అద్దుకున్నాడు

''ఏం ప్రయత్నించేది ? ఇదేసుకొని పోతేనే కాస్త కునుకు పట్టేది లేకపోతే బుర్రంతా గతంతో నిండి నిద్ర రాదు అందుకే దీనికి నేను బానిసనయ్యాను ఈరోజు నువ్వు చూశావుగా ఈ నా కొడుకుల ప్రవర్తన మనుషులేనా వీళ్ళు మానవత్వమనేది ఏకోశానన్నా వుందా వీళ్ళకు మనం కూడా మనుషులమనే తలంపే లేదు చూడు ఎంత విచ్చలవిడితనమో బతికిన నాలుగు రోజులూ గౌరవప్రదంగా బ్రతుకుదామనే వుద్దేశ్యం గాని, నలుగురిచేతా మంచి అనిపించుకుందామనే ఆలోచనగానీ వుందా ఈ నా కొడుకులికి?'' మాట్లాడటం ఆపేశాడు కోపంతో

కొద్దిసేపు నిశ్శబ్దంగా వున్నారిద్దరు ''ఆ భూస్వాముల కెలాగైతే అంతులేని ఆస్తి వుండి అడిగేవారెవరూ లేరో, ఈళ్ళకీ అంతులేని అధికారమదం వుంది ఈళ్ళని అడిగేవాళ్ళు మాత్రం ఎవరున్నారు? అందుకే విచ్చలవిడిగా బతుకుతున్నారు ఆడింది ఆట, పాడింది పాట దాని సంగతి నాలుగురోజులుంటే నీకే తెలిసిద్దిలే'' అన్నాడు నవ్వుతూ నరశింహం

ఆ మాట అర్ధం కానట్టు చూశాడు ప్రకాశం '' పోదాం పద నిన్ను చాలా ఇబ్బంది పెట్టాను ఏమనుకోమాక నా మనస్పిప్పుడు కూసింత తేలికపడింది'' అన్నాడు అభిమానంగా ప్రకాశం భుజాన్ని చిన్నగా నొక్కుతూ

ప్రకాశం ప్రశాంతంగా నవ్వాడు ''ఈ జమీందారుల, బూకామందుల చేతుల్లో అన్ని కులాలవాళ్ళూ నలిగిపోతున్నారు కదా?'' అన్నాడు

''అవును ప్రకాశం నేనన్ని కష్టాల్లో వుంటే నాకీ కులం బువ్వ పెట్టలేకపోయింది కనీసం మా కులపోళ్ళు కన్నెత్తి చూళ్ళేదు ఇంక ఈ కులాలెందుకో నాకంతు పట్టదు ఏమిటో ఇదంతా అయోమయంగా వుంటది ఆలోచిస్తే ఇంకో విషయం ఏమిటంటే నాకీ వుద్యోగం వచ్చాక రెండు మూడుసార్లు మా వూరెళ్ళా ఆడు కనపడలా కనపడ్డా ఏం చేయలేననుకో ఎట్లాగయినా కాస్త జంకాడు 'పోనీలే మనకి విలువ లేకపోయినా ఈ ఉద్యోగానికయినా వుంది మనమీ ఆఫీసర్ల కొంపల్లో అంట్లు తోముతున్నా, బయట జనం మన పులితోళ్ళకి విలువిస్తున్నారు' అనుకున్నా'' అన్నాడు చిన్నగా నవ్వుతూ నరసింహం

''నేనూ అంతే నేను పాలేరుగా వున్న ఆసామికి చెప్పాపెట్టకుండా పోయి నౌకరీలోచేరా అప్పటికి మా ఆసామికి మేము గింజలు కూడా బాకీ వున్నాం కాని నేను ట్రైనింగులో వుండి మా వూరెళితే ఆ నాకొడుకు నోరెత్తి అదేందని కూడా అనలేదు ఎట్లాగయినా మన పులి తోలుకు విలువుంది'' అన్నాడు ప్రకాశం ఆ మాటకు నరసింహం మళ్ళీ నవ్వాడు

''ప్రకాశం నీ భాష చాలా బాగుంటదయ్యా! మీవాళ్ళ యాసకూ నీకూ చా. తేడ కనపడిద్ది'' అన్నాడు నరసింహం మెచ్చుకోలుగా

ఆ మాటకు ప్రకాశం కొంత సంతోషించినా, బాధ కలిగింది

ఇద్దరూ మౌనంగా వీధి చివరకొచ్చారు ''సరే పోయి రా, ఇప్పటికే బాగా పొద్దు పోయింది'' అన్నాడు నరసింహం

''ఇందాక ఏదో యస్సై భార్య గురించి చెపుతూ '' అన్నాడు ప్రకాశం

''అదా అది తరువాత చెపుతాలే ఎందుకూ రెండు రోజుల్లో నీకే అర్థమయ్యిద్దిలే ఇకపద'' అన్నాడు నవ్వుతూ నరశింహం ప్రకాశం కూడా అతని నవ్వులో నవ్వు కలిపాడు

ఇద్దరూ విడిపోయారు గాలి శబ్దం చేస్తూ వీస్తోంది చీకట్లో ఇంకా అలవాటుకాని దారిలో చిన్నగా చూసుకుంటూ అడుగులు వేస్తూ నడుస్తున్నాడు ప్రకాశం చంద్రుడు మేఘాల బయటకు వచ్చినప్పుడు గుడ్డి వెలుతురు పరుచుకుంటోంది ఆలోచనలతో చిన్నగా నడుస్తున్న ప్రకాశంకు, లైను చివర వేపచెట్టు కింద రెండు మానవాకారాలు కదులుతూ వుండటం లీలగా కనిపించింది చటుక్కున ఆగిపోయాడు గుండె కొట్టుకుంది వేగంగా భయంతో వాళ్ళు గుసగుస లాడుకుంటున్నారు ప్రకాశాన్ని గమనించినట్లు లేదు వాళ్ళెవరో అర్థం కాలేదు అతనికి చిన్నగా పక్కనే వున్న మొండిగోడ చాటుకు వెళ్ళాడు వాళ్ళ స్వరాల్ని బట్టి మగగొంతు చింపిరయ్యదని ఆలశ్యంగా గుర్తుపట్టాడు చీకట్లో కళ్ళు చికిలించి చూశాడు కానీ ఆడమనిషెవరో అర్థం కాలేదు ఇంక అక్కడ వుండకుండా పోలీసు లైను వెనక పక్కనుండి తిరిగి ఇంటికి చేరాడు ఆరోజు జరిగిన సంఘటనల మూలంగా చాలాసేపటి వరకు నిద్ర రాలేదు మనస్సు వ్యాకులతగా వుంది లేచి, లైటు కొంచెం పెద్దది చేసి పెట్టెలోంచి బైబిలు బయటకు తీసి పేజీలు తిప్పాడు ఎప్పుడూ చేయని ఆ పనిని అతను, అనాలోచితంగా చేశాడు అందులో మత్తయి సువార్త, ఆరవ అధ్యాయం, పధ్నాలుగవ వచనం చదివాడు అనాలోచితంగా ఆ వాక్యం ఇలా వుంది 'మనుష్యుల అపరాధములను మీరు క్షమించిన యెడల, మీ పరలోకపు తండ్రియూ మీ అపరాధములను క్షమించును మీరు మనుష్యుల అపరాధములను క్షమింపక పోయిన యెడల మీ తండ్రియూ మీ అపరాధములను క్షమింపడు' ఆ వాక్యము చదివి పెదవి విరిచాడు చదవబుద్ధి కాలేదు ఇంక పేజీలు సర్రున తిప్పాడు బైబిలు పక్కన పెట్టి, లైటు తగ్గించి నిద్ర పోవటానికి కళ్ళు మూసుకున్నాడు చాలాసేపటివరకు నిద్ర రాలేదు

ఉదయం ఏడు గంటలకు ఎవరో తట్టి లేపినట్టు ఉలిక్కిపడి లేచాడు బాగా తెల్లారిపోయింది రోల్‌కాల్ గుర్తొచ్చింది అబ్సెంటు రాసేశారేమోనని భయమేసింది ఆదరాబాదరాగా ముఖం కడుక్కొని యూనిఫారం వేసుకొని స్టేషను కెళ్ళాడు యస్సై రాలేదు ఖచ్చితంగా టైముకు తను ఉలిక్కిపడి ఎలా లేచాడో అర్థం కాలేదు 'కడుపులో భయం వుంటే అంతేగాబోలు' అనుకున్నాడు నిద్ర చాలనందున కళ్ళు మండుతున్నయ్

''ఏమిటీ రాత్రి విశేషాలు, అయ్యగారింటి దగ్గర?'' అడిగాడు గోపాలం ప్రకాశాన్ని

ఆ మాటకు ప్రకాశం నవ్వాడు ''మీకు తెలియనివ్వి కొత్తవేమున్నాయి మమూలే రాత్రి కొంప కొశ్చేసరికి నడుంలు విరిగిపోయినివ్వి'' అన్నాడు ప్రతి మాటనూ ఎత్తి పలుకుతూ స్పష్టంగా మాట్లాడటానికి ప్రయత్నిస్తూ అతని చెవుల్లో రాత్రి నరసింహం మెచ్చుకోలుగా అన్న మాటలు మోగుతూనే వున్నాయి ఇంకా

గోపాలాన్ని పక్కకు పిలిచి రహస్యం చెపుతున్నట్టు అడిగాడు ఆ మాట విని గోపాలం చిన్నగా నవ్వాడు ఆ నవ్వు ప్రకాశాన్ని సేద తీర్చింది ''ఇది బహిరంగ రహస్యమే ఈ సంగతి తెలియని వాళ్ళు లైన్లోనేకాదు, వూళ్ళోనే లేరంటా, రాత్రి చింపిరయ్య టరన్ కాబోలు'' అని నవ్వాడు గోపాలం

ఆ మాటలు అర్థంకాని ప్రకాశం ఆశ్చర్యంగా చూశాడు

''వాడు లేడూ మనదగ్గర తానేదో గొప్పవాడి నన్నట్టూ, తన కులం అందరి కులాలకన్నా గొప్పదన్నట్టు ప్రవర్తిస్తాడే, వాడే, ఆ విశ్వనాథంగాడు లేడూ, వాడి పెళ్ళామన్నా కావాలి, కూతురన్నా కావాలి వాళ్ళకదే వుద్యోగం ఈనా కొడుకేమో పొద్దుగూకంగానే వూరి బయటున్న దొమ్మరోళ్ళ కాడికేడుస్తాడు ఈళ్ళేమో ఈడ ఇంతకాలం నీకు తెలియదా?'' అన్నాడు గోపాలం

''నాకేం తెలుసు రాత్రి వస్తుంటే కంట బడ్డారు అయినా మరీ అంత పబ్లిక్కుగా ఏమిటి?''

''పబ్లిక్కు లేదూ పాడు లేదూ నిన్ను అది చూసే వుంటుంది అయినా దానికి భయం లేదు అది ఇడిసిన లం ఒకరోజు నాకు కబురు చేసింది స్టేషను స్వీపరు వెంకాయమ్మతో చెప్పు తెగిందాకా కొడతానని చెప్పమన్నా అప్పటి నుండీ నావైపు కన్నెత్తి కూడా చూడదు మళ్ళీ పొద్దున లేచింకాడనుండీ అంటూ సొంటూ, పూజలూ పునస్కారాలు ఎవరన్నా పగలు ఎదురొస్తే పది గజాలు అవతలగా తొలిగి తొలిగి పోయిద్ది మహా పతివ్రతలాగా చేసేది శివపూజలు అన్నట్టు, ఇల్లు దాటి బయటకొస్తే దించిన తలమాత్రం ఎత్తదు నువ్వు జాగ్రత్త లోకంలోని రోగాలన్నీ దాని దగ్గరే వున్నయ్ తరవాత నీ యిష్టం'' అని నవ్వాడు ప్రకాశం కూడా నవ్వాడు

తరువాత ఎవరేమీ మాట్లాడుకోలేదు ఇంతలో రైటరు కేకేశాడు ప్రకాశాన్ని, 'ఏం డ్యూటీ వేశాడో మహానుభావుడు' అనుకుంటూ రైటరు దగ్గరకు వెళ్ళాడు

''ఇవ్వాళ్ళ రెండు కేసులున్నయ్ కోర్టుకెళ్ళు రెండూ వాయిదాలు పడేయేలే వాయిదాలు నోట్ చేసుకొని వచ్చి, సాయంత్రం యస్సైగారింటికెళ్ళు'' అని డ్యూటీ పాస్‌పోర్టు చేతికిచ్చాడు, సి డి ఫైళ్ళతోపాటు అవి అందుకుంటూ, పళ్ళు కొరుక్కుంటూ సెల్యూట్ చేసి బయటకు వచ్చాడు ప్రకాశం అతనికి గవర్నమెంటు డ్యూటీ కాకుండా, అధికార్ల ఇళ్ళల్లో వాళ్ళ స్వంత పనులు చెయ్యాలంటే ఎక్కడలేని చికాకూ, విసుగూ, పట్టలేని కోపం వస్తున్నాయి కానీ బయట పడటానికి వీలులేని పరిస్థితులు

కోపంగా ఇంటికెళ్ళాడు గబగబా రెండు ముద్దలు తిన్నాడు బస్సు వెళ్ళిపోతుందనే కంగారులో గబగబా బస్‌కోసం పరిగెత్తాడు 'ఆ బస్ పోతే కోర్టుకు సకాలంలో అందుకోలేడు కోర్టులో పోలీసు ఆబ్సెంటని రాస్తారు స్టేషన్లో మళ్ళీ యస్సై గొడవచేస్తాడు పనిష్మెంటు ఇస్తాడు కోర్టుకు పంపే పని వున్నప్పుడు పెందలాడే ఆ డ్యూటీ చెపితే, ఆ పీసీ ఇంటికెళ్ళి కాస్త నిదానంగా భోంచేసి వెళతాడు కేవలం అతన్ని ఇబ్బందికి గురిచెయ్యాలనే వుద్దేశ్యంతోనే రైటరు ఆలస్యం చేస్తాడు' అనుకున్నాడు ప్రకాశం 'ఈ డ్యూటీలు ఇంతే ఈ ఆఫీసర్లు ఇంతే ఈ సమస్యలు తెగేలా లేవు వీటిని గురించి ఆలోచించటం అనవసరం బుర్రలు బద్దలు చేసుకోవటం మినహా ఉపయోగం ఏమీ కనపడడం లేదు ఇష్టమైతే ఉండటం, లేకుంటే రాజీనామా చేసిపోవటం అంతే రెండే రెండు' అనుకున్నాడు

'ఉద్యోగంలో చేరిన ఈ కొద్దికాలానికే తనకింత బాధ కలుగుతోంది మరి ఇరవైయ్యేసి, ముప్పైయ్యేసి యేళ్ళు సర్వీసు చేసిన వాళ్ళు ఎలా చేస్తున్నారో' అని ఆశ్చర్యపోయాడు

అప్పుడే బస్సు బయలుదేరింది కేకేసి చెయ్యి వూపితే బస్సు ఆపారు ముందు సీటు ఖాళీ చేయించాడు కండక్టరు కూర్చున్నాక అనుకున్నాడు, 'అన్నిచోట్ల పోలీసులకు విలువుంది, కొంతమంది నీచపు తత్వమున్న పోలీసాఫీర్ల దగ్గర తప్ప'

ఆ రోజు ఇంటి కొచ్చేసరికి చీకటి పడింది స్నానం చేసి అన్నం తింటుంటే, తల్లి కొడుకు దగ్గర కూర్చుని, ముసిముసిగా నవ్వుతూ, ''నీకు కొడుకో, కూతురో పుడతార్లేరా'' అంది

ఆ మాట చప్పున అర్థం కాలేదు అర్థమయ్యాక సిగ్గు వేసింది తల్లివైపు చూడలేకపోయాడు భార్య వంటగది గడపమీద కూర్చుని వుంది అతనికెంతో ఆనందమేసింది ఆనందంలో అన్నం తినబుద్ధి కాలేదు చెయ్యి కడుక్కుని, తెల్లచొక్కా వేసుకొని యస్సై యింటికి బయలుదేరాడు 'ఈ పని లేకపోతే కాసేపు దానితో కబుర్లు చెప్పుకొనేమాట నేనొచ్చేసరికి అది మంచి నిద్రలో వుంటదాయె' అనుకున్నాడు హుషారుగా అడుగులు వేశాడు 'ఎట్టాగయినాగాని, తొందరగా రావాలి ఈపూట ఇంటికి' అనుకున్నాడు గట్టిగా యస్సై ఇంట్లో లేడు 'హమ్మయ్య' అని నిట్టూర్చాడు 'చుట్టాలు కూడా అందరూ వెళ్ళిపోయారనుకుంటా అట్టాంటప్పుడు ఇంక నేనెందుకు?' అనుకున్నాడు

ఎంగిలి పళ్ళేలు ఎత్తేటప్పుడు నరసింహంతో చిన్నగా, ''ఇయ్యాల నన్ను కాస్త పెందలాడే కొంపకు పంపించే ఏర్పాటు చెయ్యి ఒంటో బాగాలేదు'' అన్నాడు

నరశింహం నవ్వాడు ''ఒంటో బాగోకపోతే అంత హుషారుగా వున్నావే'' అని, ''ఆ బాధ్యత మాత్రం నామీద పెట్టమాక నువ్వే పోయి అడుగుదాన్ని మనంతట మనం అడిగితే అది పెందలాడే పంపించకపోగా, ఇంకా ఆలశ్యం చేసిద్ది దానిసంగతి నీకు తెలియదు'' అన్నాడు ప్రకాశం విని మెదలకుండా వున్నాడు పనంతా అయిపోయేసరికి పది దాటింది మనసంతా ఇంటిమీద వుంది ఆమె కొత్తగా ఏదన్నా పనిని సృష్టిస్తుందేమోనని ప్రకాశంకు భయంగా వుంది ఇద్దరూ వెళ్ళి ఆమెకు సెల్యూట్ చేసి నిలబడ్డారు

''పనంతా అయిపోయిందమ్మా'' అన్నాడు నరశింహం తాంబూలం నవులుతూ, రేడియో వింటూ వుంది ఆమె ఆమాట విని నరశింహం వైపు చూసింది

''ఈ రాత్రికి అయ్యగారు లేరు ఇద్దరూ వెళ్ళి పక్కగుడ్డలు తెచ్చుకొని ఇక్కడే పడుకోండి'' అని ప్రకాశం వైపు తిరిగి నవ్వింది

ఇద్దరూ మౌనంగా బయట కొచ్చారు

''ఏమిటిది నరశింహం? నువ్వన్నంత పని అయ్యిందే నేనీపూట పెందలాడే కొంపకు పోవాలనుకుంటే ఇదేంటి?'' అన్నాడు ప్రకాశం బాధగా

''అంతే మనమను కున్నయన్నీ తలకిందు లవుతుంటయ్ ఈ రాత్రికి నువు దానికాడ పడుకోవాలి అదీ అసలు సంగతి అన్నీ నీకే అర్థమవుతాయిలే పోయిరా'' అని మలుపు తిరిగాడు నరశింహం చటుక్కున

ఆ మాటకు ఆశ్చర్యపోయాడు ప్రకాశం అతను ఆశ్చర్యం నుండి తేరుకొనేలోగా నరశింహం కల్లుపాకలో దూరాడు ప్రకాశం గబగబా ఇంటికి నడిచాడు అతని మనస్సు చికాగ్గా వుంది ఇంటికెళ్ళేసరికి భార్యా, తల్లి మంచి నిద్దర మీదున్నారు భార్య తలుపు తీసింది లోపలికెళ్ళి, ఒక కంబడి, పంచె తీసుకొని బైటకొస్తూ, ''ఈపూట అయ్యగారింట్లో పండుకోవాలంట నువ్వు తలుపేసుకొని పడుకో'' అన్నాడు ఆమె నిర్లిప్తంగా తలూపి తలుపేసుకుంది

ప్రకాశం యస్సై ఇంటికెళ్ళే సరికి నరశింహం ఇంకా రాలేదు లోపలికెళ్ళి యస్సై భార్యకు కనపడి, బైటకొచ్చి వాకిలికి అటు ఇటుగా వున్న అరుగుల్లో ఒకదానిమీద కంబడి పరచుకొని పడుకున్నాడు అతనికి బాగా చికాగ్గా వుంది మగతగా నిద్రపట్టేసరికి నరశింహం వచ్చి లేపాడు ''ఎంత సేపయ్యింది వచ్చి?'' అన్నాడు

''ఇప్పుడే'' అని పక్కకు వత్తిగిల్లి పడుకున్నాడు ప్రకాశం నరశింహం వాకిలికి రెండో

వైపునున్న అరుగుమీద పక్కేసుకుంటూ, ''అమ్మగారూ లోపల గడేసుకోండి'' అని కేకేశాడు పెద్దగా ఆవలించి చిన్నగా నిద్రలోకి జారిపోయాడు

అలా ఎంతసేపు నిద్రపోయారో, ఒక రాత్రప్పుడు మంచి నిద్రలో వున్న ప్రకాశాన్ని ఎవరో తట్టిలేపుతుంటే, చిరాగ్గా, విసుగ్గా కళ్ళు చికిలించి చూశాడు యస్సై భార్య నిలబడి వుంది అతనికి పట్టిన నిద్రమత్తు క్షణాల్లో దిగిపోయింది హఠాత్తుగా పాముని చూచినట్లు గుండె కొట్టుకుంది వేగంగా లోపలకు రమ్మన్నట్లు చేత్తో సైగ చేసి లోపలికెళ్ళింది ఆమె తల తిప్పి చూశాడు ప్రకాశం నరశింహం ఆదమరచి నిద్రపోతున్నాడు తట్టి లేపాడు అతన్ని బలవంతంగా చికాగ్గా చూశాడు నరశింహం

''అమ్మగారు నన్ను లోపలికి రమ్మంటున్నది'' అన్నాడు

'సరే పో' అన్నట్లు చేత్తో సైగ చేసి పక్కకు తిరిగి పడుకున్నాడు నరశింహం ప్రకాశం ఒక క్షణం తటపటాయించాడు వెళ్ళకపోతే యస్సైకి ఏవన్నా చెప్పి లేనిపోని ఇబ్బందులు తెచ్చిపెట్టిద్దేమోననే భయం అతన్ని ఆవరించింది చిన్నగా లోపలకు అడుగుపెట్టాడు దొడ్డిలో వేపచెట్టు కింద నిలబడి చేయి వూపింది ఆమె చిన్నగా అడుగులేస్తూ అక్కడికెళ్ళి నిలబడ్డాడు మంచం మీద చెట్టునీడ పొడలు పొడలుగా పడుతోంది

''రా, కొంచెం కాళ్ళుపట్టు'' అంది అప్పుడు కూడా ఆ స్వరంలో అధికారం స్పష్టంగా ధ్వనించింది వెళ్ళి మంచంమీద కూర్చుంది ప్రకాశం చిన్నగా వెళ్ళాడు ముఖానికి పట్టిన చెమట తుడుచుకున్నాడు క్షణాలు గడిచాయి ''ఎందుకు బయ్యం నేనుండలా'' అంది ఆమె యస్సై గుర్తుకొచ్చాడు భయంతో శరీరం చాలాసేపటి వరకూ సహకరించలేదు

ప్రకాశం బయట కొచ్చాడు పడుకోవటానికి అతని పక్కమీద రెండు కుక్కలు పడుకొని వున్నయ్ నరశింహం ఆదమరచి నిద్రపోతున్నాడు అతని కాళ్ళ దగ్గర ఒక కుక్క పడుకొని వుంది కుక్కల్ని తోలి పక్క దులిపేసి పడుకున్నాడు ప్రకాశం ఆలోచనలు నిద్రని దూరంగా తరిమేశాయి భార్య గుర్తుకొచ్చింది బాధగా నిట్టూర్చాడు ఎప్పటికోగాని నిద్ర రాలేదు

తెల్లారి ఇంటికి పోతూ రాత్రి విషయం చెప్పాడు నరశింహానికి అతను ప్రకాశం వైపు నిర్లక్ష్యపు చూపు ఒకటి చూశాడు ''అదేం విచిత్రం కాదు దాని బుద్ధి లోకమంతా తెలుసు, ఆ మొగుడు ముండా కొడుక్కి కూడా ఇంతకుముందు నీలాగే ఒక కుర్ర రిక్రూట్ వుండేవాడు నీలాగే యర్రగా బుర్రగా అయితే మహా జిత్తులమారోడనుకో ఆడిని మరిగింది ఇది ఆడుకూడా దీని యవ్వారం బాగా కనిపెట్టాడు డబ్బులు బాగా గుంజాడు లంచమిత్తేగాని మంచమెక్కేవాడు కాదు కొత్తల్లుణ్ణి చూసినట్టు చూసేది యస్సై ఇల్లొదిలి పెట్టటం ఆలశ్యం, వాడింట్లో వుండేవాడు చివరికి వాడి దోపిడీకి తట్టుకోలేక, దండంపెట్టే స్థితికొచ్చింది అదయినా ఎంతని ఇచ్చిద్ది ? ఆడు ఈడకొచ్చిన మూణ్ణెల్లకే రాలీ సైకిలు బిగించాడు ఆడికెవరూ కూడా, అంటే రైటరూ, సార్జెను ఉద్యోగం చెప్పటానికి ఈల్లేదు చివరకాడే స్థితి కొచ్చాడంటే తమ మధ్యవున్న సంబంధం యస్సైకి చెపుతానని బెదిరించాడు దానితో అక్కడే వాడు దెబ్బతిన్నాడు ఇది బాగా ఆలోచించింది చివరికి ఆడినెత్తిన దొంగతనం ఏసింది అంతే ఆడి వుద్యోగం ఊడబీకిందాకా యస్సైగాడు నిద్దరపోలా ఆడు కొన్న సైకిల్‌తో సహా అన్నీ అమ్ముకొని పరార్ నువ్వుకూడా చూడు డబ్బులేమన్నా రాల్తాయేమో'' అని నవ్వాడు నరశింహం

అతని నవ్వులో ప్రకాశం శ్రుతి కలిపాడు ''ఆ, నువ్వు నాదాకా రానిస్తే కదా'' అన్నాడు

ఆ మాటకు నరశింహం పెద్దగా నవ్వాడు ''ఒరే అల్లుడూ, నన్నే దెబ్బ కొట్టావే'' అన్నాడు
ఇద్దరూ విడిపోయారు ఇంటికెళ్ళేసరికి భార్య గుర్తొచ్చింది బాధ కలిగింది ఇంట్లో ఆమె ముఖం సరిగా చూడలేకపోయాడు అతని ఆలోచనలన్నీ రాత్రి జరిగిన సంఘటన చుట్టూనే తిరుగుతున్నాయి హఠాత్తుగా అతనికి ట్రైనింగు స్కూల్లోని సీ యల్లై భార్య సుశీలమ్మగారు గుర్తొచ్చింది 'మహాతల్లి ఆఫీసరు భార్యంటే సుశీలమ్మగారే ఆడమనిషంటే అట్లాగుండాలి ఎక్కడా వంక పెట్టటానికి వీల్లేదు కదా' అనుకున్నాడు ఆలోచనలతోనే గబగబా ముఖం కడుక్కొని, చద్దన్నం తిని స్టేషనుకొచ్చాడు రోల్‌కాల్ తీశారు ''అందరూ బందోబస్తుకెళ్ళాలి తాలూకా స్టేషనుకెళ్ళి రిపోర్టు చెయ్యండి'' అన్నాడు రైటరు
''ఏం బందోబస్తంట?'' అడిగాడు గోపాలాన్ని
''వాడెవడో దొర మన పై ఆఫీసరు వస్తున్నాడంట'' అన్నాడు గోపాలం అంతా గబగబా ఇళ్ళకు వెళ్ళిపోయారు మధ్యాహ్నం పన్నెండు గంటల కల్లా అందరూ భోజనాలు చేసి, బెడ్డింగులు కట్టుకొని, రాత్రికి అన్నం మూట కట్టుకొని బయలుదేరారు తాలూకా పోలీసు స్టేషను చేరేసరికి సాయంత్రమయ్యింది జిల్లాలోని ఇంచుమించు అన్ని పోలీసు స్టేషన్ల నుండి వచ్చిన మెన్‌తో తాలూకా స్టేషను కిటకిట లాడుతోంది తన బేచ్చీవాళ్ళు ఎవరన్నా కనిపిస్తారేమోనని చూశాడు ప్రకాశం అంతా సందడిగా వుంది
ఇంతకు ముందు ఒకచోట చేసి, ఇప్పుడు వేరువేరు స్టేషన్లలో చేస్తున్న పాతమిత్రులు కనిపిస్తే ఆప్యాయంగా పలకరించు కుంటున్నారు 'ఇప్పుడు ఏ స్టేషనురా?' అంటే, 'నువ్వెక్కడరా?' అని అడుగుతున్నారు 'పిల్లలంతా బాగున్నారా?', 'నా కొడక నీ కాడికి పోయాక వళ్ళొచ్చిందిరా', 'నీళ్ళు బాగా పడ్డాయిరా', 'ఆ దొంగ నాకొడుకు ఇంకా అక్కడే వున్నాడా, ట్రాన్స్‌ఫర్ అయి పోయాడా? వాడెందుకు పోతాడు, మనబోటి వాళ్ళని వేపుకు తినటానికే పుట్టాడు' ఇలా రకరకాల ప్రశ్నలూ, నవ్వుకోళ్ళు
ఒకే వర్గపు మనుషులంతా ఒకచోట చేరినప్పుడు కలిగే వుత్సాహం, నిత్యజీవితంలో కలిగే శ్రమల్నీ, బాధల్నీ, వేదనల్నీ తాత్కాలికంగా మరిచిపోయే సమయం అది
దూరంగా కాంపౌండు గోడ కానుకొని వున్న మర్రిచెట్టు కింద కూర్చున్న వాళ్ళల్లో ఎవరో ఒకతను ప్రకాశాన్ని కేకేశాడు చేయివూపుతూ ప్రకాశం అటుగా నడుస్తూ, 'పిలిచిందెవరబ్బా' అని ఆలోచిస్తూ చూశాడు గురవయ్య చాలా సంతోషమేసింది పరిగెత్తుకుంటూ అక్కడకు వెళ్ళాడు అక్కడ కూర్చున్న వాళ్ళల్లో వెంకటేశం కూడా వున్నాడు చాలా రోజుల తరువాత కలుసుకోవటం వాళ్ళకెంతో ఆనందంగా వుంది ''అంతా బాగున్నారా?'' అడిగాడు ప్రకాశం, వాళ్ళ ప్రక్కనే కూర్చుంటూ
''ఆఁ ఏం బాగులే పెనంమీద నుండి పొయ్యిలోకి దొర్లినట్లుంది ఈ బ్రతుకు'' అన్నాడు గురవయ్య ఆ మాటకు అక్కడున్న వాళ్ళంతా నవ్వారు
''మనిషివి బాగా తగ్గావు. నీళ్ళు పడలేదనుకుంటా'' అని వెంకటేశం వైపు తిరిగి, ''ఏరా నువ్వు కూడా చిక్కిపోయావే'' అన్నాడు
ఆ మాటకు గురవయ్య అందుకున్నాడు ''ఆ అప్పటికి నువ్వు పెద్ద లావెక్కినట్టు'' అని, ''మనం తగ్గిపోతోంది నీళ్ళుపడక కాదు ఈ ఉద్యోగమే మనవంటికి సరిపడలా అదీ అసలు విషయం'' అన్నాడు ఆ మాటకు అక్కడున్న వాళ్ళంతా మళ్ళీ నవ్వారు

''చానా కచ్చితంగా చెప్పావ్ తమ్ముడూ'' అన్నాడు అక్కడున్న ఓ సీనియర్ పీసీ అలా అందరూ కలుసుకున్నందుకు ప్రకాశానికి ఆనందంగా వుంది గురవయ్యని కౌగలించుకోవాలన్నంత తపన అతని మనసులో మెదులుతోంది సంతోషంతో మాట పెగలటం లేదు అసలతని కంత ఆనందం కలగటం చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది అతనికే

''మనం అటుపోయి కూర్చుందాం రండి'' అన్నాడు ముగ్గురూ లేచి దూరంగా వున్న వేపచెట్టు కిందకు పోయి కూర్చున్నారు

''నేను రాసిన ఉత్తరం అందిందా?'' అడిగాడు గురవయ్య

''ఆఁ అందింది తిరుగు జవాబు ఇవ్వటానికే సమయం దొరకటం లేదు నీకు కనీసం ఉత్తరం రాసే టైమన్నా వుంది'' అన్నాడు ప్రకాశం ఆ మాటకు గురవయ్య నవ్వాడు

''ఒరే పెకాసిగా నీకు రాద్దామని ఉత్తరం ఒకటి కొని జేబులో పెట్టుకొన్నారా ఎవురినన్నా నీబోటి చదువుకున్న అయ్యని బతిమాలి ఉత్తరం రాయించుకుందామంటే ఒకడూ దొరకడు గదా అది జేబిలోనే వుండీ, వుండీ చవటకు నానిపోయింది'' అని నవ్వాడు వెంకటేశం ఆ మాటకు వాళ్ళిద్దరు కూడా నవ్వారు

''ఏందో ప్రకాశం బ్రతుకు రోజురోజుకూ దుర్భరమై పోతోంది'' అన్నాడు గురవయ్య అతని మాటలు గంభీరంగా తోచాయి విని వూరుకున్నారు వీళ్ళిద్దరూ

''మన వాళ్ళెవరన్నా ఈ మధ్య కనపడ్డారా ? జాన్‌గానీ, ఇంకెవరన్నా?'' అడిగాడు ప్రకాశం

''లేదు నాకెవరూ కనిపించలా మరి'' అన్నాడు గురవయ్య

''నాక్కూడా ఓరూ అవుపల్లా'' అన్నాడు వెంకటేశం

చాలాసేపు పిచ్చాపాటి మాట్లాడుకున్నారు ఉల్లాసంగా ఆకాశంలో వెలుగురేఖలు పలుచబడుతున్నయ్ పక్షులు కోలాహలంగా అరుస్తూ గూళ్ళకు చేరుతున్నయ్ వాళ్ళ హృదయాల్లోంచి ఆనందం తొంగి చూస్తోంది గురవయ్య ఏదో చెప్పబోతుంటే, తాలూకా స్టేషన్ వరండాలో నిలబడి యస్సై వేసిన విజిలు వినబడింది అక్కడున్న వాళ్ళంతా చిన్నగా లేచి, నిక్కర్లు దులుపుకుని టోపీలు పెట్టుకొని స్టేషనువైపు నడుస్తుంటే, వీళ్ళు కూడా లేచారు

''ఏరా పెకాసిగా ఇంకా ఇసేసాలు ఏంది?'' అన్నాడు వెంకటేశం

''ఏంలేదు గానీ, తొందర్లోనే నీకు అల్లుడో, కోడలో పుడతారు'' అన్నాడు ప్రకాశం

''ఓరి దొంగ నాకొడకా! ఇందాకట్నుంచి చెప్పవేం మరి?'' అన్నాడు వెంకటేశం సంతోషంగా

''మనం కనపడ్డ ఆనందంలో మరిచిపోయి నట్టున్నాడు'' అన్నాడు గురవయ్య ముగ్గురూ నవ్వుకున్నారు

స్టేషన్ ముందు అందరినీ ఫాలెన్ చేశారు ఇంకా ఎవరన్నా తెలిసిన వాళ్ళు వచ్చారేమోనని అక్కడున్న వాళ్ళందరి వైపు చూశాడు ప్రకాశం వెనుక వరుసలో సీతారామయ్య నిలబడి వున్నాడు అతన్ని మిగతా యిద్దరికీ చూపించాడు ప్రకాశం ఇంతలో యస్సై వేసిన కేకకు అంతా కదలకుండా నిలబడ్డారు యస్సై అన్ని స్టేషన్ల నుండి వచ్చిన వాళ్ళ నెంబర్లు పిలిచాడు తరువాత రేపటి బందోబస్తు గురించి సూచన లిచ్చాడు

''రేపు మన పెద్ద దొరగారు ఇటుగా వెళుతున్నారు మీరంతా రూటు బందోబస్తు చెయ్యాలి ఉదయం ఆరు గంటలకే మీరంతా యిక్కడ ఫాలెన్ కావాలి ఏడుగంటలకల్లా మిమ్మల్ని తీసుకుపోయి మీమీ పోస్టింగులలో నిలబెడతారు మధ్యాహ్నం పదకొండు గంటలకల్లా దొరవారు

పాసయ్ వెళ్ళిపోతారు ఎవరి పోస్టింగులలో వాళ్ళుండి, జాగ్రత్తగా డ్యూటీ చేసుకోండి'' అని చెప్పి, డిస్‌బర్స్ చేశాడు అందరినీ ఎటువాళ్ళటు వెళ్ళిపోతున్నారు

సీతారామయ్య వాళ్ళ ముగ్గురి పక్కగా నడుస్తూ, గురవయ్యని చూచి చిన్నగా ఎవరితోనో అంటున్నట్లు, ''ఏ గూటి పక్షి ఆ గూటికే చేరిద్ది'' అని వెకిలిగా నవ్వుతూ వెళ్ళిపోయాడు ఆ మాటకు వాళ్ళు ముగ్గురూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు

''ఇలాంటి వెధవల మూలంగా మన మెన్‌లో యూనిటీ లేకుండా పోతోంది డిపార్టుమెంటులో జరిగే ప్రతి పనితో వీళ్ళు కులానికి సంబంధం కడతారు జీవితంలో ఏమీ సాధించలేనివాళ్ళూ, ఎందుకూ పనికిరాని వెధవలూ ఈ కులాన్ని గుర్తు చేసుకొని అదేదో గొప్ప అర్హత అనుకొని తమ అసమర్థతని మరచిపోతూ, తమ నీచ గుణాన్ని కప్పెట్టుకుంటూ, తమని తాము వీపు తట్టుకుంటూ వుంటారు అమాయకులూ, ప్రపంచ జ్ఞానం లేని వాళ్ళూ ఇలా అన్నారంటే ఏదో అనుకోవచ్చు కాస్తో కూస్తో చదువుకున్నవాళ్ళు కూడా కులమనేది అదేదో వున్నతమైన, గౌరవప్రదమైన అర్హతగా భావిస్తుంటే ఇంకేం చెపుతాం'' అన్నాడు గురవయ్య

తరువాత కొద్దిసేపు ఎవరూ ఏమీ మాట్లాడలేదు ''చరేలే, అదెప్పుడూ వుండే ఏడుపేలేగాని, మీరు అన్నాలు తెచ్చుకున్నారా?'' అడిగాడు వెంకటేశం తెచ్చుకున్నట్లు వీళ్ళిద్దరూ తలలూపారు స్టేషన్ ఆవరణలో పెట్టుకున్న సంచులూ, బెడ్డింగులు తీసుకొచ్చుకొని దూరంగా వున్న పంపు దగ్గరకు వెళ్ళి, కాళ్ళూ చేతులు కడుక్కొని, అన్నం మూటలు విప్పుకొని భోంచేశారు

''ఈ వాతావరణం చూస్తుంటే నాకు ట్రైనింగు స్కూలు గుర్తుకొస్తోంది'' అన్నాడు ప్రకాశం

''ఇంకో ఆరు నెలలు మళ్ళీ ట్రైనింగుకి పంపితే బాగుండు ఈ దరిద్రపు డూటీల కన్నా ఆడే ఆయిగా వుంటది'' అన్నాడు వెంకటేశం

''మన సర్వీసులో రెస్టనేది ఏమన్నా వుంటే అది ట్రైనింగు పీరియడ్ లోనే'' అన్నాడు గురవయ్య

''ఔనౌను'' అంటూ తలూపాడు ప్రకాశం

బందోబస్తు కొచ్చిన పీసీలూ, హెచ్‌సీలూ చాలామంది అన్నం మూటలు విప్పుకొని తింటున్నారు కొంతమంది గుంపులుగా, కొంతమంది ఒంటరిగా కూర్చున్నారు అనేక విషయాలు వాళ్ళమధ్య చోటు చేసుకుంటున్నాయి కుక్కలు కొన్ని తోకలూపుకుంటూ వాళ్ళచుట్టూ తిరుగుతున్నయ్ అన్నాలు తిని విస్తరాకుల్ని దూరంగా పడవేసి, అన్నం కట్టుకొచ్చుకొన్న గుడ్డల్ని దులిపి జాగ్రత్తగా సంచుల్లో పెట్టుకున్నారు కొంతమంది చుట్టలు వెలిగించి పచార్లు మొదలుపెట్టారు తరువాత కొద్దిసేపటికి బాగా చీకటి పడింది చెట్లమీద పక్షులు అరుస్తున్నయ్ గోలగోలగా

''పక్కలు ఎక్కడేసుకుందాం'' అడిగాడు వెంకటేశం

''ఎక్కడ పడుకుంటే ఎవరు కాదంటారు ఈ గ్రౌండు, ఈ వరండా, ఈ చెట్ల కింద, ఎక్కడ పడుకున్నా ఫరవాలేదు మనల్ని అడిగే వాడెవడు ?'' అంటూ నవ్వాడు ప్రకాశం

''లేకపోతే ఏమిటి? మనం ప్రభుత్వోద్యోగులం కాదా? బందోబస్తుకు వచ్చినవాళ్ళకు కనీసం పడుకోవటానికి ఏదైనా చూపించాల్సిన బాధ్యత ఈ ఆఫీసర్లకు లేదా ? ఇప్పుడు నాలుగు చినుకులు పడితే, తడుస్తూ తెల్లవార్లూ నిలబడవలసిందేగా పంచలో మనకన్నా ముష్టెత్తుకునేవాళ్ళు నయం కనీసం వాళ్ళకు సత్రాలన్నా వున్నయ్'' అన్నాడు గురవయ్య చిరుకోపంగా

''ఈ తెల్ల నా కొడుకులు ఈ దేశం నుండి ఎప్పుడు పోతారోగాని, అప్పటిదాకా మన కష్టాలు ఈడేరవు'' అన్నాడు ప్రకాశం

''అది చరేలేగాని, వాల్లది ఏ దేశం ?'' అడిగాడు వెంకటేశం

''వాళ్ళది ఇంగ్లాండు యీడకి చానా దూరం సముద్రాలు దాటిపోవాలి వాళ్ళెంత తెలివిగల్ల వాళ్ళు కాకపోతే అక్కడ నుండి స్టీమర్ల మీద వచ్చి, ఇక్కడ వ్యాపారం మొదలుపెట్టి చిన్నగా మన దేశాన్ని పరిపాలిస్తున్నారు'' అన్నాడు గురవయ్య

''మనం ఎందుకూ పనికిరాని యెదవలం కాబట్టే ఆ ముండ నాయాల్లు ఇట్టా ఆటలాడుతున్నారు మనం ఎదురుతిరిగి తుపాకితో ఒక్కటిత్తే, నా కొడుకులు సత్తా బతుకుతా పరిగెత్తుతారు'' అన్నాడు వెంకటేశం చిరుకోపంతో ఉద్రేకంగా

ఆ మాటకు నవ్వొచ్చింది ప్రకాశంకు ''నువ్వొక్కడివే తుపాకి తీసుకొని ఆల్లెంటపడి తరిమేసేలాగా మాట్లాడుతున్నావేరా'' అన్నాడు

''నేనొక్కడ్నే కాదు మన దేశంలో వోల్లందరూ''

''ఆc, అయినా ఇంగిలీసోడు అంత తెలివి తక్కువోడు కాదు తెలిసిందా?''

''తెలివి తక్కువోడయితే, ఏడేడు పద్దనాలుగు సముద్దరాలు ఈదుకుని ఎట్టా వొత్తాడులే అయినా వాడి తెలివి ఎంతవరకు ? మనం మెదలకుండా నోరు మూసుకుని వున్నంత కాలమే ఎంత బలమైన ఏనుగు నయినా గడ్డిపరకల్తో కట్టెయ్యొచ్చు'' అన్నాడు వెంకటేశం దృఢంగా

తరువాత వాళ్ళు చాలా విషయాలు మాట్లాడుకున్నారు ముగ్గురూ గ్రౌండులోనే ఒకళ్ళ పక్కన ఒకళ్ళు కంబళ్ళు పరుచుకున్నారు బందోబస్తుకు వచ్చిన చాలామంది గ్రౌండులోనే వేసుకున్నారు పక్కలు కొంతమంది స్టేషను పంచలో వేసుకున్నారు దూరంగా పడుకొన్న ఒక పీసీ పద్యాలు పాడుతున్నాడు చాలామంది ఆ రాగాన్ని ఆలకిస్తున్నారు ప్రకాశం బుర్రలో రకరకాల ఆలోచనలు చోటు చేసుకుంటున్నాయి గురవయ్య చెప్పిన మాటల్ని అతను మననం చేసుకుంటున్నాడు 'ఈ తెల్లోళ్ళు ఎప్పుడు పోతారో' అనుకున్నాడు అతని ఆలోచన వెనుక వున్న కారణం, ఈ తెల్లోళ్ళు ఇక్కడ నుండి పోతే తమ బ్రతుకులేమన్నా బాగుపడతాయేమోనన్న ఆశ 'అవును, ఇప్పుడు ఈ పరిస్థితులు ఇట్టా గుండటానికి కారణం తెల్లవాళ్ళు తెల్లవాళ్ళని ఇక్కడ నుండి తరవడమంటే, పరిస్థితుల్ని మార్చడమే కదా' అనుకున్నాడు మళ్ళీ అతని ఆలోచనలు ఇంటిమీదకు మళ్ళాయి 'ఇద్దరూ అన్నాలు తిని పడుకొని వుంటారు' అనుకున్నాడు గ్రౌండులో చాలావరకు నిశ్శబ్దం ఆవరించింది చాలా మంది నిద్దర పోతున్నారు మిగిలినవాళ్ళు ఎవళ్ళ ఆలోచనలలో వాళ్ళు మునిగిపోయారు 'పగలంతా కష్టపడ్డవాళ్ళకు, కడుపు కింత తిండి తిని పడుకుంటే చల్లటి గాలికి కంటిమీద కునుకు దానంతటదే వస్తుంది కాని మనస్సంతా దిగుళ్ళతో, ఆందోళనలతో ఉన్నవాడికి నిద్ర రాదు, ఆకలి కాదు' అనుకున్నాడు ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నయ్ చెట్లమీద పిట్టలు నిశ్శబ్దంగా వున్నయ్ గాలి తెరలు తెరలుగా వీస్తోంది వెంకటేశం నిద్రలోకి జారిపోయాడు మాట్లాడుతూనే

''ఏంది ప్రకాశం ఆలోచిస్తున్నావు?'' అడిగాడు గురవయ్య

''ఏమీలేదు ఏముంటుంది ? ఈ బ్రతుకును గురించే''

''అదెప్పుడూ వుండే ఆలోచనేగాని, పుస్తకాలేమన్నా చదువుతున్నావా?''

''అయ్యో రామ పుస్తకాలు చదివే టైము కూడానా ట్రైనింగు స్కూలు వదిలిపెట్టాం

అంతే టైం లేదు ఇంకా నాలుగు రోజులు గడిస్తే నేర్చుకున్న ఆ నాలుగు అక్షరాలూ మరిచిపోతాం అది ఖాయం'' అన్నాడు ప్రకాశం

తరువాత కొద్దిసేపు ఇద్దరూ మాట్లాడుకున్నారు నిద్దర పోబోయే ముందు దేవుణ్ణి ప్రార్థించుకున్నాడు ప్రకాశం తెల్లవాళ్ళు ఈ దేశాన్ని తొందరగా వదిలిపోవాలని ప్రార్థించాడు

''నీవు మాట్లాడే భాషని బాగా మార్చేశావు, మొత్తం మీద'' అన్నాడు గురవయ్య

''ఆఁ అది మాత్రం బాగానే సాధన చేస్తున్నా కనీసం మాటల్లోనన్నా నా కులాన్ని గుర్తు పట్టకూడదనే వుద్దేశ్యంతో'' అన్నాడు ప్రకాశం నవ్వుతూ తరువాత ఇద్దరూ మౌనంగా వుండిపోయారు నిద్ర మత్తు ఆవరిస్తోంది ఇద్దర్నీ తరువాత కొద్దిసేపటికి నిద్రపోయారు ఇద్దరూ

ఉదయం అయిదు గంటలకు అంతా నిద్దర లేచారు చీకటి పలుచబడుతోంది పలుచగా పొగమంచు కూడా కురుస్తోంది కంబళ్ళు దులుపుకొని సంచుల్లో పెట్టుకొంటున్నారు ఒకతను వేపచెట్టెక్కి పుల్లలు విరిచి కింద వేస్తున్నాడు తలా ఒక పుల్ల తీసుకొని, నములుతూ, బావి దగ్గర కెళ్ళి సీసాల్తో, చెంబుల్తో నీళ్ళు తీసుకొని దూరంగా పిచ్చికంపల వెనక్కి వెళ్ళి వస్తున్నారు తిరిగి బావి దగ్గరకు వచ్చి ముఖాలు కడుక్కొని, చెంబుతో నీళ్ళు తీసుకొని వెళ్ళి రాత్రి మిగుల్చుకున్న చద్దన్నం తింటున్నారు చాలామంది

''మళ్ళీ మనం తిండి తినేసరికి ఏ ఝామయ్యిద్దో'' అన్నాడు గురవయ్య కొరివికారం కలుపుకుని తింటున్న అతని అన్నం బాగా సద్దిపడింది అందరి భోజనాలూ అలాగే వున్నయ్ ఎప్పుడో నిన్న ఉదయం వండి కట్టిన అన్నం అది

ఆ కార్యక్రమాలు పూర్తి చేసుకొని, అందరూ గబగబా యూనిఫారం వేసుకొని స్టేషన్ ముందు హాజరయ్యారు సర్కిల్ ఇనస్పెక్టరు అందరి నెంబర్లూ పిలుస్తున్నాడు తెల్లదొరలు కుర్చీల్లో కూర్చుని వున్నారు హాజరు పిలిచిన తరువాత సర్కిల్ ఇనస్పెక్టరు అందర్నీ అటెన్షన్‌లో నిలబెట్టాడు గిరుక్కున వెనక్కి తిరిగి దూరంగా వున్న డి యస్పీ దొర దగ్గరకు మార్చ్ చేసుకుంటూ వెళ్ళి, స్మార్ట్‌గా సెల్యూట్ చేశాడు డి యస్పీ కూడా లేచి సి ఐ కి అంతకన్నా స్మార్ట్‌గా సెల్యూట్ చేశాడు సి ఐ చెప్పింది విని డి యస్పీ ఏదో చెప్పాడు తిరిగి డి యస్పీకి సెల్యూట్ చేసి వెనక్కి తిరిగి వచ్చి అక్కడ ఫాలెన్ అయిన వాళ్ళందరినీ పక్కనే వున్న లారీల్లో ఎక్కమన్నాడు అందరూ వరుసలో వెళ్ళి లారీల్లో ఎక్కి నిలబడ్డారు లారీలు బయలుదేరాయి రోడ్డు పొడవునా ఫర్లాంగు కొక పీసీని దింపుకుంటూ పోతున్నారు వూరి బయట మంచినీళ్ళు కూడా దొరకని నిర్జన ప్రదేశంలో ప్రకాశాన్ని దించారు రోడ్డు పక్కన మాత్రం ఒక చింత చెట్టుంది

'మంచినీళ్ళు దొరక్కపోయినా ఎండపూట కాస్త నీడలోనన్నా నిలబడవచ్చు చెట్టు నీడనన్నా వేశారు నన్ను దేవుడు నిజంగా గొప్పవాడు' అనుకున్నాడు ప్రకాశం లారీ చంకకు తగిలించుకొని వెళ్ళి చెట్టుకింద నిలబడ్డాడు నిముషాలు గడిచేకొందీ ఎండ చుర్రుమంటోంది పాలేరు కుర్రోళ్ళు పశువుల్ని తోలుకుపోతున్నారు వాళ్ళు దూరం అయ్యేవరకు వాళ్ళనే చూస్తూ నిలబడ్డాడు చినిగి పీలికలయిన గుడ్డముక్కల్ని గోచీలుగా పెట్టుకున్నారు కొంతమంది కొంతమంది చిన్నపిల్లలు అవి కూడా లేకుండా మొండిమొలలతో వెళుతున్నారు ప్రతివాని చేతిలోనూ గుడ్డల్లో కట్టిన చిన్న చిన్న చద్దిమూటలున్నయ్ చీమిడి కారుతున్న ముక్కులు, ఎండకు ఎండి వానకు తడిచి రాగిరంగుకు మారిన జుట్టు మురికి ఓడుతూ, మట్టి పేరుకుపోయి అసలు రంగు కనపడని శరీరాలు, భయం భయంగా చూస్తున్న కళ్ళు వాళ్ళనలా చూస్తూ చిన్నగా నిట్టూర్చాడు 'ఈ

బతుకు లెప్పటికి బాగుపడతాయో' అనుకున్నాడు దూరంగా హారన్ వినపడింది గబగబా రోడ్డు మీదకు వచ్చి నిలబడ్డాడు లారీ వచ్చి ఆగింది లారీ కేబిన్‌లో సి ఐ వున్నాడు సి ఐ కి సెల్యూట్ చేశాడు ప్రకాశం ప్రకాశాన్ని చూస్తూ కోపంగా, ''ఏం చెట్టు నీడన నిలబడ్డావ్? చెట్టు నీడన నిలబడటానికా నిన్నిక్కడ వేసింది?'' అన్నాడు సి ఐ ఆ మాట విని ప్రకాశం తడబడ్డాడు ఏం చెప్పాలో అర్థం కాలేదు అట్లాగే గుడ్లప్పగించి చూస్తూ నిలబడ్డాడు

''ఒళ్ళు దగ్గర పెట్టుకొని రోడ్డు పక్కన నిలబడు'' అన్నాడు సి ఐ సీరియస్‌గా

''సార్ అట్లాగే సార్'' అన్నాడు ప్రకాశం అని సెల్యూట్ చేశాడు లారీ ముందుకు కదిలింది మనస్సులోనే తిట్టుకుంటూ నిలబడ్డాడు 'ఈ ఆఫీసరు నా కొడుకులకు దయా దాక్షిణ్యాలు వుండవ్ వూరకున్నప్పుడు చెట్టు నీడన నిలబడితే వాడి సొమ్ము ఏం పోయింది ?'' అనుకున్నాడు దిక్కులు చూస్తూ అక్కడే నిలబడ్డాడు ఎండ మాడ్చేస్తోంది చెమటకు చొక్కా తడిచిపోతోంది నెమ్మదిగా వుండివుండి వీస్తున్న గాలి రోడ్డు మీది దుమ్మును అలలు అలలుగా లేపుతోంది చెమట పట్టిన వంటి మీద పడి దుమ్ము అంటుకుపోతోంది చెట్టుకింద నిలబడాలని మనస్సు పీకుతున్నా ధైర్యం చాలటం లేదు 'ఈ ఆఫీసర్ల కళ్ళు గద్ద కళ్ళు దూరం నుండి కూడా చూడ గలరు ఈసారి మళ్ళీ వాడే చూశాడంటే, నెల రోజులు ఎగస్ట్రా గార్డు ఇస్తాడు లేదా జిల్లా ఆఫీసుకు పంపించి అక్కడ రిజర్వ్ పోలీసులతో నెల రోజులు ఎగస్ట్రా డ్రిల్లు చేపిస్తాడు దొంగ నా కొడుకు' అనుకుని తిట్టుకున్నాడు కొద్దిసేపటిలోనే వళ్ళంతా చెమటతో బంకలాగా సాగుతూ చీదరగా తయారయ్యింది డ్రస్సు విప్పి రెండు బక్కెట్ల చన్నీళ్ళు పోసుకోవాలనిపిస్తోంది టోపీ తీసి నుదుటికి పట్టిన చెమట తుడుచుకున్నాడు తలంతా ఒకటే జిలగా వుంది 'దీనమ్మ ఉజ్జోగాన్ని ' తిట్టుకుంటూ కాండ్రించి వుమ్మేశాడు దూరంగా పోలీసు వ్యాను వస్తూ కనపడింది టోపీ పెట్టుకొని అటెన్షన్ పొజిషన్‌లో నిలబడ్డాడు వేను దగ్గరకు వచ్చి ఆగింది లోపల డ్రైవరూ, తెల్ల డి యస్పీ దొర తప్ప ఎవరూ లేరు ప్రకాశం దొరకు స్మార్ట్‌గా సెల్యూట్ చేశాడు దొర ప్రకాశాన్ని ఎగాదిగా చూశాడు డ్రైవరుతో ఏదో చెప్పాడు డ్రైవరు ప్రకాశాన్ని దగ్గరకు పిలిచాడు ప్రకాశం డ్రైవరు వైపు వచ్చాడు

''దొరగారు నిన్ను ఆ చెట్టుక్రింద నిలబడమంటున్నారు ఇంకొక గంటలో పెద్ద దొరగారి కారు వస్తుంది దానికి ముందుగా మా వ్యాను వస్తుంది అప్పుడు రోడ్డు మీదకు వచ్చి నిలబడి రోడ్డు కడ్డం ఏమీ రాకుండా చూడమంటున్నారు చెమటవల్ల యూనిఫారం పాడైపోయి చూడటానికి అసహ్యంగా కనపడుతున్నది పెద్ద దొరగారు నిన్ను ఇలా చూస్తే ఆఫీసర్లకు పనిష్మెంటు ఇస్తారు కాబట్టి నిన్ను చెట్టు కింద నిలబడమంటున్నారు దొరగారు'' అన్నాడు

ఆ మాటలు విని, ''అట్లాగేనయ్యా'' అని తిరిగి సెల్యూట్ చేశాడు ప్రకాశం అతనికి సంతోషం వేసింది వేను దుమ్ము లేపుకుంటూ వెళ్ళిపోయింది ప్రకాశం వెళ్ళి చెట్టునీడన నిలబడ్డాడు చెట్టునీడకు, చల్లటి గాలికి హాయిగా వుంది ప్రాణం సూర్యుడు నెత్తిమీద కొచ్చాడు దప్పికతో నాలుక పిడుచకట్టుకు పోతోంది చుట్టుపక్కల ఎక్కడా మంచినీళ్ళు దొరికేలాగా లేవు చుట్టూ చూశాడు దూరంగా ఒక ముసలతను గొర్లను మేపుతూ కనపడ్డాడు చిన్న తెల్ల తుమ్మచెట్టు నీడన కాలు మెలికేసి, చేతికర్రని గడ్డంకింద ఆనించి వూతంగా పెట్టుకొని, దాని ఆసరాతో నిలబడ్డాడు అతని ముందు ఒక జత ఎడ్లు గడ్డిమేస్తున్నాయి చెట్టుకు తాబేటికాయ, చిన్న సద్దిమూట వేలాడుతున్నయ్ ఆ దృశ్యం చూసేసరికి ప్రకాశంకు ప్రాణం లేచి వచ్చిన

ట్లయ్యింది రోడ్డు కిరువైపులా తేరిపార చూశాడు ఏమీ రావటం లేదు పెద్దగా కేకేసి, చప్పట్లు కొట్టి ముసలతన్ని పిలిచాడు ఒక్క కేకతోనే ముసలతను ప్రకాశం వైపు చూశాడు రమ్మన్నట్టు చెయ్యి వూపాడు ప్రకాశం ముసలతను చెట్టుకు వేలాడుతున్న తాబేటికాయను తీసుకొని, సద్దిమూటను దానికే వుంచి చిన్నగా అడుగులు వేస్తూ ప్రకాశం దగ్గరకు వచ్చాడు

''పోలీసు దొరగారూ నీల్లు కావాలా?'' అన్నాడు ప్రకాశంతో ఔనన్నట్లు తల వూపాడు ప్రకాశం

''నీకెట్టా తెలుసే తాతా ?'' అన్నాడు ప్రకాశం చిరునవ్వు నవ్వుతూ

''తెలవటానికే ముంది దొరా! ఇట్టాటి అగ్గిలో తవరికి దప్పి కెయ్యదా? సెట్టుకిది యాలాడతా కనపడతంది గదా ! లేకపోతే ఈ ముసలాడితో తవరికేం పనుంటది ?'' అన్నాడు ముసలతను నవ్వుతూ అతను నవ్వినప్పుడు అతని బుగ్గన వున్న పొగాకుకాడ కనపడింది ప్రకాశంకు

''తెలివయిన వాడివేనే తాతా కాసిని పొయ్యి నీల్లు నాలిక పిడచకట్టుకు పోతాంది'' అని రెండడుగులు ముందుకువేసి, నోటిదగ్గర దోసిలి పట్టి ముందుకు వంగాడు కొద్దిగా

''దొరగారూ నేను మాదిగోన్ని ఈ నీల్లు తవరు ''అనుమానంగా అడిగాడు ముసలతను ఆ మాటకు ప్రకాశం చటుక్కున తలెత్తి అతని వైపు చూశాడు

ఏళ్ళుతరబడి పేరుకు పోయిన అవమానపు నీడలు ఆ ముసలతని కళ్ళల్లో కదలాడుతున్నయ్ బిడియపడుతున్నట్టు కనిపిస్తున్న అతని ముఖంలోకి కొన్ని క్షణాల సేపు చూచి, ''ఫరవాలేదులే పొయ్యి'' అని మరలా దోసిలి పట్టాడు ప్రకాశం

ముసలతను తాబేటికాయ వంచి నీళ్ళు పోశాడు నీళ్ళు తాగి దోసెడు నీళ్ళతో ముఖం కడుక్కున్నాడు ముసలతని మాటల్ని ప్రకాశం ఆలోచించాడు

''నేను మంచినీళ్ళు పొయ్యమన్నప్పుడు కులం సంగతెందుకు తాతా ? పొయ్యటమే'' అన్నాడు ఆ మాటకు ముసలతను బోసినోటితో చిన్నగా నవ్వాడు పలుచటి బుగ్గలు ముడతలు పడ్డయ్ వూడిపోగా మిగిలిన పళ్ళు గారపట్టి కనపడ్డయ్

''తరువాతయినా అడుగుతారుగా బాబూ అప్పుడు పెద్దోరికి కోపం రావచ్చు'' అన్నాడు

''ఎంత కోపమొచ్చినా దప్పికతో ప్రాణం పోతుంటే కులం గురించి ఎవరు పట్టించుకుంటారే'' అన్నాడు ప్రకాశం అతనన్న మాటలు అతనికే ఎబ్బెట్టుగా తోచాయి

''దప్పిక తీరినాక పట్టించుకుంటారు దొరా అప్పుడు కోప్పడి కొట్టబోయేది నన్నేగా దొరా'' అన్నాడు అతని మాటల్ని ఆలోచిస్తూ అతనివైపు చూశాడు ప్రకాశం 'ముసలతను అన్నమాటల్లో ఏమీ అబద్ధం లేదు' అనుకున్నాడు

తన జీవితంలో తనకి కలిగిన అనేకనేక సంఘటనలు గుర్తుకొచ్చాయి తను పాలేరుగా బ్రతికినప్పుడు, ఈ ఉద్యోగంలోకి వచ్చినాక కూడా అట్లాంటి సంఘటనలు చాలా చూశాడు తనతో అవసరమున్నంత వరకు కులం సమస్య లేకుండా అన్నిరకాల పనులూ చేయించుకుంటారు తనకేదన్నా వాళ్ళతో అవసరం వచ్చినప్పుడు కులాన్ని గుర్తు చేస్తారు వాళ్ళ అవసరాలు తీరిందాకా కులం సమస్యే లేదు 'దొంగ లంజా కొడుకులు' అని తిట్టుకున్నాడు

ఎండ తీవ్రత ఎక్కువగా వుంది మధ్యాహ్నం రెండు గంటలు దాటినట్లుంది కడుపులో ఎలుకలు పరిగెత్తుతున్నయ్ ముసలతను వెళ్ళి చద్దిమూట తెచ్చుకొని చింతచెట్టు కానుకొని కూర్చున్నాడు తాబేటికాయలోని నీళ్ళు దోసిలితో తీసుకొని పుక్కిలించి వూశాడు సద్దిమూట

విప్పి ముందు పెట్టుకున్నాడు ఆ అన్నం వైపు చూశాడు ప్రకాశం మెత్తబడి జావకారుతున్న జొన్న సంగటి దాన్నంటుకుని వున్న రెండు ఎండు మిరపకాయలు అవికూడా తెల్లగా పాలిపోయివున్న తాలు మిరపకాయలు ముసలతను తలొంచుకుని తింటున్నాడు చేతిలోని సంగటి ముద్ద నోటిలో పెట్టుకొనేలోగానే సగంజారి గుడ్డమీద పడుతోంది

ప్రకాశం తన దృష్టిని రోడ్డుమీదకు మరల్చాడు అంతా నిర్మానుష్యం 'ఉదయం పదకొండు గంటలకు వత్తాడన్న దొర, ఇంతవరకు అంతూ పొంతూ లేకపోయే' అనుకున్నాడు నిముషాలు గడిచేకొలదీ ఆకలి పెరిగిపోతోంది 'ఆ వచ్చే ఆఫీసరు ఇప్పట్లో వచ్చే సూచనలు ఏమీ కనపడడం లేదు ఇట్లా ఎంతసేపు వుండాలో ఈ డ్యూటీకన్నా గార్డు డ్యూటీ, నైటుబీట్లే నయం చివరకు శవాన్ని ఎస్కార్టు చేసినప్పుడు కూడా ఇంత బాధ కలగలేదు' అని గొణుక్కున్నాడు ఆకలిబాధ ఎక్కువయ్యింది ముసలతనివైపు చూశాడు 'నేను కూడా ఒకప్పుడు అంతేగా కాని ఈ రెండేళ్ళ కాలంలో తనకు తెలియకుండానే తనలో ఎంతో మార్పు వచ్చింది ! కొద్దిపాటి సుబ్బరమయిన వాతావరణానికి అలవాటు పడేసరికి, గతకాలపు అలవాట్లమీద ఎంతో అసహ్యం వేస్తోంది' అనుకున్నాడు ముసలతను నీళ్ళు తాగేటప్పుడు మాసిన గడ్డం మీదుగా కారిన నీళ్ళు అన్నంలో పడుతున్నయ్

'ఇలాగే ఇంకో రెండు గంటలు గడిస్తే కళ్ళు తిరిగి పడిపోతానేమో' అనుకుని భయపడ్డాడు ఎవరిమీదనో తెలియని కసి 'ఈ ఆఫీసరు నా కొడుకు వస్తుంటే ఇట్టా ఈళ్ళని ఈ రోడ్డుమీద ఎందుకు చంపాలో అర్థం కాదు' అనుకున్నాడు రోడ్డుకు రెండు వైపులా తేరిపార చూశాడు ఏవీ రావటం లేదు వెనక్కి తిరిగి ముసలతనివైపు చూశాడు అన్నం తినేసి గుడ్డ దులిపి ఎండలో ఆరవేస్తున్నాడు తాబేటి బుర్రను చెట్టు మొదలుకు ఆనించాడు అంతకుముందు వెన్నుపూస కతుక్కుపోయిన అతని పొట్ట ఇప్పుడు కొద్దిగా పైకిలేచింది బొడ్లోనుండి చిన్న పొగాకు దుంప తీసి సగం కొరుక్కుని మిగిలింది బొడ్లో దోపుకున్నాడు బీడులో మేస్తున్న ఎడ్లవంక ఓసారిచూచి చిన్నగా నేలమీద వత్తిగిల్లాడు అన్నం తినేటప్పుడు గడ్డానికి అంటుకున్న సంగటి మెతుకులు అట్లాగే వున్నయ్

'నిన్ను అడిగేవాడు లేడుకదా ' అనుకుని నవ్వుకున్నాడు ప్రకాశం 'తను పాలేరుగా బతికినపుడు తిండికి రోజూ దిగులే ఇప్పుడు పోలీసుగా బతుకుతున్నప్పుడు మనిషికి సుకం లేదు, మనసుకు శాంతిలేదు' అనుకున్నాడు నీరసం ఆవహిస్తోంది పస్తులుండటం అలవాటయి పోయినా కాని ఈ రోజెందుకో మరీ బాధగా వుంది సన్నగా తలపోటు వస్తోంది ముఖానికి పట్టిన చెమట అరచేత్తో తుడుచుకున్నాడు దూరంగా లారీ వస్తూ కనపడింది గబగబా టోపీ సర్దుకుని రోడ్డుమీదకెళ్ళి నిలబడ్డాడు ఎండలో కొంచెం తీవ్రత తగ్గినట్లుంది కాని ఆ వెలుగుని కూడా చూడలేనట్లు కళ్ళు చికిలించి చూశాడు లారీ ప్రకాశం దగ్గర ఆగింది లోపల సి ఐ వున్నాడు ప్రకాశం సెల్యూట్ చేశాడు సి ఐ ప్రకాశాన్ని మింగేసేలాగా చూశాడు

''ఏరా ఇడియట్, మళ్ళీ చెట్టు కింద కెళ్ళావ్ ?'' అరిచాడు నొసలు చిట్లించి కోపంతో అతని ముక్కుపుటాలు అదురుతున్నయ్ ప్రకాశంలో సహనం చచ్చిపోయింది ఆ మాటకు అతని బుర్ర తిరిగిపోయినట్లు అనిపించింది కోపంతో పళ్ళు బిగబట్టాడు

''మాట్లాడవేరా పంది నా కొడకా అడవి దున్నలా వున్నావ్ నెంబరెంత? చెప్పు '' బొబ్బరించాడు సి ఐ

ప్రకాశం నోరు తెరిచాడు ''డి యస్పీ దొరగారే చెట్టుకింద నిలబడమన్నారు '' అన్నాడు 'సార్' అని అనలేదు కోపంతో అతని శరీరం చిన్నగా వణుకుతోంది

''ఎవరూ డి యస్పీ గారా ?'' ఆశ్చర్యంగా అన్నాడు సి ఐ

''అవును కావాలంటే పోయి కనుక్కో'' అతనిలో కోపం తారాస్థాయిని చేరింది అతను కనీసం 'సార్' అనికూడా సంబోధించక పోయేసరికి సి ఐ అవాక్కయిపోయాడు డ్రైవరు ఇంజను ఆపు చేశాడు ఏకవచనంలో సంబోధించటం కొట్టొచ్చినట్టు కనపడి ఆశ్చర్యపోయాడు సి ఐ ఏం మాట్లాడాలో తోచలేదు

''నువ్వు చెపుతున్నది నిజమేనా?'' ఆశ్చర్యం నుండి తేరుకుని మళ్ళీ అడిగాడు సి ఐ ప్రకాశం కళ్ళల్లో కనపడిన కోపానికి కొంచెం జంకాడు అతను

''ఆఁ'' అన్నాడు ప్రకాశం అతను ఆవేశాన్ని అదుపు చేసుకొనే ప్రయత్నంలో వున్నాడు ప్రకాశం ముఖం వైపు ఒకసారి చూచి డ్రైవరు వైపు తిరిగి ''పోనీయ్'' అన్నాడు పెద్దగా లారీ ఒక్కసారిగా ముందుకు గెంతింది లారీ పోయినవైపే చూస్తూ ఒక నిముషం అక్కడే నిలబడ్డాడు ప్రకాశం తరువాత చిన్నగా కాళ్ళీడ్చుకుంటూ చెట్టు కిందకు పోయి నిలబడ్డాడు ఒక్కసారిగా నీరసం ఆవహించింది జరిగిన విషయాన్ని గుర్తుకు తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తూ కణతలు నొక్కుకున్నాడు ఏదో కలలో జరిగినట్టుగా అనిపించింది

'తను కళ్ళెర్ర జేసేసరికి వాడేంటి అంత జావకారి పోయాడు ?' అనుకున్నాడు జరిగిన విషయం తలుచుకుంటే నవ్వు వస్తోంది చిన్నగా నవ్వుకున్నాడు 'అంతా మేకపోతు గాంభీర్యం ఎదురుతిరిగితే ఎందుకూ పనికిరారు నా కొడుకులు' అనుకున్నాడు 'ఇది మనసులో పెట్టుకొని ఏదన్నా పనిష్మెంటు ఇస్తాడేమో' అని భయం వేసింది మనస్సంతా చికాకుగా అయిపోయింది ఆదమరచి నిద్దర పోతున్న ముసలతని మీద పడింది దృష్టి

'ఊఁ కానిద్దూ ఈ నౌఖరే మనిషన్నవాడికి పెద్ద పనిష్మెంటు ఇంతకన్నా ఇంకేముందిలే సరే కానీ అదీ చూద్దాం ఈ దెబ్బతో ఉద్యోగం ఊడటమో, ఉండటమో తేలిపోవాలి' అనుకుంటూ ఆలోచించాడు ఏదో దృఢ నిర్ణయాని కొచ్చినవాడిలా చతికిలబడి కూర్చున్నాడు కూర్చుంటుంటే మోకాళ్ళు వంగలేదు బాగా నొప్పి పుట్టాయి అలా కూర్చునేసరికి వళ్ళంతా తేలిపోతున్నట్టు హాయిగా వుంది తనిప్పటికి ఎన్ని గంటలపాటు అట్లాగే నిలబడి వున్నదీ లెఖ్ఖ కట్టటానికి ప్రయత్నించాడు 'ఉదయం అయిదు గంటలకు లేచింది మొదలు ఇంతవరకు ఎక్కడా ముద్దీ ఆనించలేదు ఇప్పుడు మూడయ్యిందో, నాలుగయ్యిందో మొత్తం ఏకబిగిన పది గంటల పైచిలుకు నిలబడ్డాను ఈ బందోబస్తులో వున్నవాళ్ళంతా ఇంతేగా' అనుకున్నాడు 'ఈ తెల్లదొర లేందో అన్నీ టయిముకు చేసేత్తారని అంటారు మరి ఈ ముండమోపి నాయాలు ఎప్పుడో పొద్దున పదకొండు గంటలకే వత్తాడని చెప్పారు ఇంతమటుకు అతీ లేడు, గతీ లేడు' అను కున్నాడు నిముషాలు గడిచేకొలదీ జరిగిన సంఘటన తాలూకు విషయం అతని మనస్సులో ఆందోళన కలిగిస్తోంది ఇప్పటిదాకా ఆకలి బాధ, దానికితోడు మానసిక వేదన తోడయ్యింది గట్టిగా ఒకసారి కళ్ళు మూసుకున్నాడు 'దేవుడా ఎన్ని కష్టాలు పెడుతున్నావురా' అని గొణిగాడు చిన్నగా దూరంగా కారు హారన్ వినపడింది చటుక్కున లేచి టోపీ పెట్టుకొని, రోడ్డుమీద కొచ్చి అటూ ఇటు చూశాడు, ఏవన్నా పశువులు రోడ్డుమీద కొస్తున్నాయేమోనని రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది ఇంకొకసారి కారు హారన్ మోగింది ప్రకాశం కారువైపు చూశాడు

అంతకుముందు అటువంటి అందమైన కారుని చూడలేదు అతను నల్లగా గండు తుమ్మెదలాగా గాలిలో తేలుతున్నట్టు వస్తోంది దగ్గరకొచ్చిన తరువాత సెల్యూట్ చేశాడు ఆ కారు వెనక ఇంకా మూడు కార్లు వచ్చాయి వాటి వెనుక కొంచెం దూరంగా సి ఐ లారీ కూడా వచ్చింది సి ఐ తనవైపు కోపంగా చూస్తున్నట్టు అనిపించింది ఆ చూపు భయమేసింది లారీ కూడా వెళ్ళిపోయాక ఇంకా ఏమన్నా వస్తున్నాయేమోనని చూశాడు ప్రకాశం ఏమీ కనపడలేదు చెట్టు కిందకెళ్ళి టోపీ తీసి, చెట్టు కానుకొని కాళ్ళు బారజాపి కళ్ళు మూసుకున్నాడు

'ఈ నా కొడుకు వూరుకోడు ఏదో ఒక పనిష్మెంటు ఇస్తాడు' అనుకున్నాడు పళ్ళు పటాపటా కొరికాడు అన్నంవేళ బాగా దాటిపోయి నందున ఆకలి బాధ తగ్గింది కాని నీరసంగా వుండి, కోపంతో కడుపు మండుతోంది నీరసంతో శరీరం చచ్చుబడినట్లు వుంది సూర్యుడు పశ్చిమాన ఎరడాలుగా మారిపోతున్నాడు నిద్ర వస్తున్నట్టు కళ్ళు తెరిపిడి పడటం లేదు దూరంగా హారన్ వినపడి కళ్ళు తెరిచాడు గబగబా లేచి టోపీ చేత్తో పట్టుకొని తూలుతున్నట్టు రోడ్డుమీద కొచ్చాడు ఉదయం తాము ఎక్కి వచ్చిన లారీ వస్తోంది లారీ బాడీలో పీసీలు కొంతమంది నిలబడి, కొంతమంది కూర్చుని వున్నారు ప్రకాశం దగ్గరకొచ్చి ఆగింది లారీ గభాలున ఎక్కాడు పైకి లారీ కదిలింది చాలామంది లోపల చతికిలపడి కూర్చున్నారు అందరి ముఖాలూ పీక్కుపోయి వున్నయ్ ఎవరి ముఖంలోనూ హుషారు కనిపించటం లేదు మట్టి రోడ్డుమీద ఎగిరెగిరి పడుతోంది లారీ గాలి వేగానికి రోడ్డు మీది ఎర్రటి దుమ్మంతా లారీ బాడీలో సుడులు తిరుగుతోంది గాలి వేగానికి టోపీ ఎగిరి పోయిద్దేమోనని భయమేసింది లారీ బాడీలో పడేసి, ఒక చేత్తో టోపీ పట్టుకొని, రెండోచేత్తో లారీని పట్టుకొని నిలబడ్డాడు కాని కుదుపులుకి పడిపోతానేమోననే భయంతో, చిన్నగా అక్కడే చతికిలబడ్డాడు ఎదురుగా సుబ్బారెడ్డి నీరసంగా కూర్చుని వున్నాడు కళ్ళు మూసుకుని లారీలోని దువ్వకు కళ్ళు తెరవలేక పోతున్నారు గాలి పీల్చినప్పుడల్లా ముక్కుల్లోకి దువ్వ పోతోంది టోపీ వళ్ళో పెట్టుకొని చేత్తో ముక్కు మూసుకున్నాడు లారీ కుదుపులకు నడుం, పిర్రలు లారీ చెక్కలకు, ఇనుప బోల్టులకు తగిలి ప్రాణం పోతున్నట్లుగా వుంది నిలబడితేనే హాయనిపించింది చెమట పట్టిన వంటిమీద దువ్వ పడి అట్లాగే అతుక్కుపోతోంది లారీ మలుపులు తిరిగేటప్పుడు నిలబడలేక ఒకళ్ళిద్దరు తూలి కూర్చున్నవాళ్ళ మీద పడ్డారు స్టేషను దగ్గిర లారీ ఆగినాక కళ్ళు తెరిచారు దుమ్ముతో నిండి వాళ్ళ ఆకారాలు మారిపోయాయి చిన్నగా కిందకు దిగి తల, బట్టలు దులుపుకొని అందరూ ఫాలెన్ అయ్యారు సుబ్బారెడ్డి మరీ నీరసంగా వున్నట్టు కనిపించాడు అంతలో సి ఐ వచ్చాడు అక్కడికి అతన్ని చూచేసరికి ప్రకాశం మనస్సులో భయం చోటు చేసుకుంది ఎవరి పాస్‌పోర్టులు ఆ స్టేషన్ వాళ్ళకు ఇచ్చారు వాళ్ళకిచ్చిన పాస్‌పోర్టులో సుబ్బారెడ్డికి ఒక నెల ఎగస్ట్రా గార్డు ఇచ్చినట్టు రాసుంది సార్జన్ రాజారావు సుబ్బారెడ్డిని పిలిచి ఆ విషయం చెప్పాడు సుబ్బారెడ్డి విని మౌనంగా వూరుకున్నాడు ఆ మాట విన్న ప్రకాశానికి గుండెలు దడదడలాడాయి రాజారావు సార్జిన్ దగ్గరకు వెళ్ళి, ''సార్ ఇంకెవరికన్నా ఇంకేమన్నా పనిష్మెంటులు రాశారా ?'' అని అడిగాడు రాజారావు ప్రకాశాన్ని ఎగాదిగా చూశాడు

''ఏం, నీకెందు కొచ్చింది ఆ అనుమానం ?'' నువ్వున్నచోట కూడా దొరగారి కారుకు ఎవరన్నా అడ్డమొచ్చారా ?'' అన్నాడు నవ్వుతూ

''అట్లాంటిదేం లేదు సార్ '' అన్నాడు ప్రకాశం

''అయితే సరేలే ఇంకెవరికన్నా వుంటే ఇందులో రాయకపోయరా ?'' అన్నాడు రాజారావు ప్రకాశం మనస్సు కుదుటపడింది మనస్సులోనే దేవుడికి దండం పెట్టుకున్నాడు చుట్టూ చూశాడు దూరంగా గురవయ్య ఎవరితోనో సీనియర్ పీసీతో మాట్లాడుతున్నాడు వాళ్ళ దగ్గర కెళ్ళాడు

''ఏంది డ్యూటీ విషయాలు ?'' అన్నాడు

''ఏముంది కళ్ళు తిరుగుతున్నయ్ సోష వస్తోంది ముందు ఇంత తిండితినే ఏర్పాటు చూసుకోవాలి పదండి'' అన్నాడు గురవయ్య కడుపు నిమురుకుంటూ

''అది సరేలే నా డ్యూటీ విషయం మీ నేస్తానికి చెప్పవేంది ?'' అన్నాడు గురవయ్యతో మాట్లాడుతూ వున్న సీనియర్ పీసీ, నవ్వుతూ ప్రకాశం వైపు చూచి

ఆ మాటకు గురవయ్య కూడా చిన్నగా నవ్వి, ప్రకాశంతో, ''ఇతను మా స్టేషను పీసీ పేరు గోవర్ధనదాస్ ఈయన పాయింటులో దొరగారి కారుకి దున్నపోతు అడ్డమొచ్చిదంట అందుకని నెల రోజులు ఎగస్ట్రా గార్డిచ్చారు'' అన్నాడు

''అసలేం జరిగింది'' అన్నాడు ప్రకాశం ఆసక్తిగా

''ఏముంది నేనున్నచోట అన్నీ పొలాలే దూరంగా పశువులు మేస్తున్నాయి ఆ పశువుల కార్లు వచ్చేంతవరకు రోడ్డు మీదకు ఈ నాలుగు కాళ్ళ పశువులేవీ రాలేదు తీరా కారు అల్లంత దూరాన కనపబడేసరికి రెండు దున్నపోతులు ఒకదాన్నొకటి కుమ్ముకుంటూ రోడ్డు దగ్గరకు వచ్చాయి నాకేం చెయ్యాలో తోచలేదు పక్కనే గొడ్లకాడి బుడ్డోళ్ళు నిలబడి వింతగా చూస్తున్నారే గాని వాటిని తోలలేదు ఇక లాభం లేదనుకొని, నేనే లాటీ తీసి నాలుగు పీకులు పీకాను ఇదిగో, ఆ దెబ్బలకు లాటీ కూడా విరిగిపోయింది'' అని లాటీ చూపించాడు ''నా దెబ్బలకు ఒక దున్న పొలాల్లోకి పారిపోయింది రెండోది దానెమ్మట పడింది అమ్మయ్య అనుకొని వెనక్కు తిరిగా దొరగారి కారు వెళ్ళిపోయింది పోనీలే ప్రాణగండం తప్పింది అనుకున్నా తరువాత మూడు కార్లూ సాగిపోయినియ్యి దూరంగా మన సి ఐ గాడి లారీ వస్తూ కనపడింది నేను ఆ లారీనే చూస్తూ నిలబడ్డా చాలా దూరంలో వుంది నా వెనక గోలగా పిల్లల అరుపులు వినబడి వెనక్కు తిరిగి చూశా దున్నపోతు రంకెలమీద పరిగెత్తుకుంటూ వస్తోంది నావైపు ఆ క్షణంలో నా పని అయిపోయింది అనుకున్నా పిల్లలంతా చావు బతుకుల మీద పరిగెత్తారు నేను చటుక్కున వెనక్కు తిరిగి పక్కనే వున్న చెట్టు దగ్గరకు పరిగెత్తా అంత నీరసంలోనూ ఆ వూపు ఏడనుండి వచ్చిందో నాకు ఆ ఉదుటులో నా టోపీ అక్కడే పడిపోయింది చెట్టు ఎక్కటానికి వీలుకాలా బూట్లు జారిపోతున్నాయయ్యో ఇక నాకు చావు ఖాయమనుకున్నా అటూ ఇటూ చూచి కిందకు వంగి వున్న ఒక కొమ్మను గభాల్న ఎగిరి అందుకుని పైకి లేచా వెంట్రుకవాసిలో నా చావు తప్పింది అప్పటికీ అది నా కాళ్ళను కుమ్మింది కాళ్ళు విరిగిపోయినియ్యనుకున్నా చెయ్యి జారినట్లయితే నా పని అంతే నిజంగా ఆ కోదండరాముడే నన్ను కాపాడేడు ఎంతో కష్టం మీద పైకి ఎగబాకా ఇదంతా కన్ను మూసి తెరిచేలోగా జరిగిపోయిందనుకో ఆ దున్నపోతు దానిష్టమొచ్చినట్టు నేలంతా కుమ్మింది దూరంగా పడివున్న టోపీని నజ్జునజ్జు చేసింది సి ఐ లారీ అప్పుడే అక్కడ కొచ్చింది ఆ సి ఐ లంజాకొడుకు మరి మనుషులకు పుట్టాడో, లేకపోతే ఆ దున్నకే పుట్టాడో, అక్కడి పరిస్థితి అంతా చూశాడు వాడు కాకపోయినా కనీసం డ్రైవరు నన్నా పంపించి దాన్ని తోలిస్తాడనుకున్నా కానీ లారీ వెళ్ళిపోయింది తరువాత ఈ దున్నపోతూ వెళ్ళిపోయింది

అంతలో మనల్ని తీసుకొచ్చిన లారీ వస్తుంటే చిన్నగా దిగి వచ్చి లారీలో పడ్డా'' అన్నాడు

''మరి సి ఐ కి కనపడి విషయం చెప్పకపోయావా'' అన్నాడు ప్రకాశం

''ఓ చెప్పా కూడా అసలు చెప్పేదేముంది వాడుకూడా కళ్ళారా చూశాడుగా దున్నపోతు వచ్చి పొడుస్తున్నా అక్కడే నిలబడాలంటగాని పక్కకు పోకూడదంట నేను వట్టి పిరికివాడినంట డిపార్ట్మెంటుకి పనికి రానంట అసలు నామీద డిసిప్లెన్ యాక్షన్ తీసుకొని ఇంటికి పంపించవచ్చునట కానీ తను మంచోడు కాబట్టి యస్పీ దొరతో చెప్పి ఒక ఇంక్రిమెంటు కట్ చేయిస్తానన్నాడు'' అన్నాడు గోవర్థనదాసు

''అంటే ఆ యింక్రిమెంటు కటింగు ఆర్డరు తరువాత వచ్చిద్దన్నమాట ఈయన ఇప్పుడిచ్చే పనిష్మెంటేమో నెల రోజులు ఎగస్ట్రా గార్డు అన్నమాట ఒక తప్పుకు రెండు పనిష్మెంటులు అసలిది తొప్పెట్లా అయ్యిద్ది?'' అన్నాడు గురవయ్య తరువాత ముగ్గురూ కొద్దిసేపు నిశ్శబ్దంగా వున్నారు

''ఎంత అన్యాయం ?'' అన్నాడు ప్రకాశం

''నా సర్వీసులో బందోబస్తు డ్యూటీలో నా పొరపాటు లేకుండా పనిష్మెంటు తీసుకోవటం ఇది రెండోసారి'' అన్నాడు గోవర్థనదాసు

''మా స్టేషను పీసీకి కూడా ఒకతనికి ఇలాగే పనిష్మెంటు ఇచ్చాడు'' అన్నాడు ప్రకాశం అంతలో దూరం నుండి వెంకటేశం కేక వినబడితే అటు కదిలారు

''మీ వాలకం సూత్తంటే ఈ రేత్తిరికి కూడా తిండి లేకుండా వుండేటట్టున్నారే'' అన్నాడు వెంకటేశం

''తిండి సంగతి సరేలే మావాడికి పనిష్మెంటిచ్చారు ఆ సంగతి మాట్లాడుకుంటున్నాము'' అన్నాడు గురవయ్య

''ఇందులో కట్టపడ్డవాడికే పనిస్మెంటు అన్న సంగతి ఎప్పుడో తెలిసింది నాకు అది సరే, ఇప్పుడు ఏదో ఒకటి తినకపోతే పేనం పోయిద్ది నాకు'' అన్నాడు వెంకటేశం

''అవుననుకో, కానీ జరిగిన అన్యాయం గురించి ఆలోచించకుండా వుండలేం కదా మనం అన్యాయాల్ని ఎదిరించినా లేకపోయినా, కనీసం మాట్లాడుకోకుండా వుండలేము కదా'' అన్నాడు గురవయ్య ఆ మాటకు అందరూ అవునన్నట్లు తలలూపారు

అందరూ వెళ్ళి చొక్కాలు, బూట్లు విప్పి సంచుల్లో పెట్టుకొని తెల్ల చొక్కాలు వేసుకున్నారు వళ్ళంతా బంకలు సాగుతోంది మనస్సంతా చికాకుగా వుంది లేని వుత్సాహాన్ని తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు ప్రకాశం ఇంకో గంటలో ఏ స్టేషను వాళ్ళు ఆ స్టేషనుకు వెళ్ళిపోతారు మళ్ళీ మామూలు రోకటి పాట జీవితం ఇలా బందోబస్తుల్లో పాత మిత్రులు కనపడినప్పుడు కలిగే ఆనందాన్ని కాస్తా ఇలాటి సమస్యలు దూరం చేస్తాయి

''ఏంది ప్రకాశం దీర్ఘంగా ఆలోచిస్తున్నావు ?'' అన్నాడు గురవయ్య

''ఏంలేదు మన మింకాసేపట్లో విడిపోతాము కదా'' అన్నాడు ఆ మాటకు అందరూ నవ్వారు. ఆ నవ్వులో బాధ వుంది

''ఇంకా ఏమన్నా విశేషాలు వుంటే చెప్పు'' అన్నాడు ప్రకాశం

''ఏమున్నాయి ప్రత్యేకంగా నువ్వు మా అమ్మాయి ఆరోగ్యం జాగ్రత్తగా చూడు అందులోనూ మొదటి కాన్పు చాలా జాగ్రత్తగా వుండాలి'' అన్నాడు

''ఆఁ, ఏం జాగ్రత్తలో ఏమిటో కాకుల్లాగా పోలోమని వూళ్ళంబడి పడి తిరిగే వాళ్ళకు ఇట్లాంటి విషయాలు చూసుకొనే తీరిక ఎక్కడుంటుంది''

''అది నిజమేననుకో కాని ఎలాగో చూసుకోవాలి లేకపోతే తరువాత ఏదన్నా జరిగితే బాధ పడాల్సొస్తుంది'' అన్నాడు గురవయ్య వాళ్ళు మాట్లాడుకుంటూ రోడ్డుమీద కొచ్చారు

''ఇప్పుడే వస్తానుండండి'' అని దూరంగా వున్న అరటికాయల కొట్టు దగ్గర కెళ్ళాడు గురవయ్య

''ఇట్లాంటి స్నేహితుడు ఒక్కడుంటే చాలురా జీవితంలో'' అన్నాడు ప్రకాశం వెంకటేశంతో అతని మనస్సు నిండా గురవయ్య అంటే అభిమానం నిండిపోతోంది

''ఔనౌను ఇట్లాంటోల్లు ఎక్కడో కాని వుండరు'' అన్నాడు వెంకటేశం

''ఏరా, మనూరెప్పుడన్నా వెళ్లావా ?'' అడిగాడు ప్రకాశం

''మనూరా ? సరేలే పొద్దుటేల సెంబట్టు కెల్లటానికే టయిం దొరకట్లేదయితే, ఇంక వూరుకుపోయే టైము కూడానా ? అయినా అక్కడ మనకేవన్నా పొలాలా, తలాలా ? ఏముందని అది మన వూరయ్యిద్ది ? పొట్ట చేతబట్టుకొని వచ్చినోల్లకు యేడుంటే అదే సొంతూరు'' అన్నాడు నవ్వుతూ వెంకటేశం ఇంతలో గురవయ్య వచ్చాడు రెండు డజన్ల అరటికాయలు తీసుకొని అక్కడే నిలబడి ఆవురావురుమంటూ తినేశారంతా

''పుస్తకాలేమన్నా దొరికితే చదువుతూ వుండు అభ్యాసం లేకపోతే వచ్చింది కాస్తా మరిచిపోతాం'' అన్నాడు గురవయ్య

''నేను టైనింగులో గొప్ప పొరపాటు చేశాను అప్పుడే సదువు కోవాల్సింది'' అన్నాడు వెంకటేశం బాధగా

''ఇప్పటికైనా మించిపోయింది ఏమీలేదు ప్రయత్నం చేస్తే వీలవుతుంది వెంకటేశం'' అన్నాడు గురవయ్య

''ఏదీ అసలు టైమే ఉండటం లేదు కదా''

''ఉండదు ఎట్లాగో వీలు చూసుకోవాలి అంతే మరి అవకాశమున్నప్పుడు, ఆ అవకాశాన్ని వినియోగించుకోకపోతే ఇలాగే తరవాత బాధ పడాల్సొస్తుంది'' అన్నాడు గురవయ్య

తరువాత వాళ్ళు చాలాసేపు మాట్లాడుకున్నారు చీకటి పడబోతోంది అందరూ స్టేషను దగ్గరకెళ్ళి సంచులూ, లారీలు తీసుకొని బస్టాండు దగ్గర కెళ్ళారు ఒకళ్ళ దగ్గర ఒకళ్ళు సెలవు తీసుకొని బస్సు లెక్కుతున్నారు ప్రకాశం గురవయ్యా, వెంకటేశం దగ్గర సెలవు తీసుకొని బస్సెక్కాడు ఆరోజు ట్రైనింగు నుండి జిల్లా ఆఫీసుకు వచ్చి, అందరికీ డీ వో లు పడ్డప్పుడు, అంతా విడిపోయేటప్పుడు కలిగిన బాధే మళ్ళీ కలిగింది 'ఈ బ్రతుకులింతే' అనుకొని దీర్ఘంగా నిట్టూర్చాడు ఇంటికి చేరేసరికి పదకొండు దాటింది పాస్‌పోర్టు రైటరు కివ్వటానికి సార్జెన్ స్టేషను కెళ్ళాడు మిగిలినవాళ్ళంతా ఇండ్ల కెళ్ళారు ప్రకాశం ఇంటికెళ్ళి తలుపు తట్టాడు తల్లి తలుపు తీసింది స్నానానికి చన్నీళ్ళు తోడింది భార్య పడుకొని వుంది పిలిచాడు పలకలేదు

''దానికి పొద్దుటి నుండీ వకటే వాంతులు ఏవితిన్నా ఇమడటం లేదురా'' అంది తల్లి

ప్రకాశం విని వూరుకున్నాడు స్నానం చేశాడు చన్నీళ్ళ స్నానం ప్రాణానికి హాయిగా వుంది పొయ్యి వెలిగించి గబగబా బియ్యం కడిగి పొయ్యిమీద పెట్టింది తల్లి

''అన్నం ఏమీ లేదంటే ?'' అన్నాడు ప్రకాశం

''లేదయ్యా! పొద్దుందే కాత్తుంటే నేను తిన్నా అది ముద్ద నోట్లో పెట్టుకోలేదు నువ్వొత్తావో రావో అని వండలేదు'' అంది తల్లి

వెళ్ళి భార్య దగ్గర కూర్చున్నాడు ఆమె ముఖం పీక్కుపోయినట్లు కనపడింది 'రేపు ఆసుపత్రికి తీసుకెళ్లాలి' అనుకున్నాడు చాలా రోజుల తరువాత కాస్త విశ్రాంతిగా భార్యతో మాట్లాడే అవకాశం వచ్చింది వంట్లో నీరసంగా వున్నా మనస్సు తేలిగ్గా వుంది బందోబస్తు ముచ్చట్లు భార్యకు చెపుతూ గురవయ్య, వెంకటేశం కూడా వచ్చారని చెప్పాడు కొద్దిసేపటికి వేడి వేడి అన్నం పళ్ళెంలో పెట్టుకొని, పప్పుచారు పోసి, తెచ్చి కొడుకుచేతి కందించింది తల్లి అక్కడే కూర్చుని కలుపుకుని తిన్నాడు చిమ్నీలేని దీపం చుట్టూ పురుగులు ఎగురుతున్నయ్ పప్పుతో తిన్నాక మిగిలిన అన్నంలో మజ్జిగ పోసుకొని కలుపుకుంటున్నాడు ఇంతలో బైటనుండి చింపిరయ్య గొంతు వినపడింది ఆ పిలుపు వినగానే ప్రకాశం గుండెల్లో రాయి పడింది

''ఏంది చింపిరయ్యా ?'' అని లోపల్నుండే అడిగాడు ప్రకాశం జవాబుగా చింపిరయ్య ఏం చెపుతాడో అనే భయం అతనిలో చోటు చేసుకుంది

''నిన్ను రైటరుగారు స్టేషనుకు రమ్మన్నారు అబ్దుల్లాకి సీరియస్‌గా వుంటే ఆసుపత్రికి తీసుకెళ్ళారు అతని పారాలో నిన్ను వేశారు మూడో పారా ఇప్పుడు పన్నెండు గంటలకు ఎక్కాలి'' అన్నాడు

''సరే వస్తాలే'' అన్నాడు ప్రకాశం కోపంగా చింపిరయ్య వెళ్ళి పోయాడు అంతవరకూ వున్న సంతోషం చల్లగా పలచబడింది దాని స్థానంలో రైటరు మీద కోపం పెరిగింది గబగబా అన్నం తిని యూనిఫారం వేసుకొని కంబడి చంకలో పెట్టుకొని స్టేషను కెళ్ళాడు రైటరుతో తగాదా పెట్టుకోవాలనే అతని ఉద్దేశం కానీ స్టేషన్లో రైటరు లేడు పది నిముషాల తరువాత సెంట్రీ పుస్తకంలో సంతకం పెట్టి, తుపాకి తీసుకొని వచ్చి బయట నిలబడ్డాడు ఉద్రేకంతో కూడిన ఆలోచనలు ముసురుకుంటున్నాయి రైటరుని మనస్సులో తెగతిట్టాడు 'ఇంతమందిమి బందోబస్తునుండి వస్తే అందరినీ వదిలిపెట్టి నాకే ఇప్పుడు గార్డు వేశారంటే నేను వర్రి వెర్రివెధవని అనా ? చెప్పిన డ్యూటీ కల్లా గొర్రెలాగా తలూపుతూ పోతుంటే ఇట్లాగే వుంటుంది ఎదురు తిరిగిన వాడికి డ్యూటీ చెప్పరు ప్రొబేషను రాయరేమో అని ప్రతిదానికీ తలవంచుతుంటే మరీ పచ్చాపని రుద్దినట్టు రుద్దుతున్నారు' అనుకున్నాడు ఉద్రేకంతో అతని కణతలమీది నరాలు వుబ్బుతున్నయ్ 'పగలంతా తిండిలేదు కాస్త కడుపునిండా తిన్న తరువాత కంటికి నిద్రలేదు ధూ, దీనమ్మ బతుకుని పోలీసోడి బ్రతుకు కన్నా పాకీవోడి బ్రతుకు వెయ్యిరెట్లు హాయి' అని అనుకున్నాడు అతని ఆలోచనలు తెగిన గాలిపటంలా సాగాయి 'ఈ తెళ్ళోళ్ళు ఈ దేశం వదిలిపెట్టి ఎప్పుడు పోతారో, అప్పుడుగాని ఈ బాధలు తీరవు' అనుకున్నాడు అంతలో చింపిరయ్య వచ్చాడు ఆసుపత్రి నుండి మనిషి చికాకుగా కనపడుతున్నాడు

''అబ్దుల్లాకు ఏమయ్యిందీ ?'' అడిగాడు ప్రకాశం

''పక్షవాత మొచ్చింది కాలూ చెయ్యీ పడిపోయాయి మూతికూడా వంకరపోయి నట్లుంది ఆసుపత్రిలో చేర్చారు'' అన్నాడు ఆ మాట విని ప్రకాశం కొద్దిసేపు ఏమీ మాట్లాడలేదు

''ఆయనకు పక్షవాతం రావటం ఏమిటబ్బా, పాపం మంచివాడు'' అన్నాడు సాలోచనగా

''మన మంచి చెడ్డల్ని బట్టి రోగాలు వస్తాయా ? చేసే వృత్తిని బట్టి రావటానికి అవకాశం

వుంది ఇరవై నాలుగు గంటలూ బూట్లు వేసుకొని వుండాలి ఈ దెయ్యపు బూట్ల వల్ల గాలిరాదు కాలికి రక్త ప్రసారం వుండదు ఒక్కో బూటు మణుగు బరువుంటుంది దానికి తోడూ ఈ డూటీల వలన నరాలు బిగబట్టి వుంటావుయ్యె హై టెన్షన్ పక్షవాతం రావటంలో ఆశ్చర్యమేవుంది'' అన్నాడు చింపిరయ్య అతని గొంతులో ఎవరిమీదనో తెలియని కసి కనపడుతోంది ''ఈ భాడకవ్ నౌకరీ చేసే కన్నా అడుక్కు తిని బతకటం మేలు'' అని చెరచెరా లోపలికెళ్ళాడు

అతనన్న మాటల్ని ఆలోచిస్తూ వుండిపోయాడు ప్రకాశం 'డిపార్టుమెంటులో ఏ పీ సీ సుఖపడటం లేదు ప్రతి వాడూ తీవ్రమైన అసంతృప్తితోనే బ్రతుకుతున్నాడు ఇప్పుడు అబ్బుల్లాని సర్వీసులో నుండి తీసేస్తారు అతని పరిస్థితి ఏమిటి? ఆ కుటుంబం ఏమై పోవాలి ?' సాగుతున్న ఆలోచనల్ని అడ్డుకుంటూ నరశింహం వచ్చి ప్రకాశాన్ని పలకరించాడు

''ఎక్కడి నుండీ రావటం ?'' అన్నాడు ప్రకాశం

''ఇంకెక్కడి నుండీ, బుట్ట కొలువుందిగా '' అని, '' ఏంది అబ్బుల్లాకు బాగా లేదంట'' అని అడిగాడు

''పక్షవాత మొచ్చిందట ఆసుపత్రిలో చేర్పించారు నీకు ఇక్కడ వూళ్ళో వున్నవాడికి ఆ విషయం తెలియదా ?'' అడిగాడు ప్రకాశం

''మీరే నయం నాకన్నా ఆ కొంపలో దూరితే ఇహ బాహ్య ప్రపంచంతో సంబంధం వుండదు అది సరేలేగానిరా అల్లుడూ, నిన్ను అది కలవరిస్తోందిరా'' అన్నాడు నరశింహం వెళ్ళిపోతూ

ఆ మాటకు ప్రకాశం నవ్వాడు రైటరుమీది కోపం తగ్గింది కొంచెం ఉల్లాసం కలిగింది 'ఇక ఇట్లాగుంటే లాభంలేదు మెతకతనం పనికిరాదు ఇంకా రెండు నెలల్లో ప్రొబేషను పూర్తయ్యిద్ది అప్పటిదాకా కాస్త ఓపిక పట్టాలి తరువాత వీళ్ళపని' అనుకున్నాడు

కళ్ళు మంటలుగా వున్నయ్ టైం అసలు నడుస్తున్నట్లే లేదు రాత్రి మూడు గంటలయ్యి, పహారా దిగేసరికి ప్రాణం తోడేసి నట్లనిపించింది వెళ్ళి కంబడి పరుచుకొని పడుకుంటే క్షణాల్లో నిద్ర వచ్చేసింది ఉదయం ఆరు గంటలకు చింపిరయ్య నిద్ర లేపుతుంటే లెగవబుద్ధి కాలేదు కళ్ళు భారంగా మూసుకుపోతున్నాయి కాని తప్పదు లేచి కంబడి చంకలో పెట్టుకొని ఇంటికి పోతుంటే విశ్వనాధం భార్య, డేవిడ్ భార్య పోట్లాడుకుంటున్నారు

'తెల్లారింది వీళ్ళకు' అనుకున్నాడు డేవిడ్ వాళ్ళ కోడి, విశ్వనాధం ఇంటిలో కొచ్చి ఏరిగిందంట దానికి భయంకరంగా పోట్లాడు కుంటున్నారు ఇంటికొచ్చి మొఖం కడుక్కుంటుంటే తల్లి అంది

''అసలు ఇసయం అది కాదురా అప్పుడెప్పుడో, దేవిరిడ్డూ, ఇసపునాదం గారుడు దూటీలో వున్నప్పుడు ఒక పావలా వచ్చిందంట దేవిరిడ్డు ఇసపునాదానికి బాగం ఇయ్యలేదంట అసలు సంగతి అది అంతేగాని రోజూ కోల్లు పంచల్లో యారగటం లేదా ఏందీ ?!''

ప్రకాశం నవ్వుకున్నాడు 'మగాళ్ళ మధ్య గొడవస్తే ఆడోళ్ళ మధ్య కూడా తగాదా పుట్టిద్ది ఇద్దరు మగాళ్ళు స్నేహంగా వుంటే వాళ్ళ భార్యల మధ్య కూడా స్నేహం పెరిగిద్ది క్వార్టర్లలో జరిగే ఆడవాళ్ళ పనులన్నీ మగాళ్ళనిబట్టే వుంటాయి' అనుకున్నాడు

గబగబా ముఖం కడుక్కొని స్టేషనుకు వెళ్ళాడు ఆకాశం మబ్బు పట్టి వుంది అంతా స్టేషన్లోనే వున్నారు లోపలికొస్తున్న ప్రకాశాన్ని చూచి రైటరు, ''నీ కివ్వాల్టి నుండి గార్డు డ్యూటీ'' అన్నాడు,

'అట్లాగే' అన్నట్లు తలూపాడు ప్రకాశం

కోపంగా వెళ్ళి మిగిలిన పీసీల దగ్గర నిలబడ్డాడు వాళ్ళేం మాట్లాడుకుంటున్నారో అని ఆలకించాడు అతననుకున్నట్లుగానే అవి పిచ్చాపాటి విషయాలే

వాళ్ళంతా ఎప్పుడూ ఒకేరకమైన విషయాలు మాట్లాడుకుంటారు వాళ్ళ డ్యూటీల లాగానే అవి ఎప్పుడూ ఒకేరకమయిన విషయాలయి వుంటాయి కొత్త విషయం వాళ్ళ సంభాషణల్లో చోటు చేసుకోవటం అరుదు స్టేషన్లో ఏదన్నా కేసు తాలూకు డబ్బులు వచ్చినప్పుడు వాళ్ళల్లో సంతోషం కనపడిద్ది అటువంటప్పుడు ఒకళ్ళ నొకళ్ళు పరస్పరం గౌరవంగా పిలుచుకుంటారు హుషారుగా కనపడతారు యస్సై తమ వాటా డబ్బులు ఇవ్వనప్పుడు అంతా ఒకట్లై దాన్ని గురించి చర్చించుకుంటారు రకరకాలుగా యస్సైని నిందిస్తారు కాని ముఖాముఖి ఎవరూ అడగలేరు యెవరన్నా తెగించి, కడుపు మంట ఆపుకోలేక రైటరు దగ్గరకెళ్ళి చిన్నగా నసికితే, వాళ్ళు గొప్ప ధైర్యవంతులు కింద లెఖ్ఖ యస్సై స్టాపుకి డబ్బులు పంచకుండా వున్నంతసేపూ రైటరు కూడా మిగతా స్టాపుతో కలిసి యస్సైని తిడతాడు ఆ డబ్బులు పంచుకున్నాక మళ్ళీ మామూలే స్టాపుకు రైటరు కూడా అప్పుడిక శత్రువే నియంత లాగా ప్రవర్తిస్తాడు అప్పుడు స్టాఫంతా యస్సైతో కలిపి రైటర్ని కూడా తిడతారు ఇక సార్జెన్ ఎప్పుడూ స్టాపులో కలవడు ఏ స్టేషనులో అయినా అంతే ఎక్కడన్నా ఒకళ్ళిద్దరూ మంచివాళ్ళుంటే ఉండవచ్చు ఈ సార్జెన్ రాజారావంటే అందరికీ భయం, అసహ్యం అతని ముఖంలో నవ్వనేది ఎవ్వరూ, ఎప్పుడూ చూడలేదు ఎప్పుడూ చిరచిర లాడుతుంటాడు ఎప్పుడన్నా నవ్వాడంటే ఎవరికో ఎసరు పెట్టినట్టే లెఖ్ఖ స్టేషనులోని పరిస్థితులకీ, క్వార్టర్సులోని పరిస్థితులకీ పెద్ద తేడా వుండదు ఇక్కడకు వచ్చిన తరువాత ఆ విషయాలన్నీ జాగ్రత్తగా పరిశీలించాడు ప్రకాశం రైటరు భార్యా, సార్జెన్ భార్యా మిగతా పీసీల భార్యలతో ఎక్కువగా కలిసి మెలిసి వుండరు కాని వాళ్ళ పిల్లలు మిగిలిన పీసీల పిల్లలతో ఆడుకుంటుంటారు మామూలుగా అలా ఆడుకొనేటప్పుడు పిల్లలు ఒకళ్ళ నొకళ్ళు కొట్టుకోవటం సహజంగా జరుగుతూ వుంటుంది అప్పుడా విషయం చిలికి చిలికి గాలివాన అయ్యిద్ది చివరకది స్టేషన్లో డ్యూటీలు వేసే సందర్భంలో బయటపడుతుంది సార్జెన్ కొడుకుని కొట్టిన పిల్లవాడి తండ్రికి ఏదో ఒక నెపంతో ఎగస్ట్రా డ్యూటీ వేసేవాళ్ళు పగలంతా డ్యూటీ చేసి వచ్చినా నైటుబీటు వేసే వాళ్ళు మళ్ళీ ఇలాగే ఏదో ఒకటి మాటలతో బాధ పెడుతుంటారు వాళ్ళు ఏదో చేస్తారనే భయం కలిగిస్తుంటారు అందుకని లైన్లో కూడా ఆడవాళ్ళు తమ పిల్లల్ని ఆ పిల్లల దగ్గరకు పోకుండా వీలయినంతవరకు జాగ్రత్త పడుతుంటారు తమ కోళ్ళు పోయి రైటర్ల, సార్జెన్ల పంచల్లో గలీజు చెయ్యకుండా ఎప్పుడూ వాటిని ఇవతలకు తోలుకొస్తుంటారు అవి గనక వాళ్ళ పంచల్లో రెట్ట వేస్తే ఆరోజు తగాదే కాని వాళ్ళ కోళ్ళు పీసీల పంచల్లో రెట్టవేసినా అడిగే వీలులేదు అధికార్ల ఆడవాళ్ళు కూడా అధికారం ప్రదర్శించటానికి ప్రయత్నం చేస్తుంటారు చాలా మంది పీసీల వినయ విధేయతలు ఆడవాళ్ళల్లో కూడా కనపడుతుంటాయి ఈ విషయాల్ని గమనిస్తుంటే అంతా విచిత్రంగా బాధగా వుంటుంది చాలా మందికి

రోజులు గడిచేకొంది ప్రకాశం ఇంకా కొన్ని విషయాలు గమనించాడు వాళ్ళ వుద్యోగాలు ఎలాగైతే ఎప్పుడూ ఒకే రకంగా నైటు బీట్లు, బందోబస్తులు, గార్డులు, శవాలకు ఎస్కార్టులు, ఖయిదీల్ని కొట్టడాలు, కోర్టు డ్యూటీలు, ప్రాసెస్, ఆర్డర్లీ ఉద్యోగాలు ఇవన్నీ ఎలాగయితే ఒకే మూసలో పోసినట్లు ఏమీ మార్పు లేకుండా వుంటాయో, మిగతా విషయాలు కూడా, అంటే

ఇళ్ళల్లో భార్యాపిల్లలతో విసుక్కోటాలు, తిడుతూ కొడుతూ వుండటాలు అన్నీ గానుగెద్దుల్లాగా ఒకే విధమయిన పనుల్తో రోజులు గడుస్తుంటాయి అలాగే మాట్లాడుకొనే విషయాల్లో కూడా కొత్తదనమేమీ వుండదు లైనులోగాని, స్టేషన్లోగాని, ఏ ఇద్దరు పీసీలు ఎదురైనా వాళ్ళమధ్య సంభాషణ ఎప్పుడూ ఒకేరకంగా వుంటుంది డ్యూటీల గురించీ, పడ్డ కష్టాల గురించీ, స్టేషన్లో వచ్చిన డబ్బుల్ని గురించీ, రైటరూ, సార్జెన్, యస్సైలు మిగతావాళ్ళని మోసం చేసి కాజేస్తున్న డబ్బుల్ని గురించీ, వాళ్ళు పక్షపాతంగా వేసే డ్యూటీల్ని గురించి మాట్లాడుకుంటుంటారు ఆఫీసర్లని ఎప్పుడూ ఒకేరకంగా తిడుతుంటారు చాలామంది పీసీలు ఆఫీసర్లు తమని చేసిన అవమానాల్ని కప్పిపుచ్చుకోవటానికి తాము ఇంతకుముందు స్టేషన్లలో చేసిన ఘనకార్యాల్ని గురించి చెప్పబోతుంటారు అలా తమల్ని తాము గొప్పవాళ్ళుగా ప్రకటించుకోబోతారు తాము ఇప్పుడు పడుతున్న ఆర్థిక ఇబ్బందులకు కారణం తమకు లోగడ వున్న ఆస్తిపాస్తులన్నీ పోవటమేననే బూటకపు మాటలతో నమ్మించబోతారు

రోజులు గడిచేకొందీ ఈ విధమైన మాటలు వింటుంటే అసహ్యం వేస్తోంది ప్రకాశానికి ఒకళ్ళ దగ్గర ఇంకొకళ్ళు డప్పాలు కొట్టుకోవటం తప్ప, ఆ మాటల్లో ఏమీ వుండదు గానుగెద్దు జీవితాల్లో అంతకుమించి మరింకేమీ పెద్దగా కనపడదు ఎప్పుడో నెలకోసారి ఏదన్నా కేసు రిపోర్టయినా, ఎవరికన్నా సుస్తీ చేసినా, ఎవరన్నా కొత్తగా వచ్చి రిపోర్టు చేసినా, అలాటప్పుడు వాళ్ళ సంభాషణలో కొంచెం కొత్తదనం చోటు చేసుకుంటుంది అది అయిపోయినాక మళ్ళీ మామూలే 'బావిలో కప్ప జీవితమంటే ఇదే కాబోలు' అనుకునేవాడు ప్రకాశం

అంతమందిలో నిలబడి వున్నా అతను ఒంటరితనాన్నే అనుభవిస్తున్నట్లు ఫీలవుతున్నాడు 'తన పాలేరు జీవితంలో కూడా ఇంతే కొత్తదనమనేదే కానరాదు ఎప్పుడూ గానుగెద్దు జీవితం బావిలో కప్పలా వేరే విషయాలే తెలియవు అట్లాగే రోజులు గడిపేశాను ఈ బ్రతుకు గురించీ, ఈ జీవితాన్ని గురించి ఏమీ ఆలోచనలు వుండేవి కావు కానీ, తనీ నౌకరులో చేరి, కొంచెం దేశం తిరిగి, పుస్తకాలు చదవటం నేర్చుకొని, కొంత ఆలోచించటం నేర్చుకున్నాక ఈ మానవ జీవితమంటే గౌరవం, మనిషిగా పుట్టిన తను మనిషిగా బ్రతకాలనే తపన, ఈ బ్రతుకులోని అనేక అనుభవాల తాలూకు అనుభూతులు ఇవన్నీ రోజురోజుకు ఎక్కువవుతున్నయ్ తను చదివిన కొద్ది పుస్తకాలూ, గురవయ్యతో కలిగిన స్నేహం, మొద్దుబారిన తన బుర్రకు కొంచెం పదును పెట్టాయి మనిషిగా పుట్టిన తను మనిషిగా బ్రతకాలంటే చాతకావటం లేదు ఈ జీవితాని కర్థం ఏమిటో అర్థం కావటం లేదు' అలా సాగుతున్న అతని ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ గోపాలం గొంతు వినపడింది

''ఏమిటి ప్రకాశం ? వచ్చిం దగ్గర నుండీ చూస్తున్నా, ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నావు'' అన్నాడు ప్రకాశం నవ్వాడు చిన్నగా ఆ మాటకు

''మనోడు ఎప్పుడూ ఏదో ఒకటి ఆలోచిస్తుంటాడండీ'' అన్నాడు డేవిడ్

''ఈరోజు మన నాంచారయ్యకు ప్రొబేషన్ కాగితాలు వచ్చాయి'' అన్నాడు విశ్వనాథం ప్రొబేషన్ అనే మాట వినపడేసరికి ప్రకాశం తన ఆలోచనల నుండి పూర్తిగా ఇవతలకు వచ్చాడు

''ఎప్పుడు రాసి పంపిస్తారంట ?'' అడిగాడు నాంచారయ్యను డేవిడ్ కాని జవాబు విశ్వనాథం చెప్పాడు

''ఎప్పుడు రాసేదేముంది అయ్యగారికి రెండు కోళ్ళూ, ఒక వీశె వెన్నపూస తీసుకుపోయి

ఎప్పుడిస్తే అప్పుడే ప్రొబేషన్ రాస్తాడు ఆయన దగ్గర ఏ అడ్డుపుల్లా వేయకుండా వుండాలంటే ఈ రైటరుకూ, సార్జిన్‌కు కూడా బాగా అనుకూలంగా వుండాలి చెరో అరకోడిపెట్టల్నన్నా తెచ్చియ్యాలి'' అన్నాడు ఆ మాటకు మిగిలినవాళ్ళు తలలూపారు అంతే నన్నట్టు

''అసలు ప్రొబేషను ఇలా కాదు వాళ్ళే మన నడవడికను బట్టి రాయాలి ఇంతకుముందు ఇలా కోళ్ళూ, కుక్కలూ ఇచ్చే అలవాటు లేదట ఇప్పుడిప్పుడే ఇవన్నీ వస్తున్నాయి మా ప్రొబేషను టైములో మేము ఎవరికీ ఏమీ ఇవ్వలేదు అసలు మా కాగితాలు స్టేషన్‌కొచ్చి, యస్సై రాసి పంపిన సంగతే మాకు తెలియదు ఇప్పుడీ ఆఫీసర్ల లంచాలు బాగా మరగిన తరువాత తమ దగ్గిర పనిచేసే పీసీల దగ్గర కూడా చేయి చాపుతున్నారు మరీదిగజారిపోతున్నారు'' అన్నాడు గోపాలం

ఇంతలో రైటరు 'రోల్‌కాల్ అని కేకవేశాడు గానుగెద్దు బ్రతుకులో ఈ రోజు మాట్లాడు కోవటానికి ఒక కొత్త విషయం, 'నాంచారయ్య ప్రొబేషను విషయం' దొరికింది వాళ్ళకు

కొద్దిగా హుషారుగా వాళ్ళు చొక్కా గుండీలు సరిచేసుకుంటూ యస్సై గదిలోకి వెళ్ళారు యస్సై రఫ్ డ్యూటీ రోస్టర్ చూస్తున్నాడు ఒక్కొక్కళ్ళ నెంబరే పిలుస్తూ నాంచారయ్య నెంబరు పిలిచి అతని వైపుచూశాడు నాంచారయ్య గుండె వేగం హెచ్చింది ''నువ్వు స్టేషను కొచ్చిన తరువాత ఏం చేశావ్'' అన్నాడు యస్సై అతని గొంతులో గద్దింపు వుంది

''సార్'' గుటకలు మింగాడు నాంచారయ్య

''నీకు ప్రొబేషను కాగితాలు వచ్చినియ్యి నువ్వు చేసిన ప్రోగ్రెస్ వర్కు ఏమిటి ? నువ్వేమన్నా పెట్టీ కేసులు పెట్టావా ? నేరస్థుల నెవరినన్నా పట్టుకున్నావా ? ప్రాపర్టీ రికవరీ ఏంచేశావు ?'' అన్నాడు యస్సై

''అయ్యా! పోయిన్నెల నైటుబీటులో మర్డర్‌కేసు ముద్దాయిని పట్టుకున్నాను సార్''

ఆ మాట విని యస్సై కొంచెం కంగుతిన్నట్టు చూశాడు ఆ కంగారుకు కారణం ప్రకాశంకు తెలుసు ఇప్పుడు నాంచారయ్య చెప్పిన మర్డర్ కేసు ముద్దాయిని ఆరోజు నైటుబీటులో నాంచారయ్య, డేవిడ్ పట్టుకున్నారు కాని యస్సై, సార్జిన్‌లు పట్టుకున్నట్టు రాసుకుని రివార్డులు కొట్టేశారు నాంచారయ్య రిక్రూట్ కావటం మూలాన ఆ సంగతి తెలిసినా బైటపడలేదు డేవిడ్ మాత్రం యస్సైని అడిగాడు యస్సై అప్పటికి ఆ విషయాన్ని దాటవేశాడు తరువాత నుంచి, రోజూ గడ్డం చేసుకోలేదని, బూటు పాలీష్ లేదని, చొక్కాకి గుండీలు పెట్టుకోలేదని ఎగస్ట్రా గార్డు వేశాడు డేవిడ్‌కి

''అది సరేలేవోయ్ ఇంకా ఏంచేశావ్ ? నీకు వారం రోజులు టైం ఇస్తున్నాను ఈలోగా నీవు ప్రోగ్రెస్ వర్క్ చూపించాలి'' అని రఫ్ డ్యూటీలో తరువాత నెంబరు కోసం దృష్టి మరల్చాడు యస్సై

రోల్‌కాల్ తరువాత అంతా బయటకు వచ్చారు

''వేలు వంక పెడితేగాని వెన్నరాదు'' అన్నాడు డేవిడ్ అతను యస్సైని తిట్టాడు ''దొంగ నాకొడుకులు మాకు రావాల్సిన రివార్డులు వాళ్ళు కొట్టేశారు ప్రాణాలకు తెగించి ముద్దాయిల్ని పట్టుకొనేది మనం ఆ నాకొడుకులు స్టేషన్ వదిలి బయటకురారు కాని వాళ్ళు రాసుకుంటారు అన్నీ చేతిలో అధికారమున్నోడిదే రాజ్యం అడిగితే పనిష్మెంట్లు ఇట్లా ఈ అన్యాయం ఎంతకాలం సాగిద్దో అర్థంకాదు'' అన్నాడు

''ఎంతకాలమున్నా ఇది ఇంతే నోరున్న వాడిదే రాజ్యం అదే విషయం నువ్వొక పిటీషన్

పెట్టు పైకి నీకు రివార్డు తన్నుకుంటూ వచ్చిద్ది వాడికి వార్నింగో, పనిష్మెంటో ఇవ్వకపోతే చూడు'' అన్నాడు గోపాలం

''ఆఁ పిటిషన్‌లూ, నాబొంద'' అని ప్రకాశం వైపు చూస్తూ, ''ఇదిగో ఇట్టాంటి చదువుకున్న కుర్రోళ్ళు అటాంటియ్యి చెయ్యగలరు మనకు చదువా పాడా!'' అన్నాడు డేవిడ్

''పిటీషన్లు పెట్టినంత మాత్రాన లాభం ఏముంటుందో నాకు నమ్మకం కుదరటం లేదు ఈ ఇంగ్లీషు నాయాళ్ళు ఈ దేశం నుండి పోయిందాకా ఇంతే'' అన్నాడు విశ్వనాథం

ఆ మాటకు వంత పలుకుతున్నట్టు ''అవును అవును'' అన్నాడు ప్రకాశం అంతలో రైటరు పిలిచి డ్యూటీలు చెప్పాడు అందరూ ఎటువాళ్ళటు వెళ్ళిపోయారు

రెండు రోజుల తరువాత నాంచారయ్య ప్రకాశం దగ్గరకు వచ్చాడు ''ఒక రూపాయి వుంటే ఇవ్వు ప్రకాశం రెండు కోళ్ళు ఒక వీసె వెన్నపూస కొని యస్సై నా కొడుక్కి బలియివ్వాలి చేతిలో దమ్మిడీ లేదు మనోళ్ళని కొంతమందిని అడిగాను ఎవరిదగ్గరా దొరకలేదు రేపు జీతం రాంగానే ఇస్తాను'' అన్నాడు

ప్రకాశం ఆలోచించాడు 'తన దగ్గర రెండు రూపాయలు వున్నయ్ జీతం వచ్చిందాకా కనీసం ఓ రూపాయన్నా కావాలి మధ్యలో ఏదన్నా అనుకోకుండా బందోబస్తు తగిలితే డబ్బులు కావాలి ఎట్లా ? తనకి కూడా ఎప్పుడన్నా డబ్బులు అవసరం రావచ్చు' అనుకున్నాడు ఇంటి కెళ్ళి ఓ రూపాయి తెచ్చిచ్చాడు కృతజ్ఞత నిండిన కళ్ళతో వెళ్ళాడు నాంచారయ్య

విశ్రాంతిలేని డ్యూటీల వల్ల భార్యను ఆసుపత్రికి తీసుకుపోవటానికే సమయం దొరకటం లేదు ప్రకాశంకు

జీతం రాగానే రూపాయి తిరిగి ఇచ్చాడు నాంచారయ్య ఒక పూట వీలుచూసుకొని భార్యని ఆసుపత్రికి తీసుకెళ్ళాడు ప్రకాశం డ్యాక్టరు పరీక్ష చేసి మందులు రాసిచ్చింది మొదటి కాన్పు కాబట్టి జాగ్రత్తగా వుండాలనీ, ఆమె ఆరోగ్యం అంతంత మాత్రంగా వుందనీ హెచ్చరించింది

ఆ నెలలో ఒక బొంగుల మంచం చేయించాడు ప్రకాశం నులక తెచ్చి అల్లాడు రెండు దుప్పట్లు కొనుక్కొచ్చాడు పెంచుకోటానికి రెండు కోడిపెట్టలు తెచ్చాడు లాంతరు ఒకటి కొనుక్కొచ్చాడు ఒక జత చెప్పులు కుట్టించుకున్నాడు నీళ్ళు తోడుకోవటానికి ఇబ్బందిగా వుండటం మూలంగా ఒక ఇనప బక్కెట్టు కొనుక్కొచ్చాడు నెలకంతా కావాల్సిన సరుకులు, బియ్యం తెచ్చాడు వాటికి జీతం డబ్బులు సరిపోయాయి కొంచెం చిల్లర మాత్రం మిగిలింది వాటితోనే నెలాఖరుదాకా బందోబస్తులకుగానీ, కూరలకుగాని వాడుకోవాలి

ఒకరోజు రైటరు పిలిచి ప్రొబేషను కాగితాలు వచ్చాయని చెప్పాడు ప్రకాశంకు రోల్‌కాల్‌లో యస్సై తన పాట తను పాడాడు ''ఏమోయ్ నీ కాండక్టు ఏమీ బాగాలేదు నువ్వు ఏం ప్రోగ్రెస్ చూపిస్తావు ? నీ ప్రొబేషన్ పీరియడ్ ఎక్స్‌టెండ్ చెయ్యమని వ్రాస్తాను'' అన్నాడు

ప్రకాశం మౌనంగా గుడ్లప్పగించి చూస్తూ నిలబడ్డాడు

''ఒక వారం రోజుల్లో నువ్వు పెట్టీ కేసులు పెట్టాలి'' అన్నాడు యస్సై మళ్ళీ

తలూపి, ''అట్లాగే సార్'' అన్నాడు ప్రకాశం ఆ రోజు సాయంత్రమే రెండు మంచి కోడిపెట్టల్నీ, ఒక వీశె వెన్నపూసనీ కొనుక్కుపోయి యస్సై ఇంట్లో ఇచ్చి వచ్చాడు

ప్రొబేషన్ కాగితాలు రాసి పంపించటమూ, ప్రొబేషన్ డిక్లేర్ అయినట్లు కాగితాలు రావటమూ కూడా జరిగిపోయింది ఆ రోజు ప్రకాశానికి కొంచెం వూరట కలిగింది 'ఉద్యోగం రావటం

కాదు వచ్చిందాన్ని నిలబెట్టుకోవటం కష్టం ఇకనుండి ఇంత గాడిద చాకిరీ ఉండదులే' అనుకున్నాడు అదేమాట మర్రోజు డేవిడ్ దగ్గర అన్నాడు

''పొరిబేషను డికిలేరు అయినంత మాత్రాన మన శాకిరీలో మారుపు ఏమీ వుండదు మమ్మల్ని చూట్టంలా నువ్వు'' అన్నాడు డేవిడ్

ఔనన్నట్లు తలూపి, 'నిజమే నేనే పొరపాటుగా ఆలోచించా' అనుకున్నాడు

అబ్దుల్లాని ఆ రోజు ఆసుపత్రి నుండి తీసుకొచ్చారు లైన్లో వాళ్ళూ, ఇరుగుపొరుగు వాళ్ళు అతన్ని చూడటానికి వచ్చారు మనిషి పూర్తిగా తగ్గిపోయాడు కాలూ చెయ్యీ వచ్చే అవకాశం లేదన్నాడంట డ్యాక్టరు బతికున్నంత కాలం మంచంలోనే వెళ్ళబుచ్చాలంట కూతుళ్ళు, కొడుకులు మంచం చుట్టూ చేరి ఏడుస్తున్నారు ఆడపిల్లలంతా పెళ్ళీడు కొచ్చినోళ్ళే భార్య గడప కానుకొని ఎటోచూస్తోంది ఏడ్చే ఓపిక కూడా ఆమెకు లేదు అబ్దుల్లా కళ్ళల్లో దీనత్వం కొట్టొచ్చినట్టు కనపడుతోంది తనతోటి ఉద్యోగస్తుల వంక అతను జాలిగా చూస్తూ వుండిపోయాడు ఒక పక్కకు వంకరపోయిన మూతి అతని ముఖాన్ని వికృతం చేసింది ఏదో చెప్పాలని అతను శతవిధాల ప్రయత్నం చేస్తున్నాడు కాని మాట్లాడలేకపోతున్నాడు ఆ వచ్చిన రెండు మాటలూ ముద్దగా వచ్చాయి అర్థం కాకుండా ఊళ్ళో తెలిసినవాళ్ళు కూడా వచ్చి చూచి, పిల్లల్నీ, ఆమెని ఓదార్చి పోతున్నారు రెండు మూడు రోజులు ఇరుగుపొరుగు వాళ్ళు అన్నం వొండి తెచ్చి ఇచ్చి పోయారు రెండు మూడు రోజులు అబ్దుల్లాని గూర్చి మాట్లాడుకున్నారు స్టాఫంతా ఒక నెల రోజులకు అతన్ని సర్వీసులో నుండి తొలగిస్తున్నట్లు పైనుండి కాగితాలు వచ్చాయి అసలే కష్టాల కడలిలో వున్న వాళ్ళకు ఆ వార్త చెప్పలేకపోయారు స్టాఫు తప్పని పరిస్థితి కావటం వలన రైటరు ఆ దుర్వార్త కాస్తా అబ్దుల్లా భార్య చెవిని వేసిపోయాడు ఆ కుటుంబ పరిస్థితి పూర్తిగా దిగజారింది నెల రోజుల్నుండీ ఆసుపత్రిలో వుంచి మందులు వాడినందుకు వున్న నాలుగు డబ్బులూ అయి పోయాయి పెద్ద కొడుకును తీసుకుపోయి యస్పీ దొరకు కనపడమన్నారు కొంతమంది కాని అబ్దుల్లా అందుకు ఒప్పుకోలేదు

''నా బిడ్డలు అడుక్కుతిన్నా నాకేమీ బాధలేదు తిండిలేక చచ్చినా నాకు బాధ లేదు కాని ఈ నౌకరీలో చేరిస్తే నేను ఒప్పుకోను'' అన్నాడు అంత బాధలోనూ అతను బలవంతంగా ఆ మాటలు ముద్దగా మాట్లాడాడు కాని మిగిలినవాళ్ళు నచ్చచెప్పారు పెళ్ళీడు కొచ్చిన ఆడపిల్లలూ, దమ్మిడీ సంపాదన లేని పరిస్థితీ, ఉంటానికి ఇల్లులేదు చారెడు పొలం లేదు మందులికీ, మాకులికీ డబ్బుల్లేవు పిల్లలెవరూ కాయకష్టం చేయలేరు ఇన్ని కారణాలు చూపించేసరికి అబ్దుల్లా మాట్లాడలేదు అబ్దుల్లా భార్య కొడుకుని వెంటబెట్టుకొని జిల్లా సూపర్నెంటు దగ్గరకెళ్ళింది తన బాధనంతా కన్నీళ్ళతో కలిపి ఆయన దగ్గరవెళ్ళబోసుకుంది రెండు చేతులెత్తి దండం పెట్టింది

''ఖాళీ లొచ్చినప్పుడు పిలిపిస్తా'' అన్నాడు యస్పీ ఇంగ్లీషులో పక్కనే వున్న కాంపు క్లర్కు దానిని తెలుగులో చెప్పాడు రెండు నెలల తరువాత లైను ఖాళీ చేసి, వూళ్ళో ఇల్లు అద్దెకు తీసుకొని వెళ్ళిపోయారు వాళ్ళు వాళ్ళ పరిస్థితి ఆలోచిస్తుంటే బాధ కలుగుతుంది ఎవరికైనా

'చేసినంతకాలం గాడిద చాకిరీ చేయించుకుంది ఈ గవర్నమెంటు చెయ్యలేక పోయేసరికి వాళ్ళ మానాన వాళ్ళని వదిలేసింది తెల్లోళ్ళు కాబట్టేగా అట్లా చేసింది ' అనుకున్నాడు ప్రకాశం

ఇలాంటి ఆలోచనలతోనే రోజులు గడుస్తున్నాయి యాంత్రికంగా భార్యకు మందులూ అవీ వాడుతూ వుండటం వలన డబ్బుకి కొంచెం ఇబ్బందిగా వుంది ప్రకాశానికి నెలాఖరుకు డబ్బులు

లేక కటకటలాడి పోతున్నాడు మొదటి తారీకు ఎప్పుడొస్తుందా అని రోజులు లెఖ్ఖ పెట్టుకుంటూ ఎదురు చూస్తున్నాడు అంతకుముందు వరకూ జీతం, టీ ఏ ల మీద గడుపుకుపోయే అతను, ఇప్పుడు పై డబ్బుల్ని గురించి ఆలోచిస్తున్నాడు పావలా, బేడా దొరికితే చిన్న చిన్న ఖర్చులన్నా వెళ్ళుమారిపోతాయనే ఆశతో వున్నాడు

'ఇట్లాంటి గడ్డు రోజుల్లో ఏదన్నా డబ్బులు ఖర్చయ్యే డ్యూటీ తగిలితే ఇక తన పని అయినట్లే' అని భయపడుతున్నాడు 'ఏదన్నా బందోబస్తు డ్యూటీ తగిలితే తనని పంపకుండా వుండాలంటే రైటర్నీ, సార్జెన్నీ వీలయితే యస్సైని కాకా పట్టాలి ఈ ఇబ్బంది రోజుల్లో, అర్ధాంతరంగా తగిలే బందోబస్తుల్నుండి తప్పించుకోవాలంటే అదొక్కటే వుపాయం లేకపోతే మెడికల్ సెలవు పెట్టాలి మెడికల్ సెలవులో ఎంత కాలముంటాం ? మహా అయితే నెలా, రెండు నెలలు తరువాత జీతం కట్ అవుతుంది స్టేషన్లో వచ్చే అణా, బేడా రాదు టీ ఏ వుండదు ఇక ఆఫీసర్లని కాకా పట్టటమే దారి' అనుకున్నాడు ఒకరోజు

ఆ వ్యూహకి అతనికి నవ్వు వచ్చింది అది అయ్యే పని కాదని అతనికి తెలుసు మనస్సును చంపుకొని వాళ్ళు చెప్పే పనులు చెయ్యటం అతనికి చేతకాదు ఆ మాటకొస్తే ఎవరికీ చేతకాదు కాని కొంతమంది అలా జీవిస్తున్నారంటే, మనస్సును చంపుకొని బ్రతుకుతున్నారంటే ఏ భయంకర పరిస్థితులు వాళ్ళ జీవితాల్లో నిండిపోయి, వాళ్ళనట్లా మార్చి వేశాయో ఇప్పుడిప్పుడే అర్ధమౌతోంది నరశింహం జీవితం అతనికి గుర్తు వచ్చింది ఆరు నూరైనా తను ఆ తుచ్ఛా కాకా బతుకు బతక కూడదని నిర్ణయించకున్నాడు

'ఈ బతుకులో సగం అప్పుడే అయిపోయింది బానిస కన్నా హీనంగా పాలేరు బతుకు బతికాను ఇక చాలు ఉన్నంతలోనే ముడుచుకోవటం నేర్చుకుంటే, ఆశను చంపుకుంటే ఎటువంటి ఇబ్బందులూ ఎదురవ్వవు తన ఓపిక వున్నంత కాలం, ఈ డూటీలు ఎంత కఠినంగా వున్నా చేసుకుపోతాను కాని, ఆర్డర్లీ బతుకు మాత్రం నాకొద్దు' అని మనసులోనే నిర్ణయించు కున్నాడు

అతను భయపడుతున్నట్లుగానే ఒకరోజు తాలూకా బందోబస్తు డ్యూటీ వేశారు ఏమి చెయ్యాలో పాలుపోలేదు అయినా ప్రయత్నించి చూడాలని రైటరు దగ్గర కెళ్ళి చిన్నగా నసిగాడు ''చేతిలో అర్ధణా లేదు సార్ బందోబస్తుకు ఇంకెవరినన్నా వేయండి సార్'' అన్నాడు

రైటరు అతనివైపు ఎగాదిగా చూశాడు ''అందరి పరిస్థితీ అంతే'' అన్నాడు

ప్రకాశం ఇంకేమీ మాట్లాడలేదు ఆ మాటకి అతని మనస్సు చివుక్కుమంది వెనక్కి తిరిగి వస్తుంటే సుబ్బారెడ్డి ఎదురయ్యాడు స్టేషన్ లోపలికి వస్తున్న అతను కోపంగా వున్నాడు అతనికీ, డేవిడ్‌కి కూడా బందోబస్తు వేశాడు రైటరు అతన్ని అలా చూచి ప్రకాశం ఆగిపోయాడు సుబ్బారెడ్డి గబగబా రైటరు బల్ల దగ్గరకు వెళ్ళాడు ''సార్ కొంచెం న్యాయం, అన్యాయం ఉండాలి సార్'' అన్నాడు కోపంగా

అతనంటున్న మాటలు అర్ధం కానట్టు ముఖం పెట్టాడు రైటరు

''ప్రతి బందోబస్తుకి మేమేనా ? డబ్బులు ఖర్చయ్యే ప్రతి డ్యూటీకి మా నెంబర్లే ఇస్తారు ఎక్కడన్నా పావలా, బేడా వచ్చేదానికి వేరేవాళ్ళని పంపిస్తారు ఇదేంటి సార్'' అన్నాడు అతని కోపానికి రైటరు కొంచెం తడబడ్డాడు

''ఎవర్ని గురించి నువ్వనేది ?'' అన్నాడు రైటరు కోపాన్ని అభినయిస్తూ

''ఎవరా ? ఎవరయిందీ మీకు తెలియదా ? ఆ విశ్వనాధానికి ఏం డ్యూటీలు వేస్తున్నారు? సంవత్సరంలో ఒక్కసారన్నా అతను స్టేషను వదిలి బయటకు పోతున్నాడా ? మీకీ పక్షపాత మేమిటి?'' అన్నాడు ఇంతలో డేవిడ్ వచ్చాడు లోపలకు

''అతను వంట్లో బాగాలేదని యస్సైగారికి చెప్పుకున్నాడంట పోయి ఆయన్నడుగు'' అన్నాడు రైటరు ముఖం చిట్లిస్తూ

'' అవును ఆయనకు సంవత్సరమంతా వంట్లో బాగుండదు మిగిలిన వాళ్ళే అంత ఆరోగ్యంగా వుంది ఇక్కడ '' కోపంతో అతని మాటలు తడబడుతున్నయ్

''అనవసరం పోయి అయ్యగార్ని అడుక్కో కావాలంటే'' అన్నాడు నిర్లక్ష్యంగా రైటరు ఆ నిర్లక్ష్యపు జవాబుకి వుడికిపోయాడు సుబ్బారెడ్డి తన అసమర్ధతనీ, ఏమీ చేయలేనితనాన్నీ ఎత్తి చూపిస్తోంది ఆ జవాబు ఏం మాట్లాడాలో తోచలేదు

''అయ్యగారికి కాదు అవసరం వస్తే పోయి యస్పీ గారికి డైరెక్టుగా చెపుతా ఈ స్టేషన్లో ఎవరెవరు, ఏ ఏ కేసుల్లో ఎంతెంత కాజేసిందీ చెపుతా అప్పుడు చూద్దువుగాని'' అంటూ చరచరా బయటకు వెళ్ళాడు అతన్ని డేవిడ్, ప్రకాశం అనుసరించారు కోపంతో సుబ్బారెడ్డి ముఖం ఎర్రబడింది అవమానంతో అతని ఒడలంతా వణుకుతోంది

''ఈ విశ్వనాధంగాడు కొన్ని కేసుల్లో పార్టీల నుండి డబ్బులు వసూలు చేసి యస్సైకి ఇస్తున్నంత మాత్రాన ప్రతి కష్టమయిన డ్యూటీకి వీడిని మినహాయిస్తాడు దొంగ నా కొడుకు'' అంటూ తిట్టాడు సుబ్బారెడ్డి

''విశ్వనాధాన్ని అందుకు వదిలేస్తారు ఆ గోపాలమేమో ఎక్కడ ఏం పిటీషన్లు పెడతాడో అని భయం అందుకని అతనికి డ్యూటీలు చెప్పటానికీ భయపడతారు'' అన్నాడు డేవిడ్ వంతగా

వీళ్ళు అట్లా రైటరు మీద తిరగబడటం ప్రకాశంకు ఆనందంగా వుంది తను ఈ విషయాల్లో ఒంటరి కాదు అనే భావం కొంత వూరట కలిగించింది తరువాత డబ్బుల్ని గురించి ఆలోచించాడు బందోబస్తుకు పోవటానికి చేతిలో దమ్మిడీ లేదు బందోబస్తుకు ఎలా పోవాలో అర్ధం కావటం లేదు ఎవరినన్నా ఒక అర్ధ రూపాయన్నా అప్పు అడగాలనుకున్నాడు కానీ చేతకావటం లేదు పైగా మనస్కరించటం లేదు

అయినా గత్యంతరం లేక ఇద్దరు ముగ్గురిని అడిగాడు దొరకలేదు అందరి పరిస్థితీ అంతంతమాత్రమే ఇంటికెళ్ళాడు బందోబస్తుకెళ్ళాలని చెప్పి, సాయంత్రానికి అన్నం మూట కట్టమన్నాడు చేతిలో దమ్మిడీ లేకపోతే పిచ్చెక్కినట్టు చికాగ్గా వుంది 'మనిషికి జీవనాధారమైన డబ్బు లేకపోతే వాడికేం తోచదు కదా' అనుకున్నాడు ఆలోచిస్తూ పడుకున్నాడు డబ్బుల్లేకపోయేసరికి అతనిలో కలుగుతున్న చికాకుకూ, నీరసానికీ నవ్వు వస్తోంది ఇంటికొచ్చిం దగ్గరనుండీ భర్త ప్రవర్తనను గమనించిన మాణిక్యమ్మ వచ్చి అతని పక్కన కూర్చుంది

''ఏంది అట్టాగున్నావ్ ?'' అంది

ఆ మాటకు చిన్నగా నవ్వాడు భార్యని చూచి '' ఏముంది, బందోబస్తు పోవటానికి చేతిలో దమ్మిడీ లేదు ఎవరి నడగాలో అర్ధం కావటం లేదు ఇద్దరి, ముగ్గురి నడిగి లేదనిపించుకున్నా అయినా నెలాఖరు రోజుల్లో ఎవురి దగ్గరుంటయ్ అందరి పరిస్థితులూ అంతంత మాత్రమేనాయె'' అన్నాడు ఆ మాటకు ఆమె కొద్దిసేపు ఆలోచించింది

''శాంతమ్మ గారిని అడిగితే?!''

''ఆమెవరు ?'' అన్నాడు

''గోపాలం అన్నయ్య బార్య పోయి అడిగి తెత్తా ఒక రూపాయి వుంటే కాదనదు'' అని బైటకెళ్ళింది

'వాళ్ళ దగ్గర మాత్రం దొరికిద్దో లేదో పాపం' అనుకున్నాడు ఈ బందోబస్తుకు వెంకటేశం, గురవయ్య వస్తే, ఇక డబ్బుల్తో పనే వుండదు మహావుంటే రేప్పొద్దున బందోబస్తు వుంటుంది సాయంత్రానికల్లా తిరిగి రావచ్చునేమో' అనుకున్నాడు అంతలో అతని భార్య నవ్వుతూ వచ్చింది రూపాయి బిళ్ళ ప్రకాశం చేతిలో పెట్టింది చేతిలోని రూపాయి బిళ్ళని అటూ ఇటూ తిప్పి చూశాడు 'హుం ఈ రూపాయి బిళ్ళ చేతిలోకి వచ్చాక మనస్సు ఎంత కుదుటపడింది ?! ఇప్పటివరకూ వున్న ఆందోళన ఎంతలో సద్దుమణిగింది ? అంతా ఈ డబ్బు మహిమే కదా! ఇది లేకపోతే ఈనాడు మనిషెందుకూ పనికిరాడు ఈ డబ్బు గనక చేతిలో వుంటే ఇట్వాంటి బందోబస్తులు ఒక లెఖ్ఖా' అనుకొని భార్యవైపు చూచి నవ్వాడు ప్రేమగా

''నాకన్నా నీకే పలుకుబడి బాగా వుందే, ఈ మాత్రం దొరకలేదు'' అన్నాడు ఆ మాటకు ఆమె నవ్వింది

''మరేందనుకున్నా ఆ వదిన మంచిది ఎప్పుడేది లేదనిపోయినా, వుంటే మాత్తరం తప్పకుండా ఇచ్చిద్ది నోరు మంచిదయితే వూరు మంచిదయిద్ది మనం గూడా జీతం రాగానే ఇచ్చేత్తే మరియాదగా వుంటది'' అంది

''అవును, లేకపోతే రెండోసారి విలువుండదు'' అన్నాడు వాళ్ళు కొద్దిసేపు కబుర్లు చెప్పుకున్నారు మాటల్లో భార్యతో ప్రకాశం చిన్నగా అన్నాడు ''నువ్వు భాషని కొంచెం బాగా మాట్లాడాలి మరీ యాస కొట్టొచ్చినట్టు కనపడతంది''

ఆ మాట విని ఆమె నవ్వింది

''నువ్వు బాగా మాట్లాడతన్నావ్‌గా, చాల్లే నాకెందుకింక'' అంది ప్రకాశం నవ్వాడు ''చరే ఇంగ లే లేసి కాసిని నీళ్ళు పోసుకో'' అంది భార్య

''అవునవును, బందోబస్తు నుండి తిరిగొచ్చిందాకా నీళ్ళుండవ్'' అని లేచి గబగబా స్నానం చేశాడు ఒక చొక్కా, పంచా, కండువా, కంబడిలో చుట్టి తాడు కట్టాడు ఆ తాటికి లారీని ముడేశాడు చిన్న పాతగోనె సంచిలో బూట్లూ, కాళ్ళకు చుట్టుకునే పట్టీలు, సాక్సులు వేశాడు అన్నం మూట కూడా ఆ సంచిలోనే పెట్టి మూతి కట్టాడు అంతలో బైట నుండి సుబ్బారెడ్డి కేక వినపడింది

''ఇదిగో వస్తున్నా, అన్నం తినబోతున్నా'' అన్నాడు ప్రకాశం

''ఇంకా తినబోతున్నావా ? ఆ బస్సు కాస్తా పోతే ఇంక సాయంత్రమే మనకి బస్సు లేటుగా పోయి రిపోర్టు చేస్తే అక్కడే ఎగస్ట్రా గార్డిస్తారు'' అన్నాడు సుబ్బారెడ్డి ఆ మాటతో కంగారు బయులుదేరింది ఆదుర్దాగా చెయ్యీ, నోరూ కాలుతున్నా, ఎగరొప్పుతూ గబగబా అన్నం తిని లేచాడు

''వుడుకుడుకన్నం అట్టాగే కట్టా మాపిటేలకి బాగా సద్ది పడిపోయిద్దేమో'' అంది భార్య

యూనిఫారం వేసుకొని, బెల్టూ, టోపీ పెట్టుకొని గబగబా బస్సు కోసం పరిగెత్తాడు సర్కిలాఫీసు దగ్గరకు వెళ్ళేసరికి రెండు గంటలు కావస్తోంది అంతా హడావిడిగా వుంది తెలిసిన వాళ్ళెవరన్నా వచ్చారేమోనని వెతికాడు ఎవరూ కనపడలేదు తాలూకా స్టేషను పంచలో

కొంతమంది బందోబస్తుకు వచ్చినవాళ్ళు బెడ్డింగులు పెట్టుకొని కబుర్లు చెప్పుకుంటూ కనపడ్డారు అటూ ఇటూ చూశాడు చోటు కోసం ఒకపక్క కాస్త ఖాళీ అనిపిస్తే అక్కడి కెళ్ళి బెడ్డింగు గోడకానించి చేరగిల పడ్డాడు నిముషాల్లోనే నిద్రలోకి జారిపోయాడు చాలాసేపటి తరువాత డేవిడ్ తట్టి లేపాడు గబగబా లేచి బూట్లు వేసుకొని అందరితోపాటు ఫాలెన్ అయ్యాడు

''రేపు ఉదయం మార్కెట్ దగ్గిరనుండి వూరేగింపు బయలుదేరుతుంది తాలూకా ఆఫీసు దగ్గర నుండి ఆర్ డి వో ఆఫీసు దాకా ఆ వూరేగింపు వుంటుంది ఆ వూరేగింపుకి మీరంతా బందోబస్తు'' అని చెప్పాడు సర్కిల్ ఇనస్పెక్టరు అంతా డిస్‌బర్స్ అయిపోయారు 'ఇక ఈ రాత్రికి రెస్ట్' అనుకున్నాడు ప్రకాశం

పొద్దు గూకేటప్పుడు, తెచ్చుకున్న అన్నం తీసుకెళ్ళి బావి దగ్గర కూర్చుని తిని వచ్చారు ముగ్గురూ యూనిఫారం విప్పేసి పంచె కట్టుకొని, మధ్యాహ్నం పడుకున్నచోటనే కంబడి పరచి పడుకున్నాడు ప్రకాశం క్షణంలో నిద్ర వచ్చేసింది ఒక రాత్రప్పుడు మెలుకువ వచ్చి లేచి కూర్చున్నాడు వళ్ళంతా చెమట పోసింది దోమలు జుమ్మంటూ రొదచేస్తూ ఎగురుతున్నయ్ వంటిమీద ఎక్కడ పడితే అక్కడ కుట్టి రక్తం పీలుస్తున్నయ్ లేచి, కంబడీ, సంచీ తీసుకొని దూరంగా పోయి, గ్రౌండులో కంబడి పరుచుకున్నాడు చాలామంది అక్కడ పడుకొని నిద్ర పోతున్నారు చల్లటి చలిగాలి వీస్తోంది దోమలు లేవు అతను పడుకున్న చోటుకి కొద్ది దూరంలో కసువు దిబ్బమీద రెండు పందులు పడుకొని వున్నయ్ వాటిని చూచేసరికి నిద్రమత్తు వదిలింది ఆ పందుల్ని తోలాడు కానీ అవి పోలేదు 'వాటికీ తమకూ పెద్ద తేడా లేదు' అనుకుని నవ్వుకున్నాడు ఆకాశంలో చందమామ బాగా నవ్వుతున్నాడు చుక్కలు మిణుకుమంటున్నయ్ తెల్లని మబ్బులు నెమ్మదిగా కదులుతున్నయ్ దూరంగా ఎక్కడినుండో మురుగువాసన గాలి వీచినప్పుడల్లా వచ్చి అలలు అలలుగా ముక్కుల్ని తాకుతోంది దోమలు కుట్టినచోట్ల దద్దుర్లు లేచి తీపు పుడుతోంది చాలాసేపువాటిని గీరుకుంటూ గడిపాడు తరువాతెప్పటికో నిద్ర పోయాడు

ఉదయం ఆరుగంటలకు అందరూ గ్రౌండులో ఫాలెన్ అయ్యారు ఆ సర్కిల్‌లోని స్టేషన్ల మెన్‌తో పాటు ఇతర సర్కిల్స్‌ల్లోని వాళ్ళు చాలామంది వచ్చారు బందోబస్తు లప్పుడు సహజంగా వుండే హడావిడిని చూపిస్తున్నారు యస్సైలు, సి ఐ లు

డీ యస్పీ తెల్లదొర స్టేషన్లో కూర్చుని వున్నాడు అతని ముఖంలో ఆందోళన కనపడుతోంది బందోబస్తులో వున్న వాళ్లందరినీ రెండు సెక్షన్లుగా విడదీశారు మూడో సెక్షను రిజర్వుపార్టీ వాళ్లదగ్గర త్రినాట్‌త్రీ రైఫిళ్ళు వున్నయ్ 'ఒక సెక్షను మార్కెట్ దగ్గర నుండి బయలుదేరే వూరేగింపు వెంట రావాలి రిజర్వు పార్టీ ఆ వూరేగింపు వెనకే వేనులో వస్తుంది రెండో సెక్షను వాళ్ళు తాలూకా ఆఫీసు గేటు దగ్గర వుండి వూరేగింపుని ఆఫీసుగేటు దాటి లోపలకు రాకుండా ఆపేసెయ్యాలి వూరేగింపుతో పాటు తాలూకాఫీసు దగ్గరకు వచ్చే మొదటి సెక్షనూ, వేనులోని రిజర్వు పార్టీ రెండు కలిసి, వూరేగింపు తాలూకాఫీసు గేటు దగ్గరకు రాగానే, రెండో సెక్షను వాళ్ళతో కలిసి, వూరేగింపు తాలూకాఫీసు లోపలకు రాకుండా అడ్డగించాలి ' ఇవీ ఇన్‌స్ట్రక్షన్స్

ప్రకాశం వూరేగింపు వెంట వచ్చే బేచ్చిలో వున్నాడు సుబ్బారెడ్డినీ, డేవిడ్‌నీ తాలూకాఫీసు దగ్గర వుండే బేచ్చిలో వేశారు మొదటి బేచ్చి వాళ్ళంతా మార్కెట్టు దగ్గరకు వెళ్ళారు పరిచయస్తు లెవరూ బందోబస్తుకు రాకపోవటం మూలానా, ఒంటరితనంగా వుంది ప్రకాశానికి ఇద్దరు

యస్సైలు, అయిదుగురు హెచ్ సీ లు, ముప్ఫై మంది దాకా పీసీలు వున్నారు ఆ బేచ్చీలో ఎండ చురచురమంటోంది అప్పుడే యస్సైలతోపాటు అంతా ఒకచోట నిలబడ్డారు

వూరేగింపుకు సన్నాహాలు జరుగుతున్నయ్ చాలామంది వయస్సు మళ్ళినవాళ్ళు ఖద్దరు టోపీలు పెట్టుకొని వున్నారు వాళ్ళ చేతుల్లో మూడు రంగుల జెండాలున్నయ్ కొంతమంది కుర్రోళ్ళు హడావిడిగా తిరుగుతున్నారు పోలీసుల్ని చూచిన తరువాత వాళ్ళ ముఖాల్లో ఉద్రేకం, వాళ్ళ కదిలికల్లో పట్టుదల కొట్టొచ్చినట్టు కనడింది కొంతమంది కుర్రవాళ్ళు, చొక్కాలికి కాగితం బాడ్జీలు తగిలించుకొని వున్నారు వాళ్ళు తెల్లటోపీలు పెట్టుకోలేదు

అక్కడే రోడ్డు మీదే అందరినీ ఫాలెన్‌చేసి, సీనియర్ యస్సై ఏదో చెపుతున్నాడు జేబులోని రూపాయి బిళ్ళని ఓసారి తడిమి చూసుకున్నాడు ప్రకాశం ఇంతలో రిజర్వుపార్టీ వేను వచ్చింది నిముషాల్లో వూరేగింపు బయలుదేరింది వూరేగింపు బయలుదేరేముందు తెల్లటోపీలు పెట్టుకున్న వాళ్ళకూ, యువకులకూ చిన్న ఘర్షణ జరిగింది వూరేగింపుకు అగ్రభాగాన మేముండాలంటే, మేముండాలని కొద్దిసేపు వాదించుకున్నారు తరువాత వాళ్ళల్లో వాళ్ళు, ఏదో నిర్ణయానికి వచ్చినట్టు, ముందు వరుసలో కొంతమంది వాళ్ళూ, కొంతమంది వీళ్ళు నిలబడ్డారు వాళ్ళు ఎవరు ఎవరో అర్థం కాలేదు ప్రకాశానికి కాని ఉత్సాహంగా వుంది వూరేగింపు బయలుదేరి పదిగజాలు సాగాక ఒకతను వచ్చి తెల్లటోపీల వాళ్ళకు బాడ్జీలు ఇచ్చాడు అవి తగిలించుకున్నారు వాటిమీద గాంధీతాత బొమ్మ వుంది

''ఆ బాడ్జీలను మనం ఎలవ్‌చెయ్యకూడదు కదా'' అన్నాడు జూనియర్ యస్సై, తనపక్కనున్న సీనియర్ యస్సైతో

ఆ మాటకు సీనియర్ యస్సై తల తిప్పకుండా, కళ్ళు అటూ ఇటూ తిప్పిచూసి, ''ఆఁ, పోనిద్దూ మన మిప్పుడు తీసెయ్యమంటే గొడవయిద్ది ఆ జరిగేదేదో తాలూకా ఆఫీసుకాడ, డి యస్పీ గాడి సమక్షంలో జరిగితే, మన పూచీ వుండదు అప్పుడు ఇక్కడ మనం తియ్యమంటే వాళ్ళు 'తియ్యం' అంటారు నానా గొడవయిద్ది మనమూ వూరుకోలేము ప్రిస్టేజి క్వచ్చన్ లాఠీచార్జీదాకా పోయిద్ది వ్యవహారం ఇదంతా ఎందుకు వచ్చిన గొడవ పోనీయండి'' అన్నాడు

జూనియర్ విని వూరుకున్నాడు

వూరేగింపు ముందువైపున ఇద్దరు యస్సైలు నడుస్నున్నారు రెండు వైపులా కానిస్టేబుళ్ళు, సార్జెన్‌లు నడుస్తున్నారు వెనక రిజర్వు పార్టీ వస్తోంది వాళ్ళ వెనక ఖాళీ వేను వస్తోంది ఇనప నాడాల బూట్లు శబ్దం చేస్తున్నాయి

పది గజాలు నడిచాక ముందు వరుసలోని యువకుల్లో ఒకతను గట్టిగా అరిచాడు ''బోలో స్వతంత్ర్య భారత్ కీ'' అని వూరేగింపులోని వాళ్లంతా ఒక్కసారిగా ''జై'' అన్నారు ముక్త కంఠంతో ఆ అరుపుతో వీధి వీధంతా ప్రతిధ్వనించింది ఆ యువకుడే తిరిగి ''అజాద్ భగత్‌సింగ్'' అని అరిచాడు ''అమర్ రహే'' అన్నారు యువకులంతా వాళ్ళ ముఖాల్లో ఆనందం, ఉద్రేకం గూడు కట్టుకుంటోంది యువకులంతా అలా అనగానే గాంధీబొమ్మల బ్యాడ్జీలు పెట్టుకున్న వాళ్ళంతా ముఖముఖాలు చూసుకున్నారు వాళ్ళంతా వూహించని విషయం ఎదురయినట్లు యువకుల వైపు చూశారు కాని ఎవరూ ఏమీ మాట్లాడుకోలేదు

వూరేగింపు సాగుతున్నంతసేపూ యువకులు రకరకాల నినాదాలు ఇచ్చారు వాళ్ళ నినాదాల్లో కొన్ని ప్రకాశానికి అర్థంకాలేదు భగత్‌సింగ్ ఎవరో తెలియలేదు 'సామ్రాజ్యవాదం నశించాలి,

సోషలిజం వర్ధిల్లాలి' అనే మాటలకు అర్థం తెలియలేదు అవన్నీ అతనికి కొత్తగా వున్నయ్ ఆ మాటల్నే పదేపదే వల్లించుకుంటూ వాళ్ళవెంట నడిచాడు, మిగిలిన ఫోర్సుతో పాటు రెండు మూడుసార్లు ఒకవయస్సు మళ్ళినతను ''గాంధీ మహాత్మాకీ'' అని అరిచాడు యువకులు మినహా మిగిలిన వాళ్ళంతా ఆ మాటకు 'జై' అని జై కొట్టారు వూరేగింపు తాలూకాఫీసు గేటు దగ్గరకు చేరేసరికి చాలామంది జనం వచ్చి కలిశారు వూరేగింపుని లోపలకు ప్రవేశించనివ్వకుండా పోలీసులంతా ఒకరిపక్క ఒకరు నిలబడి, ఒకరి చేతుల్ని ఒకళ్ళు పట్టుకొని దడికట్టారు

వూరేగింపు గేటు దగ్గర ఆగిపోయింది నినాదాలు మారుమ్రోగుతున్నయ్ 'ఆంగ్లేయుల పాలన నశించాలి' అని అరుస్తున్నారు ప్రకాశానికి ఏదో గమ్మత్తుగా, వుత్సాహంగా వుంది 'ఇంగ్లీషువాళ్ళు ఈ దేశం నుండి వెళ్ళిపోతే, తమవెట్టిచాకిరీ కొంతయినా తగ్గిద్దని అనుకున్నాడు ఎన్నోసార్లు చాలామంది తన తోటివాళ్ళుకూడా ఆమాటే అన్నారు ఈ వూరేగింపులోని వాళ్ళంతా అదే అంటున్నారు ఇప్పుడు తమలాగే వీళ్ళుకూడా, ఈ దరిద్రానికి ఆంగ్లేయులే కారణమను కుంటున్నారన్నమాట' ఆ ఆలోచనలలోనే మునిగి పోయాడు

ఉండే కొందీ జనసమూహం పెద్దదవుతోంది తెల్ల డీ యస్పీ దొర గేటుదగ్గర కొచ్చి నిలబడ్డాడు అతని చేతిలో రివాల్వర్ వుంది అతని వెనుక ఆ తాలూకా తహసీల్దారు అయిన తెల్లదొర కూడా నిలబడి వున్నాడు వూరేగింపుతో పాటు వచ్చిన సెక్షనూ, రిజర్వుపార్టీ వాళ్ళూ, దడికట్టిన పోలీసుల వెనక్కు వెళ్ళారు రిజర్వుపార్టీని తుపాకులు లోడ్‌చెయ్యమని ఆర్డరిచ్చాడు దొర రిజర్వ్ పార్టీ వాళ్ళంతా తుపాకులు లోడ్‌చేసి 'ఆన్‌గార్డ్' పొజిషన్‌లో నిలబడ్డారు వాతావరణమంతా వుద్రేకంగా వుంది తుపాకులు లోడ్‌చేసిన శబ్దానికి అంతటా నిశ్శబ్దం ఆవరించింది అందరి గుండెలూ కొట్టుకుంటున్నాయి భయంగా

రెండు నిముషాల అనంతరం తిరిగి నినాదాలు మిన్నుముట్టాయి కాని, తెల్లటోపీల వాళ్ళంతా యువకుల వెనక్కుచేరి నినాదాలిస్తున్నట్టు నోళ్ళు మెదుపుతున్నారు అటూ ఇటూ బిత్తర చూపులు చూస్తున్నారు అక్కడ నిలబడ్డ తెల్ల ఆఫీసర్ల నిద్దరినీ చూస్తుంటే యువకుల్లో ఉద్రేకం కట్టలు తెంచుకుంటోంది

'ఆంగ్లేయులు ' 'నశించాలి ' అనే నినాదమే ఎక్కువ ఎక్కువగా వినపడుతోంది

వూరేగింపులోని అందరి చూపులూ ఆ తెల్ల వాళ్ళమీదనే వున్నయ్ చూపుల్లో వాళ్ళు నిప్పులు కురిపిస్తున్నారు ప్రకాశం ముఖానికి పట్టిన చెమట తుడుచుకున్నాడు అంతా కలియజూశాడు తాలూకాఫీసు పైన ఆంగ్లేయుల పతాకం ఎగురుతోంది మృదువుగా నినాదాల మోత బాగా ఎక్కువయ్యింది

ఉన్నట్టుండి డి యస్పీ దొర గాలిలోకి రివాల్వర్ పేల్చాడు అంతా వులిక్కిపడ్డారు చీమ చిటుక్కుమన్నా వినపడేంత నిశ్శబ్దం క్షణంలో అలుముకుంది డి యస్పీ పెద్దగా అరిచాడు, ఏదో, ఇంగ్లీషులో, కోపంగా తిరిగి ఒక తోటా గాలిలోకి కాల్చాడు కోపంతో అతని ముఖం రక్తపు ముద్దలా అయ్యింది ఒక్క నిముషం గడిచిందో లేదో, ముందు వరుసలో నిలబడ్డ యువకుల్లోంచి ఒకతను ముందుకు రెండడుగులు వేసి, దడి కట్టిన పోలీసుల దగ్గరకు వచ్చాడు గబగబా మిగిలిన యువకులు అతన్ని అనురించారు 'భగత్‌సింగ్ జిందాబాద్' అని అరుస్తూ, వాళ్ళు దడి కట్టిన పోలీసుల్ని నెట్టుకుని ముందుకు రాబోయారు

''లాఠీ ఛార్జ్'' అని పెద్దగా కేక పెట్టాడు డి యస్పీ అంతే లాఠీలు స్వైర విహారం చేశాయి

ఆ యువకుల కాళ్ళమీదా, తలలమీదా, భుజాలమీదా దెబ్బల వర్షం కురిసింది వూహించని సంఘటనకు బిత్తరపోయినట్టు చూశాడు ప్రకాశం తెల్లటోపీల వాళ్ళు గుంపులో వెనక్కి వెనక్కి సర్దుకుంటూ కనిపించారు అంతటి వుద్రేక వాతావరణంలోనూ అది అతనికి నవ్వు తెప్పించింది

సరిగ్గా రెండు నిముషాలు గూడా గడవలేదు వూహించని లారీ చార్జీకి ముందు బిత్తరపోయిన యువకులు వెంటనే తేరుకున్నారు పోలీసుల మీద తిరగబడ్డారు పోలీసుల చేతుల్లోని లారీలు వూడబెరుక్కుంటున్నారు 'ఇక తమ సెక్షన్‌ని అడ్వాన్స్ కమ్మంటారేమో' అనుకుంటున్నాడు ప్రకాశం అతని చేతిలో లారీ బిగుసుకుపోతోంది లారీచార్జీ చేసిన వాళ్ళకూ, యువకులకూ మధ్య పెనుగులాట అంతా క్షణాల్లోనే జరిగిపోయింది లారీ కర్ర దెబ్బ తగిలి ఒక పీ సీ కేక పెట్టాడు

డి యస్పీ గావుకేక పెట్టాడు ''ఫైర్'' అని తుపాకి తోటా శబ్దంలా ఆ మాట దూసుకొచ్చింది లారీ పార్టీ అంతా చటుక్కున పక్కకు తప్పుకుంది తెల్లటోపీల వాళ్ళు ఎక్కడి వాళ్ళక్కడ భూమి మీద పడుకున్నారు యువకులంతా చెల్లా చెదురయ్యారు ''ధన్, ధన్, ధన్, ధన్'' తుపాకులు మాట్లాడాయి తుటా ఏదీ వృథా అయినట్లు కనిపించలేదు ప్రకాశానికి వూహించని ఈ పరిణామానికి అతను మ్రాన్పడిపోయాడు

మూడో క్షణంలో అంతలావు వూరేగింపూ నిశ్శబ్దంతో నిండిపోయింది బుల్లెట్ల దెబ్బ తగిలిన యువకులంతా నేలమీద పడిపోయారు ముగ్గురు అక్కడికక్కడే ప్రాణాలు వదిలారు కాళ్ళకు, చేతులకు బుల్లెట్ల దెబ్బలు తగిలినవాళ్ళు కిందపడి తన్నుకుంటున్నారు ఫైరింగు ఆగిపోయింది కాని తుపాకుల గర్జన ఇంకా ప్రకాశం చెవుల్లో గింగురుమంటోంది ఏం జరుగుతోందో వూహించే లోగానే అంతా అయిపోయింది అది అంతా కలలాగా తోస్తోంది అతనికి భయంతో వళ్ళంతా చెమటలు పోశాయి

నేలమీద పడి తన్నుకుంటున్న యువకులలో ఒకతను అతి కష్టం మీద లేచాడు ఎడమ భుజానికి గుండు తగిలినట్లుంది నెత్తురుతో బట్టలన్నీ చాలావరకూ తడిచిపోయాయి అతను లేచినప్పుడు, వేలాడుతున్న అతని చేతివెంట, నెత్తురు సన్నటి ధారగా కారుతోంది నిలబడటానికి అతను ఎంతో ప్రయత్నం చేస్తున్నాడు గభాలున వెళ్ళి అతన్ని పడిపోకుండా పట్టుకోవాలనే వూహ క్షణాల్లో బలపడింది ప్రకాశంలో ఆ యువకుడి బాధ తన బాధగా హృదయం మూలుగుతోంది కాని తననెవరో వాటేసుకున్నట్టు, తన కాళ్ళు కదలటానికి వీల్లేకుండా భూమిలోకి దిగబడి పోయినట్లు అలాగే వుండిపోయాడు మిగిలినవాళ్ళందరి లాగానే అతను కూడా బొమ్మలాగా నిలబడిపోయి చూస్తున్నాడు ఏమాత్రం వూహించని సంఘటనలు అతన్ని స్థాణువుగా చేశాయి

ఆ యువకుడు అతి కష్టం మీద రెండడుగులు ముందుకు వేశాడు అప్పటివరకూ ఎడం చేతిని గట్టిగా పట్టుకొని వున్న అతని కుడిచేయి గాలిలోకి లేచింది బలవంతంగా నోరు తెరిచాడు తీక్షణమైన సూర్యకిరణాల్లో, అతని చేతికంటిన పచ్చి నెత్తురు స్వచ్ఛంగా మెరుస్తోంది నెత్తురుతో తడిచిన కుడిచేతి చూపుడు వేలును తెల్లదొర లిద్దరివైపు చూపిస్తూ, ''ఈ తెల్ల పందుల కింద బానిస బతుకులు బతుకుతూ, దేశాన్ని అప్పజెప్పి, ఆత్మగౌరవాన్ని తాకట్టు పెట్టుకొని, చీమూ, నెత్తురూ లేని బతుకులు బతుకుతున్నారు మీరంతా '' అతని కళ్ళు అక్కడున్న అందరి పోలీసుల్ని తడుముతున్నయ్ ''మీదీ ఒక బతుకేనా ఇంత హీనమైన బతుకు '' అతని మాటలు పూర్తికాలేదు రివాల్వర్ పేలిన శబ్దం, ఆ యువకుడు గుండు దెబ్బకు బిల్లబీటుగా విరుచుకుని

నేలమీద పడ్డ శబ్దం ఒకదానివెంట ఒకటిగా వినపడ్డాయి

పీసీలు, హెచ్‌సీలు, యస్సైలు, సి ఐ అంతా ఇటూ అటూ చూశారు డి యస్పీ చేతిలోని రివాల్వర్ లోంచి సన్నటి పొగ కనపడీ కనపడకుండా వస్తోంది దొరవైపు క్షణకాలం చూశాక వాళ్ళందరి చూపులూ పడిపోయిన యువకుడి వైపు తిరిగాయి రివాల్వరు గుండు తలలోంచి దూసుకుపోయింది మృత్యువుతో పోరాడుతున్నట్టు, అతని చేయి గాలిలో, క్షణంలో సగంసేపు అటూ ఇటూ వూగింది నెమ్మదిగా వాలిపోయింది ఆ దారుణమైన దృశ్యం అక్కడున్న చాలామంది హృదయాల్ని చిత్రహింసలు చేసింది ప్రకాశంకు తెలియకుండానే నీరు నిండింది కళ్ళ నిండా పిడికిళ్ళు బిగించి పళ్ళు కొరుక్కున్నాడు సూర్యుడు మబ్బుల చాటుకు వెళ్ళిపోయాడు

నేలమీద పడివున్న యువకులు కొంతమంది ఇంకా తన్నుకులాడుతున్నారు నిముషాల్లో సంభవించిన ఆ భీభత్స వాతావరణం నుండి ఇంకా చాలామంది తేరుకోలేదు నిముషాలు కొన్ని నిశ్శబ్దాన్ని వెంటబెట్టుకు పోయాయి

తెల్ల డి యస్పీ, సి ఐతో ఏదో చెప్పి, తెల్ల తహశీల్దారుతో కలిసి, లోపలికెళ్ళటానికి వెనక్కు తిరిగాడు సిబ్బంది అంతా పడిపోయి తన్నుకులాడుతున్న యువకుల-వైపే చూస్తున్నారు హఠాత్తుగా రివాల్వర్ పేలిన మోతలు వినబడి వులిక్కిపడి ఇటు చూశారు ఒక కుర్ర సబ్ ఇనస్పెక్టరు చేతిలోని రివాల్వర్ పొగలు కక్కుతోంది తాలూకా ఆఫీసు మెట్ల మీద తెల్ల డి యస్పీ, తెల్ల తహశీల్దారు పడిపోయి వున్నారు రివాల్వర్ పట్టుకొన్న కుర్ర యస్సై అలాగే బొమ్మలా నిలబడిపోయి వున్నాడు అతని కళ్ళు నెత్తురుకన్నా యెర్రగా వున్నయ్ అతను పళ్ళు కొరుకుతున్న చప్పుడు ఆ భయంకర నిశ్శబ్దంలో స్పష్టంగా వినపడింది అందిరికీ భయం కలిగిస్తున్న అతని ముఖం చెమటతో తడిచిపోయింది ముక్కుపుటాలు అదురుతున్నయ్ అతనికి దగ్గరగా వున్నవాళ్ళు భయపడ్డట్టు ఒక అడుగు వెనక్కు వేశారు మెట్లమీద పడిపోయిన డి యస్పీ చేతిలోని రివాల్వర్ అతని నెత్తుటిలోనే తడుస్తోంది వూహించని సంఘటనల పరంపరతో మొద్దుబారిన మెదడుతో ఏం జరిగిందో తెలుసుకొనేసరికి ఒక నిముషం పట్టింది ప్రకాశంకు ఆ యస్సై తన చేతిలోని రివాల్వర్‌ను అలాగే జారవిడిచాడు వెనక్కు తిరిగి చనిపోయిన ఆ యువకుడి దగ్గరకు వెళ్ళి, మోకాళ్ళ మీద కూర్చుని అతన్నే చూస్తూ వుండిపోయాడు ఒకదాని తరువాత ఒకటిగా జరుగుతున్న సంఘటనలు అక్కడున్న చాలామందికి భయాన్ని కలిగిస్తున్నాయి

అంతవరకూ మబ్బుల చాటున వున్న సూర్యుడు అప్పుడే బయటకు వచ్చాడు ఎవ్వరూ గట్టిగా గాలి పీల్చటం లేదు అలాటి నిశ్శబ్ద భయంకరమైన వాతావరణంలో వెనక నిలబడి వున్న సి ఐ గొంతు పిరికిగా వినపడింది అంతా ఆయనవైపు తిరిగారు అందరి దగ్గర వున్న ఆయుధాలు తీసుకొని లోపల పెట్టించాడు ఆ సి ఐ తన రివాల్వర్‌ను, తెల్ల డి యస్పీనీ, తహశీల్‌దారును కాల్చిన కుర్ర యస్సై వైపు గురిపెట్టాడు ఒక యస్సైని స్టేషన్‌లో కెళ్ళి అరదండాలు తెమ్మన్నాడు. అంతా బొమ్మల్లా నిలబడి వున్నారు ఆ కుర్ర యస్సైకి అరదండాలు తగిలించి లోపలకు తీసుకెళ్ళారు ఆ సబ్ ఇనస్పెక్టరు ఎటువంటి ప్రతిఘటనా చూపలేదు. అతని ముఖంలో ఏదో ఆనందం తాండవిస్తోంది తూటాల దెబ్బలు తగిలి నేలమీద పడిపోయిన యువకులు మూలుగుతున్నారు బాధతో

అప్పటికి మధ్యాహ్నం రెండుగంటలు దాటింది దెబ్బలు తగిలిన వాళ్ళను ఆసుపత్రికి

పంపించారు పోలీసు ఎస్కార్టుతో చనిపోయిన వాళ్ళను లాగేశారు పక్కకు

టౌను వాతావరణ మంతా వేడెక్కి వుంది కొంతమందీ పీసీలనూ, యస్సైలనూ టౌనులోని కొన్ని ముఖ్యమైన కూడళ్ళలో బందోబస్తు వేశారు జిల్లా హెడ్క్వార్టరు నుండి ఆర్మడ్ రిజర్వ్ పార్టీని( ఏ ఆర్ పార్టీ) పంపమని రేడియో మెసేజ్ ఇచ్చారు కొంతమందిని స్టేషన్లో వుండమన్నారు ప్రకాశం తన బెడ్డింగు మీద కూర్చుని జరిగిపోయిన సంఘటనలను నెమరువేసుకుంటున్నాడు 'అసలివన్నీ జరిగాయా, కలా?' అనే సందిగ్ధావస్థలో చాలాసేపు వున్నాడు అతనికింకా దడ దగ్గలేదు

చాలాసేపటి తరువాత ఆకలవుతున్నట్టు అనిపించింది టైము మధ్యాహ్నం మూడుగంటలు దాటింది జేబులోని రూపాయి బిళ్ళకోసం తడిమాడు కానీ కనిపించలేదు జేబులన్నీ జాగ్రత్తగా వెతికాడు 'ఎక్కడో పడిపోయి వుంటుంది ఆ అడావిడిలో' అనుకున్నాడు 'వున్నా, ఇప్పుడెక్కడ టౌనులోకి పోతాం వంటరిగా?' అనుకున్నాడు మళ్ళీ 'ఇక ఇక్కడ ఎన్ని రోజులుండా ల్సొస్తుందో? ఇంత గొడవ జరుగుతుందని వూహించలేదు' అనుకున్నాడు సాయంత్రం అయిదుగంటలకల్లా రెండు సెక్షన్ల ఏ ఆర్ వచ్చింది జిల్లా హెడ్క్వార్టర్ నుండి ఆరు గంటలకు ఏ స్టేషనువాళ్ళను ఆ స్టేషన్లకు వెంటనే ఏమాత్రం ఆలశ్యం లేకుండా వెళ్ళిపోవాలని ఆర్డర్లు జారీచేశారు ఒంటరిగా కాకుండా అంతా ఒక్కటిగా బయలుదేరి వచ్చి బస్సు లెక్కారు అందరినీ అదోరకమయిన భయం ఆవహించింది

బస్సులో ప్రయాణం చేస్తూ ఆలోచించాడు 'ఈ పోలీసు బతుకులు ఇట్టాగుండటానికి కారణం ఈ తెల్లోళ్ళు ఈ రోజు జరిగిన ఈ వూరేగింపుని చూచిన తరువాత తమ వూహ నిజమేనని ధృవపడింది వూరేగింపులోని వాళ్ళంతా ఇంగ్లీషువాళ్ళు ఈదేశాన్ని వదిలిపెట్టి పోవాలనే కేకలేశారు ఇంగ్లీషువాళ్ళ మూలంగా అందరూ బాధపడుతున్నట్టు నిర్ణయించుకున్నాడు ధృఢంగా తను కూడా ఆ వూరేగింపులో చేరి వాళ్ళతో కలిసి కేక లెయ్యాలన్నంత ఉద్రేకం కలిగింది కానీ తమాయించుకున్నాడు ఈ దేశంలోని ప్రజలందరి బాగుకోసం తెల్లవాళ్ళు వెళ్ళిపోవాలని వాళ్ళు వూరేగింపు జరుపుతుంటే, మరి ఈ పోలీసులు వాళ్ళనెందుకు అడ్డగిస్తున్నారో అర్థం కాలేదు ఈ పోలీసులు కూడా ఈ దేశపు వాళ్ళేగా ఈళ్ళు కూడా అనేక బాధలు పడుతున్నారుగా మరి ఇంతమంది క్షేమంకోరి వాళ్ళు అట్లా వూరేగింపు జరుపుతుంటే దానిని బలపరచకపోగా ఆ తెల్లోడిమాట విని వాళ్ళని పిట్టల్లా కాల్చారు ఇదేంటి? ఇందులో ఏదో తిరకాసుంది' అనుకున్నాడు ప్రకాశం చీకటి పడిపోయింది బాగా అప్పటికే

బస్సు వేగంగా పోతోంది రోడ్డు కిరువైపులావున్న పొదలపైన మిణుగురులు ఎగురు తున్నయ్ తిరిగి ఆలోచనలు ముసురుకున్నయ్ రక్తపు మడుగులో తన్నుకుంటున్న యువకులు అతని కళ్ళ ముందు కదిలాడారు ప్రాణాల్ని కూడా లెఖ్ఖచెయ్యకుండా వాళ్ళుచేస్తున్న త్యాగాలు ఎంత గొప్పవో వూహించటానికి ప్రయత్నం చేశాడు 'భగత్ సింగ్‌కీ జై' అంటూ వాళ్ళువేసిన కేకలు చెవుల్లో ఇంకా గింగురుమంటున్నాయి తుపాకులు పేలగానే, అప్పటివరకూ ఎక్కడలేని హడావిడి చేసిన తెల్ల టోపీలవాళ్ళు కాలిసత్తువ చూపించటం, భగత్‌సింగు బ్యాడ్జీలు పెట్టుకున్న యువకులూ, కొంతమంది వృద్ధులు కూడా అట్లాగే నిలబడి నినాదాలు ఇవ్వటం ఇంకా కళ్ళముందు కనపడుతూనే వుంది 'తెల్ల డి యస్పీని, తెల్ల తహశీల్దారుని కాల్చిన యస్సైని ఇప్పుడేం చేస్తున్నారో?' ఆ యస్సై చేసిన పని ఎంతో గొప్ప పనిగా తోచింది ప్రకాశానికి

'అంతమంది జనం, ఇంతమంది పోలీసులు ఆ ఇద్దరు తెల్లవాళ్ళకు భయపడుతున్నారంటే

అసలేందిది?'' అనుకున్నాడు

ఆ రాత్రి భోంచేస్తూ జరిగిన విషయమంతా పూసగుచ్చినట్టు భార్యకూ, తల్లికీ చెప్పాడు 'ఆ అడావిడిలో నాజేబులోని రూపాయి బిళ్ళ యాడో పోయిందే' అన్నాడు

ఆ రాత్రి నిద్దురపోయిందాకా ఆ విషయమే ఆలోచిస్తూ వుండిపోయాడు మర్రోజు ఉదయం స్టేషనుకు వెళ్ళినప్పుడు అంతా ఆ విషయమే ముచ్చటించు కుంటున్నారు

''ఆ యువకుల్లా ప్రాణాల్ని కూడా లెఖ్ఖచెయ్యని వాడే నిజమైన దేశభక్తుడు'' అన్నాడు గోపాలం అతను మాట్లాడుతుంటే మిగతా వాళ్ళు వింటున్నారు

''ఆ తెల్లటోపీల వాళ్ళు తీరా కాల్పుల సమయానికి ఎటుపోయారో అర్థం కాలేదు'' అన్నాడు డేవిడ్

''అది సరేలేకానీ, భగత్‌సింగ్ అంటే ఎవరు?'' అడిగాడు ప్రకాశం

''భగత్‌సింగంటే ఒక విప్లవకారుడు గాంధీయేమో తెల్లవాళ్ళని అహింసా సిద్ధాంతం ద్వారా ఈదేశం నుండి వెళ్ళగొట్టాలనుకుంటున్నాడు ఈ భగత్‌సింగ్ అలాకాకుండా సాయుధ పోరాటం ద్వారా ఈ తెల్లవాళ్ళను మన గడ్డమీద నుండి పారద్రోలాలని, తరువాత సమ సమాజాన్ని స్థాపించాలనే సిద్ధాంతాన్ని లేవదీశాడు కాని ఆయన్ని ఇంగ్లీషువాళ్ళు ఉరితీసి చంపేశారు ఆయన చెప్పిన సాయుధ పోరట విధానం మీదా, సిద్ధాంతం మీదా నమ్మకమున్న వాళ్ళంతా అదే పద్ధతిలో తెల్లవాళ్ళను ఎదుర్కోవాలంటున్నారు నిన్న కాల్పుల్లో చనిపోయినట్టాంటి యువకులు, ఈ దేశంలో ఎంతో మంది తమ ప్రాణాల్ని తృణప్రాయంగా దేశస్వాతంత్ర్యం కోసం సమర్పిస్తున్నారు భగత్‌సింగే గనక బతికివుంటే, ఈ గాంధీ, వీళ్ళ అహింసా సిద్ధాంతం ఏమయ్యేదో!?'' అన్నాడు గోపాలం

''అహింసా సిద్ధాంత మంటే ఏంది?'' అన్నాడు ప్రకాశం ఆదుర్దాగా

''గాడిదగుడ్డు మనకెందు కియ్యన్నీ పోదాం పదండి'' అన్నాడు డేవిడ్ నవ్వుతూ ఆ మాటకు మిగతావాళ్ళుకూడా నవ్వారు

''అహింసా సిద్ధాంతమంటే ఎవ్వరినీ హింసించకుండా, బాధపెట్టకుండా తమకి కావలసినది సాధించు కోవటం ఇప్పుడు మనల్ని బ్రిటిష్ వాళ్ళు పరిపాలిస్తున్నారు కదా వాళ్ళు మనల్ని ఎన్ని బాధలు పెడుతున్నాసరే, వాళ్ళని తిట్టకుండా, కొట్టకుండా మంచిమాటల్తో వాళ్ళ మనస్సులు మార్చి, మనదేశంనుండి వాళ్ళని వెళ్ళిపొమ్మనటం అన్నమాట అంటే మీ బైబిల్లో ఏసుక్రీస్తు బోధనలున్నాయ్ చూడు, 'ఎవరన్నా నీ చెంపమీద కొడితే, ఆ కొట్టినవాళ్ళని ఏమీ అనకుండా, రెండో చెంప కూడా చూపించటం' అన్నమాట అప్పుడు-పాపం, ఆ కొట్టేవాడికి జాలేసి, కొట్టకుండా పోతాడని వూహ ఇక సాయుధ పోరాటం అంటే ఆయుధాలు తీసుకొని తెల్లవాళ్ళ మీద యుద్ధం చేస్తూ, వాళ్ళ నిక్కడనుండి తరిమెయ్యటం అన్నమాట భగత్‌సింగూ అతని అనుచరులూ ఈ విధానం అనుసరించారు దేశంలోని అరవైశాతం పైచిలుకు ప్రజలు ఈ సిద్ధాంతానికి మద్దతు నిస్తున్నారు కాని అంతలో అతన్ని వురితీశారు'' అన్నాడు గోపాలం

ప్రకాశం ఆలోచించాడు ఆ విషయాన్ని గురించి తర్వాత కూడా చాలా రోజులపాటు ఆలోచించాడు అలా కాలం దొర్లిపోతోంది

కాలచక్రం తిరిగేకొందీ ఈ విషయాన్ని మర్చిపోయారు మామూలు గానూగెద్దు బ్రతుకుల్లో కూరుకుపోయారు అంతా

రోజులు గడిచేకొొందీ గోపాలంతో పరిచయం స్నేహంగా మారింది వాళ్ళిద్దరూ ఎన్నో విషయాలు మాట్లాడుకొనేవారు 'గురవయ్య లాగానే, గోపాలం కూడా స్నేహానికి తగిన వ్యక్తి' అనుకున్నాడు ప్రకాశం గోపాలం దగ్గర వున్న పుస్తకాలు తెచ్చుకొని చదువుతున్నాడు వాటిల్లో చాలావరకు నాస్తికత్వం గురించి రాసినయ్యే ఈ దేవుడూ, దెయ్యాలు, అన్నీ వట్టివేయ్యనని చెప్పేవే అవి మొదట్లో అవి చదవబుద్ధి అయ్యేవికావు గోపాలం తరచుగా నాస్తికత్వం గురించి మాట్లాడేవాడు జీవితాన్ని గురించిన అనేక విషయాలు ప్రకాశానికి గజిబిజిగా కనిపించటం మొదలెట్టాయి

ఇక ఉద్యోగ విషయానికివస్తే- ఏగంట కాగంట, ఏరోజు కారోజు హృదయాన్ని పిండివేసే అవమానాల్తో, భరించలేని శారీరక కష్టంతో సాగిపోతోంది జీవితంలో ఎదురయ్యే సంఘటనలకు, సమస్యలకు, అవమానాలకు పరిష్కారంగా పరలోకాన్ని గురించిన ఆలోచనలు పెరుగుతున్నయ్ ప్రకాశంలో దానితో బైబిలు నిత్యపారాయణమయ్యింది కాని ఆలోచించటానికి అలవాటు పడుతున్న అతని బుర్ర, బైబిలులోని విషయాల్ని గుడ్డిగా నమ్మలేకపోతోంది ఇంతకు ముందులాగా ఇటు ఈ ఉద్యోగంలో నుండి బయటపడితే, ఏదన్నా బ్రతుకుతెరువు చూసుకోవటానికి వీలవుతుందేమోననే ఆలోచనలు, ఉపాయాలు కూడా బుర్ర ఆలోచిస్తోంది అతని దృష్టిలో చిల్లరకొట్టు ఒక మంచి ఉపాధిగా తోచింది అతని ఆలోచనల్లో క్రమంగా వస్తున్న మార్పు అతనికి తెలుస్తూనే వుంది

ఎన్ని రోజులూ, సంవత్సరాలు గడిచినా ఈ వృత్తి తన ప్రవృత్తికి ఏమాత్రం అతకదని తేలిపోయింది డిపార్టుమెంటులో క్రిందిస్థాయి ఉద్యోగులెవ్వరిలోనూ తృప్తి, సంతోషం లేదని తెలిసిపోయింది స్టాఫంతా రైటర్నీ, సార్జెన్నీ, యస్పైనీ తిడతారు చాటుగా కాని పైకిమాత్రం నవ్వుతూ నమస్కారాలు చేస్తారు పక్కకుతిరిగి పరమచండాలపు తిట్లు తిడతారు రైటరుకు సార్జెన్ అన్నా, యస్సై అన్నా కోపం యస్సైకి సర్కిల్ ఇనస్పెక్టరు అంటే మంట సర్కిల్ ఇనస్పెక్టరుకు డి యస్పీని చూస్తే హడల్, ద్వేషం అలా పై వాళ్ళందరికీ కిందవాళ్ళంటే చులకన డిపార్టుమెంట్‌లో సంతోషంగా వుండేవాళ్ళెవరన్నా వుంటే వేళ్ళమీద లెఖ్ఖపెట్టవచ్చు అదయినా కల్తీ సంతోషంగానే అతనికి తోచింది 'ఈ డిపార్టుమెంటేనా, లేకపోతే అన్ని డిపార్టుమెంటులూ ఇంతేనా?' అనుకునేవాడు అప్పుడప్పుడూ

అలాగే భారంగా రోజులు దొర్లిస్తున్నాడు భార్య ప్రసవించే రోజులు దగ్గరపడ్డాయి జీతం డబ్బులూ, టీ ఏ లూ చాలటం లేదు వృధాగా ఒక్క దమ్మిడీకూడా ఖర్చుచేయటంలేదు కానీ డబ్బులు మిగలటంలేదు భార్యమందులకు ఎక్కువ ఖర్చు అవుతోంది 'ఈ రోజు స్టేషన్లో ఏమన్నా డబ్బులు వస్తే బాగుండు' అనుకుంటున్నాడు ఎప్పటికప్పుడు పెరుగుతున్న ఖర్చుకు కారణాలు ఆలోచిస్తున్నాడు పెద్ద చెప్పుకోతగ్గ కారణాలేవీ కనపడటంలేదు భార్యకు మందులు, కొద్దిపాటి మెరుగైన తిండి అంతే వీటికే జీతం డబ్బులు చాలటం లేదు మొదటి కానుపు కనుక జాగ్రత్తగా ఉండాలంది డాక్టరమ్మ ఏదన్నా అవాంతరమొస్తే ఏం చెయ్యాలో అర్ధం కావటం లేదు 'అంతా దేవుడిదే భారం' అనుకుంటున్నాడు తరచుగా 'ఇప్పుడే ఇంత ఇబ్బందిగా వుంది భార్య ప్రసవిస్తే అప్పుడు ఇంక ఎంత ఖర్చు అవుతుందో' అనుకునేవాడు భయంగా

ఆ రోజు ఆదివారం ఉదయం ఏడుగంటలకు రోల్‌కాల్‌కు వెళ్ళాడు అతనికీ, డేవిడ్‌కు ఏదో బందోబస్తు డ్యూటీ వేశాడు రైటరు చేతిలో డబ్బులు లేవు ఏం చెయ్యాలో తోచలేదు

రైటరు దగ్గరకెళ్ళి చిన్నగా నసిగాడు "సార్! డబ్బులు ఏమీ లేవు అయినా బందోబస్తులన్నిటికీ వరుసగా నేనే వెళుతున్నాను ఇప్పుడూ నా నెంబరే వేశారు ఇంకెవరినన్నా వెయ్యండి సార్" అన్నాడు అతని మాటల్లో వినయం కొట్టొచ్చినట్టు కనపడింది

రైటరు ప్రకాశంవైపు కొరకొరా చూశాడు "నా యిష్టం వచ్చిన వాళ్ళకు వేస్తాను వెళితే వెళ్ళు లేకపోతే సిక్కవ్వు" అన్నాడు ప్రకాశం కంగు తిన్నట్టు అవాక్కయిపోయాడు కోపంతో కనుబొమలు ముడిపడ్డాయి

"ఏంది సార్ అంత కోప్పడతారు? ఉన్న విషయం చెప్పుకుంటే మీరంత కోప్పడితే ఎట్లాసార్" అన్నాడు కోపాన్ని అతి కష్టంమీద దిగమింగుకుంటూ

"నోరు మూసుకొనిపో నీతో మాట్లాడాల్సిన పనిలేదు" అన్నాడు రైటరు తననలా పురుగులాగా విదిలించి వేసినందుకు కోపం కట్టలు తెంచుకుంది ప్రకాశంకు డ్యూటీ వేసినందుకు కూడా అతను అంత బాధ పడలేదు పిడికిళ్ళు బిగబట్టాడు క్షణంలో కళ్ళు ఎర్రబడ్డాయి

తమాయించుకోవటానికి ప్రయత్నం చేస్తూ, "రైటరుగారూ, కాస్త మర్యాదగా మాట్లాడండి అధికారముందని నీ యిష్టమొచ్చినట్లు మాట్లాడొద్దు" అన్నాడు ఉద్రేకం నిండిన స్వరంతో

అతని ఆకారం చూస్తే రైటరుకు నోరు పెగల్లేదు చటుక్కున లేచి యస్సై రూంలో కెళ్ళి ఏదో చెప్పాడు అప్పటివరకూ వాళ్ళిద్దరి సంభాషణ వింటూ నిలబడ్డ స్టాపు అంతా ప్రకాశాన్ని యస్సై లోపలకు పిలవక ముందే టేబిలుమీదున్న పాస్‌పోర్టు తీసుకొని వెంటనే అక్కడినుండి వెళ్ళిపొమ్మన్నారు అంతలో రైటరు యస్సై రూంలోనుండి బయటకొచ్చి ప్రకాశాన్ని కేకేశాడు ప్రకాశం యస్సై గదిలోకి వెళ్ళాడు చెమటతో అతని చొక్కా తడిచిపోయింది ఆ కాసేపటికే ఏదో రాసుకుంటున్నట్లు నటిస్తున్న యస్సై ప్రకాశంవైపు సీరియస్‌గా చూశాడు

"ఏం ప్రొబేషన్ పూర్తయిందనుకుంటున్నావా? ఒక్క దెబ్బతో ఇంటికి పోతావ్ జాగ్రత్త" అన్నాడు యస్సై ఆ మాటకు ప్రకాశం కోపంతో వూగిపోయాడు పళ్ళు గిట్టకరిచాడు

"అదికాదు సార్, నేను " ఏదో చెప్పబోయాడు ప్రకాశం

"ఇంకనోర్ముయ్ నిన్నకాకమొన్న డిపార్టుమెంటులోకి వచ్చావ్ నీయిష్టమొచ్చినట్లు ప్రవర్తిస్తే వూరుకునేది లేదు ఇది డిసిప్లెన్ ఫోర్సు నీయిష్ట ప్రకారం వుండాలంటే నౌకరీ మానుకొని ఇంటికిపో ఇదే లాస్ట్ వార్నింగ్ గెటౌవుట్" అన్నాడు ప్రకాశానికి తల గిర్రున తిరిగిపోయింది గది అంతా చీకటిగా కనపడుతోంది నాలుక పిడుచుకట్టుకు పోయింది సెల్యూట్ చేసి బయటకొచ్చాడు ఎలాగో గబగబా ఇంటికెళ్ళాడు జరిగిన సంఘటన కళ్ళముందు కదులుతోంది వెళ్ళి మంచంమీద కూర్చున్నాడు ఉద్రేకంతో రక్తం సలసలా కాగుతోంది బాధతో కళ్ళు మూసుకున్నాడు

నిన్న జరిగిన విషయం గుర్తుకొచ్చింది రైటరు పిలిచి, 'ఒక సవాసేరు శెనగనూనె బజారుకుపోయి పోయించుకొచ్చి ఇంట్లో ఇవ్వు' అన్నాడు తనకు వంట్లో బాగోక అదేమాట రైటరుతో అన్నాడు రైటరు తన వంక కొరకొరా చూశాడు అది జరిగిన కొద్దిసేపటికే ఆ విషయం మరిచిపోయాడు తను కానీ రైటరు ఈ విధంగా బందోబస్తు డ్యూటీవేసి తన అధికారం ఎలాంటిదో గుర్తు చేస్తాడనుకోలేదు గట్టిగా నిట్టూర్చాడు

డేవిడ్ కనపడ్డాడు జరిగిన విషయం అతనితో చెప్పాడు డేవిడ్ చిన్నగా నవ్వాడు ఆ నవ్వులో బాధ మిళితమై వుంది "అంతే ప్రకాశం వీళ్ళు మనల్ని పురుగులకన్నా హీనంగా లెక్క కడతారు

మన పాలేరు బతుకుల్లో మన ఆసామిగాడొక్కడే మనకు మొగుడు ఇక్కడ ఈ నెత్తిమీద జుట్టులేని నాకొడుకులంతా మన మీదెక్కి స్వారీ చేసేవాళ్ళే వీళ్ళంతా ఒక ఎత్తు మనమీద చాడీలు చెప్పేవాళ్ళు ఒక ఎత్తు'' అన్నాడు

'ఏమాత్రం ఆత్మాభిమానం కనపరచినా వీళ్ళు దొమ్మపాగురు అంటున్నారే? డ్యూటీల్ని గురించి కనీసం నోరెత్తికూడా మాట్లాడటానికి వీలులేని గతి పట్టిందే మనకి అసలు వీళ్ళకి పనులు చేసిపెట్టాల్సిన అవసరం నాకేంటి? వీళ్ళ మోచేతి నీళ్ళు తాగేవాళ్ళెవరూ లేరిక్కడ కానీ అడ్డమయిన చాకిరీ చేస్తున్నామంటే ఈ ఉద్యోగాలకి ఒక పద్ధతీ, ఒక పాడూ లేకపోవటమే ఇదన్యాయం అని అడిగితే పనిష్మెంటా?' అలా సాగుతున్న ఆలోచనలు ఇంగ్లీషువాళ్ళ మీదకు మళ్ళాయి 'వాళ్ళని ఈ దేశం నుండి ఎప్పుడు వెళ్ళగొడతారోగాని, అప్పుడు ' ఆలోచనలు గజిబిజిగా సాగాయి ఈ గొడవలకూ ఇంగ్లీషు వాళ్ళకు సంబంధం ఏమిటో అర్థం కాలేదు గట్టిగా నిట్టూర్చాడు చివరకు ఒక నిర్ణయానికి వచ్చినట్టు, 'ఏదేమైనా, ఎన్ని కష్టాలయినా సహిస్తాను కాని, ఇక ఆ రైటరుగాడికి మాత్రం చచ్చినా ఒక్క పనికూడా చేసిపెట్టను' అనుకున్నాడు ఆ ఉద్రేకంలో

బందోబస్తు కెళ్ళి మరుసటిరోజు సాయంత్రం తిరిగొచ్చారు స్టేషనుకెళ్ళి డ్యూటీ నుండి తిరిగొచ్చిన పాస్‌పోర్టు కాగితం రైటరు బల్ల మీద పడేశాడు రైటరుకు సెల్యూట్ చేయ్యాలంటే చెయ్యి పైకి లేవలేదు అతని ముఖం చూడటానికే మనస్కరించలేదు

ప్రకాశాన్ని చూచి నవ్వాడు రైటరు ఆ నవ్వు ప్రకాశాన్ని ఎగతాళి చేసున్నట్లు 'చూశావా నా దెబ్బ' అన్నట్టు వుంది ఆ నవ్వు చూడలేక తల దించుకొన్నాడు ప్రకాశం, డేవిడ్ ఇద్దరూ ఇంటికెళ్ళిపోయారు రాత్రి అన్నం తింటుంటే కబురు చేశాడు రైటరు, సుబ్బారెడ్డితో నైటు బీటుకు వెళ్ళాలి రమ్మని తింటున్న తిండి వదిలేసి వెళ్ళి రైటర్ని తన్నాలన్నంత కోపం వచ్చింది కాని తమాయించుకున్నాడు ఆ రాత్రి సుబ్బారెడ్డితో నైటు బీటు తిరుగుతూ అన్నాడు

''ఇక్కడ ఈ యస్సై, రైటర్ల దగ్గర ఉద్యోగం కష్టంగా వుంది రిక్వెస్టు ట్రాన్స్‌ఫర్ చేయించుకోవాలి యస్పీ దొరగారు మంచోడేనంట ఈ గాడిద చాకిరీ ఎక్కడ చేస్తాంసార్ ఆ రైటరుకు బజారుకుపోయి నూనె తెచ్చివ్వలేదని, గుక్క తిప్పుకోకుండా డ్యూటీలు వేస్తుంటే ఏం చేస్తాం సార్ పీసీల మంచీచెడూ చూడాల్సిన యస్సై కూడా రైటర్నీ, సార్జెన్‌నీ సపోర్టుచేస్తూ న్యాయం, ధర్మం లేకుండా, అధికారం వుంది గదాని ప్రవర్తిస్తుంటే ఎందాకని '' అన్నాడు అతని మాటల్లో వేదన కనపడింది ఆ మాటలకు సుబ్బారెడ్డి చిన్నగా నవ్వాడు

''చిన్నగా మాట్లాడు, ఎవరన్నా వింటారు'' అన్నాడు

''విననియ్యండి సార్ ఇంతకన్నా ఇంకేం చేస్తారు'' అన్నాడు కోపంగా ప్రకాశం

''ఏం చేస్తారనికాదు ప్రకాశం తలుచుకుంటే ఏమైనా చేస్తారు ఎనకావుందనూ ఆలోచించకుండా ఉద్యోగంకూడా వూడబీకించ గలరు వాళ్ళు దుర్మార్గులు దేనికైనా తెగిస్తారు కాదంటావా?'' అన్నాడు అవునన్నట్లు నిట్టూర్చాడు ప్రకాశం

''మనం చెయ్యగలిగింది ఏమీలేదు తలొంచుకొని గొర్రెల్లా బ్రతకటం రోజులు నెట్టుకు పోవటం ఆత్మగౌరవం, అభిమానం, రోషం- ఇట్లాంటివీయన్నీ పక్కన పెట్టుకొని బతకాల్సిందే కాని, అలాటి విషయాలన్నీ ఆలోచిస్తుంటే మనమిక ఉద్యోగం చెయ్యలేం'' అని ప్రకాశంవైపు చూచి, ''ఉద్యోగం మీద ఆశలేనోడూ, ఇంటికిపోయినాతిండికి దిగుల్లేనోడూ, ఏదన్నా చేయ

గలడేమోకాని, మన బోటోళ్ళం ఏమీ చెయ్యలేం ప్రకాశం '' అన్నాడు

ప్రకాశం ఏమీ మాట్లాడలేదు

''రేపు చూడు సార్జెన్, యస్సైలు కూడా పనిగట్టుకొని, కావాలని నీకు పనులు పురమాయిస్తారు ఈ రైటరు ఆళ్ళకు ఎప్పుడో నూరిపోసుంటాడు నువ్వు 'వంట్లో బాగాలేదు సార్, నేను బజారుకు పోలేనని' చెప్పావు కదా! వీడు వాళ్ళతో ఏమంటాడో తెలుసా? 'నీకూ, సార్జెన్లకూ పనులు చెయ్యటానికేనా మేముంది?' అని అన్నావని చెప్తాడు ఆ సార్జెన్‌గాడు పోయి, యస్సైగాడికి ఇంకో చాడీ కల్పించి చెపుతాడు ఇక నీ పని గుల్ల'' అన్నాడు

ఆ మాటలు ప్రకాశానికి భయం కలిగిస్తున్నాయి అతను ఆలోచిస్తున్నాడు కొద్దిసేపు వున్నాక మళ్ళీ, ''నేను రిక్వెస్టు ట్రాన్స్‌ఫర్ పెట్టుకుంటాను సార్ ఇక్కడ లాభం లేదు'' అన్నాడు స్థిర నిర్ణయానికి వచ్చినట్టు

''నీ పిచ్చిగానీ, దూరపు కొండలు నునుపు అన్నట్లు, అన్నిచోట్లా ఇంతే ప్రకాశం ఎక్కడన్నా ఒకళ్ళిద్దరు మంచి ఆఫీసర్లు ఉంటారేమో కానీ అట్లాంటి వాళ్ళను పై ఆఫీసర్లు ఎక్కడా పట్టుమని పదిరోజులు ఉంచరు కదా నేనిట్లాంటి బాధలు అనుభవించాను ఇప్పుడు సుఖపడుతున్నానని కాదు మనస్సు రాయి చేసుకొని జీవచ్ఛావంలా, ఇంత తిండి కోసం, పిల్లలకోసం, బ్రతుకుతున్నా'' అన్నాడు చాలాసేపటి వరకు ఎవరూ ఏమీ మాట్లాడలేదు

''సరే కానీయండి సార్ పైన ఆ పరమాత్ముడే వున్నాడు ఎట్లా జరగాలని వుంటే అట్లా జరిగిద్ది'' అన్నాడు ప్రకాశం చివరకు

మరుసటిరోజు ఉదయం రోల్‌కాల్‌కు హాజరు అవుతున్నప్పుడు, బయట గేటుదగ్గర విశ్వనాథంతో మాట్లాడుతూ సార్జెన్ నిలబడి వున్నాడు సార్జెన్‌ని చూచి ప్రకాశం సెల్యూట్ చేశాడు దూరం నుండే ప్రకాశంవైపు చూచి అదో రకంగా నవ్వాడు సార్జెన్ దగ్గరకు రమ్మనమని తలవూపాడు సార్జెన్ దగ్గరకెళ్ళి నిలబడ్డాడు ప్రకాశం 'ఏంది సార్' అంటూ నవ్వుతూ ఎంతో ప్రయత్నం మీద అలా నవ్వగలిగేడు

''ఏంది ప్రకాశం అసలు కనపట్టం లేదు ఎట్లాగయినా పెద్దవాడివయిపోయావులే'' అన్నాడు సార్జెన్ ఆ మాటలు ఎబ్బెట్టుగా, బెదిరిస్తున్నట్లు వున్నయ్ ఆ మాటలకు ప్రకాశం తలదించుకున్నాడు సార్జెన్ మాటలకు విశ్వనాథం నవ్వాడు అలా అతను నవ్వినప్పుడు పాచిపట్టిన అతని పళ్ళన్నీ అసహ్యంగా కనపడ్డాయి ప్రకాశం తమాయించుకున్నాడు గట్టిగా నిట్టూర్చాడు

''ఎంతయినా మీకన్నా చిన్నోళ్ళమే కదాసార్'' అన్నాడు ప్రకాశం

''ఇంతకు ముందు రాంబాబు అని ఒకడుండేవాడు వాడు కూడా ప్రొబేషన్ అయ్యిందాకా బాగానే వున్నాడు తరువాత తరువాత కాస్త తోక జాడించటం మొదలు పెట్టాడు ఒకసారి రైటరేదో పనిచెపితే ఎందుకు చెయ్యాలన్నాడంట తరువాత వారం రోజులకే ట్రాన్స్‌ఫర్ ఆర్డరు వచ్చింది ఇప్పుడు పనిష్మెంటు స్టేషనులో వున్నాడు'' అని నవ్వాడు సార్జెన్

ఆ మాటలకు ప్రకాశం ముఖం చిన్న బుచ్చుకున్నాడు ఏం మాట్లాడాలో తోచలేదు

''కుర్రోడు మంచోడే సార్ ఏమన్నా పొరబాటుంటే సర్దుకుంటాడులే సార్ ఇతన్ని ఆ డేవిడ్, గోపాలం, రెడ్డీవాళ్లు చెడగొడుతున్నారు సార్'' అన్నాడు విశ్వనాథం, ప్రకాశం వైపు చూస్తూ ప్రకాశం ముఖం జేవురించింది ఏదో అనబోయాడు ఇంతలో యస్సై వస్తుంటే అంతా లోపలకు వెళ్ళారు ప్రకాశం మనస్సు వికలమైపోయింది బాధతో శరీరమంతా నిస్సత్తువుగా

తయారయ్యింది రోల్‌కాల్ అయిపోయిన తరువాత, గోపాలంతో సార్జెన్ అన్నమాటలు చెప్పాడు ప్రకాశం

అంతా విన్నాక గోపాలం ప్రకాశంతో, ''ఈనా కొడుకుల మాటలు పట్టించుకుంటే తిన్నది కూడా వంట బట్టదు ఈళ్ళేదో పెట్టి పోషిస్తున్నట్టు మాట్లాడతారు అలాటివన్నీ విన్నప్పుడు బాధగా, దిగులుగా వుంటుంది కాని మన సర్వీసులో ఇవన్నీ మామూలే వీటిని వీలయినంత త్వరగా మరిచిపోవటం నేర్చుకోకపోతే మనం చేజేతులా మన జీవితాన్ని బాధామయం చేసుకున్న వాళ్ళమవుతాం అసలే మన బ్రతుకంతా సమస్యలతో, సతమతాలతో నిండి వుంటుంది ఇలాటివి జరిగినప్పుడు ఇంకా మనస్సు కకావికలమై పోతుంది వాటిని గురించి ఆలోచించటం మానుకో'' అన్నాడు

ఆ క్షణంలో అతను చెప్పిన మాటలు నిజమనిపించాయి మనస్సు కొంచెం కుదుటపడింది 'ఎప్పుడూ వుండే ఏడుపే ఇది అయినా ఎప్పటికప్పుడు కొత్తకొత్త పద్ధతులలో మనసుల్ని ఎలా పాడవాలో ఈ నా కొడుకులకు బాగా తెలుసు' అనుకున్నాడు ప్రకాశం

ఇంటికెళ్ళి యూనిఫారం విప్పేసి, లుంగీ కట్టుకుని, మంచం వాల్చుకొని కూర్చున్నాడు

''అయ్యా! ఇయ్యాల యాడకీ పోయే పని లేదా ?'' అడిగింది తల్లి ఆ మాటకు చిన్నగా నవ్వాడు ప్రకాశం

''ఇంతవరకు ఏమీలేదు ఇవ్వాళ కానీ ఎందుకైనా మంచిది అన్నం, కూర పెందలాడే వండండి ఏ డ్యూటీ ఎదురుచూస్తున్నదో'' అని భార్యవైపు తిరిగి యూనిఫారం వుతకమని చెప్పి మంచంమీద పడుకుని ఆలోచించాడు 'తన పాలేరు బ్రతుకులో బాధలున్నయ్ కాని ఆ బాధల్లో, ఆ అమాయకత్వంలో కావలసినంత హాస్యానికీ, ఆనందానికి కూడా చోటుంది ఈ నౌకరీలో ఆ వూసే లేదు' అనుకున్నాడు 'ఈ ఉద్యోగ జీవితం వ్యక్తిగత జీవితాన్ని కూడా ఆక్రమిస్తోంది తమ ప్రయివేటు జీవితంలోకీ తొంగిచూస్తోంది కుటుంబ జీవితంలోని హాస్యాన్నీ, ఆనందాన్నీ, నవ్వులాటలను తన్నుకు పోతోంది ఎంత ఘోరం ' అనుకున్నాడు మళ్ళీ

''ఏంది ఆలోసిత్తన్నావు?'' అంది భార్య వచ్చి మంచంమీద కూర్చుంటూ

''ఏం లేదు మనూరు గుర్తొచ్చింది'' అన్నాడు ఇద్దరూ కొంచెం సేపు స్వంత వూరి ముచ్చట్లు చెప్పుకున్నారు

మాటల్లో ఆమె, ''మా అమ్మని ఈడకి తీసుకురా, నా పురిటప్పుడు వుండొద్దా?'' అంది

''రమ్మని వుత్తరం రాస్తా''

''ఆల్లు రాటానికి ఆల్లకేం తెలుసు ఆల్లకాడ అసలు డబ్బులు కూడా వుండవు నువ్వుపోయి తీసుకురా ఆల్లని'' అంది ఆమె

''సరేలే'' అన్నాడు ప్రకాశం భార్యతో మాట్లాడుతుంటే మనస్సు కొద్దిగా తేలిక పడ్డట్లనిపించింది మాటల మధ్యలో తల్లి, కోడలి కాళ్ళకు నీరొచ్చిందని చెప్పింది

''ఇంకా రెండు మూడు రోజుల్లో జీతాలొత్తాయి గదా, అప్పుడు పోదాంలే ఆసుపత్రికి ఇప్పుడు ఎట్టా వీలయిద్ది అయినా తొందరే మొచ్చిందిలే'' అన్నాడు ఆ రోజు మధ్యాహ్నం భోంచేసి హాయిగా నిద్రపోయాడు తన కొద్దిపాటి సర్వీసులో ఈ రోజే కాస్త నిమ్మళంగా తిండితిని నిద్రపోయిందని గుర్తుచేసుకున్నాడు సాయంత్రం లేచి ముఖం కడుక్కుని యూనిఫారం వేసుకొని రోల్‌కాల్‌కు వెళ్ళాడు నరశింహం వచ్చాడు ఎందుకో అతన్ని చూస్తే వుత్సాహం వచ్చింది వెళ్ళి

పలకరించాడు

''ఏంది అసలు నల్లపూస వయ్యావు?'' అన్నాడు నవ్వుతూ ప్రకాశం

''ఆఁ నీకు తెలియంది ఏముంది ప్రకాశం కుండ వాయిద్యానికి రెస్టు ఎక్కడుంటుంది'' అని నవ్వాడు నరశింహం

ఆ మాటకు ప్రకాశం కూడా నవ్వి, ఉదయం సార్జెన్ అన్నమాటలూ, అంతకుముందు రైటర్‌కీ, తనకూ, శనగనూనె దగ్గర వచ్చిన గొడవ చెప్పి, ''ఈళ్ళ దెబ్బ తప్పించుకోవాలంటే ఏం చేయాలో అర్థం కావటం లేదు'' అన్నాడు ఏదో జవాబు నరశింహం నుండి కోరుతున్నట్లు

ఆ మాటలు విని, ఎటో చూస్తున్నట్లు నిర్లిప్తంగా, ''ఏం చేస్తాం ప్రకాశం ఈళ్ళు మనుషులకు పుడితేకదా మనుషుల్లాగా ప్రవర్తించటానికి ఈళ్ళకు కనీసం పశువుల లక్షణాలు కూడా లేవు'' అన్నాడు కసిగా నరశింహం

ప్రకాశం నవ్వుతూ, రహస్యం చెపుతున్నట్లు ముందుకు వంగి, ''ఏదన్నా అవసరం వచ్చినప్పుడు యస్పైగాడి పెళ్ళాం మనల్ని ఆదుకోదంటావా మనతో వున్న పరిచయంతో ?'' అన్నాడు

ఆ మాటకు నరశింహం ఫక్కున నవ్వాడు ''అట్లాంటి సహాయాలు ఇదేమీ చెయ్యదు, నీ భ్రమ తప్ప నిన్ను గురించి మంచివాడవనీ చెప్పదు, చెడ్డవాడవనీ చెప్పదు నిన్ను గురించి దానికంత ఇంటరెస్టు ఎందుకని యస్పైగాడు దాన్ని తన్నడూ? ఇట్టాంటి యన్నీ మనల్ని వాడుకొనేవే గానీ, సహాయం చేసేవికాదు మనం కాకపోతే ఇంకొకళ్ళు ఇట్టాంటి వాటికి మన మొక్కుళ్ళమేనా? కానిస్టేబుళ్ళ బాధలు విని, సహాయం చేసే తల్లులు నూటికీ, కోటికీ ఎక్కడో ఒకళ్ళుంటారు, పోయిన యస్పైగారి భార్యలాంటోళ్ళు మహాతల్లి నిజంగా దేవత పొద్దున్నే లేచి ఆ అమ్మ కాళ్ళకు దండం పెడితే చాలు, ఇంక ఏ దేవుడికీ మొక్కక్కర్లా ఎంత మంచి మనిసని ఆయన మాత్రం! వచ్చిందాట్లో ఎవురివాటా తీసి వాళ్ళ కిస్తాడు ఏ కానిస్టేబులన్నా స్టేషనొదిలి ఇంటికిపోయేవాడా! ఇద్దరిద్దరే ఆళ్ళు ట్రాన్స్‌ఫరయ్యి పోతుంటే ఏడవని పీసీ వున్నాడా స్టేషన్లో ఆయనసలు నెంబరుపెట్టి ఏనాడూ పిలవడు చక్కగా పేరుతో బిడ్డని పిలిచినట్లు పిలుస్తాడు అట్టాంటోళ్ళ దగ్గర ఉద్యోగం చేయటానికయినా మన కద్రుష్టం వుండాలి ఆల్లింట్లోని ఆవగాయపచ్చళ్ళన్నీ మనస్టాపుకేగా నన్ను ఎంత ఇదిగా చూసుకునేది ఆ మహాతల్లి ఆ తల్లికీ దీనికీ ఎంతతేడా పైగా దీనికన్నా ఆ యమ్మ ఎంతో చిన్నది వయసులో బుద్ధిని బట్టి నలుగురూ గౌరవిస్తారుగానీ హోదాని బట్టి కాదు ఆ విషయం అందిరికీ అర్థం కాదు కాబట్టి అనుభవం మీద చెపుతున్నాను నేను, నువ్వు అట్టాంటి ఆశలు పెట్టుకోమాక దీనిమీద'' అన్నాడు ఆ విషయం గురించి వాళ్ళు చాలాసేపు చర్చించు కున్నారు ''ఇట్టాంటి యన్నీ పట్టించుకోగాక ప్రకాశం'' అన్నాడు నరశింహం చివరగా

రోజులు గడిచేకొందీ ఆ సంఘటన మరిచిపోయాడు ప్రకాశం తప్పని పరిస్థితిలో మళ్ళీ మామూలుగా అధికార్లందరికీ అన్ని పనులూ చేసిపెడితూనే వున్నాడు అంతకు మించి అతనికింకే మార్గం కనపడటం లేదు ఒక రోజు భార్యని డాక్టరమ్మ దగ్గరకు తీసుకెళ్ళి పరీక్ష చేయించాడు డాక్టరమ్మ ఒక ఇంజక్షన్ రాసిచ్చి టౌన్నుండి దాన్ని తెప్పించమంది అది ఆ వూళ్ళో దొరకదు కాబట్టి, అత్యవసరంగా వాడవలసి వస్తే ఉంటుందని తెప్పించమంది తను గార్డు డ్యూటీలో వున్నాడు ఆ రోజుగానీ, మర్రోజుగానీ ఏదన్నా డ్యూటీమీద టౌనుకు ఎవరన్నా వెళుతున్నా

రేమోనని చూశాడు సార్జెన్ రాజారావు ఏదో పనిమీద టౌను కెళ్తున్నాడు ఆశగా వెళ్ళి అడిగాడు ప్రకాశం బ్రతిమలాడుతున్నట్లు ప్రకాశం చెప్పిన పని విని, తెచ్చిపెట్టుకొన్న కోపంతో ఉగ్రుడై పోయాడు సార్జెన్ రాజారావు

''నువ్వు ఎవ్వరితో మాట్లాడుతున్నావో తెలుసా?'' అన్నాడు ఆ మాటకు ప్రకాశం బిత్తరపోయి చూశాడు స్టేషన్లో చాలామంది స్టాపు వున్నారు వాళ్ళకు మొదట విషయం ఏమీ అర్థం కాలేదు

''నువ్వు నాకు పనిచెప్పేంతటి వాడవా ? నీ సర్వెంటు ననుకున్నావా? నీ అంతు చూస్తాను నువ్వేంటి, సార్జెన్ని నేనేంటి నేను నీకు పనులు చేసి పెట్టాలా ?'' అన్నాడు అతను కోపంతో వూగిపోతూ

ప్రకాశానికి ఏం పాలుపోలేదు తను అడిగిన దాన్లో తప్పేమీ కనపడలేదు అతనికి తెచ్చి పెట్టుకొన్న సార్జెన్ కోపాన్ని అర్థం చేసుకోవటానికి కొంత సమయం పట్టింది అతనికి అంతా ఆ సంఘటనని గమనిస్తున్నారు సార్జెన్కి కోపం పెరిగిపోతోంది ప్రకాశం తనని కావాలని అవమానించినట్లు ప్రవర్తిస్తున్నాడు, మాట్లాడుతున్నాడు

''నీ కింద నేను సర్వెంటు ననుకున్నావా'' అన్నాడు మళ్ళీ మొదటికొస్తూ

''అది కాదు సార్ ఇది ముఖ్యమైన ఇంజక్షను ఇక్కడ దొరకదని ఎప్పుడు దీని అవసరమొస్తుందో చెప్పలేమని డాక్టరమ్మగారు చెప్పారు నేను గార్డులో వున్నాను తమరు ఎట్లాగూ టౌను కెళుతున్నారు కదాని చెప్పాను పొరపాటైతే క్షమించండి సార్'' అన్నాడు నీళ్ళు నములుతూ ప్రకాశం

సార్జెన్ ఏదో అనబోతుంటే, గోపాలం వాళ్ళను సర్దే ధోరణిలో, ''అది కాదులే సార్, ఆ అమ్మాయికి ఇది ఫస్ట్ డెలివరీకదా! ఏదైనా ప్రమాదం '' అతని మాటలు పూర్తికాకముందే సార్జెన్ అన్నాడు

''అయితే పోనియ్యి ఛస్తే చావనియ్యి నేను ఇతని సర్వెంటునా?''

వూహించని మాటలకు స్థాణువుగా మారిపోయిన ప్రకాశం వెంటనే తేరుకొని, సార్జెన్ అన్న మాటలకు కోపంతో వూగిపోయాడు ''రాజారావుగారూ '' వెర్రి కేక వేశాడు ఆ కేకకు అంతా అదిరిపోయి చూశారు అతనివైపు సార్జెన్ చేతిలోని చుట్ట జారి కిందపడింది ప్రకాశం ఆకారం సార్జెన్కి భయం కలిగించింది కిందపడ్డ చుట్టముక్కని తీసుకోవటం కూడా మర్చిపోయి రెండడుగులు వెనక్కు వేశాడు పరిస్థితిని గమనించిన గోపాలం వచ్చి ప్రకాశం చెయ్యిపట్టుకొని వెనక్కు లాక్కెళ్ళాడు కోపంతో ప్రకాశం శరీరం వణుకుతోంది సార్జెన్ గబగబా టోపీ తీసుకొని పరుగులాంటి నడకతో బైట కెళ్ళాడు స్టేషన్ అంతా నిశ్శబ్దమై పోయింది

''ప్రకాశం ! ఏమిటంత సీరియస్ అయ్యావ్?'' అన్నాడు విశ్వనాథం అతని మాటల్లో తప్పు నీదేనన్న భావం వినపడింది అతనివైపు కొరకొరా చూశాడు ప్రకాశం

''అతను సీరియస్ అయ్యేదేముంది నీ భార్యని ఛస్తే చచ్చిందిలే అంటే నీకు కోపం రాదా?'' అన్నాడు గోపాలం విశ్వనాథంతో

''అవునులే అవునవును అది తప్పే'' అన్నాడు నేల చూపులు చూస్తూ విశ్వనాథం తరువాత బైటకెళ్ళి నిలబడ్డాడు

''ఇట్టాంటి పక్కలేసే లంజాకొడుకు లుండబట్టే ఈ ఆఫీసరు నా కొడుకులు ఇట్లా

నెత్తికెక్కుతున్నారు ఆ సార్జిన్‌గాడు అన్నమాటల్లో తప్పు కనపడ లేదుగానీ, ప్రకాశం పెద్దగా అరవటం గొప్ప తప్పుగా మాట్లాడ బోతున్నాడు'' అన్నాడు కోపంగా డేవిడ్

''ఇట్టాంటివాళ్ళ మూలంగానే మనం బలహీనుల మవుతున్నాం లేకపోతే మనమంతా ఒక యూనియన్‌గా వుంటే ఎవడు మనల్ని ఏమంటాడు'' అన్నాడు సుబ్బారెడ్డి

''అవును మన పోలీసులకి కూడా ఒక రిజిష్టర్డ్ సంఘం కావాలి'' అన్నారు ఎవరో

ఆ మాటలన్నీ బైట నిలబడి వింటునే వున్నాడు విశ్వనాథం తరువాత కొద్దిసేపటికి ఎటువాళ్ళు అటు వెళ్ళిపోయారు

ఇంటికెళ్ళాక ప్రకాశం ఆలోచించాడు మనస్సంతా బాగా చికాగ్గా వుంది 'పొద్దున్నే లేసి ఎవురిమొకం చూశానో' అనుకుని, ఎవరి మొకం చూసిందీ గుర్తు తెచ్చుకోవటానికి ప్రత్నించాడు కొద్దిసేపు 'ఎంత జాగ్రత్తగా వున్నా ఏదో ఒకటి వచ్చి మీద పడతానే వుంది ఎందుకు వీళ్ళంతా ఇలా నా మీద కక్ష కట్టారు?' అనుకున్నాడు మిగతా వాళ్ళకీ తనకీ ఎక్కడ తేడా వుందో అంతుపట్టటం లేదు చాలామంది లాగా తను, ముఖస్తుతి మాటలు మాట్లాడలేకపోవటం, తన మనస్సులోని భావాన్ని మరుగుపరచి ముఖానికి రంగు పూయలేకపోవటం, మనస్సులోని మాటలు కుండ బద్దలు కొట్టినట్టు మాట్లాడటం, లౌక్యం చేతకాక పోవటం లాంటివి అతని దృష్టికొచ్చాయి

ఆ రోజు రాత్రి గోపాలం ఇంటిదగ్గర కలిసి మాట్లాడుకున్నారు ''ఏదేమైనా మనది డిసిప్లైన్ ఫోర్సు కాబట్టి ఆఫీసరు మన మాటలు నమ్మడు నమ్మినా మనకు సపోర్టు చెయ్యరు మనదే తప్పు అంటారు సస్పెన్షన్లు, ఇంక్రిమెంట్లు కట్, ట్రాన్స్‌ఫర్లూ అంటారు'' అన్నాడు గోపాలం

''ఈ సార్జిన్ గాడు పోయి యస్సైగాడి కాళ్ళమీద పడతాడండీ వున్నయ్ లేనియ్ అన్నీ చెపుతాడు మరి వాడు ఏమిచేస్తాడో '' అన్నాడు డేవిడ్

''ఏముంది వాడి విషయం మనకు తెలియనిది కాదుకదా ఇంతకు ముందు ఈ సార్జిన్ గాడికీనూ పోయిన క్రిష్ణమూర్తికీ ఇట్లాగే గొడవయితే, కృష్ణమూర్తిది తప్పు లేకపోయినా సార్జిన్ కాళ్ళు పట్టుకొని క్షమాపణ చెప్పుకోమనలా ఈ యస్సై ఈడి తీరే అంత క్షమాపణ చెప్పుకోక పోతే సస్పెండు చేపిస్తానంటాడు ఆ కృష్ణమూర్తి క్షమాపణ చెప్పుకున్నా ట్రాన్స్‌ఫర్ చేయించాడు తరువాత ఇదీ అంతే'' అన్నాడు సుబ్బారెడ్డి

''క్షమాపణ చెప్పుకోవటం మాత్రం జరగదు'' అన్నాడు ప్రకాశం ఉద్రేకంగా

కొద్దిసేపు ఏవరూ ఏమీ మాట్లాడలేదు

''నేను ఏం పొరపాటు చేశానని క్షమాపణ చెప్పుకోవాలి?'' అన్నాడు మళ్ళీ ప్రకాశం

''ఇక్కడ పొరపాటు ఎవరిదీ, తప్పు ఎవరిదీ అని న్యాయం విచారించే వాడుంటే ఇంక అనుకొనేది ఏముంది అధికారులు వాళ్ళు వాళ్ళేమైనా చేయగలరు ఏదో లేచిన వేళకొందీ జరిగింది మనది అరిటాకు బ్రతుకు కాబట్టి మనమే తగ్గాలి అలా వీలుకాదు అంటే మరి రేపు సస్పెండంటారు, ఇంకోటంటారు వాటికి తట్టుకోగల మనుకుంటే సరేసరి లేకపోతే మనసును చంపుకొని, తప్పయిపోయిందని వాళ్ళముందు చెంపలేసుకోవటమే అయితే ఆ పని చేశాక మనల్ని ఇంకా హీనంగా చూస్తారు నీ యిష్టం'' అన్నాడు గోపాలం అంతా విని మెదలకుండా వూరు కున్నాడు ప్రకాశం

బాగా పొద్దుపోయిందాకా మాట్లాడుకున్నారు వాళ్ళు ఇంటికెళ్ళి పడుకుంటే జరిగిన సంఘటన తాలూకు ఆలోచనలే ముసురుతున్నయ్ అది జరిగిన దగ్గర నుండీ మనశ్శాంతి

పూర్తిగా దూరమయ్యింది ఆలోచనల మధ్య ఎప్పటికో నిద్ర పట్టింది ప్రకాశంకు

ఉదయం రోల్ కాల్‌కు వెళ్ళినప్పుడు స్టేషన్లో వాతావరణం అంతా గంభీరంగా వున్నట్లు తోచింది ప్రకాశానికి మనస్సులో గుబులుగా వుంది అందరూ యస్సై రూంలో వరుసగా నిలబడ్డారు రోల్‌కాల్‌లో వంచిన తల ఎత్తకుండా ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు యస్సై అతని పక్కన సార్జెనూ, రైటరూ నిలబడి వున్నారు సార్జెన్ ఒకసారి ప్రకాశంవైపు చూచి చటుక్కున తల తిప్పుకున్నాడు ఆ చూపుతో విషయం అర్థమై పోయింది ప్రకాశంకు ఆలోచనలు సుడులు తిరుగుతున్నయ్ ఏం చేయాలో తేల్చుకోలేక పోతున్నాడు మిగతా అందరివైపూ చూశాడు అందరూ గంభీరంగా వున్నట్టు కనపడుతున్నారు అతని కంటికి చీమ చిటుక్కుమంటే వినిపించేటంతటి నిశ్శబ్దం ఆ గదిలో నిండిపోయింది వున్నట్టుండి యస్సై గొంతు వినపడింది కర్కశంగా

''ఏరా! నీ సర్వీసెంత?'' ప్రకాశంవైపు చూస్తూ అడిగాడు యస్సై

క్షణంపాటు తటపటాయించాడు వినపడీ వినపడకుండా అన్నాడు ''మూడో ఏడయ్యా''

''అప్పుడే వళ్ళు బలిసిపోయిందా కొవ్వుపట్టి ఛస్తున్నావా? ఇంటి దగ్గర గంజినీళ్ళకు కూడా దిక్కులేని లంజాకొడుకువి, దీనిలో కాస్త వేళకి తిండి దొరుకుతుంటే, తిని కొవ్వెక్కి నీ యిష్ట మొచ్చినట్లు ప్రవర్తిస్తున్నావు ''

ఆ మాటలూ, ఆ తిట్లూ సూలాల్లాగా గుచ్చుకుంటున్నాయి సహనం కరిగిపోతోంది అరచేతులు చెమటతో తడిచి పోతున్నాయి కళ్ళముందు శూన్యంలో ఏవో దృశ్యాలు గజిబిజిగా కదులుతున్నాయ్ ఉద్రేకాన్ని అదుపుచేసుకొనే స్థితిలో పళ్ళు బిగబట్టాడు

''నిన్ను జైలుకు పంపటానికి అరక్షణం పట్టదు పొట్టకొట్టటమెందుకని వూరుకుంటుంటే నీ యిష్టమొచ్చినట్లు ప్రవర్తిస్తున్నావు నీకెంత కళ్ళు కావరం పట్టకపోతే హెడ్ కానిస్టేబుల్ని పట్టుకొని నీ నోటికొచ్చినట్లు తిడతావు ''

''నేనేం అనలేదు సార్ ''

''నోర్మూయ్ నేనిక్కడ మాట్లాడుతుంటేనే నువ్వు ఎదురు మాట్లాడుతున్నావ్ డిసిప్లెన్ లేదు నీకసలు నాదగ్గిరే ఇట్లా మాట్లాడుతున్నావ్ సార్జెన్‌ని నువ్వేమీ అనలేదంటే నేను నమ్ముతానా? '' అని సార్జెన్‌వైపు తిరిగి ఒకసారి కళ్ళతోనే పలకరించి మిగిలినవాళ్ళవైపు చూశాడు యస్సై ''నేను మంచోడిని కాబట్టి ఈసారికి వూరుకుంటున్నాను చేసిన పనికి సార్జెన్‌కి క్షమాపణలు చెప్పుకో నీకు రెండు రోజులు టైం ఇస్తున్నాను డిస్‌బర్స్'' అన్నాడు

అందరూ బయటకు వెళ్ళుతున్నారు సెల్యూట్‌లు చేసి ఏదో చెప్పాలనే ఉద్దేశ్యంతో ప్రకాశం కదలకుండా నిలబడ్డాడు అక్కడే కాని మిగిలిన పీసీలు కొంత మంది అతన్ని బలవంతంగా బయటకు తీసుకువెళ్ళారు అవేమీ యస్సై గమనించలేదు

''ఏమిటండీ మీరు నన్ను యస్సైతో నా బాధలు చెప్పుకోనీయండి'' అన్నాడు కొద్దిపాటి విసుగుతో ప్రకాశం బైటకొచ్చాక

''ఏందయ్యా నువ్వు వాడితో చెప్పుకొనేది? అదిగో ఆ గోడకు చెప్పుకుంటే కొంత నయం'' అన్నాడు ఒక పీసీ ప్రకాశం ఇంకేమీ మాట్లాడలేదు

ఆ రెండు రోజులూ ఆ విషయం గురించే ఆలోచించాడు తీవ్రంగా 'క్షమాపణ చెప్పుకోవట మంటే, తను తప్పుచేసి, ఆ తప్పుని ఒప్పుకుంటున్నట్లేకదా' ఆ వూహే భయంకరంగా తోచింది

జీవితంలో ఎప్పుడూ అతని కలాంటి సందర్భం ఎదురు కాలేదు 'తను క్షమాపణ చెప్పకపోతే సస్పెండు చేస్తారా? ట్రాన్స్‌ఫర్ అయితే బాధలేదు ఈ దరిద్రపు వెధవల దగ్గరకన్నా వేరేచోట ఉద్యోగం చెయ్యటం మంచిది ఈ జీవితమే అక్కడ కూడా జీతంకూడా ఏం తగ్గదు సర్కారు నౌకరీలో చేరినాక ఒక వూరని ఏముంది సొంతవూరు వదిలి పెట్టినాక ఏ వూరయితే ఏం?' అనుకున్నాడు అతని ఆలోచనలు భార్యమీదకు మళ్ళాయి 'ఆమె త్వరలోనే ప్రసవిస్తుంది మరీ పల్లెటూరాయా, ఆసుపత్రి కూడాలేని వూరికి ట్రాన్స్‌ఫర్ అయితే ఎట్లా?' ఆలోచించాడు 'ఆస్పత్రులూ, డాక్టర్లు లేనిచోట ఆడాళ్ళు కనటం లేదా?' అని తనలో తను తర్కించుకున్నాడు కాని డాక్టరమ్మ చెప్పిన మాటలు గుర్తొచ్చాయి 'ప్రసవం కష్టం కావచ్చు నంది చాలా బలహీనంగా వుంది కాబట్టి, తప్పకుండా ఆసుపత్రిలో చేర్పించాలంది ఇట్లాంటి పరిస్థితుల్లో వేరే చోటకు ట్రాన్స్‌ఫర్ అయితే కష్టమే తల్లినీ, భార్యను ఒదిలిపెట్టి తను ఒక్కడూ వెళితే, తనకక్కడ అన్నిటికీ ఇబ్బందే జీతం డబ్బులు తనొక్కడికి, పూటకూళ్ళకు కూడా సరిపోవు ఇలాంటి గడ్డు పరిస్థితుల్లో మగ దిక్కు లేకపోతే ఇక్కడ వీళ్ళకు క్షణం గడవదు కాస్తోకూస్తో అలవాటయిన చోటు యిది అవసరానికి పావలో, బేడో అప్పు పుట్టిద్ది ఇటువంటి సమయంలో ట్రాన్స్‌ఫర్ చాలా ఇబ్బంది' అనుకున్నాడు కాని క్షమాపణ చెప్పుకోవాలంటే తల కొట్టేసినట్లు వుంది కోపంతో పళ్ళు పటపటా కొరుక్కున్నాడు 'దొంగ నా కొడుకులు ' తిట్టాడు కసిగా తనకీ విషయంలో సహాయం చేయగలిగిన వాళ్ళు ఎవరూ కనపడలేదు స్టాఫంతా ఇంచుమించు తననే సమర్థిస్తున్నా, బహిరంగంగా ముందుకొచ్చి నిలబడగల వాళ్ళు ఎవరూ లేరు ఎంతోసేపు అలా ఆలోచిస్తూ వుండిపోయాడు 'ఒకవేళ సస్పెన్షన్ అయితే జీతం సగం వస్తుంది కాబోలు టీ ఏ వుండదు పైన దొరికే పావలా, బేడా వుండవు అప్పు పుట్టటం కూడా కష్టమే పూర్తి జీతం, టీ ఏ వస్తుంటేనే అంతంతమాత్రంగా వుంది ఇక సగం జీతంతో ఈ సంసారాన్ని గడపగలగటం జరగని పని పోతే చివరి పనిష్మెంటు ఇంక్రిమెంటు కట్ మొన్ననే ప్రొబేషను పూర్తయినప్పుడు ఒక ఇంక్రిమెంటు వేశారు పోతే అదిపోయిద్ది అది పెద్ద సమస్య కాదు' అనుకున్నాడు ఇలా అతని ఆలోచనలు సాగాయి

తను క్షమాపణ చెప్పుకోకపోతే తనకు రాగల నష్టాల్ని అంచనా వేసుకోవటంతో గడిపేశాడు చాలాసేపు 'సరే ఆ సమయంలో ఎట్టా గుంటదో అంతా ఏసుసామి దయ' అనుకున్నాడు గట్టిగా కళ్ళు మూసుకున్నాడు

డిసిప్లైన్ భూతం నవ్వుతూ ఎగతాళి చేస్తూ కనపడింది ఈ డిపార్టుమెంటుకే పరిమిత మయిన ఈ డిసిప్లైను గురించి ఆలోచించాడు పైవాడు తన కిందివాడిని ఏమన్నా, ఏం చేసినా డిసిప్లైన్ అడ్డం రాదు కిందవాడు పైవాడిని గట్టిగా సంబోధించినా ఈ డిసిప్లైన్ భూతం విరుచుకు పడుతుంది 'అసలు డిసిప్లైన్ అంటే ఏమిటి? ఉద్యోగరిత్యా అధికారి యొక్క ఉత్తర్వులను క్రిందివాళ్ళు అమలుపరచటం మాత్రమే కాని పైవాడి వ్యక్తిగతమైన చలాయింపులకూ, ఆగడాలకు కూడా ఈ డిసిప్లైన్ అండగా నిలబడుతోంది అధికార్లకు ఇది మారాలి' అనుకున్నాడు ఆలోచనలతో అలా చాలాసేపు గడిపేశాడు

''ఏందయ్యా! ఎప్పుడూ ఏదో ఆలోచిత్తుంటావు అసలు మనుసుల్తో మాట్లాడటమే లేదీ మద్దెన'' అంది తల్లి

ఆ మాటకు నవ్వాడు ఆలోచించటం అలవాటు అవుతున్నట్టు అర్థమయింది 'అసలు

మనిషికి ఆలోచన అనేదే లేకపోతే బాధలే వుండవనుకుంటా' అనుకున్నాడు

రెండ్రోజుల తర్వాత రోల్‌కాల్‌లో యస్సై హెచ్చరించాడు

''ఏంరా, ఏం నిర్ణయించుకున్నావ్'' అన్నాడు ప్రకాశంవైపు తీక్షణంగా చూస్తూ

ప్రకాశం నిర్లిప్తంగా వూరుకున్నాడు ఉద్రేకం అతనిలో పొగవుతోంది నోట్లో యస్సైని బండబూతులు తిడుతున్నాడు

''వచ్చి సార్జిన్ చేతులు పట్టుకొని క్షమించమను'' అన్నాడు యస్సై స్టాఫంతా ప్రకాశం వైపు చూస్తున్నారు రోకటిపాటలాంటి అలాటి ఉద్యోగాల్లో ఇలాంటి చెదురుమదురు సంఘటనలు కొంతమందికి సరదాగా వుంటాయి కాకపోతే మిగిలినవాళ్ళతోపాటు వాళ్ళు కూడా ముఖాలు గంభీరంగా పెట్టుకుని ఆలకిస్తున్నారు సార్జిన్ ముఖం పక్కకు తిప్పుకొని నిలబడ్డాడు రైటరు ప్రకాశాన్ని చూస్తున్నాడు అతని చూపులు ఎగతాళి చేస్తున్నట్లున్నయ్ క్షణాలు కొన్ని దొర్లి పోయాయి ప్రకాశం ఒక్కసారి గట్టిగా గాలి పీల్చుకున్నాడు చెమట పడుతోంది గుండె వేగంగా కొట్టుకుంటోంది ఏం చేయాలో పాలుపోని పరిస్థితిలో, బలవంతంగా ఎవరో నెట్టినట్లు, గబగబా ముందుకొచ్చి సార్జిన్ చేతులు పట్టుకున్నాడు అందరూ అతనివైపే చూస్తున్నారు

''అయ్యగారు చెప్పమన్నారు కాబట్టి చెపుతున్నాను ఎవురిది తప్పో, ఎవురిది ఒప్పో మనకు తెలుసు'' అన్నాడు ఆమాటలని, సార్జిన్ చేతులు వదిలిపెట్టి యస్సై వైపు తిరిగాడు అక్కడున్న అందరిలోనూ చిన్న కదలిక కనపడింది

''నేను చెప్పమనేదేమిట్రా నీ యిష్టమయితే చెప్పు లేకపోతే జరిగింది జరిగినట్టు స్టేటుమెంటు తీసుకొని పైకి పంపిస్తాను మంచైనా, చెడైనా తరువాత నా పూచీ ఏమీలేదు'' అన్నాడు యస్సై ప్రకాశాన్ని కోపంగా చూస్తూ

ప్రకాశం ఏమీ మాట్లాడలేదు ఇంక అంతకుమించి అతనేమి మాట్లాడకూడదనే వుద్దేశ్యం క్షణక్షణానికి అతనిలో బలపడుతోంది కానీ ఒకపక్క ఎదురయ్యే ఇబ్బందులు కూడా స్పష్టంగా కనపడుతున్నయ్ వాటిని తట్టుకొని నిలబడే శక్తి అతనికి లేదు అలాగని ఆత్మాభిమానాన్ని చంపుకోలేకపోతున్నాడు

ఆ నిశ్శబ్దంలో రైటరు గొంతు చిన్నగా వినపడింది ''ఈ ఒక్కసారికి పోనీయండి సార్, తెలియక తొందరపడ్డాడు'' అన్నాడు ఆ మాటలు చురుక్కున సూదితో గుచ్చినట్టు గుచ్చు కున్నాయి ప్రకాశానికి

'అంటే తను తప్పు చెయ్యకపోయినా తను తప్పు చేసినట్లు ముద్ర వేసేశారు తనని వాళ్ళు క్షమించినట్లు నలుగురికీ తెలియజెప్పటమన్నమాట' ఉద్రేకంతో ప్రకాశం రక్తం సలసలా మరుగుతోంది 'ఈ క్షమాపణలు నేను చెప్పను, మీ చేతయింది చేసుకోండి అప్పుడే చూసు కుంటాను' అందామనుకున్నాడు నాలిక చివరివరకు వచ్చిన ఆ మాటల్ని బలవంతంగా మింగేశాడు

''సరే పో ఇటువంటి పొరపాట్లు ఇంకెప్పుడూ చేయమాక ఇదే లాస్ట్ వార్నింగ్'' అన్నాడు యస్సై కటువుగా తల తిప్పి యస్సైవైపూ, స్టాపు వైపు చూశాడు ప్రకాశం డేవిడ్ కళ్ళతోనే 'ఇంక వచ్చేసెయ్' అన్నట్టుగా సైగ చేశాడు యస్సైకి సెల్యూట్ చేసి వెళ్ళి, వరుసలో నిలబడ్డాడు ప్రకాశం

''ఇంకొకసారి ఇలాటి గొడవ నా నోటీసులోకి వస్తే వూరుకోను'' అన్నాడు యస్సై సీరియస్‌గా

చూడటానికి ప్రయత్నిస్తూ అందరూ బైటకొచ్చారు సెల్యూట్‌లు చేసి

ఒక్కసారి తేలికగా గాలి పీల్చుకున్నాడు ప్రకాశం అంతా గుంపుగా చేరి ఈ విషయాన్నే మాట్లాడుకుంటున్నారు

''ఆడు రైటరుగాడు మహా తెలివయినవాడండీ చూడండి ఆ నాకొడుకు ఎంత తెలివిగా మాట్లాడుతున్నాడో'' అన్నాడు ఒక పీసీ

''ఆలోచిస్తంటే ఆ సీటే అట్టాంటిదనుకుంటా నా సర్వీసులో ఎంతోమంది రైటర్లను చూశాను గదా! ఏ ఒక్కరో ఇద్దరో తప్ప అందరూ ఇట్టాంటోళ్ళే జిత్తులమారి గుంటనక్కలు'' అన్నాడు ఒక పీసీ

''సరే ఏదో ఒకటి అయిపోయింది అదట్లా వుంచండి నేనొక ముఖ్య విషయం చెప్పబోతున్నా అప్పుడు తాలూకా కాడ బందోబస్తప్పుడు తెల్ల డీ యస్పీనీ, తెల్ల తాసిల్దారుని కాల్చి చంపాడే ఒక కుర్ర యస్సై, అతన్ని వురి తీశారంట పాపం'' అన్నాడు ఒక పీసీ ఆశ్చర్యం కలిగించిన ఆ మాటల్ని వాళ్ళు గుడ్లప్పగించి విన్నారు గాలి పీల్చుకోవటం మానేశారు

''నిజంగానా?!'' ఆశ్చర్యంగా అడిగాడు ప్రకాశం తన విషయం మరిచిపోయి

''నిజమే నిజం కాకపోతే అబద్దమా? ఇట్టాంటియ్యి యాడన్నా ఆశ్యానికి సెపుతారా? నిన్న నేను కోర్టు కెళ్ళినప్పుడు తెలిసింది ఆ సర్కిల్ ఇనస్పెక్టరు లేడూ, అందరి దగ్గరా తుపాకులు తీసుకొని ఆ యస్సైని అరెస్టు చేసి లోపల వేశాడే, ఆయనకు డి యస్పీగా ప్రామోషనిచ్చారంట ఆయనికి సర్కిల్ ఇనస్పెక్టరుగా సరిగా మూడేళ్ళ సర్వీసు కూడా లేదంట డి యస్పీ ప్రమోషన్ రావాలంటే కనీసం పది, పన్నెండేళ్ళన్నా సర్వీసుండాలంట'' అన్నాడు

ఆ చర్చ చాలాసేపు కొనసాగింది ఆ చర్చలో పడి తన విషయం మరిచిపోయాడు ప్రకాశం తాత్కాలికంగా

''అసలు ఆ కేసు ఎప్పుడు విచారించారూ, ఎప్పుడు శిక్షవేశారూ, అంతా గమ్మత్తుగా వుందే'' అన్నాడు ప్రకాశం

''ఆఁ విచారణా పాడా అంతా షో అధికారం వాళ్ళ చేతుల్లో వుంది ఏం చేసినా చెల్లిద్ది వాళ్ళ నిక్కడనుండి వెళ్ళగొట్టటానికి ఎవరు ప్రయత్నం చేసినా వాళ్ళకి పనిష్మెంటు సీరియస్‌గానే వుంటుందన్నమాట'' అన్నాడు గోపాలం చాలాసేపు ఆ విషయం గురించి మాట్లాడుకున్న తరువాత అంతా వెళ్ళిపోయారు

ప్రకాశం ఆ కుర్ర యస్సైని గురించే ఆలోచించాడు చాలాసేపు ఆ విషయం ప్రకాశాన్ని ఎంతగానో కలవరపరిచింది తనకి తెల్లవాళ్ళంటే పగ ఆఫీసర్లంటే పగ తనని కులంతో కొలిచేవాళ్ళంటే పగ తనకి పగవాళ్ళే ఎక్కువ వున్నట్టు గమనించాడు తన పగస్తులంతా తనకంటే ఎంతో బలవంతులనే వూహ భరించలేక పోతున్నాడు తనకు తెలియకుండానే తనమీద తనకి ఒకోసారి జాలీ, ఒకోసమయంలో తనమీద తనకే ఒకరకమయిన న్యూనతా భావం కలుగుతున్నయ్ దీర్ఘంగా నిట్టూర్చాడు

రోజులు అలాగే గడుస్తున్నయ్ ఓ రోజు ఉదయం మామూలుగానే రోల్‌కాల్‌కు వచ్చాడు ప్రకాశం రైటరు ప్రకాశాన్ని పిలిచి కాగితం మీద ఒక వ్యక్తి అడ్రసు రాసిచ్చి, ఆ వూరెళ్ళి ఆ వ్యక్తిని వున్న పళంగా తీసుకురమ్మన్నాడు కాగితం మీది పేరు చదివాడు ప్రకాశం 'సుబ్బారాయుడు, టీచర్' అని రాసి, 'కోమటికుంట' అని వూరి పేరు రాసుంది

''పాస్‌పోర్టు ఇయ్యండి సార్'' అన్నాడు మామూలుగా ప్రకాశం

''పాస్‌పోర్టు వద్దులే ఇది అమాంబాబతు ఉద్యోగంలే తొందరగా పోయిరా'' అన్నాడు

ప్రకాశం రెండు నిముషాలు ఆలోచించాడు 'ఎవరో రిపోర్టు ఇచ్చుంటారు ఇతను అందులో ముద్దాయి అయివుంటాడు రిపోర్టు ఇచ్చినతను ఎవరో తెలుసుకుంటే ఖర్చులకు ఏమన్నా డబ్బులు దొరకొచ్చు' అనుకున్నాడు ఆశగా ఆ వుద్దేశ్యంతోనే చిన్నగా నసిగాడు రైటరు దగ్గర

''ఎవురు సార్ ఇతనూ? కంప్లయింట్ ఎవురుసార్?'' అన్నాడు

రైటరు విసుగ్గా చూశాడు అలాటప్పుడు ఎలా చూడాలో అలాగే చూశాడు ''ఇవన్నీ నీకెందుకు? ముందు పోయిరా'' అన్నాడు ఆ చూపునీ, ఆ విసుగుదలని తట్టుకోలేని ప్రకాశం ఇంకేమీ మాట్లాడలేదు

''సరే సార్'' అని సెల్యూట్‌చేసి, తిట్టుకుంటూ బయట కొచ్చాడు బయట సుబ్బారెడ్డి కనిపించాడు ప్రకాశం చెప్పిన వూరిపేరూ, మనిషి పేరూ విని ప్రకాశాన్ని పక్కకు తీసికెళ్ళి చిన్నగా చెప్పాడు

''ఆ వూరి మునసబు మొన్న వచ్చి ఏదో కంప్లెయింట్ ఇచ్చాడు మొత్తంమీద అందులో ఈ టీచరు ముద్దాయి అనుకుంటా ముందుగా మునసబును కలువు ఖర్చుల కేమన్నా ఇస్తాడు'' అన్నాడు ప్రకాశం తలూపి, హుషారుగా బయలుదేరాడు గబగబా అన్నం తిని నడక ప్రారంభించాడు రెండు మైళ్ళు నడిచి ఆ వూరికి చేరాడు ముందుగా మునసబు ఇంటికి వెళ్ళాడు మునసబు ఇంటిలోనే వున్నాడు

అతను ప్రకాశాన్ని చూచి, ''ఏమండి సార్ మిమ్మల్ని పంపించాడా యస్సైగారు నిన్ననే పంపిస్తానన్నాడే'' అన్నాడు, కూర్చోమని స్టూలు చూపిస్తూ

ప్రకాశం కూర్చున్నాడు ''ఎక్కడండీ నిన్నెవరూ లేరు స్టేషన్లో అందుకని ఈ రోజు నన్ను పంపించారు'' అన్నాడు

''కొంచెం మజ్జిగా తీసుకుంటారా?'' అన్నాడు మునసబు ప్రకాశం తలూపాడు అంత రంగంలో తనని కులమడుగుతాడేమో అనే అందోళన మొదలయింది ఆ అందోళన అతన్ని స్థిరంగా కూర్చోనివ్వటం లేదు స్వేచ్ఛగా మాట్లాడ నివ్వటం లేదు ఆనందంగా ఉండనివ్వటం లేదు సరిగా మనిషి ముఖంలోకి చూసి మాట్లాడలేక పోతున్నాడు తన నతను కులం అడిగే అవకాశం ఇవ్వకుండా, తన పని త్వరగా ముగించుకొని వెళ్ళాలనుకున్నాడు మునసబు పాలేరుతో మజ్జిగ తెప్పించి ఇచ్చాడు తాగి గ్లాసు కిందపెట్టాడు ప్రకాశం

''ఏమిటీ, నడిచొచ్చారా?'' అన్నాడు మునసబు మళ్ళీ తనే, ''సైకిలొకటి కొనకపోయారా? మీ కేంటి, మంచి జీతాలూ, పై ఆదాయం '' అన్నాడు వెకిలిగా నవ్వుతూ

ఆ మాటకు సమాధానంగా ప్రకాశం నవ్వి వూరుకున్నాడు అసలు విషయం ఎత్తటానికి ధైర్యం చాలటంలేదు 'వీడుపోయి యస్సైకి నేనొచ్చి ఇట్లా అడిగినట్లు చెపుతాడేమో అప్పుడు యస్సైగాడికి పట్టపగ్గాలుండవ్ అందరినీ ఫాలెన్‌చేసి పదిమందిలో అసహ్యంగా, అవమానంగా మాట్లాడతాడు వాడేమీ పత్తిత్తు కాకపోయినా తనకింద వాళ్ళని ఎప్పటికప్పుడు తన గుప్పెట్లో పెట్టుకోవటానికీ, తను చెప్పే ఉద్యోగాలకు ఎదురు చెప్పకుండా వుంచటానికీ, తన అవినీతి బయటపడకుండా వుండటానికి ఇట్లాంటి వాటిని బాగా వుపయోగించుకుంటాడు పోనీ అడగకుండా పోదామా అంటే డబ్బులికి బాగా కటకటగా వుంది' అనుకున్నాడు ఇంక అక్కడ

ఎక్కువసేపు ఉండకూడదనుకున్నాడు చిన్నగా అన్నాడు ''ఏమిటి మరి నేనొచ్చింది మీ పనిమీదే ఆ పంతుల్ని తీసుకుపోవాలిప్పుడు'' అన్నాడు

ఆ మాటకు మునసబు నవ్వాడు ''పని కానియ్యండి నేను మర్చిపోనులే సార్'' అన్నాడు

ఆ మాట తొంటిచెయ్యి చూపినట్లయ్యింది ఇంక లాభం లేదనుకొని లేచాడు నిరుత్సాహంగా ప్రకాశంతోపాటు మునసబు బైటవరకూ వచ్చాడు ''ఆ పంతులి ఇల్లు తెలుసుగా?'' అన్నాడు మునసబు తెలియదన్నట్టు తలూపుతూ, పెదవి విరిచాడు ప్రకాశం మునసబు కొన్ని గుర్తులు చెప్పాడు ఆ గుర్తులు పట్టుకొని వెళ్ళాడు ప్రకాశం దారిలో కొంత మందిని ఆ పంతుల్ని గురించి అడిగాడు ఆ పంతులు ఎటువంటివాడో, ఏమిటో విచారించాడు చాలా మంది భయపడి ఏమీ జవాబులు చెప్పలేదు ఇద్దరు ముగ్గురు మాత్రం పంతులుగారు మంచి మనిషనీ, పెద్దమనిషనీ చెప్పారు తరువాత పంతులు ఇంటికి వెళ్ళాడు పంతులు ఇంట్లోనే వున్నాడు ప్రకాశాన్ని చూడటంతోనే భయపడ్డాడు వినయంగా నమస్కరించి కుర్చీ చూపించి కూర్చోమన్నాడు అతని ముఖాన్ని కొంచెంసేపు చూశాడు ప్రకాశం పరిశీలనగా అతని ముఖంలో సాధుతత్వం కనిపించింది అతనిమీద సదుద్దేశం ఏర్పడింది

''సుబ్బారాయుడు అంటే మీరేగా?'' అన్నాడు ప్రకాశం

''అవునండీ'' అన్నాడు అతను చిన్నగా ప్రకాశం కొద్దిసేపు తటపటాయించాడు ఆ పంతులి భార్యపిల్లలు కాబోలు ఇంట్లోంచి వచ్చి వాకిలి దగ్గర నిలబడ్డారు దారినపోయే వాళ్ళు ఇంటి ముందు నిలబడిపోయారు ప్రకాశం నోటిలో నుండి ఏం వినాల్సొస్తుందో అన్నట్టు ఆందోళనగా చూస్తున్నాడు పంతులు

''మీ మీద మీ మునసబు ఏదో కంప్లైంట్ ఇచ్చాడండీ మీరొకసారి స్టేషనుకు రావాలి'' అన్నాడు ప్రకాశం

ఆ మాట వినటంతోటే పంతులు వణికిపోయాడు ''సార్, ఆ గొలుసు నేను తియ్యలేదు సార్ నా బిడ్డలమీద ఒట్టుసార్ సరస్వతీ దేవి తోడు నా తల్లిమీద ఒట్టు'' అన్నాడు భయంగా ప్రకాశంకు అతనిమీద సానుభూతి కలిగింది వదిలిపెట్టి పోదామనుకున్నాడు కాని మునసబు వచ్చి యస్సైతో చెపుతాడేమోనని భయమేసింది

''మీరన్నది నిజం కావచ్చు కానీ ఒక పిర్యాదు వచ్చినప్పుడు రాక తప్పదు కదా! రండి, యస్సైగారు విచారించి పంపిస్తారు'' అన్నాడు

అతను భయంగా చూశాడు అతని పిల్లలు ఆందోళనగా చూస్తున్నారు అతని భార్య కళ్ళల్లో నీళ్ళు వూరాయి ఆ దృశ్యం బాధ కలిగించింది ప్రకాశంకు నలుగురికి విద్యాదానం చేసే ఆ మనిషిమీద గౌరవం కూడా కలిగింది

''నాకేం పాపం తెలియదు సార్ నిజంగా'' అన్నాడు మళ్ళీ పంతులు అతని గొంతులో ఏడుపుజీర తొంగిచూసింది ప్రకాశంకు బాధ కలుగుతోంది కొద్దిసేపు మౌనంగా వుండి పోయాడు తరువాత అన్నాడు

''మీరు బయలుదేరితే మళ్ళీ పెందలాడే వచ్చేసెయ్యొచ్చు''

పంతులు ఆశగా చూశాడు ఇంటిముందు నిలబడి చూస్తున్నవాళ్ళు లోపలి కొచ్చారు

''పాపం పంతులుగారు మంచోడండీ'' అన్నాడు ఒకతను సానుభూతిగా ప్రకాశం అతనివైపు చూశాడు

''ఎవరు కాదన్నారు? నేనూ ఎంక్వయిరీ చేశా మరి తనొచ్చి సమాధానం చెప్పాలిగా'' అన్నాడు ప్రకాశం వాళ్ళతో

వాళ్ళు ఔనన్నట్లు తలూపారు ''భయపడుతున్నాడండీ'' అన్నారు ఎవరో

''ఎందుకు?'' అని పంతులు వైపు తిరిగి, ''మీకా భయం ఏమీ అఖ్ఖరలేదు నాదీ పూచి ఎందుకు భయం మీరేం చేశారని?'' అన్నాడు నమ్మకం కలిగేటట్లు ప్రకాశం ఆ మాట కొంచెం ధైర్యాన్నిచ్చింది పంతులుకు

''సాయంత్రం వస్తానండి తమరెళ్ళండి మా బావగారు వూరెళ్ళారు ఆయన్ని తీసుకొని వస్తా తప్పకుండా'' అన్నాడు ప్రాధేయపడుతున్నట్లు పంతులు

ప్రకాశం కొద్దిసేపు ఆలోచించాడు తనలో తను అనుకున్నాడు 'ఇంతవరకూ ఈ విషయంలో కేసేమీ రిజిష్టర్ చెయ్యలేదు చట్టప్రకారం అయితే బలవంతంగా తీసుకుని వెళ్ళటానికి వీలులేదు కానీ తీసుకెళ్ళకపోతే యస్పై నాకొడుకు వూరుకోఢు ఇతని దగ్గర ఏదో తీసుకొని వదిలిపెట్టి వచ్చానంటాడు మునసబు లేనిపోనియ్యన్నీ కల్పించి చెపుతాడు కాబట్టి తీసుకెళ్ళక తప్పదు'

''వీలు కాదండీ మీరు వెంటనే బయలుదేరాలి వస్తే తరువాత మీవాళ్ళొస్తారు లేండి నాకింకా చాలా పనుంది త్వరగా రావాలి మీరింటి దగ్గర లేకపోతే అది వేరే విషయం మీరేమీ భయపడొద్దు నేను పూచీ'' అన్నాడు

అక్కడున్న వాళ్ళంతా చోద్యం చూస్తున్నట్లు చూస్తున్నారు ఎన్ని మాటలు చెప్పినా పంతులి ముఖంలో భయం పోలేదు వుండేకొందీ జనం పోగవుతున్నారు పంతులు తటపటాయిస్తున్నాడు కాని ఏం మాట్లాడటం లేదు

''వూఁ కానీండి మీరుకూడా, చదువుకున్నవాళ్ళు కూడా అట్లా భయపడితే ఎట్లా మోటోళ్ళంటే అనుకోవచ్చు మీరు త్వరగా కానియ్యాలి'' అన్నాడు కొంచెం విసుగ్గా ప్రకాశం

పంతులింకేమీ మాట్లాడలేదు వెనక్కి తిరిగి భార్యతో, ''మీ అన్నయ్య రాంగానే చెప్పి పంపు స్టేషన్‌కి'' అన్నాడు ఆమె కళ్ళల్లోని నీళ్ళు బుగ్గల మీదకు జారాయి

''ఇంకాసేపటికి వస్తాడుగా'' అంది ఆమె ఆ మాట భర్తతో అన్నా, అది ప్రకాశాన్ని సంబోధించి అన్నట్లు, 'కొద్దిసేపుండండి' అనే అర్థం ధ్వనించింది ప్రకాశం విన్నాడు

''వీలుకాదమ్మా వారిని రమ్మనండి అసలు వారు రాకముందే ఈయన్ని విచారించి పంపిస్తాము'' అన్నాడు తను చెపుతున్నవి అబద్ధపు మాటలనీ, అది జరిగే పని కాదని తెలిసి కూడా మాట్లాడేశాడు ప్రకాశం

ఇక లాభం లేదనుకున్నాడు పంతులు లేచాడు చూరులోని చెప్పులు బయటకుతీసి వేసుకుని, మంచం మీది తుండుగుడ్డ భుజాన వేసుకున్నాడు ఏదో గుర్తొచ్చినవాడిలా ప్రకాశం వైపు తిరిగి, ''అయ్యో మరిచేపోయా సార్! కొంచెం మజ్జిగ గానీ, మంచినీళ్ళుకాని ''

అతని మాట పూర్తి కాకముందే ప్రకాశం అందుకున్నాడు ''వద్దండీ'' అన్నాడు వాస్తవానికి బాగా దప్పికేస్తోంది అప్పుడు అతనికి, మనసబు ఇంటి దగ్గర అంతకు ముందే మజ్జిగ తాగినప్పటికీ

''ఫరవాలేదు తీసుకోండి సార్'' అని భార్యవైపు తిరిగి ''మజ్జిగ తే'' అన్నాడు పంతులు

''అహఁ వద్దండీ వద్దు వద్దు దాహమయితే తాగనూ దానికి మొహమాట మేముంటుంది'' అన్నాడు ప్రకాశం ఆమె లోపలికి పోబోతూ ఆగిపోయింది ప్రకాశం లేచి

రెండడుగులు బయటకు వేశాడు జనం తప్పుకున్నారు పంతులు భార్యవైపు ఓసారి చూచి, మళ్ళీ గుర్తు చేసి బయలుదేరాడు

అదే ఆమెకు చివరి చూపని అప్పుడెవరూ వూహించలేక పోయారు ప్రకాశంతో సహా ప్రకాశం వెంట పంతులు వెళ్ళటం మునసబు కిటికీలోంచి చూశాడు చాలామంది జనం నిలబడిపోయి చూశారు వాళ్ళను

స్టేషనుకు వెళ్ళే దారిలో ఇద్దరూ చాలా విషయాలు మాట్లాడుకున్నారు ఎన్ని విషయాలు మాట్లాడినా పంతులు పరధ్యానంగానే మాట్లాడాడు అతని స్థితికి ఒకసారి నవ్వొచ్చింది కూడా ప్రకాశానికి కాని అంతకన్నా ఎక్కువగా సానుభూతి కలిగింది 'ఈ వుసురు నాకే తగిలిద్ది' అనుకున్నాడు కొద్దిసేపున్నాక 'నాకెందుకు తగిలిద్ది ఆర్డరేసినోడికి తగిలిద్ది నాదేముంది చెప్పింది చేసేవోడినేగా' అనుకుని, తనను తను సమర్థించుకున్నాడు

పంతులికి ధైర్యం చెప్పాలనే వుద్దేశ్యంతో ''పంతులుగారూ మీరేం కంగారు పడొద్దు మీ వంటి మీద ఈగ వాలకుండా చూసే పూచీ నాది నేను ఎంక్వయిరీ చేశా మీ గురించి అంతా మంచిగానే చెప్పారు అదే విషయం స్టేషన్లో చెపుతా యస్సైకి మీరు దిగులు పడొద్దు'' అన్నాడు అభయ మిస్తున్నట్టు

ఆ మాటలకు పంతులు ముఖంలో సంతోషం కనిపించింది కొంచెం. కృతజ్ఞతగా చూశాడు

''అయినా తప్పు చెయ్యని మీరు అంతగా భయపడతారేంది?'' అన్నాడు ప్రకాశం మళ్ళీ

''పోలీసులంటే భయం లేనిదెవరికి?! కొడతారని '' నసిగాడు

''ఛ అందరినెందుకు కొడతామండీ మీరుకూడా అలాగే అనుకుంటున్నారంటే దారుణం''

పంతులు తన పొరపాటు అంచనాకు సిగ్గుపడుతున్నట్టు చూశాడు గట్టిగా గాలి పీల్చుకున్నాడు తుండుతో చెమట తుడుచుకున్నాడు

ఒక గంటలో స్టేషనుకు చేరారు ఇద్దరూ

రైటరు వున్నాడు స్టేషన్లో బైట సెంట్రీ నిలబడి వున్నాడు లోపలికి వెళుతూనే ప్రకాశం సెల్యూట్ చేశాడు రైటరుకి పంతులు రెండు చేతులెత్తి రైటరుకి నమస్కరించాడు రైటరొకసారి పంతుల్ని పై నుండి క్రిందకు ఎగాదిగా చూశాడు భయం కలిగేలా తిరిగి కాగితాలు చూడటంలో నిమగ్నమయ్యాడు

''ఈయనే సార్ పంతులుగారు సుబ్బారాయుడుగారు'' అన్నాడు ప్రకాశం

రైటరు తలొంచుకొని ఏదో రాసుకుంటూనే ''వూ, చెక్ చేసి లోపలెయ్'' అన్నాడు ఆ మాటకు పంతులు కన్నా ప్రకాశం విస్మయం చెందాడు నొసలు చిట్లించి చూశాడు అలాగే నిలబడిపోయాడు రైటర్నే చూస్తూ రెండు నిముషాలు గడిచాయి

''నిన్నే వినపడలేదా? అతన్ని చెక్ చేసి లోపలెయ్'' అన్నాడు తలెత్తి రైటరు ప్రకాశాన్ని చూస్తూ ప్రకాశానికి ఏం మాట్లాడాలో తోచటం లేదు రెండు క్షణాలు తటపటాయించాడు

''ఎందుకు సార్ రమ్మనంగానే వచ్చాడు సార్ నేను మాటిచ్చాను కూడా సార్ '' అని ఏదో చెప్పబోతున్నంతలోనే రైటరు కోపంగా అన్నాడు

''ఇంక ఎక్కువగా మాట్లాడగాకు నువ్వెవడివి మాటివ్వడానికి'' అని పంతులి వైపు చూశాడు ముకుళించిన హస్తాల్తో పంతులు రైటరువైపు దీనంగా చూస్తున్నాడు ''నువ్వెవరివి, వేసెవడ్ని? ఇవి యస్సైగారి ఆర్డర్స్ అంతా అయితే ఆయనొచ్చాక తీసి బయట కూర్చో

పెట్టొచ్చు'' అన్నాడు తలొంచుకుంటూ, తను అంత చక్కగా, సందర్భోచితంగా అబద్ధమాడ గలిగినందుకు లోలోపల సంతోషిస్తూ

ప్రకాశం ఇంకేమీ మాట్లాడలేదు రైటరు చెప్పినవన్నీ అబద్ధమని తెలిసికూడా నోరు ఎత్తలేకపోయాడు తన హద్దులేవో గుర్తుకు తెచ్చుకున్నాడు అంతకు మించితే యస్సై ముందు మళ్ళీ సీరియస్‌గా విచారణ జరిగిద్ది నేరాన్ని ఒప్పుకోవాల్సి వస్తుంది కాని తల తిప్పి పంతులువైపు చూడలేకపోతున్నాడు తనంత పొరపాటుగా అన్ని వాగ్దానాలు చేసినందుకు వేదనగా వుంది కాని ఇంక ఎక్కువ సేపు తను అలా నిలబడటానికి వీలులేదు తన పై అధికారి ఉత్తర్వును తటపటాయించకుండా అమలుపరచాలి లేకపోతే ఇన్‌డిసిప్లెన్ అవుతుంది పనిష్మెంటు సివియర్‌గా వుంటుంది బలవంతంగా తల తిప్పాడు పంతులి కళ్ళలోకి సరిగా చూడలేక చూశాడు కసాయివాడివైపు చూసే గొర్రెపిల్ల చూపులు గుర్తొచ్చాయి పంతులి కళ్ళల్లో

''సరే పదండి సాయంత్రం యస్సైగారు రాంగానే '' నేల చూపులు చూస్తూ అంతకన్నా అనలేకపోయాడు

''సార్ జవానుగారూ '' చేతులు జోడించి ఏడుపు గొంతుతో అన్నాడు పంతులు

ప్రకాశం ఏం మాట్లాడలేదు

''సార్ సార్''

''నాకేం తెలియదు ఇంక రైటరుగార్నే అడుక్కోండి'' అన్నాడు ప్రకాశం అతన్నేమీ కాపాడలేని తన అసమర్ధతని మాటల్లో చెప్పుకుంటూ

పంతులు రైటరు వైపు తిరిగాడు

''ఏం లాభం లేదు లోపలి కెళ్ళాల్సిందే సాయంత్రం యస్సై వచ్చినప్పుడు చూద్దాం అంతలావు నేరంలో ముద్దాయిని బయటుంచితే ఆయన మమ్మల్ని బతకనిస్తాడా?'' అన్నాడు రైటరు

''సార్ అయ్యా రైటరుగారూ, నేను ఏ పాపం ఎరగను సార్ ఆ దేవుడి మీదొట్టు నా పిల్లల మీదొట్టు'' అన్నాడు నీళ్ళు నిండిన కళ్ళతో

''ఇట్లా ఒట్లు వేసేవాళ్ళని చాలామందిని చూశాం నేరం చేసిన వాడు ఎవడూ ఒప్పుకోలా నా సర్వీసులో'' అన్నాడు రైటరు

''అయ్యా! రైటరుగారూ నేను ''

పంతులిమాట పూర్తికాకముందే రైటరు కోపంగా ప్రకాశాన్ని కేకలువేశాడు ''ఏమిటోయ్ నీ ఉద్దేశ్యం నీ ఉద్యోగం నేను చెయ్యాలా? నీ మాట ప్రకారం నేను నడుచుకోవాలా?'' అన్నాడు

ప్రకాశం మౌనంగా పంతులువైపు తిరిగాడు

''పదండి పంతులుగారు సాయంత్రం యస్సై గారొచ్చాక '' అని అతనింకేమీ మాట్లాడటానికి అవకాశం ఇవ్వకుండా రెక్క పట్టుకొని చిన్నగా లాకప్ రూం దగ్గరకు తీసుకుపోయాడు పంతులేమి మాట్లాడలేకపోయాడు అతనికేమీ తోచలేదు లాకప్ తాళం తీశాడు లోపల కెళ్ళ మన్నట్టు చూశాడు ప్రకాశం

''జవానుగారూ ఎంత నమ్మించారు సార్ '' అన్నాడు పంతులు ఆవేదనగా

ఆ మాటలు శూలాల్లా గుచ్చుకున్నయ్ ప్రకాశంకు ఏం మాట్లాడలేకపోయాడు బాధతో చిన్నగా, ''ఇక్కడి పరిస్థితిని వూహించలేకపోయాను మీ విషయంలో'' అన్నాడు

''కానీయండి అన్నిటికీ ఆ దేవుడున్నాడు'' అని లాకప్‌లోకి అడుగు పెట్టాడు పంతులు

ప్రకాశం ఇంకేమీ మాట్లాడలేకపోయాడు చటుక్కున లాకప్ తాళం వేశాడు తాళం చెయ్యి తీసుకొచ్చి రైటరు బల్లమీద పెట్టాడు బైటకొస్తుంటే రైటరు అడిగాడు

''చెక్ చేశావా?''

''ఆఁ ఏం లేవు'' అన్నాడు ప్రకాశం సరాసరి గోపాలం ఇంటికెళ్ళాడు గోపాలం వున్నాడు జరిగింది చెప్పాడు

అంతా విని గోపాలం, ''ఆ పంతుల్ని పిలుచుకురమ్మని ముందు నాకు చెప్పాడు రైటరు నేను పోనన్నా తరువాత నీకు చెప్పాడు మొన్నే వాళ్ళూరోళ్ళు కొంత మంది ఇక్కడికొస్తే విషయం అడిగా పంతులు మంచోడనీ, మెతకనీ, అతనొచ్చాక పిల్లలకి నాలుగక్షరం ముక్కలొస్తున్నాయనీ చెప్పారంతా'' అన్నాడు

''అసలేంది కంప్లయింట్?''

''ఆ మునసబు మనవడుకూడా ఈ పంతులు దగ్గర చదువుకోవటానికి వస్తాడంట మొన్న వాడు ప్రైవేటుకొచ్చినప్పుడుందంట ఇంటికెళ్ళేసరికి లేదంట వాడిమెళ్ళోని పులిగోరు బంగారు గొలుసు ఈ పంతులే కాజేసి వుంటాడని కంప్లైంట్ యిచ్చాడు ఎట్టాగయినా అది రికవరీచేస్తే యస్సైకేదో కాస్త బాగానే ముట్టచెబుతానని ఆశపెట్టి వుంటాడు మునసబు అందుకని యస్సై అంత పట్టుదలగా వున్నాడు పాపం'' అన్నాడు

''నేను నలుగురైదుగుర్ని అడిగా వూళ్ళో అంతా పంతులంటే అభిమానంగానే మాట్లాడారు ఇస్కూలుని బాగా అభివృద్ధిలోకి తెచ్చాడంట మునసబు మనవడిది అక్షరాలు నేర్చుకొనే వయస్సు కూడా కాదంట పసిబిడ్డకి బంగారుగొలుసు పెట్టి పంపించటం ఏందీ బలిసిన పని కాకపోతే'' అన్నాడు కోపంగా ప్రకాశం

''అవునుమరి వూళ్ళోవాళ్ళే అన్నారుగా మునసబు మనవడి మెళ్ళో గొలుసు తీసే దమ్ములు ఆవూళ్ళో వాళ్ళకే కాదు, ఆ చుట్టపక్కల వూళ్ళ వాళ్ళకి కూడా లేవన్నారు'' అన్నాడు గోపాలం

''పాపం ఆ పంతులి ఖర్మకాలింది యస్సై కొట్టడంటావా? పాపం, నమ్మించి తీసుకొచ్చా ఇట్టా అనుకుంటే అసలు తెచ్చేవాడినేకాదు లేడని చెప్పేవాడినివచ్చి, ఏదైతే అదైయ్యేది మనమేడ కట్టుకుంటాం ఈ పాపం తినకపోయినా చెయ్యకపోయినా ఈ పాపభారం ఎందుకు'' అన్నాడు బాధగా ప్రకాశం

''కొట్టకుండా ఎందుకుంటాడు వాడికి డబ్బు ముఖ్యం డబ్బుకోసం ఏదైనా చేస్తాడు కొట్టటం, మిగతావాళ్ళతో కొట్టించటం వాడికి సరదా ఆ దండెక్కడో మునసబుగాడి ఇంట్లోనే దొరికిద్ది చూడు'' అన్నాడు గోపాలం

''నాకు బలే బాధగా వుంది'' అన్నాడు ప్రకాశం

''సరేలే, ఇట్టాంటియన్నీ పట్టించుకుంటే మనం ఉద్యోగం చెయ్యలేం పో, పోయి భోంచెయ్యి'' అన్నాడు ప్రకాశం లేచాడు

సాయంత్రం రోల్‌కాల్‌కు వెళ్ళినప్పుడు మునసబు స్టేషనులో వున్నాడు రోల్‌కాల్‌లో యస్సై పంతుల్ని పిలిపించాడు లోపలికి యస్సై టేబిలుకెదురుగా వున్న బెంచీమీద మునసబు కూర్చుని వున్నాడు పక్కనరైటరు, సార్జెన్ నిలబడ్డారు పంతులు వణుకుతూ చేతులు యస్సైవైపు జోడించి దీనంగా నిలబడి వున్నాడు రోల్‌కాల్ కొచ్చిన పీసీలంతా అతన్నే చూస్తున్నారు అతన్ని చూస్తే

ప్రకాశంకు బాధ కలిగింది

''వూఁ త్వరగా తేల్చు'' అన్నాడు యస్పై

''నాకేం తెలియదు సార్ అప్పటికీ నేను రెండు మూడుసార్లు మునసబుగారికి విన్నవించుకున్నాను కూడా సార్, పసిబిడ్డలకి బంగారు వస్తువులు పెట్టి బడికి పంపొద్దని కావాలంటే అడగండి సార్'' అన్నాడు పంతులు వినయంగా

ఆ మాటకు మునసబు ఏదో చెప్పబోయేంతలో యస్పై అందుకున్నాడు ''వస్తువులు పెట్టుకోవటానికి కాకపోతే దాచుకోవటానికా చేయించుకునేది'' అన్నాడు సీరియస్‌గా ఫోజు పెట్టి ఆమాట అన్న తరువాత మునసబు వైపు చూశాడు 'చూశావా ఎటువంటి పాయింటు లేవదీశానో నీ తరపున' అన్నట్టుంది ఆ చూపు మునసబు లోపల్లోపల నవ్వుకున్నాడు

పంతులింకేమీ మాట్లాడలేదు

''సరే నువ్విట్లా చెప్పవులే నీచేత 'నిజం' ఎట్లా చెప్పించాలో నాకు తెలుసు చూస్తా తెల్లారేసరికి నీ చేత్తోనే వస్తువు తెప్పిస్తా'' అని రైటరువైపు తిరిగి, ''వీడిని లోపల వెయ్ వీడికోస మెవరొచ్చినా తన్ని లోపలెయ్ వాళ్ళని కూడా'' అన్నాడు

పంతులు గడగడా వణికిపోయాడు రైటరతన్ని రెక్కపట్టుకుని లోపలకు లాక్కుపోయాడు పంతులు వెళుతూ వెళుతూ ప్రకాశంవైపు చూశాడు ఆ చూపుని తట్టుకోలేక పోయాడు ప్రకాశం అది కసుక్కున గుండెల్లో గుచ్చుకుంది

కొద్దిసేపు అక్కడ అంతా నిశ్శబ్దం అవరించింది పంతులు నిర్దోషి అని తను అనుకుంటున్నా ననీ, తను ఎంక్వయిరీచేస్తే అతన్ని గురించి ఎవరూ చెడుగా చెప్పలేదని యస్పైతో చెప్పాలని వుద్రేకపడుతున్నాడు ప్రకాశం

''పంతులు నిన్ను ముందుగా గొలుసు విషయం హెచ్చరించాడా?'' అడిగాడు యస్పై మునసబుని

''ఆఁ చెప్పాడు రెండు మూడుసార్లు, మనసులో ఈ ఉద్దేశ్యం ఉంచుకునే కాబోలు'' అన్నాడు మునసబు

ఆ మాటకు యస్పై నవ్వాడు

''నేను ఎంక్వయిరీ చేశానుసార్ '' అన్నాడు ప్రకాశం చటుక్కున అందరూ అతని వైపు చూశారు అతనింక నిగ్రహించుకోలేక పోయాడు

'ఏమిటి?' అన్నట్లు చూశాడు యస్పై

''అతన్ని గురించి ఎవరూ చెడ్డగా ''

అతని మాటలు పూర్తికాకముందే యస్పై అందుకున్నాడు '' ఏడిశావ్ నీ ముఖం నీ బోటోళ్ళకే అంతా అర్థమయితే ఇంక మేమెందుకిక్కడ ?'' అన్నాడు మునసబువైపు చూస్తూ అతని మాటల్లో కొంత కోపం, కొంత ఎగతాళీ కనపడింది

ఇంక ప్రకాశం ఏమీ మాట్లాడలేదు కొద్దిసేపటి తరువాత రోల్‌కాల్‌కొచ్చిన మెన్‌ని బయటకు పంపించాడు యస్పై

మునసబుకూడా లేస్తూ యస్పైవైపు చూశాడు యస్పై ఆ చూపుని అర్థం చేసుకున్నట్టు ''రేపు సాయంత్రం వచ్చి గొలుసు తీసుకుపోండి మీది కాకపోయినా ఇంకొకటయినా ఇచ్చే పూచీ నాది'' అన్నాడు

మునసబు నవ్వి, నమస్కారం చేసి వెళ్ళాడు

రాత్రి ఎనిమిది గంటలకు నైటుబీటు కెళ్ళటానికి స్టేషనుకొస్తుంటే లోపల్నుండి బాధతో కూడిన కేకలు వినపడ్డయ్ పులిక్కి పడ్డట్టు చూసి, 'దేవుడా పంతుల్ని కాదుకదా!?' అనుకుంటూ భయపడుతూ లోపలికొచ్చాడు ప్రకాశం

యస్సై రూంలోని దృశ్యం భయం కలిగించింది అతనికి

పంతుల్ని తలకిందులుగా వేలాడదీసి ఒకపక్క చింపిరయ్యా, మరోపక్క రైటరూ నిలబడి అతని అరికాళ్ళ మీద లారీల్తో కొడుతున్నారు విశ్వనాధం నిలబడి రొప్పుతున్నాడు వాళ్ళ వళ్ళంతా చెమటతో తడిచి పోయింది అలుపుతో రొప్పుతున్నారు యస్సై తన కుర్చీలో కూర్చుని కాళ్ళు రెండూ టేబిలుమీద పడేసి, సిగరెట్టు కాలుస్తూ చూస్తున్నాడు వినోదంగా పంతులు బాధతో మెలికలు తిరిగి పోతున్నాడు ఒక నిముషం కన్నా ఆ దృశ్యం చూడలేక పోయాడు ప్రకాశం వెనక్కి తిరిగి యస్సై దృష్టిలో పడకుండా పక్కకు తప్పుకోబోయే లోపల యస్సై కేక వెయ్యనే వేశాడు ''అరేయ్, ఇటురారా''

లోపలికెళ్ళి సెల్యూట్‌చేసి నిలబడ్డాడు ప్రకాశం యస్సైకి కూడా వళ్ళంతా చెమటతో తడిచివుంది వాళ్ళిద్దరూ కొద్దిసేపు కొట్టటం ఆపారు పంతుల్ని చూస్తే ఏడుపొచ్చింది ప్రకాశంకు మౌనంగా నిలబడ్డాడు భయపడుతూ

''ఆ లారీ వాడికియ్యవయ్యా'' అన్నాడు రైటరుతో యస్సై

రైటరు ప్రకాశంకు లారీ అందించాడు అనాలోచితంగా అందుకున్నాడు ప్రకాశం

''వూ కానియ్ కొట్టు'' అన్నాడు యస్సై

ప్రకాశం పంతులువైపు చూశాడు పంతులు అచేతనంగా వేలాడుతున్నాడు అతన్నలాచూస్తే కడుపులో దేవినట్లయింది ఏం చెయ్యాలో తోచని పరిస్థితి

''ఏరా, నిలబడతావ్ లంజాకొడకా'' యస్సై గద్దింపుకు బిక్కచచ్చి పోయాడు ప్రకాశం

''సార్ నేను వూళ్ళో '' తడారిపోయినగొంతుతో ఏదో చెప్పబోయేలోగా యస్సై గొంతు పులిక్కి పడేట్టు చేసింది

''చెప్పింది చెయ్యరా రాస్కెల్ '' కోపంతో పళ్ళు కొరుకుతూ అన్నాడు

ప్రకాశం పంతులు వైపు చూశాడు 'చచ్చిపోయాడేమో' అనుకున్నాడు అతనికి తెలియకుండానే అతని చేతిలోని లారీ జారి కిందపడింది ఆ సంఘటన యస్సైకి తీవ్రమయిన కోపం తెప్పించింది ఇష్టమొచ్చినట్లు తిట్టాడు అచేతనంగా, మెదడు పని చెయ్యని వాడిలాగా ప్రకాశం నిలబడ్డాడు అతని ప్రవర్తన యస్సైని వుడికించింది దడాలున కుర్చీలోంచి లేచి చేత్తో ప్రకాశం చెంపమీద కొట్టబోయాడు కోపాన్ని తమాయించుకున్నట్టు మెడమీద చెయ్యివేసి బయటకు నెట్టాడు బలంగా, బూతులు తిడుతూ తూలుతూ బయటకు వచ్చాడు ప్రకాశం ప్రకాశంమీది కోపమంతా పంతులు మీద చూపించాడు యస్సై

పంతులు ఆ దెబ్బల్ని తట్టుకోలేక మెలికలు తిరిగి పోతున్నాడు అతను వేస్తున్న కేకలు ప్రకాశం హృదయాన్ని బలంగా నొక్కుతున్నయ్ అతని కళ్లవెంట కారే నీరు ప్రకాశం కళ్ళల్లో ఇంకా కనిపిస్తూనే వుంది

''చెప్పరా నాకొడక ఆ గొలుసెక్కడ పెట్టావో చెప్పు'' అంటున్నాడు రైటరు కొడుతూ

''వాడట్లా చెపుతాడా? తెల్లారేసరికి నాశికి బొంద పడతా అప్పుడు గాని '' అలుపువల్ల

మాటలు సరిగా రావటంలేదు యస్పైకి

కొట్టటం ఆగలేదు కాని పంతులి కేకలు క్రమేణా తగ్గిపోయాయి

గదిలో నుండి వినపడే పంతులి దీనస్వరాన్నీ, యస్పై గావుకేకల్నీ బయట వున్న స్టాఫంతా గొర్రెల్లా నిలబడి వింటూవుండిపోయారు

డిసిప్లెన్ వాళ్ళని గొర్రెలకన్నా అసమర్థులుగా చేసింది

''కడుపు కింత తిండి దొరుకుతుందనేగాని మనకన్నా పెంటతినే పందులు ఎన్నో వేల రెట్లు స్వతంత్రంగా, రోషంగా బ్రతుకుతున్నయ్'' అన్నాడు సుబ్బారెడ్డి ఉద్రేకంగా

''ఈ డిసిప్లెన్ మన మెదడుల్నీ, శరీరాల్నీ మన యిష్టా యిష్టాలతో సంబంధం లేకుండా చేసింది'' అన్నాడు అతనే మళ్ళీ

''ప్రాణమున్న మనకీ ప్రాణంలేని శవాలకీ తేడాలేదు'' అన్నారు ఎవరో

ప్రకాశంకు ఇవేమీ వినిపించటం లేదు అతని కళ్ళముందు పంతులి పెళ్ళాం పిల్లలు కదులుతున్నారు దీనాతి దీనమైన పంతులి గొంతు అతని చెవుల్లో మారుమ్రోగుతోంది

లోపల యస్పై సిగరెట్లమీద సిగరెట్లు తాగుతున్నాడు పూనకం వచ్చిన వాడిలాగా కొట్టే వాళ్ళ చేతులు సచ్చుబడి పోయాయి పంతులు పంచెలోనే ఒకటీ రెండూ చేసుకున్నాడు మూడోసారి వంటిమీది తెల్లటి చొక్కా నెత్తుటి మరకలతో నిండిపోయింది కొద్దిసేపటికి స్పృహ తప్పిపోయాడు అయినా కొడతం మానలేదు వాళ్ళు దుర్వాసన గదంతా నిండింది

యస్పై మధ్య మధ్య ప్రకాశంను తిడుతున్నాడు ''ఆ రిక్రూట్ నా కొడుకు సంగతి చూస్తా ముద్దాయికి సపోర్టు చేస్తున్నాడని రిపోర్టు రాస్తా ఉద్యోగం వూడ బీకి బొక్కలో తోయిస్తా ఆ మాల నా కొడుకుని ఇటు పిలవండి'' అన్నాడు రంకెలు వేస్తూ లోపల్నుండి

ప్రకాశంకు భయంతో కాళ్ళు వణికాయి వెళ్ళి యస్పై ముందు నిలబడ్డాడు యస్పై భయంకరంగా తిట్టాడు బయట వున్న వాళ్ళందరినీ, గార్డులో వున్న వాళ్ళందరినీ ఇళ్ళల్లో పడుకున్న వాళ్ళందరినీ పిలిపించాడు స్పృహ తప్పి పడివున్న పంతుల్ని అందరూ తలా ఒక దెబ్బ కొట్టేందాకా వూరుకోలేదు యస్పై

పంతులు గనక ఛస్తే అందులో అందరికీ సంబంధాన్ని కలుగజేయటానికే అందిరినీ కొట్టమన్నాడు యస్పై అప్పుడు వాళ్ళకు కలిగిన కోపంతో ఒక్క దెబ్బతో యస్పైని చంపగలరు, కాని డిసిప్లెన్ వాళ్ళని అసమర్థుల్ని చేసింది

ఓ గంట గడిచింది పంతులి శరీరాన్ని ఇద్దరు పీసీలు మోసుకొచ్చి బైట గచ్చు మీద పడేశారు అప్పటికే అతని వళ్ళంతా వాచిపోయింది కదలిక కనిపించటం లేదు పంతులు కోసం సాయంత్రం వచ్చిన అతని బావని లాకప్‌లో వేశారు పంతులి పరిస్థితి ఇప్పుడు యస్పైకి ఆందోళన కలిగిస్తోంది రైటరు గ్లాసుతో నీళ్ళు తెచ్చి పంతులి నోట్లో పొయ్యటానికి ప్రయత్నించాడు యస్పై రైటర్నీ, సార్జెన్నీ, ఇంకా ఇద్దరు ముగ్గురు నమ్మకమైన పీసీలని పిలిచి ఏదో గుసగుస లాడాడు తరువాత వాళ్ళంతా బైటకొచ్చారు తలలూపి బైటకొచ్చాక సార్జెన్ వాళ్ళతో, ''మీరుండండయ్యా పంతుల్ని ఆసుపత్రికి తీసుకెళ్ళాలి'' అన్నాడు వాళ్ళంతా తల లూపారు మళ్ళీ

నిజమే ననుకున్నాడు ప్రకాశం పంతులి శరీరంవైపు చూస్తుంటేనే భయమేస్తోంది చాలామందికి కానీ అతని శరీరంలోని ప్రాణం నెమ్మదిగా మాయమవటం ఎవరూ గమనించలేకపోయారు

ఆ ఇద్దరు ముగ్గురు పీసీల్ని మినహాయించి మిగిలినవాళ్ళని లోపలకు పిలిపించాడు యస్పై

అంతా వెళ్ళి వరుసగా ఫాలెన్ అయ్యారు అందరి వైపు భయం కలిగించే చూపులు చూశాడు యస్పై ''ఎక్కడన్నా ఎవరన్నా నోరు జారారో, మీ గతీ అంతే'' అన్నాడు కర్కశంగా

విని గుటకలు మింగి వూరుకున్నారు తరువాత అంతా బయటకు వచ్చారు ఆ రాత్రి వాళ్ళకు దూరపు వూళ్ళకు బీట్లు వేశారు అంతా వెళ్ళి పోయారు ఉదయం బీటు నుండి తిరిగొచ్చి ఆతృతగా అడిగాడు సెంట్రీని పంతుల్ని గురించి ప్రకాశం

''రాత్రి ఆసుపత్రికి తీసుకెళ్ళారంట ఫరవాలేదని చెప్పాడు సార్జెన్'' అన్నాడు సెంట్రీ ఆ మాట కొంచెం వూరట కలిగించింది ప్రకాశంకు సంతోషంగా గాలి పీల్చుకున్నాడు ఆసుపత్రి కెళ్ళి చూచి రావాలనుకున్నాడు కానీ ఆ విషయం యస్పైకి తెలిస్తేమళ్ళీ గొడవని వూరుకున్నాడు ఆ మధ్యాహ్నం హాయిగా నిద్రపోయాడు సాయంత్రం రోల్‌కాల్‌కు వచ్చాడు స్టేషన్లో వాతావరణం అంతా గంభీరంగా వుంది యస్పై టౌన్‌లో సి ఐ ని కలవటానికి వెళ్ళాడని తెలిసింది రైటరు ఏదో రాసుకుంటున్నాడు తల ఎత్తకుండా రైటరు కెదురుగా ఎవరో ఒకతను కూర్చుని వున్నాడు

''ఆయనెవరు? ఎప్పుడూ చూచిన గుర్తు లేదే'' అన్నాడు గోపాలంతో ప్రకాశం

''ఆయన కరణంలే ముసలిపాడు ఏదో కంప్లైంట్ యివ్వటానికి వచ్చాడు ఎక్కడో శవం వుందంట'' అన్నాడు క్లుప్తంగా గోపాలం ప్రకాశం ఇంకేమీ మాట్లాడలేదు

ఓ అరగంట గడిచాక రైటరు కేకేశాడు ప్రకాశాన్నీ, విశ్వనాధాన్నీ ఇద్దరూ వెళ్ళారు

''చింతపల్లి చిట్టడవిలో, ఫలానా బావి దగ్గర ఎవరిదో మగమనిషి శవం వుందంట మీరెళ్ళి బందోబస్తుగా వుండండి యస్పైగారు రాగానే వచ్చి శవపంచాయితీ చేసి శవాన్ని ఆసుపత్రికి పంపిస్తారు'' అని పాస్‌పోర్టు ఇచ్చాడు

ప్రకాశంకు ఆశ్చర్యమేసింది విశ్వనాధానికి ఆ డ్యూటీ వెయ్యటం విడ్డూరంగా తోచింది తడవ తడవకు తనకే శవాలకు ఎస్కార్టు డ్యూటీలు వేసే విషయం గురించి అడగాలనుకున్నాడు కానీ రాత్రి నుండీ వాతావరణం బాగాలేదు తమాయించుకుని వూరుకున్నాడు గబగబా ఇంటికెళ్ళి స్నానం చేసి, భోంచేసి విశ్వనాధంతో కలిసి బయలుదేరాడు కరణంతోపాటు వచ్చిన వెట్టతను వీళ్ళను వెంటబెట్టుకొని శవం వున్న చోటుకి తీసుకెళ్ళాడు అప్పటికే బాగా పొద్దు గుంకింది వెలుతురు తగ్గి పోతోంది దూరంగా పొదల్లో శవానికి కాపలాగా ఇంకొక వెట్టతను వున్నాడు గబగబా నడిచాడు ప్రకాశం విశ్వనాధం నిమ్మళంగా నడుస్తూ వచ్చాడు ప్రకాశం వెళ్ళి పొదల్లోకి తొంగి చూశాడు పంతులి శవం వెల్లకిలా పడివుంది ఒక్కసారిగా గుండె ఆగిపోయినట్లు అనిపించింది క్షణాల్లో విషయం అర్థమైపోయింది బాధతో హృదయం విలవిల్లాడింది పక్కకు తిరిగి చూశాడు విశ్వనాధం దూరంగా నిలబడి వెట్టతనితో మాట్లాడుతున్నాడు నింపాదిగా ఇక అక్కడ నిలబడలేక ఇవతలకు వచ్చాడు

''ఏ వూరంట ఇతనిది?'' అడుగుతున్నాడు విశ్వనాధం

''ఏమో దొరా మరి ఏవూరో '' అంటున్నాడు వెట్టతను

ప్రకాశం తనకు తెలియకుండానే కోపంతో పళ్ళు కొరుక్కున్నాడు ఆ క్షణంలో విశ్వనాధాన్ని చూస్తే భయమేసింది 'ఎంత దారుణానికి ఒడికట్టారూ! వీళ్ళెంతకయినా తగుదురు' అనుకున్నాడు

ఆ రాత్రంతా ఎండుచిదుగులు తెచ్చి మంటవేస్తూ కాపలా కాసేరు విశ్వనాధం ఆ మంటపక్కనే పడుకుని కునుకు తీశాడు ప్రకాశంకు కళ్ళల్లో పంతులే కనపడుతున్నాడు 'ఈ

పాపంలో భాగం తనకూ వుంది' అనుకున్నాడు పదేపదే పంతులి భార్యా, పిల్లలు వరుసగా కళ్ళల్లో కదిలారు 'ఆ బిడ్డలు ఎంత అల్లాడిపోతున్నారో' అనుకున్నాడు తెల తెల వారుతుండగా భారమైన హృదయంతో చిన్నగా కునుకు తీశాడు కానీ కాసేపట్లోనే వులిక్కిపడి కళ్ళు తెరిచి చూశాడు ఏదో అలికిడయితే అంతా నిదరపోతున్నారు నక్కొకటి పొద చట్టూ వాసన చూస్తూ తిరుగుతోంది లేచి గభాలున చేతికందిన రాయి విసిరాడు అది తప్పిచ్చుకొని పారిపోయింది అక్కడే చతికిలపడ్డాడు మళ్ళీ హృదయాన్నీ, శరీరాన్నీ నీరసం ఆవహించింది

ఉదయం పది గంటలకు యస్సై, సార్జెన్ వచ్చారు యస్సైతో పాటు రిపోర్టిచ్చిన కరణం కూడా వచ్చాడు నీరసంగా సెల్యూట్ చేశాడు ప్రకాశం

''ఏవూరివాడో ఏమన్నా తెలిసిందటయ్యా'' అన్నాడు వస్తూనే విశ్వనాధంతో యస్సై

''అయ్యా! విచారించాను సార్ ఎవరూ చెప్పలేకపోయారు సార్'' అన్నాడు విశ్వనాధం అతి వినయంగా ఆ మాటలు వింటూ ప్రకాశం వైపు అదోలా చూచి తల తిప్పుకున్నాడు యస్సై యస్సైని చూస్తే వణుకు పుట్టింది నరుడి రూపంలో వున్న క్రూర జంతువులాగా తోచాడు ప్రకాశం కళ్ళకు యస్సై

శవాన్ని పొదలో నుండి ఇవతలకు తీశారు వెట్టివాళ్ళు శవ పంచాయితీ మొదలయింది ఏమాత్రం నదురూ, బెదురూ లేకుండా యస్సై, సార్జెన్‌లు శవ పంచాయితీ చేశారు ప్రకాశం బొమ్మలా నిలబడి చూస్తూ వుండిపోయాడు కడుపులో ఎలుకలు పరిగెత్తుతున్నయ్

''ఏమోయ్ ఇక్కడేమిటి? ఈ కాలి మడం నక్కో, తోడెలో పీకినట్టుంది రాత్రి తెల్లవార్లూ నిద్దరపోయారా?'' అని దబాయించాడు ప్రకాశాన్నీ, విశ్వనాధాన్ని మార్చి మార్చి చూస్తూ యస్సై ప్రకాశంకు కోపమొచ్చింది గుడ్లెర్ర జేశాడు

''అయ్యా! లేదయ్యా! మేమొచ్చే సరికే అట్లాగే వుందయ్యా!'' అన్నాడు విశ్వనాధం

యస్సై ఆ మాటకు, ''మనిషి చచ్చాడని కుక్కలకూ, నక్కలకు వదిలి పెట్టగూడదయ్యా! మనిషన్నవాడు చచ్చినా, బతికినా ఒక్కటే'' అన్నాడు

ఆ మాటలకు కరణం సంతోషం కలిగినట్లు తలూపాడు నవ్వుతూ వెంటనే, ''ఎవురో పాపిష్టి ముండా కొడుకులు, రాక్షసంగా కొట్టి చంపినట్టుంది సార్ మరి వాళ్ళు ఏ చావు చస్తారోగానీ'' అన్నాడు బాధగా

ఆ మాటలు సూదుల్లా గుచ్చుకున్నాయి వినీ విననట్టు వూరుకున్నారు యస్సై, సార్జెన్‌లు

రెండు నిముషాలు ఆగిన తరువాత కరణంతో, ''మీరెళ్ళి శవాన్ని పి యమ్ కు పంపటానికి బండి ఒకటి ఏర్పాటు చేసుకురండి ఈలోపు'' అన్నాడు యస్సై కరణం తలూపి ఒక వెట్టతన్ని తీసుకుని వెళ్ళాడు

కొద్ది సేపున్నాక ప్రకాశం వైపు తిరిగి, ''ఎక్కడన్నా నోరు జారావా, నీ గతి కూడా ఇంతే'' అన్నాడు యస్సై బొమ్మలా నిలబడిపోయాడు ప్రకాశం

''నేనన్నీ చెప్పానులే సార్'' అన్నాడు విశ్వనాధం

ఆ శవాన్ని పి యమ్ చేయించి, దిక్కులేని శవంలాగా శ్మశానంలో పూడ్చేయించి, యింటికి చేరేసరికి రాత్రి పదయింది ఆ రాత్రి భోజనం సహించలేదు నిద్ర రాలేదు ప్రకాశానికి

ఉదయం మామూలుగా రోల్‌కాల్‌కు హాజరయ్యినప్పుడు లాకప్‌లో కొత్తఅతను కనపడ్డాడు అతన్ని గురించి అడిగాడు ప్రకాశం గోపాలాన్ని

''వాడే మునసబు మనవడి మెడలోని గొలుసు కాజేసిన ఘనుడు  ఆవూరి కోమటోడు'' అన్నాడు గోపాలం నవ్వుతూ

ప్రకాశం ఆశ్చర్యంగా చూశాడు నోరు తెరుచుకొని

''వ్హూ గొలుసు కూడా రికవరీ చేశారుగా'' అన్నాడు గోపాలం

''పాపం పంతులు  ''

''అన్యాయమైపోయాడు  అంతే  పోలీసుల్ని ఈ ప్రభుత్వం పోషిస్తోంది ప్రజలకు న్యాయం చెయ్యటానికి కాదన్న సంగతి అర్థమైపోతోంది  పోలీసులంటే లైసెన్సు వున్న నేరస్థులు  ఈ తెల్లవాళ్ళు పోలీసుల్ని అందుకే వుపయోగించుకుంటున్నారు''

వింటూ వుండిపోయాడు ప్రకాశం చాలాసేపు

''మరింక పంతుల్ని అంత అన్యాయం చేశారు కదా  మరి దాని మీద ఇంకేమీ వుండదంటావా?'' అన్నాడు ప్రకాశం

''వుంటుంది  కాని అదంతా వట్టి తతంగమే  బోగస్ విచారణ  సాక్షులు ఏరి?''

''మనం వున్నాంగా  '' అన్నాడు ప్రకాశం అయోమయంగా

''సాక్ష్యం చెప్పి మనం ప్రాణాలతో వుంటామా?''

''  ?!''

''మనం అర్భకులం  మనకేదన్నా సంఘం వుంటే, మన తరఫున నిలబడిద్ది  అప్పుడు మనం సాక్ష్యం చెప్పొచ్చు  అప్పుడు ఇట్లాంటి అన్యాయాలు తగ్గుతాయి '' అన్నాడు గోపాలం

ప్రకాశం విని వూరుకున్నాడు  కొద్దిసేపున్నాక ''వీడెట్లా కాజేశాడంటా?'' అన్నాడు

''ఆ పిల్ల గాడేదో కొనుక్కోచ్చుకోటానికి ఈ కోమటోడి చిల్లర కొట్టుకెళ్ళాడు  ఆ గొలుసుని కాస్తా చల్లగా కాజేశాడు వీడు'' అన్నాడు గోపాలం

రోల్‌కాల్ గబగబా జరిపి అందరినీ పంపివేశాడు రైటరు  ఆ చర్య ఆశ్చర్యం కలిగించింది ప్రకాశంకు  ఎప్పుడూ రోల్‌కాల్ తీసిన తరువాత గంటలతరబడి ఏ డ్యూటీ చెప్పకుండా స్టేషన్లోపడేసి, పనిష్మెంటు ఇచ్చే రైటరు, ఆ పూట వెంటనే పంపివెయ్యటం ఆశ్చర్యం కలిగించింది గార్డు వాళ్ళు మాత్రం స్టేషన్లో వున్నారు

సాయంత్రం రోల్‌కాల్‌కు వచ్చినప్పుడు కోమటతను లాకప్‌లో లేడు  యస్సై కెదురుగా మునసబు కూర్చునివున్నాడు  సుబ్బారెడ్డి సెంట్రీ డ్యూటీలో వున్నాడు  అతని దగ్గరకెళ్ళి అడిగాడు ప్రకాశం ఏం జరిగిందని

''ఏముంది  మామూలే  కేసుపెట్టి జైలుకు పంపిస్తానన్నాడు ఆ కోమటోడి మీద  వాడు లబోదిబోమని ఓ వంద ఇచ్చుకుని గొలుసు అప్పజెప్పి కాలికి బుద్ధిచెప్పాడు'' అన్నాడు సుబ్బారెడ్డి

కొద్దిసేపు మౌనంగావున్న తర్వాత మళ్ళీ అడిగాడు ప్రకాశం ''మునసబు విషయం ఏమిటి?'' అని

''ఏముందీ, వాడిచ్చింది ఫాల్స్ రిపోర్టంటున్నాడు యస్సై  అటు కోమటోడి దగ్గరనుండి గొలుసు రికవరీ చేసుకుని జేబులో వేసుకున్నాడు  ఇటు మునసబుతో వాడిచ్చింది ఫాల్స్ రిపోర్టు అంటున్నాడు  ఇంకా ఎక్కువ మాట్లాడితే పంతుల్ని చంపించింది మునసబే అని సాక్షుల్ని తీసుకొస్తాడుకూడా  వాడంతటివాడే'' అన్నాడు సుబ్బారెడ్డి

ప్రకాశంకు ఆశ్చర్యం, భయం కలిగాయి  తను ఎటువంటి వ్యక్తుల మధ్య బతుకుతున్నదీ

వూహించుకుంటేనే గుండెజారిపోయింది 'ఏదన్నా సందర్భంలో తమనిమాత్రం అటువంటిపని చేయించడని గ్యారంటీ ఏముంది?! వీడెంతకైనా సమర్థుడే' అనుకున్నాడు మళ్ళీ మళ్ళీ

రెండోరోజు స్టేషన్లో గోపాలం చెప్పాడు ''నిన్న మునసబుగాడ్ని బెదరగొట్టాడు యస్సై వాడువచ్చి కూర్చోగానే మర్యాదగా పలకరిస్తున్నట్లు 'ఏమండీ మునసబుగారూ మళ్ళా ఏం పోయిందీ ఈ సారి ఎవరిమీద కంప్లైయింట్ ఇవ్వబోతున్నారు' అన్నాడు మునసబు ఆశ్చర్యంగా నోరు తెరిచాడు 'అదేందిసార్' అన్నాడు యస్సై సీరియస్ అయిపోయాడు 'ఇంకమర్యాదగా నోరుమూసుకుని బైటకునడిస్తే మంచిది ఏదో వూరిపెద్దవని ఇంతవరకూ నీకుసీటిచ్చా నీ వస్తువుని నీయింట్లోనే పెట్టుకొని పంతులు నీయింటికొచ్చి నీమనవడికి ట్యూషన్ చెప్పలేదని వాడిమీదా, పాతబాకీ గట్టిగా అడిగాడని కోమటోడిమీద, ఇంకా ఎంతమంది పేర్లు చెపుతావు? ఫాల్స్‌రిపోర్ట్లు ఇస్తున్నావని నిన్నుబొక్కలోవేస్తా జాగ్రత్తా' అని గదిమాడు ఆ మాటకు బిత్తరపోయి చూశాడు మునసబు ఏదో చెప్పబోయాడు కాని యస్సై అవకాశం ఇవ్వలేదు 'మర్యాదగా బైటకునడువ్ నీ మనవడి వస్తువు తీస్తున్నప్పుడు చూసినోడెవడన్నావుంటే స్టేషనుకు తీసుకురా లేకుంటే రావద్దు పో బైటకు, గెటవుట్' అన్నాడు మునసబు ఛస్తూ బతుకుతూ పరిగెత్తాడు'' అని చెప్పి నవ్వాడు గోపాలం

గోపాలం చెప్పినతీరు నవ్వు తెప్పించింది ప్రకాశంకు చిరునవ్వు నవ్వాడు

''ఈ లెఖ్ఖన ఈడు చేసిన నేరాలెన్ని మొత్తం?'' అన్నాడు ప్రకాశం

''ఎన్నో లెఖ్ఖచూడు పంతుల్ని చంపించాడు కోమటోడిమీద న్యాయంగా కేసుపెట్టాలి కేసు ఏమీలేకుండా వదలిపెట్టాడు వాడి దగ్గర సుబ్బరంగా లంచం తీసుకున్నాడు మునసబుగాడి గొలుసు కాజేశాడు గొలుసు పంతులిదగ్గరనుండి రికవరీచేస్తానని మునసబు దగ్గర ముందే డబ్బులు వసూలు చేశాడు చూడు ఇవన్నీ లెఖ్ఖలోకే వస్తయ్ మనందరిచేత చట్ట విరుద్ధమైన పనులు చేయించాడుకూడా పైగా ఒకనేరం జరిగిందని తెలిసిన మనం ఆ నేరాన్ని గురించిన సమాచారాన్ని అందజెయ్యటానికి వీలులేకుండా ఈ డిసిప్లైన్ ఒకటి'' అన్నాడు

ప్రకాశం విన్నాడు బాగా ఆలోచించాడు పిచ్చెక్కినట్లువుంది తరువాత ఎటువాళ్ళటు వెళ్ళిపోయారు

రెండు రోజులకు ఆ విషయం పాతబడిపోయింది ఆర్థిక సమస్యలు వెంట పడుతున్నయ్ ఎప్పటిలాగానే. ఆ కోమటతను ఇచ్చినవాటిలో కానీ, మునసబు ఇచ్చిన వాటిలోకానీ ఏవన్నా ఇస్తారేమోనని ఎదురుచూశాడు కాని లాభం లేకపోయేసరికి చిన్నగా భయం భయంగా రైటరు దగ్గర నసిగాడు రైటరు ఎగాదిగా చూసి ''మాకే లేవు'' అన్నాడు ప్రకాశం ఇంకేమీ మాట్లాడ కుండా జరిగిన విషయాన్ని గోపాలంతో అన్నాడు

''ఎవడి కిచ్చాడు కాబట్టి నీకివ్వటానికి?'' అన్నాడు గోపాలం

''మీ కివ్వకపోవటం వేరు నేను పోయి పంతుల్ని పిలుచుకొచ్చాగదా!'' అన్నాడు అమాయకంగా ప్రకాశం

''ఆఁ పిలుచుకొస్తే ఏమిటి? రైటరుగాడికి ఒక రూపాయిచ్చాడంట సార్జిన్‌కేమో రెండిచ్చాడంట'' అన్నాడు

ప్రకాశంకు కోపమొచ్చింది కానీ బైటపడలేదు 'పంతులి విషయం గురించి ఏదన్నా ఎంక్వయిరీ జరిగితే సాక్ష్యం చెప్పాలి తరవాత ఏదయితే అదయ్యిద్ది ఈళ్ళని జైలుకు పంపాలి'

అనుకున్నాడు ఉద్రేకంగా

రెండురోజుల తరవాత ఏదో బందోబస్తుకు వెళ్ళినప్పుడు వెంకటేశం, గురవయ్య కనపడ్డారు జరిగింది చెప్పాడు విని నిట్టూర్చాడు గురవయ్య ''ఈ తెల్లోళ్ళు పోందే మనకీ కష్టాలు పోవు'' అన్నాడు తన ధోరణిలో

ఆ మాటకు వెంకటేశం చిరాగ్గా చూశాడు ''ఇదేంది? బలేగుందే! ఈ తెల్లోళ్ళు పోవాలంటున్నారు అంతా బాగానే వుంది సంబడం ఈడ ఈ పంతుల్ని సంపింది మనోళ్ళేగా దానికీ, తెల్లోళ్లకీ ఏంది సంబంధం?'' అన్నాడు

ఆ మాటకు గురవయ్య ఏం మాట్లాడలేదు ప్రకాశం నవ్వి, ''బలేపాయింటు లేవదీశావురా'' అన్నాడు

''ఈడ నాకు కనపడేది ఒక్కటే తెల్లోల్లు మన మనుకుంటున్నంత సెడ్డోళ్ళు కాదు అల్లు అట్టాంటోల్లైతే ఆ రోజు మనం ట్రైనింగుకి పోయేదప్పుడు మన చంద్రం గాడిని ఆ ఈరయ్య ముక్కుమీద గుద్దినప్పుడు, ఆడ్ని నౌకరీలోంచి వూడబీకరు ఇయ్యాల, ఈడ జరిగిందానికి కారణం ఆ యస్సై గాడి సోర్ధం ఆ సోర్ధం ఆడికి లేకపోతే ఇన్ని అన్నేయాలు జరగవు గదా! అది పోవాలికానీ, తెల్లోడు పోయి నల్లోడొచ్చినా లాభం కనపడే లాగా లేదు నాకు'' అన్నాడు వెంకటేశం

ఆ మాటకు గురవయ్య నవ్వాడు అతను ఏదో చెప్పే లోగా ప్రకాశం అందుకుని, ''అదొక్కటే కాదు మన ఆఫీసరు నా కొడుకులు చేసే ప్రతిపనీ స్వార్ధంతోనే కదా'' అన్నాడు

''మీరీ విషయంలో చాలా పొరపడుతున్నారు స్వార్ధం మనిషికి పుట్టుకతోనే వస్తుంది అది చావుతోనే పోయేది దానిని మధ్యలో పోగొట్టలేం కాకపోతే మన నల్లవాళ్ళు దాన్ని కొంత వరకు ఆపుతారు'' అన్నాడు గురవయ్య

''సోర్ధం పోకపోతే ఓరయినా ఒకటే దాన్ని ఎట్టా పోగొట్టాలో మార్గం ఆలోసించాలిగానీ '' అన్నాడు వెంకటేశం

''అది కానిపని వెంకటేశం మనిషి స్వార్ధాన్ని మనం పోగొట్టలేం ఆ యస్సైగాడి సీట్లో మనమున్నా అంతే కాకపోతే కొంత ఉదారంగా ప్రవర్తిస్తామేమో'' అన్నాడు గురవయ్య

తరువాత వాళ్ళు ఆ విషయం గురించి చాలాసేపు మాట్లాడుకున్నారు

బందోబస్తు అయిపోయిన తరువాత స్టేషనుకు వచ్చాడు ప్రకాశం రోజులు గడిచేకొందీ ఆ విషయాల్ని మరిచిపోయాడు

ఆ రోజు ప్రకాశం గార్డు డ్యూటీలో వున్నాడు రాత్రి ఎనిమిది గంటలకు అన్నం తిని స్టేషనుకొచ్చాడు తెల్లవారుఝాము మూడు గంటల నుండీ ఆరింటివరకూ సెంట్రీ డ్యూటీ చెయ్యాలి అన్నం తినేటప్పుడు భార్య మంచంమీద పడుకొని వుంది ''సన్నగా నొప్పులు వత్తన్నాయి'' అంది

''అయ్యేం సెయ్యవులేయ్యా! ఏడి నెప్పులు రేపు సాయంత్రానికి కాని పెసవం కాదు నువ్వెల్లు నువ్వేం బయపడమాకా'' అంది తల్లి స్టేషనుకు వచ్చి అదే ఆలోచనతో పడుకున్నాడు చాలాసేపటికి నిద్ర పట్టింది ఒక రాత్రప్పుడు సుబ్బారెడ్డి కొడుకు వచ్చి ఆదుర్దాగా లేపాడు ఉలిక్కిపడి లేచాడు ప్రకాశం

''మామయ్యా! అత్తమ్మకు నొప్పు లొస్తున్నాయంట అమ్మమ్మ నిన్ను పిలుచుకు రమ్మంది'' అన్నాడు ప్రకాశం ఒక్క వుదుటున లేచాడు సెంట్రీ బయట నిలబడివున్నాడు ఈ రాత్రికి

గార్డు ఇన్‌చార్జి రైటరు స్టేషన్లో లేడు ఎక్కడుండేదీ ప్రకాశంకు తెలుసు వెయిటింగ్ పీసీలు నిద్దురపోతున్నారు చెమట తుడుచుకుంటూ బైట కెళ్ళాడు సెంట్రీ చింపిరయ్య నిలబడి వున్నాడు

''రైటరుగారు ఏరి?'' అడిగాడు ఆదుర్దాగా ప్రకాశం

''వాడు ఇక్కడెందుకు వుంటాడు ముండ కొంపలో చస్తాడు మనకు తెలియంది కాదుకదా! ఎందుకు? ఇప్పుడు వాడితో ఏం పని?'' అడిగాడు చింపిరయ్య

''ఏం లేదు మీ అమ్మాయికి నొప్పులు వస్తున్నాయంట నేను వెళ్ళాలి వెళ్ళి ఆసుపత్రిలో చేర్పించి వస్తా నేను నాలుగో పారా ఎక్కాలి రైటరింటికి పోదామంటే అక్కడుండడుకదా ముండింటికి పోతే ఆయన కోప్పడతాడు నేనొక అరగంటలో వస్తా ఈ లోగా ఆయనొస్తే ఈ విషయం చెప్పు'' అన్నాడు

అట్లాగే చెపుతాలే నీకేం బయంలేదు తొందరగాపో అయినా ఆడిప్పుడు రాడులే తెల్లరిందాకా ఆడే ఏడుస్తాడు'' అన్నాడు చింపిరయ్య

ప్రకాశం ఇంకేమీ మాట్లాడలేదు గబగబా క్వార్టర్సు వైపునడిచాడు ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి దూరంగా ఎక్కడో కుక్క ఏడుస్తోంది ఆ ఏడుపు ప్రకాశానికి భయం కలిగించింది రకరకాల భయాలు అతనిలో చోటు చేసుకుంటున్నాయి 'యమకింకరులు కుక్కలకి కనపడతారంటారు వాళ్ళు కనపడ్డప్పుడు అవి అట్లా ఏడుస్తాయంట ఈ పూట ఎవళ్ళో ఒకళ్ళు చచ్చిపోతారు ఎవరు? తన భార్యకు నొప్పులు వస్తున్నాయి ఒకవేళ ప్రసవించలేక ' ఆ వూహకే అతను తట్టుకోలేక పోయాడు తల గట్టిగా విదిలించాడు 'తమ పల్లెల్లో సగానికి సగంమంది ఆడవాళ్ళు బలహీనత మూలంగా కనలేక చచ్చిపోతారు అలాకాక గుర్రపువాతం, ఇంకా రకరకాల జబ్బులతో చచ్చిపోయే వాళ్ళు ఎంతో మంది ' ఇలా సాగుతున్న ఆలోచనలు ఇంటికెళ్ళేసరికి ఆగిపోయాయి

భార్య నొప్పులు పడుతోంది చుట్టుపక్కల ఆడవాళ్ళు కొంత మంది వచ్చారు గోపాలం భార్య బైటకొచ్చి ప్రకాశంతో, ''అన్నయ్యా! తొందరగా పోయి గుర్రబ్బండి కట్టించుకురా'' అంది వెంటనే మళ్ళీ లోపలికెళ్ళి ప్రకాశం భార్య దగ్గర కూర్చుంది

ప్రకాశం గబ గబా గుర్రబ్బండి కోసం పరిగెత్తాడు అతన్ని చూచి ఆ బజారులోని కుక్కలన్నీ వెంటబడ్డాయి వాటిని అదిలిస్తూ గుర్రబ్బండి సాయిబుని లేపి బండి కట్టించుకొని వచ్చాడు ఆడవాళ్ళంతా పట్టి ఆమెని బండెక్కించారు చిన్నగా అంతా హడావిడిగా ఆందోళనగా వుంది బండిలో ప్రకాశం తల్లి, ప్రకాశం అత్తా, గోపాలం భార్యా ఎక్కారు లైనులోని మిగిలిన ఆడవాళ్ళు కూడా లేచి వచ్చారు తలా ఒకటి గుర్తు చేస్తున్నారు తలా ఒక సలహా యిస్తున్నారు విశ్వనాథం భార్య మాత్రం పంచలో మంచమేసుకొని కూర్చొని చూస్తోంది అంతటి ఆందోళనలోనూ ఆమె నలా చూస్తుంటే నవ్వు వచ్చింది ఇంతమంది వచ్చి ఇలా సహాయపడటం అతని కెంతో ఆనందాన్ని కలిగించింది ఎవరు చేసిందీ ఏమీ లేదు కాని వాళ్ళ సహకారపు మనస్తత్వానికి హృదయం వుప్పొంగింది తలా ఒక మాట హెచ్చరిస్తున్నారు సుబ్బారెడ్డి వచ్చాడు దుప్పటి కప్పుకొని బండి బయలుదేరుతున్నప్పుడు ప్రకాశంతో, ''ప్రకాశం నన్ను కూడా రమ్మంటావా ఆసుపత్రి దాకా?'' అన్నాడు

వద్దన్నట్టు తలూపాడు ''ఫరవాలేదు నేనున్నానుగా'' అన్నాడు కృతజ్ఞత నిండిన స్వరంతో

ప్రకాశం బండతనికి ఆసుపత్రి పేరు చెప్పి అక్కడకు తీసుకు పొమ్మన్నాడు తను ఇంట్లోకి వెళ్ళి, పెట్టెలో దాచిపెట్టిన డబ్బులు తీసుకొని, తలుపు గడివేసి వడివడిగా ఆసుపత్రి వైపు నడిచాడు అప్పటికి అర్ధరాత్రి దాటింది వాతావరణం చల్లగా వుంది ఆమెని తీసుకొచ్చి ఆసుపత్రిలో మంచం మీద పడుకోబెట్టారు నర్సువెళ్ళి డాక్టరమ్మను పిలుచుకొచ్చింది డాక్టరమ్మకు సెల్యూట్‌చేసి చిన్నగా అన్నాడు, ''నొప్పులొస్తున్నాయమ్మ'' అని

ఆమె తలూపి లోపలికెళ్ళింది నర్సు ప్రకాశాన్ని అక్కడే వుండమంది అయిదు నిముషాలు గడిచాక డాక్టరమ్మ బైట కొచ్చింది ''ఇవి కాన్పు నొప్పులే ఏం భయం లేదు నువ్వెళ్ళి ఉదయం రా'' అంది

ప్రకాశం అలాగే అన్నట్టు తలూపాడు గోపాలం భార్యకూ, తల్లికీ చెప్పి స్టేషను కొచ్చాడు డాక్టరమ్మ చెప్పిన మాటలకు దిగులు పోయింది ధైర్యం వచ్చింది స్టేషను కొస్తుంటే రైటరు గుర్తొచ్చాడు 'వాడేమన్నా వచ్చి ఆబ్సెంటు రాశాడేమో' అని మనస్సు పీకింది 'ఎక్కడున్నా, ఏం చేస్తున్నా ఈ పీకులాట తప్పటం లేదే' అనుకున్నాడు 'అయినా వాడు ముండకొంపకు వెళితే తెల్లగా తెల్లవారిందాకా రాడులే' అనుకుని తనకుతాను సర్దిచెప్పుకుని స్టేషన్ను సమీపించాడు స్టేషన్లో రైటరుగొంతు పెద్దగా వినపడుతోంది ముసురుతున్న ఆలోచనలు ఆ గొంతు విని ఎగిరి పోయాయి చింపిరయ్య ఏదో చెపుతున్నాడు రైటరుకు ప్రకాశాన్ని చూచి ఇంకా సీరియస్ ఫోజు పెట్టాడు రైటరు ''ఏమోయ్, ఎక్కడి కెళ్ళావ్?'' అన్నాడు

విషయం చెప్పాడు వినయంగా ప్రకాశం అతని మాటలు పూర్తి కాకముందే, ''ఎవర్నడిగి పోయావ్'' అన్నాడు

''మీకు చెపుదామంటే మీరు లేరు ఇంటి దగ్గరకు పోతే ఆడా లేరు అందుకని సెంట్రీకి చెప్పిపోయాను సార్'' అన్నాడు అదే వినయాన్ని ప్రదర్శిస్తూ ప్రకాశం

రైటరుకు ఏం మాట్లాడలో తోచలేదు కాని ఏం మాట్లాడకుండా వుండటానికి వీల్లేదన్నట్టు, ''సెంట్రా నీ ఆఫీసరు ? నేనా?'' అన్నాడు

ప్రకాశానికి విసుగూ, కోపం రెండూ ఒకేసారి కలిగాయి అసహనంగా అన్నాడు ''సార్ నా ఆఫీసరు ఎవరయిందీ నాకు తెలుసు ఎందుకెళ్ళానో, ఎటువంటి పరిస్థితిలో వెళ్ళానో మీకు తెలుసు ఇక మీ యిష్టం ఇంక ఇంతకంటే చెప్పలేను నాకు మనసేమీ బాగాలేదు'' అన్నాడు

రైటరు కొద్దిసేపు ఏమీ మాట్లాడలేదు ''ఇవన్నీ అనవసరం నేను చెక్ చేసినపుడు నువ్వు లేవు ఆబ్సెంటు రాశాను అంతే'' అని వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు ఆ మాట వినగానే ప్రకాశం గుండె ఝల్లుమంది కోపం వువ్వెత్తున లేచింది కాని తమాయించుకున్నాడు వెళ్ళి పక్కమీద పడుకున్నాడు కోపంతో నరాలు బిగుసుకు పోయాయి నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ రైటరు, ''అప్పుడెవరన్నా ఆఫీసరు వస్తే, నువ్వు లేకపోతే నేను నీకు ఆబ్సెంటు రాయనందుకు నామీద రాస్తాడు'' అన్నాడు తను చేసిన పనిని సమర్ధించుకోవటానికి రైటరు ఆ మాటలు అంటున్నట్లు తెలుసుకున్నాడు ప్రకాశం ప్రకాశం ఏమీ మాట్లాడలేదు అతవసలేమీ మాట్లాడదలచుకోలేదు కోపంతో కణతల మీది నరాలు నొప్పి పుడుతున్నాయి అతని ఆలోచనలు భార్య మీదకు మళ్ళాయి ఆలోచిస్తూనే అలసిన శరీరంతో నిద్రలోకి జారిపోయాడు ఎప్పటికో

తెల్లవారుఝాము మూడు గంటలకు పారా ఎక్కటానికి సెంట్రీ లేపుతుంటే లేచాడు కళ్ళు మండుతున్నయ్ చటుక్కున భార్య గుర్తుకొచ్చింది 'ప్రసవించిందో లేదో' అనుకున్నాడు రైటరు

రాసిన ఆబ్సెంటు గుర్తొచ్చింది సెంట్రీ పుస్తకంలో సంతకం పెట్టాడు రైటరు స్టేషన్లో లేడు 'తెల్లవారినాక వచ్చి సెంట్రీ పుస్తకంలో గార్డు ఆఫీసరుగా సంతకాలు పెడతాడు వాడిని అడిగేవాడు, లేడు తను ముఖ్యమయిన పని మీద పోతే ఆబ్సెంటు రాశాడు ఇప్పుడు వాడి మీద రాస్తే?' ఆలోచనైతే వచ్చింది కానీ ఆచరణలో విఫలమై పోతోంది అలా తను రాస్తే తరువాత ఆఫీసర్లు పెట్టే బాధల్ని ఒంటరిగా తట్టుకోవటం అసంభవం తలొంచుకొని పోవటమే అన్నిటికీ ఆ పరమాత్ముడే వున్నాడు' అనుకున్నాడు తుపాకీ తీసుకొని వెళ్ళి బయట నిలబడ్డాడు టైం గడవటం లేదు మనసంతా భార్యమీదే ఉంది ఎప్పుడెప్పుడు ఆసుపత్రికి వెళదామా అని తహతహలాడాడు ఆరయ్యేసరికి అతనిలోని ఓపిక నశించింది

గబగబా ఆసుపత్రికెళ్ళాడు నర్సు నవ్వుతూ ఎదురయ్యి, 'మగ పిల్లవాడు' అని చెప్పింది ఆనందంతో ఏమీ మాట్లాడలేకపోయాడు గబగబా లోపలికెళ్ళి భార్యనీ, పిల్లవాడినీ చూశాడు తనలాగే ఎరుపు ఇంకా కళ్ళు తెరవలేదు

ఇంటికెళ్ళి గబగబా ముఖం కడుక్కొని హాస్పిటల్‌కు వచ్చాడు మళ్ళీ మిస్టీ చొక్కా తొడుక్కొని డ్యాక్టరమ్మతో మాట్లాడాడు తొమ్మిది గంటలకల్లా తిరిగి స్టేషను కొచ్చాడు యూనిఫారం వేసుకుని రాత్రి రాసిన ఆబ్సెంటు గురించి రిపోర్టు కొట్టారని చెప్పాడు చింపిరయ్య అక్కడున్న వాళ్ళల్లో కొంతమంది ప్రకాశంను 'పోయి యస్పైకి కనపడి ఏదో రిక్వెస్టు చేసుకో' అని సలహా చెప్పారు కొంతమంది అనవసరమన్నారు ప్రకాశం కూడా పోదలచుకోలేదు ఏదైతే అదయ్యిద్దని వూరుకున్నాడు కొడుకు పుట్టిన సంతోషాన్ని ఈ విషయం మింగేసింది ఎంత మనస్సు దిటవు చేసుకున్నా గుబులు గుబులుగానే వుంది

అందరూ ప్రకాశాన్ని పార్టీ ఇవ్వమని అడిగారు పార్టీ అంటే ఏమిటో ప్రకాశంకు తెలియలేదు అదే మాట అడిగాడు ఆ సంభాషణలతో కొన్ని నిముషాలు ఆనందంగా దొర్లాయి అంతా హుషారుగా వున్నప్పుడు విశ్వనాధం, ''ప్రకాశంకు కొడుకు పుట్టాడు, తండ్రికి ఆబ్సెంటు రాయించి పనిష్మెంటు ఇప్పిస్తున్నాడు, పిల్లగాడి జాతకం మంచిది కాదు'' అన్నాడు అంతా నిశ్శబ్దమై పోయారు

ఆ మాటతో ప్రకాశం ముఖం నల్లగా మాడిపోయింది తరువాత కొద్దిసేపటికి అంతా వెళ్ళిపోయారు గోడ కానుకుని అక్కడే కూర్చున్నాడు ప్రకాశం విశ్వనాధం చిలికిన విషం అతని మనస్సు మీద పని చేస్తోంది 'తనింతవరకు ఎలాటి పనిష్మెంటూ తీసుకోలేదు ఇప్పుడలాంటిది జరుగుతోంది నా బిడ్డ జాతకం మంచిది కాదా? ఏసు ప్రభువు తన కిలాటి బిడ్డ నిచ్చాడేమిటి?' అనుకున్నాడు మనస్సులోనే ప్రార్థన చేసుకున్నాడు 'నారాయణమూరితీ నువ్వే నాకు దిక్కు' అనుకున్నాడు మళ్ళీ

మధ్యాహ్నం ఇంటికెళ్ళి అన్నం తిని వచ్చేటప్పుడు గోపాలం పిలిచాడు విశ్వనాధం అన్నమాట గుర్తు చేశాడు ప్రకాశం ''నువ్వు వాడి మాటల్ని గురించి పట్టించుకోగాక వాడు దుర్మార్గుడు ఎదుటివాళ్ళని మాటలతో, చేతలతో బాధ పెట్టటమే వాడి పని అసలు నువ్వు ఇక్కడ ఒక విషయం ఆలోచించు నీకు ఆబ్సెంటు రాసింది రాత్రి పన్నెండు గంటలకు నీకు కొడుకు పుట్టింది తెల్లవారుఝామున ఈ రెంటికీ సంబంధమేమిటి? నువ్వు లేవు కాబట్టే వాడు ఆబ్సెంటు రాశాడు ప్రతి పనికీ ఇక్కడ హేతువు కనపడుతూ వుంటే, ఆ బిడ్డ జాతకం అంటావేమిటి?'' అన్నాడు

ఆ మాటలు నిజమనిపించాయి ప్రకాశంకు

''మరి వాడు అన్నదాంట్లో ఎంతవరకు నిజముందో, జాతకఫలం కూడా వుంటుందం టారుగా'' అన్నాడు

ఆ మాటకు గోపాలం నవ్వాడు ''ఎవడో వెధవ ఆ మాట అన్నాడు మనిషి జీవితంలో జరిగే సంఘటనలకూ, అతను పుట్టిన వేళకూ ఏమీ సంబంధం లేదు అలాంటి సంబంధా లున్నాయని నమ్మించి, అసలు హేతువును చూపించకుండా భయపెట్టి ఆ కీడును తొలగిస్తానని డబ్బూ, దస్కం కాజేస్తారు వాడి పీతి పొట్టకోసం వాడెన్ని మాటలైనా సృష్టిస్తాడు ఆస్తికత్వం వలన మనిషి పిరికివాడవుతాడు నాస్తికుడు అట్లా కాడు ప్రతిదానికీ హేతువుని చూపిస్తాడు సైన్సును నమ్ముతాడు ఈ దేవుడూ, దెయ్యాలు లేవు '' అతని మాటలు పూర్తికాకముందే ప్రకాశం అందుకున్నాడు

''దేవుడు లేడంటే ఒప్పుకోను ఈ జాతకాలూ, జన్మనక్షత్రాలూ అంటావూ, వాటిని ఒప్పుకోను హిందువుల దేవుళ్ళ మీద నాకు నమ్మకం లేదు కాని ఏసుక్రీస్తు వున్నాడు ఆయన రెండవ రాకడ గురించి అంత స్పష్టంగా బైబిలులో చెపుతుంటే '' అన్నాడు ప్రకాశం

''గోపాలం మాట్లాడలేదు చిన్నగా నవ్వాడు ''సరేకాని తరువాత మాట్లాడుకుందాంలే పో '' అన్నాడు

అదే విషయం ఆలోచిస్తూ స్టేషను కొచ్చాడు విశ్వనాథం ఎదురయ్యాడు ''ఏంది ప్రకాశం పిల్లవాడి విషయం ఏం ఆలోచించుకున్నావు?'' అన్నాడు

అర్థం కానట్టు చూశాడు ప్రకాశం

''అదే, జన్మ నక్షత్రాన్ని గురించి పిల్లవాడు పుట్టిన వేళా విశేషం బాగాలేదు దృష్టాంతం నువ్వే చూశావుగా శాంతి చేయించు అంతా అదే సర్దుకుంటుంది ఇంతకుముందు కృష్ణమూర్తని ఒక అతనికి కొడుకు పుట్టినప్పుడు ఇట్లాగే జరిగింది నేనే అంతా చేయించాను ఇప్పుడు బాగానే వున్నాడు'' అన్నాడు

ప్రకాశం ఏమీ మాట్లాడలేదు కొంచెం కోపంగా చూశాడు ఆ చూపుని గ్రహించిన విశ్వనాథం లోపలికి వెళుతూ, ''ఆలోచించుకో, తరువాతయినా ఫరవాలేదు మరీ ఆలశ్యం చేయకూడదు'' అన్నాడు ప్రకాశం పళ్ళు పటపటా కొరుకుతూ లోపలకు వెళ్ళాడు స్టేషన్లో రైటరు లేడు

కాస్సేపు పడుకుందామని పక్క పరుచుకున్నాడు లాకప్‌లోంచి వచ్చే వాసనకు కడుపులోది బయటకు వచ్చేటట్లుంది పక్కమీద నడుంవాల్చాడు వెయిటింగ్ పీసీ చింపిరయ్య వచ్చాడు భోంచేసి అతను, ప్రకాశం పక్కన కూర్చుంటూ, ''ఏందీ, నీ కొడుకు ఎవరి పోలికా? నీదా మా అమ్మాయిదా?'' అన్నాడు నవ్వుతూ

ప్రకాశం కూడా నవ్వాడు ''అప్పుడే పోలికలేం తెలుస్తాయ్'' అని, ''అదిసరే కాని మరి నీ పెళ్ళికి సెలవు తీసుకున్నావా?'' అన్నాడు ప్రకాశం

''ఆఁ ఏడ్పించి, ఏడ్పించి సెలవిచ్చాడు రేపటినుండే సెలవు ఆవులెల్లుండి పెళ్ళి'' అన్నాడు చింపిరయ్య

''అబ్బాయ్ నేను ముందే చెపుతున్నా నువ్వు కూతుర్ని కనాలి ఎందుకంటే నీకు అల్లుడు పుట్టాడు గనక'' అన్నాడు నవ్వుతూ ప్రకాశం

''తప్పేదేముంది'' అని ముందుకు వంగి, ''అది సరేలేకానీ రాత్రి నీకు వాడాప్పెంటు ఎందుకు రాశాడో తెలుసా?'' అన్నాడు ఏదో రహస్యం చెపుతున్నట్టు.

''ఎందుకు?'' అడిగాడు ప్రకాశం చిన్నగా, ఆత్రుతగా తనూ కొంచెం ముందుకు వంగి

''రాత్రి ఈ నా కొడుకు, ముండ కొంపకెల్లేసరికి దాని దగ్గర వేరే ఎవడో వున్నాడంట వీడు పోలీసు జబర్దస్తీ చూపించ బోయాడంట అది మనోడ్ని ఇదిలించి పారేసిందంట ఆ దెబ్బతో ఈడు ఇక్కడికొచ్చి పడ్డాడు, అక్కడ దాన్ని ఏమీ అనలేక అసలు నామీద కూడా రాస్తానన్నాడు'' అన్నాడు చింపిరయ్య

''నీమీదా? నీమీద ఏమని రాస్తాడు?''

''నేను హాల్టు కొట్టలేదని రాస్తానన్నాడు నేను కాస్త గట్టిగా దబాయించాను 'ఏంది సార్ మీరంత స్పష్టంగా కనపడుతుంటే హాల్ట్ కొట్టలేదు అంటారేమిటి' అన్నాను ఇంకేమీ మాట్లాడలేదు వాడు

''అంటే ముండమీద కోపం నామీద చూపించాడన్న మాట''

''ఈ నా కొడుకులంతే ప్రకాశం మెత్తనోడిని చూస్తే మొట్టాలనిపిస్తుంది కాస్త ఎదురు తిరుగు, నీ జోలికిరారు'' అన్నాడు చింపిరయ్య

తరువాత వాళ్ళు చాలా విషయాలు మాట్లాడుకున్నారు చాలాసేపటి తరువాత నిద్రపోయాడు ప్రకాశం

ఒక వారం రోజుల తరువాత సర్కిల్ ఆఫీసు నుండి కాగితం వచ్చింది ఆబ్సెంటు అయినందుకు సంజాయిషీ అడిగారు ఏం రాసివ్వాలో అర్ధం కాలేదు గోపాలాన్ని సలహా అడిగాడు ''ఆ రోజు రాత్రి రైటరు స్టేషన్లో లేడని రాయటానికి వీల్లేదు ఎందుకంటే సెంట్రీ పుస్తకంలో వాడి సంతకాలు కనపడుతున్నయ్ రికార్డు ప్రకారం వాడు ప్రజెంట్‌లో వున్నట్లే ఇకపోతే నీకు మిగిలింది ఒకటే కుర్రవాడు వచ్చి, నీ భార్యకు నొప్పులు వస్తున్నాయని చెప్పగానే భయంవేసి హడావిడిగా పరిగెత్తినట్టూ, ప్రథమ తప్పుకింద క్షమించమని రాయి'' అన్నాడు గోపాలం

అదే విషయం రాసిచ్చాడు ప్రకాశం ఒక సంవత్సరం పాటు ఇంక్రిమెంటు కట్ చేస్తున్నట్టు కాగితం వచ్చింది కాగితం తీసుకొని గోపాలం చేత చదివించుకొని విన్నాడు దిగులుగా

''ఇంగ్లీషు నేర్చుకో ప్రకాశం'' అన్నాడు గోపాలం నవ్వుతూ

''ఆఁ తెలుగు పుస్తకాలు చదివే తీరికలేదుగానీ, ఇంకా నా ముఖానికి ఇంగ్లీషు కూడానా?''

'' ఇంగ్లీషు భాషనేర్చుకుంటే ప్రపంచాన్ని అర్ధం చేసుకోవచ్చు'' అన్నాడు ఎగతాళిగా నవ్వుతూ గోపాలం

''ఇప్పటికే అర్ధమయ్యింది చాలావరకు ఇంకా జ్ఞానం పెరిగిందంటే పిచ్చెక్కిద్ది'' అన్నాడు ప్రకాశం కూడా నవ్వుతూ

ఆ మాటకు గోపాలం కూడా నవ్వాడు ''నువ్విక్కడ ఎన్ని కష్టాలు పడితే, ఎంత బాధకు ఓర్చుకుంటే పరలోకంలో అన్ని సుఖాలు నీకోసం ఎదురు చూస్తుంటాయి'' అన్నాడు నవ్వుతూ గోపాలం.

గోపాలంతో ఎప్పుడు ఏ విషయం మాట్లాడినా చివరికది నాస్తికత్వం దగ్గరకొచ్చి ఆగిపోతుంటుంది. ఈ గొడవలన్నిటికీ కారణం మనం దేవుడున్నాడని నమ్మటమే నంటాడు గోపాలం ఎన్నో విషయాలలో ఇద్దరి అభిప్రాయాలు ఒకటవుతాయి కాని ఈ విషయానికొచ్చే సరికి ప్రకాశం అతనితో విభేదిస్తాడు

''అయితే పరలోకం అనేది లేదంటావా?'' అన్నాడు ప్రకాశం చిరుకోపంగా

''ఎంత గాలేదు క్రైస్తవుల పరలోకంలో కన్నా హిందువుల స్వర్గ లోకంలో ఎంతో మజా వుంటుంది మద్యం, మగువ అంటే ఊర్వశీ, తిలోత్తములూ నీకు క్రిష్టియన్ల స్వర్గమా ? హిందువుల స్వర్గమా? ఏది కావాలి ? నువ్వేమో ఒక్కోసారి నారాయణమూరితీ అంటావు, ఒకోసారేమో ఏసుపెబువూ అంటావు'' అని నవ్వాడు ఎగతాళి చేస్తున్నట్లు

ప్రకాశం కూడా నవ్వాడు ''నాకందరూ కావాలి అయితే లెవ్వనా నీ వుద్దేశ్యం ?'' అన్నాడు మళ్ళీ

''పరలోకం లేదూ, హిందూ మతంలో చెప్పినట్లు స్వర్గనరకాలూ లేవు ఇక్కడ మనం బాధలన్నీ నోరుమూసుకొని, ఎదురు తిరగకుండా అనుభవించాలని దోపిడీ దారులు వాళ్ళ పెత్తనాన్నీ, దోపిడీని సజావుగా సాగించుకోటానికి అట్లా కధ లల్లారు'' అన్నాడు గోపాలం కొంచెం సీరియస్‌గా

''కధలే నంటావా? నిజంగా ఆ లోకాలే లేవంటావా?'' అన్నాడు మళ్ళీ ఒత్తి పలుకుతూ ప్రకాశం

''వున్నాయని చెప్పిన వాడెవడూ కనపడలేదు ఇంతవరకు ఈ ప్రపంచంలో ఇన్ని కోట్లమంది ఛస్తున్నారు, పుడుతున్నారు చచ్చినోడెవడన్నా ఎక్కడన్నా, తిరిగొచ్చి, 'ఇదిగో మనిషికి ఈజన్మ కాకుండా ఇంకోటి వుంది' అని చెప్పాడా?'' అన్నాడు

ప్రకాశం ఫక్కున నవ్వాడు ''చచ్చినోళ్ళు ఎవరన్నా బతికొస్తారా మళ్ళీ'' అన్నాడు

''అదే మరి నవ్వటం కాదు నువ్వు అన్నదాన్లోనే వుంది జవాబు చచ్చినోడు ఎవడూ వచ్చి చెప్పకపోతే, బతికున్న వాడెవడన్నా పోయి ఆ సొర్గ నరకాలుగానీ, బైబిల్లో చెప్పిన పరలోకంగానీ చూసి వచ్చాడా? ఈ పుస్తకాల్లోని విషయాలు ఎట్లా రాసినట్టు మరి? ఆ లోకాలు వున్నాయని వీళ్ళకెట్లా తెలిసింది?'' అన్నాడు గోపాలం

''ప్రవక్తలు రాశారు''

''వాళ్ళకెట్లా తెలుసు వాళ్ళూ మనుషులేగా? దేవుడు పంపించాడు వాళ్ళనంటావు లేకపోతే ఇంకొక టంటావు అంతేగా నువ్వనబోయేది వాస్తవంగా, హేతుబద్ధంగా ఆలోచిస్తే ప్రజల్ని అజ్ఞానంలో వుంచటానికీ, వాళ్ళని దోపిడీదారులు తమ అవసరాలకి వాడుకోవటానికీ ఇట్లాంటి కట్టుకథల్ని ప్రచారం చేశారు బుర్రుంటే ఆలోచించు నీ బైబిలు కాని, ఇంకో మత గ్రంథంకాని అన్నీ కూడా కేవలం నమ్మకం మీద నిలబడేవే ఏమాత్రం హేతుబద్ధంగా ఆలోచించినా అవన్నీ గాలి కెగిరిపోతయ్'' అన్నాడు గోపాలం

ప్రకాశం ఏం మాట్లాడలేదు

''ఇప్పుడుచూడు నీకు ఎంత అన్యాయం జరిగిందో నువ్వు దేవుడూ, దెయ్యం అనే వూహలోవున్నావు కాబట్టి నీకు జరిగిన అన్యాయానికి 'కర్మ' అని సరిపెట్టుకుంటావు వాడి మీద ఎదురుదెబ్బ తియ్యకుండా, వాడిపాపాన వాడేపోతాడని, ఈ బాధల్ని అనుభవిస్తే నీకు పరలోకం లోనో, స్వర్గంలోనో స్థానం దొరికిద్దనే భావంతో వుంటావు నీలో అలాంటి భావాలున్నంత కాలం, వీళ్ళు నిన్ను బాధపెడుతూనే వుంటారు భయపెడుతూనే వుంటారు తద్వారా వాళ్ళ పనుల్ని చేయించుకుంటూ అధికారాన్ని ప్రదర్శిస్తుంటారు ఇలా జరుగుతున్న పనులకు దేవుడి ప్రమేయంవుందని నువ్వనుకుంటున్నంతకాలం నీకునష్టమే జరుగుతూ వుంటుంది ఎప్పుడయితే నువ్వు నాస్తికుడివవుతావో, అప్పుడు నీకష్టాలు గట్టెక్కటానికి

వీలుంటుంది'' అన్నాడు గోపాలం

''నువ్వు నాస్తికుడివేగా నీకు కష్టాలు లేకుండా పోయాయా? నిన్ను కూడా మిగిలిన వాళ్ళతో సమానంగా బాధిస్తూనే వున్నారుగా ఆఫీసర్లు నువ్వూ మానసికంగా బాధపడుతూనే వున్నావుగా'' అన్నాడు ప్రకాశం

''కేవలం నేనొక్కడినే నాస్తికుడినయితే లాభం లేదు అందరం మారాలి అప్పుడు ఈ అన్యాయ్యాల్ని మనం వుమ్మడిగా ఎదుర్కోనవచ్చు అట్లాకాకుండా ఒకడు నాస్తికుడయ్యి హేతుబద్ధంగా విషయాన్ని ఆలోచిస్తుంటే, ఇంకొకడేమో మన ఖర్మ ఇంతే, వాడి పాపాన వాడు పోతాడులే, పడ్డవాడెప్పుడూ చెడ్డవాడుకాదులే అనుకుంటూ తలవంచుకుపోతుంటే మన బలం చాలక వాళ్ళ నెదుర్కోలేము ఈ నాస్తికభావాలు అందరిలోనూ రావాలి'' అన్నాడు

ప్రకాశం ఏమీ మాట్లాడలేదు కొద్దిసేపున్నాక, ''ఏందో అంతా గజిబిజిగా వుందినాకు నువ్వు చెప్పిందికూడా పాయింటే అనుకో'' అన్నాడు

గోపాలం నవ్వాడు అనునయంగా అన్నాడు ''ఇందులో ఏమీ గజిబిజిలేదు ప్రకాశం జాగర్తగా ఆలోచిస్తే అంతా నీకే అర్థమయిద్ది''

ఆ సంభాషణ అంతటితో ఆగిపోయింది ఆ రోజుతో గార్డు డ్యూటీ అయిపోయింది మరుసటిరోజు అందరూ తాలూక ఆఫీసు దగ్గరకు బందోబస్తుకు వెళ్ళివచ్చారు

దేశస్వాతంత్ర్యం కోసం ఆందోళన దేశవ్యాప్తంగా ఉధృతంగా సాగుతోందని చెప్పాడు గోపాలం చింపిరయ్య నిన్నటి నుండీ సెలవులో వున్నాడు

ఆ రోజు రాత్రి ఎనిమిది గంటలకు సర్కిల్ ఆఫీసునుండి ఎక్స్‌ప్రెస్ కానిస్టేబులు వచ్చి, సీక్రెట్ కవరు ఇచ్చి వెళ్ళాడు యస్పైకు ఆ కవరు చించి, చూచి రైటర్ని కేక వేశాడు యస్పై రైటరు హడావిడిగా వెళ్ళాడు ''నాలుగయిదు రోజుల్లో కొంతమంది పోలీసు స్టేషన్ల మీద పడి ఆయుధాల్ని లూటీ చెయ్యాలనుకుంటున్నారంట ఇన్‌ఫర్‌మేషన్ వచ్చింది మెన్‌ని అందరినీ స్టేషన్లోనే వుంచమనీ, బయటకు ఏ డ్యూటీ మీద కూడా పంపొద్దనీ ఆర్డర్స్ వచ్చాయి బందోబస్తు వాళ్ళు వచ్చేశారు కదా గార్డు వాళ్ళు పోగా ఇంకా ఎంతమంది వున్నారు?'' అన్నాడు యస్పై

''ఎనిమిది మంది మాత్రం వుంటారు సార్'' అన్నాడు రైటరు కొద్దిసేపు వేళ్ళు లెఖ్ఖపెట్టుకొని మళ్ళీ ఏదో గుర్తొచ్చినట్టు, 'చింపిరయ్య మాత్రం శెలవులో వున్నాడు సార్'' అన్నాడు

''పిలిపించు అర్జంటుగా నైటుబీట్లు కూడా వెయ్యొద్దు. అంతా స్టేషన్లోనే స్టాండ్‌టూ లో వుండాలి'' అన్నాడు యస్పై

''ఇవ్వాళ అతని కార్యం సార్'' నసిగాడు రైటరు

''కార్యమైనా, దినమైనా-అనవసరమైన మాటలు కార్యం తరవాత చేసుకోవచ్చు ఇక్కడ స్టేషను తగలబడిపోతోంది ముందు పిలిపించు'' అన్నాడు కఠినంగా

రైటరు ప్రకాశాన్ని పంపించాడు ప్రకాశం చిన్నగా వెళ్ళాడు చింపిరయ్యను పిలవటానికి డ్యూటీకి పెండ్లి ఇల్లు అంతా కోలాహలంగా ఆనందంగా వుంది పెండ్లికొడుకు హడావిడిగా తిరుగుతున్నాడు పిలవలేక పిలిచాడు ప్రకాశం 'ఏమిటన్నట్లు' ఆశ్చర్యంగా చూస్తూ వచ్చాడు చింపిరయ్య

''రైటరుగారు నిన్నొకసారి రమ్మంటున్నారు'' అన్నాడు ప్రకాశం, అతని కళ్ళల్లోకి సూటిగా చూడలేక తలవంచుకొని ప్రకాశంతో కలిసి స్టేషను కొచ్చాడు చింపిరయ్య కాళ్ళకు కొత్త చెప్పులు,

పంచె, చొక్కా, జరీ అంచు పైపంచె, బుగ్గన పెళ్ళిచుక్క తను పిలవాల్సి వచ్చినందుకు బాధపడుతున్నాడు ప్రకాశం

రైటరు దగ్గర కెళ్ళాడు చింపిరయ్య నమస్కారం చేసి నిలబడ్డాడు ''ఏంది సార్? రమ్మన్నారంట'' అన్నాడు రైటరు చింపిరయ్య నోసారి చూచి తలదించుకున్నాడు

''ఏం లేదు చింపిరయ్యా సర్కిలాఫీసు నుండి ఆర్డర్సొచ్చాయి ఈ రాత్రి స్టేషను మీదకి కొంతమంది దాడి చెయ్యాలను కుంటున్నారంట దోర్నాల స్టేషన్ రాత్రి కొట్టారంట వున్న మెన్‌ని అందరినీ స్టాండ్ టూలో వుంచమన్నారు నువ్వు డ్రస్ వేసుకునిరా యస్సైగారు కూడా స్టేషన్‌లోనే వుండాలి'' అన్నాడు రైటరు చెప్పలేక చెపుతూ

ఆ మాట వినటంతోనే చింపిరయ్య ముఖం వివర్ణమైంది ''సార్, నేను సెలవులో వున్నాను కదా సార్'' అన్నాడు ఆవేదన నిండిన స్వరంతో

''సెలవులో వున్నా, యమర్జెన్సీలో రావాల్సిందే మనది పోలీసు డిపార్టుమెంటు కదా?! మిగతా వాటికీ మన డిపార్టుమెంటుకి తేడా వుంది'' అన్నాడు రైటరు బాధపడుతూనే

''సార్ ఈరోజు కార్యం సార్ ఈ ఒక్కరోజు సర్దండి సార్'' అన్నాడు ప్రాధేయపడుతున్నట్టు

''నాకేం తెలియదు నేనేం చెయ్యలేను ఏమన్నా వుంటే యస్సై గారికి చెప్పుకో '' అన్నాడు రైటరు చింపిరయ్య యస్సై రూం లోకి వెళ్ళాడు కాళ్ళవేళ్ళా పడ్డట్టు బ్రతిమాలుకున్నాడు కానీ లాభం లేకపోయింది

''వస్తావా డ్రస్సు వేసుకొని రా లేదా నిన్ను నిముషాల మీద డిస్‌మిస్ చేయిస్తా ఇక్కడ స్టేషను తగలబడి పోతుంటే అక్కడ నీకు కార్యం ముఖ్యమా?'' అన్నాడు కోపంగా యస్సై చింపిరయ్య ఇంకేమీ మాట్లాడలేదు అతని కళ్ళు నీళ్ళతో నిండాయి సెల్యూట్ చేసి మౌనంగా బైట కొచ్చాడు గార్డు వెయిటింగ్ పీసీలంతా అతనివైపు సానుభూతిగా చూశారు అతను చిన్నగా కాళ్ళీడ్చుకుంటూ బైట కెళ్ళాడు పీసీలంతా ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు

''అంత ముఖ్యమయిన విషయమైతే నరశింహం గాడికి కూడా కబురు చేసి యూనిఫారం వేసుకొని రమ్మనవచ్చుగా'' అన్నాడు గోపాలం

''మిన్ను విరిగి మీద పడ్డా యస్సైకి తన ఇంట్లో పనులు ఆగకూడదు స్టేషను ఎటుపోతేనేం ఎవడికెన్ని పనులుంటేనేం వాడిష్టా రాజ్యం '' అని తిట్టాడు యస్సైని డేవిడ్

''ఎంత దగుల్బాజీ నౌకరీ'' అన్నాడు సుబ్బారెడ్డి

''మనమెంత చైతన్యంలేని మనుషులం'' అన్నాడు డేవిడ్ కోపంగా

ఓ వారం గడిచింది అలాగే యస్సై హడావిడి చేసినట్టు ఏమీ జరుగలేదు అందరినీ స్టేషన్లో తుపాకులిచ్చి వుంచాడు తనుమాత్రం సుఖంగా ఇంట్లో పడుకున్నాడు స్టేషను మీదకు వచ్చే వాళ్ళెవరో, ఎందుకు వస్తారో ఎవరికీ తెలియదు ఎన్నో విషయాలు క్రింది ఉద్యోగస్తులకు చెప్పకుండానే వాళ్ళచేత ఉద్యోగాలు చేయించినట్లు ఇదికూడా చేయించాడు యస్సై రైటరు, సార్జెన్‌కూడా స్టేషన్లో పడుకున్నారు ఆ వారం రోజులు ఆ వారం రోజులపాటు మిగతా వాళ్ళతో కలిసి యస్సైని తిట్టారు వాళ్ళు కూడా తరువాత మళ్ళీ మామూలే

ఒకేరకమయిన గానుగెద్దు బ్రతుకులతో విసుగెత్తుతోంది అందరికీ గోపాలంతో జరిగే సంభాషణలు ప్రకాశాన్ని నాస్తికత్వం వైపు మొగ్గేలా చేస్తున్నాయి అతను అంతకుముందు లాగా బైబిలును పదేపదే చదవటం లేదు ఆదివారం పూట టైమున్నా చర్చికి కూడా సరిగా వెళ్ళటం

లేదు జరుగుతున్న సంఘటనలను గురించి హేతుబద్ధంగా ఆలోచించటం అలవాటవుతోంది గోపాలం దగ్గర వున్న పుస్తకాలు చదువుతున్నాడు అవన్నీ ఎక్కువగా నాస్తికత్వానికి సంబంధించినవే ఈ యాంత్రిక జీవితంలో, ఈ ఆర్థిక సంక్షోభంలో ఆ పుస్తకాలు చదివే కొద్దిసేపే కొద్దిపాటి మనశ్శాంతి కలుగుతున్నట్టు అనుభూతి చెందుతున్నాడు

ఉద్యోగ సమస్యలతో రోజు రోజుకు పెరుగుతున్న మానసిక, శారీరక కష్టానికి తోడు, కుటుంబ సమస్యలు అదనంగా పుట్టుకొని వస్తున్నాయి పుట్టిన పిల్లవాడికి తల్లిపాలు చాలక డబ్బాపాలు పట్టవలసి వచ్చింది డబ్బాపాలు పడక, తల్లి పాలు తగినన్ని లేక పిల్లవాడి ఆరోగ్య విషయంలో ఆందోళన ఎక్కువయ్యింది మందులతో రోజులు నెట్టుకురావటం జరుగుతోంది జీతం డబ్బుల్ని ఎంత జాగ్రత్తగా వాడుతున్నా మిగిలిన డబ్బులు మందులకు చాలటంలేదు అడపా దడపా అప్పులు చెయ్యవలసి వస్తోంది చిల్లర దుకాణంలో అప్పు పెట్టాడు భార్య రోజు రోజుకూ నీరసించి పోతోంది విడవకుండా పొడిదగ్గు దగ్గుతోంది డాక్టరమ్మ దగ్గరకు తీసికెళితే పరీక్షలు చేసి, 'ఇప్పటివరకూ ఏమీలేదనీ, బలహీనం వలన అలాగుంటున్నదని, బలం కోసం పండ్లూ, టానిక్కులూ వాడమని, లేకపోతే కొన్ని రోజులకు టీ బీ వచ్చే అవకాశముందనీ' చెప్పి మందులు రాసిచ్చింది పిల్లవాడు బాగా తగ్గిపోతున్నాడు రోజురోజుకు

చేతిలో దమ్మిడీలేదు సమస్యలతో సతమతమయి పోతున్నాడు ఇంట్లో తల్లి మీదా భార్య మీదా తరచుగా విసుక్కుంటున్నాడు కాని తరువాత మళ్ళీ బాధపడుతున్నాడు ఆలోచనలు రకరకాలుగా సాగుతున్నయ్ ఈ మధ్య తల్లి కూడా కొంచెం నలతగా కనపడుతోంది స్టేషన్లో ఏమన్నా కేసుల్లో చిల్లర డబ్బులన్నా దొరికితే బాగుండుననీ, ఏదో ఒక ఖర్చుకు కలిసివస్తుందనీ ఎదురు చూస్తున్నాడు కాని ఈ మధ్యకాలంలో ఒక్క దమ్మిడీ కూడా రాలేదు ఏవన్నా అడపా దడపా డబ్బు లొచ్చే కేసులు తగిలినా, అవి యస్సై, సార్జెన్, రైటర్ల వరకే పరిమిత మౌతున్నయ్

ఎప్పుడన్నా కాస్త రెస్ట్ దొరికినప్పుడు ఇంట్లో వుండటానికి వీలులేకుండా పిల్లవాడి ఏడుపుపెద్ద సమస్య అయింది పిల్లవాడు గంటల తరబడి ఏడుస్తున్నాడు పిల్లవాడి శరీరంలో ఎముకలు మినహా, కండ చూద్దామన్నా కనబడటం లేదు ఏడ్చే ఓపిక లేకపోతేనే వాడు నిద్ర పోయేది ఎంత ప్రయత్నించినా పిల్లవాడి ఏడుపును తట్టుకొనే సహనం లేకుండా పోతోంది ఉన్న ఆ ఒక్క గదిలోనే ఒకపక్క పాత చీర వుయ్యాలలాగా కట్టి అందులో వేశారు పిల్లవాణ్ణి పెచ్చులూడిపోయిన గచ్చుమీద పిల్లవాడి ఒంటేలు నిలబడి వాసన వేస్తోంది ఇంటా బయట కలిగే విసుగును భార్యమీద చూపిస్తున్నాడు

ఒకరోజు స్టేషన్లో కూర్చున్నప్పుడు ఆలోచించాడు 'తాను నాస్తికుడిగా మారుతుండటంవల్ల గానీ, తనకు దేవుడిమీద నమ్మకం పోతుండటం వలన గాని తనకీ కష్టాలు కలుగుతున్నాయేమో' అనుకున్నాడు లేకపోతే ఏమిటిదంతా, ఒకదానిమీద ఒకటిగా ఈ కష్టాలు పొరపాటయిపోయింది 'గోపాలం మాటలు విని తనిన్ని కష్టాలు కొని తెచ్చుకున్నా' ననుకున్నాడు ఆరోజు రాత్రి చాలా పొద్దుపోయిందాకా బైబిలు చదివాడు ప్రార్థన చేసుకొని పడుకున్నాడు మర్రోజు ఆదివారం చర్చికెళ్ళాడు ఒక అర్పణా చందా వేశాడు ఇక తన కష్టాలు దూరం కావచ్చనుకున్నాడు మనిషిలో కొంచెం హుషారు ప్రవేశించింది కాని అది ఎంతో కాలం నిలబడలేదు తల్లి మంచాన పడింది డాక్టరమ్మ దగ్గరకు తీసుకెళ్ళటానికి, ఆమెకు లోగడ ఇవ్వవలసిన ఫీజే ఇంతవరకు ఇవ్వలేదు అందువలన అక్కడకు తీసుకెళ్ళలేకపోయాడు ధర్మాసుపత్రికి తీసుకెళ్ళి సీసాలో ఏదో అరుకు

పోయించుకొచ్చాడు ఆ రోజు రాత్రి విశ్వనాథం మళ్ళీ హెచ్చరించాడు

''ఏంది ప్రకాశం శాంతి సంగతి చెప్పనే లేదు'' అన్నాడు

''శాంతి చేయించండి మీరే చెయ్యండి'' అన్నాడు ప్రకాశం ఆశగా

''నేనే చేస్తానులే మరిదానికి కొంచెం ఖర్చవుతుంది అందరి దగ్గరయితే నాలుగురూపాయలు తీసుకుంటా నువ్వు మూడు రూపాయలివ్వు మూడుసోళ్ళబియ్యం, రెండుకొబ్బరికాయలు, ఆకూవక్కలూ, పూలూ, సాంబ్రాణికడ్డీలు, హారతికర్పూరం, అరటికాయలు, ఒకతుండుగుడ్డ ఇవిచాలు పూర్తిచేస్తాను'' అన్నాడు

ప్రకాశం నీరసించిపోయాడు అవన్నీవిని ''సార్ ఇప్పుడేమీలేవు నాదగ్గర జీతం తీసుకోంగానే ఇస్తాను మీరు చెయ్యండిసార్ కావాలంటే బియ్యం, కొబ్బరికాయలు ఇప్పుడే తెస్తాను తమరు '' అతని మాటలు పూర్తికాలేదు

''అదేం లాభంలేదు అన్నీ ఇప్పుడుంటేనే లేకపోతే లేదు ఆలశ్యమయితే నీకేనష్టం'' అని చరచరా లోపలికెళ్ళాడు విశ్వనాథం ప్రకాశం ముఖం నిండా దిగులు నిండిపోయింది నీరసంగా ఇంటికెళ్ళాడు

పిల్లవాడు ఏడుస్తున్నాడు అన్నంపెడుతూ భార్య, ''అబ్బాయికి మందులు అయిపోయినయ్యి'' అంది ఆమాట వినటంతోనే చప్పున కోపం ముంచుకొచ్చింది

''నేనింక మందులు తేలేనూ, ఏమీ తేలేను ఆయుష్షుంటే బతుకుతాడు, లేకపోతె చస్తాడు చచ్చినా పీడాపోయిద్ది'' అన్నాడు ఆ మాటలకు అదిరిపడ్డట్టు చూసింది భార్య పిల్లవాడింకా గుక్కపట్టి ఏడుస్తున్నాడు ప్రకాశం అన్న మాటలు విన్న అతని తల్లి చిన్నగా లేచివచ్చి, పిల్లవాడ్ని తీసుకొని దొడ్లోకివెళ్ళింది అన్నం కలుపుకుని రెండు ముద్దలు తిని తల తిప్పి భార్యవైపు చూశాడు గడపలో కూర్చుని పవిట చెంగుతో కళ్ళు ఒత్తుకుంటోంది ఆమె అన్నం సహించలేదు మనస్సంతా కకావికలమైపోయింది చటుక్కునలేచి దొడ్లోకెళ్ళి చెయ్యికడుక్కుని గబగబా బైటకెళ్ళిపోయాడు ఆలోచనలు సుడులు తిరుగుతున్నయ్

పిల్లవాడు బ్రతకడేమోననే అనుమానం రోజురోజుకూ ఎక్కువవుతోంది 'పల్లెల్లో కూలీనాలీ చేసుకుని బతికేవాళ్లకు పుట్టేపిల్లలు బ్రతకటం చాలాఅరుదు ఎక్కడో ఒకళ్ళు ఇద్దరు బ్రతికినా, వాళ్ళు బలహీనంగా దిష్టిబొమ్మల్లా ఎదుగుతారు అదే ఆసాముల, షావుకార్ల పిల్లలయితే అసలు పుట్టుకతోనే ఆరోగ్యంగా, మంచి రంగుతో ఉంటారు వాళ్ళల్లో చిన్నతనపు చావులు చాలా తక్కువ ఆఫీసర్లకు పుట్టేబిడ్డలు కూడా మంచి ఆరోగ్యంతో నిగనిగలాడుతూ వుంటారు' అట్లా లేడావుండటానికి దేవుడు కారణం అంటే అతనికి నమ్మబుద్ధికాలేదు 'మంచి పుష్టికరమైన ఆహారం దొరికే ఆర్థిక పరిస్థితులు వాళ్ళకున్నయ్ కనీసం తిండిదొరికే అవకాశాలు కూడా ఈ బీదవాళ్ళకు లేవు' అనుకున్నాడు ఆమాటలు అతనికి వాస్తవంగానే కనపడ్డాయి 'కానీ- వాళ్ళు అలా వున్నవాళ్ళయిళ్ళల్లో పుట్టటానికీ, మంచి ఉద్యోగాలు చెయ్యటానికీ, నొసటిరాతే కారణమా?' అని తనలోతను తర్కించుకున్నాడు అలా అంతకుముందు ఎన్నోసార్లు అతను తనలోతను ఆ విషయం గురించి ఆలోచించాడు కాని ఏ నిర్ణయానికీ రాలేకపోయేవాడు కాని ఇప్పుడు అదికూడా నమ్మబుద్ధికావటంలేదు కాని అంతకన్నా ముందుకు ఆలోచనలు సాగటంలేదు 'వాళ్ళ కన్నియకరాల భూములుండటానికీ, బీదవాళ్ళకు లేకపోవటానికి కారణం ఎక్కడుందా?' తనలోతను తర్కించుకున్నాడు చాలాసార్లలాగా 'ప్చ్' కాదు. ఆమాటకూడా

నమ్మబుద్ధి కావటం లేదు ఇవన్నీ అర్థంకాని విషయాలుగా కనపడుతున్నయ్' అనుకున్నాడు

ఆలోచనలు కొడుకు మీదకు మళ్ళాయి

'అయ్యో! పిల్లవాడు బతకటం కష్టమయ్యా' అని తల్లి ఈమధ్య తరచుగా అంటున్న మాటలు గుర్తుకొచ్చాయి బాధతో హృదయం మూలిగింది ప్రథమ సంతానం కొడుకు పుట్టినందుకు గర్వంతో ఉప్పొంగిపోయాడు మొదట ఆనందంతో మిత్రులికి ఉత్తరాలు రాశాడు కొడుకు రంగు తనదేనని, ముక్కూ ముఖం వాళ్ళమ్మవనీ, పిల్లవాడు బాగా పొడుగనీ, ఆజానుబాహుడవుతాడని తన తోటివాళ్ళంతా అంటుంటే సంబరపడిపోయాడు నెలరోజులకల్లా గుమ్మడిపండులా వళ్ళు చేసిన పిల్లాడికి, రెండో నెలనుండి తల్లిపాలు కరువయ్యాయి బోద్దు వంటితో కేరింతలు కొడుతూ ఆడుకుంటున్న బిడ్డ, తరువాత రెండు వారాలు తిరిగే సరికి గుర్తుపట్టలేనంతగా మారిపోయాడు

అంతవరకూ మీదనే రెండూ, ఒకటీ పోసినా, మురిసిపోయిన తను ఇప్పుడు బిడ్డవైపు కన్నెత్తి చూడలేకపోతున్నాడు ఏపూట కాపూట, డ్యూటీ నుండి ఇంటికెళ్ళేసరికి బిడ్డ చచ్చిపోయాడనే వార్త వినాల్సొస్తుందేమోననే భయంతో అడుగులు వేసేవాడు దూరం నుండే బిడ్డ ఏడుపు విని నిమ్మళించేవాడు ఇప్పుడు ఆ ఏడుపు భరించలేని స్థాయికి పోతోంది 'చచ్చిపోతేనే అందరికీ సుఖం' అనుకుంటున్నాడు అప్పుడప్పుడు 'అసలు పుట్టలేదనుకుంటాం ఒక్క ఏడుపు ఏడ్చి వూరుకుంటాం దేవుడెందుకు మమ్మల్నిట్లా శిక్షిస్తున్నాడు ? ఛీ దేవుడేంటి అసలు అర్థం లేని మాట ' ఆలోచనలకు అంతం లేదు సమస్యలకూ, కష్టాలకు దరి కనపడటం లేదు

అల్లకల్లోలంగా మారిపోయిన హృదయంతో ఆ పగలంతా గడిపాడు బుర్ర వేడెక్కిపోయింది సన్నటి తలనొప్పి వస్తోంది మధ్యాహ్నం కడుపునిండా తిండి కూడా తిననందున ఆకలి దహించి వేస్తోంది ఇంటికెళ్ళబుద్ధి కావటం లేదు అడపాదడపా అతనికి తెలియకుండానే విసుగు పుట్టుకొస్తోంది బాధగా కణతలు నొక్కుకున్నాడు ఎంతమందిలో వున్నా మనసులో గుబులు తగ్గటం లేదు శరీరమంతా నిస్సత్తువుగా వుంటోంది శారీరకంగా మానసికంగా విపరీతమయిన వేదన కలుగుతోంది

'కొద్దిసేపు ఈ ఆలోచనలేవీ గుర్తురాకుండా గాఢంగా నిద్ర పడితే బావుండు' అనిపించింది స్టేషను కెళ్ళి ఎవరి పక్కన్నా వేసుకొని పడుకోవాలనుకున్నాడు కానీ నిదుర రావటం లేదు ఈ మానసిక సంక్షోభం నుండి ఎలా బయటపడాలో అతనికి అర్థం కాలేదు అతని ప్రమేయం లేకుండానే మనస్సులో రకరకాల ఆలోచనలు చోటు చేసుకుంటున్నాయి

'కొంతమందేమిటి- ఎలాటి సమస్యలున్నా, ఎన్ని ఇబ్బందులున్నా, ఎన్ని కష్టాల సుడిగుండాల్లో వున్నా నిశ్చలంగా వుంటారు కడుపునిండా తింటారు, కంటినిండా నిద్రపోతారు వాళ్ళకదెలా సాధ్యం?! అలాగుండ గలగటం ఎంత గొప్ప విషయం తను ప్రతిదానికీ బాధ పడతాడు ఎందుకు బాధ ? ఎలా జరగాలనుంటే అలా జరిగిద్ది తను బాధపడి చేసే దేమిటి? ప్రతిదాన్నీ చిరునవ్వుతో నెట్టెయ్యడం తనకెందుకు చాతకావటం లేదు ?' ఇలా సాగాయి అతని ఆలోచనలు

వుత్సాహంగా వుండాలని, తన కిష్టమైన విషయాల్నీ, వ్యక్తుల్నీ గుర్తుకు తెచ్చుకోవటానికి ప్రయత్నించాడు కాని సాధ్యం కావటం లేదు ప్రస్తుత సమస్యల మీదనుండి మనస్సు లెగవటం లేదు బాధగా తల వూపాడు 'ప్చ్' అని నిట్టూర్చాడు

అతనిలో అనాలోచితమైన ఆలోచన ఒకటి చట క్కున చోటు చేసుకుంది ఆ ఆలో...

క్రమంగా బలపడింది బాగా పొద్దుపోయిందాకా గడిపాడు చిన్నగా లేచి బయలుదేరాడు అతని కాళ్ళు కల్లు దుకాణం వైపు దారి తీశాయి ఏదో ఒక స్థిరనిర్ణయానికి వచ్చిన వాడిలాగా, అతను నడిచాడు దుకాణంలో బుడ్డి దీపం వెలుగుతోంది దుకాణం ముందు ఆగిపోయాడు లోపలనుండి మాటలు వినపడుతున్నయ్ మెదడు మొద్దుబారి పోయినట్లు ఒక నిముషం అలాగే నిలబడ్డాడు అతనికి పిచ్చెక్కుతున్నట్లుగా వుంది

చిన్నగా దుకాణంలోకి అడుగు పెట్టాడు మసక వెలుగులో అతని కక్కడ నలుగురైదుగురు మనుషులు కనపడ్డారు వాళ్ళల్లో నరశింహం కూడా వున్నాడు అతన్ని చూడగానే చటుక్కున తల దించుకున్నాడు ప్రకాశం గిరుక్కున వెనక్కు తిరగాలనుకున్నాడు కానీ అతని కాళ్ళు అతని స్వాధీనంలో లేనట్లు కదలలేకపోయాడు నరశింహం ఆశ్చర్యంగా చూశాడు ప్రకాశాన్ని లేచి ప్రకాశం దగ్గరకొచ్చాడు ఒక్క నిముషంపాటు నొసలు చిట్లించి ప్రకాశం ముఖంలోకి చూస్తూ అతన్ని చదివాడు ఆ చిరుచీకటిలో

''ఏందిరా అల్లుడూ '' అన్నాడు దీర్ఘంగా తనకోసం వచ్చాడేమో అనే అనుమానం ఓ మూలవుంది ప్రకాశం ఏం మాట్లాడలేదు తలొంచుకున్నాడు అలాగే అవమానం జరిగినట్టు ముఖం కందగడ్డలా మారిపోయింది నరసింహానికి విషయం కొద్దిగా బోధపడింది

''ఏరా ప్రకాశం! ఏందొచ్చావు?'' అనుమానంగా అడిగాడు భుజం మీద చేయ్యివేసి

''ఏం లేదు ఏం లేదు'' అన్నాడు తడబడుతూ ప్రకాశం పూర్తిగా అవగాహన అయ్యింది నరసింహంకు

''బయటకు పోయి మాట్లాడుకుందాంపద'' అన్నాడు భుజం మీద వున్నచేతితో అలాగే ప్రకాశాన్ని ఇటుతిప్పుతూ నరశింహం ప్రకాశం వెనక్కు తిరిగాడు

''నేనురాను'' అన్నాడు ప్రకాశం

''కాదులే, రా'' అని బలవంతంగా బయటకు నడిపించుకెళ్ళాడు నరసింహం ''ఏందిరా? నీకేమన్నా పిచ్చిపట్టిందా?'' అన్నాడు

ప్రకాశం సమాధానం చెప్పలేదు బాధగా నుదురు రుద్దుకున్నాడు గట్టిగా నిట్టూర్చాడు ''నేను ఇంటికిపోవాలి'' అని గబగబా కదిలాడు నరశింహం ప్రకాశం భుజం పట్టుకొని ఆపాడు

''ప్రకాశం, ఇటుచూడు నావైపు'' అన్నాడు అతని స్వరంలో చనువుతోకూడిన అధికారం వినిపించింది ప్రకాశం తలతిప్పి అతని వైపు చూశాడు సారాయివాసనకు మళ్ళీ తలతిప్పుకున్నాడు

''నీబాధ నేను అర్థం చేసుకోగలనురా ఎంత బాధలో వుంటే నువ్విట్లా తాగటానికి వస్తావో నేనూహించగలను'' అన్నాడు అతనలా ఆప్యాయంగా మాట్లాడుతుంటే ఏడుపు ముంచుకొచ్చింది ప్రకాశంకు అతి బలవంతంగా పళ్ళుబిగబట్టి ఆపుకున్నాడు కళ్ళల్లో నీళ్ళూరాయి కొద్దిసేపు ఏమీ మాట్లాడలేదు చీమిడి చీది చెయ్యి నిక్కరుకు తుడుచుకున్నాడు

''నా బాధ నీకర్థంకాదు మామా '' అన్నాడు ప్రకాశం బరువుగా

''అయ్యో! నీ బాధ నే నర్థం చేసుకోగలనురా! నీకన్నా ఎక్కువ బాధలుపడ్డాను అచ్చం నీ పరిస్థితులలోనే నేనూ, ఇదిగో ఈ తాగుడికి అలవాటుపడ్డాను నీ కొకసారి ఇక్కడే ఈ దుకాణం దగ్గిరే చెప్పానుకూడా ఇట్లాగయినా ఆ బాధలనుండి కొంత విశ్రాంతి దొరికిద్దేమోనని బలవంతంగా దీని కలవాటు పడ్డాను దీనివలన కష్టాలు తగ్గకపోగా ఈ వ్యసనం నుండి బయటపడలేక పోతున్నాను మనబోటోళ్ళమంతా ఇట్లాంటి బాధలనుండి కొంచెం విముక్తి పొందుదామనే ఇట్లాంటి వ్యసనాలకు

అలవాటుపడి పోతున్నాం. కానీ ఈటిలో పడ్డాక ఇక తప్పించుకోటం ఎవుడి తరమూ కాదు'' అన్నాడు. మాటలు క్రమంగా ముద్దగా వస్తున్నాయి.

ప్రకాశం ఏటో శూన్యంలోకి చూస్తున్నాడు చీకట్లో.

''ప్రకాశం, నామాట విను. నువ్వు తాగితే నాకొచ్చే నష్టం లేదు. తాగకపోతే వచ్చే లాభమూ లేదు. మనమంతా ఒకటి. నీ కులమొకటీ, నా కులమొకటీ కావచ్చు. కాని నువ్వు నా స్నేహితుడివి. ఒకచోట పని చేస్తున్నాం. దీనివల్ల ఎంత నష్టముందో నాకు తెలుసు. అందుకు నీకు చెపుతున్నా. చేతులు పట్టుకొని బ్రతిమాలుతున్నా. నేను నిజమయిన స్నేహితుడిని కాబట్టి నీ మంచి కోరుతున్నా. నువ్వు తాగొద్దు. నీ పెళ్ళాం పిల్లలకు అన్యాయం చెయ్యొద్దు. ఈ బాధలు మనకెప్పుడూ వుండేవే. మనసు గట్టిపరచుకోవటం అలవాటు చేసుకో. చదువుకున్నోడివి. నీకు నేను చెప్పకూడదు. కొంచెం ఓపిక పట్టుకో. చేతిలో చదువుంది. ఏ రైటరువో అయితే నీ కష్టాలు గట్టెక్కుతాయి. మాకు సదువులేదు. ప్రొమోషనొచ్చే రాత లేదు. నామాట విను'' అని గడ్డం పట్టుకున్నాడు. నరశింహం వైపు చూశాడు ప్రకాశం. చిన్నగా గొంతు పెకలించాడు అతికష్టం మీద.

''వేదనతో నేను చచ్చిపోతున్నాను నరశింహం మామా'' అన్నాడు. అతని గొంతు విషాదంగా ధ్వనించింది. ఏ క్షణంలోనయినా ఏడుపు కట్టలు తెంచుకోవచ్చనే అనుమానం వచ్చింది నరశింహానికి. వాతావరణం చలిగా వుంది. కల్లుపాకలో గొంతులు అస్పష్టంగా వినపడుతున్నయ్. దూరంగా వీధి దీపం మసగ్గా కునుకుతోంది. గట్టిగా తనివితీరా ఏడవాలనే బలమైన అతని కోర్కెకు అభిమానం ఆనకట్ట వేస్తోంది. ప్రకాశం పరిస్థితిని చదవటానికి ప్రయత్నం చేస్తున్నాడు నరశింహం. నిముషాలు నిశ్శబ్దంగా జారిపోతున్నాయి. కొద్దిసేపటికి కొద్దిగా తమాయించుకున్నాడు ప్రకాశం.

''ప్రకాశం, ఇంటికి పద'' అన్నాడు నరశింహం.

''నేను రాలేను మామా. అక్కడ నాకు మనశ్శాంతి లేదు. స్టేషన్లో కూడా అంతే. ఎక్కడా నాకు మనశ్శాంతి లేదు. నన్నర్థం చేసుకొనేవాళ్ళు లేరు. నా బాధని పంచుకొనేవాళ్ళు లేరు. నాకు చచ్చిపోవాలనిపిస్తోంది. కొద్దిసేపు మనస్సు విప్పి మాట్లాడేవాళ్ళు లేరు. కష్టాలు నన్ను వెంటబడి తరుముతున్నయ్. ఏం చేయాలో పాలుపోవటం లేదు''

''నిజమే. నువ్వొక్కడివే కాదు. అందరూ అంతే. చివరకు విశ్వనాథంగాడు కూడా అంతే. ఆమాటకొస్తే రైటరుగాడు, యస్సైగాడు, సార్జెన్‌గాడు, సి ఐ గాడు. ఏ నా కొడుకు సుకంగా, సంతోషంగా వున్నాడో చెప్పు నాకు. కాకపోతే ఆళ్ళకి డబ్బులికి ఇబ్బంది లేదుకానీ, మనశ్శాంతి ఆళ్ళకి కూడా లేదు. నే చూస్తన్నాగా. కాకపోతే నీది మరీ సుతిమెత్తని మనస్సు. నాకు తెలుసు. కానీ, అయ్యా! ఈ నిర్ణయం వద్దు. మానుకో. బాధలకు ఓర్చుకోటం నేర్చుకోకపోతే ఇట్టాంటియ్యి తప్పవు. మన మొకాన దేవుడు అట్టా రాసిపెట్టాడు. అనుబగించాల్సిందే. తెల్సుకుంటే అంతే. అయినా ఇట్టాంటప్పుడే దైర్యంగా వుండాలి. అదే మొగోడి తనం...''

''దేవుడున్నా డంటావా?'' అడిగాడు నిర్లిప్తంగా ప్రకాశం.

''అమ్మో! అంతమాట అనమాక. దేవుడు లేకపోతే మనం ఏడనుండొచ్చాం. కష్టం వచ్చిందని మనం అంతలావు మాటలనకూడదు'' అన్నాడు నోటికి వేలు అడ్డం పెట్టుకొని.

ప్రకాశం నవ్వాడు విరాగిలాగా.

వాళ్ళ సంభాషణ అలా జరుగుతున్నప్పుడు దారినపోయే ఒకతను ఆ మాటలు విని వాళ్ళని

దాటి పోయి నాలుగడుగులు వేసి నిలబడ్డాడు వింటూ అది గమనించారు ఇద్దరూ మాట్లాడటం ఆపి అటు తిరిగాడు నరశింహం ''ఏంది?'' అన్నాడు అతన్ని ఉద్దేశించి అతనేమి సమాధానం చెప్పకుండా కదలబోతున్నాడు అంతలోనే అన్నాడు నరశింహం ''ఏంది లేకపోతే, ఏంది ఇనేది, ఫో లేకపోతే '' అని ఒకడుగు వేశాడు కోపంగా అతను గబగబా వెళ్ళిపోయాడు ''పెతి నాకొడుకూ మా బతుకుల్లోకి తొంగిచూడాలనే ఈళ్ళమ్మని '' అని తిట్టాడు ఇటువైపు తిరిగాడు

''ఇప్పుడయ్యన్నీ ఎందుకుగానీ, నువ్వింటికిపో ఆ గోపాలంతో తిరుగుతున్నావు కాబట్టి నీ కిట్టాంటి ఆలోచనలు వస్తున్నయ్ సరేలే పద'' అని ప్రకాశం భుజం పట్టుకొని ముందుకు నెట్టాడు ప్రకాశం ఏమీ మాట్లాడలేదు చిన్నగా నడక సాగించాడు నరశింహం అతన్ని అనుసరించాడు రెండడుగులు వేశాక, ''అరే అల్లుడూ, నే నీడ వుండటం కూడా నీ అదృష్టమేరా లేకపోతే ఈ పాటికి ఎంత గోరం జరిగిపోయేదో'' అన్నాడు నవ్వుతూ

ప్రకాశంకు మనస్సు కొంచెం తేలికపడ్డట్టు అనిపించింది ఇంటికెళ్ళి అన్నం తివి స్టేషను కొచ్చాడు చాలా రోజుల తరువాత గాఢంగా నిద్ర పట్టింది తెల్లవారు ఝామున మూడుగంటలకు లేచి పహారా ఎక్కాడు నరశింహంతో జరిగిన సంభాషణ గుర్తు కొచ్చింది వెలితిగా శూన్యంగా వున్న మనస్సు కొంత నిండినట్లు అనుభూతి కలిగింది

'కష్టంలోనే ధైర్యం గుండాలి' అన్న నరశింహం మాటలు గుర్తు కొచ్చాయి ఏదో నిర్ణయాని కొచ్చినట్లు గాఢంగా నిట్టూర్చాడు తల పైకీ కిందకు వూపాడు 'సరేకానీ, ఎట్టా రాసుంటే అట్టా జరిగిద్ది' అనుకున్నాడు

మర్రోజు కొట్టుకెళ్ళి పిల్లవాడికి పాలడబ్బా తెచ్చాడు కొట్టతను బాకీ గుర్తు చేశాడు ''ఇస్తాను లేవయ్యా! ఎగ్గొట్టనులే నాకు గుర్తుంది'' అన్నాడు చిరుకోపంగా

''అయ్యా! అట్టాగే కాకపోతే ఒకసారి గుర్తుకు '' అని నసిగాడు కొట్టతను ఎప్పుడూ మెత్తగా వుండే ప్రకాశంలో ఈ మార్పు కొట్టవచ్చినట్టు కనపడింది కొట్టతనికి

తనలో తను నవ్వుకున్నాడు ప్రకాశం

'పోలీసంటే ఎంత భయం వీళ్ళకు' అనుకున్నాడు గురవయ్య తరచుగా అనే మాటలు గుర్తొచ్చాయి 'ఈ రోజుల్లో బ్రతకాలంటే కొంత గడుసుదనం కూడా కావాలి మంచిగా బ్రతకాలనుకుంటే కడుపు నిండదు, రోజు గడవదు' ఆ మాటలే ఆలోచించాడు 'కాని ఈ పద్ధతికి మనం అలవాటు పడలేము మనస్సును చంపుకొని అలా ప్రవర్తించలేము. మరి పరిస్థితులేమో ఇలా గుంటున్నాయి' అనుకొన్నాడు ఆలోచనలతో ఇంటికెళ్ళాడు

రోజులు గడుస్తున్నాయ్ పిల్లవాడి ఆరోగ్యం కొంచెం కుదుటపడింది ప్రకాశం తల్లికి కూడా వంట్లో బాగానే వుంటోంది భార్య ఆరోగ్యం బాగుపడింది ఇంట్లో పరిస్థితులు కాస్త మెరుగయ్యాయి స్టేషన్లో పరిస్థితులు మామూలే కాని వూరినిండా అప్పులు పెరిగాయి చిల్లర సరుకుల కొట్లో అప్పు తెలిసినవాళ్ళ దగ్గర చిల్లర డబ్బులు అప్పు మందులషాపులో అప్పు కట్టెల అడితిలో అప్పు ఇలా అప్పులు పెరిగిపోయాయి అప్పుల వాళ్లని తప్పుకొని తిరగాల్సి వస్తోంది జీతం డబ్బులు ఇంటి ఖర్చులకే చాలటం లేదు అదనపు రాబడికోసం ఎదురుచూడాల్సి వస్తోంది అప్పుల వాళ్ళని తప్పుకొని పోలేని పరిస్థితుల్లో చిన్న చిన్న అబద్ధాలు చెప్పాల్సి వస్తోంది వాళ్ళ

కొద్దిపాటి జులుం ప్రదర్శించక తప్పటం లేదు ఇలాటి అన్ని సంఘటనల తరువాత తీవ్ర మానసిక క్షోభను తట్టుకోలేని పరిస్థితి కలుగుతోంది ఈ బాధను తట్టుకోవటానికి తాగుడు మార్గం కాదని తెలిసింది ఈ అప్పులు తీరాలంటే డబ్బులు కావాలి ఎలా ? ఎలాగో అర్థం కావటంలేదు

స్టేషన్లో ఎవరన్నా రిపోర్టిస్తే ముద్దాయిల్ని పిలుచుకు రావటానికి తనని పంపిస్తే బాగుండు ననుకుంటున్నాడు 'ఆ స్థానంలో వున్న విశ్వనాధాన్ని పడగొట్టాలి ఆ స్థానాన్ని తను కైవసం చేసుకోవాలంటే ఆఫీసర్లని కాకా పట్టాలి. విశ్వనాధం కన్నా అన్ని విధాలా వాళ్ళకు దగ్గరవ్వాలి ఆత్మాభిమానం, ఆత్మగౌరవం ఇలాటి మాటలు మరిచిపోవాలి మనసాకటుందనే విషయం గుర్తుకు రాకూడదు ఆర్డర్లీని మించిన సేవలు అందించాలి నీతి నియమాల్ని వదిలెయ్యాలి పరిస్థితులు అంతదూరం తీసుకెళ్ళేలా వున్నయ్' అనుకున్నాడు

కానీ అది అతనికి చేతకావటం లేదు డబ్బులు సంపాదించటానికి మార్గం కనిపించటం లేదు

అదే విషయం గోపాలం దగ్గర ఒకరోజు ప్రస్తావించాడు ''మన స్టేషనుకేమీ మామూళ్ళు లేవేంటి అసలు మిగతాచోట్ల వున్నాయటగా? అసలు డబ్బులకెంత కటకటగా వుందో చెప్పలేను'' అన్నాడు

''మిగతా చోట్లన్నిచోట్లా ఎందుకుంటయ్? కొన్ని టౌన్ స్టేషన్లలో, పెద్ద తాలూకా స్టేషన్లలో వుంటాయ్'' అన్నాడు గోపాలం

''ఎట్లా, ఏ రూపంలో రావటానికి వీలుంది?''

''ఎట్లాగేముంది టౌనుల్లో అయితేక్లబ్బులుంటయ్ వాళ్ళిస్తారు సారాయి కాంట్రాక్టర్లిస్తారు బ్రోతల్ కంపెనీలవాళ్ళు ఇస్తారు బ్రాకెట్ కంపెనీలున్నచోట వాళ్ళిస్తారు సిటీ బస్సుల వాళ్ళు ఇస్తారు ఇట్లా ఒకోచోట ఒకోరకంగా వుంటుంది సబ్ స్టేషన్లలో అయితే కొన్నిచోట్ల కోడి పందేలు వేస్తుంటారు వాళ్ళిస్తారు నాటుసారాయి కాసేవాళ్ళుంటే వాళ్ళిస్తారు కొన్ని టౌనుల్లో నల్లమందు అమ్మేవాళ్ళుంటారు వాళ్ళిస్తారు మన దరిద్రం కొద్దీ మన లిమిట్స్‌లో అలాటివేమీ లేవు మన జనమంతా వుత్తమోత్తములు ఎవుడన్నా స్టేషను కొచ్చి కంప్లైంట్ యిస్తే, అదీ ఏదన్నా ప్రాపర్టీ కేసయితే, ఆ వచ్చినవాడు కాస్త వున్నవాడయితే తలా ఒక అణా లేకుంటే అదీలేదు మొన్నటి దాకా ఆ బస్సులవాళ్ళు ఇచ్చేవారు ఈ యస్పై వచ్చినాక, ఆ బస్సు ఓనర్లని పనిగట్టుకుని పిలిపించి స్టాపుకి డబ్బులు ఇవ్వవొద్దని చెప్పాడు ఆ సార్జెన్ గాడికీ, రైటరు గాడికీ మాత్రం ఇస్తూ మన కాపేశారు బస్సులోళ్ళు అదేమని అడిగితే 'మీవికూడా మీ యస్పై తీసుకుంటున్నాడుగా' అన్నారు ఏంచేస్తాం మూసుకుని కూర్చున్నాం వెధవముండల్లాగా' అన్నాడు కోపంగా గోపాలం

ఆ విషయాన్ని వాళ్ళు చాలాసేపు మాట్లాడుకున్నారు

ఒకరోజు ఆ విషయాన్ని భార్య దగ్గర కదిలించాడు ప్రకాశం విని వూరుకుంది ''మనం కొంచెం పొదుపుగా వాడుకోకపోతే చాలా ఇబ్బందులలో పడాల్సొచ్చిద్ది కావల్సినియ్యి తెచ్చిపడేసేవాడినే కాని, ఇంట్లోది ప్రతీది పొదుపుగా వాడే బాధ్యత ఆడవాళ్ళదే కదా!'' అన్నాడు

భార్య కొద్దిసేపు మాట్లాడలేదు ''మనమీదకొచ్చాక శానా ఇసయాలు మారిపోయినియ్యి'' అంది

ఏమిటన్నట్లు చూశాడు ప్రకాశం

''అన్నీ తలసవురు కాడినుండీ ఒక్కోసారి మనూళ్ళో వున్నప్పుడు పుల్లనీళ్ల కూడా

కటకటలాడే మనం, సిక్కటి సల్లకు అలవాటు పడ్డాం సజ్జ బువ్వో, జొన్న సంగటో ఉడకేసుకొని ఇంత సింతకాయో, మిరపకాయో నలుసుకొని, పుల్లనీల్లతో కడుపు నింపుకొనే మనం, రోజుకొక కూరగాయతో తింటన్నాము ఆడ ఏనాడన్నా మనం పాయిలోకి పుల్లలు కొన్నామా ? మట్టికుండల్లో వుడకేసుకొనే మనం డేగిశాల్లో వండుకుంటున్నాం ఇంక గుడ్డల ఇసయం సరేసరే నేలమీద గోనెపట్టలు పరుసుకొనే మనం, మంసాలమీద తలగడ లేసుకొని పడుకుంటున్నాం ఈటన్నిటికీ తోడు ఆడేనాడన్నా వల్లెచ్చబడిందా, మాత్తరేసుకున్నామా? ఈడెన్ని డబ్బులు ఆసుపత్రికి పోత్తన్నాం మరింక ఇట్టాంటప్పుడు జీతం డబ్బులు ఏడసాల్తయ్ ఇంకిన్ని వత్తే మాత్తరం యాడసాల్తయ్ ఇంటికర్సుల్లో వురదా కర్సులు ఏవున్నయ్, పొదుపు సెయ్యటానికి?!'' అంది

భార్య మాటల్ని జాగ్రత్తగా ఆలకించాడు తన భార్య ఇంత బాగా ఆలోచిస్తూ తమ జీవితాల్లో జరుగుతున్న మార్పుని ఇంత జాగ్రత్తగా గమనిస్తున్న విషయాన్ని ఇప్పుడే తెలుసుకున్నాడు అతనికి చాలా సంతోషమేసింది ఆమె అన్న మాటల్ని నెమరు వేసుకున్నాడు

అతని ఆలోచనలను భగ్నం చేస్తూ భార్య చిన్నగా అంది ''నేను కూడా ఏదన్నా పనికిపోతా, పొలం పనికి''

ఆమాటకు అతను ఆశ్చర్యంగా చూశాడు ''ఏం పొలం పనికీ?!'' అన్నాడు

''ఏం పొలం పనేంది? ఏదో ఒక పని పొలం పనులు, కాయ కష్టం పనులు నాకు కొత్తా? లేకపోతే ఎట్టా? పెరిగిన కర్సుకి మరి ఏదో ఒకటి ''

''సర్లే సర్లే'' అన్నాడు ఆమె మాటని మధ్యలోనే తుంచివేస్తూ ''భలే ఆలోచించావే'' అన్నాడు మళ్ళీ

''బలే ఆలోసించేదేంది? పోయేవాల్లంతా? రోజూ డొంకలోకి పోయి పేడేసుకొచ్చి పిడక లమ్మితే నెలకు రెండు మూడు రూపాయిలన్నా వత్తాయి లేకపోతే ఇంకో పని ఎంతకాడికని నువ్వొక్కడివే పిల్లాడ్ని సూసుకోటానికి మెమ్మెండ్లా? డొబ్బులకింత కటకటలాడిపోతుంటే మరెట్టా యేదోవకటి సెయ్యకుండా'' అంది

భార్య మాటలు ప్రకాశంకు ఆనందం కలిగించాయి కొద్దిసేపు ఏమీ మాట్లాడలేదు

''అప్పుడంటే అప్పుడు మనూల్లో వున్నాం మనకి ఉజ్జోగం సజ్జోగం లేదు మరి ఇప్పుడేమో ''

''మరి ఈ అప్పులు ఎప్పుటికి తీరేది? రోజురోజుకీ ఇట్టా పెరిగిపోతావుంటే ''

''ఎప్పుడూ ఇట్టాగే వుంటదా? కొంతకాలం సూడాలి. నువ్వు అట్టాంటి పని ఎప్పుడూ సెయ్యగాక నాకు చెప్పకుండా'' అన్నాడు

ఆమె ఇంకేమీ మాట్లాడలేదు

'సర్కారు నౌకరీ చేస్తూ తోటివాళ్ళలో గైరుగా వుండాలి కనీసం వాళ్ళతో సమానంగానన్నా వుండాలి ఇంట్లో ఏతిండి తింటున్నదీ ఎవరూ చూడకపోయినా, బయటకు వెళ్ళేటప్పుడు కట్టే గుడ్డన్నా కనీసం మిగతా వాళ్ళతో సమానమైంది కట్టాలి కనీసం ఆమాత్రం లేకపోతే ఇంకెందుకు?' అని ఆలోచించాడు

అదేమాట ఒకసారి గోపాలం దగ్గర అన్నాడు

అతను అంతా విని, ''అదేమరి మానవ జీవితాల్లోని సుఖ దుఃఖాలకు మూలం ఆర్థిక పరిస్థితుల్లోని హెచ్చు తగ్గులే అంతేకాని దేవుడూ, దెయ్యం, ఖర్మ, పునర్జన్మ కాదు'' అన్నాడు

ఆమాట గురించి ప్రకాశం చాలాసేపు ఆలోచించాడు తరువాతెప్పుడూ ఆ మాటల్ని మరిచిపోలేదు

''నీతో ఎప్పుడేమాట మాట్లాడినా తీసుకొచ్చి దేవుడూ దెయ్యం దగ్గిర ఆపుతావే'' అన్నాడు నవ్వుతూ ప్రకాశం

ఆ మాటకు గోపాలం కూడా నవ్వి, ''మనల్నిప్పుడు పట్టి పీడిస్తున్నవి అవేగా మరి'' అన్నాడు

నౌకరీ విషయంలో పాలేరు బతుక్కీ దీనికీ ఏం తేడాలేదు గొడ్డుశాకిరీకీ మారుపేర్లే ఇందులో మాత్రం జీవనంలో కొద్దిపాటి సౌఖ్యముంది అంతకుమించి మరింకేమీలేదు కాని తనభార్య గమనించని ఒక విషయం తన మానసికవేదన పాలేరుగా తనెప్పుడూ ఇంతటిబాధను అనుభవించలేదు కారణం ఏదైనాకానీ, తనెప్పుడూ వుల్లాసంగానే వున్నాడు మానసికంగా కాని ఇప్పుడు జీవచ్ఛవంలా ప్రతి నిముషం- తన మనస్సుకు - వ్యక్తిత్వానికి వ్యతిరేకమైన కృత్రిమ జీవితం గడుపుతున్నాడు ఇది వుద్యోగంలోనే వుంది తరువాత తను కాస్తోకూస్తో చదువు నేర్చుకొని, పుస్తకాలు చదివి, బుర్రకు ఆలోచించే అలవాటు నేర్పి, ప్రపంచాన్ని గురించీ, దేవుణ్ని గురించీ, జీవించే విధానాన్ని గురించీ కొన్ని అభిప్రాయాలు ఏర్పరచుకొని, అలా జీవించాలని ప్రయత్నించటమూ, పరిస్థితులు దానికి ఎదురుతిరగటమూ, ఇదంతా ఏమిటో అర్థం కాలేదు

'తనీ ఉద్యోగంలోకి రాకుండా వుంటే బావుండు ఈ చదువూ, ఈ తెలివితేటలూ, ఈ ఆలోచన, ఈ ప్రపంచంతో పరిచయం కలగకుండా, తమ వూళ్ళోనే బతికినంతకాలం పాలేరుగానో, ఇంకోరకంగానో బతికి చస్తే బాగుండు, ఇట్లాంటి బాధలుండవుకదా' అని అనిపిస్తుంటుంది ఒక్కొక్కసారి రోజురోజుకూ తన జీవితమంటే ఓరకమయిన ఆనందం, బాధ, దుఃఖం, విసుగు, మాటలతో చెప్పటానికి వీలుకాని అభిప్రాయాలు కలుగుతున్నాయి కాని అవి పూర్తిగా నిలబడటం లేదు పరిస్థితుల్ని బట్టి పూర్తిగా మారటం లేదు అవసరాలు తనని మారమంటున్నాయి కాని మనస్సు అందుకు అంగీకరించటంలేదు ఆర్థిక ఇబ్బందులు ఆత్మగౌరవాన్ని తాకట్టు పెట్టమంటున్నాయి 'అందరి పరిస్థితీ ఇంతేనా? లేకపోతే తన ఒక్కడి విషయంలోనే ఇట్లా జరుగుతోందా?' అని అలోచించాడు

'చాలా మంది విషయంలో ఇలాగేవున్నట్లు తోచింది కాని ఎవరూ బయటకు చెప్పుకోరు, చెప్పుకోలేరు చాలామంది తమ మనసుల్లో కలిగే భావాలకు మాటలరూపం ఇవ్వలేరు ఆనందమయినా, బాధయినా, చేష్టల ద్వారా వ్యక్తం చేస్తున్నారేతప్ప వాటికి మాటల రూపం ఇచ్చి నలుగురికీ చెప్పటంలేదు కారణం తాము నలుగురిలో నగుబాటవుతామనే భావనా?' చాలాసేపు ఆ విషయం గురించి ఆలోచించాడు విసుగుపుడుతోంది దారీ తెన్నులేని ఆలోచనలు విసుగు పుట్టిస్తున్నాయి ప్రతివిషయం చివరకు డబ్బు దగ్గరకొచ్చి ఆగుతోంది విసుగుతో అటు ఇటూ చూశాడు తేనెతుట్టె చుట్టూ ముసిరే తేనెటీగల్లా విదిలించినాపోకుండా చుట్టు ముడుతున్నయ్ ఆలోచనలు

'అదనపురాబటి విషయం ఎట్లా చెయ్యాలి ?' చివరకేదో నిర్ణయాని కొచ్చినట్లు, 'తప్పుదు అయినా ప్రయత్నించిచూద్దాం' అనుకున్నాడు ఒకరోజు తన ఉద్దేశ్యాన్ని ఎవరికన్నా చెబితే బాగుండునని తహతహలాడాడు ఎవరికిచెపితే మంచిసలహా యిస్తారా అని ఆలోచించి గోపాలం దగ్గరకు బయలుదేరాడు 'కోప్పడతాడేమో నే చెప్పేదివిని' అనుకుని నవ్వుకున్నాడు

గోపాలం ఇంటిదగ్గరేవున్నాడు ప్రకాశాన్ని చూచి కూర్చోమని కుర్చీ చూ పించాడు కూర్చొని

ఆ మాటా ఈమాటా మాట్లాడిన తరువాత తన మనస్సులోని మాటని బైటపెట్టాడు ''ఈ ఆర్థిక ఇబ్బందుల్లోనుంచి బయటపడాలంటే పేకాట ఒక మంచి పరిష్కారమార్గంగా కనపడుతోంది'' అన్నాడు గోపాలం ఏమంటాడో అనే బెరుకు మనస్సులో కదులుతోంది ప్రకాశం అన్న మాటవిని నొసలుచిట్లించాడు గోపాలం చిరుకోపంగా, ఎగతాళిగా అన్నాడు

''దానికన్నా కొంపలకు రాత్రిపూట కన్నాలెయ్యటం ఇంకా మంచి లాభదాయకమ్మైన పరిష్కార మార్గం'' అన్నాడు

ఆమాటవిని బిత్తరపోయి చూశాడు ప్రకాశం అంతలోనే తేరుకున్నట్టు నవ్వాడు గోపాలంకూడా అతని నవ్వుతో శృతి కలిపాడు

''ఎందుకు నవ్వుతావు? ఏం నేనుచెప్పింది నచ్చలేదా?'' అన్నాడు గోపాలం

''ఏం నన్ను జైలుకు పంపాలనుకుంటున్నావా?'' అన్నాడు ప్రకాశం నవ్వుతూ

''అవును నేరాలుచేస్తే నువ్వొక్కడివే పోతావు జైలుకి పేకాటలో అయితే కుటుంబమంతా నాశనమయ్యిపోయిద్ది నీకేమన్నా చాదస్తమా అసలెందుకొస్తాయి ఇట్లాంటి ఆలోచనలు ఎవుణ్ణే చూశావు నువ్వు పేకట్లో బాగుపడ్డోడిని?'' అన్నాడు గోపాలం

''మనోళ్ళు అంటుంటారుగా కొంతమంది రాత్రి అంతొచ్చిందీ, ఇవ్వాళ ఇంతొచ్చిందీ అని కోళ్ళూ, మాంసాలు నాగాలేకుండా తింటుంటారు ''

ప్రకాశంమాట పూర్తికాకుండానే గోపాలం అన్నాడు

''పది రోజులపాటు వరసగా పేకాటలో డబ్బులు పోగొట్టుకోవటం నీకు కనపడదు కానీ పదకొండోరోజుమాత్రం వాళ్ళకు రెండురూపాయలు రావటం, కోళ్ళని కోసుకోవటం నీదృష్టిలో పడిద్ది ఆ పదిరోజులూ కొంపలో పిల్లలకి పచ్చడిమెతుకులు కూడా లేని స్థితి నీకు తెలియదు జూదగాళ్ళ బ్రతుకులింతే ఇట్లాంటి ఆర్థిక ఇబ్బందుల్ని తట్టుకోలేక ఏదో సంపాదించాలని, ఇలా పేకాటకు అలవాటుపడటం, జీతంరాళ్ళుకూడా దానిలోపోగొట్టుకోవటం, పెళ్ళాంపిల్లల్ని పస్తులు పడుకోబెట్టటం మినహా ఏంలేదు నువ్వు చెప్పరాదూ మన స్టేషన్లో కూడా పేకాట బేచ్చీ వుందిగా వాళ్ళ ఆర్థిక పరిస్థితి ఏమాత్రం మెరుగ్గావుందో చెప్పరాదూ నాసర్వీసులో, నాకు తెలిసినంతవరకు పేకాటలో బాగుపడ్డవాడెవడూలేడు దానిమూలంగా సర్వనాశమైపోయిన కుటుంబాలని చూశాను అది తాగుడుకన్నా భయంకరమ్మైన వ్యసనం దానికలవాటుపడ్డవాడు ఇక అంతే మన ఆర్థిక పరిస్థితులు బాగుపడాలంటే గవర్నమెంటు మనకిచ్చే జీతాలు పెంచాలి టీ ఏ లు పెంచాలి సరుకుల ధరలు తగ్గించాలి మనం వున్నవాటిని పొదుపుగా వాడుకోవాలి ఇట్లాగయితే కొంచెం ఇబ్బందులు తొలుగుతాయి గానీ, నీ వనుకుంటున్నట్లుగా జూదం మనిషి దరిద్రాన్ని తొలిగించ లేదు'' అన్నాడు

ప్రకాశం జాగ్రత్తగా ఆలకించాడు గొప్ప విషయం తెలిసినట్లు సంతోషించాడు తన కామాత్రం ఆలోచన రానందుకు సిగ్గుపడ్డాడు 'నిజానికి గోపాలానికి చాలా విషయాలు తెలుసు ప్రతివిషయాన్ని గురించి నిర్దిష్టమైన అభిప్రాయాలున్నయ్ అతనంతట అతను విషయాన్ని వీలయినంతవరకు కూలంకషంగా ఆలోచిస్తాడు తన విషయానికొస్తే ఎవరైనా చెప్పిందాకా తనో నిర్ణయానికిరాలేడు' అనుకున్నాడు లేచి వచ్చాడు ఇంటికి

మర్రోజు ఉదయం కోర్టుకెళ్ళాడు ప్రకాశం ఇంటికొచ్చేసరికి బాగా పొద్దుపోయింది స్టేషనుకెళ్ళి సి డీ ఫైళ్ళు స్టేషన్లో పడేసి, పాస్పోర్టు కాగితంమీద డ్యూటీనుండి తిరిగొచ్చిన

టైమువేసి రైటరుచేత సంతకం చేయించుకొని, ఆ కాగితాన్ని తీగకు గుచ్చి బయటకొచ్చాడు గేటుదాటి బయటకొచ్చిందాకా మనస్సు బిక్కుబిక్కుమంది రైటరు తనని వెనక్కు పిలిచి, నైటుబీటుకు రమ్మనో, లేకపోతే ఇంకోపనేదన్నా చెపుతాడేమోనని భయపడ్డాడు కాని రైటరు ఏ ఆలోచనల్లో మునిగివున్నాడోకాని ప్రకాశాన్ని పట్టించుకోలేదు లైను దగ్గర కొచ్చేసరికి ఎవరో పెద్దగా అరుచుకుంటున్నారు 'తరచుగా జరిగే తగాదాలేలే' అనుకున్నాడు ఆ రాత్రి డ్యూటీ ఏమీ లేనందుకు పెద్దపెద్ద అంగలు వేస్తూ నడిచాడు సంతోషంగా బాగా దగ్గరకొచ్చేసరికి తన భార్య గొంతు వినపడుతోంది రెండో గొంతు విశ్వనాథం భార్యది మనిషిని కంగారు ఆక్రమించింది గబగబా నడిచాడు విషయాన్ని వూహించలేకపోయాడు లైనులో కొచ్చాడు రెండు లైన్లలోని మిగతా ఆడవాళ్ళు ఎవరి ఇంటిముందు వాళ్ళు నిలబడి చోద్యం చూస్తున్నట్టు చూస్తున్నారు భార్యని లోపలికి పిలిచి, ఇంటిలో కెళ్ళాడు భార్య అతనితో పాటు లోపలి కొచ్చింది కానీ మళ్ళీ బైట కెళ్ళింది వెంటనే

''ఏమిటి? ఏమిటి తగాదా?'' అన్నాడు తల్లితో

''ఏముందిరా ఇదిగో కోడిపెట్ట అళ్ళ పంచలో యేరిగిందంటా ఆ బేపనావ రాయి తీసుకొని కొడితే సచ్చిపోయింది అదేవని అడిగితే ఆవ నోటి కొచ్చినట్టు మాట్టాడతంది'' అంది తల్లి

చచ్చి నీలుక్కుపోయిన కోడివైపు చూశాడు ప్రకాశం కోపమొచ్చింది తమాయించు కోవటానికి ప్రయత్నించాడు భార్యని కేకేశాడు లోపలికి రమ్మని అవతలనుండి విశ్వనాథం భార్య ఇంకా పోట్లాడుతూనే వుంది అతని పిలుపుకు భార్య లోపలకు వచ్చింది ఆ గోలకు నిద్రపోతున్న పిల్లవాడు లేచి ఏడుస్తున్నాడు

''అది యిడిసిందయితే దానితో నీకేంది సంపితే సంపిందిలే పోనియ్ దాని పాపాన అదే పోయిద్ది'' అన్నాడు యూనిఫారం విప్పి కొంకికి తగిలిస్తూ

''కోడిని సంపింది కాక, కులం తక్కువోల్లమని, అంటరానోల్లమని ఏందేందో అంటంది'' అంది వుక్రోషంగా భార్య ఆ మాట వినేసరికి ప్రకాశంకు వళ్ళు మండింది కాని కోపాన్ని అణుచుకోవటానికి ప్రయత్నించాడు కానీ క్షణంలో అవమానంతో అతని హృదయం నిండిపోయింది

''అంటే అందిలే పిల్లాడ్ని తీసుకో'' అని లుంగీ కట్టుకొని బయటకు వచ్చాడు ప్రకాశాన్ని చూచి ఇంకా రెచ్చిపోయినట్టు మాట్లాడుతోంది విశ్వనాథం భార్య నిశ్శబ్దంగా వున్న ఆ వాతావరణంలో ఆమె గొంతు పెద్దగా వినబడుతోంది తను కలుగజేసుకోవటం బావుండ దనుకున్నాడు ఆడవాళ్ళ విషయంలో మగవాళ్ళు తలదూర్చినట్లు చూసినవాళ్ళు అనుకుంటారని వూరుకున్నాడు కానీ ఆమె మళ్ళీ కులం ఎత్తి మాట్లాడుతుంటే ఇక ఆగలేకపోయాడు కోడిని చంపినా, అన్ని మాటలన్నా రానికోపం కులం ఎత్తేసరికి వచ్చింది రక్తం కాగిపోయింది

'తమ కోడిని చంపిందికాక అన్ని మాటలు అంటోంది అంటే తమల్ని ఎంత చేతకాని వాళ్ళుగా భావిస్తోంది?' అనుకుంటూ, కోపాన్ని దిగమింగటానికి ప్రయత్నం చేస్తూ, అదే సమయంలో ఆమెకు తగిన సమాధానం చెప్పాలనే ధృఢ నిశ్చయంతో చిన్నగా అన్నాడు ''నిజమే నమ్మా మేం కులం తక్కువ వాళ్ళమే కాని నీలాగా గుణం తక్కువ పనులు ఏమీ చెయ్యటంలేదే నీలాగా రోజుకొకడితో ''

అంతే విశ్వనాథం పెళ్ళాం చటుక్కున లోపలికెళ్ళి తలుపు వేసుకుంది హఠాత్తుగా నిశ్శబ్దం ఆక్రమించింది అక్కడంతా కానీ ప్రకాశానికింకా కసితీరలేదు

అంతవరకూ ఆ తగాదా వింటూ, పంచలో కూర్చుని, చుట్ట కాల్చుకుంటున్న డేవిడ్ తుపుక్కున వూసి, ''మంచి మాటన్నావు ప్రకాశం దానితో మాట్లాడాల్సిన తీరు అదే కుక్కకాటుకు చెప్పుదెబ్బ'' అన్నాడు

మిగిలిన వాళ్ళంతా ప్రకాశం అలా మాట్లాడినందుకు లోపల్లోపల సంతోషించారు

అంతటితో తగాదా సద్దుమణిగి పోయింది

అన్నంతింటూ భార్యతో, ''నీలో చాలా మార్పు వస్తోందే'' అన్నాడు నవ్వుతూ

''మారుపు రాకపోతే మనల్ని బతకనిత్తారా? నీకేం తెలుసు దాని యిరగబాటు పొద్దునలేసి దూటీకి పోయి రాత్తిరి కొత్తావ్ అందరికన్నా తనేందో గొప్పదాన్ననుకుంటది అందరినీ ఈనంగా సూసిద్ది'' అంది ఏవగింపుగా భార్య

ఆ రాత్రి నిద్రపోయిందాకా అదే విషయం ఆలోచించాడు 'తనేమన్నా తొందరపడ్డాడా? ఇది ఎంత దూరం పోతుంది? దీని పర్యవసానం ఎలా గుంటుంది? ఒకవేళ యస్సై అడిగితే ఏంచెప్పాలి? గొడవ జరిగినపుడు చూచిన వాళ్ళు ఎంతవరకు నిలబడి సాక్ష్యం చెప్పగలరు ఇలాసాగాయి ఆలోచనలు

ఆమె అన్నమాటలన్నీ చెప్పాలనుకున్నాడు అతను అనుకున్నట్లుగానే మర్రోజు ఉదయం రోల్‌కాల్‌లో ప్రకాశాన్ని, సీరియస్ ఫోజు పెట్టి అడిగాడు యస్సై

''ఏం, లైన్లో ఆడవాళ్ళమీదకు ఒంటికాలిమీద తగాదాకు పోతున్నావంట? సస్పెండు చేయిస్తాను జాగ్రత్త'' అన్నాడు

ఆ మాట వినటంతోటే అరికాలిమంట నెత్తికెక్కింది ప్రకాశంకు పళ్ళుకొరికాడు యస్సై వైపు తీవ్రంగా చూశాడు ''జరిగిన విషయం రెండువైపులా ఆలకించి అప్పుడడగండిసార్'' అన్నాడు అతని సమాధానంవిని ఆశ్చర్యంగా చూశాడు యస్సై అతని గొంతులోని ధ్వని విని కొద్దిగా జంకాడు అంతలోనే తన అధికారాన్నీ, హోదానీ గుర్తుకు తెచ్చుకొని దబాయించాడు

''నోర్ముయ్ లైన్లో గొడవలుపడితే వచ్చే పనిష్మెంటు ఏమిటో తెలుసా? పైగా విశ్వనాధం భార్యని నీ నోటికొచ్చినట్లు తిట్టావంట ఆమె జోలి నీకెందుకు ముండమోపిలాగా ఆడదాని మీద తగాదాపెట్టుకోవడానికి సిగ్గులేదూ నీ ప్రతాపం ఆడవాళ్ళమీద కాదు అంతలావు మొనగాడివైతే బయట మొగాళ్ళమీద చూపించుకో అప్పుడు ఇరగదీస్తారు వెధవ వేషాలేస్తే ఒక్క కలంపోటుతో నిన్ను పుట్టినచోటుకి పంపిస్తా'' అన్నాడు

ఆ మాటతో ప్రకాశం కోపం తారాస్థాయికి చేరుకుంది తననొక వెధవలాగా, అసమర్థుడిలాగా పోల్చి మాట్లాడటం భరించలేకపోయాడు అప్పటికీ తమాయించుకొని అన్నాడు, ''తమరికి తెలిసింది అంతవరకే ఆ కాస్తకూడా అబద్ధమే మాకోడిపెట్టని రాయితోకొట్టి చంపేసిందికాక, మమ్మల్ని అంటరాని వాళ్ళనీ, తక్కువ కులం వాళ్ళనీ తిట్టి, నాభార్యని నోటికొచ్చినట్లు మాట్లాడింది ''

అతని మాటలు పూర్తికాక ముందే యస్సై తన అధికారపు అహంకారాన్ని మాటల్లో చూపించాడు ప్రకాశం అలా నోరు తెరచి మాట్లాడటం సహించలేకపోయాడు ''అయితే మగోడివి నువ్వు నోరు పారేసుకుంటావా? ఏదైనా వుంటే నాకు చెప్పాలి అంతగా నీలుగుతున్నావ్,

నువ్వు తక్కువ కులపోడివి కాక, ఉన్నత కులస్థుడివా? వున్నమాట అంటే అంత గింజు కుంటున్నావు? నీ సంగంతేందో నేను తేలుస్తా గెటవుట్ నీతో యిక మాటల్తో పనికిరాదు నువ్వు అంటరానోడివి కాదా ? అసలు మీకు ఉజ్జోగాలిచ్చే నా కొడుకుల్ని, ఆ తెల్ల నా కొడుకుల్ని అనుకోవాలి వ్వా గెటౌట్ పో బయటికి'' అన్నాడు కోపంగా యస్పై

ఆ మాటలకు ప్రకాశం బొమ్మలా నిలబడి పోయాడు అతని హృదయం అవమానంతో బ్రద్దలయి పోతున్నట్లు తోచింది రాత్రి విశ్వనాథం భార్య అన్నమాటలకు కూడా అంత బాధ కలగలేదు ఏం చెయ్యాలో తోచలేదు నిగ్రహం పూర్తిగా కోల్పోయాడు కోపంతో వూగి పోయాడు యస్పైని కూడా అంతకంటే యెక్కువ బాధకు గురిచెయ్యాలనే తలంపు క్షణంలో పుట్టి పర్వత మంతయ్యింది ఏదో స్థిర నిర్ణయాని కొచ్చినట్లు గట్టిగా శ్వాస పీల్చి, నిబ్బరంగా వుండటానికి ప్రయత్నించాడు

''తమరన్నమాట నిజమే సార్ కానీ మీలాగా ఇతరుల సొమ్ము కాజేస్తూ, గుణం తక్కువ పనులు చేస్తూ, మిగిలిన వాళ్ళతో అమ్మలక్క కోవటం లేదుకదా సార్ నీ పెళ్ళాం లాగా నాభార్య రోజుకొక పీసీతో '' స్పష్టంగా ఆ మాటలని, స్టాఫందరినీ కలియజూస్తూ బయట కొచ్చాడు నిబ్బరంగా నడుచుకుంటూ యస్పై టేబిలు దగ్గరరైటరూ, సార్జెన్, విశ్వనాథం నిలబడి వున్నారు స్టాఫంతా బొమ్మల్లా ఒక పక్కన నిలబడి వున్నారు చరచరా నడుచుకుంటూ ఇంటి కెళ్ళాడు

''ఏంది అట్లాగున్నావ్'' అంది భార్య వాకిట్లోనే

''రాత్తిరి ఇషయం ఈ కొజ్జా నాకొడుకు పోయి, ఆ పెద్ద కొజ్జా, యస్పైగాడి దగ్గర మొరపెట్టుకున్నాడు ఆడు నన్ను పిలిచి పెద్ద తప్పు చేసిన వాడిని దండించబోయినట్టు దండించ బోయాడు ఆ లంజ మనల్నన్న మాటల్లో వాడికేం తప్పు కనిపించలేదు కానీ, నే నన్న మాటలకు పొడుచు కొచ్చింది ఈడూ అదే మాటన్నాడు''

''ఏవన్నాడు?''

''ఆఁ నువ్వు కులం తక్కువోడివి కాదా ? నువ్వు అంటరాని వోడివి కాదా? వున్న మాటంటే నీకెందు కంత వులుకు'' అన్నాడు

''నువ్వేమన్నావ్?'' అంది ఆమె ఆందోళనగా

''నేనూ వున్నమాటే అన్నాను నలుగురికీ ఇయ్యకుండా అందరియ్యా ఆడే తీసు కుంటున్నాడు డబ్బులు ఆడి పెళ్ళాం దీనికన్నా ఒక ఆకు ఎక్కువే సదివింది అదే మాట అన్నా నా కొడుకు ఇరగబడి సచ్చాడు ఆ మాటకు'' అన్నాడు

వెళ్ళి మంచంమీద కూర్చున్నాడు భార్య ఇంకేమీ అడగలేదు తను ఆ మాట అన్నప్పుడు యస్పై ముఖంలో మారిన రంగులు ఇంకా స్పష్టంగా అతని కళ్ళల్లో కనపడుతూనే వున్నయ్ తను ఆ మాట అన్నప్పుడు తనవైపు పిచ్చోడిలా చూశాడు యస్పై 'ఏదైతే అదయిద్ది తన కసి తీరింది మనస్సు కుదుట పడింది' అనుకున్నాడు తృప్తిగా ప్రకాశం

లేచి యూనిఫారం విప్పి లుంగీ కట్టుకున్నాడు వాళ్ళిద్దరూ మాట్లాడుకునే మాటలన్నీ వంట గదిలో వుండి విని, కొడుకు దగ్గరకొచ్చింది తల్లి

కాళ్ళు బారచాపుకొని పడుకున్నాడు ప్రకాశం

''అయ్యా! ఇట్టాంటియన్నీ మన కెందుకురా! ఈ నౌకరీ కేదన్నా అయితే మళ్లీ మన బతుకులు ఎట్టా మారతయ్యో ఏందో!? ఇప్పుడు కాత్త కడుపునిండా బువ్వ తింటన్నాం అయినా

అంటరానోళ్లమంటే బాదెందుకు మనం అంటరానోళ్లమేగా ఈ మాట ఈల్లు కొత్తగా అనేదేముంది ఆసామి లెప్పుడూ మనల్ని అట్టాగే పిలిసేవోరుగా ఎప్పుడూ లేంది ఇప్పు డెందుకు ఆమాటెవురన్నా అంటే అంత ఇదయి పోతన్నావు?'' అంది తల్లి

''నీకు తెలియదులే, నువ్వూరుకోవే'' అని విసుకున్నాడు ''ఈ నౌకరీపోతే అడుక్కుతిని బతుకుతాం ఇట్టా అవమానాలతో బతికే బతుకుకన్నా, ముస్తైత్తుకొని బతకటం మనశ్శాంతిగా, ఆత్మకానందంగా వుంటది'' అన్నాడు తరువాత ఎవరూ ఏమీ మాట్లాడలేదు

ప్రకాశం ఆలోచించాడు తనలో వస్తున్న ఈ మార్పుకి ఆశ్చర్యం కలుగుతోంది 'తను పాలేరుగా వున్నప్పుడు తనని అంటరాని వాడుగా, నీచ కులస్థుడిగా అందరూ చూచేవారు, మాటలనేవారు కాని తనకప్పుడు అంత బాధ కలిగేది కాదు తనని పోలీసు నౌకరీలోకి తీసుకున్నప్పుడు, మెడికల్ టెస్ట్ రోజున తక్కువ కులానికి చెందిన ఒక కుర్రవాడు రైలు బండిలో మిగతా వాళ్ళతో పాటు బెంచీమీద కూర్చున్నాడని పెద్దకులపోడు అతనిని కొట్టినప్పుడు, ఆ కొట్టిన కుర్రవాడి పేరు లిస్టులో నుండి తీసివేసినప్పుడు మొదటిసారిగా తన కెంతో ఆశ్చర్యం, ధైర్యం కలిగింది తమబోటివాళ్ళ గురించి కూడా ఆలోచించే వాళ్ళు వున్నారనీ, తమనికూడా గౌరవించే వాళ్ళు వున్నారనీ తెలిసినప్పుడు ఏదో గొప్ప ఆదరణ, అండ దొరికినట్లు అనుభూతికి లోనయ్యాడు ఉద్యోగంలో చేరి చదవటం, వ్రాయటం నేర్చుకొని ప్రపంచాన్ని గురించి తెలుసుకొంటున్న కొందీ, తనమీద తనకు గౌరవం పెరిగింది అందరిలాగానే తనూ పనిపాటల్లో, చదువు సంధ్యల్లో సమానంగా వుంటున్నాడు అందరిలాగానే తనూ జీతం తీసుకొని, పెళ్ళాం పిల్లల్ని పోషించు కొంటున్నాడు తనని తక్కువ కులం వాడనే పేరుతో అవమానిస్తూ మాట్లాడటం సహించలేక పోతున్నాడిప్పుడు ఈ మార్పు తను చదువు సంధ్యలు నేర్చుకోక ముందు లేదు ప్రపంచాన్ని చూడకముందు లేదు ఉద్యోగం రాకముందు లేదు మరి నాలో మార్పు ఇలాగుంటే అమ్మేంటి ఎంతసేపూ 'నోటికాడి కూడు' అంటుంది రోషం, ఆత్మాభిమానం లేదసలు' అనుకున్నాడు

'ఏదేమైనా తాను మిగతావాళ్ళ కంటే తక్కువనే భావన ఇప్పుడు ఒప్పుకోలేడు ఇతరులు తనకంటే ధనవంతులు కావచ్చు, తెలివయిన వాళ్ళు కావచ్చు కాని సాటిమనిషి నయిన తనను తక్కువగా, నీచంగా, మాట్లాడటం, చూడటం తను భరించలేడు అలాటి అవమానాన్ని ఇంతకు పూర్వంలాగా ఇప్పుడు మౌనంగా, వినమ్రతతో స్వీకరించి తనను అవమాన పరచిన వాళ్ళను గౌరవించలేడు బైబిలులో చెప్పిన 'ఒక చెంపమీద కొడితే రెండో చెంప చూపించమనే సూక్తి ఆచరణలో విఫలమయింది అది తాను ఆచరించలేడు తనని గౌరవించే వాడినే తనూ గౌరవిస్తాడు తనని అవమానించిన వాడిని తనూ అవమానిస్తాడు' అనుకున్నాడు

'తనలో ఇంతగా భావాలు అభివృద్ధి చెందుతున్నట్లు ఈ రెండు సంఘటనలు జరిగిందాకా తను గ్రహించలేక పోయాడు ఇప్పటిదాకా తను గమనించలేక పోతున్నా తనలో చాలా మార్పు జరిగిపోతోంది అన్నమాట తనలోనే కాదు తన భార్య కూడా ఎంతో మారిపోయింది అమాయకంగా కనపడే భార్యే తన మనస్సులో ఇంతకాలం వుంది కాని ఇప్పుడు ఆమె ప్రవర్తన, మాటలు, ఆలోచనాతీరు గమనిస్తుంటే, జీవితంలో జరిగే మార్పులు ప్రతి మనిషిమీద పడతాయని అర్థమయ్యింది మరి అమ్మ విషయం? పెద్ద తనంలో ఆమెలో ఇంకేం మార్పు లొస్తాయి' అనుకున్నాడు

జరిగిన సంఘటన గురించి ఆలోచించాడు దీని పర్యవసానం ఎలా వుంటుందో వూహించటానికి ప్రయత్నించాడు ఇదే తను పాలేరుగా వుండి, తను పనిచేసే ఆసాముల్ని తను ఇలా అడిగివుంటే, తన ప్రాణాలు ఎప్పుడో గాలిలో కలిసిపోయివుండేవి కాని ఇప్పుడు పరిస్థితి వేరు ఈ యస్సైగాడు ఆ భూస్వాముల కంటే దుర్మార్గుడే అయినా తనూ ఒక గవర్నమెంటు వుద్యోగే

లేచి వెళ్ళి జరిగిన సంఘటన గురించి గోపాలంతో చర్చించాడు గోపాలం అంతా విని, ''ప్రకాశం నువ్వు చేసింది మంచి పనే ఇకమీదట వాడు మిగతావాళ్ళతో జాగ్రత్తగా మాట్లాడతాడు నువ్వు వాడికి షాక్ ట్రీట్‌మెంటు ఇచ్చావు కానీ నిన్ను వాడు దెబ్బ తియ్యటానికి తీవ్రంగా ప్రయత్నం చేస్తాడు తప్పకుండా వాడు ఆఫీసర్లని కాళ్ళూ, గడ్డాలు పట్టుకొని నిన్ను సస్పెండు చేయించటానికి ప్రయత్నిస్తాడు ఎలాగూ నువ్వు రంగంలోకి దూకావు నిండా మునిగినవాడికి చలి లేదు కాబట్టి నిన్న రాత్రి లైనులో జరిగిన విషయం, విశ్వనాథంగాడి పెళ్ళాం నిన్ను అన్న మాటలూ, యస్సై అన్న మాటలూ, కులం పేరుతో నిన్ను అవమానించిన విషయం అన్నీ ఒకదాని తరువాత ఒకటిగా రాసి యస్పీ కొక పిటీషన్ పెట్టు దీనివలన వాళ్ళకు ఏమీ పనిష్మెంటు ఇవ్వకపోయినా నీకు డిఫెన్సుగా వుంటుంది'' అన్నాడు

గోపాలం చెప్పినట్లుగానే యస్పీకి ఒక పిటీషను పెట్టాడు ప్రకాశం రెండు వారాలు గడిచాయి తన కాగితానికి ఏమీ సమాధానం రాలేదు

తను అన్న మాటలకు యస్సై అవమానంతో ఛస్తున్నట్లు గమనించాడు ప్రకాశం మిగతా స్టాపు దగ్గర కూడా అతను ఫ్రీ గా ఉండలేక పోతున్నాడు కానీ మేకపోతు గాంభీర్యాన్ని తెచ్చిపెట్టుకొంటున్నాడు రైటరు, సార్జెన్ ప్రకాశంతో అసలు మాట్లాడటమే లేదు మిగతా స్టాపు కూడా చాలామంది ప్రకాశంతో స్టేషన్లో వున్నంతసేపూ సరిగా మాట్లాడటం లేదు ప్రకాశంకు తన కాగితం అసలు యస్పీకి చేరిందోలేదో తెలియలేదు మొత్తంమీద స్టేషన్లో పరిస్థితి ఆందోళన కలిగిస్తోంది తుఫాను ముందటి స్తబ్దత చోటు చేసుకుంది

ఒకరోజు ఉదయం స్టేషనుకు వచ్చి రోల్‌కాల్‌కు హాజరయినప్పుడు రైటరు పిల్చి పాస్‌పోర్టు ఇచ్చాడు

''ఏం డ్యూటీ సార్'' అన్నాడు ప్రకాశం మామూలు ధోరణిలో రైటరు ప్రకాశంవైపు బెదురు బెదురుగా చూశాడు

''డ్యూటీకాదు నిన్ను లోకల్ పోలీసు నుండి ఏ ఆర్ (డిస్ట్రిక్ట్ ఆర్మడ్ రిజర్వ్)కు ట్రాన్స్‌ఫర్ చేసారు'' అన్నాడు

నెత్తిన పిడుగు పడ్డట్టు అదిరిపోయాడు ప్రకాశం ఆ మాట విని మిగిలిన పీసీలంతా అక్కడకు వచ్చారు రైటరు భయం భయంగా, ''ఇదిగో ఈ డూప్లికేటు మీద సంతకం చెయ్యి'' అన్నాడు అందరివైపూ చూశాడు ప్రకాశం అంతా తనవైపూ, రైటరువైపూ చూస్తున్నారు ఆ చూపులు రైటర్ని ముళ్ళులాగా గుచ్చుతున్నయ్ స్టేషన్లో యస్సై, సార్జెన్, విశ్వనాథం మినహా మిగిలినవాళ్ళంతా వున్నారు

''ఏమిటి సార్ ఇది?'' అన్నాడు రైటరు నుద్దేశించి ప్రకాశం. రైటరు సీళ్ళు నమిలాడు ప్రకాశాన్ని చూస్తుంటే అతనికి భయమేస్తోంది పాస్‌పోర్టు ఇచ్చేటప్పుడు ప్రకాశం ఆగ్రహానికి గురికావల్సి వస్తుందనే భయంతో యస్సై, సార్జెన్, విశ్వనాథం ముఖాలు చాటు చేశారు పాస్‌పోర్టు

ఇచ్చే బాధ్యత రైటరుది కాబట్టి అతనికి తప్పులేదు

''నాకేం తెలియదు ప్రకాశం నిజంగా నా పిల్లలమీద ఒట్టు'' అన్నాడు రైటరు తడబడుతూ అంతా ప్రకాశం వైపు చూస్తున్నారు సానుభూతిగా ప్రకాశంకు కోపంతో శరీరం వణుకుతోంది

''ఏవుంది ప్రకాశం అతన్నడిగేదేందింక నీకూ, యస్సైకు జరిగిన గొడవ ఈ రూపం దాల్చింది'' అన్నాడు సుబ్బారెడ్డి రైటరుకు ముఖమంతా చెమట పట్టింది ప్రకాశం కొడతాడేమో ననే భయం కూడా అతనిలో చోటు చేసుకుంది

''అంటే, నువ్వు తప్పు చేశావని నిర్ధారించి, అన్యాయంగా వాళ్ళని తిట్టావని రుజువు పరచి, చట్ట ప్రకారం న్యాయంగా నీకీ శిక్ష వేశారు'' అన్నాడు రైటరువైపు చూస్తూ వెటకారంగా గోపాలం ప్రకాశంతో అక్కడున్న వాళ్ళందరికీ ప్రకాశం మీద జాలి, యస్సైమీదా విశ్వనాధం మీద కోపం కలిగాయి.

''ఇంక అనవసరం ప్రకాశం ఈ చీడ పురుగుల ముందు నౌకరీ చేయటం కన్నా పాస్‌పోర్టు తీసుకొని పోవటం ఉత్తమం వ్యక్తిత్వంలేని వెధవల దగ్గర బ్రతకటం చాలా కష్టం కానిచ్చి పాస్‌పోర్టు తీసుకో ఇంకా ఆలోచించి లాభం లేదు విషయం స్పష్టంగా కనపడుతూనే వుందిగా న్యాయాన్నీ, చట్టాన్నీ అమలుజరపాల్సిన పోలీసు కానిస్టేబుళ్ళ విషయంలో చట్టం ఇట్టా చట్టు బండలవుతోంది న్యాయం ఇంత నిక్కచ్చిగా వెంట నిలుస్తోంది'' అన్నాడు సుబ్బారెడ్డి

''పక్కలేసే నాకొడుకుల దగ్గర పని చెయ్యటం కన్నా ఈడనుండి పోవటమే మంచిదిలే'' అన్నాడు డేవిడ్

రైటరుకు చెమటతో చొక్కా తడిచిపోయింది డూప్లికేటు మీద సంతకం చేసి పాస్‌పోర్టూ, స్మాల్‌సర్వీసు పుస్తకమూ తీసుకొని బైటకొచ్చాడు ప్రకాశం కొంతమంది అతన్ని అనుసరించారు తమలో అంతర్గతంగా అధికార్లమీద వున్న ద్వేషాన్ని మాటల్లో కక్కారు పీసీలంతా

''కానీ నా కొడుకు మొత్తంమీద బలే దెబ్బ తీశాడు'' అన్నాడు ఒకతను

''అసలిది ఎట్టా జరిగిందో నాకు రాత్రే తెలిసింది నువ్వు తిట్టినట్టు యస్సై రిపోర్టు పంపించాడు నువ్వు యస్పీకి పెట్టిన కాగితం కూడా ఎస్పీ చూశాడంట రెంటినీ ఎంక్వయిరీ చెయ్యమని సి ఐ కు పంపాడంట యస్పీ యస్సై, సి ఐ ఆఫీసుకు వెళ్ళి సార్జెన్ చేత, విశ్వనాధం చేత, రైటరు చేత స్టేట్‌మెంట్లిప్పించాడంట నువ్వు పెట్టిన పిటీషన్ ఫాల్సని తన ఎంక్వయిరీ రిపోర్టులో రాశాడంట సి ఐ దాని పర్యవసానం ఇది'' అన్నాడు రెడ్డి ప్రకాశం వింటూ వున్నాడు

''అసలూ, న్యాయం విచారించమని కాగితం పెట్టుకొన్న నన్ను పిలిచి విచారించవద్దా ఆ ఇనస్పెక్టరు?'' అన్నాడు ప్రకాశం

''మనం లెక్కలోని ఉద్యోగులమైతేగా ఇంత అన్యాయం జరిగినా అడగటానికి మనకి యూనిటీ ఏది? అది లేదు కాబట్టే వాళ్ళు మనల్ని ఇట్టా బానిసల్లాగా చూస్తున్నారు'' అన్నాడు సుబ్బారెడ్డి మిగతావాళ్ళు వింటూ వున్నారు

''ఏ ఆర్ చాలా కష్టం మనం చెయ్యలేం ఇదే భయంకరమైన ఉద్యోగం కానీ ఏ ఆర్ కన్నా వందరెట్లు నయం ఇది అయితే అందులో చేసేవాళ్ళంతా మనుషులు కాదంటారేమో మనుషులే పరిస్థితుల్ని బట్టి తప్పదనుకో కాని మరీ దారుణమైన ఉద్యోగాలు అవి'' అన్నాడు ఒక పీసీ

''ఏ ఆర్ అనే మాటలోనే వుందిగా అంతా ఆర్మడ్ రిజర్వ్ పోలీసు ప్రతి జిల్లాలోనూ యమర్జెన్సీగా వుపయోగించుకోవటానికి, లోకల్‌పోలీస్‌కు సహాయపడే నిమిత్తం ఎప్పుడూ జిల్లా

హెడ్ క్వార్టరులో రెడీగా వుంటుంది లా అండ్ ఆర్డర్‌ని కంట్రోలు చెయ్యటం వీలుకాని పరిస్థితుల్లో లోకల్ పోలీసుకు సహాయంగా జిల్లాలోని అన్ని చోట్లకు ఆ ఫోర్సును పంపిస్తూ వుంటారు తుపాకులు ఎప్పుడూ వాళ్ళ శరీరాల్లో ఒక భాగంగా వుంటుంటాయి నెలల తరబడి వాళ్ళు పెళ్ళాం బిడ్డల్ని వదిలి హెడ్‌క్వార్టర్సు వదిలిపెట్టి వుండాలి మనం చూస్తున్నాంగా మొన్న మన స్టేషను లిమిట్స్‌లో వున్న రెడ్డిపాలెంలో రైటింగ్ జరిగితే, వచ్చి నాలుగు నెలలపాటు వుండలా వాళ్ళు కంటిన్యూగా'' అన్నాడు ఒకతను

ఈ మాటలన్నీ వింటుంటేగుండె జారిపోయింది ప్రకాశానికి జరిగిపోయిన సంఘటనలన్నీ ఒకసారి నెమరు వేసుకున్నాడు తను చేసిన తప్పు ఎంతవరకో, తనకొచ్చిన పనిష్మెంటు ఎంతుందో అంచనా వేసుకోవటానికి ప్రయత్నించాడు తన తప్పు ఏమీ కనపడలేదు 'వాళ్ళు మాటల్తో తనని అవమానపరిచారు తనూ అలాగే ప్రవర్తించాడు ముందు వాళ్ళే అన్నారు తరువాతే తను అన్నాడు కానీ శిక్ష తను అనుభవించాల్సొచ్చింది వాళ్ళు నిక్షేపంగా వున్నారు ఇదెక్కడిన్యాయం ?' ట్రాన్స్‌ఫర్ పాస్‌పోర్టు కాగితాన్ని జేబులోంచి బైటకు తీశాడు

'ట్రాన్స్‌ఫర్ సర్వీసులో మొదటిసారి ట్రాన్స్‌ఫర్ అన్యాయంగా ట్రాన్స్‌ఫర్ చట్ట విరుద్ధమయిన ట్రాన్స్‌ఫర్ అర్ధాంతరపు ట్రాన్స్‌ఫర్ ఇలాటి ట్రాన్స్‌ఫర్ ఎంత బాధాకరమైనదో, ఎంతటి తీవ్రమయిన పనిష్మెంటో మొదటిసారిగా అర్థమయింది హైగా లోకల్‌లో నుండి రిజర్‌లోకి పీసీ అనేవాడు ఎంతటి అర్భకుడో అర్థమయింది ఈ అన్యాయాన్ని ఎలా అడ్డుకోవాలి? ఎవరు ఆపుతారు' అనాలోచితంగానే పైకి అనేశాడు ఆ మాటలన్నీ ఉద్రేకంతో

''ఈ అన్నాయాన్ని ఎదుర్కోలేమా మనం?'' అన్నాడు బాధగా మళ్ళీ

''అది అయ్యే పనికాదు ప్రకాశం కొండని తలతో ఢీకొని పిండి చెయ్యలేం అది ఎంత వాస్తవమో ఇదీ అంతే మనకెవరూ సపోర్టు చెయ్యరు కనీసం మనకేడర్ కూడా మనకి సపోర్టు ఇవ్వరు మనమంతా ఒక సంఘంగా ఏర్పడి మన సమస్యలను ఉమ్మడిగా ఎదుర్కోవాలనే జ్ఞానం కూడా లేదు మిగతా డిపార్టుమెంటుల్ని చూసి కూడా నేర్చుకోరు కానీ ఆఫీసరు మాట ఆఫీసరు వింటాడు మన మంచి చెడ్డలు విచారించే ఆఫీసర్లు ఎక్కడో నూటికి కోటికి ఒక్కళ్ళుంటారు'' అన్నాడు సుబ్బారెడ్డి

''ఇట్టాంటియ్యి ఎన్ని చూశాం తల బొప్పికట్టిందనుకో ముక్కుకు సూటిగా పోతే ముక్కు బద్ద లవ్వటం జరుగుతోంది కడుపు కోసం తలొంచక తప్పటం లేదు ఏం చేస్తాం మన బతుకులింతే దేవుడు మన మొకాన ఎట్టా రాస్తే అట్టా జరిగిద్ది'' అన్నాడు ఒకతను

కొద్దిసేపటికి అంతా వెళ్ళిపోయారు మధ్యాహ్నం నరశింహం వచ్చాడు ఇంటికి జరిగిన అన్యాయానికి అతనెంతో బాధపడ్డాడు

''రావటం పడలేదురా అల్లుడూ'' అన్నాడు బాధగా

ప్రకాశం నవ్వి వూరుకున్నాడు

''అరే ప్రకాశం! నీకు తెలవదు ఉడుకు నెత్తురులో వున్నావు ఈ ప్రపంచం తీరే అంత బలమున్నోడిదే రాజ్యం నువ్వు ఏదైనా చూడు ఇదే న్యాయం బలం లేనోడు అడుగంటి పోవాల్సిందే ఈ నా కొడుకులు మరి ఎట్టాంటి చావు చస్తారోగానీ '' అన్నాడు కోపంగా

ప్రకాశం ఇప్పుడు కూడా ఏమీ మాట్లాడలేదు

''ఆ రోజున, నువ్వు యస్సైగాడిని తిట్టిన రోజున, వాడు ఇంటికొచ్చి పెళ్ళాన్ని కొట్టాడు

చూడూ, నా సామిరంగా, గొడ్డుని బాదినట్టు బాదాడు ఫేము లాటీ చిట్లిపోయిందనుకో అమ్మో, అమ్మో, ఆ లంజమాత్రం, ఆ దెబ్బలకు అది కాబట్టి తట్టుకుంది గానిరా, మన బోటోళ్ళమైతే, ఆ దెబ్బలకి వాయిగమ్మి సచ్చేవాళ్ళ మనుకో నీ దెబ్బ చెపితే దాని తోలు వొలిపించావు గదరా'' అన్నాడు నవ్వుతూ

ఆ మాటకు ప్రకాశం కూడా నవ్వాడు నరశింహం మళ్ళీ చెప్పటం ప్రారంభించాడు

''అది ఆ రోజంతా అలిగి కూర్చుంది మరుసటి రోజు పెట్టే బేడా సర్దుకుని ప్రయాణ మయ్యింది ఇక ఈడి అవస్త చూడు కాళ్ళు పట్టుకొని బతిమాలాడు ఆడు దాన్ని ఎన్ని దెబ్బలు కొట్టాడో, ఇది ఆడిని అన్నిసార్లు కాళ్ళతో తన్నింది, జుట్టు పీకింది, తిట్టింది అబ్బా, అది ఆడది కాదురా బాబు ఆడు కుక్కలా పడున్నాడు తంతుంటే ఇయ్యన్నీ చూడలేక నేను చిన్నగా జారుకున్నా ఆడు అప్పుడు నన్ను చూశాడంటే నా తాట వలిచాడే పెళ్ళాన్నొదిలి పెట్టి వాడు నాప్రాణం తీస్తాడు'' అన్నాడు ప్రకాశం నవ్వి వూరుకున్నాడు కొద్దిసేపు పిచ్చాపాటి మాట్లాడుకున్నాక, ''మళ్ళీ కలుస్తాలే'' అని లేచి వెళ్ళాడు నరశింహం

ఏమీ తోచక గోపాలం దగ్గరకు వెళ్ళటానికి లేచి తెల్ల చొక్కా తొడుకున్నాడు ప్రకాశం ఇంటినిండా నిశ్శబ్దం తాండవిస్తోంది కొడుకు వచ్చీ రాని మాటలతో, గడప పట్టుకొని నిలబడి, వాళ్ళమ్మకేవో కబుర్లు చెపుతున్నాడు వెళ్ళి వాడి నొకసారి ముద్దు పెట్టుకొని దింపాడు గోపాలం దగ్గరకెళ్ళాడు గోపాలం ఇంటిదగ్గరే వున్నాడు ప్రకాశాన్ని చూచి కుర్చీ చూపించాడు

''మళ్ళీ యస్పీకి కాగితం పెట్టాలనుకుంటున్నా'' అన్నాడు ప్రకాశం ఆమాట విని గోపాలం ఆలోచించాడు ఒక నిముషం పాటు

''కాగితం పెట్టొచ్చు నిన్నిట్లా ట్రాన్స్‌ఫర్ చేయడానికి గల కారణం అడగొచ్చు ఇంతకు ముందు పెట్టిన పిటీషను గురించి అడగొచ్చు నష్టమేముంది కాని ఇట్లా కాగితాలు పెడుతూ వుంటే ఆఫీసర్ల దృష్టిలో మనం ప్రమాదకర వ్యక్తులుగా ముద్రపడతాము మన మేమో మనకు జరుగుతున్న అన్యాయాలను, గత్యంతరంలేక కాగితాల ద్వారా దొరలకు విన్న వించుకుంటాం వీళ్ళేమో ఇట్లా కాగితాలు పెట్టే వాళ్ళని ప్రమాదకర వ్యక్తులుగా చూస్తారు'' అన్నాడు తిరిగి గోపాలమే అన్నాడు ''నువ్వు చేసిన పని చాలా గొప్ప పని ప్రకాశం'' అని

'ఏంపని ?' అన్నట్లు చూశాడు ప్రకాశం

''అదే, యస్సైగాడితో అట్లా మాట్లాడటం వాడి సర్వీసులో ఎప్పుడూ వాడు అట్లాంటి షాక్ తిని వుండడు భవిష్యత్తులో ఇంకెప్పుడూ అట్లా తేలిగ్గా ఎవరి గురించీ మాట్లాడడు దీని విషయం తీసుకో అది మాత్రం ఇంక నోరు పారేసుకుంటదా? ఇప్పుడు నువ్వంటే అట్లాంటోళ్ళందరికీ కొంచెం భయమే'' అన్నాడు విశ్వనాధం భార్యని ఉద్దేశించి

''ఏం భయమో ఏమో ఇప్పుడు కష్టాలొచ్చింది ఎవడికి? నాకే కదా!'' అన్నాడు ప్రకాశం

''కష్టాలు లేంది ఎప్పుడు మనకు కాని నీలాంటి వాళ్ళు స్టేషనుకు ఒక్కళ్ళుంటే చాలు కింది కేడర్‌కు ఎంతో బలం'' అన్నాడు నవ్వుతూ

ఆ మాట నిజమో, పొగడ్తో అర్థం కాలేదు ప్రకాశంకు కాని ఆ మాటలు ఆనందం కలిగించాయి బాధలోనుండి కొంతవూరట చెందింది అతని హృదయం తరువాత వాళ్ళు చాలాసేపు మాట్లాడుకున్నారు లేచి ఇంటికెళ్ళబోతుంటే గోపాలం అన్నాడు

''ఇంత జరిగినా నువ్విలా వుండగలిగావంటే వాస్తవంగా చాలా ధైర్యవంతుడివనే చెప్పాలి

అదే ఇంకొకళ్ళు అయితే జరిగినదానికి బెంబేలెత్తిపోయేవాళ్ళు జావకారిపోయేవాళ్ళు ఇదేం తక్కువ పనిష్మెంటుకాదు కాని నువ్వు తట్టుకున్నావు మళ్ళీ యిప్పుడు కాగితాలద్వారా పోరాటానికి సిద్ధమవుతున్నావు నీభవిష్యత్తు ఎలా వుంటుందో ఏమో కాని, నువ్వు చాలా ధైర్యవంతుడివి'' అన్నాడు

ఆమాటలువిని కొద్దిసేపు మౌనంగావున్నాడు ప్రకాశం ఆనందంగా నిట్టూర్చాడు తను చేసిన పనిని గురించి హర్షిస్తూ గోపాలం మాట్లాడటం ఆనందం కలిగిస్తోంది తనకామాత్రం మాట సహాయం, నైతిక బలం అందించే వాడుండటమే కొండంత అండగా వుంది

''అయ్యా! బాబూ! అంటే మనల్ని పశువులకన్నా హీనంగా చూస్తున్నారు దెబ్బకుదెబ్బ అంటే ఈ రకంగా బాధపెడుతున్నారు ఎట్లా చావాలో అర్థం కావటంలేదు'' అన్నాడు ప్రకాశం

''పరిస్థితుల్ని బట్టి పద్ధతి మార్చుకోవటం ఒకవిధానం''

''అది అయ్యేపనికాదు క్షణానికి ఓ పద్ధతి ఎవుడికీ చేతకాదు అటు ఒదిగిపోయి బతకటమో, ఇటు ఎదురు తిరిగి నిలవటమో తప్ప ఇంకో మార్గమేంలేదు'' అన్నాడు ప్రకాశం అతని స్వరంలో ఉద్రేకం ధ్వనించింది

''సరే నువ్వెట్లా జీవించాలను కుంటున్నావు?''

''ఎట్లా ఏముంది ఇంతకుముందు ప్రపంచజ్ఞానం తెలియనప్పుడు, నిజం చెప్పాలంటే పశువులాగానే బ్రతికాను అంటే ఇప్పుడేదో మహా జ్ఞానినయి పోయాననికాదు కాని ఇప్పుడట్లా బటకటానికి మనస్సు ఒప్పటంలేదు మనస్సు చంపుకొని బతకటమేమో చాతవటంలేదు పుట్టిన పెతోడూ చావాల్సిందే బతికే నాలుగురోజులూ తోటోళ్ణిగౌరవిస్తూ, వాడిచేత గౌరవింపబడాలని నా కోరిక ఎవడన్నా నన్నవమానిస్తే నేను సహించను నే నెవడ్నీ అనవసరంగా అనను వాడూచచ్చేవాడే, నేను చచ్చేవాడినే ఈ మూడురోజుల ముచ్చటికి బానిస బతుకొద్దూ, యజమాని బతుకొద్దు అందరూ సమానంగా బతికితే అంతేచాలు'' అన్నాడు ప్రకాశం

ఆ మాటలు జాగ్రత్తగా ఆలకించాడు గోపాలం చిన్నగా నవ్వి అన్నాడు ''ప్రకాశం నీ ఆదర్శం గొప్పదే దీన్ని ఆదర్శం అంటారు ఆ మాటలు నువ్వంత తేలికగా అన్నావుగానీ, నువ్వనుకున్నంత తేలికగా ఎవరూ నిన్నూ నీ సమానత్వ సిద్ధాంతాన్నీ ఒప్పుకోరు ఈ నిజం నీకు తెలియందికాదూ, కొత్తదీ కాదు మన ఆలోచనకూ, వాస్తవానికీ చాలా దూరం వుంది ఇప్పుడు నీ జీవితం నీకు అదే చెపుతోందికదా! పరిస్థితులు మన ఆదర్శాన్ని హారతి కర్పూరంలా కరిగించేస్తాయి'' అన్నాడు గోపాలం

ప్రకాశం కూడా ఆ మాటల్ని జాగ్రత్తగా ఆలకించాడు

''చేతనయినంతవరకు చూస్తా'' అన్నాడు ప్రకాశం

తరువాత వాళ్ళు చాలాసేపు మాట్లాడుకున్నారు ''అంటే దీన్ని బట్టి నిన్ను ఒక చెంపమీదకొడితే, రెండో చెంప చూపించే సిద్ధాంతం కాదన్నమాట నీది'' అని నవ్వాడు గోపాలం ఆ మాటకు ప్రకాశంకూడా నవ్వాడు

''ఆ సిద్ధాంతం కాదు వాడు నా చెంపమీద కొడితే నేను వాడి నడ్డిమీద తంతా'' అన్నాడు

''అయితే నీకు పరలోకంలో ప్రవేశం లేదు'' అన్నాడు నవ్వుతూనే గోపాలం, ఆమాటకు ప్రకాశం ఏమంటాడో అని ఆసక్తితో చూస్తూ

''అక్కరలేదు ఈ లోకంలో తన్నులు తింటూ, అవమానాలు భరిస్తూ- ఆ పరలోకంలో

ఏదో దొరికిద్దనుకోవటం నన్ను నేను మోసం చేసుకోవటమే బైబిలులోని ఇట్లాంటి సూక్తులన్నీ నాబోటి వాళ్లని మోసం చెయ్యడానికే వున్నయ్ ఇప్పుడిప్పుడే నాకు ఇట్వాంటి సూక్తులలోని వాస్తవాలు తెలుస్తున్నయ్'' అన్నాడు ప్రకాశం ఉద్రేకంగా ఆమాటలు విని గోపాలం తనలో తను నవ్వుకున్నాడు ఇంకా ఉద్రేకపరచాలన్నట్టు చిన్నగా అన్నాడు

'అబ్బా అయితే నువ్వు, చాలా విషయాల్లో గొప్ప అనుభవజ్ఞానం సంపాదించావన్నమాట'' అన్నాడు ఆశ్చర్యపోతున్నట్టు నటిస్తూ

ఆ మాటకు ప్రకాశం కూడా నవ్వాడు కాని ఏం మాట్లాడలేదు కొద్దిసేపు మౌనంగా వున్నాక, ''సరే నే పోయి, కాస్సేపు పడుకుంటా ఈ నాలుగు రోజులన్నా కాస్త వేళకు తిని, కరువుతీరా నిద్రపోతా మన డిపార్టుమెంటులో ఇవే మనకు సెలవు రోజులు'' అన్నాడు నవ్వుతూ ఆ మాటకు గోపాలం కూడా నవ్వాడు తరువాత ప్రకాశం ఇంటికెళ్ళాడు ఆ సంభాషణ అతని మనస్సుని తేలికపరిచింది తనకు అన్యాయం జరిగిందనీ, ఈ విధంగా పనిష్మెంటు తీసుకోవటంలో తన తప్పు ఏమీలేదనీ తనని తాను ఓదార్చుకున్నాడు 'సరేకానీ చూద్దాం ఏం జరిగిద్దో' అనుకున్నాడు

ఇంట్లో తల్లీ, భార్యా దిగాలుగా కూర్చుని వున్నారు చెరోపక్క పిల్లవాడు నిద్రపోతున్నాడు మంచం వాల్చుకుని దుప్పటి పరచుకొని పడుకున్నాడు ప్రకాశం కొద్దిసేపటికి నిద్రలోకి జారిపోయాడు గాఢ నిద్ర పట్టింది బాగా పొద్దువాలిన తరువాత లేచాడు రెండు క్షణాల్లో విషయం గుర్తొచ్చింది 'నిద్రపోయే టప్పుడు మినహా మిగతా అప్పుడు ఈ ఆలోచనలు వదలటం లేదు' అనుకున్నాడు

లేచి దొడ్లోకెళ్ళి చన్నీళ్ళతో ముఖం కడుక్కున్నాడు తల్లి అన్నం వండుతోంది భార్య వాకిట్లో కూర్చొని పిల్లవాడికి ఏదో పెడుతోంది వాళ్ళ ముఖాలవైపు చూశాడు విచారంగా వున్నయ్ కండవాతో ముఖం తుడుచుకుంటూ చిన్నగా అన్నాడు ''యెందుకమ్మా అట్లా దిగులుగా వుంటారు? బతుకంతా దిగుళ్ళతో, ఏడుపులతో గడపటమేనా? కాస్త వుషారుగా వుండండే మనం ఏడుస్తున్నా, విచారంగా వున్నా మనల్ని ఓదార్చేవాళ్ళూ, మనగురించి ఆలోచించే వాళ్ళూ ఎవరూ లేరు మనల్ని మనమే ఓదార్చుకోవాలి మనకు మనమే ధైర్యం చెప్పుకోవాలి మనకి జరిగింది అన్యాయమే బాధపడే విషయమే కాని బాధపడి ప్రయోజనం ఏముంది?'' అన్నాడు

ఆ మాట విని తల్లి తల తిప్పి చూచింది అన్నం డేగిశా పొయ్యి గడ్డమీద ఆనించి సట్టిలోకి గంజి వారుస్తూ చిరుకోపంగా అంది ''బాదపడక సేసేదేవుంది నోటికాడి ముద్ద పోయినాక అనుకుని లాబమేంది ?''

''నోటికాడి ముద్ద ఎందుకు పోయిద్ది, నీదంతా పిచ్చిగాని'' అన్నాడు విసుక్కుంటూ

''ఎందుకు పోయేదేందిరా ఇప్పుడిది ఎందుకు జరిగినట్టు ? నువ్వు ఏం తప్పు సేశావని? అది గూడా అంతే అల్లు పెద్దోల్లు ఏమైనా సేత్తారు ఇప్పుడు మనల్ని ఆదుకునే దెవురు ? రేపూ అంతే ఇంతకు మునుపు మనూళ్ళో ఏం తిన్నామో, ఏం తాగామో ఇప్పుడు కూసింత సుకానికి ఈ పేనాలు అలవాడు పడ్డాక, మళ్లీ పాతబతుకెంక తలెత్తి సూడలేము పూలమ్ముకున్న సోట కట్టెలమ్ముతామా? నీ కడుపున ఒక్కాయ కాసింది ఆ సంటోడి బగిసత్తు కూడా ఆలోసించు నాదేం వుంది ఇయ్యాల్లో రేపో రాలిపోతా నువ్వూ, నీ పెల్లాం పిల్లలు పది కాలాల పాటు బతకాలి ఆలోసించుకో ఎందుకొచ్చిందో ఈ నౌకరీ వచ్చింది దాన్ని నిలబెట్టుకోవటం గొప్పతనం ఇకముందైనా కాత్త తొందరపాటు తగ్గించుకో'' అంది

ఆమె మాటలు అతనికి బాగాకోపం తెప్పించాయి చిరాకేసింది ''ఏంటే నువ్వు మాట్లాడేది నువ్వు మాట్లాడేదానికి ఏమన్నా అర్థం పర్థం వుందా ఇందులో మన తప్పేంది మన కోడిని చంపారు మనల్ని కులం తక్కువోళ్ళన్నారు నువ్వు మాట్లాడేదానికి అర్థమేమన్నావుందా? అంటే ఆళ్ళు ఏమంటున్నా నోరు మూసుకోమనేగా నీ అర్థం అంత రోసంలేని బతుకు బతికేకన్నా సావటంమేలు ఎప్పుడికైనా చచ్చేవాళ్ళమే'' అన్నాడు

''మరేం సేత్తావయ్యా! రోసానికిపోయి మనం గెలవలేం ఆళ్ళ పాపానికి ఆల్లే నరకానికి పోతారు పడ్డోడెప్పుడూ సెడ్డోడుగాదు అందరూ ఇప్పుడు ఆళ్ళనే వూత్తన్నారుగా అదిసాలదూ అయినా పేదోడికోపం ఆడికేసేటు నీకు తెలవదా? అయినా నీ కీ నౌకరీలోకొచ్చాక సిన్నదానికీ, సితకదానికీ కోపమొత్తాంది బాగా'' అంది

ఆ మాటలు అతనికి విసుగుపుట్టించాయి లోపలికెళ్ళి చొక్కా తొడుక్కుని బైటకొచ్చాడు విసుగ్గా తల్లి అన్నమాటలు పదేపదే గుర్తొచ్చాయి 'ఆమె మాటలుకూడా నిజమే కానీ ఇంత కష్టపడుతోంది ఈ జానెడు పొట్టకోసమే అయినా ఈవిధమైన అవమానాలు ' అతని మనస్సు అంగీకరించలేదు ఇంక ఆ ఆలోచనలకు స్వస్తి చెపుతున్నట్టు తలవిదిలించాడు గట్టిగా దీర్ఘంగా శ్వాసతీశాడు పక్కనున్న కాఫీ పాకలోకి వెళ్ళాడు స్ట్రాంగుకాఫీ వేడివేడిగా పట్రమ్మన్నాడు కాఫీతాగి బైటకొచ్చి నిలబడ్డాడు ఎక్కడికెళ్ళాలో తోచలేదు తెలిసినవాళ్ళు పలకరించారు ఊరిబయట చెరువుదగ్గరకు నడిచాడు దూరంగా చెరువు గట్టుమీదున్న చెట్టుకింద కొద్దిసేపు కూర్చున్నాడు చెరువుకు నీళ్ళకొచ్చే ఆడ మగా అంతా అతనివైపు చూస్తూ పోతున్నారు వాళ్ళనిచూస్తే నవ్వొచ్చింది గట్టుమీదుగా నడుస్తూ అవతలివైపుకు వెళ్ళాడు సూర్యుడు పశ్చిమాన వాలిపోతున్నాడు పచ్చని పొలాలన్నీ సాయంసంధ్యాపు నీరెండలో మెరుస్తూ రమణీయంగా కనిపిస్తున్నయ్ దూరంగా, డొంకలో పశువుల్ని ఇళ్ళకు తోలుకొచ్చే పాలేర్ల కేకలు అస్పష్టంగా వినపడుతున్నయ్ పశువులు నడుస్తున్నంత మేర దుమ్మలేచి తెలిమేఘం లాగా కనపడుతోంది ఆగి ఆగి వీస్తున్న గాలి శరీరాన్ని మృదువుగా తాకుతోంది గట్టిగా గాలిపీల్చుకున్నాడు అతని హృదయం తేలిక పడ్డట్టు అనిపిస్తోంది అక్కడే గట్టుమీద కూర్చున్నాడు ఆలోచనలు అతన్ని తిరిగి చుట్టుముట్టాయి చిన్న చిన్న మట్టిపెళ్ళల్ని చెరువులోకి విసిరాడు అలలు కొంతదూరం సాగి మాయమవుతున్నాయి చెరువులో అక్కడక్కడా నీళ్ళపైకి ఎగురుతున్న చేపపిల్లలు సూర్యకాంతిలో తళుక్కున మెరుస్తున్నయ్ 'తన పాత బ్రతుకులో ఇట్లా ప్రకృతిని గురించి గానీ, జీవితాన్ని గురించికానీ, ప్రపంచాన్ని గురించి కాని ఆలోచనలు లేవు ఈ పోలీసు నౌకరీ కూడా తనకా జ్ఞానం నేర్పలేదు తను చదివిన పుస్తకా లెంత గొప్పవో తన కిప్పుడు అర్థమౌతోంది ఇట్లాంటి చోట కూర్చుని ఒక మంచి పుస్తకం చదువుకుంటే ఎంత బాగుంటుందో' అనుకున్నాడు అలా చాలాసేపు కూర్చున్నాడు అతని ఆలోచనలు గురవయ్య మీదకు మళ్ళాయి వెలుగు క్రమేణా క్షీణిస్తోంది చీకటి రెక్కలు విప్పుకుంటోంది

'జిల్లా హెడ్‌క్వార్టరు కాబట్టి తప్పకుండా మంచి లైబ్రరీ వుంటుంది చాలా పుస్తకాలు వుంటయ్ కావాల్సిన పుస్తకం తీసుకోవచ్చు' గోపాలం అన్నమాటలు గుర్తొచ్చాయి

ఇల్లు చేరేసరికి బాగా చీకటి పడింది స్నానంచేసి, భోజనం చేసి పడుకున్నాడు నిద్ర రాలేదు లేచి చెక్కపెట్టె తెరిచి, పుస్తకం ఒకటి తీసుకొని హరికెన్ లాంతరు ముందు కూర్చుని నిద్ర వచ్చేంత వరకూ చదువుతూ వుండిపోయాడు బాగా పొద్దు పోయిం తరువాత లైటు వత్తి తగ్గించి

పడుకున్నాడు చిన్నగా నిద్రలోకి జారిపోయాడు

ఒక పూట జిల్లా పోలీసు ఆఫీసుకు వెళ్ళాడు అక్కడ కొంతమంది రిజర్వు కానిస్టేబుళ్ళతో విషయం చెప్పి, ''నేను ఇక్కడ ఇల్లు చూసుకోవాలా? లేకపోతే క్వార్టర్లు వున్నయ్యా ?'' అని అడిగాడు

''ఇక్కడ రిజరోళ్ళందరికీ లైన్లు వున్నయ్ వెంటనే నీకు లైను ఇస్తారు'' అన్నారు వాళ్ళు సాయంత్రానికి ఇంటికి తిరిగొచ్చాడు వున్న జాయినింగ్ టైం అంతా వుపయోగించుకున్నాడు

మిత్రులందరికీ జరిగిన సంఘటన గురించి ఉత్తరాలు రాశాడు ప్రకాశం గురవయ్య రిప్లై రాశాడు ఉత్తరంలో ఒకే ఒక్క వాక్యం రాశాడు 'జరిగిన సంఘటనలో నీ తప్పు వీసమెత్తు కూడా లేదు' అన్నదే ఆ వాక్యం అది చదివి ఎంతో ఆనందపడ్డాడు ప్రకాశం

డ్యూటీకి రిపోర్టు చేసి ఒకరోజు సెలవుపెట్టి వచ్చి కుటుంబాన్ని తీసుకెళ్ళాలనుకున్నాడు కాని ఒక్కరోజు సెలవు దొరకటమే గగనమైపోయింది ఎంతో కష్టం మీద మూడు వారాల తరువాత ఒక్కరోజు సెలవు ఇచ్చారు ఆ మూడువారాలలో పూటకూళ్ల ఇంటిలో కేవలం భోజనానికే జీతం డబ్బులు ఇంచుమించుగా అయిపోయాయి పాతచోట ఇవ్వాల్సిన బాకీలు చాలావరకు సర్దేశాడు మిగిలినవాళ్ళకు తరువాత తాను పంపిస్తానని చెప్పి ఒప్పించాడు సామాను సర్దుకుని భార్యా పిల్లలతో బయలుదేరేటప్పుడు లైన్లలోని ఆడా మగా అంతా వచ్చారు తమనుంచి దూరమౌతున్న కుటుంబ సభ్యులలాగా వాళ్ళు బాధపడ్డారు గోపాలం, అతని భార్యా పిల్లలు వచ్చి బస్సు కదిలిందాకా వున్నారు డేవిడ్, సుబ్బారెడ్డి కూడా వచ్చారు విశ్వనాథం భార్యా పిల్లలు మాత్రం బయటకు కూడా రాలేదు తలుపు వేసుకొని బస్సు కదిలి వెళుతుంటే ప్రకాశానికి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి హృదయమంతా బాధతో నిండిపోయింది వూరు కనుమరుగయ్యేంత వరకూ చూస్తూ వుండి పోయాడు పవిట చెంగుతో కళ్లు వత్తుకుంటోంది అతని భార్య ఏమిటో ఈ జీవితం ?! పరిచయస్తుల నుండీ, స్నేహితుల నుండీ, పరిచయమైన వాతావరణం నుండి దూరంగా మళ్ళీ కొత్త మనుషులలోకి, కొత్త ప్రదేశంలోకి వెళుతున్నారు

రెండు బస్సులు మారి, వాళ్ళు జిల్లా ముఖ్యపట్టణం చేరుకున్నారు బస్సుల్నీ, సైకిళ్ళని, రిక్షాల్నీ, పెద్ద పెద్ద భవనాల్నీ, విశాలమైన రోడ్లని చూస్తూ ఈలోకంలోకి వచ్చారు బస్సు దిగి సామానంతా ఒక లాగుడు బండిమీద వేసుకొని రిజర్వు లైనులోకి వచ్చారు తాము ఇంతకుముందు వున్న లైనుకన్నా పెద్ద పెద్ద లైన్లు చాలా వున్నయ్ కాని ఇళ్ళ సైజు మాత్రం మామూలే ఇరుకు ఇళ్ళు ఆ వూళ్ళో కన్నా ఇక్కడి మనుషుల వేషభాషల్లో పట్టణ వాతావరణం కొట్టొచ్చినట్టు కనపడుతోంది సామాను సర్దుకుని ఉదయం వండి తెచ్చుకున్న అన్నం తిన్నారు అందరిలోనూ బాధ గూడుకట్టుకొని వుంది మర్రోజు ఉదయం యూనిఫారం వేసుకొని వెళ్ళి డ్యూటీకి రిపోర్టు చేశాడు

రోజులు గడిచేకొందీ ఆ వుద్యోగాన్ని చూచి బెదిరిపోయాడు ప్రకాశం పెనంలోంచి జారి పొయ్యిలో పడ్డట్టయ్యింది అతని పరిస్థితి ఇంతకు ముందు లోకల్‌పోలీసుగా వున్నప్పటి జీవితానికీ, ఈ ఉద్యోగానికి బేరీజు వేసుకున్నాడు దానిలో వున్నప్పుడు నెలకు మూడు నాలుగు రాత్రుళ్ళన్నా ఇంట్లో పడుకోవటానికి వీలయ్యేది ఇక్కడ నాలుగయిదు నెలల కొకరాత్రి కూడా ఇంటిదగ్గర పడుకొనే ప్రాప్తంలేదు జిల్లా హెడ్‌క్వార్టరులో వుంటున్నాడనే పేరేగాని ఉద్యోగమంతా జిల్లాలోని మిగతా వూళ్ళల్లోనే. యూనిఫారం విషయంలో ఏమీ మార్పులేదు కాకపోతే ఎర్రబుట్ట బదులు

ఖాకీ మడత టోపీ ఇచ్చారు ఎండలో వున్నప్పుడు ఆ టోపీకి వున్న చుట్టు అంచువల్ల కొంత సుఖంగా వుండేది అదికూడా తల కుడిపక్కనే ఎడం పక్క అంచు పైకి మడిచి వుంటుంది

దుర్భరమైన జీవితాన్ని సాగిస్తున్నట్టూ, ఇంక అందులో అనుమానమేమీ లేనట్టు తెలుసుకున్నాడు ప్రకాశం రోజుకొకసారైనా తననీ పరిస్థితికి తెచ్చిన యస్పైని కసిగా తిట్టుకునేవాడు 'ఇంతకన్నా నన్ను సర్వీసులో నుండి డిస్మిస్ చేసినా బాగుండేది ఏ కూలీనాలో చేసుకుని పెళ్ళాం, పిల్లల్తో రోజులు వెళ్ళదీసేవాడిని ఇప్పుడు దీన్ని విడిచి నా అంతట నేను వెళ్ళలేనూ, అనుక్షణం బాధపడుతూ దీనిలో వుండలేకాపోతున్నాను' అనుకునేవాడు

లోకల్ పీసీలకీ, రిజర్వ్ పీసీలకీ మనస్తత్వాల్లో ఏమీ తేడా కనిపించలేదు అతనికి కొంతమంది మంచివాళ్ళు కొంతమంది చెడ్డవాళ్ళు కొంతమంది ఆఫీసర్ల దగ్గర చేరి చాడీలు చెప్పేవాళ్ళు ఇలా రకరకాల తత్వాల మనుషులు అక్కడున్నారు మూడొందల పైచిలుకు పీసీలు అక్కడున్నా ఎవ్వరూ కంటికి కనపడరు అందరూ బందోబస్తుల్లో చెల్లాచెదురైపోయే వాళ్ళే జిల్లా పోలీసు ఆఫీసుకు గార్డు చేసేవాళ్ళూ, జిల్లా ట్రెజరీ ఆఫీసు దగ్గర గార్డు డ్యూటీ చేసేవాళ్ళూ, ఆఫీసర్ల ఇళ్ళల్లో పనిచేసే ఆర్డర్లీలు తప్ప మిగిలినవాళ్ళంతా జిల్లాలో ఎవరెవరు ఎక్కడ వున్నారో తెలియదు ఎవరికీ పూర్తిగా గానుగెద్దు జీవితాలుగా వుంటయ్ అవి ఆ డ్యూటీల్లో వేరే విషయాన్ని గురించి ఆలోచించే వ్యవధి కూడా ఉండదు వాళ్ళ ఉద్యోగాల్ని బట్టే వాళ్ళ సంభాషణలు కూడా ఎపుడూ ఒకేరకంగా రోకటి పాటలాగా వుంటయ్ ఏ ఇద్దరు పీసీలు ఎదురయినా వాళ్ళ సంభాషణలూ, వాళ్ళు మాట్లాడుకునే విషయాలు ఒకేరకంగా, వాళ్ళ ఉద్యోగాలకు సంబంధించిన విషయాలతో నిండిపోయి వుంటయ్

'ఏరా డ్రిల్లు వుందా రేపు? '

'బూట్ పాలీష్ సరిగా లేదు దొంగ నా కొడుకు రిమార్క్ చేస్తాడేమో '

'గడ్డం బాగా మాసినట్టు కనపడుతోందా? క్రాపు పెరిగిందంటావా? '

'పాస్‌పోర్టు ఇచ్చాడా? . '

'ఆడి గుండెల్లో త్రీనాట్ త్రీ బయినెట్ దించి అట్టాగే కాసేపు వుంచాలిరా అప్పుడుగాని నా కసి తీరదు '

'బందోబస్తుకు రిలీఫ్ వేస్తారంటావా? '

'రోల్‌కాల్‌కు పర్మిషన్ ఏమన్నా ఇస్తాడా ? '

'ఈ పాపిష్టి లంజాకొడుకు చచ్చేటప్పుడు ఎట్టాంటి చావు చస్తాడంటావ్? '

'బందోబస్తుకు వెళ్ళేవాళ్ళకి ఫీడింగ్ ఏమన్నా ఇస్తారంటావా? '

'నిక్కరుకు మరీ గంజి ఎక్కువయ్యింది '

'ఈ యస్పీగాడు మంచోడేనా? ఆడి పెళ్ళాం ఆర్డర్లీలని కాల్చుకు తినిద్దంటగా '

'సెలవెట్టాగూ ఇయ్యడు సిక్కు అవుతా '

ఇలా సాగుతుంటయ్ నిత్య జీవితంలోని వాళ్ళ సంభాషణలు అనుక్షణం విసుగుతో, ఉద్యోగం మీద విరక్తితో, అధికార్ల మీద కోపంతో, పెళ్ళాం పిల్లల్ని చూసుకునే తీరికలేని స్థితిలో ఎటూ దిక్కుతోచని అయోమయంలో వాళ్ళు రోజులు గడిపేస్తుంటారు వాళ్ళ బుర్రల్లోకి ప్రపంచంలోని ఇంకో ఆలోచన రావటం చాలా అరుదయిన విషయం డ్యూటీలు ఎంత కష్టంగా వుంటున్నాయో, జీవితాలెంత దుర్భరంగా సాగుతున్నయ్యో ఒకళ్ళ కొకళ్ళు చెప్పుకోవటం మినహా, వాటి నుండి

తప్పించుకునే ఆలోచనలుగాని, వాళ్ళ కలాంటి పరిస్థితులెందుకున్నయ్యో ఆలోచించటంగానీ కనీసంగా కూడా జరగదు 'ఈ వుద్యోగాలింతే వీటినెవరూ మార్చలేర' నే ఒక దృఢాభిప్రాయం వాళ్ళ మనస్సుల్లో నాటుకుపోయింది కాని వాళ్ళ అధికార్లు వాళ్ళని పెట్టే బాధలకూ, వాళ్ళ డ్యూటీ నిబంధనలకూ వాళ్ళలో కలిగే కోపం, కసి మాత్రం వాళ్ళ మనస్సుల్లో ఎప్పుడూ ఓమూల కదులుతూనే వుంటుంది అధికార్ల ముందు వాళ్ళు ఒదిగి ఒదిగి నిలబడతారు భయం వాళ్ళ నరనరాల్లో నిండిపోయి వుంటుంది చిన్న పొరపాటుకు కూడా వాళ్ళు అతి కష్టమైన శారీరక బాధకు లోనవ్వాలి ఇంకాస్త పెద్ద పొరపాటుకు దారుణమైన పనిష్మెంటు తీసుకోవాల్సి వస్తుంటుంది ఇంక్రిమెంట్లు కట్ చెయ్యటం, సస్పెన్షన్‌లో వుంచటం దొరలకు హాబీ

డిపార్టుమెంటులోని క్రింది తరగతివాళ్ళు వాళ్ళని వాళ్ళు తక్కువ చేసుకునే అనేక అనేక విషయాల్లో నిరక్షరాస్యత ఒకటి కొంచెం రాయటం, చదవటం వచ్చినవాళ్ళముందు వీళ్ళు చేతులు కట్టుకొని నిలబడతారు పే బిల్లులో తన పేరు ఎక్కడుందో, తన జీతం ఎంతో ఎవరో ఒకళ్ళు చెప్పాలి దారుణమైన ఆ వుద్యోగ నిబంధనలు, వాళ్ళని పిరికి వాళ్ళుగా మార్చేశాయి ఎప్పుడూ వాళ్ళు భయం భయంగా చూస్తూ వుంటారు అధికార్ల మీద వాళ్ళకు కలిగే కసి ఒక్కోసారి అమాయక ప్రజలమీద, ఇంట్లో భార్య పిల్లలమీదా ప్రదర్శిస్తుంటారు అధికార్ల ముందు మాట్లాడే ప్రతి మాట ఆచి తూచి మాట్లాడాలి లేకుంటే పనిష్మెంటు నిద్ర పోతున్నా, మేలుకునివున్నా డిసిప్లైన్ భూతం వాళ్ళని నీడలా వెంట తరుముతూ వుంటుంది

అడుక్కు తినేవాడు తమకన్నా వందరెట్లు హాయిగా స్వతంత్రంగా బ్రతుకుతున్నా డనుకుంటుంటారు వాళ్ళు ఏరోజు కారోజు ఆ ఉద్యోగానికి స్వస్తి చెప్పాలనీ, పోయి ఏదో ఒక పని చేసుకొని బ్రతకొచ్చనీ అనుకుంటారు కానీ రోజులూ, నెలలూ, సంవత్సరాలూ అలా గడిచిపోతూనే వుంటయ్ దారుణమైన డిసిప్లైన్ వాళ్ళ ప్రతి పనిలోనూ, ఆలోచనలోనూ ఎంతో వుదాసీనతని ప్రోగు చేసింది గడిచిపోయిన సంవత్సరాల్ని తలుచుకొని వాళ్ళు ఆశ్చర్యపోతుంటారు 'అప్పుడే ఇన్ని సంవత్సరాలు గడిపేశామా!' అని వాళ్ళల్లో వాళ్ళు అనుకుంటుంటారు

ఎప్పుడో ఏ బందోబస్తులోనో రవ్వంత విశ్రాంతి దొరికినప్పుడు గతించిన జీవితాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ నీరసంగా నిట్టూరుస్తుంటారు ఈ నౌకరీకి రాకముందో, వచ్చాకనో, ఏ ఏ ఆడవాళ్ళతో ఎలాటి పరిచయాలు జరిగాయో కొద్దిసేపు గుర్తుకు వస్తాయి రెండు క్షణాలపాటు ఉత్సాహం కనపడిద్ది మళ్ళీ అంతలోనే మామూలే మీద పడుతున్న వయస్సు, నెరిసిపోతున్న వెంట్రుకలు వాళ్ళకు బాధ కలిగిస్తాయి 'ఏం సాధించాం ఈ బ్రతుకులో ?!' అనుకుంటారు కనుచూపుమేరలో జవాబేమీ కనపడదు. తమ యవ్వనాన్నీ, రక్తాన్నీ, ఈ జీవితాన్నీ సర్వస్వం ఈ డిపార్టుమెంటుకు ధారపోశారు అందుకు ప్రతిఫలంగా వాళ్ళకు వచ్చింది ఏమీ లేదు సర్వీసులో వున్నంతకాలమూ భార్యా పిల్లలకు వేళకింత తిండి అంతే అంతకుమించి ఇంకేమీ కనపడదు తమకేమో అనుక్షణం అవమానాలు, గొడ్డు చాకిరీ

రిటైరు అయ్యేసరికి పరిస్థితి భయంకరంగా తయారవుతుంది 'పెళ్ళీడుకొచ్చిన ఆడపిల్లలూ ఎప్పుడూ ఇంటిపట్టున తాము లేనందున, తమంతట తాము పెరిగి జులాయిలుగా, బాధ్యతలు తెలియకుండా పెరిగిన మగ పిల్లలూ తలదాచుకోవటానికి పూరిగుడిసెకానీ, సెంటుభూమిగాని లేని స్థితీ శక్తిలేని శరీరాలు రోగాలూ రొప్పులు రిటైర్ అయ్యాక ఎప్పటికోవచ్చే పెన్షను డబ్బులు చేసిన అప్పులుకూడా తీర్చటానికి చాలని గవర్నమెంటు గ్రాట్యుటీ ఆ వచ్చిన కాస్త డబ్బుతో

కూతురి పెళ్ళో, కొడుకు ఉద్యోగానికి లంచమో సరిపోతే తమ బ్రతుకులు ఎట్లాసాగాలి?' ఆ వూహకే గుండె వణికిపోతుంది

'సర్వీసులో వున్నప్పుడు కిందామీదా కనపడక, భవిష్యత్తు గురించి ఆలోచించక వున్నదంతా ఖర్చుపెట్టుకుంటూ, రేపటికంటూ ఏమీ మిగుల్చుకోకపోతే ఇంతే' అని తననితను తిట్టుకుంటూ వుండటమేకానీ తన సర్వీసులో ఎప్పుడూ ఏ సందర్భంలోనూ కాసిని డబ్బులు మిగిలిన సందర్భం లేదనీ, అత్యవసరాలకు తనకున్న అవకాశాల్లోంచి లోనులు తీసుకోవాల్సి వచ్చిందనీ, మర్చి పోతుంటారు చివరకు అన్నిటికీ 'ఆ భగమంతుడున్నాడులే' అనే వేదాంతపు ఆలోచనతోపాటు, ఆ సమస్యల వలయం నుండి తాత్కాలిక వుపశమనం కోసం మాదకద్రవ్యాల అలవాటు తప్పనిసరి చాలామందికి

ఇవే విషయాలు ఆలోచిస్తూ తుపాకీ పట్టుకొని నిలబడివున్నాడు ప్రకాశం ఆ రోజుతో ఆ వూరికి బందోబస్తుకువచ్చి మూడునెలలు నిండాయి ఇంటిదగ్గర భార్యా, పిల్లవాడూ, తల్లీ ఎలాగున్నారో తెలియదు తన విషయం వాళ్ళకు తెలియదు 'ఇలాంటి భయంకరమైన పరిస్థితి ఇంకే డిపార్టుమెంటులోనన్నా వుందా?' అనే అనుమానం వచ్చింది ఆ వూరు బందోబస్తుకు వచ్చిన పోలీసులంతా పంచాయితీ ఆఫీసులో కేంపుపెట్టారు ప్రకాశం తుపాకి పట్టుకొని నిలబడి వున్నాడు బయట కొంతమంది వూళ్ళో గస్తీ తిరగటానికి వెళ్ళారు కొంతమంది లోపల గుడ్డిదీపం వెలుగులో పేకాడుకుంటున్నారు ఇన్‌చార్జి, లోకల్‌సార్జెన్, నిద్రపోతున్నాడు ఆ వూళ్ళో ఇద్దరు ఆసాముల పొలాలగట్ల దగ్గర వచ్చిన తగాదాలు, చిలికిచిలికి గాలివానై హత్యలు జరిగాయి వూళ్ళోని భూస్వాములు రెండు పక్షాలుగా చీలిపోయారు దాంతో వాళ్ళదగ్గర కూలి చేసుకొనిబ్రతికే కూలివాళ్ళుకూడా రెండుపక్షాలయ్యారు వాళ్ళు, రాత్రిళ్ళు వాళ్ళవాళ్ళ పల్లెల్లో వున్నప్పుడు అంతా మామూలుగానే వుంటారు ఉదయం నుండి, ఆ వర్గ భూస్వామి కూలోళ్లు ఈవర్గపు వాళ్ళతో మాట్లాడరు, వాళ్ళు తండ్రీ కొడుకులయినాసరే వాళ్ళు అలా మాట్లాడుకోవటం ఏ భూస్వామి చూచినా వాళ్ళని పనిలోనుండి తీసివేస్తాడు ఇకవాళ్ళకి పని దొరకటంకష్టం కేవలం పనికోసం, జీవన భృతికోసం, వాళ్ళ యజమానుల అడుగులకు మడుగులొత్తుతూ, రోజులు దొర్లిస్తుంటారు తమ డ్యూటీలుకూడా అంతే

ఆ రోజువరకూ బందోబస్తుకు వచ్చిన పోలీసువాళ్ళకు రోజుకొక వర్గంవాళ్ళు భోజనాలు ఏర్పాటు చేసేవాళ్ళు రోజులు గడిచేకొద్దీ మార్పు వచ్చింది బందోబస్తుకు వచ్చిన కొత్తలో రోజూ కోళ్ళనికోసి పెట్టేవాళ్ళు ఆ భూస్వాముల్లో ఒకవర్గం వాళ్ళకు ఇంకోవర్గంమీద వుండే కసిని పోలీసులు ఈవిధంగా సొమ్ముచేసుకొనేవాళ్ళు రోజులు గడిచేకొందీ వీళ్ళ భోజనాలకు అయ్యే ఖర్చు ఆ భూస్వాములకు కొటొచ్చినట్టు కనపడేది ఈ ఖర్చుకాక వండి వడ్డించే శాకిరీ ఒకటి

రోజులు గడిచేకొందీ పప్పు, ఉప్పు తీసుకెళ్ళి ఎవరిచేతనన్నా వండించుకోమనేవాళ్ళు అప్పటికీ ఒకటికి రెండుసార్లు ఆవూరి మునసబు కరణాలచేత, ప్రెసిండెంటుచేత ఆ ఆసాములకి పోలీసులు చెప్పించారు కాని వీళ్ళు వాళ్ళ మాటల్ని ఖాతరు చెయ్యలేదు ఇక చేసేది ఏమీలేక తపేలా ఒకరింట్లోనుండి, బిందె ఒకరింట్లోనుండి, గ్లాసులు చెంబులు ఒకరింట్లోనుండి- ఇలా కావలసిన వస్తువులు తలా ఒకచోటనుండి తెచ్చుకొని పబ్బం గడుపుకొంటున్నారు

వంట ఎవరుచెయ్యాలి అనేవిషయంమీద వాళ్ళల్లో వాళ్ళకు గొడవలువచ్చేవి వంటచేసే వాళ్ళకు డ్యూటీలు ఏమీ చెప్పకూడదని నిర్ణయించారు అందుచేత ప్రతివాళ్ళు డ్యూటీ

తప్పించుకోవటానికి వంటచేస్తామని వచ్చేవాళ్ళు అంతమందిలో ఒకళ్ళిద్దరికి మినహా మిగతా వాళ్ళకు వంట చెయ్యటం ఎంతకష్టమైనో తెలిసివచ్చింది వంటచెయ్యలేక సతమతమయ్యేవాళ్ళు 'రోజూ ఇళ్ళకాడ పెళ్ళాలు వండిపెడుతుంటే, కుతికిల కాడికి తిని తేన్చే మనకేం అర్థంకాలా ఇది శానా కష్టమైన పనేరా' అనుకుని నవ్వుకునేవాళ్ళు చివరికి వండిపెట్టటానికి ఇద్దరు పీసీల్ని ఎన్నుకున్నారు భోంచేసే సమయాల్లో అంతా కలిసేవాళ్ళు అనేక విషయాలు వాళ్ళ మధ్య చోటుచేసుకొనేవి వీళ్ళు వంట స్వయంగా వండుకోకముందు, ఆసాముల ఇళ్ళల్లో ఆరగించేటప్పుడు, ఇక్కడ భోంచేస్తున్నప్పుడు ఆ వర్గంవాళ్ళని తిడుతూ అక్కడ భోంచేసే టప్పుడు ఈ వర్గం వాళ్ళని తిడుతూ మాట్లాడటం జరిగేది తద్వారా భోజనంలో కూరలూ, పెరుగూ తగ్గకుండా, నెయ్యి మరోసారి వేయించు కోవటానికీ, చుట్టాబీడికి ఇబ్బంది లేకుండా చూసుకోవటానికి వీలయ్యేది ఎన్ని మాటలు చెప్పినా రోజులు గడిచేకొందీ కూరలు క్షీణించి పచ్చళ్ళల్లోకి, గడ్డపెరుగుపోయి పల్చటి మజ్జిగలోకి వచ్చింది పరిస్థితి భోంచేసి లేచేసరికి ఇంటియజమాని ఎటో పోయేవాడు కనపడకుండా, వుంటే చుట్టాబీడీకి డబ్బులు ఇవ్వవలసి వస్తుందని ఇహ అదికూడా వీలుకానిస్థితి వచ్చింది కాబట్టి తామే వంట చేసుకుంటున్నారు

పెట్టినంతకాలంతిని, పెట్టకపోయేసరికి ఇరువర్గాలమీద కసి పెరిగింది వీళ్ళకు పూట పూటకూ వాళ్ళ కొంపలకిపోయి కావలసిన సరుకులు అడుక్కొని తెచ్చుకోవటం బాధగావుండేది ఎంతో స్వంతడబ్బులు పెట్టుకొని కొనుక్కొచ్చుకొని వండుకుందామంటే వచ్చిన జీతం డబ్బులు కుటుంబాన్ని పోషించుకోవటానికే చాలటంలేదు గవర్నమెంటు వారిచ్చే టీ ఏ ఒక్కపూటకు భోజనానికికూడా చాలటంలేదు ఇక మిగిలినమార్గం ఒక్కటే ఛీ అన్నా ఛా అన్నా కావాల్సిన సరుకులు భూస్వాముల ఇళ్ళకు వెళ్ళి తెచ్చుకోవటం, వండుకు తింటం ఆసాముల ఇళ్ళల్లో అయితే ఉదయం పూట రోజు కొక రకమయిన టిఫిన్, చిక్కటి కాఫీ దొరికేది ఇప్పుడేట్లా? టీ కొట్లో నీళ్ళ టీకి కూడా డబ్బులు లేవు చుట్టా బీడీ అలవాటున్న వాళ్ళు డబ్బులు పెట్టి కొనుక్కోవలసి వస్తోంది రాబడిలేదు కాని అలవాట్లు తగ్గలేదు ప్రత్యమ్నాయ మార్గాల కోసం వెదికే వాళ్ళు రాత్రిళ్ళు పది దాటిం తరువాత ఎవరన్నా ఒంటరిగా కనపడితే పంచాయితీ ఆఫీసులో వున్న క్యాంపుకి తీసుకెళ్ళటం, జేబులోవున్న పొగాకుతో సహా తీసుకోవటం, ఏమీ దొరక్కపోతే భయపెట్టి పొద్దున్నే టౌనుకు తీసుకుపోయి, కోర్టులో హాజరుపెట్టి ఆరునెలల వరకు శిక్షవేయిస్తామని, లేకుంటే ఇంటికెళ్ళి, వాళ్ళడిగిన వస్తువులు తెచ్చిపెట్టాలనీ, లేకుంటే ఒకటి రెండు రూపాయ లన్నా ఇవ్వాలనే షరతుమీద వదిలిపెట్టేవాళ్ళు పోలీసుల చేతుల్లో పడి దెబ్బలు తిన్నాడనే విషయం గొప్ప అవమానంగా భావించే వాళ్ళు ప్రజలు అందువలన మూడోకంటికి తెలియకుండా జాగ్రత్తపడేవాళ్ళు

'వెధవలని వెధవలు పోలీసులంటే అంత భయమున్నప్పుడు ఈళ్ళ కీ తగాదాలు ఎందుకు? పిరికి నా కొడుకులు' అనుకునేవాళ్ళు వీళ్ళు

'తగాదాలు ఆసాములియ్యి మన జులుం అమాయకులమీదే కదా ఈ సన్యాసులు తగాదాలు పెట్టుకొని మర్డర్లు చేస్తే పోలీసు బందోబస్తు వస్తుందా?' అనేవాళ్ళు కొంతమంది

గ్రామాల్లో బందోబస్తులు చేసేటప్పుడు గ్రామంలోని చాలామందితో పరిచయాలు ఏర్పడుతుంటాయి పరిచయాలన్నీ ఇంచుమించు స్వార్థపు ఆలోచనకేంద్రంగానే వుండేవి ఎవరి

అలవాటుకు తగ్గట్లు ఆ అలవాటు కలవాళ్ళు పరిచయమయ్యే వాళ్ళు జూదగాళ్ళకు జూదగాళ్ళు తాగుబోతులకు అలాటి వాళ్ళు, ఆడవాళ్ళకోసం తిరిగే వాళ్ళకు అదేరకం మనుషులు తారసపడేవాళ్ళు అలాటి పరిస్థితిలోనే ప్రకాశానికి నాగేశ్వర్రావుతో పరిచయం ఏర్పడింది

ఒకరోజు వీళ్ళంతా భోజనానికి వెళ్ళి వస్తుంటే, ఒక అరుగుమీద కూర్చుని పుస్తకం చదువుతూ కనిపించాడు నాగేశ్వరరావు అతని చేతిలోని పుస్తకం చూసేసరికి ప్రాణం లేచి వచ్చినట్లనిపించింది ప్రకాశంకు ఎంతో ఆనందం కలిగించింది చిరునవ్వుతో పలకరించాడు దగ్గరకెళ్ళి ''ఏం పుస్తకం సార్ అది?'' అన్నాడు

నాగేశ్వర్రావు ప్రకాశం వైపు చూశాడు చిన్నగా నవ్వాడు స్నేహపూర్వకంగా చేతిలోని పుస్తకాన్ని అందించాడు పుస్తకాన్ని అటూ ఇటూ తిప్పి చూశాడు ప్రకాశం అది ఒక నవల

''కూర్చోండి'' అన్నాడు నాగేశ్వరరావు ప్రకాశం కూర్చున్నాడు అరుగుమీద చిన్నగా సంభాషణలోకి దిగారు అప్పుడే ప్రకాశం మనస్సులో చిన్నగా వేదన ప్రారంభమయ్యింది 'తన కులాన్ని ఎక్కడ అడుగుతాడో' అని జంకు మొదలయ్యింది కాని నాగేశ్వర్రావు అతని కులాన్ని గురించి అడగలేదు ఆ వుద్దేశం వున్నట్లు కూడా అనిపించలేదు ప్రకాశంకు చాలాసేపు మాట్లాడు కున్నాక వెళ్ళిపోయాడు ప్రకాశం

అలా జరిగిన పరిచయం ఓ వారం రోజుల్లోనే స్నేహంగా మారింది నాగేశ్వరరావు మాట్లాడు తుంటే ఎంతసేపయినా వినాలనిపించేది మాట్లాడే విషయం ఏదైనా కానీ మాట్లాడటంలో అతని కెంతో నైపుణ్యం వున్నట్లు తోచింది ప్రకాశంకు స్వరం గంభీరంగా వినిపించేది అతనితో మాట్లాడుతున్నంతసేపూ తన సమస్యలు కొంచెం దూరమయ్యేవి చాలాసార్లు తన ఉద్యోగంలోని సాధక బాధకాలు చెపుతుండేవాడు ప్రకాశం అలా చెప్పటం వలన కొంచెం ఆ నిముషం పాటు మనస్సు తేలికపడ్డట్టు తోచేది ఏ పూట కాపూట నాగేశ్వరరావు ప్రకాశం ఉద్యోగవిశేషాలు అడిగేవాడు

''ఆс. ఏముంటాయి కొత్తగా చూస్తున్నారుగా ఇక్కడ కొచ్చి మూడు నెలలు దాటింది పెళ్ళాం బిడ్డల సమాచారం తెలియదు ఒక్కపూటన్నా పోయి వద్దామంటే మా యిన్చార్జి పంపించడు వాడు కూడా పోడు మహా భయం వాడిక్కడి నుండి ఇంటికెళ్ళినప్పుడు, ఏ బజార్లోనో ఏ ఆఫీసరు కళ్ళల్లోనో పడతాడేమోనని వాడి భయం అది కాకపోయినా వాడిక్కడ లేనప్పుడు ఎవరన్నా ఆఫీసరు చెకింగుకు వస్తాడేమోనని భయం ఆ వున్నది కాస్తా వూడితే తాగటానికి గంజి కూడా దొరకదుగా అందువలన ఈ ఉద్యోగాన్ని జాగ్రత్తగా కాపాడుకోవాలిమరి అది సహజమే ననుకోండి మొన్న మా కానిస్టేబులు కొడుకొకతను వచ్చాడు వాళ్ళమ్మకు సీరియస్గా వుందని ఆ కానిస్టేబుల్ని హెడ్క్వార్టరుకు పంపనంటాడు ఈ ఇన్చార్జి ఆఫీసరుగారు పంపే అధికారం తనకు లేదనంటాడు ఏదయితే అదయిద్దని మొండిధైర్యంతో అతను వెళ్ళిపోయాడు అప్పటినుండీ అతనికి ఆబ్సెంటు రాస్తున్నారు ఉద్యోగం పోవటం ఖాయం. ఆ పిల్లోడొచ్చినప్పుడు చెప్పాడు మా అమ్మకు కూడా బాగాలేదని మమ్మ కళ్ళల్లో మెదులుతోంది ఏందో ఈ బతుకులు కన్నతల్లిని కడసారి చూపుకుకూడా అవకాశం ఇవ్వని నౌకరీలు ఛీ '' అన్నాడు చీదరింపుగా అతని మొహంలో బాధ కొట్టొచ్చినట్టు కనపడింది తిరిగిచెప్పటం ప్రారంభించాడు ఆవేదన నిండిన స్వరంతో

''నేను దీనిలోకి రాకముందు సివిల్ పీసీ ని అంటే లోకల్ పీసీని కష్టం విషయంలో దానికీ

దీనికీ పెద్ద తేడా లేదు కాని దానిలో వున్నప్పుడు నాలుగు రోజుల కొకసారన్నా పెళ్ళాం పిల్లల్ని చూసుకొనే అవకాశం వుండేది ఇందులో అలాటిదేమీ లేదు'' అన్నాడు

''నిజంగా ఇది చాలా భయంకరమైన సమస్య ఇట్లా నెలల తరబడి కుటుంబాన్ని వదిలిపెట్టి వుంటుంటే కలిగే దుష్ఫలితాలు చాలా తీవ్రంగా వుంటుంటాయి కదా? అవి కుటుంబం మీదనేకాదు సమాజం మీద కూడా పడతాయి కాదంటారా?'' అన్నాడు నాగేశ్వరరావు

''వుంటుంటాయి కాదు వుంటున్నాయి కూడా ఇప్పుడు చూడండి ఇక్కడున్న పీసీలంతా ఇంచుమించు కుర్రవాళ్ళే ఇక్కడ కొచ్చాక ప్రతివాళ్ళకూ ఎవరో ఒక ఆడమనిషితో సంబంధాలు ఏర్పడ్డాయి ఇక్కడ ఇవేవీ దాచేస్తే దాగే విషయాలు కాదుకదా! మీకు తెలుసు ఏ ఏ పరిస్థితులైతే వీళ్ళనీ స్థితికి దిగజార్చాయో అవే పరిస్థితులు అక్కడున్న వీళ్ళ ఆడవాళ్ళకు కూడా ఎదురవుతాయి కదా చాలామందికి సరే అదలా వుంచండి ఇక పోలీసు పిల్లల విషయానికొస్తే, ఎప్పుడూ ఇలా నెలలూ సంవత్సరాల తరబడి పెళ్ళాం పిల్లల్ని వదిలిపెట్టి వూళ్ళు పట్టుకొని తిరిగే పరిస్థితుల్లో పిల్లలకు క్రమశిక్షణ, భయభక్తులు ఎట్లాగొస్తాయి ఇక్కడ మేమెంత కఠినమైన క్రమశిక్షణతో అఘోరిస్తున్నామో, అక్కడ మా పిల్లలు చాలామంది, కనీస క్రమశిక్షణ, కనీస భయభక్తులు, కనీస మంచీచెడూ తెలియకుండా, జులాయిలుగా తిరుగుతూ చదువుసంధ్యలు అబ్బక వాళ్ళ కనీస ఆర్థిక అవసరాల కోసం చిల్లర దొంగతనాలకు అలవాటు పడిపోతున్నారు చివరకు ఎందుకూ పనికిరాకుండా పోతున్నారు వాళ్ళకు పాపభీతి లేదు మంచీ చెడూ లేదు చిన్నా పెద్దలేదు కొంతమందిలో వావీవరసలు కూడా కనపడటంలేదు మరింకేమిటి చెప్పండి పరిస్థితులు ఇట్లా మారిపోతున్నాయంటే లోపం ఎక్కడుందో మీరే చెప్పాలి పోలీసుల పిల్లలంతా ఇలాగే వున్నారనికాదు నా వుద్దేశ్యం మా ఉద్యోగ విధానం మా బిడ్డల భవిష్యత్తుని కూడా దెబ్బతీస్తోందని నా అభిప్రాయం సంవత్సరాల తరబడి ఆఫీసర్ల కొంపల్లో ఆర్డర్లీలుగా ఉండగలిగిన పీసీలు కొంతమంది మాత్రం పిల్లల్ని చదివించుకొని కొద్దిగా అభివృద్ధిలోకి తెచ్చుకోగలుగుతున్నారు'' అన్నాడు ప్రకాశం

''ప్రభుత్వానికి ఈ విషయాలు తెలియవంటావా!'' అన్నాడు నాగేశ్వరరావు

''తెలియకుండా ఎందుకుంటయ్?'' అన్నాడు ప్రకాశం

''ఆఁ అదీ ప్రభుత్వానికి అన్నీ తెలుసు తెలిసే ఈ విధమైన చెడుల్నీ కావాలని కల్పిస్తోంది ఈ పద్ధతులు దేశంలో ఎంత ఎక్కువగా వుంటే తెల్ల వాళ్ళకంత లాభం'' అన్నాడు నాగేశ్వరరావు

వాళ్ళట్లా మాట్లాడుకుంటుంటే నాగేశ్వరరావు భార్య రెండు గ్లాసుల్తో ఇద్దరికీ కాఫీ తెచ్చిచ్చింది

''ఇప్పుడెందుకమ్మా! ఇంతకుముందేగా భోంచేసి వచ్చింది'' అన్నాడు ప్రకాశం కాఫీ గ్లాసు అందుకుంటూ

''కాఫీయేగా మా యింట్లో మీరు భోజనం కూడా చెయ్యరుగా ఎన్నిసార్లడిగినా'' అంది ఆమె ఆ మాటకు ప్రకాశం నవ్వాడు

''ఎందుకు చెయ్యనమ్మా కాకపోతే నలుగురితోపాటు కాకుండా ఇక్కడకొస్తే వాళ్ళేమన్నా అనుకుంటారని'' అన్నాడు కొద్దిసేపు తర్వాత ఆమె ఖాళీ గ్లాసులు తీసుకెళ్ళింది

మళ్ళీ వీళ్ళు కబుర్లలో పడ్డారు

''ఈ తెల్ల నా కొడుకులు మనదేశం వదిలి ఎప్పుడు వెళ్ళిపోతారంటారు ?'' అన్నాడు ఆసక్తిగా ప్రకాశం

''అందరం ఆ శుభ గడియ కోసమేగా ఎదురుచూస్తోంది  ఇంకా ఒకటీ ఒకటిన్నర సంవత్సరాలలో మనకు స్వాతంత్ర్యం వస్తుందనుకుంటన్నా నేను'' అన్నాడు నాగేశ్వరరావు

ఆ విషయాన్ని గురించి చాలాసేపు చర్చించుకున్నారు  తర్వాత ప్రకాశం లేచి పోలీసు క్యాంపు దగ్గరకు కెళ్ళాడు

ప్రతిరోజూ వాళ్ళు కలుసుకునేవారు  ఆ బందోబస్తులో వున్న ఆరు నెలల్లో వాళ్ళమధ్య స్నేహం బలపడింది  బందోబస్తు 'క్లోజ్' చేసుకొని వచ్చేముందు నాగేశ్వరరావు ప్రకాశాన్ని భోజనానికి తీసుకెళ్ళాడు  కోడిని కోసి, గారెలు వండారు  భోంచేసి బయటకొచ్చి కూర్చున్నారు అరుగులమీద

''తెల్లవారుఝామునే వెళ్ళిపోతాం'' అన్నాడు ప్రకాశం బాధగా  నాగేశ్వరరావు ఏం మాట్లాడ లేదు  అతనికి ప్రకాశం వెళ్ళిపోతాడనే వూహే బాధగా వుంది  ఇంటికెళ్ళే ఆనందం ఓ ప్రక్కా, నాగేశ్వరరావు దూరమౌతాడనే బాధ ఓ ప్రక్కా ప్రకాశాన్ని కలిచివేశాయి  గురవయ్య నుండి విడిపోయేటప్పుడూ, గోపాలం నుండి దూరమయ్యేటప్పుడూ కలిగిన తరహా బాధే ఇప్పుడూ అతన్ని ఆవహించింది

''వదిన్ని తీసుకొని ఒకసారి రావాలి మీరు'' అంది నాగేశ్వరరావు భార్య

ఆ మాటకు ప్రకాశం చిన్నగా నవ్వాడు  ''ఆ, ఏం తీసుకురావటమో  మాకు అట్లాంటి అదృష్టాలుండవు తల్లీ  చూస్తున్నావుగా  ఇక్కడకొచ్చి ఆర్నెల్లు  ఇంతే మా బతుకులు  స్నేహితులు, సరదాలు అంటే ఏమిటో మా బతుకుల్లో రాసిలేదు  స్నేహితుల ఇళ్ళకు, శుభకార్యాలకు పోయే అదృష్టాలు కూడా మా ముఖాల్లో రాసిలేవు'' అన్నాడు

''మీ బోటివాళ్ళు ఈ ఉద్యోగానికి పనికిరారు అన్నయ్యా!''అంది ఆమె  ఆ మాటకు నాగేశ్వరరావు నవ్వాడు

''మరేం చేస్తాం  జానెడు పొట్టకోసం తప్పదుగా'' అన్నాడు నాగేశ్వరరావు  వాళ్ళ ఆప్యాయతకు ప్రకాశం కళ్ళు చెమర్చాయి  కొద్దిసేపు నిశ్శబ్దం తరువాత చిన్నగా అన్నాడు

''పుస్తకాలు మనుషుల్లోని మంచితనాన్ని పాఠకులకు చూపిస్తాయి  మనుషుల్ని అర్థం చేసుకోవటానికి తోడ్పడతాయి  విజ్ఞానం కలిగిస్తాయి  జీవితం మీద ఆశలు కలిగిస్తాయి జీవితమంటే ఏమిటో చెప్పి, జీవించటమెలాగో నేర్పుతాయి కదా!'' తమ పరిచయమింత గాఢంగా మారటానికి గల మూలకారణాన్ని ప్రకాశం గుర్తు చేసుకుంటూ ఆ మాటలు అన్నాడు

అవునన్నట్లు తలవూపి చిన్నగా నవ్వాడు నాగేశ్వరరావు

''పుస్తకాలు చదివినవాళ్ళంతా మంచివాళ్ళుగానే కనపడతారు నాకు ఎందుకో'' అన్నాడు ప్రకాశం నవ్వుతూ

''అవును  చాలావరకు  కానీ బాగా చదువుకున్న వాళ్ళల్లో కూడా నీచపు భావాలతో బ్రతికే వాళ్ళు ఎక్కువమందే వున్నారు  కులాల పట్టింపు ముఖ్యంగా వాళ్ళల్లో కనపడుతుంది'' అన్నాడు నాగేశ్వరరావు

''అది పోవాలి ముందు  దానితో చస్తున్నాం  అదిపోతేకాని కాస్త వూపిరి పీల్చుకోలేము'' అన్నాడు ప్రకాశం ఆదుర్దాగా  ఆ విషయం గురించి చాలాసేపు మాట్లాడుకున్నారు  బాగా పొద్దుపోయింది  ఆకాశంలో చందమామ ప్రకాశవంతంగా వెలుగుతున్నాడు

బయలుదేరటాని కన్నట్లు లేచాడు ప్రకాశం  నాగేశ్వరరావు కూడా లేచాడు  ''అమ్మా! నేను వస్తారా  మళ్ళీ బతికి బాగుంటే ఎప్పటికో మనం కలుసుకునేది  మీరొకసారి టౌనుకి రండి

ఒకపూట వుండి వద్దురుగాని'' అన్నాడు ప్రకాశం

''అట్లాగే అన్నయా! ఒకసారి వస్తాంలే '' అంది నాగేశ్వరరావు భార్య వాళ్ళదగ్గర శెలవు తీసుకొని, భారంగా కేంపుకొచ్చాడు ఆ రాత్రి చాలాసేపటివరకు నిద్ర పట్టలేదు నాగేశ్వర్రావుని గూర్చిన ఆలోచనలే అతన్ని చుట్టుముట్టాయి

బ్రిటీష్‌వాళ్ళ అఘాయిత్యాలను సహించలేక, వాళ్ళ దగ్గర కొలువు చెయ్యటం యిష్టంలేక, నిక్షేపంలాంటి ఉద్యోగానికి రాజీనామా చేసి, వున్న యకరంన్నర పొలం సాగుచేసుకుంటూ వుండిపోయాడు నాగేశ్వర్రావు ప్రకాశం దృష్టిలో నాగేశ్వర్రావు గొప్ప వ్యక్తి తనకీ ఈ వుద్యోగం చెయ్యటం ఇష్టం లేదు బ్రిటీష్ వాళ్ళ దగ్గర కొలువు చేసే విషయం అటుంచి, ముందు ఈ గొడ్డు చాకిరీ చాలా కష్టంగా వుంది ఇది మానుకొని పోయి వ్యవసాయం చేసుకోటానికి పొలం లేదు ఇది వదిలేస్తే తిరిగి పాలేరు బ్రతుకే

ఆలోచనలతో ఎప్పటికోగాని నిద్ర పట్టలేదు తెల్లవారురఝామున లేచి బెడ్డింగులు చుట్టుకొని, తుపాకులు భుజాలకు తగిలించుకొని బయలుదేరారు మూడు మైళ్ళు నడిచి రైల్వే స్టేషను చేరుకున్నారు కడుపులు నకనకలాడుతున్నయ్ ఉదయం ఏడు గంటలయ్యింది రైలు రావటానికి ఇంకా రెండు గంటల టయిముంది తుపాకులు, బెడ్డింగులు అన్నీ ఒక మూలన పెట్టారు దూరంగా వున్న వేపచెట్టు ఎక్కి ఒకతను వేపపుల్లలు విరుచుకొచ్చాడు అంతా కబుర్లు చెప్పుకుంటూ ముఖాలు కడుక్కున్నారు ఆకలి వేస్తోంది ఒక కుర్రవాడు ఫ్లాట్‌ఫారం మీద పునుగులూ, చక్రాలు అమ్ముతున్నాడు ఆ కుర్రోణ్ణి పిలిచి తలా రెండు పునుగులు తీసుకొని తిని నీళ్ళు తాగారు పొద్దెక్కేకొందీ నీరసం ఎక్కువవుతోంది కానీ ఇళ్ళకెళ్ళే వుత్సాహంలో అది అంతగా అనిపించలేదు రైలుకోసం ఎదురుచూస్తూ కూర్చున్నారు రైలు వస్తున్నట్టు గంట కొట్టారు వారంటు మార్చుకొని రైలెక్కారు

వాళ్ళు డీ పీ వో (డిస్ట్రిక్ట్ పోలీసు ఆఫీసు) చేరి ఆన్‌డ్యూటీలో వున్న ఆర్ యస్సై (రిజర్వ్ సబ్ ఇన్‌స్పెక్టరు) కు రిపోర్టు చేశారు తుపాకులు, తోటాలు అప్పగించి పరుగులాంటి నడకతో ఇంటికి చేరారు అప్పటికి మధ్యాహ్నం పన్నెండు దాటింది

ప్రకాశాన్ని వాటేసుకొని అతని భార్య ఏడ్చింది బావురుమని అతనికీ కళ్ళు చెమ్మగిల్లాయి తల్లి మంచంలో లేవలేని స్థితిలో వుంది పిల్లవాడు ఆడుకుంటున్నాడు తండ్రిని చూచి గబగబా వచ్చి కాళ్ళని చుట్టేసుకున్నాడు ''మనం మనూరు పోదాం ఆడే ఏ కూలో నాలో సేసుకుని బతుకుదాం'' అంది భార్య ఏడుస్తూ ప్రకాశం ఏమీ మాట్లాడలేదు అతని మనస్సంతా మొద్దుబారిపోయినట్లు అనిపించింది వంగుని పిల్లవాడిని ఎత్తుకున్నాడు ఆ విచారం నుండి వాళ్ళు తేరుకోవటానికి చాలాసేపు పట్టింది మంచంమీద కూర్చుని తల్లి చేతిని పట్టుకొని పరామర్శించాడు ఓ గంట తర్వాతగాని వాతావరణంలో కొంచెం మార్పు రాలేదు పిల్లవాణ్ణి ఒళ్ళో కూర్చోబెట్టుకొని ముద్దాడాడు

''వీడికేమన్నా తినటానికి తేవటానికి కూడా డబ్బులు లేవే'' అన్నాడు భార్యతో ఆ మాటా ఈ మాటా చెప్పుకున్నారు మధ్యాహ్నం భోజనం చేసి కొద్దిసేపు పడుకొని లేచాడు అప్పటికి కొంచెం హుషారు ఆ యింట్లో ప్రవేశించింది 'ఏ నిముషంలో ఎటు వెళ్ళవలసి వస్తుందో' అని అతనికి మనస్సులో పీకుతోంది ఎందుకయినా మంచిదని తల్లిని తీసుకెళ్ళి ఒక ప్రయివేటు ఆసుపత్రిలో చూపించుకొచ్చాడు అప్పటికి సాయంత్రం అయిదు కావొస్తోంది రోల్‌కాల్‌కి

పెళ్ళాడు రోల్‌కాల్‌కు వెళ్ళినవాళ్ళకు పాస్‌పోర్టు ఇచ్చారు అందులో అయిదుగురి నెంబర్లున్నయ్ 'వాళ్ళని యస్పీ బంగళాకు వెళ్ళి, అక్కడ బంగళా గార్డులో వున్న వాళ్ళని రిలీవ్ చేసి, తిరిగి రిలీఫ్ వచ్చేంతవరకూ గార్డు డ్యూటీ చేస్తూ వుండవలసినదని' రాసి వుంది ఆ పాస్‌పోర్టులో ప్రకాశం నెంబరు కూడా వుంది ఆ పాస్‌పోర్టు చూసి ఉగ్రులైపోయారు అంతా రిజర్వ్ హెడ్ కానిస్టేబులు ముసలతను అతను ఆ గార్డు డ్యూటీకి ఇన్‌చార్జి

''చేసేదేముంది పోదాం పదండి మంత్రసానితనం ఒప్పుకున్నాక తప్పదుగా '' అన్నాడు తల పట్టుకొని అతను మిగిలిన నలుగురు పీసీలు ముఖముఖాలు చూసుకున్నారు ప్రకాశంకు కడుపు మండిపోతోంది

''వీల్లేదు ఆరెస్సైని అడగాల్సిందే ఆర్నెల్లు అక్కడ చచ్చీ చెడీ వస్తే ఒక్క రాత్రన్నా కొంపలో పడుకోకుండా మళ్ళీ ఈ గార్డు వెయ్యటం అన్యాయం'' అన్నాడు ప్రకాశం ఉద్రేకంగా

హెడ్ కానిస్టేబులు ప్రకాశం వైపు ఆశ్చర్యంగా చూశాడు రోల్‌కాల్‌కు వచ్చిన మిగిలిన పీసీలు ప్రకాశాన్ని ఒలపర్చారు ''అడిగితే పనిష్మెంటు ఇస్తాడు'' అన్నాడు ఇంకొక హెడ్ కానిస్టేబులు పక్కనే వుండి

''అయినా ఫరవాలేదు ఈ అన్యాయాన్ని ఎదిరించి తీరాల్సిందే నేను అడుగుతా ఎవరన్నా వచ్చేవాళ్ళు నాతో రండి దమ్ముంటే'' అన్నాడు ప్రకాశం ఆవేశంగా ఆఫీసు ముందు అంతా నిశ్శబ్దం నిండిపోయింది అంతకుముందు తమ సర్వీసులో ఎప్పుడూ చూడని, వూహించని విషయాన్ని చూస్తున్నట్టు అందరూ చూస్తున్నారు ప్రకాశంతోపాటు మిగిలిన ముగ్గురు పీసీలు కూడా ఆరెస్సై రూంలోకి వెళ్ళారు రోల్‌కాల్ నెంబర్లు డైరీలో రాసుకుంటున్న ఆరెస్సై తలెత్తి వాళ్ళవైపు చూశాడు అందరూ సెల్యూట్స్ చేశారు

''ఏమిటి ?'' అన్నాడు ఆరెస్సై రాసుకుంటూనే

''మమ్మల్ని యస్పీ దొరగారి బంగళా గార్డు వేశారు సార్ మేము మధ్యాహ్నమే వచ్చాం సార్, బందోబస్తు నుండి ఆర్నెల్ల క్రితం ఇల్లూ వాకిలి వదిలిపెట్టిపోయి ఇవ్వాళేవచ్చాం సార్ మాకూ పెళ్ళాం పిల్లలున్నారు సార్'' అన్నాడు ప్రకాశం అనునయంగా

రాస్తున్నవాడల్లా ఆగిపోయి, కలం బల్లమీదపెట్టి ఆశ్చర్యంగా చూశాడు ఆరెస్సై ఎప్పుడూ తన సర్వీసులో అటువంటి సంఘటన ఎదురుకానట్టు చూశాడు కొద్దిసేపటికి తేరుకున్నాడు

''అయితే ఏమిటి నువ్వనేది?'' అన్నాడు తీక్షణంగా చూస్తూ

''ఈ రాత్రికి మాకు రెస్టివ్వండి సార్ రేపు ఉదయం వెళతాము'' అన్నాడు ప్రకాశం బ్రతిమాలుతూ మిగిలిన వాళ్ళు కూడా అంతే అన్నట్టు తలలూపారు

''మీ యిష్టమొచ్చినప్పుడు డ్యూటీకి రావటం కాదు మే మేసిన డ్యూటీకి పోవాలి'' అన్నాడు కోపంగా ఆరెస్సై

''కోప్పడకండి సార్ మా బాధలు మీకు తప్ప ఎవరికి చెప్పుకోగలం మమ్మల్ని మీరు కనిపెట్టకపోతే మా కష్టాలు ఎవరు పట్టించుకుంటారు చెప్పండి సార్'' అన్నాడు ఒక కుర్ర కానిస్టేబులు

ఆరెస్సై రూంలో జరుగుతున్న సంభాషణని బయట రోల్‌కాల్‌కు వచ్చిన వాళ్ళంతా నిశ్శబ్దంగా నిలబడి వింటున్నారు ఎప్పుడూ జరగనీ, విననీ, వూహించని ఆ సంఘటనకు వాళ్ళు ఆకర్షితులయ్యారు

'నా సర్వీసులో ఇంతవరకూ ఎవరికన్నా డ్యూటీవేసి పాస్‌పోర్టు ఇస్తే మళ్ళీ వెనక్కు తీసుకోవటమన్నది జరగలేదు అది మూడైనా మీరు ఆ డ్యూటీకి వెళ్ళాల్సిందే వెళ్ళకపోతే చెప్పండి అదే విషయం డైరీలో రాస్తాను'' అన్నాడు బల్లమీది పెన్ను వేళ్ళలోకి తీసుకుంటూ విలాసంగా కాలు వూపుతూ

అక్కడున్న పీసీల శరీరాల్లో రక్తం వేగంగా కదులుతోంది ఆ మాటలకు వాళ్ళ పళ్ళు పటపటలాడాయి ప్రకాశం ఏం మాట్లాడతాడోనని ఎదురు చూస్తున్నారు అంతా

''మమ్మల్ని ఆర్ఐ ( రిజర్వ్ ఇన్‌స్పెక్టరు) గారి ముందు హాజరుపరచండి సార్ మా రిక్వెస్టు ఆయనకే చెప్పుకుంటాం'' అన్నాడు ప్రకాశం

ఆ మాటతో ఆరెస్సై ఖంగుతిన్నట్టు చూశాడు అతని సర్వీసులో పీసీల మీదా, హెచ్‌సీల మీదా ఆర్‌ఐకు అబద్ధాలూ, చాడీలూ చెప్పి ఎగస్ట్రా డ్యూటీ, ఎగస్ట్రా గార్డూ ఇప్పించాడేగానీ, ఇలా తమంతట తాము ఆర్ఐ ముందు హాజరవుతామని అడిగిన వాళ్ళు లేరు

''ఇది లోకల్ అనుకున్నావా ? రిజర్వని గుర్తుంచుకో ఇక్కడ డిసిప్లైన్‌గా వుండాలి తెలిసిందా?'' అన్నాడు లేనికోపాన్ని తెచ్చుకుంటూ, పెద్దపెద్దగా అరుస్తూ ఆరెస్సై

''డిసిప్లైన్ అంతా ఒక్కటే మేము ఇక్కడ ఇన్‌డిసిప్లైన్‌గా మాట్లాడటం లేదు సార్'' అన్నాడు ప్రకాశం తొణక్కుండా

ఆరెస్సైకి ఏం మాట్లాడాలో తోచలేదు ''అసలు మీ ఇన్‌చార్జి సార్జిన్ ఎవరు?'' అని గద్దించాడు

''కుటుంబరావు సార్జిన్ సార్'' అన్నాడు ఒక పీసీ ఒకతను వెళ్ళి వేపచెట్టు కింద కూర్చుని వున్న సార్జిన్‌ని పిల్చుకొచ్చాడు సార్జిన్ వచ్చి ఆరెస్సైకి సెల్యూట్ చేశాడు నీరసంగా

ఆరెస్సై అతనివైపు కొరకొరా చూశాడు ''ఏమిటి నువ్వుండి కూడా వీళ్ళని గార్డు డ్యూటీకి తీసుకెళ్ళలేదు ? అందరిమీదా రిపోర్టు రాస్తా'' అన్నాడు

''గార్డుకు పోవటానికి నాకేమీ అభ్యంతరం లేదు సార్ వాళ్ళే మిమ్మల్ని చూడవస్తామని వచ్చారు సార్'' అన్నాడు అతను

''వాళ్ళని తీసుకెళ్ళాల్సిన బాధ్యత నీకు లేదా ?'' అన్నాడు ఆరెస్సై కోపం నటిస్తూ

''తీసుకెళ్ళటమంటే చంకనేసుకుని పొమ్మంటారా?'' అన్నాడు సార్జిన్ విసుగుగా అతనలా మాట్లాడటం ఎవరూ కలలోకూడా వూహించని విషయం కావటాన, ఆరెస్సైతో పాటు చాలా మంది ఆశ్చర్యపోయారు ఆరెస్సైకి ఏం మాట్లాడాలో తోచలేదు

''ఏమిటి నీ యిష్టం వచ్చినట్లు మాట్లాడుతున్నావు నువ్వేదో చెప్పిన డ్యూటీకి పోతావూ మంచివాడివను కుంటుంటేే, ఇంత సర్వీసుండి కూడా '' అన్నాడు ఏదో అభిమానాన్ని నటిస్తూ ఆరెస్సై అంతలోనే

''ఆఁ, నా మంచితనమే నా బతుకుని నాశనం చేసింది నా సర్వీసూ గాడిద సర్వీసూ ఒకటే ఎవుడిక్కావాలి నా సర్వీసు గాడిద బతుకుకన్నా హీనమైన బతుకు బతికాను కాసిని గంజిమెతుకుల కోసం ఈ దగుల్బాజీ నౌకరీ సేస్తున్నాను ఇందులో ఏముంది బానిసలకూ మాకూ తేడా నాకేం అవుపడతల్లా'' ఎంతో కాలంనుండి బలవంతంగా ఆపుకున్న అతని అసహనం అలా మాటల్లో కొద్దిగా తొంగిచూచింది

వూహించని జవాబుకు బిత్తరపోయాడు ఆరెస్సై ఏంమాట్లాడాలో తోచలేదు ఆర్ఐ దగ్గర ఫాలెన్ చేస్తే ఇంతమందీ రిక్వెస్టు చేస్తున్నారు కాబట్టీ, పైగా వాళ్ళ రిక్వెస్టు న్యాయమైనదే కాబట్టీ

ఆర్డై తననే అనొచ్చు అయినా అంత తేలికగా తగ్గటానికి లతని మనస్సు అంగీకరించలేదు

''ఆర్డై కూడా ఒప్పుకోరు'' అన్నాడు సీరియస్‌గా

''ఆర్డై గారు ఒప్పుకోకపోతే యస్పీ దొరగారి దగ్గరకు పోతాం'' అన్నాడు ప్రకాశం దృఢంగా ఆ మాటకు ఆరెస్సై వులిక్కిపడ్డాడు ప్రకాశం వైపు తీక్షణంగా చూశాడు వాళ్ళ ముందు తను తగ్గాల్సి వచ్చింది వాళ్ళంతా 'కట్ట' కట్టుకొని వచ్చారు

''ముందు మీరంతా బయటకు పోండి నేను డైరీ రాసుకోవాలి తరువాత మీ రిక్వెస్టును గురించి ఆలోచిస్తాను'' అన్నాడు పుస్తకంలో తలదూర్చి అంతా బయటకు వచ్చారు తరువాత కొద్దిసేపటికి ఆరెస్సై రైటర్ని పంపించాడు వాళ్ళదగ్గరకు

అతనొచ్చి, ''మీరంతా తలా ఒక పర్మిషన్ కాగితం రాసుకొచ్చి యివ్వండి'' అన్నాడు ఆ సంఘటన అందరికీ ఆనందం కలిగించింది అంతా అభిమానంగా చూశారు ప్రకాశం వంక ఒకతను పోయి నాలుగు కాగితాలు పట్టుకొచ్చాడు అందరికీ నైట్ పర్మిషన్ కొరకు దరఖాస్తులు రాసిచ్చాడు ప్రకాశం అందరూ వేలిముద్రలు వేశారు వాటిపైన ప్రకాశం ఒక్కడూ ఇంగ్లీషులో సంతకం చేశాడు దానితో అతని ప్రత్యేకత ఏమిటో అందరికీ తెలిసిపోయింది అతను రాసిన పర్మిషన్ కాగితాలు చూశాడు ఆరెస్సై ఇంగ్లీషులో వున్న ప్రకాశం సంతకం చూసి కసిగా పళ్ళు నూరుకున్నాడు కానిస్టేబులు నుండి ప్రొమోషను మీద ఆరెస్సై అయిన అతను తెలుగు రాయటమే అంతంత మాత్రం అందరూ వెళ్ళి ఆరెస్సై ముందు నిలబడ్డారు

''అం రేపు ఉదయం ఏడుగంటల రోల్‌కాల్‌కు రండి'' అన్నాడు అతను అందరూ అతనికి సెల్యూట్స్ చేసి బయటకొచ్చారు

''అబ్బాయ్ ప్రకాశం, ఈ పోలీసాఫీసు పుట్టినాక, ఇది చరిత్ర సృష్టించిన విషయమే'' అన్నాడు ఒక సీనియర్ పీసీ

''ఎట్టాగయినా సదువుకున్నోడూ, తెలివి తేటలు వున్నోడు'' అన్నాడు ఒకతను

''తెలివి తేటలుంటే ఏం లాభం అందరికీ వున్నయ్ ధైర్యముండొద్దూ'' అన్నాడు ఒకతను

''ఆరెస్సై నా కొడుకు సచ్చివుంటాడు ఈ దెబ్బకు'' అన్నాడు ఒకతను

''కాని దీని పరిణామం ఎలాగుంటుందో వాడసలే నాగుబాము లాంటోడు'' అన్నాడు ఒకతను

''అదీ నిజమే మన జాగ్రత్తలో మనం వుండాలి'' అన్నాడు ఇంకొకతను

అప్పటి వరకూ వాళ్ళమాటలు వింటూ నిలబడ్డ ప్రకాశం చిన్నగా అన్నాడు ''ఏమిటి మన జాగ్రత్తలో మనముండేది మన యిష్టా యిష్టాలతో ఏమీ సంబంధము లేకుండా చెయ్యాల్సిన డ్యూటీలు మనవి ఇంక మనం జాగ్రత్తగా వుండేదేమిటి ? కాకపోతే వాడి దృష్టిలో కష్టమనుకున్న డ్యూటీలు వేస్తాడు మనం చేసేదే గొడ్డు చాకిరీ ఇంక కష్టం, తేలిక సమస్య ఏమిటి ? మన వుద్యోగం తీసెయ్యటం వీడి బాబు వల్ల కూడా కాదు దీనిలో లోకల్‌పీసీలాగా ట్రాన్స్‌ఫర్ సమస్య లేదు ఎప్పుడన్నా రోల్‌కాల్ ఆబ్సెంటు రాసినా, గార్డు వెయిటింగ్ ఆబ్సెంటు వేసినా ఎగస్ట్రా గార్డు, ఎగస్ట్రా డ్రిల్లు అంతకుమించి ఇంక ఏముంది ?'' అన్నాడు

''అంతే అంతే'' అన్నారు అంతా

ఆ రోజంతా అదే విషయం గురించి ఆలోచించాడు జరిగిన విషయం భార్యకు చెప్పాడు

''ఇంత జరిగినా నీకింకా గేనం రాలేదు ఏంది?'' అంది ఆమె

''ఇంకా ఇంత జరిగినా అంతే లేకపోతే, ఆర్నెల్ల తరవాత ఇవ్వాళ వచ్చామో లేదో, అప్పుడే మళ్ళీ గార్డు అంటే మళ్ళీ నెలరోజులదాకా కొంపలో పడుకొనే వీలులేదు'' అన్నాడు నవ్వుతూ

''లేకపోతే పోయింది ఈ వున్నది కాస్త వూడిందాకా నువ్వట్టాగే చేస్తావులే'' అంది ఆమె కొంచెం విసుగ్గా

''ఏం వూడితే పొద్దునేగా నువ్వు మనూరుపోయి కూలో నాలో చేసుకుని బతుకుదామంది అంతలోనే మర్చిపోయావా ?'' అన్నాడు నవ్వుతూ ఆ మాటకు ఆమె కూడా నవ్వింది చిన్నగా

మర్రోజు చీకటితోనే లేచి కాలకృత్యాలు ముగించుకొని రోల్‌కాల్‌కు వెళ్ళాడు ఇన్ని రోజుల యాంత్రిక జీవితం మధ్య ఒక్కపూట రెస్టే మనసుకెంతో హాయి కలిగించింది ఉల్లాసంగా వుంది

తుపాకులూ తూటాలు తీసుకొని యస్పీ బంగళా దగ్గరకు వెళ్ళారు అక్కడ గార్డు డ్యూటీలో వున్న వాళ్ళని రిలీవ్ చేశారు అక్కడున్న పీసీలంతా రాత్రి జరిగిన విషయం తెలిసి ఆదుర్దాగా ఆనందంగా అడిగారు ప్రకాశాన్ని దాన్ని గురించి కొద్దిసేపు మాట్లాడుకున్నాక పాతవాళ్ళు తుపాకులూ బెడ్డింగులు తీసుకుని ఆఫీసుకు వెళ్ళిపోయారు

అది జిల్లా యస్పీ బంగళా దానిచుట్టూ అంతా కలియజూశాడు ప్రకాశం బంగళాచుట్టూ దాదాపు పది ఎకరాల స్థలం వుంది దానిలో రకరకాల చెట్లున్నాయ్ బంగళాచుట్టూ రకరకాల పూలమొక్కలు ఒక పక్క ఆటస్థలం దానికొంచెం పక్కగా 'దొర'గారు సాయంత్రం పూట కూర్చుని విశ్రాంతి తీసుకోవటానికిగాను, శ్రద్ధగా నీళ్ళుపోసి ఒత్తుగా పెంచిన పచ్చటి లాన్ బంగళా వెనుకగా కోళ్ళకోసం చిన్న కోళ్ళఫారం, దాని పక్కన బావి ఆ బావి నానుకొని కూరగాయల మళ్ళు, బంగళా క్రింది భాగంలో 'దొర' ఆఫీసు దాని ప్రక్కనకేంపుక్లర్కు గది దాని నానుకొని టెలిఫోను గది పక్కనే చిన్న హాలు పై అంతస్తులోకి మెట్లు ముందు పంచలో గొలుసుతో కట్టేసిన తోడేళ్ళులాంటి రెండు కుక్కలు ప్రహరీగోడ గేటు నుండి, బంగళా వరకు వేసివున్న నల్లటి తారు రోడ్డు, రోడ్డు కిరువైపులా మొక్కల ఫెన్సింగు 'దొర' కుటుంబంతో కాపురముండేది బంగళా పై అంతస్తులో

చెట్లమీద పక్షులు అరుస్తున్నయ్ వరండాలో కట్టేసిన కుక్కలు అదే పనిగా మొరుగుతున్నయ్ ఆర్డర్లీలు హడావిడిగా అటూ ఇటూ తిరుగుతున్నారు ఉదయం పదిగంట లయ్యింది ''దొరగారు ఆఫీసుకు వెళ్ళబోతున్నారు'' అన్నాడు ఒక పీ సీ డ్రైవరు కారు తీసుకొచ్చి బంగళా ముందు పెట్టాడు దొరని పరీక్షగా చూశాడు ప్రకాశం ఆజానుబాహు విగ్రహం సీమదొర లందరి లాగానే తెలుపు యెరుపు కలిసిన రంగు యూనిఫారం వేసుకొని బూట్లు టకటక లాడిస్తూ, చేతిలోని కర్ర వూపుకుంటూ వచ్చి కారెక్కాడు దొరనిచూచి మొరగటం ఆపేసిన కుక్కలు కారు కనుమరుగవ్వగానే తిరిగి మొరగటం ప్రారంభించాయి కారు కాంపౌండు గేటు దాటగానే కొంతమంది ఆర్డర్లీలు ప్రకాశం దగ్గర కొచ్చారు

''ఏంది, రాత్రి, డ్యూటీ ఆరెస్పై గాడిని అడలగొట్టావంట?'' అన్నాడు ఒకతను నవ్వుతూ ప్రకాశం కూడా నవ్వాడు జరిగిన విషయం చెప్పాడు

''యస్పీ దొర మంచోడేనా?'' అడిగాడు ప్రకాశం

''ఈడా, దొంగలంజా కొడుకు మన బాస సరిగారాదు చిన్న పొరపాటు జరిగినా వూరుకోడు కుక్కల్ని వుసిగొలుపుతాడు అయ్యి రాకాసి కుక్కలు కండలు వూడొచ్చేలాగా పీకుతాయి ఒక పీసీని ఇట్టాగే కరిస్తే, ఆడు పది పదిహేను రోజుల్లో వాయిగమ్మి సచ్చిపోయా''

ఆమెకు చెప్పుకొని ఆమెచేత దొరకు చెప్పించా ఈడు ససేమిరా ఒప్పుకోనన్నాడట, నన్ను లోకల్‌కి ట్రాన్స్‌ఫర్ చెయ్యటానికి పైగా నా అంత మంచి వంట [illegible]డని చెజేతులా వదిలిపెట్టుకో కూడదన్నాడట ఏం చెయ్యాలో అర్థం కాలేదు కుడితిలో పడ్డ ఎలుకలా అయిపోయింది నా పని ఇక్కడ కొచ్చిన దగ్గరనుండీ ఈ నీళ్ళు పడక నా భార్యకు సుస్తీ చేసింది ఆ విషయం కూడా చెప్పా వీడు, 'డ్వాక్టరు దగ్గరకు పంపించు, నేను ప్రత్యేకంగా వైద్యం చేయిస్తా' నన్నాడు గాని ట్రాన్స్‌ఫర్‌కి ఒప్పుకోలేదు చేసేదేంలేక యిక్కడే చస్తున్నా'' అని, ప్రకాశంతో, ''ఏమిటి , రాత్రి డ్యూటీ ఆరెస్పికి ఎదురు తిరిగావంట ఏ ఆర్ అంతా గోలగా వుంది'' అన్నాడు

ఆ మాటకు ప్రకాశం నవ్వాడు ''అది సరేలేకాని ఈ వంట ఎక్కడ నేర్చుకున్నావు?'' అన్నాడు ఆనందరావు కూడా నవ్వాడు

''మా నాన్న నా చిన్నప్పుడే చచ్చిపోయాడు మా వూళ్ళో ఒక క్రైస్తవ స్వాములోరు దగ్గర మా అమ్మ వంట చేసేది ఆమెకి వంట్లో బాగాలేనప్పుడల్లా నేనే వండి పెట్టేవాడిని అట్లా అలవాటయ్యింది ఆ స్వాములోరు చాలా మంచి వ్యక్తి'' అన్నాడు

''బావుంది అదిలావుపయోగపడు తోందన్నమాట సరే, నాకేమన్నా లోకల్‌కు పోయే అవకాశం వుందంటావా?'' అడిగాడు

''చెప్పలేము ఈడు రాక్షసుడంటే నమ్మ మనం లోకల్‌లో నుండి దీనిలోకి వచ్చామంటే మనకి పనిష్మెంటు ఇప్పిన [illegible] ఎట్టు ఆ పనిష్మెంటుని అనుభవించాల్సిందే నంటాడు వీడు'' అన్నాడు

చిన్నగా నిట్టూర్చాడు ప్రకాశం ''ఈ తెల్లోళ్ళు మనదేశం నుండి వెళ్ళిపోతేనే గాని మన కష్టాలు గట్టెక్కవు'' అన్నాడు అనాలోచితంగా

''అవునవును'' అన్నాడు ఆనందరావు తలూపుతూ కొద్దిసేపు మౌనంగా వున్నారిద్దరూ ''మనలాగా లోకల్‌లో నుండి దీనిలోకి వచ్చిన వాళ్ళు మొత్తం పదకొండు మంది వున్నారు ఈళ్ళంతా ఏదో ఒక విధంగా మళ్ళీ లోకల్‌లోకి వెళ్ళాలని చూస్తున్న వాళ్ళే కాని ఎన్ని రెక్వెస్టులు చేసుకున్నా వీడు ఒప్పుకోవటం లేదు వాడెవడో అందరి కన్నా పెద్దోడు వుంటాడు కదా మద్రాసులోనో ఎక్కడో ఆడికి కూడా కాగితాలు పెట్టారు కానీ లాభం లేకపోయింది'' అన్నాడు ఆనందరావు

కొద్దిసేపు మౌనంగా వుండి అన్నాడు ప్రకాశం

''ఈ విషయంలో మనం ఏదో ఒకటి చెయ్యాలి మనమంతా కలిసి ఒక రోజు మాట్లాడుకోవాలి''

''మాట్లాడుకోటాని క్కూడా ఎక్కడ వీలయిద్ది మూడొందల యాభై పైచిలుకు రిజర్ పీసీలున్నారనే కానీ ఎవడేమూల వుంటాడో ఎవడికీ అర్థం కాదు ఆ మాబులేషన్[19] డ్యూటీలో ఒక్కదానిలో మాత్రమే అందరం కలవటానికి వీలుంటుంది అప్పటిదాకా ఒకడు బందోబస్తులో జిల్లాలో ఎక్కడో ఆ మూల వుంటాడు ఒకడు ఈ మూల వుంటాడు ఒకడు గార్డు ఒకడు ఆర్డర్లీ ఒకడు ఎస్కార్టు ఒకడు ఇంకెక్కడో వుంటాడు ఒకడు సిక్కులో వుంటాడు ఇలా తలా ఒక దిక్కున వుండటం వలన అందరం కలవటం పడదు'' అన్నాడు ఆనందరావు

''ఎట్లాగో మరి ప్రయత్నం చెయ్యాలి కదా దీనిలో వుండటానికి ఎవ్వరూ ఇష్టపడరు కదా!'' అన్నాడు ప్రకాశం

''ఇష్టం అంటే ఆ మాటకొస్తే ఎవ్వరూ ఇష్టపడరు లోకల్‌లో నుండి దీనిలోకి వచ్చిన వాళ్ళకు ఇందులో ఉండటం కష్టం ఇందులో నుండి లోకల్‌లోకి పోయినోడు హాయిగా ఉంటాడు కాకపోతే మొదటి నుండీ దీనిలోనే వున్నవాడు ఏడుస్తూ ఎట్లాగో రోజులు దొర్లిస్తుంటాడు'' అన్నాడు ఆనందరావు

చాలాసేపు వాళ్ళు ఆ విషయం గురించి మాట్లాడుకున్నారు ఆనందరావు వెళ్ళిపోతూ ప్రకాశాన్ని హెచ్చరించాడు ''రాత్రిళ్ళు సెంట్రీ డ్యూటీలో జాగ్రత్త వీడు చెకింగుకి వస్తుంటాడు ముండాకొడుక్కి రాత్రిళ్ళు నిద్రపట్టదు ''

తరువాత కొద్దిసేపటికి సెంట్రీ పుస్తకంలో సంతకం పెట్టి వెళ్ళి బంగళాముందు వున్న వేపచెట్టు కింద నిలబడ్డాడు తుపాకి పట్టుకొని ప్రకాశం మిగిలినవాళ్ళు రెస్ట్ తీసుకోవటానికి బంగళావెనకవున్న చిన్నగుడ్డ టెంట్ దగ్గరకు వెళ్ళారు

వెయిటింగ్ పీసీలంతా అక్కడే ఆ టెంట్‌లో నేలమీద చాపపరచుకొని పడుకోవాల్సిందే బంగళా వెనుక భాగంలో విపరీతంగా ముళ్ళపొదలు పెరిగివున్నయ్ వాటిని ఎవరూ పట్టించుకోలేదు బంగళా ప్రక్కనున్న కరెంటు స్తంభపువెలుగు టెంట్ లోపలికి పడుతుంటుంది రాత్రిళ్ళు అంతకు మించి గార్డు పీసీలకి లైటు లేదు

ఆనందరావుతో జరిపిన సంభాషణ గుర్తు చేసుకుంటూ నిలబడ్డాడు ప్రకాశం ఒకటిన్నర దాటింది పారా దిగి మూడు గంటలకు ఇంటి కెళ్ళి భోజనం చెయ్యాలి 'భోజనానికి ఒక వేళంటూ లేదుకదా' అనుకున్నాడు 'ఏదన్నా కోర్టుకు ఎస్కార్టు పోవాలంటే ఉదయం పదిగంటలకల్లా భోంచేయాలి గార్డు డ్యూటీలోవుంటే మూడు గంటలు దాటింతరవాత ఎక్కడన్నా బందోబస్తుల్లో వుంటే సాయంత్రం ఏ నాలుగు గంటలకో భోజనం ఒకోసారి వరుసగా రెండు మూడు పూటలు తిండి లేని సందర్భాలు ఎన్నో భోజనానికి ఒక టైమంటూ లేనందువలన ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిని పోతోంది అడుక్కుతినే భిక్షగాళ్ళు నయం వేళకు తింటారు ఆ దొరికిందేదో ఎప్పటి కీ నరకంలో నుండి బయటపడగలుగుతానో కాని ' అనుకున్నాడు మూడెప్పుడయిద్దా అనుకుంటూ పేగులు పీక్కుంటూ నిలబడ్డాడు మూడయ్యేసరికి కళ్ళు తిరిగి పడిపోతానేమో అనిపించింది అతనికి

పారా దిగి, టెంట్‌లోకి వెళ్ళి, పట్టీలూ బూట్లు విప్పి పక్కన పెట్టాడు ఎప్పుడూ వుండే గార్డుకోసం గట్టి గది కట్టకపోయినా, కనీసం రేకుల షెడ్డన్నా వేయకుండా ఇట్లా గుడ్డ టెంట్ ఎందుకుంచారో ఆలోచించాడు

'ఈ ఒక్క అంశం చాలు కానిస్టేబులుకి డిపార్టుమెంటు ఇచ్చే గుర్తింపు ఏపాటిదో అర్థం చేసుకోవటానికి అయినా అవస్థ పడేవాడు తన సమస్యను అధికారుల దృష్టికి తీసుకుపోవాలి ముందు ధైర్యంగా అప్పుడెందుకు పనికాదు ?' అనుకున్నాడు టెంట్‌వైపు చూశాడు ఆలోచిస్తూనే ఆ టెంట్ ఎండకు ఎండి వానకు తడిచి చివికిపోయి అవసాన దశలో వుంది గట్టిగా వానపడితే లోపల వుండటానికి వీలులేదు గార్డు ఆఫీసరుకు చెప్పాడు భోజనానికి వెళుతున్నానని

తారు రోడ్డుమీద కాళ్ళు అంటుకు పోతున్నాయి కళ్ళు తిరుగుతున్నాయి ఆకలితో ఇంటికొచ్చి గబగబా కాళ్ళు కడుక్కొని అన్నం తినేసరికి నాలుగయ్యింది కొద్దిసేపు మంచంమీద అడ్డం పడ్డాడు ఒక గంటసేపు పడుకొని లేచి గబగబా స్నానం చేశాడు రాత్రి భోజనానికి రావటానికి వీలుకాదు కాబట్టి జర్మన్ సిల్వర్ టిఫిన్‌లో అన్నం పెట్టింది ప్రకాశం భార్య పడుకోవటానికి ఒక

కంబడీ, దుప్పటి, దిండు తీసుకుని కాకి షర్టుకూడా బెడ్డింగులో పెట్టుకొని మఫ్టీ షర్టు వేసుకొని బయలుదేరాడు

రాత్రి ఏడుగంటల ప్రాంతంలో చెంబుతో నీళ్ళు తెచ్చుకొని టెంట్‌లో కూర్చుని అన్నం తిని పడుకున్నాడు దోమలు కుట్టి చంపుతున్నయ్ దుప్పటి కప్పుకుంటే చెమటతో వళ్ళంతా తడిచిపోతోంది ఎటునుండి కూడా గాలి వచ్చే అవకాశం లేదు ఎప్పటికో మగత నిద్రపోయాడు రాత్రి పన్నెండు గంటలకు గార్డు ఆఫీసరు లేపాడు గబగబా లేచి యూనిఫారం వేసుకొని సెంట్రీ పుస్తకంలో సంతకం పెట్టి, తుపాకీ తీసుకుని వెళ్ళి చెట్టుకింద నిలబడ్డాడు

ఆకాశంలో చందమామ వెలుగుతున్నాడు కుక్కల్ని కట్టెయ్యకుండా వదిలిపెట్టారు అవి బంగళా చుట్టూ తిరుగుతున్నయ్ వాటిని చూస్తేనే భయమేస్తోంది ఒక కుక్క ప్రకాశం దగ్గరకొచ్చి ఎదురుగా నిలబడి గుర్రుమంది దగ్గరగా వచ్చి వాసన చూచింది కరుస్తుందేమోనని హడలిపోయాడు ఎందుకైనా మంచిదన్నట్టు తుపాకీ మడమతో పొడవబోయాడు అది తోక ముడుచుకొని పరిగెట్టింది అతనికి నవ్వొచ్చింది 'చూడటానికంత భయంకరంగా వుంది తీరా కొట్టబోతే తోక ముడిచింది ఈ సృష్టిలోని విచిత్రమే అంత ఎదురు తిరిగితే ఏమీవుండదు' అనుకున్నాడు చెట్లు గాలికి తలలూపుతున్నయ్ దూరంగా కరెంటు తీగమీద గుడ్లగూబ కూర్చుని అరుస్తోంది మిగిలిన పక్షుల కంటే దాని కూత విరుద్ధంగా వుంది మసక వెన్నెల్లో సైతం దాని ఆకారం స్పష్టంగా కనిపించింది 'భగవంతుడు దీని నెందుకు ఇట్లా సృష్టించాడో పాపం ఆకారం చూస్తే అసహ్యమేస్తుంది చాలామందికి అన్నిటిలాగా పగటిపూట తిరగలేదు ఒంటరి బ్రతుకు అందరికీ ఇదంటే అసహ్యమే, మనుషుల్లో పోలీసుల్లాగా' అనుకున్నాడు రాత్రి జరిగిన సంఘటన గుర్తొచ్చింది దానితో పాటు గతించిన జీవితంలోని సంఘటనలు వరుసగా గుర్తొచ్చాయి అన్నిటిలోకి ఒక విషయం స్పష్టంగా అతనికి అవగాహన అయ్యింది 'తమకు జరుగుతున్న, ఆమాట కొస్తే అన్యాయానికి గురవుతున్న ప్రతివాడూకూడా, తన నట్లా అన్యాయానికి గురిచేసే వాడిమీద తిరగబడితే తప్ప అయ్యా, బాబూ అనటం వలన ప్రయోజనం లేదు ఆ తిరుగుబాటు రీజన్‌గా, చట్టబద్ధంగా సాగాలి' అనుకున్నాడు

ఎస్పీ, సెంట్రీని చెక్ చెయ్యటానికి క్రిందికి వస్తాడేమోనని అప్రమత్తంగా వున్నాడు ప్రకాశం బంగళాలోని గోడ గడియారం రెండు గంటలు కొట్టింది 'ఇంకా గంటసేపుండాలి' అనుకున్నాడు ఆలోచనలు అతని ప్రమేయం లేకుండానే సాగిపోతున్నాయి కుక్కలు రెండూ పోయి వరండాలో వాటిని రోజూ కట్టేసేచోట పడుకున్నాయి నిముషాలు భారంగా జరుగుతున్నయ్ కనురెప్పలు భారంగా వాలుతున్నయ్ నిద్ర ముంచుకు వస్తోంది తీగెమీది గుడ్లగూబ రెక్కలు టపటపా కొట్టుకుంటూ ఎగిరిపోయింది వేగంగా కళ్ళు చికిలించి చూశాడు గట్టిగా ఆవలించాడు కాలం కదలనట్టు తోచింది

''అమ్మో! బాబోయ్!''

ఆ నిశ్శబ్ద వాతావరణాన్ని చీల్చుకుంటూ ఆ కేక వినపడింది ఉలిక్కిపడ్డాడు మత్తు వదిలిపోయింది కేకలు ఎటునుండి వచ్చాయో తెలియలేదు చేతిలోని తుపాకి గట్టిగా పట్టుకొని, 'ఆన్‌గార్డు పొజిషన్' కు వచ్చాడు చెవులు రిక్కించాడు 'పోచ్' లోంచి, రౌండు (తుపాకీ తూటా) తియ్యాలనే ఆలోచన చటుక్కున కలిగింది మళ్ళీ కేకలు వినపడ్డయ్

''సార్ సార్ అమ్మో పాము '' అంటున్నారు ఎవరో బంగళా వెనకనుండి ఆ మాటలు

వినపడ్డయ్ ఒక నిముషంలో అంతా గోల గోల గా అరుచుకుంటూ బయటకొచ్చారు టెంట్‌లో నుండి గార్డు వెయిటింగ్ పీసీ ఒకతను, కాలు పట్టుకొని కుంటుకుంటూ వచ్చాడు అతని వెనక మిగిలిన వాళ్ళు వచ్చారు వాళ్ళని చూసేసరికి విషయం అర్థమయిపోయింది వాళ్ళ దగ్గరకు వెళ్ళాలనుకున్నాడు ప్రకాశం ఇంతలో బంగళాపైన లైట్లు వెలిగాయి ఆర్డర్లీలంతా లేచారు కుక్కలు గోలగోలగా అరవటం మొదలుపెట్టాయి ప్రకాశం అక్కడే నిలబడిపోయాడు అంతా గోలగోలగా వుంది

''ఏమి! ఏమి?'' అంటున్నాడు యస్పీ పైనుండి

''సార్! పాము కరిచింది సార్'' అన్నాడు గార్డు ఆఫీసరు పైకి చూస్తూ ఆ మాట విని, యస్పీ ఏం మాట్లాడకుండా లోపలకు వెళ్ళాడు అంతా గుంపయ్యారు పాము కరిచినతను కింద కూలబడిపోయాడు తలా ఒకమాట గోలగా అంటున్నారు ఆఫీసు తలుపు తీసుకొని యస్పీ భార్య చకచకా క్రిందకు వచ్చింది అంతా నిశ్శబ్దంగా వుండి, పక్కకు తప్పుకున్నారు పాము కరిచిన అతను, ఆమెని చూచి లేవబోయాడు 'కూర్చో' మన్నట్లు సైగచేసింది ఆమె అతని కాలు పట్టుకొని పాము కరచినచోటు చూసింది ఆమె వస్తూ వెంట తెచ్చిన దూదితోరక్తాన్ని తుడిచింది గాట్లు పడ్డచోట, బ్లేడుతో కోసి చిన్న గాయం చేసింది రక్తం ఎక్కువగా కారింది గాయానికి పైభాగంలో గాజు గుడ్డతో కట్టు కట్టింది కొంచెం సేపట్లో రక్తం ఆగిపోయింది సీసాలోంచి ఏదో మందు, దూది మీదకు వంచి, గాయం దగ్గరపెట్టి కట్టుకట్టింది

''ఎట్టలాగుంది ?'' అంది వచ్చీరాని తెలుగులో

''ఇప్పటిదాకా బాగానే వుందమ్మా'' అన్నాడు అతను

ఆమె లేచి గార్డు ఆఫీసరు వైపు తిరిగి, ''ఆషుపట్రికి టీసుకు ఫో'' అంది ఆ మాటకు అతను తల వూపాడు అంతా సెల్యూట్స్ చేశారు ఆమె లోపలికెళ్ళి పోయింది తరువాత కొద్దిసేపటికి బంగళాపైన లైట్లు ఆరిపోయాయి అతన్ని ఆసుపత్రికి తీసుకువెళ్ళారు కొంతమంది

''అదేం చెయ్యదులేండి బాగా నెత్తురొచ్చింది కదా ! కాబట్టి ప్రమాదం ఏమీ లేదు ఆసుపత్రికి కూడా అక్కరలేదు పొలాల్లో పడుకునేటప్పుడు ఇట్టాంటియ్యి ఎన్నిసార్లు కరిసినాయో'' అన్నాడుప్రకాశం మిగతావాళ్ళతో

''అదేలే కాని ఆసుపత్రికి తీసుకు పొమ్మన్నారుగా అమ్మగారు మనమిప్పుడు తీసుకుపోకపోతే, ఏమన్నా అయితే ఆమెకి కోపం వస్తది తీసుకుపొమ్మన్నప్పుడు తీసుకుపోవాలిగా'' అన్నాడు గార్డు ఆఫీసరు తరువాత వాళ్ళు వెళ్ళిపోయారు పడుకోవటానికి

ఆసుపత్రికి వెళ్ళినవాళ్ళు తిరిగి వచ్చేసరికి నాలుగయ్యింది ''నాకు తెలిసినంతవరకు ఈ గార్డులో ఇట్టా పాము కరిసిన వాళ్ళల్లో ఇతను నాలుగవవాడు ఇద్దరు చచ్చిపోయారు'' అన్నాడు పారా ఎక్కే పీసీ

''మన బతుకులు ఎప్పుడు ఎట్టా తెల్లారిపోతయ్యో తెలియదు అడుగడుగునా ప్రమాదా లేనాయె'' అన్నాడు గార్డు ఆఫీసరు

తెల తెల వారుతుండగా నిద్ర పట్టింది ఉదయం ఏడుగంటలదాకా మెలుకువ రాలేదు లేచి ఆ ముళ్ళ పొదల్లోంచి, ఒక ఈతమట్ట విరిచి పళ్ళు తోముకున్నాడు బూట్లు వేసుకుని వెయిటింగ్‌లో వున్నాడు కళ్ళు మండుతున్నయ్ కడుపు కాలుతోంది ఈ గార్డు ఎప్పుడయ్యి పోయిద్దా అని అనుకుంటూ, ఆలోచిస్తూ చాలాసేపు ఉండిపోయాడు ఆ డ్యూటీ చాలా

కష్టమనిపించింది

ఒక రోజు గార్డు ఆఫీసరుతో నవ్వుతూ అన్నాడు ''ఇంకా రెండు వారాలు బాధపడాలి సార్ ఈ గార్డు డ్యూటీతో''

ఆ మాట విని, అతను ప్రకాశంవైపు అదోరకంగా చూశాడు ''తరువాత మనకేమన్నా సుఖమయిన డ్యూటీలు వున్నయ్యంటావా ? ఈ గార్డుగానీ, ఆఫీసు గార్డుగానీ, ట్రెజరీగార్డుగానీ, ఆసుపత్రి గార్డుగానీ, ఇంకో డ్యూటీగానీ, ఎందులోనన్నా సుఖం వుందంటావా?'' అన్నాడు

నిజమేనన్నట్లు తలవూపాడు ప్రకాశం

రోజులు ఎప్పటిలాగానే నిర్జీవంగా దొర్లిపోతున్నాయి అక్కడున్న నాలుగు వారాలూ అక్కడ ఆర్డర్లీలు చేసే పనుల్ని నిశితంగా పరిశీలించాడు ఆర్డర్లీ ఉద్యోగమంటే మొత్తంమీద దౌర్భాగ్యపు నౌకరీ అని తెలుసు అయినా ఏమేం పనులు ఈ బంగళాలో ఎవరెవరు చేస్తున్నారో గమనించాడు

ఆ సాయంత్రం పూట యస్పీ 'దొర'గారి పిల్లలు బంతి ఆట ఆడుతున్నారు వాళ్ళకి బంతి అందివ్వటానికి అటు ఒకళ్ళు, ఇటు ఒకళ్ళు ఆర్డర్లీలు నిలబడి వున్నారు బంతి కోర్టు దాటిపోయినప్పుడల్లా దానికోసం ఆర్డర్లీ పరిగెత్తాలి ఏ ఆర్డర్లీ కూడా కాళ్ళకు చెప్పులు వేసుకోకూడదు బంతికోసం చిన్నగా ముళ్ళు చూసుకుంటూ నడవటానికి వీలులేదు బంతి తేవటం ఆలశ్యమయితే 'దొర'గారి పిల్లలకు కోపమొస్తుంది 'దొర'కు కోపమొచ్చినా తట్టుకోవచ్చు నేమోగాని, 'దొర'గారి పిల్లలకు కోపమొస్తే తట్టుకోవటం కష్టమయిన పని ఒక ఆర్డర్లీ కుక్కలకు సబ్బుతో నీళ్ళు పోస్తున్నాడు సువాసన వచ్చే ఆ సబ్బువాసన చాలా దూరం వేస్తోంది ఇద్దరు ఆర్డర్లీలు బావిలోంచి నీళ్ళు తోడి, చెట్లకు పోస్తున్నారు ఒకతను దొడ్లో బట్టలుతుకున్నాడు ఒకతను కోళ్ళనుకోసి బొచ్చు పీకి, శుభ్రం చేస్తున్నాడు ఒక ఆర్డర్లీ పాకీదొడ్డి సుభ్రం చేసొచ్చి చేతులు కడుక్కుని, కోళ్ళఫారంలోని గుడ్లు బుట్టలోకి ఏరుతున్నాడు ఫోను బల్లదగ్గర ఒకతను నిలబడి వున్నాడు ఆనందరావు వంట ప్రయత్నంలో వున్నాడు ఒకతను లోపల బల్లలు, కుర్చీలు, గోడలతో సహా గుడ్డతో తుడుస్తున్నాడు సుబ్బరంగా 'దొర'గారి, 'దొరసాని', వాళ్ళ పిల్లల బూట్లు అన్నీ ఒకతను పాలీష్‌చేస్తున్నాడు డ్రైవర్ కారు తుడుచుకుంటున్నాడు అర్జెంటు తపాలు తీసుకెళ్ళే ఆర్డర్లీ చెట్టుకింద నిలబడి వున్నాడు చేతులు కట్టుకొని బంతి ఆట చూస్తూ దూరంగా చావిట్లో వున్న గేదెల్ని కడిగి కుడితి పెడుతున్నాడు ఒక ఆర్డర్లీ వరండా పైన, ఆఫీసంతా వూడ్చే ఆర్డర్లీ చీపుర్లు బాగుచేసుకుంటున్నాడు ఒకతను బజారుకెళ్ళి కూరగాయలు తెస్తున్నాడు ఒకతను ఏవో ఆకుల్ని, కాయల్ని చిన్న చిన్న ముక్కలుగా తరిగి, బావి దగ్గర అటూ ఇటూ తిరుగుతున్న పెద్దపెద్ద చైనా బాతులకు తినిపిస్తున్నాడు వాటికి కొంచెం దూరంలో పావురాళ్ళు గింజలు ఏరుకుతింటున్నాయి పైన 'దొర'గారూ, ఆయన భార్య కూర్చుని టీ తాగుతూ, కబుర్లు చెప్పుకుంటున్నారు వాళ్ళకు కొంచెం దూరంలో గ్రామఫోను పాడుతోంది వాళ్ళు చెప్పిన పని వెంటనే చేసిపెట్టటానికి నాలుగయిదు గజాల దూరంలో ఒక ఆర్డర్లీ అటెన్షన్‌లో నిలబడి వున్నాడు 'దొరసాని' వొళ్ళో పిల్లొకటి కళ్ళు మూసుకుని పడుకుని వుంది మత్తుగా చెట్లమీద పక్షులు గోలగోలగా అరుస్తూ వున్నయ్ దొరగారి పిల్లల్ని బడికి తీసుకువెళ్ళే ఆర్డర్లీ గార్డు ఆఫీసరుతో మాట్లాడుతూ బీడీ తాగుతున్నాడు బంగళా వెనక సూర్యుడు పడమటకు వాలిపోతున్నాడు 'దొర'గారి చేతిలోని పైపులోంచి సన్నని పొగ సుడులు తిరుగుతూ వచ్చి గాలిలో అదృశ్యమై పోతోంది సాయంకాలపు నీరెండలో 'దొరసాని' రంగు వేసిన పెదాల వెనక పళ్ళు నవ్వినప్పుడల్లా

తళుక్కున మెరుస్తున్నయ్ ఉండి ఉండి వీచే గాలికి ఆఫీసు ముందు ఏపుగా పెరిగిన అందమైన క్రోటన్‌మొక్కలు భారంగా తలలూపుతున్నయ్ బంగళాకు దూరంగా వున్న స్పెషల్ బ్రాంచివాళ్ళ ఆఫీసు లోంచి ఏవో మాటలు అస్పష్టంగా వినపడుతున్నయ్ 'దొరసాని' వైపు రెండు క్షణాలపాటు చూచి తల తిప్పుకున్నాడు ప్రకాశం తను అటూ ఇటూ చూస్తున్నట్టు వాళ్ళెవరు గమనించినా తన నౌకరీ పోతుందనే వాస్తవం అతనికి బాగా తెలుసు 'దొరసాని' రాగిరంగు తల వెంట్రుకలు ప్రకాశాన్ని తడవతడవకు అటే చూసేలా చేస్తున్నాయి కొద్దిసేపటి తరువాత దీర్ఘంగా నిట్టూర్చాడు 'భోగమంటే ఇదే' అనుకున్నాడు

ఆలోచనలు మళ్ళీ తన జీవితం వైపు మళ్ళాయి రోజురోజుకూ ఈ ఉద్యోగం దుర్భరమై పోతోంది అనుక్షణం స్వేచ్ఛా స్వాతంత్ర్యం గురించి ఆలోచనలు పెరుగుతున్నయ్ 'ఈ దేశానికి స్వాతంత్ర్యం వస్తేకాని తమకు స్వాతంత్రం రాదు' అనుకున్నాడు అతనికి నాగేశ్వర్రావు గుర్తొచ్చాడు ఇప్పుడేం చేస్తుంటాడో వూహించాడు 'ఏముంటుంది ఏదో ఒక పుస్తకం చదువుతూ కూర్చుంటాడు 'దొర' బంగళాలో కూడా చాలా పుస్తకాలుంటాయనుకుంటా అవన్నీ ఇంగ్లీషు పుస్తకాలై వుంటాయి' అనుకున్నాడు ఇంతలో ఫోను గణగణ మోగింది ఫోను ఆర్డర్లీ రిసీవరు అందుకున్నాడు ''అయ్యా! యస్పీ 'దొర' వారి బంగళా నుండి ఫోను ఆర్డర్లీని మాట్లాడుతున్నాను సార్, తమరెవరయ్యా'' అన్నాడు వినయంగా అవతల నుండి ఏం వినిపించిందో వెంటనే అటెన్షన్ పొజిషన్‌లోకి వచ్చి, ''అయ్యా నమస్కారమయ్యా'' అన్నాడు కుడిచేత్తో సెల్యూట్ చేస్తూ

ఆ చర్యకు ప్రకాశం నవ్వుకున్నాడు మనిషి ఎదురుగా లేకపోయినా ఫోనులో నమస్కారం చెపుతూ, చేతిని పైకిలేపి సెల్యూట్ చేయటం చూస్తే తవు నరనరాల్లో భయం ఎంతగా పేరుకుపోయిందో అర్థమయ్యింది

తరువాత అతను ఫోను పెట్టేశాడు పైకి వెళ్ళి యస్పీకి చెప్పి వచ్చాడు

ఆ రోజు రాత్రి ఆనందరావు ఇంటికెళుతూ ప్రకాశం దగ్గర కొచ్చాడు కొద్దిసేపు మాట్లాడుకున్నారు ''అయితే, ప్రకాశం! తెల్లోళ్ళు మనదేశం నుండి వెళ్ళిపోతే, మనకి స్వాతంత్ర్యం వచ్చినాక మన బ్రతుకులేమన్నా బాగుపడతాయంటావా?'' అన్నాడు ఆనందరావు అతని మాటల్లో ఆశ కనపడింది

''ఇంత దరిద్రంగా ఉండకపోవచ్చు అప్పుడు అంతా మనవాళ్ళే ఆఫీసర్లుగా వస్తారుగా ఎట్టాగయినా తేడా వుంటుంది'' అన్నాడు ప్రకాశం

''ఇప్పుడు మనమీద రిపోర్టులు రాసి మనకీ గతి పట్టించిన యస్పై లంతా మనోళ్ళేగా'' అన్నాడు ఆనందరావు.

''అవుననుకో పై ఆఫీసర్లు మనవాళ్ళే గనకయితే మన బాగోగులు చెప్పుకోటానికి వీలయిద్ది కదా'' అన్నాడు ప్రకాశం

''అక్కడెక్కడో రైళ్ళు తగలబెట్టారంట గాంధీగారు సత్యాగ్రహాలు చేస్తున్నాడంట ఆయన చేసేవాటివలన మనకేమీ ఇబ్బంది లేదుగాని, చాలాచోట్ల బస్సుల్ని, షాపుల్ని తగలబెడుతున్నారంట రైళ్ళని నడవనివ్వటం లేదంట ఉద్యోగస్తుల్ని వాళ్ళవాళ్ళ ఆఫీసులకి పోనివ్వటం లేదంట ఇప్పుడిప్పుడే మనకికూడా ఆ తాకిడి ఎక్కువవుతోంది ఇది ఇంకా బాగా సాగాలని నా ఉద్దేశ్యం ఈళ్ళు మనదేశం నుండి ఎంత తొందరగా పోతే అంత బాగుంటుందని నా వుద్దేశం'' అన్నాడు.

''సరే అది ఎట్టాగూ జరిగిద్ది కానీ, మనం మిగిలిన మన లోకల్ నుండి వచ్చిన పీసీల్ని

కూడా కలిసి, అందరితో పిటీషన్లు పెట్టించాలి నేను రాస్తాను'' అన్నాడు ప్రకాశం

''అందరం కలవాలంటే మాబులేషన్‌లోనే వీలయిద్ది వచ్చే నెలలోనే మాబులేషన్ అప్పుడందరం కలుస్తాము'' అన్నాడు ఆనందరావు కొద్దిసేపు మాట్లాడి అతను వెళ్ళిపోయాడు ప్రకాశం అదే విషయం ఆలోచించాడు

'ఈ గార్డు డ్యూటీ అయ్యేసరికి మాబులేషన్ వస్తుంది' అనుకున్నాడు కాని కొద్దిరోజులు గడిచేసరికి ఆ సంవత్సరం మాబులేషన్ ఉండదని తేలిపోయింది కారణం దేశంలో అంతా హడావిడిగా వుంది

చూస్తుండగానే జిల్లాలో చాలాచోట్ల బంద్‌లూ, గల్లంతులూ, కొట్లాటలూ మొదలయ్యాయి పోలీసులకు ఊపిరి పీల్చుకునే వ్యవధి కూడా దొరకటం లేదు మాబులేషన్ లేకపోతే అందరూ కలిసి పిటీషన్ పెట్టే అవకాశము వుండదు కాని అనుకోకుండా ప్రతి సంవత్సరంలాగానే ఈయేడు కూడా మాబులేషన్ రెండు వారాలపాటు మామూలుగానే జరిగింది జరగదనుకున్న మాబులేషన్ జరగటం ప్రకాశంకు ఆనందం కలిగించింది లోకల్ నుండి పనిష్మెంటు మీద రిజర్వ్ కొచ్చిన పదకొండు మందికీ పిటీషన్లు రాసిచ్చాడు ప్రకాశం అందరూ వాటిమీద సంతకాలూ, వేలిముద్రలూ వేశారు ఒక కాపీ జిల్లా యస్పీకి, ఒక కాపీ మద్రాసులో వుండే ఐ జి పి కి పంపించారు మాబులేషన్ పదిహేను రోజులూ కంటి మీద నిద్ర లేదు బూట్లూ, బెల్టులు పాలీష్ చెయ్యటం, క్రాపులు, గడ్డాలు చేయించుకోవటం, యూనిఫారం వుతుక్కుని ఇస్త్రీ చేయించుకోవటం, డ్రిల్లుకు అటెండ్ కావటం, ఏ ఆర్ పార్టీ అంతా ఆయుధాలతో టౌన్ అంతా మార్చింగ్ చేయటం ఇలా వీటితో వూపిరి ఆడటం లేదు ఎవ్వరికి కూడా కాని ఎలాగో వీలు చూసుకుని పిటీషన్లు మాత్రం రాసిచ్చాడు ఈ మాబులేషన్ పూర్తయితే తిరిగి అందరూ కలిసే అవకాశం లేదు ఇప్పుడే ఏదో ఒకటి చెయ్యకపోతే ఇక సర్వీసంతా దీనిలోనే గడపాలి లేదా ఈ నౌకరీ మానుకొని ఇంటికి పోవాలి ఎట్లాగయితేనేమి పిటీషన్లు పెట్టారు

మాబులేషన్ అయిపోయిన మరుసటిరోజు ఎవరెక్కడున్నారో కూడా అర్థం కాలేదు మళ్ళీ పిటీషన్లకు ఏమని రిప్లై వస్తుందో అని ఎదురు చూస్తూ రోజులు గడుపుతున్నారు

స్వాతంత్రం కోసం దేశంలో ముమ్మరంగా ఆందోళనలు సాగుతున్నయ్ వున్న డ్యూటీలకు పోలీసులు సరిపోవటం లేదు కొత్త డ్యూటీలు వేస్తున్నారు రైలుబళ్ళకు ఎస్కార్టు, రైల్వేస్టేషన్లో గార్డులు, కలెక్టరు బంగళాకు, మిగిలిన పోలీసాఫీసర్ల బంగళాలకు, ముఖ్యంగా తెల్ల ఆఫీసర్ల బంగళాలకు గార్డులు, ఎస్కార్టులు వేస్తున్నారు దేశమంతా స్వాతంత్ర్య కాంక్షతో వూగిపోతోంది ఆ పరిస్థితులు ప్రకాశానికి ఆనందాన్ని కలిగిస్తున్నాయి ప్రకాశంలాగా చాలామంది ఎదురు చూస్తున్నారు ఆ స్వాతంత్ర్యం వస్తే, తమ బతుకులేమన్నా బాగుపడతాయేమో నన్నది వాళ్ళ అంతరంగాల్లో వున్న కోరిక సామాన్యప్రజల కందరకూ తెల్లవాళ్ళు ఈ దేశం నుండి పోవాలనే కాంక్ష బలీయంగా వున్నట్లు తోచింది ప్రకాశంకు గాంధీ నాయకులు చెప్పే ఉపన్యాసాల్లో ఈ దేశ ప్రజలందరి దారిద్రానికి కారణం తెల్లవాళ్ళ పరిపాలన అని చెపుతున్నారు ఇంకా కొంతమంది యువకులు చెప్పే మాటలు సరిగా అర్థం కావటం లేదు వాళ్ళంతా 'సామ్రాజ్యవాదం నశించాలి' అంటారు 'పెట్టుబడిదారీ విధానం, భూస్వామ్య విధానం నశించాలి' అంటారు ఈ మాటలు చాలామందికి అర్థమయ్యేవి కావు పైగా సామాన్య ప్రజలు ప్రత్యక్షంగా కనపడుతున్న తెల్లవాళ్ళని తమ శత్రువులుగా భావించి వాళ్ళని దేశం నుండి వెళ్ళగొట్టాలనే నిశ్చయంతో వున్నారు అదే

సమయంలో తాము జరుపుతున్న పోరాటాలకు అవరోధంగా నిలబడే పోలీసులు కూడా ప్రజల దృష్టిలో సహజంగానే శత్రువులుగా మారారు అప్పటివరకు పోలీసులంటే ఉండే భయం, గౌరవం క్రమంగా క్షీణిస్తున్నట్టు గమనించాడు ప్రకాశం ఆ మార్పు కొట్టొచ్చినట్టు కనపడుతోంది దారిన వెళుతుంటే ప్రజలు పోలీసుల్ని చేసే విమర్శలు స్పష్టంగా వినపడుతున్నయ్ రోజులు గడిచేకొలదీ ప్రజల్లో పోలీసులంటే గౌరవం పోయి, భయం మాత్రం మిగులుతున్నట్టు గమనించాడు ప్రకాశం భారత ప్రజల శత్రువులయిన తెల్లవాళ్ళ చంక నాకుతూ బతికేవాళ్ళుగా ప్రజల్లో పోలీసులమీద ముద్ర పడిపోయింది చాలామంది ఇతర డిపార్టుమెంటులవాళ్ళు తమ తమ ఉద్యోగాలకు రాజీనామాలు చేస్తున్నారని అనుకుంటున్నారు కాని పోలీసుల్లో, అందులోనూ క్రిందిస్థాయి ఉద్యోగులు ఎవ్వడూ రాజీనామా చేసినట్లు వినలేదు అతను ఇంతవరకూ

రోజురోజుకూ పరిస్థితి భయంకరంగా మారుతోంది రైళ్ళ రాకపోకలు స్తంభించాయి కొన్నిరోజులు స్వాతంత్ర్య పోరాటం ఉధృతమవుతోంది ఎక్కడో పోలీసులు కూడా ప్రదర్శన జరుపుతున్న వారికి సపోర్టు చేస్తూ, తమ పై అధికారుల ఉత్తర్వులను ఖాతరు చేయలేదనే వార్త వచ్చింది ఆ వార్త ఎంతో వుత్తేజాన్ని కలిగించింది చాలామందికి ఆ వార్త తెలిసిన తరువాత ఆఫీసర్ల ప్రవర్తనలో కొద్దిపాటి మార్పు కొట్టొచ్చినట్టు కనపడింది డ్యూటీల్లో మార్పేమీలేదు కాని, ఆఫీసర్లు ఇంతకు ముందులాగా కఠినంగా ప్రవర్తించటం లేదు ఆ కొద్ది మార్పే పోలీసుల్లో చాలామందికి ఎంతో వూరట కలిగించింది

తాము పెట్టుకున్న పిటీషన్లు ఏమయ్యాయో, అతీగతీ లేదు సంవత్సరం తిరిగి వచ్చింది ఈ సంవత్సర కాలంలో ఎన్నో మార్పులు జరిగిపోయాయి ఏ ఆర్ నంతా హెడ్క్వార్టర్సులోనే ఉంచుతున్నారు ఖయిదీలకు ఎస్కార్టు డ్యూటీలూ, విలేజి బందోబస్తులు చాలావరకు తీసేశారు చాలామంది ఆర్డర్లీలను కూడా కంపెనీడ్యూటీలు చెయ్యటానికి పంపివేశారు కొన్ని ప్లటూన్‌లను జిల్లాలోని ముఖ్యమయిన తాలూకా హెడ్క్వార్టర్లకు పంపారు

మద్రాసు నుండి స్పెషల్ పోలీసు ఒక బెటాలియన్ వచ్చింది జిల్లా హెడ్క్వార్టరుకు నాలుగు రోజులలోనే స్పెషల్ పోలీసుల డ్యూటీలు ఎలాటివో అర్థమయిపోయింది ప్రకాశంకు వాళ్ళు ఇల్లు వదిలి ఇప్పటికి రెండు సంవత్సరాలు అయిందని చెప్పారు పామ్మన్నచోటుకి వేనెక్కి పోవటం, జనాన్ని కాల్చమంటే కాల్చటం, కొట్టమంటే కొట్టటం మినహా వాళ్ళకింక వేరే డ్యూటీలు లేవట ఎక్కడ క్యాంపు పెడితే అక్కడ వండుకొని తినటం గవర్నమెంటు యూనిఫారం రాత్రీ, పగలూ విడిచే పని లేదు క్యాంపు దగ్గర్లో వున్న చెరువుకో, వాగుకో పోవటం స్నానం చెయ్యటం, గుడ్డ లుతుక్కోవటం వచ్చి ఇంత తిని యూనిఫారం వేసుకొని నిలబడటం జీతం రాగానే పెళ్ళానికో, తల్లిదండ్రులకో కొంత పంపటం, తమకు కొంచెం ఉంచుకోవటం ఇంతకుమించి వేరే ప్రపంచం తెలియదు వాళ్ళకు

''పెళ్ళాం, పిల్లల్ని వదిలిపెట్టి ఇట్లా సంవత్సరాల తరబడి తిరుగుతుంటే బాధగా వుండదా?'' అన్నాడు ప్రకాశం ఒకరోజు ఆమాట అతనికే ఎబ్బెట్టుగా తోచింది

''ఆహాఁ హాయిగా వుంటది'' అన్నాడు ఒక స్పెషల్ పోలీసు యకసెక్కెంగా తిరిగి అతనే మరలా అన్నాడు ''ఏం చేస్తాం పెళ్ళాం బిడ్డల కోసం, పేనం నిలబెట్టుకోవటం కోసం ఈ నౌకరీ సేత్తున్నాం ఈ భూపెపంచకంలో మా అంత కష్టం, ఎవరూ పడతల్లేదు ఇదిగో సూత్తన్నావుగా ఈ తుపాకులికీ, మాకు తేడా ఏమన్నా కనపడుతోందా ? అయ్యి తుప్పు

పట్టకుండా, ఆయిలు పెట్టి వుంచుతున్నారు మేం సావకుండా ఇంత కూడేత్తున్నారు ఏమీ తేడా లేదు అది చెడిపోతే గవర్నమెంటుకి ఎంత లెఖ్ఖ లేదో, మేము పోయినా అంతే'' అన్నాడు అతను అతని మాటల్లో ఎవరిపైనో తెలియని కసీ, తమపట్ల తమకి సానుభూతి కనిపించింది

''మీరే కాదు మనమంతా అంతే, కాకపోతే ప్రభుత్వం వుప్పు తింటున్నాము కాబట్టి ఆళ్ళు చెప్పినట్లు ఇంటున్నాము'' అన్నాడు ప్రకాశం

''అంతే అంతే'' అన్నాడు అతను

రోజులు గడుస్తున్నాయి దీనిలోనుండి లోకల్‌లోకి వెళ్ళే ఆశ ఏమీ కనపడలేదు 'ఈ సంవత్సరం మాబులేషన్ కూడా వుండదు ఈ అడావిడి వల్ల' అనుకున్నాడు ప్రకాశం

అనుకోకుండా ఒకరోజు జిల్లాలో వేరువేరుచోట్ల ముఖ్యమైన బందోబస్తుల్లో వున్న ఏ ఆర్ పార్టీని తెల్లారేసరికి జిల్లా పోలీసు ఆఫీసుకు రప్పించారు ఎందుకో విషయం ఎవరికీ అర్థం కాలేదు 'మద్రాసు నుండి ఐ జి పీ దొరగారు వస్తున్నారంట ఏదో చెపుతారంట ఉదయం ఎనిమిది గంటలకల్లా ఎట్లాగున్నవాళ్ళు అట్లా పేరేడ్ గ్రౌండుకు హాజరు కావాల'న్నారు బూట్లు, యూనిఫారం నీటుగా లేకపోయినా ఫరవాలేదన్నారు ఇలాటి ఆర్డర్ గందరగోళంగా, కొత్తగా ఉంది ప్రకాశానికి అంత పెద్ద ఆఫీసరు వస్తుంటే నీట్ టర్నవుట్ లేకుండా ఎందుకు రమ్మంటున్నారో అర్థంకాలేదు అతనికొక ఆలోచన వచ్చింది

అంతా గ్రౌండుకు వెళ్ళారు లోకల్ నుండి రిజర్వ్‌కు వచ్చిన అందరినీ కూడగట్టి, తాము పదకొండు మందీ విడిగా ఫాలెన్ అవుదామన్నాడు ప్రకాశం ఆ విషయం మీద చాలాసేపు తర్జన భర్జన జరిగింది అలా విడిగా ఫాలెన్ అయితే డిస్‌మిస్ చేస్తారేమోననే భయం వెల్లడించారు మిగిలిన వాళ్ళు ప్రకాశం వాళ్ళకు ధైర్యం చెప్పాడు ''మీ అందరి తరపున నేను మాట్లాడతాను మన సమస్యను 'దొర'గారి దృష్టికి తేవటానికే ఇట్లా ప్రత్యేకంగా ఫాలెన్ అయ్యామని చెపుదాం ఇది ఏమీ ఇన్ డిసిప్లైన్‌కాదు అంత తేలికగా ఉద్యోగాలు పోవు మనం ఏ ప్రయత్నం చెయ్యకుండా మనకేమీ ఒరగలేదన్నా, జరగలేదన్నా లాభం లేదు దీనివల్ల మనకు ఏమీ నష్టం కలగదు'' అన్నాడు వాళ్ళనలా ఒప్పించేసరికి అతనికి తాతలు కనపడ్డారు వాళ్ళమీద తీవ్రమైన కోపం కూడా కలిగింది ప్రకాశం మాటల్ని ఆనందరావు బలపరిచాడు ఇప్పుడు వాళ్ళు పడుతున్న శ్రమల్ని గుర్తుచేసి, ఎత్తిచూపితేనే వాళ్ళల్లో కొద్దిగా చలనం కనపడి ఒప్పుకున్నారు చివరకు ఈ పదకొండుమంది సెపరేట్‌గా నిలబడ్డారు గ్రౌండులో ఆరై వచ్చి వాళ్ళమీద విరుచుకుపడ్డాడు అందరితో కలిసి నిలబడమన్నాడు ప్రకాశం ఒప్పుకోలేదు అతనిలాగే చాలామంది ఒప్పుకోలేదు కొంతమంది అటూ ఇటూ కాకుండా మాట్లాడారు ఆరై కోపంగా వెళ్ళిపోయాడు అనుకున్న టైముకి ఐ జి పి వచ్చాడు మెన్‌ని అందరినీ పరికించి చూశాడు వీళ్ళిలా వేరుగా నిలబడటానికి కారణం ఏమిటని అడిగాడు యస్పీని ఇంగ్లీషులో యస్పీ ఆరై వైపు చూశాడు

''సార్, వీళ్ళని లోకల్ నుండి రిజర్వ్‌కు వేశారు దాన్ని గురించి 'దొర'గారికి విన్నవించుకోవటానికి, ఇలా సెపరేట్‌గా నిలబడ్డారు నేను అందరిలో కలిసి నిలబడమని చెప్పా నా మాట వినకుండా ఇట్లా నిలబడ్డారు సార్'' అన్నాడు అతని మాటల్లో తన తప్పు ఏమీ లేదన్నట్లు చెప్పాడు యస్పీ వాళ్ళ వైపు తీక్షణంగా చూశాడు ఐ జి పి కి ఏదో చెప్పాడు ఐ జి పి ఏదో చెప్పాడు యస్పీకి యస్పీ, ఆరైకి ఏదో చెప్పాడు ఆరై వీళ్ళవైపు తిరిగి, ''పెద్ద దొరగారు మిమ్మల్ని, లోకల్‌లోకి వెయ్యమన్నారు మీరు వెళ్ళి అందరిలో కలిసి నిలబడండి'' అన్నాడు

వూహించని ఆ మాటకు అందరూ ఆశ్చర్యపోయారు 'నిజమా! కలా' అన్నట్టు చూశారు వాళ్ళు కామాటలు నమ్మదగ్గట్టు లేవు అయినా చేసేదేమీ లేక వెళ్ళి మిగిలిన వాళ్ళతో కలిసి నిలబడ్డారు ఎవరి ఆలోచనలలో వాళ్ళున్నారు అంతా ఫాలెన్ అయినప్పుడు మాట్లాడకూడదు కాబట్టి నిశ్శబ్దంగా వుండిపోయారు

ఐ జి పీ మైకులో మాట్లాడటం ప్రారంభించాడు ఇంగ్లీషులో అతని మాటల్ని తెలుగులోకి అనువదించి చెపుతున్నాడు ఆర్టై మొదట్లో మాట్లాడిన మాటలు ఎవ్వరికీ సరిగా అర్థం కాలేదు తరువాత తరువాత కొద్దిగా అర్థమయ్యాయి 'మీరుపడుతున్న కష్టాన్ని ప్రభుత్వం గుర్తించింది అందుకని మీకందరికీ తలా ఒక యింక్రిమెంటు చొప్పున ఇస్తున్నారు మీకింకా ఎన్నో సౌకర్యాలు కల్పించటానికి పెద్ద దొరగారు ప్రయత్నిస్తున్నారు ఇప్పుడు దేశం చాలా క్లిష్ట పరిస్థితుల్లో వుంది మీరు క్రమశిక్షణతో మెలగాలి ఇంతకాలం ఏ ప్రభుత్వపు వుప్పు తిన్నారో, ఆ ప్రభుత్వానికి విధేయులై వుండాలి మీకు ఎక్కువగా ప్రమోషన్లు యివ్వటానికి రూల్సు మారుస్తామని దొరగారు హామీ ఇస్తున్నారు మీ కుటుంబాలకు మంచి సదుపాయాలు చెయ్యాలని ప్రభుత్వం ఆలోచిస్తోంది ' ఇలా సాగింది ఆ వుపన్యాసం

ఉపన్యాస మవగానే ఎవరెవరు ఏఏ డ్యూటీల్లో నుండి వచ్చారో, వాళ్ళని తిరిగి ఆయా డ్యూటీలకు వెళ్ళిపొమ్మన్నారు ప్రకాశంతోపాటు మిగిలిన వాళ్ళు అంతా ఆర్టై అన్నమాటల్ని గురించి ఆలోచించారు 'అది నిజమా? వట్టిదా?' అని ఆలోచించారు ఎటూ తేల్చుకోలేక పోయారు మధ్యాహ్నానికల్లా ఎటువాళ్ళటు వెళ్ళిపోయారు

ప్రకాశం ఇంటికొచ్చి భోంచేసి మంచంమీద చేరబడ్డాడు ఐ జీ పీ అన్నదాన్ని గురించి ఆలోచించాడు ఆ మాటలమీద అతనికేమీ నమ్మకం కలగలేదు ఎంతో బాధ వేసింది ఇంకా ఎంతకాలం ఇందులో వుండాలి ? బయటపడే మార్గం కనిపించటం లేదు 'ఇందులో ఇకపైన రోజులు నెట్టుకురావటం కష్టం పోనీ ఏదన్నా ఆర్డర్లీగా ప్రయత్నిస్తే ? లాభం లేదు దొర బంగళాకు ఆర్డర్లీలుగా పోవాలంటే ఆర్టైకి లంచం ఇవ్వాలి ఎవురెక్కువిస్తే వాళ్ళనే ఆర్డర్లీగా పంపిస్తాడు కనీసం ఒక రోజు శెలవు కావాలంటే ఆర్టైని కాకాపట్టాలి ఆరెస్సైని కాఫీకి తీసుకు పోవాలి సెలవు పాస్‌పోర్టు తీసుకుని బయట కొచ్చేసరికి తలప్రాణం తోక కొస్తుంది దరిద్రమంతా ఈ డిపార్టుమెంటులోనే వుంది' అనుకున్నాడు ఏం చేయాలో పాలుపోవటం లేదు పిచ్చి పిచ్చి ఆలోచనలు వస్తున్నాయి నిద్రపోవటానికి గట్టిగా కళ్ళు మూసుకున్నాడు 'ఎట్లా జరిగేది అట్లా జరిగిద్ది ఇక దాన్ని గురించి ఆలోచించకూడదు' అనుకున్నాడు

కాని వూహించని విధంగా నాలుగోరోజు కల్లా అతన్ని లోకల్‌కు వేసినట్టు కాగితం వచ్చింది అతనిని వేసిన స్టేషను కూడా జిల్లా హెడ్‌క్వార్టరులోనే సంతోషంతో అతని హృదయం నిండిపోయింది జిల్లా పోలీసు ఆఫీసుకు వెళ్ళి విచారిస్తే పదకొండుమందినీ లోకల్‌కు వేసినట్లు తెలిసింది ఆనందరావు ప్రకాశాన్ని కౌగలించుకున్నాడు చాలామంది అతన్ని మెచ్చుకున్నారు వెంటనే ఏ ఆర్ నుండి పాస్‌పోర్టు తీసుకుని పోలీసు స్టేషనుకు వెళ్ళి డ్యూటీకి రిపోర్టు చేశాడు

లోకల్‌కు వేసిన సంతోషం త్వరలోనే కరిగిపోయింది ప్రకాశంకు అతని డ్యూటీల్లో మార్పేమీ లేదు

వందేమాతరం నినాదం మారుమ్రోగుతోంది దేశంలో పోలీసుల బ్రతుకు మరీ అధ్వాన్న మయిపోతోంది కంటి మీద కునుకులేదు కడుపుకి తిండిలేదు ఆ డ్యూటీల ముందు

గవర్నమెంటు ఇచ్చిన ఇంక్రిమెంటు తాలూకు సంతోషంగాని, లోకల్‌కు వచ్చిన ఆనందంగానీ నిలబడలేదు బందోబస్తులు, బందోబస్తులు పగలూ రేయి బందోబస్తులే బందోబస్తులతో చచ్చే రోజొచ్చింది

జైళ్ళన్నీ జనంతో నిండిపోతున్నాయి లారీలు విరిగిపోతున్నాయి ఎంతమంది చచ్చిపోతున్నారో, ఎవరికి కాళ్ళూ చేతులూ విరుగుతున్నాయో తెలియదు పోలీసులంతా ఈ బందోబస్తులలోనే వున్నారు వేరే ఇక డ్యూటీలు లేవు స్టేషన్లలో ఒక్క గార్డు డ్యూటీ మినహా నైటుబీట్లు, కోర్టు డ్యూటీలు, ఎస్కార్టు డ్యూటీలు అన్నీ ఆపేశారు ప్రజల్ని కొట్టి కొట్టి పోలీసులకు చేతులు నొప్పిపుడుతున్నయ్

గాంధీ అహింసా పద్ధతిలో స్వాతంత్ర సమరంలో పాల్గొనమని పిలుపు ఇస్తున్నాడు. కాని ఎవరూ ఆయన అహింసా విధానాన్ని ఖాతరు చేస్తున్నట్లు కనపడటం లేదు ప్రకాశంకు ప్రజలంతా పోలీసుల్తో ముఖాముఖి తలపడుతున్నారు ఎంతోమంది పోలీసులకు దెబ్బలు తగిలినట్లు, చాలామంది చనిపోయినట్లు వార్తలు వస్తున్నాయి కొంతమంది పోలీసులు అంగవికలురైపోయారు వాళ్ళందరినీ సర్వీసుల్లో నుండి తీసేశారు వాళ్ళకు ఎటువంటి సహాయం చెయ్యటం లేదు ప్రభుత్వం ఈ హడావిడి తగ్గిన తరువాత వాళ్ళ విషయం చూస్తామన్నారు అధికారులు

తెల్లవాడు కనపడితే జనం రెచ్చిపోతున్నారు వాళ్ళ బంగళాల మీదకు రాళ్ళు రువ్వుతున్నారు టెలిఫోను తీగల్ని తెంపేస్తున్నారు కార్లకు నిప్పు పెడుతున్నారు రైళ్ళు, బస్సులు తిరగటం లేదు మంచీచెడూ విచక్షణా జ్ఞానం కోల్పోయిన వాళ్ళలాగా ఆసుపత్రుల్ని కూడా ధ్వంసం చేస్తున్నారు పట్టణమంతా శ్మశానంలా మారిపోయింది పోలీసులు ఇళ్ళకు భోజనాలకు పోయిరావటం చాలా ఇబ్బందిగా, ప్రమాదంగా వుంది ఎవరు, ఎక్కడ, ఏంచేస్తారో అనే భయంతో స్టేషన్ని వదిలిపెట్టి పోవటం లేదు పగలు రాత్రిళ్ళు అంతా సద్దుమణిగాక తెల్లబట్టలు వేసుకొని ఇండ్లకు వెళ్ళి వస్తున్నారు

కొంతమంది పోలీసులు ఉద్యోగాలు వదిలిపెట్టిపోయారు ప్రకాశం కూడా వెళ్ళిపోవాలను కున్నాడు కాని అతని ఆశ అంతా బ్రిటీష్‌వాళ్ళు ఎలాగూ ఈ దేశం నుంచి వెళ్ళిపోతారు తరువాత పరిస్థితులు బాగుంటాయని అయినా వదిలివెళితే చేసే పనేంటి ? ఎలా బ్రతకాలి ?

భవిష్యత్తులో పరిస్థితులు బాగుంటాయనే ఆశతో, పళ్ళ బిగువున ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని రోజులు దొర్లించాడు రోజూ ఇంటికెళ్ళినప్పుడు భార్యతో తల్లితో మరీ మరీ చెప్పేవాడు 'ఎవరైనా ప్రజలు గుంపులుగా పోలీసు లైను వైపు వచ్చి గొడవచేస్తే, మీరు ఇంటికి తాళం వేసి, దొడ్డిదారి గుండా వూళ్ళోకి పోండి' అని కాని అలాటి సంఘటనలు జరగలేదు

ఇంటి నుండి స్టేషనుకొచ్చి తిరిగి ఇంటికెళ్ళిందాకా నమ్మకం వుండేది కాదు చాలామంది పోలీసుల కన్నా అతని పరిస్థితి ఎంతో నయం ఎక్కడో తాలూకా హెడ్‌క్వార్టర్సులో బందోబస్తులు చేస్తున్న వాళ్ళ సంగతులు ఇంటి దగ్గరున్న భార్యా పిల్లలకు తెలియటం లేదు రోజులూ వారాలూ నెలలు గడుస్తున్నాయి ఇళ్ళ దగ్గరున్న ఆడవాళ్ళు తమ తమ భర్తల దగ్గరకు పోవటానికి బస్సులు లేవు చేతిలో డబ్బుల్లేవు అష్టకష్టాలకు లోనయ్యారు

---

అందరూ కోరుకుంటున్నట్లు ఆరోజు రానే వచ్చింది భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని ఇచ్చినట్లు ప్రకటించారు ప్రజలంతా ఆనందోత్సాహాలతో గంతులేశారు అప్పటి వరకూ భయంకరంగా వున్న వాతావరణం ఒక్కసారిగా సంతోషంగా మారిపోయింది పౌరజీవనం కొద్దిరోజుల్లో

తిరిగి మామూలయి పోయింది బస్సులు, రైళ్ళు తిరుగుతున్నయ్ ఉద్యోగస్తులంతా ఆఫీసులకి వెళుతున్నారు దేశమంతా ఆనందోత్సాహాలతో మునిగి వున్నా పోలీసులకు మాత్రం వూపిరాడని పని స్వాతంత్రం వచ్చిన సందర్భంలో ఎక్కడ చూచినా వూరేగింపులూ, వుపన్యాసాలూ ప్రకాశానికి ఎంతో ఆనందంగా వుంది ఎంతోకాలం నుండి ఎదురుచూస్తున్న విధంగా తెల్లవాళ్ళు ఈ దేశం నుండి వెళ్ళిపోయారు

అన్ని కష్టాలకు కారకులయిన వాళ్ళు పోయారు ఇక బతుకులు బాగుపడతాయి ఈ దేశాన్ని ఈ దేశ ప్రజలే పరిపాలించుకుంటారు భవిష్యత్తు ఆశాజనకంగా వుంటుంది ఇక తాము చేసే నౌకరీలో ఇంతకు ముందులాగా ఇరవైనాలుగు గంటల డ్యూటీ వుండదు రెస్ట్ దొరికిద్ది జీతాలు పెరుగుతాయి బ్రతుకులో సంతోషం వెల్లివిరుస్తుంది ఇలా అందరి లాగానే ప్రకాశం కూడా వూహించాడు అదే ఆశతో వున్నాడు గోపాలం, నాగేశ్వరరావూ, గురవయ్యా, వెంటేశం గుర్తొచ్చారు 'అందరూ తనలాగే ఎంతో సంతోషంగా వుండి వుంటారు' అనుకున్నాడు

అయినా, ఇప్పుడు కూడా పోలీసులకు మాత్రం క్షణం తీరిక దొరకటం లేదు వుపన్యాసాలు జరుగుతున్న చోట్లకు, వూరేగింపులకు బందోబస్తులు కావలసి వస్తున్నాయి శాంతి భద్రతలను కాపాడే సందర్భంలో పోలీసు డిపార్టుమెంటుకి చేతినిండా పని రోజులు గడుస్తున్నాయి అలాగే తెల్లటోపీల వాళ్ళ వుపన్యాసాలూ, వూరేగింపులూ క్రమంగా తగ్గిపోతున్నాయి

మళ్ళీ మామూలు డ్యూటీల్లో మునిగిపోయింది పోలీసు డిపార్టుమెంటు గార్డులు, ఎస్కార్టులు, బందోబస్తులు, కోర్టులు, నైటు బీట్లు ఈ డ్యూటీలతో మామూలయి పోయింది దేశానికి స్వాతంత్రం వచ్చింది తమ బ్రతుకులు బాగుపడతాయనే ఆశతో ప్రజలు ఎదురుచూస్తున్నారు జైళ్ళన్నీ ఇంచుమించు ఖాళీ అయిపోయాయి కాని పోలీసుల్ని సభలు, సమావేశాలకు బందోబస్తులకు పంపుతున్నారు అధికారులు 'ఇంకా ఇప్పుడు ఎవరిని అరెస్టు చెయ్యటానికి ఈ బందోబస్తులు?' అనుకుంటున్నాడు ప్రకాశం

కాని బందోబస్తు డ్యూటీలకు వెళుతున్న అతనికి ఒక విషయం అర్థమయ్యింది ఉపన్యాస వేదికల వద్దా, వూరేగింపులలోనూ గాంధీ టోపీ నాయకులు ముందు వరుసల్లో వుండి, ఉపన్యాసాలిస్తున్నారు కొందరు యువకులు ఆ వుపన్యాసాలను భంగపరుస్తూ గొడవలు చేస్తున్నారు తెల్లటోపీ నాయకులు చెప్పిన ఉపన్యాసాలను ఖండిస్తున్నారు యువకులు ప్రత్యేకంగా సభలూ, వూరేగింపులూ జరుపుతున్నారు వాళ్ళ చేతుల్లో యర్ర జెండాలు వున్నయ్ వాళ్ళు రకరకాల పాటలు పాడుతున్నారు బుర్రకథలు చెపుతున్నారు నినాదాలు ఇస్తున్నారు

'దున్నేవానిదే భూమి' అనే నినాదం వాటిల్లో ఒకటి వాళ్ళు వూరేగింపుగా నడుస్తూ పాటలు పాడుతున్నారు రకరకాల నినాదాలు రాసిన అట్టలు పట్టుకొని నడిచేవారు 'ప్రపంచ కార్మికులారా ఏకం కండి' అనే ఒకే ఒక నినాదం ముఖ్యమైంది వాళ్ళు వాళ్ళ ఉపన్యాసాల్లో, 'ఇది నిజమైన స్వాతంత్రం కాదు అధికారం తెల్లవాడి చేతిలో నుండి నల్లవాడి చేతిలోకి మారింది అంతే తప్ప నిజంగా ఈ దేశానికి స్వాతంత్రం రాలేదు మానవుల దారిద్ర్యానికి కారణమైన దోపిడీ వ్యవస్థ పదిలంగా అలాగే వుంది' అని చెప్పేవారు వాళ్ళ నినాదాలు వింటుంటే ఆనందమేసేది 'కమ్యూనిస్టు పార్టీ వర్థిల్లాలి, ఎర్రజెండా వర్థిల్లాలి' అని వాళ్ళు చేసే నినాదాలు మిన్నుముట్టేవి అవి ప్రకాశాన్ని బాగా ఆకర్షించాయి రోజులు గడుస్తున్న కొద్దీ, వాళ్ళమాటలు కొద్దికొద్దిగా అర్థమవుతున్నాయి 'ఎవరైతే పొలంలో కష్టపడి, పంట పండిస్తారో, ఆ పంట, ఆ కష్టపడ్డ వ్యక్తికే

చెందాలని' వాళ్ళు చెప్పేమాటలు ఎంతో నచ్చాయి వాళ్ళమీద ఎంతో అభిమానం వుప్పొంగేది తెల్లటోపీల వాళ్ళ వుపన్యాసాల్లో ఆ మాటలు మచ్చుకు కూడా వినపడేవి కావు

రోజులు గడుస్తున్నయ్ కానీ ఉద్యోగాల్లో ఏమీ మార్పు కనపడటంలేదు జవహర్‌లాల్‌నెహ్రూ ప్రధానమంత్రి అవుతాడని అందరూ అనుకున్నారు రేడియోల్లో వచ్చే వార్తల్ని గుంపులుకూడి వింటున్నారు గాంధీ, నెహ్రూలు రేడియోల్లో మాట్లాడతారని అనుకున్నారు

జవహర్‌లాల్‌నెహ్రూ దేశప్రజల్ని వుద్దేశించి రేడియోలో ప్రసంగించాడట కొత్త ప్రభుత్వం చేయబోయే పనుల్ని గురించి ప్రజలు చర్చించుకుంటున్నారు రోజులూ, వారాలూ, నెలలూ గడుస్తున్నయ్ ప్రకాశానికి ఎక్కడా ఏమీ ప్రత్యేకమైన మార్పు కనిపించటం లేదు

ఇంట్లో తల్లి ఆరోగ్యం నిలకడగా వుంటోంది పిల్లవాడు ఆరోగ్యంగానే పెరుగుతున్నాడు భార్యకు నెల తప్పింది డబ్బుకు చాలా ఇబ్బందిగా వుంది ఉద్యోగంలో క్షణం విశ్రాంతి దొరకటం లేదు బందోబస్తులతో సరిపోతోంది గాంధీ టోపీ వాళ్ళ మీటింగులు క్రమంగా క్షీణించిపోతున్నాయి కమ్యూనిస్టుల మీటింగులు చెదురుమదురుగా జరుగుతున్నయ్ పోలీసు ఉద్యోగాల్లో వీసమెత్తు మార్పురాలేదు అదే గానుగెద్దు నిస్సారపు బ్రతుకులు

ఆ రోజు ప్రకాశం స్టేషనుకొచ్చేసరికి అంతా ఏవో చర్చించుకుంటున్నారు ఆ విషయం అతనికి అర్థం కాలేదు రాత్రి నుండీ వళ్ళు వెచ్చబడినట్లు వుంది బాగా నీరసంగా, కళ్ళు మండుతున్నయ్ ఆ చర్చ గురించి తెలుసుకోవాలనే ఆదుర్దా వుంది కాని ఓపికలేదు 'జ్వరమొచ్చినట్లుంది' అనుకున్నాడు వెళ్ళి పక్కపరుచుకొని పడుకున్నాడు మిగతావాళ్ళు మాట్లాడుకునే విషయాలు చెవిన పడుతున్నయ్

''తెలంగాణాలో నైజాం నవాబు పరిపాలన ఇంకా వుంది వాడు భారతదేశంలో కలిసిపోవటానికి ఇష్టపడటం లేదంట తమది ప్రత్యేకమైన దేశంగాప్రకటించుకున్నాడు అన్ని దేశాలకూ వున్నట్లే వాడిదగ్గర సెపరేటుగా మిలటరీ, పోలీసులు వున్నారంట వాడి దేశంలో రజాకార్లు అనే బందిపోట్లు కూడా వున్నారంట ఆ రజాకార్లు వూళ్ళమీద పడి ప్రజల్ని దోచుకుపోవటమే వృత్తిగా జీవిస్తుంటారట వాళ్ళనేమీ చెయ్యడంట నైజాం నవాబు మన జిల్లా నుండి కూడా ఒక పోలీసు అక్కడకు దొంగతనంగా పారిపోయాడంట వాళ్ళల్లో కలవటానికి పోయేవాడు పోక, స్టేషన్లోని తుపాకులూ, తూటాలూ తీసుకొని పోయాడంట ఏం చేస్తాడు మరి పాపం ఈ నౌకరీతో విసిగిపోయి వుంటాడు అక్కడికి పోయి ఆ ప్రజలనోళ్ళు కొట్టి, రజాకార్లల్లో కలిసిపోయి కాస్త సుఖంగా బతకొచ్చని అనుకుని వుంటాడు'' అన్నాడు హెచ్ సీ ఒకతను

ఆ మాటలు వింటుంటే ప్రకాశానికి ఆసక్తిగా వుంది కాని అతనికి తెలియకుండానే మగత ఆవహించి నిద్ర పట్టింది కొద్దిసేపటి తరువాత ఎవరో లేపుతుంటే భారంగా కళ్ళు తెరిచి చూశాడు కళ్ళు మండుతున్నయ్ తల పగిలిపోతోంది వొళ్ళంతా నొప్పులు

''ఏమిటయ్యా పొద్దున్నే నిద్దర లే యస్సైగారొచ్చారు ఏం వంట్లో బాగాలేదా?'' అంటున్నాడు తోటి కానిస్టేబులు

''జొరమొచ్చింది'' అన్నాడు ప్రకాశం ఆ మాట విని చేయిపట్టుకొని చూశాడు అతను

'అబ్బా, కాలిపోతోందిగా ఆసుపత్రికి పోకపోయావా?'' అన్నాడు అతను ప్రకాశం ఏం మాట్లాడలేదు భారంగా లేచాడు తూలు వచ్చింది ఎట్లాగో నిలదొక్కుకున్నాడు చిన్నగా యస్సై

దగ్గరకెళ్ళి సెల్యూట్ చేసి నిలబడ్డాడు ఏమిటన్నట్లు చూశాడు యస్సై

''బాగా జొరమొచ్చింది సార్'' అన్నాడు ప్రకాశం

''అయితే సిక్కవ్వు'' అన్నాడు యస్సై సెల్యూట్ చేసి రైటరు దగ్గరకెళ్ళి రిక్విజిషన్ రాసియిచ్చాడు రైటరు సిక్కు పాస్‌పోర్టు ఇచ్చాడు చిన్నగా నడిచి గవర్నమెంటు ఆసుపత్రికి వెళ్ళాడు డాక్టరు చూచాడు పరీక్షలు చేశాడు

''ఇది టైఫాయిడ్ జ్వరం ఆసుపత్రిలో అడ్మిట్ అవ్వు'' అన్నాడు ఆ మాట విన్న ప్రకాశంకు భయమేసింది చిన్నగా తలూపాడు

''వెళ్ళి, నా భార్యకు చెప్పి, యూనిఫారం తీసేసి వస్తా సార్'' అన్నాడు డాక్టరు అలాగే అన్నాడు ప్రకాశం వెళ్ళి విషయం చెప్పాడు భార్యకు ఆమె కంగారు పడింది ధైర్యం చెప్పాడు ఆసుపత్రిలో అడ్మిట్ అయ్యాడు

నెలరోజుల తరువాత తను చచ్చిపోనని నిర్ణయించుకున్నాడు అంతకుముందు రెండు రోజులక్రితమే జ్వరం తగ్గింది ఈరోజు కాస్త ఎంగిలి చేశాడు తననితాను ఓసారి పరిశీలనగా చూసుకున్నాడు ఆకారంలో ఎంతో మార్పు వచ్చింది నిజంగా చచ్చిపోయిన మనిషి బ్రతికివస్తే ఎలాగుంటాడో అలాగున్నాడు అతను శరీరమంతా సుష్కించిపోయింది బుగ్గలు పీక్కుపోయి దవడలు బైటపడ్డాయి తలవెంట్రుకలు చాలావరకు వూడిపోయాయి రక్తంలేక వళ్ళంతా పాలిపోయింది ఆపూట పిల్ల వాడిని దగ్గర కూర్చోబెట్టుకున్నాడు ఆ నెలరోజులూ రాత్రిళ్ళు తల్లి తోడుపడుకుంది ఆసుపత్రిలో నాలుగురోజులకు కొంచెం ఓపిక వచ్చింది ఓపికతో పాటు ఆలోచనలు చుట్టుముట్టాయి 'ఒకవేళ నేను చచ్చిపోయినట్లయితే?' అనుకున్నాడు పిల్ల వాడిని గురించి ఆలోచిస్తూ 'ఏమయ్యేది ? ఏముంటుంది ? ఏమయ్యేదో ? చచ్చాక ఏం తెలిసిద్ది?' అనుకున్నాడు కాని ఆ ఆలోచన అతనికి భయాన్ని కలిగించింది 'ఇంకా ఈలోకంలో నాకు నూకలున్నయ్ డాక్టరుగారు దేవుడు' అనుకున్నాడు

ఇంకారెండు రోజులకు డిచ్చార్జి చేస్తారనగా ఆరోజు సాయంత్రం చిన్నగా నడుస్తూ స్టేషనుకెళ్ళాడు ఆ నెలరోజుల్లో స్టేషన్లో జరిగిన ముఖ్య సంఘటన అతనికి ఆశ్చర్యం కలిగించింది స్టేషన్లో అప్పుడు రైటరొక్కడే వున్నాడు నమస్కారం చేశాడు ''ఆ నమస్కారం ఎలా వుందోయ్'' అన్నాడు రైటరు

''చచ్చి బతికాను సార్ నా పెళ్ళాం పిల్లలు అదృష్టవంతులు సార్ డాక్టరుగారు నాపాలిట దేవుడు సార్'' అన్నాడు ప్రకాశం

''ఏదేమైనా నీవు అదృష్టవంతుడివి మన మెన్‌ని కొంతమందిని నైజాం పంపారు తెలుసా? అక్కడ నైజాం మిలటరీతో యుద్ధానికి'' అన్నాడు రైటరు

ప్రకాశం ఆశ్చర్యంగా చూశాడు అర్థంకానట్టు చూశాడు అతని భావాన్ని అర్థం చేసుకున్నట్టు రైటరు అన్నాడు

''అదెన్ని రోజులుంటుందో, ఎంతమంది ప్రాణాలతో తిరిగొస్తారో! అందుకే మన పెద్దలంటారు, ఏం జరిగినా మనమంచికే అని నీకీ జ్వొరం రాకపోతే నిన్నూ అక్కడికి తరిమేవారేగా?'' అన్నాడు

ప్రకాశం ఏం మాట్లాడలేదు కొద్దిసేపు కూర్చుని ఆసుపత్రికి తిరిగొచ్చాడు రెండురోజుల తరువాత డాక్టరు డిశ్చార్జి చేశాడు చేస్తూ కొన్నిమందులు రాసిచ్చాడు అవి వాడుతూ ఓ

రెండువారాల పాటు రెస్ట్ రాశాడు

రెండు డజన్ల చక్రకేళీలు, ఒక డజను బత్తాయిలు కొని తీసుకువెళ్ళి డాక్టరుకిచ్చాడు అవి తీసుకోవటానికి డాక్టరు ఒప్పుకోలేదు బలవంతంగా ఇచ్చి, నర్సులకు, కాంపౌండర్లకు చెప్పి, తలావక రూపాయి ఇచ్చి, దండంపెట్టి ఇంటికొచ్చాడు

నాలుగు రోజులు గడిచాయి కాస్త బాగానే హుషారు వచ్చింది ఆలోచనలు మామూలుగానే ముసురుతున్నయ్ స్వాతంత్రమొచ్చి అప్పటికి సంవత్సరం దాటింది అంతటా స్వతంత్ర్య దినోత్సవ వేడుకలు చేసుకున్నారు స్వతంత్ర్యం వచ్చిందాకా ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూశారు ప్రజలంతా స్వాతంత్ర్య మొచ్చింది కానీ బీదప్రజల బ్రతుకుల్లో మార్పేమీ కనపడలేదు స్వాతంత్ర్యం కోసం ప్రాణాల్ని బలిపెట్టారు ఎన్నో త్యాగాలు చేశారు ఎంతో ఆశతో ఎదురుచూశారు కాని స్వాతంత్ర్యం వచ్చినందువలన బీద ప్రజలకు కలిగిన ఉపయోగం ఏమిటో ప్రకాశానికి అర్థం కాలేదు

పెద్దపెద్ద పదవుల్లో వున్న తెల్లదొరల స్థానాల్లోకి నల్లవాళ్ళు వస్తున్నారు యస్పీలు, డి యస్పీలు అంతా నల్లవాళ్ళు వచ్చారు క్రింది స్థాయిల్లో వున్న హెచ్ సీ ల, పీ సీల మీద ఆఫీసర్లు జరుపుతున్న అన్యాయాల్లో మార్పేమీ కనపడలేదు ప్రకాశానికి రెస్ట్ లేదు చాకిరీ ఇంకా పెరిగింది స్వాతంత్ర్య మొచ్చిందనే సంతోషం చప్పగా చల్లారిపోయింది

డ్యూటీకి వెళ్ళటానికి ఇంకో నాలుగు రోజులు టైముంది వేళకు భోజనం చేస్తూ, మందులు వాడుతూ, రెస్ట్ తీసుకోవటం వలన త్వరగానే స్వస్థత చేకూరింది అతనికి ఆ రోజు సాయంత్రం ఓ దారుణమైన వార్త తెలిసింది ఆ స్టేషన్ నుండి నైజాం వెళ్ళిన వాళ్లల్లో ఒక కానిస్టేబులు ఎదురుకాల్పుల్లో చనిపోయాడని తెలిసింది అతని మృతదేహాన్ని ఇక్కడకు పంపిస్తున్నారని తెలిసింది ఆ వార్త విని ప్రకాశం గుండె గుబగుబలాడింది తల్లికీ, భార్యకూ చెప్పాడు ఆ వార్త గురించి వాళ్ళు అంతా విని దీర్ఘంగా నిట్టూర్చారు భయంగా

''నీకీ జెరం రాటం కూడా ఒకందుకు మంచిదే అయ్యిందే'' అంది భార్య ఆ మాటకు ప్రకాశం నవ్వుకున్నాడు నిర్లిప్తంగా

''చావు ఏడున్నా వచ్చిద్దే పిచ్చిదానా'' అంది ప్రకాశం తల్లి కోడలితో

డాక్టరు రాసిన రెండు వారాల మెడికల్ లీవు అయిపోయిన తరువాత డ్యూటీకి రిపోర్టు చేశాడు ప్రతి స్టేషన్నుండి, స్టేషనుకు అయిదారుగురి చొప్పున నైజాం వెళ్ళారు ఫుల్గా మెన్ వుంటేనే డ్యూటీలకు చాలటం లేదు ఇప్పుడు ఇంకా ఇబ్బందిగా వుంది వున్నవాళ్ళనే పగలూ, రాత్రీ చేపల్ని తోమినట్టు తోముతున్నారు నైజాం వెళ్ళిన వాళ్ళని గురించి తెలుస్తున్న వార్తలు భయం కలిగిస్తున్నాయి డ్యూటీల తీవ్రత వలన వస్తున్న కోపాన్ని ఒకటి రెండు మాటల్తో మినహా ఇంతకుముందులాగా ఆఫీసర్ల ముందు నిలబడి గట్టిగా అడగలేకపోతున్నాడు ప్రకాశం అనారోగ్యం తాలూకు నీరసం, నిర్లిప్తత అతన్ని అలా మార్చాయి నైజాంలో ఎవరన్నా ఒక కానిస్టేబులు చనిపోయాడని తెలిసినప్పుడు, తను చేస్తున్న ఆ కష్టమైన ఉద్యోగం కూడా సుఖమనిపిస్తున్నది ఆ కాసేపు తెలంగాణా ప్రాంతంలోనే వున్నాయనుకుంటున్న కమ్యూనిస్టుల కార్యకలాపాలు ఆంధ్ర ప్రాంతానికి కూడా సోకుతున్నట్టు అనుకుంటున్నారు

రెండు మూడు నెలలకు కాని అతను శక్తిని కూడదీసుకోలేక పోయాడు ఇంకో రెండు నెలలకు చిన్న చిన్న చిల్లర బాకీలు తీర్చివేయగలిగాడు మొత్తంమీద సంసారం పెద్ద ఇబ్బందులకు

లోను కాకుండా లాక్కొస్తున్నాడు ఆ యింట్లో ఎవరికి వంట్లో బాగోకపోయినా రూపాయి, రెండు రూపాయలతో ఆ జబ్బు నయమవటం లేదు కనీసం ఓ నెల జీతమన్నా ఖర్చయ్యే రోగా లొస్తున్నాయి మళ్ళా ఆ ఖర్చుని పూడ్చుకుని, బండిని పట్టాలమీద కెక్కించేసరికి ఇంకొకరికి జబ్బు చేస్తోంది అయితే ప్రకాశంకు టైఫాయిడ్ వచ్చి తగ్గిం తరువాత ఇంకెవరికీ ఇంతవరకు ఏమీ రాలేదు

వంట్లో శక్తి చేరేసరికి, ఉద్రేకం పాలు మామూలుగానే కనపడింది 'ఇకపైన లోకల్ నుండి రిజర్‌లోకి ట్రాన్స్‌ఫర్ చేసే సమస్య లేదు ఇక్కడ కాకపోతే ఇంకొక స్టేషను అక్కడేమన్నా కొంచెం విశ్రాంతి దొరికిద్దేమో డబ్బుల సంగతికొస్తే ఎక్కడా దొరికేది లేదనుకో' అనుకునేవాడు ఆ వుద్దేశ్యంతోనే యస్సై, సార్జెన్, రైటర్లతో మాట్లాడేవాడు నిర్లక్ష్యంగా

స్వాతంత్ర్యం తరువాత ప్రజల్లో కొద్దిపాటి మార్పు గమనించాడు పోలీసులంటే చాలావరకు భయం పోయింది చిన్నదానికీ, చితకదానికీ పోలీసు స్టేషన్ల కొచ్చి ఫిర్యాదు చేస్తున్నారు కాని గ్రామ ప్రాంతాల్లో పెద్దగామార్పురాలేదు తెల్లటోపీల వాళ్ళ మీటింగులు క్రమేణా తగ్గిపోయాయి

చూస్తుండగానే కమ్యూనిస్టు పార్టీ సభ్యుల కార్యకలాపాలు ఉధృతమయ్యాయి ప్రభుత్వం కమ్యూనిస్టు సభ్యుల్ని ఏరివేయుటం ఒక కార్యక్రమంగా తీసుకుంది ఎందుకిలా జరుగుతోందో చాలాకాలం వరకు ప్రకాశానికి అర్థం కాలేదు తరువాత కాలంలో కూడా అతను వాళ్ళను గురించి అర్థం చేసుకున్నది చాలా తక్కువే కాని కమ్యూనిస్టుల మూలంగా తమకు డ్యూటీలు ఎక్కువవు తున్నాయనే తలంపు చాలామంది పోలీసుల్లో చోటు చేసుకుంది

కమ్యూనిస్టు ఉద్యమం ఉధృతరూపం దాల్చింది ప్రభుత్వం కమ్యూనిస్టు మీటింగుల్ని నిషేధించింది కమ్యూనిస్టు అన్నవాడిని అరెస్టు చేస్తోంది చాలామందిని రహస్యంగా చంపి వేస్తున్నట్టు వింటున్నాడు ప్రకాశం కమ్యూనిస్టుల ఏరివేతకు ప్రత్యేక ఆఫీసర్లను, స్క్వాడ్‌లను నియమిస్తున్నారు కొన్నిచోట్ల కొత్తగా వాళ్ళ ఏరివేత కోసం పోలీసు స్టేషన్లు పెడుతున్నారు ఒకటీ, రెండుచోట్ల పోలీసు స్టేషన్లని కమ్యూనిస్టులు లూటీ చేసినట్లు వార్తలు అందాయి స్టేషన్లలో తలబిరుసుగా వున్న పీసీల్ని, హెచ్ సీ ల్ని, యస్సైలని ఆ పోలీసు స్టేషన్లకు ట్రాన్స్‌ఫర్ చేస్తున్నారు తనకు కూడా అటువంటి స్టేషనుకు ట్రాన్స్‌ఫర్ రావచ్చనుకుంటున్నాడు ప్రకాశం అతను కమ్యూనిస్టులు పెట్టే మీటింగులు వినటానికి వెళ్ళాలనుకుంటున్నాడు కాని చాలాచోట్ల వాళ్ళ మీటింగులు నిషేధిస్తున్నారు ఎక్కడన్నా జరిగినా తన డ్యూటీలు తనని అక్కడకు పోనివ్వటం లేదు కానీ వాళ్ళ మీటింగులంటే ఆసక్తి కలుగుతోంది

అతను భయపడ్డట్టుగానే ట్రాన్స్‌ఫర్ వచ్చింది కమ్యూనిస్టుల ఏరివేత కోసం ఏర్పరచిన కొత్త పోలీసు స్టేషనుకు బదిలీ వచ్చింది వెంటనే పాస్‌పోర్టు తీసుకుని వెళ్ళాడు జాయినింగ్ టైము కూడా వాడుకోవటానికి వీల్లేదని అన్నారు కాని ఆ మాటల్ని అతను ఖాతరు చెయ్యలేదు. సెలవు వారం రోజులు వాడుకున్నాడు ఆ వెళ్ళిన వూళ్ళో పోలీసులకు ఇల్లు అద్దె కివ్వటానికి ఎవరూ ముందుకు రాలేదు వూరంతా తిరిగి ఒక ఇల్లు సంపాదించగలిగాడు ఎలాగైతేనేమి వచ్చి కుటుంబాన్ని తీసుకెళ్ళాడు ఆ స్టేషన్లో శీతారామయ్య కూడా వున్నాడు అతన్ని ఈ స్టేషనుకు వెయ్యటం ఆశ్చర్యం వేసింది ప్రకాశానికి

డ్యూటీకి రిపోర్టు చెయ్యగానే యస్సై అడగనే అడిగాడు. ''సెలవు ఎవరి నడిగి వాడుకున్నావ్?''

''ఒకళ్ళ నడిగేదేంది సెలవు లేకపోతే పెళ్ళాం పిల్లల్నీ, సామాన్ని ఎప్పుడు తెచ్చుకోవాలి?''

అన్నాడు పెడసరంగా ప్రకాశం

ఆ సమాధానం విని ప్రకాశాన్ని ఎగాదిగా చూశాడు యస్సై అంతకుముందే ప్రకాశాన్ని గురించి వినివుండటం వలన ఎక్కువ మాట్లాడదలచుకోలేదు ''సరే ఈ ఆలశ్యానికి ఏం రాసిస్తావో రాసియ్యి'' అన్నాడు

''నేను రాసిచ్చేదేం లేదు నీ యిష్టమొచ్చింది రాసుకో రిపోర్టు'' అన్నాడు ప్రకాశం తన ధోరణిలో తను

''రిపోర్టు కొత్వాల్సాచ్చిద్ది తరువాత నీ యిష్టం'' అన్నాడు యస్సై బెదిరింపుగా

''నీ యిష్టమన్నాగా తెల్లోడి ప్రభుత్వం పోయి, మన ప్రభుత్వం వచ్చాక ఇట్టా ఏడుత్తోందన్న మాట ట్రాన్సఫరొచ్చినోడికి వారం రోజులు జాయినింగ్ టయివున్నా వుండేదప్పుడు మామూలు సెలవు లెట్టాగూ లేవనుకో ఇప్పుడది కూడా పోయిందన్నమాట'' అన్నాడు

యస్సై ఇంకేమీ మాట్లాడలేదు

నాలుగయిదు రోజులకు అక్కడి డ్యూటీలు అర్ధమయి పోయాయి మామూలు స్టేషను ఉద్యోగాలకూ ఆ కేంపు స్టేషను ఉద్యోగాలకు తేడా వుంది బాగా ఈ స్టేషనులో ఎప్పుడూ గార్డు వుంటుంది నైటు బీట్లు లేవు కోర్టూ, ఎస్కార్టూ, ప్రాసెస్, బందోబస్తులు లేవు వున్న స్టాపులో సగం మంది సాదా దుస్తుల్లోనే వుంటున్నారు ఆ ప్రాంతంలో ఎవరెవరు కమ్యూనిస్టులు ? ఎక్కడెక్కడ మీటింగులు పెడుతున్నారు ? వూళ్ళల్లో ఎవరెవరు వాళ్ళకు ఆశ్రయమిస్తున్నారు ? వీటిని కనిపెట్టటమే సాదా దుస్తుల వాళ్ళ ఉద్యోగాలు వీళ్ళని 'ఇంటెలిజెన్స్ పీసీ' లంటారు

సబ్ ఇన్స్పెక్టరుకి అనుకూలంగా వున్న వాళ్ళంతా ఇంటిలిజెన్స్ కానిస్టేబుళ్ళు వాళ్ళు సాదా దుస్తుల్లో వూళ్ళమీద తిరగటం, ఏదో ఒక గాలివార్త పోగుచేసుకొచ్చి యస్సైకి చెప్పటం 'సార్! ఫలానా వూళ్ళో ఫలానావాడు కమ్యూనిస్టు సార్, ఫలానావాడు కమ్యూనిస్టు అభిమాని సార్, ఫలానావాడు కమ్యూనిస్టులకు షెల్టర్ ఇస్తున్నాడు సార్ ఫలానా ఆడది ఒక గ్రూపు సమాచారాన్ని, ఇంకో గ్రూపుకు అందజేసే 'వేగు' సార్! ఫలానాగ్రూపు వాళ్ళు ఫలానాచోట రాత్రి మకాం వేసి సమావేశ మయ్యారంట సార్ ఈ రోజు రాత్రికి ఫలానా భూస్వామి గింజల కొట్టు లూటీ చేస్తారంట సార్ ఫలానా స్టేషను మీద దాడి చేస్తారంట సార్!' ఇలా సవాలక్ష బోగస్ ఇనఫర్మేషన్ పోగుచేసి చెప్పటం, అది నిజమైనదైనా కాకపోయినా యస్సై పై ఆఫీసర్లకు తెలియ జెయ్యటం, అనుమానితుల్ని తీసుకురావటం, గొడ్లని బాదినట్లు బాదటం, చచ్చినవాళ్ళని రహస్యంగా తీసుకుపోయి ఎక్కడో పడేసిరావటం, బతికిన వాళ్ళమీద ఏవో కేసులు పెట్టటం, పల్లెల్లో ఆడవాళ్ళని అవమానించటం, అడ్డగించిన వాడిని కమ్యూనిస్టనే నెపంతో స్టేషనుకు తీసుకువచ్చి కొట్టటం, దొరికినచోట దొరికినంత అందుకోవటం, అందులో కొంత యస్సైకి ముట్టజెప్పటం, మిగిలింది జేబులో వేసుకోవటం ఇవీ వాళ్ళ డ్యూటీలు సీతారామయ్య కూడా ఆ డ్యూటీలోనే వున్నాడు

ఇలా సాగుతున్నయ్ ఇక్కడ ఉద్యోగాలు అటువంటి పనులకు ఇష్టపడని పీసీలు ఇరవైనాలుగు గంటలూ యూనిఫారం వేసుకొని స్టేషనుకు కాపలా వుండాలి సాదా దుస్తుల వాళ్ళు తెచ్చేవాళ్ళని కనిపెట్టుకొని వుండటం, ఎక్కడికన్నా రెయిడ్కి వెళ్ళాలంటే తుపాకులు భుజాన వేసుకుని గొర్రెల్లా పోవటం, స్టేషన్ లాకప్లలో దెబ్బలు తింటున్నవాళ్ళు వేసే కేకల్ని, ఏడుపుల్ని వింటూ, పై ఆఫీసర్లు వస్తే, వాళ్ళకు జరుగుతున్న సేవల్ని చూస్తూ, ప్రాణమున్న బొమ్మల్లా గడపటం, గ్రామాల్లోకి

వెళ్ళినప్పుడు ఆ గ్రామాల్లోని యువకుల్ని కలుపుకొని కమ్యూనిస్టుల కోసం గస్తీ తిరగటం ఇవే వాళ్ళ వుద్యోగాలు ఇంతకుమించి ఏ రాత్రీ ఇంటిదగ్గర పడుకోవటానికి వీలులేదు మధ్యాహ్నం ఓ గంట, రాత్రి ఓ అరగంట భోజనానికి మాత్రమే ఇంటికి వెళ్ళి రావటానికి వీలుంటుంది

ఆ వుద్యోగ విధానాలూ అక్కడి పరిస్థితీ చూసేసరికి బుర్ర తిరిగి పోయింది ప్రకాశంకు పిచ్చిపట్టినట్టయింది రెస్ట్ లేదు అది పెద్ద పనిష్మెంటు అమాయకులైన ఆడవాళ్ళనీ, పిల్లల్నీ, ముసలి వాళ్ళనీ కూడా స్టేషన్లకు గొడ్లని లాక్కొచ్చినట్టు లాక్కొచ్చి వీళ్ళిష్ట మొచ్చినట్టు కొట్టటం చూస్తుంటే హృదయం వక్కలయిపోతోంది బాధతో ఉద్రేకంతో కణతల మీది నరాలు పెట్లిపోతాయన్నంతగా వుబ్బుతున్నాయ్ అదేమని అడగటానికి వీల్లేదు అడిగితే, 'నువ్వు కూడా కమ్యూనిస్టువే అనీ, లేదా కమ్యూనిస్టు పార్టీ అభిమానివి' అని ముద్ర వేస్తారు అంతటితో వూరుకుంటే ఫరవాలేదు ఉద్యోగం వూడిపోయిద్ది ఇంకా అధికార్లు తలుచుకుంటే అదే స్టేషన్ లాకప్‌లో కమ్యూనిస్టులతోపాటు వుండాల్సొచ్చినా ఆశ్చర్య పడాల్సిన పనిలేదు అలాటి సంఘటనలు కొన్నిచోట్ల జరిగినట్లు తను విన్నాడు

'ఎవరు ఈ దారుణాల్ని ఆపగలరు ?' అతని కెవరూ కనిపించలేదు 'ఎందుకిలా జరుగుతోంది తెల్లవాళ్ళ గవర్నమెంటుకాదిది ఇది మన గవర్నమెంటు మనప్రజల్ని ఈ విధంగా చెయ్యటవేంటి? అసలీ కమ్యూనిస్టులు ఎవరు ? ఏం చేయాలనుకుంటున్నారు ? ఎక్కడుంటున్నారు? ఎందుకిలా తమకి రెస్ట్ లేకుండా చేస్తున్నారు ? వీళ్ళ ఉద్దేశ్యాలు ఏమిటి?' ఇలా సాగుతున్నాయ్ ఆలోచనలు వాటికి అంతులేదు అనుక్షణం ఆవేదన ఓవైపు ఈ నౌకరీవదలి పెట్టి పోవాలనే తలంపు, రెండోవైపు భార్యాపిల్లలు, తన బాధను అర్థం చేసుకునే ఒక్క మనిషన్నా కనపడకపోవటం, 'చచ్చిపోతే ఈ సమస్యలుండవు కదా!' అనే ఆలోచనలు తరచూ రావటం

ఈ స్టేషనుకొచ్చాక మానసికంగా నలిగిపోయాడు ప్రకాశం శారీరకంగా కృశించిపోయాడు టైఫాయిడ్ జ్వరం పడ్డరోజుల్లోలాగా తయారయింది ఆకారం ఏ రాత్రీ సరిగా నిద్రలేదు గంజిపెట్టిన ఖాకీ యూనిఫారంలో మాంసం వుడుకుతోంది కుతకుత వుడుకుతున్న ఆ మాంసంలోని హృదయం బాధగా మూలుగుతోంది వుద్రేకం కలుగుతోంది అందరిమీద ఆ పరిస్థితి అలా గెందుకుందో అర్థం కాని అయోమయ అవస్థ రోజులు గడిచేకొలదీ ఓ రకమైన నిర్లిప్తత, స్తబ్దత తనీలోకం నుండి శాశ్వతంగా వెళ్ళిపోదామంటే, ఆ సుఖాన్ని కూడా తనకి దక్కకుండా చేయడానికి వున్నట్లు భార్యాపిల్లలు వూపిరాడకుండా పడుతున్న సమ్మెటపోట్ల వంటి సంఘటనలు మనస్సుని మొద్దుబార్చి, మనిషినొక జడ పదార్థంగా మార్చేస్తున్నాయి ఎటుచూసినా, ఏది విన్నా బాధగా నిట్టూర్చటం మినహా ఇంకో స్పందనలేని స్థితికి వచ్చేస్తున్నాడు ప్రకాశం

అప్పుడప్పుడూ 'ఏదెట్లా జరగాలనుంటే అట్లా జరిగిద్దనే' తనకు నచ్చని, నమ్మకంలేని వేదాంతపు ఆలోచనలు తన కళ్ళముందు జరిగేవి, తన చెవులకు వినపడేవి ఏవీ జరగనట్టూ, వినపడనట్టు పట్టించుకోకూడదనే అలవాటు చేసుకోవాలనుకుంటూ తల విదిలించుకుని ఇంకోవైపు చూడటం ఇలాటి మార్పులు చోటుచేసుకుంటున్నాయి అతనిలో

రోజులు గడుస్తున్నాయి అలాగే. అతనిలాగా బాధపడేవాళ్ళు డిపార్టుమెంటు మొత్తంమీదా చాలా తక్కువమంది కనపడుతున్నారు. కాని చాలామంది మాత్రం ఈ సందర్భం తమ బాగుకోసం వచ్చిందని భావిస్తున్నారు ఎన్ని అకృత్యాలు చేస్తే అంత లాభం కనపడుతోంది వాళ్ళకు

వస్తున్న జీతం డబ్బుల్ని జాగ్రత్తగా వాడుకుంటున్నాడు వుండేకొందీ ఆ నిర్బంధ జీవితానికి అలవాడు పడుతున్నట్టు అనిపిస్తోంది అతనికి పగటిపూట వాళ్ళని కొండల్లోకీ కోనల్లోకి తోలుతున్నారు, కమ్యూనిస్టుల్ని వెతకటానికి ఎవడన్నా కొత్తమనిషి కనిపిస్తే వాడిని ప్రశ్నలతో చంపేస్తున్నారు అనుమానితుల్నీ, కమ్యూనిస్టుల్నీ కొట్టటానికి కొంతమంది కానిస్టేబుళ్ళని ఏరారు ప్రత్యేకంగా వాళ్ళకు 'టాస్క్‌ఫోర్సు' అని పేరుపెట్టారు

వాళ్ళకికవేరేడ్యూటీలు ఏమీలేవు తినటం, కొట్టటం మిగిలిన పీసీలకన్నా తమకేదో ప్రత్యేకత వున్నట్టు వాళ్ళు తిరుగుతుంటారు కోమట్ల ఇళ్ళకు మనుషుల్ని పంపించి, వాళ్ళకు కావాల్సిన వస్తువులు తెప్పించుకుంటున్నారు ఎవడన్నా ఇవ్వటానికి నిరాకరిస్తే అతనిమీద ఆఫీసరుకు చాడీలు చెప్పటమూ, కమ్యూనిస్టుల ఇన్‌ఫార్మెంటు అని అబద్ధాలు చెప్పటమూ, అతన్ని కేంపుకు ఈడ్చుకొచ్చి కొట్టటం తెలంగాణాలో రజాకార్లమా, నైజాం మిలటరీని మించిన దుర్మార్గాలు చేస్తున్నారు టాస్క్‌ఫోర్సు వాళ్ళూ, తెల్లదుస్తుల వాళ్ళు ఎఱ్ఱ గుడ్డ కనపడితే పోలీసులు కళ్ళెఱ్ఱ జేస్తున్నారు

అధికార్లు వాళ్ళకు సర్వహక్కులిచ్చారు పగలంతా వాళ్ళు ఎక్కడున్నా సాయంత్రానికల్లా గాలిపోగుచేసి ఆఫీసర్లకు చెప్పాలి వాళ్ళు చెప్పే అబద్ధాలకు అంతువుండేది కాదు 'ఈ రాత్రికి తూర్పుకొండ అవతల సమావేశమవుతారంట' అని చెప్పేవాళ్ళు ఆఫీసర్లు బలగాన్నంతా తీసుకుని ఆ చుట్టూ కాపలా కాసేవారు తెల్లవార్లూ కాని అక్కడెవరూ సమావేశం కావటంకానీ, కనీసం మానవాకారంకాని కనిపించేదికాదు ఆఫీసర్లు ఇన్‌ఫార్మెంట్లమీద కన్నెర్ర జేసేవారు ఇన్‌ఫార్మెంట్లు తొణక్కుండా నింపాదిగా జవాబు చెప్పేవారు ''సార్ మాకు ఖరెక్టయిన సమాచారమే వచ్చింది అందులో ఏమీ సందేహంలేదు మన వాళ్ళల్లోనే ఎవరో ఇన్‌ఫర్‌మేషన్ లీక్ చేసి వుంటారు''

ఆ మాటల్ని ఆఫీసర్లు పూర్తిగా నమ్మేవాళ్ళుకాదు కానీ, అవి వాళ్ళ మీద పనిచేసేవి వాళ్ళ దృష్టిలో ఎవడైతే తలబిరుసు కానిస్టేబులో అతన్ని అనుమానించేవారు ఇన్‌ఫార్మెంట్ కానిస్టేబులుకి, ఏ కానిస్టేబులుతోనన్నా పడకపోతే ఆ కానిస్టేబులి నంబరు చెప్పేవాడు అందువల్ల ఎంత ఇష్టం లేకున్నా ప్రతి కానిస్టేబులూ, ఆ మఫ్టీ కానిస్టేబుళ్ళతో మంచిగా వుండటానికి ప్రయత్నం చేసేవారు.

రోజు రోజుకీ కొత్త అర్డర్లు వస్తుండేవి స్టేషనుకు గ్రామాలలో పార్టీ కళాకారుల పాటలూ, ఇతర కళారూపాలూ తీవ్రరూపం దాలుస్తున్నాయి ఇక్కడవున్న పోలీసు బలగం చాలక మలబారు పోలీసుల్ని కూడా దించుతున్నారు

ప్రకాశం భార్యకు నెలలు నిండాయి ప్రసవించే రోజులు ప్రకాశంకు ఆందోళనగావుంది కొడుకు పుట్టినప్పటి సంగతులు గుర్తుకొచ్చాయి 'ఈసారి మళ్ళీ కొడుకే పుడతాడో, కూతురు పుట్టిదో' అనుకున్నాడు 'కూతురు పుడితే బావుండు' అనుకున్నాడు భార్య ఆరోగ్య విషయానికి ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నాడు కొడుక్కి సూర్యం అని పేరు పెట్టాలనుకున్నాడు

సాదాదుస్తుల పీసీలు కొంతమంది తాగి ఆ రాత్రి పల్లెలో వున్న వెట్టి ఇంటికి వెళ్ళి, వెట్టికూతురి చెయ్యిపట్టుకొని అసహ్యంగా ప్రవర్తించారు అక్కడ చుట్టూ వున్నవాళ్ళు మర్యాదగా చెప్పిచూశారు వీళ్ళు వినకపోయేసరికి తన్ని పంపించారు చావుతప్పి కన్ను లొట్టబోయేస్థితిలో వాళ్ళు స్టేషనుకు వచ్చారు వాళ్ళవాలకం ఏమీ అర్థంకాలేదు మొదట స్టేషన్లో వాళ్ళకి

''ఏం జరిగింది ?'' అడిగాడు యస్సై

''సార్, పల్లెలో వెట్టికూతురు కమ్యూనిస్ట్‌సార్ దాన్ని తీసుకురావటానికిపోతే అందరూ

కలిసి ''

''కమ్యూనిస్టా, లేకపోతే మీరు తాగిపోయి గొడవచేస్తే తన్ని పంపారా?''

''కాదుసార్ నిజం సార్''

''నేన్నమ్మను''

''తమరిష్టం రేపు సి ఐ గారో, డి యస్పీ దొరగారో వస్తే ఇదే విషయం చెపుతాం మేం తెచ్చిన ఇనఫర్మేషన్ తమరు నమ్మనప్పుడు ఇంక మాకెందుకీ ఉద్యోగం రాత్రింబవళ్ళు చచ్చీచెడి తిరిగి ఇనఫర్మేషన్ తెస్తుంటే మమ్మల్ని నమ్మనంటున్నారు మమ్మల్ని స్టేషన్ డ్యూటీకి వేయండి అక్కడ మాకంత అవమానం జరిగాక, మన మేమీ యాక్షన్ తీసుకోకపోతే ఇంక డిపార్టుమెంటు అంటే గౌరవం, భయం ఏముంటాయి మేము జనాల్లోకెళ్ళి ఏం చెయ్యగలం ఇక్కడ కూర్చునుండే వాళ్ళకూ, తమరికీ మా పరిస్థితి అర్థం కాదులేసార్'' అన్నాడు ఒక మఫ్టీ పీసీ

వాళ్ళమాటలు జాగర్తగా విన్నాడు యస్సై వీళ్ళు అన్నంత పనీ చేస్తారు సి ఐ కో, డి యస్పీకో చెపుతారు కమ్యూనిస్టని అనుమానమొచ్చిన ఏ ఆడదాన్నీ, మొగాడ్నీ వదలటానికి వీల్లేదు మర్డర్ కేసులో ముద్దాయి నయినా వదలొచ్చు గాని వీళ్ళని వదిలి పెట్టటానికి వీల్లేదని ఆర్డర్స్ అటువంటి ఆర్డర్స్‌ని తను వుల్లంఘించినట్లే 'సరే కానీ, ఎన్ని అన్యాయాలు చెయ్యటం లేదు అందులో ఇదొకటి తనీ పని చెయ్యకపోతే ఎలాటి పనిష్మెంటు తీసుకోవాల్సొస్తుందో' అనుకుని కించిత్తు భయానికి లోనయ్యాడు యస్సై

''సరే పోయి తీసుకురాండి లంజని'' అన్నాడు మిగతా స్టాఫుతో

మఫ్టీ వాళ్ళ ముఖాల్లో సంతోషం కనపడింది ఆ సంభాషణంతా వింటున్న ప్రకాశానికీ, అతనిలాంటివాళ్ళకూ నీరసం ఆవహించింది ఎప్పటిలాగానే

తెల్లవారకముందే వెట్టితనూ, అతని కూతురు కేంపుకు లాక్కురాబడ్డారు ఇవ్వాళో, రేపో అన్నట్టున్న వెట్టితను రెండే రెండు దెబ్బలకు చచ్చిపోయాడు వయసులో వున్న అతని కూతుర్ని యస్సై దగ్గర నుండి సాదా దుస్తుల పోలీసుల వరకు ఇంచుమించు అందరూ కలిసి పాడు చేశారు స్టేషన్‌లోని ఒక గదిలో ఇదంతా జరిగిపోతోంది రెండో గదిలో అంతా వింటూ గార్డు వెయిటింగ్ పీసీలు పడుకుని వున్నారు శవాల్లా ముందు వెనకల సెంట్రీలు నిలబడి వున్నారు తుపాకులు పట్టుకుని

చేసిన పని చాలదన్నట్టు ఆమెని కొట్టారు స్పృహలేని స్థితిలో ఆమెనలా లాకప్ గదిలో వదిలేసి తలుపులు వేసి వెళ్ళిపోయారు అందరూ నాటు సారా పూటుగా తాగి వున్నారు

తపన ఆగక వెళ్ళి తొంగిచూశాడు ప్రకాశం ఓమూల ముసలతను పడిపోయున్నాడు చచ్చిపోయి రెండోపక్కగా అతని కూతురు స్పృహ తప్పి పడి వుంది నిశ్చలంగా తలుపు తెరిచి లోపలికెళ్ళి చూశాడు బైటకెళ్ళి కుండలోంచి మంచినీళ్ళు లోటాతో తెచ్చి ఆమెని తట్టి లేపాడు చాలాసేపటికి కళ్ళు తెరిచి చూచింది లోటాతో మంచినీళ్ళు తాపాడు తాగి పక్కకు వాలిపోయింది క్షణకాలం ఆమెవేపు చూచి బయటకొచ్చాడు తలుపులు దగ్గరకు వేసి ఆ కొద్దిసేపటికే లాకప్ గదిలోని వాసనకు కడుపులో తెమిలినట్లుంది అతనికి బాధతో అతని హృదయం బరువెక్కింది వచ్చి సెంట్రీ దగ్గర నిలబడ్డాడు ప్రకాశం కళ్ళల్లోకి చూశాడు సెంట్రీ ప్రకాశం కూడా చూశాడు అతను కళ్ళతో మాట్లాడుతున్న భాషని అర్థం చేసుకున్నట్టు, ''మనం చెయ్యగలిగింది ఏముంది చెప్పు'' అన్నాడు సెంట్రీ జాలిగా

ప్రకాశం తలొంచుకున్నాడు ''బలహీనులం అన్నివిధాలా అర్భకులం ఏం చేసినా మనకే నష్టం రోజులు లెఖ్ఖపెట్టుకుంటూ ఈ బతుకు బండి నీడ్చుకు పోవటమే'' అన్నాడు మళ్ళీ అతనే

చాలాసేపు అక్కడ కూర్చున్నాక చిన్నగా కాళ్ళీడ్చుకుంటూ ఇంటికెళ్ళాడు ప్రకాశం ఇరుగు పొరుగు ఆడవాళ్ళు వున్నారు ఇంటిదగ్గర 'నొప్పులొస్తున్నాయి గాబోలు' అనుకున్నాడు గబగబా అడుగులు వేశాడు మనస్సులో అప్పటివరకూ వున్న సంఘటన పక్కకు జరిగింది భార్య ప్రసవం తాలూకు ఆందోళన ఆ స్థానాన్ని ఆక్రమించింది తల్లి ఎదురొచ్చింది ''అయ్యా! నొప్పు లొత్తున్నాయిరా'' అంది విని మెదలకుండా వూరుకున్నాడు తల మాత్రం వూపి ''ఏం పరవాలేదు బయ్యం లేదులే'' అంది మళ్ళీ ఆమే లోపలకు వెళ్ళాడు ఆడవాళ్ళు అతన్ని చూచి పక్కకు తప్పుకున్నారు పిల్లవాడు బిక్కమొహం వేసుకొని ఓ పక్కనిలబడి వున్నాడు వాడిని తీసుకుని బయట కొచ్చాడు చిల్లర కొట్టుకెళ్ళి పిల్లవాడికి తినటానికి పిప్పరమెంటు బిళ్ళలు కొనిచ్చాడు తిరిగి ఇంటికెళ్ళి యూనిఫారం విప్పి కాలకృత్యాలు ముగించుకొని, తల్లికి చెప్పి స్టేషనుకొచ్చాడు

మనస్సు పరిపరి విధాల పోతోంది చికాకుగా వుంది ఎక్కడా కాలు నిలబడటం లేదు లోపల వున్న వెట్టికూతురు గుర్తొచ్చింది దీర్ఘంగా నిట్టూర్చాడు వేపచెట్టు చుట్టూ కట్టిన అరుగుమీద చతికిలబడ్డాడు ఆలోచనలు భార్య చుట్టూ ముసురుకున్నాయి 'ఏం ఫరవాలేదు కదా దేవుడి దయ వలన ఏమీ లేకుండా వుంటే బాగుండు ఈ పల్లెటూళ్ళో డాక్టరు లేడు ఇప్పుడు పట్నం తీసుకుపోవటం కుదరని పని డబ్బు లేదు పోవటానికి సెలవివ్వరు కనీసం పర్మిషన్ ఇచ్చేవాడు కూడా లేడు ఏం కాదులే, రెండో కాన్పు కదా అయినా చేసేదేముందిలే, అన్నిటికీ వాడే వున్నాడు' ఇలా సాగాయి ఆలోచనలు ఇంటి కెళ్ళటానికి లేచాడు సెంట్రీకి విషయం చెప్పాడు ''ఫరవాలేదు పోయిరా నేను చెపుతాలే యస్సైగారికి'' అన్నాడు సెంట్రీ పిల్లవాడు పుట్టినప్పుడు రైటరు రాసిన ఆబ్సెంటు గుర్తొచ్చింది అప్పటి విషయాలన్నీ గుర్తొచ్చాయి ఆలోచిస్తూనే ప్రకాశం ఇంటికొచ్చాడు

అప్పటికే ప్రకాశం భార్య ప్రసవించింది ఆడపిల్ల తల్లీ, పిల్ల బావున్నారని చెప్పింది తల్లి ఎదురొచ్చి సంతోషంగా తేలిగ్గా నిట్టూర్చాడు ఏమీ ఆటంకం జరగకుండా గట్టెక్కినందుకు దేవుడికి దండం పెట్టుకున్నాడు మనస్సులో

అప్పటికి మధ్యాహ్నం అయ్యింది ఆకలవుతోంది 'అమ్మ అన్నం వండిందో లేదో' అనుకుని, 'సరేలే' అనుకుని వచ్చి సెంట్రీ డ్యూటీ ఎక్కాడు సాయంత్రం మూడింటికి దిగి ఇంటికెళ్ళాడు భార్య మంచం దగ్గరకెళ్ళి కూతుర్ని చూసుకున్నాడు ఆనందం కలిగింది తల్లి కూడా వచ్చి కొడుకు పక్కన నిలబడింది ఆనందంతో భార్య మగతగా కళ్ళు మూసుకుని వుంది ఒక్క పూటలోనే తీవ్రమయిన మార్పు గమనించాడు భార్యలో ముఖమంతా పీక్కుపోయింది కళ్ళకింద నల్లటి చారలు కొత్తగా ఈపూటే గమనించాడు నిర్లిప్తంగా కూతురివైపు చూశాడు 'ఏం పీక్కుతిందామని వచ్చావు తల్లీ ఈ లోకంలోకి' అనుకుని నవ్వుకున్నాడు చిన్నగా లేచి వెళ్ళి కాళ్ళూ, చేతులూ కడుక్కుని తల్లి పెట్టిన అన్నం తిని స్టేషనుకు వెళ్ళాడు స్టేషన్‌లో కొంచెం హడావిడిగా వుంది 'ఏదో ఇన్‌ఫర్‌మేషన్ వచ్చి వుంటుంది ఈ రాత్రికి వెళ్ళాలి కాబోలు' అనుకుని లోపలకొచ్చాడు

''వెట్టి కూతురు చీరతో వురేసుకుని చచ్చిపోయింది'' అన్నాడు సెంట్రీ ప్రకాశంతో ఆ మాట విని ప్రకాశం అదిరిపడ్డాడు

''ఎట్లా?'' అన్నాడు

సెంట్రీ ఏదో చెప్పబోయేలోగా యస్పై బయటకు వచ్చాడు సెల్యూట్ చేశాడు ప్రకాశం యంత్రంలాగా

''ఎక్కడికెళ్ళావ్?'' అడిగాడు యస్పై కోపంగా యస్పై తాగి వున్నట్టు గమనించాడు ప్రకాశం

''మూడింటికి పారా దిగి భోజనానికి వెళ్ళి వస్తున్నా సార్'' అన్నాడు ప్రకాశం

''ఏం ఒక్కపూట తిండి లేకపోతే చస్తావా? ఇక్కడ ఇన్ని ఘోరాలు జరిగిపోతా వుంటే మీకసలు చీమ కుట్టినట్లు లేదు ఆ మూడు గంటలు సెంట్రీ వుద్యోగం చేస్తే మీ బాధ్యత తీరిపోయినట్లు అనుకుంటారు మీరెవరన్నా వుంటే ఈ ఘోరం జరిగేది కాదుకదా!'' అన్నాడు నేరాన్ని ఇటు తిప్పుతూ

ఆ మాటలకు ప్రకాశం వళ్ళు మండిపోయింది వెర్రి కోపం ఆవహించింది

''అది చావటానికి మేము లేకపోవటం కాదు మీ కిరాతకం మీరూ, మీ మన్షీవాళ్ళు చేసిన పనికి అది చచ్చింది దాని చావుకు కారణం మీ దుర్మార్గం మీ రాక్షసత్వానికి ఎంతమంది చచ్చిందీ ఎవ్వరికి తెలియదు? నేరాన్నేంది మా మీదకు నెట్టటానికి చూస్తున్నారు ఏం మాట్లాడుతున్నారో కాస్త ఆలోచించి మాట్లాడండి'' అన్నాడు తీవ్రంగా

అతని మాటలకు యస్పై తడబడ్డాడు జరిగిన సంఘటన కంటే ప్రకాశం అన్న మాటలకు యస్పై వుడికిపోయాడు ఏం మాట్లాడాలో తోచలేదు ''ఎవ్వరితో మాట్లాడుతున్నావో తెలుసా? నేను తలుచుకుంటే '' అతని మాటలు పూర్తికాక ముందే ప్రకాశం అందుకున్నాడు

''ఎవ్వరితో మాట్లాడేదీ తెలియక పోవటానికి నేనేం తాగుబోతుని కాదు నువ్వేం పెద్ద సీమదొరవి కాదు, నీ కాళ్ళు మొక్కి నెత్తి నెక్కించుకొని, నీ ముందు చేతులు కట్టుకొని నిలబడటానికి మే మేమన్నా నేరం చేసుంటే అట్లాగే నిలబడేవాళ్ళం నువ్వేం చేస్తావ్? పై ఆఫీసరుకి చాడీలు చెపుతావ్ ఆబ్సెంటులు రాపిస్తావ్, రాస్తావ్ రిపోర్టులు రాస్తావ్ డిస్మిస్ చేపిస్తావు మహా అయితే కమ్యూనిస్టునని చెప్పి జైలుకు పంపుతావ్ అంతకు మించేం చేస్తావ్ నువ్వీ పనులన్నీ చేసి పాపం మూటకట్టుకో'' అన్నాడు కోపంగా కోపంతో ముఖం జేవురించింది

యస్పై ఇంకేమీ మాట్లాడలేదు గబగబా తన గదిలోకి వెళ్ళిపోయాడు

రాత్రి భోంచేసి వచ్చి పడుకున్నాడు ప్రకాశం ఒక రాత్రప్పుడు అలికిడి అయ్యి మెలుకువ వచ్చింది మన్షీ పోలీసులు చచ్చిన ఇద్దరినీ గోతాల్లో మూటలు కట్టి మోసుకుపోతున్నారు ఆ దృశ్యం చూశాక ఇక నిద్ర పట్టలేదు ఎవరికీ అక్కడకి వచ్చాక తరచూ అలాటి దృశ్యాలు చూస్తున్నా, ఎప్పటికప్పుడు, తను ఎలాటి దారుణమైన నౌకరీ చేస్తున్నాడో వూహించుకుని బాధపడటం జరుగుతోంది

ఓ గంట తరవాత సాదా దుస్తుల పోలీసులు తిరిగొచ్చారు రెండు శవాల్నీ వూరిబయట పాడుపడ్డ కోనేట్లోకి నెట్టి వచ్చారు మూడోనాటికల్లా శవాలు పైకి తేలాయి వూరంతా గుప్పుమంది కాని అంతటా నివురు గప్పిన నిప్పులా వుంది వాతావరణం జనం రెచ్చిపోయి వున్నారు

నాలుగు రోజుల తరువాత ఇన్ఫార్మెంట్లలోని ఒక కానిస్టేబులు గైరు హాజరయ్యాడు అతను ఆబ్సెంటయ్యి వెళ్ళిపోయి వుంటాడని అనుకున్నారు అంతా రెండు రోజుల తరువాత అతని శవం అడవిలో చింతచెట్టుకు వేలాడుతూ కనపడింది కమ్యూనిస్టుల కోసం అడవిలోకి వెళ్ళి వస్తున్న మలబారు పోలీసులు దూరంగా చెట్టుకు వేలాడుతున్న శవాన్ని చూశారు దగ్గరకెళ్ళి చూస్తే

రోజులు అలాగే సాగుతున్నయ్ భారంగా, బాధగా

మళ్ళీ స్వాతంత్ర్యం దినోత్సవం జరుపుకున్నారు అంతా స్వాతంత్రం కోసం కన్న కలలు గుర్తొచ్చాయి ఆశలు ఆశలుగానే వుండిపోయాయి 'ఈ రోజుల్తో పోల్చి చూస్తే ఆ రోజులే బాగున్నాయి' అనుకున్నాడు 'బ్రిటిష్‌వాళ్ళు ఈ దేశాన్ని వదిలినా, ఈ దరిద్రం, కష్టాలూ తమల్ని వదల్లేదు మరి ఈ దరిద్రం ఎప్పుడు పోయిద్దో' అనుకున్నాడు చూస్తున్న సంఘటనల వలన కలుగుతున్న నిర్లిప్తత, నీరసాన్ని కలిగిస్తోంది ఆ సంవత్సరంలో కంటికి కనపడని మార్పులు జరుగుతున్నట్టు గమనించాడు ప్రకాశం పార్టీ కళాకారుల కార్యక్రమాలు సన్నగిల్లాయి కమ్యూనిస్టుల కోసం గాలింపు ఎక్కువ చేశారు పెద్ద ఆఫీసర్లు మారిపోతున్నారు గ్రామాలలో యువకులు పోలీసులతోపాటు ఇంతకు ముందులాగా గస్తీ తిరగటానికి నిరాకరిస్తున్నారు

ఎక్కడో తెలంగాణా ఏరియాలో రెండుచోట్ల కమ్యూనిస్టులు పోలీసు స్టేషన్లను లూటీ చేశారని వార్త లొచ్చాయి

నిద్ర పోయేటప్పుడు తుపాకిని గొలుసుతో కట్టుకొని, ఆ గొలుసు చివర్లు బెల్టులకు తగిలించుకొని, తుపాకుల్ని పక్కలో పెట్టుకొని నిద్రపోతున్నారు పోలీసులు సెంట్రీలు కళ్ళల్లో వత్తులు వేసుకున్నట్లు జాగ్రత్తగా పహారాలు కాస్తున్నారు ఆ భయంకర జీవితానికి అలవాటు పడిపోయినట్లు అంతా ప్రవర్తిస్తున్నారు ప్రయాణ సౌకర్యాలు లేని కొన్నిచోట్ల అడవుల్లోంచి, పది పదిహేను మైళ్ళు తుపాకీ భుజాన వేసుకొని పోవాలి ఆ నిర్మానుష్య ప్రదేశాల్లో ఏ మూల నుండి కమ్యూనిస్టులు దాడిచేస్తారో అనే భయంతో చచ్చిపోతున్నారు ఆ భయం నుండి విముక్తి కోసం అన్నట్టు కొంతమంది తాగుతున్నారు

ప్రకాశం ఆ రాత్రి స్టేషన్లో గార్డు డ్యూటీలో వున్నాడు ఎందుకో సీతారామయ్యకు కూడా యస్పై గార్డు డ్యూటీ వేశాడు ఎక్కడో వాళ్ళిద్దరకూ తేడా వచ్చినట్లుంది మళ్ళీ డ్యూటీకీ, పీడనకు అలవాటుపడిన అతను ఆ అవకాశం పోయినందుకు కుమిలి కుమిలి పోతున్నాడు అతన్ని గురించి ఆలోచిస్తుంటే అసహ్యమేస్తుంటుంది ప్రకాశంకు ఆలోచిస్తూ కునుకు తీశాడు

దిగబోయే సెంట్రీ ప్రకాశాన్ని నిద్రలేపాడు అర్థరాత్రి పన్నెండు గంటలయింది లేచి ముఖం కడుక్కొని, సెంట్రీ పుస్తకంలో సంతకం పెట్టి, తుపాకి తీసుకొని బైటకొచ్చి నిలబడ్డాడు నిద్రమత్తు ఇంకా వదలలేదు వెనకవైపు సెంట్రీ లింగయ్య చుట్ట వెలిగించాడు

ఆకాశమంతా మబ్బు పట్టివుంది చల్లటిగాలి రివ్వున వీస్తోంది దిగిన సెంట్రీ ఒకతను చెంబుతో నీళ్ళు తీసుకొని బైటకు వెళ్ళాడు రెండో అతను పడుకోవటానికి పక్కవేసు కుంటున్నాడు మంచి నిద్రలో లొేవటం వలన నిద్ర ఇంకా పట్టుకొనే వుంది

''ఇవ్వాళ చెకింగు ఎవరు?'' అడిగాడు ప్రకాశం

''ఎవరొస్తారో మరి వాళ్ళేం ఒక లెఖ్ఖ ప్రకారం వస్తుంటేగా వాళ్ళిష్టం వాళ్ళు నడిగే దెవరు? మనల్నయితే అందరూ నిలదీసే వాళ్ళే'' అన్నాడు లింగయ్య

''అవును అయినా ఎవరైతే మనకేందిలే గట్టిగా ఒక్క హోల్ట్ కొడితే పోయిద్ది'' అన్నాడు ప్రకాశం మామూలుగా

''ఆఁ సరేలే, మాట్లాడగాకండి ఆఫీసర్లు వింటే పనిష్మెంటు ఇస్తారు'' అన్నాడు అంతకు ముందు రియర్ సెంట్రీ దిగి పడుకోబోతున్న పీసీ

దూరంగా ఎవరో వస్తున్నట్టు ఆకారం కనిపించి జాగ్రత్తగా చూశాడు ప్రకాశం అతని చేతిలో

తుపాకి బిగుసుకుంది నాలుగు క్షణాల తరువాత చిన్నగా వూపిరి పీల్చుకున్నాడు ఫ్రంట్ సెంట్రీ, పహారా దిగి దొడ్డికెళ్ళి వస్తూ కనిపించాడు అతను లోపల కొచ్చి యూనిఫారం వేసుకుంటూ, ''నా పెళ్ళాం యాడుందిరా'' అన్నాడు

''అదిగో అక్కడ గోడకానించి పోయావుగా '' అన్నాడు నవ్వుతూ అక్కడే పడుకున్న పీసీ

''ఆఁ మరిచిపోయా!'' అని కంబడి దులిపి, బెల్టు పెట్టుకొని, తుపాకీకున్న గొలుసు బెల్టుకు తగిలించుకొని తనతోపాటు పక్కమీద పడుకోబెట్టాడు తుపాకీని

''అయితే ఇయ్యే మన పెళ్ళాలన్నమాట'' అన్నాడు ఒకతను

''అంతేగా మరి కొత్త పెళ్ళికొడుకు గనక పెళ్ళాం కోసం కలవరించినట్టు, మనం వీటిని పక్కన వేసుకొని పడుకోవాలి లేకపోతే పనిష్మెంటు'' అన్నాడు నవ్వుతూ మొదటతను

ఆ మాటకు అందరూ నవ్వుకున్నారు తరువాత కొద్దిసేపటికి వాళ్ళు నిద్ర పోయారు స్టేషనుకు వెనకా ముందు వున్న సెంట్రీలు మాత్రం నిలబడి వున్నారు లింగయ్య చేతిలోని చుట్ట పారేసి, కేకరించి వూశాడు నిముషాలు నిశ్శబ్దంగా దొర్లిపోతున్నాయి వూళ్ళో దూరంగా ఎక్కడో కుక్కొకటి పెద్దగా మొరిగింది ఒకదాని తరువాత వకటిగా చాలా కుక్కలు అరిచాయి అయిదారు నిముషాల తరువాత అంతా నిశ్శబ్దమై పోయింది

రకరకాల ఆలోచనలు గజిబిజిగా వస్తున్నయ్ ప్రకాశంకు 'పిల్లవాడికి ఇంతవరకూ పేరు పెట్టలేదు బుజ్జి అనే పిలుస్తున్నాం ఇంకా ఇంకో బిడ్డ కూడా పుట్టింది ఏం పేరు పెడితే బావుంటుందో? 'సూర్యం' బాగానేవుంది' అనుకున్నాడు వెనకవైపున వున్న సెంట్రీగడపకానుకుని కూర్చున్నాడు నీరసంగా వుండి ఓ అరగంట గడిచింది ఆలోచనలతో చీకట్లోకి చూస్తున్న ప్రకాశంకు దూరంగా చింతచెట్టు కింద ఎవరో మనిషి కదిలినట్టుగా అనిపించింది వళ్ళు జలదరించింది మరుక్షణంలో తుపాకిని బలంగా పట్టుకుంది చెయ్యి జాగ్రత్తగా చూశాడు ఏమీ కనిపించలేదు చెవులు రిక్కించాడు అంతా నిశ్శబ్దం 'కన్ను చెదిరి వుంటుంది' అనుకున్నాడు కాని అనుమానంగా వుంది లోపల హరికెన్ లాంతరు వెలుగుతోంది దాని కాంతిలో బైటవాళ్ళకు సెంట్రీ స్పష్టంగా కనిపిస్తాడు కానీ బైటంతా చీకటిగా వుండటం వలన సెంట్రీకేమీ కనపడదు ఏదో ఆలోచన వచ్చినవాడిలాగా లోపలికెళ్ళి లైటు అక్కడనుండి తీసి తలుపు చాటున పెట్టాడు బయట వరండా అంతా చీకటయ్యింది బైటకొచ్చి ఇంతకుముందు నిలబడ్డ చోటుకి బాగా ఇవతలకొచ్చి నిలబడ్డాడు కొన్ని నిముషాలు గడిచాయి చింతచెట్టు వైపే చూస్తున్నాడు చీకట్లో కానీ ఏమీ కనపడలేదు చింతచెట్టు కివతలగా వున్న వేపచెట్టు కింద ఎండుటాకుల మీద ఎవరో అడుగులు వేసినట్టు ఆకులు గలగల మన్నాయి చప్పున అటు తిరిగాయి ప్రకాశం కళ్ళు బుర్రలో ఏదో అనుమానం చోటు చేసుకుంది ఆన్‌గార్డ్ పొజిషన్‌లోకి వచ్చాడు అతని శరీరం సన్నగా వణుకుతోంది 'అది పురుగూ, పుట్రా తిరిగేటప్పుడు అయ్యే శబ్దం కాదు' అని నిర్ణయించు కున్నాడు భయం వేస్తోంది. అనాలోచితంగానే కుడిచేతి బొటనవేలు 'సేఫ్టీ కేచ్'ని ముందుకు నెట్టింది. చూపుడు వేలు ట్రిగ్గర్ మీదకు వెళ్ళింది భయం శరీరాన్ని పూర్తిగా ఆక్రమిస్తోంది

''ఎవరక్కడ?'' తడి ఆరిపోతున్న ప్రకాశం గొంతులో నుండి ఖంగుమంటూ దూసుకొచ్చింది ప్రశ్న ఆ కేకకు నిద్రపోతున్న గార్డు పీసీలు కొందరు వులిక్కిపడి కళ్ళు తెరిచారు మరుక్షణంలో ఎండుపుల్ల విరిగిన శబ్దం వినిపించింది వేపచెట్టు కింద నుండే చప్పున తుపాకిని ఎత్తి భుజానికి ఆనించి, ఎయిమ్ చూస్తున్నట్టుగా తల కొంచెం వంచి శబ్దం వినపడ్డవైపే దృష్టి సారించాడు

చుట్టుకుంటున్న చుట్ట అవతల పెట్టాడు లింగయ్య ''ఏంది ప్రకాశం?'' అన్నాడు తుపాకిని గట్టిగా పట్టుకుంటూ, కంగారుగా

''గార్డు ఫాలెన్, గార్డు ఫాలెన్'' కంగారుగా గట్టిగా కేకేశాడు ప్రకాశం అతని అనుమానం నిజమయ్యింది గభాలున గోడ చాటుకు తప్పుకున్నాడు వున్నచోటు నుంచి గార్డులో వాళ్ళు వులిక్కిపడి లేచారు అంతా కంగారుగా, భయంగా వుంది

''ఏంది ప్రకాశం?'' అడిగాడు గార్డు ఆఫీసరు లోపల్నుండే

''ఎవరో మనిషి వేపచెట్టు చాటున దాక్కున్నాడు సార్'' అన్నాడు ప్రకాశం వూపిరి బిగబట్టి

''కాల్చెయ్ నా కొడుకుని '' సార్జెన్ మాట పూర్తి కాలేదు ప్రకాశం మస్కెట్‌లోని తూటా గుండు దూసుకెళ్ళి వేపచెట్టుకు తగిలింది

తూటా పేలిన చప్పుడుకి ఆ ప్రాంతమంతా మార్మోగిపోయింది రెండో తూటా తీసి లోడ్ చేశాడు చప్పునగెంతి ఇవతల గోడవైపు కొచ్చి నిలబడ్డాడు మరుక్షణంలో స్టేషన్ లోపలి వాళ్ళంతా లేచారు వెనకకు ఇద్దరూ, ముందుకొక అయిదుగురు పీసీలు వచ్చారు సార్జెన్ కొద్దిసేపు ఆలోచించి వెనక్కు వెళ్ళాడు తుపాకి పట్టుకొని బైటకొచ్చిన వాళ్ళంతా చంగుచంగున చీకట్లోకి మాయ మయ్యారు క్షణాల్లో తుపాకులు లోడ్ చేసుకున్నారు వాళ్ల కళ్ళు చీకట్లోకి చూస్తున్నాయి అందరిలోనూ భయం గూడుకట్టుకుంది ప్రాణభయం చోటుచేసుకుంది

భయంకరమైన ఆ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ హఠాత్తుగా వేపచెట్టు చాటునుండి తుపాకి పేలింది మరుక్షణంలో ఒక కానిస్టేబులు గావుకేక పెడుతూ ధభీలున పడిపోయాడు అతని చేతిలోని తుపాకి అల్లంత దూరాన ఎగిరిపడింది ఏం జరిగిందో గమనించే లోగానే వేపచెట్టుకి పదిగజాల దూరంలోవున్న కంచె వెనక నుండి మరో తుపాకి పేలింది ప్రకాశం చటుక్కున తను నిలబడ్డ చోటునుండి కదిలాడు పక్కనేవున్న ఎత్తైన పెద్ద రాతిరోలును చాటుచేసుకొని మోకాలిమీద కూర్చున్నాడు ప్రతివాళ్లూ సురక్షితమైన మరుగుకోసం వెతికారు అంతా నిశ్శబ్దం ఎవరెవరు ఎక్కడున్నారో ఎవరికీ తెలియదు స్టేషన్‌లోంచి హరికెన్ లాంతరు వెలుగు గుడ్డిగా ప్రసరిస్తోంది బయటంతా కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి

దెబ్బ తగిలిన కానిస్టేబులు తన్నుకుంటున్నాడు అతన్నెవరూ గమనించటం లేదు కేవలం వినికిడి శక్తి మీద ఆధారపడి వున్నారంతా స్టేషన్ వెనకవైపున వున్నవాళ్ళు అటుపక్క తలుపులు వేసి ముందుకొచ్చి పక్కకు తప్పుకోబోతున్నప్పుడు ఇందాకటి పొదలో నుండి మళ్ళీ తుపాకి పేలింది కాని ఎవరికీ తగల్లేదు అంతా చీకట్లో కలిసిపోయారు భయంతో గుండెలు దడదడలాడుతున్నాయి

ప్రకాశం పొదవైపే ఎయిమ్ చూచి ట్రిగ్గర్ నొక్కాడు తుపాకిపేలిన శబ్దం, ఆ గుండు తగిలిన వ్యక్తి వేసిన భయంకరమైన కేక ఒకదానివెంట ఒకటి వినిపించాయి భయంకరమైన ఈ జీవన్మరణ సమయంలో కూడా మనస్సులో కించిత్తు గర్వం తళుక్కున మెరుపులా మెరిసిపోయింది ప్రకాశంలో అది కమ్యూనిస్టుల మీద అతనికి తెలియకుండానే మనస్సులో పెరిగిన ద్వేషానికి తార్కాణంగా భావించుకున్నాడు మరుక్షణంలో, అతను అక్కడే వుండటమా, పక్కకు తప్పుకోవటమా- అని ఆలోచించాడు అంతకన్నా సురక్షితమైన చోటు అక్కడింకేదీ లేదు 'తన తుపాకీ పేలినప్పుడు శత్రువు తనని గమనించినా, రాతి రోలు శత్రువు తుపాకి దెబ్బ నుండి తనని కాపాడుతుంది' అలా ఆలోచనలు కొనసాగుతూనే వున్నయ్ ఆ ఆలోచనల మధ్యే తుపాకీలో తూటా లోడ్ చేయటం కూడా జరిగిపోయింది చిన్నగా వెన్నెల వెలుగు పరుచుకుంటోంది

అప్పుడే

పిడుగు పడుతున్నట్టు నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ కంచెల వెనక నుండి గొంతు ప్రతిధ్వనించింది ''కమ్యూనిస్టు పార్టీ కీ జై ఎర్ర జెండా వర్ధిల్లాలి''

ఆ గర్జనతో పాటు దేనినో నేలకేసి గట్టిగా కొట్టిన శబ్దం వినిపించింది తరువాత తిరిగి నిశ్శబ్దం నిండిపోయింది స్టేషను పక్కనుండి ఎవరో పీసీ ఆ శబ్దం వచ్చిన దిక్కు వైపు ఫైర్ చేశాడు ఎదురు దిక్కుల నుండి నాలుగు తుపాకులు ఆ కానిస్టేబులు మీదకు నిప్పులు కురిపించాయి అలా ప్రారంభమయిన కాల్పులు రెండు మూడు నిముషాల తరువాత ఆగిపోయాయి రెండువైపులా నిముషాలు నడుస్తున్నాయి నిశ్శబ్దంగా ఆకాశంలో మబ్బులు విడిపోయి చంద్రుని వెలుగు పలుచగా నేలమీద పరుచుకుంటోంది ఎటునుండీ కాల్పులు లేవు 'వాళ్లు వెళ్ళి పోయి వుంటారు' అనుకున్నాడు ప్రకాశం

ఎక్కడి వాళ్ళక్కడ అలాగే వుండిపోయారు కదలకుండా ఏ మాత్రం కదిలినా వెన్నెల వెలుగులో శత్రువు తుపాకి గుండుకి బలైపోవాల్సిందేనన్న సత్యం అందరికీ తెలుసు ఆ రోజుతో తమకి నూకలు చెల్లిపోయాయనే నిర్ణయంలోనే వున్నారు సెకండ్లు, నిముషాలు, గంటలు గడిచాయి తూర్పుకొండల వెనక వెలుగురేఖలు విచ్చుకుంటున్నాయి పిట్టల అరుపులు వినపడు తున్నయ్ ఎవరికి వాళ్ళు తమతమ మాటుల్నుండి బయటకు రావటానికి భయపడు తున్నారు చూస్తుండగానే చీకటి మాయమయ్యింది భయంతో గుండెలు గుబగుబలాడుతున్నాయి

రాతిరోలు పక్కనుండి భయం భయంగా చూశాడు ప్రకాశం ఎవరూ కన్పించలేదు గట్టిగా గాలి పీల్చుకున్నాడు చిన్నగా, భయంగా లేచాడు చిన్నగా రెండడుగులు వేశాడు నాలుగయిదు గంటలపాటు అలాగే వుండిపోవటం వలన కీళ్ళు పట్టుకుపోయాయి తుపాకీ ఆన్‌గార్డు పొజిషన్‌లో పట్టుకొని స్టేషను ముందుకొచ్చాడు అతన్ని చూచి మిగిలిన వాళ్ళు గోడలచాటు నుండి అక్కడకు వచ్చారు ఒకళ్ళనొకళ్ళు చూచి ధైర్యం తెచ్చుకున్నారు స్టేషను ముందు ఓ పీసీ రక్తపు మడుగులో పడివున్నాడు అతని కాళ్ళ దగ్గర తుపాకి పడివుంది ఆ దృశ్యం గుండెల్ని జార్చేసింది కళ్ళు బైర్లు కమ్మినట్లు అనిపించింది ప్రకాశంకు నిర్ఘాంతపడి చుట్టూ చూశాడు ఇంకా ఎక్కడన్నా పొంచి వున్నారేమో కమ్యూనిస్టులని భయంగా వుంది అందరికీ

''ఎవ్వరూ ఏమీ తాకవద్దు'' అన్నాడు సార్జెన్ ముందుగా తేరుకుని ''మిగిలిన మనవాళ్ళంతా వున్నారా?'' అన్నాడు

అంతా చూశారు అటూ ఇటూ ''లింగయ్యా, శీతారామయ్య కనపట్టం లేదే'' అన్నాడు ఒక పీసీ

''అడిగో లింగయ్య'' అరిచినట్టు అన్నాడు ఓ పీసీ, చూపుడు వేలిని ఓ దిక్కుకు చూపిస్తూ అందరూ అటు వెళ్ళారు స్టేషను పక్కనున్న మొండిగోడ కవతల పడిపోయి వున్నాడు లింగయ్య అతని తొడలో తుపాకి గుండు దూరినట్టుంది 'చనిపోయాడేమో' అనుకున్నారు అంతా కాని వూపిరి పీలుస్తున్నాడు తుపాకీ పక్కనే వుంది కాలి కిందనుండి చుక్కలు చుక్కలుగా నెత్తురు కారుతోంది ఇంకా అతను బాధతో సన్నగా మూలుగుతున్నాడు

''సీతారామయ్య ఏడి ?'' ఎవరో అడిగారు అతను ఏమయ్యాడో ఎవరికీ అర్థం కాలేదు చుట్టూ కలియచూశారు.

స్టేషను కెదురుగా, దూరంగా కంచె కవతల ఎవరో పడిపోయినట్లు వుంటే భయంగా అటు

వెళ్ళారు అక్కడి పడి చనిపోయి వున్న మనిషిని చూచి ఆశ్చర్యపోయారు ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు రోశయ్య ఆ వూరికి చెందిన చాకలి కోటి కొడుకు అతను రోజూ పోలీసుల ఇళ్ళకు కూడా వచ్చి గుడ్డలు తీసుకెళ్ళి వుతుక్కొచ్చి ఇచ్చేవాడు చూపులకు అమాయకుడిగా కనపడుతూ, ఎప్పుడూ తన పని తను చూసుకుంటూ వుండే రోశయ్య, కమ్యూనిస్టుల్లో చేరి పోలీసు స్టేషను మీదకు దాడికి వచ్చాడంటే ఆశ్చర్యంతో నోళ్ళు వెళ్ళబెట్టారు అంతా 'ఇంత అమాయకంగా వుండే అతని నిజస్వరూపం ఇదే అయితే ఇంక ఎవరిని నమ్మాలి? ఎవరు ఎవరనేది ఎలా?' అనుకుంటూ ఆశ్చర్యపోయాడు ప్రకాశం

చనిపోయిన అతని పక్కనే విరిగిపోయిన యస్ బి బి యల్ తుపాకి వుంది ఎడమ చేతిలో సుత్తి, కొడవలి గుర్తు వున్న ఎర్ర జెండా వుంది తుపాకి గుండు తలలో నుండి దూసుకుపోయింది నుదుటి మీద గుండు లోపలికి దూరినచోట రంధ్రం స్పష్టంగా కనిపిస్తూ వుంది చేతులకి, కాళ్ళకి ముళ్ళ కంచె గీరుకుపోయిన గీతలు వున్నయ్ రక్తం ముఖం నిండా ఎండిపోయి వుంది చనిపోయిన అతని ముఖంలో నిశ్చలత్వం కొట్టొచ్చినట్టు కనపడుతోంది ప్రాణం పోబోయే ముందు అతనికి కలిగిన శారీరక బాధ తాలూకు చిహ్నలెక్కడా ఆ ముఖంలో కనిపి చటం లేదు

అతని ముఖాన్ని చూస్తూవుండే కొంచీ ఏదో తప్పు చేసినవాడిలాగా బాధపడ్డాడు ప్రకాశం మాటలతో చెప్పలేని నేరం చేసినట్లుగా అతను చలించిపోయాడు మౌనంగా ఇవతలి కొచ్చాడు వేపచెట్టుకు తగిలిన తుపాకిగుండు చెట్టులోకి నాలుగయిదు అంగుళాలు దూసుకుపోయినట్లుంది ప్రకాశం మనస్సంతా బాధతో నిండిపోయింది రోశయ్య ప్రకాశం తుపాకీ దెబ్బకే చనిపోయాడు అతను చనిపోయేటప్పుడు వేసిన కేకకు మనస్సులో కించిత్తు గర్వం ఎందుకు కలిగిందో, ఇప్పుడతన్ని చూశాక ఈ బాధ ఎందుకు కలుగుతుందో విశ్లేషించుకోలేకపోయాడు ప్రకాశం మౌనంగా వెళ్ళి బల్లమీద కూర్చున్నాడు అప్పటికే వూళ్ళో జనమంతా అక్కడికి వచ్చారు అంతా గోలగోలగా వుంది

చనిపోయిన కానిస్టేబులు మీదపడి అతని భార్యాపిల్లలు ఏడుస్తున్నారు దీనాతి దీనమైన వాళ్ళ ఏడుపు వింటుంటేే కడుపులో చెయ్యిపెట్టి దేవినట్టుంది లింగయ్యని తీసుకొచ్చి బల్లమీద పడుకోబెట్టారు ఏడుపులతో, వూళ్ళోవాళ్ళ హడావిడితో అంతా గందరగోళంగా వుంది వూళ్ళోని జనమంతా అక్కడ పోగయ్యారు ఆఫీసర్లకు తెలియజెయ్యటానికి రిపోర్టులు రాస్తున్నాడు సార్జెన్ ఆ రాత్రి యస్సై హెడ్క్వార్టర్సులో లేక పోవటం మూలాన అంతా హెడ్కానిస్టేబులు మీదపడింది చనిపోయిన కమ్యూనిస్టు దగ్గర ఇద్దరు పీసీల్ని తుపాకు లిచ్చి నిలబెట్టారు అక్కడకి ఎవ్వరినీ రానివ్వటంలేదు చనిపోయిన పీసీ భార్యపిల్లల్ని పక్కకు తీసుకెళ్ళటానికి మిగిలిన ఆడవాళ్ళు ప్రయత్నం చేస్తున్నారు బల్లమీద కూర్చుని గోడకానుకున్నాడు ప్రకాశం అతని ముఖంలో ఆవేదన, దైన్యం గూడుకట్టుకొనివుంది కళ్ళుమూసుకుని తలపట్టుకుని ఉండిపోయాడు. ఆ వాతావరణం అతనికి పిచ్చెక్కించేలా వుంది

''అయ్యా! అయ్యా!'' కంగారుగా దగ్గరకు వస్తూ పిలిచింది తల్లి కళ్ళు తెరిచిచూశాడు తల్లీ, భార్య వచ్చారు భార్య చేతుల్లో కూతురు వుంది పిల్లవాడు బిక్కమొహం వేసుకుని నిలబడి వున్నాడు వాళ్ళ ముఖాల్లో తీవ్రమయిన ఆందోళన కనిపిస్తోంది

''అయ్యా! నీకేం కాలేదుగా!'' అంది తల్లి ప్రకాశం చేతిని తడుముతూ అతను నిర్లిప్తంగా చూశాడు భార్య చేతుల్లో ని కూతురివైపూ కొడుకువైపూ మార్చి మార్చి చూశాడు ''అయ్యా!

ఏందిరా మాట్లాడవు'' అందితల్లి ఆమె గొంతులో కంగారు కనపడింది

''నాకేం కాలేదులే మీరింటికిపోండి'' అన్నాడు చిన్నగా వాళ్ళు విని, నిలబడ్డారు అలాగే మళ్ళీ చెప్పాడు ''ఏం పరవాలేదులే మీరు ఇంటికిపోండి నేనొస్తాపోండి'' అన్నాడు వాళ్ళు చనిపోయిన పీసీని, దూరంగా పడివున్న కమ్యూనిస్టు శవాన్ని చూస్తూ చిన్నగా కదిలారు ప్రకాశం లేచాడు చిన్నగా సార్జెన్ కేకేశాడు

''ఇదిగో ప్రకాశం నువ్వూ పంతులూపోయి, ఈ కాగితాలు డి యస్పీ దొరగారికీ, యస్పీ దొరగారికి ఇచ్చి విషయం చెప్పాలి యస్పై గారుకూడా డి యస్పీ దొర గారి దగ్గరే వున్నారు బహుశా మీకంటే ముందే ఫోనుద్వారా సి ఐ గారు చెపుతారనుకో నేను సి ఐ గారికి కబురు పంపిస్తాను మీరు త్వరగా బయలుదేరండి'' అని కాగితాలు వున్న కవర్లు చేతికిచ్చాడు

కవర్లు అందుకుని, అవి తీసుకున్నట్టు జనరల్ డైరీలో సంతకాలు పెట్టి, తుపాకులు, తూటాలు తీసుకుని ప్రకాశం, పంతులు బయలుదేరారు 'గభాలున ఇంటికెళ్ళి ఏదన్నా ఇంతతిని, స్నానం చేసుకుని బయలుదేరితే బాగుంటుంది మళ్ళీ ఇంటికొచ్చే సరికి ఎంతటయిమయ్యిద్దో' అనుకున్నాడు ప్రకాశం అదేమాట పంతులుతో అంటే ససేమిరా కాదన్నాడు 'పిరికి పంతులు' అని తిట్టుకుంటూ బయలుదేరాడు ప్రకాశం

వూళ్ళో జనం గుంపులుగా వస్తున్నారు స్టేషను దగ్గరకు 'ఆ కమ్యూనిస్టుకోసం ఎవరూ వచ్చినట్టులేదు ఇంతవరకు' అనుకున్నాడు ప్రకాశం వాళ్ళు డి యస్పీకి, యస్పీకి కాగితాలు ఇచ్చి తిరిగొచ్చే సరికి రాత్రి బాగా పొద్దుపోయింది వాళ్ళు స్టేషన్ కొచ్చేసరికే యస్పీ వచ్చేశాడు స్టేషనుకు

''ఆ శవాన్ని ఆసుపత్రికి తీసుకుపోవాలి పోస్టుమార్టంకు ఎస్కార్టు పోవాలి మీరెక్కడికీ పోగాకండి'' అన్నాడు రైటరు ఆ మాటకు మింగేసేలాగా చూశాడు ప్రకాశం కాని బలవంతంగా దిగమింగుకొని మౌనంగా బైటకొచ్చి నిలబడ్డాడు శరీరం పచ్చి పుండులాగా వుంది కోపంతో కడుపు భగభగమంటోంది వుద్రేకంతో కణతలు నొప్పెడుతున్నయ్ తన మీద తనకే కోప మొచ్చింది ఓ పది నిముషాలు గడిచాక, కొంచెం ప్రశాంతంగా ఆలోచించాడు 'ఎవరిమీద కోప్పడి ఏం లాభం? ఈ నౌకరీ లక్షణమే అంత' అనుకున్నాడు ఎవరెవరేం పనులు చేస్తున్నారో గమనించాడు పోస్టుమార్టంకు వెళ్ళటానికి ఇంకో గంటో, అరగంటో టైం పట్టేలాగా తోచింది 'ఈ లోపు కామ్‌గా వెళ్ళి భోంచేసి రావటం ఉత్తమం చెప్పా చెయ్యకుండా పోయిరావటమే ఎవరి నడిగితే ఎవరు పంపిస్తారు?' అనుకున్నాడు చిన్నగా లోపలికెళ్ళి తుపాకీ స్టేషన్లో పెట్టి గబగబా ఇంటికెళ్ళాడు స్నానంచేసి, భోంచేశాడు మాసిపోయిన యూనిఫారం తీసేసి, ఇస్త్రీ చేసింది వేసుకుందా మనుకున్నాడు కాని ఆ వుద్దేశ్యం మానుకున్నాడు 'ఈ శవాలకి ఎస్కార్టు చేసేసరికి ఎలాగూ యూనిఫారం గలీజయిపోయిద్ది కాబట్టి ఇదే వేసుకోవటం మంచిది' అనుకున్నాడు వేసుకుంటూ వాసన చూశాడు చెమటతో నాని, మాగు వాసన వేస్తోంది కష్టంగా తొడుక్కున్నాడు ఇంట్లో చెప్పి స్టేషను కొచ్చాడు

''రాత్రిళ్ళు ఎస్కార్టు వద్దన్నారు దొరగారు రేపు చీకటితో బయలుదేరాలి అందరూ స్టేషనులోనే వుండాలి'' అన్నాడు రైటరు విని వూరుకున్నాడు ప్రకాశం స్టేషనుకే కాకుండా చనిపోయిన కమ్యూనిస్టు శవంవద్ద ఇద్దరు కానిస్టేబుళ్ళు చొప్పున, మూడేసి గంటలు సెంట్రీ డ్యూటీ చేశారు ఆఫీసర్లు స్టేషన్‌లోనే వున్నారు ఆ రాత్రి గాలి గట్టిగా వీచినప్పుడల్లా శవంమీది నుంచి దుర్వాసన వస్తూవుంది 'శవంకోసం కమ్యూనిస్టులు దాడి చెయ్యవచ్చు' అనే వుద్దేశ్యంతో

అందరూ జాగ్రత్తగా వున్నారు

మూడుగంటలు సెంట్రీ డ్యూటీ చేసి, దిగిపోయి పడుకోవటానికి చోటుకోసం వెతికాడు ప్రకాశం స్టేషన్లో ఎక్కడా చోటు లేదు బయట వరండాలో పడుకోవటానికి వీలులేదు లాకప్ తలుపు పక్కనే కంబడి దులిపి పక్క వేసుకున్నాడు లాకప్పులో నుండి ముక్కులు పగిలిపోయే వాసన వస్తోంది ఆ వాసన దెబ్బకు వస్తున్న నిద్ర కూడా ఎగిరిపోయింది అక్కడ నుండి లేచిపోయి వెనకభాగం వైపుకు వెళ్ళి తలుపు పక్కన పక్క వేసుకున్నాడు తుపాకీ పక్కలో పెట్టుకొని పడుకున్నాడు ఏదో ఆలోచిస్తూ

''ప్రకాశం!'' చిన్నగా పిలిచాడు వెనక సెంట్రీ

''ఆ!''

''వాడు సీతిగాడు లేడూ, రాత్రి స్టేషన్లో నుండి పారిపోయాడంట'' అన్నాడు ఆ మాట ప్రకాశం ఆశ్చర్యంగా విన్నాడు ''వాడిని బొద్దున్నే అరెస్టుచేసి సర్కిలాఫీసుకు పంపారు తరువాత ఏం చేస్తారో?''

''భయపడి వుంటాడు పాపం అందరం అంతేగా పారిపోవటానికి వీలులేక నిలబడ్డాంగాని మనం'' అన్నాడు ప్రకాశం

''అంతే అంతే ఎంతయినా ప్రాణం మీద తీపికదా, కానివాడు మరీ వెధవలె'' అన్నాడు సెంట్రీ

సీతారామయ్య గుర్తుకొచ్చాడు ట్రైనింగు స్కూలు నుండీ అతను పరిచయం ఒకే బేచ్చీ 'ఇంత వయస్సొచ్చినా అతనికి కులమతాల పట్టింపులు పోలేదు వంటినిండా కరుడుగట్టిన స్వార్ధం అంత ప్రమాదంలో కూడా తన ప్రాణం తనుచూసుకున్నాడు ఇప్పుడేమయ్యింది ఎవడి బ్రతుకెట్లాంటి మలుపుతిరిగిద్దో అతన్ని చూచి అయ్యోపాపం అనే వాళ్ళు ఒక్కళ్ళు కూడా లేరు, కనీసం అతని కులస్థులు కూడా ఎందుకాబతుకు?' అనుకున్నాడు

అదే విషయం ఆలోచిస్తూ నిద్రలోకి జారిపోయాడు ప్రకాశం చీకటితోనే నిద్ర లేచారు అప్పటికే ఒంటెద్దు బండిమీద, చనిపోయిన కమ్యూనిస్టుని చాపలో చుట్టిపెట్టారు వెట్టివాళ్ళు కనీసం కాలకృత్యాలు తీర్చుకునే టైం కూడా లేదు గబగబా వట్టి నీళ్ళతో ముఖం కడుక్కున్నారు శవానికి ఎస్కార్టు చేస్తూ పదిమైళ్ళు నడిచారు పదిగంటల కల్లా వాళ్ళు తాలూకా ఆసుపత్రి చేరారు పోస్టుమార్టం అయిపోయేసరికి ఒంటిగంట అయ్యింది శవాన్ని తీసుకుపోవటానికి ఎవరూ రాలేదు ఆ వూళ్ళోని వెట్టివాళ్ళని ఇద్దరిని వెతుక్కుని వాళ్ళకు సారాయి పోయించి, చెరొక బేడా ఇచ్చి, శవాన్ని తీసుకుపోయి గుంటతీసి పూడ్చిపెట్టించే సరికి మూడుగంటలు దాటింది బస్సు దొరికి స్టేషను కొచ్చేసరికి రాత్రి ఏడు దాటింది

''మీరు పోయి అయిదు నిముషాల్లో రావాలి, తెలిసిందా'' అన్నాడు యస్సై

అంతా తలలూపారు తుపాకీ, తూటలూ స్టేషన్లో పెట్టారు లోపల ఆఫీసర్లు ఇద్దరు ఆడవాళ్ళనీ, ఒక ముసలతన్ని ఏదో అడుగుతున్నారు ఆడవాళ్ళల్లో ఒక మనిషిముసలామె 'ఆమె చనిపోయినతని తల్లి అనుకుంటా' అనుకున్నాడు ప్రకాశం మసక వెలుగులో, దూరంగా వున్న వీళ్ళకు ఆమె సరిగా కనిపించలేదు రెండో ఆడ మనిషికి ఇరవై అయిదు సంవత్సరాలు వయస్సుంటుంది చనిపోయిన కమ్యూనిస్టు భార్య ఆమె

ప్రకాశం పోయి గబగబా స్నానం చేసి, భోంచేసి వచ్చాడు స్టేషన్లో ఎవరినో విపరీతంగా కొడుతున్నారు లోపలికి తొంగి చూశాడు డి యస్పీ ఒక పక్కన కూర్చుని వున్నాడు యస్సై

అతని ప్రక్కనే నిలబడి వున్నాడు ఇద్దరు కానిస్టేబుళ్ళు లావుపాటి లాఠీలతో ఒక ముసలతన్ని కిందపడేసి గొడ్డుని బాదినట్టు బాదుతున్నారు

''చెప్పు నా కొడకా నీకు తెలిసిన వాళ్ళ పేర్లు చెప్పు'' అంటున్నాడు యస్సై

ముసలతను బాధతో ఉండచుట్టుకుపోయాడు నోటితో చెప్పలేక తెలియదన్నట్టు చేతులు వూపుతున్నాడు కర్రలదెబ్బలు, ఆ ఎముకల గూడు మీద తగులుతుంటే, రక్ రక్ మని శబ్దం వస్తోంది

ఆడవాళ్ళిద్దర్నీ లాకప్‌లో వేశారు ముసలతన్ని కొట్టే దెబ్బలకు వాళ్ళిద్దరూ తట్టుకోలేక పోతున్నారు ముసలావిడ తలని తలుపుకేసి కొట్టు కుంటోంది నుదురు చిట్లి నెత్తురు సన్నగా ముఖం మీదగా కారుతోంది గొంతు బొంగురు పోయేలాగా అరుస్తోంది ''దొరా, ముసలోడ్ని చంపబాకండి మాకేం తెలవదు దొరా '' అంటోంది

లాఠీ దెబ్బల శబ్దాల్లో, ముసలామె మాటలు ఎవ్వరికీ వినపడటం లేదు దెబ్బ దెబ్బకు ఒక్కొక్క ఎముక విరగటమో, చిట్లటమో జరుగుతోంది ముసలతని శరీరమంతా వాచి, నెత్తురుకారి కాలవ కట్టింది తలంతా బొప్పెలు కట్టింది ముఖం నిండా నెత్తురు నిండి, ఎండి చారలు కట్టింది అలుపు తీర్చుకోవటానికన్నట్లు ఒక్క క్షణం ఆగారు ఆ ఇద్దరు పీసీలు వాళ్ళు రొప్పుతున్నారు

''వూ౦ ఏం ఆగారు?'' కళ్ళురిమి చూశాడు డి యస్పీ

''కానివ్వండిరా'' వంతపాడాడు యస్సై

పళ్ళు పట పటా కొరుకుతున్నారు పీసీలు క్రీగంట్లతో డి యస్పీ వైపు చూచి, ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు ఇద్దరిమధ్యా మాంసం ముద్దలా పడివున్న ముసలతని శరీరాన్ని లాఠీలతో బాదసాగారు ముసలతను గట్టిగా అరిచాడు చిరిగి పీలికలైవున్న పంచెలో మలమూత్రాలు విసర్జించాడు కాళ్ళూ చేతులూ గిజ గిజా కొట్టుకున్నాడు తరువాత అచేతనంగా వుండిపోయాడు ప్రాణం పోయిన శరీరాన్ని కూడా అదే పనిగా కొడుతున్నారు వాళ్ళు రెండు నిముషాల తరువాత దుర్గంధం వాళ్ళ ముక్కుల్ని తాకి, కొట్టటం ఆపేశారు

''ముసలి నాకొడుకు గలీజు చేసినట్లున్నాడు సార్'' అన్నాడు యస్సై డి యస్పీతో

''వాడిని లేపి బయటకు తీసుకెళ్ళండి'' అన్నాడు డి యస్పీ కుర్చీలోంచి లేచి బయటకెళుతూ యస్సై అతన్ని అనుసరించాడు

''ఈ ముసలోడికి తెలుసునోయ్ వీడు ముగ్గురు నలుగురు కమ్యూనిస్టుల పేర్లు చెప్పినా చాలు మనకి తన్నుకుంటూ ప్రమోషను వచ్చిద్ది'' అంటున్నాడు డి యస్పీ నవ్వుతూ కళేబరాల్ని పీక్కుతినే రాబందులాగా ఆనందపడిపోతూ వున్నాడు అతను

''అవును సార్, అవును సార్'' అంటున్నాడు యస్సై లొట్టలేసుకుంటూ

ముసలతన్ని లేపటానికి అతని చెయ్యి పట్టుకున్నాడు ఒక పీసీ చేతులు చల్లగా వున్నయ్ వులిక్కిపడి వదిలి పెట్టాడు గబగబా వెళ్ళి రైటరు బల్లమీద వున్న లాంతరు తెచ్చి చూశారు అచేతనంగా పడివున్న ముసలతని ముక్కుల్లో నుండి నెత్తురు చుక్కలు చుక్కలుగా కారి గచ్చంతా పాకుతోంది వాళ్ళలా ముసలతన్ని పరీక్ష చెయ్యటం, కంగారుగా అటూ ఇటూ తిరగటం, వుసకబారిన కళ్ళతో లాకప్పులో నుండి చూస్తున్న ముసలవ్వ స్పృహతప్పి కుప్పలా కూలిపోయింది

ముసలతని విషయాన్ని రైటరుకు చెప్పాడు ఒక మఫ్టీ పీసీ ఆ విషయం బైటకెళ్ళి యస్సైకి,

డి యస్పీకి చెప్పాడు రైటరు ఆమాట విని క్షణం సేపు మౌనంగా వుండిపోయారు ఇద్దరు ఆఫీసర్లూ అంతలోనే తల పంకించాడు డి యస్పీ ''అలా కొట్టకూడదోయ్ వాడు ఛస్తే మనకేగా నష్టం చూడు ఇప్పుడు'' అన్నాడు డి యస్పీ, చాలా మామూలు ధోరణిలో

''అవును సార్'' అన్నాడు యస్సై గొర్రెలాగా తలూపుతూ

''తీసుకుపోయి అవతల పారేసి రమ్మను'' అన్నాడు డి యస్పీ కొంచెం విసుగ్గా

లాకప్పులోని యువతి గుండెలు పగిలేలా ఏడుస్తోంది మూడు నెలల గర్భవతిగా వున్న ఆమె కడుపులోని పేగులు, ఆపుకోలేని ఏడుపుకు అల్లకల్లోల మౌతున్నాయి

లాకప్పులో వున్న వాళ్ళని ఆ పరిస్థితిలో చూస్తుంటే, తన తల్లీ, భార్యా గుర్తుకొచ్చారు ప్రకాశంకు బాధగా గుటకలు మింగి పక్కకెళ్ళాడు సన్నగా తలనొప్పి వస్తోంది 'వాళ్ళిన్ని కష్టాలు పడటానికి కారణం నేనే' అనే భావం కలిగింది 'తాను కాల్చటం వల్లనే అతను చనిపోయాడు అతన్ని చూచి, అతని కుటుంబాన్ని తీసుకువచ్చారు ఇప్పుడీ ముసలతను చనిపోయాడు మిగిలిన ఆడవాళ్ళిద్దర్నీ కూడా చంపకుండా వదిలిపెడతారనే నమ్మకం ఏమీ లేదు' అనుకున్నాడు కణతలు నొక్కుకుంటూ స్టేషను వెనక్కు వెళ్ళాడు చనిపోయిన ముసలతన్ని కాళ్ళూ, చేతులూ పట్టుకొని, చచ్చిన గొర్రెని మోసినట్టు, తెచ్చి దొడ్డివైపు గడప పక్కన పడవేశారు మస్టీ పీసీలు ఒకళ్ళ నొకళ్ళు తిట్టుకుంటూ, ఆఫీసర్లని తిడుతూ చెంబుతో నీళ్ళు తెస్తూ లోపలపోసి శుభ్రం చేశారు

''ఏదేమైనా మనం ఇనఫర్మేషన్ తీసుకోగలగాలి'' అంటూ లోపలి కొచ్చాడు డి యస్పీ

''సార్ సార్ ''తోకలా వెనకాలే వచ్చాడు యస్సై

''హ్ అబ్బా ఏమిరా దొంగ నా కొడకల్లారా, సరిగ్గా కడగలేదు'' కోపంగా తిట్టాడు పీసీల్ని డి యస్పీ పీసీలు ఎవరూ ఏమీ మాట్లాడలేదు డి యస్పీ మళ్ళీ బయటకు నడిచాడు

''వూ త్వరగా కానీయ్యండి కాస్త సుబ్బరంగా రుద్ది కడగండి లేకపోతే వాసన పోదు'' అని, యస్సై డి యస్పీతో పాటు బయటికెళ్ళాడు మళ్ళీ

''రేయ్ కుర్చీ ఇటు పట్రారా రైటర్'' కేకేశాడు డి యస్పీ

కుర్చీ తీసుకుని బయటకు పరిగెత్తాడు రైటరు

''దాన్ని, ఆ కుర్ర లంజని ఇటు లాక్కురండి'' అన్నాడు డి యస్పీ

లోపలికెళ్ళి రెక్క పట్టుకొని తీసుకొచ్చి నిలబెట్టాడు ఆ యువతిని రైటరు ఆమె వెక్కిళ్ళు పెడుతోంది

''జాగర్త పారిపోయిద్ది అందరూ లోపల ఏంచేసి చస్తున్నారు'' కేకేశాడు యస్సై ఇద్దరు పీసీలు బైటకొచ్చారు ఆ కేక విని

డి యస్పీ ఆమె వంక పరీక్షగా చూశాడు ''ఏమే, కడుపుతో వున్నట్టున్నావ్ మీకెందుకే లంజా పిల్లలు'' అంటూ కుర్చీలో కూర్చునే చటుక్కున కాలితో తన్నాడు ఆమె చప్పున ఒక అడుగు వెనక్కు వెయ్యటం వల్ల పొత్తి కడుపుకు తగలాల్సిన ఆ బూటు దెబ్బ త్రుటిలో తప్పిపోయింది భయంగా కడుపు మీద రెండు చేతులూ అడ్డుపెట్టుకుంది వెనక్కు అడుగు వేసిన ఆమెని ముందుకు నెట్టాడు రైటరు

''పార్టీలో తిరిగే మీకు పిల్లలెందుకే '' మాటలు మధ్యలోనే ఆపి, ''ఛీ, లంజను అవతలకు లాగవయ్యా, బేడ్ స్మెల్ వస్తోంది'' అన్నాడు ముఖం చిట్లించి డి యస్పీ

''వెనక్కురా '' జుట్టు పట్టుకుని వెనక్కులాగాడు రైటరు విసురుగా తూలిపడబోయి

నిలదొక్కుకుంది ఆమె

''మంచిగా చెప్పు లేకపోతే నీ గతికూడా అంతే నీ మొగుడి దగ్గరకు పోతావు పోయి ఇద్దరూ ఆ లోకంలో పార్టీ పెడుదురు గాని నీ మామ ఏమయ్యాడో చూశావుగా మర్యాదగా నలుగురి పేర్లు చెప్పు నిన్ను వదిలిపెడతా గవర్నమెంటుకు చెప్పి మంచి బహుమాన మిప్పిస్తా నిన్ను కొట్టను నువ్వు పట్నం పోయి ధర్మాసుపత్రిలో పురుడు పోసుకోవచ్చు కొడుకో, కూతురో పుడతారు ''

అంత బాధలోనూ ఆమె మనసులో పుట్టబోయే బిడ్డమీద తియ్యటి మమకారం మెరుపులా మెరిసి మాయమయ్యింది

''లేకపోతే నీ మొగుడి లాగానే నువ్వు కూడా దిక్కులేని చావు చస్తావు ఆలోచించుకో తర్వాత నీ యిష్టం ఆడదానివనీ, కడుపుతో వున్నావని జాలి తలుస్తామనుకోగాకు'' అన్నాడు డి యస్పీ

కొద్దిసేపు నిశ్శబ్దం అలుముకుంది ఆమె బాధగా, దీర్ఘంగా నిట్టూర్చింది వెక్కిళ్ళు వస్తూ వున్నాయి ఇంకా చెట్లమీద పక్షులు అరుస్తున్నాయ్, లాకప్‌లో ముసలావిడ పరిస్థితి ప్రమాదకరంగా వుంది స్టాఫంతా అలసటతో విసిగిపోయి వున్నారు అంతా అయోమయంగా, పిచ్చిగా, యంత్రాల్లా తిరుగుతూ పనులు చేస్తున్నారు

'దీన్ని కొట్టకుండా, బుజ్జగించి నలుగురి పేర్లన్నా, కనీసం ఇద్దరి పేర్లన్నా లీక్‌చేయించగలిగితే, ప్రమోషన్ రావటానికి మంచి అవకాశం ' ఇలాటి ఆలోచనల్లో మునిగిపోయాడు డి యస్పీ 'ఈ కమ్యూనిస్టుల వల్ల మనకెంత లాభమో' అనుకున్నాడు మళ్ళీ

'ఈ లంజాకొడుక్కి ఈ రాత్రికి ఏ గుంటని తీసుకురావాలో ' అనే ఆలోచనలో మునిగిపోయాడు యస్సై

ఎవరి ఆలోచనలతో వాళ్ళు వున్నారు

ఆమె డి యస్పీ ముందు నిలబడి వుంది మౌనంగా కళ్ళు తిరుగుతున్నయ్ ఆమెకు ఏ క్షణంలో నయినా తూలి పడిపోతానేమో ననే భయం ఆమెలో బలపడుతోంది పచ్చి మంచి నీళ్ళు కూడా ఇంతవరకు తాగలేదు అతి కష్టంమీద నిలదొక్కుకుని నిలబడుతోంది మానసికంగా ఆమె చిత్రవధలకు గురైంది

''దీన్ని తీసుకుపోండి'' అన్నాడు డి యస్పీ రెక్క పట్టుకొని లోపలకు తీసుకువెళ్ళాడు రైటరు

''దానిక్కాస్త తిండీ తిప్పలు చూడు రేపు దాన్ని ఇంటరాగేషన్ చేయ్యాలి ఇప్పుడు నాకు మూడేం బాగాలేదు పైగా దాని మొగుడూ, మామా ఇద్దరూ చచ్చారు కదా ఇప్పుడదేమీ చెప్పలేదు'' అన్నాడు యస్సైతో డి యస్పీ

''అవును సార్ నేనూ అదే చెపుదా మనుకుంటున్నా తమరికి ఇప్పుడు ఈ దుఃఖం మీద ఏమీ లాభం వుండదని నా వుద్దేశ్యం సార్ దీనికి తప్పకుండా మిగతావాళ్ళల్లో కొంతమందైనా తెలిసుండాలి సార్ వీళ్ళ మట్టాల్లో '' డి యస్పీ చూచిన చూపుకి భయపడి చప్పున తన ప్రసంగాన్ని ఆపేసి, బిత్తరపోయినట్లు చూశాడు యస్సై

డి యస్పీ తలతిప్పి ఎటో చూస్తూ ఆలోచనలో మునిగిపోయాడు యస్సై మనస్సులోనే తిట్టుకుని పళ్ళు నూరుకున్నాడు రెండు నిముషాల తరువాత తేరుకున్నట్లు చిన్నగా నసుగుతూ,

''తమరు ఈ రాత్రికి ఇక్కడే ''

''ఆఁ ఉండకపోతే ఎట్లా ''

'ఎందుకుండవ్ తినమరిగిని కోడివి కదా' అనుకున్నాడు మనస్సులో యస్సై 'ఈ రాత్రికి వీడి దగ్గరకు దేన్ని తీసుకురావాలో?' అనే ఆలోచనలో పడ్డాడు

''ఏయ్''

వులిక్కిపడ్డట్లు ఆలోచనల్లో నుండి తేరుకుని డి యస్పీ వైపు చూశాడు యస్సై

''రాత్రికి స్టేషనుకు గట్టి గార్డు వెయ్యి ఆడోళ్ళిద్దరనీ తీసుకుపోవటానికి కమ్యూనిస్టులు రావచ్చు ఆ ముసలోడి శవాన్ని బాగా దూరంగా అడవిలో పడేసి రమ్మను'' అన్నాడు డి యస్పీ

యస్సై రైటర్ని కేకేశాడు రైటరు వచ్చి, సెల్యూట్ చేసి నిలబడ్డాడు ''రాత్రికి స్టాఫంతా స్టేషన్లో వుండాలి ముందు ఇద్దరు, వెనక ఇద్దరు చొప్పున సెంట్రీలను నియమించి చాలా కేర్‌ఫుల్‌గా వుండాలి యస్పీ దొరగారు వస్తారు'' అన్నాడు

''అలాగే అయ్యా!'' అన్నాడు విధేయత ఒలకబోస్తూ రైటరు

''ఏదన్నా అయిందో నిన్ను నరుకుతా జాగర్త'' అన్నాడు డి యస్పీ

రైటరు సెల్యూట్ చేసి లోపలికెళ్ళాడు. ఏదో ఆలోచన వొచ్చినవాడిలా యస్సైతో అన్నాడు డి యస్పీ ''ఈ రాత్రికే దీన్ని ఇంటరాగేట్ చేస్తే, తెల్లారేసరికి, అదే యస్పీ వచ్చేసరికి ఇనఫరమేషన్ తెలిసిపోయిద్ది కదా ''

''అవును సార్'' అన్నాడు యస్సై

''దాని దగ్గర కొంచెం బాడ్ స్మెల్ వస్తున్నట్టుంది సరే రైటర్ని పిలువు'' అన్నాడు మళ్ళీ యస్సై రైటర్ని కేక వేశాడు

రైటరు గబగబా తన సహజ ధోరణిలో బైటకువచ్చి సెల్యూట్ చేసి నిలబడ్డాడు వినయంగా కొద్దిగా వంగి ఆరోజు అది వెయ్యో సెల్యూట్

''నువ్వు దాన్ని తీసికెళ్ళి సుబ్రంగా స్నానం అదీ చేయించి, కొంచెం అన్నం పెట్టి పదకొండు గంటల కల్లా నా క్యాంపు దగ్గరకు పంపించు జాగర్త'' అని కళ్ళురిమాడు డి యస్పీ

ఆ చూపుకి ఆజానుబాహుడైన రైటరు గజగజా కంపించాడు ''అట్లాగే నయ్యా'' అని సెల్యూట్ చేశాడు కళ్ళతోటే వెళ్ళమన్నట్టు సైగచేశాడు డి యస్పీ రైటరు లోపలికెళ్ళి బల్లమీద కూర్చుని ఆలోచనలో మునిగిపోయాడు

''దీనమ్మ బతుకు '' కసిగా తిట్టుకున్నాడు చేతిలోని పెన్సిల్ని విసిరేశాడు బల్లమీదకు 'దీన్ని ఇంటికి తీసుకుపోతే నా పెళ్ళాం బతకనియ్యదు ఆఫీసరు కన్నా ఎదురు తిరగగలనేమో కాని, పెళ్ళాన్ని సముదాయించలేను కదా' అనుకున్నాడు ఏం చెయ్యాలో పాలుపోలేదు కిటికీలో నుంచి బయటకు చూశాడు డి యస్పీ యస్సైకేదో చెప్పి నవ్వుతున్నాడు లైటు వెలుగులో మసకగా కనబడుతున్నారు 'ఈ నా కొడుకుల్ని, త్రీనాట్ త్రీతో ' తిట్టుకుంటూ దొడ్డివైపు తల తిప్పాడు ప్రకాశం కనపడ్డాడు

''ప్రకాశం! ఓయ్ ప్రకాశం '' గట్టిగా కేకేసి పిలిచాడు ఆ పిలుపుకి ప్రకాశం లోపల కొచ్చాడు అతని ముఖం పీక్కుపోయి వుంది లోపల అడుగుపెట్టటంతోనే మలమూత్రాల వాసన ఘాటుగా తగిలింది అతనికి

''ఏంది సార్?'' అన్నాడు రైటరుతో

''నువ్వు ఆ కుర్రదాన్ని తీసుకెళ్ళి కాస్త స్నానం అదీ చేయించి ''

రైటరు మాటలు పూర్తికాకముందే, ''ఎక్కడికీ? '' కోపంగా అన్నాడు ప్రకాశం నొసలు చిట్లించి

''ఇంకెక్కడికి డి యస్పీ దొరగారు చెప్పారు''

''దేవుడు చెప్పినా తీసుకెళ్ళను మొగోళ్ళు చేసే ఉద్యోగాలు చెప్పు పిచ్చితనంగా పనులు చెప్తావంటే మర్యాద దక్కదు'' అని చప్పున వెనక్కు తిరిగాడు

''అదే మాట డి యస్పీ దొరకు చెపుతా'' గుటకలు మింగుతూ అన్నాడు రైటరు మేకపోతు గంభీర్యాన్ని ప్రదర్శిస్తూ

''యస్పీకి చెప్పుకో పోయి నీబోటి వాళ్ళను చాలామందిని చూశా,పో'' అని చరచరా బైటకు వెళ్ళాడు రైటరు కోపంగా పళ్ళు కొరుక్కున్నాడు అసహనంగా అటూ ఇటూ కదిలాడు గట్టిగా నిట్టూర్చి లేచాడు లాకప్ దగ్గరగా వెళ్ళి పిలిచాడు విసుగ్గా

''భాగ్యమ్మా ! ఓ భాగ్యమ్మా!''

ధూళిలో, చీకటిలో, ఓమూల ఒరిగి నిస్తేజంగా పడివున్న భాగ్యమ్మ ఎవరో పిలిచారని తలెత్తి చిన్నగా కళ్ళెత్తి చూసింది చీకట్లోకి ఎవరూ కనిపించలేదు

''భాగ్యమ్మా'' గట్టిగా పిలిచాడు ఈసారి

''ఆఁ '' నూతిలో నుండి వచ్చినట్లు శబ్దం వినపడింది

''ఇటురా లేచి'' లాకప్ తాళం తీశాడు ఆమె లేవలేక లేచి నిలబడింది అడ్డం పడివున్న ముసలావిడ మీదుగా దాటి తలుపుదగ్గర కొచ్చింది

''బయటకు రా''

ఆమె బయట కొచ్చి నిలబడింది ప్రతిఘటన వలన ప్రయోజనం లేదని గ్రహించింది ఆమె అందుచేతనే ఇప్పటివరకూ అన్ని పనులూ వాళ్ళు చెప్పినట్లే ఆమె చేస్తోంది

''మా యింటికి రా, కాస్త తిండి తిందువుగాని ''

ఆ మాటకు ఆమె నిస్తేజంగా చూసింది దీర్ఘంగా నిట్టూర్చింది వెంటనే జవాబు ఏమీ చెప్పకుండా తలవంచుకుని వెనక్కి తిరిగింది చటుక్కున ఆమె భుజం పట్టుకున్నాడు రైటరు అతని కళ్ళల్లోకి చూచింది తలతిప్పి అంత చీకట్లోనూ ఆమె కళ్ళల్లో నిప్పుల కణికలు అతనికి కనపడ్డాయి చేతిపట్టు సడలించాడు కాని అంతలోనే తేరుకున్నట్టు గట్టిగా భుజం పట్టుకున్నాడు మళ్ళీ ''అదికాదే, నేను చెప్పేది విను ఎంతయినా మా యింటి చాకలివి పైగా కడుపుతో వున్నావు ఆఫీసర్ల ముందు అట్లా అనక తప్పటం లేదు గానీ, నీ మీద నాకేం కోపం లేదు రా'' అన్నాడు

ఆమె అయిష్టంగానే అడుగులు ముందుకు వేసింది తూలుతున్నట్టు ఇంటికెళితే భార్య ఏమంటుందో అన్న భయంతో అతనికి వళ్ళంతా చెమటలు పోస్తున్నాయి ముందు నుయ్యి, వెనకగొయ్యి వూరు అప్పుడే సద్దు మణుగుతోంది ఆమె రైటరు వెనక చిన్నగా అడుగులు వేసింది అంతటి భయంకరమైన బాధలోనూ ఆమె ఆలోచనలు సుడిగాలిలా తిరుగుతున్నయ్

''అయిపోయిందేదో అయిపోయింది ఎందుకొచ్చిన బాధ ఇదంతా నలుగురి పేర్లుచెప్పు వదిలిపెడతారు నువ్వూ మీ అత్తా సుకంగా వుండొచ్చు ప్రభుత్వం ఏదన్నా సహాయం చేసిద్ది ''

ముంచుకొస్తున్న ఏడుపుని పళ్ల బిగువున అణచి పెట్టుకుంటూ నిద్రలో నడిచినట్లు నడుస్తోంది ఆమె

'నువ్వూ మీ అత్త ' అతనన్న తరువాతి మాటలు సరిగా వినపడలేదు ఆమె ఆలోచనలు

భర్తపైనుండి, చనిపోయి లాకప్‌రూంలో పడివున్న అత్త మీదకు మళ్ళాయి ఆ ముసలావిడ చావుగురించి ఇంకా ఎవరికీ తెలియదు ముసలమ్మ తన కళ్ళముందు జరుగుతున్న సంఘటనలకు తట్టుకోలేకపోయింది ఆమె ప్రాణాలతోనే వుందనే వుద్దేశ్యంతో రైటరు ఆ మాటలు అంటున్నాడు

''అసలు మీకేం లోటొచ్చిందనే ఇంతింతలావు పనులు చేస్తున్నారూ? ఆయిగా నాలుగిళ్ళల్లో గుడ్డలుతుక్కుని నాలుగిళ్ళలో బువ్వడుక్కుని కమ్మగా గుడిసెలో సావక ఎందుకొచ్చినియ్యి ? అందులోనూ కడుపుతో వుంటివాయె ''

ఆమె ఆలోచనలు తిరిగి భర్త చుట్టూ పరిభ్రమిస్తున్నాయి పార్టీని గురించీ, పార్టీ కార్యకర్త బాధ్యతగురించీ, అతను చేప్పేమాటలు అమాయకంగా వినేది ఉద్రేకంతో అతను మాట్లాడేతీరుకు ఆశ్చర్యంగా చూసేది 'నా జీవితం పార్టీకే అంకితం చేస్తాను' అని అతను తరచుగా అనే మాటలు ఆమె చెవుల్లో గింగురు మంటున్నాయి

నీరసంతో, తడబడుతూ నడుస్తూ రైటరింటి దగ్గరకు చేరింది ఆమె నక్కడ నిలబెట్టి లోపల కెళ్ళాడు రైటరు లోపల భార్యకు విషయంచెప్పి ఆమెను ప్రసన్నం చేసుకునేసరికి అతనికి తల ప్రాణం తోకకువచ్చింది బయటకొచ్చి, గోడకానుకుని కూలబడివున్న ఆమెతో, ''నువ్వటు దొడ్డి వాకిలివైపురావే'' అన్నాడు

ఆమె నీరసంగా నడిచి దొడ్డివైపు వచ్చింది ఏదో నిర్ణయానికొచ్చిన దానిలా ఓపిక తెచ్చుకుంది సుభ్రంగా స్నానం చేసింది రైటరు భార్య ఇచ్చిన పాత చీర కట్టుకుంది వళ్ళంతా పచ్చి పుండులాగా అనిపించింది ఆమెకు స్నానం చేస్తున్నప్పుడు 'ఇంతగా ఏడ్చినందువలన పొట్టలోని బిడ్డకేమన్నా అయిద్దేమో' అని అనుమానంగా పొత్తికడుపు చేత్తో తడుముకుంది ఏమీ ఆలోచించకుండా గబగబా అన్నం తినింది

ఆమె అన్నం తింటుంటే బయటనుండి ఒక కానిస్టేబులు రైటర్ని కేకవేశాడు రైటరు బైటకెళ్ళాడు ''ఆమెని త్వరగా తీసుకు రమ్మనమని యస్పైగారు గొడవచేస్తున్నారుసార్'' అన్నాడు నవ్వుతూ ఆ పీసీ ''దీన్ని డి యస్పీగారికి అప్పగించిందాకా యస్పైకి ఇంటికిపోయే ప్రాప్తం లేదుకదా'' అన్నాడు అతనే మళ్ళీ అలాగే నవ్వుతూ

''తెస్తున్నానని చెప్పవయ్యా! దొంగ నాకొడుకులు మేమిక్కడ బ్రోకర్ల మనుకుంటారు ఈళ్ళమ్మల్ని ఇయ్యాల ఆళ్ళనీ ఈళ్ళనీ తెమ్మంటారు రేపు మా పెళ్ళాల్నే తెమ్మంటారు నా కొడుకుల్ని నరకాలి ఆ కమ్యూనిస్టు నాకొడుకులు స్టేషన్ల మీద పడటమే కాని ఈ ఆఫీసరు నా కొడుకుల జోలికిపోరు ''

''తొందరగా కానియ్యండి సార్ '' అన్నాడు ఆ పీసీ

''సరేలే నువ్వుపద, నేను తీసుకువస్తా'' అన్నాడు రైటరు వచ్చిన పీసీ వెళ్ళిపోయాడు సెల్యూట్‌చేసి రైటరు లోపలకువచ్చి అన్నం తింటున్న ఆమెతో, ''కడుపునిండా తినవే మొకమాట పడమాక'' అని భార్యవైపు తిరిగి, ''నాకు నీళ్ళుతోడే'' అన్నాడు

ఆమె అన్నంతిని కంచం కడిగి తిన్నచోటు సుభ్రం చేసింది ఇందాక రైటరూ, కానిస్టేబులూ మాట్లాడుకున్న మాటలు ఆమె చెవినపడ్డాయి అస్పష్టంగా రకరకాల ఆలోచనలు ఆమె బుర్రలో చోటుచేసుకున్నయ్ కొద్దిపాటి ఓపిక వచ్చింది భోంచేయటంవల్ల తననేం చేస్తారో అనే భయం ఆమెలో చోటు చేసుకుంటోంది రైటరు స్నానంచేసొచ్చి, తడిచిన తుండుగుడ్డని పిండి ఆరేస్తూ

ఆమెతో, ''ఏయ్ కాసేపు కూర్చోవే నేనూ అన్నం తిన్నాక స్టేషనుకుపోదాం'' అన్నాడు ఆమె విని వూరుకుంది రైటరు లోపలికెళ్ళాడు భోం చేయటానికి

ఆమె బాధగా గోడకానుకుని కూర్చుంది కొద్దిసేపటికి రైటరు భార్య ఎందుకో బయటకు వస్తే ఆమెతో, ''అమ్మగారూ కాలుమడుచు కోవలమ్మా'' అంది చిన్నగా

ఆమాటకు విరుచుకు పడింది రైటరుభార్య ''అది కూడా నాకు చెప్పాలంటే, బయటకు చావలేవూ'' అంది

ఆమె చిన్నగాలేచి, లోపలికి చూచి, దొడ్డి తలుపు తీసుకుని బయటకు వచ్చింది రైటరు భార్య లోపలకు వెళ్ళింది ''ఏమిటే?'' అన్నాడు రైటరు భార్యతో భోంచేస్తూ

''ఏమీలేదులే అన్నీ దరిద్రపు పనులు'' అని విసుక్కుంది భర్తమీద భోజనం చేస్తున్నంతసేపూ ఆరోజు జరిగిన విషయాలన్నీ కధగా చెప్పాడు రైటరు విసుగ్గా వూ కొట్టింది భార్య

''ఏమిటే, ఒక్కపూట ఒక్క మనిషికి కాస్త చద్దన్నం పెట్టినందుకు అంత బాధపడి పోతావూ? తప్పని పరిస్థితి అయి కానీ, లేకపోతే నేనుమాత్రం దాన్ని తిండికి తీసుకువస్తానా?'' అన్నాడు

''నాకోపం అదికాదు ఈ దొంగముండ మొగుడు కమ్యూనిస్టుకదా! అట్టాంటోడి పెళ్ళానికి తిండీతిప్పలు అన్నీ అంత శ్రద్ధగా ఏమిటి? ''

''పోనియ్‌వే, పాపం కడుపుతో వుంది''

ఆమె కాసేపు ఏమీ మాట్లాడలేదు ''మజ్జిగలోకి అన్నంలేదు, వట్టి మజ్జిగ కాసిని పోసుకుని తాగు'' అంది

అతను భోజనం ముగించి, లేచి దొడ్లోకొచ్చి నీళ్లు పుక్కిలించి వూశాడు అనుమానంగా అటూ ఇటూ చూశాడు గుండె ఝల్లుమంది ''ఇదేదే? ఏమేవ్ ఇదేదీ?'' కేకేశాడు అదుర్దాగా భార్యని

ఎంగిలిపళ్ళెం తీసుకొని భార్య దొడ్లోకొచ్చింది ''బయటకెళ్ళింది'' అంది ఆమె నింపాదిగా

''ఎప్పుడూ? ఎంతసేపూ? '' ఆదుర్దాగా దొడ్డితలుపు తీసుకుని బయటకు వచ్చి చూశాడు అంతా చీకటి ఎక్కడా మనిషి అలికిడిలేదు ఇంటికి పదిగజాల అవతలనుండి ఏపుగా పెరిగిన ఆముదపు చెట్లతో నిండిన పొలాలు క్షణాల్లో అతనికి ముచ్చెమటలు పోశాయి ''భాగ్యమ్మా, ఒసే భాగ్యం'' పేరుపెట్టి గట్టిగా పిలిచాడు జవాబులేదు కాటుకలాగా చీకటి కీచురాళ్ళ అరుపులు మృదువుగా వీస్తున్నగాలి

''ఏమేయ్'' లోపలికొస్తూ కేకేశాడు కోపంగా భార్యని ఆమె బయటకువస్తూ భర్తవైపు చూచింది ఏమిటన్నట్లు ''ఏదే అది నీకు చెప్పిందా?''

''ఆఁ నేనే పొమ్మన్నా బైట వుంటది చూడరాదూ ఎందుకా కేకలు''

''కేకలు కాదే నీయమ్మ '' చెయ్యెత్తి కొట్టబోయాడు తమాయించుకొని పెదాలు కొరుక్కున్నాడు ''అది కనపడకపోతే, ఇద్దరం చెరొక బొచ్చె తీసుకుని అడుక్కు ''

అప్పటికిగాని పరిస్థితి అర్ధంకాలేదు ఆమెకు అలాగే నిలబడి పోయింది అతను గబగబా చెప్పులు తొడుక్కుని, లాంతరు తీసుకుని బయటకు వచ్చాడు భార్యని తిడుతూ అంత చలిలోనూ చెమటలు పోస్తున్నాయి విపరీతంగా గుండె వేగంగా కొట్టుకుంటోంది కాళ్ళు వణుకుతున్నయ్ పిచ్చివాడిలాగా అటూ ఇటూ పరిగెత్తాడు పేరుపెట్టి కేకలేశాడు అతని భార్య

భర్తపైనుండి, చనిపోయి లాకప్‌రూంలో పడివున్న అత్త మీదకు మళ్ళాయి ఆ ముసలావిడ చావుగురించి ఇంకా ఎవరికీ తెలియదు ముసలమ్మ తన కళ్ళముందు జరుగుతున్న సంఘటనలకు తట్టుకోలేకపోయింది ఆమె ప్రాణాలతోనే వుందనే వుద్దేశ్యంతో రైటరు ఆ మాటలు అంటున్నాడు

''అసలు మీకేం లోటొచ్చిందనే ఇంతింతలావు పనులు చేస్తున్నారూ? ఆయిగా నాలుగిళ్ళల్లో గుడ్డలుతుక్కొని నాలుగిళ్ళలో బువ్వడుక్కొని కమ్మగా గుడిసెలో సావక ఎందుకొచ్చినియ్యి ? అందులోనూ కడుపుతో వుంటివాయె ''

ఆమె ఆలోచనలు తిరిగి భర్త చుట్టూ పరిభ్రమిస్తున్నాయి పార్టీని గురించీ, పార్టీ కార్యకర్త బాధ్యతగురించీ, అతను చేప్పేమాటలు అమాయకంగా వినేది ఉద్రేకంతో అతను మాట్లాడేతీరుకు ఆశ్చర్యంగా చూసేది 'నా జీవితం పార్టీకే అంకితం చేస్తాను' అని అతను తరచుగా అనే మాటలు ఆమె చెవుల్లో గింగురు మంటున్నాయి

నీరసంతో, తడబడుతూ నడుస్తూ రైటరింటి దగ్గరకు చేరింది ఆమె నక్కడ నిలబెట్టి లోపల కెళ్ళాడు రైటరు లోపల భార్యకు విషయంచెప్పి ఆమెను ప్రసన్నం చేసుకునేసరికి అతనికి తల ప్రాణం తోకకువచ్చింది బయటకొచ్చి, గోడకానుకుని కూలబడివున్న ఆమెతో, ''నువ్వటు దొడ్డి వాకిలివైపురావే'' అన్నాడు

ఆమె నీరసంగా నడిచి దొడ్డివైపు వచ్చింది ఏదో నిర్ణయానికొచ్చిన దానిలా ఓపిక తెచ్చుకుంది సుభ్రంగా స్నానం చేసింది రైటరు భార్య ఇచ్చిన పాత చీర కట్టుకుంది వళ్ళంతా పచ్చి పుండులాగా అనిపించింది ఆమెకు స్నానం చేస్తున్నప్పుడు 'ఇంతగా ఏడ్చినందువలన పొట్టలోని బిడ్డకేమన్నా అయిద్దేమో' అని అనుమానంగా పొత్తికడుపు చేత్తో తడుముకుంది ఏమీ ఆలోచించకుండా గబగబా అన్నం తినింది

ఆమె అన్నం తింటుంటే బయటనుండి ఒక కానిస్టేబులు రైటర్ని కేకవేశాడు రైటరు బైటకెళ్ళాడు ''ఆమెని త్వరగా తీసుకు రమ్మనమని యస్సైగారు గొడవ చేస్తున్నారుసార్'' అన్నాడు నవ్వుతూ ఆ పీసీ ''దీన్ని డి యస్పీగారికి అప్పగించిందాకా యస్సైకి ఇంటికిపోయే ప్రాప్తం లేదుకదా'' అన్నాడు అతనే మళ్ళీ అలాగే నవ్వుతూ

''తెస్తున్నానని చెప్పవయ్యా! దొంగ నాకొడుకులు మేమిక్కడ బ్రోకర్ల మనుకుంటారు ఈళ్ళమ్మల్ని ఇయ్యాల ఆళ్ళనీ ఈళ్ళనీ తెమ్మంటారు రేపు మా పెళ్ళాల్నే తెమ్మంటారు నా కొడుకుల్ని నరకాలి ఆ కమ్యూనిస్టు నాకొడుకులు స్టేషన్ల మీద పడటమే కాని ఈ ఆఫీసరు నా కొడుకుల జోలికిపోరు ''

''తొందరగా కానియ్యండి సార్ '' అన్నాడు ఆ పీసీ

''సరేలే నువ్వుపద, నేను తీసుకువస్తా'' అన్నాడు రైటరు వచ్చిన పీసీ వెళ్ళిపోయాడు సెల్యూట్‌చేసి రైటరు లోపలకువచ్చి అన్నం తింటున్న ఆమెతో, ''కడుపునిండా తినవే మొకమాట పడమాక'' అని భార్యవైపు తిరిగి, ''నాకు నీళ్ళుతోడే'' అన్నాడు

ఆమె అన్నంతిని కంచం కడిగి తిన్నచోటు సుభ్రం చేసింది ఇందాక రైటరూ, కానిస్టేబులూ మాట్లాడుకున్న మాటలు ఆమె చెవినపడ్డాయి అస్పష్టంగా రక రకాల ఆలోచనలు ఆమె బుర్రలో చోటుచేసుకున్నయ్ కొద్దిపాటి ఓపిక వచ్చింది భోంచేయటంవల్ల తననేం చేస్తారో అనే భయం ఆమెలో చోటు చేసుకుంటోంది రైటరు స్నానంచేసొచ్చి, తడిచిన తుండుగుడ్డని పిండి ఆరేస్తూ

రైటరు, పీసీతో పాటు యస్సై ఇంటి దగ్గరకు వెళ్ళాడు యస్సై వరండాలో పచార్లు చేస్తున్నాడు లోపల డి యస్పీ మంచం మీద పడుకొని సిగరెట్లు కాలుస్తూ, ఆలోచనలో మునిగిపోయాడు రైటరూ, కానిస్టేబులూ రావటం చూచి, కోపంతో పళ్ళు పటపట కొరికాడు యస్సై ఆలశ్యమయినందుకు

''ఎంతసేపురా దొంగరాస్కెల్, నీకోసం ఎదురుచూసేది'' అన్నాడు కోపంగా, లోపలకు వినపడకుండా చిన్నగా రైటరు గొంతు తడి ఆరిపోయింది చీకట్లోనే సెల్యూట్ చేసి భయంగా చూశాడు

''ఏది, అదేది? ఈ లంజాకొడుకు పదిసార్లు కలవరించాడు ఇంటి దగ్గర చిల్లిగవ్వకు పనికిరాడు ఏది, అదేది ?'' అన్నాడు అసహనంగా యస్సై

''సార్ '' గుటకలు మింగాడు రైటరు, చేతులు నలుపుకుంటూ

యస్సైలో సహనం చచ్చిపోతోంది కడుపులో ఆకలి దహించుకుపోతోంది ఆ మనిషి వస్తే, దాన్ని లోపలికి నెట్టి, తను వెళ్ళి పూటకూళ్ళ ఇంటినుండి వచ్చే తిండి తిని స్టేషన్లో పడుకోవాలి ఈ రాత్రికి రైటరు ప్రవర్తన అతనిలోని సహనాన్ని రెచ్చగొడుతోంది అనుమానం వచ్చింది రైటరు ప్రవర్తన చూచి

''ఏదయ్యా! ఆ లంజ ఏది?'' మీదపడి కొట్టే మనిషిలా చూశాడు యస్సై

''సార్ నేను దాన్ని స్టేషనుకు తీసుకొచ్చి వదిలిపెట్టాను సార్ రాములు పోగొట్టాడు సార్ '' ఏకబిగిన చెప్పాడు రైటరు

అతనేం చెప్పిందీ యస్సైకు అర్థం కాలేదు మొదట అయోమయంగా చూశాడు తను చెప్పిన మాటకు ఎలాంటి ప్రతిచర్యను ఎదుర్కోవాల్సి వస్తుందో అనేభయంతో ఒక అడుగు వెనక్కు వేసి వణుకుతూ నిలబడ్డాడు రైటరు పదిక్షణాలు గడిచాక విషయం అర్థమయ్యింది యస్సైకు

''ఏమిటీ?'' చీకట్లోనే యస్సై తీక్షణమైన చూపులు రైటరుకు గుచ్చుకున్నాయి

''సార్ రాములు దాన్ని వదిలిపెట్టాడు సార్ ''

నెత్తిమీద పిడుగుపడ్డట్టు దిమ్మెరపోయాడు యస్సై ''ఏమిట్రా ఇడియట్ నువ్వనేది?!'' అన్నాడు పెద్దగా కోపంతో అతని పెదాలు వణికాయి అతను వేసిన కేకకు డి యస్పీ బయటకు వచ్చాడు అతన్ని చూచి, ''సార్, ఈ ఎధవలు దాన్ని పోగొట్టారంట సార్'' అన్నాడు భయంతో కూడిన కోపంతో

''వ్వాట్? వ్వాట్ ఆర్ యూ సేయింగ్?!'' నొసలు ముడిచి అన్నాడు సీరియస్గా డి యస్పీ రైటరుతో పాటువున్న పీసీ ఆ చీకట్లోనే సెల్యూట్చేశాడు డి యస్పీకి ఏదో మత్తులో వున్నట్లున్న రైటరు తప్పు చేసినట్లు చటుక్కున సెల్యూట్ చేశాడు

''ఏమిటి? ఏమంటున్నారూ '' అడిగాడు కోపంగా డి యస్పీ మళ్ళీ

''సార్ '' యస్సై ఏదో చెప్పబోయి రైటరు మాటలువిని ఆగిపోయాడు

''అయ్యా! నేను ఆ మనిషిని తీసుకుపోయి సుబ్బరంగా స్నానమదీ చేయించి, అన్నంపెట్టి స్టేషనుకు తీసుకువచ్చాను సార్ విపరీతంగా కడుపులో నొప్పిగావుంటే సెంట్రీ పీసీ రాములుతో దాన్ని చూస్తుండమని చెప్పి, దొడ్డికెళ్ళి వచ్చేసరికి ఆ మనిషిలేదు సార్ ఆ విషయం ప్రభువుల వారికి విన్నవించు కుందామని వచ్చాను సార్'' అన్నాడు వినయంగా రైటరు అటెన్షన్లో ఇంకా స్మార్ట్గా నిలబడుతూ అతని గుండె వేగం విపరీతంగా పెరిగిపోయింది

ఆ మాటల్తో డి యస్పీ ఉగ్రుడైపోయాడు ''దొంగలంజా కొడకల్లారా ఎంతపని చేసారురా! మీ యమ్మల్ని నా కొడకల్లారా, మిమ్మల్నందర్నీ జైలుకు పంపిస్తా '' కోపంతో గంతులు వేశాడు ''ఒరే యస్సై నువ్వు స్టేషనుకెళ్ళి రిపోర్టు తయారుచెయ్యి నే నొస్తున్నా పద'' అన్నాడు గాండ్రిస్తూ

''సార్! అయ్యా! అలాగే '' యస్సై వణుకుతూ సెల్యూట్‌చేసి గబుక్కున మెట్లుదిగాడు డి యస్పీ కోపంగా లోనికెళ్ళాడు యస్సై, రైటరూ స్టేషనుకు బయలుదేరారు

''ఏయ్ నువ్వు వాడి దగ్గరకుపో వాడికేం కావాలో చూడు'' అని తమతోపాటు వస్తున్న పీసీని డి యస్పీ దగ్గరకు వెనక్కు పంపించాడు యస్సై

''ఈ రోజు ఎవుడి మొకం చూశానో కాని నిద్రలేచి ఇంతవరకు ఒక్క క్షణం సేపు కూర్చోలేదు తిండి లేదు అసలది ఎట్లా పోయిందోయ్ నీవంత నిర్లక్ష్యంగా ఎట్లా వదిలేశావోయ్ ఆ రాములుగాడు అసలే పొగరుబోతు వాడి దగ్గర దానిని ఎట్లా వదిలిపెట్టావ్ అన్నీ వెధవ పనులు తప్ప ఒక్కటన్నా సరిగా చేయలేవే ఈ డి యస్పీ నిన్ను జైలుకు పంపిస్తాడు నీ ఖర్మ కాలింది ఉద్యోగమంటే ఇంత నిర్లక్ష్యమయితే ఎట్లా వాడు రాములుగాడు స్టేషన్లో వున్నాడా? ఈ దెబ్బతో ఆ తొత్తు కొడుకు అయిపోతాడులే రూల్సు మాట్లాడతాడా లేకపోతే ప్రతి దానికి? వాడికి తుది ఘడియ దగ్గర పడింది ఎవడేం చేయకుండా వాడి గోతి వాడే తొవ్వుకున్నాడు'' అన్నాడు యస్సై

స్టేషను దగ్గర అయ్యేకొద్దీ రైటరుకు భయం ఎక్కువవుతోంది ''అయ్యా! తవరే నన్ను రక్షించాలి'' ఏడుపు నిండిన స్వరంతో చటుక్కున వంగి యస్సై కాళ్ళు పట్టుకోబోయాడు రైటరు నడుస్తున్నవాడల్లా ఆగిపోయాడు యస్సై

''ఏమీ లాభం లేదు ఇది మామూలు విషయం కాదు పైగా నా చేతిలో ఏమీ లేదు ఆ డి యస్పీ దున్నపోతుగాడు చెపితే వినే రకం కాదు'' విసుగ్గా అని వెనక్కు చూశాడు యస్సై, డి యస్పీ వస్తున్నాడేమోననే అనుమానంతో, తన మాటలు విన్నాడేమోననే భయంతో

''అయ్యా! సార్! తమరే నన్ను కాపాడాలి పిల్లలు గలవాణ్ణి నేను తమర్ని నమ్ముకుని ఇంతకాలం తమరి దగ్గర పనిచేశా తమరే నాకు దిక్కు ఈ ఉద్యోగం పోతే ఇంటిల్లపాదిమీ ఆకలి చావులు చావాలి '' అతనేం మాట్లాడుతున్నాడో తెలియని స్థితిలో పడిపోయాడు రైటరు యస్సై విసుకున్నాడు కాళ్లు విడిపించుకోవటానికి చిన్నగా ఝాడించాడు కాని లాభం లేకపోయింది అడుగు వెయ్యటానికి వీలులేకుండా దుమ్ములో సతికిలబడి కాళ్ళు రెండూ గట్టిగా పట్టుకున్నాడు రైటరు కోపంతో పళ్ళు పటపట లాడించాడు యస్సై

''సరే,లెగు, చూద్దాంలే అయినా నీ కెందుకు భయం నీకేంకాదు దాన్ని పోగొట్టింది రాములుగాడు కదా! నీకేం కాదులే ముందు స్టేషనికి పోనియ్యి వాడొస్తాడేమో'' అని వెనక్కు తిరిగి చూశాడు మళ్ళీ మసగ్గా ఎవరో వస్తున్నట్లు కనపడింది కంగారుగా ''డి యస్పీ దొర వస్తున్నట్లున్నాడు, లెగు'' అని కాళ్ళు విదిలించి ముందుకు కదిలాడు రైటరు యస్సైని అనుసరించాడు పరుగులాంటి నడకతో వాళ్ళవెనకే డి యస్పీ, పీసీ స్టేషనుకు వచ్చారు వాళ్ళని దూరం నుండే చూచి సెంట్రీగా వున్న రాములు గట్టిగా హాల్ట్ కొట్టాడు ఆ కేకకు మంచి నిద్రలో వున్న వెయిటింగ్ పీసీలు వులిక్కిపడ్డారు యస్సై రాములు దగ్గరకు వచ్చి కోపంగా చూశాడు నోరు తెరిచి ఏదో అనబోయేలోగానే డి యస్పీ కూడా వచ్చేశాడు అక్కడకు

''ఎవడు వాడు ? ఎవడు రాములు గాడంటే ? పిలిపించు ముందు'' అన్నాడు తీవ్రమయిన కోపంతో డి యస్పీ యస్సైతో

రాములు ఆశ్చర్యంగా చూస్తున్నాడు అర్థం కాక

''ఇతనే సార్'' అన్నాడు యస్సై రాముల్ని చేత్తో చూపిస్తూ

''ఏరా దొంగ లంజా కొడకా, దాన్ని వదిలేశావ్ నీ పెళ్ళాన్ని తీసుకురా నా కొడక నువ్వూ కమ్యూనిస్టు నా కొడుకువే నిన్నూ పిట్టని కాల్చినట్టు కాల్చిస్తా చెప్పు దాన్నెందుకు వదిలిపెట్టావ్?'' కోపంతో వూగిపోతూ అన్నాడు డి యస్పీ అతని కేకలకు వెయిటింగ్ పీసీలు నిద్రలేచారు వాళ్ళకేమీ అర్థం కావటం లేదు

రాములు విషయం అర్థం కాక అవాక్కయి నిలబడ్డాడు కాని డి యస్పీ అన్న మాటలతో అతను కోపంతో కదిలిపోయాడు వెయిటింగ్ పీసీలు ఒక్కొక్కళ్ళు బయటకు వచ్చారు రైటరు యస్సై వెనక నిలబడ్డాడు వణుకుతూ

''సార్'' కోపంగా అరిచాడు రాములు

''ఏంట్రా ఈడియట్ ఇంకా అరుస్తావ్ ఆ చాకలిదాన్ని ఎందుకు వదిలిపెట్టావ్ సమాధానం చెప్పు, లేకపోతే ''

అప్పటికి అతనికి విషయం కొంత అర్థమయ్యింది

''దాని సంగతి నాకేం తెలుసు మాటలు జాగర్తగా రానియ్'' కోపంతో రాములు చేతిలోని తుపాకి బిగుసుకుంది కోపంతో నిండిన అతని ముఖం వైపు చూసి జంకాడు డి యస్పీ

''రైటరు ఆ మనిషిని తీసుకొచ్చి అప్పగించాడు నీకు ఆమెనెందుకు ?''

అప్పటికి విషయం పూర్తిగా బోధపడింది అందరికీ రైటరు వైపు కళ్ళెర్రచేసి చూశాడు రాములు కోపంతో అతని శరీరం వణుకుతోంది చటుక్కున చేతిలోని తుపాకితో ఆన్‌గార్డ్ పొజిషన్‌కు వచ్చాడు బోల్ట్ ఓపెన్ చేసి పోచ్‌లోంచి బుల్లెట్ తీసి లోడ్ చేశాడు అంతా క్షణంలో జరిగిపోయింది వూహించని ఆ పనికి అంతా భయంతో బిగుసుకు పోయారు తుపాకిని రైటరు వైపు తిప్పాడు కుడిచేతి చూపుడు వేలు ట్రిగ్గర్ మీద వుంది వణుకుతున్న ఆ వేలు ట్రిగ్గర్‌ని ఎప్పుడు నొక్కుతుందో వూహించటం కష్టం ఎర్రటి చింత నిప్పులు అతని కళ్ళల్లో నిండిపోయాయి డి యస్పీ కి క్షణాల్లో వళ్ళంతా తడిచిపోయింది చెమటతో భయంగా ఒక అడుగు వెనక్కు వేశాడు

''ఏరా రైటరు లంజాకొడకా, ఎప్పుడు అప్పజెప్పావు నాకు దాన్ని ? ఎవుడి ఉద్యోగాలు పోగొట్టాలని అబద్దాలు చెపుతున్నావు? నిజం చెప్పు వాళ్ళకి లేకపోతే నా చేతిలో నీకు చావు మూడిందే''

రైటరు మరుక్షణంలో డి యస్పీ కాళ్ళ మీద పడిపోయాడు, వల వల ఏడుస్తూ ''మహాప్రభో, నేనే పోగొట్టాను దాన్ని''

డి యస్పీ కోపంతో బలం కొద్దీ తన్నిన తన్నుకు, ''అబ్బా'' అంటూ డొక్క పట్టుకొని ఇవతలకు దొర్లాడు రైటరు డి యస్పీ వెనక్కు తిరిగి గబగబా వెళ్ళాడు

''తుపాకి దించు'' అన్నాడు యస్సై ఆ మాటతో ఈ లోకంలోకి వచ్చినట్టు తుపాకి బోల్టు ఓపెన్ చేసి, తూటా తీసి, పోచ్చిలో పెట్టాడు రాములు

అందరూ గట్టిగా గాలి పీల్చుకున్నారు

''ఏమిటి రాములూ ఏమయ్యింది ?'' బైటకొస్తూ అడిగాడు ప్రకాశం

''ఏముంది ఈ పంది లంజా కొడుకు ఆ చాకలిదాన్ని పోగొట్టి, డి యస్పీ కి నేను పోగొట్టానని

చెప్పాడు వాడొచ్చి నోటి కొచ్చినట్టు తిడుతున్నాడు ఈళ్ళమ్మల్ని ''

యస్సై కోపంగా చూడబోయి రాములు ముఖం చూసి వూరుకున్నాడు వెంటనే అక్కడి నుండి బయలుదేరాడు రైటరు యస్సై వెనకాల పడిపోయాడు, భయంగా రాములువైపు చూస్తూ మంచి నిద్రలో లేచినవాళ్ళంతా అర్ధరాత్రి వరకూ అదే విషయాన్ని మాట్లాడుకున్నారు

''ఈళ్ళమ్మని, ఎవుడ్నీ నమ్మటానికి వీల్లేదురా ఎంతసేపూ పక్కోడి మీదకు నేరాన్ని నెట్టటమే'' అన్నాడు ఒక పీసీ

'' ఆ రైటరుగాడి బుద్ధే అంత'' అన్నాడు రాములు కోపంగా ''ఇంకో నిముషముంటే ఏసేసే వాడినే పంది లంజా కొడుకుని '' అన్నాడు మళ్ళీ

చాలాసేపటికి కాని అందరూ పడుకోలేదు పన్నెండింటికి ప్రకాశం ముందువైపు సెంట్రీ డ్యూటీలో వున్నాడు అతను ఎంతో బాధపడ్డాడు దీర్ఘంగా ఆలోచించాడు 'రోజు రోజుకూ పరిస్థితులు భయంకరంగా తయారవుతున్నాయి ఎటుచూసినా 'పీసీ' కి రక్షణ కనిపించటం లేదు ఆత్మహత్య ఒక్కటే దీనికి పరిష్కార మార్గం అన్నట్టుగా కనిపిస్తోంది తమకే కాదు, తమ పెళ్ళాం పిల్లలకు కూడా సుఖ శాంతులు లేవు ఇటు ప్రజలు అసహ్యించుకుంటున్నారు అటు కమ్యూనిస్టులను చూస్తే భయమేస్తోంది ఇటు ఆఫీసర్లు అనుక్షణం వేధిస్తున్నారు దిక్కు తోచని పరిస్థితిగా వుంది ఈ విధంగా ఇంకా ఎన్ని సంవత్సరాలు చెయ్యాలో? వూహించుకుంటేనే భయంతో పిచ్చెక్కిపోతోంది'

ఆలోచనలు తీవ్రంగా సాగుతున్నా అప్రమత్తంగానే నిలబడ్డాడు చూపులు తీక్షణంగా చూస్తున్నాయి చీకట్లోకి వీలయినంత దూరం చెవులు జాగ్రత్తగా చిన్న శబ్దాన్ని కూడా వింటున్నాయి 'కమ్యూనిస్టులు దాడి చేసే సమయం ఇదే రాత్రిళ్ళు పన్నెండు నుండి మూడు వరకు ప్రజలంతా మంచి నిద్రలో వుండేవేళ ఈ వేళప్పుడే వాళ్ళు దాడులు ప్రారంభిస్తారు మొన్న జరిగిన సంఘటన కూడా ఈవేళప్పుడే జరిగింది' అనుకున్నాడు అతను

నిముషమొక యుగంగా గడిచింది మూడు గంటలకు సెంట్రీ డ్యూటీ దిగిపోయాడు తన సెంట్రీ డ్యూటీలో ఏమి జరగనందుకు మనస్సులోనే దేవుడికి దండం పెట్టుకున్నాడు పడుకున్న వెంటనే నిద్ర పట్టేసింది మర్రోజు ఉదయం నిద్ర లేచేసరికి డి యస్పీ వచ్చాడు అంతా హడావిడిగా, గందరగోళంగా వుంది

''ఏమిటి హడావిడి?'' అడిగాడు ప్రకాశం

''ఆ లాకప్పులో ముసల్ది చచ్చింది ఎప్పుడు చచ్చిందో ఏమో పొద్దున్నే వాడు డి యస్పీ గాడు వచ్చి దానిని బయటకు తియ్యమన్నాడు తీరా చూస్తే చచ్చి బిగుసుకుపోయి వుంది''

ఆ మాట విని ఉలిక్కిపడ్డాడు ప్రకాశం శ్వాస పీల్చటం కూడా మరిచిపోయినట్టు అచేతనంగా చూశాడు అక్కడే నిలబడి లాకప్పు గది వైపు కటకటాల వెనుక చీకటి చిక్కగా వుంది బాధతో కణతల దగ్గరి నరాలు చిట్లిపోతాయేమోనన్నంత తలనొప్పి వచ్చింది క్షణాల్లో తల పట్టుకొని బయటకు వచ్చాడు భయంకరమైన శారీరక బాధతో పాటు మానసిక వేదన అతన్ని కృంగ దీస్తోంది నిద్రలేని యర్రని కళ్ళల్లో అతనికి తెలియకుండానే నీళ్ళు నిండుతున్నాయి ఇదంతా తన వల్లనే జరిగిందనే వూహ బలపడుతోంది తను అతన్ని చంపకపోతే ఈ ముసలమ్మ, ఆ ముసలతను ఇలా దారుణమైన హత్యలకు గురయ్యేవాళ్ళు కాదు ఈ పాపం అంతా తనదే తనను దేవుడు క్షమించడు దీనికి ప్రతి ఫలంగా తను ఏం పోగొట్టుకోవాల్సొస్తుందో అనే భయం అతని

నరనరాల్లో కరిగిపోయింది ఆలోచనల్లో బయటకు నాలుగడుగులు వేశాడు

''ఏయ్ ప్రకాశం ఎక్కడికి ? ఉండు పనుంది'' కేకేశాడు సార్జెన్

కోపంతో నమిలేశాలా చూశాడు సార్జెన్‌వైపు కాని ఏమీ జవాబు చెప్పకుండానే ముందుకు నడిచాడు 'ఇన్ని ఘోరాలు తమ కళ్ళముందే జరుగుతున్నా ఏమీ పట్టనట్లు, ఏమీ జరగనట్లు వీళ్ళెట్లా వుండగలుగుతున్నారు ? తమ ప్రవర్తనలో వీసమెత్తు మార్పు కూడా కనిపించనీయ రేమిటి? ఎంత నిర్లిప్తతని ప్రదర్శిస్తారు! ఎలా సాధ్యం వీళ్ళకివన్నీ? అన్నిటికీ కారణం పరిస్థితు లేనా? రైటరుకు వచ్చిన ఇబ్బంది ఈ సార్జెన్‌కు ఆనందం కలిగిస్తోందా?' అనుకున్నాడు రైటరు గుర్తొచ్చే సరికి పారిపోయిన ఆమె గుర్తొచ్చింది 'పోనీలే ఆమె అన్నా బ్రతికింది' అనుకుని నిట్టూర్చాడు ఇంటికెళ్ళి కాలకృత్యాలు ముగించుకున్నాడు మాసి, చెమటతో నాని, దుర్వాసన వేస్తున్న యూనిఫారం విప్పి, చలువ చేసిన యూనిఫారం వేసుకుంటుంటే తల్లి పిలిచింది

''అయ్యా! మాకు రేత్తిరిపూట బయంగావుందిరా ! ఆ కమ్యూనిట్టులు ఇల్లమీద పడి ''

ఆ మాటలు అంటుంటే, ఆమెవైపు నిశితంగా చూశాడు ప్రకాశం భయం ఆమె ముఖంలో గూడుకట్టుకుని వుంది భార్య పిల్లవాడిని చంకన వేసుకుని నిలబడి వింటూ చూస్తోంది వాళ్ళనలా చూస్తుంటే ఏడుపు వస్తోంది అలాటి స్థితిలో ఎవరిమీదో కసితో నరాలు వుబ్బుతాయి ఏమీ సమాధానం చెప్పలేని స్థితిలో వైరాగ్యంతో నిండిన నవ్వు నవ్వుతాడు ఇప్పుడూ అలాగే అన్నాడు

''వాళ్ళు మా లాగా వెధవలు కాదులేమ్మా'' ఆ మాటలు ఆడవాళ్ళకు అర్ధం కాలేదు అయోమయంగా చూశారు మళ్ళీ వాళ్ళనలా చూసి నవ్వాడు 'వీళ్ళ భయం పోగొట్టాలి ముందు' అనుకున్నాడు అనునయంగా అన్నాడు ''ఏం జరిగినా మనం ఏమీ చెయ్యలేని స్థితిలో వున్నాం అంతా దేవుడి దయ కత్తుల బోనుల్లోకి మన బతుకులు నెట్టబడ్డాయి ఏ పూట కాపూట స్టేషను కెళ్ళి తిరిగొచ్చి మిమ్మల్ని చూసిందాకా, చూస్తామనే నమ్మకాలు వుండటం లేదు నాకే కాదు అందరికీ ''

''అసలిదంతా ఏంది ? ఎందు కిట్టా జరుగుతోంది ?'' అడిగింది భార్య

''ఏమో నాకూ సరిగా తెలియటం లేదు కాని వాళ్ళు అడుగుతున్నయ్ సబబుగానే కనిపిస్తున్నయ్ ఎవడు కష్టపడి పండించుకున్న పంట వాడే తినాలి ఎవుడికీ వూరికే శాకిరీ చెయ్యకూడదు ఇయ్యన్నీ బాగానే వున్నయ్ '' అతని మాటలు పూర్తి కాకముందే తల్లి అందుకుంది

''అయ్యా! నువ్వు జాగర్త వుసారుగా వుండు మన వూల్లోనే నయం తిన్నా తినకపోయినా మడిసివి బాగుండేవాడివి'' అంది నిట్టూరుస్తూ

ప్రకాశం బయటకు వచ్చాడు స్టేషన్ దగ్గరకు వచ్చేసరికి ఎప్పటి లాగానే హడావిడిగా వుంది స్టేషన్‌చుట్టుపక్కలా ఎవర్నీ నిలబడనివ్వటం లేదు వెనక నుండి తిరిగొచ్చి లోపలికొచ్చాడు కొంతమంది పీసీలు అక్కడ వున్నారు

''ఏమిటి విశేషం ?'' అన్నాడు ప్రకాశం

''ఏముంది రైటరు గాడ్ని అరెస్టు చేశారు యస్పీ ముందు హాజరు పరచటానికి కాగితాలు సిద్ధం చేస్తున్నారు ఎస్కార్టు మరి ఎవరికి వేస్తారో అందరినీ ఉండమన్నారు ఆ ముసలిదాన్ని తీసుకుపోయి అడవిలో పారేసి రమ్మన్నారు ఆ పని చీకటి పడినాక చేపిస్తారనుకుంటా'' అన్నాడు ఒక పీసీ

''అయిపోయింది రైటరు పని ఈ మాత్రం బ్రతుక్కి వాడు ఏం విరగబాటు పోయాడు వాడిని పాపం అనేవాడు లేడు ఏ ఆఫీసర్లకయితే వాడు కుక్కకన్నా హీనంగా సేవచేశాడో, ఆ ఆఫీసర్లే వాడిని జైలుకు పంపుతున్నారు పైగా వాడు కావాలని చేసిననేరం కూడా కాదు ఈ ఆఫీసర్లకేమాత్రం జాలిలేదు రేపటి నుండి వాడి పెళ్ళాం పిల్లల సంగతి ఏమిటి?'' అన్నాడు ఒక సీనియర్ కానిస్టేబులు

''అందరి బ్రతుకులు అంతే చేసినంత కాలం సేవ చెయ్యటం తరువాత రామా కృష్ణా అనుకుంటూ కాళ్ళు ముడుచుకోవటం అదికూడా పరిస్థితులు అనుకూలిస్తే లేకపోతే ఇదిగో ఇట్లాగే వుంటుంది పరిస్థితి'' అన్నాడు ప్రకాశం

ఓ గంట గడిచేసరికి కాగితాలు సిద్ధమయ్యాయి ఇద్దరు పీసీలు రైటరు చేతికి సంకెళ్ళు వేసి తీసుకుపోతూ వుంటే, తోటి కానిస్టేబుళ్ళందరికీ బాధతో హృదయాలు బరువెక్కాయి రైటరు భార్యా పిల్లలు, అతన్ని వాటేసుకుని హృదయ విదారకంగా ఏడుస్తూ వుంటే అక్కడున్న అందరి కళ్ళూ చెమ్మగిల్లాయి కళ్ళ వెంట కారే నీరు తుడుచుకోటానికి కూడా వీల్లేకుండా రైటరు చేతులకు వేసిన సంకెళ్ళకు లీడింగ్ చైను బరువుగా వేలాడుతోంది

''వూ, తీసుకుపోండి'' వెనకనుండి డి యస్పీ హుంకరించాడు కిందపడి వలవలా ఏడుస్తున్న రైటరు భార్యనీ, పిల్లల్ని మిగిలిన కానిస్టేబుళ్ళ భార్యలు ఓదార్చే ప్రయత్నాలు చేస్తున్నారు అంతకు క్రితం వరకు ఆమె పీసీల భార్యల్ని తక్కువగా, ఈసడింపుగా, తనొకప్పుడు పీసీ భార్యననే విషయం మరిచి ప్రవర్తించినా కూడా, అవన్నీ వీళ్ళు మరిచి పోయారు ఆ సమయంలో

''ఈ పరిస్థితిలో రైటరుకు జరిగినది ఎంతో మంచిది'' అన్నాడు పీసీ ఒకతను ఆ మాటకు ఆశ్చర్యంగా, 'ఎట్లా?'' అన్నట్లు చూశారు అంతా అతనివైపు

''అక్కడతను జైల్లో వుంటాడు ఏ కమ్యూనిస్టు అతన్ని గురించి పట్టించుకోడు మనలాగా అనుక్షణం భయంగా బ్రతికే పరిస్థితి లేదు''

'జరుగుతున్న కీడుల్లోంచి లాభం కొరకు వెదికే అలవాటు ఆ పీసీ చేత ఆ మాటలనిపించింది, కీడులో మేలంటే ఇదే గాబోలు' అనుకున్నాడు ప్రకాశం

ఆ రాత్రి బాగా పొద్దుపోయినాక ముసలామె శవాన్ని తీసుకుపోయి అడవిలో దూరంగా పడేసి వచ్చారు

అలాగే రోజులూ, వారాలు, నెలలు గడుస్తున్నయ్ భయంతో, ఆందోళనతో, కోపంతో గడిపెయ్యటం సాధారణమయిపోయింది కొంతమంది మాత్రం రోజూ చచ్చే చావుకు భయమేమిటన్నట్లు మొండిగా రోజులు దొర్లిస్తున్నారు ప్రతిపనిలోనూ ప్రతి కదలికలోనూ నిరాసక్తత, నిర్లిప్తత, చోటు చేసుకున్నాయి పోలీసులంటే ప్రజల్లో నానాటికి గౌరవం పోయి ద్వేషం, అసహ్యం, భయం చోటు చేసుకుంటున్నాయి డిపార్టుమెంటులోని క్రింది స్థాయి ఉద్యోగులు అధికార్లని చూచి భయపడటంలేదు నిజంగా వాళ్ళని చూచి భయాన్ని నటిస్తున్నారు బ్రతికినంత కాలం ఇంత తిండి కోసం అన్నట్టు గానుగెద్దుల్లాగా తిరుగుతూ డ్యూటీలు చేస్తున్నారు తమకు భయపడి ఎవరూ పనిచెయ్యటం లేదని అధికారులకూ తెలుసు కాని డిసిప్లైన్ ముసుగును వాళ్ళ విధేయతకు తగిలించారు

జీవితం చెల్లాచెదురై పోయిందని కుంగిపోయాడు ప్రకాశం జరుగుతున్న పనులు చూస్తుంటే అతనికి పిచ్చిపట్టిద్దేమో అని అనుమానం కలుగుతోంది భార్యా బిడ్డల్ని ప్రేమించాడు అంతకన్నా జీవితాన్ని ఇంకా ఎక్కువగా ప్రేమించాడు అతని మాటల్లోనే చెప్పాలంటే, అతను బ్రతికున్నంత

కాలం వీలయినంత ఎక్కువుగా పెళ్ళాం పిల్లల్ని సాకాలనీ, వీలయినంత ఎక్కువగా జీవితాన్ని తెలుసుకోవాలని, ప్రపంచాన్ని అర్థం చేసుకోవాలని అనుకున్నాడు కానీ పరిస్థితులు అందుకు విరుద్ధంగా పరిణమించాయి బ్రతుకు చిందర వందర అయిపోయింది కాలం గడిచిపోతోంది ఎప్పటిలాగానే గంభీరంగా జీవితంలో ప్రశాంతత, స్వేచ్ఛ, విశ్రాంతి, వినోదం పూర్తిగా దూరమై పోయాయని అతనికి బోధపడింది కేవలం వేళకింత తిండికోసం అందరిలాగానే అతనూ కాలం వెళ్ళదీస్తున్నాడు వాళ్ళ ప్రతి కదలికలోనూ, చివరికి శ్వాసలోనూ నిర్లిప్తత చోటుచేసుకుంది బ్రతుకంతా టెన్షన్ ఉద్యోగ జీవితం వ్యక్తిగత జీవితంలోని ఆనందాన్నీ, హాస్యాన్నీ మింగేసింది ఆ హాస్యం దూరమయినందున బ్రతుకు నిస్సారమై పోయింది, శృంగారంలో కూడా అంతే

రోజులు గడుస్తున్నాయి పోలీసులు చేస్తున్న అన్యాయాలకు అంతు ఉండటం లేదు చెయ్యని కిరాతకాలు లేవు ఇంత భయంకర పరిస్థితుల్లో కూడా వాళ్ళు రాక్షసుల్లాగా ప్రవర్తిస్తున్నారు అధికారులు ప్రజల్ని పిట్టల్లాగా కాల్చిస్తున్నారు క్రిందిస్థాయి ఉద్యోగులు కొందరు అధికారుల అండతో మానభంగాలు యధేచ్ఛగా సాగిస్తున్నారు అమాయకులైన ఆడవాళ్ళపై లూటీలూ, దారుణమైన హింసలు మామూలై పోయాయి రోజులు గడిచేకొందీ తమకేమీ పట్టనట్టు ప్రవర్తిస్తున్నారు అంతకుముందు ఎటు పోవాలన్నా ఏం చెయ్యాలన్నా, జాగ్రత్తగా, భయంగా చూస్తూ చేస్తూ పోయేవాళ్ళు ఏ నిముషంలో, ఏ కమ్యూనిస్టులు ఎటునుండి వస్తారో, ఎవరిని నరుకుతారో, ఎవరిని కాలుస్తారో అనే భయంతో, తిన్న నాలుగు మెతుకులు వంట బట్టేవి కావు ఇప్పుడదేమీ లేదు పులి నోట్లో తల పెట్టి చావుకు భయపడితే లాభం లేదనే నిర్ణయానికి వచ్చారు

ప్రజల కన్నా, కమ్యూనిస్టులకన్నా, ఆఫీసర్ల బాధ, భయం ఎక్కువయ్యాయి ఆఫీసర్లు ప్రజలమీద కన్నా ఎక్కువగా కానిస్టేబుళ్ళ మీద జులుం ప్రదర్శిస్తున్నారు వాళ్ళు చేస్తున్న పనులకు అంటున్న మాటలకు ఒక్కోసారి కోపంతో వూగిపోతున్నారు కొంత మంది ఉద్రేకపరులైన పీసీలు, హెచ్ సీలు 'చేతిలోని తుపాకి ఎత్తి, తూటాలన్నీ అయిపోయిందాకా, వళ్ళంతా తూట్లుపడి పోయిందాకా, పిట్టల్ని కాల్చినట్టు ఆఫీసర్లని కాల్చి, మనిషిగా పుట్టినందుకు ఒక మంచి పని చేశామనే తృప్తితో చచ్చినా దిగులు లేదు ' అని కొంతమంది అనుకొన్న సందర్భాలు చాలా వున్నయ్ కానీ ఎప్పటి కప్పుడు భార్యాబిడ్డలు గుర్తుకు వచ్చి ప్రాణంమీది తీపితో, బ్రతుకు మీది తీపితో ఆ సాహసం చెయ్యలేక పోయేవారు అసమర్థుల ఆలోచనా విధానం వాళ్ళల్లో కొట్టొచ్చినట్లు కనపడుతోంది

ఆ రాత్రి సెంట్రీ డ్యూటీ దిగి పడుకున్నాడు ప్రకాశం పన్నెండు దాటింది అప్పుడే నిద్రపడుతోంది ముందు సెంట్రీ గట్టిగా హాల్ట్ కొట్టాడు ఆ కేకకు తుళ్ళిపడి లేచాడు ప్రకాశం మిగిలిన వెయింటింగ్ పీసీలు కూడా లేచి కూర్చున్నారు మామూలుగా కొట్టే హాల్ట్ కాదది జీపు దిగి డి యస్పీ వస్తున్నాడు అతని వెనుక సి ఐ , కొంతమంది కానిస్టేబుళ్ళూ వున్నారు వాళ్ళంతా హడావిడిగా స్టేషను దగ్గరకు వచ్చారు సార్జెన్ సెల్యూట్ చేశాడు డి యస్పీకి

''యస్సైని పిలిపించు '' అన్నాడు డి యస్పీ డి యస్పీకి మళ్ళీ సెల్యూట్ చేసి, సార్జెన్ గబగబా యస్సై క్వార్టరు వైపు పరిగెత్తాడు డి యస్పీతో పాటు వచ్చిన సి ఐ జీపుదిగి నిలబడి వున్నాడు రెండు నిముషాలు గడిచాక అక్కడున్న కానిస్టేబుళ్ళందరినీ బయటకు పంపించాడు సి ఐ వచ్చి అతనూ, డి యస్పీ స్టేషన్లో కూర్చుని, ఏదో మాట్లాడుకున్నారు రహస్యంగా పది నిముషాలలో యస్సై వచ్చాడు హడావిడిగా డి యస్పీకీ, సి ఐ కి సెల్యూట్‌లు చేశాడు

''ఎంత సేపు కూర్చోవాలోయ్ నీకోసం '' అన్నాడు డి యస్పీ ముఖమంతా చిట్లిస్తూ

''వస్తున్నాను సార్ ఇప్పటిదాకా స్టేషనులోనే వున్నాను సార్ పనిచూసుకుంటూ ఇప్పుడే వెళ్ళాను ఇంతలో తమరొచ్చారు ''

''వూ ఆపు అధిక ప్రసంగం'' అంటూ కొరకొరా చూశాడు డి యస్పీ యస్సై ముఖం మాడ్చుకుని వూరకుండిపోయాడు

''నీ మెన్ అంతా ప్రజెంటేనా?'' అడిగాడు సి ఐ

''సర్ అందరూ వున్నారు సార్'' యస్సై జవాబిచ్చాడు నిదానంగా

''అయిదు నిముషాల్లో అందరినీ ఫాలెన్‌చెయ్యి లారీవస్తోంది వెనుక వెళ్ళాలి క్విక్'' అన్నాడు డి యస్పీ

''అలాగే సార్'' అని బైటకొచ్చాడు యస్సై సెల్యూట్‌చేసి సార్జెన్‌ని పిలిచి, అందరినీ లేపుకు రమ్మన్నాడు

''ప్రజెంట్‌మెన్ అంతా స్టేషన్లోనే వున్నారు సార్'' అన్నాడు సార్జెన్

అయిదు నిముషాల్లో అందరూ ఫాలెన్ అయ్యారు, ఇద్దరు సెంట్రీలు తప్ప అందరి భుజాలకు తుపాకులు వేలాడుతున్నాయ్ బెల్టులకు పెట్టుకున్న తూటాల సంచుల్లో తూటాలు వున్నయ్ ఇనుప నాడాల బూట్లు శబ్దం చేస్తున్నాయి ఎవరికి వాళ్ళు ఆలోచనల్లో మునిగిపోయారు 'ఇంత హడావిడిగా ఫాలెన్ చేస్తున్నారంటే, ఏదో ఇనఫర్‌మేషన్ వచ్చి వుంటుంది' అనుకున్నాడు ప్రకాశం

నిద్ర ముంచుకు వస్తోంది నీరసంగా వుంది శరీరం ఎవరికి వాళ్ళు తిట్టుకుంటూ నిలబడ్డారు 'ఇద్దరు సెంట్రీల్ని మినహాయించి మిగిలిన వాళ్ళందరినీ తీసుకువెళతారేమో' అనుకుంటూ నిలబడ్డారు సెంట్రీలు అలా చాలాసార్లు జరిగింది అలా తీసుకు వెళితే, తిరిగి వాళ్ళు వచ్చిందాకా ఎన్ని రోజులయినా, ఎన్ని వారాలయినా ఇక ఆ సెంట్రీలిద్దరే స్టేషనుకు కాపలా వెళుతూ వెళుతూ స్టేషన్‌లోని తుపాకులూ, తూటాలు పూర్తిగా తీసుకుపోతారు ఇప్పుడు కూడా అంతే చేస్తారేమో అనుకుంటున్నారు వాళ్ళు

పది నిముషాలు గడిచిన తరువాత ఒక మిలటరీ వేను వచ్చి స్టేషను ముందు ఆగింది దానిలో నుండి బిలబిలమంటూ, పదిమంది దాకా మలబారు పోలీసులు కిందకు దిగారు వాళ్ళ ఇన్‌చార్జి ఆఫీసరు గబగబా అందరినీ ఫాలెన్ చేసి, వెళ్ళి, డి యస్పీకి రిపోర్టు చేశాడు అయిదు నిముషాల్లో డి యస్పీ జీపూ, దాని వెనకాల మిలటరీ వేనూ బయలుదేరాయి జీపులో డి యస్పీతో పాటు, సి ఐ, యస్సై, ఇద్దరు కానిస్టేబుళ్ళూ, వాళ్ళతోపాటు ఎవరో ఒక బయటి మనిషి కూడా వున్నాడు వేనులో మలబారు పోలీసులతో బాటు ఈ స్టేషన్లో ఎక్కిన లోకల్ పోలీసులు కూడా వున్నారు వేను బయలుదేరిన రెండు నిముషాలలోనే ఇంచుమించు అందర్నీ నిద్ర ఆవరిస్తోంది కాని విపరీతమయిన కుదుపులవల్ల, ఒకళ్ళ నొకళ్ళు నెట్టుకున్నట్టు ఇరుగ్గా కూర్చోవటం వలన, కుదుపుల్లో తుపాకి మొనలు ఎక్కడ తగిలి, ముక్కులు మొహాలు బద్దలవుతాయే అనే భయంతో నిద్రపోలేక, తుపాకుల్ని జాగ్రత్తగా పట్టుకుని కూర్చున్నారు జీపు వెనుక అడవిలో చిన్నగా వస్తోంది వ్యాను అలాటి ప్రయాణాలు బాగా అలవాటయి పోవటం వలన ఎవరికీ ఏమీ ఆందోళనగా లేదు పోయే కొద్దీ అడవి చిక్కబడుతోంది అడవిలోని బండ్లబాటలో దువ్వలేపుతూ పోతోంది జీపు ఆ దువ్వలో వెనక వస్తున్న వేను నిండి పోతోంది ఆ దువ్వ నిండిన గాలి పీల్చుకుంటూ ఉక్కిరి బిక్కిరి అవుతున్నారు లోపల వున్నవాళ్ళు మలబారు పోలీసు ఆఫీసరు డ్రైవరుతో చిన్నగా పోనివ్వమని చెప్పినట్లున్నాడు వేను కాస్త స్లో అయ్యింది అడవిలో తెల్లటి వెన్నెల చిక్కగా

కురుస్తోంది కొద్దిసేపటికే నిద్ర దూరమయ్యింది కళ్ళు మాత్రం మండుతున్నయ్ ఒక అరగంట ప్రయాణం తరువాత జీపు ఆగింది దాని వెనకే వేను ఆగింది వెంటనే లైట్లు ఆర్పివేశారు ఇంజన్లు కూడా ఆపివేశారు అడపా దడపా పక్షుల అరుపులు మినహా భయం కలిగించే నిశ్శబ్దం

జీపులోని ఆఫీసర్లు వేను దగ్గరకొచ్చారు సిపాయిలూ, పోలీసులూ అంతా గబగబా వేను దిగారు డి యస్పీతో పాటు లోపల వున్న సివిలియన్ చిన్నగా ఏదో చెపుతున్నాడు చేతులూపుతూ, డి యస్పీతో

''అందరూ నిశ్శబ్దంగా లోడ్ చెయ్యండి'' అన్నాడు డి యస్పీ చిన్నగా, గంభీరంగా నిశ్శబ్ద వాతావరణంలో ఆ మాటలు స్పష్టంగా వినపడ్డాయి భుజాలకు వేలాడుతున్న తుపాకుల్ని తీసి, లోడ్ చేసి, సేఫ్టీ కేచెస్ లాక్ చేశారు అంతా క్షణాల్లో అక్కడున్న సిబ్బందిని, మూడు సెక్షన్లుగావిభజించాడు డి యస్పీ ఒకదానికి డి యస్పీ, రెండోదానికి సి ఐ, మూడోదానికి యస్సై ఇన్‌చార్జ్‌లు సి ఐ కీ యస్సైకీ ఇన్‌స్ట్రక్షన్స్ జారీ చేశాడు డి యస్పీ మరుక్షణంలో ముందుకు సాగాయి మూడు సెక్షన్లూ వీలయినంత తక్కువ శబ్దాన్ని చేస్తూ అలా రెయిడ్‌లకు పోవటం, అంతకు ముందు ఎన్నోసార్లు జరగటం వలన కొత్త అనిపించలేదు ఎవరికీ

ఇలా రెయిడ్‌కు పోయే ప్రతిసారీ ఆఫీసర్లు సిబ్బందికి ఎలాంటి వివరాలూ చెప్పరు అలా ముందుగా చెపితే మెన్‌లో కొంతమంది ఆ విషయాలను లీక్‌చేస్తారని వాళ్ళ అనుమానం రెయిడ్‌కు వెళ్ళినప్పుడు, ఎవ్వరూ దొరక్కపోతే దానికి కారణం మెన్‌లో ఎవరో ఇన్‌ఫర్‌మేషన్ ఇచ్చి వుంటారని అనుమానం వెలిబుచ్చుతారు మెన్‌లో కాస్త గట్టిగా మట్లాడే హెచ్ సీ మీదకో, పీసీ మీదకో ఆ అనుమానం పోతుంది ఆఫీసర్లు ఇక అతన్ని అనుమానంగా చూస్తూ వెలివేసినట్లు ప్రవర్తిస్తారు

మూడూ సెక్షన్లూ అలా కొంత దూరం పోయాయి అడవి దట్టంగా వుంది కాలిబాట కూడా లేదు బూట్లకు వున్న ఇనుప నాడాలు కొండ రాళ్ళకు తగిలి కణేల్ మని శబ్దం చేస్తున్నాయి ముందు నడుస్తున్న డి యస్పీ ఆగిపోయాడు అతని వెనుక మిగిలిన వాళ్ళంతా ఆగి పోయారు అక్కడ నలుగురు మనుషులు చెట్లచాటు నుండి వచ్చి డి యస్పీని కలిశారు వాళ్ళు పోలీసులు కాదు వాళ్ళతో రెండు నిముషాల చర్చ తరువాత మూడు సెక్షన్లు చీలిపోయాయి కొత్తగా కలిసిన మనుషులు ఈ మూడు సెక్షన్లకు ముందు వుండి దారి చూపిస్తున్నారు పిల్లుల్లాగా శబ్దం రాకుండా నడుస్తున్నారు అంతా పదినిముషాల నడక అనంతరం అందరూ ఆగిపోయారు వూపిరి బిగబట్టి, వీలయినంత దూరం చూడటానికి ప్రయత్నం చేస్తున్నారు అంతా

ఎంతగా అలవాటు పడ్డా భయం వాళ్ళని వెన్నాడుతూనే వుంది ఎటునుండి ఏ కమ్యూనిస్టు చేతి బాంబు విసురుతాడో, ఏ పొదచాటు నుండి తుపాకి పేలుతుందో అనే భయం వాళ్ళ నరసరాల్లో చోటు చేసుకుంది

ప్రకాశంకు ఇంటి దగ్గర పిల్లలు గుర్తుకొచ్చారు తల్లీ, భార్య గుర్తుకొచ్చారు ఎన్నో... అనుకున్నట్టు ఇప్పుడు కూడా అనుకున్నాడు, 'ప్రాణాల్తో తిరిగి ఇంటికెళ్ళి, పెళ్ళాం పిల్లల్ని కళ్ళా చూస్తానో లేదో' అని మనసులోనే దేవుడికి మొక్కుకున్నాడు 'ప్రాణాల్తో తిరిగొస్తే కోటయ్య స్వామికి తలనీలాలు ఇస్తాన'ని మొక్కుకున్నాడు మనసులోనే అలా అంతకుముందు ఎన్నోసార్లు మొక్కులు మొక్కాడు కాని అవి తీర్చలేదు ఆ భయం ఎక్కువుగా అతన్ని పీడిస్తూ వుంది 'ఈ సారి నీ కొండ కొస్తాం స్వామీ' అన్నాడు మనసులో ఆలోచనలతోనే అటూఇటూ చూస్తున్నాడు దూరంగా తెల్లగా ఏదో కదిలినట్లు అనిపించింది గుండె ఝల్లుమంది తేరిపార చూశా...

తీక్షణంగా అవతలి సెక్షన్లో డి యస్పీ కాబోలు తెల్లగుడ్డ వూపాడు సెక్షను అడ్వాన్సు అయ్యింది ఇరవై గజాలు నడిచి ఆగిపోయారు ఇంకా పది గజాల దూరంలో చెట్ల మధ్య పాకాలాంటిది కనపడుతోంది మూడు సెక్షన్లవాళ్ళు మూడు వైపుల నుండి వలయంలాగా ఏర్పడి పాకాని చుట్టుముట్టారు అంతా నిశ్శబ్దం గుండెల్లో భయం కలిగించే నిశ్శబ్దం అందరూ ఆన్‌గార్డ్ పొజిషన్‌లో మోకాళ్ళ మీద కూర్చున్నారు అందరూ ఫైర్ చేస్తే ఒకళ్ళు కాల్చిన గుళ్ళు ఇంకొకళ్ళకు తగులుతాయి పాకాకు చుట్టూ ఏమీ లేవు అడవి దుంగలు పాతి రెల్లు గడ్డితో కప్పిన పాక అది పాకాలో ఎవ్వరూ వున్నట్టు అలికిడి లేదు డి యస్పీ చేతులు వూపుతూ దూరంగా వుండి, చేతి సైగలతోనే ఆర్డర్లు ఇస్తున్నాడు మలబారు స్పెషల్ పోలీసులు పదిమంది చప్పున నేల మీద పడుకొని పాకుతూ, తుపాకుల్ని ముందుకు నెట్టుకుంటూ పాకాని సమీపించారు చుట్టూవున్న మిగిలిన వాళ్ళంతా నేలమీద బోర్లా పడుకున్నారు

పాకా దగ్గిరికెళ్ళిన వాళ్ళంతా పరిశీలనగా చూశారు లోపలకు పాకలో నలుగురు వ్యక్తులు మంచి నిద్రలో మునిగిపోయి వున్నారు వారి పక్కల్లో యల్ జి తుపాకులు వున్నయ్ పాకలో ఒక మూలగా పొయ్యి వుంది దాని మీద ఒక తపేలా అక్కడకు వెళ్ళిన వాళ్ళంతా తల తిప్పి డి యస్పీ వైపు చూశారు భయంగా అప్పటికే పరిస్థితిని పూర్తిగా ఆకళింపు చేసుకున్న డి యస్పీ తల వూపాడు ప్రత్యేక అర్థంతో మరుక్షణంలో తుపాకుల్ని నేలమీదే విడిచి తోడేళ్ళలాగ దూకారు ఆ నలుగురి మీదకు మలబారు పోలీసులు కొంతమంది వాళ్ళపక్కనున్న యల్ జి తుపాకుల్ని లాగేశారు చటుక్కున నిద్రిస్తున్న నలుగురూ వులిక్కిపడి కళ్ళు తెరిచారు క్షణంలో విషయం అర్థమయ్యింది వాళ్ళకు కాని అప్పటికే వాళ్ళ చేతులు విరిచి కట్టివేయబడి వున్నాయ్ శక్తినంతా ఉపయోగించి పెనుగులాడారు కాని ఉపయోగం లేకపోయింది నలుగుర్నీ పాకాలోంచి బయటకు తీసుకు వచ్చారు చుట్టూ కలియచూశారు ఆ నలుగురూ వాళ్ళ కళ్ళు మామూలు బట్టల్లో వున్న ఆ అయిదుగురి వ్యక్తుల మీద పడ్డాయి పార్టీలోంచి బయటకు పోయి పార్టీకే ద్రోహం తలపెట్టిన ఆ అయిదుగురి వ్యక్తుల మీద వాళ్ళు కళ్ళతో నిప్పులు కురిపించారు ఆవేశంతో రక్తం సలసలా కాగింది వాళ్ళకు

వెనకా ముందూ తుపాకులు లోడ్ చేసి వాళ్ళని వేనుదాకా నడిపించారు వేనులో ఎక్కించారు అక్కడ వాళ్ళ చేతులకు బేడీలు వేశారు కాళ్ళకు కూడా బేడీలు వేశారు అరగంట గడిచేసరికి అందరూ స్టేషనకు వచ్చారు ఒక సెక్షన్ వాళ్ళని తనతో తీసుకొని మిగిలిన వాళ్ళను పంపించి వేశాడు డి యస్పీ డి యస్పీ తనతో తీసుక్ను సెక్షన్లో ప్రకాశం కూడా వున్నాడు తెల్లవారకముందే వేను కదిలి డి యస్పీ ఆఫీసుకు వెళ్ళిపోయింది ఆ వేనులోనే ప్రకాశం కూడా వున్నాడు మధ్యాహ్నాని కల్లా చాలా మంది అధికార్లు డి యస్పీ బంగళాకు చేరుకున్నారు ఆ నలుగురు కమ్యూనిస్టుల్ని డి యస్పీ బంగళాలోనే చివరి గదిలో వుంచారు అక్కడ వున్న గార్డు పీసీలు చాలరన్నట్లు ప్రకాశంతో బాటు ఇంకా ముగ్గుర్ని ఆ బంగళాకు గార్డుగా వేశారు

ఆఫీసర్లు ఆ రోజు పగలూ, రాత్రీ ఆ నలుగురినీ రకరకాల ప్రశ్నలు వేశారు వాళ్ళ నలుగురి పేర్లూ, చిరునామాలు మాత్రం తెలుసుకోగలిగారు అవికూడా ఇన్‌ఫార్మెంట్ల వలన తెలిసినవే ఎన్నిరకాలుగా ప్రశ్నలు వేసినా వాళ్ళనుండి ఏమీ తెలుసుకోలేకపోయారు అంతకు మించి ఎంతో నిబ్బరంగా మాట్లాడుతున్నారు వాళ్ళు ఆ రోజంతా వాళ్ళకు గుక్కెడు నీళ్ళు కూడా ఇవ్వలేదు అందువలన వాళ్ళు నీరసించిపోయారు బాగా మరుసటిరోజు దహానికల్లా వాళ్ళు బాగా

వాడిపోయారు ఉదయం వాళ్ళకు తినటానికి ఏదో తెచ్చిపెట్టారు వాళ్ళు దాన్ని తిని నీళ్ళు తాగారు

''మీరంతా వక్కటే మీరేం చెప్పరు ఇంతకుముందు ఎందరో మా తుపాకీ గుళ్ళకు తమ జీవితాల్ని బలి చేసుకున్నారు మీ బ్రతుకులూ అంతే మంచిగా చెప్పండి, మిమ్మల్ని వదిలి పెడతాము'' మామూలు పాటే పాడాడు యస్పీ వాళ్ళ ముందు వాళ్ళేమీ మాట్లాడలేదు

''మీ ఖర్మ మీ చావు మా చేతుల్లో రాసి వుంది '' అని కోపంగా బయటకు వెళ్ళాడు యస్పీ

వాళ్ళు నలుగురూ ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు కళ్ళతోనే మాట్లాడుకున్నారు ఎవరి స్మృతుల్లో వాళ్ళు మునిగిపోయారు ఓ అరగంట గడిచింది నలుగురు కానిస్టేబుళ్ళు తలుపులు తీసుకొని లోపలికి వచ్చారు వాళ్ళ చేతుల్లో లావుపాటి పట్టుడు కర్రలున్నయ్ వాళ్ళ వెనుక ఇంకో నలుగురు మలబారు పోలీసులు వచ్చారు ఏవో పొట్లాలు తాటాకు బుట్టలో పెట్టుకొచ్చారు వాళ్ళను చూడంగానే గుండెలు ఝల్లుమన్నాయి వీళ్ళకు

రెండో నిమిషంలో కాళ్ళూ, చేతులు కట్టివేయబడిన ఆ నలుగురి వ్యక్తుల శరీరాల మీద పట్టుడు కర్రలు కదంతొక్కాయి పది నిముషాలలో ఆ గది గోడలూ, గచ్చూ అన్నీ నెత్తురు మరకలతో నిండి పోయాయి గచ్చంతా మలమూత్రాలు కలిసిన నెత్తుటి చారికలతో అలికినట్లయి పోయింది కొద్దిసేపటికే ఆ నలుగురూ నేలకు కరుచుకున్నారు ఇద్దరు స్పృహ తప్పారు ఒకతని కనుగుడ్డు కర్ర దెబ్బకు పగిలి, గుడ్డు జన బయటకు చిమ్మింది అతను బాధతో తలక్రిందులయి పోయాడు నాలుగో అతను పళ్ళ బిగువున నినాదాలిస్తున్నాడు ''కమ్యూనిస్టు పార్టీ వర్ధిల్లాలి '' అతని నినాదం గొంతులోనే మాసిపోతోంది నలుగురి వంటిమీది బట్టలు రక్తంతో ముద్దయిపోయాయి ఒక గంట తరువాత కొడుతున్న వాళ్ళు అలసిపోయారు వాళ్ళ చొక్కాలు చెమటతో తడిచి పోయాయి వాళ్ళ వంటినిండా వీళ్ళ రక్తం చింది ఎండిపోతోంది

తలుపులు తీసుకుని లోపలకు వచ్చారు అధికారులు అక్కడి వాతావరణం చూశారు వాసనకు ముక్కులికి చేతిగుడ్డలు అడ్డు పెట్టుకున్నారు ''వూ, కానీయండి'' అని బయటకు వెళ్ళిపోయారు

కానిస్టేబుళ్ళు, మలబారు పోలీసులు ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు వాళ్ళందరి కళ్ళల్లో కసీ, కోపం, విసుగూ కనపడుతున్నయ్ నిలబడి వున్న నలుగురు వచ్చి కింద పడిపోయివున్న కమ్యూనిస్టుల వంటిమీది బట్టల్ని చించివేశారు మొండిమొలలతో వాళ్ళు పడి పోయి వున్నారు తాటాకు బుట్టలో పెట్టి తెచ్చిన పొట్లాలు విప్పి కారాన్ని గుప్పిళ్ళతో తీసుకొని వాళ్ళ నలుగురి శరీరాల మీద మర్దన చేసినట్లు రుద్దారు అంతవరకూ పళ్ళ బిగువుతో బాధను ఓర్చుకున్న ఆ కమ్యూనిస్టులు ఈ బాధను తట్టుకోలేక భయంకరంగా కేకలు పెట్టాడు స్పృహ తప్పిన వాళ్ళిద్దరు కూడా మెలికలు తిరిగిపోయారు

''చెప్పండిప్పటికైనా? చెబితే మీకు '' ఏదో అంటున్నారు పోలీసులు

అంత బాధలోనూ వాళ్ళు ఆ మాటల్ని నిర్లక్ష్యం చేస్తున్నట్లు పెనుగులాడారు ఆ పెనుగ... వాళ్ళ జవాబునీ, భావాన్నీ కొట్టొచ్చినట్లు చూపించింది అలాటప్పుడు కూడా ఆ కమ్యూనిస్టు... పట్టుదల వీళ్ళకు ఆశ్చర్యం కలిగించింది

''నా కొడకల్లారా మీకు చావు తప్పదు'' అన్నాడు ఒక కానిస్టేబులు జేబులోంచి చాకు తీశాడు సప్పున పడిపోయి వున్న వాళ్ళ శరీరాల్ని ఎక్కడ పడితే అక్కడ దోసబద్దల్ని కోసినట్లు కోశాడు నెత్తురు వరదలవుతున్న గాయాల్నిండా కారం రాశాడు ఎడంచేత్తో ఎంతో అనుభవం వున్నవాళ్ళలా ఏమాత్రం ఇబ్బంది పడకుండా వాళ్ళు పనుల్ని చేసుకుపోయారు తిరగి నాలుగు శరీరాల్ని ఎట్ట...

కర్రలు మర్దన చేశాయి రెండు చేతులతో పట్టుకొని బలంగా కొట్టిన ఒక కర్ర దెబ్బ ఒకతని మర్మాంగానికి తగిలింది మరుక్షణంలో ఆ దెబ్బకు అతను వేసిన కేకకు డి యస్పీ బంగళా ప్రతిధ్వనించింది మనిషి అమాంతం గాలిలోకి లేచి ధన్‌మని పడిపోయాడు తరువాత అంతా నిశ్శబ్దం కొన్ని నిముషాలు గడిచాక ఒక కానిస్టేబులు అన్నాడు పక్కవాళ్ళతో ''వాడు చచ్చాడనుకుంటా''

ఔనన్నట్లు తలలూపారు మిగిలినవాళ్ళు కొట్టే ఓపిక లేక బయటకు వెళ్ళారు అంతా ఆ రాత్రి చనిపోయిన వ్యక్తిని మూట కట్టుకు వెళ్ళి వూరికి దూరంగా వున్న ఏట్లో పారేసి వచ్చారు మరుసటి రోజు తెల్లవారేటప్పుడు మళ్ళీ వాళ్ళు ఎనిమిదిమందీ అక్కడకు వచ్చారు డి యస్పీ దగ్గర వుండే ఆర్డర్లీ వచ్చి, ''దొరగారు మిమ్మల్ని రమ్మన్నారు'' అన్నాడు వాళ్ళతో

వాళ్ళు ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు వెళ్ళి కనపడ్డారు దొరకు డి యస్పీ దొర ఈజీ చైర్లో కూర్చుని కాఫీ తాగుతున్నాడు వాళ్ళని చూస్తూనే వుగ్రుడై పోయాడు

''ఏరా లప్డి కొడుకుల్లారా ఆ లంజా కొడుకుల్ని ఏదన్నా స్టేషనకు తీసుకుపొమ్మంటే, తీసుకుపోకుండా ఇక్కడే ఇంటరాగేట్ చేశారు రూమంతా గలీజు చేశారు వాళ్ళు ఈపూట ఆ మిగిలిన వాళ్ళనన్నా ఎక్కడికన్నా తీసుకుపోండి తాలుకా పి యస్ కి తీసుకుపోండి గది అంతా శుభ్రం చేయాలి మీ వెధవ ఇంటరాగేషన్‌కి పిల్లలు భయపడుతున్నారు వెంటనే వాళ్ళని తీసుకెళ్ళండి ఈపూట ఇంకేమీ కొట్టగాకండి కాస్త ఏమన్నా తిండి పెట్టండి తింటానికి వాళ్ళకి పట్టుకొచ్చిన వాళ్ళందరినీ ఇట్లా చంపేస్తుంటే ఎంతకాలం మనం ఇన్‌ఫార్మెంట్ల మీద ఆధారపడతాము ?'' అన్నాడు

వాళ్ళు తిట్టుకుంటూ నిలబడ్డారు సమాధానం ఏమీ చెప్పకుండా చెప్పటానికి ఏమీలేదు వాళ్ళ దగ్గర కొద్దిసేపు నిలబడ్డాక వెళ్ళిపొమ్మన్నాడు వాళ్ళని సెల్యూట్స్ చేసి వెళ్ళారు

గది తలుపులు తీసేసరికి ముక్కులు పగిలిపోయే దుర్వాసన గుప్పున ముక్కుల్ని తాకింది వాంతి వస్తుందేమోనని ఇవతలకు వచ్చారు ఇద్దరు ఒకతను ముక్కుల్ని మూసుకునే వెళ్ళి కిటికీలు తీశాడు ఎండిన రక్తపు మరకలు నల్లగా భయంగొలిపేలా కనిపిస్తున్నాయి గోడల నిండా ముగ్గురూ మూడు దిక్కుల్లో పడిపోయి వున్నారు రెక్కలు తెగిన పక్షుల్లాగా వాళ్ళని పరిశీలనగా చూస్తూ ''చచ్చారా వీళ్ళు కూడా?!'' అన్నాడు అనుమానంగా

''ఇవి అంత తొందరగా చచ్చే ఘటాలు కాదులే'' అన్నాడు ఇంకొకతను ముక్కుని చొక్కా అంచుతో మూసుకొని వెళ్ళి వాళ్ళని కదిలించాడు వాళ్ళ శరీరాలన్నీ దెబ్బలకు వాచిపోయి వున్నయ్ అతను కదిలించిన తరువాత వాళ్ళు బాధగా మూలిగారు కన్ను పోయిన అతని ముఖం వుబ్బి భయంకరంగా వుంది

''ఏం చేద్దాం? వీళ్ళని తాలుకా స్టేషనికి ఎట్లా తీసుకెళ్ళాలో తోచటం లేదు జనమంతా చూస్తారు పొద్దుపోయినాక అయితే ఏ ఇబ్బందీ ఉండదు'' అన్నాడు ఒకతను

''మరి ఆ విషయం ఆ ముసలి తొత్తు కొడుక్కి చెప్పాలి'' అన్నాడు ఇంకొకతను

''నేను చెప్పి ఒప్పిస్తాను ఈలోగా మీరు నాలుగు బక్కెట్లు నీళ్ళు తెచ్చి వీళ్ళమీద పొయ్యండి గదికూడా సుభ్రం చేసినట్లుంటుంది ఏందక్కడ నిలబడి చూస్తారు ఆఫీసరు నా కొడుకుల్లాగా'' అన్నాడు ఒకతను విసుగ్గా

అక్కడున్న వాళ్ళు కదిలారు లోపలకు

''మనం చేసేదే పాకీపనయితే ఇంకా ముక్కులు మూసుకుంటారేరా?'' అన్నాడు అతనే మళ్ళీ

''దీనమ్మని మొదట బుద్ధి తక్కువయ్యి ఇంటరాగేషన్ చేతనవునని ఒప్పుకుంటే బతికినంతకాలం అదేపని చెయ్యాలి పేరేమో ఇంటరాగేషన్ చేసేదేమో పాకీపని'' అన్నాడు ఒకతను చిరాగ్గా

''కొంప వదిలి వచ్చి ఎన్నాళ్ళయిందో ఈళ్ళని పరలోకం పంపేసరికి, ఇంకొక ఇన్‌ఫార్మెంట్ లంజాకొడుకు వస్తాడు వాడో నలుగుర్ని చూపిస్తాడు మనమింక పెళ్ళాం పిల్లల్ని చూసేదెప్పుడు?'' అన్నాడు ఒకతను నిరుత్సాహంగా

''ఈళ్ళపని సాయంత్రానికల్లా అయిపోయేటట్టుందిగా నా కొడుకులు వాయిగమ్మి చస్తారు'' అన్నాడు ఒకతను బక్కెట్లతో నీళ్ళు తెచ్చి వాళ్ళ మీద గుమ్మరించారు ఇంటరాగేషన్‌లో అదీ ఒక భాగమే వాళ్ళ ప్రాణాల్ని తియ్యటానికదొక తేలికపని వాళ్ళు బాధతో మెలికలు తిరిగి పోయారు బొంగురు గొంతులతో కేకలు వేశారు ఒకళ్ళు కూడా కళ్ళు తెరచి చూడలేక, పొయ్యవద్దన్నట్టు చేతులు అడ్డుపెట్టారు తరువాత అచేతనంగా వుండిపోయారు ఆవేదనతో కుమిలిపోయారు

''వీళ్ళకేదన్నా తీసుకురారా నువ్వుపోయి'' అన్నాడు ఒక పీసీ ఇంకొక అతనితో అతను హోటల్‌కు వెళ్ళి పది ఇడ్లీలు పొట్లాం కట్టించుకొచ్చాడు అతను వచ్చేసరికి మిగిలిన వాళ్ళు గదిని కాస్త శుభ్రపరిచారు దుర్వాసన మాత్రం ఏమీ తగ్గలేదు కాని నిముషాలు గడిచేకొలదీ ఆ వాసనకు వాళ్ళ ముక్కులు అలవాటు పడుతున్నట్టున్నయ్ ముక్కులకు గుడ్డలు అడ్డుతీసేసి తిరుగు తున్నారు వాళ్ళ ముగ్గురి శరీరాల్ని నీళ్ళతో తడిపేశారు వాళ్ళు ఆ బాధతో మూలుగుతున్నారు కాని కదలలేకపోతున్నారు నరకయాతనతో చావుకు దగ్గరవుతున్నారు శరీరమంతా మంటల్లో మండుతున్నట్లుగా వుంది

''రేయ్, లేచి ఇడ్లీలు తినండి'' అన్నాడు ఇడ్లీలు తెచ్చిన పీసీ

ఆ కానిస్టేబులి మాటలు ఎక్కడో దూరం నుండి వినిపిస్తున్నట్లు వినిపించాయి వాళ్ళకు ఎంత ప్రయత్నించినా సమాధానం చెప్పలేకపోయారు తమకసలెలాగుందో కూడా తెలుసుకోలేని బాధతో అచేతనంగా వున్నారు శరీరంలోని ఏ భాగం కూడా మెదడు ఆజ్ఞల్ని అమలు పరచలేక పోతోంది ఒక్క మెదడు మాత్రం నీరసంగా ఆలోచిస్తోంది

''అయ్యగారు పిలుస్తున్నారు'' అన్నాడు ఆర్డర్లీ వచ్చి వాళ్ళు ఒకళ్ళ మొఖాలు ఇంకొకళ్ళు చూసుకున్నారు నలుగురు అక్కడేవుండి, మిగిలిన నలుగురు డి యస్పీ ఆఫీసురూం దగ్గరకు వెళ్ళారు అనుమానంగా

''ఒక ఇన్‌ఫర్‌మేషన్ వచ్చింది త్వరగా బయలుదేరాలి మొన్నటి వాళ్ళే తెచ్చారు ఆచూకీ'' అన్నాడు డి యస్పీ వాళ్ళని చూస్తూనే

''మరి వీళ్ళు ముగ్గురూ '' నసిగారు వాళ్ళు, గదిలోని ముగ్గురు కమ్యూనిస్టుల్ని గురించి

''ఏం ఫరవాలేదు అంతగా అయితే వెంటనే వద్దురుగాని మీరు తలుపువేసి బయట జాగ్రత్తగా గార్డు వెయ్యండి లోపలివాళ్ళ చేతులకూ కాళ్ళకు బేడీలు వేసి గొలుసులతో కిటికీలకు కట్టెయ్యండి ''

వాళ్ళేమీ మాట్లాడలేదు, వాళ్ళమాటకు విలువలేదుకాబట్టి సెల్యూట్స్‌చేసి బయటకొచ్చారు

''ఇట్లాంటివెయ్యి మనం ఎన్ని చూడలేదు ఈళ్ళ పని ఇంతే'' అన్నాడు ఒక పీసీ

''అవును మరి మనం చెయ్యగలిగింది మాత్రం ఏముంది కానియ్'' అన్నాడు ఇంకొకతను ఒక అరగంటలో బయలుదేరి వెళ్ళారు అంతా ఈసారి కూడా ప్రకాశం పనిచేస్తున్న స్టేషనుకే వెళ్ళారు అంతా అప్పటికి ఉదయం పదయ్యింది యస్సై గబగబా పరుగులాంటి నడకతో వచ్చి సెల్యూట్ చేశాడు డి యస్పీకి డి యస్పీ జీపులోనే కూర్చుని వున్నాడు

''మెన్ అంతా సిద్ధంగా వున్నారా?''దబాయించినట్లు మాట్లాడాడు డి యస్పీ

''వున్నారు సార్'' అన్నాడు వినయంగా యస్సై

''వేను ఎక్కించు, త్వరగా, టైంలేదు''

''అలాగే సార్ '' అని, అందర్నీ వేను ఎక్కిస్తున్నాడు యస్సై అంతా ఎక్కారు, ఒకళ్ళ [illegible] తోసుకుంటూ, తొక్కుకుంటూ ముందు [illegible] ఎక్కిన వాళ్ళకే సీట్లు మిగిలిన వాళ్ళంతా [illegible] ఎంత దూరం నిలబడవలసిందే [illegible] సగం సీట్లు వందలబారు పోలీసులు [illegible]ంచేసుకున్నారు

డి యస్పీ ఏదో ఆలోచనలో మునిగిపోయాడు

''తమరు కొంచెం పలహారం తీసుకోవాలి'' బుజ్జగిస్తున్నట్టు అడిగాడు వినయాన్ని మేళవించి యస్సై డి యస్పీతో ఆ మాట విని డి యస్పీ య[illegible] అదోలా చూశాడు

''వూహు టైం లేదు'' అన్నాడు బింకంగా

''అమ్మమ్మా! ఒక్క నిముషం సార్ అసలే [illegible] అలసిపోయి వున్నారు'' బతిమాలుతున్నట్లు అన్నాడు యస్సై

''తెప్పించాలా? రెడిగా వుందా?''

''వుంది సార్ ఒక్క నిముషంలో బయలుదే[illegible] సార్'' అన్నాడు అనునయంగా యస్సై

''ఊ సరే త్వరగా కానియ్'' అని అయిష్టంగా దిగుతున్నట్టు జీపులో నుంచి క్రిందకు దిగి, వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు డి యస్పీ యస్సై హడావిడిగా లోపలికి వెళ్ళి పెద్ద ప్లేటు నిండా ఉప్మా తీసుకొచ్చి పెట్టాడు సుబ్రంగా కడిగిన గాజు గ్లాసుతో కూజాలోంచి చల్లటి నీళ్ళు తెచ్చి టేబిలు మీద పెట్టాడు జీడిపప్పు వేసిన ఉప్మావాస[illegible] నోట్లో నీళ్ళూరుతున్నాయ్ యస్సైకి రెండే రెండు నిముషాల్లో ప్లేటు ఖాళీ చేశాడు డి యస్పీ [illegible]ట్లో వూరుతున్న నీళ్ళని చప్పుడు కాకుండా దిగమింగుతూ అటెన్షన్‌లో టేబులకు రెండడుగుల దూరంలో నిలబడ్డాడు యస్సై చెయ్యి కడిగిన ప్లేటుని తీసి పక్కనపెట్టి ఫ్లాస్కులో నుంచి, చిక్కటి కాఫీ పెద్ద గాజుగ్లాసు నిండా పోసి డి యస్పీ ముందు పెట్టి చేతులుపిసుక్కుంటూ నిలబడ్డాడు యస్సై స్ట్రాంగ్ కాఫీ వాసన ముక్కుల్ని తాకిన వెంటనే చటుక్కున గ్లాసుని చేతిలోకి తీసుకున్నాడు డి యస్పీ

''అయ్యా! సార్ '' గొణిగాడు యస్సై భయంగా

''[illegible] '' కాఫీని సిప్ చేస్తూ మందంగా అన్నాడు డి యస్పీ

''మొన్న పట్టుకున్న వాళ్ళ విషయంలో రిపోర్టులో నా పేరు కూడా రివార్డు కోసం '' నట్లు కొడుతూ బయటుకొస్తున్న అతని మాటలు [illegible]యస్పీ చూసిన కోరచూపుకు చటుక్కున ఆగిపోయాయి

తరువాత యస్సై ఇంకేమీ మాట్లాడలేదు ఖా[illegible]న గ్లాసుని బల్లమీద పెట్టి లేచి నిలబడ్డాడు డి యస్పీ గబగబా వెళ్ళి జీపు ఎక్కాడు విశ్వా[illegible]న్న జంతువులాగా అతన్ని వెంబడించాడు

యస్సై తనలో తను తిట్టుకుంటూ

సాయంత్రానికల్లా వాళ్ళు నలుగురు కమ్యూనిస్టుల్ని పట్టుకొని స్టేషనుకు తిరిగివచ్చారు పొద్దుపోతోంది ఎప్పటిలాగానే అంతా హడావిడిగా వుంది ఎవరికి ఏ డ్యూటీలు చెపుతారా అని మెన్ అంతా ఎదురు చూస్తున్నారు ప్రకాశం చటుక్కున ఇంటికెళ్ళి గబగబా స్నానం చేసి, భోంచేసి వచ్చాడు డి యస్పీ ఆఫీసునుంచి ఉదయం వచ్చిన ఇంటరాగేషన్ పార్టీవాళ్ళు వెళ్ళి డి యస్పీతో ''సార్ మేమెళ్ళి ఆ ముగ్గురి సంగతి చూస్తాం'' అన్నారు

''ఇప్పుడు కాదు ఇక్కడ పనివుంది '' అన్నాడు డి యస్పీ చిరాగ్గా వాళ్ళు తిట్టుకుంటూ ఇవతలకు వచ్చారు సెల్యూట్లు చేసి

''బంగళాలో వాళ్ళు అయిపోతారు వాళ్ళని పట్టించుకొనేవాళ్ళు లేరు '' అన్నాడు ఒక పీసీ బాధగా

''పోనియ్ ఇయ్యేమన్నా మనకు కొత్తా వాడికి చెప్పినా అర్ధం కాదు అంతా వాడిష్టమేగా'' అన్నాడు ఇంకొక పీసీ, డి యస్పీని దృష్టిలో పెట్టుకొని

''అసలింత మంది ఇక్కడుంటే మనం ఎందుకు ? మనమేనా పోటుగాళ్ళం పాపమంతా మనమే మూటగట్టుకోవాలా ?'' అన్నాడు ఒక సీనియర్ పీసీ

ఆ మాట విని ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు కొద్దిసేపు

''ఇప్పుడు దొరికిన నలుగురిలో ముగ్గురు లీడర్లంట ఒకడేమో ఎనాపుంగాలు కమ్యూనిస్టంట'' అన్నాడు ఒకతను

''ఆ చచ్చారు ముండనాకొడుకులు మన ప్రాణాలు తోడటానికి పుట్టుకొచ్చారు'' అన్నాడు ఒకతను కోపంగా

రాత్రి పదిగంటలప్పుడు యస్పీ వచ్చాడు అధికారులంతా, ఆ రాత్రంతా, ఆ నలుగుర్ని రకరకాలుగా ప్రశ్నలు వేశారు ఎప్పటిలాగానే వాళ్ళు క్రింది ఉద్యోగస్తుల తిండితిప్పల విషయం పట్టించుకోలేదు బయటి నుండి వచ్చిన పీసీలు వూళ్ళో కెళ్ళి దొరికిందేదో తిని నీళ్ళు తాగి కడుపుమంట చల్లార్చుకున్నారు ఆకలిమంట తీరినా అధికారుల మీద ఆగ్రహం రగులుతూనే వుంది స్టేషనుకొచ్చి ఎక్కడ కాస్త చోటు దొరికితే అక్కడ పడి నిద్రపోయారు స్టేషన్లో గార్డు పీసీలు, అధికారులు తప్ప మిగిలిన అందరూ నిద్రలోకి జారిపోయారు తెలతెలవారుతుండగా యస్పీ వెళ్ళిపోయాడు వెంటనే అందరినీ నిద్ర లేపారు కమ్యూనిస్టుల్ని తీసుకొచ్చి వేనులో కూర్చోబెట్టారు వాళ్ళు దొరికినప్పటి నుండీ వాళ్ళ చేతులు వెనక్కు విరగదీసి కట్టేవున్నయ్ పన్నెండుమంది మం బారు పోలీసులు వేనులో ఎక్కారు యస్సై, సి ఐ, డి యస్పీ జీపులో ఎక్కారు

నలుగురు లోకల్ పీసీల్ని కూడా వేను ఎక్కొచ్చమన్నాడు డి యస్పీ యస్సై నలుగుర్ని పిలిచి వేను ఎక్కమన్నాడు వాళ్ళల్లో ప్రకాశం కూడా వున్నాడు అందరి చేతుల్లో తుపాకులు వున్నయ్ విషయం అర్ధమయింది అందరికీ అంతా ఆ నలుగురు కమ్యూనిస్టుల్ని చూస్తున్నారు వాళ్ళు ప్రశాంతంగానే వున్నారు ఏ భావాలూ వాళ్ళల్లో కనిపించటం లేదు 'ఎక్కడికి తీసుకెళ్ళేదీ వాళ్ళకు కూడా తెలుసా?' తనలో తను అనుకున్నాడు ప్రకాశం తరువాత కొద్దిసేపటికి వేను బయలుదేరింది వ్యాన ముందు జీపు వెళుతోంది అధికార్లంతా అందులో వున్నారు మలబారు పోలీసుల యస్సై మాత్రం వేనులో వున్నాడు అతను డ్రైవరు సీటు పక్కన కూర్చుని వున్నాడు వాహనాలు వూరిని వదిలిపెట్టి అడవిలో ప్రవేశించే సరికి బాగా తెల్లవారింది అడవిలో ఒక

అరగంటసేపు ప్రయాణం చేశాయి అక్కడితో దారి ఆగిపోయింది వేనులోని వీళ్ళని దింపారు వాళ్ళకి వెనకా ముందూ తుపాకులు లోడ్ చేసుకుని పోలీసులు నడుస్తున్నారు వాళ్ళ వెనుక లోకల్ పోలీసులు నడిచారు జీపుకీ, వేనుకీ కాపలాగా కొంతమంది పీసీలు ఉండిపోయారు రెండొందల గజాలు దట్టమైన అడవిలోకి వాళ్ళు వెళ్ళారు అక్కడ నాలుగొందల గజాల దీర్ఘచతురస్రపు స్థలం వుంది అంతా అక్కడి కొచ్చి నిలబడ్డారు

''ఊ కానియ్యండి త్వరగా అంతా నిముషాలలో అయిపోవాలి'' హుకుం జారీ చేశాడు డి యస్పీ సి ఐ, మలబారు ఆరెస్సైకి 'ఫైర్' ఉత్తర్వులు జారీ చేశాడు నలుగురు మలబారు పోలీసులు ఆ వ్యక్తుల్ని నెట్టుకుంటూ స్థలం ఆ చివరికి వెళ్ళి నలుగుర్నీ ఒకళ్ళ పక్కన ఒకళ్ళని రెండేసి అడుగుల దూరంలో నిలబెట్టారు వాళ్ళ కెదురుగా నలుగురు మలబారు పోలీసులు తుపాకులు లోడ్ చేసుకుని నిలబడ్డారు మిగిలినవాళ్ళు పక్కన నిలబడి చూస్తున్నారు అలాటి సంఘటనలు ఎన్నో చూసి వుండటాన పోలీసుల్లో ఏ భావమూ కనిపించటం లేదు వాళ్ళ నక్కడ నిలబెట్టి చటుక్కున పక్కకు తప్పుకున్నారు ఆ నలుగురు మలబారు పోలీసులు పెద్ద బండరాళ్ళ చాటుకు ఆ కమ్యూనిస్టు లేదన్నా నినాదం చేస్తారేమో అనుకున్నాడు ప్రకాశం కాని వాళ్ళు నిశ్చలంగా నిలబడ్డారు గంభీర వాతావరణం ఆవరించింది అక్కడ ప్రశాంతమైన నునువెచ్చని ఆ వాతావరణంలో చెదురుమదురుగా పక్షుల కూతలు మినహా ఏ శబ్దాలూ వినిపించటం లేదు అందరి దృష్టీ ఆ నలుగురి మీదే వుంది ఈ నలుగురు పీసీలు ఆరెస్సై చెప్పిన కాషన్‌తో తుపాకులు ఎత్తి భుజానికానించుకొని ఎయిమ్ చూస్తూ నిలబడ్డారు

''ఫైర్'' ఆరెస్సై గొంతు ఖంగున మోగింది

మరుక్షణంలో అడవి అంతా దద్దరిల్లేలా త్రీ నాట్ త్రీ రైఫిల్స్ నిప్పులు చెరిగాయి ఆ రాక్షస తుపాకీ గుండ్ల తాకిడికి భయంకరమైన అరుపులతో రెండడుగుల ఎత్తు లేచి, అయిదారడుగుల వెనక్కు పోయి, విసిరేసినట్లు పడిపోయారు ఆ కమ్యూనిస్టులు నలుగురూ కుప్పలా భయంతో అరుస్తూ ఎగిరిపోయాయి చెట్లమీది పక్షులు ఆ దృశ్యాన్ని చూడలేక కళ్ళు మూసుకున్నాడు ప్రకాశం ఆ నలుగురి రక్త మాంసాలు చెల్లా చెదురుగా చిందాయి ఫైర్ చేసిన నలుగురు పీసీలూ తుపాకుల్ని నేలమీద పడుకోబెట్టి లేచి అటెన్షన్‌లో నిలబడ్డారు అంతా క్షణాల్లో జరిగిపోయింది బండరాళ్ళ వెనుక నిలబడ్డ వాళ్ళని కేకేసి పిలిచాడు యస్సై వాళ్ళు వచ్చి, బాగా అనుభవం ఉన్నవాళ్ళలాగా, ఆ శవాల్ని ఏ మాత్రం బిడియం, భయం లేకుండా కాళ్ళూ, చేతులూ పట్టుకొని పది గజాల అవతల వున్న పెద్ద లోయ దగ్గరకు ఈడ్చుకుపోయి విసిరేశారు ఆ కార్యక్రమానికి పట్టిన మొత్తం కాలం పదినిముషాల లోపే

అంతా వేనులెక్కారు స్టేషనుకు వచ్చేశారు స్టేషను కొచ్చిన పది నిముషాలకు డి యస్పీ వెళ్ళిపోయాడు అతనితో పాటు వచ్చిన ఇంటరాగేషన్ పార్టీవాళ్ళు కూడా వెళ్ళిపోయారు

తన బంగళా ముందు జీపు దిగటంతోటే డి యస్పీ ఇంటరాగేషన్ పార్టీని పిలిచి, ''లోపల వున్న వాళ్ళ సంగతి చూడండి'' అన్నాడు

'అలాగే' అన్నట్టు తలలూపారు వాళ్ళు గబగబా లోపలికెళ్ళారు బైట సెంట్రీ నిలబడి వున్నాడు తాళాలు తీసి, తలుపులు తీసి అక్కడి దృశ్యం చూచి గట్టిగా నిట్టూర్చారు లోపల వున్న ముగ్గురూ చచ్చిపోయి వున్నారు ఆ రాత్రి బాగా చీకటిపడిన తరువాత వాళ్ళను తీసికెళ్ళి వాగులో పడేసి వచ్చారు

చూస్తుండగానే ఇలాటి సంఘటనలతో నెలలూ, సంవత్సరాలూ గడిచిపోయాయి ప్రపంచంలో ఎన్నో మార్పులు జరిగినట్టుగానే ప్రకాశం కుటుంబంలో కూడా ఎంతో మార్పు వచ్చింది తల్లి మంచంలో నుండి లెగవటం లేదు పిల్లవాడు అయ్యవారి బడికి వెళుతున్నాడు కూతురు ఆరోగ్యంగా పెరుగుతోంది కూతురు పుట్టిన తరువాత భార్యకు రెండు సార్లు గర్భస్రావం జరిగింది ఆమె బలహీనంగానే వుంటోంది ప్రకాశం విషయానికొస్తే నేర్చుకొన్న ఆ నాలుగు అక్షరం ముక్కలూ అభ్యాసం లేక మరిచిపోయాడు శారీరకంగా కన్నా మానసికంగా బాగా అలసిపోయాడు సదరు అలుపు తాలూకు వృద్ధాప్యపు లక్షణాలు ముఖం మీద చోటు చేసుకుంటున్నాయి వెంట్రుకలు తెల్లబడుతున్నయ్ శారీరక శక్తి కూడా సన్నగిల్లుతోంది ఆర్థికమైన వెసలుబాటు ఏమీ లేదు గొర్రె తోకలాగా ఎంత కాలమున్నా అంతే

కమ్యూనిస్టుల కార్యకలాపాలు క్రమంగా సన్నగిల్లాయి అధికారుల హడావిడి కూడా తగ్గిపోయింది రకరకాల వార్తలు వింటున్నారు కమ్యూనిస్టులు పోరాటం విరమించు కుంటున్నారనీ, ఎన్నికలలో నిలబడి అధికారంలోకి వచ్చి, అధికారాన్ని చేజిక్కించుకుంటారనీ, అందువలనే వాళ్ళ హడావిడి నెమ్మళించిందని అనుకుంటున్నారు ఆ మాటలూ, వాళ్ళ పనులు చూస్తుంటే నిజమనిపిస్తోంది ప్రకాశానికి 'ఈ పని ముందే చేసి చావకూడదూ ముండా కొడుకులు' అని తిట్టుకున్నాడు తమ ప్రాణాలకు ఇక ముప్పులేదని నిర్ధారించుకున్నాడు చాలా నెలల తరువాత నిబ్బరంగా నిట్టూర్చాడు తరువాత ఎన్నికలు జరిగాయి కమ్యూనిస్టు పార్టీకి చాలా సీట్లు వచ్చాయని విన్నాడు అతని కెంతో ఆశ్చర్యం వేసింది దాన్ని బట్టి ప్రజలకు ఆ పార్టీ అంటే ఎంత అభిమానముందో తెలిసింది మలబారు పోలీసుల్నీ, మిలటరీ కేంపుల్నీ ఎత్తివేశారు ఇప్పుడెక్కడా కమ్యూనిస్టుల మాటే వినబడటం లేదు కొంచెం విశ్రాంతిగా వున్నట్లు తోచింది అతనికి పోలీసులంతా మామూలు డ్యూటీల్లో పడిపోయారు

గత నాలుగయిదు సంవత్సరాలుగా పూర్తిగా మరిచిపోయిన పేకాట మరలా వేస్తున్నారు స్టేషన్లలో తనకు దొరికిన ఈ రెస్ట్ టైంని చదువుకు వినియోగించాలనుకున్నాడు ప్రకాశం ఆ వూహ అతనికి నవ్వు తెప్పించింది తనలో ఎందుకీ వ్యామోహం చదువు మీద ఇంకా వుందో అర్థం కాలేదు చదవటం తనకెంతో ఆనందం కలిగించే క్రియగా అర్థం చేసుకున్నాడు మానసికంగా నీరసించి వున్న అతనిలో విశ్రాంతి తిరిగి వుత్సాహాన్ని రేకెత్తించింది కాని ఆ గ్రామంలో కనీసం దిన పత్రిక కూడా దొరకదు

కమ్యూనిస్టుల ఏరివేత కోసం పెట్టిన అట్లాంటి పోలీసు స్టేషన్లను ఎత్తివేసింది ప్రభుత్వం అలాటి పరిస్థితిలో అతనికి టౌను పోలీసు స్టేషనుకు బదిలీ వచ్చింది డి వో వచ్చిన తరువాత ఇంకొక్క క్షణం సేపు కూడా అక్కడ వుండబుద్ధికాలేదు 'ఎప్పుడెప్పుడు ట్రాన్ఫర్ పాస్‌పోర్టు తీసుకుని వెళదామా' అని ఎదురు చూశాడు ఆ ట్రాన్స్‌ఫర్ వార్త మాత్రం అతని భార్యకేమీ ఆనందం కలిగించలేదు

''ఎందుకు టౌను? అన్నీ కొనాల్సిందేగా? ఈడైతే పుల్లలు కొనే పనిలేదు సల్ల కొనే పనిలేదు ఇంకా ఇట్టాంటోటికి ఇబ్బంది లేదు'' అంది కాని ప్రకాశం అవి ఏమీ పట్టించుకోలేదు 'టౌనులో అయితే కాస్త చదువుకోవటానికి వీలుంటుంది పిల్లవాడి చదువు కూడా బావుంటుంది అమ్మకు ఆసుపత్రి సౌకర్యముంటుంది కాకపోతే కాస్త ఖర్చు ఎక్కువే కాని దానికి తగ్గ రాబడి కూడా వుంటుందిలే' అని సర్ది చెప్పుకున్నాడు తనకు తాను

''అయినా చేసేదేముంది మనకు నచ్చినా, నచ్చకపోయినా మన యిష్టాయిష్టాలతో సంబంధం

లేదు గవర్నమెంటు ఉద్యోగం ఎక్కడికి పొమ్మంటే అక్కడికి పోవాలి కదా'' అన్నాడు భార్యతో ఆమె ఏమీ మాట్లాడలేదు జీతం తీసుకుని వూళ్ళో యివ్వవలసిన చిల్లరమల్లర బాకీలు ఇచ్చివేసి ముందుగా వెళ్ళి డ్యూటీకి రిపోర్టు చేసి, ఇల్లూ అదీ చూసుకొని, రెండు రోజులు సెలవు పెట్టి వచ్చి సామానంతా సర్దుకుని భార్యా, పిల్లల్ని తీసుకొని వెళ్ళాడు తల్లి ఆరోగ్యం సన్నగిల్లుతోంది

మొదట్లో టౌను డ్యూటీ విధానం అంతుపట్టలేదు అతనికి కాని రోజులు గడిచే కొందీ తెలుసుకోగలిగాడు టౌనులో పగలు డ్యూటీలు, రాత్రి డ్యూటీలు విడివిడిగా వుంటాయి పగల డ్యూటీల వాళ్ళకు రాత్రిళ్ళు రెస్ట్ రాత్రి డ్యూటీల వాళ్ళకు పగలు రెస్ట్ కాని సరిపోయినంత మంది సిబ్బంది లేక పగలూ, రాత్రుళ్ళూ డ్యూటీలు చేయిస్తున్నారు చదువుకోవటానికి పుస్తకాలు దొరుకుతున్నయ్, కాని టైం దొరకటం లేదు మిగతా డిపార్టుమెంటుల్లో ఆదివారం శెలవుంది పండగలకు, పబ్బాలకు సెలవుంది కాని ఇందులో లేదు ఎందుకని శెలవివ్వరో అర్థం కాలేదు అదేమాట తోటి వాళ్ళతో అంటే వాళ్ళు అతన్ని పిచ్చివాడికింద జమకట్టి మాట్లాడారు

''పోలీసులకు వీక్లీ ఆఫ్ ఏంది ప్రకాశం ?! అంతా గమ్మత్తుగా మాట్లాడుతున్నావే, ఎవురిస్తారు మనకి?'' అన్నారు

''అంటే మనకు రెస్ట్ అక్కర లేదా?'' అన్నాడు వాళ్ళ అమాయకత్వానికి ఆశ్చర్యపోతూ

''రెస్ట్ ఎందుకు అఖ్ఖరలేదు ? కాని ఇచ్చేవాడు ఎవడు ? అసలు మన డిపార్టుమెంటులో ఆఫ్ అనేదే లేదుగా ఇవ్వటానికి''

''లేకపోతే మనమంతా కలిసి యస్పీదొరకి కాగితాలు పెట్టుకుందాం ఎందుకియ్యరో చూద్దాం'' అన్నాడు ఉద్రేకంగా

''మనమంతా కలిసి ఆ పనిచేస్తే, ఉన్న నౌకరీ వూడబీకి ఇంటికి పంపిస్తారు ఇది చీదితే వూడిపోయే ఉద్యోగం మా దగ్గర అంటే అన్నావు గానీ ఇంకెక్కడా ఆ మాట అనమాక నీలాంటి చదువుకున్న వాళ్ళతో వచ్చే ఇబ్బందులు ఇవే'' అన్నాడు ఒకతను

''అట్లాగెందుకు జరిగిద్ది? ఇంత చిన్న విషయానికి ఉద్యోగాలు పోతాయా?''

''ఇంత చిన్నదేంది? వాళ్ళు తలుచుకుంటే ఏమీ కారణం లేకుండానే నౌకరీలు వూడబీకుతారు పోయిన నౌకరీనీ నువ్వు కాగితాలు నడిపి తిరిగి తెప్పించుకోగలవా ?'' అన్నారు

ప్రకాశం ఏమీ మాట్లాడలేదు వాళ్ళన్నది కూడా నిజమే చేసేది ప్రభుత్వోద్యోగమని పేరే గానీ, ఏ మాత్రం భద్రత లేదు కాని ప్రకాశంకు మాత్రం చాలా బాధగా వుంది 'ఆరు రోజులు కష్టపడ్డ వాళ్ళకు ఒక్కరోజు సెలవు ఇవ్వటం అన్ని చోట్లా వున్నదే కాని తమకు మాత్రం 'ఆఫ్' అనేదే లేదు ఎంత దారుణం' అనుకున్నాడు

ఈ డిపార్టుమెంటుని ప్రభుత్వాలు ఇలాగెందుకు వుంచుతున్నయ్యో అర్థం కావటం లేదు బాధగా రోజులు దొర్లిస్తున్నాడు

తల్లి ఆరోగ్య పరిస్థితి ఆందోళనగా వుంది అప్పటికీ శ్రద్ధగానే డాక్టర్లకు చూపిస్తున్నాడు ఆమె కిష్టమయిన కూరా నారా తెస్తున్నాడు కాని ఏమీ అభివృద్ధి కనిపించటం లేదు ఆమెలో రోజుల్లోనే ముఖంలో ప్రేతకళ చోటు చేసుకుంది భయమేసింది ప్రకాశంకు డాక్టర్ని కొంచెం గట్టిగా అడిగాడు ఓ రోజు ప్రకాశం పరిస్థితీ, మంచితనం తెలిసిన ఆ డాక్టరు సలహా చెపుతున్నట్టు అన్నాడు, ''ఇంక ఎన్ని మందులు వాడినా లాభం లేదు ప్రకాశం డబ్బులు దండగ పెద్ద వయస్సు కదా ?''

అంత బాధ తనెప్పుడూ పడనట్టు అనిపించింది ఇల్లంతా చిన్న బోయినట్లు బావురు మంటోంది ఆలోచనలు జీవితం చుట్టూ తిరుగుతున్నయ్ 'అయిపోయింది బ్రతుకు' అనుకున్నాడు 'తనయినా కూడా అంతే కదా! అందరూ అంతే ఎప్పుడీ జీవుడు ఎగిరిపోతాడో తెలియదు ఈ కాస్త దానికి, ఎన్ని అన్యాయాలు, ఎన్ని ఎక్కువ తక్కువలూ! ఎంత తక్కువ జీవితకాలం ?'' అనుకున్నాడు

అతని బాల్యం, యౌవ్వనం, ఉద్యోగం, వూళ్ళు తిరగటం అన్నీ గుర్తొచ్చాయి అన్నీ మొన్న మొన్న జరిగినట్టున్నాయి కూతురు 'నానమ్మ, నానమ్మా' అంటూ ఏడుస్తోంది కొడుకు బిక్కు బిక్కుమంటూ తిరుగుతున్నాడు 'నాన్నా! నానమ్మ ఎప్పుడొచ్చిద్ది?'' అని అడుగుతున్నాడు వాడిని తీసుకుని ఒళ్ళో పెట్టుకొని తల నిమిరాడు ఏడుపు ఆగలేదు

రెండు రోజుల తరువాత ఫోటో స్టూడియోకి వెళ్ళాడు ఫోటోగ్రాఫర్ ప్రకాశాన్ని చూస్తూనే గతుక్కుమన్నాడు ''అది సరిగా రాలేదండీ నేనొచ్చి ఇంకొకటి తీస్తాలే'' అన్నాడు

ప్రకాశంకు కోపం వచ్చింది కొద్ది సేపు ఏమీ మాట్లాడకుండా నిలబడ్డాడు ''అసలు చూపించండి ఎట్లావచ్చిందో'' అన్నాడు

అతను నీళ్ళు నమిలాడు చూపించాడు ఎలా తెలా పోయి వుంది ఫోటో ''పొరపాటయి పోయింది సార్'' అన్నాడు

ప్రకాశంకు కోపం తారాస్థాయి నందుకుంది కాని ఏమీ మాట్లాడకుండా విసురుగా వెనక్కు తిరిగి వచ్చేశాడు

తొమ్మిదో రోజున తల్లి దినం చేశాడు అప్పు చేసి

వేటితోనూ సంబంధం లేకుండా రోజులు గడిచిపోతున్నాయి వాటి మానాన అవి మళ్ళీ మామూలు జీవితంలో పడ్డాడు కాలం కరిగిపోతోంది కర్పూరంలాగా

ఒకరోజు ఉదయం స్టేషన్లో వున్నారు అంతా ఇద్దరు వ్యక్తులు లోపలికి వచ్చారు ఇద్దరూ లుంగీలు కట్టుకొని వున్నారు గడ్డాలు పెరిగి మాసిపోయి వున్నయ్ వాళ్ళు సరాసరి రైటరు దగ్గరకొచ్చి సెల్యూట్లు చేశారు 'ఏమిట'న్నట్టు చూశాడు రైటరు వాళ్ళు సెల్యూట్లు చేసిన తీరు చక్కగా, స్మార్ట్‌గా వుంది 'మిలటరీ నుండి తిరిగివచ్చిన వాళ్ళేమో' అని అనుకున్నారు అంతా రైటరుతో ఏదో చెప్పారు చిన్నగా వాళ్ళు అర్థం కానట్టు చూశాడు రైటరు వాళ్ళు మళ్ళీ చెప్పారు అప్పటికి పీసీలు అందరూ రైటరు బల్ల చుట్టూ చేరారు ఆ వచ్చినవాళ్ళు వచ్చీరాని తెలుగు మాట్లాడుతున్నారు వాళ్ళు చెప్పిన దానిని బట్టి అర్థం చేసుకున్నదేమిటంటే, వాళ్ళు మెద్రాస్ పోలీసులనీ, 'వీక్లీ ఆఫ్' కోసం అంతా స్ట్రయికు చేశారనీ, ప్రభుత్వం ఆఫ్ ఇచ్చిందనీ, కాని స్ట్రయికులో పాల్గొన్న వాళ్ళని డిస్మిస్ చేసిందనీ, ఇలాగొచ్చి చందాలు పోగు చేసుకుంటున్నారని అర్థమయ్యింది అందరికీ ఆమాటలు ఎంతో వుత్తేజాన్ని కలిగించాయి ప్రకాశానికి అక్కడున్న వాళ్ళంతా తలా ఒక ప్రశ్న వేశారు వాళ్ళని వాళ్ళు వినయంగా సమాధానం చెప్పారు

''చూశావటయ్యా ప్రకాశం! నువ్వేదో వీక్లీ ఆఫ్ అంటుంటావుగా చూడు వాళ్ళ పరిస్థితి ఇప్పుడు వాళ్ళకు దిక్కెవరు? పెళ్ళాం, పిల్లలు బజారున పడ్డారు ఏం చెపుతావు దీనికి ?'' అన్నాడొక పీసీ ప్రకాశం ఏమీ మాట్లాడలేదు వాళ్ళని చూస్తే జాలి వేసింది

''ఎవరికి తోచింది వాళ్ళివ్వండి, వాళ్ళెంతసేపు వుంటారు పాపం'' అన్నాడు రైటరు

అప్పటికే కొంతమంది జారుకున్నారు మిగిలినవాళ్ళు వాళ్ళకు తోచింది ఇచ్చారు మొత్తం

కలిపినా రెండు పూటల భోజనానికి చాలవు వాళ్ళకు ప్రకాశం వాళ్ళని ఇంటికి తీసుకెళ్ళాడు గబగబా భోజనం తయారుచెయ్యమని భార్యని పురమాయించాడు మంచం వేసి కూర్చోబెట్టాడు వాళ్ళను ''అసలేమిటి? ఏం జరిగింది ? వివరంగా చెప్పండి'' అన్నాడు ఆనందంగా

వాళ్ళు చిన్నగా నిట్టూర్చారు ''ఏం చెప్పమంటారు '' అన్నారు చిన్నగా ప్రారంభించారు ''ఏమీలేదు ప్రత్యేకంగా ఈ రోజుల్లో కూడా ఎన్ని దారుణమైన పని పరిస్థితులు వున్నయ్యో చూడాలంటే మన డిపార్టుమెంటు మంచి ఉదాహరణ మునిసిపాలిటీల్లో దొడ్లు సుభ్రం చేసేవాళ్ళకు కూడా వారానికొక రోజు సెలవుంది పండగలకూ, పబ్బాలకు సెలవులున్నయ్ మనం వాళ్ళకన్నా తీసేశామా? మనకి పని గంటలులేవు వీక్లీ ఆఫ్ లేదు ఆదివారం లేదు ఇక ఈ దుర్భర పరిస్థితులకు తట్టుకోలేకపోయాం పనిగంటల నిర్ణయం ఎలాగూ లేదు కనీసం వారానికొక్క రోజన్నా ఆఫ్ లేకపోతే ఇక మనకీ, ఇంత మేత వేసి పనుల కుపయోగించుకునే గొడ్లకీ తేడా ఏముంది ? ఉద్యోగంలో చేరినప్పుడు వేసుకున్న యూనిఫారం వంటిమీదే చివికిపోవాల్సిందే గానీ, ఇంకో మార్గం లేదు అందులో రూరల్ పోలీసుకీ, సిటీ పోలీసుకీ తేడా వుంది సిటీలో మా పరిస్థితి మరీ దారుణం అలాగని రూరల్ పోలీసులు సుఖపడుతున్నారని అర్థం కాదు సుమా మేము మంటల్లో కాలుతుంటే, మీరు పెనం మీద వేగుతున్నారు మొత్తం మీద అందరి బ్రతుకులు మసి బొగ్గుల్లా మాడిపోతున్నాయి ఆ స్థితిలో ఆఫ్ కోసం స్ట్రయికు చెయ్యాలనుకున్నాం ఒక యూనియన్‌గా ఏర్పడి ప్రభుత్వానికి అర్జీ పెట్టుకున్నాం కాని ఏమీ రిప్లై లేదు మొదట మేము మామూలుగానే డ్యూటీలు చేస్తూ జీతాలు తీసుకోలేదు నల్ల బ్యాడ్జీలు తగిలించుకొని డ్యూటీలు చేశాము బ్యానర్లు తీసుకొని మౌనంగా వూరేగింపులు చేశాము అంతా శాంతియుతంగానే సుమా ప్రభుత్వం తల్లకిందులయిపోయింది వున్నవాళ్ళల్లో సగం మందిమి కూడా చేసివుండము కాని ప్రభుత్వానికి వెన్నెముక ముక్కలుముక్కలుగా విరిగిపోయింది అంతేకదా మరి మనవుంటేనేగా ఏ ప్రభుత్వమయినా గాని అది దానికి చేతనయిన దుర్మార్గపు చేష్టలన్నీ చేసింది 'ఈ క్రూర ప్రభుత్వాలకి శ్రమ చేసే మనుషుల మీద కనీసపు సానుభూతి కూడా వుండదు' అనటానికి మా స్ట్రయికే మంచి ఉదాహరణ చాలా మందిని, ముఖ్యులనుకున్న మా నాయకులని దూర ప్రాంతాలకు ట్రాన్స్‌ఫర్లు చేశారు కొంతమందిని అరెస్టు చేశారు అయినా మేము ఏ మాత్రం పట్టు సడలనీయలేదు మాలో కొందరికి ప్రమోషన్ల ఆశ చూపించారు మా ఉద్యమాన్ని బలహీనపరచటానికి ప్రయత్నించింది ప్రభుత్వం కానీ చేతకాలేదు ఉద్యమంలో పాల్గొన్నవాళ్ళు మొత్తం డిపార్టుమెంటులో సగంమంది కన్నా తక్కువే అయినా, ప్రభుత్వం గజగజ వణికింది ఎన్ని ఇబ్బందులు కలిగించినా మేము దారికి రాకపోయే సరికి చివరి అస్త్రంగా మమ్మల్ని, అంటే గవర్నమెంటు క్వార్టర్సు)లో వుండే వాళ్ళనందరినీ బలవంతంగా ఇళ్ళల్లో నుండి వెళ్ళగొట్టించింది మా సామానులు బజారులో పారవేశారు నిముషాల్లో వందలాది కుటుంబాలు నిరాశ్రయు లయ్యాయి ఎన్నిటినో తట్టుకుని నిలబడిన మేము ఆ పరిస్థితిని తట్టుకోలేకపోయాము అన్ని వందల మందిమి కుటుంబాలతో సహా ఎక్కడ తల దాచుకోవాలి ? పిల్లా పీచుతో ఎక్కడికెళ్ళాలి ప్రజల్లో పోలీసులంటే ఏ మాత్రం సానుభూతి లేదు ఎవ్వరూ సహాయం చెయ్యటానికి ముందుకు రాలేదు అయిపోయింది ఆ దెబ్బను తట్టుకుని నిలబడలేకపోయాము అన్నిటినీ వూహించగలిగిన మేము ఈ పరిణామాన్ని వూహించలేకపోయాము మాతో గొడ్డు చాకిరీ చేయించుకొనే ఈ ప్రభుత్వం కనీసం సానుభూతితో మా సమస్యను పరిష్కరించకపోగా, దారుణంగా, దుర్మార్గంగా,

రాక్షసంగా ప్రవర్తించింది కర్కశంగా కక్ష కట్టి మమ్మల్నీ, మా కుటుంబాల్నీ పేరు పేరునా నాశనం చేస్తుందనుకోలేదు మిగతా డిపార్టుమెంటులు నెలల తరబడి స్ట్రయికులు చేసినా వాళ్ళకు అన్ని నెలలకు కూడ జీతాలు ఇస్తూ, వాళ్ళ కోర్కెలు తీరుస్తూవచ్చిన ఈ విశ్వాసం లేని ప్రభుత్వం విశ్వాసపరులమైన మమ్మల్నీ, మా జీవితాల్నీ, మా బిడ్డల భవిష్యత్తుల్నీ కిరాతకంగా ఛిన్నాభిన్నం చేసింది ఎంతో మందిని ఉద్యోగాల్లోంచి తీసేసింది కొంతమంది మీద దేశద్రోహం క్రింద కేసులు పెట్టింది చాలామందిని ప్రమోషన్‌ల నుంచి రివర్ట్ చేసింది మా సానుభూతిపరులనుకున్న వాళ్ళకి ఇంక్రిమెంట్స్ కట్ చేసింది ఇవన్నీ మేము వూహించినవే కాని స్ట్రయికులో పాల్గొన్నవాళ్ళు ఎవరున్నా పోలీసు క్వార్టర్సులో వుంటే వాళ్ళని చట్టవిరుద్ధంగా, నీతి బాహ్యంగా గూండాల చేతా, మిలటరీ చేతా, ప్రభుత్వం చంక నాకే విధేయులయిన మిగతా పోలీసులతో, ఆ క్వార్టర్స్‌లో నుండి గెంటివేయించింది అదే ఏ రూరల్ ఏరియాలోనో అయితే మేము దాన్ని కూడా లెఖ్ఖచెయ్యం ఆ మద్రాసు మహా నగరంలో మా గతేంటి ? కుక్కలకన్నా విశ్వాసంగా మూడొందల అరవై అయిదురోజులూ కష్టపడే మాకు ఈ ప్రభుత్వపు నిజ స్వరూపం అప్పుడు అర్థమయ్యింది ఇంత జరిగినా 'వీక్లీ ఆఫ్' ఇవ్వక తప్పలేదు పోలీసులకు వారానికొకరోజు పూర్తి సెలవు ఇస్తున్నట్టు ప్రకటించింది మా స్ట్రయికుని కొంతమంది అధికార్లు సమర్థించారు కొందరు డైరక్టుగా, కొంతమంది ఇన్‌డైరక్టుగా వాళ్ళమీద కూడా ఈ ప్రభుత్వం కక్ష సాధింపు చర్యలు మొదలు పెట్టింది మన న్యాయమైన కోర్కెలను ప్రభుత్వం తీర్చాలనే మంచి అధికారులూ వున్నారు వాళ్ళూ చాలా ఇబ్బందులు పడ్డారు, మాకు సానుభూతి చూపి, సహాయం చేసినందుకు ''

''మేమంతా కష్టపడి, చివరకు మా ఉద్యోగాల్ని కూడా పోగొట్టుకొని, వీక్లీ ఆఫ్ సాధించిన మా మీద ఇప్పుడు తోటి వాళ్ళెవరూ సానుభూతి చూపటం లేదు మమ్మల్ని ఇలా తీసివెయ్యటం అన్యాయమని గానీ, మమ్మల్ని తిరిగి ఉద్యోగాలకు తీసుకొనమని గానీ ఎవరూ ప్రభుత్వాన్ని డిమాండ్ చేయలేదు కనీసం మనిషి కొకటి చొప్పున కూడా తమ నిరసనను తెలియచేస్తూ ప్రభుత్వానికి కార్డుముక్క రాసినవాళ్ళు లేరు పోనీ మేము సాధించి పెట్టిన ఆ 'వీక్లీ ఆఫ్' ని అనుభవించే పాటి ధైర్యం కూడా లేదు చాలా మందికి అడక్కపోతే ఆ వీక్లీ ఆఫ్ ఇచ్చే యస్పైగానీ, సిఐ గానీ లేడు మా కదే ఎంతో బాధగా వుంది మేము ఐ జీ పీ దొరని కలిశాం కాని లాభం లేదు ఉండదని మాకు తెలుసు ఇదిగో ఇలా తిరుగుతున్నాం ఇంతకు మించి ఇంక మాకేం బ్రతుకు తెరువుంది ఈ వయస్సులో ? మా కుటుంబాలు సర్వనాశనమయ్యి పోయాయి అన్ని విధాలా చితికి పోయాం మా కోపమంతా స్ట్రయికు చెయ్యని వాళ్ళమీదే మూడొవంతు మందిని ఉద్యోగాల్లోంచి తీసివేశారు ఆ ఖాళీలు ఏమీ భర్తీ చెయ్యలేదు అంతకుముందే ఒకొక్కళ్ళూ ముగ్గురు మనుషుల పని చేసేవాళ్ళం రోజూ ఇప్పుడింకా పనిభారం పెరిగింది అయినా నోరు మూసుకుని గొడ్లలాగా చేస్తున్నారు మాకు జరిగిన అన్యాయానికి కోర్టు కెళ్ళటానికి ఇట్లా చందాలు పోగుచేస్తున్నాం '' చెప్పటం ఆపాడు అతను

ప్రకాశం ఆశ్చర్యంగా విన్నాడు జాగ్రత్తగా అంతా అతనికెందుకో భయం వేసింది కొద్దిసేపు ఏమి మాట్లాడలేదు బుఱ్ఱ ఒక క్రమంలో పని చెయ్యలేదు ఏదో ప్రశ్న అడగాలనుకున్నాడు కాని ఏమి అడగాలో కొద్దిసేపు గుర్తురాలేదు చివరకు అన్నాడు ఆశగా ''అయితే ఆఫ్ ఇవ్వమని ఆర్డర్లు వచ్చాయా ?''

''ఆ జీ వో పాస్ అవ్వటం ఎప్పుడో జరిగింది కాని అమలు జరగటం లేదు నువ్వడిగిన

ప్రశ్నబట్టి చూస్తే కనీసం ఆ విషయం కూడా నీకు తెలియదని తెలుస్తోంది మేమంత దారుణంగా పోరాడుతుంటే చాలామందికి తెలియదు, చుట్టుపక్కల జిల్లాల వాళ్ళకు కూడా ఇంత ముఖ్యమయిన వార్తని పేపర్లలో కనీసంగా కూడా వెయ్యలేదు ఎందుకో మరి పేపర్లవాళ్ళు?! వాళ్ళు కూడా అలా మాకు ద్రోహం చేశారు పైకి మాత్రం ప్రజాస్వామ్యాన్ని నిలబెట్టే సాధనాలని ఫోజు మనం మనకున్న హక్కుల్ని అమలు జరిపించుకోవాలన్నా ఎక్కడికక్కడ పోరాటం చేయాల్సిందే ఈ ఖోజ్జా లంజా కొడుకులికి ఆ సంగతే తెలియదు కేవలం, గవర్నమెంటు మీద పోరాటమే కాదు మన కన్యాయం జరిగే ప్రతిచోటా ప్రతి ఆఫీసరు మీదా మన హక్కులకోసం పోరాటం చెయ్యాల్సిందే అలా చెయ్యాలంటే మనం ముందు ఒక సంఘంగా ఏర్పడాలి సంఘటితపడితేనే ఏదైనా సాధించగలం ఒంటరిగా ఎవరూ ఏమీ చెయ్యలేరు ఉమ్మడి సమస్యల్ని ఉమ్మడిగానే పరిష్కరించుకోవాలి వీళ్ళకెంత చెప్పినా వీటిని గురించి ఆలోచించరు పెంటెత్తేసే వాళ్ళకు కూడా సంఘాలున్నయ్ ఆ కనీసపు చైతన్యం కూడా వీళ్ళల్లో కనపడటంలా''

వాళ్లు చెప్పటం ఆపారు వాళ్ళ మాటల్లో వుద్రేకం, తోటివాళ్ళమీద అసహ్యం, తమ బ్రతుకులిలా మార్చినందుకు ప్రభుత్వం మీద చెప్పలేని కసి కనపడుతున్నయ్ వాళ్ళ మనోభావాల్ని చదవటానికి ప్రయత్నం చేస్తున్నాడు ప్రకాశం వాళ్ళు తిరిగి చెప్పటం మొదలు పెట్టారు

''మేమేం చేశామో, ఏం సాధించామో మిగతా మన కానిస్టేబుళ్ళకూ, హెచ్ సీలకు తెలుసు ఇంత జరిగినా వాళ్ళు మా ఉద్యోగాల కోసం తమ నిరసన తెలియచేయలేదు ప్రభుత్వానికి దాన్ని బట్టి ఈ జంతువులు ఎంత చైతన్యం లేకుండా జీవిస్తున్నాయో అర్థమవుతోంది ఒకడు బలయితే వాడి త్యాగఫలాన్ని ఇంకొకడు అనుభవించే పరిస్థితే ఇక్కడ వుంది అందరూ కలసి కట్టుగా నిలబడే స్థితికి రావాలి అప్పుడు ఎవరినీ ప్రభుత్వం ఏమీ చేయలేదు కొంతమంది చేసి, కొంతమంది వూరుకోవటం వలన మమ్మల్ని దెబ్బ తీశారు అందరూ చేస్తే అందరినీ తీసెయ్యగలదా ? తీసేసి ఎలా పనిచెయ్యగల్గుతుంది ఈ ప్రభుత్వం? అందులో, వెన్నుపూస లాంటిది ఈ డిపార్టుమెంటు ఇది పనిచెయ్యటం మానేస్తే, అంతా తారుమారే కుప్పకూలి పోవాల్సిందే'' అన్నారు వాళ్ళు

తరువాత చాలా విషయాలు మాట్లాడుకున్నారు వాళ్ళకు భోజనం పెట్టి ఒక రూపాయి ఇచ్చి పంపాడు ప్రకాశం వాళ్ళు సంతోషంగా వెళ్ళారు

ఈ విషయాన్ని సర్కిల్ఇన్స్పెక్టరు ఆఫీసులో వాకబు చేశాడు వారానికి ఒకరోజు ఆఫ్ ఇవ్వమని కాగితాలు ఎప్పుడో వచ్చాయని చెప్పారు ''మరి ఆఫ్ ఇవ్వటం లేదుగా?'' అన్నాడు ప్రకాశం

ఆ మాటకు వాళ్ళు నవ్వారు ఆ నవ్వు అతన్ని ఎగతాళి చేస్తున్నట్లు వుంది స్టేషనుకు తిరిగివస్తూ అనుకున్నాడు 'వట్టి జీవోల వలన ఉపయోగం లేదు వాటిని అమలు జరిపించుకోవాలన్నా పోరాటం తప్పదు ఐకమత్యంతో ఇంతకాలం తను ఆఫ్ డ్యూటీగురించి ఆలోచించాడు అదివచ్చింది అంటే తనలాగా ఆలోచిస్తున్న వాళ్ళు ఎంతోమంది వున్నారు తను ఒంటరివాడు కాదు తనకన్నా ధైర్యంగా ఆలోచించి, పోరాటం చెయ్యగలుగుతున్నారు ఇప్పుడు ఆఫ్ వచ్చింది దాన్ని అనుభవించాలన్నా పోరాటం చెయ్యాల్సిందే తప్పదు' అనుకున్నాడు

దాన్ని గురించి తన తోటివాళ్ళకు చెప్పాడు విని వూరుకుంటున్నారు అదోరకంగా చూస్తున్నారు రకరకాల ప్రశ్నలు వేస్తున్నారు కాని 'అందరం కలిసి ఆఫ్ గురించి అడుగుదాం' అని ఎవరూ అనటం లేదు 'నేను ముందుండి అడుగుతా, మీరు నా వెనక నిలబడి వుండండి చాలు' అన్నా కూడా ఎవరూ కలిసి రావటం లేదు చేస్తున్న ఉద్యోగాన్నీ, చేపిస్తున్న ఆఫీసర్లనీ

తిట్టుకుంటూ, విసుక్కుంటూ తమలో తాము గొణుక్కోవటానికే పరిమితమయ్యారు వాళ్ళు

వాళ్ళనలా చూస్తుంటే ఎంతో కోపం, అసహ్యం వేస్తోంది ప్రకాశంకు 'ఎంత పిరికి వెధవలు' అనుకున్నాడు 'వీళ్ళకి చైతన్యం ఎప్పటికొచ్చిద్దో?!' అనుకున్నాడు

ఎక్కడో కొన్నిచోట్ల ఈ విషయం గురించే కానిస్టేబుళ్ళు అలజడి చేస్తున్నారనీ, కొన్ని స్టేషన్లలో వీక్లీ ఆఫ్‌లు ఇస్తున్నారని వార్తలు వస్తున్నాయి

వీక్లీ ఆఫ వచ్చిందన్న తరువాత ఆతృత ఎక్కువయ్యింది ప్రకాశంకు

ఉన్న ఆఫ్‌ను ఉపయోగించుకోలేని తమ అసమర్థత మీద అసహ్యం వేస్తోంది కనీసం వ్యక్తిగతంగానయినా తను దాన్ని సాధించి మిగతావాళ్ళకు కొంత ఆదర్శం కావాలనుకున్నాడు ఆ దిక్కుగా ఆలోచనలు సాగుతూనే వున్నాయ్ రోజురోజుకు ఆ ఆలోచనలు బలపడుతున్నయ్

అలాగే కాలచక్రం గిర్రున తిరిగిపోతోంది దేశంలో ఎన్నో మార్పులు చోటు చేసు కుంటున్నాయి పరిపాలించే ప్రభుత్వాలు మారిపోతున్నాయి పాతరూపాయలు పోయి కొత్తనాణేలూ, నోట్లూ చలామణిలోకి వస్తున్నాయి జరుగుతున్న సంఘటనలను గుడ్లప్పగించి చూడటం తప్ప వాటిని మార్చగల తెలివిగానీ, సత్తాగానీ లేవు ముఖ్యంగా కానిస్టేబుళ్ళకి అధికార్ల ఉత్తర్వులను - అవి మంచివయినా చెడ్డవయినా, స్వంత ఆలోచనలతో సంబంధం లేకుండా అమలుపరచటమే స్విచ్ వేస్తే తిరిగే యంత్రంలాగా, మర మనుషుల్లాగా మారిపోయి బ్రతుకులు ఈడుస్తున్నారు డిపార్టుమెంటులోని కిందిస్థాయి ఉద్యోగులు

కానీ ఇలా బానిసబ్రతుకులు బ్రతకటం ఎవ్వరికీ ఇష్టంలేదు అయితే సమస్యలను ఎలా పరిష్కరించుకోవాలో తెలియటం లేదు ఎవ్వరికీ కూడా 'అందరూ కలిసి అంటే కానిస్టేబుళ్ళూ, హెడ్ కానిస్టేబుళ్ళు వరకు ఒక యూనియన్‌గా ఏర్పడి, సంక్షేమ సంఘం ఒకటి పెట్టుకొని దానికి ఎవరిన్నా చదువుకున్న వ్యక్తినీ, బాగా ధైర్యమున్న వ్యక్తినీ ప్రెసిడెంటుని చేసి, ఆ సంఘం ద్వారా, చట్టబద్ధంగా తమ సమస్యలకు పరిష్కారం చూసుకోవాల'ని అనుకుంటున్నాడు ప్రకాశం

అలాగే రోజులు దొర్లిస్తున్నాడు పిల్లలు పెద్దవాళ్ళు అవుతున్నారు కొడుకు సూర్యం పెద్దగా ఆరోగ్యవంతుడు కాడు కాని చదువు విషయంలో బాగా చదువుతున్నాడు

రెండు సంవత్సరాలకి మించి ఏ స్టేషన్లోనూ వుండలేకపోతున్నాడు ప్రకాశం 'ఇక ఇది ఇంతే ఈ గాడి మారదు ' అనుకున్నాడు ఎన్నో వందలసార్లు శరీరంలో సత్తువ తగ్గుతోంది కాని ఉద్రేకంలో మార్పు లేదు పెద్దగా

ఆ స్టేషన్లో అతని సర్వీసులో మొట్టమొదటి సారిగా ఈరోజు 'వీక్లీ ఆఫ్' తీసుకున్నాడు ప్రకాశం అతని వుద్యోగ జీవితంలో అది అతని వ్యక్తిగత విజయం తోటి పీసీలూ, హెచ్‌సీలూ కొందరు అతన్ని అభినందించారు ఆ విషయం ఆ నోటా ఆనోటా పడి ఆ సర్కిల్‌లో వున్న అన్ని స్టేషన్ల వాళ్ళకీ తెలిసింది వాళ్ళు కూడా వీక్లీ ఆఫ్ కొరకు యస్సైలనూ, సి ఐ లనూ అడుగుతున్నారు అప్పటినుండి అడగ్గా, అడగ్గా ఆఫ్‌లు అడపా దడపా ఇస్తున్నారు అధికార్లు

ప్రతి స్టేషన్లోనూ ఒకళ్ళిద్దరు ప్రకాశంకు మంచి దోస్తులున్నట్లే, ప్రస్తుతమున్నచోట సత్యం మంచి స్నేహితుడు ఇద్దరికీ వయస్సులో ఎంతో తేడా వున్నప్పటికీ ఇద్దరి భావాలు ఒకటే ఓ రోజు మాటల మధ్యలో సత్యంతో అన్నాడు ప్రకాశం ''ఒరే అబ్బాయ్ త్వరలోనే నాకు ఈ ఠాణా నుండి ఉద్వాసన చెపుతారు''

సత్యం నవ్వాడు ''మొన్న వచ్చేటప్పుడు తెచ్చిన సామానంతా విప్పావా ? ఎలాగూ జెండా

పీకాలి కాబట్టి కొన్ని విప్పకుండా వుంచావా?'' అన్నాడు

ఆ మాటకు ఇద్దరూ నవ్వుకున్నారు మాటల మధ్యలో, ''ఏంటీ కాస్త డల్‌గా వున్నారు'' అన్నాడు సత్యం

''ఏంలేదు జేబు ఖర్చులకి డబ్బులునిండుకున్నాయి జేబులు బరువుగా వుంటే హుషారు లేకుంటే బేజారు మన స్థితి అంతేగా'' అని నవ్వాడు ప్రకాశం

''నిన్న కోడి పందాల వాళ్ళయ్యి వచ్చినియ్యిగా రైటరు ఇవ్వలేదా మీకు '' అన్నాడు సత్యం

''ఇవ్వటం, అయిపోవటం, అంతా అయ్యింది బ్రాకెట్వోళ్ళ కోసం ఎదురుచూపులు'' అన్నాడు నవ్వుతూ ప్రకాశం

''వాటికింకా టైముందిగా సరే ఏమన్నా కావాలంటే పదీ పరకా '' జేబులో చెయ్యి పెట్టబోయాడు సత్యం

''అబ్బెబ్బే వద్దువద్దు అంత గొంతు మీదకొస్తే అడగనూ చిల్లర వుందిలే పదోపదిహేనో మినిమం ఈ రోజుల్ని బట్టి ఓ యాభై వుంటే గాని గుండె నిబ్బరంగా వుండదు అంతకు తగ్గితే నిస్సత్తువుగా వుంటది'' అని నవ్వాడు ప్రకాశం

''డబ్బే ఆక్సిజన్ అదిలేకపోతే అంతే అదే సోషలిస్టు వ్యవస్థలో అయితే వున్నోడూ, లేనోడూ అంటూ ఉండరు అందరికీ ఆక్సిజన్ సజావుగా సరఫరా అవుతూ వుంటుంది అట్లా సమానంగా పంపిణీ చేసే యంత్రాంగం వుంటుంది'' అన్నాడు సత్యం

''అదెప్పటికో అసలు చూస్తామో లేదో '' అన్నాడు ప్రకాశం

''వస్తుంది అయితే ఆలస్యమయిద్ది '' అని చేతిగడియారం చూసుకుని ''వస్తా నీ మనవరాల్ని కాన్వెంటుకు తీసుకెళ్ళాలి టైం అవుతోంది సాయంత్రం కలుస్తా వీలయితే ఏదన్నా మంచి పాతసినిమాకు వెళదాం రాజేశ్వరిలో ఏదో పాతబొమ్మ వచ్చినట్టుంది'' అన్నాడు లేస్తూ సత్యం

''మాయాబజారు అనుకుంటా సరేపోయిరా'' అన్నాడు ప్రకాశం కూడా సైకిలు స్టాండు తీస్తూ

అప్పటికి ఉదయం తొమ్మిది గంటలయింది కూతుర్ని తీసుకుని కాన్వెంటులో వదిలిపెట్టి రావటానికి హడావిడిగా బయలుదేరాడు సత్యం సైకిలు మీద కూర్చోపెట్టుకొని తీసుకెళ్ళాడు ఆ రోజు శనివారం పిల్లలంతా ఎప్పుడూ వేసుకొని వచ్చే యూనిఫారం బదులు మామూలు బట్టలు వేసుకొని వస్తున్నారు కాన్వెంటు కాంపౌండు లోపల అంతా గోలగోలగా వుంది పెద్దవాళ్ళు పిల్లల్ని తీసుకొచ్చి వదిలిపెట్టిపోతున్నారు కొంతమంది చిన్న పిల్లలు లోపలకు వెళ్ళకుండా మారాం చేస్తున్నారు పెద్దవాళ్ళు వాళ్ళని బుజ్జగిస్తున్నారు సత్యం కూతుర్ని లోపల వదిలిపెట్టి బయటకు వచ్చాడు అంతా పసిబిడ్డలు కాబట్టి బైటకెళ్ళిందాకా నడవటం మంచిదని సైకిల్ని నడిపించు కొనివస్తున్నాడు పిల్లలు తొడుక్కున్న రకరకాల గౌనులు చూస్తున్నాడు తన కూతురికి కూడ ఒక మంచి ఖరీదయిన గౌను కొనాలనే కోరిక ఎప్పటినుండోవుంది కాని అది తీరటం లేదు తనబోటివాడు ఇంగ్లీషు కాన్వెంటులో పిల్లని చేర్పించటమే కష్టమయిన పని ఇంక ఇంత ఖరీదయిన రెడీమెడ్ బట్టలు కొనటం అయ్యేపనేనా ? ఇప్పటికే కూతురికి యూనిఫారం, బూట్లు అప్పుచేసి కొన్నాడు తనకొచ్చే జీతంలో, జాగ్రత్తగా పొదుపుగా వాడి, మిగిల్చిన డబ్బుల్తో ఫీజులూ అవీ కట్టాడు

కాన్వెంటు చదువులు తనబోటివాళ్ళ తాహతుకు మించినవన్న విషయం అతనికి తెలుసు కాని ఈరోజుల్లో మామూలు మునిసిపాలిటీ బడుల్లో చదువు ఎట్లా వుంటున్నదో చూస్తున్నాడు కూతుర్ని స్కూలులో చేర్పించేటప్పుడు ఎన్నో విషయాలు ఆలోచించాడు కనీసం టెన్త్ క్లాస్ వరకయినా ఇంగ్లీషు మీడియం స్కూలులో చదివించగలనా ? తనకిక్కడ నుండి ఏదన్నా పల్లెటూరికి ట్రాన్స్‌ఫర్ అయితే తిరిగి అక్కడ తెలుగు స్కూలులో చేర్పిస్తే చదువేంకాను ? పోనీ ఎవరో ఒక మాష్టారు బాగా తెలుగు ప్రయివేట్లు చెపుతాడని విని చేర్పించాలనుకున్నాడు కాని ఆయనుండేది వూరికి ఆ చివర, తనుండేది ఈ చివర రోజూ అంతదూరం తీసుకెళ్ళటం సాధ్యమయ్యే పనికాదు పోనీ ఆ మాష్టారుండే పేటలోనే ఇల్లేమన్నా దొరికిద్దేమోనని చూస్తే భరించలేని అద్దెలు, పైగా క్యాస్ట్ ఫీలింగు ఇక లాభం లేదనుకుని, ఎలా జరిగేది అలా జరిగిద్దనే ఒక మొండి నిర్ణయానికొచ్చి ఇంకేమీ ఆలోచించకుండా ఈ కాన్వెంటులో చేర్చాడు డ్యూటీ లేనప్పుడు తను, తను లేనప్పుడు తన భార్య, కూతుర్ని స్కూలుకు తీసుకుపోయి తీసుకొస్తున్నారు ప్రతిపూటా ఒక మనిషి పని గట్టుకొని తీసుకుపోయి తీసుకురావాలి ఒంటరిగా పంపటానికి వీలులేదు చిన్నపిల్ల రిక్షాలు, కార్లు, సైకిళ్ళు రిక్షా మాట్లాడదామనుకున్నాడు మొదట కానీ కాన్వెంటు ఫీజుకీ, యూనిఫారానికే అప్పు చేయాల్సొచ్చింది

ఆలోచనలలో మునిగి నడుస్తున్న అతని ఆలోచనలకు భంగం కలిగిస్తూ బడిగంట గణగణ మోగింది ఆడుకుంటున్న పిల్లలంతా క్లాసు రూముల్లోకి పరిగెత్తుతున్నారు కార్లల్లో, స్కూటర్ల మీదా తమ పిల్లల్ని తీసుకొచ్చి దింపి పోతున్నారు కొంతమంది ఆలోచనల్నుంచి బయటపడి రోడ్డుమీదకొచ్చాడు సత్యం కాన్వెంటు గేటుకి రెండువైపులా, రోడ్డు పక్క జామకాయలు, మొక్కజొన్న కండెలు, ఇంకా రకరకాల రంగుల బొమ్మల స్టిక్కర్లు అమ్మేవాళ్ళు కూర్చుని వున్నారు పిల్లల్ని తీసుకొచ్చి వదిలి పెట్టిన రిక్షాలు రోడ్డుమీద ఒకపక్కగా బారుగా నిలబెట్టి వున్నయ్ సైకిలెక్కబోతూ తలెత్తి చూశాడు సత్యం దృష్టి ఇటే వస్తున్న కారుమీద పడింది ఆ కారు వస్తున్న తీరు చూస్తే ఎవరో కొత్త వ్యక్తి దాన్ని డ్రైవ్ చేస్తున్నట్టు వూహించాడు అతననుకుంటున్నట్టుగానే దాన్ని డ్రైవ్ చేస్తున్న వ్యక్తి ప్రక్కన మరో వ్యక్తి కూర్చుని డ్రైవ్ చేస్తున్న అతనికి ఏవో సలహాలు ఇస్తున్నాడు

'వీళ్ళ వాలకం చూస్తుంటే ఎవర్నో తినేసే లాగున్నారు' అనుకున్నాడు సత్యం ఆ కారు అతన్ని దాటి పోయింది పాతకాలపు చెవర్లెట్ కారు చిన్నసైజు విమాణమంత వుంది అతన్ని దాటిన నాలుగో క్షణంలో పెద్దగా శబ్దమైతే వెనక్కి తిరిగి చూశాడు కారు జామకాయల బుట్టమీదుగా పోయి కాన్వెంటు కాంపౌండు గోడకు గుద్దుకొని ఆగిపోయింది సత్యం సైకిలు వెనక్కు తిప్పాడు జామకాయలమ్మే మనిషి వెనక్కు పడిపోయింది అక్కడున్న వాళ్ళంతా గుమికూడారు వెల్లకిలా పడ్డ మనిషి లేచింది బాధగా మూలుగుతూ సత్యం కూడా గబగబా అక్కడికి నడిచాడు సైకిలు దిగి జామకాయలన్నీ పిసరు పిసరయ్యిపోయాయి ఆమె మోచేతులు దోక్కుపోయాయి అక్కడున్న వాళ్ళంతా ఆమెనీ, కారులోని వాళ్ళనీ చూస్తున్నారు ప్రేక్షకుల్లాగా ఇదేమీ పట్టనట్టు కారుని స్టార్టు చేస్తున్నాడు స్టీరింగు ముందు కూర్చున్న యువకుడు నిర్లక్ష్యంగా ఆ దృశ్యం చూసే సరికి సత్యానికి కోపంతో వళ్ళు వశం తప్పింది

''ఎక్కడ నువ్వు డ్రైవింగు నేర్చుకొనేది, వూళ్ళోనా?'' అన్నాడు కోపంగా

స్టార్ట్ చెయ్యటం ఆపి సత్యం వైపు చూశాడు అతను అతని ప్రక్కనే కూర్చున్న అతను డ్రైవరు

కాబోలు, మాసిన గడ్డంతో, నడివయస్సు మనిషి , తల కొద్దిగా వంచి సత్యం వైపు చూశాడు ''పోనీయండి సార్, ఏదో పొరపాటు అయిపోయింది'' అన్నాడు వినమ్రతగా

సత్యం కళ్ళల్లోని ఎర్రదనానికి, ముఖంలోని కోపానికి ఆ డ్రైవ్ చేస్తున్న కుర్రోడికి గొంతు తడి ఆరిపోయింది ఏం మాట్లాడాలో తోచలేదు కానీ అదే నిర్లక్ష్యపు చూపుతో చూశాడు మళ్ళీ

''ఎవడి ప్రాణాలు తియ్యాలని దాపురించావు'' అన్నాడు సత్యం మళ్ళీ అదే కోపంతో అతని పిడికిళ్ళు బిగుసుకుంటున్నాయి ఎంత ప్రయత్నించినా ఉద్రేకం అణుచుకోలేక పోయాడు

''రోడ్డు మీదనా కూర్చునేది?'' అన్నాడు ఆ యువకుడు గొంతు పెగల్చుకుని

''ఇంకా మట్లాడేవంటే తంతా '' జనాన్ని తోసుకుని డోరుదగ్గరుకు వెళ్ళాడు సత్యం

''ఇంక నోరు మూసుకుని పోవయ్యా! పైగా మాట్లాడుతున్నావు పోనీయండి కానిస్టేబులుగారూ '' అని ఎవరో సత్యాన్ని భుజం పట్టుకుని ఇవతలకు లాగారు

''నా కొడుకులు కష్టం దుఃఖం తెలియకుండా పెరిగి, తాతలు తండ్రులు లోకుల నోళ్ళు కొట్టి సంపాదించినదాంతో కార్లు కొని జనం మీదకు తోలతారు'' కసిగా తిట్టాడు సత్యం అతని ఉద్రేకం చూసి అక్కడున్నవాళ్ళు ఆశ్చర్యపోయారు

''పోనీయండి, వాళ్ళ పాపాన వాళ్ళే పోతారు '' అన్నాడు ఒకతను సత్యాన్ని ఇవతలకు తీసుకువస్తూ

అదే ఉద్రేకంతో ఇంటికొచ్చాడు సత్యం అతన్ని చూస్తూనే అతని భార్య అడిగింది, ''ఏమిటట్లా వున్నారు?'' అని

''ఏమీ లేదు ''అన్నాడు ప్రశాంతంగా ఉండటానికి ప్రయత్నిస్తూ

''ఏమయ్యిందండీ?''

''ఏముంటుంది సుజాతా వున్నవాళ్ళ ఆగడాలు అక్కడ పాప స్కూలు దగ్గర ఒకడు కారు ఏసుకొచ్చి జామకాయలు అమ్ముకునే ముసలమ్మ మీదకు పోనిచ్చాడు వాడు కారు నేర్చు కుంటున్నాడు అక్కడెంత మంది పిల్లలుంటారు ? అంతకుముందే బడి గంట కొట్టారు కాబట్టి సరిపోయింది లేకపోతే అక్కడెంతమంది పిల్లలు తినే వస్తువులు కొనుక్కుంటూ వుంటారు వాళ్ళల్లో ఎంతమంది చనిపోయేవాళ్ళు ?''

''ముసలమ్మ చచ్చిపోయిందా ?'' ఆతృతగా అడిగింది భార్య

''లేదు వెంట్రుకవాసిలో చావు తప్పింది జామకాయలన్నీ చితికి పోయినియ్యి''

''పోనీలే పాపం మీరు అతన్నేమన్నా అన్నారా ?''

''అంటమేంది ఇంకాసేపుంటే నా కొడుకుని తన్నేవాణ్ణి'' అన్నాడు

''అక్కడెవరూ లేరా ఇంకా ?''

''ఎందుకు లేరు చాలా మంది ఉన్నారు ఒక్కళ్ళన్నా నోరు మెదిపితేగా ఎంత అన్యాయం కళ్ళముందు జరుగుతూ వున్నా, ఒక్కళ్ళన్నా మాట్లాడరాయె అసలెంత స్పందన లేకుండా వుంటారో నా కిప్పుడు కోపం వాళ్ళమీదే'' అన్నాడు

''ఆ, మీకందరిమీదా కోపమేలే ఇదేమయిద్దో ఏమో '' అంది ఆమె ఆందోళనగా

''ఏందయ్యేది నోరు మూసుకుని అన్నం పెట్టు'' అని అతను కాళ్ళు కడుక్కోవటానికి లోపలికి వెళ్ళాడు

''వూ, ఎప్పుడూ ఏదో ఒకటి కొనుక్కు రావాల్సిందే'' అంది ఆమె

అన్నం తింటూ అన్నాడు, ''అది కాదు సుజాతా అదే అక్కడ చిన్నపిల్లలు వుంటారు ఎంతమంది ప్రాణాలు పోయి వుండేవి డ్రైవింగ్ నేర్చుకోవాలంటే ఎక్కడో వూరి బయట జనసంచారం లేనిచోట నేర్చుకోవాలి కాని ''

''పోతే వాడే పోతాడు జైలుకి'' అంది ఆమె చటుక్కున అతని మాట పూర్తికాకముందే

ఆమెవైపు చీదరింపుగా చూశాడు సత్యం ''అర్థం లేకుండా మాట్లాడతావేం వాడికేం కాదు మహా వేస్తే ఆరునెలలు జైలుశిక్ష పోయిన పసిప్రాణాలు తిరిగొస్తాయా ? అదే మన పాపకు జరిగ ' వనుకో ఎంత విలవిలలాడిపోతాం చెప్పు కేవలమొక ధనికుడి విలాసానికి అంతమంది అమాయకులు బలి అవుతుంటే చూస్తూ వూరుకోవటం మానవత్వమా?'' వుద్రేకంగా అన్నాడు

''ఏం చేస్తారు చూస్తూ వూరుకోక అంటే మీ బోటి వాళ్ళకు మనస్సు ఉండబట్టదనుకోండి కాని వాళ్ళు ధనవంతులు ఏమైనా చేస్తారు''

''అవును వాళ్ళు చేసినా మనం ఆశ్చర్యపడ వలసినదేమీలేదు ఇదే సోషలిస్టు వ్యవస్థలో అయితే అలాంటి సమస్యలే వుండవు ఒకడు బలిసినోడు, ఒకడు బలహీనుడు అనే సమస్యే లేదు ఆ వ్యవస్థ ఎప్పుడొస్తుందో'' అన్నాడు

''సరేలే ఇలా మీలాగా ఒంటరిగా ఎవ్వరేం చేసినా రాదు అందరూ కలవాలి ఎన్ని సంవత్సరాలకో అది అసలొస్తుందో రాదో'' అంది సుజాత

ఆమె మాటలకు చిన్నగా నవ్వొచ్చింది ''ఫరవాలేదు, నువ్వు కూడా బాగానే ఆలోచిస్తున్నావు'' అన్నాడు కొంచెం కోపం తగ్గింది

ఆమె కూడా నవ్వింది భోజనం చేసి వెళ్ళి మంచం మీద కూర్చుని జరిగిన సంఘటన గురించి ఆలోచిస్తున్నాడు ఎంగిలి పళ్ళెం తీసుకొని దొడ్లోకెళ్ళింది సుజాత బైట సైకిలు స్టాండు వేసిన చప్పుడయితే, తొంగి చూశాడు సత్యం

''సత్యన్నారాయణా! ఓయ్ వున్నావా?'' కేకవేశాడు కోటిలింగం బయట నుండి

''ఆ, ఆ, రా లోపలికి రా!'' అన్నాడు సత్యం ''ఆ, ఏం రావటం ఎందుకు వాడిని తన్నబోయావంట?'' అన్నాడు కోటిలింగం

''ఎవర్ని?!''

''ఎవర్నా ఆ లోకుల్ని ముంచే నా కొడుకు గోపయ్యగాడ్ని, వాడి కొడుకుని వాళ్ళు కారేసుకుని పోతుంటే ఏదో అన్నావంట వాడొచ్చి నీమీద రిపోర్టిచ్చాడు, తిట్టి తన్నబోయావని ఎందుకొచ్చింది మనకిదంతా నీకు చెపితే అర్థంకాదు ఎంతసేపూ ఉడుకు నెత్తురు పనులే కాని వాడమ్మని వాడెట్లా మనకెందుకు'' అన్నాడు మంచం మీద కూర్చుంటూ

''అసలక్కడ జరిగింది '' చెప్పబోయాడు సత్యం

''అక్కడ జరిగింది నాకు తెలుసు కాని అవన్నీ ఎవడు పట్టించుకుంటాడు వాడు రిపోర్టు రాసివ్వగానే ఆనందంగా తీసుకున్నాడు యస్సై గాడు అప్పుడు నువ్వు యస్సైగాడ్ని ఆ బ్రాకెట్టు కంపెనీ వాళ్ళిచ్చిన డబ్బుల్ని గురించి నిలదీసి అడిగినప్పటినుండీ నీ మీద వాడికి గొంతు దాకా వుంది నీకూ తెలుసుగా ఎక్కడ దొరుకుతావా అని చూస్తున్నాడు ఇక ఇప్పుడు చంకలు ఎగరేస్తున్నాడు'' అన్నాడు

''వాడెమ్మ వాడు నన్నేం చేస్తాడులేగాని, అయితే ఇప్పుడేంది వచ్చావు?'' అన్నాడు సత్యం అతనికి కోపంలో తిట్లువస్తున్నాయి

''వచ్చేదేముంది యస్సై పిలుచుకు రమ్మన్నాడు''

ఇంతలో దొడ్లో నుంచి లోపలకొచ్చింది సుజాత

''అమ్మాయ్! నీ మొగుడు మారడమ్మా ఆ కమ్యూనిస్టుల పుస్తకాలు చదవ వద్దంటే వినకుండా ఆ పుస్తకాలు చదివి ఇలా తయారవుతున్నాడు'' అన్నాడు నవ్వుతూ కోటిలింగం ఆ మాటకు సుజాతా, సత్యం నవ్వారు కాని ఆమెకు ఆందోళనగా వుంది

''ఆ విషయం రిపోర్టుగా మారి యస్సైగాడి దగ్గర కొచ్చిందంట స్టేషనుకెళ్ళొస్తా'' అన్నాడు సత్యం భార్యతో

''మీరేం తొందరపడకండి తొందరగా రండి'' అంది సుజాత

''అమ్మాయ్ వీడిమూలంగా ప్రశాంతంగా వుండే రోజు నీకు ఒక్కటికూడా లేదనుకుంటా'' అన్నాడు కోటిలింగం ఆ మాటకు ఆమె చిన్నగా నవ్వింది తరువాత వాళ్ళిద్దరూ స్టేషనుకు వెళ్ళారు

స్టేషను బయట అదేకారు ఆగివుంది లోపల గోపయ్యా, అతని కొడుకూ ఇంకా ఎవరో యస్సై రూంలో కూర్చుని వున్నారు బయట డ్రైవరు కారు దగ్గర నిలబడి వున్నాడు సత్యం తనచేతిలో దొరికినట్లు చిరునవ్వుని ఒలకబోస్తూ, గోపయ్య కొడుకు చెప్పేమాటల్ని సరదాగా వింటూ సత్యంకోసం ఎదురుచూస్తున్నట్టు మాటిమాటికీ గేటువైపు చూస్తున్నాడు యస్సై అతని చేతిలో రిపోర్టు రాసిన కాగితం వుంది రైటరు రూంలో రైటరూ, డబ్బా రైటరు[20] (అసిస్టెంటు రైటరు) కూర్చుని వున్నారు బైట సెంట్రీ నిలబడి వున్నాడు సత్యం మీద అలాటి రిపోర్టు రావటం రైటరుకు ఆనందంగా వున్నది ప్రతి విషయాన్నీ రీజన్‌గా మాట్లాడే సత్యం అంటే తలనొప్పిగా వుండే రైటరుకు సహజంగానే ఆ సంఘటన ఆనందం కలిగిస్తోంది తన స్థానాన్ని పదిలపరచుకొనే పనిలో భాగంగా డబ్బారైటరు, సత్యాన్ని గూర్చి రైటరు అంటున్న మాట లన్నిటికీ తలూపు తున్నాడు గొర్రెలాగా సత్యం వెళ్ళి యస్సైకి సెల్యూట్‌చేశాడు యస్సై అతన్ని ఎగాదిగా చూశాడు కోరగా అక్కడున్న వాళ్ళంతా అతన్ని చూశారు నిబ్బరంగా నిలబడటానికి ప్రయత్నంచేశాడు సత్యం

''ఏం ఇతన్ని తిట్టి కొట్టబోయావంట ?'' అడిగాడు గోపయ్య కొడుకుని చూపిస్తూ యస్సై, పెద్ద అభియోగాన్ని మోపుతున్నట్టు ఫోజు పెడుతూ

ఆ యువకుడి వైపు తినేలాగా చూశాడు సత్యం ''నేనేం తిట్టలేదు సార్ అసలక్కడ ఏం జరిగిందో మీకు ''

''నీ కనవసరం నువ్వెవరు మాట్లాడటానికి? '' కోపంగా అన్నాడు యస్సై ఆ మాటలతో కోపం వచ్చింది సత్యానికి

''సార్ '' గట్టిగానే అన్నాడు సత్యం ''మీరంతగా కోప్పడాల్సిందేమీ లేదు ఇక్కడ అక్కడ ఏం జరిగిందో మీకు తెలియదు కనీసం, తెలుసుకోవాలనే ఉద్దేశ్యం కూడా లేదు వాళ్ళముందు నన్నో ముద్దాయిగా నిలబెట్టి మాట్లాడటమే మీకు కావలసింది వాళ్ళని చూస్తే మీకు భయం నేను భయపడాల్సిన పని లేదు ఇక్కడ నేను చెప్పేది వినేవాళ్ళు కానీ, నాకు న్యాయం జరిగిద్దని కాని నేననుకోవటంలేదు నా తరపున నిలబడటానికి కానిస్టేబుళ్ళకు సంఘం లేదు నేను ఏం మాట్లాడినా వినేవాళ్ళులేరు ఇక్కడ ఆ రిపోర్టుమీద మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి పోలీసు కానిస్టేబులుగా అన్యాయాన్ని గురించి అడిగే హక్కు నాకు లేదనే స్థాయికి నువ్వు దిగజారాక ఇక డిపార్టుమెంటుకి నువ్వు పనికిరావు'' అని గిరుక్కున వెనక్కు తిరిగాడు

వాళ్ళనుకున్నట్లుగానే నాలుగో రోజుకల్లా ట్రాన్స్‌ఫర్ ఆర్డర్ వచ్చింది సత్యానికి పనిష్మెంటు స్టేషను వేశారు అతనికదేమీ కొత్త కాదు కానీ కూతుర్ని చదివించుకోవటానికి కనీసం పంచాయితీ బడి కూడా లేని వూరు అది అందుకెంతో బాధపడ్డాడు అతనికి ట్రాన్స్‌ఫర్ వచ్చిన విషయం ఇంటి దగ్గరే తెలిసింది నాగయ్య చెప్పాడు మనస్సంతా ఆందోళనగా వుంది పిచ్చిపట్టినట్లయ్యింది ఎంత తమాయించుకోవాలని ప్రయత్నం చేసినా ఉద్రేకంతో పొట్టలోని కండరాలన్నీ కుచించుకు పోతున్నాయి సుజాత వంటగదిలో చాప వేసుకుని పడుకుని వుంది లేచి చొక్కా వేసుకుని బయటకెళ్ళాలనుకున్నాడు కాని అలాగే పడుకున్నాడు యస్పై మీద, ఆ భూస్వామి గోపయ్య మీద, వాడి కొడుకు మీదా, రైటరు మీదా, ఇలా తనంటే గిట్టని వాళ్ళమీద, తనపై సానుభూతి చూపని వాళ్ళమీదా కోపం వస్తోంది వాళ్ళంతా తనని చూచి పగలబడి నవ్వుతున్నట్లు కనపడ్డారు అతనిని ఎందుకూ పనికిరానివాడుగా, బ్రతకటం చేతకానివాడుగా ఎద్దేవా చేస్తున్నారు గట్టిగా కళ్ళు మూసుకున్నాడు

''సత్యం! సత్యం!'' బైట ఎవరో కేక వేశారు ఆలోచనల్లో మునిగివున్న అతనికి ఆ కేకలు వినపడలేదు మొదట

''ఏం చేస్తున్నావోయ్ ఎన్ని కేకలేసినా పలకవూ'' అంటూ లోపలికొచ్చాడు ప్రకాశం

''లోపలకు రా మావయ్యా!'' అంటూ లేచి కూర్చున్నాడు సత్యం

''డీ వో వచ్చింది తెలుసుగా'' అన్నాడు ప్రకాశం

''ఆ'' అని చిన్నగా తలూపాడు రెండు నిముషాలు మౌనంగా దొర్లిపోయాయి

సుజాత వచ్చి వాకిట్లో కూర్చుంది, 'బాగున్నారా బాబాయిగారూ' అంటూ

''సరే అయిందేదో అయిపోయింది, ఒక పనిచెయ్'' అన్నాడు ప్రకాశం

ఏమిటన్నట్లు చూశారు భార్యాభర్తలిద్దరూ

''పోయి యస్పీకి కనబడు రిక్వెస్టు చెప్పుకో అంతకు మించి నాకేం తోచటం లేదు నీకిప్పుడు వేసిన స్టేషను పనిష్మెంటు స్టేషనంటారుగాని, చాలా లైట్ స్టేషన్ పిల్లా జెల్లా లేని వాళ్ళకైతే బాగుంటుంది ఇంకా పిల్ల చదువు కోసమైనా నీవు యస్పీని చూడక తప్పదు ఏమంటావు?'' అన్నాడు ప్రకాశం

''ఆ, ఏం చదువులే అది చదివే ఫస్ట్‌క్లాస్ కోసం అయినా వాడు చెయ్యొద్దూ ఈ యస్పై నా కొడుకు పోయి ఏమేం చెప్పాడో నా మీద సిఐకీ, డియస్పీకి లేకపోతే కేవలం ఆ గోపిగాడి పట్టుదలమీదయితే ఈ స్టేషన్ పడదని నా వూహ'' అన్నాడు సత్యం

''అవును అవకాశం వచ్చింది కదాని ఒకటికి రెండు కల్పించి రిపోర్టు రాసి వుంటాడు యస్పై ఈడేం రాసినా గుడ్డిగా సబ్‌మిట్ చెయ్యటమేగా ఆ ఇనస్పెక్టరు ఎల్లాగూ గోపయ్యాగాడి పిటీషను వుంది కదా, కొట్టాడు దెబ్బ యస్పైగాడు'' అన్నాడు ప్రకాశం

''లేకపోతే అయ్యిందేదో అయ్యింది కోర్టుకెళ్ళి స్టే తెస్తే?! ఈడు యస్పైగాడు ఏమీ హానెస్ట్ కాడు ఎక్కడో ఒకచోట ఇరికిస్తే సరిపోయిద్ది దెబ్బకుదెబ్బ కాకపోతే అప్పోసొప్పో ఆరేడు వందలు ఖర్చవుతాయి'' అన్నాడు సత్యం

''వద్దు వద్దు నువ్వట్లాంటి పనిచెయ్యొద్దు నువ్వా పనిచేస్తే, మొదటిది యస్పీకి, రెండోది యస్పైకి, మూడు గోపయ్యాగాడికి వీళ్ళు ముగ్గురూ నిన్నొక కంట కనిపెడుతూ వుంటారు యస్పీగాడి మాట మీద డి యస్పీగాడూ, సి ఐ గాడు నువ్వంటే కంటుగా వుంటారు కనీసం

తోటివాళ్ళ సహకారం కూడా ఉండని డిపార్టుమెంటు ఇది మన డ్యూటీలు అంటావా, మానవ మాత్రుడన్నవాడు ఎవడూ పర్‌ఫెక్టుగా చెయ్యలేని డ్యూటీలు ఎక్కడో ఒకచోట వత్తేస్తారు కాబట్టి పోయి యస్పీగాడికి కనపడి చెప్పుకో తప్పేంలేదు వాడు కాదూ కూడదూ అంటే ఇంక అప్పుడే కోర్టు సంగతి ఆలోచించవచ్చు పైగా కోర్టుకు నువ్వనుకున్నంత తక్కువ ఖర్చు కాదు డబలయ్యిద్ది'' అన్నాడు ప్రకాశం

సత్యం ఆలోచిస్తూ వుండిపోయాడు

ఆ సాయంత్రం రోల్‌కాల్‌కు వెళ్ళాలంటే అవమానంతో తల కొట్టేసినంత బాధ కలిగింది తోటి ఉద్యోగస్తుల ముఖం చూడాలంటే ప్రాణం పోయింది లేని గంభీరాన్ని తెచ్చిపెట్టుకుని స్టేషనుకు వెళ్ళాడు తనకు జరిగిన సంఘటన వల్ల తనేమీ బాధపడటం లేదనీ, మామూలుగానే వున్నట్టు కనపడాలనీ విశ్వప్రయత్నం చేశాడు ప్రతివాళ్ళూ తన గురించే అనుకుంటున్నట్లూ, తన అసమర్ధతనీ, ఈ సొసైటీలో ఎలా బ్రతకాలో చేతకాని తన చాతకానితనాన్నీ చూచి నవ్వు తున్నట్టు ఫీలయ్యాడు స్టేషన్లో యస్పైలేడు రైటరు రోల్‌కాల్‌తీశాడు అంతా మౌనంగావున్నారు

''యస్పై గారు పాస్‌పోర్టు ఇవ్వమన్నారు'' అన్నాడు రైటరు నసుగుతున్నట్టు

కోపంతో పళ్ళు పటపట కొరికాడు సత్యం ఏం మాట్లాడాలో కూడా తెలియలేదు అతి బలవంతంగా నిభాయించుకున్నాడు అవమానం అతన్ని కృంగదీస్తోంది ''అందరికీ పాస్‌పోర్టులిచ్చి మీరే పరిపాలించండి'' అన్నాడు కోపంగా రైటరు కిమ్మనలేదు పాస్‌పోర్టు ఇచ్చి డూప్లికేటు మీద సంతకం చేయించుకొని పాస్‌పోర్టూ, సి యల్ ఆబ్‌స్ట్రాక్టూ, స్మాల్ సర్వీసు పుస్తకమూ ఇచ్చాడు అవి ముట్టినట్లు సంతకము పెట్టించుకున్నాడు

''అబ్బాయ్ నీ పెళ్ళాం పిల్లల ఉసురు తగలకుండా పోదులే నువ్వేం బాధపడమాక ఇదెందు కొచ్చిందో ఎక్కడ నీళ్ళు ఎంతవరకు ప్రాప్తమో అంతే'' అన్నాడు కోటిలింగం అతనిమాటల్లో బాధ కనిపించింది పాస్‌పోర్టు తీసుకుని అవమానంతో బయటకు వెళ్ళాడు సత్యం అతని ముఖం నల్లగా మాడిపోయింది అతనితో మాట్లాడటానికి ఎవరూ సాహసించలేకపోయారు కొంతమందిలో అతనిమీద సానుభూతివుంది అయినా ఎవ్వరూ అతన్ని ఓదార్చలేదు ఆ సందర్భంలో అతనితో ఎవరు మాట్లాడితే వాళ్ళమీద చాడీలు యస్పై దగ్గర కెళ్ళిపోతాయి ఇక వాడిష్టం రాచి రంపాన పెడతాడు అన్నన్ని అన్యాయాలు జరుగుతూవున్నా కనీసం మాటలతో కూడా ఎదుర్కోలేని అసమర్ధ బ్రతుకులు వాళ్ళవి ప్రస్తుతం సత్యంతో మాట్లాడటమంటే యస్పైకి యాంటీ గ్రూప్‌కింద లెఖ్ఖ వాళ్ళ నెంబర్లు యస్పై మనసులో నోటుచేయబడతాయి తరువాత అనుక్షణం వాళ్ళు వేదనకు గురిచేయబడతారు

ఇంటికెళ్ళి మంచంమీద వాలిపోయి భారంగా కళ్ళు మూసుకున్నాడు సత్యం వంటగదిలో తల్లి దగ్గర కూర్చుని కబుర్లు చెబుతున్న కూతురు వచ్చి తండ్రి పక్కలో కూర్చుంది ఒకసారి కళ్ళు తెరిచి చూచి మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు

''నాన్నా! మా టీచరే, నాకు సీ ఏ టీ కాట్, డీ వో జీ డాగ్ రాసిచ్చింది వుండు పలకతెత్తా'' అని మంచందిగి అలమారవైపు పరిగెత్తింది సంతోషంగా వస్తున్న దుఃఖాన్ని బలవంతంగా గుటక వేసి దిగమింగాడు సత్యం దగ్గరకొచ్చి నిలబడ్డ కూతుర్ని గట్టిగా గుండెలకు అదుముకున్నాడు కూతురి జీవితం గురించి ఆలోచిస్తుంటే ఏడుపొస్తోంది తను బతకాలనుకున్న విధానం తన కూతురి భవిష్యత్తును దెబ్బ తీస్తుందనే వాస్తవం అతన్ని కలవరపెట్టింది కళ్ళు మూసుకుని ఒక

పక్కకు ఒత్తిగిలి పడుకున్నాడు పాప వాళ్ళమ్మ దగ్గరకెళ్ళి తనురాసిన అక్షరాలు చూపిస్తోంది

'ఆత్మగౌరవంతో బ్రతకాలనుకునేవాళ్ళు, వాళ్ళ జీవితాల్నీ, వాళ్ళ పిల్లల జీవితాల్నీ బలియివ్వాలి ఈ వ్యవస్థలో' అనుకున్నాడు సత్యం

డ్యూటీకి రిపోర్టు చెయ్యటానికి వారంరోజులు టైముంది రెండు రోజులపాటు ఇంట్లోనుండి బయటకు రాలేకపోయాడు లైనులోని కొంత మంది ఆడవాళ్ళు వచ్చి సుజాతని పలకరించి, జరిగిన దానికి సానుభూతి చూపించారు సార్జిన్ భార్య, రైటరు భార్యా, డబ్బారైటరు భార్యా ఇంకా వాళ్ళ అనుకూలవర్గాల వాళ్ళు ఎవరూ సుజాత దగ్గరకు రాలేదు

ఆ రెండు రోజులూ చెవిలో ఇల్లు కట్టుకుని పోరింది సుజాత, యస్పీ దొర దగ్గరకెళ్ళి కనపడమని ప్రకాశం కూడా అదే మాట చెప్పాడు

'సరే వెళ్ళి ఒకసారి కనపడతా' అనుకున్నాడు సత్యం క్రాపు చేయించుకున్నాడు తను చెప్పదల్చుకున్న విషయం కాగితం మీద టైపు చేయించుకున్నాడు రేపు వెళ్ళటానికి రెడీ అయ్యాడు

ఆ సాయంత్రం పీసీ బ్రహ్మయ్య వచ్చాడు సత్యం దగ్గరకు ''దొరకి దయకలిగేలాగా మాట్లాడు వినయంగా నీ పని అయిపోయిద్ది'' అన్నాడు మాటల్లో చిన్నగానవ్వి వూరుకున్నాడు సత్యం

''అవునయ్యా! మీరు నవ్వుతారు కుర్రాళ్ళు మీకేం తెలియదు చెపితే అర్థం చేసుకోరు మన బతుకులన్నీ ఆ దొరల చేతుల్లో వున్నయ్ ఆళ్ళు కనికరిస్తే మన బతుకులు మూడు పువ్వులూ, ఆరు కాయలు ఆళ్ళు కళ్ళు తెరిస్తే మన బతుకులు బుగ్గే నా సర్వీసులో ఎవడూ నాపై స్పెషల్ రిపోర్టు రాయలేదు ప్రతి ఆఫీసరూ నేను కావాలని కోరుకుంటాడు నా సర్వీసు ముప్పైనాలుగు ఇది నాకు ఆరో టేషన్ నువ్వు, అంటే కోపగించుకుంటావు కానీ, అస లా రోజే తప్పైపోయిం దంటే, గోపయ్యగారు ఇంతదూరం పోయేవాడు కాడుకదా మీకు అంతా చిన్నతనంగా కనపడిద్ది అదేమీ తప్పుకాదు నన్నడిగితే అదే తప్పయితే మొన్న సి ఐ పోయి డి యస్పీ దొర యింట్లో, దొర కూతురు రయిసురాలయినప్పుడు ఎన్ని పనులు చేశాడు దగ్గరుండి బట్టలన్నీ కుట్టించి తీసుకొచ్చాడు బంగళాకి సున్నం కొట్టించడం దగ్గర్నుండి, యస్పై, మన మెన్ అంతా అక్కడ వున్నా కూడా సిఐ గారే దగ్గరుండి చేయించాడు ఇంత ఇదిగా వుంటున్నా ఆయన ఈయన్ని ఎప్పుడూ పురుగుని చూసినట్లు చూస్తాడు సరే మన డి యస్పీ గారు యస్పీ గారి బంగళాలో ఎన్ని పనులు చేపిస్తుంటాడు ఇంక యస్పైగారి సంగతి సరేసరి మనం ఎందుకూ పనికిరాము పై ఆఫీసర్లకు ఎంత అణుకువుగా వుంటారు వాళ్ళు వాళ్ళందరికీ నీ మాత్రం తెలియకనా మనకి వాళ్ళే ఆదర్శం అర్థమయ్యిందా?'' అన్నాడు బ్రహ్మయ్య

సత్యం నవ్వుతో వెక్కిరించాడు మళ్ళీ

ఆ నవ్వు అర్థమయ్యింది బ్రహ్మయ్యకు ఈ సారి ఇంకాబాగా చటుక్కున లేచి ''సరే నీ యిష్టం ఇంత లెక్కలేని తనమయితే ఎట్లా?'' అని చరచరా బయటికి నడిచాడు కోపంగా అటువేపే చూస్తూ కూర్చున్నాడు సత్యం నవ్వుకుంటూ

''ఆయన మనకేదో చెప్పటానికి వస్తే మీరంత నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తారేంటి?'' అంది సుజాత నొసలు చిట్లిస్తూ

''కాకపోతే అతనన్న వాటన్నిటికీ తలూపమంటావా?''

సుజాత కోపంగా చూచింది ''మీ మొండితనం మీదే కదా?'' అంది

''బ్రతికినంతకాలం అంతే వాళ్ళు ఇలా ఈ ఉద్యోగంలో చేరిం దగ్గరనుండీ వాళ్ళు నమ్మిన

'జీ హుజూర్' సిద్ధాంతాన్నే అంటి పెట్టుకుని, నా బోటి వాళ్ళచేత అనుక్షణం విమర్శింపబడుతూ, ఇలా ఎప్పుడన్నా నా బోటివాడికి ఒకదెబ్బ తగిలినప్పుడు, నేను నమ్మినదంతా భ్రమేననీ, ఎప్పటికైనా వాళ్ళు చెప్పేదే వాస్తవమనీ ఎత్తిపొడవటానికి ఇప్పుడాయన దయచేశాడు తప్ప మన మీద అభిమానంతో కాదు ఎలాగోలా తన మాటలకు వంతగా నేను తలూపాలని పాపమాయన కోర్కె'' అన్నాడు సత్యం

''ఏమోలే పోనీయండి ప్రతీదీ మీరులోతుగా ఆలోచిస్తారు ఇవన్నీ నాకు తెలవ్వు పోయిన పని అయితే చాలు'' అంది ఆమె

''అయిద్దిలే రోజా కనకదుర్గకు దణ్ణం పెడుతున్నావుగా'' అన్నాడు నవ్వుతూ

''ఆ, మీ కన్నీ నవ్వులాటల్లాగానే వుంటయ్'' అంది ఆమె లేచి లోపలికెళుతూ

సత్యంకూడా నవ్వుతూ లేచి బూట్లకు పాలీష్ కొట్టాడు సుభ్రంగా ఇస్త్రీ చొక్కా తీసి గుండీలు పెట్టాడు ఇత్తడి నెంబరుకు మెటల్ పాలీష్ రాసి బాగారుద్దాడు రుద్దినదాన్ని పరీక్షగా చూశాడు అలా చూస్తూ నవ్వుకున్నాడు

''ఏమిటి నవ్వుకుంటున్నారు మీలోమీరు?'' అడిగింది భార్య ఇటు వస్తూ

''ఏం లేదు ఈ నెంబరు ఇంతకుముందు వున్నతను ఒక్కరోజన్నా యూనిఫారం వేయలేదంట పాపం నెంబరుకు ఒక్కరోజన్నా పాలిష్ పెట్టి రుద్దిన పాపాన పోలేదు కొత్తదిగానే వుంది'' అన్నాడు

''అతన్నెంబరు మీకెలాగొచ్చింది?'' అడిగింది సుజాత

''ఎలాగొచ్చేదేముంది అతను రిటైర్ కాగానే, నెంబరూ, పెట్టె, బట్టలూ, లారీ, బెల్టులతో సహా అన్నీ అప్పజెప్పాలి గవర్నమెంటుకి తరువాత మళ్ళీ కొత్తగా పోలీసుల్లో చేర్చుకున్న వాళ్ళకి అవి ఇస్తారు అవి పాతబడిపోతేనో, విరిగిపోతేనో కొత్తవి ఇస్తారు'' అన్నాడు

అర్థమయినట్టు తలవూపింది ''సరేలే త్వరగా కానిచ్చిరండి, అన్నంపెట్టా'' అంది ఆమె లేచి వెళ్ళి భోంచేశాడు సాయంత్రం ప్రకాశంతో కలిసి సినిమాకు వెళ్ళాడు

మరుసటి రోజు తెల్లవారుఝామునే లేచి ఫస్ట్ బస్‌కి బయలుదేరి మూడుగంటలపాటు మూడుబస్సులు మారి డిస్ట్రిక్ట్ పోలీసు ఆఫీసుకి చేరాడు సత్యం తీరా ఆఫీసుదగ్గర కెళ్ళేసరికి, యస్పీ హెడ్ క్వార్టర్సులో లేడనీ, ఎక్కడికో కేంపుకు వెళ్ళేడనీ తెలిసింది ఆ వార్త వినగానే నీరసం వచ్చేసింది సరే ఎలాగూ వచ్చాను కదా అనే ఉద్దేశ్యంతో ఆఫీసులో టాన్స్‌ఫర్ల గుమస్తా దగ్గరకు వెళ్ళి సెల్యూట్‌చేశాడు అప్పుడే సుష్టుగా భోంచేసి వచ్చిన గుమస్తా అతికష్టంగా సత్యంవైపు చూచి, వెంటనే సత్యం చొక్కాకున్న నెంబరు చూశాడు ఏదో గుర్తు వచ్చిన వాడిలాగా ముఖం చిట్లించి, ''ఏందోయ్ వచ్చావ్?'' అన్నాడు

ఆ పలకరించిన తీరుకూ, చూచిన నిర్లక్ష్యపు చూపుకూ సత్యానికి వళ్ళు మండింది కాని తనలో కలిగే భావాలు బయట పడకుండా జాగ్రత్త పడుతూ, నవ్వుని ముఖానికి పులుముకుని, ''ఏముంది సార్ మీకు తెలియంది ఏముంది'' అన్నాడు

''ఏం. నువ్వు పెద్ద హెడ్‌స్ట్రాంగ్‌వంట'' అన్నాడు గుమస్తా, అతవే యస్పీ అయినట్టు పోజు పెడుతూ

ఆ మాటలు కోపం తెప్పించాయి సత్యంకు కళ్ళతోనే మింగేశాలాగా చూశాడు ఆ చూపుకే కలవరపడి పోయాడు గుమస్తా కాని అంతలోనే తేరుకున్నాడు ''మాకేం తెలుసోయ్ మీ యస్పై,

సిఐలు పట్టుపట్టి నీ కా పనిష్మెంటు స్టేషను వేసిందాకా యస్పీ చుట్టే తిరిగారు'' అన్నాడు

''పక్కలేసి బతికే వాళ్ళ దృష్టిలో, ఆత్మాభిమానంతో బతకాలని ప్రయత్నించేవాళ్ళు పొగరుబోతులూ, తలబిరుసువాళ్ళు వాళ్ళ మాటల్ని మీరూ నమ్మితే ఎట్లా?'' అన్నాడు అదే చూపుచూస్తూ సత్యం కోపంగా

''అదేలే నేనేమీ నమ్మలేదనుకో ఇంతకీ ఏమిటి, రిలీవయ్యావా?'' అన్నాడు బల్లమీదకు వంగుతూ

''ఆ, రిలీవయ్యాను దొరగారికి కనపడదామని వచ్చాను మీరు కొంచెం సహాయం చేయాలి మీ సహాయం వుంచుకోనులే'' అన్నాడు గుమస్తా ముఖాన్ని చదవటానికి ప్రయత్నం చేస్తూ సత్యం

''నేనేం చేయలేనయ్యా! క్రైం మీటింగులో నిన్ను గురించి మీ యస్సై, సిఐ, డియస్పీలు అట్లా చెప్పారు నేనిప్పుడు నిన్ను గురించి ఏం చెప్పలేను సారీవోయ్ అయినా ఏమిటి మీ ఇద్దరికీ అంత ఇది ఎందుకయ్యా గొడవలు వాళ్ళతో చూడు ఇప్పుడు'' అన్నాడు గుమస్తా

అతని మాటలు చిరాకు కలిగించాయి సత్యానికి అసహనంగా చూశాడు ''సరేలెండి దొరగారు ఎప్పుడొస్తారో, కేంపునుండి?'' అన్నాడు

''ఏమోనోయ్ తెలియదు సాయంత్ర మొస్తాడో, రేపొస్తాడో స్టేషన్ ఇనస్పెక్షన్ కెళ్ళాడంట'' అన్నాడు

''సరేలేండి వస్తా సార్'' అని ఇవతల కొచ్చాడు సత్యం

ఇంక ఈ రోజు లాభం లేదనుకుని ఇంటికి బయలుదేరాడు మరుసటి రోజు మళ్ళీ బూట్లు పాలీష్‌చేసుకొని నీటుగా వేరే యూనిఫారం వేసుకుని, ఛస్తూ బ్రతుకుతూ జిల్లా ఆఫీసుకు చేరాడు

''దొరగారు వున్నారు'' అని చెప్పాడు ఆఫీసు ఆర్డర్లీ

'హమ్మయ్య' అనుకున్నాడు కాని, యస్పీ తన రిక్వెస్టు వింటాడనే నమ్మకం లేదు పైగా నిన్న గుమస్తా చెప్పిన మాటలతో వున్న కాస్త ఆశ కూడా అడుగంటింది అప్పటికే యస్పీ కోసం చాలా మంది వచ్చారు కానిస్టేబుళ్ళు , యస్సైలు, సిఐలు, కొంతమంది సివిలియన్స్ కూడా వచ్చారు పదకొండు గంటలకే యస్పీ ఆఫీసుకొచ్చాడు బంగళానుండి అందరూ ఒదిగి ఒదిగి నిలబడి సెల్యూట్‌లు చేశారు సివిలియన్స్ దండాలు పెట్టారు రాజరీవి ఒలకబోస్తూ లోపలికెళ్ళాడు యస్పీ అతని వెనుక ఒక డి యస్పీ, ఒక కేంపు క్లర్కూ, ఫైళ్ళు పట్టుకొని ఆర్డర్లీ వెళ్ళారు యస్పీ దర్శనం కోసం వచ్చినవాళ్ళు వాళ్ళ వాళ్ళ ఆలోచనలలో మునిగిపోయారు నల్లటి నాపరాళ్ళ మీద, ఇనప నాడాల బూట్లు శబ్దం చేయకుండా జాగ్రత్తగా అడుగులేస్తూ తచ్చాడుతున్నారు కానిస్టేబుళ్ళు సత్యం అక్కడున్న వాళ్ళని పరిశీలిస్తూ మౌనంగా నిలబడ్డాడు ఓ ప్రక్కన 'మా కష్ట సుఖాల్ని పట్టించుకోవటానికి మేమొక సంఘం పెట్టుకోవాలి' అనుకున్నాడు

లోపలికెళ్ళిన ఆర్డర్లీ బయటికొచ్చాడు అతని చుట్టూ సిఐలు, యస్సైలు జోరీగల్లా మూగారు

''దొరగారి మూడ్ ఎలావుంది?'' అనడిగాడు ఒక సిఐ

''ఫరవాలేదు సార్ సంతోషంగానే వున్నారు'' అన్నాడు అతను ఆ మాట వినటంతోనే వాళ్ళ ముఖాల్లో సంతోషం కనబడింది ఆ ఆర్డర్లీ వెళ్ళిపోయాడు వెయిటింగ్ ఆర్డర్లీ అక్కడే వున్నాడు తెల్లటి మందపాటి పి టీ బన్నీనూ, నీటుగా ఇస్త్రీ చేయించిన నిక్కరుతో కాళ్ళకు పట్టీలు చుట్టుకుని బూట్లు లేకుండా వున్నాడు అక్కడున్నవాళ్ళు అతన్ని అభిమానంగా పలకరిస్తున్నారు, చిన్నగా గుసగుసలాడుతున్నట్లు అతను విసుగుదలని కనపడనీయకుండా,

చిరునవ్వుని పెదాలమీద రాసుకుంటూ మాట్లాడుతున్నాడు

''మీరంతాకూడా దొరగారిని చూడటానికే వచ్చారా?'' అడిగాడు ఒక సిఐ పక్కగా నిలబడ్డ కానిస్టేబుళ్ళను చూస్తూ

''అవును సార్'' అన్నాడు ఒక సీనియర్ కానిస్టేబుల్ వినయంగా

నిముషాలు నిశ్శబ్దంగా దొర్లుతున్నాయి అంతకు ముందువరకూ వరండాలో అటూఇటూ తిరుగుతున్న ఆఫీసు గుమస్తాలు సీట్లలోంచి ఎవరూ కదలటం లేదు

కాలం గడిచేకొంది సత్యం మనస్సులో అందోళన చోటు చేసుకుంటోంది 'అసలెందుకు వచ్చానా?' అని అతను భావించాడు నిశ్శబ్ద వాతావరణాన్ని విచ్ఛిన్నం చేస్తూ బజర్ మోగింది ఉలిక్కిపడ్డట్టు కదిలి లోపలికెళ్ళాడు వెయింటింగ్ ఆర్డర్లీ మరునిముషంలో తిరిగొచ్చాడు బయటవున్న వాళ్ళంతా అతనివైపు ఆత్రుతగా చూశారు

''ఒంటిగంట వరకూ కానిస్టేబుళ్ళ రిక్వెస్టు లేవీ చూడనన్నారు దొర గారు మిమ్మల్ని ఒంటిగంట తరువాత రమ్మన్నారు మీరంతా బయటికెళ్ళండి, మిగిలినవాళ్ళు వుండండి'' అన్నాడు ఆర్డర్లీ

పీసీలకు నీరసం ఆవహించింది యస్పైలు, సిఐలు ఒకళ్ళనొకళ్ళు చూసుకుని ముసిముసిగా నవ్వుకున్నారు వాళ్ళ నవ్వు పీసీలకు బాధ కలిగించింది చిన్నగా కదిలి బయట కెళ్ళారు

సత్యం గబగబా హోటల్‌కెళ్ళి భోజనం చేసి వచ్చి ఆఫీసు పక్కనే వున్న వేప చెట్టు క్రింద కూర్చున్నాడు యస్పీని చూడాలనే వుద్దేశ్యం క్రమంగా క్షీణిస్తోంది కానీ తిరిగి వెళ్ళబుద్ధి కావటం లేదు 'ఇంటికెళితే సుజాత బాధపడుతుంది తన బాధను అర్థం చేసుకోదు తనని ఎందుకూ పనికిరానివాడిగా భావిస్తూ చూస్తుంది అదెంతో బాధ కలిగించే చూపు ఇక్కడి అవమానాల పర్వం గురించి అర్థం చేసుకోదు' అనుకున్నాడు గట్టిగా నిట్టూర్చి చెట్టు మొదలుకి చేరబడ్డాడు నిద్ర వస్తోంది 'మానసిక బాధ కూడా నిద్రకలిగించిద్ది కొద్దిసేపు ఎక్కడన్నా నిద్రపోతే బాగుండు' అనుకున్నాడు కొద్దిసేపటికి మిగిలినవాళ్ళు కూడా అక్కడకు చేరుకున్నారు అలవాటుగా చెత్త విషయాలు ముచ్చటించుకుంటూ, చుట్టలు కాల్చుకుంటూ కబుర్లల్లో పడ్డారు ఒక సీనియర్ పీసీ ఒంటరిగా దూరంగా కూర్చుని వుంటే అతన్ని అడిగాడు సత్యం ''ఏమిటి మీ రిక్వెస్టు?'' అని

''ఏముంది నాయనా మామూలే నా కొడుకుని తీసుకొచ్చా దొరకి చూపిద్దామని నాకింకా ఆర్నెల్లే సర్వీసుంది దొరకి కనపడి వెయిటింగ్ లిస్ట్‌లో పెట్టిద్దామని వచ్చా'' అన్నాడు తిరిగి అతనే మళ్ళీ అన్నాడు ''ఏం చేస్తాం వీడు బియ్యే పేసయ్యాడు దేనిలోకి పోవాలన్నా వేలువేలు అడుగుతున్నారు నా బోటి వాళ్ళు ఏం పెడతారు లంచం నాకు ఇద్దరు మగపిల్లలు, ఇద్దరాడ పిల్లలు ఆళ్ళకి చదువు సంధ్యలు చెప్పించి ఈ స్థితికి తెచ్చేసరికి నా పని అయిపోయింది ఇంక వేలకు వేలు పొయ్యటం నాకు చేత కాదు ఒకమ్మాయికి పెండ్లి చేశా అల్లుడు మిలటరీలో సిపాయి ఆళ్ళ బతుకు ఆళ్ళు బతుకుతున్నారు రిటైరయినాక వచ్చే డబ్బుల్తో రెండో పిల్లకి పెళ్ళి చెయ్యటం, మాకింత గుడిసె ఏసుకోవటం చెయ్యాలి మరి ఆ ఎంకటేశరసామి దయ ఎట్టా వుందో రెండో అబ్బాయి ఈ ఏడు పదికొచ్చాడు రెండోవాడిదేం దిగులు లేదు ఇదిగో ఈడినే బాగా గారాబంగా పెంచాం కాయకష్టం చెయ్యలేడు చిన్నగా దొరగారి కాళ్ళూ గడ్డం పట్టుకొని దీనిలో అన్నా జేరిస్తే కొంత గుండె బరువు తీరిద్ది ఈ యస్పీ కిందోళ్ళని అసలు కన్నెత్తి సూడడంట మళ్ళీ

ఆయినొచ్చిందేమో రిజర్వేచను కోటారో అంట'' అన్నాడు

''వీళ్ళెక్కడి నుండి వస్తే యేం, ఆడ కెక్కాక అందరూ వున్నోళ్ళు మనుషులుగా మారి పోతారుగాని, మనబోటోళ్ళ కోసం ఎవరూ ఆలోచించరు'' అన్నాడు పక్కనున్న అతను

''నువ్వేం రిక్వెస్టు కొచ్చావు?'' అడిగాడు సత్యాన్ని

విషయం చెప్పాడు సత్యం టైము చూశాడు ఒంటిగంట కావస్తోంది ''లోపలికి పోదామా?'' అన్నాడు

అంతా లోపలకు వెళ్ళారు అప్పటికే సిఐలు, యస్సైలు యస్పీని కలిసి వెళ్ళారు ఒకటిన్నరకు బజర్ మోగింది ఆర్డర్లీ లోపలికెళ్ళాడు బయటకొచ్చి అక్కడున్న జనంలో ఒకతన్ని లోపలకుపంపించాడు అతను వచ్చి వెళ్ళిన తరువాత రెండవ అతను లోపలికి వెళ్ళాడు తరువాత ఒక పీసీని లోపలకు పంపాడు ఆర్డర్లీ బయటకు వస్తున్న వాళ్ళ ముఖాలు చూస్తూ నిలబడ్డాడు సత్యం కొందరు సంతోషంగా, ఇంకొందరు ముఖాలు మాడ్చుకొని బయటకు వస్తున్నారు తన పని ఏమౌతుందో అనే బెంగ మనస్సులో పీకుతోంది సత్యానికి లోపలికెళ్ళిన కానిస్టేబులు బయటకు వచ్చాడు నీరసంగా

మళ్ళీ బజర్ మోగింది

ఆర్డర్లీ లోపలి కెళ్ళాడు వెంటనే బయటికొచ్చాడు ''మిగిలిన వాళ్ళను రేపు రమ్మన్నారు దొరగారు అంతా బైటకెళ్ళండి'' అన్నాడు ఆ మాటతో ఒక్కసారిగా నీరసం ఆవహించి శరీరాలు చచ్చుబడి పోయాయి అందరికీ

''చేసేదేముంది, పదండి'' అన్నాడు ఒకతను అంతా బైట కొచ్చారు సత్యం ఇంటికెళ్ళేసరికి బాగా పొద్దుపోయింది భోజనం చేస్తూ భార్యకు జరిగినదంతా చెప్పాడు

''ఇట్లా ట్రాన్స్‌ఫర్‌లు వచ్చినప్పుడు వుండే జాయినింగ్ టైంలో వుండే రెస్ట్ కూడా మీకు దక్కటం లేదు'' అంది ఆమె బాధగా

''సరే, ఏం చెయ్యమంటావో నీ వుద్దేశ్యం చెప్పు'' అన్నాడు అతనికి యస్పీని రిక్వెస్టు చేయాలనే ఉద్దేశ్యం పూర్తిగా నశించింది ఆ మాట భార్యతో అంటే బాధపడిద్దని అలా అన్నాడు

''మీ ఇష్టం'' అంది ముక్తసరిగా సత్యం విని వూరుకున్నాడు 'రేపయినా దొర దర్శనం అయిద్దో లేదో ' అనుకున్నాడు

మరుసటి రోజు మళ్ళీ యధాలాపంగానే హడావిడిగా తయారయి చీకటితోనే బయలు దేరాడు మార్గమధ్యంలోనే దొర హెడ్ క్వార్టర్సులో లేడని తెలిసి వెనక్కు తిరిగాడు

చిట్ట చివరికి అయిదోరోజు దొర దర్శనం అయింది సత్యం యస్పీ ఆఫీసులోకి అడుగు పెట్టేటప్పుడే అక్కడున్న ఆర్డర్లీ, ''ఈ రోజు యస్పీ దొరగారు ఎందుకో కోపంగా వున్నారు జాగ్రత్త'' అని హెచ్చరించాడు జారిపోతున్న గుండెని కూడదీసుకుంటూ లోపలికి వెళ్ళి స్మార్ట్‌గా, ట్రైనింగులో వున్నప్పుడు చేసినట్టు చేశాడు సెల్యూట్

''ఏమి?'' అన్నాడు యస్పీ కళ్ళద్దాల లోంచి చూస్తూ సత్యానికి నాలిక తడి ఆరిపోయింది చిన్నగా గుటకలు మింగాడు

''ఎందుకొచ్చావని అడుగుతున్నారు దొరగారు'' అన్నాడు కేంపుక్లర్కు విషయం గుర్తుచేస్తునట్టు

''దొరవారితో నా ట్రాన్స్‌ఫర్ విషయం మనవి చేసుకుందామని వచ్చానయ్యా'' అన్నాడు

సత్యం మాటల్ని పొడిపొడిగా

''ఏమిటి ?'' ప్రశ్న వేశాడు యస్పీ

సత్యం తన ఎడమచేతిలోని పిటీషన్ కాగితం సి సి (క్యాంపుక్లర్క్)కి అందివ్వబోయే లోగానే

''పర్మిషన్ తీసుకుని వచ్చావా?'' అన్నాడు యస్పీ తిరిగి

''సార్ అయ్యా '' ఏం మాట్లాడాలో అర్థం కాలేదు

''ఎంత నీ సర్వీసు?''

''అయిదు ఆరు'' మాటలు తడబడ్డాయి

''బ్లడీ రిక్రూట్ సి ఐ దగ్గర పర్మిషన్ తీసుకోకుండా యస్పీని రిక్వెస్టు అడగటానికి వచ్చావంటే నీకెంత ధైర్యం నీ సర్వీసు ఆరేళ్ళు లేదు సరిగ్గా ఏ స్టేషను నువ్వు?'' కోపంగా అన్నాడు యస్పీ

చెప్పాడు సత్యం కాని అతని మాటలు అతనికే వినపడలేదు అతని చేతిలోని పిటీషన్ తీసుకుని యస్పీ కిచ్చాడు సి సి యస్పీ పిటీషనంతా రెండు సెకండ్లలో చదివేశాడు ఆ రెండు సెకండ్లలో కొద్దిగా తేరుకున్నాడు సత్యం గట్టిగా ఒక్కసారి కళ్ళు మూసి తెరిచాడు అప్పటి వరకు కళ్ళు బైర్లు కమ్మినట్లున్నయ్ తనెందుకిలా భయపడిపోయాడో అర్థం కాలేదు ఇప్పుడు అక్కడున్న వస్తువులు కాస్త కళ్ళకు కనపడుతున్నయ్ హాలు నిండా ఖరీదైన తివాచీ పరచి వుంది పైన ఫేను నిశ్శబ్దంగా తిరుగుతోంది సింహాసన మంత కుర్చీలో కూర్చున్నాడు యస్పీ ముందు విశాలమైన టేబులు దానికివతలగా ఖరీదయిన సోఫాసెట్లు టేబులు మీద ఫైళ్ళు, ఇంకా తదితర సామాగ్రి, ఫోన్లు

''వూ, పో'' అన్నాడు కాగితాన్ని సీ సీ కి ఇస్తూ యస్పీ సత్యం సెల్యూట్ చేశాడు ఎబౌట్ టరన్ తిరిగి బైటకొచ్చాడు అతను అలా ఎబౌట్ టరన్ తిరిగినప్పుడు బూటు నాడా తివాచీని పట్టుకుంది తొట్రు పడ్డాడు ఎలాగో బైటకొచ్చి పడ్డాడు గట్టిగా గాలి పీల్చుకున్నాడు చొక్కా అంతా చెమటతో తడిచి పోయింది లోపల వున్నది మొత్తం రెండు నిముషాలకన్నా తక్కువ క్షణాల్లో భయం శరీరాన్ని నిసత్తువ పరిచింది

ఇంటికెళ్ళే సరికి పొద్దుపోయింది జరిగిన విషయం భార్యకు చెప్పాడు

''పర్మిషన్ తీసుకుని పోకపోయారా?'' అంది భార్య అర్థంకానట్లు

''ఎవడిస్తాడు? ఇక్కడ నుండి రిలీవ్ అయ్యాను కాబట్టి ఈ సర్కిల్ ఇన్‌స్పెక్టరు ఇవ్వడు డ్యూటీలో చేరాల్సిన చోట ఇంకా డ్యూటీకి రిపోర్టు చెయ్యలేదు కాబట్టి అక్కడి సర్కిలిన్‌స్పెక్టరు ఇవ్వడు ఇంక పర్మిషన్ ఎక్కడినుండి వచ్చిద్ది?'' అన్నాడు

''ఏమయిద్దో అది చేస్తానని కానీ, చెయ్యనని కానీ చెప్పలేదుగా''

''ఏం చెప్పలేదు వాడెమ్మని '' తిట్టాడు కోపంగా

సుజాత విని వూరుకుంది కొద్దిసేపు ''మన రాత ఎట్లావుంటే అట్లా జరిగిద్దిలే కానీయండి'' అంది నిరాశగా సత్యం విని వూరుకున్నాడు

సత్యం మర్రోజు తనకు వేసిన స్టేషనుకు వెళ్ళి రిపోర్టు చేశాడు తను యస్పీకి కనపడి చెప్పుకున్న రిక్వెస్టు బూడిదలో పోసిన పన్నీరయిందని తరువాత అతనికి తెలిసింది ఆ రోజు సత్యంతో పాటు బస్టాండు వరకు వెళ్ళి బస్సెక్కించాడు ప్రకాశం

''ఇల్లూ అదీ చూసుకుని త్వరగా వచ్చి అమ్మాయి వాళ్ళని తీసుకుపో'' అన్నాడు ప్రకాశం

'అలాగే' అన్నట్లు తలవూపాడు సత్యం బస్సు బయలుదేరాక తను సైకిలెక్కి క్వార్టర్ కొచ్చాడు ప్రకాశం అతని మనస్సంతా దిగులుగా భారంగా వుంది సత్యానికి జరిగిన అవమానం తనకు జరిగినట్లుంది ఎప్పటిలాగానే తన మిత్రుల శత్రువులు కూడా తనకూ శత్రువులన్నట్టు మనస్సులో తనకి తెలియకుండానే వాళ్ళ మీద వ్యతిరేకత పెరుగుతోంది

ఆ సాయంత్రం రోల్ కాల్‌కు వెళ్ళినప్పుడు రోల్‌కాల్‌లో ముభావంగా వుండిపోయాడు ప్రకాశం వారం రోజుల తరువాత, ఈ రోల్‌కాల్ యస్పై తీశాడు ఈ వారం రోజులూ హెచ్‌సీ లతో రోల్‌కాల్ తీయించాడు యస్పై సత్యం ట్రాన్స్‌ఫర్ విషయాన్ని ఈ వారం రోజుల్లో అతని సానుభూతిపరులు మరిచి పోతారని యస్పై వూహ యస్పై మామూలుగా వుండటానికి ఆ రోల్‌కాల్ సమయంలో ప్రయత్నించాడు కానీ కుదరలేదు అతని ముఖంలోని క్రూరత్వాన్ని గమనించాడు ప్రకాశం

సత్యాన్ని అభిమానించే వాళ్ళు అతనికి జరిగిన అన్యాయానికి యస్పైని మనస్సులోనే తిట్టుకున్నారు అలా ఆఫీసర్లని తిట్టటం వాళ్ళ ఉద్యోగాల్లో ఒక భాగమయ్యింది

యస్పై మేకపోతు గాంభీర్యాన్ని ప్రదర్శించాడు ప్రకాశం వైపూ, ఇంకా అలాటి ఇద్దరి ముగ్గురి వైపు చూసేటప్పుడు అతని చూపులు తడబడ్డాయి ప్రకాశం విషయం తెలిసిన వాడు కనుక అతనితో మాట్లాడేటప్పుడు రెండు మూడు మాటలతో సరిపుచ్చుతాడు అధికార్లలో ప్రకాశం అంటే ఆ తరహా జంకు వుంది తనేమిటో, తన వ్యక్తిత్వమేమిటో ప్రకాశం వాళ్ళకు రుచి చూపించాడు అందరివైపూ ఒకసారి చూచి, రైటరందించిన రఫ్‌డ్యూటీరోష్టరు తీసుకుని ఎంతమంది ప్రెజెంట్‌లో వున్నారో, ఈ రోజు నైటు బీటుకి ఎంతమంది వుంటారో అని లెఖ్ఖ వేస్తున్నట్టు నటించాడు యస్పై కొద్దిసేపు

''ఏమిటి, ఇరవై ముగ్గురే వస్తున్నారు టోటల్ స్ట్రెంత్ ?!'' అన్నాడు అమాయకంగా రైటరు వైపు చూస్తూ

'అది నటనే' అని మెన్, రైటరు గ్రహించటానికి వాళ్ళకు అరక్షణం కూడా పట్టలేదు

''సత్యం లేడుగా సార్ అతనికి ట్రాన్స్‌ఫర్ ''

రైటరు మాట పూర్తికాకముందే, ''ఆ, అవునయ్యా ఆ విషయం మరిచేపోయా'' అన్నాడు యస్పై సత్యం పేరు గుర్తు చేసి మెన్‌ని హెచ్చరించటానికి చిన్న డ్రామా ఆడాడు సత్యాన్ని ట్రాన్స్‌ఫర్ చేయించిన విషయం అంత ముఖ్యమయిన విషయంగా తాను భావించనట్లూ, ఆ ట్రాన్స్‌ఫర్ ప్రభావం మిగతా మెన్ మీద పడి వాళ్ళల్లో తనపట్ల వ్యతిరేకత పెరుగుతున్నట్లుగా తాను గుర్తించడం లేదన్నట్లూ, ఫోజు పెట్టబోయాడు అలాటి పనులు తాను చాలా అవలీలగా చేయగలనన్నట్లూ, కాబట్టి జాగ్రత్తగా వుండమని మిగిలిన వాళ్ళను హెచ్చరిస్తున్నట్లూ అతని ప్రవర్తన కనపడింది

అతని నిర్లక్ష్యపూరిత వ్యవహారం మెన్‌లో తీవ్రమయిన నిరసనని కలిగించింది ఒకే ఒక కలం పోటుతో కానిస్టేబుళ్ళ జీవిత గతుల్ని మార్చే రాక్షస చర్యను అతను అంత నిర్లక్ష్యంగా, లెఖ్ఖ లేని తనంగా ప్రకటించటం చూస్తే అతనిమీద కడుపుమండింది చాలా మందికి

ప్రకాశం లాంటి ఉద్రేకపరులు తమ కోపాల్ని ముఖకవళికల్లో చూపించారు 'అది నీ గొప్పతనమేమీ కాదు అన్ని రకాలుగా అర్భకులయిన పీసీల మీదా, హెచ్‌సీల మీదా నీ బోటివాళ్ళు అధికారం చెలాయించటం గొప్పెట్లా అవుతుంది ? నీకు చేతనయితే, నీలో నీతీ నిజాయితీ

గుండె ధైర్యముంటే అవినీతి పరులయిన అధికార్లకు భయం పుట్టించు' అనుకున్నాడు ఒక హెడ్ కానిస్టేబులు మనస్సులోనే

'మాకు ఒక సంఘం లేకా, ఆ చైతన్యం లేకా, ఒంటరిగా వుండటం చేత నీ బోటి వాళ్ళ ఆటలు సాగుతున్నాయ్ మిగతా డిపార్టుమెంటుల్లాగా మాకూ ఒక సంఘం వుండి, మేమూ సంఘటితంగా వుంటే నీ బోటి వాళ్ళ పొగరు అణిచే వాళ్ళమే' అనుకున్నాడు ప్రకాశం

ఎక్కువసేపు వాళ్ళనట్లా వుంచకూడదని గబగబా డ్యూటీలు చెప్పి పంపించాడు యస్పై

అందరూ కదలబోతుంటే, ''ఒక రిక్వెస్టు సార్ '' అన్నాడు ప్రకాశం ఆ స్వరం విని పీసీలూ, హెచ్‌సీలూ ఆగిపోయారు

'ఏమిటి?' అన్నట్లు చూశాడు యస్పై

''నాకు రేపు ఆఫ్ కావాలి సార్'' అన్నాడు ప్రకాశం

యస్పై తటపటాయించాడు కాస్త ఆలోచించాడు 'తనకు ఎదురు తిరిగేవాళ్ళకు ఎలాటి పనిష్మెంటు ఇస్తాడో తను సత్యం విషయంలో రుజువు చేశాడు కేవలం పనిష్మెంట్లిచ్చే యస్పైగానే కాకుండా మెన్ వెల్‌ఫేర్ చూసే విషయంలో కూడా తను ఉదారంగానే ప్రవర్తిస్తాడనే పేరు తెచ్చుకోవటం కూడా ఇలాటప్పుడు ముఖ్యం కనుక ఆఫ్‌లు ఇవ్వటం తనకు ఇష్టం లేక పోయినా ఇవ్వాలి అయితే అడిగిన వెంటనే 'సరే' అన్నా మరీ లోకువయ్యిపోతాం కాబట్టి రెండు మూడు ప్రశ్నలన్నా వేయాలి ఆ పీసీ తో బతిమలాడించుకోవాలి, అప్పుడు ఇవ్వాలి 'ఊ సరే' అంటూ తను దయాదాక్షిణ్యాలతో ఇస్తున్నట్లు ఫోజుపెట్టాలి నటన చాలా ముఖ్యం కదా' అనుకున్నాడు

''ఎందుకు ఆఫ్?'' అన్నాడు గంభీరంగా ఫోజుపెట్టి, అసందర్భంగా

ఆ మాటకు చిరాకేసింది ప్రకాశంకు

''కావాలి సార్, కాస్త పనుంది'' అన్నాడు ప్రకాశం మామూలుగా వుండటానికి ప్రయత్నిస్తూ

''అదేనయ్యా, ఎందుకంటున్నా?'' అన్నాడు తనేమడిగినా, ఎట్లా అడిగినా చెల్లిపోతున్నది కాబట్టి

''అది నా వ్యక్తిగతమయిన పని సార్ మీరడగకూడదు నేను చెప్పను నా పనినిబట్టి కాదు ఆఫ్ ఇప్పటికి ఇరవై రోజుల్నుండీ నేను డ్యూటీలో వున్నా సగటున రోజుకు పజ్జెనిమిది గంటల డ్యూటీ చేస్తున్నా ఆరు రోజులు డ్యూటీ చేస్తే ఏడో రోజు ఆఫివ్వాలి'' అన్నాడు ప్రకాశం నిబ్బరంగా, ఉద్రేకం నిండిన స్వరంతో

వూహించని ఆ జవాబుకి యస్పై కంగుతిన్నాడు స్టాఫ్‌లో ఆసక్తి పెరిగింది ఏం మాట్లాడాలో యస్పైకి తోచలేదు స్టాపు ముందు అవమానం జరిగినట్లు ముఖం ఎర్రబడింది తన అధికారాన్ని గుర్తు చేయాల్సిన అవసరం గుర్తించాడు యస్పై ''ఎవరితో మట్లాడుతున్నావో తెలుసుగదా!'' అన్నాడు అసందర్భంగా మళ్ళీ

ఆ మాటకు ఇంకా చికాకు వేసింది ప్రకాశానికి కాని తగిన జవాబు చెప్పే సమయం దొరికింది అని సంతోషపడ్డాడు లోలోపలే 'స్టాపు వున్నప్పుడే వీడికి గుణపాఠం చెప్పాలి' అనుకున్నాడు నిదానంగా అన్నాడు ''నేనేం తాగుబోతును కాదు సార్ తేరగావచ్చే సొమ్ముతో తాగి వళ్ళు తెలియకుండా ఎవరు ఎవరో తెలియకుండా వుండటానికి అయినా ఆఫ్ ఇస్తే ఇస్తాననండి లేకపోతే ఇవ్వననండి వాదాన్ని పెంచటమెందుకు?'' అన్నాడు ప్రకాశం

ఆ మాటతో దిమ్మ తిరిగిపోయింది యస్పైకి స్టాపు ఆశ్చర్యంగా నోరు తెరిచారు

ఇంక ఏమీ మాట్లాడలేక పోయాడు యస్సై 'ఇంకేమన్నా అంటే ప్రకాశం మరింకేమన్నా అంటాడు కనుక ఇప్పటికి ఇంతటితో పోనివ్వాలి వీడినీ సత్యంగాడిలాగానే శంకరగిరి మాన్యాలు పట్టించాలి కులం తక్కువ నా కొడుక్కి ఎంత దొమ్మ పొగరు చూస్తా ' అనుకున్నాడు యస్సై మనస్సులో

అతని అహం దెబ్బతిని పోయింది

చటుక్కున నవ్వుని ముఖానికి పులుముకున్నాడు ''అవుననుకో సరే తీసుకో'' అని రైటరు వైపు తిరిగి, ''రేపు ఇతనికి ఆఫ్ ఇవ్వు ఇంకా ఎవరన్నా కావాలంటే ఇవ్వు సరే మీరు పోండి'' అన్నాడు మెన్‌వైపు చూచి

అంతా బయటకు నడిచారు సెల్యూట్‌లు చేసి చాలామంది అదే విషయం ముచ్చటించు కున్నారు సీరియస్‌గా

జరిగిన సంగతి ఇంట్లో చెప్పాడు ప్రకాశం ''ఇంకేం, మనం కూడా తట్టాబుట్టా సర్దు కోవడమే'' అంది అతని భార్య ఆ మాటకు నవ్వి వూరుకున్నాడు

''తప్పదు జనం కోసం బతకలేను నామనస్సుకు నచ్చినట్లు బతుకుతా చేతనయినంతవరకు' అన్నాడు ప్రకాశం అలవాటుగా

''నీ మనస్సుకు నచ్చినట్లు బతకటం అంటే మా బతుకుల్ని సంపటమేగా '' అంది భా౦ అసహనంగా జ్వరంతో ఆమె మంచంలో వుంది విని వూరుకున్నాడు

తిరిగి అదే రోజుకి ట్రాన్స్‌ఫర్ ఆర్డర్ చేతికొచ్చింది వాళ్లు వూహించినట్లుగానే

కొత్త పోలీసుస్టేషన్లో రిపోర్టు చేయటానికి బయలుదేరాడు బస్సు దిగి బెడ్డింగూ, కిట్టు బాక్సు రిక్షాలో వేసుకుని స్టేషనుకు చేరాడు ప్రయాణం వల్ల వళ్ళంతా హూనమైనట్లు వుంది

'ఇక్కడెంతకాలమో? ఎట్లాంటివాళ్ళో రైటరూ, యస్సైలు ఏం తగాదా వచ్చిద్దో వీళ్ళతో అనుకున్నాడు రిక్షాలో స్టేషనుకు వస్తూ

రిక్షా దిగి ఒకసారి అటూ ఇటూ తేరిపార చూశాడు ప్రకాశం 'మామూలే అన్ని తాలూక ఆఫీసుల్లాగానే ఇదీ వుంది' అనుకున్నాడు బ్రిటీష్ హయాంలో కట్టిన కట్టడమది ఎడమవైపు తహశీలుదారు ఆఫీసు, దాన్ని ఆనుకుని సబ్ ట్రెజరీ, దాని పక్కనే పోలీసు స్టేషను దాని కానుకొ మేజిస్ట్రేటు కోర్టు చుట్టూ విశాలమైన ఖాళీ స్థలాన్ని చుడుతూ ప్రహరీ గోడ స్టేషనుకు వెన వైపున సబ్‌జైలు కిట్టు బాక్సు రిక్షా అతనికెత్తి, తను బెడ్డింగు తీసుకుని లోపలికి నడిచాడు స౦ ట్రెజరీ సెంట్రీ తుపాకి పట్టుకుని నిలబడి వున్నాడు చిరునవ్వుతో పలకరించాడు ప్రకాశాన్ని ''ఏమండీ ఇక్కడకు డ్యూటీ వో పడిందా ?'' అన్నాడు అవునన్నట్టు తల వూపాడు ప్రకాశం

''ఏ స్టేషను నుండి?''

చెప్పాడు ప్రకాశం ''సరే పోయి పెట్టె పెట్టుకోండి గార్డు రూంలో సెట్టుకోండి అక్కడయితే ఎవరికీ అడ్డు వుండదు ఎవరూ కదిలించరు'' అన్నాడు సెంట్రీ అలాగే అన్నట్టు తలూపి లోపల కెళ్ళాడు ప్రకాశం సొరంగం లాంటి దారిలో నుండి లోపలకు వెళుతుంటే గబ్బిళాల వాసన ముక్కుల్ని తాకింది తల పైకెత్తి చూశాడు తాటిచెట్టంత ఎత్తున వున్న కప్పుకు గబ్బిళాలు వేలాడుతున్నయ్ పదిహేను అడుగుల పొడవున్న ఆ దారి దాటంగానే ఎదురుగా యస్సై గది ఈ దారికీ, ఆ గదికీ మధ్య పదిహేను ఇరవై చదరపు గజాల చిన్న హాలు హాలు గోడకి, అన్ని స్టేషన్లలో వున్నట్టు అద్దం ఒకటి పెద్దది వుంది రూముని ఆనుకుని పంచ, పంచలో ఒక పెద్ద బల్ల బల్ల

చుట్టూ కొంతమంది కానిస్టేబుళ్ళు కూర్చుని వున్నారు హెడ్ కానిస్టేబులు ఒకతను డైరీలో ఏదో రాస్తున్నాడు కొత్త వ్యక్తిని అంతా ఒకసారి తలెత్తి చూశారు

''ఏమిటి ఇక్కడకు వచ్చారా?'' అడిగాడు ఒక పీసీ

అవునన్నట్టు తలూపాడు ప్రకాశం

''ఎక్కడినుండి?'' అన్నాడు ఇంకొకతను ప్రకాశం జవాబు చెప్పకముందే, ''ఎప్పుడు పడ్డ డీ వో ?'' అన్నాడు మళ్ళీ

''నెంబరెంత?'' అని ప్రకాశం చొక్కాకున్న నెంబరు చూచి పైకే చదివాడు ఇంకొక పీసీ

''నమస్కారం సార్ '' అన్నాడు సార్జిన్‌తో ప్రకాశం

''నమస్కారమండీ'' అన్నాడు సార్జిన్

''రిక్షా అతను పెట్టె అలాగే నెత్తిన పెట్టుకొని నిలబడి వున్నాడు పెట్టె లోపల గార్డు రూంలో పెట్టించండి'' అన్నాడు ఒక పీసీ

''ఎక్కడ గార్డు రూము?''

''రండి నేను చూపిస్తా'' అని ఒక పీసీ ప్రకాశాన్ని లోపలకు తీసుకుపోయాడు యస్పై రూముని ఆనుకుని రైటరు గది, దాని నానుకుని పోలీసు లాకప్పులు రెండు ఒకటి ఆడ ఖయిదీల కోసం, రెండోది మగ ఖయిదీల కోసం అక్కడినుండి లోపలకు వెళితే సబ్ జైలు ఇంగ్లీషు అక్షరం 'యూ' ఆకారంలో వున్న సబ్ జైలుకు అభిముఖంగా గార్డురూం వుంది దానిలో కెళ్ళి రిక్షా అతని నెత్తిన వున్న పెట్టె దించాడు అక్కడ చాలా పెట్టెలున్నయ్ గోడలకు మూడుపక్కలా యూనిఫారం బట్టలూ, మఫ్టీ బట్టలు వేలాడుతున్నయ్ సీలలకు రిక్షా అతనికి డబ్బులిచ్చి పంపేశాడు

''సార్, మీ పేరేమిటి సార్?'' అడిగాడు ప్రకాశంకు గార్డు రూం చూపించిన ఆ కుర్ర కానిస్టేబులు అతని స్వరంలో అభిమానం స్పష్టంగా కనిపించి ఆశ్చర్య పోయాడు ప్రకాశం

''ప్రకాశం''

''నా పేరు ఆంజనేయులు''

అతన్ని ఓసారి నిశితంగా చూశాడు ప్రకాశం కుర్రవాడు ఎర్రగా సన్నగా వున్నాడు ముఖంలో అమాయకత్వం కొట్టొచ్చినట్టు కనపడుతోంది ఇంకా చెవులికి బంగారపు పోగులున్నయ్ ముక్కు కూడా కుట్టినట్లున్నారు చిన్నప్పుడు ఇప్పుడు సన్నని గుంటలాగా కనపడుతోంది

''రండి, సెక్షను బల్లదగ్గర కూర్చుందాం'' అన్నాడు ఆంజనేయులు

''సెక్షన్ బల్లంటే ?'' బయటకు నడుస్తూ అడిగాడు ప్రకాశం గార్డు రూములోనుంచి

''సెక్షన్ బల్లంటే ఏమీ లేదు గార్డు డ్యూటీ మినహా మిగిలిన నైటుబీట్లవాళ్ళూ, పగలు సెక్షను డ్యూటీలవాళ్ళు అంతా అక్కడ కూర్చుంటారు గార్డు డ్యూటీలవాళ్ళు మామూలుగా గార్డు రూంలోనే వుంటుంటారు అంతే అన్ని స్టేషన్లలోనూ ఇట్లాంటి బల్లలుండవులెండి అది గవర్నమెంటు ఇచ్చింది కాదు పోయిన సంవత్సరం ఒక బ్రాకెట్టు కంపెనీ ఓనరు చేయించాడు'' అన్నాడు నవ్వుతూ ఆంజనేయులు

ఆ మాటకు ప్రకాశం నవ్వి ఊరుకున్నాడు

బల్ల దగ్గరకెళ్ళి తను డ్యూటీకి రిపోర్టు చేస్తున్నట్టుగా పాస్‌పోర్టు సార్జిన్‌కి ఇచ్చాడు

''ఏమిటీ, డ్యూటీకి రిపోర్టు చేస్తున్నారా?'' అడిగాడు సార్జిన్

''అవును సార్'' అన్నాడు ప్రకాశం

''అయితే లోపలకు వెళ్ళండి లోపల రైటరు గారు వున్నారు జనరల్ డైరీలో రాస్తాడు ఇది బీటు డైరీ'' అన్నాడు సార్జిన్ ప్రకాశం లోపల కెళ్ళాడు

లోపల గదిలో రైటరు వున్నాడు అతని కెదురుగా ఒకతను కూర్చుని డ్యూటీ రోష్టరు వేస్తున్నాడు 'బహుశా డబ్బా రైటరేమో' అనుకున్నాడు ప్రకాశం ప్రకాశం రైటరునుద్దేశించి ''నమస్కారం సార్'' అన్నాడు

తలెత్తి చూశాడు రైటరు ''నమస్కారమండీ ఏమిటి'' అన్నాడు నవ్వుతున్నట్లు

''ఏమీ లేదు సార్ ఇక్కడ కొచ్చాను డ్యూటీకి రిపోర్టు చేస్తున్నాను'' అన్నాడు ప్రకాశం ఆ మాట వినటంతోటే రైటరు ముఖంలో నవ్వు మాయమయింది సీరియస్‌నెస్ ఆ స్థానాన్ని ఆక్రమించింది కొద్ది సేపట్లోనే జరిగిన ఆ మార్పు, అతని అనుభవాన్ని చెపుతోంది ప్రకాశాన్ని ఎగాదిగా చూశాడు ప్రకాశం నవ్వుకున్నాడు మనస్సులో

''వూహూ అలాగా'' అని ప్రకాశం ఇచ్చిన పాస్‌పోర్ట్, స్మాల్ సర్వీసు పుస్తకమూ తీసుకొని, ఓసారి చూచి, నిర్లక్ష్యంగా టేబిలు మీద పడేసి, ''సరే రాస్తాన్లే, వుండండి'' అని తలవంచి పనిలో నిమగ్నమయి పోయినట్లు తల ఎత్తలేదు రైటరు ప్రవర్తన బాధ కలిగించింది మామూలుగానే 'రైటర్లందరికీ సహజంగా వున్న లక్షణం ఇతనిలోనూ వుంది' అనుకొని బైటకొచ్చాడు సంవత్సరాల తరబడి అలవాటయిన ఆ నిరాదరణని అంతగా పట్టించుకోలేదు బైటకొచ్చి సెక్షన్ బల్ల దగ్గర నిలబడ్డాడు

''ఇటు కూర్చోండి'' అన్నాడు ఆంజనేయులు

ప్రకాశం కూర్చున్నాడు నెత్తిమీది టోపీ తీసి బల్లమీద పెట్టాడు

''ఏమండీ ఈ రోజు మంచిదేనా తిథీ అదీ చూసుకుని రిపోర్టు చేశారా?'' అన్నాడు సార్జిన్ డైరీ రాసుకుంటూ ప్రకాశం ఏమీ మాట్లాడలేదు

''ఇవాళ అంత మంచిది కాదనుకుంటా'' అంటూ తిధి వారాలు లెక్క పెట్టటం మొదలు పెట్టాడు ఒక పీసీ

''నా కలాంటి పట్టింపులేమీ లేవు లెండి'' అన్నాడు ప్రకాశం ఆ మాటకు అక్కడున్నవాళ్ళంతా అతనివైపు చూశారు కొద్ది ఆశ్చర్యంగా

''మనకేందండీ మంచీ చెడూ, రాక్షసులకు'' అన్నాడు ఆంజనేయులు నవ్వుతూ

''రాక్షసులమా?!'' అన్నాడు ఒక పీసీ ఆశ్చర్యంగా

''కాక? రాక్షసులం, దెయ్యాలం, రాత్రులందు తిరిగే నిశాచరులం కాక ఎవ్వరం మనం?'' అన్నాడు ఆంజనేయులు

''రాక్షసులకే ఈ పట్టింపు లెక్కువ'' అన్నాడు ఒకతను బొంగురు గొంతుతో

రైటరు దగ్గర ఎదురయిన నిరాదరణకు తోడు వీళ్ళల్లో ఎవరన్నా తనని కులం గురించి అడుగుతారేమో అనే కొద్దిపాటి ఆందోళనతో వాళ్ళతో ఫ్రీగా వుండలేక మౌనంగా కూర్చున్నాడు ప్రకాశం

''రాక్షసులకు తిథీ, వార, నక్షత్రాలు చూచి చెప్పేదెవరు?'' అన్నాడు ఒకతను

''వాళ్ళల్లోనూ ఒక బ్రాహ్మణుడుంటాడనుకుంటా''

''వాడు మాంసం తినడంటావా?''

ఆ మాటకు అంతా నవ్వారు

''ఏమండీ ప్రకాశం గారూ '' లోపల్నుండి కేక వేశారు ఎవరో

''అడిగో, డబ్బా రైటరు పానకాలు పిలుస్తున్నాడు వెళ్ళండి ఏదో తగిలింది డ్యూటీ'' అన్నాడు ఆంజనేయులు

ప్రకాశం టోపీ పెట్టుకుని లోపలికెళ్ళాడు ''ఇదిగో ఈ కవరు తీసుకుపోయి డి పి వో లో ఇచ్చి, అక్కడే లాలాపేట మెయిన్ బజారులో బంగారప్ప అని ఒకతనున్నాడు అతనికి గ్యాసు పొయ్యిలు బాగుచేసే షాపుంది ఆ షాపులో మన యస్సైగారి పొయ్యి బాగుచెయ్యమని ఇచ్చాం అది బాగుచేశారంట అది తీసుకురండి'' అంటూ డబ్బా రైటరు పాస్‌పోర్టూ, కవరూ ప్రకాశంకు అందించాడు అవి తీసుకుని, అతని మాటలు విని వూరుకున్నాడు కొద్దిసేపు ప్రకాశం

తరువాత రైటరుతో, ''సార్, మరి బస్సు వారెంట్లు'' అన్నాడు విన్నగా

''వారెంట్లు లేవూ ఏమీ లేవు'' అని గట్టిగా అని, తిరగి అంతలోనే ''ఏమయ్యా యూనిఫాం మీద వెళుతున్నావు వారంట్లు కావాలా? నేను యూనిఫారం వేసుకున్నానంటే దేశమంతా తిరిగొస్తా'' అన్నాడు లేని నవ్వు తెచ్చుకుంటూ రైటరు

''ఏదో కాస్తో కూస్తో దూరమయితే కండక్టర్లు తీసుకుపోతారు గాని సార్, ఇంత జర్నీ, వారెంటు లేకుండా తీసుకుపోరు సార్ అంత మంది ప్రయాణీకుల్లో కండక్టరు టిక్కెట్టు కొట్టి చేతికిస్తే నోర్మూసుకుని తీసుకుని డబ్బులివ్వాలి లేకపోతే దిగిపోవాలి దిగిపోతే అవమానం'' అన్నాడు ప్రకాశం

ఆ మాటకు చేతిలోని కలం చటుక్కున టేబిలు మీద పెట్టాడు రైటరు ''ఏమయ్యా, వచ్చి అప్పుడే అరగంట కాలేదు, రూల్సు మాట్లాడుతున్నావే సీనియర్ కానిస్టేబులువని రెసుపెక్టు ఇస్తున్నా పోయిరా వచ్చిన రోజే తగాదా ఎందుకు'' అన్నాడు రైటరు బెదిరింపు ధోరణిలో కాస్త స్వరం పెంచి తిరిగి కలం తీసుకుని ఏదో రాసుకోబోతున్నట్లు దృష్టిని పుస్తకం మీద పెట్టాడు రైటరు పెద్దగా అన్న ఆ మాటలకు బయట సెక్షను బల్ల దగ్గర వున్న పీసీలు లోపలికొచ్చారు ప్రకాశంకు కోపం రావటం లేదు కాని చికాకు వేస్తోంది ఇలాటి మనుషుల్ని చూచి చూచి చిన్నగా అన్నాడు

''మీరు నాకు రెస్‌పెక్టు ఇవ్వాల్సిన పనిలేదు కాని సార్, వారెంటు ఇస్తే పోతా లేకపోతే పోలేను'' అని పాస్‌పోర్టు కాగితం టేబులు మీద పెట్టాడు ప్రకాశం రైటరు మింగేశేలా చూశాడు ప్రకాశాన్ని అహం దెబ్బతిన్నట్టు కనపడింది అతని మొహంలో

గది అంతా నిశ్శబ్దం ఆవరించింది

''సరే, అదే విషయం డైరీ ఎంట్రీ పెడతా నువ్వు బయటకు పో'' అన్నాడు రైటరు జనరల్ డైరీని చేతిలోకి తీసుకుంటూ

''వారెంట్లు లేకుండా పొమ్మన్నట్లు కూడా రాయండి దాని సంగతి తరువాత తేలుస్తా'' అన్నాడు ప్రకాశం కాస్త గట్టిగానే

ప్రకాశం ఆ మాట అనగానే చేతిలోని డైరీ టేబిలు మీద పడేశాడు రైటరు ''నువ్వు బలే పేచీకోరు మనిషిలాగా వున్నావే'' అన్నాడు కంగుతిన్నట్లు

''నేనేం పేచీ పెట్టానండీ'' వస్తున్న నవ్వుని ఆపుకుంటూ అన్నాడు ప్రకాశం

''ఏయ్ ఇతన్ని వెయిటింగ్‌లో వుంచి, ఇంకో కానిస్టేబుల్ని పంపించు'' అన్నాడు డబ్బా రైటరు వైపు చూస్తూ రైటరు

''ఇంక ఎవరూ లేరు సార్'' అన్నాడు డబ్బా రైటరు పానకాలు

''ఏమిటయ్యా! గవర్నమెంటు పనిమీద పంపిస్తూ వారంట్లు ఇవ్వటానికి బాధపడతావు ఇచ్చి పంపియ్యి, నీదేం పోయింది'' అన్నాడు బైట సెక్షన్ బల్ల దగ్గరనుండి వచ్చి సార్జిన్

అతనివైపు కొరకొర చూశాడు రైటరు ''నీ బోటి వాళ్ళు వుండబట్టే వీళ్ళుకు కొమ్ము లొస్తున్నాయి'' అన్నాడు

''వారెంట్లు లేకుండా అతను వెళ్ళి వారం రోజుల కొచ్చినా మాట్లాడటానికి వీలులేదు వారెంట్లు ఇవ్వకుండా పంపినందుకు మనకే బండవేస్తారు ఆఫీసర్లు అవసరమొస్తే'' అన్నాడు సార్జిన్

ఆ మాటలు ముళ్ళులాగా గుచ్చుకున్నాయి రైటరుకి ''సరేలే, ఆ మాత్రం నాకు తెలియదనా?'' అని పానకాల వైపు తిరిగి, ''రెండు వారెంట్లు యివ్వు'' అని ప్రకాశం వైపు తిరిగి ''నైటు బీటుకి రావాలి '' అన్నాడు రైటరు

''సూర్యుడు పడమరన పుట్టాలి'' అన్నాడు ప్రకాశం నింపాదిగా ఆ మాటలకు బిత్తరపోయి చూశాడు రైటరు అతనికి స్పృహతప్పే పరిస్థితొచ్చింది

గది అంతా నిశ్శబ్దమై పోయింది అక్కడున్న పీసీ ఎవరూ ఎప్పుడూ అట్లా మాట్లాడి ఎరగరు, విని ఎరగరు ఎన్ని డ్యూటీలు చెబితే అన్ని డ్యూటీలు చెయ్యటమే వాళ్ళు గొర్రెల్లాగా వాళ్లకా మాటలు ఆనందాన్నీ, ఆశ్చర్యాన్నీ కలిగిస్తున్నాయి

''ఏమిటి నువ్వు మాట్లాడేది?'' అన్నాడు రైటరు కుర్చీలోంచి ఉదుటుగా పైకిలేచి

''నువ్వనేది ఏమిటి?'' అన్నాడు ప్రకాశం ఏకవచనాన్ని వాడుతూ రైటరుకు ఏం మాట్లాడాలో అర్థం కాలేదు

''ఎంత నీ సర్వీసు?'' అన్నాడు తల పైకీ కిందకీ వూపుతూ

''నీ కనవసరం నువ్వెవరు నా సర్వీసు గురించి అడగటానికి?'' తుపాకి గుండులా దూసు కొచ్చింది ప్రకాశం గొంతులోనుండి జవాబు

ఆ సంభాషణ వింటున్న వాళ్ళు ఆనందంలో వళ్ళు మరచిపోతున్నారు సార్జిన్ మాత్రం నవ్వుతూ నిలబడ్డాడు రైటరుకు తల కొట్టేసినంత పనయ్యింది స్టాఫ్‌లో అతను కానిస్టేబులుగా వున్నంత కాలం ఆఫీసర్ల ఇళ్ళల్లో ఆర్డర్లీగా చేశాడు సార్జిన్‌గా ప్రమోషన్ వచ్చిం తరువాత ప్రతి స్టేషన్‌లోనూ యస్సై కాళ్ళు పట్టుకొని రైటరుగా కూర్చున్నాడు కానిస్టేబుళ్ళకూ, తోటి సార్జిన్లకు అతనంటే భయం, ఆఫీసర్లకు ఎక్కడ చాడీలు చెపుతాడో అని అందుకే అతనికి అందరూ నమస్కారాలు పెట్టడమూ, లేని అభిమానాన్ని అతని ముందు నటించటమూ చేస్తుంటారు ఎంత అభిమానాన్ని నటిస్తారో, అతని వెనుక అంత క్రోధాన్ని వెళ్ళ గక్కుతారు సహజంగా ఇది అన్నిచోట్లా వుండేదే అయినా, ఈ పద్ధతి ఇక్కడ మరీ ఎక్కువగా వుంది ఈ విధమైన ప్రతిఘటన రైటరు కెప్పుడూ ఎదురు కాలేదు అతని సర్వీసంతా తనకుతాను ఒక చిన్న నియంతలాగా ప్రవర్తిస్తున్న అతని అహానికి ఎదురుదెబ్బ తగిలింది గొంతు తడి ఆరిపోయింది తీవ్రమయిన అవమానం జరిగినట్లు క్రుంగిపోయాడు

''ఎందుకు రావు?'' అన్నాడు

''ఎందుకు రావాలి? ఎన్ని డ్యూటీలు చెయ్యాలి? ఇది డ్యూటీ కాదా? నువ్వు పగలూ రాత్రీ డ్యూటీ చేస్తున్నావా?''

''అవసరమయితే రావాలని రూలుంది ఆంధ్రప్రదేశ్ పోలీసు మాన్యుల్ చదువుకో''

''నువ్వే సరిగ్గా చదువుకో అది అత్యవసరమయిన పరిస్థితి వస్తే , లా అండ్ ఆర్డర్ కంట్రోలు తప్పితే, హత్యలూ, దారి దోపిడీల-- మత కలహాలూ జరిగి సిబ్బందిని మొత్తాన్ని స్టేషన్లోనే ఉంచవలసి వస్తే నువ్వే సరిగ్గా చదువుకో ఇంకో సారి''

''అదే రాస్తాను అయితే''

''రాయి నేనూ రాసి రేప్పొద్దునే యస్పీ కొకటి, డిఐజీ కొకటీ, ఐజీ కొకటి, హోం మినిష్టరు కొకటీ పంపిస్తా తేల్చుకుందాం'' అన్నాడు ప్రకాశం

ఆ మాటతో రైటరుకి కళ్ళు బైర్లు కమ్మాయి రైటరు పరిస్థితిని గమనించిన సార్జిన్ రాజీ ధోరణిలో మాట్లాడాడు ''ఎందుకయ్యా! రెండు వారెంట్లు ఇచ్చి పంపిస్తే పోయేదానికి అందరం ఇక్కడకు పొట్ట చేత్తో పట్టుకొని వచ్చాం ఒకళ్ళ మీద ఒకళ్ళకు అధికారాలేంది అందరం బానిసలమే'' అని ప్రకాశం వైపు తిరిగి, ''వూరుకోండి, మీరు వెళ్ళండి ప్రకాశంగారూ'' అని అతన్ని బైటకు తీసుకువచ్చాడు

రైటరు తన సీట్లో కూలబడ్డాడు ఈ గొడవకు బైటవున్న ట్రెజరీ సెంట్రీ, లోపల సబ్ జైలులో వున్న సెంట్రీ, గార్డు వెయింటింగ్ పీసీలూ అంతా వచ్చి చేరారు అందరూ ప్రకాశాన్ని ఆశ్చర్యంగా, ఆనందంగా, గౌరవంగా చూస్తున్నారు వాళ్ళకి అతనంటే ఒకరకమైనగౌరవం ఏర్పడింది అప్పుడే వాళ్ళ కతనో చిన్నపాటి హీరోగా కనిపించాడు

పానకాలు బయటకు వచ్చి బస్ వారెంట్లూ, కవరు ఇచ్చాడు ''వస్తాన్ సార్'' అని బయట కూర్చునివున్న సెక్షన్ సార్జిన్‌కు నమస్కారం చేసి బయటకు నడిచాడు ప్రకాశం నవ్వుతూ

అతనివైపే చూస్తూ అతను కనుమరుగైనాక ఒకళ్ళ నొకళ్ళు చూసుకుని నవ్వుకున్నారు పీసీ లంతా

''మొత్తం మీద గట్టిపిండమే'' అన్నాడు సెంట్రీ శంకర్రావు తుపాకీ గోడకానిస్తూ

''ఇంతకు ముందు చేసి వచ్చిన స్టేషన్లో ఆఫీసర్లను అల్లాడించి వుంటాడు'' అన్నాడు ఆంజనేయులు నవ్వుతూ

''అసలు డ్యూటీలు చెప్పేవాళ్ళో కాదో ఇతనికి దడిచి'' అన్నాడు ఒకతను

''అసలిలాంటి మనిషి స్టేషను కొకళ్ళున్నా వుంటేగాని, లేకపోతే ఆఫీసర్ల ఆగడాలు, ఇదిగో ఇట్లాగే వుంటయ్'' అన్నాడు ఒకతను

''మొత్తంమీద గొప్ప ధైర్యవంతుడు నేనిట్లా మాట్లాడేవ్యక్తిని ఇంతవరకు చూడలేదు సార్జిన్‌గారు సర్దకపోతే ఎంతదూరం పోయేదో'' అన్నాడు సార్జిన్ వైపు చూచి నవ్వుతూ ఒకతను

''ఆ ఎంత దూరం పోయిద్ది రైటరే నోరు మూసుకుని వూరుకోవాల్సివచ్చేది అతను రీజన్‌గానే మాట్లాడుతున్నాడు'' అన్నాడు సార్జిన్ చిన్నగా

''బాగానే వుందిగానీ, ఇలాటి వాళ్ళకు అన్నీ సమస్యలే ఆఫీసర్లు బ్రతకనివ్వరు సంచార జీవితాలే వీళ్ళవి ఇతనీ వయస్సులోనే ఇలాగుంటే ఇక కుర్రతనంలో జనాన్ని బతకనిచ్చి వుండడు వయస్సెంత వుంటుందంటారూ? గడ్డం మీసాలు అన్నీ బాగా తెల్లబడిపోయాయి'' అన్నాడు ఒకతను

ఆ రోజంతా వాళ్ళు అదే విషయాన్ని గురించి మాట్లాడుకున్నారు రైటరుకు జరిగిన అవమానం వాళ్ళకెంతో ఆనందంగా వుంది జరిగిన సంఘటన గురించి వాళ్ళల్లో వాళ్ళు గుసగుసలాడుకున్నారు అది జరిగినప్పుడు అక్కడలేని వాళ్ళకు చిలవలు పలవలు చేసి చెప్పారు

అంతకు ముందెన్నడూ ప్రాక్టికల్‌గా అటువంటి సంఘటన జరగనందువలన, అది వాళ్ళను చాలా వుత్తేజపరిచింది బాగా ఆకర్షించింది

''రైటరు నా కొడుకు చచ్చాడు మీరు గమనించారా?'' అన్నాడు శంకరరావు

''అవునవును వాడి ముఖం నల్లగా మాడిపోయింది ఇతను మన స్టేషన్లో వుంటే రైటరూ, యస్సైలు కొద్దిగా కంట్రోల్లో వుంటారు'' అన్నాడు ఒకతను

''అతన్ని ఈ యస్సై ఇక్కడ వుండనియ్యొద్దూ! ఈ రైటరుగాడు పోయి లేనిపోని చాడీలన్నీ ఇతనిమీద యస్సైకి చెపుతాడు యస్సై తన బలం చాలదనుకుంటే సి ఐ కి చెపుతాడు వాళ్ళిద్దరూ కలసి ఓ రిపోర్టు తయారుచేసి, డియస్పీతో రికమెండ్ చేయించి యస్పీకి పంపిస్తారు ట్రాన్స్‌ఫర్ రెడీ డిపార్టుమెంటులో ఎంతటి వెధవనైనా ఆఫీసర్లు సహిస్తారు కాని, చట్టం గురించి మాట్లాడేవాడిని వాళ్ళు ఎంతమాత్రం ఒప్పుకోరు కదా! పైగా మనం చట్టాన్ని సంరక్షించే వాళ్ళం మనకు చట్టపరమైన రక్షణ లేదు ఇతనెక్కడా పట్టుమని పదినెలలు ఉద్యోగం చెయ్యలేదు నేనువిన్నాను ఇతని గురించి ఇతన్ని అంతా 'లా' ప్రకాశం అంటారు ఎందుకంటే ఎప్పుడూ లా ప్రకారం డ్యూటీ చెయ్యాలంటాడు'' అన్నాడు ఒక సీనియర్ పీసీ

''ఇతనేనా లా ప్రకాశం అంటే! నేనూ విన్నా అబ్బో సామాన్యుడు కాడంట'' అన్నాడు ఒకతను ఆశ్చర్యం వ్యక్తం చేస్తూ

''నేనూ విన్నా ఇతని గురించి అట్లాంటోళ్ళు ఎన్నిరోజులుంటే మాత్రమేమిటండీ చేసిన నాలుగు రోజులు కింగే కదా అతన్ని చూచి ఆఫీసర్లు భయపడే స్థితిలో వున్నారంటే ఏమిటి?'' అన్నాడు ఇంకొకతను

''ఏం లాభం 'లా' మాట్లాడి ఎంతకాలం తిరుగుతావట్లాగ, సట్టీ తట్టా సంకన పెట్టుకుని'' అన్నాడు ఒక సీనియర్ పీసీ

వాళ్ళ సంభాషణ అలా చాలాసేపు సాగింది

రాత్రి ఎనిమిది గంటలకు గ్యాసు పొయ్యి తీసుకుని రిక్షాలో వేసుకుని స్టేషను కొచ్చాడు ప్రకాశం పాస్‌పోర్టూ, బస్సు వారెంటూ దారంతో కలిపి కట్టి రైటరు బల్ల మీద పెట్టాడు గ్యాసుపొయ్యి రైటరు రూంలో పెట్టించాడు రిక్షా అతనికి డబ్బులిచ్చి పంపేశాడు రైటరుకు సెల్యూట్ కూడా చెయ్యలేదు అక్కడే నిలబడ్డాడు

''ఏమిటి?'' అన్నాడు రైటరు కొరకొరా చూస్తూ

''రిక్షా చార్జీలు అయిదు రూపాయలు అయినయ్, ఇవ్వండి'' అన్నాడు ప్రకాశం అతను రైటరు రూంలోకి రాగానే అక్కడున్న పీసీలు బిలబిలమంటూ గడప దగ్గరకు చేరారు వాళ్ళకు అది వినోదంగా, వుత్తేజంగా వుంది

''రిక్షాకు అయిదు రూపాయలిచ్చావా?'' నమ్మలేనట్టు, ప్రకాశం అబద్ధమాడుతున్నట్టు మాట్లాడాడు రైటరు కళ్ళు ఆర్పుతూ

''లేకపోతే అర్ధరూపాయికే అయిద్దనుకున్నావా? పోలీసు ఆఫీసు నుండి మెయిన్‌బజారు దగ్గరకు, అక్కడనుండి బస్టాండుకి, బస్సులో లగేజి, బస్సు దిగినాక ఇక్కడిదాకా, ఇవన్నీ ఎంతయిద్ది?'' అన్నాడు రైటర్ని వెర్రివాణ్ణి చేస్తున్నట్టు వ్యంగ్యంగా రైటరు గుక్క తిప్పుకోలేక పోయాడు ఆ వ్యంగ్యానికి

''బస్టాండు నుండి పోలీసు స్టేషనుకు ఎంత దూరం వుందని?''

''ఎంత దూరమున్నా లేకపోయినా పొయ్యి భుజాన పెట్టుకుని రమ్మంటావా, పైగా యూనిఫారం మీద నాకు ఆ అలవాటు సర్వీసు మొదటినుండీ లేదు ఒక రూపాయి పారేస్తే వాడే తెస్తాడు'' అన్నాడు ప్రకాశం

''అయితే మాకేనంటావా యూనిఫారం మీద మూటలు మోసే అలవాటు?''

''నేను నిన్ననలేదు నా సంగతి చెప్పా ముందు డబ్బులివ్వు'' అన్నాడు చిరాగ్గా

''అయ్యగారు లేరు వచ్చినాక అడిగిస్తా'' అన్నాడు రైటరు

''నువ్విచ్చి ఆయన్నడిగి తీసుకో నేనిప్పుడు హోటల్‌కు పోయి భోంచేయాలి వున్న అయిదు రూపాయలూ రిక్షాకు అయిపోయాయి నువ్వు చెపితే చేశా కాని, అయ్యగారు చెపితే కాదు''

రైటరు ఒకసారి ప్రకాశం వైపు చూచి తలదించుకున్నాడు

వాళ్ళ సంభాషణ వింటూ ముసిముసి నవ్వులు నవ్వుతున్నారు వాకిట్లో నిలబడ్డవాళ్ళు జేబులోంచి అయిదురూపాయల నోటుతీసి విసురుగా టేబులుమీద వేశాడు రైటరు అది తీసుకుని ఇవతలకు వచ్చాడు ప్రకాశం

''గురూగారూ, రైటరు దగ్గర డబ్బులు తీసుకున్న మొగాళ్ళు మీ రొక్కళ్ళే మాకు కనపడింది'' అన్నారు అక్కడున్న పీసీలు ప్రకాశం నవ్వుతూ గార్డు రూంలోకి వెళ్ళాడు యూనిఫారం విప్పి ఖాళీగా వున్న ఒక మేక్కు తగిలించి, పెట్టె తెరిచి లుంగీ, టవలూ, డ్రాయరు తీసుకుని, సబ్బుపెట్టె చేత పట్టుకొని స్నానానికి బైటకెళ్ళాడు పంపు దగ్గర స్నానం చేసివచ్చిన తరువాత ఆంజనేయులు వచ్చి పలకరించాడు పంపు నీళ్ళు పోసుకోవడం కష్టమయ్యింది

''భోజనహోటల్ ఏది బావుంటుందయ్యా?'' అడిగాడు ప్రకాశం

''రండి నేను చూపిస్తా అయ్యరు హోటలు బాగుంటది'' అని ఆంజనేయులు బయలుదేరాడు దారిలో ఇద్దరూ పిచ్చాపాటి మాట్లాడుకుంటూ హోటల్‌కు చేరారు ప్రకాశాన్ని హోటలతనికి పరిచయంచేస్తూ, ''కన్సెషన్ ఇవ్వండి'' అన్నాడు ఆంజనేయులు ప్రకాశం భోజనం చేసిందాకా అతను బయట కూర్చుని పేపరు చూశాడు తరువాత ఇద్దరూ స్టేషనుకు బయలు దేరారు

''ఈ విధమైన ప్రవర్తన వలన బాగా దెబ్బ కదండీ'' అన్నాడు ఆంజనేయులు

ఆ మాటకు ప్రకాశం నవ్వాడు ఇద్దరూ మాట్లాడుకుంటూ వచ్చారు ఆంజనేయులు ఇంటి కెళ్ళిపోయాడు

ఆ రాత్రి సబ్‌జైలు వరండాలో పడుకున్నాడు ప్రకాశం అతను నిద్రపోయిందాకా అనేక విషయాలు మాట్లాడారు తోటివాళ్ళు తెల్లవారి లేచి కాలకృత్యాలు తీర్చుకొని ఏడుగంటలకల్లా రోల్‌కాల్‌కు వెళ్ళాడు రోల్‌కాల్‌లో నెంబర్లు పిలుస్తూ యస్సై అతన్ని ఎగాదిగా చూశాడు ప్రకాశం కూడా ఇంచుమించు అలాగే చూశాడు యస్సైని మళ్ళీ ఏదన్నా ఘర్షణ జరిగిద్దేమోనని అను కున్నారు అంతా అలా జరిగితే చూడాలని వువ్విళూరుతున్నట్టు కనపడ్డారు యస్సై ప్రకాశం వైపు ఎంత సీరియస్‌గా చూశాడో, ప్రకాశం అంత నిర్లక్ష్యంగా చూశాడు యస్సై వైపు

''ఏం పేరు?''

''ప్రకాశం''

''సర్వీసెంత?''

''ఇరవై దాటాయి సార్''

''ఎన్నో స్టేషన్ ఇది?''

''పదమూడో, పద్నాలుగో''

''అయితే పెద్ద రికార్డే వుందీ!''

''ఆఁ''

ఆశ్చర్యంగా చూశాడు యస్సై ఆ సమాధానానికి ''ఇక్కడ ఎవడి డ్యూటీలు వాడు చేసుకోవటమే ఒకళ్ళ విషయంలో ఇంకొకళ్ళు వేలు పెడితే తోక కత్తిరించటమే'' అన్నాడు యస్సై బెదిరింపుగా, అతన్ని ఒక వూపు వూపాలని

''నేనూ అంతే లేని అధికారం చెలాయించాలనిచూస్తే, తోక కత్తిరించి సున్నం పెడతా వూరక వదిలిపెట్టను నే ననవసరంగా ఒకళ్ళ జోలికి పోను నా జోలికెవరన్నా వస్తే వూరుకోను, దేవుడైనా'' అన్నాడు ప్రకాశం

అక్కడున్న వాళ్ళంతా ఆశ్చర్యంగా విన్నారు ఆ మాటలు అలా ఒక కానిస్టేబులు ఒక యస్సై ముందు మాట్లాడటం చాలా చాలా అరుదైన విషయం వాళ్ళ దృష్టిలో యస్సైకయితే అసలటువంటి వ్యక్తి తారసపడటమే ప్రధమం అతని మాటలు యస్సైకి కంగారు పుట్టించాయి కాని పైకి మాత్రం మేకపోతు గాంభీర్యాన్ని ప్రదర్శించాడు అందరు యస్సైలలాగా

''ఆ ఇకచాలు ఆపు లెక్చర్లివ్వటానికి ఇదేం పబ్లిక్కు బజారు కాదు పోలీసుస్టేషను మనది డిసిప్లైన్ ఫోర్సు ఎవడిష్టమొచ్చినట్లు వాడు మాట్లాడకూడదు'' అన్నాడు కోపాన్ని ఆపుకుంటూ యస్సై

''ఆ సంగతి డిపార్టుమెంటులో చేరినప్పుడే తెలిసింది కాని నా పద్ధతేమిటో చెప్పాలి కాబట్టి చెప్పాను'' అన్నాడు ప్రకాశం తనంతట తానేమీ మాట్లాడేదిలేదనీ, ఎదుటివాళ్ళు మాట్లాడితే తను తప్పకుండా మాట్లాడతాననే అర్థం వినపడింది అందులో

యస్సై ఇంకేమీ మాట్లాడలేదు మాట్లాడితే ప్రకాశం వూరుకునే లాగా కనిపించలేదు మాట్లాడి మిగతా వాళ్ళల్లో తేలికవటం ఇష్టంలేక వూరుకున్నాడు

అక్కడున్నవాళ్ళంతా ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూసుకుని ఆనందంగా ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు ప్రకాశం చెప్పిన సమాధానంతో కోపం పట్టలేక లోపల్లోపల ఉడికిపోయాడు యస్సై రఫ్‌డ్యూటీరోస్టర్‌ని చూస్తున్నట్లు తల ఎత్తకుండా అలాగే కూర్చున్నాడు ప్రకాశం అన్నమాటలు యస్సై అహాన్ని దెబ్బతీశాయని అంతా తెలుసుకున్నారు

తరువాత కొంచెం సేపటికి ఎవరి డ్యూటీ వాళ్ళకు చెప్పి పంపివేశాడు యస్సై అంతా బయటకు వచ్చారు డబ్బా రైటరు పానకాలు వచ్చి, ''నీకు గార్డు డ్యూటీ వేశాం, పోయి అతన్ని రిలీవ్ చేయండి'' అన్నాడు ప్రకాశం వెళ్ళి గార్డు ఆఫీసరు దగ్గర సబ్ జైలులో రిపోర్టు చేశాడు

''మీరు పోయి బైట వున్న ట్రెజరీగార్డు సెంట్రీని రిలీవ్ చేయండి'' అన్నాడు గార్డు ఆఫీసరు ప్రకాశం సెంట్రీ రిలీఫ్ బుక్కులో సంతకం చేసి వెళ్ళి బైట సబ్‌ట్రెజరీకి సెంట్రీగా వున్న కానిస్టేబుల్‌ని రిలీవ్ చేశాడు తొమ్మిది గంటలకల్లా పహారా దిగిపోయాడు ప్రకాశం యూనిఫారం విప్పి, మఫ్టీ వేసుకుని బైటకొచ్చాడు గార్డు ఆఫీసరు టీ తాగుతూ కనపడితే అతన్ని ఇంటి గురించి వాకబు చేశాడు, అద్దె ఇల్లు కావాలని ప్రకాశం

''ఎంతలో కావాలి ?'' అడిగాడు గార్డు ఆఫీసరు

''ఆ ఎంత మనకొచ్చే హౌస్‌రెంట్ ఎలవెన్సుకి ఒక పది అటు ఇటుగా''

''ఆ రేటు కయితే మరీ దరిద్రపు కొంపలే మనకి దొరికేది పేరుకు మనకి గవర్నమెంటు అద్దె అలవెన్సు ఇస్తుందనే గానీ, ఆ ఇంటి అద్దె ఏమూలకి సరిపోయిద్ది? పైగా ఇక్కడ ఇళ్ళకు విపరీతమయిన గిరాకి పైగా క్యాస్ట్ ఫీలింగు మీరు క్రిష్టియన్లా?'' అన్నాడు గార్డు ఆఫీసరు ఔనన్నట్లు తల వూపాడు ప్రకాశం

''మేమూ అదేలేండి మీరు క్రిష్టియన్‌పాలెంలోగాని, రైలు పేటలోగాని, లేకపోతే ఇటు కొత్తపేటలోగాని ప్రయత్నించండి మన స్టేషనుకు ఇటువైపున వున్నవన్నీ ఆ పేటలే మిగతా చోట్ల అద్దె ఎక్కువ పైగా క్యాస్టు ఫీలింగు ఎక్కువ'' అన్నాడు అతను

ప్రకాశం టౌనులో కొద్దిసేపు అటూఇటూ తిరిగాడు మధ్యాహ్నం భోజనం చేసుకుని పన్నెండు గంటలకల్లా స్టేషనుకొచ్చాడు

''మీరు కోర్టుకెళ్ళి అక్కడున్న ఇద్దరు పీసీలని రిలీవ్‌చెయ్యాలండి'' అన్నాడు గార్డు ఆఫీసరు ఉదయం ఆరుగంటల నుండి తొమ్మిదింటి వరకూ పహారా చేసి వెళ్ళి తనలాగే మూడు గంటలు రెస్టు తీసుకొని వచ్చిన రెండవ పీసీతో కలిసి కోర్టుకెళ్ళాడు ప్రకాశం అక్కడున్న ఇద్దరు పీసీలని వీళ్ళిద్దరూ రిలీవ్‌చేశారు వాళ్ళ దగ్గరున్న తుపాకులూ, తూటాలూ తీసుకుని వాళ్ళు సబ్ జైలునుండి కోర్టుకు తీసుకు వెళ్ళిన ఖయిదీని స్వాధీన పరుచుకొన్నారు కోర్టు వరండా అంతా కిటకిట లాడుతోంది లోపల నల్లకోట్లు తొడుక్కుని ప్లీడర్లు కూర్చుని వున్నారు అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఏదో కేసు వాదిస్తున్నాడు

సబ్ జైలునుండి తీసుకువచ్చిన ఖయిదీ కొరకు అతని భార్యా, పిల్లలూ వచ్చారు కోర్టు వరండా గోడకానుకుని కూర్చుని, పిల్లల్ని వళ్ళో కూర్చోబెట్టుకుని ఖయిదీ అతని భార్యతో మాట్లాడుతున్నాడు కోర్టుకు వచ్చిన జనం కొంతమంది ఆ ఖయిదీని విచిత్రంగా చూస్తున్నారు ప్రకాశమూ, రెండో పీసీ అక్కడకు వెళ్ళే సరికి అప్పటిదాకా ఖయిదీ దగ్గర కూర్చున్న ఆ ఆడమనిషి దూరంగా జరిగింది అప్పటివరకూ వాళ్ళు మాట్లాడుకుంటూవున్నా, మళ్ళీ ఇప్పుడొచ్చిన కొత్త పోలీసుల పర్మిషన్ కూడా తీసుకోవాలి కాబట్టి, ఖయిదీ వీళ్ళవైపు చూస్తూ ''అయ్యగారూ, ఒక్కమాట మా ఆడవాళ్ళతో మాట్లాడతానండీ'' అన్నాడు

ఆ మాటకు ప్రకాశం ఏమీ మాట్లాడలేదు రెండో పీసీ విసుకున్నాడు ''తగలబడండి తొందరగా'' అన్నాడు ప్రకాశం ఆమె వైపు చూశాడు

ఆమె భర్త దగ్గరకు బెరుకు బెరుకుగా జరిగింది ఎందుకో ఆమెకు ఏడుపు వస్తోంది వస్తున్న ఏడుపుని ఆపుకోవటానికి ప్రయత్నం చేస్తోంది ఆ ప్రయత్నంలో గడ్డంమీది చర్మం ముడుతలు పడుతోంది ''మెమ్మా, మెయ్యా, మమ్మల్ని ఇంటిలోనుంచి నెట్టేశారు'' అంది కళ్ళవెంట కారుతున్న కన్నీరు, తలవంచుకుని కూర్చున్న ఆమె ముక్కు చివరనుండి బొట్లు బొట్లుగా కారుతోంది మురికిపట్టి, మాసికలేసిన చీర చెంగుతో ముక్కు తుడుచుకుంది

''ఊరుకో'' అన్నాడు ఖయిదీ, ఎన్నో రోజులనుండి తైల సంస్కారం లేకుండా వున్న ఆమె చింపిరి తలమీద చెయ్యివేసి ఆమె చెప్పిన మాటలు అతనికి కోపాన్ని కలిగించాయి కోపంతో పళ్ళు కొరికాడు ''మరి ఇప్పుడేడుంటున్నా?'' అన్నాడు

''ఆడే రోజుకొకళ్ళ .ంచన జేరి వుంటున్నా వూళ్ళోకి పోయి ఇంత అడుక్కొచ్చుకుని పిల్లలకి పెడుతున్నా'' అంది ఆమె

అక్కడున్న జనం చాలామంది వాళ్ళని వింతగా చూస్తున్నారు

''ఈసారి వాయిదాతో అయిపోవచ్చులే నేను బయటికి వచ్చినాక గాని నా కొడుకుల పని సెప్పను '' అన్నాడు అతను కోపం పట్టలేక పెద్దగా

''ఏయ్ ఏంది అరుపులు చిన్నగా'' అన్నాడు ప్రకాశం

''ఏం దొరా కడుపు మండుతోంది దోసుకొచ్చి పెట్టినన్నాళ్ళు తిన్నారు నా సొమ్ము ఎన్ని సెవర్ల బంగారం ఆళ్ళ మొకాన కొట్టానో నేను నాలుగు రోజులు జైల్లో వుంటే నా పెళ్ళాం పిల్లలకి ఇంత తిండి పెట్టలేకపోయారు వాళ్ళు ఇంకేం తల్లిదండ్రులు నా తమ్ముడికి నేను దోసుకొచ్చి పెళ్ళిచేశా అడికి ఆ మాత్రం యిశ్వాసం కూడా లేదు'' అన్నాడు అతను బాధగా, కోపంగా

''అంతేరా ఈ లోకం పెట్టినంత కాలం తింటారు మనకి పెట్టాల్సివత్తే ఎంగిలి మెతుకులు కూడా ఇదిలియ్యరు '' అన్నాడు రెండో పీసీ సాయంత్రం నాలుగు గంటల వరకూ ఎస్కార్టు ఖయిదీని పిలవలేదు నాలుగు గంటలకు పిలిచి వాయిదా వేశాడు మెజిస్ట్రేటు తిరిగి వీళ్ళు సబ్ జైలుకు బయలుదేరారు ఖయిదీ భార్య, ఖయిదీకి బీడీకట్ట తెచ్చిచ్చింది అందుకు రెండో కానిస్టేబులు వూరుకోలేదు ఆ ఖయిదీ ప్రకాశం ముఖంవైపు బిక్కుబిక్కుమంటూ చూశాడు

''పోనీలేండి'' అన్నాడు ప్రకాశం రెండో పీసీతో

''మీకు తెలవదు వూరుకోండి ప్రకాశంగారు ఆళ్ళకి బీడీలకూ, వాటికీ, మాట్లాడుకోవటానికీ మనం పర్మిషన్ ఇవ్వాలి కానిస్టేబులికి కాఫీ తాగమని రెండురూపాయలు ఇవ్వటానికి వాళ్ళకు చేతులు రావు మనమిక్కడ వూరుకున్నా అక్కడ సెంట్రీ అన్నీ సోదాచేసి బైటపారవేస్తాడు'' అన్నాడు

''బాబా! మీ రుణం వుంచుకోవులే సామీ ఈ సారి వాయిదా కొచ్చినప్పుడు ఇత్తాంలే సామీ'' అంటూ ఆమె వాళ్ళ వెనకే దండం పెడుతూ వెంట పడింది ఆమె వెనక ఇద్దరు చిన్నపిల్లలు వస్తున్నారు ప్రకాశం ఏమీ మాట్లాడలేదు రోడ్డుమీద వెళ్ళేవాళ్ళు తమని అలా చూడటం ప్రకాశానికి సిగ్గుగా వుంది 'పోనీలే తీసుకోనియ్యండి' అని గట్టిగా రెండో పీసీకి చెపితే బాధపడతాడేమోనని సంశయిస్తూ, ఆ ఆడమనిషిని గట్టిగా హెచ్చరించి రావొద్దనీ, బీడీకట్ట ఇవ్వొద్దనీ అనలేక మెదలకుండా వూరుకున్నాడు

''దొరా! తీసుకుంటా బీడీల్లేక సచ్చిపోతన్నా'' అన్నాడు ఖైదీ రెండో పీసీతో

''సరే అఘోరించు నీయమ్మ దరిద్రపు '' తిట్టాడు రెండో పీసీ

ఆ ఖైదీ నవ్వుకుంటూ భార్య దగ్గరనుండి బీడికట్ట అందుకున్నాడు ''పిల్లల్జాగర్తే'' అన్నాడు భార్యతో

ఆమేమీ మాట్లాడకుండా అక్కడే ఆగిపోయింది అతన్ని సబ్‌జైలుకు తీసుకొచ్చారు సెంట్రీ ఖయిదీని చెక్‌చేస్తుంటే ప్రకాశంతో పాటు వచ్చిన పీసీ, సెంట్రీతో ''వాడేదో బీడీ కట్ట తెచ్చుకున్నాడులే పోనీయ్'' అన్నాడు పుస్తకంలో రాసి అతన్ని స్వాధీనపరచుకున్నట్టు సంతకం పెట్టాడు సెంట్రీ తరువాత లాకప్‌లో వేశారు

''ఎక్కడికీ పోగాకండి ఖయిదీలని దొడ్డికి తీయాలి వంట కూడా అయిపోయింది'' అన్నాడు గార్డు ఆఫీసరు ప్రకాశంతో

ఖయిదీలను సాయంత్రపు రెస్ట్‌కు తీశారు బయటకు ఉదయం పూట ఓ గంట, సాయంత్రం పూట ఓ గంట ఖయిదీలను లాకప్పులో నుంచి బయటకు తీస్తారు ఆ కాలాన్ని 'వరండా రెస్ట్' అని పిలుస్తారు అప్పుడే వాళ్ళు కాలకృత్యాలు తీర్చుకొని, స్నానాలూ భోజనాలు పూర్తి

చేసుకుంటారు బయటకు వచ్చిన వాళ్ళు అక్కడక్కడ కూర్చునీ, నిలబడీ కబుర్లు చెప్పు కుంటున్నారు అంతకు ముందు కోర్టుకెళ్ళి వచ్చిన ఖయిదీ దగ్గర బీడీలు అడుక్కోవటానికి అతనిచుట్టూ చేరారు చాలామంది వరండా రెస్టుకు తీసినప్పుడు కాపలా వున్నట్టు సెంట్రీ పుస్తకంలో సంతకం పెట్టించుకున్నాడు గార్డు ఆఫీసరు మిగిలిన పీసీ లతో పాటు ప్రకాశంతో కూడా తరువాత ఒక అరగంటకు వంటగదిలో నుండి వంట వండే ఇద్దరు ఖయిదీలు అన్నంమూటా, పులుసు డేగిశా తీసుకొని లోపలకు వచ్చారు అప్పుడు ఎంత టైము అయిందో ఆ టైము వేసి సెంట్రీ పుస్తకం రాసి, పీసీ లందరి చేతా సంతకాలు చేయించుకున్నాడు గార్డు ఆఫీసరు పీసీలంతా తలా పది తూటాలూ, తలా ఒక తుపాకీ తీసుకుని బయటకెళ్ళారు సబ్‌జైలుకి వెలుపల వున్న స్థలంలో చుట్టూ ఏడడుగుల ఎత్తున గోడ వుంది ఖాళీ స్థలంలో గోడకు దగ్గరగా, ఎప్పుడో బ్రిటీష్ వాళ్ళ కన్నా ముందు ఎవరో కట్టించినట్టున్న, సిధిలమయిపోయిన పాయిఖానా దొడ్డి దానికి చుట్టూ ముళ్ళ చెట్లు దట్టంగా పెరిగివున్నయ్ తుపాకులు పట్టుకొని ప్రహరీగోడ చుట్టూ లోపలి ప్రక్క దూరదూరంగా నిలబడ్డారు పీసీలు అంతా సిద్ధంగా నిలబడ్డాక సబ్‌జైలులోని ఖయిదీలను అక్కడే ఖాళీస్థలంలోనే వరుసగా కూర్చోబెట్టి లెఖ్ఖ సరిపోయిన తరువాత లోపలకు తీసుకువచ్చారు మిగిలిన పీసీలంతా లోపలకు వచ్చి గార్డురూంలో తుపాకులూ, తూటాలూ పెట్టారు ఖయిదీలంతా స్నానాలు చేసి, భోజనాలు చేసి, పంపుదగ్గర చిన్న కుండలతో నీళ్ళు పట్టుకొని తమతమ సెల్స్‌లో పెట్టుకున్నారు వాళ్ళు లోపలకు వెళ్ళిన తరువాత వార్డెన్ వచ్చి అన్ని కొట్లకూ తాళాలు వేశాడు సెంట్రీవెళ్ళి, అన్ని కొట్ల తాళాలు లాగి చూసుకుని, ఖయిదీలందర్నీ లెఖ్ఖ పెట్టుకొని, సెంట్రీ పుస్తకంలో సంతకం పెట్టాడు

అప్పటికి అయిదున్నర దాటింది గాలి చలిగా వుంది స్నానం చేస్తే బావుండు ననుకున్నాడు ప్రకాశం కాని పంపునీళ్ళు మరీ చల్లగా వున్నయ్ జలుబు చేస్తుందేమో అనుకొని కాళ్ళూ, చేతులూ, ముఖం కడుక్కొని, అటు రోడ్డుమీద కెళ్ళి టీ తాగివచ్చాడు యూనిఫారం వేసుకుని సెంట్రీ పుస్తకంలో సంతకం పెట్టి వెళ్ళి సెంట్రీని రిలీవ్ చేశాడు సెంట్రీ దగ్గర నుంచి తుపాకీ, తూటాలు తీసుకున్నాడు వళ్ళంతా చెమటగా వుండి చికాకు వేస్తోంది స్టేషను ముందు ఏమంత జనసంచారం లేదు చలిరోజులు కావటంవలన అప్పటికే పొద్దుగూకింది కుటుంబాన్ని వదిలిపెట్టి రెండురోజులు అవుతోంది అలా కుటుంబాన్ని వదిలిపెట్టి ఇలా డ్యూటీ చేసే సందర్భాలు అతని సర్వీసులో ఎన్నివేలో అయినా ఆ పరిస్థితికి అతను అలవాటు పడలేదు

మనస్సంతా గుబులుగా వుంది ఇంటిదగ్గరి పరిస్థితి గుర్తుకొచ్చింది మనస్సు కలత చెందింది నీరసంగా పాలిపోయిన ముఖంతో, పీక్కుపోయిన కళ్ళతో, తిరిగే ఓపిక కూడా లేక, దగ్గుతూ మంచంలో వున్న భార్య కళ్ళముందు కదిలింది దీర్ఘంగా నిట్టూర్చాడు ఇలా ఒంటరిగా వున్నప్పుడు గతించిపోయిన జీవితాన్ని నెమరు వేసుకోవటం అలవాటయ్యింది బాగా దీర్ఘాలోచనలో మునిగిపోయినట్లు తల దించుకున్నాడు అతని చూపులు చేతిలో వున్న తుపాకీమీదా, దానికి వున్న బాయినెట్ మీదా నిలబడిపోయాయి సంవత్సరాల తరబడి గాఢమైన స్నేహం వున్న నేస్తం వైపు చూస్తున్నట్లు ఆ తుపాకీవైపు చూస్తున్నాడు అతనికి తెలియకుండానే కళ్ళు నీటితో నిండాయి తన ఆప్తమిత్రుడి ముందు కష్టసుఖాలను వెళ్ళ బోసుకుంటున్నట్లు బాయినెట్‌ని చేత్తో గట్టిగా పట్టుకున్నాడు

మనసంతా భార్యాపిల్లల చుట్టూ గిరికీలు కొడుతోంది 'తొందరగా ఇల్లు దొరికితే బాగుండు,

పోయి పిల్లల్ని తీసుకురావచ్చు' అనుకున్నాడు భార్యని గుర్తు తెచ్చుకుంటూ

ఆకాశంలో వెలుగు రేఖలు పూర్తిగా క్షీణిస్తున్నాయి స్టేషను ఎదురుగా వున్న చెట్లమీద పక్షులు గోలగోలగా అరుస్తూ ఎగురుతున్నయ్ రోడ్డుమీద రిక్షా అతను గట్టిగా గంట మోగిస్తూ రిక్షా తొక్కుతున్నాడు కళ్ళద్దాలు తీసి చేతిగుడ్డతో కళ్ళు ఒత్తుకున్నాడు ప్రకాశం

'ఈ జీవితానికి విముక్తి ఎప్పుడో? చావబోయేలోగా సుఖపడేయోగముందో లేదో' అని నిట్టూర్చాడు ప్రకాశం ఆరుగంటలకు పహారా దిగిన పీసీ ఇంటికెళుతూ ప్రకాశాన్ని పలకరించాడు

''ఏమిటి ఆలోచిస్తున్నారు? ఇక్కడ నచ్చలేదా?'' అన్నాడు చిన్నగా తలెత్తి అతనివైపు చూశాడు ప్రకాశం నవ్వాడు వేదాంతిలాగా

''మనకు నచ్చినా నచ్చకపోయినా తప్పేదేముంది మన చేతిలో ఏముంది ఆఖరికి గట్టిగా గాలి పీల్చుకోవటానికి కూడా వీలులేని పరిస్థితి మనది'' అన్నాడు ప్రకాశం

''అవును మన బదుకులింతే దేవుడు మన నొసటన అట్లా రాశాడు '' అన్నాడు అతను

''దేముడు కాదు ఆఫీసర్లు వాళ్ళే మన బతుకుల్ని శాసించేది మధ్యలో దేవుడేం చేశాడు పాపం చేసేదంతా వీళ్ళే కీలుబొమ్మలాటలాడించే వాళ్ళు, బొమ్మల కాళ్ళకీ, చేతులకి దారాలు కట్టి తెరవెనక వుండి వాటిని ఆడించినట్లు, మన ఆఫీసర్లు మనల్ని అట్లా ఆడిస్తున్నారు వాడు నడవమంటే నడవాలి, కొట్టమన్నవాడిని కొట్టాలి, సెల్యూట్ చెయ్యమంటే చెయ్యాలి, డ్యూటీ చెయ్యమన్నంతసేపు చెయ్యాలి నోరెత్తటానికి వీలు లేదు కాదంటావా?'' అన్నాడు ప్రకాశం

అతను ఆశ్చర్యంగా విన్నాడు ''మీరు చాలా బాగా చెప్పారండి'' అన్నాడు

''ఎవరయినా చెప్పొచ్చు ఇందులో ఏముంది బ్రహ్మాండమయిన విషయం రోజు మనం చూస్తున్నదీ చేస్తున్నదీ అదేగా'' అన్నాడు ప్రకాశం

''అవునవును కానీ ఎంతమంది ఇలా ఆలోచిస్తున్నారు మనోళ్ళు'' అన్నాడు అతను సైకిలు ముందుకు నడిపిస్తూ ''అయినా మనం చెయ్యగలిగింది మాత్రం ఏముంది ఇవి మార్చటానికి వీలుకాని పరిస్థితులు '' అన్నాడు మళ్ళీ ఆమాట అని చిన్నగా సైకిలెక్కి వెళ్ళిపోయాడు

అతను వెళ్ళినవైపే చూస్తూ నిలబడ్డాడు ప్రకాశం బాగా చీకటి పడింది ఒకగంట గడిచింది కాళ్ళు పీకుతున్నయ్ సబ్ ట్రెజరీ గుమస్తాలు కూడా వెళ్ళిపోయారు సి ఐ ఆఫీసులో ఎవరో వున్నారు సి ఐ తో పెద్దపెద్దగా మాట్లాడు తున్నారు రోడ్డు మీద జనసంచారం క్రమంగా తగ్గిపోతూ వుంది కడుపులో పేగులు అరుస్తున్నయ్ సబ్ ట్రెజరీ ఆఫీసు తలుపుకి ఆనుకొని నిలబడ్డాడు ప్రకాశం నిముషాలు భారంగా దొర్లుతున్నట్టు అనిపించింది సెక్షన్ బల్ల దగ్గర ఇద్దరు కానిస్టేబుళ్ళు కూర్చుని ఏదో మాట్లాడుకుంటూ నవ్వుకుంటున్నారు తొమ్మిది అయ్యేసరికి ఎంతో టయిమయినట్లు అనిపించింది రిలీఫ్ కానిస్టేబులు వచ్చి తుపాకీ, తూటాలూ తీసుకున్నాడు ప్రకాశం గార్డురూంలోకి వెళ్ళి బూట్లూ, పట్టీలూ, బెల్టూ, టోపీ తీసి యూనిఫారం విప్పి, లుంగీ కట్టుకుని పంపు దగ్గరకెళ్ళి, కాళ్ళూ చేతులూ కడుక్కుని, నిక్కరూ మష్టీ షర్టు వేసుకుని భోజనానికి బయలుదేరాడు బైట ఆంజనేయులు ఎదురయ్యాడు

''భోజనానికనుకుంటా తొందరగా పోండి ఏమీ వుండవు ఆలశ్యమయితే'' అన్నాడు నవ్వుతూ ప్రకాశం నవ్వి తల వూపాడు

హోటల్‌లోకి అడుగు పెట్టగానే హోటల్ అతను, ''ఏవండీ జవానుగారు ఇంత ఆలశ్యమయ్యింది కూరలన్నీ అయిపోయినియ్యే'' అన్నాడు

ఆ మాట విని ''అసలేమీ లేవా?'' అన్నాడు ప్రకాశం నీరసంగా

''సాంబారున్నట్టుంది'' అన్నాడు అయ్యరు

''సరే, ఏదో కానియ్యండి మాకిట్టాంటియన్నీ అలవాటేలే'' అని టేబిలు ముందు కూర్చున్నాడు

అప్పటికే ఒక పక్క నుండి బల్లల్ని సర్దుతున్నారు కుర్రవాడు వచ్చి విస్తరి వేశాడు వెళ్ళి అడుగుబొడుగు వున్న కూరల్ని గరిటతో గీరుకొచ్చాడు అతనలా గీరటం ప్రకాశంకు వినిపించింది ప్రకాశం విస్తరాకు మీద నీళ్ళు చల్లి తుడుస్తుంటే, ఆ కుర్రోడు ప్రకాశంతో, ''కాస్త పెందలాడే రాండి సార్, అసలే మీరు తినేది నాలుగు మెతుకులు'' అన్నాడు సానుభూతిగా

ప్రకాశం నవ్వాడు చిన్నగా అతను కూరలు వడ్డించబోతే వద్దన్నట్లు చెయ్యి అడ్డుపెట్టి, ''వద్దులే, కాస్త సాంబారు వుంటే తీసుకురా పైపైది, ఒక కప్పు పెరుగు చాలు'' అన్నాడు

ఆ కుర్రవాడు వెళ్ళి అన్నం తెచ్చి వడ్డించి సాంబారు తెచ్చాడు అది కూడా వట్టి పిప్పి పిప్పిగానే వుంది ఒక కప్పుతో రసం తీసుకొచ్చి పెట్టాడు ''అప్పడాలు కూడా అయిపోయాయి సార్'' అన్నాడు

ప్రకాశం ఏమీ మాట్లాడలేదు గబగబా రెండు ముద్దలు తిని లేచాడు అయ్యరు మామూలు రేటే తీసుకున్నాడు

చిన్నగా కాళ్ళీడ్చుకుంటూ వచ్చి, చొక్కా నిక్కరు విప్పి, లుంగీ కట్టుకుని, మంచినీళ్ళు తాగి, పక్క గుడ్డలు తీసుకెళ్ళి సబ్‌జైలు వరండాలో వేసుకుని పడుకున్నాడు కడుపు నిండక పోయేసరికి చాలా సేపటివరకు నిద్ర పట్టలేదు అటూ ఇటూ పొర్లాడు దోమలు పీక్కుతింటున్నాయ్ ఇక నల్లులు సరేసరి ఖయిదీల, పోలీసుల రక్తం తాగి తాగి చింతగింజల్లా వూరి స్థిరనివాసా లేర్పరుచుకున్నాయి అక్కడ రాత్రి గాఢ నిద్రలో వీటిని పట్టించుకోలేదు స్నానంలేని వళ్ళు చెమటకు చీదరగా వుంది దుప్పటి కప్పుకోకపోతే దోమల పోడు సబ్‌జైలు లాకప్పు గదుల్లోంచి దుర్వాసన వస్తూవుంది కంటిన్యూగా ఎప్పటికోగాని నిద్ర పట్టలేదు

తెల్లవారి ఆరు గంటలకల్లా వెయిటింగ్ పీసీలని నిద్ర లేపాడు సెంట్రీ అందరూ లేచారు చిన్నగా పక్కగుడ్డలు చుట్టుకొని గార్డురూంలో వాళ్ళ వాళ్ళ పెట్టెల మీద పెట్టుకున్నారు యూనిఫారాలు వేసుకుని ప్రతివాళ్ళూ తలా ఒక తూటాల పెట్టె, తుపాకీ తీసుకొని సెంట్రీ పుస్తకంలో సంతకాలు పెట్టారు జైలు వార్డెన్ తాళాలు తీసుకొని లోపలకు వచ్చాడు అతన్ని చూడగానే సెల్స్‌లో వున్న ఖయిదీలు రోజూలాగానే కేకలు వేశారు, ''అయ్యా! వార్డర్ గారూ, ఇవ్వాళ మా తాళం ముందు తియ్యాలండీ, మా తాళం ముందు తియ్యాలండీ'' అని అదంతా వింతగా వుంది ప్రకాశంకు

''ఎందుకు వీళ్ళు ఇట్లా గోల చేస్తారు ? రెండు నిముషాల్లో అంతా బయటకు వస్తారుకదా!'' అన్నాడు పక్కనున్న పీసీతో

ఆ మాటకు మిగిలినవాళ్ళు నవ్వారు ''ఎవరి సెల్లు ముందుగా తీస్తే వాళ్ళు ముందుగా బయటకు వస్తారు కదా! అలా వచ్చిన వాళ్ళకే ఇక్కడ మనవాళ్ళు తాగి పడేసిన ఎంగిలి బీడీముక్కలూ, చుట్టపీకలూ దొరికేది వాటికోసం వాళ్ళల్లో వాళ్ళు తన్నుకుంటారు'' అన్నాడు ఒకతను అతని మాటలు పూర్తికాకముందే వార్డరు తాళం తీసిన సెల్‌లోని ఖయిదీలు విసురుగా తలుపు తీసుకుని, ఒకళ్ళ నొకళ్ళు తొక్కుకుంటూ గతాగతా - రొగెత్తుతూ వచ్చి, సబ్ జైలు గేటు

లోపలిపక్క వుమ్మల్లో పడివున్న బీడీ ముక్కల్నీ, చుట్టపీకల్నీ కలబడుకుంటున్నట్లు, ఒకళ్ళ నొకళ్ళు తోసుకుంటూ ఏరుకున్నారు వాళ్ళ చేతుల్లో అవి తుక్కు తుక్కు అయి పోయాయి వాటినే మట్టి వూది, నిక్కరు జేబుల్లో, లుంగీ కొంగుల్లో, చెవుల్లో పెట్టుకొని భద్రపరుచుకున్నారు ఆలశ్యంగా వచ్చిన వాళ్ళు ఆశగా మూలల్లో చూశారు ఎక్కడన్నా ఒక బీడీముక్క దొరికిద్దేమోనని

వాళ్ళని కాలకృత్యాలకు తీసి, తిరిగి లోపల వేసేసరికి ఏడున్నర అయ్యింది యూనిఫారం విప్పి, కాలకృత్యాలు పూర్తిచేసుకుని, హోటల్‌కెళ్ళి నాష్టా చేసి వచ్చేసరికి తొమ్మిది కావచ్చింది భార్యా పిల్లలు గుర్తొచ్చేసరికి నీరసం ఆవహించింది

ప్రకాశంకూ, ఆంజనేయులికీ వంట డ్యూటీ వార్డెన్ ఇద్దరు ఖయిదీలను బయటకు తీశాడు రెండు తుపాకులూ, ఇరవై గుండు తూటాలు తీసుకుని, ఆ ఇద్దరు ఖైదీలను అప్పగించు కున్నట్టు సెంట్రీ పుస్తకంలో సంతకం పెట్టి, వంటగది దగ్గరకు వెళ్ళారు ప్రకాశం, ఆంజనేయులు అప్పటికే సబ్‌జైలు కాంట్రాక్టరు దగ్గరవుండే కుర్రాడు వంటకు కావలసిన సరుకులు తీసుకువచ్చాడు వంటగది దగ్గరకు వంటగది ముందువున్న రావిచెట్టు చుట్టూ అరుగు కట్టి వుంది తుపాకులు రెండూ అరుగుకి ఆనించారు

ఆంజనేయులు అరుగుమీద కూర్చున్నాడు ప్రకాశం వంటగది లోకి వెళ్ళాడు చూడటానికి లోపలకు అడుగు పెట్టటంతోటే ముక్కులు పగిలిపోయే, ఛండాలపు వాసన గుప్పుగ తగిలింది ఎప్పుడో బ్రిటీష్‌వాళ్ళ టైంలో కట్టిన ఆ వంటగది శిథిలావస్థలో వుంది ఎత్తాయి పొయ్యిరాళ్ళు వున్నయ్ వండిన అన్నం ఆరబోయటానికి సిమెంటుతో చేసిన ఎత్తయిన అరుగు వుంది వంచిన గంజి పూర్తిగా బయటకు పోనందున, నిల్వ వుండి, కుళ్ళి, మురుగువాసన భరించలేనంతగా వస్తోంది ఎక్కువసేపు నిలబడలేక బయటకు వచ్చాడు సబ్‌జైలులోని ఖయిదీలకు భోజన సరుకులు సరఫరా చేసే కాంట్రాక్టరు దగ్గరనుండి ఏపూట సరుకులు ఆ పూట తీసుకురావటానికి ఒక కుర్రవాడు వున్నాడు అతని పేరు అప్పలకొండ అతను ఆ పూటకు కావలసిన సరుకులూ, కూరగాయలూ, పొయ్యిలోకి కట్టెపేళ్ళూ తెచ్చి అక్కడే వున్నాడు అతను ఆంజనేయుల్ని చూచి, ''ఏం సార్, మీకేమన్నా కావాల్నా?'' అన్నాడు

''ఆఁ నాకు రెండిడ్లీలు పట్రా'' అని ప్రకాశం వైపుచూచి, ''మీకు?'' అన్నాడు ఆంజనేయులు

''నాకేం వద్దు బాబూ! నేను టిఫిన్ చేసొచ్చాను'' అన్నాడు ప్రకాశం

''అయితే మీ పావలా ఇదిగోండి'' అని పావలా బిళ్ళ ప్రకాశం చేతిలో పెట్టాడు అప్పలకొండ అర్థం కానట్టు చూశాడు ప్రకాశం నవ్వుతూ సైకిలెక్కి వెళ్ళిపోయాడు అప్పలకొండ అలా చూస్తున్న ప్రకాశాన్ని చూసి నవ్వాడు ఆంజనేయులు

''ఏందిసార్ ఆశ్చర్యంగా చూస్తారూ? అది అంతే మామూలే తీసుకోండి'' అన్నాడు

ప్రకాశం ఆ మాటకు నవ్వి, ''ఇదీ బాగానే వుంది అయితే రోజూ ఇస్తారా?'' అన్నాడు

''ఆ రోజూ వంటడ్యూటీలో వున్నవాళ్ళకు ఉదయం, సాయంత్రం చెరొక పావలా ఇస్తారు'' అన్నాడు ఆంజనేయులు

''ఏమిటిది? మనకివ్వటం ఏంది?'' అన్నాడు ప్రకాశం

ఆ మాటకు ఆంజనేయులు నవ్వాడు ''కంట్రాక్టరు ఇస్తాడు ఇదంతా ఖయిదీల రేషన్‌లోదే'' అన్నాడు

''మనకేనా ఇంకా ఎవరికన్నా ఇస్తాడా?''

''మనకిచ్చేదేముంది బోడి పావలా పై నుండి కింద దాకా ఎవరి వాటాలు వాళ్ళవి ప్రతినెల మేజిస్ట్రేటుకి ఇంట్లో కావలసిన సరుకులు, బియ్యం పంపుతాడు కంట్రాక్టరు ''

''ఏ మేజిస్ట్రేటుకి?'' అంజనేయులి మాటలు పూర్తికాకముందే ఆశ్చర్యంగా అడిగాడు ప్రకాశం

''ఇంకే మేజిస్ట్రేటుకి ఈ సబ్ జైలు మీద ఎవడికి అధికారముంటుందో, వాడికే ఇదిగో ఈ కోర్టు మేజిస్ట్రేటుకి'' అని కోర్టు వైపు వేలు చూపించాడు

''ఇంకా?!'' అన్నాడు ప్రకాశం ఆసక్తిగా

''ఈ జైలు వ్యవహారాలు చూడటానికి ఒక గుమస్తా వుంటాడు ఆయనకి సరుకులు గిరికులు ఏమీ వుండవు కాని పెద్దమొత్తమే ముట్ట చెపుతాడు కాంట్రాక్టరు తరువాత జైలు వార్డరుకి లోపలున్న ఖయిదీలు అన్నం బాగాలేదనీ, కూర బాగాలేదనీ గొడవ చెయ్యకుండా, మేనేజ్ చేస్తుంటాడు కాబట్టి అతనికీ, ఇంక మన గార్డు ఆఫీసరుకి వారంవారం అంటే ఆదివారంనాడు కిలో గానీ, ముప్పావు కిలోగానీ మాంసం పంపిస్తుంటాడు ఇదిగో ఈ వంట చేసే ఖయిదీలున్నారే వాళ్ళకి, వాళ్ళు ఏది అడిగితే అది అంటే బీడీ, చుట్టా లాంటివి'' అని వంటగదిలోకి తొంగి చూచి, ''ఏం తెప్పించు కుంటున్నార్రా ఈ పూట'' అన్నాడు

వాళ్ళు అతని ప్రశ్నకు సమాధానంగా, ''అయ్యగారూ మేమా ఈ పూట ఎండు చేపలూ టమాటాలుసార్'' అన్నారు

''ఇదంతా ఖయిదీల కిచ్చే రేషన్‌లో మిగిల్చిందేగా'' అన్నాడు ప్రకాశం

''ఆఁ కాకపోతే కాంట్రాక్టరు జేబులోది తెచ్చిపెడతాడనుకున్నారా ఖయిదీల కిచ్చే తలనూనే, సబ్బులూ ఇచ్చే పనిలేదు రేషన్‌లోనూ అన్నీ తక్కువే''

''అయితే అందరికన్నా మనకే తక్కువన్నమాట'' అన్నాడు ప్రకాశం

''ఆఁ అదయినా వాడివ్వనంటే మనం చేయగలిగింది ఏమీలేదు పెద్దగా కాకపోతే ఈ ఖైదీలలో ఎవరిని వంటకు తియ్యాలనేది మన ఇష్టమే కాబట్టి కాస్త గట్టివాళ్ళను తీస్తే, వాళ్ళు 'అన్నీ లెఖ్ఖ ప్రకారం తీసుకొస్తేనే వండుతాం లేకపోతే వండమని' పేచీ పెడతారు 'బియ్యం నాసిరకపువ'ని వంట ఆపేస్తారు ఇక అన్నీ పేచీలే కంట్రాక్టరుకి మిగిలేది కందిపప్పూ, శెనగనూనే, చింతపండూ, బియ్యం ఇట్లాంటివాటిల్లోనే కదా కారం, వుల్లిపాయల్లో ఏముంటాయి? మళ్ళీ కూరగాయల్లో మంచి లాభం వుంటుంది ఇంతమంది ఖయిదీలకు ఎక్కువ మొత్తంలో కూరగాయలు కావాలి కదా ఆరోజు మార్కెట్లో ఏది చౌకగా వుంటే అదే ఏసుకొస్తారు ఇక ఆదివారంనాడైతే మాంసం తిననివాళ్ళకు బంగాళా దుంప తెస్తాడు అక్కడ లెఖ్ఖ మాత్రం అందరికీ మాంసానికే రాసేది వాడికి పిచ్చిలాభం కదండీ ఇంతమందికి పెట్టేది మొత్తం కలిపినా వాడికొచ్చే లాభంలో మూడో వంతు వుండదు'' అన్నాడు ఆంజనేయులు

ప్రకాశం తలూపి మెదలకుండా వూరుకున్నాడు ఇంతలో అప్పలకొండ వచ్చాడు సైకిలు వేసుకుని ఇడ్లీ పొట్లం ఆంజనేయులి కిచ్చాడు తరువాత వెళ్ళిపోయాడు రెండు గంటల్లో వంట అయిపోయింది

వారం రోజులకు గార్డు డ్యూటీ అయిపోయింది ప్రకాశంకు

గార్డు అయిపోయిన తరువాత మామూలు డ్యూటీలు వేశారు వీలు దొరికినప్పుడల్లా ఇంటికోసం తిరిగి ఓ వారం రోజుల్లో పెంకుటిల్లొకటి మాట్లాడాడు ప్రకాశం రెండు రోజులు

సెలవు పెట్టి సామాను వేసుకురావటానికి వెళ్ళాడు

వెళ్ళినరోజు తన పిల్లలు చదువుకునే కాలేజీకీ, హైస్కూలుకు వెళ్ళి టి సీ లు తీసుకోవటం, సామాను సర్దుకోవటం లాంటి పనులతో సరిపోయింది సామాన్లు సర్దుతూ అనేక వస్తువులు అక్కడ వదిలెయ్యవలసి వచ్చింది అది మామూలే నీళ్ళ బానలూ, కోళ్ళ గంపలూ, కర్ర దండేలూ, పుల్లల మోపులూ, పాత డబ్బాలూ, కూసాలు విరిగిన కుక్కి మంచాలూ, బట్టలు వుతుక్కునే చోట, స్నానం కోసం వేసుకున్న పెద్దపెద్ద నాపరాళ్ళూ డబ్బాలూ, సీసాలు పెట్టుకొనే జాజిచెక్క పెట్టెలూ, రోలూ, ఇలాటివన్నీ వదిలిపెట్టటం, కొత్తచోటకు వెళ్ళాక వరుసగా అన్నీ కొను క్కోవటం, మళ్ళీ ట్రాన్స్‌ఫర్ రాగానే వాటన్నిటిని వదిలిపెట్టటం ఎవరో తప్ప చాలామంది ఆ లగేజ్‌తో ప్రయాణం చెయ్యలేరు బస్సులమీద వెళ్ళే వూరిలో ఇంటిపక్కనే మంచినీళ్ళ బావి వున్నందువలన నీళ్ళ కావిడి పక్కింటివాళ్ళకిచ్చేశారు ఆ రోజు సాయంత్రానికి వండుకోవటానికి కావాల్సిన తపేళాలు బయట వుంచి మిగిలినవన్నీ కట్టేశారు సాయంత్రం భార్యను ఆసుపత్రికి తీసుకువెళ్ళి డ్యాక్టరుకు చూపించాడు ఆమెకు కొంచెం ఓపిక వచ్చింది తనకు ట్రాన్స్‌ఫర్ అయినట్లు డ్యాక్టరుకు చెప్పాడు డ్యాక్టరు ఆమెని పరీక్ష చేసి, మందులూ అవీ వాడుతూ, బలమైన ఆహారం పెట్టాలని గట్టిగా చెప్పాడు సెల్యూట్ చేసి తలూపి వచ్చాడు

బాగా చీకటితో లేచి గబగబా అన్నం వండింది మాణిక్యమ్మ వంట్లో బాగాలేకపోయినా అక్కడి కెళ్ళాక అప్పటికప్పుడు వీలుకాదు కాబట్టి తినటానికిగాను అన్నం, గోంగూర పప్పు, కొద్దిగా చింతకాయ పచ్చడి చేసింది అందరూ అన్నాలు తిన్నారు తెలిసిన వాళ్ళు బస్సుదాకా వచ్చారు సూర్యం ఫ్రెండ్స్ కూడా వచ్చారు అందరి దగ్గరా వీడ్కోలు తీసుకుని బస్సెక్కారు అంతకు ముందు ఎన్నోసార్లు బాధకలిగినట్లే పరిచయమైన వూరునీ, జనాన్నీ వదిలిపోతుంటే మనసంతా గుబులు గుబులుగా దిగులుగా వుంది అందరికీ బస్సు బయలుదేరింది క్రమంగా వూరు దూరమయ్యి కనుమరుగయ్యింది ఎవరికి వాళ్ళు మౌనంగా కూర్చున్నారు అందరి హృదయాలు బాధతో బరువెక్కివున్నయ్ సూర్యానికి అతని స్నేహితులు గుర్తుకు వస్తున్నారు అంతకుముందు తామున్న వూళ్ళల్లోని పరిచయస్తులూ, స్నేహితులు గుర్తుకొచ్చారు 'జిప్సీల లాగే ఇవీ సంచార జీవితాలే ఏమీ తేడా లేదు' అనుకున్నాడు సూర్యం కనుమరుగవుతున్న వూరి పొలిమేరల్ని చూస్తూ వుండిపోయాడు బస్సు చేస్తున్న శబ్దం భరించలేకుండా వుంది కండక్టరు టిక్కెట్లు కొట్టి, లగేజికి తక్కువ చార్జీ చేశానని తన మామూలు కూడా అడిగి తీసుకున్నాడు

''మా దగ్గర ఏమిటయ్యా బాబూ! మేమేమన్నా వ్యాపారస్తులమా?'' అన్నాడు సూర్యం

''అదేంది సార్ ఎప్పుడో ఒక్కసారి మీకు ట్రాన్స్‌ఫర్ వచ్చేది మాకిచ్చే కాఫీ డబ్బులికి మీరట్లా అంటే ఎట్లా లగేజీ లెఖ్ఖ ప్రకారం కొట్టానా?'' అన్నాడు దీర్ఘం తీస్తూ కండక్టరు

''బాగానే వుంది'' విసుకున్నాడు సూర్యం

''పోనీలే'' అన్నాడు ప్రకాశం తండ్రివైపు ఓసారి చూచి తలతిప్పుకున్నాడు సూర్యం

సూర్యకిరణాలు వెచ్చగా తగులుతున్నయ్ గతుకుల రోడ్డు కిరువైపులా ఏపుగా పెరిగిన జొన్నా సజ్జ చేలు, అక్కడక్కడా కంది చేలు పచ్చగా వున్నయ్ రాత్రి కురిసిన మంచు బిందువుల మీద లేత సూర్య కిరణాలు పడి మెరుస్తున్నయ్ గంటన్నర ప్రయాణం తరువాత ఆ బస్సు మారి వేరే బస్సు ఎక్కారు ఆ బస్సు మీద నుండి సామాను దించి రెండో బస్సు మీద వేశారు పోర్టర్లు సామాన్ని పోర్టర్లు చాలా నిర్లక్ష్యంగా వేశారు అప్పటి వరకూ వున్న ఎండ తీవ్రత తగ్గిపోయి

ఆకాశం మేఘావృత మౌతోంది బస్సు బయలుదేరిన కొద్దిసేపటికి చిన్నగా తుప్పర్లు ప్రారంభమయ్యాయి

''ఓరి దేవుడా! వానొచ్చేట్టుంది సామానంతా నాశనమయ్యి పోయిద్దిగా ఇదేం ఖర్మరా! ఇప్పుడేం చేయాలి'' అని గొణిగింది ప్రకాశం భార్య ఏం చేయాలో ఎవరికీ తోచలేదు

''కండక్టరు గారూ! సామాను తడిచి పోయిద్దే, ఎట్లా?'' అన్నాడు ప్రకాశం

''అయితే నన్నేం చేయమంటారూ?'' అన్నాడు కరుకుగా కండక్టరు బస్సు ఆపితే చిన్నచిన్న సామానన్నా లోపల పెట్టొచ్చనే ఉద్దేశ్యంతో ఆ మాట అన్నాడు ప్రకాశం కండక్టరు ఇచ్చిన సమాధానంతో మెదలకుండా వూరుకున్నాడు నిముషాల్లో వర్షం పెద్దదయ్యింది

లక్ష్మికి మాత్రం ప్రయాణం సరదాగా వుంది

''అయినా వర్షాకాలం ఈ సామాను వేసుకుని ప్రయాణమేందీ'' అన్నాడు కండక్టరు వూరుకోకుండా

''ఆ నీ మాత్రం తెలివి లేక'' అన్నాడు సూర్యం చటుక్కున కండక్టరు సూర్యంవైపు చూచి తల తిప్పుకున్నాడు అయిదు నిముషాల సేపు కురిసి వర్షం వెలిసిపోయింది వాళ్ళ సామాను తడపటానికే అది వచ్చినట్టు కనపడింది ప్రకాశం భార్యకు బస్సు గమ్యం చేరేసరికి పన్నెండు గంటలు దాటింది పోర్టర్లను వెదికి పట్టుకొని, సామాన్లు దింపించుకుని, రిక్షాలు మాట్లాడుకుని ఇంటికి చేరారు మధ్యాహ్నం తినటానికి వండుకున్న అన్నం బుట్ట బస్సులోపల పెట్టకోవడం వలన అది తడవలేదు

ఇంటికెళ్లిన వెంటనే పక్కింటివాళ్ళనడిగి నీళ్ళు తెచ్చుకుని అన్నం తిన్నారు ఇంటికొచ్చిన దగ్గరనుండీ లక్ష్మి మెత్తగా కనపడింది వళ్ళు వెచ్చబడుతోంది మిగిలినవాళ్ళకు ప్రయాణం వలన బడలికగా వుంది ఇరుగుపొరుగువాళ్ళ చిన్నపిల్లలు వచ్చి నిలబడి చూస్తున్నారు కొత్తగా తండ్రీ కొడుకులు కలిసి చిన్నగా సామాను విప్పదీశారు బియ్యపు డ్రమ్ములోని బియ్యం వర్షానికి చాలా వరకు తడిచిపోయాయి దుప్పట్లు, దిండ్లు, పుస్తకాలు తడిచిపోయాయి చెక్కపెట్టెలో పెట్టిన పచ్చడి జాడీ, కారపు సీసా పగిలిపోయాయి డబ్బాలో కొద్దిగా వున్న కిరసనాయిలు, బిందెల నిండా బక్కెట్ల నిండా కారి వాసన కొడుతోంది సైకిలు బెల్లు విరిగి వూడిపోయింది తడిచిపోయినవాటిని ఆరబెట్టారు తండ్రీ కొడుకులు సామాను సర్దుతుంటే, తల్లీ కూతుళ్ళు చాప పరుచుకుని పడుకున్నారు సాయంత్రానికి సర్దటం ఒక కొలిక్కి వచ్చింది మాణిక్యమ్మ చిన్నగా వంటపని ప్రారంభించింది లక్ష్మి మాత్రం మూసిన కన్ను తెరవలేదు జ్వరం వచ్చింది బాగా మార్కెట్టు కెళ్ళి కూరగాయలేమన్నా తెద్దామని డబ్బులెన్ని వున్నయ్యో లెక్క చూశాడు ప్రకాశం పదిహేను రూపాయల చిల్లర వుంది జీతం రావటానికి ఇంకా వారం రోజులు టైముంది చార్జీలకీ, లగేజీలకయిన డబ్బులుంటే నెలాఖరు వరకూ ఇబ్బంది లేకుండా వుండేది సాయంత్రం మార్కెట్టుకు వెళ్ళొచ్చనుకొని ఆలోచిస్తూ నడుంవాల్చాడు గోడాకానించి తల్లి ఫొటో కనపడింది 'ఎలాగో ఇది పగలకుండా వుంది' అనుకున్నాడు సరిగా తియ్యటం చేతకానందున ఫొటో స్పష్టంగా రాలేదు

సాయంత్రం మార్కెట్టుకు వెళ్ళబోతూ చూశాడు కూతుర్ని నుదిటిమీద చెయ్యివేసి చూశాడు వళ్ళు కాలిపోతోంది డాక్టరు దగ్గరకు తీసుకుపోవాలనుకున్నాడు కాని డాక్టరుకు ఫీజు ఇవ్వాలి మందులు తేవాలి డబ్బులు లేవు కొద్దిసేపు ఆలోచించాడు [illegible] సంచి తీసుకుని

బైటకు వెళ్ళాడు సరాసరి స్టేషన్‌కొచ్చాడు సమయానికి ఆంజనేయులు స్టేషన్లో వున్నాడు ప్రకాశాన్ని చూచి, ఎదురు వస్తూ నమస్కారం చేశాడు ''ఏం సార్, సామాను తెచ్చేశారా?'' అన్నాడు

''ఆc, తెచ్చానయ్యా! మా అమ్మాయికి ఇక్కడికొచ్చినాక జ్వరం వచ్చింది ఆస్పత్రికి తీసుకెళదామంటే డబ్బుల్లేవు ''

అతని మాటలుపూర్తి కాకుండానే, ''నా దగ్గర కూడా ఏమీ లేవు సార్ ఈ నెల్లో చాలా ఖర్చు తగిలింది చుట్టాలొచ్చారు నా కొడుక్కి కుక్క కరిచి దానికే చాలా ఖర్చయింది సార్ '' కంగారుగా చెప్పుకుపోతున్నాడు ఆంజనేయులు

అతని మాటలకు ప్రకాశం చిన్నగా నవ్వాడు ''అది కాదయ్యా! నిన్ను డబ్బులడగటానికి రాలేదు ఈ వూళ్ళో పోలీసోళ్ళకు ఫ్రీగా చూసే డ్యాక్టరెవరన్నా వున్నారేమో కనుక్కుందామని నేను కొత్తకదా '' అన్నాడు

ఆ మాట విని ఆంజనేయులు సిగ్గుపడ్డట్టు చూశాడు అంతలో తేరుకుని, ''ఆc ఆc ఒకాయన వున్నాడు సార్ పాపం మన దగ్గర ఫీజేమీ తీసుకోడు కాని ఆసుపత్రి కొచ్చిన ప్రతి పేషెంట్‌ని అడ్మిట్ చెయ్యమంటాడు తరువాత మాత్రం బిల్లు గుద్దుతాడు'' అన్నాడు

''అప్పుడది మాత్రం ఏమయ్యింది దీనికి డబల్ అయ్యిందిగా'' అన్నాడు ప్రకాశం

''ఇంకెవరూ లేరు సార్ నిలబెట్టి ఫీజు తీసుకుంటారు అందులో మొహమాటమేమీ లేదు'' అన్నాడు ఆంజనేయులు

''అసలు ఫీజు తీసుకోవటమే మంచిదనుకో వూరికే చూస్తే ఆ రోగం కూడా అట్లాగే వుంటుంది'' అన్నాడు ప్రకాశం నవ్వుతూ ఆంజనేయులు కూడా నవ్వాడు ఆ మాటకు

''మీరు చాలా ఇబ్బందిలో వున్నట్టున్నారే డబ్బులికి'' అన్నాడు సానుభూతిగా ఆంజనేయులు

ఆ మాటకు ప్రకాశం నవ్వి, ''శాశ్వత సమస్య ఇది నాకు'' అన్నాడు ఆంజనేయులు కూడా నవ్వాడు మళ్ళీ ''సరే ఏదో చేస్తాలే వస్తా'' అని బయటకొచ్చాడు ప్రకాశం

మార్కెట్టుకెళ్ళి చౌకగా ఏమున్నాయో చూశాడు ఒక కిలో దొండకాయలు తీసుకుని, పచ్చడికి ఒక పావుకిలో మిరపకాయలు, రెండు కట్టలు గోంగూర తీసుకుని ఇంటికొస్తూ, దారిలో మెడికల్ షాపు దగ్గర ఆగి అతనితో విషయం చెప్పాడు షాపతను ఏవో రెండు టాబ్లెట్లు ఇచ్చి, ''ఇప్పుడొకటి, రేప్పొద్దున ఒకటి కాఫీతో వెయ్యండి'' అని ఒక రూపాయి తీసుకున్నాడు ప్రకాశం ఇంటికెళ్ళి సూర్యాన్ని హోటల్ కి పంపించి కాఫీ తెప్పించాడు సూర్యం స్టీలుచెంబుతో హోటలు నుండి తెచ్చిన కాఫీ ఇంటికొచ్చేసరికి చల్లగా చల్లారిపోయింది వాటిని మళ్ళీ వెచ్చబెట్టి టాబ్లెట్టు వేశారు లక్ష్మికి కుక్కిమంచం వొకదాన్ని అక్కడే వదిలిపెట్టి రావటం వలన ఆ రాత్రి సూర్యం క్రిందనే పడుకున్నాడు తెల్లవారినా లక్ష్మికి జ్వరం తగ్గలేదు బలవంతంగా లేపి ముఖం కడిగించింది తల్లి రెండిడ్లీలు, కాఫీ తెచ్చాడు సూర్యం నోరు చేదుగా వున్నందువల్ల ఏమీ తినలేకపోయింది రెండో టాబ్లెట్టు వేసుకుని కాఫీ తాగింది నిన్న తడిచిపోయిన బియ్యం ఈ పూట అన్నానికి పనికిరాలేదు వున్న పది రూపాయలలోనే నాలుగు కిలోల బియ్యం తీసుకువచ్చాడు ప్రకాశం మిగిలిన రెండు మూడు రూపాయల చిల్లర భార్య కిచ్చాడు పక్కింటి వాళ్ళకు పాలు పోసే మనిషొస్తే, ఆమె దగ్గర నెల ఖాతా మాట్లాడుకుని పాలు పోయించుకుంది భార్య సద్దన్నంలో కొరివికారం వేసుకుని రెండు ముద్దలు తిని స్టేషనుకు వెళ్ళాడు ప్రకాశం

''ఏమిటి డ్యూటీకి రిపోర్టు చేస్తున్నారా? బందోబస్తుకు పోవాలంట'' అన్నాడు ఆంజనేయులు ఎదురై

''ఏం బందోబస్తు?''

''జూట్‌మిల్లు వర్కర్సు సమ్మె చేస్తున్నారు మొన్నటి నుండి మనోళ్ళు బందోబస్తులో వున్నారు మీరు డ్యూటీకి వస్తే అక్కడున్న వాళ్ళల్లో ఒకళ్ళని రిలీఫ్ చేస్తారు'' అన్నాడు ఆంజనేయులు

''టౌనులోనే కదా!''

''ఔను టౌనులోనే''

''ఆ పోదాంలే ఏదో ఒక ఉద్యోగం చెయ్యాల్సిందేగా పన్నెండు గంటలలోపు రిపోర్టు చేస్తా'' అన్నాడు ప్రకాశం

''సరేలే కానీ, మీకొక విషయం చెప్పాలి'' అన్నాడు ఆంజనేయులు

''ఏమిటి ?'' అడిగాడు ప్రకాశం

''బ్రాకెట్టు వాళ్ళూ, క్లబ్బుల వాళ్ళూ, బ్రోతల్ కంపెనీల వాళ్ళూ, సారాయి కాంట్రాక్టరు మనకి మామూళ్ళు ఇస్తారు మొత్తం కలిపి నెల కొక యాభై వస్తయ్ పోయి తెచ్చుకోండి'' అన్నాడు

ఆ మాటలు వినే సరికి కొద్దిగా హుషారు వచ్చింది ప్రకాశానికి, ఆశగా చూశాడు ''నాకేం తెలుసు? కాస్త చూపించి పరిచయం చెయ్యి, శ్రమ అనుకోకుండా'' అన్నాడు బ్రతిమాలుతున్న ధోరణిలో

''ఇప్పుడు కాదు కాస్త పొద్దుపోయిన తరువాత పోదాం అప్పుడయితే అంతా దొరుకుతారు'' అన్నాడు ఆంజనేయులు

''అవుననుకో అయినా ఒకసారి సైకిళ్ళేసుకుని ఒక రౌండు పోయొద్దాం ఎవుడన్నా మన అదృష్టం కొందీ దొరికితే, ఓ అయిదో పదో దొరికితే టీ నీళ్ళ కన్నా వుంటయ్ మరీ జేబు నిల్లు'' అన్నాడు నవ్వుతూ ప్రకాశం ఇద్దరూ సైకిళ్ళు వేసుకుని బయలుదేరారు ఒకక్లబ్బు ఓనరు మాత్రం దొరికాడు

''నమస్కారం సార్ వెంకటపతిగారూ '' అన్నాడు ఆంజనేయులు దూరం నుండే రాని నవ్వుని తెచ్చుకుంటూ ఆ క్లబ్బు ఓనరు పేము కుర్చీలో కూర్చుని పేపరు చూస్తున్నాడు ఆంజనేయులి గొంతు విని తలెత్తి అతన్ని చూసి, పక్కనున్న ప్రకాశాన్ని ఒక్కక్షణం తేరిపార చూచి పేపర్లో తలదూర్చాడు మళ్ళీ ఆ చూపూ, ఆ నిర్లక్ష్యం ప్రకాశానికి బాధ కలిగించాయి నిశ్శబ్దంగా నిట్టూర్చాడు దీనంగా నిలబడ్డాడు

''నమస్కారం సార్ ఏం సార్ సంగతులు'' అన్నాడు ఆంజనేయులు మళ్ళీ, సైకిలుకు స్టాండు వేస్తూ

''ఏముంటాయి మీరే చెప్పాలి'' అన్నాడు క్లబ్ ఓనరు కొద్దిగా నిష్ఠూరంగా

''ఏందిసార్ అంత నిష్ఠూరంగా మాట్లాడుతున్నారు?'' అన్నాడు ఆంజనేయులు

''ఆ, నిష్ఠూరం కాకపోతే ఏంది మీ యస్సై ఏ నెలకానెల టంచనుగా మామూలు దొబ్బుతూనే వుంటాడు, ప్రతినెలా ఏదో ఒక ఇండెంటు నెత్తి నేస్తుంటాడు మరీ అంత పొదుగు కోసుకుని పాలు తాగకూడదు'' అన్నాడు కొంచెం సీరియస్‌గా ఆ మాటకు ఆంజనేయులు చిన్నగా నిట్టూర్చాడు పని కాదేమో అనుకున్నాడు ప్రకాశం

''అదా ! ఒక వేళ మా స్టాపువల్ల ఏమన్నా ఇబ్బంది కలిగిందేమో అనుకున్నా'' అన్నాడు ఆంజనేయులు లౌకికంగా

''మీ వల్ల నాకెప్పుడూ ఇబ్బంది లేదు అయినా మీరు మమ్మల్నేం చేయగలరు ఎవురికీ మంచీ చెయ్యలేరూ, చెడూ చెయ్యలేరూ మీ పై వాళ్ళ ప్రమేయం లేకుండా మీదేముంది మీ స్టాపుకందరికి ఇచ్చేది మొత్తం కలిపినా మీ యస్పై కిచ్చేదాన్లో సగం కూడా వుండదు'' అన్నాడు

''ఈడు దొంగనా కొడుకు సార్ పోయినోడైతే '' ఏదో చెప్పబోయాడు ఆంజనేయులు

''ఆ అందరూ అంతే పోయినోడు కాదు అంతకు ముందోడు కాదు నాకీ లైనులో పదిహేడేళ్ళ సర్వీసుంది ఏ యస్పై వచ్చినా, ఏ సిఐ వచ్చినా మమ్మల్ని జలగల్లా పీక్కు తినేవాళ్ళే ప్రతినెలా ఏదో ఒకటి యస్పీ ఇన్‌స్పెక్షన్‌కి వస్తాడనీ, డీ యస్పీ కూతురు పెద్దమనిషి అయిందనీ, లేకపోతే ఏదో ఒక ఆఫీసరు ట్రాన్స్‌ఫరు అనీ, సిఐకి ప్రమోషననీ, సిఐ కూతురి పెళ్ళనీ, యస్పై కొడుకు బారసాలనీ ఇట్లా మాకెన్ని చావులు పోనీ అడిగిన ప్రతిసారీ ఏదో శక్తికొద్దీ సర్దుతూనే వున్నా, మళ్ళీ రెయిడ్‌లు అదేమంటే కేసులుకావాలంటారు అసలు నాకు తెలవక అడుగుతా, నెలకిన్ని కేసులు కావాలని రూలేం లేదు కదా ఒకసారి రెయిడ్‌లో దొరికినోడు మళ్ళీ క్లబ్బులోకి అడుగు పెడతాడా? తల్లిపాలు తాగి రొమ్ము గుద్దే డిపార్టుమెంటయ్యా మీది'' అన్నాడు అతను

''మమ్మల్ననగాకండి సార్'' అన్నాడు ఆంజనేయులు నవ్వుతూ ''మేమంత విశ్వాసం లేనివాళ్ళం కాదు సార్'' అన్నాడు మళ్ళీ

''ఆ రేపు నువ్వు యస్పైవయ్యాక నువ్వుకూడా అంతే'' అన్నాడు అతను కూడా చిన్నగా నవ్వుతూ

''ఆ? అయితే మీ అబ్బాయి అయినా అంతేగా ట్రైనింగు నుండి వచ్చాక చూస్తాంగా'' అన్నాడు ఆంజనేయులు

ఆ మాటకు క్లబ్బతను చిన్నగా నవ్వాడు ఆనందంగా ''ఏంది వచ్చావు?'' అన్నాడు

''ఏం లేదు సార్ ఈయన స్టేషన్‌కు కొత్తగా వచ్చారు ముందుగా మీ బోటి పెద్దోళ్ళని చూడటం మంచిదనీ '' మాటలు సగంలో ఆపి నవ్వాడు ఆంజనేయులు

''మా కంటే పెద్దోళ్ళే వున్నారు చాలా మంది'' అని, ''సరే రేపొచ్చి కనపడు '' అన్నాడు ప్రకాశాన్ని ఉద్దేశించి

''అది సరే సార్ పెద్దోళ్ళు వుంటే వుండొచ్చు గాక కాని మా దృష్టిలో పెద్దోళ్ళు మీరే ఎందుకంటే మంచితనమూ, మంచి హృదయమూ వున్న మీరే మా దృష్టిలో పెద్దోళ్ళు'' అన్నాడు పొగుడుతున్నట్లు ఆంజనేయులు

ఆ మాటకు అతను ఇబ్బందిగా కదిలాడు కుర్చీలో వస్తున్న నవ్వుని బలవంతంగా ఆపుకుంటున్నట్టు ఆంజనేయులు వైపు చూశాడు ''నీకు సర్వీసు తక్కువే కాని, గొప్ప అనుభవం సంపాదించావోయ్'' అని నవ్వుతూ, ''సరేలే ఇంకా మళ్ళీ మళ్ళీ ఎందుకు'' అని పక్క జేబులో చెయ్యి పెట్టి పది రూపాయలు తీసి ప్రకాశానికిస్తూ, ''నెంబరెంత?'' అన్నాడు

ప్రకాశం చెప్పాడు తరువాత రెండు నిముషాలు ఆ మాటా ఈ మాటా మాట్లాడి ''వస్తాం సార్'' అన్నాడు ఆంజనేయులు

''ఆఁ ఆఁ పోయిరాండి'' అన్నాడు అతను తలూపుతూ

ఇద్దరూ నమస్కారం చేసి బయట కొచ్చారు అక్కడున్నంతసేపూ ప్రకాశం ముళ్ళమీద

నిలబడ్డట్టు ఫీలయ్యాడు అతని ముందు నిలబడి ఓ బానిసలాగా, సిగ్గులేకుండా, అవమాన భారంతో కుంగిపోతూ, ఆ పదిరూపాయల కోసం 'దేహీ' అంటూ దేబిరించటం తలకొట్టేసినంత పనయ్యింది ప్రకాశానికి కాని మరో ప్రక్క ఆర్థిక ఇబ్బందులు అతని అభిమానాన్నీ, ఆత్మగౌరవాన్నీ, రోషాన్నీ మెడపట్టి వంచుతున్నయ్

''దొంగనా కొడుకండీ మనమంటే లెక్కలేదు వాడికి కాస్త గేస్ కొట్టాలి అప్పుడు దారికొస్తాడు వీడి కొడుకు యస్సైగా సెల్కక్టయి, ఇప్పుడు ట్రైనింగులో వున్నాడు అసలు ముందుగా డబ్బులెవుడికీ ఇవ్వడు నెల కాకుండా మీ అదృష్టం బాగుంది'' అన్నాడు ఆంజనేయులు ప్రకాశం చిన్నగా నవ్వాడు అతని మనస్సంతా కూతురిమీద వుంది తరువాత వాళ్ళు మిగతావాళ్ళకోసం వెళ్ళారు కాని ఎవరూ దొరకలేదు

''సరే, మనం సాయంత్రం వాళ్ళని కలుద్దాం అప్పుడయితే అందరూ దొరుకుతారు'' అన్నాడు ఆంజనేయులు ప్రకాశం అలాగే అన్నట్టు తలూపాడు ఆంజనేయుల్ని బలవంతంగా హోటల్కి తీసుకుపోయి టిఫిన్, కాఫీ ఇప్పించాడు తానేమీ తినలేదు ఆంజనేయులు మొహమాట పడ్డాడు మొదట

''మీరూ తీసుకోండి లేకపోతే నేను తీసుకోను అయినా ఇదేమిటి? నాకు లంచమా?'' అన్నాడు ఆంజనేయులు

''అబ్బే, అదేంకాదులే'' అని ప్రకాశం నవ్వి, ''నా కొద్దులే, పొద్దున్నే చద్దన్నం తినొచ్చా మళ్ళీ ఇప్పుడెళ్ళి భోజనం చేస్తా కదా'' అని అతన్ని ఒప్పించాడు ముప్పావలా బిల్లు ప్రకాశం కట్టాడు బయటకొచ్చారు

గబగబా ఇంటికెళ్ళాడు లక్ష్మికి జ్వరం ఎక్కువయ్యింది కూతుర్ని తీసుకొని పక్కింటి వాళ్ళ సలహామీద వీధి చివరనున్న ఆర్ యం పి డాక్టరు దగ్గరకు తీసుకెళ్ళాడు అతను లక్ష్మిని చూచి, ఏవో రెండు ఇంజక్షన్లు చేసి, రెండు టాబ్లెట్లు ఇచ్చాడు సాయంత్రంకూడా తీసుకొచ్చి ఇంజక్షను చేయించి తీసుకెళ్ళమని చెప్పాడు అయిదు రూపాయలు తీసుకున్నాడు

ఇంటికొచ్చి గబగబా అన్నం తిని స్టేషనుకెళ్ళాడు ప్రకాశం అతను డ్యూటీకి రిపోర్టు చెయ్యటంతోనే జూట్మిల్లు దగ్గరకు బందోబస్తుకు పంపించారు పాస్పోర్టు తీసుకుని వెళుతూ ఆంజనేయుల్ని సాయంత్రం మిల్లు దగ్గరకు రమ్మని చెప్పాడు తను మిల్లు దగ్గరకు వెళ్ళి అక్కడున్న సార్జెన్ వద్ద రిపోర్టు చేశాడు

''భోం చేసి వచ్చావా?'' అడిగాడు సార్జెన్

''చేసేను సార్'' అన్నాడు ప్రకాశం

''చెయ్యకపోతే ఇక్కడ చెయ్యి మనకి రెండు పూటలా భోజనం, ఉదయం టిఫిన్, రోజుకొక రూపాయి డబ్బులూ ఇస్తారు మిల్లువాళ్ళు'' అన్నాడు పక్కనున్న కానిస్టేబులు

''ఈ పూటకు చేసొచ్చాలెండి సాయంత్రం ఇక్కడే భోజనం చేస్తా'' అన్నాడు ప్రకాశం అక్కడే మిల్లు గేటు బయట వున్న గదిలో అందిరితో పాటు కూర్చున్నాడు గేటు కెదురుగా రోడ్డుకవతల ఫ్యాక్టరీ వర్కర్లు పెద్ద టెంటు వేశారు టెంట్లో ఇద్దరు వ్యక్తులు మెడల్లో పూల దండలు వేసుకుని కూర్చుని వున్నారు టెంట్కి ఎర్ర జెండాలు కట్టి వున్నయ్

''ఏమిటి ఇక్కడ గొడవ?'' అడిగాడు ప్రకాశం

''జీతాలు పెంచమని వర్కర్లు సమ్మె చేస్తున్నారు'' అన్నాడు పక్కన వున్న కానిస్టేబులు ఒకతను

''శాంతియుతంగానే జరుగుతున్నది కదా?''

''ఆ అయినా మనముండాలి కదా లా అండ్ ఆర్డర్ మెయిన్‌టైన్ చెయ్యటానికి'' అన్నాడు అతను

సాయంత్రం నాలుగు గంటల ప్రాంతంలో సార్జెన్‌కి చెప్పి ఇంటికెళ్ళాడు, కూతురికెలాగుందో చూసి రావటానికి జ్వరం ఏమీ తగ్గు ముఖం పట్టలేదు సాయంత్రం భోజనానికి రానని భార్యతో చెప్పాడు సూర్యాన్ని పిలిచి, ''అమ్మాయిని తీసుకువెళ్ళి ఇంజక్షను చేయించుకు రా'' అన్నాడు

సాయంత్రం ఆరు గంటలకు ఆంజనేయులు మిల్లు దగ్గరకొచ్చాడు ఇద్దరూ కలిసి సార్జెన్‌కి చెప్పి బయలుదేరారు అందరినీ కలిశాక, చివరగా బ్రోతల్‌హౌస్‌కు బయలుదేరారు

''ఇప్పుడెక్కడికి ఇంకా?'' అన్నాడు ప్రకాశం

''ఇంక మిగిలింది బ్రోతల్ హౌసులే మూడు క్లబ్బులూ, రెండు బ్రాకెట్టు కంపెనీలు, ఒక సారాయి కాంట్రాక్టరూ అయిపోయారు ఇంక బ్రోతల్‌కంపెనీలు మిగిలాయి వాళ్ళు కొంతమంది పోంగానే ఇస్తారులే ఇదివరకు ఇంకొకటుండేది బ్రోతల్ కంపెని వాడు అప్పలసామనీ, వాడికి డబ్బులివ్వటానికి మనసొప్పేది కాదు అందుకే నా కొడుకు కంపెనీని యస్పైకి చెప్పి ఊపిరాడకుండా రైడ్స్ చేయించాము వాడు దెబ్బతో పీక్కుపోయాడు వాడు కనీసం యస్పైకి కూడా ఇవ్వడంట'' అన్నాడు ఆంజనేయులు అతను చెప్పిన విషయాలు ఒకదానికొకటి పొసగలేదనిపించాయి ప్రకాశంకు

''అదీ సంగతి యస్పైకి డబ్బులు ఇవ్వలేదు కాబట్టి రెయిడ్ చేశాడు గానీ, మనకివ్వలేదనీ, మనం రెయిడ్ చెయ్యమని చెప్పామనీ కాదు రెయిడ్ చేసింది మనం చెయ్యమంటే యస్పైలు చేస్తారా? సరేలే కానీ ఆ బ్రోతల్ హౌసులికి వద్దులేవయ్యా'' అన్నాడు ప్రకాశం

ఆ మాటకు తొక్కుతున్న సైకిల్ని చటుక్కున ఆపి, ''ఏం?!'' అన్నాడు ఆంజనేయులు అర్థం కానట్టు ఆశ్చర్యంగా

''నాకు వాళ్ళ దగ్గర తీసుకోవటం ఇష్టం లేదు ఇంతవరకు చాలులే'' అన్నాడు ప్రకాశం

''మనం వాళ్ళ దగ్గరెందుకు తీసుకుంటాం ఓనర్లిస్తారు!'' అన్నాడు ఆంజనేయులు కాని ఆ మాటలు అతనికే ఎబ్బెట్టుగా తోచాయి

''ఎవరి దగ్గర తీసుకున్నా అవి వాళ్ళ శరీరాలతో సంపాదించినవేగా''

''సరే మీ యిష్టం'' అన్నాడు ఆంజనేయులు ఇద్దరూ వెనక్కు తిరిగారు

''మిల్లు దగ్గర భోజనాలవీ ఫ్రీగా ఏర్పాటు చేశారట గదా'' అన్నాడు ఆంజనేయులు

''అవునట నేనీపూటేగా వచ్చిందీ''

''ఇంక అందరూ ఆ డ్యూటీ వెయ్యమని పేచీ పెడతారు ఎక్కడన్నా ఫ్రీగా టీ ఇస్తున్నారంటే చాలు, అక్కడికి డ్యూటీలు వేయించుకోవటానికి తగాదా అయినా పెట్టుకుంటారు'' అన్నాడు ఆంజనేయులు

ఆ మాటలకు చిన్నగా నవ్వాడు ప్రకాశం ''మరి మన ఆర్థిక పరిస్థితులు అలాటివి'' అన్నాడు

''అవుననుకోండి అయినా మరీ ఇంత దిగజారి బ్రతకటం ఏం బావుంటుంది''

''బాగుండేదేంది మీరిద్దరు కాకపోతే ముగ్గురు మీకు పెద్దగా ఆర్థిక పరమైన ఇబ్బందులు లేవు నేనూ ఒకప్పుడు నీలాగే అనుకున్నాను కాని ఇలా ప్రతివాళ్ళముందూ చెయ్యి చాచే పరిస్థితీ, అవమానాలు భరిస్తూ, అడ్డమొచ్చిన వాళ్ళందరికీ వంగి వంగి దండాలు పెడుతూ జీవించే స్థితీ

వచ్చిందంటే మన ఆర్థిక స్థితిగతులు అలాటివి కడుపుకింత తిండికోసం మానాన్ని అమ్ముకొని జీవించే దాని దగ్గరకు పోయి మనం చెయ్యి జాస్తున్నాం అంతకన్నా అవమానం, పాపం ఏముంది దానికెందుకు పాల్పడుతున్నామో, ఈ భోజనం కోసం కూడా అందుకే పాల్పడుతున్నాము'' అన్నాడు ప్రకాశం

ఆంజనేయులు కొద్ది సేపు ఏమీ మాట్లాడలేదు ''మీతో మాట్లాడటం కష్టం '' అన్నాడు నవ్వుతూ ఇద్దరూ నవ్వుకున్నారు తరువాత అతను వెళ్ళిపోయాడు

ప్రకాశం ఆంజనేయుల్ని గురించి ఆలోచించాడు 'కుర్రవాడు మంచోడే పోలీసుల్లో ఈ మాత్రం స్నేహంగా ఉండగలిగేవాళ్ళు చాలా తక్కువ కపటం లేని మనిషి సూర్యం కన్నా ఓ అయిదారేళ్ళు పెద్దనుకుంటా' అనుకున్నాడు తన కొడుకుని గుర్తు చేసుకుంటూ ఇంటికెళ్ళి స్నానం చేసి, పక్క గుడ్డలు తీసుకున్నాడు సూర్యం లక్ష్మిని తీసుకుని ఇంజక్షను చేయించుకుని రావటానికి వెళ్ళినట్లున్నాడు

ప్రకాశం మిల్లు దగ్గర కెళ్ళాడు అక్కడ వీళ్ళంతా కలిసి మిల్లు యజమాని చెప్పిన హోటల్ కెళ్ళి భోంచేసి వచ్చారు అక్కడి పోలీసులంతా వాళ్ళు వుంటున్న గది బయట , రోడ్డుమీద పక్కలు వేసుకున్నారు మిల్లులోని మురికి నీరు బైట సైడు కాల్వలో నిలబడిపోయి ముక్కులు పగిలిపోయే దుర్వాసన వేస్తోంది ఎదురుగా టెంట్‌లో వర్కర్లు ఏవో మాట్లాడుకుంటున్నారు

''అబ్బాయిలూ, నేను వెళుతున్నాను ఎవరన్నా మన ఆఫీసర్లు చెకింగుకి వస్తే, ఎప్పుడొస్తే అప్పుడు, 'ఇంతకుముందే వెళ్ళాడు సార్, కడుపులో నొప్పిగా వుందని టాబ్లెట్లు తెచ్చుకోవటానికి' అని ఆ వచ్చిన ఆఫీసరుకు చెప్పి , మీలో ఒకళ్ళు వచ్చి నాకు కబురు చెయ్యండి'' అన్నాడు సార్జెన్

''సరేలే సార్ ఇది మనకు పుట్టుకతో వచ్చిన విద్యే కదా'' అన్నాడు ఒక కుర్ర కానిస్టేబులు సార్జెన్ నవ్వుతూ వెళ్ళిపోయాడు

రెండు రోజుల పాటు తిరిగి, రావలసిన డబ్బులు చిన్నగా వసూలు చేసుకున్నాడు ప్రకాశం లక్ష్మికి జ్వరం తగ్గింది మూడోరోజు జూట్ మిల్లు డ్యూటీ నుండి స్టేషను డ్యూటీకి పిలిపించారు

సూర్యంకూ, లక్ష్మికీ కాలేజీ, హైస్కూలుసీట్లు సంపాదించటానికి హైస్కూలు హెడ్‌మాస్టార్నీ, కాలేజి ప్రిన్సిపాల్‌ని కాళ్ళావేళ్ళా పడి ఒప్పించేసరికి తల ప్రాణం తోక కొచ్చింది సంవత్సరం మధ్యలో అడ్మిషన్లకు వాళ్ళు ఒప్పుకోలేదు మొదట చివరికి ఎలాగయితేనేం ఒప్పుకున్నారు ఆ పని అయ్యే సరికి పెద్ద బరువు దింపుకున్నట్టు వూపిరి పీల్చుకున్నాడు ప్రకాశం

ఆ రోజు మళ్ళీ గార్డు వేశారు గార్డు దిగి వారం రోజులు కూడా కాలేదు మళ్ళీ గార్డు డ్యూటీ

''అప్పుడే గార్డు డ్యూటీ ఏమిటండీ?'' అని అడిగాడు ప్రకాశం డబ్బా రైటర్ని

''అవునండీ మీకు టరన్ వచ్చింది '' అన్నాడు అతను

''ఏదీ, గార్డు డ్యూటీరోస్టర్ చూపించండి'' అన్నాడు ప్రకాశం

డబ్బా రైటరు పుస్తకం తీసి ప్రకాశం ముందు వుంచాడు తన నెంబరికి పైనున్న నెంబర్ల వాళ్ళంతా గార్డు చేశారా అని చూశాడు ప్రకాశం పై నెంబర్లలో షుమారు పదిమంది గార్డు డ్యూటీ చెయ్యవలసిన వాళ్ళున్నారు

''ఇతను చేశాడా?'' అడిగాడు ప్రకాశం ఒక నెంబరుమీద వేలుపెట్టి

''అతనా?, అతనూ ఇదిగో ఈ నెంబరతనూ వీళ్ళిద్దరూ డీ యస్పీ దొరగారి బంగళాలో

ఆర్డర్లీలు వీళ్ళిద్దరేమో సి ఐ గారింట్లో ఇతనేమో మూమూలుగా యస్సైగారికి అదీ ఇదీ చూస్తుంటాడు ఇదిగో ఈ నెంబర్ల వాళ్ళేమో యస్సైగారి దగ్గర ఐ డీ పార్టీ అంటే మఫ్టీ పీసీలు వీళ్ళిద్దరూ ఒకళ్ళు కోర్టు డ్యూటీ ఒకళ్ళు ప్రాసెస్ డ్యూటీ వీళ్ళు నలుగురూ సర్కిల్ ఐ డీ పార్టీ ఇతనేమో రైటరుగారి పనిమీద తిరుగుతున్నాడు ఇంక నెక్స్ట్ మీరే'' అన్నాడు అతను

''ఇతనెవరు?'' అన్నాడు ఒక నెంబరు చూపిస్తూ ప్రకాశం

''ఇతను సిఐగారి ఆఫీసులో ఇనస్పెక్టరు రైటరుకి అసిస్టెంటు అతనికెట్లా డ్యూటీ వేస్తాము?!'' అన్నాడు డబ్బా రైటరు

ప్రకాశం ఏమీ మాట్లాడలేదు గొణుక్కుంటూ బైట కొచ్చాడు ఆర్రోజులకు గార్డు డ్యూటీ అయిపోయింది

''ఇవ్వాళ నాకు ఆఫ్ కావాలి సార్'' అన్నాడు రైటరుతో

''యస్సైగారు ఎవరికీ ఆఫ్‌లు ఇవ్వొద్దన్నాడు'' అన్నాడు రైటరు తలవంచుకునే

''ఎందుకని? ఆర్రోజులు డ్యూటీ చేసినవాళ్ళకి ఏడో రోజు ఆఫ్ ఇవ్వాలి కష్టపడ్డోళ్ళకి ఆఫ్‌లు లేవా?''

''మెన్ లేరు''

''ఎందుకుంటారు? వున్నవాళ్ళల్లో సగం మందిని సొంత పనులకు వాడుకుంటుంటే, మెన్ ఎక్కడినుండి వస్తారు?'' అన్నాడు సీరియస్‌గా

రైటరు ఆ మాటకు ఏమీ సమాధానం చెప్పలేదు ప్రకాశం తిట్టుకుంటూ బైటకెళ్ళాడు అట్లా తిట్టుకోవటం సంవత్సరాల తరబడి ఆ వుద్యోగంలో అలవాటయింది

ఆ మధ్యాహ్నం స్టేషన్లో వున్నాడు ప్రకాశం షుమారు మూడు గంటలప్పుడు ఒకతను హడావిడిగా స్టేషను కొచ్చాడు అప్పుడు ప్రసాదరావు సార్జెన్ స్టేషన్ ఇన్‌చార్జి ఆ వచ్చినతను గబగబా ప్రసాదరావు దగ్గరకెళ్ళాడు అతన్ని చూస్తూనే సార్జెన్, ''ఏంది లింగం ఇటొచ్చావు?'' అన్నాడు లింగం వంగి సార్జెన్ చెవిలో ఏదో రహస్యం చెపుతున్నట్టు గుసగుసలాడాడు వెంటనే సార్జెన్ లేచి ప్రకాశాన్ని రమ్మన్నాడు ఇద్దరూ సైకిళ్ళమీద బయలుదేరారు లింగం స్టేషనులోనే వుండిపోయాడు

''ఎక్కడికి సార్?'' అడిగాడు ప్రకాశం

''చెపుతాను, వెంట రా'' అన్నాడు సార్జెన్ వాళ్ళు ఒక పెంకుటింటిముందు ఆగారు సార్జెన్ గబగబా సైకిలు దిగి, ఇంటి వెనుకవైపుకు వెళ్ళి దొడ్డి తలుపుకు గొళ్ళెం పెట్టి ముందువైపుకు వచ్చి తలుపు కొట్టాడు గట్టిగా రెండు నిముషాల నిశ్శబ్దం తరువాత తలుపు తెరుచుకుంది ఇద్దరూ లోపలి కెళ్ళారు లోపల ఇద్దరు కుర్రోళ్ళు, ఒక యువతి వున్నారు ఆ కుర్రవాళ్ళిద్దరిలో ఒకతని మెడకు కెమేరా వేలాడుతోంది వాళ్ళ ముగ్గురి ముఖాల్లో నెత్తురు చుక్క లేదు వీళ్ళని చూసేసరికి

''నడవండి స్టేషనుకు'' దబాయించినట్టు అరిచాడు సార్జెన్ ఆ అరుపుకు బిత్తరపోయారు కుర్రాళ్ళిద్దరూ

''అయ్యా, పెచాదరావుగారూ '' అంటూ బ్రతిమలాడే ధోరణిలో ముందుకు రెండడుగులు వేసింది ఆమె

''చంపేస్తాన్ దొంగముండా నోరు మూసుకుని నడువు'' కళ్ళల్లో కృత్రిమంగా నిప్పులు చెరుగుతూ అన్నాడు సార్జెన్ ఆ అరుపుకు ఆమె బిక్కచచ్చి పోయింది భయంగా చూసింది చామనఛాయ శరీరం, పెదాలకు రంగు వేసింది గాబోలు, గబగబా తుడుచుకోవటం వలన సరిగా

పోలేదు. ఆ కుర్రవాళ్ళిద్దరూ గుటకలు వేస్తూ నిలబడ్డారు వాళ్ళకు ముచ్చెమటలు పోశాయి గొంతు తడి ఆరిపోయింది కొద్దిసేపటికి తేరుకున్నారు ఒకతను కొంచెం ధైర్యం చేశాడు

''సార్, కొద్దిగా ఉండండి సార్ '' అన్నాడు

''నో మీరిద్దరూ స్టేషనుకు రావాల్సిందే'' అని ప్రకాశం వైపు చూచి, ''ప్రకాశం వాళ్ళిద్దరినీ స్టేషనుకు తీసుకుపో నేను దీన్ని తీసుకొస్తా'' అని ఆమెవైపు తిరిగి, ''శేషమ్మా ! కదులూ!'' అన్నాడు

''అబ్బాయిలూ కదలండీ'' లేని గాంభీర్యాన్ని తెచ్చుకుంటూ గట్టిగా అన్నాడు ప్రకాశం కాని అది పేలవంగానే వుంది

''వుండండి సార్ ఒక మాట సార్ '' అని ఒకతను బ్రతిమాలుతున్నట్టు సార్జెన్ దగ్గర కొచ్చాడు అతని చేతిలో యాభై రూపాయలున్నయ్ వాటిని చూపిస్తూ, ''సార్ మాదీవూరు కాదు సార్ ఇంకెప్పుడూ రాము సార్ '' అన్నాడు

''నో నో మీరు స్టేషనుకు రావాల్సిందే మీమీద కేసు పెట్టాల్సిందే ఆర్నెల్లకు తగ్గకుండా జైలుశిక్ష పడిద్ది'' అన్నాడు సార్జెన్ ఆ కుర్రవాళ్ళిద్దరూ ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు ఇంకో యాభై రూపాయిలు కలిపి వంద రూపాయలు ఇవ్వబోయారు సార్జెన్ ఒప్పుకోలేదు

''అబ్బాయ్ ఇట్టాంటి యాపారాలు మన దగ్గర పనికిరావు మీరు మర్యాదగా బయటకు నడవకపోతే, ఇద్దరినీ బలవంతంగా చేతులు కట్టి బజార్ల వెంట నడిపిస్తూ తీసుకెళ్ళాల్సి వస్తుంది తరువాత మీ యిష్టం పరువు పోయాక బతికి లాభం లేదు బయలుదేరండి'' అని ఆమెవైపు తిరిగి, ''నడవ్వేమే'' అన్నాడు కోపాన్ని నటిస్తూ

ఆ మాటతో వాళ్ళు బిక్కచచ్చిపోయారు జేబుల్లో వున్నదంతా తీశారు రెండువందల పదిహేను రూపాయలు వున్నయ్ మొత్తం ఆ డబ్బులు చేత్తో పట్టుకొని సార్జెన్ కాళ్ళు పట్టుకోవటాని కన్నట్టు ముందుకు వంగాడు ఒకతను ఆ డబ్బుల్ని చూశాక మౌనంగా వుండిపోయాడు, ఇంక వాళ్ళ దగ్గరేమీ లేవని నిర్ధారించుకున్నాక సార్జెన్ ప్రసాదరావు

''మీ భవిష్యత్తు దెబ్బ తినిద్దేమోనని ఆలోచిస్తున్నాను నాకూ మీ అంతటి కొడుకు వున్నాడు'' అన్నాడు గంభీరంగా

వాళ్ళకు కొంచెం ధైర్యం కలిగింది ఆమాటలు విన్నాక ఏం మాట్లాడకుండా నిలబడ్డారు

జేబులోంచి రెండు తెల్ల కాగితాలు తీసి, వాళ్ళ అడ్రసులు రాసుకుని సంతకాలు చేయించుకున్నాడు ''మీరు ఎల్లుండి కోర్టుకు రావాలి రాకపోయారో వారంటు తెచ్చి, మిమ్మల్ని అరెస్టు చేస్తా'' అన్నాడు సార్జెన్ వాళ్ళు గట్టిగా తలలూపారు

''అంతవరకేనా? ఇంక ఏమీ లేవా?'' అడిగాడు సార్జెన్

''లేవుసార్ మాకు చార్జీలకు కూడా లేవుసార్ కావాలంటే చూసుకోండి సార్'' అన్నారు వాళ్ళు జాలిగా

''సరే, ఈ పదిహేను రూపాయలు తీసుకోండి'' అని పైనున్న పదిహేను రూపాయలు ఇచ్చాడు వాళ్ళకి వాళ్ళు నమస్కారం చేసి వెనక్కి తిరిగి చూడకుండా పోయారు

''ఏందే, నీ సంగతేంది?'' అన్నాడు ఆమెవైపు చూచి

''రేపు మనిషిని పంపండయ్యా'' అంది ఆమె

''ఎంత? ఎంతిస్తావు? ఇద్దరం వచ్చాం ఇప్పుడు వీళ్ళేమీ యియ్యలేదా? ఇయ్యకుండానే

గుడ్డల్లేకుండా ఫోటోలు తీసుకోవటానికి వప్పుకున్నావా?''

''మా ఓనరు తీసుకుందండీ''

''ఎవరూ  తిరపతమ్మేనా?''

ఔనన్నట్లు తల వూపింది శేషమ్మ

''దానికి కబురు చెయ్యి పోయిన్నెల డబ్బులు ఇంతవరకు పంపలేదు దానికి రోజులు దగ్గర పడ్డాయని చెప్పు''

శేషమ్మ అన్నిటికీ తల వూపింది స్టేషనుకు తీసుకుపోకుండా వుంటే చాలనే భావం ఆమెలో వుంది ఈ సంభాషణ జరుగుతున్నంతసేపూ ప్రకాశం వింటూ మౌనంగా నిలబడ్డాడు

''ప్రకాశం నువ్వుపద, నేనొస్తాను'' అన్నాడు సార్జిన్ ప్రకాశం బైటకొచ్చాడు

''రాత్రికేదకన్నా ప్రోగ్రాం వుందా?'' అడిగాడు సార్జిన్ ఆమెని

నవ్వుతూ చూచింది శేషమ్మ ''ఏ పోగురాం అయినా మీ పోగ్రాం తరవాతేగా'' అంది ఆ మాటకు ఆనందంగా నవ్వాడు సార్జిన్

''సరే పదిగంటలు దాటిన తరవాత వస్తా'' అన్నాడు

''ఇప్పుడు ఏం?''

''ఇప్పుడు కాదులే డ్యూటీమీద వున్నప్పుడు అట్టాంటియ్యి పనికి రావు కాకీ గుడ్డలు వేసుకున్నప్పుడు అట్టాంటి తప్పుడు పనులు పనికి రావు'' అని నవ్వాడు అతని కళ్ళల్లో కోరిక కదులుతోంది

''ఇప్పుడు చేసింది ఏంపని ఆళ్ళ దగ్గర డబ్బులు తీసుకోటం తప్పుడు పనికాదా?'' అని కిసుక్కున నవ్వింది శేషమ్మ ఆ నవ్వుతో పాటు పైట జారిపోయింది

''ఇంక ఇక్కడ వుండకూడదు కానీ, వస్తా'' అంటూ తలుపులు తీసుకుని బైటకొచ్చాడు అటూ ఇటూ చూశాడు వీధంతా నిర్మానుష్యంగా వుంది ఒకళ్ళిద్దరు వీధి చివర నిలబడి ఇటేస్తే గమనిస్తున్నారు సార్జిన్, ప్రకాశం ఆ ఇంటిదగ్గరకు రావటంతో ఆ వీధిలోని, ఆ పేటలోని బ్రోతల్స్ అంతా గప్‌చిప్‌గా తప్పుకున్నారు పోలీసులు రెయిడ్ చేస్తున్నారనే భయం ఆ కొంపల్లో వ్యాపించింది కాని ఇద్దరే రావటం చూచి ఆ వుద్దేశ్యం మార్చుకున్నారు అయినా సార్జిన్, ప్రకాశం వెళ్ళిపోయిందాకా గోడలచాటున, మొత్తల మాటున పొంచివుండి చూస్తున్నారు వాళ్ళు వెళ్ళిపోయాక ఫ్రీగా గాలి పీల్చుకున్నారు

సార్జిన్ సైకిలెక్కుతూ ఆమెవైపు చూచి ''పది గంటల తరువాత'' అంటూ నవ్వుతూ ముందుకు సాగాడు

''పోరా దొంగసచ్చినోడా ఎన్నడు పురుగులు పడిపోతారో'' అని గొణిగింది మెటికలు విరుస్తూ ఆమె

సార్జిన్ స్టేషన్ కొచ్చేసరికి ఇన్‌ఫార్మెంటు లింగం అక్కడే వున్నాడు సార్జిన్ సైకిల్ స్టాండు వేస్తూ, అతన్ని చూస్తూ, ''ఏమిటోయ్, అన్నీ తుక్కుకేసులు యదవ లిద్దరి దగ్గర కలిపినా యాభై రూపాయలు లేవు'' అంటూ కుర్చీలో కూలబడ్డాడు ప్రకాశం తలవంచుకొని చిన్నగా నవ్వుకున్నాడు

''ఇదిగో, ఇది తీసుకో'' అని ఒక అయిదు రూపాయలు లింగం కిచ్చాడు

అతనది తీసుకుని ''వస్తాన్ సార్'' అన్నాడు నమస్కారం చేస్తూ

''ఆఁ ఆఁ పోయిరా ఏంటి, కాస్త గట్టి ఇనఫర్‌మేషన్ తీసుకురా మాకో పదోస్తే, నీకు ఓ పదొస్తాయి'' అన్నాడు సార్జెన్

''అట్టాగేసార్ ఈసారి చూడండి సేట్ ఒకడు మూర్తిగాడి కంపెనీకి వత్తన్నాడు శానా సీకిరెట్టుగా వత్తన్నాడు ఒక్కోసారి పిల్లని తీసుకుపోతన్నాడు ఆడీసారి వచ్చినప్పుడు సెపుతా'' అన్నాడు లింగం ఆ మాటకు సార్జెన్ ఎగిరి గంతేసినంత పనిచేశాడు

''అట్టాంటిది సూడరా! కొడితే పచ్చముద్దలు కొట్టాలిగాని, ఇట్టాంటి సన్నాసి నాయాళ్ళ దగ్గరేముంటుంది బూడిద'' అన్నాడు ఆనందంగా

లింగం నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు

రెండు నిముషాలు గడిచాయి

''ఏంది ప్రకాశం నీ సంగతేమిటోచెప్పు నువ్విట్టాంటి బ్రోతల్ డబ్బులు తీసుకోవాయె నీదంతా ప్రిన్సిపుల్ లైఫాయె'' అని జేబులోంచి డబ్బులుతీసి, ఒక ముప్పైరూపాయలు టేబిలుమీద పెట్టాడు ''తీసుకో ఫరవాలేదు ఇయ్యి వాళ్ళ దగ్గరియ్యిలే దాని దగ్గర మనం ఏమీ తీసుకోలేదు నేనుకూడా నీ సిద్ధాంతాన్నే సమర్థిస్తాను చాలావరకు అయితే ఈ డబ్బులు ఆ కుర్ర నా కొడుకులియ్యిలే వాళ్ళ డబ్బులకేం ఫరవాలేదు తీసుకో'' అన్నాడు

ప్రకాశం మారు మాట్లాడకుండా తీసుకుని జేబులో పెట్టుకున్నాడు ఆ డబ్బులు ఆ కుర్రాళ్ళవి కాకపోయినా, శేషమ్మవే అయినా తీసుకునే వాడే అతని అర్థిక ఇబ్బందులు, అతని ప్రిన్సిపుల్స్‌ని వంచి వేస్తున్నాయి నాలుగు రోజుల క్రితమే భార్యకు టాబ్లెట్లూ, ఇంజక్షన్లు అయిపోయాయి ఆ మందుల్ని గనక మధ్యలో వాడటం ఆపితే, రోగం బలం పెరుగుతుందనీ, తరువాత ఇంకా ఎక్కువ పవరున్న మందులు, ఎక్కువ మోతాదులో వాడాల్సి వస్తుంది కాబట్టి, తాము తిన్నా తినకపోయినా భార్యకు మందుల్నీ, మంచి ఆహారాన్నీ ఇవ్వటంలో అశ్రద్ధ చెయ్యవద్దనీ, అలా చేస్తే ఇన్నాళ్ళు వాడిన మందులన్నీ బూడిదలో పోసినట్లేననీ డాక్టరు చెప్పిన మాటలు అతని మనస్సులో కదులుతూవున్నయ్

'ఈ మందులు వాడాలి బలానికి పాలూ, గుడ్లూ, మాంసం వాడుతుండాలి అట్లాంటప్పుడే ఆమె క్షయ తగ్గుతుంది' అన్నాడు డాక్టరు వచ్చే జీతం డబ్బులు కనీసపు అవసరాలకే సరిపోవటం లేదు పరిస్థితులు అతని మనోబలాన్ని క్రమంగా దిగజార్చేస్తున్నాయి శారీరకబలం ఏనాడో సన్నగిల్లింది మొన్నటికి మొన్న ఆంజనేయులితో తను, బ్రోతల్స్ దగ్గర డబ్బులు తీసుకోవటం పద్ధతి కాదన్నాడు వేరే గత్యంతరం లేక మానాన్ని అమ్ముకుని జీవించే వాళ్ళ దగ్గరనుండి డబ్బులు తీసుకోవటం తనకిష్టంలేదని అతనితో అన్నప్పుడు ఎంతో ఆనందం కలిగింది తనేదో, తనకు తెలిసినంతలో, ఒక సిద్ధాంతానికి కట్టుబడ్డట్టు, మిగిలిన వారిలోకన్నా తనలో ఒక ప్రత్యేకత వున్నట్టు భావించాడు కాని అతని ఆర్థిక పరిస్థితులు అతన్ని, అతని సిద్ధాంతాలనుండి దూరం చేస్తున్నాయి ఆ పరిస్థితుల్ని ఎదిరించి, కలిగే కష్టాల్నీ భరించేశక్తి అతనిలో నశిస్తోంది క్రమంగా సర్వీసు పెరిగేకొందీ జవసత్వాలు తగ్గిపోతున్నాయి ఆర్థిక పరమైన ఇబ్బందులు తీవ్రమౌతున్నాయి కళ్ళముందు జరిగే అన్యాయాల్ని గురించి కనీసం నోరెత్తలేని పరిస్థితి ఏర్పడుతోంది పరిస్థితులకు తలొగ్గేస్థితి తీవ్రమవుతోంది

''నేను బ్రోతల్స్ దగ్గర డబ్బులు తీసుకోనని ఎవరన్నారు సార్'' అన్నాడు ప్రకాశం సార్జెన్ ప్రసాదరావుతో

''అందరూ అనుకుంటున్నారు గదయ్యా? మనోళ్ళే అన్నారు'' అన్నాడు సార్జెన్ సిగరెట్టు వెలిగించుకుంటూ

''అదేలేసార్ ఒకసారి అంజినీలుతో అన్నా''

''అయినా ఇలాటివన్నీ పట్టుకుని కూర్చుంటే మనకు పస్తులే గతి మనకొచ్చే జీతభత్యాలు మన కనీసావసరాలకు ఏం సరిపోతాయి పోలీసు జవానంటే అతనికి రెండు కాపురాలున్నట్టు లెఖ్ఖ ఎందుకంటే ఎప్పుడూ వూళ్ళమీదే తిరగటం ఆ తిరుగుళ్ళకు అయ్యే ఖర్చులతో ఒక చిన్న కుటుంబాన్నే పోషించవచ్చు అటువంటప్పుడు ఈ సిద్ధాంతాలు మనల్నింకా ఇబ్బందులకు లోనుచేస్తాయే తప్ప, లాభంలేదు నేను ఉద్యోగంలోకి రాకముందు పోలీసోళ్ళని చూచి చాలా అసహ్యించుకొనేవాడిని, తీవ్రంగా విమర్శించేవాడిని కాని ఏ ఉద్యోగం దొరక్క ఇందులోకి వచ్చిన తరువాత ఈ పరిస్థితులు నన్ను ఇలా తయారుచేశాయి దిగినవాడికే కదా లోతు తెలిసేది చదువుకొనేటప్పుడు జీవితాన్ని ఆదర్శంగా గడపాలనీ, హానెస్టుగా బ్రతకాలనీ కలలుకనేవాడిని అలాటి కథలు, నవలలూ చదివి, జీవితాన్ని అలా గడపొచ్చునుకునేవాణ్ణి కానీ వాస్తవంలో ఎంతో తేడా వుంది నాకు తెలిసినంత వరకూ ఈ పోలీసు వ్యవస్థలో నీతిగా బ్రతకటానికి వీలులేదు, వీలుకాదు మన కేడరుకేకాదు పై కేడరుగూడా సి ఐ, డియస్పీల దాకా ఎందుకంటే మనం పళ్ళబిగువున జీతంరాళ్ళతో బ్రతకాలని ప్రయత్నించినా, మన పై ఆఫీసర్లు మనల్ని అలాగుండనివ్వరు ఉదాహరణకు నేనే రైటర్ననుకో వచ్చే ఆఫీసర్లకూ పోయే ఆఫీసర్లకు ఎన్నిరకాల సప్లయిలు చెయ్యాలి వాటన్నిటికీ జీతం డబ్బులు ఎక్కడపెడతాం సప్లయిలు చెయ్యకుండా ఉండటానికి ఎట్లావీలయిద్ది ఈ ఆఫీసరు ముండా కొడుకులు ప్రతివాడికీ ఏదో ఒక టెండరు వేసేపనేగా, ఒక్క కానిస్టేబుళ్ళని మినహాయించి వాళ్ళల్లోకూడా కాస్త గట్టి పీసీలుంటే వాళ్ళకీ ఏదో ఒకటి, వాళ్ళ స్థాయికి తగ్గది వేసే పనేగా ఇక సార్జెన్ అంటే చాలు, వాడికి ఏదో ఒక టెండరు పెడతారు సి ఐల, డియస్పీల దృష్టిలో సార్జెన్లూ, యస్సైలూ అంతా ఎంతో ఆదాయంతో మునిగిపోతున్నట్టు కనపడతారనుకుంటా ఏదో సామెత చెప్పినట్టు కామెర్ల రోగికి లోకమంతా పచ్చగా కనపడినట్లు, వాళ్ళ దృష్టిలో అందరూ సంపాదించేవాళ్ళే ఆ దృష్టితో వాళ్ళు మనల్ని చూస్తున్నప్పుడు నీబోటి, నాబోటి వాళ్ళం అన్యాయంగా బలయిపోక ఏముంది చెప్పు ఆ మృగాల బారినుండి మనం ఎంతకాలం తప్పించుకు తిరగగలం వాళ్ళ టెండర్లు తీర్చలేకపోతే, అది మనసులో పెట్టుకుని తీసుకుపోయి ఏ శ్రీకాకుళం అడవుల్లోనో వేస్తారు అంతటితో ఆ నిర్భాగ్యుడి బ్రతుకు హరీ మనాల్సిందే లేదా ప్రొబేషనరయితే ప్రొబేషను పూర్తి చేయరు వాడి సర్వీసు రిజిష్టరంతా రిమార్కులతో నిండిపోయిద్ది చివరకు రివర్షను దాకా తెస్తారు ఏ రికార్డులోనో ఇరికిస్తారు డిస్‌మిస్ దాకా తీసుకుపోతారు ఈ పరిస్థితులన్నిటికీ తట్టుకోగలిగిన వాడెవడూ నాకు కనపడలా ఇట్లా ఇంటికిపోతే మనం కనీసం అడుక్కోవటానికి కూడా పనికిరాము మనస్సుకు బాధ కలుగుతున్నా మనమా పరిస్థితులకు తల ఒగ్గక తప్పదు మనకొక బేడా, వాడికొక పావలా ఇంతే ఈ జీవితాలు ఇట్లా ఆఫీసర్ల సేవలో వెళ్ళమారి పోవాల్సిందే నీకు చెప్పేతంటటివాడిని కాదనుకో నాకంటే సర్వీసులో, వయస్సులో, ప్రపంచానుభవంలో, అన్నిట్లోనూ పెద్దోడివి కాబట్టి నువ్విట్లాంటి య్యేమీ పెట్టుకోమాక మనస్సు గట్టిపరచుకోవాలి ఏ డిపార్టుమెంటులో లేదంటావు ఇది? అన్నిచోట్లా ఇంతకన్నా ఎక్కువ వుంది కాని ఇందులో మాత్రం మనం తీసుకునే పావలా పాతికమంది కళ్ళల్లో పడటానికి అవకాశముంది మిగతా డిపార్టుమెంటుల్లో వాళ్ళు పదివేలు

తీసుకున్నా, తీసుకున్నోడికీ, ఇచ్చినోడికి మినహా మూడో కంటికి తెలియటానికి అవకాశం లేదు కాదంటావా?''

'ఔనన్న'ట్టు తల వూపాడు ప్రకాశం

ఆ మధ్యాహ్నమే భార్యకు మందులు తెచ్చాడు నాలుగురోజులు మందులు మానేసరికి ఆమెకి కొద్దిగా దగ్గు వస్తోంది ''మెడికల్ షాపులో అప్పు యివ్వటానికియినా మనకీ వూరు కొత్తాయె'' అన్నాడు భార్యతో

ఆమె బాధగా నిట్టూర్చింది ''నాకీ జబ్బు నన్ను తింటానికి కాదు, నిన్ను తింటానికి వచ్చింది'' అంది ఆమె కళ్ళల్లో నీళ్ళూరాయి చిన్నగా ఆమెకి ఆమె అన్న మాటలు వింటూ, ఆమెనలా చూస్తుంటే చాలాసార్లు కలిగిన భావమే ఇప్పుడూ కలిగింది ప్రకాశానికి

'ఆత్మాభిమానం, ఆత్మ గౌరవం, పరువూ ప్రతిష్ఠా ఇవన్నీ అనవసరం నా భార్యా పిల్లలే నాకు కావాలి వాళ్ళు లేకపోయినప్పుడు ఇవేవీ నాకు ఆనందం కలిగించవు ఇకనుండి నేను డబ్బు సంపాదనకే ప్రాధాన్యత ఇస్తాను నా భార్యా బిడ్డలకు ఎటువంటి ఇబ్బంది లేకుండా చేస్తాను ఎందుకూ పనికిరాని నాయాళ్ళు ఇట్టా డిపార్టుమెంటులోకి వచ్చి, అట్టా బాగుపడిపోతుంటే నేనేనా అంత చవటను' అనుకున్నాడు ప్రకాశం

అతని సర్వీసులో అలా అనుకున్న సందర్భాలు కొల్లలు కాని ఆ వుద్దేశ్యం ఇంటి గుమ్మం దాటిందాకానే యూనిఫారం వేసుకున్న మరుక్షణంలో అతని మనస్సుకి నచ్చని పనులేవీ చెయ్యలేడు అలాగని యూనిఫారం వేసుకోనప్పుడు చెయ్యగలడనో, అది యూనిఫారం గొప్ప అనో కాదు ఏ పరిస్థితులు అతని తత్వాన్ని అలా మలిచాయో కాని, వాస్తవ పరిస్థితులకూ, అతని మనస్తత్వానికి భయంకరమైన ఘర్షణ అతను సర్వీసులో చేరిందగ్గర నుండీ జరుగుతున్నదే ఇప్పుడనుకున్నట్లు ఎన్నోసార్లు అనుకున్నాడు అనుకోవటంవరకే అతను చెయ్యగలిగింది ఆ మాట ఇప్పుడూ అనుకుని తనలోతాను బాధగా నవ్వుకున్నాడు 'ఈ బ్రతుకులిట్టా గడిపెయ్యాల్సిందే దాన్ని గురించిన ఆలోచన అనవసరం' అనుకున్నాడు మళ్ళీ భోంచేసి పడుకున్నాడు

సాయంత్రం నిద్ర లేచేసరికి నాలుగు గంటలయ్యింది మందులు కొనుక్కురాగా జేబులో ఇంకా ఏడెనిమిది రూపాయలున్నయ్ నిద్రపోయి లేచేసరికి హుషారుగా వుంది మొహం కడుక్కుని వచ్చి మంచం మీద కూర్చున్నాడు పక్కింటివాళ్ళ రేడియోలోంచి పాటలు వినపడుతున్నయ్ 'ఈ సర్వీసంతా ప్రయత్నం చేసినా వంద రూపాయలు పెట్టి చిన్ని రేడియో కొనుక్కోలేకపోయా, ఛీ' అనుకున్నాడు

జర్మన్‌సిల్వర్ గిన్నెలో వేయించిన పెసలు, దోసగింజలు కలిపి తెచ్చి పక్కన పెట్టింది భార్య గిన్నెలోంచి కొంచెం తీసుకుని నోట్లో పోసుకుని నములుతూ, ''నువ్వు పొయ్యి దగ్గరకు ఎందుకు పోతావ్, వేడయితే అసలే'' అన్నాడు

''ఆఁ ఇంక డాక్టర్లు చెప్పినట్టు అన్నీ అమరుతాయా మనకి'' అంది ఆమె గడపమీద కూర్చుంటూ మాట్లాడుతూ అవి తిని మంచినీళ్ళు తాగాడు లేచి నిక్కరూ, తెల్లచొక్కా తొడుక్కుని బైటకెళ్ళాడు కాసేపు అటూ ఇటూ తిరిగి, ఒక టీ తాగి ఇంటికి బయలుదేరాడు దారిలో ఒక అర్థ రూపాయి పెట్టి పకోడీలు కట్టించుకొచ్చాడు

ఆ రాత్రి కొడుకూ, కూతురూ, భార్యా, తనూ కలిసి కబుర్లు చెప్పుకుంటూ పకోడీలు తింటూ కుంటూ భోంచేశారు

''ఇక్కడి కొచ్చినాక నాన్నకి కాస్త రెస్ట్ దొరుకుతోంది'' అంది లక్ష్మి

''ఏం రెస్టమ్మా ఇక్కడికొచ్చి రెండు వారాలు దాటుతోంది కదా ఇవ్వాళేగా ఇంటి దగ్గరుంది'' అన్నాడు ప్రకాశం బాగా పొద్దుపోయిందాకా కబుర్లు చెప్పుకున్నారు తాముండి వచ్చిన వూరిలోని స్నేహితుల్ని గుర్తు చేసుకున్నారు ఎప్పటికో నిద్రలోకి జారిపోయారు

తెల్లవారింది ఆ రోజు ఆదివారం

''ఈపూట ఒక కిలో మాంసం తెస్తానే, శానా రోజులవుతోంది'' అన్నాడు భార్యతో

''డబ్బులున్నయ్యా?''

''ఆఁ నిన్నటోటిల్లో ఏడు రూపాయలు మిగిలినియ్యి'' అని కాకీ సంచి తీసుకుని మార్కెట్టుకు బయలుదేరాడు వూరి మధ్యలో కూరగాయల మార్కెట్టు దాని నానుకుని మాంసం మార్కెట్టు మాంసం మార్కెట్టు బయటనుండే, ముక్కులు పగిలిపోయే దుర్వాసన వస్తోంది 'అబ్బా' అనుకుంటూ లోపలికి అడుగు పెట్టాడు వాసనకి వాంతి వస్తుందేమో అనిపించింది

అంతకుముందు తను చేసిన ఏ వూరిలోనూ ఇలా మాంసం మార్కెట్టూ, దాని నానుకుని చేపల మార్కెట్టూ, వాటికి పక్కగా కూరగాయల మార్కెట్టూ లేవు అందువలన అతనికి ఇది కొత్త అనుభవం అక్కడి వాతావరణం చూసేసరికి రోత పుట్టింది మాంసం తినాలనే కోరిక చచ్చిపోయింది కాని ఇంటిదగ్గర పిల్లలు గుర్తొచ్చారు ముందుకు కదిలాడు కోసిన వేటలు రేకు షెడ్డుల్లో వేలాడుతున్నయ్ ఒక పక్క ఎండు చేపలు గంపల్లో పోసి అమ్ముతున్నారు మరోపక్క రకరకాల పచ్చి చేపలు, ఒకవైపు కోడి మాంసం కోళ్లను కోసి పీకిన బొచ్చు అంతా ఎక్కడపడితే అక్కడ వుంది మార్కెట్టు నిండా ఈగలు ఎగురుతుంటే వాటి రెక్కల శబ్దం ఝుంమ్మని వినపడుతోంది

అంతా చిత్తడి ఒక బండమీద వేటల నెత్తురు గిన్నెల్లో పెట్టి అమ్ముతున్నారు ఒకమూల పందులు అరుస్తూ తిరుగుతున్నయ్ ఇక నిలబడలేకపోయాడు వాంతి వచ్చే సూచనలు కనపడ్డాయి రెండోగేటు గుండా బయటకొచ్చాడు 'పల్లెల్లో గొడ్లు కోసే చోటు ఎంతో శుభ్రంగా వుంటుంది ఈ లెఖ్ఖన' అనుకున్నాడు

మార్కెట్టు ప్రక్కనే పెద్ద మురుగు కాలవ పారుతోంది రోడ్డు మీద పెద్ద పెద్ద బుట్టల్లో పెట్టి కోళ్లని అమ్ముతున్నారు కోళ్ళు కొనుక్కున్నవాళ్ల దగ్గరకొచ్చి కొంతమంది చిన్న కుర్రవాళ్ళు, ''కోళ్ళను కోసి బొచ్చు పీకిస్తాము, ఒక పావలా ఇవ్వండి సార్'' అని బతిమాలుతున్నారు కొంతమంది కుర్రోళ్ళు అలా బొచ్చు పీకిన కోళ్లని చుట్టుపక్కల దొరికే చెత్తా చెదారంతో మంట వేసి కాల్చి, పక్కనే పారుతున్న నీళ్ళల్లో కడిగి తెస్తున్నారు అది చూచి 'ఛీ, అబ్బా ఎంత దరిద్రంరా భగవంతుడా' అనుకున్నాడు ప్రకాశం వళ్ళు చిటచిటలాడింది అవతలకు వెళ్ళి ఒక అరడజను కోడిగుడ్లు కొన్నాడు కూరగాయల మార్కెట్టులోకి వెళ్ళాడు

కూరగాయలు, ఆకుకూరలూ అమ్మేవాళ్ళు గొంతులు చించుకొని అరుస్తున్నారు దూరంగా రోడ్డుపక్కన దిబ్బల్లాగా కుళ్ళిపోయిన కూరగాయలు పారబోశారు కొంతమంది చిన్నపిల్లలు ఆ కుళ్ళిన కూరగాయల్లో కొద్ది మంచివాటిని ఏరుకుంటున్నారు వాళ్ళకు మొలచుట్టూ కూడా సరైన బట్టలు లేవు వంటిమీద పేరుకుపోయిన మట్టి, వాళ్ల అసలు రంగుని దాచేస్తోంది వాళ్ళతోపాటు పోటీగా పందులు ఆ కుళ్ళిన కూరగాయల్ని పెళ్లగిస్తున్నాయి ఏరుకున్న కాయల్ని

చినిగిపోయిన విస్తరాకుల్లో వేసుకుంటున్నారు వాళ్ళు ఆ దృశ్యం చూస్తూ మార్కెట్టులోకి వెళ్ళి కూరలు కొనుక్కొని ఇంటికెళ్ళాడు

మధ్యాహ్నం భోజనం చేసి పడుకున్నాడు మూడవుతుండగా కానిస్టేబులు పర్వతాలు వచ్చి పిలిచాడు ''మార్కెట్టు దగ్గర మీటింగు వుందట సాయంత్రం అయిదింటికి యూనిఫారం వేసుకుని రమ్మన్నారు రైటరుగారు వెంటనే'' అని చెప్పి వెళ్ళిపోయాడు ప్రకాశం చిన్నగాలేచి యూనిఫారం వేసుకొని, లారీ తీసుకుని బయలుదేరాడు ఒక పావుగంటలో హెచ్ సీలు, పీసీలు అంతా వచ్చారు యస్సై అందరినీ ఫాలెన్ చేశాడు

''సాయంత్రం అయిదింటికి మార్కెట్టు ఎదురుగావున్న మైదానంలో మీటింగు వుంది మీరంతా ఒక్క పావుగంటలో అక్కడకు చేరాలి ఇప్పుడు నాలుగయ్యింది నాలుగుంబావుకల్లా అక్కడుండాలి పదండి నేనొస్తున్నాను'' అని చెప్పి సి ఐ రూంలోకి వెళ్ళాడు యస్సై స్టాఫంతా బయటకు కదిలారు

''ఎలక్షన్లు వస్తున్నాయిగా, ఇక రాజకీయ నాయకుల మీటింగులతో మన దుంపలు తెగుతాయి'' అన్నాడు ఎవరో ఒక పీసీ అంతా సైకిళ్ళెక్కి మీటింగు జరిగే చోటుకి చేరుకున్నారు అప్పటికే అక్కడికి యస్సై, సి ఐ వచ్చివున్నారు జీపులో

మీటింగుకి స్టేజీ కడుతున్నారు కొంతమంది దూరదూరంగా గుంజలు పాతుతున్నారు మైకులు కట్టటానికి దూరంగా వున్న పెద్ద రావిచెట్టు మీద పక్షులు అరుస్తూ ఎగురుతున్నయ్ అందరినీ అక్కడే ఫాలెన్ చేశాడు సి ఐ చిన్న ఉపన్యాసం మొదలుపెట్టాడు వెనకవరసలో నిలబడ్డ పీసీలు సి ఐ ని బూతులు తిడుతున్నారు 'నా కొడుక్కి బజారనీలేదు, స్టేషననీలేదు ఎక్కడపడితే అక్కడ ఫాలెన్ చెయ్యటమే ఇట్టాంటి నా కొడుకు లుండబట్టే డిపార్టుమెంటు పరువుపోతోంది' అని కసిగా తిడుతున్నారు రోడ్డునపోయే జనం వాళ్ళని వింతగా చూస్తూ నిలబడ్డారు వాళ్ళట్లా చూస్తుంటే అవమానంగా వుంది కొంతమంది పీసీలకి

''వీళ్ళిప్పుడు అధికారంలో వున్న పార్టీవాళ్ళు మన బందోబస్తులో ఏదన్నా పొరపాటు జరిగిందంటే మన తాట వొలుస్తారు అలాటిదేమన్నా జరిగితే నే నూరుకోను సస్పెన్షన్‌కి రిపోర్టు కొడతా తరవాత మీయిష్టం మీ పోస్టుల్లో మీరుండండి జాగ్రత్తగా చేసుకోండి మీటింగు అయిపోయిందాకా ఎవరూ ఎటూ పోకూడదు మీటింగు అయినాక అందరూ మళ్ళీ ఇక్కడే ఫాలెన్ అవ్వాలి'' అని యస్సైవైపు తిరిగి, ''అందరి నెంబర్లూ నోట్ చేసుకో ఎవరెవరిని ఎక్కడ పోస్టు చేస్తున్నదీ నాకు చెప్పు'' అన్నాడు

''పోరా నీయమ్మ నీబోటి పిరికి నా కొడుకులుంటే అందర్నీ సస్పెన్షన్‌లో పెట్టెయ్యక ఏముంది'' అన్నాడొక పీసీ బహుచిన్నగా

''బహుపిరికోడు'' అన్నాడింకొకతను ఇంకా చిన్నగా యస్సై అందరికీ పోస్టింగులు చూపించాడు తనతో కొంతమందిని వెంటబెట్టుకొని అక్కడున్న షోడాబండ్లనీ, మిరాయి బండ్లనీ, అరటికాయబండ్లనీ దూరంగా తోలాడు

''షోడాబండ్లని ఎట్టి పరిస్థితుల్లోను ఈ చుట్టుప్రక్కల వుండనియ్యొద్దు'' అన్నాడు అలాగే అని తలలూపారు పీసీలు హెచ్‌సీలు సాయంత్రం అయిదు దాటిపోయింది ఇంకా స్టేజీ కట్టటం పూర్తికాలేదు రావిచెట్టుకి కొద్దిదూరంలో ప్రకాశాన్నీ, పర్వతాల్ని వేశారు కొద్దిసేపటికి గుంజలన్నిటికీ లౌడ్‌స్పీకర్లు కట్టి, సినిమాపాటలు వెయ్యటం ప్రారంభించారు మరీ మైకు చెవుల్లో

పెట్టినట్లుగా భరించలేని శబ్దంగా వుంది పొద్దుగూకిపోతోంది స్టేజీమీద ట్యూబులైట్లు వెలిగిస్తున్నారు మైకు టెస్ట్ చెయ్యటం కోసం పాటలు ఆపారు

''మన మీ మైకు గోలలో నిలబడలేము సార్'' అన్నాడు పర్వతాలు

''కాసేపుండి, కాస్త చీకటి పడితే జనంలో పక్కకు తప్పుకోవచ్చు ఇప్పుడు యస్సై, సి ఐ లు మనల్ని చూస్తున్నారు'' అన్నాడు ప్రకాశం 'అంతేలే' అన్నట్లు తలవూపాడు పర్వతాలు క్రమంగా చీకటి ముసురుకొంటోంది జనం పోగవుతున్నారు రాత్రి ఏడు గంటలయ్యింది మైకుహోరులో చెవులు పగిలిపోతున్నాయి ఎనిమిది కాబోతున్నప్పుడు, వేస్తున్న పాట ఆపి, మంత్రిగారు వస్తున్నట్టు ప్రకటించారు జనమంతా స్టేజీవైపు చూశారు మంత్రిగారి గుణగణాల్ని పొగడ్తలతో ముంచేశాక, చిన్ని చిన్ని నాయకులు మాట్లాడిన తరువాత, మంత్రిగారు తాపీగా లేచి, నిలబడి అందరికీ నమస్కారం చేశాడు జనసమూహంలో నుండి గట్టిగా కరతాళ ధ్వనులు, కేకలు మిన్నుముట్టాయి కొద్ది క్షణాలపాటు ఆ శబ్దాలకు భయపడ్డట్లు రావిచెట్టుమీది పక్షులు గోలగా అరుస్తూ ఎగిరాయి మంత్రిగారు గున్న ఏనుగులా నాలుగడుగులు ముందుకేసి నిలబడ్డాడు మైకుముందు మైకు కుర్రోడు మైక్రోఫోనును మంత్రిగారి మూతికి దగ్గరగా వుండేలాగా ఎడ్జస్ట్ చేశాడు భుజంమీది జరీ కండువాని ఒకసారి సర్దుకుని ఎడంచేత్తో ఎత్తుగావున్న బొర్రని చిన్నగా నిమురుకున్నాడు చేతికున్న రాళ్ళ వుంగరాలు లైట్ల వెలుగులో తళతళ మెరుస్తున్నయ్ చిన్నగా గొంతు సవరించుకొని కుడిచేత్తో మైకు పట్టుకున్నాడు ఖరీదయిన సిల్కు చొక్కా జిగేలుమంటోంది జనమంతా చెవులు రిక్కించారు

''మహాజనులారా !'' ఉపన్యాసం ప్రారంభించాడు ఫులుస్టాపులూ, కామాలు లేకుండా జోరుగా సాగిపోతోంది ఉపన్యాసం '' ఇంతకాలం మా పార్టీ ఇలా అధికారంలో వుంటూ వస్తూ వున్నదీ అంటే దానికి కారణం మా పార్టీపై ప్రజలకున్న ప్రగాఢమైన ఆదరాభిమానాలే ప్రజలకంతటి అభిమానం ఈ పార్టీమీద ఎందుకుందని నేను మిమ్మల్నడుగుతున్నాను సమాధానం నేను చెపుతా '' అని తన బొర్రని ఒకసారి ఎడంచేత్తో తడుముకున్నాడు మళ్ళీ '' ఈనాడు ఈ దేశం ఇంత అభివృద్ధి సాధించిందంటే అది మా పార్టీకే సాధ్యమయ్యింది మేము భూసంస్కరణలు ప్రవేశపెట్టాము బక్క రైతులుకి రుణాలిస్తున్నాము నిరుద్యోగులకు స్వయం ఉపాధికల్పన ఏర్పాటు చేస్తున్నాము హరిజనులకు, గిరిజనులకు ఇళ్ళు కట్టిస్తున్నాము వరకట్నాన్ని నిషేధించాము త్వరలో ఈ దేశంలోపలికి సోషలిజాన్ని తీసుకు రావటానికి మా శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తున్నాము అందుకు కంకణం కట్టుకున్నాము '' అని ఆగాడు సోషవచ్చినట్టు అటూఇటూ చూశాడు వెనకనుండి ఒకతను మంచినీళ్ళు అందించాడు అవి తాగి, జనంవైపు చూచి, జరీకండువాతో పెదాలు అద్దుకుని, నుదురు తుడుచుకుని మళ్ళీ మైకు పట్టుకున్నాడు '' ఈనాడు ఈ దేశంలోవున్న అన్ని ప్రతిపక్షాలు మమ్మల్ని గద్దె దింపటానికి అనేక రకాల ఎత్తులు వేస్తున్నాయి మా పరిపాలనలో దేశంలో ఆకలిచావులు ఎక్కువయ్యాయంట ''

ప్రకాశం విసుగ్గా తల పక్కకు తిప్పాడు రావిచెట్టు కింద బిచ్చగాళ్ళు కొంతమంది కలిసి అన్నం వండుకుంటున్నారు రావిచెట్టుచుట్టూ వున్న చెత్తాచెదారంపైనే మూడు రాళ్ళు పెట్టి పొయ్యిగా చేసి, వాటిమీద మట్టికుండ పెట్టి కుండ కింద చుట్టుపక్కల సైకిలుషాపుల దగ్గర, చెప్పుల షాపుల దగ్గర దొరికే టైరు ముక్కలు తెచ్చి మంట వేస్తున్నారు రబ్బరు కాలుతుంటే వాసన వస్తోంది వాళ్ళకీ ఉపన్యాసం పట్టలేదు వాళ్ళ ప్రక్కనే ఇంకొక గ్రూపు కూర్చుని

అడుక్కొచ్చుకున్న అన్నం తలాకాస్త పంచుకుంటున్నారు ఎక్కువగా వున్న పచ్చడి అందరూ సర్దుకుంటూ ఏదో ముచ్చట్లో పడిపోయి వున్నారు చిరిగి పీలికలయిన గుడ్డలు వాళ్ళ శారీరాలమీద వేలాడుతున్నయ్ చెట్టుకింద దొరికిన పుల్లతో కుండలో వుడుకుతున్న అన్నం కలబెడుతున్నాడు ఒకతను గబుక్కున చప్పట్లు వినబడి ప్రకాశం స్టేజీవైపు చూశాడు

'' అలాగే నిరుద్యోగుల సమస్య కూడా చాలావరకు పరిష్కరించాం'' అంటున్నాడు వక్త

ఆ మాటలు వింటుంటే కొడుకు గుర్తుకు వచ్చాడు ప్రకాశంకు 'ఇంకో రెండు సంవత్సరాల్లో డిగ్రీ అయిపోయిద్ది వాడి భవిష్యత్తు ఎలా గడిచిద్దో? లంచం లేకుండా ఉద్యోగం వచ్చే పరిస్థితే లేదు తన బోటివాళ్ళకు రికమెండేషన్లలకు అవకాశమేలేదు ఏదన్నా వ్యాపారం చేసుకోవటానికి పెట్టుబడి లేదు ' చప్పట్లు అతని ఆలోచనలకు ఆనకట్ట కట్టాయి

ఉపన్యాసకుడు మైకుని వదిలేలాగా కనపడలేదు చెప్పిందే చెపుతున్నాడు ప్రతిపక్షం మీద దుమ్మెత్తిపోస్తూ వరకట్నం దగ్గరకొచ్చి ఆగాడు ఆ మాటలు వినగానే ప్రకాశానికి కూతురిపెళ్ళి విషయం గుర్తుకొచ్చి దీర్ఘంగా, బాధగా నిట్టూర్చాడు ఎన్నోసార్లలాగే ఇప్పుడూ కూతుర్ని గురించి అనుకున్నాడు

'దానికి పెళ్ళిచేస్తే ఇక ఈ జీవితానికి దిగులులేదు చిన్నప్పటి నుండీ కష్టం తెలియకుండా పెరిగింది కూలీనాలీ చేసుకునే వాడికిస్తే కాయకష్టం చెయ్యలేదు చిన్నదో చితకదో ఉద్యోగస్తుడి కియ్యాలంటే వేలల్లో కట్నం పోయాలి' ఆ ఆలోచన అతన్ని వుక్కిరి బిక్కిరి చేసింది ఆ ఆలోచనల మీదనుండి మనసును మరల్చటానికి స్టేజీవైపుకి దృష్టి మరల్చాడు

''ఈనాడీ దేశంలో అవినీతి ఎక్కడుందో చూపించండి ''

తనలో తను నవ్వుకున్నాడు ప్రకాశం

మీటింగు పూర్తయ్యే సరికి పది దాటింది ఒక పావుగంటలో జనమంతా వెళ్ళిపోయారు సి ఐ అన్నట్లు అందరినీ మళ్ళీ ఫాలెన్‌చేసి లెఖ్ఖ చూశాడు యస్సై

''పెంటలమీద తిరిగే కుక్కని సింహాసనం మీద కూర్చోబెడితే దాని బుద్ధి పోయిద్దా'' అన్నాడు ఒక పీసీ గుసగుసగా వెనకవరసలో

''వెరీగుడ్, అంతా బాగా చేశారు బందోబస్తు అంతా స్టేషనుకు వెళ్ళండి'' అని యస్సైవైపు తిరిగి, ''నేనొస్తా వెళ్ళి మంత్రిగారికి కనపడితే మంచిది గదా!'' అన్నాడు నవ్వుతూ సి ఐ

''పోయిరాండి సార్'' అన్నాడు యస్సైకూడా నవ్వుతూ సి ఐ వెళ్ళిపోయాడు

''పో, నా కొడకా కష్టపడింది మేము ఫలితం నీకు ఈ బందోబస్తు విషయం గుర్తు చేసేదీనూ, ఏదో సొంత పని చేయించుకుంటావు పో, మీ బోటోళ్ళదేలే కాలం'' అన్నాడు ఒకపీసీ కాస్త పెద్దగానే ఆ మాటలు యస్సైకి వినపడ్డట్టున్నయ్ కానీ మెదలకుండా వూరుకున్నాడు అతనికి కూడా సి ఐ మీద కోపంగా వుంది అందరినీ డిజ్‌బర్స్ చేశాడు స్టేషనుకు రమ్మన్నాడు అంతా సైకిళ్ళెక్కి స్టేషన్‌కొచ్చారు టైం పదకొండు అవుతోంది రాత్రి

''ఎవరీపూట సెక్షన్ ఇన్‌చార్జి?'' అడిగాడు యస్సై

''నే నే సార్'' అన్నాడొక హెచ్ సి

''ఆః బీట్లన్నీ వేస్తావు కదా? ప్రతి బీటువాళ్ళూ అయిదుగురికి తగ్గకుండా స్ట్రేంజర్స్‌ని తీసుకురావాలి నేను బీట్లు చెక్‌చేస్తా ఎవరిబీటు ఏరియాలో నేరం జరిగితే వాళ్ళమీద స్పెషల్ రిపోర్టు కొడతా మీ యిష్టం టైం కాకముందే బీట్ల నుండి తిరిగొస్తున్నారు'' అని కోపం నటిస్తూ

లోపలికెళ్ళాడు

''ఇది ఎప్పుడుండే ఏడుపేలే'' అన్నాడు ఒక పీసీ

ఆ రాత్రి నైటుబీటు ప్రకాశానికీ, కోటేశ్వరరావుకి కలిపివేశారు

''ఈ డెమ్మని ఇదొకటి బీటు తిరగటం కాకుండా, ఈ స్ట్రేంజర్స్‌ని తేవటం ఒకటి నాలుగు గంటల కాడనుండి నిలువ కాళ్ళ మీద నిలబడ్డాం కాస్త పెందలాడే వచ్చి పండుకోవటానికి కూడా వీలు లేకుండా ఇదొకటి'' అనితిట్టాడు కోటేశ్వరరావు

అతనే మళ్ళీ, ''సరేలే పోయి కాసేపు ఏదన్నా సినిమాలో కూర్చుందాంపద'' అంటూ సైకిలెక్కాడు ప్రకాశం అతన్ని అనుసరించాడు ఇద్దరూ వెళ్ళి సినిమాహాల్లో కూర్చున్నారు

''ఏం సినిమా ఇది?'' అడిగాడు ప్రకాశం

''ఏమో మరి?''

చిన్నగా నవ్వాడు ప్రకాశం అతని నవ్వుతో కోటేశ్వరరావు వంత కలికాడు

''నా సర్వీసులో ఎప్పుడూ నేను పూర్తిగా ఏ సినిమా చూడలేదు అన్నీ కాస్త కాస్త చూడటమే' మనోళ్ళకి ఎవ్వరికీ పూర్తిగా సినిమా చూడటానికి వీలుండదు ఏదో ఇట్నాగొచ్చి కాసేపు చూడటమే కాదంటావా?'' అన్నాడు అవునన్నట్లు తలవూపాడు ప్రకాశం సినిమా వదిలి పెట్టేసరికి ఒంటిగంటయ్యింది బయటకొచ్చి ఇద్దరూ చెరొక టీ తాగారు బీటు ఏరియా అంతా తిరిగి సంతకాలు పెట్టించుకొనేసరికి మూడుదాటింది

''ఆఁ ఇక స్ట్రేంజర్స్ విషయం చూడాలి'' అన్నాడు ప్రకాశం

''పోదాం పదండి మునిసిపల్ ఆఫీసు దగ్గరకు అక్కడతప్ప ఇంకెక్కడా మనకు కావాల్సినోళ్ళు దొరకరు రైల్వేస్టేషను దగ్గరకు పోవచ్చుగానీ, అంతదూర మెందుకులే మునిసిపల్ ఆఫీసు మన స్టేషనుకు పోయే దారిలోనే కాబట్టి అక్కడే నలుగురిని ఏసుకుపోదాం'' అన్నాడు కోటేశ్వరరావు

''సరేపద నాకు అంతా కొత్త ఎక్కడ దొరుకుతారంటే అక్కడికే పోదాం పద'' అన్నాడు ప్రకాశం

''ఈ పాపం మనకు తగలకుండా పోదు మనకి కాకపోయినా మన పిల్లలకైనా దీని షాకుకొట్టిద్ది ఎక్కడో ఇంత అడుక్కుని తిని, ఏ అరుగుమీదనో, ఫుట్‌పాత్‌ల మీదనో పడుకున్న వాళ్ళని తీసుకుపోయి ఫార్టీవన్ సి ఆర్ పీ సీ సెక్షన్‌వేసి, నేరాలు చేయటానికి తిరుగుతున్నారనీ, చీకటిలో దాక్కుని వున్నారనీ, అనుమానాస్పదమైన పరిస్థితుల్లో, మనం వాళ్ళని చూచి, వెంటబడి పట్టుకున్నామని చెప్పి చార్జిషీట్‌లో రాసి జైలుకు పంపిస్తున్నాము ఏ పాపం ఎరుగని వాళ్ళ ముఖంమీద దొంగలనే ముద్ర వేస్తున్నాము జెయిల్లో నెలో రెండునెల్లో, నాలుగునెల్లో వుండి బయట కొచ్చినవాడు, ఆ జైల్లోని మిగిలిన వాళ్ళ ప్రభావంతో నిజంగా నేరాలు చెయ్యటానికి అవకాశ మెంతయినా వుంది నేరస్థులని మనం అనుకొనే వాళ్ళల్లో ఎంతోమంది మనం తయారు చేసేవాళ్ళే'' అన్నాడు కోటేశ్వరరావు

''అవునవును'' అని తలవూపాడు ప్రకాశం ''ఈ స్టూడెంటు కుర్రోళ్ళు గోడలమీద రాస్తారు చూడూ, 'మన దేశంలోని కాలేజీలు నిరుద్యోగుల్ని ఉత్పత్తిచేసే కార్ఖానాలనీ', అట్నాగే పోలీసు స్టేషన్లు, జైళ్ళు నేరస్థుల్ని తయారుచేసి, వాళ్ళకు తర్ఫీదు ఇచ్చే కార్ఖానాలు కాదంటావా?'' అన్నాడు ప్రకాశం

ఔనన్నట్లు తలూపాడు కోటేశ్వరరావు ''అసలు అందరికంటే పెద్ద నేరస్థులు ఎవరు?

మనం కాదూ, కాకపోతే ఆ మాట మనం అనకూడదు కానీ'' ఆమాట విని ప్రకాశం వైపు చూశాడు

''మనం లైసెన్సు పొందిన నేరస్థులం'' అని నవ్వాడు ప్రకాశం

అతని నవ్వుతో శృతికలిపి, ''బాగా చెప్పావు అసలు మన ఆఫీసర్లు డబ్బుకోసం చెయ్యని తప్పుడు పని ఏముంది ఛీ దీనెమ్మ బతుకుని పారనూక, పగోడికికూడా ఈ నౌకరొద్దు నా ముప్పై సంవత్సరాల సర్వీసులో ప్రతిరోజూ ఎవుడిచేతో ఒకడిచేత అమ్మలక్కలు కోకుండా ఇంటికిపోయిన రోజు ఒక్కటున్నాలేదు అయితే ఎవుడూ మనమొకాన అనడనుకో'' అన్నాడు

''అవునవును నిజం'' అన్నాడు ప్రకాశం

మాటల్లోనే వాళ్ళు మార్కెట్టు దగ్గరి మునిసిపల్ కొట్ల దగ్గరకు వచ్చారు వాళ్ళనుభవిస్తున్న శారీరక కష్టం వాళ్ళ నోటివెంట కొన్ని వాస్తవాల్ని బయటపెట్టిస్తోంది మునిసిపల్ కొట్లముందు పంచల్లో చాలామంది పడుకొని నిద్ర పోతున్నారు సైకిళ్ళు దిగి స్టాండ్లు వేశారు ''మరీ ముసలోడూ, నడవలేనివాడూ కాకుండా, మరీ పిల్లలు కాకుండా చూడు'' అన్నాడు కోటేశ్వరరావు

''సరే'' అని అందరినీ చూచుకుంటూ పోయాడు ప్రకాశం అతని దృష్టి ఒక వ్యక్తిమీద పడింది ''ఇటురా కోటేశ్వరరావ్ ఇక్కడొకడున్నాడు'' అని కేక వేశాడు

కోటేశ్వరరావు వచ్చి టార్చిలైటు వేసి చూశాడు చేతిలోని లాఠీతో అతని కాళ్ళమీద ఒక్కటేశాడు ''రేయ్ లేరా'' అన్నాడు కేక వేసినట్లు దెబ్బతిన్న అతను ఉలిక్కిపడి కళ్ళు తెరిచి యూనిఫారంలో వున్న వీళ్ళిద్దరివైపు బిత్తరపోయి చూశాడు

''లేవ్వేరా'' గద్దించాడు కోటేశ్వరరావు

అతను భయపడుతూ లేచి నిలబడ్డాడు అతని పక్కనే ఏదో చిన్న పెట్టెలాటిది పాతగుడ్డలో చుట్టివుంది వీళ్ళిద్దరి దృష్టి దానిమీద పడింది అనేకరకాల ఆలోచనలు వాళ్ళ మెదళ్ళల్లో చోటు చేసుకున్నాయి చేతిలోని కర్రతో దానిమీద కొడుతూ, ''ఏమిటిది, ఎవరు నువ్వు?'' అన్నాడు కోటేశ్వరరావు గట్టిగా

అతను రెండు చేతులు జోడించి దండం పెడుతూ, ''దొరా మేము పాములోళ్ళం అది తాసుపాం దొరా'' అన్నాడు, ఆ పెట్టెవైపు చెయ్యిచూపిస్తూ

ఆ మాట వినటంతోనే చెంగున రెండడుగులు వెనక్కువేశారు వీళ్ళిద్దరూ అతనివైపూ, ఆ పాముని పెట్టిన బుట్టవైపూ, మార్చి మార్చి చూసి ఒకళ్ళ నొకళ్ళు చూసుకున్నారు వాళ్ళకు గుండెలు దడదడ లాడాయి కోపంతో అతనివైపు చూశాడు కోటేశ్వరరావు ''మరి చెప్పవేరా దొంగలమ్డి కొడకా నిజంగా అది పామేనా?'' అన్నాడు

''ఔ దొరా'' అన్నాడతను భయపడుతూ

''నీయమ్మ దరిద్రపు నా కొడకా కాసేపుంటే మా ప్రాణలకే ముప్పొచ్చేది గదరా'' అని ప్రకాశం వైపు చూచి, చిన్నగా నవ్వి, మళ్ళీ అతనితో ''మరి ఈడ తగలబడ్డావే, అయి బయటకొచ్చి ఎవుడినన్నా కాటేస్తే?!'' అన్నాడు

''రాదు దొరా గుడ్డలో సుట్టా బుట్టని మంత్రం గూడా ఏసి కట్టుకట్నాగా'' అన్నాడతను అమాయకంగా అలాగే దండం పెడుతూ

''ఆ, మంత్రం నీ ముకం మంచి బోణే తగిలింది మాకు'' అంటూ ఇవతల కొచ్చాడు ప్రకాశం

''వాడిని లేపకముందే నేను ఆ పెట్టెని చూశా ఏందో తీసి చుద్దామనుకున్నా తియ్యక పోవటం మంచిదయ్యింది'' అన్నాడు కోటేశ్వరరావు ప్రకాశం ఏం మాట్లాడలేదు

''పోయినేడు ఇట్లాగే మనోళ్ళు నైటు బీటుకొచ్చి ఇట్లాగే స్ట్రేంజర్స్ కోసం వెతుకుతుంటే, ఒకడిట్లాగే మూట ఒకటి పక్కన పెట్టుకుని నిద్రపోతున్నాడు మనోళ్ళు ముందుగా ఆ మూట చేతబట్టుకొని వాడిని లేపారు వాడు లేచి, మనోళ్ళని చూచి అదే పోత పొయ్యాడు తుపాకి దెబ్బకు దొరక్కుండా పారిపొయ్యాడంట ఆ మూట విప్పి చూస్తే బంగారం, వెండి వస్తువులు బీటోళ్ళిద్దరూ సుబ్బరంగా పంచుకున్నారు వాడెక్కడో నేరం చేసొచ్చి, ఇట్లా అలగా జనంలో పడుకున్నాడు తెల్లారిందాకా ఇట్లా జనంలో తలదాచుకుంటే, తెల్లారినాక వాణ్ణి దేవుడు కూడా పట్టుకోలేడు కదా కాని అనుకోకుండా మనోళ్ళు పోయేసరికి వాడి ఖర్మ కాలి వాడు మంచి నిద్రలో వుండటం, వీళ్ళు ముందుగా మూట చేతపట్టుకొని వాడిని లేపటం, ఇవన్నీ వాళ్ళకు కలిసొచ్చాయి నాకీ మూట చూడంగానే అది గుర్తొచ్చింది'' అన్నాడు కోటేశ్వరరావు

ప్రకాశం ఆ మాటకు పెద్దగా నవ్వాడు ''మొత్తం మీద పెద్ద గండమే తప్పింది'' అన్నాడు

''కాని నాకా మూట చూడంగానే ఎందుకో ఆనందం కలిగింది'' అన్నాడు కోటేశ్వరరావు

''ఆఁ మన ముఖాలకి అంత అదృష్టం గూడానా అట్టాంటి దేదన్నా తగిలిద్దేమోనని ఎన్నోసార్లు అనుకుంటా మన దరిద్రపు ముఖాల కెందుకు వచ్చిద్ది అట్టాంటిరోజు'' అన్నాడు ప్రకాశం

''ఇంక ఈ పూటకు స్ట్రేంజర్లు వద్దూ ఏ మొద్దు పోదాం పద యస్సై కేదో ఒకటి చెప్పొచ్చు'' అన్నాడు కోటేశ్వరరావు వళ్ళంతా నీరసంగా, తల బరువుగా వుంది అతనికి ఇద్దరూ నడుస్తూ స్టేషన్‌కొస్తుంటే మెయిన్ బజారులో బట్టలకొట్టు మెట్లమీద ఒకతను పడుకుని వున్నాడు సైకిళ్ళు స్టాండ్ వేసి అతని దగ్గరకెళ్ళారు అతని తలక్రింద గోనెసంచి ఒకటి మడతపెట్టి వుంది

''రేయ్ ఎవర్రా నువ్వు లే'' అని లాఠీ కర్రతో చిన్నగా అతని అరికాళ్ళ మీద కొట్టేడు కోటేశ్వరరావు అతను బిత్తరపోయి లేచాడు కొద్ది క్షణాల వరకు అతనికేమీ అర్థం కాలేదు నిద్ర కళ్ళకు ఏమీ కనపడలేదు ఇరవై సంవత్సరాల దాకా వయస్సుంటుంది చినిగిపోయిన నిక్కరూ, మురికి ఓడుతున్న చాలీచాలని చిరుగుల చొక్కా, చింపిరి జుట్టూ, ధుమ్ము నిండిన శరీరం మెర్క్యురీ లైటు వెలుగులో తెల్లగా పాలిపోయిన అతని ముఖం భయపడుతున్న అతని కళ్ళు వాళ్ళవైపు చూశాయి లేచి తలకింద పెట్టుకున్న పాత గోనెసంచిని వంగి తీసుకుని నిలబడ్డాడు

''ఎవుర్రా నువ్వు?'' కఠినంగా అడిగాడు కోటేశ్వరరావు

''పాత కాతికాలు ఏరుకునే వాడినయ్యా'' అన్నాడు అతను భయంగా

''ఆ గోతం ఏమిటి?'' ప్రకాశం అడిగాడు

''పాత గోతం సామీ, పొద్దున్నే కాతికాలు ఏరుకోటానికి''

''నిజమేనా, లేకపోతే నేరాలు చెయ్యటానికి ఇక్కడున్నావా?''

ఆ మాటలు అర్థం కానట్టు కళ్ళు ఆర్పుతూ చూశాడు అతను వాళ్ళవైపు

''పద ముందు స్టేషనుకు నడు. నీ సంగతక్కడ విచారిస్తాం'' అని ప్రకాశం వైపు తిరిగి, ''ఒకడినన్నా తీసుకుపోకపోతే, ఆ యస్సై లంజాకొడుకు వాడిష్ట మొచ్చినట్టు నోరు పారేసుకుంటాడు'' అన్నాడు

ప్రకాశం ఏమీ మాట్లాడలేదు కదిలారు అతను వాళ్ళ వెనకే చిన్నగా నడుస్తున్నాడు కుంటుతూ చంకలో గోతం వుంది

''ఏమిట్రా కుంటుతున్నావు?'' అడిగాడు ప్రకాశం కాలక్షేపానికి

''సీసా పెంకు కోసుకుపోయింది దొరా'' జవాబిచ్చాడు అతను వినయంగా

''గవర్నమెంటు ఆసుపత్రికి పోయి ఇండీసను చేయించుకోకూడదూ?''

అయోమయంగా చూశాడు అతను వాళ్ళను

''నువ్వు భలేవాడివే ప్రకాశం మనబోటోళ్ళకే అక్కడ గతిలేదు గానీ, ఇంక ఇట్టాంటోళ్ళ మొహం చూసేదెవుళ్ళు ఆడ?'' అన్నాడు కోటేశ్వరరావు

తనన్నమాట ఎంత తెలివితక్కువదో అన్నట్టు చిన్నగా నవ్వాడు ప్రకాశం ''రోజూ ఎంత సంపాదిస్తావురా ఇట్టా పాత కాగితాలు ఏరుకుని?'' అడిగాడు మళ్ళీ

''నాలుగు రూపాయలొత్తయ్ దొరా! ఓసారి రెండు మూడు రూపాయలు కూడా రావు''

''మరి నాలుగు రూపాయలతో నీకెట్టా గడిచిద్ది? మెమ్మోళ్ళున్నారా?''

''లేరండీ మాది ఈవూరు కాదండీ నేను చిన్నప్పుటినుండే అడుక్కుతిని బతుకుతున్నానండి రెండు రూపాయలు పెట్టి అరిటికాయలూ సెనగపప్పు అట్టాంటియ్యి కొనుక్కుంటా రేత్తిరిపూటేమో ఒక రూపాయి పెట్టి బువ్వ కొనుక్కుంటా'' అన్నాడు

''రూపాయి పెట్టి అన్నం కొనుక్కోవటం ఏందిరా?! ఏ హోటల్లో పెడతారు?''

''ఓటల్లో కాదు సామీ అడుక్కునేవాళ్లకాడ వూళ్లో బువ్వ అడుక్కొచ్చుకుంటారు గదా ఆళ్ళ దగ్గిర బువ్వ కొనుక్కుంటా సాలు కడుపు నిండిపోయిద్ది ఇంకేమన్నా సిల్లర మిగిల్తే బీడీలు కొనుక్కుంటా'' అన్నాడు

''ఒరే నీకు ఆకలిబాధ పోయిద్దిలే పద జైల్లో తిన్నంత తిండి పెడతారు'' అన్నాడు కోటేశ్వరరావు నవ్వుతూ అతను భయంగా చూశాడు వాళ్ళ వీపుల్ని , చిన్నగా నడుస్తూనే వాళ్ళు నడుస్తూ దారిలో ఒక హోటల్ మెట్లమీద పడుకుని వున్న ఒకతన్ని లేపి బలవంతంగా తీసుకుపోయారు

''నేనీ హోటల్లో క్లీనర్ని సార్'' అని అతను వచ్చీరాని తెలుగులో మొరపెట్టుకున్నాడు నడుస్తూనే

''పోరా, అరవ నాకొడకా ఎక్కడెక్కడినుండో ఇక్కడికొచ్చి నేరాలు చేస్తారు నా కొడుకులు రేపు విచారించి నువ్వు చెప్పింది నిజమయితే పంపిస్తాంలే'' అన్నాడు కోటేశ్వరరావు

అతను కాళ్ళావేళ్ళా పడ్డాడు

''ఇంక ఎక్కువగా మాట్లాడేవంటే తన్నుకుంటూ తీసుకుపోతా నోర్మూసుకుని వెంట రా'' అన్నాడు కోటేశ్వరరావు క్రూరంగా ఆ మాటకు అతను బిక్కచచ్చిపోయాడు

''పోనీలే కోటేశ్వరరావు, వీడొకడున్నాడు చాలులే'' అన్నాడు ప్రకాశం చిన్నగా, చెప్పలేక చెపుతూ

''అహఁ కాదులే ప్రకాశం, నీకు తెలియదు వాడి తల్లిని ఆ యస్సై నా కొడుకు నోటికెంతొస్తే అంతంటాడు మనమెక్కడ మాట పడతాం అంతగా అయితే రేపు వదిలి పెట్టొచ్చు చెప్పి'' అన్నాడు కోటేశ్వరరావు ప్రకాశం ఏమీ మాట్లాడలేదు ఇక

వాళ్ళు స్టేషన్కు చేరేసరికి తెల్లవారుఝాము అయిదు కావస్తోంది తాము తెచ్చిన వాళ్ళిద్దరినీ స్టేషన్లో కూర్చోపెట్టి, సెంట్రీకి చెప్పి, బీటు పుస్తకం రాసి, అక్కడ పడేసి ఇండ్లకెళ్ళి పోయారు

ఆ రోజు సాయంత్రం అయిదు గంటలకు రోల్కాల్కు వచ్చినప్పుడు, కోటేశ్వరరావు ప్రకాశం

చెవిలో చిన్నగా అన్నాడు ''రాత్రి నైటుబీట్లవాళ్ళు తెచ్చిన వాళ్ళల్లో రిక్షావాళ్ళనీ, ఒక చిల్లరకొట్టు గుమస్తానీ, ఒకలారీక్లీనర్‌ని వదిలిపెట్టి వాళ్ళ దగ్గరనుండి మొత్తం ఎనభై రూపాయలు దొబ్బేడంట రైటరు నా కొడుకు కనీసం కాఫీ తాగమని మనకొక పావలా అన్నా ఇవ్వలేదు'' అన్నాడు కోపంగా పళ్ళు నూరుతూ

''ఇదంతా మామూలేలేగా మనం పాపం మూట కట్టుకోవటం, వాళ్ళు అనుభవించటం అన్నిచోట్లా వున్నదేగా'' అన్నాడు ప్రకాశం కూడా కోపంగా

''అందుకే అసలు మనం తేకుండా వుండాల్సింది'' అన్నాడు కోటేశ్వరరావు

ఇంతలో లోపల్నుండి ''రోల్‌కాల్'' అని కేక వేశారు ఎవరో

టోపీలు పెట్టుకుంటూ, చొక్కా గుండీలు సరిచేసుకుంటూ యస్సై గదిలోకి వెళ్ళారు స్టాపు అంతా వరసగా యస్సైకి సెల్యూట్‌లు చేస్తూ ఇనుప నాడాల బూట్లు నాపరాళ్ళ మీద టకటక లాడాయి అందరి నెంబర్లు వరుసగా పిలిచాడు యస్సై అంతా పలికారు ''సార్, సార్'' అంటూ

''ఏమయ్యా, రాత్రి ఎవరెవరు నైటుబీట్లు?'' అన్నాడు యస్సై

ఆ ప్రశ్నతో రాత్రి నైటుబీట్లు తిరిగినవాళ్ళ గుండెలు గుభిల్లుమన్నాయి

ఉద్యోగంలో చేరినప్పటినుండి అయిన అలవాటు ఇది చేసిన తప్పుకి ఎప్పుడో ఇచ్చే పనిష్మెంటుకన్నా, ఏదో జరిగిద్దనీ, పనిష్మెంటు ఏదో ఇస్తారనే భయం వాళ్ళని పిరికివాళ్ళుగా మార్చేసింది అనుక్షణం ఆఫీసర్ల బెదిరింపులు వాళ్ళల్లోని మానసిక స్థయిర్యాన్ని దెబ్బ తీశాయి వాస్తవంలో వాళ్ళకిచ్చే పనిష్మెంట్లు కన్నా ఏదో పనిష్మెంటు ఇస్తారనే భయమే వాళ్ళకి పెద్ద పనిష్మెంటు అదే రకమయిన భయంతో యస్సై ఆ మాట అడగంగానే రాత్రి బీట్లు తిరిగిన వాళ్ళకు గుండెలు ఝుల్లుమన్నాయి ప్రకాశం మాత్రం నిబ్బరంగా వున్నాడు కొంతవరకు

''ఏమీ, మరీ పాకీ వెధవలనీ, బెగ్గర్‌లనీ తీసుకురాకపోతే కాస్త నీటుగా, హుషారుగా వుండేవాళ్ళని తేలేరా? కోర్టులో పెడితే మనిషిని చూచి మేజిస్ట్రేటు నమ్మాలా కనీసం? వాళ్ళని తీసుకుపోయి నేరం చెయ్యబోతున్నారని మనం చార్జిషీటులో కొడితే, మేజిస్ట్రేటు వాళ్ళ ముఖాలు చూచి, ఆ సీ డీ లు మన మొకంమీద కొడతాడు నేరస్థుల శారీరక లక్షణాలను ఆమాత్రం అంచనా వేయలేరా మీరు ఇంతింత సర్వీసు వుండి?'' అన్నాడు యస్సై తనేదో ఆ విషయంలో కూలంకషమైన పరిశోధన చేసినట్లూ, అక్కడున్న పీసీలంతా నేరస్థులని ఎప్పుడూ చూడనట్లూ, నేరం చేసే వ్యక్తికి వుండాల్సిన కనీస శరీర ధారుఢ్యం, పర్సనాలిటీ గురించి తెలియనివారన్నట్టూ వున్నయ్ అతను మాట్లాడిన మాటలు ఆ మాటలు చురుక్కు మనిపించాయి వాళ్ళకు స్ట్రేంజర్స్‌ని తెచ్చినందుకు పడ్డ తల నొప్పికన్నా, రైటరు డబ్బులు దొబ్బినట్లు తెలిసినప్పుడు వచ్చిన కోపం కన్నా, ఈ మాటలు బాధ కలిగించాయి శ్రమపడీ, పాపం మూటకట్టుకుని, కాఫీ డబ్బులు కూడా ఎరగని తమని యస్సై మాటలు వెక్కిరించినట్లు తోచాయి

''మంచోళ్ళూ, సుభ్రమయినోళ్ళూ రోడ్లమీద, ఫుట్‌పాత్‌లమీద ఎందుకుంటారు సార్? అప్పటికీ ఆ హోటల్లో పనిచేసేవాళ్ళనీ, రిక్షావాళ్ళనీ తెస్తే రైటరేమో అమ్ముకున్నాడాయె'' అన్నాడు ప్రకాశం ఉద్రేకం కనపడకుండా మాట్లాడటానికి ప్రయత్నిస్తూ

ఆ మాటలకు యస్సై గతుక్కుమన్నాడు ఏం మాట్లాడాలో అర్థం కాలేదు రెండుసార్లు ప్రకాశాన్ని పైకీ కిందకీ చూశాడు ''ఆఁ నేనే జామీనిచ్చి పంపమన్నా మరి మనకి ఆఫీసర్ల తాకిడెక్కువవుతుండే వాళ్ళొచ్చినప్పుడల్లా డ్రింకులూ, సిగిరెట్లూ, ఇట్లాంటి చిన్న చిన్న ఖర్చులే

మోపెడవుతుండె అవన్నీ రైటరే పెట్టుకుంటున్నాడు కదా అతను మాత్రం ఎంతకాలం జేబులోయి ఖర్చు పెడతాడు ఆ విషయం కూడా మనం ఆలోచించాలి కదా'' అని రైటర్ని వెనకేసుకు వచ్చాడు యస్సై ఎవరూ ఏమీ మాట్లాడలేదు కొద్ది క్షణాలు

''సరే అదయిపోయిందిలే మీరంతా రెడీగా వుండండి ఎవరూ ఎక్కడికి పోవద్దు డి యస్పీ గారు ఏదో ప్రోగ్రాం వుందన్నారు ఎవరన్నా ఆబ్సెంటయితే తరువాత మీ యిష్టం ఆయనసలే కోప్పిష్టి మనిషి. నేనెవరికీ సహాయం చెయ్యలేను తరువాత అంతా బయట వుండండి'' అన్నాడు యస్సై అందరూ బయటకు వచ్చారు

''ఆఁ ఈయనే తెగమీదేసుకుంటున్నాడు పీసీలని లేనిపోనియ్యన్నీ కల్పించి ఆఫీసర్లకి చెప్పకపోతే సంతోషం'' అన్నాడొకతను చిన్నగా

''నువ్వు బాగా అడిగావ్ ప్రకాశం'' అన్నాడు ఒక సీనియర్ పీసి

ప్రకాశం విని వూరుకున్నాడు

''ఇప్పుడెక్కడికయి వుంటుంది?''

''ఆఁ ఏ టూవైన్‌టీఫోర్స్ 21ని రేడ్ చెయ్యటానికో, లేకపోతే ఏ క్లబ్బో అంతకు మించి ఏముంటుంది ఈ డెంత సీక్రెట్‌గా వుంచినా ఆ ఇనఫరమేషన్ ఈపాటికి అక్కడికి చేరే వుంటుంది దేనోడు దానికుంటాడు'' అన్నాడు ఒక పీసీ

ఆ మాటలు చాలామంది విన్నారు తలా ఒక చోటచేరి కబుర్లలో, ఆలోచనల్లో మునిగి పోయారు ఒక అరగంట గడిచింది ఇంతలో డి యస్పీ జీపూ, దాని వెనుక రెండు పోలీసు వ్యానులూ లోపలికొచ్చాయి బైటవున్న వాళ్ళంతా గబగబా పులిని చూచిన జింకల్లా లోపలకు సర్దుకున్నారు ''దుర్మార్గుణ్ణే చూచి దూరంగా తొలగాలి'' అన్నాడు ఒకతను నవ్వుతూ

డి యస్పీ జీపు ఆగిన శబ్దం విని, యస్సై చటుక్కున లేచి టోపీ పెట్టుకుని, హడావిడిగా పరుగులాంటి నడకతో బయటకొచ్చి డి యస్పీకి సెల్యూట్ చేశాడు ''మెన్ అంతా రెడీసార్'' అన్నాడు అప్పటికే సి ఐ అక్కడ వున్నాడు

''అందర్నీ ఒకసారి ఫాలెన్‌చేసి నాకుచెప్పు'' అన్నాడు డి యస్పీ, సి ఐ రూంలోకి వెళుతూ సి ఐ అతన్ని అనుసరించాడు యస్సై, జేబులోని విజిల్ తీసి గట్టిగా రెండుసార్లు వూది, 'ఫాలెన్' 'ఫాలెన్' అని అరిచాడు పీసీలూ, హెచ్‌సీలూ, ఏ యస్సై అంతా వచ్చి మూడు వరుసలుగా నిలబడ్డారు రెండుసార్లు సావధన్, విశ్రమ్ ( అటెన్షన్, స్టాండటీజ్) లు చెప్పి, లెఖ్ఖపెట్టి, లోపలికెళ్ళి అందర్నీ ఫాలెన్ చేసినట్లు డి యస్పీకి చెప్పాడు డి యస్పీ బయట కొచ్చాడు చేతిలోని స్టిక్కు వూపుకుంటూ అందర్నీ ఒకసారి కలియచూశాడు

''జాగ్రత్త ఒక్క లంజకూడా మిస్ కాకూడదు ఎవరన్నా అట్లా మిస్ చేసినట్లు నా నోటీసు కొచ్చిందో వాడిపని అయ్యిందే ఊ, అంతా వేనెక్కండి'' అన్నాడు అంతా ఒకళ్ళనొకళ్ళు ఇరగదొసుకుంటూ 'డిసిప్లెన్'గా వేను ఎక్కారు సీట్లు దొరకనోళ్ళు తలలువంచి నిలబడ్డారు యస్సై, సి ఐ, ఏ యస్సై, డి యస్పీ జీపు ఎక్కారు అయిదు నిముషాల్లో వ్యభిచార గృహాలుండే పేట దగ్గరకు చేరాయి వ్యాన్లు అంతా బిలబిలమంటూ దిగి గబగబా కొంపల్లోకి దూరారు కోలాహలంగా, కేకలతో నిండిపోయింది ఆ ప్రాంతం యస్సై, ఏ యస్సై కూడా కొంపల్లోకి దూరారు సి ఐ జీపు దిగి నిలబడ్డాడు డి యస్పీ జీపులో కూర్చుని, చలువకళ్ళద్దాల్లోంచి అటూ ఇటూ చూస్తున్నాడు డ్రై వరుకూడా గబగబా యస్సైని అనుసరించాడు వేను డ్రై వర్లు మాత్రం

వేనుల్లో నుండి కిందకు దిగలేదు ఒక పావుగంటా, ఇరవై నిముషాల తరువాత నలుగురు ఆడవాళ్ళనీ, ఒక మగవాడిని పట్టుకుని తీసుకొచ్చారు యాభైమంది పీసీలూ, ఎనిమిదిమంది హెచ్‌సీలూ, ఒక యస్సై, ఒక ఏ యస్సై కలిసి

''ఏమిటి వీళ్ళేనా?!'' అన్నాడు ఆశ్చర్యంగా, కోపంగా డి యస్పీ

''సార్, ఇనఫర్‌మేషన్ లీక్ అయ్యుంటుంది సార్ ఎవరో వాళ్ళకు ఇనఫర్‌మేషన్ ఇచ్చుంటారు సార్'' అన్నాడు యస్సై తన అసమర్థతని కప్పి పెట్టుకోవటానికి ప్రయత్నంచేస్తూ డి యస్పీ కోపంలో తననేమంటాడో అనే భయం మనస్సులో పీకుతోంది యస్సైకి

''ఎవడయ్యుంటాడు? ఎవడో వాడి నెంబరు నాకివ్వు వాడి అంతు చూస్తా'' అన్నాడు డి యస్పీ

''సార్ అలాగే సార్ '' అన్నాడు యస్సై అతి వినయంగా

అంతా తిరిగి స్టేషను కొచ్చారు ఆడవాళ్ళని వరండాలో కూర్చోబెట్టారు అలా పట్టుకొచ్చిన ఆడవాళ్ళను సాధారణంగా లాకప్‌లో వెయ్యరు మగ అతని జేబులు చెక్‌చేసి, లాకప్‌లో వేశారు లోపలేస్తుంటే అతను బ్రతిమాలుకున్నాడు ''సార్ బయట వుంటాను ఏవండీ సార్'' అతని మాటలు ఎవరూ వినలేదు బలవంతంగా లోపలకు నెట్టారు అక్కడున్న ఖాకీల కళ్ళన్నీ ఆ నలుగురి ఆడవాళ్ళని నఖశిఖ పర్యంతం పరిశీలిస్తున్నాయి ఆ నలుగురిలో ఒకామె మాత్రం కొంచెం చూడటానికి వీలుగావుంది మిగిలిన ముగ్గురూ ఏమాత్రం శారీరకాకర్షణ లేని వాళ్ళే ఆ ముగ్గురిలో ఒకామె వయస్సు మళ్ళిన స్త్రీ

''ఇంత ముసలి దానికి, ఇంకా కావాల్సొచ్చిందా? లంజని జీపుకి కట్టి లాగించేవాడు లేక'' అన్నాడు పీసీ రామయ్య శెట్టి ఆ మాటకి కొంత మంది నవ్వారు చిన్నగా ఆ మాటలు ఆమెకూ వినపడ్డాయి కానీ వినపడనట్లు తలొంచుకుని కూర్చుంది

''ఆ వయస్సులో ఆమె ఆ పని చేస్తున్నదంటే ఎంత భయంకరమైన ఆర్థిక పరిస్థితులు ఆమె నా స్థితికి నెట్టాయో మనం ఆలోచించాలి'' అన్నాడొక సీనియర్ పీసీ

''అవును అదికూడా కరక్టే'' అన్నారు కొందరు

ఆ మాటలు రామయ్యశెట్టికి చురుక్కుమనిపించాయి తను అన్నమాటను సమర్థించుకుంటూ, ''ఆఁ, అంత గతిలేనిదయితే అడుక్కుతినాలి నాలుగిళ్ళల్లో పాచిపని చేసుకుంటే దాని కడుపు నిండకపోయిద్దా కొవ్వుపట్టి కాకపోతే '' అన్నాడు

వీళ్ళ సంభాషణ వాళ్ళు వింటున్నారు

''అంటే ఇప్పుడిట్లా వ్యభిచారం చేసే వాళ్ళంతా, మీరన్నట్లు కొవ్వుపట్టి, బలిశేనా? ఏమండీ ఇంత వయసొచ్చింది మీరు ప్రపంచాన్ని అర్థం చేసుకున్నది ఇదేనా? మీరు అన్నట్టు కొవ్వుపట్టి, మొగాడికోసం పరితపించే లంజలు వేరే వున్నాయండీ లక్షలూ, వేలూ, పాపపు సొమ్ము మొగుళ్ళు తెచ్చి పడేస్తుంటే తిని పొగరెక్కిన లంజలు అవి వేరు ఇట్లా అయ్యి, మురికి కొంపల్లో పందుల్తో పాటు, పెంట దిబ్బల్లో, మురుగు కాల్వలపక్కన వ్యభిచారం చెయ్యాల్సిన పనిలేదు ఎదురిచ్చి మరీ చేస్తాయండీ అయ్యి ఏసీ హోటళ్ళలో, పట్టుపరుపులమీద దొర్లుతాయిగాని, ఇట్లా వీళ్ళుండే చోట్లకాదు వాళ్ళని తేవటం, మనల్నీ మన ఆఫీసర్లని పుట్టించిన దేవుళ్ళకి కూడా చేతకాదు వాటి జోలికెవడన్నా పోవాలనుకుంటే మూడో రోజు కల్లా మూటాముల్లే సర్దుకోవటమే అట్లాంటోళ్ళని ఈ వూళ్ళో ఎంతో మందిని చూపిస్తాను మీకుమాత్రం తెలియదా? డి యస్పీని

తెమ్మను వాళ్ళను చూద్దాం దమ్ములుంటే దుమ్ములు విరిచి పార్సెల్‌చేసి చేతికిస్తారు అన్నివిధాలా అర్భకులమీదే మన ప్రతాపమంతా'' ఆవేశంగా అని గాలి పీల్చుకున్నాడు ఆంజనేయులు ఆ నలుగురు ఆడవాళ్ళు తలెత్తి అతని వైపు ఒకసారి చూచి తలదించుకున్నారు

అతని మాటలకు ఉక్రోషం పట్టలేక పోయాడు రామయ్యశెట్టి ''మరి అంత జాలివున్న వాడివి ఎందుకు తెచ్చా'' అన్నాడు అదోలా వెటకారంగా

''నేనేమన్నా వ్యక్తిగతంగా పోయి తెచ్చానా? ఉద్యోగం పై అధికార్ల ఉత్తర్వులు అంతేగాని నా అంతట నేను ఎప్పుడూ పోలా వాళ్ళ సంపాదనలో మనకీ భాగముంది ఆ పాపం చాలు ఇంకా ఇది కూడా ఎక్కడ మూటగట్టుకుంటాం'' అన్నాడు నొసలు చిట్లిస్తూ ఆంజనేయులు

''అయితే మిగిలినవాళ్ళు పారిపోవటానికి కారణం నువ్వేనన్నమాట ఇనఫరమేషన్ ఇచ్చుంటావు'' అన్నాడు రామయ్యశెట్టి అసందర్భంగా

''ఇంకూరుకోండయ్యా మీరెక్కడనుండి ఎక్కడకు పోతున్నారు'' అన్నాడు ఒక పీసీ రామయ్యశెట్టి వైపు చూస్తూ విసుగ్గా

''అతనికి చెప్పవే?!''

''ఇద్దరినీ వూరుకోమన్నా ఆంజనేయులికి కూడా చెప్పినట్టే'' అన్నాడతను ముఖం కందగడ్డలాగా పెట్టుకొని అవతలకెళ్ళాడు రామయ్యశెట్టి

అప్పటికి బాగా పొద్దుగూకింది సార్జెన్ ప్రసాదరావు బైటకొచ్చి, కానిస్టేబుళ్ళను చూచి నవ్వుతూ, ''ఏ రోజన్నా రోల్‌కాల్‌కు వచ్చినవాళ్ళు ఆరుదాటితే తుపాకీ దెబ్బకు దొరకరు ఇవ్వాళ్ళంతా ఇక్కడే వున్నారేమిటి?'' అన్నాడు ఆడవాళ్ళవైపు చూస్తూ కుర్రపీసీలు నవ్వి అవతలకు వెళ్ళారు అతను ఆ ఆడవాళ్ళ దగ్గరకు వెళ్ళి కొంచెం సుభ్రంగా వున్న అమ్మాయివైపు వేలుచూపుతూ, వాళ్ళల్లో వయస్సు మళ్ళిన ఆమెతో, ''ఇదెవరే, బాగా ఎర్రగా బుర్రగా వుంది కొత్తపిట్టలాగుందే'' అన్నాడు ఆ మాటకు ఆ అమ్మాయి మరీ ముడుచుకుపోయి కూర్చుంది

''అల్లీగాడి కంపెనీ కొచ్చిందయ్యా ఈ బిగినెస్సుకే కొత్త'' అంది ఆ వయస్సుమళ్ళిన ఆమె

''అదే చూస్తుంటేకొత్తగా కనపడుతోంది వ్యవహారం'' అంటూ ఆ అమ్మాయి దగ్గరకెళ్ళాడు

''ఏం పేరే?''

వినపడీ వినపడనట్లు చెప్పింది

''పెద్దగా చెప్పు ఇక్కడ సిగ్గుపడితే ఏం లాభం ఎవుళ్ళమ్మాయివి?''

చెప్పలేక చెప్పింది కులం

''మీ అమ్మా నాన్నా వున్నారా?''

వున్నారన్నట్లు తలూపింది

''అడ్రసు ఏంది?''

మాట్లాడలేదు

''చూడబోతే చదువుకున్నదానిలా వున్నావ్ పైగా పెద్ద కులపు దానివి ఇదేంది? '' అని, ''ఎక్కడో కాలుజారుంటావ్, ఖండమై పోయావు ఇట్టా మురికిగుంటలో మునిగిపోతున్నావు''

అతని మాటలకు అడ్డువస్తూ, సందర్భం కోసం ఎదురుచూస్తున్నట్టు ''అయ్యగారూ, ఇంటికాడ పిల్లోడు పాలకోసం ఏడుస్తుంటాడు జామీనుమీద వదిలిపెట్టండి'' అంది ఒకామె బతిమలాడుతున్నట్టు

ఆమె మాటలు పూర్తికాకముందే, ''ఆగండి తొందరపడితే ఎట్లా? దొరలూ, దాలటా అంతాస్టేషన్లోనే వున్నారింకా'' అన్నాడతను ఇవతలకు వస్తూ

''ఈ పూటే పంపిస్తారుగా '' ఆశగా, లేని నవ్వు తెచ్చిపెట్టుకుని అడిగింది ఆమె అడుగుతుంటే మిగిలిన ముగ్గురూ ఆశగా చూశారు

''ఆఁ పంపించవచ్చు మూడొంతులు రైటరు నడగండి'' అని ఇవతలకొచ్చాడు కొద్దిసేపటికి పీసీలంతా ఎటువాళ్ళు అటు వెళ్ళి పోయారు

రాత్రి తొమ్మిదింటికి నైటు డ్యూటీకి వచ్చాడు ప్రకాశం

స్టేషన్ ఇన్‌చార్జ్ రాఘవులు సార్జెన్ వచ్చాడు ప్రసాదరావు డైరీ చార్జీ రాఘవులుకు ఇచ్చాడు రాఘవులు డైరీ తీసుకున్నట్లు డైరీలో వ్రాశాడు

'నైటుబీటుకు ఎంతమంది వున్నారో' అనుకుంటూ రఫ్‌డ్యూటీ రోస్టరు చూసి, మనుషుల్ని లెఖ్ఖ పెట్టుకుని, 'స్టేషన్ వాచ్ఎవరి కొస్తుందబ్బా' అనుకుంటూ ప్రకాశం నెంబరుచూసి, ప్రకాశంతో ''ఏమండీ మీకు స్టేషన్‌వాచ్'' అన్నాడు

ప్రకాశం స్టేషన్‌వాచ్ పుస్తకంలో సంతకంపెట్టి, లాకప్పులో ఎంతమంది వున్నారో లెఖ్ఖపెట్టి, లాకప్పుతాళం లాగిచూచి, తాళపుచెవి జేబులో వేసుకున్నాడు సాయంత్రం తెచ్చిన ఆడవాళ్ళు అక్కడే పంచలో కూర్చుని వున్నారు సహజంగా అలా తెచ్చిన ఆడవాళ్ళను లాకప్‌లో వేయరు

''సార్, వీళ్ళని పంపించలేదు ఏందిసార్?'' అన్నాడు సార్జెన్‌తో ప్రకాశం

ఆ మాటలకు సార్జెన్ నవ్వాడు ''అలాటివన్నీ మనకేం తెలుసు ప్రకాశం అధికారపార్టీ వాళ్ళ ఇష్టం యస్సై, రైటరు, వాళ్ళిష్టం అంతా'' అన్నాడు

ప్రకాశం విని మంచినీళ్ళు తాగటానికి గ్లాసుకోసం రైటరు రూంలోకి వెళ్ళాడు రైటరు యస్సైగదిలో నిలబడి వున్నాడు

''ఏమిటి? ఒక్కలాడ్జిలో కూడా ఒక్క గదికూడా ఖాళీలేదా?, నిజంగానా?'' అంటున్నాడు యస్సై

''నిజమేసార్! కానిస్టేబుల్ని పంపించాను కాని ఎక్కడా ఖాళీల్లేవంటసార్! అన్నాడు రైటరు

''మునిసిపల్ టీబీలో ట్రై చెయ్యకపోయావా?'' అన్నాడు యస్సై అసహనంగా రైటరువైపు చూస్తూ

''చేశాం సార్, దొరకలేదుసార్'' అన్నాడు రైటరు

''భలే ఇబ్బంది పెట్టావయ్యా సరేలే సెకండ్‌షో వదిలినాక స్టేషనుకే వస్తా నాకు ఇంటిదగ్గర నిద్రపట్టదు '' వెకిలిగా నవ్వుతూ అంటున్నాడు యస్సై

''నాకు తెలియందేముంది తమరి సంగతి అనుకున్న దాన్ని సాధింసిందాకా, మనస్సు నిలబడదు తమరికి'' అన్నాడు రైటరు గ్యాసు కొడుతున్నట్లు

ఆ మాటలకి ఆనందంతో మెలికలు తిరిగి పోయాడు యస్సై కుర్చీలో

''ఏందోనోయ్, నా కదొక గిప్టే ననుకో, ఒకసారి మన దగ్గర కొచ్చిన ఆడది మనమంటే '' ప్రకాశాన్ని చూచి మిగిలిన మాటలు మింగేశాడు యస్సై

ప్రకాశం గ్లాసు తీసుకుని బయట కొచ్చాడు మంచినీళ్ళు తాగి పక్క వేసుకుని పడుకున్నాడు బీటుపుస్తకాలు రాసి, బీటు పీసీలని పంపించివేసి సెక్షన్ సార్జెన్ కూడా బల్ల మీద పడుకున్నాడు బయట సెంట్రీ నిలబడి వున్నాడు రైటరు వెళ్ళిపోబోతున్నాడు ఇంటికి యస్సై మోటారుసైకిలు

స్టార్టుచేసిన శబ్దం వినిపించింది సాయంత్రం బ్రోతల్‌హౌస్ నుండి తెచ్చినతను లాకప్పులోంచి అదేపనిగా పిలుస్తున్నాడు ప్రకాశం విసుగ్గాలేచి లాకప్పు దగ్గరకు వెళ్ళాడు

''ఏమిటయ్యా, ఏమిటి నీ గోల?'' అన్నాడు విసుగ్గా

''సార్ బయట కూర్చుంటా నా డబ్బులు కూడా నాకొద్దు నే నిక్కడ ఈ వాసనలో వుండలేను సార్ ఇప్పటికే ఒకసారి వాంతి చేసుకున్నా నన్ను బయటకు తియ్యండి మీకాళ్ళు పట్టుకుంటా'' అన్నాడతను ఇంచుమించు ఏడుపు గొంతుతో

''నీ డబ్బులు ఎంత తీసుకున్నారు?''

''నూటపాతిక సార్, ఒక ఫౌంటెన్ పెన్నూ, గడియారం, రైటరుగారు సార్'' అన్నాడతను

ప్రకాశం చిన్నగా చెప్పాడు ''అబ్బాయ్, నిన్ను లోపల వేయాలన్నా బయటకు తీయాలన్నా మాకేమీ అధికారంలేదు ఇప్పటిదాకా రైటరూ, యస్సై వుంటే వాళ్ళ నడక్కుండా మమ్మల్ని అడుగుతావేమిటి?'' అన్నాడు

''వాళ్ళెవరూ తియ్యమన్నారు సార్'' అన్నాడు గద్గదికంగా అతను

''మేము తియ్యటానికి వీలులేదు తడవ తడవకు పిలవగాక'' అని ఇవతల కొచ్చాడు ప్రకాశం

అతను ఇంకా అలాగే లాకప్పులోంచి పెద్దగా కేకలు వేస్తూవుంటే బల్లమీద పడుకున్న సార్జెన్ గట్టిగా కోపంగా అరిచాడు ''అరే దొంగనాకొడకా, నేనొచ్చానంటే నీకు ఎముకలు గుల్లవుతాయి ఇప్పటిదాకా వాళ్ళువుంటే వాళ్ళ మొ కుండా ఇప్పుడు మమ్మల్ని తియ్యమంటావే? ఇంకోసారి పిలిచావంటే నీ వళ్ళు గుల్లయ్యిద్ది నేను కాదు, లాకప్పులో వాళ్ళతో కొట్టిస్తా నోర్మూసుకుని పడుకో నీ డబ్బులు దొబ్బింది రైటరు ఆడి చంక నాకు''

తరువాత లాకప్పులోవున్న అతను కిక్కురుమనలేదు

నలుగురు ఆడవాళ్ళూ ఆ దుమ్ములోనే పవిటచెంగులు పరచుకొని ఒక మూలగా పడుకున్నారు ముడుచుకుని కొద్దిసేపట్లో ప్రకాశం నిద్రలోకి జారిపోయాడు ఒకరాత్రప్పుడు విపరీతంగా దోమలు కుడుతుంటే మెలుకువ వచ్చింది చెమటతో చొక్కా తడిచిపోయింది లైట్లు ఆర్పివేసి వున్నయ్ ఒకటికి లేచి తూలుతూ చిన్నగా నడుస్తూ యస్సై గదిమీదుగా బయటకు వస్తుంటే, యస్సై గదిలోంచి ఏవోశబ్దాలు వినపడ్డట్టయ్యి ఆగిపోయాడు గదిలో ట్యూబులైటు వెలుగుతోంది కిటికీలు మూసేసి వున్నయ్ తలుపులు దగ్గరకువేసి వున్నయ్ పాతకాలపు గాలి పంకా శబ్దంచేస్తూ వేగంగా తిరుగుతోంది లోపలెవరన్నా గార్డు పీసీలు పడుకున్నారేమో అనుకుంటూ రెండడుగులువేసి ఆగిపోయాడు బలవంతంగా ఆపుకుంటున్న ఏడుపు వినపడుతోంది అతికష్టంగా బాధను భరిస్తున్నట్టు సన్నటి మూలుగు మధ్యమధ్యలో ముద్దగా కర్కశంగా వినపడుతున్న మగమనిషిగొంతు ఆ గొంతు ఎవరిదో చప్పున గ్రహించుకోలేకపోయాడు ప్రకాశం ఒక అడుగు ముందుకు వేసి తలుపు సందులోంచి లోపలకు చూశాడు యస్సై, నిన్న సాయంత్రం తెచ్చిన ఆడవాళ్ళల్లో ఆ ఎర్రగావున్న పిల్లని కింద చాపమీద బలవంతంగా

పైన గోడకు తగిలించిన జాతిపిత బోసినవ్వులు నవ్వుతున్నాడు ఇక అక్కడ నిలబడలేక ముందుకు కదిలాడు ప్రకాశం తిట్టుకుంటూ బయట అంతా చీకటి ఖయిదీలకు వంటచేసే గదికివతల కోర్టు ఆవరణలో ఒకమూల చీకటిలో నుండి మాటలు వినపడుతున్నయ్ చటుక్కున ఆగిపోయాడు

''ఇంతసేపుబ్రతిమాలించు కోవటం బాగాలేదు మూడు కావస్తోంది మళ్ళీ నాకు సెంట్రీ

రిలీఫ్ వస్తాడు ఆ యస్సైగాడు పూర్తిచేసుకుని బయట కొచ్చేడంటే నన్ను కేకేస్తాడు'' అంటున్నాడు ఎవరో

''అబ్బ వుండండి చెయ్యి తియ్యండి వంట్లో బాగాలేదంటే వినరే'' అంటోంది ఆమె

''మంచిగా వినిపించుకోవుగా అందుకేనే మంచితనం పనికిరాదే మీ దగ్గర ఆ యస్సైగాడిలాటోళ్ళకే మీరు మాట వినేది'' అంటున్నాడు అతను

ప్రకాశం అక్కడనుండి కదిలాడు వచ్చేటప్పుడు యస్సై రూం మీదుగా రావటం ఇష్టంలేక సబ్‌జైలులోంచి లోపలి కొచ్చాడు సబ్‌జైలు సెంట్రీ తుపాకీ పక్కన పెట్టుకొని నిద్రపోతున్నాడు కాళ్ళీడ్చుకుంటూ వచ్చి పక్కమీద పడుకోబోతూ మూలనున్న ఆడవాళ్ళని చూశాడు ఇద్దరే వున్నారు చిన్నగా నడుం వాల్చాడు నిద్ర రాలేదు అతనిలో ఆలోచనలు గజిబిజిగా సాగుతున్నయ్

''పడుకో ప్రకాశం'' హఠాత్తుగా వినపడింది ఆ మాట

ఆశ్చర్యంగా చూచి, ''సార్'' అన్నాడు చిన్నగా సార్జెన్ రాఘవుల్ని వుద్దేశించి

''ఆఁ నేనేలే పడుకో'' అన్నాడతను మెల్లిగా ఇంతలో యస్సై గదిలో దబ్బున ఏదో పడ్డట్టు శబ్దం, వెనువెంటనే 'అమ్మా' అని పెద్దగా కేక, చిన్నగా ఏడుపు వినిపించాయి

''ముయ్ దొంగలంజా మరీ సుకుమారిలాగా ఒకటే ఏడుపు బూటు కాలితో ఒక్కటిచ్చానంటే, గుడ్లెల్ల పెట్టి చస్తావ్ పో బయటికి, నీకు అర్నెల్లేయిస్తా శిక్ష పో'' యస్సై మాటలు పూర్తికావటం, దడాలున తలుపు తెరుచుకోవటం ఒక్కసారే జరిగింది ప్రకాశం చటుక్కున కళ్ళు మూసుకున్నాడు నోటి నిండుగా వోణీచెంగు కుక్కుకుని ప్రకాశం పడుకున్న పక్క పక్కగా, ఎవరో వెంటబడి తరుముతున్నట్టు, గతగతా నడుచుకుంటూ ఆ మూలకెళ్ళి ఆ ఇద్దరు ఆడవాళ్ళ పక్కన కూలబడింది ఆ అమ్మాయి యస్సై తూలుతూ బయటకెళ్ళాడు ఒక నిముషం తరువాత బయట మోటార్‌సైకిలు స్టార్ట్‌చేసిన శబ్దం వినబడింది

''వూరుకో యాడవమాక'' అంటోంది పడుకున్న నడికారు మనిషి తరువాత కొద్దిసేపటికి రెండో మనిషి వచ్చి వాళ్ళపక్కన పడుకుంది ఆ అమ్మాయి మాత్రం ఎప్పటికోకాని ఏడుపు ఆపలేదు తెలతెలవారుతుంటే చిన్నగా కునుకు పట్టింది ప్రకాశంకు ఒక గంటలో స్వీపరు వెంకన్న స్టేషను వూడుస్తూ లేపాడు లేచి పక్క గుడ్డలు చుట్టుకొని వచ్చి బల్లమీద కూర్చున్నాడు సార్జెన్ దొడ్లోకెళ్ళి వస్తున్నాడు

''నమస్కారం సార్'' అన్నాడు ప్రకాశం

''నమస్కారం ప్రకాశం'' అన్నాడతను, వచ్చి బల్లమీద కూర్చుంటూ ''బీటు పుస్తకాలు చెప్పండి డైరీ రాద్దాం'' అన్నాడు మళ్ళీ ప్రకాశం బీటుపుస్తకాలు చెపుతుంటే సార్జెన్ రాస్తున్నాడు

మధ్యలో ప్రకాశం ''సార్, రాత్రి అంత ఘోరం '' ఆశ్చర్యంగా అన్నాడు చిన్నగా

''ఇక్కడ అవి చాలా మామూలు విషయాలు నీవెక్కడా టౌన్ స్టేషన్ చెయ్యలేదు కాబట్టి నీకిది అనుభవంలోకి రాలేదు సబ్‌స్టేషన్సులో ట్వూనైన్‌టీఫోరులు చాలా అరుదు కాబట్టి ఇలాటివికూడా తక్కువే మళ్ళీ తాలూకా హెడ్‌క్వార్టర్సులోని సబ్‌స్టేషన్సులో బ్రోతల్స్ వుంటారు'' అన్నాడు ప్రకాశం ఓరగా ఆ ఆడవాళ్ళవైపు చూశాడు ఆ అమ్మాయి మొహం ఏడ్చి, ఏడ్చి ఉబ్బి వుంది కనురెప్పలు వాచివున్నయ్ ఆలోచిస్తూ వుండిపోయాడు ప్రకాశం

అతని ఆలోచనల్ని చదివినట్లు అన్నాడు సార్జెన్ ''దొంగనాకొడుకు ఛ మరీ రాక్షసరతి నా కొడుకుది పురుగులు పడి చస్తాడు పెళ్ళయి పదేళ్ళవుతున్నా వీడికింత వరకూ పిల్లలులేరు

నాకు తెలిసినంతవరకు, నేనిక్కడకొచ్చి నాలుగేళ్ళు దాటుతోంది కదా, వాడొక్క రాత్రన్నా ఇంటిదగ్గరవున్న పాపాన పోలేదు పొద్దుగూకితే మందు కొట్టటం, ఏదో ఒక లాడ్జికి దేన్నో ఒకదాన్ని- అది పుచ్చుదో, సచ్చుదో, ఏసుకుని పోవటం తెల్లారితే మళ్ళీ స్నానం చేసి, పూజాగీజాచేసి బొట్టుపెట్టుకుని ఏడింటికల్లా తయారు అదీ ఇదీ కాదంటే తెల్లార్లూ ఏక్షబ్బులోనో గడిపేస్తాడు అంతేకాని రాత్రిపూట ఇంటికాడ మాత్రం చావడు మరి నా కొడుకు నిద్రెప్పుడు పోతాడోగాని! ఈడికి నిద్రపాపలు చచ్చిపోయివుంటాయి ప్రకాశం'' అని నవ్వుతూ, కొంచెం బల్లమీదకు ముందుకు వంగి, ''ఈ నా కొడుకు ఈడ ఇట్టా తిరుగుతుంటే ఇంటికాడ ఈడిపెళ్ళాం ఆర్డర్లీలతో ఇంకేంది చెప్పేది ''

''అవున్లేండి వాళ్ళు మాత్రం ఎంతకాలమని వుంటారు ఆళ్ళయి మాత్రం ఉప్పూకారం తగులుతున్న శరీరాలుకావా? తప్పు ఈళ్ళల్లో పెట్టుకుని ఆళ్ళనంటే ఏంలాభం'' అన్నాడు ప్రకాశం

ఏడుగంటలకల్లా ఉదయం సెక్షన్ల వాళ్ళు వచ్చారు డ్యూటీ చార్జి నాగభూషణం సార్జెన్‌కి అప్పగించాడు రాఘవులు లాకప్ తాళం ఏడు గంటలకెక్కిన స్టేషన్ వాచ్‌కిచ్చి ఇంటికి వెళ్ళాడు ప్రకాశం

మధ్యాహ్నం వంటిగంటకు సాయంత్రం సెక్షనుకు వచ్చాడు, 'చేతిఖర్చులకు కూడా డబ్బులులేవు ఎట్టాగబ్బా' అనుకుంటూ

''నిన్న సాయంత్రం రేడ్‌లో తెచ్చిన కుర్రోడి దగ్గర డబ్బులు సుష్టాగా కాజేశాడంట రైటరు వాచీ మాత్రం ఇచ్చాడంట పెన్నుగూడా ఇవ్వకుండా పంపేడంట వాడు బ్రతుకు జీవుడా అని అదేపోత నలుగురి ఆడవాళ్ళ దగ్గిరా నాలుగు పాతికలు వసూలు చేశాడంట జామీను ఇచ్చినందుకు అంటే వాళ్ళవాళ్ళ కంపెనీ ఓనర్లు డబ్బుకట్టి వాళ్ళని తీసుకెళ్ళారు మళ్ళీ కేసు కేసే జామీనుకు పాతిక మొత్తం రెండొందల చిల్లర రాత్రికి యస్సైగాడికి బుడ్డికి నలభయ్యో యాభయ్యో ఖర్చు పెడతాడు సి ఐ కి ఒక కోడిని పంపిస్తాడు ఇంక మిగిలినియ్యి జేబులో వేసుకుంటాడు అసలు రేడుచేసి తెచ్చినోళ్ళకి ఏంలేదు కనీసం రాత్రి వాళ్ళని కాపలా కాసిన స్టేషన్ వాచ్‌కికూడా నోట్లో మట్టే'' అన్నాడు కోటేశ్వరరావు

''మీరు నా వెనకాల నిలబడతామంటే నేను అడుగుతా ఎవడబ్బ సొమ్మని దొబ్బి జేబులో పెట్టుకోవటానికి అందులో అందరికీ వాటావుంది, అది పాపపుదో పుణ్యానిదో'' అన్నాడు ఉద్రేకంగా ప్రకాశం

''అడుగుదాం పదండి, అడుగుదాం పదండి'' అన్నారంతా రైటరు గదిలోకి వెళ్ళారు వాళ్ళందరినీ అలా చూచి డొటుపడ్డాడు రైటరు

''ఉదయం టూనైన్‌టీఫోర్‌ల దగ్గరా, ఆ కుర్రోడి దగ్గరా తీసుకున్న వాటిల్లో మా భాగమేది సార్'' అన్నాడు ప్రకాశం రైటరు నీళ్ళు నమిలాడు క్షణకాలం అంతలోనే తేరుకున్నాడు

''అదిప్పటిదాకా వుందా? వాటితోపాటు నా చేతియ్యి పదిరూపాయలు పడ్డయ్యి వుంటే నే నుంచుకుంటానా? మీ డబ్బులు నాకెందుకు?!'' అన్నాడు అనునయంగా నవ్వబోతూ

''అదేందిసార్ రెండొందల చిల్లర ఏమయ్యింది?'' అడిగాడు ఇంకో కుర్రకానిస్టేబులు

వాళ్ళందరినీ ఒకసారి పరిశీలించి చూస్తున్నట్టు చూశాడు రైటరు ఆ చూపు అందరికీ భయం కలిగించింది ఎవడిమీద యస్సైకీ, సి ఐ కీ అవకాశం వస్తే డి యస్పీకి చాడీలు చెపుతాడో అని ఎవరికి వాళ్ళకి మనస్సు పీచుపీచుమంటోంది కానీ డబ్బుల విషయం గుర్తొచ్చేసరికి మేకపోతు

గాంభీర్యంతో నిలబడ్డారు అంతా

''ఏందయ్యా! నేనేమన్నా తిన్నాననుకున్నారా? ఆ డబ్బుల్లో డి యస్పీదొరకి రెండు కిలోల మాంసం, ఒక కిలో వెన్నపూసా, పలావు సరుకులూ, సి ఐ గారికి ఏవో డోర్ కర్టెన్లు రెండు కావాలంటే ఒక్కొక్కటి ముప్ఫైరూపాయలు యస్సైగారి సంగతి మనకందరికీ తెలిసిందేగా, ఒక ఆఫ్ బాటిలూ, ఒక క్వార్టరు బాటిలూ పోయినసారి ఇనస్పెక్షనుకు ఆ కొట్లో తెచ్చిన తెల్లకాగితాలకూ, టైపు రిబ్బనుకూ, కార్బన్‌పేపర్లకు- ఇంత వరకే నా చేతియ్యి ఇంకా పది రూపాయలు పడ్డయ్ ఇంకా డ్రింకు షాపులో, కొబ్బరిబోండాలకీ, ఇయ్యన్నీ నాపేరు చెప్పేగా తెస్తున్నదీ ఆ బాకీలింకా అట్లాగే వున్నయ్'' అన్నాడు

ఎవరూ ఏం మాట్లాడలేదు కొద్దిసేపు

''అదేలేసార్ మా డబ్బులు మీరు వుంచుకుంటారని కాదు అయినా ఏమన్నా వస్తాయేమోనని ఆశ అందుకని అడిగాం'' అన్నాడు ఒక పీ సీ మెరమెచ్చుగా

''నాకెందుకయ్యా మీ డబ్బులు నాకష్టార్జితమే నాకుండటంలేదు ఇంకా ఇదొక పాపమా! ఎప్పుడైనా మీకు రావాల్సిన డబ్బులుంటే పిలిచే ఇస్తున్నాను కదా'' అన్నాడు రైటరు నవ్వుముఖంతో ఆ నవ్వులో వాళ్ళని తేలికగా మోసం చేయగలిన తాలూకు గర్వం కనపడుతోంది

''అవుననుకోండి '' అన్నాడు ఒకతను దీర్ఘంతీస్తూ, రైటరు అలా తమల్ని పిలిచి ఎప్పుడిచ్చాడా అని గుర్తు చేసుకుంటూ అంతా బిల బిలా బైటకొచ్చారు సెల్యూట్‌లు కూడా చేశారు కొంతమంది స్మార్ట్‌గా బైటకొచ్చాక మళ్ళీ మామూలు ధోరణిలోకి వచ్చారు

''వచ్చినియ్యన్నీ వాళ్ళకే పెడుతుంటే మన గతేంది 'ఇంత' ని తీసి పక్కనపెట్టి మిగిలినియ్యి వాళ్ళేమైనా చేసుకోవాలి అంతేగాని, మన వాటా వాళ్ళు నూకటమేంది? మనకూ పెళ్ళాం పిల్లలు లేరా? మనకు ఖర్చులు లేవా? మేము నాలుగు రోజుల్నుండి కూరకు డబ్బులు లేక పచ్చడి మెతుకులతో కాలం గడుపుతున్నాం ఈ లంజాకొడుకులేమో, పలావులూ, ఫ్రైలూ'' అన్నాడు ఒకతను కోపంగా

''మా అమ్మాయికి పోయిన్నెలలో ఫీజు కట్టలేదని దానిని స్కూలుకు రానివ్వటం లేదు ఎంత పైసా పైసా పోగుచేసినా ఈ బతుకు బండి లాగటం కష్టమౌతోంది కారణం అర్థం కావటం లేదు'' అన్నాడు ఇంకొకతను దిగాలుగా

''మా యింట్లో, నెలలో, జీతాలొచ్చిన వారం పదిరోజులు కాస్త మంచి కూరా, కాసిని సల్లా పోసుకుంటామేమో తరువాత ఇరవైరోజులూ పచ్చడి మెతుకులే అందుకే ఈ బాధ భరించలేక, తెలివిగా, సీజన్‌లో అప్పోసొప్పోచేసి, ఒక కుండకు సింతకాయ తొక్కు, ఒక కుండకు పండుమిరపకాయా పెట్టిస్తే అప్పుడుగాని దిగులు లేకుండా పోదు లేకపోతే ఇబ్బందే'' అన్నాడు ఒక సీనియర్ పీసీ

ఆ మాటలకు ఒక కుర్రకానిస్టేబులు నవ్వాడు

అతనలా నవ్వటం కొంతమంది సీనియర్స్‌కి కోపం తెచ్చింది

''అదే మనకీ వీళ్ళకి తేడా నిన్నకాక మొన్న డిపార్టుమెంటులో చేరిన కుర్ర రిక్రూట్‌లు ఇట్టా సంవత్సరం తిరిగొచ్చి ప్రొబేషనుకూడా పూర్తికాకముందే స్థలాలూ, పొలాలూ కొంటున్నారు వేలకి వేలు వడ్డీలకు తిప్పుతున్నారు పెళ్ళాలకి నగలూ, నట్రా చేయిస్తున్నారు ఆళ్ళయిళ్ళలో ఎట్టాంటి కుర్చీలూ, గంగాలాలూ, స్టీలు సామాన్లూ మరి అయ్యన్నీ ఏడనుండొస్తున్నా

యంటారు'' అన్నాడు సందేహంగా ఒక సీనియర్ పీసీ

''ఏడదేముంది నవ్వు చెప్పే వాళ్ళంతా ఐడీ పార్టీవాళ్ళు, ఆర్డర్లీలూ, డబ్బారైటర్లూ వీళ్ళేగా వాళ్ళ ఉద్యోగమేంది? ఈడిని తీసుకోండి, నాగేంద్రంగాడిని ఉద్యోగమేంది? పొద్దున్నే సి ఐ గారింటికి పోవటం, కావాల్సిన కూరగాయలు తెచ్చి పడెయ్యటం పిల్లోడ్ని తీసుకుపోయి బడికాడ వదిలిపెట్టిరావటం ఇంక వూరిమీదపడి దండుకోవటమేగా మొదట బ్రోతల్ కంపెనీలు దేన్నీ వదలిపెట్టడు కదా! అన్ని కొంపల లిస్టుంది ఆడికి సీక్రెట్ బ్రోతల్స్ కూడా తెలుసు వాళ్ళదగ్గరకూడా కాస్తో కూస్తో లాగటానికి ప్రయత్నం చేస్తాడు భయపెట్టో, బెదిరించో అదీ ఇదీ కాదంటే కనీసం ఒకసారి ఏడ్చున్నా వస్తాడుగాని వదిలి పెట్టడు తరువాత క్లబ్బులు, సారాయి కాంట్రాక్టర్లు, బ్రాకెట్టు కంపెనీవాళ్ళు చివరికి డాన్సు పిల్లల్ని కూడా వదలి పెట్టడు ఈళ్ళంతా మనకిచ్చే దానికన్నా వాడికి డబల్ ఇవ్వాలి మధ్యమధ్యలో అయ్యగారికోసం పనుల మీదొచ్చే ఘరానా పెద్దమనుషుల దగ్గరకూడా చెయ్యిచాపి, పదీపాతికా లాగుతుంటాడు వాళ్ళకీ అయ్యగారికి మధ్య డబ్బులు మార్చేదీ ఈడేగా అయ్యగారు డైరెక్టుగా తీసుకోడుగా మరి అయ్యగారికనిచెప్పి మాంసం తక్కువరేటు, కూరగాయలు తక్కువ, చేపలు తక్కువ అవి తీసుకుని, అయ్యగారి ఇంటికిపోతూ నాలుగు వంకాయలు, రెండు దొండకాయలు, ఒక గోంగూరకట్ట తన యింటిలో పడేసిపోతాడు అయిపోయ ఆ పూట కూర గడిచి పోయినట్టే ఇంకా ఇట్టాంటియ్యెన్ని రైటర్లూ, సార్జెన్‌లూ సంపాదించేది ఏదన్నా వీడి దృష్టిలో పడిందో వీడికొక పదో, పాతికో చేతిలో పెడతారు లేకపోతే వెంటనే ఆఫీసర్లకు మెసేజ్ పోతుంది వాళ్ళు సంపాదించిన దానిని వడ్డీతోసహా కక్కిస్తారు ఆఫీసర్లు అన్నిటికంటే సుఖం తుపాకి పట్టుకుని ఉద్యోగం చేసే పనిలేదు ఎప్పుడూ తెల్లటి గుడ్డల్లో సినిమా యాక్టర్లా తిరగొచ్చు సైకిలుమీద అటు నిండు టీ ఏ కొట్టేస్తాడు ముప్పైరోజులు ఉద్యోగం చేసేవాడికి పదిరోజుల టీ ఏ లేదు ఎక్కడికన్నా పోవటానికి సెలవులే ఇవ్వరు మనకు గొంతుమీద కొచ్చినా మనకి సెలవివ్వటానికి అధికార్లకు మనసొప్పదు వాడు తనకు పనున్న వూరు ఏదో ఒక డ్యూటీ రాసుకుని, బస్సు వారంట్లు సైతం తీసుకుని వెళ్ళి రాగలడు మరి అట్లాంటోళ్ళు సంపాదించకుండా, నువ్వూ నేను సంపాదిస్తామా?'' అన్నాడు ఒక సీనియర్ పీసీ ఆవేశంగా

''అయితే ప్రతి ఆఫీసరూ పోయేటప్పుడు వీళ్ళమీద రిపోర్టు రాసే వాడేగా, వాళ్ళు చేసిన తప్పుడు పనులు వీళ్ళు ఎక్కడ బయట పెడతారోనని'' అన్నాడు ఆంజనేయులు

''అయితే మాత్రం ఏందంట ఈ రోజుల్లో నాలుగురాళ్ళు ఎనకేసుకున్నవాడు మొనగాడుగానీ, ఎట్టాబతుకుతున్నా మనేది ముక్యంకాదు తోముడు పార్టీకి ఎక్కడా తిరుగులేదు'' అన్నాడు ఒకతను

''అయితే ముసిలి యలమందకూడా అట్టాగే సంపాదిస్తున్నాడంటావా? వాడుకూడా సి ఐ దగ్గర ఆర్డర్లీయే కదా'' అన్నాడు ఒకతను

''ఆర్డర్లీలయ్యే వాళ్ళంతా దోచుకుంటానికేనా? వాడికది చేతకాదు పాపం వాడీ డ్యూటీలు చెయ్యలేకా, బండెడు సంసారాన్ని ఈదలేక బాధపడుతున్నాడు వయస్సు పైనపడింది వాడికసలు ఆ పని చెయ్యటానికి కూడా మనసొప్పదు ఒకప్పుడు ఆఫీసర్ని వెంట్రుక కింద జమ కట్టిన వాడు కుర్రతనంలో ఓసారి ఏదో బందోబస్తులో ఓ డీ యస్పీ వీడిని 'ఏరా గాడిదకొడకా' అంటే సర్రున బెల్టుతీసి నడిబజార్లో డి యస్పీని కొట్టబోయినవాడు మహా రోసగాడు మాట పడడు కాకపోతే పరిస్థితులట్టా నెట్టుకొచ్చి వాడీ ఆర్డర్లీ కమతానికి కుదిరాడు తప్పని స్థితిలో ఇట్టా ఆఫీసర్ల

పిల్లలకు ముడ్లు కడుగుతూ, అంట్లు తోముతూ కాలం వెళ్ళదీస్తున్నాడు ఇంకా ఎంతో సర్వీసు లేదు పెళ్ళీడుకొచ్చిన ఆడపిల్లలున్నారు ఒక కుర్రాడు కాబోలు చదువుకుంటున్నాడు మనలాగే సర్వీసంతా జీతంమీద ఆధారపడి బ్రతికాడు ఎవడన్నా ఇస్తే చెయ్యిచాపే రకమేకానీ, రుబాబు చేద్దాం అనిగానీ, ఆఫీసర్ని అడ్డంపెట్టుకొని సంపాదిద్దామని కానీ అనుకున్న మనిషికాదు అసలు మనలో చాలామంది మనస్సు చంపుకొని, ఆత్మాభిమానాన్ని అమ్ముకొని జీవించలేనివాళ్ళే అట్లాంటోళ్ళకి ఈ డిపార్టుమెంటు పనికిరాదు'' అన్నాడు ఒకతను

''ఆఁ అన్ని డిపార్టుమెంటులూ ఇట్లాగే వున్నయ్‌లే ఆఫీసర్లకు అనుకూలంగా ఉండేవాళ్ళకు సౌకర్యాలూ, ప్రమోషన్‌లు అలాకాకుండా తన పని తను చేసుకుపోయే వాడికి అన్నీ ఇబ్బందులే ఇక మనదయితే పూర్తి బానిసత్వమనుకో డిసిప్లైన్ పేరుతో మనల్ని ఇంటా బయటా ఎందుకూ పనికిరాని వెధవల్ని చేస్తున్నారు మనం మన బాధని భరించలేని పరిస్థితిలో కాస్త గట్టిగా మన కష్టం గురించి చెప్పుకున్నా ఇన్‌డిసిప్లైన్ అంటారు ట్రాన్స్‌ఫర్‌లూ, ఇంక్రిమెంట్లు కట్ ఇంకాస్త గట్టిగా అరిస్తే సస్పెన్షన్‌లు స్టార్ట్ మన బ్రతుకులకి మనల్ని మూడునెలలు సస్పెన్షన్‌లో పెడితేచాలు ఆఫీసర్ల కాళ్ళు పట్టుకోవటమో ఇంటిల్లపాదీ విషం తాగటమో అంతకుమించి గత్యంతరంలేదు ప్రతినెలా కాస్తోకూస్తో జీతం వస్తుంటేనే నెలలో చివరి రోజులు సరిగ్గా గడవ్వు ఇక సస్పెన్షన్ సంగతి వూహించుకుంటేనే భయం పుట్టిద్ది'' అన్నాడు ఒకతను

''అట్లా పాపపు సొమ్ము సంపాదించినా అది నిలబడదు లేండి అంతకంతా పోయిద్ది ఇప్పుడు కాదు చచ్చిపోయినాక అక్కడ దేవుడి దగ్గర, అయనెదుట సమాధానం చెప్పుకోవాలి'' అన్నాడు ఒక దైవభక్తి వున్న పీసీ

''ఆఁ చచ్చేక సంగతి అప్పుడేదో సమాధానం చెప్పుకోవాల్సి వస్తుందని, ఇప్పుడు పెళ్ళాం పిల్లల్ని పస్తులుంచలేం కదా అయినా మన చేతకానితనాన్ని కప్పిపుచ్చుకోవటానికి చెప్పుకునే రకరకాల సాకుల్లో ఇదొకటి'' అన్నాడు ఒకతను ''మనబోటోళ్ళం పాపం పుణ్యం అనుకుంటుంటే సంపాదించేవాళ్ళు బాగానే సంపాదిస్తున్నారు'' అన్నాడు అతనే మళ్ళీ

ఈ సంభాషణ ఇక్కడ జరుగుతుంటే లోపల యస్పై గదిలో రైటరు అంతకుముందు జరిగిన విషయం గురించి యస్పైకి చెపుతున్నాడు ''అతను అందరినీ వేసుకుని వచ్చాడు సార్ లీడర్‌లాగా లెఖ్ఖచెప్పమని దబాయించాడు ఈ లెఖ్ఖన వాడ్ని మనం ఇలాగే వదిలేస్తే మనల్ని బ్రతకనియ్యడు సార్ 'మా డబ్బులు దొబ్బటానికి వాడెవడు' అన్నాడు సార్ తమర్ని''

ఆ మాటలు వింటుంటే యస్పై ముఖం కందగడ్డలాగా మారిపోతోంది అతను చేతితో టేబిలుమీది పేపర్‌వెయిట్‌ని గట్టిగా వత్తుతున్నాడు కోపంతో

''నిన్న వీడేనంట సార్, తమరు రేడ్‌కి బయలుదేరబోయేముందు బ్రోతల్ కంపెనీవాళ్ళకి ఇనఫరమేసన్ అందజేసింది మన ఐ డీ పార్టీవాళ్ళు అంటున్నారు సార్'' అన్నాడు రైటరు అబద్ధం సృష్టించి

ఆ మాటలు వింటుంటే యస్పై కళ్ళల్లో రక్తపు జీరలు చిక్కబడుతున్నయ్ ''సరే నువ్వెళ్ళు వాడి సంగతి నేను చూస్తా దొరికాడులే'' అన్నాడు

రైటరు సెల్యూట్ చేసి, మనస్సులో నవ్వుకుంటూ బయటకొచ్చాడు బయట వున్నవాళ్ళని చూచి, ''ఏందయ్యో, ఏందో చర్చిస్తున్నారే'' అన్నాడు మామూలుగా

''ఏముంది సార్ మామూలే కాలక్షేపం'' అన్నాడు ఒక కుర్రపీసీ

ఆ మాటకు రైటరు చిన్నగా నవ్వాడు ''మాట్లాడుకోండి కాలక్షేపం మంచిదేగా'' అన్నాడు వెళ్ళి తన కుర్చీలో కూర్చున్నాడు

యస్సై బుర్ర నిండా ప్రకాశం నిండిపోయాడు 'వీడిని మొక్కలోనే తుంచకపోతే ఏకు మేకవుతాడు అందుకే వీడు ఏ స్టేషన్లోనూ పట్టుమని పది రోజులు ఉండలేదు ఇక్కడకూడా వుండడు వీడి పర్ఫెక్ట్ ఉద్యోగం ఎవడిక్కావాలి? ఆఫీసర్ల ప్రైవేటు జీవితం గురించి వీడు ఆలోచిస్తున్నాడంటే అది చాలా ప్రమాదం' అనుకున్నాడు వెంటనే లేచి బయటకొచ్చి మోటారు సైకిలు స్టార్టు చేసి డి యస్పీ బంగళావైపు దూసుకుపోయాడు డి యస్పీ అప్పుడే పూజ చేసుకుని ఆఫీసులోకి వచ్చి కూర్చున్నాడు వెళ్ళటంతోనే స్మార్ట్‌గా సెల్యూట్ చేశాడు యస్సై

''ఆఁ ఏమిటి విశేషాలు?'' అన్నాడు డి యస్పీ మామూలుగా

''ఏం లేదు సార్ రాత్రి విశేషాలు ఏమీలేవు సార్ సార్ మనం నిన్న కండక్ట్ చేసిన బ్రోతల్స్ రేడ్‌లో బ్రోతల్ కంపెనీ వాళ్ళకు ఇనఫర్‌మేషన్ ఇచ్చిన పీసీ తెలిశాడు సార్'' అన్నాడు యస్సై

''ఎవడు వాడు? ఎవడా ఈడియట్'' కోపంగా తిట్టాడు డి యస్పీ

''ప్రకాశమనీ, నెంబరు '' గుర్తు తెచ్చుకోవటానికి కొద్దిసేపు ఆగి, గుర్తొచ్చాక చెప్పాడు యస్సై

''సరే, వాడిమీదొక రిపోర్టు రాసి తీసుకురా సబ్‌మిట్ చేసి రేపు క్రైం మీటింగులో దగ్గరుండి యస్పీచేత డి వో (ట్రాన్స్‌ఫర్) వేయించుకొస్తా'' అన్నాడు డి యస్పీ

'అలాగే సార్' అన్నట్లు తలూపాడు వినయంగా యస్సై ''ఉదయం వాళ్లకెవళ్ళకో జామీనిస్తే పది రూపాయలు ఇచ్చారంట సార్ రైటర్‌కి వాటితో మన బంగళాకి రెండు కిలోల మాంసం, ఒక కిలో వెన్న, ఇంకేవేవో పంపించాడంట సార్ రైటరు అది పట్టుకొని, 'వాడెవడయ్యా మా డబ్బుల్తో పలావులు తినటానికి, మేమిక్కడ పచ్చడి మెతుకులకు గతిలేక చస్తుంటే' అని తిట్టాడంట సార్ తమర్ని'' అన్నాడు యస్సై

ఆ మాటలు వినేసరికి డి యస్పీ కళ్ళల్లో నెత్తురు చుక్కలు నిండాయి పళ్ళు పటపట నూరాడు చేతిలోని ఫైలు విసిరి కింద కొట్టాడు ''అంత మాటన్నాడా? వాడి అంతు చూస్తాను వాడి కా పచ్చడి మెతుకులు కూడా లేకుండా చేస్తా ఫో, నువ్వు పోయి రిపోర్టు రాసుకురా లేకపోతే రాసుకో ఇప్పుడే, డిక్టేట్ చేస్తా'' అంటూ కేకలేశాడు

''ఎందుకు సార్ నేను రాసుకొస్తా సార్ రాయగలను సార్ ఇంతకుముందు చాలామందికి రాశాను కదా సార్'' అన్నాడు యస్సై హేపీగా

''వూ అయితే త్వరగా రా'' అన్నాడు డి యస్పీ

''అలాగే సార్'' అని స్మార్ట్‌గా సెల్యూట్‌చేసి ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ బైట కొచ్చాడు యస్సై మోటరుసైకిలు స్టార్ట్ చేసి చిన్నగా ఈలవేస్తూ బయలుదేరాడు స్టేషన్‌కు

ఇక్కడ ఈ సంభాషణ జరుగుతున్నప్పుడు, అక్కడ బ్రోతల్ కంపెనీ ఓనర్లతో ఐ డీ పార్టీవాళ్ళు ఘర్షణ పడుతున్నారు

''మేము ఇనఫరమేషన్ ఇవ్వకపోతే మీకు వెయ్యి రూపాయల పైచిలుకు నష్టం జరగేది మాకు అందులో సగం ఇవ్వటానికి ఏడుస్తారేంది'' అంటున్నాడు గౌసు

''అదికాదు సార్ మీరు ఇనఫర్‌మేషన్ ఇచ్చారు బాగానే వుంది అసలు మా దగ్గరెవురి దగ్గరా పిల్లలు లేరు ఎక్కువగా అన్‌సీజన్ కదా ఇంతకుముందు ఎంత అడిగితే అంత ఇవ్వలేదా

మీరుకూడా మా కష్టసుఖాలు అర్థం చేసుకోండి కాస్త'' అంటున్నాడు అందరి తరుపున ఒక బ్రోతల్ కంపెనీ ఓనరు బుల్లన్న

''ఇట్లాగయితే లాభం లేదు ఇకపైన మేము ఇనఫర్మేషన్ ఇవ్వలేము తరువాత మీ యిష్టం మమ్మల్ని అనొద్దు'' అన్నాడు మూర్తి

''అయ్యయ్యా! తమరట్లా అంటే ఎట్లా? మా కష్టసుఖాలు చూడమంటున్నాం తమరు కోప్పడితే మేమెంతటివాళ్ళం ఈసారికి మమ్మల్ని ఇంతటితో వదిలిపెట్టండి ఈ రెండువందలు తీసుకోండి అయ్యగారూ! జోసఫ్‌గారూ, తమరన్నా కాస్త ఆలోచించాలి'' అని డబ్బులు జోసఫ్ చేతిలో పెట్టబోతున్నట్టు జోసఫ్ చేతులు పట్టుకొని చిన్నగా గీరాడు అతని చేతిని

దాని అర్థం తెలిసినట్లు, ''సరే కానీయండి ఈసారికి అన్‌సీజన్ అంటున్నాడుగా నెక్స్ట్ టైం చూద్దాం మనం కూడా కాస్త పట్టువిడుపు చూడాలికదా అయ్యి తీసుకోండి'' అన్నాడు మిగిలినవాళ్ళతో జోసఫ్ ఆ మాటకు మిగతా ఐ డీ పార్టీ వాళ్ళు ఏమీ మాట్లాడలేదు

''మీరేమీ కష్టమనుకోగాకండి సార్ ఈవార ఇంకోసారి తీర్చుకుంటాముగాని మీ రుణం వుంచుకుంటామా'' అని బలవంతంగా గౌస్ చేతిలో పెట్టాడు డబ్బులు అతను అయిష్టం నటిస్తూ వాటిని తీసుకున్నాడు గౌస్

''సరే పదండి మనం ఎక్కువసేపు ఇక్కడ వుండటం మంచిది కాదు'' అన్నాడు జోసఫ్ నలుగురూ సైకిళ్ళెక్కి బయలుదేరారు వాళ్ళంతా సరాసరి బృందావన్ హోటల్‌కెళ్ళి ఒక మూలగా కూర్చున్నారు

''నాలుగు స్ట్రాంగ్ కాఫీలు పట్రారా'' అన్నాడు జోసఫ్ సప్లయిర్ కుర్రాడితో

''నువ్వంత మెత్తగా మాట్లాడకూడదురా జోసఫ్ ఆ లంజాకొడుకులకు డబ్బులకేం కొదవ? నువ్వట్లా మాట్లాడేసరికి మేం తగ్గాల్సొచ్చింది'' అన్నాడు గౌసు జేబులోంచి డబ్బులు తీసి తలా యాభై రూపాయలు లెఖ్ఖపెట్టి ఇస్తూ

''ఒరేయ్ మనం కూడా పట్టువిడుపులు చూడాలి ఇదీ ఒక రకమైన వ్యాపారమే, మనం ఒకే పట్టుమీదుంటే లాభం లేదు పొదుగు కోసుకొని పాలు తాగాలంటే ఎట్లా? ఏమంటావురా భద్రం'' అన్నాడు జోసఫ్

''వాడేమంటాడు. వాడి నిందాకటినుండి చూస్తున్నా, నోరెత్తటం లేదు, వాడి బాబుగాడి సొమ్మంతా పోయినట్టు'' అన్నాడు మూర్తి

''కాదులేరా నా మనసేమీ బాగాలేదు మమ్మకి వంట్లో బాగాలేదని ఉత్తరం వచ్చింది పోక తప్పదు అందువల్ల కొంచెం బాధగా వుంది ఆమెకెట్లా వుందో ఏమిటో'' అన్నాడు భద్రం బాధగా

''సరేలే పదండి రెండు స్టార్ల నా కొడుకు మనకోసం ఎదురుచూస్తుంటాడు పోయి ముందు వాడి దర్శనం చేసుకోవాలి వాడిని ప్రసన్నం చేసుకుంటే మనకి నిత్య జీవితం పచ్చ తోరణం'' అన్నాడు మూర్తి యస్సైని వుద్దేశించి అందరూ లేచారు జోసఫ్ బిల్లిచ్చి బైటకొచ్చాడు సైకిళ్ళెక్కి నలుగురూ బయలుదేరారు స్టేషనుకు స్టేషన్‌కు చేరేసరికి యస్సై ఎవరితోనో మాట్లాడుతున్నాడు హుషారుగా నలుగురూ ఒక్కసారిగా స్మార్ట్‌గా సెల్యూట్లు చేశారు

అందరినీ ఒకసారి పరికించి చూచి ''కాసేపుండండి'' అన్నాడు యస్సై

నలుగురూ పక్కకు వెళ్ళారు మళ్ళీ సెల్యూట్స్ చేసి స్మార్ట్‌గా సెక్షన్ హెడ్ కానిస్టేబులు రంగారెడ్డి తలెత్తి వీళ్ళని చూశాడు

''నమస్కారమండీ ఐ డీ పార్టీ వాళ్ళందరికీ'' అన్నాడు నవ్వుతూ

''మాకెందుకు సార్ నమస్కారాలు తమరు మాకు నమస్కారం పెట్టారంటే మాకేదో మూడిందనే దానర్థం'' అన్నాడు మూర్తి నవ్వుతూ

''అమ్మమ్మా అంతమాట అనమాక మిమ్మల్ని ప్రసన్నం చేసుకుంటే మాకూ మంచిదనే గాని వేరేకాదు'' అన్నాడు సార్జెన్

''అదేం మాట సార్ మీరు సార్జెన్‌లు ఎర్రబెల్టు, మూడు పట్టీలు ఒక్క కేసు వస్తే చాలు వందలు వందలు'' నవ్వుతూ అన్నాడు భద్రం

''ఆఁ వందలు వందలు రావాల్సిందే పిటీషన్లు మామీద మాకెవడయ్యా మహా యిస్తే పదీ, పాతిక అవయినా ఆ రెండు పూల దొరని దాటొస్తే ఆ పదిలో ఆఫీసర్లకు పెట్టగా మనకు మిగిలేది పది పైసలే మీకు తెలియనిదా ఇది'' అన్నాడు సార్జెన్

''మా పనీ అంతేకదా సార్ మేమూ నానాగడ్డి తినీ, ఇనఫార్మెంట్లని పెట్టీ, వాళ్ళకి మా పాకెట్ మనీ ఖర్చుపెట్టి చివరికెవడినన్నా ఒకడ్ని పట్టుకొని, వాడిని చావబాదీ, ఆ పాపమంతా మూట కట్టుకొని, వాడి దగ్గర నుండి తులమో, ఫలమో, బంగారమో, ఇంకోటో రికవరీ చేస్తే, మాకు చివరికి కనీసం ఖర్చులకి కూడా ఇవ్వకపోతుంటే మేమేం ఛస్తాం సార్'' అన్నాడు చిన్నగా జోసఫ్

''అంతా నష్టం మీద జరుగుతుందంటావు వ్యాపారం సరేకాని కొన్ని రోజులు నష్టం తరువాత లాభం తొందరపడితే ఎట్లా'' అన్నాడు సార్జెన్

''అందుకేగా ఓపిక పట్టి పళ్ళు బిగువున రోజులు దొర్లిస్తున్నది'' అన్నాడు జోసఫ్

''మా పని కూడా అంతే జోసఫ్ ఈ పూలు బెల్టు కన్నా, ఆ తోలుబెల్టు నయమనిపిస్తోంది బరువూ బాధ్యత లేదు సెక్షన్ దిగితే వాళ్ళని అడిగే నాధుడు లేడు కదా'' అన్నాడు సార్జెన్ పీసీలని దృష్టిలో వుంచుకుని

ఇంతలో రైటరు గదిలో నుండి, డబ్బా రైటరు చాక్‌పీసు తీసుకుని బయటకు వచ్చాడు

''ఏందండోయ్, అసిస్టెంటు రైటరుగారూ, చాక్‌పీసు తీసుకుని తిరుగుతున్నారు, గార్డు రిలీఫా?'' అన్నాడు ఒక పీసీ, తనకేమన్నా గార్డు నుండి రిలీఫ్ వేస్తున్నారేమో అనే వుద్దేశంతో

''గార్డు కాదు ఇరవై నాలుగో తారీకు యస్పీగారి రికార్డు ఇన్‌స్పెక్షన్ ఇరవై అయిదు డ్రిల్లూ, కిట్టూ ఇనస్పెక్షన్'' అన్నాడు డబ్బా రైటరు

''మొన్ననేగా డి యస్పీదీ, సి ఐ దీ అయిపోయింది'' అన్నాడు భద్రం

''దానికీ దీనికీ సంబంధమేముంది దానికదే, దీనికిదే'' అని నోటీసు బోర్డు మీద ఇనస్పెక్షన్ గురించి రాశాడు డబ్బా రైటరు

''ఇంకా నాలుగు రోజులుంది యూనిఫారం శుభ్రం చేయించి, మళ్ళీ డిప్ప క్రాఫులు కొట్టించాలన్నమాట'' అన్నాడు ఒకతను ఇంతలో యస్సైతో మాట్లాడుతూ కూర్చున్నవాళ్ళు బయటకు వెళ్ళారు ఐ డీ పార్టీవాళ్ళు యస్సై రూంలోకి వెళ్ళారు సెల్యూట్‌లు చేసుకుంటూ యస్సైకి

'అయ్యగారి ప్రస్తుత మనస్థితి ఎలాగుందో?' అని ముఖం చూచి స్టడీ చెయ్యటానికి ప్రయత్నిస్తున్నట్టు యస్సై వైపు చూశారు ఆ సిగరెట్టు తాగేతీరూ, కాలు వూపుతున్న తీరూ, అయ్యగారు హుషారుగా వున్నట్టుగానే కనపడి గట్టిగా గాలి పీల్చుకున్నారు

''ఏమిటి సంగతులు ఒకళ్ళకి నలుగురు టౌన్‌లో తిరుగుతున్నారు. కాని నేరాలు జరుగుతూనే

వున్నయ్ ఒక్కపైసా రికవరీ లేదు, తెచ్చి నోళ్ళని ఇంటరాగేట్ చేసేది లేదు'' అన్నాడు ప్రతి మాటా వత్తి పలుకుతూ యస్సై మళ్ళీ తనే, ''ఇట్లాగయితే నేను ఆఫీసర్లకి ఏం సమాధానం చెప్పుకోవాలి అందులో నాలుగు రోజుల్లో యస్పీగారి ఇనస్పెక్షన్ వుంది ఏమిటి, ఏమిటో చెప్పండి ఏం చేస్తున్నట్టు మనమంతా?'' అన్నాడు

కొద్దిసేపు ఎవరూ ఏం మాట్లాడలేదు మాట్లాడటానికి ఏం సమాధానం లేదు వాళ్ళదగ్గర కాని ఏమీ సమాధానం చెప్పకపోతే యస్సై ఇంకా మాట్లాడతాడని చిన్నగా అన్నాడు మూర్తి ''తిరుగుతూనే వున్నాం సార్''

''తిరుగుతూనే వున్నారు మీరొక పక్క తిరుగుతున్నారు నైటు బీటువాళ్ళు ఒకప్రక్క తిరుగుతున్నారు ఒక పక్క నేరాలు జరిగిపోతున్నాయి అన్నీ పెద్ద పెద్ద గ్రేవ్ అఫెన్సులే ''

ఏదో ఒకటి మాట్లాడి యస్సై మాటలకు ఆనకట్ట వేయాలన్నట్టు ''నైటుబీటోళ్ళు రెండు మూడు గంటలకల్లా ఇళ్ళకెళ్ళిపోతున్నారు సార్ మన ఏరియాలో జరిగే నేరాలన్నీ తెల్లవారు ఝూము, నాలుగయిదు మధ్య జరుగుతున్నాయి సార్ '' అన్నాడు జోసఫ్

''ఛా వూరుకోండి వాళ్ళనంటారే వాళ్ళిప్పుడు పర్ఫెక్ట్‌గానే తిరుగుతున్నారు వాళ్ళని బెదిరించో, భయపెట్టో, రిపోర్టు రాస్తాననో తెల్లవార్లూ తిప్పుతూనే వున్నా'' అన్నాడు యస్సై

ఆ మాటకు జోసఫ్ ఇబ్బందిగా ముఖం పెట్టాడు

''ఇంకా నలుగురిని ఇన్‌ఫార్మెంట్లని పెట్టాం సార్'' అన్నాడు భద్రం ఏదో ఒకటి మాట్లాడక పోతే బావుండదని

''అవన్నీ నాకనవసరం మీరు రేపీపాటికి నాకు సరయిన క్లూ తేవాలి నా అనుమానమంతా టైగర్ నాగేశ్వరరావు మీదే ఈ ఫక్కీ నేరాలన్నీ వాడు తప్ప ఇంకొకడు చెయ్యడూ, చెయ్యలేడు వాడన్నా కావాలి లేకపోతే వాడున్నాడే నాంపల్లి దాదాగాడు, వాడన్నా కావాలి'' అన్నాడు యస్సై

''నా ఉద్దేశ్యం దాదాగాడనే సార్ చాలా స్టేషన్లవాళ్ళకి వాడు వాంటెడ్ సార్ నాంపల్లిలో వాళ్ళక్క వుంది సార్ దాని దగ్గరకు వచ్చాడంట వెంటనే మళ్ళీ మాయమైపోయాడు సార్ ఈసారి వాడికోసం గట్టి ఇన్‌ఫార్మెంట్సుని ఏర్పాటు చేశాను సార్ ఈ సారి గ్యారంటీ వాడు గనక మనకు దొరికితే షుమారు వంద శౌరీలన్నా రికవరీ అయిద్ది సార్ గోల్డ్ ఇక సైకిళ్ళు, టేప్‌రికార్డులూ, చిల్లర వస్తువులయితే లెఖ్ఖ వుండవు సార్ కుప్పలు కుప్పలే సార్'' అన్నాడు జోసఫ్

బంగారం మాట వినంగానే యస్సై కళ్ళకు అంతా పసుపుపచ్చగా కనపడింది ఆనందంతో గుటకలు వేసి, సిగరెట్ పీక యాష్‌ట్రేలో పడేశాడు

''వాడిని జాగ్రత్తగా, తొందరలో ట్రేస్ చెయ్యాలి మీరివ్వాల్టి నుండి ఆ పనిమీదే వుండండి'' అన్నాడు, ఆదుర్దాగా సంతోషం నిండిన స్వరంతో ''మిగతా స్టేషన్ల వాళ్ళుకూడా తిరుగుతున్నారు వాడికోసం మనమే పట్టాలివాడ్ని'' అన్నాడు మళ్ళీ

''సార్ మరి, ఈ సైకిల్ తెఫ్ట్‌ట్లూ, సినిమా హాళ్ళ దగ్గర, బస్టాండులో పిక్‌పాకెటర్స్ కోసం ''

''ప్ఛ్ అవన్నీ వదిలి పెట్టవయ్యా! ఇవ్వాల్టినుండి మీరు దాదాగాడి పనిమీద వుండండి ఇవ్వాళ రాత్రికి లాకప్‌లోవున్న వాళ్ళలో ఫ్రాంక్లిన్, మురళి, గాంధీగాళ్ళని ఇంటరాగేట్ చెయ్యాలి పనులు చకచకా అయిపోవాలి'' అన్నాడు యస్సై

''అలాగే సార్'' అన్నారు వాళ్ళు ముక్తకంఠంతో కూడబలుకున్నట్టు ఒక్కసారిగా

''మీరు నైటు కొంచేసి వాళ్ళని ఇంటరాగేట్ చెయ్యండి నేను లేక పోయినా ఫరవాలేదు నాకు

వేరే పనుంది నైటుకి''

''అలాగేసార్'' అన్నారు వాళ్ళు మళ్ళీ

''సరే మీరు పోయిరండి పోయి ఒకసారి సి ఐ గారికి కనపడండి ఆయన మిమ్మల్ని అదేపనిగా అడుగుతున్నాడు'' అన్నాడు హెచ్చరికగా నవ్వుతూ యస్సై వాళ్ళుకూడా సందర్భాన్ని జారి పోనీకుండా ఆ నవ్వులో పాలుపంచుకున్నారు

''సార్ మా అమ్మకు సీరియస్‌గా వుందంటసార్ మనిసొచ్చాడు ఒకసారి ఇంటికిపోయి చూసొస్తా సార్'' అన్నాడు భద్రం నీళ్ళు నములుతూ దీనంగా

ఆమాట విని ముఖం చిట్లించాడు యస్సై ''ఏమిటయ్యా! ఎప్పుడూ ఏదో ఒకటంటావు ఎప్పుడూ ఆబ్లిగేషన్లేనా ఇట్లాంటియన్నీ వుంటే ఐ డీ పార్టీకి పనికిరావు నువ్వు ఎప్పుడూ వాళ్ళకి బాగాలేదూ, వీళ్ళకి బాగాలేదు అంటావేంది? అటువంటప్పుడు ఇదిమానుకో సెక్షను డ్యూటీకెళ్ళి నాలుగురోజులు సెలవు పెట్టిపో'' అన్నాడు చిరాగ్గా

''నేనెప్పుడూ సెలవు పెట్టలేదుసార్ మమ్మకి బాగా సీరియస్‌గా వుందంట పోయినసారి మా అంకుల్‌కి బాగా లేదంటే పొయ్యానా సార్ తమరికి నా సంగతి తెలుసుకదా సార్'' అన్నాడు భద్రం అనునయంగా

''ఇయ్యన్నీ నా కనవసరం ఇలాటి వాటితో ఐడీ పార్టీ మెయిన్‌టైన్ చెయ్యలేను ఈ సారికి పంపిస్తున్నా, రేపీపాటికి నువ్వురావాలి పోయి రైటరుకి లీవు రాసిచ్చిపో, గ్రాంటుచేస్తాను'' అని విసుక్కున్నాడు యస్సై మళ్ళీ తనే, ''ఒకపక్క యస్పీ ఇనస్పెక్షను ఒకపక్క ఒక్క కేసులో కూడా రికవరీలేదు మీరేమో బాధ్యత లేకుండా తడవతడవకు సెలవలంటే ఎట్లా? ఏమయ్యా మూర్తీ, నువ్వు చెప్పు'' అన్నాడు

''అవునుసార్ చాలా వర్క్ పెండింగులోవుంది కాని పాపం వాళ్ళమ్మకు బాగా సీరియస్‌గా వుందంటసార్'' అన్నాడు మూర్తి యస్సైని ఒప్పించే ధోరణిలో

''అమ్మాలేదు, గిమ్మాలేదు ఈ డిపార్టుమెంటులో అలాటివన్నీ పెట్టుకుంటే మనం ప్రజలకు సర్వీసు చెయ్యలేము మన జీవితాల్ని ప్రజాసేవకు అంకితం చెయ్యాలి'' అన్నాడు యస్సై గంభీరంగా వుపన్యాసధోరణిలో

పళ్ళు పటపటా కొరుక్కున్నాడు మూర్తి ఆ మాటకు మనస్సులో పుట్టిన క్రోధం ముఖంలో కనపడకుండా జాగ్రత్తపడ్డాడు

'నీ యమ్మని నా కొడకా, మొన్నే కదరా నీ అక్కకూతురు పెద్దమనిషయితే రైలు వారంటు తీసుకుని, ట్రాఫిక్ వాళ్ళకు చెప్పి బుట్టలు బుట్టలు చక్రకేళీలు, ద్రాక్షాలు తీసుకుని పోయావు కదరా కానిస్టేబుళ్ళని వెంటబెట్టుకొని వెళ్ళావే మా దగ్గరకు వచ్చేసరికి వుపన్యాసాలిస్తున్నావా?' అనుకున్నాడు జోసఫ్

కొద్దిసేపు నిశ్శబ్దం నిండింది అక్కడ ''సరేపోండి'' అన్నాడు ముఖం గంటు పెట్టుకొని యస్సై సెల్యూట్స్‌చేసి బయట కొచ్చారు అంతా ఇవతల కొచ్చి ఒకళ్ళ నొకళ్ళు చూసుకుని నవ్వుకున్నారు

''ఒరే జోసఫ్ దొంగనాకొడకా నీదెబ్బకు రెండు పూలోడు బిల్లబీటుగా పడిపోయాడు కదరా వంద శెవర్ల బంగారం అనేసరికి వూపిరాడక చెమటలు పోశాయి బంగారం దొబ్బటానికి తేరగా వుందనుకుంటాడు లంజాకొడుకు'' అని నవ్వాడు మూర్తి

''రాత్రికి వాడికి పనుందంట ఏంది వాడిపని దొమ్మరపేటలో పుచ్చిపోయిన వాటిని ఏడవటమేగా వాడిపని గలీజు నా కొడుకు'' తిట్టాడు గోస్

''ఇప్పుడు ఈడు, మూడు పువ్వులోడు ఎందుకు రమ్మనట్టు ముసిల్నాకొడుక్కి మనతో ఏం పని?'' అన్నాడు భద్రం

''ఏదో ఒక పనిలే కానీ, ఇయ్యెప్పుడూ వుండేయేలే బతికినంత కాలం నువ్వెళ్ళి సెలవుపెట్టిపో ఈ నాకొడుకు ఏమన్నా ఫరవాలేదు కావాలంటే సెలవు ఎక్స్‌టెండ్ చెయ్యి మనల్ని కని పెంచిన తల్లికి సీరియస్‌గా వున్నప్పుడు కూడా పోకపోతే ఇంకెందుకురా ఈ బ్రతుకులు ఈడెమ్మ ఈడికి బయపడి నువ్వుండి పోతావా?!'' అన్నాడు గోస్

''అది కాదురా ఎల్లా రావటం రెండ్రోజులు ఆలశ్యమయితే పార్టీలోనుండి తీసేస్తాడేమో, అదీ '' అని నసిగాడు భద్రం

''ఏడిశాడు వాడిజుట్టు నాచేతిలో వుంది, మాయల పకీరు పేనం చిలకలో వున్నట్టు నేనున్నంతవరకు నీకేం బయంలేదుపో ఈ టేసన్లో చేస్తే మనం నలుగురుం చెయ్యాలి ఐడీ పార్టీ లేకపోతే అందరం మానుకుని తుపాకి పట్టుకుని గార్డు డ్యూటీ చేసుకోవటమే నీకెందుకు నువ్వు భద్రంగా వెళ్ళిరా'' అన్నాడు జోసఫ్

ఆ మాటకు అందరూ నవ్వారు ''ఒరే భద్రంగా నువ్వు పోరా శ్రీకృష్ణుడే మన పక్కనవుంటే అవతల కౌరవులెంతమంది వున్నా భయంలేదుపోరా'' అన్నాడు మూర్తి

భద్రం ఆమాటకు నవ్వుతూ రైటరు గదిలోకి వెళ్ళాడు సెలవుచీటీ రాసివ్వటానికి

వీళ్ళు ముగ్గురూ సి ఐ రూం దగ్గరకు వెళుతుంటే యస్పై రైటరుతో అంటున్నాడు ''నువ్వేం చేస్తావో నాకనవసరం యస్పీగారి ఇన్‌స్పెక్షన్ వర్క్ ఎట్లా పికప్ చేస్తావో కావాలంటే ఇద్దరు చదువుకున్న పీసీలని తీసుకో పెండింగ్ వర్కంతా లాగెయ్యాలి''

''అలాగే సార్'' అంటున్నాడు రైటరు

ఐడీ పార్టీ వాళ్ళు ముగ్గురూవెళ్ళి సి ఐ కి సెల్యూట్‌చేసి నిలబడ్డారు ఆయన తలెత్తి వాళ్ళనొకసారి చూచి, తలదించుకుని, టైపిస్టుకి ఏదో సీ డీ డిక్టేట్ చేస్తున్నాడు వాళ్ళట్లాగే పది నిముషాలు నిలబడ్డారు తరువాత సి ఐ తాపీగా కళ్ళద్దాలు తీసి టేబులుమీద పెట్టి ''ఏమిట్రా, మీరంతా ఎక్కడ చస్తున్నారు ? అసలు కంటికే కనపడటం లేదు'' అంటూ మొదలుపెట్టాడు దానికి వాళ్ళు తలా ఒక సమాధానం చెప్పారు

''సరేలే ఏదో చెపుతారుగానీ, ఆ స్టీరియో టేపురికార్డరు సరిగా పనిచెయ్యటం లేదు దాన్ని ఎవడన్నా మీలో ఒకడు తీసుకుపోయి రిపేరు చేయించుకురాండి. దొంగసొమ్ము దొంగసొమ్ములాగానే పనిచేస్తోంది'' అని నవ్వాడు

ఆ మాటకు వాళ్ళుకూడా నవ్వి, ''అలాగేసార్'' అన్నారు

''సైకిళ్ళేమన్నా మంచియున్నయ్యా! హంబర్‌బండి వకటుంటే చూడండి మా వాడికొకడికి కావాలి'' అన్నాడు

''హంబరు బండ్లేమీ లేవుసార్ అన్నీ అట్లాసులూ, హీరోలే సార్''

''అన్ని బండ్లు రికవరీ చేశారు కదరా హంబర్ బండి ఒకటన్నా లేదా ! సరే వున్నవాటిల్లో ఒకటి మంచిది చూసి, ఏమన్నా రిపేరుంటే చేయించండి మా ఆర్డర్లీ నాగేంద్రంతో ఇంటికి పంపండి లైటూ అదీ వుండాలి'' అన్నాడు

''అలాగే సార్'' అని వాళ్ళు బయటకొచ్చారు సెల్యూట్‌లు చేసి

''మూర్తీ, నువ్వెళ్ళి ఆ టేప్‌రికార్డర్ తీసుకురారా, మనకు తెలిసిన షాపులో చూపిద్దాం నా కొడుకులు తేరగా దొబ్బేదికాక రిపేర్లు కూడా మనమే చేయించి యివ్వాలి'' అన్నాడు జోసఫ్

''మరి మనం పోయి తిండ్లు తినొద్దామా! 'కన్య'లో కొత్తబొమ్మ రిలీజయింది కదా మ్యాటినీకి అక్కడకు పోవాలి లేకపోతే గొడవయ్యిద్ది'' అన్నాడు గోస్ అందరూ సైకిళ్లెక్కి బయటకు వెళ్ళారు

జోసఫ్ ఇంటికెళుతూ దారిలో బ్రోతల్‌హౌస్ ఓనరు బుల్లన్న ఇంటికి ఓ కుర్రాడితో కబురు చేశాడు బుల్లన్న గబగబా వినయంగా అల్లంత దూరంనుండే నమస్కారంచేస్తూ జోసఫ్ దగ్గరకొచ్చి హడావిడిగా చొక్కాజేబులో చెయ్యిపెట్టి ఓ నలభై రూపాయలు తీసి జోసఫ్ చేతిలో పెట్టాడు

''రెండొందలతో పోనిచ్చినందుకు కమీషన్ నలభైయ్యేనా?'' అన్నాడు జోసఫ్ కోపాన్ని కనపడనీయకుండా నవ్వుతూ

''ఇంతకంటే విలువయిన పనులు మేం మీకు చాలా చెయ్యాలి ఇవి డబ్బులుగా భావించు కోవద్దు మీ సహాయానికి మేం విలువ కట్టగలమా'' అన్నాడు అతనుకూడా నవ్వుతూ, పొగిడే ధోరణిలో

ఇంక మాట్లాడి లాభం లేదనుకున్నాడు జోసఫ్ ''సరేలే మంచికి చోటెక్కడుంది ఈ రోజుల్లో అది సరే, కొత్త ఫిగర్లేమన్నా వచ్చాయా? ఈ నైటుకి రావాలనుకుంటున్నా'' అన్నాడు వెకిలిగా నవ్వుతూ జోసఫ్

''తప్పకుండా రండిసార్ ఎవరితోనూ చెప్పొద్దు మీరు కాబట్టి చెపుతున్నా క్లాసుఫిగరు, ఫామిలీటైపు'' అన్నాడు అతను రహస్యం చెపుతున్నట్టు

సైకిలుమీంచి కిందకు దిగాడు జోసఫ్ ఆ మాట విని ఆత్రుతగా ''ఎవరు? ఏవూరు? వైటా, బ్లాకా ?'' అన్నాడు ఆతృతగా

''తినబోతూ రుచులడుగుతారెందుకు సార్ మీరు రండి మీ కెప్పుడన్నా బ్లాకు సప్లయ్ చేశానా? మీ టేస్టు నాకు తెలియదా? మీరు రండి''

ఆ మాటకు జోసఫ్ నవ్వాడు

''సరేలే మూడు దాటాక'' అని సైకిలెక్కాడు

జోసఫ్ వెళ్ళినవైపే చూస్తూ, 'పోరా దొంగనాకొడకా నీ కెప్పుడూ నాసి సరుకేగా సప్లయ్ చేసేది' అని తనలో తను అనుకుని నవ్వుకున్నాడు బుల్లన్న

కొత్త సినిమా విడుదలయిన 'కన్య' థియేటరు దగ్గర విపరీతమైన రద్దీగా వుంది యూనిఫారంలో వున్న పోలీసులు నేలా, బెంచీ బుకింగుల దగ్గర వున్న జనాన్ని లైన్లో సర్దుతున్నారు ఐ డీ పార్టీ కానిస్టేబుళ్ళు ఒకసారి అటూ ఇటూ తిరిగి స్టేషను కొచ్చారు

''బుడ్డాగాడు అక్కడే వున్నాడు గదా?'' అడిగాడు గోస్

''ఆఁ'' అన్నాడు మూర్తి

వాళ్ళు స్టేషనుకొచ్చిన ఒక అరగంటకు ఒకతను హడావిడిగా స్టేషనుకు వచ్చాడు మాసిపోయిన పైజమా, లాల్చీ వేసుకుని వున్నాడు కాళ్ళకు చెప్పులులేవు అతన్ని పలకరిస్తేనే ఏడ్చేలా కనపడ్డాడు అతను గబగబా లోపలకొచ్చాడు అక్కడున్న వాళ్ళంతా అతనివైపు చూశారు ఆతృతగా అతను అందరివైపూ చూశాడు ఎవరు ఎవరో అతనికేమీ అర్థంకాలేదు అందరూ యూనిఫారాల్లో

వున్నారు అటూ ఇటూ చూసి, తుపాకీ పట్టుకుని నిలబడ్డ సెంట్రీ దగ్గర కెళ్ళాడు ''సార్, నా జేబు కొట్టేశారు సార్'' అన్నాడు ఏడుపు గొంతుతో దండంపెడుతూ

''నాతో కాదు సెక్షన్ ఇన్‌చార్జి సార్జెన్‌గారు అదిగో అక్కడ వున్నాడు ఆయనతో చెప్పండి'' అని సార్జెన్‌వైపు వేలుచూపిస్తూ అన్నాడు సెంట్రీ

ఆ వచ్చిన అతను నీళ్ళతో మసకబారిన కళ్ళతో సార్జెన్‌వైపు చూశాడు కళ్లు తుడుచుకుని బల్లదగ్గరకెళ్ళి నిలబడ్డాడు ''సార్ నా డబ్బు కొట్టేశారు సార్'' అన్నాడు దండం పెడుతూ

''ఎక్కడ?''

''కన్నె థియేటర్ దగ్గర సార్''

''ఎంతపోయింది?''

''మూడొందల యాభై సార్ అది నా జీతం సార్ నేను బట్టల కొట్లో గుమాస్తాగా పని చేస్తున్నాను సార్ మా ఓనరుగారు టిక్కెట్లు తెమ్మని పంపిస్తే వెళ్ళానుసార్ అంతకుముందే జీతం తీసుకున్నాసార్'' అంటూ అతను ఏడవటం మొదలు పెట్టాడు

''అరేపాపం మరింకే మీ ఓనర్నే అడుగు ఆయనపనిమీదేగా, ఆయన కోసమేగా నువ్వక్కడికి పోయింది ఆయనే కట్టిస్తాడు''

''ఆయనియ్యడు సార్ అసలు నమ్మడు సార్ నాయన్నీ దొంగ నాటకాలంటాడు సార్ సార్, ఆ జీతంతోనే నేనూ నాభార్యా నెలంతా బ్రతకాలిసార్'' అంటూ దీనంగా ఏడ్చాడు

''పిల్లల్లేరా?''

''లేరుసార్ ఇప్పుడు ఆరోనెలసార్'' అన్నాడు అతను ముక్కు ఎగబీలుస్తూ

''సరే అదిగో వాళ్ల దగ్గరకెళ్ళి చెప్పు ఐ డీ పార్టీవాళ్ళు వారే'' అన్నాడు సార్జెన్ ఎకసక్కెంగా అప్పటి వరకూ అతనివైపు నవ్వుతూ చూస్తున్న వాళ్ళ దగ్గరకు అతను వెళ్ళాడు వాళ్ళున్నా తన డబ్బులు తెచ్చిస్తారేమోనని ఆశగా చూస్తూ వాళ్ళముందు నిలబడ్డాడు

''ఏ బుక్కింగులో నిలబడ్డావు?'' అడిగాడు గోస్

''బాల్కనీ సార్''

''మీ ఓనరెవరు?''

''ముక్కలకొట్టు ముక్తేశ్వరరావుసార్ మార్కెట్టు మూలమీద కొట్టు''

''వాడా! వాడంత పిసినారి ఇంకొకడు లేడు కదండీ సరే నీ పక్కన, అంటే నీ ఎనకా ముందు నిలబడ్డ వ్యక్తుల గుర్తులు ఏమన్నా చెప్పగలవా?''

ఆ మాటలకు అతను కొద్దిసేపు ఆలోచించాడు పైకిచూస్తు ''ఎర్రగా ఎత్తుగా వున్నాడుసార్ గడ్డంమీద అడ్డంగా తెగిన మచ్చవుంది సార్ ఒకతనికి ఇంకొకతనికి ''

ఆ మాట విని ఐడీ పార్టీ వాళ్ళు ఒకళ్ళ నొకళ్ళు క్రీగంట చూసుకున్నారు

''సరే, రిపోర్టు ఒహటి రాసి సార్జెన్‌గారికివ్వు నీ అడ్రసు కూడా రాసివ్వు మేము ట్రై చేస్తాం ఏం ఫరవాలేదు ఏడవమాకు'' అన్నారు వాళ్ళు

''ఆ జీతం లేకపోతే ఈ నెల మాకు తిండి కూడా లేదుసార్'' అన్నాడు అతను కళ్లు తుడుచుకుంటూ

''ఏం ఫరవాలేదు పో మేమున్నాము నిశ్చింతగా వుండు రిపోర్టు రాసియ్యి మేమెళ్ళొస్తాం'' అన్నాడు జోసఫ్ ముగ్గురూ లేచారు

''సార్, ఇతని దగ్గర రిపోర్టు తీసుకోండి సార్ మే మటు పోయొస్తాం'' అని సార్జెన్‌తో చెప్పి ముగ్గురూ బయటకు వెళ్ళారు

వాళ్ళు సరాసరి ఊరిబయట వున్న పాతబ్రిడ్జీ దగ్గరకు వెళ్ళారు అప్పటికే అక్కడ ఒకతను వున్నాడు వాళ్ళని చూచి, లేచి, ముగ్గురికీ పేరు పేరున నమస్కారం చేశాడు అతని గడ్డంమీద అడ్డంగా తెగినమచ్చ వుంది ''ఏరా బుడ్డాగా, వాడెవడో గుడ్డలకొట్లో గుమస్తా అంట మరీ తిండికిలేని దరిద్రుల దగ్గర చేస్తున్నావేరా'' అన్నాడు మూర్తి

''ఏం చెయ్యమంటారు సార్ సరయినోడు తగల్లేదు లేకపోతే నేనూ కాస్త బీదాబిక్కీ గురించి ఆలోచిస్తా సార్'' అంటూ జేబులోంచి డబ్బులుతీసి జోసఫ్ చేతికిచ్చాడు

జోసఫ్ డబ్బులు లెఖ్ఖపెడుతూ, ''ఎంత?'' అన్నాడు

''మూడొందల పాతికసార్ లెఖ్ఖ పెట్టుకోండి సార్ నేను అబద్దం '' అతని మాట పూర్తికాకముందే జోసఫ్ చెయ్యి అతని చెంపమీద బలంగా పడింది ఆ దెబ్బకు అతను గిర్రున తిరిగి కిందపడ్డాడు

''ఎంతరా? దొంగనా కొడకా నీ యమ్మని మాకే అబద్దం చెపుతావా? చెప్పి బతకటానికేనా? ఎంతా?'' అన్నాడు గట్టిగా అరుస్తూ కళ్ళతోనే మింగేసేలా చూస్తూ

అతను చిన్నగా లేచాడు, పైజమా కంటిన దుమ్ము దులుపుకుంటూ జేబులోంచి పాతిక రూపాయలు తీసిచ్చాడు భయంగా చూస్తూ పెదవి చివరినుండి వస్తున్న నెత్తురు వూసి చొక్కా అంచుతో తుడుచుకున్నాడు

డబ్బులు లెఖ్ఖపెట్టటం అయిపోయిన తరువాత, ''అబద్ధపు కూతలు కూస్తావేరా లమ్డికొడుకా ఆమాత్రం తెలియదనుకున్నావా? ఆవలిస్తే పేగులు లెఖ్ఖపెడతా'' అన్నాడు జోసఫ్

అతను మూతి తుడుచుకుంటూ వాళ్ళవైపు భయంగా, బేలగా చూశాడు ''అయ్యా జోసఫ్‌గారూ, నా పెళ్ళాం ఆసుపత్రిలో వుంది దానికి ఫిట్సు మందులికి పైసా లేదు ''

''అందుకని వాడి డబ్బులు కాజేస్తావా? వీటిల్లో ఎవరికీ ఏం లేవు మాకూ వద్దు వాడి పెళ్ళాం, వాడూ ఈ డబ్బుల్తో నెలంతా బ్రతకాలంట నోరు మూసుకుని పో'' అని మొత్తం జేబులో పెట్టుకున్నాడు

''అయ్యాగారూ జోసఫ్‌గారూ '' చటుక్కున కాళ్ళు చుట్టేసుకున్నాడు అతను ''నా పెళ్ళాం చావు బతుకుల్లో వుంది సార్'' అంటూ ఏడిచాడు

''ఛీ, వదులు వెధవా ఫేంటు పాడయ్యింది'' అంటూ కాలు విదిలించాడు జోసఫ్ కాని అతను వదిలిపెట్టలేదు ''అయ్యగారూ మూర్తిగారూ గోస్‌భాయ్ తూ బోలో జోసఫ్ సాబ్‌కు'' అంటూ ఇంకా గట్టిగా కాళ్ళు కావలించుకున్నాడు

''ఈసారిగనక ఇట్టాంటి దొంగకూతలు కూశావంటే ఎముకలు విరిగిపోతాయి గుర్తుంచుకో దొంగనా కొడక వదులు కాలు'' అంటూ విసురుగా కాలు జాడించాడు అతను అంత దూరం పోయి పడ్డాడు జేబులోంచి డబ్బులు తీసి యభై రూపాయలు అతనికిచ్చాడు జోసఫ్

''సార్ సార్ ఇంకొక పాతికియ్యండి సార్ చాలు నా పెళ్ళానికి ప్రాణంపోసిన వాళ్ళవుతారు అయ్యా! జోసఫ్‌గారూ'' అంటూ ప్రాధేయపడ్డాడు

''ఏడిసేవ్‌లే నోర్ముయ్ అయ్యి కూడా ఇవ్వను నోరెత్తావంటే '' అంటూ ఇవతలకొచ్చి సైకిళ్ళెక్కారు సైకిళ్ళెక్కి పోతున్న వాళ్ళవంక అతను కసిగా చూస్తూ పళ్ళు పటపటా కొరికాడు

చేతిలోని డబ్బులకేసి చూశాడు జేబులోంచి డాక్టరు రాసిచ్చిన మందుచీటీ తీసి చూసుకుని తిరిగి జేబులో పెట్టుకున్నాడు

'ఛీ దీనమ్మ బతుకుని ఇంక ఎట్టా బతకాలి ఈ లంజాకొడుకులు ఎట్టాంటి చావు చస్తారోగాని నా పెళ్ళానికొచ్చినట్టు మూర్ఛలొచ్చి, టీబీలొచ్చి, పెద్ద రోగాలొచ్చి ఈళ్ళ పెళ్ళాలెన్నడు పోతారో దొంగనాకొడుకులు ' కసిగా తిట్టి కాండ్రించి వూశాడు వుమ్ముతో కలిసి సన్నటి నెత్తుటిచార కూడా బండమీద పడింది చిన్నగా వూళ్ళోకి కదిలాడు

వాళ్ళు స్టేషను కెళ్ళేసరికి, జేబు కొట్టించుకున్న, గుడ్డల కొట్లో గుమస్తా అక్కడే వున్నాడు వాళ్ళని చూచి, ఆశగా లేచి వాళ్ళ దగ్గర కొచ్చాడు

'వాడు దొరికాడుగానీ సార్, అప్పుడే నూట యాభై ఖర్చు పెట్టేశాడు రెండు ఫుల్‌బాటిల్స్, పలావులు, వేపుళ్ళు ఇదిగో ఈ రెండొందలు మిగిల్తే తీసుకొచ్చాం '' అన్నాడు జోసఫ్ అతను వినాలని సార్జెన్‌తో ఆ రెండొందలు బల్లమీద పెట్టాడు

గుమస్తా అయోమయంగా చూశాడు అర్థం కానట్టు

''వాడిని తీసుకురాకుండా ఎందుకొచ్చారు ?'' అని, తన తొందరపాటు ప్రశ్నకు నాలిక కరుచుకున్నాడు సార్జెన్ ఐ డీ పార్టీ వాళ్ళు సార్జెన్‌వైపు చురచురా చూశారు

''వాడిని తెస్తన్నాం పెద్ద కాలవ గట్టుమీద నడిచొస్తున్నాం వాడు చటుక్కున కాలవలోకి దూకి అవతల వడ్డుకు ఈది పారిపోయాడు ముందుగా ఆ రెండొందలయినా తీసుకున్నాం కాబట్టి అయ్యయినా దక్కినియ్యి లేకపోతే అయ్యికూడా దక్కేవి కాదు వాడెక్కడికి పోతాడులే వాడు పాత కేడీగాడే మిగిలినియ్యి కూడా తొందరగానే రికవరీ చేస్తాంలే అయి తీసుకో'' అన్నాడు జోసఫ్ ఆ గుమస్తాని చూస్తూ

అతను ఇంకా అయోమయంగానే చూశాడు

''సరే తీసుకోవయ్యా! తీసుకొని నాలుగయిదు రోజుల తరువాత ఒకసారి రా వచ్చి కనపడు మిగతావాటి విషయం చూద్దాం నువ్వు చాలా అదృష్టవంతుడివి ఇలా జేబులు కొట్టించుకున్నాక, మళ్ళీ డబ్బులు దొరకటం అంటేనే నిజంగా నీ భార్య చాలా అదృష్టవంతురాలు అవి తీసుకో '' సర్ది ఒప్పించే ధోరణిలో మాట్లాడాడు సార్జెన్

సెక్షన్‌లోని కానిస్టేబుళ్ళు తలా ఒకమాట చెప్పారు అతను వాటిని తీసుకుని జేబులో పెట్టుకున్నాడు

''జాగ్రత్తా ఇయ్యన్నా ఇంటికి తీసుకుపో జాగ్రత్తగా ఇంక పో ఇంకెప్పుడూ కొత్త ఆట వచ్చినప్పుడు పోగాక'' అన్నాడు మూర్తి

''సార్ నేను సినిమాకు పోలేదు సార్ మా ఓనరు కోసం ''

''అదేలేవయ్యా! ఎవరికోసం పోయినా నీ డబ్బులేగా పోయింది ఇప్పుడు మీ ఓనరేమైనా ఇచ్చాడా సరేలే ఇంక పో'' అన్నాడు గౌసు విసుక్కుంటున్నట్టు

ఆ మాటలకతను బిక్కచచ్చిపోయాడు ''సార్, వాటికోసం ఎప్పుడు రమ్మంటారు?'' అన్నాడు

''మిగిలినవాటికోసమా? నువ్వు రావొద్దులే నీ అడ్రసు ఇచ్చావుకదా మేమే కబురు చేస్తాం వాడిప్పట్లో ఇంక ఈ వూరు రాడు పారిపోయాడు కదా మేం చెపుతాంలే, నువ్వు పో'' అన్నాడు మూర్తి అతను 'అలాగే' అన్నట్టు తలూపి అక్కడున్న వాళ్ళందరికీ నమస్కారాలు చేసి బయట

తిరిగిపోయాయి

''గలీజు లంజా కొడుకులు   ఒరే మురళిగా  '' గట్టిగా కేకేశాడు మళ్ళీ

''అయ్యా!'' నీరసంగా వినపడింది జవాబు

''రారా పంది నా కొడకా  తిని ఆదమరచి నిద్రపోతున్నావా  అంత కొవ్వెక్కిందంటరా తేరతిండి తిని  రా బయటకు  నీ చావు దగ్గర పడింది  ఇయ్యాలే నీ జీవితంలో ఆఖరి రోజు దేవుణ్ణి తలుసుకో, రా బయటకి'' గర్జించాడు జోసఫ్

అతను చిన్నగా అడుగులో అడుగు వేసుకుంటూ, భయపడుతూ , చీకట్లో పడుకున్న వాళ్ళని తప్పుకుంటూ, లాకప్పు దగ్గర కొచ్చాడు  లాకప్పు ఇనప తలుపు దగ్గర ముగ్గురూ యమభటుల్లా నిలబడి కనపడ్డారు  అతని గుండె జారిపోయింది

''రారా దొంగలంజా కొడకా  ఎంతోసేపు నిలబడాలిరా నీకోసం  నీయమ్మని   ఈ పెంట కంపుతో   తిన్నది కాస్తా బయట కొచ్చేటట్టుంది'' అన్నాడు గౌసు పళ్ళు కొరుకుతూ

అతను భయపడుతూ బయటకు అడుగు పెట్టాడు

''అటు పద'' అని లాగించి అతని డొక్కలో ఒక్క తన్ను తన్నాడు జోసఫ్  ఆ తన్నుకి అతను వెల్లికిలా విరుచుకుపడ్డాడు బిల్లబీటుగా  ఇద్దరి చేతుల్లో లావుపాటి లారీలున్నయ్  లాకప్ తాళం వేస్తూ, ''గాంధీగా, నెక్ట్స్ నువ్వే, రడీ అవ్వు'' అన్నాడు

పడ్డ అతను చిన్నగా లేచాడు  ''నీదగ్గర మంచితనం పనికిరాదురా  నీయమ్మ దొంగ నా కొడకా రోజూ పెడతావుంటే కొత్త పెళ్ళికొడుకు తిన్నట్టు తిని లోపల హాయిగా కూర్చుందామనుకున్నావా? పద అటు'' అంటూ లారీతో అతని కాళ్లమీద బలంగా కొట్టాడు జోసఫ్

''అమ్మా  '' లారీ దెబ్బ, అతని కేకా ఒకదాని తరువాత ఒకటిగా ఆ వరండాలో మార్మోగిపోయాయి  ఉలిక్కిపడి లేచాడు స్టేషన్ వాచ్ కానిస్టేబుల్  బయట చెట్లమీద పక్షులు గోలగా అరుస్తూ రెక్కలు టప టపా కొడుతూ పైకి ఎగిరాయి  బైట సెంట్రీ లోపలికొచ్చాడు, 'ఏమిటో' అన్నట్టు  ఆ దెబ్బకు అతను వెనక్కు పడిపోయాడు మళ్ళీ

''లెగు  పద  నోరు ముయ్యి  నోటిలోనుండి మాటొస్తే గొంతు ముడి కొరికి రక్తం తాగుతా పద  ఇన్ని రోజులూ చెపుతావని వూరుకున్నాం  ఈరోజే నీ చివరిరోజు  దేవుడ్ని తలుసుకో మా చేతుల్లో పడ్డ వాడెవడూ బతికి బట్ట కట్టలా  నీకింకా రెండే రెండు నిముషాలు టైముంది చెప్పు'' అన్నాడు మూర్తి  దెబ్బతిన్న అతనికి వళ్ళంతా చెమటలు పట్టింది బాగా

అతను లేగవలేక లేచి నించున్నాడు  ఎముకమీద తగిలిన దెబ్బ, కాలుని నిలబడ నివ్వటం లేదు  అతన్ని రైటరు రూంలోకి లాక్కుపోయారు ముగ్గురూ  అతనక్కడ కూలబడ్డాడు  జోసఫ్ స్టూలుమీద కూర్చున్నాడు  ''అరే మురళిగా  నువ్వు దొంగతనాలు చేశావు  తిన్నావు అయిపోయింది  వాటినెక్కడ అమ్మేవో చెప్పు  తెచ్చుకొనేవాళ్ళం మేము  నీకేంది బాధ  మంచిగా చెప్పు  లేకపోతే నా సంగతి తెలుసుగా'' అన్నాడు వేలు చూపిస్తూ

''అయ్యగారూ    నేను రెండేళ్ళనుండి నేరాలు సెయ్యటం లేదు చార్  రిచ్చా బండేసుకుని బతుకుతున్నా చార్    దచ్చినాదికి పోయి బతుకుతున్నా చార్'' అన్నాడతను ఏడుపు గొంతుతో

''హుం  పాత పాటేగా ఇది  ఇంతకుమించి ఇంకొక్క మాట రావటం లేదు  ఇంతకుముందు నయం గదరా, దెబ్బ పడకముందే చెప్పేవాడివి  ఇక మాటల్తో నువ్వినవు  ఇక లాభం లేదు  కాళ్ళకు తాడెయ్యండిరా'' అన్నాడు జోసఫ్

''నేనిందాకే చెప్పలా ఈడు మాటల్తో ఇనే రకం కాదని'' అంటూ బలవంతంగా అతని రెండు కాళ్ళూ లాగి, తిరిగి అతను కాళ్ళు ముడుచుకుంటాడేమోనని అతని మోకాళ్ళమీద కెక్కి నిలబడ్డాడు మూర్తి అతని కాళ్ళల్లోని నరాలు ఆ బరువుకు చిటచిట లాడాయి రెండు పాదాల్ని చీలమండల దగ్గర, పొడవాటి తాటితో కలిపి కట్టి, ఆ తాటి రెండో చివరని, పై కప్పు దూలానికి వున్న ఇనుప రింగులో దూర్చి పైకి లాగారు అతను వెల్లకిలా పడిపోయాడు నడుము దగ్గర నుండి తల వరకు నేలమీద వుంది తొడల దగ్గరనుండి పైకి లేచాయి కాళ్ళు అరికాళ్ళు ఆకాశాన్ని చూస్తూన్నట్టు వుండిపోయాయి

''ఒరే, లాస్టు ఛాన్సు ఇస్తున్నా ఇక నీ యిష్టం చెపుతావా?''

''నాకేమి తెలియదు చార్ నేనీమద్దైన అచలు నేరాలు చెయ్యటం లేదు చార్''

''ఫట్ ఫట్ ఫట్ ఫట్ ' అతని మాటలు పూర్తికాకముందే తమ తమ బలాల్ని పూర్తిగా చూపిస్తూ అతని పాదాలమీద బాదుతున్నారు గౌసు, మూర్తి

గట్టిగా అరవటానికి కూడా నోరు పెగలక మెలికలు తిరిగిపోయాడు అతను అటూ ఇటూ తిరిగాడు కాని పైకి లాగి కట్టిన కాళ్ళు అతన్ని కదలనియ్యలేదు గుండె ఆగిపోతుందేమోననే అనుమానం వచ్చింది ఉక్కిరిబిక్కిరయ్యి పోయాడు వూపిరి అందనట్లు సరిగ్గా నాలుగు క్షణాలు గడిచిపోయాయి ''అయ్యో! నాయనో, దేవుడో, బాబా! అమ్మో'' పెంకులు ఎగిరిపోయే శబ్దాలతో కేకలూ వేశాడు అతని మెడచుట్టూ వున్న నరాలు వుబ్బాయి ఒకటితో అతని వీపంతా తడిచి, అక్కడంతా మడుగయ్యింది

''ఆపొద్దు, ఇంటర్వెల్ లేదు'' అన్నాడు జోసఫ్

''అమ్మా! నాయనా! దేవుడా! అయ్యా జోసఫ్‌గారూ ''

''చెప్పు చెపుతావా?''

చెపుతానన్నట్టు తలూపాడు

''నోటితో చెప్పు''

కొడుతున్నవాళ్ళు క్షణంలో సగంసేపు నెమ్మదించారు

''ఆపొద్దు మీరాపొద్దు వాడు నోటితో అన్నీ ఒప్పుకొనేదాకా ఆపొద్దు''

పేము కర్రల దెబ్బకు పాదాలమీది చర్మం బొబ్బలెక్కినట్లు పైకి వుబ్బింది ఒక దెబ్బ ఎడమకాలి చిటికెన వేలికి తగిలి చిట్లి రక్తం చిందింది చిందిన నెత్తురు తుప్పరలాగా జోసఫ్ ముఖాన పడింది

''చెపుతా దేవుడా చచ్చిపోతున్నాను కొట్టొద్దండీ, జోసఫ్‌గారూ చెపుతా'' కేకల్లాంటి మాటలతో పాటు అతను తలా, చేతులూ ధన్ ధన్ మని నేల కేసి కొట్టుకున్నాడు

స్టేషన్ వాచ్, సెంట్రీ, గార్డు ఆఫీసరూ, అంతా గడపదగ్గర నిలబడి చూస్తున్నారు

''ఆపండి ఒక్కక్షణం'' అన్నాడు జోసఫ్ చెయ్యి పైకెత్తి

వాళ్ళుకొట్టటం ఆపారు

''మళ్ళీ మాట తప్పావో దొంగలంజాకొడకా ఈసారి ఇంటర్వెల్ కూడా ఉండదు చెపుతావా?''

''చెపుతాను దొరా! చచ్చిపోతున్నాను ''

''రేయ్, కాళ్ళు కాస్త సళ్ళివ్వండి'' అన్నాడు జోసఫ్ మూర్తి పక్కనే దూలానికి కట్టిన తాడు వదులు చేశాడు అతని కాళ్ళు దబ్బున గచ్చుమీద పడ్డయ్''

''అమ్మా!'' అంటూ అతను బోర్లా తిరిగిపోయాడు

''నీ నాటకాలు తరువాత వూ చెప్పు లెగూ కూర్చో ''

అతను బలవంతాన లేచి కాళ్ళు చాపుకుని గోడకానుకుని కూర్చున్నాడు బాధగా బాధతో కిందామీదవుతున్నాడు

''ఊ చెప్పు'' అన్నాడు జోసఫ్, కాగితం కలం తీసుకుని

''అయ్యా జోసఫ్‌గారూ '' అంటూ అతను ముందుకు వాలి జోసఫ్ కాళ్ళు కావలించుకున్నాడు 'అయ్యా! నేనేమీ నేరాలు చెయ్యటం లేదు అయ్యా, దెబ్బలకు తట్టుకోలేక అట్లా అన్నా అయ్యా, నేను నేరాలు చేసినప్పుడు తమరికి, ఒంటిమీద దెబ్బ పడకుండా అన్నీ చెప్పా అయ్యా, దొరగారూ, జోసఫ్‌గారూ తమరు నాయందు దయవుంచకబోతే నాప్రాణం పోయిద్ది దొరా తమరే నాపేణం కాపాడాలి నా సంగతి తమకు తెలుసు '' అని దీనంగా ఏడ్చాడు

ఆ దీనరోదన జోసఫ్‌ని తాకింది ''న్నియ్యమ్మ'' అన్నాడు కోపంగా ''నాకొడకా నువ్వు కాకపోతే మరి ఇవన్నీ ఎవర్రా ఈ తరహా నేరాలన్నీ ?'' అన్నాడు పళ్ళుకొరుకుతూ

''అయ్యన్నీ గాంధీగాడే సార్''

''వాడూ నువ్వు కలిసే చేశారా?''

''కాదుచార్ వాడొక్కడే చేశాడు తరువాత చెప్పాడు '' అతను రొప్పుతున్నాడు నోరు తడారిపోయి పిడుచకట్టుకు పోతోంది నాలుక బాధతో తల అటూ ఇటూ కదుపుతున్నాడు

''పద్నాలుగో వార్డు కౌన్సిలరు గారింట్లో''

''వాడేసార్ ''

''వాడింకా ఎక్కడెక్కడ చేశాడు?''

ఆ వివరాలన్నీ చెప్పాడతను అన్నీ కాగితంమీద రాసుకున్నాడు జోసఫ్

'సరే, గాంధీగాడిని పిలిచి అడిగితే వాడేమన్నా తేడా చెప్పాడో నీకిక నూకలు చెల్లినట్లే సరేనా'' అన్నాడు జోసఫ్

''అట్టాగే చార్'' అన్నాడు అతను దండం పెడుతూ

అక్కడ జరుగుతున్న సంభాషణలు, కొడుతున్న దెబ్బలు ఆ నిశ్శబ్దంలో లాకప్‌లోని వాళ్ళకు స్పష్టంగా వినపడుతూ వాళ్ళని భయభ్రాంతుల్ని చేశాయి

''అరే మూర్తీ , గాంధీగాడిని బయటకు తియ్యరా'' అన్నాడు జోసఫ్

మూర్తి వెళ్ళి లాకప్ తాళంతీసి గాంధీని బయటకు తీసుకు వచ్చాడు కొట్టుకుంటూ

అతను వచ్చి జోసఫ్‌కు అభిముఖంగా నిలబడ్డాడు రెండు చేతులూ జోడించి

''ఏరా, నీసంగతేంది చెప్పు నువ్వు చేసిన లిస్టు మురళిగాడు చెప్పాడు వాడు నేరాలు చెయ్యటం లేదంటగా, నిజమేనా? నువ్వొక్కడివే చేశావంటగా అన్నీ '' అన్నాడు గౌస్

ఔనన్నట్లు తలూపాడు అతను

''ఊఁ సరే ఒరేగాంధీగా అయితే మనం రేపే బయలుదేరుతున్నాం రికవరీకి అక్కడేమన్నా తకరారు వచ్చిందంటే అక్కడే అయిపోతావు సరేనా''

'సరేన'న్నట్టు తలూపాడు గాంధీ

''ఒరే మూర్తీ మురళిగాడికి కాసిని నీళ్ళు తెచ్చియ్యి'' అన్నాడు జోసఫ్

గౌస్ అతని కాళ్ళకు కట్టిన కట్లు విప్పతీశాడు

''అరే, లే, లేచి అటూ ఇటూ రెండుసార్లు నడువు ఊఁ'' అన్నాడు గౌసు

మురళి లెగవలేక పోయాడు పాదాలు నేలకు తగులుతుంటే మెడలోని నరాలు జివ్వుమంటు న్నాయి అరికాళ్ళమీద ఎర్రగా కాల్చిన ఇనపకడ్డీని పెట్టినట్టు మంట పుడుతోంది

''లే లేచి నడు'' లాఠీదెబ్బ వీపున ఫెడీలున పడింది

''అబ్బా'' అని రక్కున లేచి నిలబడ్డాడు కాళ్ళు గజగజా వణికాయి మడమలమీద నిలబడి, టేబిలుని పట్టుకుని రెండు అడుగులువేసి ధభీమని వెనక్కి పడిపోయాడు

''ఏంరా! లంజాకొడకా నాటకాలు ఏస్తున్నావు లే'' కర్ర పైకెత్తాడు మూర్తి

''అయ్యా! అయ్యా! లెగుస్తా కొట్టొద్దు లెగుస్తా'' భయంతో చెయ్యి పైకెత్తి ఎడంచేతి మీద బలమంతా ఆనించి చిన్నగా నడుంపైకి లేపాడు మురళి

''లే మరి ఏం బ్రతిమ లాడాలా?''

పాదాలు నేలకు తగులుతుంటే ప్రాణాలు పైపైనే పోతున్నాయి లెగవకపోతే దెబ్బపడిద్దనే భయం పళ్ళ బిగువున చటుక్కున లేచి నిలబడ్డాడు గబగబా రెండడుగులు వేశాడు కాళ్ళు గజగజా వణికాయి చెమటలు ధారగా కారిపోతున్నాయి

''ఊఁ అటూ ఇటూ తిరుగు బయటకు పద'' మాట్లాడుతూనే కర్రపైకెత్తాడు మూర్తి

''అయ్యాగారూ కొట్టొద్దు నడుస్తా '' ఏడుపుతో పెదాలు వణికాయి ''నా ఖర్మ నేను చచ్చినా బాగుండు'' వస్తున్న ఏడుపును ఆపుకుంటూ, తన అసహాయతని పళ్ళ బిగువున బిగబట్టి, ఆపుకోలేని అతని మనసులోని క్రోధాన్నంతా ఆ మాటల ద్వారా వ్యక్తీకరించాడు

''నోర్మూయ్ ఏం వాగుతున్నావ్'' మాటతోపాటు గూడమీద లాఠీ దెబ్బ బలంగా పడింది

ఎడంచేత్తో కుడి గూడని తడుముకున్నాడు ''అమ్మా'' అంటూ ఏడ్చాడు ఎవరితోనూ చెప్పుకోలేక, తనబాధని అర్థం చేసుకునే వాళ్లు లేక, నిస్సహాయంగా మూగగా రోదించాడు అటూ ఇటూ రెండడుగులు వేశాక ఈడ్చుకు పోయినట్టు లాక్కుపోయి లాకప్పులోకి నెట్టాడు మూర్తి

''కాళ్ళనొప్పులు తగ్గుతాయి నడవరా అంటే వినుకోవే ముండా నీ మంచి కోసమేరా నడవమనేది'' అన్నాడు గౌసు బుజ్జగిస్తునట్లు

సోష వచ్చిందాకా ఏడ్చాడు అతను లాకప్పులో అలుపు వచ్చిందాకా వాళ్ళని అమ్మ బూతులు తిట్టాడు తెలతెలవారుతుండగా నిద్రలోకి జారిపోయినట్టు స్పృహలేని స్థితిలోకి నెట్టివేయబడ్డాడు అతనితో పాటు గాంధీకూడా ఓమూల కూర్చుని ఆలోచిస్తున్నాడు

ఇంటరాగేషన్ అయిపోయినాక ఐ డీ పార్టీ వాళ్ళు ముగ్గురూ ఇళ్ళకు బయలుదేరారు స్టేషను బయట ముగ్గురూ మూడు దార్లయ్యారు జోసఫ్ బ్రోకర్ బుల్లన్న ఇంటికెళ్ళాడు అక్కడనుండి తెలతెలవారుతుండగా ఇంటికి చేరాడు ఒక గంట పడుకుని లేచి ముఖం కడుక్కుని స్టేషనుకు బయలుదేరాడు

''ఈ దరిద్రపుగొడ్డు నౌకరీ పోయినా బావుండు నాలుక్కొంపలు అడుక్కుతిని బతకొచ్చు'' పొయ్యి దగ్గర కూర్చుని పొయ్యి వెలిగిస్తూ కోపంగా ముఖం చిట్లించి అంది అతని భార్య

''ఏందే పొద్దున్నే నీ గోల, దరిద్రపు ముఖవా'' విసుక్కుంటూ అన్నాడు అతను

''ఆఁ, నాది దరిద్రపు ముఖమే ఇల్లు, ఇల్లాలు, సంసారం, పిల్లలు పట్టినియ్యా నీకు నువ్వేందో, నీ తిరుగుడేందో ఎంత మాలావు ఉద్యోగమైనా నెలల తరబడి ఇంటిముఖం చూడకుండా అవ్వఁ ఇదెక్కడన్నా వుందా?''

''నోరుముయ్యి వాగుతున్నావ్ కొంపలో లేక ఏడసత్తన్నాను''

''ఆ, వుంటున్నావులే కనపడతల్లా''

''ఇప్పుడేందే నీగోల ఏమన్నా కావాలంటే తెప్పిచ్చు కోరాదు డబ్బులు బీరువాల్ వున్నయ్యిగా''

''ఆః వున్నయ్ నువ్వుగాని సంపాదించావు డబ్బులు మనమూ బతుకుతున్నాం ఎందుకు ఒక అచ్చటా ముచ్చటా డబ్బులు సంపాదించటమే గొప్పనుకుంటే ఆమాత్రం సంపాదన శానామందికి సేతవ్వ ''

''యహె పో నీయమ్మ పొద్దున్నే ఏందే నీ గొడవ నాకవతల అర్జంటు పనుంది'' అంటూ అతను సైకిలెక్కి వెళ్ళిపోయాడు ఆవె కోపంతో గుటకలు మింగి గొణుక్కుంటూ వుండిపోయింది

అతను స్టేషనుకెళ్ళే సరికి మూర్తి, గౌస్ ఎదురు చూస్తున్నారు ముగ్గురూ యస్సై దర్శనం చేసుకోవటానికి వెళ్ళారు

''దాదాగాడి సంగతేం చేశారు?'' సిగరెట్టుపొగ విలాసంగా గాలి లోకి వదులుతూ అడిగాడు యస్సై

'ఆ బంగారం పిచ్చే పట్టినట్టుంది ఈ నాకొడుక్కి నిద్దర్లోకూడా దాదాగాడే గుర్తొస్తున్నట్టుంది' అనుకున్నాడు జోసఫ్ ''వాడికోసం ఇన్ ఫార్మెంట్సుని పెట్టాంసార్ రాత్రి మురళిగాడిని ఇంటరాగేట్‌చేశాంసార్ వాడేం చెప్పలేదు వాడేం నేరాలు చెయ్యటంలేదు సార్ గాంధీగాడు మాత్రం ఇవిగో ఇవి చెప్పాడు సార్'' అని గాంధీ చెప్పిన లిస్టు కాగితం యస్సై టేబిలుమీద పెట్టాడు జోసఫ్

కాగితాన్ని చేతిలోకి తీసుకుని చూశాడు యస్సై అది చూస్తూ ఆశ్చర్యపోయాడు ''ఏమిటీ? ఇవన్నీ నిజమేనా? నానుతాడు, జంటహంసల లాకెట్టు, ఒక టేపురికార్డరు, ఫేను, ట్రాన్సిస్టరు, పది నైలెక్సు చీరలు, రెండు వెండిజరీ చీరలు, రెండు రాళ్ళగాజులు, ఒక గంగాళం, నాలుగు రాగికాగులు, ఒక సూటుకేసు '' ఇంకావున్న లిస్టుని చూచి ఆశ్చర్యంగా నోరు వెళ్ళబెట్టి వాళ్ళవైపు చూశాడు వాళ్ళు గర్వంగా విలాసంగా చూశారు '' ఇయ్యన్నీ దెబ్బలకు తట్టుకోలేక చెప్పి వుంటాడా ఏమిటి?'' అన్నాడు యస్సై

''లేదుసార్ ఏ వస్తువెక్కడ కొట్టేసింది వివరాలన్నీ చెప్పాడు సార్ గాంధీగాడినసలు కొట్టలేదు సార్ దెబ్బపడకుండా చెప్పేడుసార్ మొత్తం రికవరీ అయ్యేవేసార్ కావాలంటే మీరే విచారించండి వాడ్ని'' అని మూర్తివైపు తిరిగి, ''వాడిని లాకప్పులోంచి తీసుకురారా, అయ్యగారే అడుగుతారు'' అన్నాడు జోసఫ్

మూర్తి ఇవతలకొచ్చాడు

''వెరీగుడ్ ఫరవాలేదు అసలే రికవరీలేదని డి యస్పీ ఒకటే గోల పెడుతున్నాడోయ్ మరి వెంటనే బయలుదేరండి డబ్బులేమన్నా కావాలా?'' అడిగాడు ఆనందంగా

''తమరు రావాలిసార్ మనూరోళ్ళ దగ్గరకయితే, తమరు లేకుండానే మేము పోయి, నా కొడుకుల్ని తన్ని రికవరీ చేసుకురాగలం కాని విజయవాడ వాళ్ళు ఒక పట్టాన లొంగరుసార్ యస్సై ఆర్ చూపించమనే టంతటి రకాలు తమరు రాకపోతే కష్టం'' అన్నాడు జోసఫ్

యస్సై ఇబ్బందిగా కదిలాడు ''నాకు ఇనస్పెక్షను వర్కు తలమోపడంత వుంది జోసఫ్ నువ్వు చూస్తున్నావుగా ఇనస్పెక్షన్ వాయిదా పడే సూచనలుకూడా కనపడటంలేదు! ఈసారికి

మీరెళ్ళి రండి  కావాలంటే ఏ యస్పై శౌరిని తీసుకుపోండి'' అన్నాడు

''అమ్మో! ఆయన్నా? ఆయన్ని తీసుకుపోవటం అంటే పిల్లిని చంకన పెట్టుకుని పోయినట్టే వద్దుసార్ మేమే పోయివస్తాం'' అన్నాడు నవ్వుతూ గౌసు  ఆ మాటలు ఏ యస్పై ఎక్కడ విన్నాడో అని అటూ ఇటూ చూశాడు

యస్పై వాళ్ళనవ్వులో శ్రుతికలిపాడు  ''పాపం కాస్త భయస్తుడు'' అని ఆ మాటలు ఏ యస్పై ఎక్కడ విన్నాడో అన్నట్టు, ''లేడు కదా ఇక్కడ'' అన్నాడు

''లేడులే సార్'' అన్నాడు గౌస్

'ఆఁ, నీకే మహాధైర్యమున్నట్టు' మనసులో అనుకున్నాడు జోసఫ్ యస్పైనిగూర్చి  అంతలో మూర్తి లాకప్పులోంచి గాంధీని తీసుకొచ్చి యస్పై ముందు నిలబెట్టాడు  అతనివైపు ఒకసారి ఎగాదిగా చూశాడు యస్పై  అతను రెండు చేతులూ జోడించి యస్పైకి ఎదురుగా గడపకివతల నిలబడ్డాడు

''ఏరా, మొత్తం ఇప్పిస్తావా?'' అడిగాడు యస్పై

తలవూపాడు అతను

''సరే చూస్తా  ఏదన్నా తకరారు వచ్చిందంటే సబ్‌జైలు ఎనకే నిన్ను పాతిపెడతా  తెలిసిందా పో'' అన్నాడు కళ్ళతో ఉరిమిచూసి

అతను నెమ్మదిగా ఇవతలకు వచ్చాడు చేతులు అట్లాగే వుంచి

''వాడు మురళిగాడు, నేరాలు చేయటం లేదంటావా?'' అడిగాడు యస్పై

''లేద్సార్  వాడసలు దెబ్బలు తినేరకం కాదు  రాత్రి అంతంత కోటింగు ఇచ్చినా వాడు చెప్పలేదు సార్  పైగా వాడు రెండేళ్ళనుండి హుబ్లీలో వుంటున్నాడు సార్  బండేస్తున్నాడు  వాడి కూతురు చచ్చిపోయిందగ్గర నుండీ  నేరాలు చెయ్యటం లేదు సార్  అయినా చూద్దామని రాత్రి బాగానే ఇచ్చాం'' అన్నాడు జోసఫ్

''సరే వారంట్లు తీసుకొనిపోండి  ఇయిగో ఖర్చులకి ఈ యాభై వుంచండి  నేను రాకపోయినా అక్కడున్న వాళ్ళంతా మనకు బాగా తెలిసినోళ్ళే  ఏం ఫరవాలేదు  అక్కడ ఏంజరిగినా నాకు తెలుస్తుంది'' అన్నాడు గూడార్థంగా

జోసఫ్ రేచుబుర్రకు ఆ మాటలకు అర్థం చప్పున స్ఫురించింది  నవ్వాడు  అంతా సెల్యూట్‌లు చేసి బయట కొచ్చారు

''ఈడెమ్మని   అక్కడ మనమేదో ఈడికి తెలియకుండా కాజేస్తామనీ, ఆడ ఏం జరిగినా ఈడికి తెలిసిద్దంట  దొంగనాకొడుకు, వాడి గుబిలి మనం బాగా తియ్యాలి'' అన్నాడు జోసఫ్  ఆ మాటకు మూర్తీ, గౌసూ చిన్నగా నవ్వారు

స్టేషను స్వీపరు పకీరయ్యని పిలిచి, రెండు రూపాయలిచ్చి, ''అరే , రెండిడ్లీలు, ఒక పెసరట్టు, ఒక టీ పోయించుకుని, ఒక శాంపిల్ సబ్బు తీసుకురా  తెచ్చి గాంధీగాడికియ్యి'' అని గాంధీవైపు తిరిగి, ''ఒరే ఇప్పుడీ టిఫిన్ చేసి టీ తాగు. పంపు కింద కూర్చుని సుబ్రంగా నీళ్ళు పోసుకొని గుడ్డలుతుక్కో  మద్యాన్నం పలావు తెప్పిస్తా  తిని బయలుదేరదాం, సరేనా?'' అన్నాడు

అతను అలాగే అన్నట్టు తల వూపాడు

మధ్యాహ్నం ముగ్గురూ భోజనాలు చేసొచ్చారు  గాంధికి కోడిపలావు పొట్లం తెప్పించి, ఒక బీడీ కట్ట, అగ్గిపెట్టె తెప్పించారు

అతను భోంచేస్తుంటే, ''తినరా తిను నీళ్ళు పోసుకునేసరికి ఈడికి సినిమా స్టారు గ్లామరొచ్చిందయ్యా'' అన్నాడు జోసెఫ్ పొగుడుతున్నట్టు మిగిలినవాళ్ళు నవ్వారు తరువాత అతని చేతికి తాడు కట్టి ఆ తాడుని జోసెఫ్ పట్టుకున్నాడు నలుగురూ రెండు రిక్షాలెక్కారు బస్టాండు చేరారు బస్సు వారెంటు మార్చారు వారెంటులో నాలుగో మనిషి కింద వేరే కానిస్టేబులు నెంబరు వేశారు

''అబ్బ, ఈ ఆడోళ్ళతో చచ్చే పనవుతోందిరా గౌసూ'' అన్నాడు మూర్తి బస్సు బయలుదేరినాక

''ఏంది?''

''ఏముంది ఇంటికిపోతే ఒకటే గోల ఎప్పుడూ ఇంట్లోనే చావమంటారు ఈళ్ళకి ప్రపంచగ్నానం ఎప్పుడొచ్చిద్దోగాని, దీపముండగానే ఇల్లు సక్కబెట్టుకోవాలని చెప్పినా అర్థం చేసుకుని చావరు తంతే ఏడుస్తారు ఈళ్ళెమ్మ''

''వాళ్ళంతే వాళ్ళకు తెలిసిచావదు వాళ్ళకేలోటూ లేకుండా చూస్తున్నామన్న జ్ఞానం ఉండదు, ఎంతసేపూ ఇంటికాడ వుండలేదనే గోల తప్ప''

వాళ్ళ సంభాషణ వింటూ నవ్వుకున్నాడు జోసెఫ్ 'ఈ సమస్య వీళ్ళకీ వుందన్నమాట' అనుకున్నాడు

వాళ్ళు విజయవాడ చేరి గాంధీ చెప్పిన వస్తువులన్నీ రికవరీ చేశారు గంగాళాలూ, కాగులు కొన్నవాళ్ళదగ్గర వాళ్ళమీద కేసులు పెడతామని బెదిరించి, కేసులు పెట్టకుండా ఉండటానికిగాను వస్తువులతో పాటు డబ్బు లాగారు రాత్రి తొమ్మిదింటికి వాళ్ళు ఒక హోటల్‌కెళ్ళారు అంతా ఒక మూల కూర్చున్నారు

''అరే గాంధీగా నేను చెప్పేది జాగ్రత్తగా విను'' అన్నాడు జోసెఫ్ ''నువ్వు చెప్పినియ్యన్నీ రివకరీ చేశాము బాగానే వుంది కాని మేము యస్సైకి, 'రాళ్ళ గాజులు కొన్న అతను పేచీ పెట్టాడ' ని చెపుతాము లేకపోతే ఆ అడ్రసు నువ్వు తప్పు చెప్పావనీ, నువ్వు చెప్పిన అడ్రసు సరిగా లేదని, ఏదో ఒకటి చెపుతాము ఏది చెప్పేదీ నీముందే చెపుతాము కాబట్టి నువ్వు దానికి తగ్గట్టు అబద్ధమాడాలి యస్సై నిన్నడుగుతాడు నువ్వుకూడా అదే చెప్పాలి ఇన్ని వస్తువులమీద వాటిని గురించి పెద్దగా పట్టించుకోడు ఎట్లాగు నీమీద కేసు పెట్టాల్సిందే నువ్వు జైల్లోంచి బయటకు వచ్చినాకకానీ, నీ పెళ్ళానికికానీ రెండువందలు ఇస్తాం నాది మాటంటే మాటే నా సంగతి తెలుసుకదా?'' అన్నాడు జోసెఫ్

''అట్లాగే సార్'' అన్నాడు అతను

నలుగురూ పలావులు తిని బైటకొచ్చారు వాళ్ళు స్టేషనుకు చేరేసరికి రాత్రి పన్నెండు దాటింది సి డీలు టైపు చేయిస్తూ యస్సై స్టేషనులోనే వున్నాడు ''అయ్యాగారికి రాసకేళికి ఇంకా టైం కాలేదు కాబోలు'' అన్నాడు గౌసు చిన్నగా అంతా నవ్వారు ముగ్గురూ వెళ్ళి యస్సైకి సెల్యూట్స్ చేశారు

''ఏమయ్యింది?'' ఆశగా అడిగాడు యస్సై

''వస్తున్నాయ్ సార్'' అన్నాడు జోసెఫ్ గర్వంగా చూస్తూ రిక్షా అతను కాగులూ, గంగాళం, సూటుకేసూ, రేడియో, చీరలూ, ఇంకా మిగతావి తీసుకొచ్చి యస్సైకి కనపడేట్టు వాకిలికి ఎదురుగా పెట్టాడు అవి చూడగానే యస్సై ముఖం ట్యూబులైటులాగా వెలిగింది

''ఇవి సరే, అసలివి ''

యస్సైమాట పూర్తికాకముందే జేబులోంచి, బంగారు నగలపొట్లాం, లిస్టూ రెండూ బల్ల మీద పెట్టాడు జోసఫ్ చటుక్కున పొట్లం విప్పతీసి చూశాడు యస్సై ఆనందంతో అతని కళ్ళు మిలమిలా మెరిశాయి

''గాజులెక్కడ అమ్మిందీ, తప్పు చెప్పాడు సార్ ఖచ్చితంగా చెప్పలేక పోతున్నాడు సార్ ఈ నా కొడుకు'' అన్నాడు సందర్భం చూచి జోసఫ్, గాంధీవైపు కోపంగా చూస్తున్నట్లు నటిస్తూ

ఆ మాటకు గాంధీ వంగి దండం పెట్టాడు యస్సైకు ''దొరా, గుర్తురావటం లేదు శానాకాలమయ్యింది అయ్యి అమ్మినరోజు బాగా తాగివున్నా అందుకని గుర్తు రావటం లేదు'' అన్నాడు

యస్సై అతనివైపు కొరకొరా చూశాడు అతను చెప్పిన మాట నమ్మినట్లు కనిపించ లేదు కాని ఏమీ అడగలేదు ఎవర్నీ కాగితంలోని నానుతాడూ, లాకెట్టూ, మిగతా బంగారు వస్తువులవైపు చూస్తూ, ''ఇవి రాయిమీద రుద్ది చూపించారా?'' అన్నాడు

''అన్నీ జాగ్రత్తగా చెక్‌చేసి తీసుకొచ్చాం సార్ అంత తెలివి తక్కువగా ఎట్లా వుంటాం సార్, ఇంతకాలం నుండీ ఐడీ పార్టీ చేస్తూ'' అన్నాడు గౌసు

''వూఁ సరే వీడిని ఈ రాత్రికి చావగొట్టండి ఆ రవ్వల గాజులు ఎవడి కమ్మిందీ చెప్పిందాకా వదిలిపెట్టొద్దు'' అన్నాడు యస్సై మళ్ళీ తనే, ''ఇప్పటికి సి ఐ గారు మూడుసార్లు అడిగాడయ్యా, 'రికవరీకెళ్ళిన వాళ్ళు వచ్చారా' అని డి యస్పీగారు ఒకసారి ఫోను చేశాడు పొద్దున మీరటు పోగానే ఇద్దరికీ తెలియజేశా ఎందుకయినా మంచిదని'' అన్నాడు ''సరే వీడిసంగతి చూడండి ఆ రవ్వల గాజుల కోసం'' అన్నాడు మళ్ళీ

వాళ్ళు విని సెల్యూట్స్ చేసి ఇవతలకొచ్చారు

గాంధీ వాళ్ళవైపు భయంగా చూశాడు

''వట్టిదేలేరా నిన్నెందుకు కొడతాం అక్కడ ఆ మాట అనకపోతే ఎట్లా నువ్వు లోపలకు పద'' అని అతన్ని లాకప్ తాళం తీసి లోపల వేశాడు మూర్తి

''ఇయిగో, బీడీలు కొనుక్కో'' అని రెండు రూపాయలిచ్చి వస్తూ, ''చెప్పింది గుర్తుందికదా!'' అన్నాడు జోసఫ్

వుందన్నట్లు తలూపాడు అతను తెచ్చిన వస్తువులన్నీ లోపల పెట్టించి తాళం వేశాడు గౌసు పాస్‌పోర్టూ, వారంట్లూ సెక్షన్ ఇన్‌చార్జి హెడ్‌కానిస్టేబులికిచ్చి, డైరీ రాయమని చెప్పి ఇంటికి బయలుదేరారు

''గాజుల సంగతి రేపు చూద్దాంలేరా'' అన్నాడు జోసఫ్

''సరేలే'' అన్నారు మిగిలిన ఇద్దరూ

అతను ఇంటికి చేరేసరికి రెండు దాటింది స్నానంచేసి భోంచేసి పడుకునేసరికి ఇంకా పొద్దుపోయింది

''రేపంతా ఇంటిదగ్గరే ఉంటాలే'' అన్నాడు అన్నం తింటూ భార్యతో జోసఫ్

''ఆ ఇట్లాంటియెన్ని అయిపోలేదు'' అంది ఆమె నిష్టూరంగా

అతను నవ్వి వూరుకున్నాడు భోంచేసి లేచి జేబులోంచి గాజులు తీసి భార్యకు చూపించాడు వాటిని చూడగానే ఆమె కళ్ళు జిగేల్‌మని మెరిశాయి ''బంగారప్పియ్యేగా?'' అంది

''కాదు రోల్డ్‌గోల్డ్'' అని ఎగతాళిగా అని, ''అందులో మూర్తికీ, గౌస్‌కీ కూడా భాగాలు వున్నయ్'' అన్నాడు

''పెద్దగా వాడినట్టు కూడా లేవండీ కొత్త కారకం అన్నా పోలేదు పాపం ఎవురియ్యో'' అని, ''ఇయ్యి మనం వుంచుకుని వాళ్ళకు డబ్బులిద్దాం పెద్దమ్మాయికి సక్కగా సరిపోతయ్'' అంది ఆమె మురిపెంగా ఆ రాత్రి ఆమెకు ఆనందంతో నిద్ర పట్టలేదు సరిగా

మరుసటిరోజు మధ్యాహ్నందాకా స్టేషను కెళ్ళలేదు అతను మధ్యాహ్నం భోజనం చేస్తుంటే మూర్తీ, గౌసూ వచ్చారు

''రండన్నయ్యా! రండీ'' అంటూ ఇద్దరికీ కుర్చీలు వేసింది జోసఫ్ భార్య

''వాడున్నాడంటమ్మా?'' కూర్చుంటూ అడిగారు వాళ్ళు

''రండ్రోయ్ అన్నం తిందాం'' అని లోపల్నుంచి కేకేసి,'' మీ అన్నయ్యవాళ్ళకు అన్నం వడ్డించవే'' అన్నాడు భార్యతో

''ఒరే తినొచ్చినవాళ్ళకు ఏం పెడతావులేరా'' అన్నాడు మూర్తి

''రండన్నయ్యా అన్నం తిందురుగాని'' అంది ఆమె

''తినొచ్చామమ్మా ఈడి దర్శనం పొద్దటినుండీ లేకపోతే, ఏమయ్యాడో అని, పరారీలో వున్నాడేమోనని ఇటు ఒచ్చాం'' అన్నాడు గౌసు నవ్వుతూ

''వదినమ్మా, పిల్లలూ అంతా బాగున్నారా?'' అడిగింది ఆమె అతను తలూపాడు

ఇంతలో జోసఫ్ తువ్వాలుకు చెయ్యి తుడుచుకుంటూ బయటకొచ్చాడు ''స్టేషనుకు రాబుద్ధి కాలేదురా ఈపూట ఇంక భోంచేసి బయలుదేరుదాముకదా అనుకుంటుంటే మీరొచ్చారు ఏంది సంగతులు? రెండు పూలోడు అడిగాడా?'' అన్నాడు

''ఏంలేదు కానీ, వాడు దాదా పేరు కలవరిస్తున్నాడు'' నవ్వుతూ చెప్పాడు గౌసు

ఆ మాటకు ముగ్గురూ నవ్వారు ముగ్గురూ బయలుదేరి వాళ్ళకు పరిచయమున్న బంగారపు కొట్టు అతని దగ్గరకెళ్ళి, గాజులు చూపించి, వాటి వ్యవహారం పూర్తి చేసుకొని స్టేషను కొచ్చారు

వాళ్ళని చూస్తునే , ''ఎక్కడి కెళ్ళారయ్యా! డీ యస్పీగారు మీ కోసం ఫోను చేశారు తొందరగా పోయి కనపడండి'' అన్నాడు యస్సై

''ఎందుకుసార్?'' అన్నాడు జోసఫ్

''ఏమోమరి విషయం నాకు తెలియదు పోయి కనపడండి మీ కోసం పీసీలని కూడా పంపించాడు డీ యస్పీగారు ఎదురు చూస్తుంటారు తొందరగా పోండి'' అన్నాడు

ముగ్గురూ ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు వాళ్ళు చేసిన తప్పులు ఏవి, ఎక్కడ బయట పడ్డాయో అన్నట్టు గుండెలు ఝల్లుమన్నాయి తప్పదు కాబట్టి సైకిళ్ళు వేసుకుని డియస్పీ బంగళాకెళ్ళారు

డి యస్పీ ఆఫీసులో కూర్చుని వున్నాడు ముగ్గురూ బంగళాముందు సైకిళ్ళు దిగారు ఆర్డర్లీలు బయట కొబ్బరిచెట్టు కింద నిలబడి దొంగతనంగా చుట్టలు కాలుస్తున్నారు వీళ్ళని చూచి, 'దోపిడి దొంగల ముఠా ఇటు బయలుదేరిందేరా' అనుకున్నారు

వాళ్ళని చూచి, 'తోముడుపార్టీ ఇక్కడేవుందిగా ఏందో కనుక్కుందాం' అనుకున్నారు ఐ డీ పార్టీవాళ్ళు

''అయ్యా యేసోబుగారూ, ఏంది దొరగారు పిలిపించారట'' అన్నాడు జోసఫ్

''మాకేం తెలుసండీ మీరొస్తుంటే ఎందుకొస్తున్నారో కనుక్కుందా మనుకుంటున్నాం''
అని తనతోటి వానివైపు చూచి, ''ఏరా, కదూ?'' అన్నాడు అతను ఔనన్నట్లు తలూపాడు
''ఎందుకో దొరగారు పిలిపిచ్చారంట సరే పోయి కనపడతాం మీకు తెలిసినా చెప్పరుగా''
అన్నాడు నిష్ఠూరంగా గౌను
''మీరు తెలుసుకోకుండా వస్తున్నారా? మాకు కబుర్లు చెపుతున్నారు గానీ'' అన్నాడు ముసలి
ఆర్డర్లీ
వాళ్ళు గేటు తీసుకుని లోపలకు వెళ్ళారు
''పోంగ్రా లంజా కొడకల్లారా వేలు వేలు సంపాదిస్తున్నారు ఎప్పుడో మొత్తం అమ్ముకునే
రోజొస్తుందిలే పోండి వూరిని పిండుతున్నారు'' అన్నాడు రెండో ఆర్డర్లీ కసిగా ఐ డీ పార్టీవాళ్ళవైపు
చూస్తూ
వీళ్ళు ముగ్గురూ డి యస్పీ ఆఫీసురూం ముందు చెప్పులు విడిచి, లోపలికెళ్ళి వరుసగా
సెల్యూట్‌లు చేశారు
''ఎక్కడికెళ్ళారోయ్ ఎంతసేపు కూర్చోవాలి మీకోసం'' అన్నాడు కొద్ది చిరాగ్గా డి యస్పీ
''అయ్యా! కొత్త సినిమా హాలు '' నీళ్ళు నములుతూ చెప్పాడు జోసఫ్ డి యస్పీ ముఖాన్ని
చదువుతున్నారు వాళ్ళు ఏ క్షణంలో ఏం వినవలసి వస్తుందో అనే భయంతో వున్నారు
''ఆఁ మీ ముఖం ఐ డీ పార్టీ మీరు మీరంత ఎలర్ట్‌గా వుంటే నేరాలెందుకు జరుగుతాయ్
మిమ్మల్ని ఐ డీ పార్టీకి సెలక్ట్ చేసినోడిని అనుకోవాలి సరే, వీరు హోంగార్డు డి యస్పీగారు
ఉదయం ఇక్కడ బస్టాండులో వీరి జేబు కొట్టారంట ఆరొందల చిల్లర వున్న పర్స్ పోయింది''
అని వాళ్ళ ముఖాలు చూశాడు
'హమ్మయ్య, ఇదేకదా' అనుకుని వాళ్ళు వూపిరి పీల్చుకున్నారు
''తప్పకుండా ప్రయత్నం చేస్తాం సార్'' అన్నాడు జోసఫ్.
''ప్రయత్నంకాదు మీరేం చేస్తారో నాకు తెలియదు ఇంకో గంటకల్లా వీరి డబ్బులు
ఆరువందల ఎనభై రూపాయలు, అక్షరాలా ఆరువందల ఎనభై రూపాయలూ నాబల్లమీద ఉండాలి''
అన్నాడు హెచ్చరిస్తున్న ధోరణిలో డి యస్పీ
జోసఫ్ ఏదో అనబోయేంతలో, ''మీరేమీ చెప్పొద్దు నేను వినదలుచుకోలేదు మీరేం చేస్తారో
నాకు అనవసరం మీరెక్కడైనా జేబులు కొట్టి తెచ్చినా నాకభ్యంతరంలేదు ఇది ప్రెస్టేజ్ క్వశ్చన్ నా
సబ్ డివిజన్‌లో, అందులో హెడ్ క్వార్టర్సులో జరిగింది ఇంక వెళ్ళండి మీరొచ్చిందాకా మేము
భోజనాలు కూడా చెయ్యం వూ పోండి'' అన్నాడు కరుకుగా
ఇంకేమీ మాట్లాడలేదు వీళ్ళు వాళ్ళిద్దరికీ సెల్యూట్‌లు చేసి బయటకొచ్చారు ముగ్గురూ
సరాసరి యస్పై దగ్గరకెళ్ళి విషయం చెప్పారు
''ఆఁ నాకు తెలుసు నాకిందాకే ఫోన్ చేశాడు మరి ఏదో చూడండి మనకింక
ఆపద్బాంధవులు క్లబ్బులోళ్ళూ, బ్రాకెట్పోళ్ళూ, సారాయి కాంట్రాక్టర్లేగా పోండి పోయి
డి యస్పీ పేరు చెప్పండి నాపేరు చెప్పొద్దు'' అన్నాడు యస్పై
తప్పనట్టు కదిలారు అక్కడనుండి సెల్యూట్‌లుచేసి. ఒకగంట గడిచే సరికి మొత్తం కలెక్టుచేసి
డి యస్పీ బంగళా కొచ్చారు
''వచ్చాయండి మా రేసు కుక్కలు'' అంటున్నాడు డి యస్పీ, హోంగార్డు డి యస్పీతో

ఆ మాటలు చిన్నగా వినపడ్డాయి వీళ్ళకి

''అవున్రా లంజా కొడకా మేము రేసు కుక్కలం మిగిలినోళ్ళమే వూరకుక్కలు ఆర్డర్లీలేమో పీతికుక్కలు అంతా నీ దృష్టిలో కుక్కలే నువ్వేమో మా దృష్టిలో పెద్ద ఆల్సేషియన్ కుక్కవి అది కూడా చూడటానికి గంభీరంగా వుంటుందేకాని గడపదాటి బయటకు రాలేదు దానికి స్థానబలమేకానీ సొంత బలమెక్కడి నుండి వచ్చిద్ది? ఈ కుక్కలుంటేనే వాటి వెనకాల నిలబడి, నాలికింత బారున చాచేది'' అని కసిగా తిట్టాడు జోసఫ్

ముగ్గురూ వెళ్ళి సెల్యూట్‌లు చేశారు జేబులోంచి డబ్బులుతీసి టేబిలుమీద పెట్టాడు జోసఫ్ ఆ పని చేసినందుకు తమని మెచ్చుకుంటారని భావించారు ఐ డీ పార్టీ వాళ్ళు

''నా పరువు కాదు మన సబ్‌డివిజన్ పరువు కాపాడేర్రా'' సంతోషంగా చూస్తూ అన్నాడు డి యస్పీ

డబ్బులు లెఖ్ఖపెట్టుకొని, సరిపోయినట్లు నవ్వుతూ తలూపి, ''మెనీ మెనీ థాంక్స్'' అన్నాడు హోంగార్డు డి యస్పీ, ఈ డి యస్పీతో కనీసం వీళ్ళ వైపు తల ఎత్తి కూడా చూడలేదు అతని ప్రవర్తనకు వాళ్ళ మనస్సులు చివుక్కుమన్నయ్

''నేనొస్తామరి మీకు చాలా శ్రమ కలిగించాను'' అంటూ లేచాడు హోంగార్డు డి యస్పీ టైం చూసుకుంటూ ఈ డి యస్పీ కూడా లేచాడు ఇద్దరూ కరచాలనం చేశారు వీళ్ళు ముగ్గురూ వెళ్ళి బయట నిలబడ్డారు కాలింగ్‌బెల్ కొట్టి డ్రైవర్ని పిలిచి, ''దొరగార్ని తీసుకుపోయి బస్సు ఎక్కించిరా'' అన్నాడు డి యస్పీ

డ్రైవర్ సెల్యూట్‌చేసి బయటకు వెళ్ళాడు హోంగార్డు డి యస్పీ మరోసారి థాంక్స్ చెప్పి బయటకు వెళ్ళాడు డి యస్పీ గేటుదాకా వెళ్ళి లోపలకొచ్చాడు అక్కడ నిలబడి వున్న ఐ డీ పార్టీ వాళ్ళని చూచి, ''ఏమోయ్ మీరంతా ఏం చేస్తున్నారు ఏమిటీ పిక్‌పాకెటింగులు మీరెట్లాగూ గ్రేవ్స్ జరగకుండా చూడలేరు కనీసం వీటినికూడా కంట్రోలు చెయ్యలేకపోతున్నారు ఇలాటి అసమర్థులతో నేను ఏమీ మెయిన్‌టెయిన్ చెయ్యలేను ఇలాటిది ఇంకొకటి గనక నా నోటీసులోకి వచ్చిందంటే నేను ఎక్స్‌క్యూజ్ చెయ్యను'' అన్నాడు సీరియస్‌గా

ఆ మాటలకు వాళ్ళు అవాక్కయి పోయారు ఏం మాట్లాడకుండా తలూపి వుండిపోయారు

''ఎవరిపేరు చెప్పి ఈ డబ్బులు కలెక్టు చేశారు? నా పేరేమన్నా బయట కొచ్చిందా?'' అన్నాడు

లేదన్నట్టు తలూపి, ''దొరగారి పేరు ఎందుకు చెప్తాం సార్'' అన్నారు వాళ్ళు

''మీ యస్సైకి కూడా చెప్పండి ఇలాటి సంఘటన నాకు ఇంకోసారి రాకూడదు'' అని లోపలకెళ్ళాడు ఆయన వీపుకి సెల్యూట్స్ చేసి బయటకొచ్చారు ముగ్గురూ ఆ మాటలు రెండే అయినా, ఆ చూచిన చూపూ, మాట్లాడిన విధం వాళ్ళకు బాగా బాధ కలిగించింది మనసులో తెగ తిట్టుకున్నారు

బయట ఆర్డర్లీలు ఎదురయ్యి, వీళ్ళ మొహాలు చూచి, ''అక్షింతలు పడ్డట్టున్నాయిగా'' అన్నారు. మళ్ళీ వెంటనే, ''ఇయ్యి మన బతుకుల్లో మామూలేలే వాటిని పట్టించుకుంటే ఒక్క నిముషమైనా ఉద్యోగం చెయ్యలేము పొండి. ఇది నరకం మనం ఏనాడో పాపం చేసుకుని పుట్టాం'' అన్నారు

అవునన్నట్టు చూచి, మాట్లాడకుండా సైకిళ్ళెక్కారు ఐ డీ పార్టీ వాళ్ళు తిట్టిన తిట్టు తిట్టకుండా డి యస్పీని, అమ్మ దగ్గరనుండి, అక్క పెళ్ళాం మీదుగా కూతుర్ని కూడా వదిలి

పెట్టకుండా తిట్టారు ''ఈడెమ్మ ఖొజ్జాని  పెళ్ళాన్ని లోకుల కప్పగించే ఖొజ్జా నాకొడుక్కి కూడా మేం లోకువే'' అన్నాడు మూర్తి కేకరించి తుపుక్కున వుమ్మేశాడు

''ఇది చెయ్యలేంరా ఐ డీ పార్టీ మేం చెయ్యలేమని రెండు పూల నా కొడుక్కి, వాడు కాదంటే మూడు పూల ముసలి నా కొడుక్కి చెపుదాంరా'' అన్నాడు జోసఫ్

''ఈళ్ళమ్మని  ఒకవంక గాడిద చాకిరీ చేయించుకుంటూనే రెండో పక్క ఈ బెదిరింపులు ఏంది? మనమేమన్నా బూటు కట్టుకుని, తుపాకి పట్టుకోవటం చేతకానివాళ్ళమా! మూడు గంటలు డ్యూటీచేసి తుపాకి అక్కడ పారేసి ఇంటికి పోయి హాయిగా పెళ్ళాం బిడ్డలతో  ''

అతని మాటలు పూర్తికాకుండానే అందుకున్నాడు జోసఫ్ ''ఆఁ దీని తాత అది దాని తాత ఇది అందులో శారీరకమైన కష్టం ఒకటే వుంది ఇందులో అనుక్షణం మానసిక వేదన వుంది కాకపోతే పాపపు సొమ్ము ఏదో వస్తుండబట్టిగానీ లేకపోతే  ''

అప్పటివరకూ మౌనంగా వున్న గౌసు చిన్నగా అన్నాడు ''సరే అయ్యిందేదో అయిపోయింది ఎలాగూ ఐ డీ పార్టీ మానుకోవాలనుకుంటున్నాం వాడు భద్రంగాడు ఎట్లాగూ ఇవ్వాళకూడా రాలేదంటే వాళ్ళమ్మకు సీరియస్‌గానే వున్నట్టు లెఖ్ఖ లేకపోతే వాడు టౌన్ వదిలిపెట్టి ఒక్క క్షణం కూడా వుండలేడు వాడెట్లాగూ సెలవు ఎక్స్‌టెండ్ చేస్తాడు రేపు నేను సిక్కు అవుతాను మీరు తరువాత రెండురోజుల్లో సిక్కవ్వండి సరే ఇప్పుడు మనం మందేసుకోకపోతే మనస్సు తేలికపడేలాగా లేదు అటు సెంటర్‌కి పోదాం పదండి ఎవడో ఒకడు తగలకపోడు వాడి నెత్తిన చెయ్యి పెడదాం లేదంటే నా దగ్గరున్నయ్యి పదండి'' అన్నాడు

''వద్దురా ఇప్పుడొద్దు మనస్సు బాగాలేదు'' అన్నాడు జోసఫ్

''అందుకేగా పిలుస్తోంది నీకొక్కడికేనా మనసు బాగోంది మనసు బాగానప్పుడు మందే దానికి మందు లైట్‌గా తలా ఒక పెగ్గు నా మాట వినండి'' అన్నాడు గౌసు

''సరే పదరా వాడంతగా బాధపడుతుంటే మనం కాదనటం బాగాలేదు'' అన్నాడు మూర్తి, మనసులోని కోర్కెను గమ్మత్తుగా బయటపెడుతూ

జోసఫ్ మనసులో సంతోషించాడు కాని పైకిమాత్రం ఏమీ అనలేదు ''సరేలే దానికింకా టైముంది గానిలే అద్సరే, ఈ హోంగార్డు డి యస్పీ గాడి జేబు దొబ్బినోడు ఎవురు? వాడెవడైనా కానీ మనల్ని కలవటానికి రావాలి గదా లేకపోతే కనీసం కబురైనా చెయ్యాలి గదా'' అన్నాడు

''ఔను ఈడెవడోకొత్తోడు కావాలి బస్టాండింగులో వరకయితే ఎర్రోడు కావాలి వాడక్కడ జేబు కొడతం, ఇక్కడ మనముందు వాలటం వెంటనే జరిగిపోవాలికదా వాడు రాలేదంటే ఎవడో కొత్తోడు అయ్యుంటాడు అయినా అదే తెలిసిద్దిలే ఎవడో ఒకడు చెప్పకపోతాడా'' అన్నాడు మూర్తి

అప్పటికి బాగా చీకటి పడింది సెంటర్‌లో గంగరావి చెట్టుకింద సైకిలుషాపుదగ్గర సైకిళ్ళ స్టాండు వేసి నిలబడ్డారు వాళ్ళ కళ్ళు తెలిసిన తాగుబోతు వ్యక్తి కోసం చురుగ్గా చూస్తున్నాయి

జోసఫ్ కళ్ళు, దూరంగా పంచె కట్టుకుని, ఖద్దరు చొక్కా వేసుకుని వస్తున్న వ్యక్తిమీద పడి మిలమిలా మెరిశాయి

''మన పంట పండిందిరా'' అన్నాడు హుషారుగా

''ఎవరు? ఎవరు?!'' ఇద్దరూ ఒకేసారి అడిగారు అటు చూస్తూ వాళ్ళ ముఖాల్లో తాగుబోతు ఆనందం తాండవించింది

''అడుగో గొల్లపాలెం ప్రెసిడెంటు దొంగనా కొడుకు వస్తున్నాడు'' అని వేలితో చూపించాడు

అతను చాలా దూరంలో వున్నాడు అతన్ని మిగిలిన ఇద్దరూ పోల్చుకున్నారు

''వెరీగుడ్ అరే జోసఫ్‌గా నియ్యి గద్ద కళ్ళురా సరే ఇంకెందుకు, డ్రామా మొదలుపెడతా'' అంటూ గౌసు సైకిలేసుకుని హుషారుగా అతని కెదురు పోయాడు కానీ అతను గౌసుని గమనించలేదు అందువల్ల సర్రున సైకిలు వెనక్కి తిప్పాడు గౌస్ అతని పక్కగా వచ్చి ''నమస్కారం ప్రెసిడెంటుగారూ'' అన్నాడు

అతను తలతిప్పి, గౌస్‌ని చూచి ''ఆఁ ఆఁ నమస్కారం'' అన్నాడు నిలబడి

''తమరి దర్శనమే మాకు కరువయ్యింది'' అన్నాడు సైకిలు దిగి అతనితో నడుస్తూ గౌసు

''మేం వస్తూనే వుంటాంకదా రోజూ మా అడ్రసు నెహ్రూ కల్చరల్‌క్లబ్బేగా పొద్దున్నే ఏడింటికి రావటం, రాత్రి పదకొండింటికి పోవటం ఎప్పుడూ ఇక్కడే వుండేవాళ్ళమైతే మీరే కనపడటంలా'' అన్నాడు అతను

'అవున్లే మీ బతుకులన్నీ క్లబుల్లో గడపాల్సిందేలే ఆడ పెళ్ళాం బిడ్డలు ఎట్టాపోయినా ఫరవాలేదు' అనుకున్నాడు మనస్సులో గౌసు ''అహఁ అటూ ఇటూ తిప్పి మాకే పెట్టారుగా ఏమైనా మిమ్మల్ని మాటల్లో గెలవటం కష్టమైన పనే అది సరేలేకాని, మీరు నడవటం ఏంది? మీ స్టేటస్‌కి అసలు కారు మెయిన్‌టెయిన్ చెయ్యాలి కనీసం రిక్షా అన్నా ఎక్కాలి ఉండండి రిక్షా పిలుస్తా ఎక్కడిదాకా?'' అన్నాడు అభిమానాన్ని ఒలకబోస్తూ అతను మొహమాట పడిపోయాడు ''అహహఁ వొద్దులే ఇక్కడి దాకానే జంగమయ్యగారి ఆసుపత్రికి ఇక్కడేగా'' అన్నాడు నవ్వుతూ అభిమానంగా

''ఏమిటి, వంట్లో బాగాలేదా? అదే? కాస్త నలిగినట్టు కనపడుతున్నారు నేను అడుగు దామనుకున్నా ఏమిటి సుస్తీ'' శ్రద్ధగా అడుగుతున్నట్టు అడిగాడు

''నాక్కాదు మా బంధువు ఒకాయన ఉంటే పలకరించి వద్దామని''

''అదా అయినా మీరుకూడా కాస్త నలతగానే కనపడుతున్నారు ఈమధ్య అసలు స్టేషనుకే రాకపోతే ఏమిటో అనుకున్నాను అయినా ఆరోగ్యం కాస్త జాగ్రత్త'' అన్నాడు హితుడిలాగా మాటల్లో గంభీరతని కనపరుస్తూ

''నాకేం ఫరవాలేదు ఇప్పటిదాకా, ఆ దేవుడి దయవల్ల కనీసం తలనొప్పి కూడా లేదు'' అన్నాడు అతను నవ్వుతూ చిన్నగా నడుస్తూ

''అదేలేండి అయినా మీ ఆరోగ్యం గురించి నాకు తెలియందేముంది మొన్న బుల్లెన్నగాడి కంపెనీలో ఆ యర్రపిల్ల మిమ్మల్ని అడిగింది ''

నడుస్తున్న అతను చప్పున ఆగిపోయాడు

''అదే, మిమ్మల్ని గురించి గుచ్చిగుచ్చి అడిగింది తన సర్వీసులో మీలాంటోడ్ని తను చూడలేదంది''

అతను రోడ్డుమీదే మెలికలు తిరిగిపోయాడు

''మీముందు మాబోటి కుర్రోళ్ళం ఎందుకు పనికొస్తాం '' గౌసు చెప్పుకుపోతున్నాడు

అతను బయలుదేరిన పని ఇంచుమించు మర్చిపోయాడు

''ఏమంది ఇంకా? ఇటుపక్కకు రా, ట్రాఫిక్‌కి అడ్డం''

''ఏముంది, నే వెళ్ళా వేరే పనుండి మీ పేరు అడిగి నాకు తెలుసా అంది మీ సంగతి నాకు తెలుసుగా మిమ్మల్ని ఒకసారి చూచిన ఆడది ఇంకొకసారి గుర్తుకు తెచ్చుకోవటంలో

ఆశ్చర్యమేముంది''

అతను ముఖానికి పట్టిన చెమట తుడుచుకున్నాడు ఆనందం తన్నుకొస్తుంటే బలవంతాన ఆపుకున్నాడు నడిచీ, నడిచి కాళ్ళు లాగుతున్నా పళ్ళు బిగువున నిలబడ్డాడు

''ఒక్కసారి పోండి పాపం మీ పేరే కలవరిస్తోంది '' అన్నాడు గౌసు

అతని మాటలకు అడ్డు తగులుతూ, ''నమస్కారం ప్రెసిడెంటుగారూ '' అంటూ వచ్చాడు మూర్తి

''నమస్కారం'' అన్నాడు ప్రెసిడెంటు నవ్వుతూ

''మరీ నల్లపూసయ్యి పోయారే ఏదన్నా టూర్ వేశారా? లేకపోతే పనుల వత్తిడా? అయినా రోజుకొక్కసారన్నా మీరు టౌనుకు రాకపోతే మనసు నిలబడదే బండేది?'' అన్నాడు

అతను నవ్వి, ''రీ బోర్ కిచ్చా షెడ్డులో వుంది'' అన్నాడు

''అరే, గౌసూ, అయ్యగారు కాఫీ కోసమైనా లీటరు పెట్రోలు ఖర్చుపెట్టి టౌనుకు రావాల్సిందే జమిందారీ పోకడ అంతా వీళ్ళ వూళ్ళో మిగతావాళ్ళున్నారు ఈళ్ళెమ్మ ధూ ఏం బతుకులురా పీనాసి నాయాళ్ళు జీవితమంటే ఏమిటో ఈయన్ని చూసి నేర్చుకోవాలి బతికినంతకాలం రాజా బతుకు'' కళ్ళు పెద్దవి చేసి అన్నాడు మూర్తి

అతను ఉబ్బిపోతున్నాడు ఏం మాట్లాడాలో తెలియక దిక్కులు చూస్తున్నాడు

''రండి కాఫీ తాగుదాం'' అన్నాడు మూర్తి

'' ఏం కాఫీ ఇదా ఛ ఇది ఈ కాఫీ తాగే టైం కాదురా పోదాం పదండి నవయుగకి ఇవ్వాళ ఖర్చంతా నాదే ప్రెసిడెంటుగారూ మీరు తప్పక రావాలి'' అన్నాడు గౌస్ బలవంతం చేస్తున్నట్టు

''ఇప్పుడు కాదులే మీరు పోయిరండి'' అన్నాడు అతను ఇరుకునపడ్డట్లు

''నమస్తే సార్ '' జోసఫ్ వచ్చి సైకిలు మీదనుండి దిగకుండానే అన్నాడు

''నమస్తే'' అన్నాడు ప్రసిడెంటు

''ఏందిరో, ప్రెసిడెంటుగార్ని కాకాపడుతున్నట్టున్నారు ఆయన మనమంటే దూరదూరంగా పోతున్నాడాయె ఆయన్ని ఇబ్బంది పెట్టమాకండి'' అన్నాడు నవ్వుతూ జోసఫ్

''ఎందుకు? ఎందుకు దూరదూరంగా పోవటం ఎందుకు?'' అన్నాడతను పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టు

''ఏముంది మాతో పనులు ఏమున్నాయి పోయినేడు దసరా మామూలు ఇస్తామన్నారు ఇవ్వలేదు సరే కానీయండి మాతోనూ పని పడక పోదు'' అన్నాడు ఎత్తిపొడుపుగా జోసఫ్

''ఏవయ్యా జోసఫ్ దసరా మామూలని ప్రత్యేకంగా ఇవ్వకపోయినా ఎన్నివందలు ఇచ్చి వుంటాను అంత ఇదిగా మాట్లాడకూడదయ్యా'' అన్నాడు కొద్దిగా నిష్ఠూరంగా

'' ఇవ్వలేదని ఎవరన్నారు సార్ తిని తినలేదని, విశ్వాసం లేకుండా మాట్లాడేవాళ్ళం కాదుసార్ మీరు స్టేషనుకి ఏ పనిమీద వచ్చినా, మీ పని చేసిపెట్టకుండా పంపామా? మీరిన్ని ఇచ్చినా దసరాపేరుతో ఏమిచ్చారు మీ వూరోళ్ళు కనపడి,'ఏమయ్యా, మా ప్రెసిడెంటు ఏమిచ్చాడు మీకు దసరా మామూలు, ఆయనంటే అంత కలవరిస్తారు' అన్నారు మేం నోరు మూసుకోవాల్సి వచ్చింది''

అతను నవ్వుతూ మాట్లాడకుండా నిలబడ్డాడు

''నేను అయ్యగార్ని పార్టీకి రమ్మంటున్నారా '' అన్నాడు గౌసు జోసఫ్‌వైపు చూస్తూ

''పద తీసుకుపోదాం పాపం ఆయన చాలాసార్లు మనకి పార్టీ ఇచ్చాడు మనమివ్వాళ ఇవ్వాల్సిందే, ఆయన దసరా మామూలు ఇవ్వకపోయినా ఇక్కడే వుండండి మీరు, డబ్బులు తెస్తా'' అని ముందుకు కదలబోయాడు జోసఫ్

''కాదు నువ్వుండరా జోసఫ్ నేనిప్పిస్తా ఈపూట పదండి ప్రెసిడెంటుగారు'' అన్నాడు మూర్తి

''మీరు బయలుదేరాలి మా ఆనందంలో పాలుపంచుకోవాలి'' అన్నాడు గౌసు

''అయ్యగారికి రిషా పిలవండిరా'' అని అటు తిరిగి, ''అరే రిషా'' అని చిన్నగా కేకేశాడు మూర్తి

''వద్దు, వద్దులే'' ప్రెసిడెంటు కంగారుగా అన్నాడు ''నాకు కాస్త పనుంది ఆసుపత్రిలో మీరు పోయిరండి ఇదిగో ఇది వుంచండి'' అంటూ జేబులోంచి వందరూపాయల నోటుతీసి జోసఫ్ చేతిలో పెట్టాడు

''ఛ మీ దగ్గరా?! మీరు రాకుండానా మర్యాదకాదు బాగుండదు చూసేవాళ్ళు కూడా ఏమనుకుంటారు'' అన్నాడు జోసఫ్ నోటు తీసుకుంటూనే

''ఏం ఫరవాలేదు నేనొస్తా ఈసారి మళ్ళీ కలుసుకుందాం ఆసుపత్రిలో మావాళ్ళు నాకోసం ఎదురు చూస్తుంటారు'' అని గౌసు వైపు తిరిగి ''గౌసూ, ఆ విషయం తరువాత మాట్లాడుకుందాంలే'' అని అతను కదిలిపోయాడు కంగారుగా

అప్పటి వరకూ మనస్సుల్లో నవ్వుకుంటున్న వాళ్ళు పైకే నవ్వారు ఫక్కున

''పిచ్చినాకొడుకులు'' అన్నాడు జోసఫ్

''మొన్న ఈడు బుల్లన్న కంపెనీకి పోయాడంటరా అది లేదూ . ఆ నత్తిది, ఈడిని సుబ్రంగా క్షౌరం చేసింది నేను పోయినప్పుడు నాకు చెప్పి ఒకటే నవ్వు అదే అస్త్రం ప్రయోగించి, 'మిమ్మల్ని కలవరిస్తోంది ఒకసారి పోయి రండి' అన్నా నా కొడుక్కి కిందపడినంత పని అయ్యింది'' అన్నాడు గౌసు

''సరేలే పదండి ఇట్టాంటోళ్ళుంటేనే మనకి రోజులు గడిచేది పదండి పెందలాడే ఇల్లు చేరదాం, ఒక చుక్కేసుకుని'' అన్నాడు మూర్తి

ముగ్గురూ బార్‌లోకి వెళ్ళారు మొదటి రౌండు పూర్తయిన ఒక పావుగంటకల్లా నిషా వాళ్ళని ఆవరించింది రైటరుతో మొదలుపెట్టి డి యస్పీ, యస్పీలతో సహా ఎవరినీ వదిలి పెట్టకుండా పేరుపేరునా తిట్టారు మధ్యమధ్యలో ఒకరిద్దరు సార్జెన్లనుకూడా వాళ్ళు వదిలి పెట్టలేదు మందు తలకెక్కేకొందీ బూతులు మితిమీరాయి అక్కడికొచ్చిన క్లీనర్ కుర్రోడిని చెయ్యి పట్టుకొని నిలబెట్టాడు పోకుండా గౌస్ ''ఏరా నీకు పిల్ల కావాలా?'' అన్నాడు అతనేమీ మాట్లాడలేదు చెయ్యి వదిలించుకోబోయాడు

''ఏయ్ నాకు తెలుసులే మా డి యస్పీ కూతురుంది లంజ, బన్నులాగా జమ్మగా వుంటది ఇంగ్లీషు అమ్మగార్లస్కూల్లో చదువుతోంది యస్సెస్సెల్సీ ఒక తగులు తగిలావంటే నీ పంట పండిందే '' అన్నాడు గౌసు

''దాన్ని నా కొదిలెయ్ గురూ '' అన్నాడు జోసఫ్ ''దానికి కడుపుచేసి, దాని బాబుకి పీ సీ గాడి తడాఖా ఏందో చూపిస్తా పీ సీ అంటే గౌరవించేలాగా చేస్తా'' ముద్దగా వస్తున్నాయి మాటలు

''అరే ఆ పిల్ల ఏంచేసిందిలేరా మనల్ని చేతయితే దానమ్మనీ '' మధ్యలో కలుగజేసుకుని మాట్లాడబోయాడు మూర్తి

కాని అతని మాటలు పూర్తికాకముందే జోసఫ్ అందుకున్నాడు కోపంగా ''నువ్వు నోరుముయ్యరా ఎదవనాకొడకా నీయమ్మ, ఏందిరా నువ్వనేది చేతనయితే అంటే, నీ ఉద్దేశ్యం మేము చేతకానోళ్ళమనా గొంతుముడి కొరికి, ఇదిగో ఈ ఫ్రైతో పాటు నమిలేస్తా నా కొడకా ఆ పిల్లలంజని ఎనకేసుకొస్తన్నావు అది మన ఆర్డర్లీలని ఎంత నీశంగా మాట్లాడిద్దో తెలుసంట్రా ధాని అమ్మా, బాబు కన్నా ఈ లంజ పెత్తనాన్ని ఆళ్ళు తట్టుకోలేక పోతున్నామని ఓ రోజు మనకు సెప్పారు ఆళ్ళు గుర్తుందా ఎవుడిట్టాన్ని బట్టి, ఎవుడి ఓపికని బట్టి వాడు ఏపని చేసినా, అందరం పీసీలమే అందరం ఎర్రబుట్టోళ్ళమే అందరం నల్లబూటోళ్ళమే ఆళ్ళని, అంత వయసోళ్ళని పట్టుకొని, అది, అరే ఒరే అంటంటే ఆ లంజాకొడుకు మురిసిపోతాడంట కూతుర్ని ఐ పీ యస్ చేపిత్తాడంట మన బోటోళ్ళు జనాల నోళ్ళు కొట్టి సంపాదించిపెడితే తిని, సదివి, రేపు ఐ పీ యస్‌లూ, ఐ ఏ యస్‌లూ అయి మనమీదే స్వారీ చేత్తార్రా ఈ లంజాకొడుకులు నాకొడుకుల్ని కత్తికొక కండజేసినా పాపం లేదు మనోళ్ల పిల్లలకి సరిగ్గా హైస్కూలు దాకన్నా సెప్పించుకునే స్తోమతుందా! మనమంటే మన సంగతి తీసెయ్ మనం సీమూ, నెత్తురూ లేనోళ్ళం సిగ్గు లేనోళ్ళం ఏదో నోళ్ళు కొట్టి సంపాయించుకుంటున్నాం ఆ ఆల్సేసియన్ కుక్కలకి ఒక కండ పడేసి, ఒక బొమికి మనం నములుతున్నామనుకో మిగిలినోళ్ళ సంగతేంది ఆ ప్రకాశం లాంటోళ్ళ సంగతి ''

డోసెక్కువయిపోయింది మాటలు వడిగా దూకుతున్నయ్ కొద్ది సేపటికి ఏం తింటు న్నారో, ఏం తాగుతున్నారో తెలియని స్థితిలోకి వెళ్ళిపోయారు మూర్తి చిన్నగా ఏడవటం మొదలెట్టాడు కడుపులోని కక్షంతా తీరిందాకా ఆఫీసర్లని తిట్టారు తూలుతూ బయటకొచ్చి, సైకిళ్ళు అక్కడే వుంచి, రిక్షా లెక్కారు అలవాటుగా సైకిళ్ళు లోపల పెట్టించాడు బార్ యజమాని

తెల్లవారింది ఉదయం పది గంటలకల్లా స్టేషను కొచ్చారు ''రాత్రి మందెక్కువయ్యిందిరా'' అన్నాడు జోసఫ్, కాసేపు ఆమాటా ఈమాట మాట్లాడిన తరువాత

''అది సరేలేకానీ, నిన్న వాడు హోంగార్డు డి యస్పీ గాడి జేబుకొట్టిందెవరో కనుక్కోకపోతే మన వ్యవహారం దెబ్బ తింటుంది మనం బస్టాండు దగ్గరకు పోదాం పదండి'' అన్నాడు గౌసు

''అవునవును పోదాం పదండి రెండు స్టోర్లోడికి ఒకసారి కనపడి పోతే మనం ఎక్కడికి పోయినా బాధలేదు'' అన్నాడు జోసఫ్ ముగ్గురూ యస్సై గదిలోకి వెళ్ళి సెల్యూట్స్ చేసి నిలబడ్డారు

ఏమిటన్నట్లు చూశాడు అతను

''నిన్న అదే హోంగార్డు డీ యస్పీగారి దగ్గర పిక్‌పాకెట్ చేశాడు కదా సార్ ''

''వాడెవడో దొరికాడా?''

''అది కాదు సార్ వాడెవడో తేలలేదు ఇంకా వాడి పనిలోనే బయలుదేరాం, తమరికి చెప్పి పోదామని''

''సరే పోండి వాడెవడో నా దగ్గరకు తీసుకురాండి''

సెల్యూట్లు చేసి బయటకు వచ్చారు వాళ్ళు సైకిళ్ళెక్కి బయలుదేరారు కొద్దిదూరం పోయేసరికి, ''అడుగో యర్రోడు'' అన్నాడు మూర్తి

''ఒరే ఒరేయ్'' కేకేశాడు గౌసు పెద్దగా అతను వచ్చాడు అందరికీ దండం పెట్టాడు

వినయంగా చేతులెత్తి

''ఏరా, నిజం చెప్పు నాకొడక బొమికలు ఏరతా నిన్న బస్టాండ్లో పి యస్పీ జేబు కొట్టిందెవరు?'' అన్నాడు జోసఫ్

అతను ఆ మాటకు భయంగా చూశాడు

''ఏం మాట్లాడవు? చెప్పు'' అని సైకిలు దిగి, చప్పున లాఠీ లాగాడు మూర్తి సైకిలు క్యారేజీలోంచి

''సార్'' గజగజ వణికాడు అతను ''రవణ సార్'' అన్నాడు

''రమణా? ఏ రమణరా?'' రమణెవరో పిక్‌పాకెటర్స్ లిస్టు గుర్తుచేసుకుంటూ అన్నాడు జోసఫ్

''రమణ సార్ ఆ నల్లపోలీసు జమానుగారబ్బాయి అప్పుడొకసారి ఒకమ్మాయిని గొడవచేస్తే తీసుకొచ్చారే, అతను''

''ఒహో వాడా? వాడెప్పటినుండి మొదలుపెట్టాడు?''

''ఏమో సార్ నిన్న చూశా బస్టాండులో''

''అతనయ్యా! ఆ రిటైర్డ్ కానిస్టేబులు నల్లకృష్ణమూర్తి లేడూ అతని కొడుకు వాడికి పెద్ద వయస్సు కూడా లేదు ఇంకా పసోడే ఒకసారి తెచ్చాం గుర్తుందా?'' అన్నాడు మిగతావాళ్ళతో జోసఫ్

''ఒహో అతనా ఔనౌను వాళ్ళుండేది కోమల టాకీసు ఎనకాల శ్మశానం కాడ కదా అయితే పదండి వాడు పసోడేగానీ చేసే పనులు మాత్రం పెద్దయ్యి'' అన్నాడు మూర్తి ముందుకు కదుల్తూ

''మరి నువ్వెందుకొచ్చి చెప్పలేదురా దొంగ నాకొడకా?'' అన్నాడు గౌసు

''నేనొచ్చా సార్ నిన్నసాయంత్రం మీరెవరూ కనపడలేదు''

''ఇప్పుడెక్కడికి బయలుదేరావ్ బస్టాండుకేనా?'' సైకిళ్ళెక్కు ...

''బుడ్డాగాడి పెళ్ళాం చచ్చిపోయిందంట సార్ ఆసుపత్రిలో ఆడకే''

ముగ్గురూ ఆగిపోయారు

''ఎందుకురా?''

ఏందో సార్ నాకు తెలవదు జబ్బుచేస్తే లోకనాదం డాక్టరుగారి ఆసుపత్రిలో చేర్పించాడంట మందులు అయ్యా తేలేక పోయాడంట నాకూ సరీగా తెలవదు సార్'' అన్నాడు అతను

వాళ్ళు ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకున్నారు ఏదో బాధ వాళ్ళని ఆవరించింది

''ఆరోజు వాడు బ్రతిమలాడాడు కూడా'' అన్నాడు జోసఫ్ బాధగా

''అందులో మన తప్పేముంది వాడెప్పుడూ అబద్ధాలే చెబుతుంటాడని మనం అంతవరకే ఇచ్చాం లేకపోతే ఇంకొక పాతిక యిద్యొకపోయామా? అయినా ఆ అమ్మాయికి అంతవరకే రాశాడు దేముడు పోదాం పదండి'' అంటూ ముందుకు కదిలాడు మూర్తి అలా అనుకున్నారేకాని వాళ్ళ మనసులు గిలగిలలాడాయి చాలాసేపు

చాలాసేపు వాళ్ళేమీ మాట్లాడుకోలేదు కోమల టాకీసు వెనక్కు వెళ్ళి, రిటైర్డ్ కానిస్టేబులు ఇంటిముందు నిలబడి కేకేశారు ఒకతను బయటకొచ్చి చూశాడు ''ఆఁ రండి రండి ఏందిటొచ్చారు రండి'' అన్నాడు, ఇంటిముందు నిలబెట్టిన నులకమంచం వాలుస్తూ మా సిని గడ్డంతో చిరిగిన లుంగీ కట్టుకుని వున్నాడు జంధ్యం పోగులు వున్నయ్ వట్టొంటి మీద

''రావాల్సొచ్చింది'' అంటూ జోసఫ్ ఆ కుక్కిమంచం మీద కూర్చున్నాడు
''నీ కొడుకున్నాడా?'' అడిగాడు గౌసు
''ఎవరు పెద్దబ్బాయా, చిన్నోడా?'' అన్నాడు కృష్ణమూర్తి ఆతృతగా
''పెద్దబ్బాయే అప్పుడొక పిల్లని గోలచేశాడు చూడు అతనే''
''ఉన్నాడు లోపల ఏం జరిగింది? అసలేమైంది?'' కంగారుగా అడిగాడు అతను
''ఏమీ లేదులే, కాస్త బయటకు పిలువు నువ్వు ముప్పై సంవత్సరాలు సర్వీసు చేసినా నిప్పులాగా చేశావు నీ కొడుకేందయ్యా ఇట్లా తయారయ్యాడు'' అన్నాడు జోసఫ్
అతను వెనక్కు తిరిగి, ''ఒరే శర్మా ఇటురా'' అని కంగారుగా కేకేసి, ''ఏమయ్యింది చెప్పండి మళ్ళీ ఏమన్నా గొడవచేశాడా?'' అన్నాడు
ఆ కుర్రవాడు లోపల్నుండి బయటకొచ్చి నేలచూపులు చూస్తూ నిలబడ్డాడు
''వుండు, మనోడే చెప్తాడు'' అని అతనివైపు తిరిగి, ''ఏమోయ్, ఏంది నీ సంగతి మీనాన్న అడుగుతున్నాడు చెప్పు ఏంది మాట్లాడవ్ నీ పేరు రమణేకదా?'' అన్నాడు జోసఫ్ అతని వైపు ఉరిమిచూస్తూ
కృష్ణమూర్తి భార్యా, చిన్నకొడుకూ, కూతురూ బయటకొచ్చి నిలబడి, భయంగా ఆశ్చర్యంగా చూస్తున్నారు
''అయ్యా జోసఫ్ ఏమయ్యిందో చెప్పు నా కసలే వంట్లో బాగాలేదు గుండె బలహీనంగా వుంది'' అన్నాడు అతను కంగారుగా
''ఏం కాలేదు నువ్వేమీ కంగారు పడమాక నిన్న నీకొడుకు బస్టాండులో ఒకతని జేబు కొట్టాడు''
''ఏరా?'' కృష్ణమూర్తి కొడుకువైపు తిరిగి పళ్ళునూరుతూ, కొట్టటానికి చేయెత్తి మీదికెళ్ళాడు
''ఎప్పుడూ! అన్నీ అబద్ధాలే'' అన్నాడు ఆ కుర్రోడు చేతిని అడ్డుపెట్టుకుంటూ
''నోర్ముయ్ ఇంకా మాట్లాడుతున్నావ్ దొంగనాకొడకా నా కడుపున మీరంతా చెడబుట్టారు అయ్యా జోసఫ్, మీ యిష్టం మీరేం చేసినా నాకు బాధలేదు వాళ్ళు చచ్చినా దిగుల్లేదు చేసినంతకాలం చేశాను పందుల్ని మేపినట్లు మేపాను ఇంక చాతకాదు చాతనయినంత వరకు చదువు చెప్పించాను నాకొచ్చిన గ్రాడ్యుటీతో ఆ పెద్దపిల్ల పెళ్ళి చేశాను ఈడు గాడిద పెరిగినట్టు పెరిగాడు పనీపాట చేతకాదు అయినా భరించాను ఇంక చాతకాదు నేను వీళ్ళతో వేగలేను నాకు సహనం పూర్తిగా చచ్చింది ఈ వయస్సులో తల్లిదండ్రులకు కాస్త చేదోడు వాదోడుగా ఉండకపోగా, ఈ అపనిందలూ, ఈ అవమానం ఫలానా పోలీసాయన కొడుకు ఇట్లాంటి వాడంటే నేను తలెత్తుకు తిరగలేను మీ యిష్టం'' అన్నాడు అతను బాధగా
''వూరుకోండి పిల్లల్ని కన్నారుకానీ వాళ్ళ జాతకాల్ని కనలేదుగా'' అని ఆ కుర్రవాడి వైపు తిరిగి, ''అబ్బాయ్ పోయి ఆ డబ్బులు తెచ్చియ్యి, ఎక్కడ పెట్టావో ఈ సారికి వదిలి పెడుతున్నాం'' అన్నాడు గౌస్
ఆ మాటవిని ఆయన కొడుకుతో, ''ఏరా, కదలవేరా ? దొంగలంజాకొడక ఎక్కడ పెట్టావ్ ఆ పాడుబుద్ధి నీకెందుకు పుట్టిందిరా నా కొంపకు రావద్దు ఎక్కడుంటావో, ఎక్కడ చస్తావో నా కనవసరం ముందు ఆ డబ్బులు తెచ్చివ్వు'' అని కొడుకు మీద చిందులు తొక్కాడు కృష్ణమూర్తి

తిరిగి జోసఫ్ వైపు చూస్తూ ''అయ్యా, ఎంత?'' అన్నాడు

''ఆరొందల చిల్లర''

''హమ్మా '' గుండెలు కొట్టుకున్నాడు కృష్ణమూర్తి ''ఆ వ్యక్తి ఎంత బాధపడుతున్నాడో కదా! దేవుడా! ఎంతపని చేయించావురా ఫో నాకొడకా పోయి ఎక్కడ పెట్టావో తెచ్చియ్యి ఫో'' ఛళ్ళున కొట్టాడు చెంపమీద

''మీరూరుకోండి అదంతా మేము చూస్తాం'' అన్నాడు జోసఫ్

''చెక్క పెట్టెలో పెట్టా'' అన్నాడు ఆ కుర్రవాడు చెంప పట్టుకొని అతని కళ్ళల్లో నీళ్ళు వూరాయి అతనివంక పరిశీలనగా చూశాడు జోసఫ్ పదహారూ, పదిహేడేళ్ళుంటాయ్ తెల్లఖద్దరు చొక్కా అరచేతులిది కాకీ నిక్కరు పసితనం ఇంకా కొట్టొచ్చినట్టు కనపడుతోంది ముఖంలో అతన్ని చూస్తుంటే 'అంతంత పనులు చేయగలడా?' అనిపిస్తోంది వాళ్ళకు

''పో ఎక్కడ పెట్టావో తెచ్చియ్యి'' అన్నాడు కృష్ణమూర్తి పళ్ళు పటపట కొరుకుతూ మళ్ళీ

ఆ కుర్రవాడు ఇంటిలోకెళ్ళి డబ్బులు తీసుకొచ్చి ఇచ్చాడు తీసుకున్నాడు జోసఫ్

''అబ్బాయ్ నీకిది ఆఖరు వార్నింగ్ తోటి కానిస్టేబులు కొడుకువనే గౌరవంతో నిన్నీసారికి వదిలి పెడుతున్నాం మేం దేవుడ్నికూడా వదలం కావాలంటే మీ నాన్నని అడుగు ఇంకోసారి నువ్విట్లాంటి పనిచేస్తే నువ్వింక ఖండమై పోయినట్లే మీ నాన్నేమో నిప్పులాగా ''

అతని మాటలు పూర్తి కాకముందే కృష్ణమూర్తి అందుకున్నాడు ''ఆ నిప్పు, నా బొంద ఎవడికి మేలు చేయటానికి అసలానాడే ఈ దరిద్రపు నౌకర్లో చేరకుండా ఏ అర్చక వృత్తో చేసుకునుంటే పిల్లలకి తిండి దొరక్కపోయినా, బుద్ధి వక్రించకుండా వుండేది వుంటే తినేవాళ్ళు లేకుంటే లేదు ఈ నౌకరీ నన్నే కాకుండా నా కుటుంబాన్ని కూడా నాశనం చేసింది'' అన్నాడు బాధగా కోపంగా

ఆ మాటవిని వీళ్ళేమీ మాట్లాడలేదు ఇంక మాట్లాడటం కూడా అనవసరమనిపించింది ''సరే వస్తాం'' అన్నాడు జోసఫ్ సైకిల్ స్టాండు తీస్తూ

కృష్ణమూర్తి తలూపాడు ముగ్గురూ సైకిళ్ళు నడిపించుకుంటూ రోడ్డుదాకా వెళ్ళారు

''మరి బావకు సైకిలెట్లా కొనిపెడతా? సైకిలు కొనిపెట్టకపోతే అక్కయ్యని వదిలి పెడతాడుగా '' అంటున్నాడు ఆ కుర్రవాడు తల్లితో ఆ మాటలు వాళ్ళకు చూచాయిగా వినపడ్డయ్

ఆ మాటకు ఆ తల్లి మనస్సు ఆర్ద్రతతో నిండిపోయింది బాధగా కొడుకుని అక్కున చేర్చుకుంది ''అయితే దొంగతనం చేస్తావుట్రా '' అంటున్నాడు కృష్ణమూర్తి బాధగా

రోడ్డుమీదకొచ్చి వాళ్ళు ముగ్గురూ ముఖముఖాలు చూసుకొని సైకిళ్ళెక్కారు

''ఆ అమ్మాయిని ఎక్కడో చూచిన గుర్తు'' అన్నాడు గౌసు సైకిలు తొక్కుతూ

''ఓసారి బ్రోతల్ రేడ్‌లో పట్టుకొచ్చాం'' అన్నాడు జోసఫ్

''ఛ నిజంగానా ? దీనమ్మ బతుకుని కానిస్టేబులు కడుపున పుట్టి ''

''కానిస్టేబులులేదూ, కలెక్టరూ లేదు ఏం చేస్తారు పరిస్థితులట్లాగొస్తే చూడరాదూ, వూరిబయట, శ్మశానానికెదురుగా పదికో, పాతిక్కో ఆ వూరి కొంపలో అద్దెకుండే పరిస్థితి ఎందుకొచ్చిందో ఆలోచించు రిటైరయినాక వచ్చిన ఆ నాలుగు డబ్బుల్తో పెద్దపిల్ల పెండ్లి చేసేసరికి నడుములు విరిగాయి ఇంక మిగిలినోళ్ళ గతేంది ? ఎవరైనా అంతే ఆడు పెద్దోడికి చదువు

అబ్బులయ ... ..బుద్ది? మన పిల్లలకు తండ్రులుగా మన భయం ఏం వుంటది? మనం కొంపల్లో వుండటానికి ఎంతవరకు వీలయ్యిద్ది ఆడోళ్ళు పిల్లల్ని ఎంతవరకు కంట్రోలు చేస్తారు?''

''అంతే అంతే'' అన్నాడు గౌస్

''సరేలే గాని ఈ డబ్బుల్లో బుడ్డాగాడికి ఏదన్నా ఇద్దాం పాపం'' అన్నాడు మూర్తి

జోసఫ్ జేబులోంచి వందరూపాయలు తీసి ఇచ్చాడు ''పోనీలే వాడి కష్టార్జితం మనం ... ... తినేదు ఇచ్చిరాపో'' అన్నాడు

తరువాత కొద్దిసేపటికి వాళ్ళు స్టేషను కొచ్చారు దారిలోనే ముగ్గురూ ఆ మిగిలిన డబ్బుల్ని పంచుకున్నారు యస్సై ఫోన్లో డి యస్పీతో మాట్లాడుతున్నాడు వాళ్ళు సెక్షన్ ...ల్లదగ్గరకెళ్ళి నిలబడ్డారు

చూడు లక్షణరావ్, నేను డి యస్పీనీ మాట్లాడుతున్నా '' ఫోనులో డి యస్పీ గొంతు ...సిపించింది

''నమస్కారం సార్ చెప్పండి సార్ '' అన్నాడు యస్సై

''నువ్వు స్పెషల్ రిపోర్టు రాసిచ్చావే, వాడొచ్చి సరిగా నెలరోజులు కూడా కాలేదంట కదయ్యా''

''ఔను సార్ వాడిపేరు ప్రకాశం సార్ అయినా వాడు డేంజరస్ ఫెలో సార్ ''

''క్రైం మీటింగులో యస్పీ ఒప్పుకోలేదు రెండు మూడు నెలల్లో రైల్వేకి కొంతమందిని పంపించటానికి చూస్తున్నారంట వాడి నెంబరివ్వు అప్పుడు''

''అలాగే సార్ కాని అప్పటిదాకా వాడితో వేగటం చాలా కష్టం సార్ పెద్దతలనొప్పిగా తయారయ్యాడు సార్ ప్రతిదానికీ వాడితో పేచీగా వుంది సార్ ''

''నిజమే ఈ యస్పీ డియస్పీల మాటల్ని పెద్దగా ఖాతరు చెయ్యడు లోయర్ కేడర్‌మీద సానుభూతి చూపించబోతాడు అదే పోయినోడయితే, అతను డైరెక్ట్ ఐ పి యస్ అయిన డి యస్పీలు ఎంత చెబితే అంత అతని హయాంలో మన సబ్‌డివిజన్ నుండి షుమారు పదిహేను ...ందిని దాకా లేపాం అతని దగ్గరసలు స్పెషల్ రిపోర్టు కూడా అక్కరలేదు నోటిమాట చెపితే చాలు, ట్రాన్స్‌ఫర్ వీడట్లా కాదు పైగా తింటం ఏమీ తక్కువలేదు పోనీ వీడేమన్నా రిజర్వేషను కాండేటా అంటే అదీకాదూ సరే అప్పటిదాకా వాడిని ఏ ఐ డీ పార్టీలోనో వెయ్యి పదిరూపాయలు వచ్చే పరిస్థితి వుంటే వాడే నోరుమూసుకుని పడుంటాడు ''

''అదే చేస్తా సార్ ఇక ఈ నాలుగురోజులపాటు వాడికి ఐ డీ పార్టీ వేస్తా 'మొరిగేకుక్కకొక మాంసపుకండ' సిద్ధాంతాన్ని ప్రయోగిస్తా సార్''

''వాడెక్కడా డ్యూటీలో దొరకడంటావా?

''చాలా పెర్ఫెక్ట్ సార్ వాడు''

''సరేకానీయ్ చూద్దాం''

''నమస్కారం సార్ '' ఫోను పెట్టేసి ఆలోచనల్లో పడ్డాడు యస్సై అతని ఆలోచనలలో ప్రకాశం సుడులు తిరుగుతున్నాడు చాలా మంది ఆఫీసర్లలాగానే, అతను కూడా ప్రకాశాన్ని గురించి వాళ్ళూ, వీళ్ళూ చెప్పింది వినే ఒక నిర్ణయానికొచ్చాడుగానీ, తన స్వంత వ్యక్తిత్వంతో పరిశీలించి, ...టూ ఒక నిర్ణయానికి రాలేదు అతనికున్న శత్రువులలో ప్రకాశం ప్రధముడుగా కనిపించాడు ... చెప్పె డ్యూటీలు నోరుమూసుకుని చేసేవాడయితే పేచీలేదు కాని అంతా రూలు ప్రకారం జరగాలనే ఇతని పద్ధతికి యస్సై బెంబేలెత్తాడు ఇంకో ఇద్దరు పీసీలు ప్రకాశంలాగా తయారయితే

ఇక ఈ స్టేషన్లోని వాళ్ళచేత ఉద్యోగాలు చేయించినట్టే 'కనుక వాడిని వీలయినంత త్వరలో ఇక్కడినుండి తొలగించాలి ఇలాటప్పుడు పరమౌషధంగా పనికివచ్చే స్పెషల్ రిపోర్టు ఇప్పుడు పనిచేయలేదు అతనొచ్చి తక్కువరోజులే కావటం వలన యస్పీ ఒప్పుకోలేదు రైల్వేకి అతని నెంబరు ఇచ్చిందాకా అతన్ని ఎలా కలుపుకుపోవాలి? ' ఆలోచనలు అలా యస్సై బుర్రలో సాగుతున్న సమయంలోనే, స్టేషన్ బయట టీ కొట్లో టీ తాగుతూ ప్రకాశమూ, ఆంజనేయులూ ఇంకో ఇద్దరు రిక్రూట్ పీసీలు తమ సమస్యల్నీ, కష్టాల్ని గురించి మాట్లాడుకుంటున్నారు

''మొన్న పి యమ్‌కు (పోస్టుమార్టంకు) ఆ దిక్కులేని బాడీని తీసుకెళ్ళాను [illegible] దానిలో 'కంటింజెంటు బిల్లు' రాయండి సార్ అని రైటర్ని ఎన్నిసార్లడిగినా ఇంతవరకు రాయలేదు'' అన్నాడు ఆంజనేయులు

ప్రకాశం ఆ మాటకు నవ్వి వూరుకున్నాడు

''చూడండి సార్ అంత కష్టపడీ, జేబులో డబ్బులు ఖర్చుపెట్టుకున్నాను కదా కంటింజెంటు బిల్లు ఎందుకు రాయడు ? ఆయనకి బాధ్యత లేదా ? ఇదే విషయాన్ని యస్పీదొరకు పిటీషను పెడితే ఏమయిద్ది?''

''ఏమీకాదు ఏమయ్యిద్ది ? 'రాస్తున్నాను సార్, రాసి పంపిస్తాను సార్' అంటాడు, నీ పిటీషను ఇనస్పెక్టరు దగ్గరకు వచ్చినప్పుడు తరువాత అంతా మామూలే అది మనసులో వుంచుకుంటాడు నువ్వింత చిన్న విషయానికే రైటరు మీద పిటీషను పెట్టావు కాబట్టి ఆఫీసర్ల దృష్టిలో డేంజరస్ మనిషివి డ్యూటీల్లో సఫర్ చేస్తారు ఇట్లాంటివి ఎన్నో అంతంతమాత్రపు వాళ్ళు ఆ బాధల్ని తట్టుకోలేరు ఎంతసేపూ యస్సై మొదలుకొని యస్పీదాకా మనం వాళ్ళ కాళ్ళకు మొక్కుతూ ఇంద్రుడనీ, చంద్రుడనీ, వాళ్ళుచేసే అన్ని పనులకు మనం శెభాష్ అని తలూపుతూ, వాళ్ళు మన భుజాలమీద ఎక్కి వూరేగుతామంటే, సంతోషంతో మన జన్మ ధన్యమైనట్టు ఫోజుపెడుతూ ఒప్పుకొని తిప్పితే, వాళ్ళకుక్కల దగ్గరనుండి పిల్లలదాకా అన్నిటినీ, అందరినీ మీదెక్కించుకొని, సవారీ చేయించుకుంటూ గడిపితేనే ఇందులో నాలుగురోజుల పాటు ఉండగలుగుతాం ఒకచోట''

''స్టేషన్లో మన కళ్ళముందు జరిగే పనులూ, వినపడే మాటలూ జరగట్లేదనీ, వినపడటం లేదనీ అనుకోవాలి హృదయాన్ని రాయి చేసుకోగలిగిన వాళ్ళూ, ఆత్మ గౌరవాన్ని అవతల పెట్టగలిగినవాళ్ళే రోజుల్ని దొర్లించగలుగుతారు అంతేగాని, నాలాగా మాట్లాడేవాళ్ళు రోజుకో స్టేషన్, ఇంక్రిమెంట్లు కట్ నాకు ఇంచుమించు పాతిక సంవత్సరాలు సర్వీసుంది ఎనిమిదిసార్లు ఇంక్రిమెంట్లు కట్టయ్యాయి దగ్గర దగ్గర ఇరవై స్టేషన్లు చేశా. ఎవరూ అన్ని స్టేషన్లు చేయరు ఒకే ఒక్క స్టేషన్లో మాత్రం రెండున్నర ఏళ్ళున్నా అదీ ఆ యస్సై గారి వల్ల ఆయన తన సర్వీసులో ఎవరిమీదా స్పెషల్ రిపోర్టులు రాయటంగానీ, కడుపు కొడతంగానీ చెయ్యలా పైగా డైరెక్ట్ యస్సై తనది తను తీసుకునేవాడు మెన్‌ది మెన్‌కి ఇచ్చేవాడు ఆఫీసర్లది ఆఫీసర్లకు ముట్టజెప్పేవాడు అందరికీ సమానంగా డ్యూటీలు చెప్పేవాడు ఆర్డర్లీని పెట్టుకోవటం అతనెరుగడు ఎవరైనా మెన్ వీక్లీ ఆఫ్ అడిగితే వెంటనే ఇచ్చేవాడు కష్టం సుఖం, మంచీ చెడూ తెలిసినవాడు పైగా అగ్రకులస్థుడు తనకెంత రావాలో అంత వరకే ఆలోచించే ఆఫీసరుతో ఎప్పుడూ పేచీలు రావు ఉద్యోగాన్ని అడ్డం పెట్టుకొని దేశాన్ని దోచుకోవాలనుకునే వాళ్ళు వాళ్ళ స్వార్థం కోసం ఎన్నో [illegible] పాపాలకయినా ఒడిగడతారు లెక్క ప్రకారం హానెస్టుగా ఉద్యోగం చేసే ఆఫీసరు దగ్గర మెన్‌కి సుఖం అట్లాంటోళ్ళు నూటికి ఒకళ్ళు అసలట్లాంటి వాళ్ళని సి ఐ లూ, డి యస్పీలు వుంచరుగా

యస్పై అంటే తమకు సంపాదించి పెడుతూ వాడు కాస్త తినాలి ఇంక అక్కడ తప్ప మిగతా చోట్ల అంతా సంవత్సరం సంవత్సరంన్నర ఇంక్రిమెంట్లు కట్ అయిన అన్ని సందర్భాలలోనూ, నేను నా మనస్సాక్షిగా చెపుతున్నా, నేను చేసిన పొరపాటుగానీ, తప్పుగానీ ఒక్కటి కూడా లేదు''

''ఆఫీసర్ల దృష్టిలో నేను డేంజరస్ మనిషిని నాతో ఫ్రీగా మాట్లాడటానికే జంకుతారు దాన్ని కప్పిపుచ్చు కోవటానికి నన్ను భయపెడతారు నేను స్టాఫ్‌ని చెడగొడుతున్నానంటారు నాతో ఎవరన్నా మాట్లాడినా, అసలెవరుకూడా ఆఫీసర్లు చూస్తుండగా మాట్లాడరనుకో, ఎవడన్నా పొరపాటున మాట్లాడేరో, అది ఆఫీసర్ల దృష్టిలో పడిందో, వాడి వెంటపడతారు''

''మనం డ్యూటీల్లో ఎక్కడో ఒకచోట దొరక్కపోము ఎందుకంటే మిగిలిన డిపార్టుమెంట్లు లాగా ఉదయం పదింటికొచ్చి సాయంత్రం అయిదింటికి ఇళ్ళకుపోయే ఉద్యోగాలు కావు ఇవి మానవ శరీరాలు చెయ్యలేని విధంగా మన డ్యూటీలు వున్నయ్''

''ఏ పీ పి యమ్ అంటే తెలుసుగా ఆంధ్రప్రదేశ్ పోలీసు మాన్యువల్ దాన్ని అట్లా రాశారు దాన్ని మద్రాస్ పోలీసు మాన్యుల్ లోంచి ఎత్తిరాశారు ఆ మద్రాస్ పోలీసు మాన్యూల్ని ఎప్పుడో వంద ఏళ్ళక్రితం (బ్రిటీష్‌వాళ్ళు) రాశారు దానిలో మన వెల్ఫేర్ గురించి ఒక్క ఛాప్టరు కూడా లేదు ఆ మాన్యూల్లో, మన క్షేమం కోరుతూ ఒక్కమార్పు కూడా జరగలేదు ఇంతవరకు కాకపోతే యూనిఫారాల్లో, టోపీల్లో మార్పులొచ్చాయి ఈ పరిస్థితి మనదేశం మొత్తంమీద ఇలాగే వుండొచ్చనుకుంటా ఎక్కడన్నా ఏదన్నా మార్పువస్తే దాని ప్రభావం మనకూతగిలిద్ది కదా అన్ని రాష్ట్రాల్లోనూ ఇదే విధమైన మాన్యువల్ అంట కాకపోతే ఆయా రాష్ట్రాల పేర్లు ఆ మాన్యువల్‌ముందు చేర్చారు అంతే ఇది బ్రిటీష్‌వాడు దేశవ్యాప్తంగా అమలు చేసిన మాన్యూలేగా''

''మాటకు ముందు డిసిప్లైన్ ఈ డిసిప్లైన్ అనే నాలుగు అక్షరాలే మన బ్రతుకుల్ని ఇంత అధఃపాతాళానికీ, ఇంత భయానికీ లోనుచేస్తున్నాయి ఈ డిసిప్లైన్‌కి అర్థం 'క్రమశిక్షణ' అని అంటే పై అధికారి జారీచేసిన ఉత్తరువులను అమలుపరచటం కాని వాస్తవంలో ఈ డిసిప్లైన్ అనే మాట, మన వ్యక్తిగత జీవితాలమీద యమపాశంలా పనిచేస్తోంది మనల్ని పిరికి వాళ్ళుగా చేస్తోంది అన్యాయాన్ని గురించి, అంటే ఎవరికో జరిగిన అన్యాయం గురించి కాదు మనకు మన అధికార్ల నుండి జరుగుతున్న అన్యాయం నుండి మనల్ని మనం రక్షించుకోకుండా ఈ డిసిప్లైన్‌ని అడ్డుపెడుతున్నారు మనం మాట్లాడే ప్రతి మాటా ఇన్‌డిసిప్లైన్‌గా లెఖ్ఖకడుతున్నారు తద్వారా మన బ్రతుకుల్ని నాశనం చేస్తున్నారు మనల్ని ఒకళ్ళ నొకళ్ళు కలవకుండా, సమిష్టిగా మన సమస్యలకు పరిష్కారమార్గం చూసుకోకుండా ఎప్పుడూ చెప్పుకింద అణిచిపెట్టి ఉంచుతున్నారు మనం ఏకం కాకుండా విభజించి పాలిస్తున్నారు మన జీవితాల్ని యంత్రాల లాగా, గానుగెద్దు బ్రతుకుల్లాగా మార్చేస్తున్నారు ప్రజలు మనల్ని చూచి, అంటే ఖాకీగుడ్డల్ని చూచి ఎంతో భయపడుతున్నారేకాని, వాస్తవానికి ఈ ఖాకీగుడ్డల్లోని గుండెకాయలెంత పిరికివో వాళ్ళకు తెలియవు మరి ఈ జీవితాలకి విముక్తి ఎప్పుడో '' మాట్లాడటం ఆపి చిన్నగా నిట్టూర్చాడు ప్రకాశం

''అసలు విముక్తి వుంటుందో లేదో లేకపోతే ఇంతేనేమో '' అన్నాడు ఆంజనేయులు

''తప్పకుండా వుంటుందనే నేనను కుంటున్నాను '' అన్నాడు ప్రకాశం ఆశగా

''సార్ ప్రకాశంగారూ మీ మాటకడ్డం వస్తున్నా మాకు ట్రైనింగు పిరీడ్‌లో ఏం చెప్పేవాళ్ళంటే, మేము ఆఫీసర్ల అనుగ్రహం సంపాదిస్తే చాలునట మా డ్యూటీలూ, మా ఫర్ఫెక్ట్‌నెస్ ఎవడికీ అఖ్ఖరలేదట అసలలాటి ఉద్దేశ్యంతో ఎవడన్నా వున్నాడంటే వాడొట్టి తెలివితక్కువ

వాడన్నమాటంట ఆఫీసర్లని మంచి చేసుకుంటే చాలు వాడి కింకేమీ ఢోకా ఉండదంట ఆఫీసర్లకు కోసమొచ్చి అమ్మలక్కలు తిట్టినా, పట్టించుకోకుండా వుంటే చాలట ఈ డిపార్టుమెంటులో ప్రతివాడూ తన పై వాడి అనుగ్రహం సంపాదిస్తే చాలు, ఇక వాడి బతుక్కి ఢోకా వుండదని చెప్పే వాళ్ళు ఇప్పుడు వాస్తవంలో కూడా అంతే కనపడుతోంది కానిస్టేబులూ హెడ్ కానిస్టేబులూ వీళ్ళంతా యస్సైతో, యస్సై సి ఐ తో, సి ఐ డి యస్పీతో, డి యస్పీ యస్పీతో, యస్పీ డి ఐ జీతో, డి ఐ జీ ఐ జీతో, ఐ జీ గవర్నమెంటుతో, అంటే మనం ఓట్లేసి ఎన్నుకునే ఏలుముద్దరగాళ్ళతో అన్నమాట ఇలాగంట ఇదీవరస ఈక్రమంలో పై వాడిముందు, వాడు అన్నివిధాలా వెధవైనా, వాడు పక్కలేసి ఆ స్థితి కొచ్చినా వాడిమాట శిరసావహించటమే వాడు వేపచెట్టుని పట్టుకొని మర్రిచెట్టంటే మనమంతా గొర్రెల్లాగా బుర్రలూపటమే ఔనన్నట్టు 'కాదుసార్, అది వేపచెట్టు సార్' అన్నామో మన ఖర్మ కాలిందే ఆ ఒక్క సూత్రం మీదనే మన బ్రతుకులు ఆధారపడ్డాయని, నాకు దీనిలో కొచ్చిన పదిరోజుల్లోనే తెలిసిపోయిందిసార్ మనం నాలుగు కాలాలపాటు కడుపులో నీళ్ళు కదలకుండా గడపాలంటే అదేమార్గం మనమేదో మనస్సాక్షి, ఆత్మ గౌరవంలాంటి పదాలని మరిచిపోలేకపోతే పెళ్ళాం పిల్లలకి పస్తులే'' అన్నాడు ఒక రిక్రూట్ పీసీ ఆవేశంగా అతని మాటల్ని జాగ్రత్తగా ఆలకించారు అంతా

ఆ మాటలకు ప్రకాశం నవ్వాడు

''ఎవరిష్టం వాళ్ళదిలే మనస్సుని చంపుకుని బ్రతకటం అంత తేలికయిన పనికాదు అలా బ్రతకాలనుకున్నవాడు అనుక్షణం మానసిక వేదనకు గురికావాల్సిందే తన కళ్ళముందు జరిగే ప్రతిపనినీ సహించటానికి ప్రయత్నం చేస్తుంటాడు కానీ సహించలేడు ఆ అన్యాయానికతను మానసికంగా బాధకు లోనవ్వాల్సిందే తనకోసం తన భార్యా బిడ్డలకోసం ఆఫీసర్లు చేస్తున్న అన్యాయాన్ని గుడ్లప్పగించి చూస్తుంటాడు అదేమని అడిగితే బ్రతుకు బుగ్గయిద్దని భయం కొద్ది సుఖం కోసం చేస్తున్న ప్రయత్నాలు ఇవన్నీ'' అన్నాడు ప్రకాశం

''అసలు ఆఫీసర్లకూ మనకు ఎటువంటి సంబంధాలుండాలంటారు?''

ఒక్కక్షణం తటపటాయించాడు ప్రకాశం ఆ మాటకు ''దీనికి నేను సరయిన సమాధానం చెప్పలేను సుబ్రహ్మణ్యం అంత ఆలోచన లేదు నాకు తెలిసినంతవరకూ మనదంతా ఒక కుటుంబం ఒక కుటుంబంలో ఎలాగయితే కుటుంబ పెద్ద, చిన్న వుంటారో వాళ్ళ మధ్య ఎలాటి సంబంధముంటుందో ఇక్కడకూడా అలాగే వుండాలని నా ఉద్దేశ్యం కాని ఇప్పుడిక్కడ వున్న సంబంధమేమిటో తెలుసా ? ఒక విలాసవంతుడయిన విటుడికీ, దరిద్రురాలయిన వేశ్యకి ఉండే సంబంధం ఎలాటిదో అలాటి సంబంధముంది ఇక్కడ మనం మన పెళ్ళాం పిల్లల కోసం, మన కడుపుల కోసం, ఆఫీసరు మనతో ఎలా ప్రవర్తిస్తున్నా లొంగి బాధతో అనుభవిస్తున్నాం వాడు మనల్ని తన అవసరం మేరకు వాడుకుంటున్నాడు అసలీ డిపార్టుమెంటు ఎవరికోసం ? ప్రజల కోసం ఈచట్టం ప్రజలకోసం కాని ఇక్కడ ఏదీ ప్రజల కోసం లాగా కనపడటం లేదు అంతా అధికార్లకోసం, అగ్రకుల రాజకీయ నాయకులకోసం, డబ్బు దండిగా వున్నవాళ్ళ కోసం కాదంటారా? అలా జరుగుతోంది ? మనల్ని యంత్రాల్లా, ప్రాణమున్న యంత్రాల్లా వాడుకుంటున్నారు బానిసయుగం నాటి బానిసలకూ మనకూ తేడా ఏముంది ? ఇంత కష్టపడుతున్నా మనల్ని గురించి 'సానుభూతి' గా ఆలోచించే మానవుడేడీ? అంతా డబ్బు మహిమని నేననుకుంటున్నా దానిచుట్టే అంతా తిరుగుతున్నాము మనల్నెంత కష్టపెట్టయినా, కన్నీరు

కార్పించయినా వాళ్ళ పనులు చేసుకుంటారు తరువాత మనకేమన్నా కష్టమొస్తే కన్నెత్తి చూడరు కనీసం వాళ్ళ కాళ్ళకు మొక్కే వాళ్ళను కూడా రక్షించరు''

''అవునులేండి ఎర్రబూట్లన్నీ ఒకటే వీటన్నిటికీ నల్లబూట్లంటే అసహ్యం మళ్ళీ ఆఫీసర్లు, వాళ్ళు ఏ కేడర్‌లో వున్నా పరస్పర సహాయ సహకారాలుంటాయ్ ఎటొచ్చీ కింద కేడర్ విషయంలోనే '' అన్నాడు సుబ్రమణ్యం

''మనం చేసేదేమో గాడిదకన్నా హీనమైన బానిస చాకిరి మనల్నేమో గౌరవంగా 'పోలీసాఫీసరు' అని పిలవాలంట చట్టప్రకారం'' అన్నాడు ఆంజనేయులు నవ్వుతూ

''అవునవును'' అన్నాడు సుబ్రమణ్యం

''వానపాముని పాము అనటం ఎలాగుందో, పోలీసు జవాన్ని పోలీసాఫీసరు అనటం అట్లాగుంది'' అన్నాడు ప్రకాశం ఎకసెక్కెంగా

''ఇదెప్పటికి బాగుపడిద్దో, ప్రజలకు నిజమైన సేవ ఎప్పుడు చేస్తామో'' అన్నాడు ఆంజనేయులు నీరసంగా

''ఏమో మేము బ్రిటీష్ వాళ్ళ హయాంలో చేరాము అందరనుకున్నట్లు వాళ్ళు మనదేశం నుండి వెళ్ళిపోతే ఈ డిపార్టుమెంటు బాగుపడుతుందనుకున్నాం ఈ డిపార్టుమెంటే కాదు, అసలు ఈ దేశమే మారిపోయిద్దనుకున్నాం కాని తెల్లోళ్ళు పోయాక మన కష్టాలింకా పెరిగాయే కాని, వీసమెత్తు తగ్గలేదు అదే వచ్చినమార్పు ధరలు పెరిగాయి దరిద్రం పెరిగింది ''

''ఏమండీ దీర్ఘంగా చర్చిస్తున్నారు అంతా '' అంటూ వచ్చాడు రిక్రూట్ పీసీ రామలింగం

''ఏముంది మన కష్టసుఖాలే అంతకుమించి ఇంకొక విషయం మాట్లాడుకునే తీరిక ఎక్కడుంది'' అన్నాడు సుబ్రహ్మణ్యం

''అమ్మో ఇదేం ఉద్యోగం సార్ ఏందో అనుకున్నాం ట్రైనింగులో వున్నప్పుడు ఇంటికి ఒక ఉత్తరం రాద్దామన్నా తీరిక దొరకటం లేదు పచ్చాపని తోమినట్టు తోముతున్నారు ఇంతదారుణం అనుకోలేదు'' అన్నాడు రామలింగం ఆశ్చర్యంగా

ప్రకాశం నవ్వాడు అతను ఆశ్చర్యంగా చెపుతుంటే

''సార్ ప్రొబేషను పిరీడయిపోయిన తరువాతన్నా మాకేమన్నా కాస్త రిలీఫ్, గాలి పీల్చుకోవటానికి వుంటుందా?''

''మమ్మల్ని చూస్తున్నావుగా ఇంక ప్రత్యేకంగా చెప్పేదేముంది'' అన్నాడు ప్రకాశం

''అవునవును సరేగాని మధ్యాహ్నం ఎవురికో జామీనిస్తే వాళ్ళో యాభై రూపాయలిచ్చారు రైటరుకి అతను అక్కడున్న స్టాఫందరికీ కాఫీలు తెప్పిచ్చాడు కాని నాకు తెప్పించలేదు కేవలం మేం రిక్రూట్లమనేగా అతని భావన కనీసం ముఖపరిచయమున్న వ్యక్తి కాఫీ తాగుతూ ఆఫర్ చేస్తాడే చదువుకునే రోజుల్లో సభ్యతా, సంస్కారం లాంటి వాటిగురించి ఎంతో గొప్పగా భావిస్తూ, స్నేహితులతో ఎలాతిరిగామో, ఇక్కడ వాస్తవంలో అవి అంత విరుద్ధంగా చూస్తున్నాం కనీసపు మర్యాదలన్నీ కూడా మరిచిపోయి బ్రతికేస్తున్నారు అది తోటి మానవుడికి ఎంతబాధ కలిగిస్తుందో ఆలోచించండి మనిషికీ మనిషికీ మధ్య డబ్బు తప్ప ఇంకోటి కనిపించటంలేదు ఎవరికీ'' అన్నాడు రామలింగం

''ఇప్పటి దాకా మేము అదే మాట్లాడుకుంటున్నాంరా జీవితాన్ని గురించి ఎన్ని కలలు కన్నాం సభ్యత, సంస్కారం, మానవత్వం గురించి ఎన్ని కబుర్లు చెప్పాం ఇప్పుడెలాంటి

పరిస్థితుల్లో జీవించాల్సి వస్తోంది నేను న్యూస్ పేపరు ముఖం చూచి ఇవ్వాళ్టికి రెండు వారాలు దాటింది అంటే మనం ట్రైనింగు నుండి వచ్చి రిపోర్టు చేశాం అది మొదలు ఇంతవరకు పేపరు చూళ్ళేదు కదా! ఈ రెండు వారాల్లో ప్రపంచంలో ఎన్ని మార్పులు జరిగాయో, ప్రపంచంలో ఏం జరుగుతుందో తెలియదు కదా కనీసం రేడియోలో వార్తలువినే టైం కూడా ఉండటం లేదు బావిలో కప్పన్నా ఏదో వేళప్పుడు ఓసారి నీటిపైకొచ్చి కాస్త అటూ ఇటూ చూస్తుంది సముద్రంలో మునిగిపోతున్న వాడి స్థితి లాగా వుంది ఇంకా చెప్పాలంటే ఆక్టోపస్ పట్టులో చిక్కుకున్నట్టు వుంది నాకైతే అసలు అది సరేగానీ సార్, సబ్‌స్టేషన్‌లో ఎలాగూ రెస్ట్ ఉండదంట మరి ఈ టౌన్ స్టేషన్లో, సెక్షన్ డ్యూటీలు కదా మమ్మల్ని వదిలిపెట్టరేంది రైటరూ, యస్సై'' అన్నాడు సుబ్రహ్మణ్యం

ప్రకాశం ఏదో చెప్పబోయే లోగా అతనే రామలింగం వైపు తిరిగి, ''ఒరే రామలింగం, నా ట్రాన్సిస్టరు తుప్పుపట్టిపోతోందిరా ఇరవై నాలుగు గంటలూ చెవులకి కట్టుకొని తిరిగేవాడినా, అట్టాంటిది నా అభిమాన గాయకుడు మహమ్మద్ రఫీ పాటలకి మొహమాసిపోయా ఆ భోజనానికి హోటలుకి పోయినప్పుడు ఆ హోటలులో పెట్టినియ్యి వినటమే సినిమా విషయానికొస్తే, సినిమాలు చూచి చుట్టూ హాళ్ళున్నాయి అంగట్లో అన్నీ వున్నాయ్, అల్లుడి నోట్లో ఏదో అంటారే అట్లా ప్చ్ మా సరదాలన్నీ నాశనమైపోయాయి మనకేమన్నా క్లబ్బులా? బోటు షికార్లా? ఇంకా ఏమన్నా కాస్ట్లీ సరదాలా? అవెలాగూ మనబోటి మధ్య తరగతోడికి లేవనుకో కనీసపు సరదాల్ని కూడా ఈ నౌకరీ దూరం చేసింది ఇందాక ఏదో మాటల్లో పరధ్యానంగా సిగరెట్టు వెలిగించా రైటరు దగ్గర మింగేసేలా చూశాడు వీళ్ళమ్మ పొలాల్లో పనిచేసే పాలేరుల్ని చూచినట్టు చూస్తారేరా బాబూ, వాడి మోచేతి నీళ్ళు తాగుతున్నట్టు మేనర్సులేకుండా ప్రవర్తిస్తున్నానంట మేనర్స్ అనేమాటకి వాడికి స్పెల్లింగు తెలియదు పీజీ చేసి ఏలు ముద్దరగాడిముందు ఎదవలమయ్యేమేరా అసలు మన పౌరుషం ఏమయ్యిందో అర్థం కావటంలేదు చదువుకునే రోజుల్లో ఎవడ్నీ లెఖ్ఖ చెయ్యలేదు ప్రతిదానికీ ముందుండేవాళ్ళం భయమంటే ఏమిటో తెలియనోళ్ళం ఇలా మనల్ని పిరికివాళ్ళుగా మార్చిందేమిటో అర్థంకాదు ఏమీ పని దొరక్క ఈ వెట్టిచాకిరీకి రావాల్సొచ్చింది చూస్తా రేపు గ్రూప్ టూ రాస్తున్నా దాన్లో ఛాన్సు దొరకొచ్చు. అంతటితో ఈ బానిస బతుక్కి స్వస్తి చెపుతా ఇక్కడ అడ్డమైన వాళ్ళందరిచేతా మాటలుపడే స్థితి దాపురించింది నిన్నటిదాకా వాడుకూడా కానిస్టేబులుగానే గడిపాడు ఇవ్వాళ అంత అధికారం చెలాయిస్తే ఎట్లా వాడుకూడా మనలాగా అధికార్ల వేధింపులకు బాధపడ్డవాడేగా అట్లా ప్రవర్తిస్తే అతని ముందు ఏమీ అనకపోయినా బయటకెళ్ళి తిడతారని తెలుసుకోవాలి ప్రకాశంగారూ కాదంటారా? నిజంగా నాకేగనక ఒక్కయకరం కాస్త సుబ్రమయిన పొలం ఉంటే ఇది మానుకుని పోయేవాడిని దీనిలో చేసే చాకిరీలో సగం చేస్తే అది రాళ్ళ పొలమయినా రత్నాలు పండియ్యొచ్చు. వొదిగిపోయేకొందీ ఈళెమ్మని బూతులుకూడా అలవాటు అవుతున్నాయండీ ''

ప్రకాశం నవ్వాడు ''అన్ని దురలవాట్లూ అవ్వటానికి అవకాశముంది మనల్ని మనం కంట్రోలు చేసుకోకపోతే సర్వనాశనమవుతాం ఎవరూ మనకి చెప్పేవాళ్ళుండరు మీరు కుర్రోళ్ళు చాలా జాగ్రత్తగా వుండాలి మనం నాశనమయిపోతూ వుంటే సంతోషించే వాళ్ళు చాలా మంది వుంటారు ''

వాళ్ళు చాలా సేపు మాట్లాడుకున్నారు

''మీకెంతమంది పిల్లలు?'' అడిగాడు రామలింగం

''నాకొక అబ్బాయి బియ్యే మొదటి సంవత్సరం చదువుతున్నాడు ఒకమ్మాయి ఈ సంవత్సరమే పీ యూ సీ లో చేర్చాము అసలు వాడీపాటికి పీజీ చెయ్యాల్సింది మధ్యలో నాకొక పల్లెటూరు పడి రెండేళ్ళు చదువు బ్రేకయ్యింది ''

''మీవాడిని చచ్చినా ఈ డిపార్టుమెంటులో చేర్చొద్దు నాలుగిళ్ళు అడుక్కునయినా తినొచ్చు '' అన్నాడు రామలింగం

''ఒక పక్క చూస్తూనే ఈ గోతిలోకి దించుతానా? వాడి రాతెట్లాగుందో, ఆ దేవుడి దయ'' అన్నాడు ప్రకాశం

''రాతాలేదూ గీతాలేదు రాతనుకుంటే ఇవన్నీ మనం ఎవరిమీదా పెట్టటానికి వీలులేదు ఇవన్నీ ఖచ్చితంగా ఆఫీసర్లు సృష్టించే ఇబ్బందులే అద్సరే, మీరు పెద్ద నాస్తిక చక్రవర్తులని విన్నాము, మరి మీరేంది రాతా, గీతా, కోత అంటున్నారు'' అన్నాడు కళ్ళు చిట్లిస్తూ సుబ్రహ్మణ్యం

''ఆఁ ఎప్పుడో కుర్రతనంలో '' అన్నాడు ప్రకాశం ఏదో ఒకటనాలన్నట్టు ఏమని జవాబు చెప్పాలో కూడా తోచలేదు. ఆ జవాబు అతనికే ఎబ్బెట్టుగా వుంది

ఈ మధ్యకాలంలో తిరిగి తన ఆలోచనలు దేవుడూ, దెయ్యం చుట్టూ తిరుగుతున్నయ్ మనసులో వాటిమీద సదభిప్రాయం లేకపోయినా, నాస్తికత్వం వలన అతనికి ఒనగూడిన లాభం ఏమీ కనపడలేదు అంతమాత్రాన ఆస్తికుడిగా మారినట్టు అతను మనస్ఫూర్తిగా అంగీకరించలేక పోతున్నాడు తనకూ తన వాళ్ళకూ, తన లాగే మిగిలిన వాళ్ళకూ జరుగుతున్న అన్యాయాలకూ, పరిష్కారం కనపడని సమస్యలకూ, అలాగే ఎన్నో తెలియని విషయాలకు, ముభావంగా, ఉదాసీనంగా, నలుగురితోపాటు తనుకూడా దైవత్వభావనకు లోనయ్యి పోతున్నాడు ఈనాడె వరన్నా తనముందు నాస్తికత్వం గురించి మాట్లాడుతుంటే, చిన్నగా వేదాంతిలాగా నవ్వుకుంటాడు వాళ్ళలాగే తనుకూడా అదేదో గొప్ప సిద్ధాంతంలాగా ఒకప్పుడు నమ్మాడు కాని దానివలన ఏమీ ఉపయోగం కనపడలేదు ఆ వాస్తవం వాళ్ళు కూడా త్వరలోనే తెలుసుకుంటారని అతను భావిస్తున్నాడు

అతనీ మధ్యకాలంలో ముఖ్యంగా ఆలోచిస్తున్నది ఆర్థిక ఇబ్బందులను గురించీ, వాటి మూలాల్ని గురించి 'ఆర్థికమైన అసమానతలకు కారణం ఏమిటో' అని అతను తన పరిధిలో ఆలోచిస్తున్నాడు నాస్తికత్వంలో ఈ రకమైన సమస్యలకుపరిష్కారం కనపడటంలేదు కేవలం దేవుడూ, దెయ్యం లేదనటంతోనే ఆ సిద్ధాంతానికి ఫులుస్టాపు పెడుతున్నారు మరి ఎవరూ లేరు, మానవుడే వున్నాడనుకుంటే మానవులమధ్య ఈ ఆర్థికమైన సమస్యలకూ, హెచ్చుతగ్గులకు కారణం ఏమిటి? ప్రశ్నగానే అది ఎప్పుడూ మిగిలిపోతోంది తనకెదురయిన వాళ్ళెవరూ దానికి సరయిన సమాధానం చెప్పి నమ్మించలేకపోయారు

తన కొడుకు సూర్యం రెండు మూడుసార్లు ఆ విషయం గురించి చర్చించాడు మానవుల మధ్య వున్న కోట్ల సమస్యలకు మూలం ఆర్థికపరమైన అసమానతలనీ, ఆర్థిక పరమైన ఇబ్బందులకు మూలం ఒక మనిషి యొక్క శ్రమను ఇంకొక మనిషి దోచుకోవటం అనీ, ఎంతోమంది మానవుల శ్రమను, చాలా కొద్ది మంది దోచుకోవటం వలన ఎక్కువమంది దరిద్రంలోనూ, అలా దోచుకొనే వాళ్ళు సకల సంపదలతోనూ బ్రతుకుతున్నారనీ, అదే అసలు

విషయమనీ చెప్పాడు దానికి సంబంధించి ఎన్నో విషయాలు మాట్లాడాడు కానీ అవేవీ తనకి చప్పున సరిగా అర్థం కాలేదు 'కాని వాడి మాటల్లో నమ్మకం కలిగింది వాడి మాటల్లో తెలివుంది నిజాయితీ వుంది' అనుకునేవాడు తను, ఆ మాటలు సూర్యం చెప్పినప్పుడల్లా కాని ఆ విషయాలు సూర్యం చెపుతుంటే ఒకపట్టాన కొరుకుడు పడేవికావు అన్నీ కొత్త కొత్త మాటలు వినిపించేవాడు ఎవురో కారల్‌మార్క్సు అనే ఆయన, తన స్నేహితుడు ఫ్రెడరిక్ ఏంగెల్స్ అనే ఆయనతో కలిసి ఈ ఆర్థిక సమస్యలకు మూలకారణాలను కనిపెట్టాడని పదేపదే చెప్పేవాడు మానవులకున్న సమస్యలు పోవాలంటే పెట్టుబడిదారులమీదా, భూస్వాములమీద కార్మికులూ, కర్షకులు తిరగబడి, దోపిడీదారుల ఆస్తులకు కావలి కుక్కలుగా వున్న పోలీసునీ, మిలటరీని ఓడించి, శ్రామికుల రాజ్యం స్థాపించుకోటం ఒక్కటే పరిష్కార మార్గమని చెపుతాడు తను చెప్పేది కేవలం వూహించి కాదనీ, మార్క్సు, ఏంగెల్స్ సిద్ధాంతాలను అధ్యయనంచేసి, లెనిన్ అనే ఆయన రష్యాలో, మావో అనే ఆయన చైనాలో ఆ విధమైన సమసమాజాల్ని స్థాపించారనీ, తరువాత అక్కడి ప్రజలకు వేళ్ళమీద లెఖ్ఖపెట్టతగ్గ సమస్యలు మాత్రమే మిగిలివున్నాయనీ, వాటిని కూడా క్రమేణా వాళ్ళు పరిష్కరించుకుంటారనీ, అక్కడ మతం చాలా వరకు రూపుమాసిపోయిందనీ, ప్రపంచమంతా ఏదో ఒకనాటికి కమ్యూనిస్టు సమాజం వైపు మళ్ళక తప్పదనీ చెప్పేవాడు కమ్యూనిస్టు అనే మాట వినపడేసరికి ప్రకాశంకు తనకు పరిచయమున్న కొంతమంది కమ్యూనిస్టులు గుర్తుకు వచ్చేవారు వాళ్ళు చెప్పే మాటలకూ చేసే చేతలకూ పొంతన కనపడేది కాదు అవన్నీ గుర్తొచ్చాయి ఆ కాసేపట్లోనే ప్రకాశానికి

తరువాత వాళ్ళు పిచ్చాపాటిగా అనేక విషయాలు మాట్లాడుకున్నారు

''ఇక్కడకొచ్చి మీరెన్నాళ్ళయింది?'' అడిగాడు సుబ్రహ్మణ్యం

''ఎన్నో ఏళ్ళా నెలలే అయిపోవచ్చింది ఈ స్టేషనుకూడా నా సర్వీసులో సంవత్సరం కన్నా ఎక్కడా ఎక్కువ వుండలేదు మహా అయితే సంవత్సరం నర''

''ఎవరుంచుతారులేండి ఇలాటి భావాలున్న వాళ్ళని'' అని రామలింగంవైపు తిరిగి, ''ఒరే మా మామయ్య కొడుకంటున్నాడూ, కాస్త ఆలస్యమయినా మంచి డిపార్టుమెంటులో చేరానంట రెండు చేతుల్తో సంపాయించొచ్చంట ఇక్కడేమో కనీసం కాఫీకి కూడా దొరకని పరిస్థితి ఏదన్నా పార్టీవచ్చినా మనదాకా రానిస్తాయా ఆ పెద్దరాబందులు ''

''మీ మామయ్య కొడుకేకాదు అందరూ అనుకొనేది అంతే ప్రజా రచయితలమని ఫోజులు పెట్టే రచయితలుకూడా పోలీసోళ్ళు రెండుచేతుల్తో సంపాయిస్తారనీ, వాళ్ళకు హృదయమనేదే ఉండదనీ, వాళ్ళ మెదళ్ళు రక్కసి పాదల్తో, వాళ్ళ గుండెలు సీసపు లోహంతో నిండిపోయి వుంటాయనీ రాస్తున్నారు కాస్తో కూస్తో చదువుకుని ప్రపంచాన్ని చదివి రచనలు చేసే రచయితలే ఆ భావల్తో ఉంటే ఇంక మిగిలిన సామాన్య జనం సంగతేముంది వాళ్ళట్లా అనుకునేదాన్లో, అనేదాన్లో కొంత న్యాయం కూడా వుందనుకో ఎందుకంటే ప్రజల దృష్టిలో పడే పోలీసులంతా ప్రజలతో దారుణంగా ప్రవర్తించేవాళ్ళే మంచి పోలీసెవడూ ప్రజలతో అలా ప్రవర్తించడు సహజంగా వాడికెవ్వరూ స్నేహితులుండరు జనమంతా వాడిని మిగిలిన వాళ్ళతో సమానంగా అంటరానివాడిగా దూరంగానే వుంచుతారు వాడు ఇంక వంటరిగా కాలంగడపాలి అది అందరికీ సాధ్యమయ్యే విషయం కాదు కాబట్టి తిరిగొచ్చి ఈ పక్షుల్లో కలిసి కాలక్రమేణా వాళ్ళతోపాటు వాడు కూడా మారిపోతాడు ''

''అవునవును మొన్నటికి మొన్న ఏమయ్యిందో చెపుతానుండు మనమంతా ట్రైనింగు పూర్తిచేసుకుని జిల్లా హెడ్క్వార్టర్స్‌కి వస్తున్నామా ట్రైన్లో నాకు మా కంపార్టుమెంటులో చోటు దొరక్క వేరేపెట్టెలో ఎక్కా మఫ్టీలోనే వున్నా అయినా మనల్ని పట్టియ్యటానికీ, తోటి జనంతో కలవకుండా చెయ్యటానికీ, న్యూనతా భావంతో మనం కుచించుకు పోవటానికీ మూకుళ్ళు బోర్లించినట్టు క్రాపులు ఎలాగూ వున్నాయనుకో ఆ రాత్రి నన్నెవరూ ఆ విషయాల్లో పట్టుకోలేదు రాత్రి కావటం మూలాన ఏదో రాజకీయ విషయాల మీద చర్చ జోరుగా సాగింది నా నాలెడ్జికి వాళ్ళు కొంచెం మెచ్చుకోలుగా మాట్లాడారు ఆమాటా ఈ మాటా మాట్లాడినాక నేనేం చేస్తున్నానని అడిగారు చెప్పా అంతే పక్కలో ఏదో పామున్నట్టు నా పక్కనోడు చిన్నగా పక్కకు జరిగాడు ఇంక తరువాత ఎవరూ సరిగా మట్లాడలా ఆడవాళ్ళేమో అంతవరకూ నవ్వుతూ మాట్లాడినోళ్ళు ముభావంగా వుండిపోయారు నేను చేసిందేమీ లేదు కేవలం కానిస్టేబుల్ని కావటం '' అన్నాడు రామలింగం

''దానిక్కారణం సొసైటీలో మనపాత్ర మనం పబ్లిక్కుతో ప్రవర్తించే తీరు మనలో మార్పొస్తే వాళ్ళూ మారతారు ఏమండీ ఏమంటారు?'' అన్నాడు సుబ్రహ్మణ్యం

''ఏంది వచ్చేదీ, మార్చేదీ, మార్పించేదీ మన జీవితాల్ని సుఖవంతం చేసుకోవటానికి అందరం ఒకటికావటం చేతకాదు కానీ, మనం ప్రజలకేంచేస్తాం సొసైటీలో ప్రజలు మనల్నేకాదు అందర్నీ, అన్ని డిపార్టుమెంటుల్నీ గవర్నమెంటు ఆసుపత్రులు తీసుకోండి, పంతుళ్ళను తీసుకోండి, కోర్టులు తీసుకోండి, వ్యాపారస్తుల్ని తీసుకోండి, రెవిన్యూ డిపార్టుమెంటుని తీసుకోండి ఎవరంటే ప్రజలకు సదభిప్రాయం వుంది అందరూ ప్రజల చేత అసహ్యించుకోబడేవాళ్ళే అయితే మనం మరీ దారుణంగా ప్రవర్తిస్తాము కొట్టొచ్చినట్టు కనపడిద్ది మన ప్రవర్తన న్యాయాన్ని మనమే నిర్ణయిస్తాం చాలాసార్లు ఎవడు డబ్బులిస్తే వాడికే మనం సపోర్టు క్రపెత్తనం చేస్తాం ఆఫీసర్లమీది ద్వేషమంతా ప్రజల మీదా, పెళ్ళాం పిల్లల మీదా, సమాజంలోని బక్కవాళ్ళమీదా చూపిస్తాం ప్రజలతో మనం ఏమాత్రం మారాలన్నా ముందు మన సర్వీసు రూల్సుల్లో మార్పురావాలి ''

''ఏం మార్పులో ఆ మార్పులు వచ్చేలోగా ఎన్ని జీవితాలు నాశనమయ్యి పోతాయో ఎవడొస్తాడండీ ముందుకు అంతటి త్యాగం ఎవడు చేస్తాడు''

''మనం చెయ్యలేక పోవచ్చు దానోడు దానికుంటాడు వాళ్ళు జీవితాల్ని పణంగా పెట్టి మిగతా వాళ్ళ సహాయ సహకారాలతో సాధిస్తారు దాన్ని అందరూ అనుభవిస్తారు ''

ఇంతలో స్టేషన్లో నుండి డబ్బా రైటరు బైటకొచ్చి ప్రకాశాన్ని కేకేశాడు ప్రకాశం లేచి లోపలికెళ్ళాడు ఆ చర్చ అంతటితో ఆగిపోయింది

మర్రోజు ప్రకాశం స్టేషనుకి వచ్చేసరికి అతన్ని ట్రాఫిక్ డిటాచ్‌మెంటుకి వేసినట్టు చెప్పాడు డబ్బారైటరు

''ఎవరికి రిలీఫ్ ?''

''మస్తాన్‌కి అతన్ని రిలీవ్‌చేసి అతని దగ్గరున్న తెల్లటోపీ, తెల్ల చొక్కా మీరు తీసుకోండి'' అన్నాడు.

మర్రోజు నుంచి ట్రాఫిక్ డ్యూటీకి వెళ్ళాడు ప్రకాశం ఆరోజు సాయంత్రం ట్రాఫిక్ పాయింటులో నిలబడివుంటే పన్నెండు పధ్నాలుగు సంవత్సరాల కుర్రోడు వచ్చి, ''నమస్కారం

సార్'' అన్నాడు

''నమస్కారం బాబూ ఏమిటి'' అన్నాడు ప్రకాశం

''వసూలు చెయ్యమంటారా ?'' అడిగాడు ఆ కుర్రవాడు

ఆ మాటల కర్థం చప్పున గుర్తుకురాలేదు రెండో నిముషంలో ఉదయం మస్తాన్ చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి

''ఆఁ పోయి వసూలు చెయ్యి'' అన్నాడు చింపిరి జుట్టు సరిచేసుకుంటూ ఆ కుర్రోడు వెళ్ళిపోయాడు ఒక గంటలో తిరిగొచ్చి ఏడురూపాయలు చేతిలో పెట్టాడు ఆ కుర్రోడికి ఓ రూపాయిన్నర ఇచ్చాడు ప్రకాశం మిగిలిన డబ్బులు జేబులో వేసుకుని అటూ ఇటూ చూశాడు, తననెవరన్నా గమనిస్తున్నారేమోనని టైమ్ అయిపోయినాక స్టేషనుకువెళుతుంటే మస్తాన్ ఎదురయ్యాడు

''ఇవ్వాళ ఏ బీటు'' అన్నాడు తాపీగా మస్తాన్

''నెంబర్ టూ'' అన్నాడు ప్రకాశం సైకిలు దిగుతూ

''ఎంతొచ్చినియ్యి?''

''ఏడు రూపాయలు తెచ్చిచ్చాడు వాడికో రూపాయిన్నర ఇచ్చా'' అన్నాడు ప్రకాశం

''అమ్మ, దొంగ నాకొడుకు నిన్ను తిన్నాడయ్యా! అది పదమూడు రూపాయల బీటు అంతకు ఎక్కువ రావాల్సిందే గాని తక్కువ రావటానికి వీలులేదు వాడు పదిహేనో పదహారో వసూలు చేస్తాడు మనకి పదమూడు తెచ్చిస్తాడు అందులో మనం రెండో రెండున్నరో ఇస్తాం నువ్వు కొత్తోడివని టోపీవేశాడు వాడికొచ్చే కమీషను నీకూ, నీకొచ్చేది వాడికీ పోయింది ఈ రోజు నా కొడుకుని రేపు నాలుగు లాగించు వాడికదే మందు నువ్వు మరీ ఇంత అమాయకంగావుంటే లాభంలేదు ఎట్లాగూ పేరు మనదేగా మధ్యలో ఆ నా కొడుకులు దొబ్బుతుంటే ఎట్లా? ఇదిసరే, ఏడోబీట్లో దగ్గర దగ్గర డెబ్బైదాకా వస్తాయి నువ్విట్లాగే వుంటే నీ చేతిలో పదో పదిహేనో పెడతారు ఆ బీట్లో వసూలు చేసేవాడు మరీదొంగ ఆ బీటు నెలకొకసారే వస్తుంది అక్కడ మల్లెపూలమ్ముకునే ఆడవాళ్ళే బుట్టకు పావలా చొప్పున ఇస్తారు కాయల బండోళ్ళు అర్ధరూపాయి, బజ్జీల బండోళ్ళు రూపాయి, కొబ్బరి బోండాలు, ప్లాస్టిక్కు సామాన్లు, కేలెండర్లు అమ్ముకునేవాళ్ళు రూపాయి చొప్పున ఇస్తుంటారు నీకు ట్రాఫిక్ అంత బాధగా వుంటే రైటరుకు చెప్పు, స్టేషన్ డ్యూటీ కొస్తానని ట్రాఫిక్ అంటే ఎగబడతారు జనం రాత్రిళ్ళు రేస్ట్ దొరికిద్ది పది రూపాయలు డబ్బులూ కనపడతాయి కాకపోతే కొత్తలో కాస్త వేడిచేసిద్ది ఎందుకంటే కంటిన్యూగా బూటు వేసుకుని ఎండలో నిలబడి వుండాలి కాబట్టి రోజూ రాత్రి ఇంటికి పోబోయేముందు ఓ బీరు కొడితే అదే సర్దుకుంటుంది శశికళవైన్స్ వాడయితే మనకి రూపాయి తక్కువగా ఇస్తాడు బీరువరకు అలవాటు లేనివాళ్ళు కొబ్బరి బోండా తాగితే అదే సర్దుకుంటుంది ఇంకా నీకు చాలా బీట్లు తెలియవు ఫోర్, ఫైవ్ బీట్లు ఒన్వే పాయింట్లు అక్కడ ఒన్వేలో రాంగ్రూట్లో సైకిళ్ళమీద వచ్చే వాళ్ళుంటారు ఆ పాయింట్లల్లో బండ్లేమీ వుండవు బీటు రెండురూపాయిలకన్నా ఏమీరాదు అక్కడ రెండు సైకిళ్ళు పట్టుకుంటే చాలు మందుకు సరిపోతాయి '' అన్నాడు హోరూరుతున్నట్టు

ఆ మాటలన్నిటిని ప్రకాశం నవ్వుతూ విన్నాడు ''సరేలే కానీ, తొమ్మిదోబీట్లో కానిస్టేబుల్ని ఉదయం లారీ గుద్దిందంటగా ఎలా వున్నాడు?'' అన్నాడు

''ఏమో విజయవాడ తీసుకెళ్ళారంట సీరియస్‌గానే వుందంట నువ్వు జాగ్రత్త ఆ బీటు మరీ హెవీ ట్రాఫిక్ చాలా ఎలర్ట్‌గా వుండాలి పరధ్యానం పనికిరాదు నా కొడుకులు మిడిమేలంగా వస్తుంటారు డ్రైవర్లు అతను పాపం, సింగు ఎప్పుడూ ఏదో ధ్యాసలో వుంటాడు కుటుంబం పెద్దది ఎప్పుడూ డబ్బులికి ఇబ్బంది పడుతుంటాడు ఏదో అట్లాంటి ఆలోచనల్లోనే మునిగిపోయి వుంటాడూ, ఇది జరిగింది''

''అక్కడ ట్రాఫిక్ పాయింట్‌కి దిమ్మలేదా మనం ఎక్కి నిలబడటానికి?''

''ఎక్కడుంది కాబట్టి అక్కడుండటానికి దిమ్మల్లేవు మనకి అడిగే దమ్ముల్లేవు పోయినేడు నాలుగో బీట్లో జీపు గుద్ది ఒక పీసీ చచ్చిపోయాడు ఈ ట్రాఫిక్‌లో సంవత్సరానికొకళ్ళు చావాల్సిందే ట్రాఫిక్ పాయింట్లో నిలబడటంలేదనీ, పక్కన చెట్లకింద నిలబడుతున్నారనీ, ఆబ్సెంట్లు రాసీ, నోరు పారేసుకుని, పనిష్మెంట్లిచ్చే ఆఫీసరు నా కొడుకులు పాయింట్లలో దిమ్మలు కట్టియ్యాలని ఆలోచించరు ఈళ్ళమ్మని సరేనే వస్తా వాడెన్ని రిపోర్టులు రాసుకున్న మనకేం ఫరవాలేదు కాని, నువ్వు మాత్రం పాయింటులో నిలబడమాక ఒక్క ఏడో బీటుకి మాత్రం దిమ్మ వుంది అది కూడా శిధిలావస్థలో వుంది మనకేదన్నా అయితే మన పెళ్ళాం పిల్లలుఅడుక్కుతినాల్సిందే చస్తే-ఈ గవర్నమెంటిచ్చే ఆ పదివేలు ఏ మూలకీ రావు అయ్యికూడా చస్తేనే ఏదన్నా కాలో చెయ్యో విరిగితే మూడో నాలుగో వేలిచ్చి ఇంటికిపంపిద్ది వాటితో మన బతుకులు ఏమవుతాయి?'' అన్నాడు ఆ మాటలు విని ప్రకాశం బాధగా నిట్టూర్చాడు

''ఇంకోమాట ఏమిటంటే నీకు ముఖ్యంగా చెప్పాల్సింది, బలిసిన నా కొడుకులు మోటారు సైకిళ్ళ మీద ముగ్గురేసి ఎక్కి వస్తుంటారు సైకిళ్ళ మీద ముగ్గురొస్తారు ఒక్కోసారి వన్‌వేలో వస్తారు చూడనట్టు పక్కకు తల తిప్పుకో మనం వాళ్ళనేమీ చెయ్యలేము ఆఫీసర్లే వాళ్ళంటే జంకుతారు మనం కిందామీదా పడి వాళ్ళని స్టేషనుకు తీసుకుపోయినా మనకి కనీసం విలువ వుంచకుండా ఆఫీసర్లు వాళ్ళని ఎదురుగా కూర్చోబెట్టుకొని కాఫీ తెప్పించి మనచేతే ఇప్పిస్తారు మనం ఇంకాస్త గట్టిగా పట్టుబడితే విషయాన్ని రివర్స్ చేస్తారు వన్‌వేలో వస్తుంటే దబాయించి డబ్బులు తీసుకున్నామని రిపోర్టిస్తారు ఆఫీసర్లే చేస్తారంతా మన బతుకులు మాడి మసైపోతుంటే ఆ నాకొడుకులు ఈళ్ళతో కలిసి హాయిగా నవ్వుకుంటారు అంతేకాని కనీసపు సానుభూతి మనమీద చూపరు మనతోటి కానిస్టేబుళ్ళు కూడా లోలోపల సంతోషిస్తారు ఒక బీదవాడు తనకు జరిగిన అన్యాయం గురించి చెప్పుకోవటానికి స్టేషనుకొస్తే మనం వాడి మాట ఎంతవరకు ఆలకిస్తామో, ఆఫీసర్లు మన విషయంలో కూడా అంతే ప్రతిచోటా-ఈ రాజకీయ నాయకులతో ఆఫీసర్లు చేయి కలపటమే బీదవాడు సినిమాహాల్లో బీడీ తాగినా వాడిని వొదిలిపెట్టం వున్నవాడు నడిరోడ్డు మీద నలుగుర్ని నరికినా వాడికి శిక్షపడదు మనం ఎన్ని చూడటంలేదు ఈ సమాజంలో బీదోడికీ, బక్కోడికీ స్థానం లేదు మనం మరబొమ్మల్లాగా, స్విచ్చేస్తే తిరిగే యంత్రాల్లాగా కాలం గడుపుకుని అవతలకు పోవటమే ఈ బతుకులింతే నీకు తెలియందేముంది ఇట్లా మన సమస్యల్నీ, బాధల్నీ ఒకళ్ళకొకళ్ళం కాస్త చెప్పుకుంటుంటే మనస్సుకు కొంచెం వూరటగా వుంటది అంతుకుమించి ఏం లేదు నువ్వేదో ఇరగదీసుకుని ఉద్యోగం చెయ్యాలనుకుంటే నీకన్నీ పనిష్మెంట్లే ఏమీ పట్టనట్టు పోతే నీ జీతం, టి ఏ డబ్బులు నీకొస్తాయి నాకు ట్రాఫిక్ టరన్ పూర్తిగా అయిపోలేదు ఇంకా రైటరు గాడికి మొన్న చక్రకేళీలు తెచ్చివ్వలేదని నన్ను దీనిలోంచి దించేశాడు వచ్చేది చలికాలం నాకు జనవరి వరకు టరన్ నా ఇంట్లోకే నేను డబ్బులిచ్చి

కొనుక్కుంటావా వాడికి నేనెక్కడ అడుక్కొచ్చి ఇచ్చేది ఏం, వందలు వందలు దొబ్బుతున్నాడుగా, కొనుక్కోలేడూ నా టర్నంట రోజుకొకళ్ళు చొప్పున టరన్ ప్రకారం వాడికి చక్రకేళీలు తెచ్చివ్వాలి ట్రాఫిక్ సార్జెనేమో యస్సైలకీ, సి ఐ లకీ, డి యస్పిలకీ సప్లై చేస్తుంటాడు పీసీలేమో రైటరుగాడి కియ్యాలంట నేను తెచ్చియ్యలేదని దించేశాడు నిన్ను కూడా అడుగుతాడు రేపు నేనెక్కి ఇంకా నెల రోజులు కూడా కాలేదు సరే కాని కష్టాలు మనకి కొత్త కాదుగా అడగడమంటే వాడు డైరక్టుగా అడగడు డబ్బారైటరు చేత అడిగిస్తాడు అక్కడ ఆ డబ్బా రైటరు పోస్టు అందుకే వాడు పార్టీకీ, రైటరుకీ మధ్య బ్రోకరు ఐ డి పార్టీ వాళ్ళేమో యస్సైకి, సి ఐ కి బ్రోకర్లు డి యస్పీ, యస్పీ, డి ఐ జీలకు వాళ్ళ కనుకూలమైనవాళ్ళు బ్రోకర్లు కొంతమందికైతే వాళ్ళ భార్యలే వాళ్ళు మరి ఇంకెవర్నీ నమ్మరుగా క్రింది ఆఫీసర్లు కవర్లు తీసుకుపోయి అమ్మగార్ల చేతుల్లోనేగా పెట్టేది సరే నేనొస్తా ఇయ్యన్నీ బహిరంగ రహస్యాలేలే ఇవ్వాళో రేపో నిన్ను గూడా అడుగుతాడు వాడు'' అంటూ ముందుకు కదిలాడు మస్తాన్

''నా దగ్గరనుండి కాయలు కాదుగదా! మల్లెమొగ్గ కూడా వాడు తెప్పించుకోలేడు'' అని సైకిలెక్కి స్టేషనుకెళ్ళాడు ప్రకాశం బీటు బుక్కు అక్కడ పడేశాడు ఆంజనేయులు కనపడితే, 'సింగుకి ఎట్లావుంద'ని అడిగాడు

''ఏమో సార్ జనరల్ ఆసుపత్రికి తీసుకెళ్ళారంట సీరియస్‌గా వుందంట భార్యాపిల్లలంతా వెళ్ళారు పాపం కాలు తీసెయ్యాలన్నారంట ఇక్కడే'' అన్నాడు

ప్రకాశం విని బైటకొచ్చి సైకిలేసుకుని నీరసంగా ఇంటికి చేరాడు సన్నగా తలనొప్పి వస్తోంది

''ఒక్కపూటకే ముకమంతా పీక్కుపోయిందే'' అంది భార్య

''ఏముంది మరి ఎర్రటి ఎండలో నిలబడటమాయె తలమీద ఏమన్నా నీడుంటేగా వచ్చే బస్సూ, పోయే లారీ దుమ్మంతా వచ్చి చెమట పట్టిన వంటిమీద పడి అతుక్కుపోవటమేగా వళ్ళంతా చండాలపు వాసనొచ్చిద్ది మరి యూనిఫారం రోజూ ఉతకాల్సిందే'' అని మంచం మీద కూర్చున్నాడు తలమీది హెల్మెట్‌లాంటి తెల్లటోపీ తీసి పక్కన పెట్టాడు కొత్తగా వున్న ఆ టోపీని సూర్యం, లక్ష్మి పరీక్ష చేసి చూశారు

చూపుడు వేలు గోటితో దానిమీద టకటక కొట్టి, ''ఇది ప్లాస్టిక్కుది నాన్నా, తల మాడిపోయి వుండాలే'' అన్నాడు సూర్యం

''తల మాడిపోవటమే కాదు, తలపోటు వస్తోంది కొంతమందికి దాని వేడికి తల వెంట్రుకలు కూడా వూడిపోతున్నాయి ఇది తలమీద పెట్టుకున్న ఒక అరగంటకల్లా చెమటపోసి ఒకటే దురద తడవ తడవకు తల గోక్కోవాలంటే నలుగురూ మా వైపే చూస్తుంటారని సిగ్గుతో చస్తున్నాం'' అన్నాడు ప్రకాశం నవ్వుతూ

బూట్లు విప్పటానికి ముందుకు వంగబోతే నడుములు వంగలేదు ''అబ్బా నడుంలు పట్టుకుపోయినియ్యి మోకాళ్ళు కూడా వంగటంలేదు కంటిన్యూగా ఉదయం నాలుగు గంటలూ, సాయంత్రం నాలుగు గంటలు నిలబడటమే కదా!'' అన్నాడు భార్యా, కొడుకూ, కూతురూ ప్రకాశం చెప్పే మాటలు వింటూ బాధగా నిలబడ్డారు ప్రకాశం బూట్లు విప్పి మంచం కిందకు నెట్టి, యూనిఫారం విప్పి గోడకు తగిలించి, స్నానం చేసొచ్చి మంచం మీద కూర్చున్నాడు

''రా వచ్చి, ఒక్కసారే అన్నం తిని కూర్చుందువుగాని'' అంది భార్య

దొడ్లో చాప వేసుకుని అంతా భోజనాలకు కూర్చున్నారు హరికెన్ లాంతరు రోటిమీద

పెట్టారు ఎత్తుగా వుండటానికి

''ట్రాఫిక్ విశేషాలు ఏంటి నాన్నా'' అడిగాడు సూర్యం

''ఏముందిరా మిగతావాటికంటే అదేం సుఖమయ్యింది కాదు కళ్ళు మంట కాళ్ళు లాగుతున్నయ్ ఎండ దెబ్బకు సరిగా కళ్ళు తెరిచి చూడలేము లేకపోతే చలవజోడు కొనుక్కోవాలి మసకజోడు కొంటానికే డబ్బులు లేక వాయిదా వేస్తూ వస్తున్నాం సింగనీ, ఒక కానిస్టేబులిని ఉదయం ఒక లారీ గుద్దింది'' అన్నాడు ప్రకాశం పప్పుచారులోని కరివేపాకు రెబ్బలు ఏరివేస్తూ

''అయ్యో పాపం ఇప్పుడెలాగుంది?'' అంది భార్య ఆతృతగా

చెప్పాడు ప్రకాశం తరువాత వాళ్ళు చాలా విషయాలు మాట్లాడుకున్నారు అన్నం తిని లేస్తూ, ''అబ్బా! కాళ్ళు పచ్చిపుండ్లయిపోయాయి'' అన్నాడు బాధగా

''ట్రాఫిక్‌లో పది నిముషాలన్నా కూర్చోవటానికి వీలుకాదా?'' అంది కూతురు భాధగా

''ఎక్కడ కూర్చుంటామమ్మా పది నిముషాల కొకసారి సి ఐ గాడో, యస్సై గాడో, లేకపోతే ట్రాఫిక్ సార్జినో వస్తారు ఈడు ట్రాఫిక్ సార్జిన్ ఆబ్సెంటు ఏమీ రాయలేడుగానీ, ఆ దమ్ములు లేవు గానీ, ఆఫీసర్లకి చాడీలు చెపుతాడు''

''సి ఐ కీ, యస్సైకీ ఎంతసేపూ ట్రాఫిక్‌వాళ్ళని చెక్ చెయ్యటం తప్ప ఇంకో పనేమీ ఉండదా?'' అంది లక్ష్మి

ఆ మాటకు ప్రకాశం చిన్నగా నవ్వాడు ''ప్రత్యేకంగా చెక్ చెయ్యటానికి రారుగానీ, అటు ఇటూ, అక్కడకూ ఇక్కడకు వెళుతూ బీట్లల్లో పీసీలు వున్నారో లేరో అని చూస్తుంటారు ఆళ్ళకి సర్వస్వం ట్రాఫిక్‌వాళ్ళనుండే పోవాలి ట్రాఫిక్ సార్జిన్ చాలావరకు సప్లై చెయ్యాలి రోడ్ల మీద పెట్టుకుని వ్యాపారం చేసే అన్ని రకాల వ్యాపారస్తులు ఇవ్వాల్సిందే వాళ్ళ జీవనం రోడ్డుమీదే కదా ఏడుస్తూనో, తిట్టుకుంటూనో ఇస్తారు వాటిల్లో యస్సైకీ, సి ఐ కీ నెలకు సరిపడా సరుకులూ, నాలుగు రోజులకోసారి వెరైటీ ఫ్రూట్స్ చెరో బుట్టా, ఆఫీసర్లు వచ్చినప్పుడు బంగళా అద్దెలూ, భోజనం ఖర్చులూ ఇవన్నీ వాడే చూసుకుంటాడు మధ్యమధ్యలో మళ్ళీ బండ్లవాళ్ళమీద కేసులని, పేర్లు రాసుకుంటారు పదిమందిబండ్లోళ్ళ దగ్గర కేసుల్లేకుండా చేస్తామని చెప్పి డబ్బులు వసూలుచెయ్యటం ఇద్దరిమీదో ముగ్గురిమీదో కేసులు పెట్టటం, ఇట్లా ఇక సైకిళ్ళు రోజూ పది పదిహేను సైకిళ్ళు పట్టుకుని కోర్టులో పెడతారు అక్కడ ఫైను రెండు రూపాయలు ఏస్తే, సార్జిన్‌కి రెండు రూపాయలివ్వాలి ఇక మమ్మల్ని అదే పనిగా హరాస్ చేస్తుంటే తప్పు లేకుంటే పాయింట్లు వదిలిపెట్టి పోతామని భయం మేముంటే బండ్లోళ్ళు రోడ్డు మార్జిన్ దిగి వుంటారు లేకుంటే రోడ్డుమీదకొచ్చి ఆ కాసిని కాయలూ అమ్ముకుని వెళ్ళిపోతారు, డబ్బులు ఇవ్వకుండా మాకు''

''ట్రాఫిక్ సార్జినే ప్రతి బండి దగ్గరకు పోయి వసూలు చేసుకుంటాడా?''

''వాడెందుకు పోతాడు వాడికింద ఏ హోంగార్డు కుర్రోడో లేకపోతే ఏ సివిలోడో వుంటాడు దేనికి తగ్గోడు దానికుంటాడు కదా మాకెట్లాగయితే బీటు మామూలు వసూలు చేసి యిచ్చేవాళ్ళు మమ్మల్ని వెతుక్కుంటూ వస్తారో, అలాగే ట్రాఫిక్ సార్జిన్ వాడి చేత్తో పది పైసలు కూడా ముట్టుకోడు భయం పిటీషన్లు పెడతారేమోనని ''

''బాగానేవుంది మరిట్లాంటియన్నీ ఉండబట్టే పోలీసులంటే అంత తేలిక జనాలికి'' అంది ప్రకాశం భార్య

''కర్వేగానీ, వీళ్ళు చేసే పనుల్లో మూడొంతులు ఆఫీసర్ల కోసమే'' అన్నాడు సూర్యం

చాలాసేపు అనేక విషయాలు మాట్లాడుకున్నారు

ఆ రాత్రి పెందలాడే నిద్ర పట్టేసింది ప్రకాశంకు బడలిక వలన

తెల్లారినాక స్టేషను కెళ్ళాడు 'సింగుకి కాలు తీసేశారంట' అన్నారెవరో అదే విషయం అందరూ గుమికూడి మాట్లాడుకుంటున్నారు సెక్షన్ బల్ల దగ్గర ఆ వార్త భయం కలుగజేసింది ప్రకాశంకు

''ఇంత జరిగినా ఆ డ్రైవరు నా కొడుకుని కనీసం లోపలకూడా వెయ్యనివ్వలేదంట యస్పై ఆ లారీ ఓనరు వచ్చి ఏదో ఆమ్యామ్యా చేశాడు వాడిని బయటే కూర్చోబెట్టారు అప్పటికీ మన కానిస్టేబులు కోపం పట్టలేక డ్రైవర్ని లోపలేస్తానన్నాడంట యస్పై ఆ పీసీ వైపు కొరకొర చూశాడంట అందరూ పోయి రైటర్ని అడిగారంట, 'ఏంది సార్ మనోడికి ఇంత అన్యాయం జరిగితే డ్రైవరుగాడ్ని పెళ్ళికొడుకుని కూర్చోబెట్టినట్టు బైట కూర్చోబెట్టారు మరీ ఇంత దారుణం ఏంది సార్ మీరన్నా యస్పైగార్కి చెప్పండి సార్' అని ఆ మాటకు ఆ రైటరు గాడు, 'ఏం చెపుతావయ్యా, వాడిని లోపలేస్తే డ్రైవర్ల యూనియన్ వాళ్ళు గొడవ చేస్తారని యస్పై అంటున్నాడు' అన్నాడంట 'ఒక కేసులో ముద్దాయిని లోపలేస్తే యూనియన్‌వాళ్ళు గొడవ చేస్తారా? ఏం కతలు చెపుతున్నారండి' అన్నారంట మన పీసీలు ఆ మాటకు రైటరు, 'పోయి యస్పైనడగండి అసలు మీకు సంబంధం లేని విషయం కదా' అన్నాడంట

అతనలా చెపుతూ వుంటే మిగిలిన వాళ్ళు వింటూ నిలబడ్డారు బొమ్మల్లా చాలా సేపు ఆ విషయం మాట్లాడు కున్నారు అంతా ''అంతా డబ్బు ప్రభావమయ్యా'' అన్నాడు ప్రకాశం విన్నారు వాళ్ళు ఆ మాటని తరువాత ఎటు వాళ్ళు అటు వెళ్ళారు

ట్రాఫిక్ పదిరోజులు గడిచిపోయింది కాస్త కష్టంగా వున్నా రాత్రిళ్ళు నిద్ర మేల్కొనే పరిస్థితి లేదు 'చలికాలం ఈ మూడు నెలలూ ఇంటి దగ్గర పండుకోవచ్చులే' అనుకున్నాడు ప్రకాశం ఒకనెల రోజులు గడిచాయి సింగుని ఇంటికి తీసుకువచ్చారని స్టాఫంతా చూట్టానికెళ్ళారు మనిషి బాగా చిక్కిపోయాడు గడ్డం పెరిగింది ఎడంకాలు మోకాలుదాకా తీసేశారు వీళ్ళందరినీ చూసి బావురుమని ఏడ్చాడు అతను భార్యా పిల్లలు మంచం చుట్టూ నిలబడి ఏడుస్తున్నారు పది నిముషాలు గడిచాక ఎవరో అన్నారు ''పోనీలే అంతవరకన్నా అదృష్టవంతుడివి'' అని

ఆ మాటకు సింగు బాధగా చూశాడు విరాగిగా నవ్వాడు ''ఏం అదృష్టం డ్యూటీలో చచ్చినా నా పెళ్ళాం పిల్లలకి ఇరవై వేలొచ్చేవి పిల్ల పెళ్ళికని జి పి యఫ్ లో తీసుకున్న రెండువేలూ ఆసుపత్రిలో డాక్టర్లకూ, మందులికీ, మా ఖర్చులికి సరిపోయినియ్యి దాని పెళ్ళి ఆగిపోయింది నాకు నొప్పి పూర్తిగా తగ్గలేదు బయట డాక్టర్లకి చూపించుకోవాలి ఇంకా ఎంత ఖర్చయ్యిద్దో ఆ గవర్నమెంటు ఆసుపత్రి డాక్టర్లు బలవంతాన పంపించేశారు 'తగ్గిద్దిలే ఇంటికి పోయి మందులు వాడుకో' అన్నారు మనమింకా అక్కడుండాలంటే ఇంకా ఇవ్వాలి ఉన్న డబ్బులు అయిపోయాయి దేవుడు మమ్మల్నెందుకు ఇలా పరీక్షచేస్తున్నాడో అర్థం కావటంలేదు'' అన్నాడు ఏడుపు గొంతుతో

''ఆలశ్యం చెయ్యకుండా మీ అబ్బాయిని తీసుకుపోయి, యస్పీ దొరకు కనపడు వెంటనే తీసుకోవచ్చు పోలీసుల్లోకి'' అన్నాడు వెంకటేశ్వర్లు

''అదీ అయిపోయింది నేను ఆసుపత్రిలో వున్నప్పుడే నా భార్య పోయి ఒక పిటీషను రాసుకుని దొరకు కనపడింది పిటీషను చూచి, 'ఇప్పుడెవర్నీ తీసుకోవటం లేదు వచ్చే సంవత్సరందాకా

ఏమీ వీలుకాదు, తరవాత వచ్చి కనపడ' మన్నాడంట ఇంక అది అంతే మూడేళ్ళక్రితం చచ్చిపోయిన ఖాదర్ కొడుకుని అప్పుడన్నారూ ఇప్పుడన్నారు ఇంతవరకు తీసుకోలేదు వాళ్ళెన్ని ఇబ్బందులు పడుతున్నారు మధ్యలో రికమెండేషన్లు తెచ్చినవాళ్ళనీ, డబ్బులు ఖర్చుపెట్టిన వాళ్ళని ఎంతమందిని ట్రైనింగుకి పంపలేదు మన లెవల్లో ఏం పనులు అవుతాయి, ఏం ఖర్చు పెట్టగలం అంతా మన ఖర్మ'' అన్నాడతను బాధగా

ఎవరికి తోచిన ఓదార్పు మాటలు వాళ్ళు చెప్పి ఇవతలకొచ్చారు ఆ ఉద్రేకంలో, 'జీతాలొచ్చినప్పుడు తలా పది రూపాయలు తీసి ఇవ్వాలను'కున్నారు తీరా జీతాలొచ్చాక ఆ పది రూపాయలు ఇవ్వటానికి ఎంతో ఆలోచించుకోవాల్సి వచ్చింది చాలామందికి ఆ పది రూపాయలు ఇస్తే ఏ ఖర్చుని మానుకోవాలో, ఏ ఖర్చుని వాయిదా వేయాలో, ఆ పది రూపాయలని ఎట్లా పూడ్చాలో అనే ఆలోచన చాలామందిలో చోటు చేసుకుంది

ఆ సాయంత్రం ట్రాఫిక్ డ్యూటీలో వున్నాడు ప్రకాశం కడుపులో విపరీతంగా నొప్పిగా వుంది బాధ భరించలేక దగ్గరలో వున్న లాడ్జింగ్‌లోని లెట్రిన్‌కి వెళ్ళి వచ్చాడు అతను వచ్చేసరికి ట్రాఫిక్ సార్జిన్, ట్రాఫిక్ పాయింటు పక్కనేవున్న చెట్టుకింద నిలబడి వున్నాడు కోపంగా

''ఎక్కడికి వెళ్ళావు పాయింటు వదిలిపెట్టి ?'' తీవ్రంగా చూస్తూ అడిగాడు సార్జిన్

''కడుపులో తీవ్రంగా నొప్పి వస్తుంటే ఇప్పుడే ఆ లాడ్జింగుకెళ్ళి వస్తున్నా సార్ అంతా పది నిముషాలు కాలేదు'' అన్నాడు ప్రకాశం

''నేనిక్కడకొచ్చి అరగంట అవుతోంది''

''అరగంటా! ఏంది సార్ మీరు మాట్లాడేది''

''అసలెవర్నడిగావు వెళ్ళటానికి ?''

క్షణంలో తీవ్రమయిన కోపం వచ్చింది ''ఏందీ అడిగేదీ దొడ్డికొస్తే నువ్వెక్కడున్నావో వెతుక్కుంటూ టౌనంతా తిరిగి, నిన్నడిగి నువ్వు పొమ్మంటే పోవాలా కాస్త ఆలోచించి ప్రశ్న వెయ్యి'' అన్నాడు ప్రకాశం కోపంగా

అతను ఇంకేమీ మాట్లాడలేదు ''సరే చూస్తా'' అంటూ సైకిలెక్కాడు

'నీబోటి బోడి వెధవల్ని చాలామందిని చూశాన్లే లెట్రిన్ కెళ్ళాలంటే వీడెక్కడున్నాడో వెతుక్కుంటూ వెళ్ళి వాడు పొమ్మంటే పోవాలన్నమాట' అని తిట్టుకున్నాడు మనసులోనే 'వెధవలకు ఏం మాట్లాడుతున్నదీ అర్థం కాదనుకుంటా' అనుకున్నాడు మళ్ళీ

ఆ సంఘటన జరిగిన మూడోనాడు ప్రకాశాన్ని ట్రాఫిక్‌నుండి రిలీవ్‌చేసి, వేరే అతన్ని వేశారు దాన్ని గురించి ఏమీ పట్టించుకోలేదు ప్రకాశం అలాటిదేదో జరుగుతుందని అతను ముందే వూహించాడు మామూలుగా స్టేషను డ్యూటీకి హాజరయ్యాడు వారం రోజులు గార్డు చేశాడు 'ఈ చలికాలం రాత్రుళ్ళు మూడు గంటలపాటు తుపాకీ పట్టుకొని నిలబడితే ప్రాణం పోతోంది దేశంలో జనమంతా తిన్నా తినకపోయినా సుబ్బరంగా వెచ్చగా నిద్రపోతున్నారు తమకీ బ్రతుకులో ఆ ప్రాప్తం లేదు' అనుకున్నాడు

ఆ రోజు రాత్రి స్టేషన్‌వాచ్ వేశారు యూనిఫారం వేసుకుని తలకు తుండు గట్టిగా చుట్టుకుని ఫోను తల దగ్గర పెట్టుకొని పడుకున్నాడు ఒక రాత్రప్పుడు పెద్ద పెద్దగా కేకలు, శబ్దాలు వినపడితే ఉలిక్కిపడి లేచి చూశాడు ఐ డీ పార్టీ వాళ్ళు ఎవరినో కాళ్ళు కట్టి, వేటని వేలాడదీసినట్టు వేలాడదీసి కొడుతున్నారు అతను దెబ్బలు భరించలేక పెద్ద పెద్దగా అరుస్తున్నాడు

'ఎప్పుడూ వుండే గోలేలే' అనుకుని అక్కడనుండి పక్క తీసుకుని వెళ్ళి వేరేచోట వేసుకుని పడుకున్నాడు తెల్లవారిన తరువాత లేచేసరికి స్టేషనంతా హడావిడిగా వుంది బయటంతా జనం వున్నారు ఏమిటో అర్థం కాలేదు

''ఏమిటి సార్?'' సార్జెన్ని అడిగాడు

''రాత్రి ఐ డీ పార్టీవాళ్ళు కొట్టినతను లాకప్‌లో చచ్చిపోయాడంట ఎట్లా తెలిసిందో, యువజన సంఘం వాళ్ళు స్టేషనుమీద కొచ్చి పడ్డారు ఒకటే గొడవ ఏమయిద్దో ఏమో నేనే రాత్రి ఇన్‌చార్జిని నాకు తగులుకుంటది నన్ను సస్పెన్షన్లో పెడతారు '' అన్నాడు భయంగా

ఐడీ పార్టీ వాళ్ళు నలుగురూ ఎటుపోయారో కనపడలేదు లాకప్పులో శవం వుంది లాకప్పులో వున్న మిగిలిన పదిమందినీ బయటకు తీసి వరండాలో కూర్చోపెట్టారు

విషయాన్ని క్షణాల్లో ఫోన్లమీద యస్పీకి, డి ఐ జీకి తెలియజేశారు యస్సై మోటారు సైకిలు వేసుకుని డి యస్పీ బంగళాకువెళ్ళి విషయం చెప్పాడు

యస్పీకి ఫోను చేశాడు డి యస్పీ

''యువజన సంఘం వాళ్ళని మేనేజ్ చెయ్యటానికి వీలవుతుందేమో చూడు'' అన్నాడు యస్పీ

''లేదుసార్ వాళ్ళు చాలా పట్టుదలగా వున్నారు నిముష నిముషానికి స్టేషను దగ్గర జనం ఎక్కువవుతున్నారు'' అన్నాడు డి యస్పీ

''సరే నువ్వొక రేడియో మెసేజ్ నాకివ్వు దానిమీద బేసయ్యి నేను సస్పెండ్ ఆర్డర్లు పంపిస్తా మనచేతులు కడుక్కోవటం ముఖ్యం రేపు ప్రతిపక్షాలు అసెంబ్లీలో గొడవచేస్తే నన్నే అడిగేది గవర్నమెంటు తహశీల్దారుతో ఇంక్వెస్టు చేయించేసి, ఫార్మాలిటీస్ పూర్తి చేయించండి నేనేమీ యాక్షన్ తీసుకోలేదంటే నాకు పనిష్మెంటిస్తారు'' అన్నాడు యస్పీ

''అవునుసార్ కేసు రిజిష్టర్ చేసి, బాడీని ఇంక్వెస్ట్ చేయించి, పి యమ్ కి పంపించేసి, ఇన్‌వెస్టిగేషన్ స్టార్ట్ చేస్తా సార్'' అన్నాడు డీ యస్పీ

''సరే'' అని ఫోను పెట్టేశాడు యస్పీ అవతల

మిగిలిన కార్యక్రమమంతా ఒకదాని తరువాత ఒకటిగా జరిగిపోయింది రెవిన్యూ అధికారి శవ పంచాయితీ చేసి, పి యమ్‌కు ప్రభుత్వాసుపత్రికి పంపించాడు బాడీని లాకప్పులో వున్న ఆ పదిమందిని ఆ రాత్రే అరెస్టు చేసినట్లు 'ఫార్టీవన్' సి ఆర్ పీ సీ పెట్టి కోర్టుకు పంపించారు ఆ పదిమందినీ ఈకేసులో సాక్షులుగా పెట్టారు యువజన సంఘం వాళ్ళు ఐడీ పార్టీవాళ్ళు ఇళ్ళూ వాకిళ్ళూ పెళ్ళాం పిల్లల్ని వదిలిపెట్టి పరారీలో వున్నారు

నిత్యం రోకటిపాటలాగా సాగే పోలీసు జీవితాల్లో, అడపాగడపా జరుగుతుండే ఇలాటి సంఘటనలు, వాళ్ళు మాట్లాడుకోవటానికొక కొత్త విషయాన్ని ల[illegible]దిస్తాయి జరిగిన విషయానికి చిలవలు పలవలు కల్పించి, తనివితీరా మాట్లాడుకుంటారు

''వాళ్ళు సంపాదించి పెట్టినంత కాలం తెగతిన్నారు ఆఫీసర్లు తీరావాళ్ళకి ఆపద వచ్చేసరికి ఎవరికి వాళ్ళు తప్పుకున్నారు పాపం వాళ్ళు నలుగురూ ఎన్ని అవస్థలు పడుతున్నారో'' అన్నాడు ఒక పీసీ సానుభూతిగా

''మొన్నటికి మొన్న నాగేంద్రంగాడు ఆ ఆడదాని విషయంలో ఎంత దెబ్బతిన్నాడు పాపం సి ఐ ని అడ్డం పెట్టుకొని సంపాదించిన దానితోపాటు, వాళ్ళ అమ్మానాన్నా సంపాది[illegible] ఇచ్చిపోయింది కూడా [illegible]గొట్టుకున్నాడు కేసు కొట్టేయించుకో[illegible]'

''ఈళ్ళ పరిస్థితికూడా ఇంతే సంపాదించిందేదో ఉంటుందికదా దానికి ఇంకా అంతేసుకున్నా ఏం గట్టెక్కుతారో నమ్మకం లేదు''

''ఈ యువజన సంఘం నా కొడుకుల్ని నిలబెట్టి కాల్చాలి ఈళ్ళెమ్మల్ని ఎవరికీ పట్టనియ్యి వీళ్ళకే పట్టినట్టు అన్నిట్లోనూ వేలు పెడతారు''

''వాళ్ళ ననుకొని వుపయోగం ఏముంది మన బంగారం మంచిదయితే రోజులు ఇంతకు ముందు లాగాలేవు రోజుల్ని బట్టి మనమూ నడుచుకోవాలి అంతేకాని మనం ఏం చేసినా చెల్లిద్ది అనుకునే రోజులు పోయినియ్''

''అయినా వీళ్ళు ఆ కొట్టటమేమిటి ? వాడు నేరస్థుడే అనుకో కనీసం తోటి మనిషనే ఆలోచన కూడా లేకుండా, తాగొచ్చి, ఏం బాదుడు అది? గొడ్డుని కూడా అట్టా కొట్టమే మనం''

''ఇట్లాంటియ్యి ఒకటీ అరా జరుగుతూ వుంటేగాని, మిగిలినవాళ్ళు కాస్త కంట్రోలులో వుండరు ఎవడినంటే వాడిని తెస్తారు నెలల తరబడి లాకప్పులో పడేస్తారు వాడి మంచీ చెడూ, తిండీ తిప్పలు చూడరు ఎవరన్నా మనబోటోళ్ళం చెప్పబోతే మనల్ని ఉరిమిచూస్తారు చేసుకున్న వాడికి చేసుకున్నంత అని వూరకన్నారా ? ఎవుడిపాపం వాడిని తింటది పెద్దలు వూరికే చెప్పలా''

''కేసు ఏమయిద్దో? ''

ఐడీ పార్టీ వాళ్ళకలా జరిగినందుకు మనసులో ఎంతో సంతోషించారు కొంతమంది కానీ పైకి మాత్రం బైటపడలేదు

''కేసు ఏమయినా కానివ్వు ఈ విషయం అన్ని పేపర్లలోనూ పడిందికదా మనం బైటకెళితే మనల్ని చూచిన ప్రతివాళ్ళూ ఇదే విషయం మాట్లాడుకోవటం ఎరేత నామర్దా'' అన్నాడు ఒకతను

''అయినా వీళ్ళయినా కొంచెం పూసుకోమంటే వళ్ళంతా పూసుకుంటారు ఆఫీసర్ల బుద్ధి తెలుసుకోలేకపోతే ఎట్లా ఈ ఆఫీసరు నా కొడుకులు ఎంత ఘోరమైన పని చెయ్యటానికయినా వెనకాడరు మనల్ని అడ్డం పెట్టుకుని వాళ్ళకు కావాల్సింది బంగారం, డబ్బు వాళ్ళిద్దరికీ, అదే ఆ రిక్రూట్‌లు సుబ్రహ్మణ్యం, రామలింగం వాళ్ళిద్దరికీ ప్రొబేషను పిరీడ్ ఎక్స్‌టెండ్ చేయించాడంట యస్సై వాళ్ళని పగలూ రాత్రి వాడుకుంటూనే వున్నారు వాళ్ళతో చేయించని పనిలేదు వాడు నాగేంద్రం గాడు సస్పెండు అయిందాకా రెండు పూలోడికి, లంజల్ని తీసుకుపోయి లాడ్జింగులో వదిలిపెట్టి వచ్చేవాడు వాడు సస్పెండు అయినాక ఆ రైటరుగాడు ఎవుటికి పడితేవాడికి ఆ పని చెపుతున్నాడు ఓసారి ఈ సుబ్రహ్మణ్యాన్ని పిలిచి, 'ఏయ్ మిస్టర్ నువ్వు బుల్లన్నగాడి కంపెనీకి పోయి, అక్కడ ఒక పిల్ల వుంటుంది జ్యోతి అని, దాన్ని వెంటబెట్టుకొని వసంతవిహార్ లాడ్జి కెళ్ళి యస్సైగారుంటారు అక్కడ, అక్కడ వదిలిపెట్టి, తెల్లవారుఝామున నాలుగింటికెళ్ళి దాన్ని తీసుకుపోయి బుల్లన్నగాడి కంపెనీలో వదిలిపెట్టి రా' అన్నాడంట ఆ మాటకతను బిత్తరపోయి సీరియస్ వార్నింగు ఇచ్చాడంట సరే అని రామలింగానికి చెపితే అతనూ అదేమాట అన్నాడంట సందు దొరికింది కదా అని యస్సై, సి ఐ లు కలిసి ప్రొబేషన్ ఎక్స్‌టెండ్ చేశారు చూడండి ఎంత అన్యాయమో''

''ఈ డబ్బారైటరుగాడికి కూడా పొగరెక్కింది వాడిష్టం వచ్చినట్లు డ్యూటీలు వేస్తున్నాడు వాడికి కాఫీలు, టీలు తాగించినోడి నెంబరు అసలు డ్యూటీ రోష్టరులోనే కనపడటం లేదు ఆ రైటరుగాడి అండ చూసుకొని ఇరగదీసుకుంటున్నాడు వాడి సంగతి తేలవాలి''

జరిగిన సంఘటన నాలుగయిదు రోజుల్లో పాతబడిపోయింది మళ్ళీ మామూలు

ఊకదంపుడు మాటలే, రోకటి పాట బ్రతుకులే

ఐ డీ పార్టీ వాళ్ళు నలుగురూ సస్పెన్షన్‌లో వుండటం వలన కొత్త ఐ డీ పార్టీని ఫాం చేస్తారని అనుకుంటున్నారు చాలామందికి ఐ డీ పార్టీలో చెయ్యాలనే కుతూహలం మనస్సులో వుంది కాని పైకి మాత్రం ఎవరికీ ఇష్టం లేనట్లు పెదవి విరుస్తున్నారు కొంతమంది జరిగిన సంఘటన గుర్తుకు తెచ్చుకుని భయపడుతున్నారు ఓ సాయంత్రం రోల్‌కాల్‌లో యస్పై ఈ విషయాన్ని ప్రస్తావనకు తెచ్చాడు

రైటరు కూడా ఏదో పనున్నట్టు వచ్చి అక్కడ నిలబడ్డాడు ''కొత్త ఐ డీ పార్టీ ఫాం చెయ్యాలనుకుంటున్నాము సి ఐ గారికి కూడా చెప్పాను మీలో ఎవరన్నా విల్లింగు ఉన్నవాళ్ళు చేతులెత్తండి'' అన్నాడు యస్పై ఎవరూ కదలలేదు చేతులెత్తాలనీ, ఐడీ పార్టీ చెయ్యాలని మనస్సులో వున్నవాళ్ళు, మిగిలినవాళ్ళతో పైకిమాత్రం తమకిష్టం లేదన్నారు మొన్న ఇప్పుడు చేతులెత్తితే ఏమన్నా అనుకుంటారేమో అని జంకు అలాకాకుండా యస్పై తనంతట తను పిలిస్తే వెళ్ళి, తరువాత ఎవరన్నా అడిగితే, 'ఏం చెయ్యమంటారు, మాకైతే ఇష్టం లేదు యస్పై రమ్మంటే రానననటానికి వీలులేదు కదా ఇది డిసిప్లైన్ ఫోర్సుకదా, కాబట్టి గట్టిగా మనం 'రాము ' అంటే అప్పుడు ఆఫీసర్లు ఏమనకపోయినా తరువాత మనస్సులో పెట్టుకొని ఏదన్నా స్పెషల్ రిపోర్టు రాస్తారనే భయంతో వెళ్ళానని చెప్పొచ్చు ఆ మాట వాస్తవానికి దగ్గరగా వుంటది కాబట్టి ఎవ్వరూ పెద్దగా పట్టించుకోరు' అనుకున్నారు చాలామంది

''సరే ఎవరికీ ఇష్టం లేకపోతే నేనే సెలక్టు చేస్తా'' అన్నాడు యస్పై ఐ డీ పార్టీ చెయ్యాలని వువ్విళ్ళూరుతున్న ముగ్గురు పీసీలనీ సెలక్టు చేసుకున్నాడు నాలుగో మనిషిగా ప్రకాశాన్ని పిలిచాడు

''నాకు చేతకాదు సార్'' అన్నాడు ప్రకాశం

''ఇందులో చేతకావటానికి ఏముంది వాళ్ళతో కలిసి నాలుగు రోజులు తిరిగావంటే అదే అర్థమయ్యిపోయిద్ది'' అన్నాడు యస్పై అతని వుద్దేశ్యం ప్రకాశాన్ని ఐ డీ పార్టీ వేస్తే తన తలనొప్పి తగ్గిద్దని, ఏదైనా జరిగితే కనీసం సస్పెండన్నా అవుతాడనే దురుద్దేశ్యమే

''మీరు ఐ డీ పార్టీకి బాగానే పనికొస్తారండి మీరుండొచ్చు'' అన్నాడు రైటరు అభిమానాన్ని ఒలకబోస్తూ

ప్రకాశం నవ్వాడు చిన్నగా ''ఈ వయస్సులో నేను ఏం చెయ్యగలను సార్ ఐ డీ పార్టీ సైకిలు గట్టిగా ఒక ఫర్లాంగు తొక్కితే ఆయాసమొస్తోంది నేను చెయ్యలేను సార్ అది కుర్రవాళ్ళు చేసే పని'' అన్నాడు వినయంగా

''సరే నీ యిష్టం నన్నడిగితే దీనికి కుర్రోళ్ళు పనికిరారయ్యా వాళ్ళేదో హుషారుగా తిరుగుతారనేకానీ, వూరక ఆవేశమే ఆలోచన తక్కువ ఇంతకు ముందువాళ్ళ పని చూశావుగా నీబోటివాళ్ళయితే కాస్త నిదానించి ''

''వద్దు సార్ ఆ నెత్తురుకూడు నాకొద్దు నా సర్వీసులో నేనెవడ్నీ చెయ్యెత్తి కొట్టలేదు ఇదే పాపం ఇంకా ఎక్కడ ఆ పాపం నేను మూటకట్టుకునేది'' అన్నాడు ప్రకాశం

''అందరూ నీలాగే పాపమనుకుంటే ఇంక డిపార్టుమెంటులో ఎవరూ వుండరు సరే, సరేలే'' అన్నాడు విసుగ్గా యస్పై ''సరే మీరు ముగ్గురే తిరుగుతూ వుండండి నాలుగో మనిషిని చూసిందాకా ఐ డి పార్టీ వాళ్ళు ముఖ్యంగా, దాదా అని ఒకడున్నాడు, వాడిని పట్టుకోవాలి ఆ వివరాలన్నీ తరువాత చెపుతాను పోండి'' అన్నాడు యస్పై

అంతా బయటకు వచ్చారు

''వీళ్ళు స్వార్థానికి నలుగురు బలయ్యారు తరువాత వీళ్ళు మీరు తెలివిగానే తప్పుకున్నారు'' అన్నాడు ఆంజనేయులు ప్రకాశంతో

''తప్పించుకొనేదేముంది నాకు ఇష్టం లేదు ఆంజనేయులూ'' అన్నాడు ప్రకాశం

''అదేలే సార్ మీ సంగతి నాకు తెలియదా ఏమిటి ? ఇప్పుడు నాగేంద్రం పోస్టులో సి ఐ దగ్గరకు ఎవరిని పంపాలా అని చూస్తున్నారు ఎవరూ పోమంటున్నారు అక్కడికి'' అన్నాడు ఆంజనేయులు

''ఎవరు పోతారు ఆ మహాతల్లి చేపని రుద్దినట్లు రుద్దిద్దంట''

''సరేలేకాని వచ్చే నెలలోనే, పైవచ్చే నెలలోనో పోలీసు సెలక్షన్లు వున్నాయంట మీ అబ్బాయిని ఏమన్నా ''

''అహ ఆ ఉద్దేశ్యం లేదు ఇంకో సంవత్సరం వుంటే ఆ బియ్యే అయిపోయిద్ది చాలు వాడన్నా కాస్త సుఖపడాలని నా కోరిక''

ఇద్దరూ మాట్లాడుకుంటూ బైటకెళ్ళబోయారు సి ఐ జీపు లోపలకు వస్తూ కనపడింది ''వాడొస్తున్నాడు వెనక్కి రండి'' అని ప్రకాశాన్ని చెయ్యి పట్టుకొని బరబరా లోపలకు లాక్కొచ్చాడు ఆంజనేయులు

''అరే, అరే, ఏమిటయ్యామరీ ఏమిటంత కంగారు ఏమి చేస్తాడు తింటాడా ఏమిటీ మరీ ఇంత భయం'' అన్నాడు నవ్వుతూ ప్రకాశం

''మీకు తెలియదు ఆఫీసర్లకు ముందూ, గాడిదకు వెనకా వుండకూడదు'' అన్నాడు ఆంజనేయులు

ఆ మాటకు పెద్దగా నవ్వాడు ప్రకాశం ''ఎందుకని ? కారణం లేకుండానే కాళ్ళు విదిలిస్తాయనా?'' అని మళ్ళీ నవ్వాడు ఆంజనేయులు కూడా నవ్వాడు సి ఐ జీపు దిగి తన రూములోకెళ్ళాక ఇద్దరూ బైటకి వెళ్ళారు

''అటు పోదాం రండి టీ తాగొద్దాం'' అన్నాడు ఆంజనేయులు

ఇద్దరూ మాట్లాడుకుంటూ టీ బంకు దగ్గరకు వెళ్ళారు దారిలో, మాటల్లో, అడగలేక అడుగుతున్నట్టు ఆంజనేయులు, ''సార్, మీరేమీ అనుకోకపోతే, మీరేమిట్లు ?'' అన్నాడు ఆ మాట వినేసరికి ప్రకాశం ముఖంలో వున్న సంతోషం కనుమరుగయ్యింది కాని అంతలోనే తేరుకున్నట్టు చిన్నగా నవ్వాడు ఆ నవ్వులో పేలవత్వం మినహా ఇంకేమీ లేదు

చెప్పాడు

''ఏదయితే ఏం లేండి మంచితనం కావాలిగాని మనోళ్ళకి చాలా మందికి వుంది అడగాలని కాని మిమ్మల్నడిగే దమ్ములు అందరికీ వుండొద్దూ నేనంటే మీ శిష్యుడ్ని కాబట్టి'' అని నవ్వాడు ఆంజనేయులు ప్రకాశం ముఖంలో కనబడ్డ భావాల్ని దూరం చెయ్యాలనే ఆ మాటలు అన్నాడు అతను

ప్రకాశం నవ్వి వూరుకున్నాడు టీకొట్టు దగ్గరకు వెళ్ళేసరికి అక్కడ రామచంద్రయ్య కూర్చుని వున్నాడు టీకొట్టు అతనితో ''మణీ, ఫస్ట్‌క్లాసు టీలు రెండు చెయ్యి'' అన్నాడు ఆంజనేయులు

ప్రకాశం తేరుకోవటానికి కొంచెం టైం పట్టింది రెండు నిముషాల తరువాత, ''ఏంది రామచంద్రయ్యా ? ఏంటి అట్లాగున్నావు ? వంట్లో బాగా లేదా ?'' అనడిగాడు

రామచంద్రయ్య నవ్వుతూ పెరిగిన గడ్డం తడుముకున్నాడు ''వంట్లో బాగానే వుంది కాస్త ~నుండి సెలవుపెట్టా'' అన్నాడు

''చూస్తుంటే లంకణాల మనిషిలాగా కనపడుతున్నారు'' అన్నాడు ఆంజనేయులు

''ఎన్నిరోజులు సి యల్?'' అడిగాడు ప్రకాశం

''ఆర్రోజులు పెడితే మూడ్రోజులిచ్చాడు ఆదివారం పర్మిషన్ ఇవ్వలేదు ఆయనకి అలవాటు లేదంట ఈఁడెమ్మ '' కోపంగా తిట్టాడు రామచంద్రయ్య

''ఈ నా కొడుకులకు ఏదన్నా సొంత పనిపడితే ఏ విలేజి విజిటింగో, ఏ డిటెక్షన్ డ్యూటో రాసుకుని పోతారు మనకు హక్కువున్నా, సి యల్ ఇవ్వటానికి ఏడిపించుకు తింటారు నా సర్వీసులో ఏ సంవత్సరము కూడా నాలుగయిదు రోజులుకన్నా ఎక్కువ సి యల్ వాడుకోలేదు ఎప్పుడు సి యల్ పెట్టినా కాగితాలు విసిరేస్తారు మనల్ని విదిలించి కొడతారు కాస్త గట్టిగా అడిగితే సెలవివ్వను నీకు దిక్కున్నచోట చెప్పుకోమంటారు లేకపోతే సిక్కు అవమంటారు ఎన్నిసార్లు సిక్కులవుతాము సిక్కయితే ఆ మెడికల్ లీవు అయిపోగానే జీతం కట్ అయిపోయిద్ది ఏ డి యస్పీ ఇనస్పెక్షనులోనో, యస్పీ ఇనస్పెక్షనులోనో ఇవన్నీ ఎవడన్నా కాస్త ధైర్యం చేసి చెపితే, అవన్నీ ఆ అధికార్లు ఇనస్పెక్షన్ నోట్సులో రాసి పోతారు 'సి యల్స్, వీక్లీ ఆఫ్‌లు ఇవ్వవలసినద' ని రాస్తారు కానీ అవన్నీ కాగితాల వరకే ఆఫీసర్లకు చెప్పినందుకు యస్సైలు మనల్ని, అంటే ఆ చెప్పినోళ్ళని నానా ఇబ్బందులు పెడతారు నిజంగా నరకమనుకో మరి ఇది ఎప్పటికి మారిద్దోగాని మొన్నటికి మొన్న సి యల్ కోసం పొద్దున తొమ్మిది గంటల నుండి ఒంటిగంట వరకు పడిగాపులు పడీపడీ తీరా పోయి కనపడితే, ఏమిటో వాడి ఆస్తంతా మనకు రాసిస్తున్నట్టుగా మొఖం ఇంత లావున పెట్టుకుంటాడు యస్సై సాయంత్రం కనపడమంటాడు రేపటి నుండి ఇస్తానంటాడు సమయం సందర్భం లేకుండా లోపలకు వచ్చానంటాడు తనేదో అర్జంటు పనిమీద పోతున్నప్పుడు వస్తామని విసుక్కుంటాడు అక్కడ ఎవరన్నా పబ్లిక్కువుంటే ఇంకా రెచ్చిపోయి మనల్ని పూచికపుల్ల విలువ లేకుండా మాట్లాడతాడు మనకి కడుపులో రక్తం వుడికిపోతూ వుంటుంది ఏడుపు వస్తుంటుంది నవ్వటానికి ప్రయత్నం చెయ్యబోతాం కాని నవ్వకూడదు ఇలాటి పరిస్థితుల్లో మనల్ని ఎగాదిగా పరీక్ష చేస్తాడు బూట్‌పాలీష్ లేదంటాడు నెంబరేదంటాడు గడ్డం చెయ్యలేదంటాడు యూనిఫారం మాసి పోయిందంటాడు తన గొప్పతనం గురించీ, తన విశాల హృదయం గురించీ ఆ జనం ముందు చిన్న లెక్చరివ్వబోతాడు పెట్టుకున్న దానిలో సగం రోజులు కట్‌చేసి, దానికింద, 'సెలవును పొడిగించరాదు' అని రాసి ఇస్తాడు ఆ కాగితం తీసుకుని సెల్యూట్ చేసి ఇక పూజారి దగ్గరకొచ్చాను ఎవరూ ? రైటరన్నమాట పూజారి అంటే ''

అతని మాటలకు అడ్డువస్తూ ప్రకాశం, ''సెల్యూట్ చెయ్యకుండా వచ్చే సమస్యే లేదులే డిపార్టుమెంటులో చేరంగానే, ఈ చేతికి ఆ లక్షణం వచ్చేసిద్ది మనకంటే పెద్దోడెవడు కనపడ్డా ఆటోమేటిక్‌గా ఈ చెయ్యి పైకిలేచిద్ది మనం సెల్యూట్ చెయ్యాలని ప్రత్యేకంగా అనుకోనవసరం లేదు పాముని చూస్తే ఎలా, కాళ్ళు వాటంతటవే దూరంగా పరిగెత్తుతాయో, ఈ విషపురుగుల్ని చూచినా మన చేతులంతే, లేకపోతే ప్రమాదం'' అన్నాడు

''అదేలేండి'' అని నవ్వి, ''నన్ను చెప్పనివ్వండి పూర్తిగా'' అన్నాడు రామచంద్రయ్య

వాళ్ళ సమస్యల్ని గురించి వాళ్ళు ఇలా మాట్లాడుకోవటం వాళ్ళకు హుషారుగా వుంది బాగా

''చెప్పండి మీరు చెప్పినాక నేనొకటి చెపుతా మీరు మీది కానియ్యండి'' అన్నాడు

ఆంజనేయులు ఉత్సాహంగా కళ్ళు టపటపలాడిస్తూ

''సరే అక్కడినుండి రైటరు దగ్గరకొచ్చి ఆ సి యల్ కాగితం ఇచ్చి, సి యల్ పాస్‌పోర్టు అడిగితే, వూఁ అన్నాడు ఆఁ అన్నాడు ఏమీ చెప్పడు మనం కాస్త గట్టిగా అడిగితే, 'ఏమయ్యా నాపని అంతా వదిలిపెట్టి నీ పనిచేస్తూ కూర్చోవాలా? నాకింకేమీ పనిలేదా ?' అంటాడు కాసేపున్నాక బజారుకు పంపి రెండు దస్తాలు రావులు తెచ్చిచ్చినాక, కోమల టాకీసు కెళ్ళి సి ఐ గారి ఫామిలీ వస్తున్నారని మేనేజరుకి చెప్పి రమ్మన్నాడు

'ఫోనుచేసి చెప్పమంటారా ?' అన్నాను

'ఆఁ ఫోను మన సొంత విషయాలకా ?' అని దబాయించాడు ''పొద్దున లెగిస్తే, ఆఫీసర్లంతా ఫోన్లల్లో మాట్లాడే విషయాలు మూడొంతులు పైగా తమ స్వంత విషయాలు ''

''వేన్లు, జీపులు మాత్రం గవర్నమెంటు పనిమీద తిరిగేది ఒక పావలావంతన్నా వుంటదా ? పొద్దునలేస్తే పిల్లల్ని స్కూళ్ళకీ, అమ్మగార్లని సినిమాలకూ, షికార్లకూ, గుళ్ళకూ, చుట్టాలింటికీ, ఆస్పత్రులకూ, ఆడపా దడపా అయ్యగార్లు ముండల కొంపలకూ ఇక్కడకేగా అంతకు మించి వెహికల్ వేసుకుని వీళ్ళెప్పుడన్నా ఇన్వెస్టిగేషన్ నిమిత్తము ఫలానావూరు పోయినట్టు మనకి తెలుసా? '' అన్నాడు ఆంజనేయులు రామచంద్రయ్య మాటలకు హుషారుగా అడ్డు వస్తూ

''అదేలే వాడు కేవలం నన్ను సఫర్ చెయ్యాలనే ఆ మాట అన్నాడు సరేలే అని తిట్టుకుంటూ హాలుకిపోయి మేనేజరుకి ఈ విషయం చెపితే అతను పాపం ఏమనలేక అయిష్టంగానే తలూపి, 'మీ సిఐ రిటైరయ్యాక ఒక హాలు కట్టించుకుంటే మంచిది' అన్నాడు నేను ఆ విషయాన్ని పొడిగించకుండా చిన్నగా నవ్వి వచ్చా రైటరుగాడు అప్పుడు పాసుపోర్టు రాసిచ్చాడు దానిలోకూడా 'సెలవు పొడిగించరాదు' అని రాసి, అండర్‌లైన్ చేసి ఇచ్చాడు. ఆ సి యల్ అప్పటికి ఒకపూట గడిచిపోయినట్లే చూశారా ఎన్ని ఇబ్బందులో'' అన్నాడు

''సరేనేనొక విషయం చెపుతా నుండండి, ఉండండి'' అన్నాడు ఆంజనేయులు ఉత్సాహంగా

''ఏందో చెప్పు నేనూ వింటా'' అంటూ వచ్చి కూర్చుని, ''టీ ఒకటి చెయ్యవయ్యా మణీ'' అన్నాడు పీ సీ ఆదాం

''నమస్తే కామ్రేడ్'' అన్నాడు ఆంజనేయులు ఆదాంతో

''నమస్తే ఏమిటి విషయం ? ఏదో చెపుతానన్నావుగా చెప్పు'' అన్నాడు ఆదాం మణి ఇచ్చిన టీ అందుకుంటూ

''ఏం లేదు సార్ పబ్లిక్కులో డిపార్టుమెంటు ప్రెస్టేజి కాపాడాలంటారు ఆఫీసర్లేమో రూపాయి కోసం ఎంత నీచమైన పనైనా చేస్తారు వాడు నిజలింగప్ప తెలుసుగా మీకంతా నేను ఇక్కడ కొచ్చిన క్రొత్తలో మనం ట్రాఫిక్‌లో వుంటే మనికి కాఫీలూ, సిగరెట్లు తెచ్చిచ్చి, మనమేదన్నా ఇస్తేవాటితో టీ తాగి, బీడీలు కొనుక్కునేవాడు వాడిప్పుడు బ్రోకరేజి చేసి, నాలుగు రూపాయలు సంపాదించి, కాస్త తెల్లగుడ్డలు వేసుకొని తిరుగుతుండేసరికి వాడికి తనముందు సీటిస్తాడు యస్సై స్టేషన్లో మనం వాడికి కప్పులు కడిగి టీ ఇవ్వాలి స్టేషన్లో వాడు తాగిన కప్పు మనం తీయాలి ఇంకేంది మన ప్రిస్టేజి ఏదో మన ఆఫీసర్లకంటే తప్పదు వాళ్ళ టేబిళ్ళు తుడవాలి కాఫీలూ అవీ పోసివ్వాలి అసలు అదీ చెయ్యగూడదనుకో కాని తప్పని పరిస్థితి మరీ ఆ నా కొడుకులకు ఎక్కడిస్తామండి'' అన్నాడు బాధగా

''అబ్బాయ్ ఈ బానిస విధానం పోవాలంటే ఈ వ్యవస్థ మారాలయ్యా'' అన్నాడు ఆదాం

టీ గ్లాసూ, డబ్బులూ మణికి ఇచ్చి, ''వస్తా, నాక్కాస్త పనుంది'' అని వెళ్ళిపోయాడు

''ఆఁ మారిద్ది నీబోటి పక్కలేసే వాళ్ళుంటే బాగానే మారిద్ది నీయమ్మ బతుకుని పొరుగాక కమ్యూనిస్టు సిద్ధాంతం చెపుతాడు చేసేదేమో బ్రోకరుపని ఎప్పుడన్నా చూడు, ఆ మాట తప్ప ఇంకొకటి అనడు ఈ వ్యవస్థ మారాలీ, ఈ వ్యవస్థ మారాలి చేసేదేమో తప్పుడు పనులు ధూ'' అన్నాడు రామచంద్రయ్య

''ఆ సిద్ధాంతం మంచిదే సార్'' అన్నాడు ఆంజనేయులు

''సిద్ధాంతం మంచిదే కాని ఆ సిద్ధాంతం పేరుచాటున, ఇదిగో, ఇట్లాంటి డాఫర్ నాయాళ్ళు వుండి, దానిమీద గౌరవం లేకుండా చేస్తున్నారు మిగిలినవాళ్ళకు'' అన్నాడు ప్రకాశం

''ఇతనికింత వయసొచ్చిందా ఇప్పటికీ తనతోటి వాళ్ళమీద చాడీలు చెపుతుంటాడు''

''దానికి వయస్సుతో పనేముంది ఆ బుద్ధి చావుతోకాని పోదు'' అంటూ లేచాడు ప్రకాశం ''పోదాంపద ఆంజనేయులూ'' అన్నాడు

''వస్తాం రామచంద్రయ్యగారూ'' అంటూ లేచి ప్రకాశంతో కలిసి లోపలకొచ్చాడు ఆంజనేయులు రామలింగం ఎదురయ్యాడు

''ఏమండీ మీరు టీ ఏ లు తీసుకున్నారా ?'' అన్నాడు రామలింగం

''ఇస్తున్నాడా రైటరు ?''

''ఆఁ''

ఇద్దరూ లోపలకి వెళ్ళారు ఎక్విటేన్స్ రోలుమీదా, రఫ్ కేష్ బుక్‌లో సంతకాలు చేశారు వచ్చిన టి ఏ లో రూపాయికి అయిదు పైసల చొప్పున లెఖ్ఖ చూసి పక్కన పెట్టి, మిగతావి ఇచ్చాడు రైటరు

మర్రోజు ఆ కమీషను డబ్బులు మూడొందల చిల్లరా, జిల్లా పోలీసు ఆఫీసుకు పంపాల్సిన కొన్ని కవర్లూ ఇచ్చి జిల్లా పోలీసు ఆఫీసుకు పంపించారు ప్రకాశాన్ని అలా తీసిన కమీషనులో రైటరుదీ, డబ్బా రైటరుదీ, ఇంకా వాళ్ళ ముఖ్యులిదీ లేదు మిగిలిన వాళ్ళ డబ్బులు మాత్రం టీ ఏ గుమస్తాకి ఇవ్వమని చెప్పి పంపారు

ప్రకాశం, జిల్లాపోలీసు ఆఫీసుకి వెళ్ళాడు కనపడ్డ గుమాస్తా లందరికీ సెల్యూట్‌లు చేసుకుంటూ వెళ్ళాడు

చాలా మంది గుమాస్తాలు, కానిస్టేబులు కనపడితే సెల్యూట్ కోసమన్నట్టు తీక్షణంగా చూస్తారు సెల్యూట్ చెయ్యంగానే ఎంతో ఆనందం పొందినట్టు పాచిపళ్ళన్నీ కనపడేలాగా నవ్వుతారు ప్రతి గుమస్తాతో పని వుంటుందనే ఉద్దేశ్యంతో పీసీలు, హెచ్ సీలు అంతా అందరితో మంచిగా వుండటానికి ప్రయత్నిస్తారు ఒకళ్ళు ఇంక్రిమెంట్లు, ఒకళ్ళు టి ఏ లు, ఒకళ్ళు హౌస్‌రెంట్లు, ఒకళ్ళు లీవులు, ఒకళ్ళు ట్రాన్స్‌ఫర్‌లు ఇలా ప్రతివాళ్ళూ ఏదో ఒక పని చూసేవాళ్ళే కాబట్టి పేచీలు ఎందుకన్నట్టు గుమస్తాలందరితో మంచిగా వుండడానికి ప్రయత్నిస్తారు పోలీసు ఆఫీసులో గుమస్తాలంతా పీసీల దగ్గర తామే యస్పీలన్నట్టు ప్రవర్తిస్తారు ఎంత చిన్న బిల్లు రావాలన్నా అయిదో పదో ఇచ్చుకుని, ఒకటికి నాలుగుసార్లు కాఫీలకి టిఫిన్‌లకు తీసుకుపోతే తప్ప ఆ పని కాదు వందకు మించిన బిల్లయితే ఎక్కువ మొత్తం ఇవ్వాలి ఏ కానిస్టేబులు ఏ పని మీద వస్తాడా, ఏ విధంగా మెలికపెడితే ఎలా డబ్బులొస్తాయా అని, కళేబరాల కోసం ఎదురుచూసే రాబందుల్లా వుంటారు డిస్ట్రిక్టు పోలీసు ఆఫీసుల్లోని కొందరు క్లర్కులు

ప్రకాశం వెళ్ళిన పని చూసుకొని తిరిగొచ్చేసరికి బాగా పొద్దుపోయింది నోటీసు బోర్డు మీద తన నెంబరు గార్డు డ్యూటీకేమన్నా వేశారేమోనని చూశాడు అన్నీ కొత్త నెంబర్లు కనపడ్డాయి 'ఎవరబ్బా వీళ్ళు' అనుకుంటూ సుబ్రహ్మణ్యాన్ని అదే విషయం అడిగాడు

''వాళ్ళంతా టూ టౌన్‌వాళ్ళు ఎగస్ట్రా గార్డు వేశారు ఒక్కొక్కళ్ళకి వారం రోజులు' అన్నాడు అతను

''పోనీలే ఓ రెండు రోజులు గార్డు వెనక్కి పోయిద్ది'' అన్నాడు ప్రకాశం

స్టేషన్ అంతా ఎప్పటిలాగా సంతలాగా వుంది ఏడుపులూ, మూలుగులూ, బాధలూ, వేదనలు 'పోలీసుస్టేషను కొచ్చేవాడుగానీ, స్టేషన్ నుండి పోయేవాడుగానీ, ఆడగానీ, మగగానీ, కానిస్టేబుళ్ళతో సహా ఎవడూ సంతోషంగా వుండడు కదా!' అనుకున్నాడు ప్రకాశం పాస్‌పోర్టు మీద దాఖలా వేసి, డైరీ రాయించి, తీగ కొక్కానికి గుచ్చి బైటకొస్తుంటే ఆంజనేయులూ, గుప్తా ఎదురయ్యారు

''ఏమండీ, ఏమిటి డి పి వో (డిస్ట్రిక్ట్ పోలీసు ఆఫీసు) సంగతులు ? ఏమన్నా బిల్లు లొస్తాయంటనా ? మన డీ ఏ ఎరియర్స్ ఎప్పుడేసొగంట ?'' అన్నాడు గుప్తా

''ఎవురడిగారు ఇయ్యన్నీ వాళ్ళ నడిగినా, వ ళ్ళు మనమడిగాము కదా అని ఏదో చెపుతారు దాన్ని పట్టుకొచ్చి, ఇక్కడ మనోళ్ళకి చెప్పడమే కానీ, అనుకున్న టైంకి వాళ్ళు మనకి ఏం బిల్సు పంపించారు ? సరేలేగానీ, ఏంది స్టేషన్ ఇవాళ మరీ హడావిడిగా వుంది అయ్యవార్లకు రాబడి ఎక్కువగా వున్నట్టుందే'' అన్నాడు ప్రకాశం

''ఆఁ, లేకేమి ఆ మూలనున్న వాళ్ళు టూనైన్‌టీఫోర్లు ఇటువున్న మగోళ్ళు పదిమందీ క్లబ్బు రేడ్‌లో తెచ్చినోళ్ళు ఆ సెక్షన్ బల్లదగ్గర కూర్చున్నవాళ్ళు బ్రాకెట్ బుక్కర్లు రైటరు గదిలో వున్నవాళ్ళేమో తన్నుకుని తలలు పగలకొట్టుకొని వచ్చినవాళ్ళు ఇక్కడ యస్సైతో మాట్లాడుతున్న వాళ్ళేమో రేప్ కేసులో ముద్దాయి తరపువాళ్ళు సి ఐ గదిలో వున్నవాళ్ళేమో త్రిబుల్ మర్డర్ కేసులో ముద్దాయిల తాలూకు మనుషులు ఏ ఎస్సై దగ్గర గుసగుసలాగే వాళ్ళేమో రౌడీ షీటరు అప్పారావుగాడి తాలూకు వాడిని వదిలిపెట్టమని ఏదో బేరమాడుతున్నారు సి ఐ ఆఫీసు బయట వెయిటింగులో వున్నవాళ్ళేమో మన సింగుని గుద్దిన యాక్సిడెంటు కేసులోని వాళ్ళు ట్రాఫిక్ సార్జెన్ దగ్గర మాట్లాడే కుర్రాళ్ళేమో మోటారుసైకిలు మీద త్రిబుల్ రైడ్ '' అన్నాడు ఆంజనేయులు గుక్కతిప్పు కోకుండా

''ఇంకా ఎవరన్నా వున్నారా ? వీళ్ళంతా నీకెట్లా తెలుసయ్యా బాబూ'' అన్నాడు గుప్తా నవ్వుతూ

''మన బుర్రకి ఇలాటి అబ్రెవేషన్‌లు పెద్ద బ్రహ్మాండమైన విషయం కాదులేండి ఉండండి ఇంకా వున్నయ్ డబ్బా రైటరు దగ్గరున్న కుర్రోడేమో టెన్త్ క్లాసు సర్టిఫికెట్ పోగొట్టుకున్నాడు అతను సర్టిఫికెట్ పోయినట్లు రిపోర్టిచ్చాడు ఆ రిపోర్టు నిజమేనని రాసి, యస్ హెచ్ వో (స్టేషన్ హౌస్ ఆఫీసరు) సీలు వేసి, యస్సైతో సంతకం చేయించి యివ్వటానికి యాభై దగ్గర నుండి బేరాలు పెడుతున్నాడు డబ్బా రైటరు అదిప్పుడు ముప్పైమీది కొచ్చి ఆగింది ఇంకపోతే స్టేషను బయట సాగే వ్యవహారం ఏమిటో చెపుతా మణి టీ కొట్లో ఐ డీ పార్టీవాళ్ళు కే డీ కరీముల్లాగాడిని బెదిరిస్తున్నారు మొన్న ఆర్ యం పీ డాక్టరింట్లో జరిగిన దొంగతనంలో చాలా తక్కువ యిచ్చాడనీ, మిగతా బాకీ యివ్వకపోతే లోపలేసి ఎముకలు లెఖ్ఖపెట్టే కార్యక్రమం తీసుకోవాల్సివచ్చిద్దనీ

బెదిరిస్తున్నారు సబ్‌జైలు వార్డరూ, గార్డు ఆఫీసరూ, సబ్‌జైలులో వున్న మర్డర్ కేసు ముద్దాయికి పలావు పొట్లం, క్వార్టరు బాటిలూ అందివ్వటానికి పార్టీతో బేరం చేస్తున్నారు''

''సరే నేనొస్తానయ్యా! ఇది ఎప్పుడూ వుండేదేలే ఆకలవుతోంది మధ్యాహ్నం భోజనం కూడా చెయ్యలేదు ఆ జేబులో వున్న అయిదు రూపాయలు గుమాస్తాలని కాఫీలకు పిలుచుకుపోతే అయిపోయినియ్యి అంతా ఖర్మ '' అన్నాడు ప్రకాశం

అతని మాటలకు అడ్డు వస్తూ, ''ఖర్మ గిర్మ మన దగ్గర ఎత్తొద్దు'' అన్నాడు గుప్తా నవ్వుతూ

''అబ్బో మీరు నాస్తికులు కదా మర్చేపోయాం అయినా శెట్టిగారూ, మీరు నాస్తికులుగా మారటం ఏందీ ? ఆశ్చర్యమే'' అన్నాడు ఆంజనేయులు నవ్వుతూ

''ఆశ్చర్యమేముంది ఇదిగో నాకు జంధ్యం కూడా లేదు చూస్కో కావాలంటే'' అంటూ చొక్కా పైకెత్తబోయాడు

''తెలుసులేండి వద్దులేండి ఎత్తొద్దు, చూడలేం'' అన్నాడు ప్రకాశం

''మరి, ఇంత భయంకరమైన పరిస్థితి డిపార్టుమెంటులో ఇలాగుండటానికి కారణం దేవుడూ, ఖర్మ కాకపోతే ఇంకేమిటి ? ఈ సమస్యలకు మూలకారణం, దేవుడు, దయ్యం, ఖర్మ, పునర్జన్మ, పూర్వజన్మ ఫలితం, పాపం పుణ్యం, కులం, మతం, వర్ణం, అంటరానితనం యివే కదండీ'' అన్నాడు ఆంజనేయులు

''ప్రజలకు నాస్తికత్వం గురించీ, ఇంకా హేతువాదం గురించి తెలియకపోవటం మాత్రమే ఈ సమస్యలకు మూలం'' అన్నాడు గుప్తా

''అబ్బా! మీరుండండి మిమ్మల్ని పలకరించటమే తప్పులాగుందే'' అని నవ్వాడు ప్రకాశం ఆ మాటకు మిగిలిన ఇద్దరు కూడా నవ్వారు

''ఆఁ సరే నీదింకా కాలేదా ? వర్ణన అయిపోయిందిగా'' అన్నాడు నవ్వుతూ గుప్తా

''ఎక్కడయ్యిపోయింది అసలు విషయానికి ఇప్పుడే వస్తుంటే'' అన్నాడు ఆంజనేయులు

''సరే అటుపోయి, ఆ టీ కొట్లో కూర్చుందాం పదండి'' అన్నాడు ప్రకాశం

''అఖ్ఖరలేదండీ వక్కమాట ఇందాక ఇంతమందిని గురించి చెప్పానా ? ఇప్పుడు, మనం ఎవరిని గురించి ఆలోచిస్తామో, వాళ్ళ గురించి చెప్పబోతున్నా ఉదయం పది గంటలకు, సబ్ జైలులో వున్న భర్తని చూడటానికి ఇద్దరు చిన్నపిల్లల్ని తీసుకుని, ఒక పాలు తాగే పిల్లతో ఒకామె వచ్చింది సెంట్రీ ఒప్పుకున్నా గార్డు ఆఫీసరు డబ్బుల్లేందే లోపలకు పంపేది లేదన్నాడు ఆమె బ్రతిమిలాడి, బ్రతిమిలాడి, ఏడ్చుకుని, అదిగో, పోయి ఆ చెట్టుకింద కూర్చుంది పిల్లలతో ఇంతకుముందే అటుపోయి నాలుగిళ్ళు అడుక్కుని, పిల్లలకు పెట్టినట్టుంది మళ్ళీ వచ్చి ఆ చెట్టు కిందే కూర్చుంది ఏ వూరో, ఏ వాడో తెలియదు ఆమెని గురించి పట్టించుకున్నవాడే లేడు ''

''అబ్బా! అలాటివి చెప్పాకయ్యా ఆంజనేయులూ ఎవరు గార్డు ఆఫీసరు ? ఆ సీతారామయ్యగాడేనా ? తాగుబోతు సీతిగాడు '' అన్నాడు గుప్తా

''ఆఁ వాడే ఇంకెవడున్నాడు మనబోటోళ్ళం, 'పోనీలేండి ఒక మాట మాట్లాడి పోయిద్ది, పాపం బీదది'' అని అతన్ని కాదని లోపలకు పంపించామో, వాడు యస్పైకి రిపోర్టు చేస్తాడు నేనే ఆ మనిషిని అక్కడ కూర్చోమన్నా ఈడు ఆరు గంటలకు దిగిపోతాడు గదా దేవదానం వస్తాడు అతనికి చెప్పి లోపలకు పంపిస్తా అతను మంచి వ్యక్తి పాపం దైవభక్తుడు'' అన్నాడు ఆంజనేయులు

''ఆఁ నా ముఖం దైవభక్తిలే ఆ సీతారామయ్యతో పోల్చుకుంటే వీడు కాస్త నయమేగానీ,

వీడూ లోకుల్ని ముంచే రకమేలే నువ్వేమన్నా చెప్పు వింటాంగానీ, దైవభక్తి వున్నవాళ్ళను గురించి చెప్పమాక నాకు వళ్ళు మండిద్ది'' అన్నాడు చిరాకుని నటిస్తూ గుప్తా

''సరే చెప్పన్లే అది పోనియ్యి ఇదిగో ఇక్కడ కూర్చున్నవాళ్ళు, వాళ్ళ రైతు చేతిలో తన్నులు తినొచ్చినపాలేరుగాళ్ళు తలలు పగిలినియ్యి కనీసం మెమోలు రాసి వాళ్ళని ఆసుపత్రికి పంపటానికి కూడా తీరిక లేకుండా పోతోంది మన గొప్ప ఆఫీసర్లకి ఆ రైతుని, రైతంటే చిన్న రైతు కాదు, నాలుగొందల చిల్లర ఎకరాల భూస్వామి వాడిని ఎట్లాగూ స్టేషనుకు తీసుకురాలేరనుకో పోతే మన సుబ్రహ్మణ్యం అంటే మన కానిస్టేబులు, మనతోటివాడు, పాపం ఉదయం పదిగంటల నుండీ రెండు రోజుల సి యల్, ఒకరోజు పర్మిషన్ కొరకు పడిగాపులు పడుతున్నాడు విసుగు పుట్టి ఇప్పుడే బయటకు పోయాడు రామలింగానికేదో తగులుకున్నట్టుంది, ఆసుపత్రి కెళ్ళాడు ఇంజక్షను పొడిపించుకోవటానికి ఇవీ ఈనాటి కొన్ని విశేషాలు మీరింక ఇండ్లకెళ్ళవచ్చు బాధపడుతూ'' అన్నాడు ఆంజనేయులు నవ్వుతూ

ఆ మాటకు మిగిలినవాళ్ళూ నవ్వారు

''ఆఁ, వస్తా ఆంజనేయులు'' అన్నాడు ప్రకాశం అడుగువేస్తూ

''ఆఁ పోయిరాండి ఇవన్నీ చెప్పానని బాధపడొద్దు ఇలా చెపితే నాలోకలుగుతున్న వేదన ఏమన్నా తగ్గుతుందేమోనన్న ఉద్దేశ్యంతో చెప్పానుకానీ, వేరే ఉద్దేశ్యం కాదు అయినా అది ఏమీ తగ్గదనుకోండి అసలిలాంటి సంఘటనలు ఏమీలేకుండా వుండాలికానీ, లేకపోతే నలుగురితో చెప్పుకున్నంత మాత్రాన తగ్గిద్దా సరే మీరు పోయిరాండి కాని నాకర్థం కాని విషయం ఎక్కడంటే మనకి పై ఆఫీసర్ల వల్ల ఇబ్బందులొస్తున్నప్పుడూ, ఇతరులు మనపట్ల నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తున్నప్పుడూ, మనల్ని లెఖ్ఖచెయ్యకుండా చూచి మాట్లాడినప్పుడు, మన బాధను గురించి తీవ్రంగా ఆలోచించి నలుగురి ముందూ వాపోతామే, మరి మనం ఇతరులతో అలా ప్రవర్తించేటప్పుడు అది గుర్తుకు రాదా ? ఇతరుల బాధ మనకు కనపడదా ? అప్పుడిదంతా గుర్తురాదా మనమెంతసేపూ ఒకవైపునుండేనా ఆలోచించాల్సింది ? ఏమిటో బలే గమ్మత్తయిన మనుషులం'' అన్నాడు ఆంజనేయులు వేదనగా ఆ మాటలు ప్రకాశానికి సంతోషం కలిగించాయి

దాన్ని గురించి మాట్లాడాలనుకున్నాడు ప్రకాశం కానీ నీరసంగా వుంది అందువలన చిన్నగా నవ్వి, ''రేపుకలుద్దాం వస్తా రేపు మాట్లాడుకుందాం'' అని సైకిలెక్కాడు

స్నానం చేసి, భోజనాలు చేసేటప్పుడు, లక్ష్మి తండ్రితో ''నాన్నా రేపు నీకు గార్డు డ్యూటీ కదా ! నేను చెప్పెయ్యగలను'' అంది

''నీకెట్లా తెలుసమ్మా'' అన్నాడు ప్రకాశం

''ఇదేం పెద్ద విశేషం కాదు నాన్నా గార్డు దిగిన తరువాత మూడురోజులు బైట డ్యూటీల్లో వుంటావు ఆ మూడురోజుల్లో కూడా రెండు రోజులు నైటు బీట్లు వుంటాయి మళ్ళీ నాలుగోరోజు గార్డు అంతేగా'' అంది

''అవునమ్మా కాని ఈసారి రెండురోజులు వెనక్కి-పోయింది గార్డు టూటౌన్‌లో ఇద్దరు పీసీలకు ఒక వారం ఎగ్‌స్ట్రా గార్డు ఇచ్చారు వాళ్ళు గార్డు కొచ్చారు అందువలన రెండురోజులు వెనక్కి-పోయింది'' అన్నాడు

''నాన్నా, ఏదన్నా పొరపాటు చేసినవాళ్ళకు గార్డు డ్యూటీ పనిష్మెంటుగా ఇస్తున్నారు కదా ! మరి మీ స్టేషన్లో కంటిన్యూగా మీ పీ సీ లు గార్డు డ్యూటీ చేస్తున్నారు కదా మరి మామూలు

డ్యూటీల కన్నా అంటే గార్డు డ్యూటీలు లేని స్టేషన్లవాళ్ళకన్నా మీ స్టేషను వాళ్ళకు ఎక్కువ జీతం ఇవ్వాలి కదా ఆ లెఖ్ఖన ఎందుకంటే ఎగ్స్ట్రా డ్యూటీగా గార్డు డ్యూటీ వేస్తున్నారంటే దానిలో మిగతావాటికన్నా శరీరకష్టం ఎక్కువ వున్నదనేగా అర్థం మరి అప్పుడు కంటిన్యూగా గార్డు చేస్తున్న మీబోటోళ్ళకి ఎక్కువ జీతం ఇవ్వాలికదా'' అన్నాడు సూర్యం

''అవును కాని ఎవరూ మా సమస్యల్ని పట్టించుకొనేదీ ? సర్వీసంతా సబ్జైలు గార్డు వున్న స్టేషన్లలోనే గడిపేస్తున్న పీసీలు ఎంతోమంది వున్నారు లైఫ్ పడిన ఖయిదీల్లాగా వుంటున్నారు జీవిత ఖయిదు పడిన వాడయినా పదీ పదిహేను ఏళ్ళల్లో బయటకొస్తాడు వీడికి ఇంకా ఎక్కువ కాలం గార్డులో వుండే సందర్భాలు వున్నయ్''

''గార్డు డ్యూటీకన్నా పనిష్మెంటు ఏముంది ?'' అంది లక్ష్మి

''ఎందుకు లేదమ్మా ఈ సివిల్లోనుండి, ఏ రైల్వేకో లేకపోతే రిజర్వ్‌లోకో ట్రాన్స్‌ఫర్ చేస్తే, ఆ డ్యూటీలు చాలా కష్టం'' అన్నాడు

''అయితే నీకు తప్పదునాన్నా, సర్వీసు మొత్తంలో ఓ సారన్నా రైల్వే పీసీగా'' అంది లక్ష్మి

ఆ మాటకు అంతా నవ్వారు

''ఛీ నోర్మూసుకోవే అన్నీ అపశకునం మాటలూ నువ్వూనూ'' అంది తల్లి లక్ష్మి తల్లి మాటకు ఏదో జవాబు చెప్పబోయేలోపే, ఆమే, ''అది సరేలే ఈ గోల ఎప్పుడూ వుండేదే గానిలే కాని, ఆ సింగు అన్నయ్యకి డబ్బెంతో వచ్చిందంటగా'' అంది మజ్జిగపోస్తూ

''ఆ, ఎంతో వచ్చాయి మళ్ళీ మందులికీ, డాక్టరు ఫీజుకీ, పరీక్షలకి వెయ్యిరూపాయలదాకా అయ్యాయంట అప్పుడు యాక్సిడెంటుకి ముందు పిల్ల పెళ్ళికని తెప్పించుకున్న డబ్బులు అక్కడ గవర్నమెంటు ఆసుపత్రిలో డాక్టర్లకూ, మందులకూ, ఇంటిల్లపాదీ వుండటానికి ఖర్చులకీ సరిపోయాయి ఇప్పుడు గవర్నమెంటువాళ్ళు డిపార్టుమెంటులోంచి తీసేస్తూ ఇచ్చిన మూడో, నాలుగోవేలు మళ్ళీ ఇప్పుడు మందులకూ, ఆస్పత్రికి తుంటిలో భరించలేనంత నొప్పి వస్తోందట నడుములో ఒకటే పోటంట ఇంక ఆ కుటుంబం సర్వనాశనమయిపోయినట్టే ఆ మత్తు బిళ్ళలు వేసుకున్న కాసేపు కొంచెం హాయిగా వుంటదంట'' అన్నాడు ప్రకాశం

ఒక నిముషంపాటు నిశ్శబ్దం ఆ నలుగురి మధ్య రాజ్యం చేసింది

''ఇట్లాంటప్పుడు అసలు పోయినా బావుంటుంది ఆ వచ్చేదేదో భార్యా పిల్లలన్నా తింటారు'' అన్నాడు ప్రకాశమే

ఆ విషయం మాట్లాడుకున్నాక అందరి మనస్సులు బాధతో బరువెక్కాయి నిశ్శబ్దంగా ఎవరికి వాళ్ళు లేచారు

''నాన్నా, ఇవాట్టినుండి, మీ స్టేషన్లోని విషయాలు కానీ, డ్యూటీ విషయాలు కాని ఇంట్లో మాట్లాడుకోవద్దు వున్న మనశ్శాంతి కాస్తా పోతోంది'' అంది లక్ష్మి

ఆ మాటకు ప్రకాశం చిన్నగా నవ్వాడు కూతురు వైపు ఆప్యాయంగా చూశాడు

''మన జీవితాలు మనం చేస్తున్న పనులతో ముడిపెట్టుకుని వున్నప్పుడు, మరి, ఆ వృత్తి తాలూకు మంచిచెడ్డలు, మన మీద పడకుండా ఎలా వుంటాయి ? ఆ విషయాలు మాట్లాడుకోకుండా ఎలా వీలయిద్ది ?'' అన్నాడు సూర్యం

అతని మాటలు అర్థం కానట్టు చూచింది లక్ష్మి ''ఏమిటో నీ మాటలు ఓ పట్టాన అర్థం కావు నాకు'' అంది

ఆ మాటకు సూర్యం నవ్వాడు 'నేనింకా అర్థమయ్యేలా మాట్లాడాలన్నమాట అర్థం కాకపోవటం నీ తప్పు కాదు నేనే నీ స్థాయికి దిగాలి ఉండు చెపుతా '' అన్నాడు

అతని మాటలు పూర్తికాకముందే తల్లి కలుగచేసుకుని, ''ఊరుకోండిరా మీగోలా మీరూ'' అని భర్తవైపు తిరిగి ''నువ్వు దూటీలు సేసేటప్పుడు, నైటు బీట్లు తిరిగేటప్పుడు కూత్తంత మెలుకువగా వుండు'' అంది ఆ మాటల్లో ఎక్కడో భయం కనపడింది ప్రకాశంకు

చిన్నగా నవ్వి వూరుకున్నాడు అంతా పక్కల మీదకు చేరారు

చిన్నగా అన్నాడు సూర్యం ''ప్రతి మనిషి యొక్క ఆరోగ్యం గురించి పట్టించుకోవాల్సింది ప్రభుత్వం ప్రతిమనిషికీ పని చూపించాల్సింది ప్రభుత్వం సింగు మామయ్య విషయంలో అవి రెండూ జరగలేదు ప్రజాప్రభుత్వం కాదు కాబట్టే ఇలాగయ్యింది''

ఆ మాటలు విన్నారు అందరూ ఎవ్వరికేమీ అర్థం కాలేదు ''ప్రజలందరి ఓట్లతో గెలిచి పరిపాలించే ప్రభుత్వం ప్రజల ప్రభుత్వం కాక ఏమయ్యిద్ది ?'' అంది లక్ష్మి

''ప్రజల ప్రభుత్వమయితే ప్రజల్లో ఒకడయిన సింగు విషయం, అతని కుటుంబ విషయం ఎందుకు పట్టించుకోలేదు ? '' అన్నాడు సూర్యం

''ఎంతమందిని గురించి పట్టించుకుంటది? అప్పటికీ ఏదో కొంత డబ్బు ఇచ్చింది కదా ఏ ప్రభుత్వమయినా అంతకంటే ఏం చేస్తుంది ? మన ఖర్మకి ప్రభుత్వం యేం చేస్తుంది ?'' అంది మళ్ళీ

సూర్యం కొద్దిసేపు ఆలోచించాడు లక్ష్మికి అర్థమయ్యేలాగా ఎలా చెప్పాలా అని యోచించాడు ఎలా చెప్పాలో అర్థం కాలేదు 'చాలా మందికి ఇంతకంటే అర్థం కాదు ఈ దోపిడీ వ్యవస్థని గురించి అందరికీ తేలికగా అర్థమయ్యే పద్ధతులెవరన్నా అభివృద్ధి చేస్తే బావుండు' అనుకున్నాడు

కొద్దిసేపున్నాక ''లక్ష్మి'' అని చిన్నగా పిలిచాడు, నిద్ర పోబోతోందేమోనన్న అనుమానంతో సూర్యం

''ఊ'' అంది లక్ష్మి

''మనదేశం లాగానే, ఈ భూమ్మీద, రష్యా, చైనా అని రెండు దేశాలున్నాయి తెలుసా ?'' అన్నాడు

''ఆ, వున్నయ్, తెలుసు అక్కడంతా కష్టపడి పని చెయ్యాలనీ, పని చెయ్యలేనివాళ్ళనీ, ముసలీముతకాలాంటి వాళ్ళని బలవంతంగా చెట్లకు కట్టి కాల్చి చంపేస్తారు పని చేస్తేనే తిండి అవునా ?'' అంది లక్ష్మి

ఆ మాటలకు సూర్యం ఆశ్చర్యపోయాడు 'కమ్యూనిజాన్ని గూర్చి, సోషలిస్టు దేశాల్నిగూర్చి ఈ బూర్జువా ప్రభుత్వాలు చేస్తున్న ప్రచారంలో ఇది ఒక భాగం మనిషికి నిజాన్ని గురించిన విషయంకన్నా భయాన్ని కలిగించే విషయం బాగా నాటుకుపోతుంది కాబోలు' అనుకున్నాడు ఇంకేమీ మాట్లాడలేదు ఎవరి ఆలోచనల్లో వాళ్ళు మునిగి, నిద్రలోకి జారిపోయారు

ప్రకాశంకు మరునాడు రాత్రి 'స్టేషన్‌వాచ్' డ్యూటీ రాత్రి పదకొండు గంటలకు బీట్ల వాళ్ళంతా వెళ్ళిపోయారు చలిగా వుంది వాతావరణం అంతా నిశ్శబ్దం తలకు కండువా చుట్టుకొని, గాలి తగలని చోటు చూసుకుని పక్కేసుకున్నాడు సబ్‌జైలులోని ఖయిదీ ఎవరో దీనంగా ఏడుస్తున్నాడు తలగడ కుదరనట్లుగా వుంటే తలకు చుట్టుకున్న కండువా తీసివేశాడు నిద్ర రావటం లేదు గాలి వుండి వుండీ వీస్తోంది ట్యూబులైటు చుట్టూ పురుగులు ఎగురుతున్నయ్ అతని

ఆలోచనలు కూడా అలాగే ముసురుతున్నయ్ గోడకు బల్లులు అంటుకొని వున్నయ్ ఎత్తైన కప్పుమీది నుండి గాలి పోతూ, నిస్సహాయుల నిశ్వాసాల్లాంటి శబ్దాల్ని సృష్టిస్తోంది పోలీసు లాకప్పులో ఎవరో వుండి వుండి బాధతో మూల్గుతున్నాడు బయట ఎక్కడో టపాకాయలు పేలుతున్న శబ్దం వినిపిస్తోంది 'దీపావళి వస్తోంది కాబోలు' అనుకున్నాడు స్టేషనులోని వేపచెట్టు గాలికి అటూ ఇటూ వూగుతూ, అధికార మధాంధుల అట్టహాసాల వంటి వికృత శబ్దాలు చేస్తోంది ఎప్పటికో నిద్రలోకి జారిపోయాడు చిన్నగా

ఆ రోజు దీపావళి తెల్లవారు ఝామునుండే టపాసుల శబ్దాలు వినపడుతున్నయ్ లేచి మొహం కడుక్కుంటుంటే కూతురు వచ్చి నిలబడింది 'ఏమిటు'న్నట్లు చూశాడు ప్రకాశం

''దీపావళి మందులు తీసుకురా నాన్నా'' అంది లక్ష్మి గారాబంగా

నవ్వాడు చిన్నగా ఆహ్లాదంగా ప్రకాశం ఎంతో పరిచయమైన ఆ స్వచ్ఛమైన తండ్రి నవ్వు లక్ష్మికెంతో సంతోషం కలిగిస్తుంది

''ఊఁ ఏందయ్యా! అందరూ ఎన్నెన్నో కొనుక్కుంటుంటే'' అంది మురిపెంగా

''వున్నవాళ్ళు కొనుక్కుంటారు తల్లీ సరే తెస్తాలే ఒక రూపాయి మందులు తెస్తా మనింట్లో నువ్వొక్కదానివేగా ఎన్నిమందులు కాల్చినా ఏముందమ్మా డబ్బుల్ని తగలేసినట్లేగా ఆ రూపాయిపెడితే అమ్మకి మూడు రోజులకి మూడు కోడిగుడ్లు వస్తాయి ఇంకో రెండు రూపాయలు వేసుకుంటే ఒకపూట మాంసం వస్తుంది'' అన్నాడు చెంబు గాబు దగ్గర పెట్టి ఇవతలికివస్తూ

''వస్తేమాల్లే దానికొక రూపాయి కాకరపువ్వొత్తులూ, నాలుగు మతాబులు తీసుకురాండి'' అంది భార్య టవలు తీసుకుని అక్కడకు వస్తూ

''తెస్తాలేవే తెస్తానన్నాగా'' అన్నాడు నవ్వుతూ ముఖం తుడుచుకుంటూ

''నాన్నా, పోలీసోళ్ళకి మామూలు వుంటదంటగా, దసరాకి లాగా అయితే మనకీ వస్తాయిగా దీపావళి మందులు'' అంది లక్ష్మి

''ఏమోనమ్మా ఇది టౌన్ స్టేషనుకదా, వస్తే రావచ్చు'' అన్నాడు మష్టీ చొక్కా తొడుక్కుంటూ

''ఒకేల మందులు మనకీ వస్తే కొనమాక'' అంది భార్య

''సరేలే, ఆ సంచివ్వు మాంసం తెస్తా'' అని కాకీ సంచి తీసుకుని మాంసం దుకాణానికి వెళ్ళాడు అప్పుడే పొటేళ్ళని ఒక్కోదాన్నే మంత్రాలు చదివి, గొంతులు కోస్తున్నాడు మాంసంకొట్టు ఖాశిం కిందపడేసిన అవి తన్నుకుంటున్నాయి ప్రాణం పోతుండటం మూలంగా

''ఏమిటండీ సాయిబుగారూ, ఇంత పొద్దెక్కిందాకా ?'' అన్నాడు ప్రకాశం

''ఇవ్వేళ కాస్త హాలశ్యమైంది సార్'' అన్నాడు అతను

''జనం ముందు ఇలా కోస్తావుంటే, అబ్బ, చూడలేమయ్యా ఇలాటివన్నీ చీకటితోనే కానిచ్చుకోవాలి'' అన్నాడు ప్రకాశం, తన్నుకుంటున్న పొటేళ్ళ వైపుచూస్తూ

ఆ మాటకు అతను చిన్నగా నవ్వాడు ''ఆహాఁ అంత బాధగా వుందా సార్ పోలీసోళ్ళకన్నా కటికోళ్ళు ఎవరున్నారు సార్'' అన్నాడు థనూ నవ్వుతూనే

ఆ మాట అతను నవ్వుతూ అన్నా ప్రకాశం మనసుకు బాధ కలిగించింది మౌనంగా నిలబడ్డాడు కోసిం తర్వాత మాంసం తీసుకెళ్ళి ఇంట్లో ఇచ్చి స్టేషను కొచ్చాడు అప్పటికి పదిగంటలవుతోంది స్టేషన్లో అంతా సందడిగా వుంది

''ఉదయం నుండీ ఎక్కడికి పోయారండీ కనపడకుండా'' అన్నాడు ఆంజనేయులు ఉత్సాహంగా అతను ప్రకాశం కోసం ఎదురు చూస్తున్నాడు

''పగలు డ్యూటీ ఏమి లేదుగా ఈ రోజు''

''డ్యూటీ లేకపోయినా స్టేషనుకు రావాలండీ ఇదిగో ఇక్కడ చూడండి ఎంత సందడో'' అని లోపలకు తీసుకువెళ్ళాడు రైటరు గదిలో మూడు పెద్ద పెద్ద బస్తాల్లో దీపావళి సామాను వుంది పెద్ద సైజు తాటాకు బుట్టలు పదిహేను వరకూ వున్నయ్ యస్సై స్వయంగా అక్కడ నిలబడి, ఆ బుట్టల్ని వరుసగా పెట్టించి, గోతాల్లోంచి దీపావళి సామాన్ని సమంగా బుట్టల్లో వేయిస్తున్నాడు ఐడీ పార్టీవాళ్ళు అన్నీ బుట్టల్లో సమంగా పంచుతున్నారు అన్ని బుట్టలూ నిండేసరికి రెండున్నర బస్తాల పైచిలుకు మందులు అయిపోయినియ్యి ఏ బుట్ట ఎవరికి అని గుర్తించటానికి అన్నిటికీ స్లిప్పులు రాసిగుచ్చారు డి ఐ జీకీ, యస్పీకీ, అడిషనల్ యస్పీకీ, డి యస్పీకీ, సర్కిల్ ఇనస్పెక్టరుకూ, సబ్ ఇనస్పెక్టరుకూ, ముగ్గురు మేజిస్ట్రేట్లకూ, అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటర్ గ్రేడ్‌వన్‌కూ, గ్రేడ్‌టూకూ, ఆర్ డీ వోకూ, తాసిల్దారుకూ, గవర్నమెంటు డాక్టరుకూ ఇలా అందరికీపోగా ఇంకా రెండు బుట్టలు మిగిలితే వాటిని జాగ్రత్తగా ఉంచమని రైటరుకు చెప్పాడు యస్సై

''పబ్లిక్ ప్రాసిక్యూటర్ గ్రేడ్ టూ గారు తీసుకుంటారంటావా ?'' అడిగాడు యస్సై

''ఆయన తీసుకోరు సార్ పక్కా హానెస్ట్ సార్'' అన్నాడు రైటరు వొత్తిపలుకుతూ

బస్తాలో మిగిలినవాటిని పీసీలకూ, హెచ్‌సీలకూ భాగాలు వేయటానికి ముందు, రఫ్ డ్యూటీ రోస్టరు తీసి సెలవుల్లో, మెడికల్ లీవులో ఉన్నవాళ్ళు మినహా ప్రెజెంట్‌లో వున్నవాళ్ళెంతమందో లెఖ్ఖ చూశారు పీసీకి ఒకటి, హెచ్‌సీకి రెండు చొప్పున వాటాలు లెఖ్ఖ కట్టి కుప్పలు వేశారు ఒక్కొక్కళ్ళకు ఒక డజను అగ్గిపెట్టెలు, రెండు కాకరపువ్వొత్తుల పెట్టెలు, రెండు భూచక్రాలు, ఒక విమాణం చొప్పున వచ్చాయి అక్కడున్నవాళ్ళు ఎవరి భాగాలు వాళ్ళు గుప్పిళ్ళతో తీసుకున్నారు

''కాకుల్ని కొట్టి గద్దలకి వెయ్యటమంటే ఇదే'' అన్నాడు ఒక పీసీ బయటకు వచ్చాక

''టౌన్లో ఆఫీసర్లకు బుట్టలు ఇవ్వటానికి ఒక పీసీని, యస్పీకి, అడిషనల్ యస్పీకి, డి ఐ జీకి ఇచ్చి రావటానికి ఒక పీసీని ఎలాట్ చెయ్యి'' అన్నాడు రైటరుతో యస్సై

''సి ఐ గారింటికి ఒకళ్ళని పంపాలి సార్ ఆయన ఫామిలీ ఇక్కడ లేదుకదా'' అన్నాడు రైటరు

ఆ మాటలు వింటున్న పీసీలకు ఎవరికి వాళ్ళకు మనసులో పీకుతోంది ఎవర్ని పంపిస్తారో, పండగపూట పెళ్ళాం పిల్లల దగ్గర లేకుండా పోవాల్సొస్తుందేమోనని, ఎటువాళ్ళటు చిన్నగా జారుకున్నారు

''కోటేశ్వరరావుని పిలిపించవయ్యా!'' అన్నాడు రైటరు డబ్బా రైటరుతో గార్డులోని వెయిటింగ్ పీసీ వెళ్ళి కోటేశ్వరరావుని పిలుచుకొచ్చాడు

''ఏమిటి సంగతి ?'' అన్నాడు కోటేశ్వరరావు పిలవటానికొచ్చిన పీసీతో

''ఏమో మరి నేను గార్డు కదా'' అన్నాడు అతను

కోటేశ్వరరావు వెళ్ళి రైటరుకి సెల్యూట్ చేశాడు అతని ముఖం నిండా ఆదుర్దా నిండి వుంది పండగపూట ఏం డ్యూటీ చెపుతాడో అనే భయం అతని శరీరమంతా ఆవహించింది

''నువ్వు ఈ దీపావళి సామాను తీసుకెళ్ళి సి ఐ గారి ఫామిలీ వరంగల్లులో వుంది, అక్కడ ఇచ్చిరా'' అన్నాడు

ఆ మాట వినటంతోనే అతని నవనాడులూ తెగిపోయినట్టు, శరీరం వణికింది

''ఏం, నేను తప్ప ఎవరూ దొరకలేదా ?'' అన్నాడు కోపంగా

''ఎవరూ లేరు ఉంటే ఎందుకు పంపిస్తా ?''

''పండగపూట కూడా కొంపలో వుండనియ్యరా? మాకేమిటి ఈ డ్యూటీలు గవర్నమెంటు డ్యూటీలే చెయ్యలేక ఛస్తుంటే''

''నాకు తెలియదు పోయి యస్సైగారి నడుగు'' అన్నాడు నిర్లక్ష్యంగా రైటరు

ఆ మాట తీరు అతని కోపాన్ని అధికం చేసింది పళ్ళు కొరుక్కున్నాడు ఏమీ చెయ్యలేని అశక్తతతో క్షణకాలం ఏమీ మాట్లాడలేదు

''యస్సైగారు నన్నే పంపమన్నాడా ?'' ఉపయోగం లేదని తెలిసినా అడిగాడు

''లేదు ఎవరినన్నా పంపమన్నాడు ఇంకెవరూ లేక నిన్నే పంపిస్తున్నా'' చిరాగ్గా అన్నాడు రైటరు

రెండు క్షణాలు తటపటాయించాడు కోటేశ్వరరావు ఇంకేం మాట్లాడినా లాభం లేదని అతనికి తెలుసు అవమానంతో అతని మనస్సు కృంగిపోతోంది ఓటమిని స్వీకరించలేకపోతున్నాడు అన్నివిధాలా అతను బలహీనుడు

''అదేంది సార్ పండగపూట పెళ్ళాం పిల్లలు వున్నవాళ్ళని పంపకపోతే, రిక్రూట్‌లున్నారు కదా వాళ్ళని పంపకూడదా ? పనిగట్టుకుని పండేనికి నన్ను కావాలని పంపటం తప్పు'' అన్నాడు అనునయంగా గొంతు మారుస్తూ కోటేశ్వరరావు

''వాళ్ళకేం తెలుసు రిక్రూట్‌లకు తొందరగా పోకపోతే, ఆయన మా తాట వలుస్తాడు అందుకనే సీనియర్‌వని నిన్ను పంపిస్తుంది''

''నాకు మాత్రం ఆ టౌన్‌లో సి ఐ గారిల్లు ఏమి తెలుసు ఆయనింటికి నేను మాత్రం ఎప్పుడు వెళ్ళాను ?''

''తెలుసుకోవాలి పోలీసన్నాక అన్నీ తెలుసుకోవాలయ్యా ! తెలియదంటే వూరు కుంటారా?''

''ఆ మాటే ఆ రిక్రూట్‌లకు చెప్పి పంపకూడదా ?''

''ఏమిటయ్యా నీ ఆర్గుమెంటు నువ్వు చెప్పినట్టు నేను వినాలా ? నేను వేసిన డ్యూటీకి నువ్వు పోవాలా ? ఇది తేల్చి చెప్పు ముందు అన్నిట్లోనూ రూల్సు మాట్లాడినట్లే ఇదీ రూలు ప్రకారం చెయ్యాల్సిందే'' అన్నాడు కోపంగా రైటరు

''అంటే డబ్బుల్లో భాగం అడిగితే, ఇట్లా అన్యాయంగా డ్యూటీలు వేస్తావన్నమాట డబ్బులేమీ అడగకుండా వుంటే నీ దృష్టిలో మంచోడన్నమాట సరేలే ఇటియ్యి ఈ అన్యాయం ఎంతకాలం సాగిద్దో'' అన్నాడు కోపంగా కోటేశ్వరరావు

రైటరు ఏమీ మాట్లాడలేదు అప్పటికే చాలామంది గుమికూడారు డిటెక్టివ్ డ్యూటీమీద వెళుతున్నట్టూ, డబ్బారైటరు రాసిచ్చిన పాస్‌పోర్టూ, వారెంట్లు తీసుకుని మందుల బుట్ట తీసుకుని, గొణుక్కుంటూ బైటకొచ్చాడు కోటేశ్వరరావు ''ఎన్నడు ఈ రాక్షసులు చస్తారో, ఈళ్ళెక్కల్ని '' అతని ముఖం కందిగడ్డలా మారిపోయింది శరీరం కోపంతో స్వల్పంగా వణుకుతోంది ''నా కొడుకులు నా చేతిలో దొరక్కపోతారా ?'' అనుకుంటూ వెళ్ళిపోయాడు

''ఇవి మనకేమీ కొత్తయ్యి కాదుగానీ, కడుపులో మంట ఆపుకోలేక తిట్లతో ఎప్పటికప్పుడు

కసిగా తిట్టుకుంటూ కాలం గడిపేస్తున్నాము ఈ మాటలూ, ఈ తిట్లూ వాళ్ళనేమీ చెయ్యలేవని మనకు తెలుసు దీని వలన ఇంకా వాళ్ళకి మనమీద ద్వేషం పెరుగుతుందే తప్ప ఏమీ మార్పు రాదన్న సంగతికూడా తెలుసు కాని మనం అంతకన్నా ఇంకేమీ చెయ్యలేని స్థితిలో వున్నాము'' అన్నాడు ప్రకాశం

''ఇటురండి బయటకుపోయి మణి కొట్లో కూర్చుందాం లేకపోతే మనకీ ఏదో ఒక ఆవారా ఉద్యోగం చెపుతారు కనపడ్డోళ్ళకే ఉద్యోగాలు చెప్పేది'' అన్నాడు ఆంజనేయులు

''అవును ప్రతి కానిస్టేబులుకీ ఖచ్చితమైన పనంటూ ఒకటుంటేగా ? అదే మిగిలిన డిపార్టుమెంటులలోని వాళ్ళకయితే వాళ్ళు చేయవలసిన పని 'ఇది' అంటూ ఒకటుంటుంది''

''అసలు మెన్ పవర్ ఎంత వేస్టవుతుందో చూడండి మన స్టేషన్లో మొత్తం నలభైమంది కానిస్టేబుళ్ళు వీళ్ళల్లో డి యస్పీ బంగళాలో నలుగురు సి ఐ దగ్గర ఇద్దరు యస్సై దగ్గర ఒకళ్ళు డబ్బా రైటరు ఒకడు ఇనస్పెక్టరు రైటరుకు అసిస్టెంటు ఒకడు కోర్టుకు ఇద్దరు ఐ డీ పార్టీ నలుగురు ఇంక పైపైన ఒకళ్ళిద్దరూ కోర్టోళ్ళు మినహాయించి మిగతావాళ్ళేవరు వీళ్ళల్లో గవర్నమెంటు ఉద్యోగం చేసేది? ఇంతమందికి నెలకు ఎన్ని వేలు జీతాలక్రింద, ఎన్నివేలు టి ఏ ల క్రింద ప్రభుత్వం ఖర్చుపెడుతోంది పైగా డ్యూటీల కోసం కన్నా, ఆఫీసర్ల స్వంత పనులకు బస్సు వారెంట్లూ, రైలు వారెంట్లూ వాడటం చూడండి వీటిని ఎవడన్నా పట్టించుకున్నాడా ? ఎవరికి దొరికింది వాళ్ళన్నట్టు, దోచుకోవటమేకాని ఇంకో పనేది ? ఇంతమంది ఆవారాగాళ్ళ డ్యూటీలు మరి మిగిలినవాళ్ళు చేయాల్సిందేగా ? వున్న మొత్తం మంది చేసినా ఇంకా ఎంతో గవర్నమెంటు పని మిగిలిపోతూవుంటే, ఉన్నవాళ్ళల్లో సగం మందిని ఆఫీసర్లు స్వంత పనులకు ఉపయోగించు కొంటుంటే, ఇంక మిగిలినవాళ్ళే మొత్తం డ్యూటీలు చెయ్యాలికదా! అందులో రోజురోజుకూ మనం చేసే డ్యూటీలు పెరిగిపోతున్నాయి ''

''ఏ యస్సై వస్తున్నాడు'' అన్నాడు ప్రకాశం ఆంజనేయులి మాటలకు అడ్డువస్తూ

''సెల్యూట్ చెయ్యండి తప్పేదేముంది తిట్టుకుంటూనో, మెచ్చుకుంటూనో చెయ్యాల్సిందేగా'' అన్నాడు ఆంజనేయులు ఆ మాటకు ప్రకాశం వస్తున్న నవ్వును ఆపుకుంటూ సెల్యూట్ చేశాడు ఆంజనేయులు కూడా చేశాడు ఏ యస్సై వాళ్ళని అలా చూచి, ఆనందంతో ముఖం చాటంత చేసుకున్నాడు

''లోపల ఎవరున్నారోయ్ ?'' అన్నాడు ఏ యస్సై

''అందరూ వున్నారు సార్'' అన్నాడు ఆంజనేయులు

ఏ యస్సై లోపలకు వెళ్ళిపోయాడు

''ఆ నాకొడుకులకు కూడా తెలుసు సార్, మనం పచ్చి బూతులు తిడుతూనే సెల్యూట్ చేస్తామని'' అన్నాడు ఆంజనేయులు

''ఖర్మక్కే''

''సరే అసలు విషయానికొద్దాం రోజురోజుకీ మనం చేసే పనులు ఎలా పెరుగుతున్నాయో చూడండి ఇంతకుముందు లేనియ్యి, ఇప్పుడు కొత్తకొత్తయ్యి పుట్టుకొస్తున్నాయి ఇప్పుడు కొత్తగా పదోతరగతి పరీక్షలకి, ఇంటర్ వాళ్ళకి, డిగ్రీ వాళ్ళకి పరీక్షలయిపోయిందాకా బందోబస్తులు క్వశ్చన్ పేపర్లకి గార్డు, స్కూళ్ళల్లో ఎలక్షన్లకు బందోబస్తులు ఎలక్షన్లోగెలిచి వూరేగేవాళ్ళకి బందోబస్తులు కొత్త సినిమా రిలీజయితే పూటపూటా బందోబస్తులు ''

''అవునవును''

''ఇంతకుముందు ఇవి వుండేవికాదంట కదా మీలాంటి సీనియర్లు చెపుతుంటారు మామూలుగా అసెంబ్లీ, పార్లమెంటు ఎలక్షన్లకి, తిరనాళ్ళకి, ఏవైనా మీటింగులకి, శ్రీరామనవమి పందిళ్ళకి ''

''మినిష్టర్లకి బందోబస్తులు ''

''అవి సరే అనుకోండి మన ప్రాణాలు తోడటానికి మినిష్టర్లు పోయినంత దూరం ఎర్రటి ఎండలో బందోబస్తులు ఇప్పుడు చూడండి యస్పీలు, డి ఐ జీలూ, వస్తున్నా, పోతున్నా రూటు బందోబస్తులు ఇవన్నీ మెహర్బానీ ఉద్యోగాలు కావా ? అందులో ఇప్పుడు ఎక్కడ చూచినా, హర్తాళ్ళూ, గొడవలూ, స్ట్రయికులు వీటితోపాటు వూళ్ళల్లో ముఠా తగాదాలూ, పార్టీ తగాదాలూ అక్కడ బందోబస్తులు పెరుగుతున్న బందోబస్తులకు తగ్గట్టు మెన్‌ని పెంచేది లేదు రోజురోజుకీ నేరాలు పెరిగిపోతున్నాయి ట్రాఫిక్ విపరీతంగా పెరిగిపోతోంది లా అండ్ ఆర్డర్ క్షీణిస్తోంది ఇంత జరుగుతున్నా మెన్‌ని పెంచేది లేదు రిటైర్ అయినవాళ్ళ ఖాళీలను పూర్తిచేసేదే ఎప్పటికో ఉన్నవాళ్ళని సక్రమంగా వినియోగించుకొనేది లేదు ''

''ఎవుడయ్యా మనల్ని గురించి పట్టించుకొనేది ?'' చిరుకోపంగా అన్నాడు ప్రకాశం

''ఈ సమస్యలకి పరిష్కారం కనపడటం లేదండీ మరి ఈ పోలీసు వ్యవస్థ చివరికెలా తగలడిద్దో కాని''

వాళ్ళు చాలాసేపు అలా మాట్లాడుకున్నారు తరువాత వెళ్ళిపోయారు ఇంటికెళ్ళి భోంచేసి పడుకున్నాడు ప్రకాశం సాయంత్రం అయిదు గంటలకు రోల్‌కాల్‌కు వచ్చాడు స్టేషన్లో అధికారులెవ్వరూ లేరు ఆంజనేయులు కనపడ్డాడు

''ఏమిటి విశేషాలు ?''

''ఏమున్నాయి అధికారులెవ్వరూ లేరు పండగ కదా! మనల్ని పట్టించుకొనే నాథుడు ఎవ్వడూ లేడు అటుపోయి టీ తాగి ఇళ్ళకు పోదాం పదండి మామూలుగా నైటుబీటుకు రావటమే'' అన్నాడు

''అయితే ఇప్పుడు యూనిఫారం వేసుకునే పని లేదన్నమాట పోనీలే పండగపూటన్నా ''

''ఆ, తప్పినట్లే ఆ యూనిఫారాన్ని చూస్తేనే నాకు ఎలర్జీ మణుగు బరువుండే బూట్లు, మోకాళ్ళదాకా జనపనార పట్టీలు ''

''అయ్యో ఒకటే దురద '' అని నవ్వాడు ప్రకాశం మాట మధ్యలో

''దురదేం దురద గీరీ గీరీ పుండ్లు పడుతుంటే '' అని ఆంజనేయులు కూడా నవ్వాడు ''ఇక యూనిఫారం చూద్దామా ఆ గంజిపెట్టి ఇస్త్రీ చేసిన యూనిఫారం వేసుకుంటే, తుప్పు పట్టిన పాత రేకుని వంటికి చుట్టుకున్నట్టేగా వళ్ళంతా మంట ఎక్కడికక్కడ కత్తుల్లాగా కోసుకుపోవటం గంజి పెట్టకపోతేనేమో తోళ్ళలాగా అసహ్యంగా వేలాడటం అబ్బా ఇది పూర్వజన్మ పాపమేనండీ ''

''పూర్వజన్మలో రాక్షసులమై ఉంటాం'' అన్నాడు ప్రకాశం నవ్వుతూ

''అందుకే ఈ జన్మలో కూడా రాక్షసులమై ప్రజల్ని పీక్కు తింటున్నాము సరే టోపీ సంగతి చూడండి అది పెట్టుకుంటే గాలాడక తలంతా దురద బస్సులోగాని, జీపులోగాని పోవాలంటే అడ్డం లారీలో పోతూ పెట్టుకుంటే గాలికి ఎగిరిపోయిద్ది నాలుగు వర్షపుచినుకులు పడితే

రంగుపోయి వంకర్లు తిరిగిపోయిద్ది పాడైపోతే కొత్తది కొనాలంటే బోలెడు ఖరీదు దానికోసం ప్రత్యేకంగా ఒక సంచి కావాలి బందోబస్తులకు పోయేటప్పుడు అనేకరకాల రద్దీల్లో దానితో ఎంత అవస్థ పడుతుంటామో ఆ దేవుడికే తెలియాలి మూరెడు టోపీ పెట్టుకోకపోతే పోలీసనరా ? దీనెమ్మ దరిద్రపు యూనిఫారాన్ని యూనిఫారం వేసుకుంటే హుందాతనం రావాలండీ, సర్కస్‌లో బఫూన్ గుర్తుకొస్తే ప్రజలకి మన మీద గౌరవమేముంటుంది '' తిట్టాడు కసిగా ఆంజనేయులు

ప్రకాశం అతని కోపాన్ని చూచి నవ్వాడు '' ఇరవైనాలుగు గంటలూ జనంలో వుండి ఉద్యోగం చెయ్యాల్సినోడికేమో ఇబ్బంది కలిగించే టోపీలూ, బూట్లూ, తుపాకులూ ఎప్పుడో సీనులో కొచ్చే యస్పైలకీ ఆపైవాళ్ళకీ పీకేప్‌లూ, ఆఫ్ బూట్లూ, రివాల్వర్లు మనమసలా తుపాకులతో ఎన్ని ఇబ్బందులు పడుతూ ఉద్యోగం చేస్తున్నాము ఒకచేత్తో లాఠీ, ఒకచేత్తో తుపాకి, నెత్తిన జారిపోయే టోపీ, కాళ్ళకు బండలమీద జారిపోయే ఇనపనాడాల బూట్లు బస్సుల్లో, లారీల్లో, జీపుల్లో ఎక్కాలన్నా, జనం మధ్య ఉద్యోగం చేయాలన్నా ఎంత బాధ నిజంగా మనతో ఉద్యోగం చేయించాలనుకునే ప్రభుత్వాలయితే మనల్ని ఇలా ఉంచుతాయా ? ఇలా కట్టేసెయ్యవు'' అని నవ్వాడు మళ్ళీ

''ఎందుకు సార్ నవ్వుతారు నాకొచ్చినట్లు మీకు కోపం రావటం లేదా ?'' అన్నాడు ఆంజనేయులు

''వస్తోంది రాకపోవటమేమిటి మరీ జడ పదార్థమైతే తప్ప లేకుంటే సామాన్యంగా ఎవరికయినా ఈ విషయంలో చిరాకు, కోపం రావటం సహజం కాని మనం అందరం కూడా ఈ పరిస్థితుల్ని అసహ్యించుకుంటున్నాం, తిట్టుకుంటున్నాం, అంతకుమించి ఒక్క అడుగు కూడా ముందుకు పోలేకపోతున్నాం ఈ సమస్యలకు పరిష్కారం ఆలోచించలేకపోతున్నాం మనకోసం ఒక సంఘాన్ని ఏర్పాటు చేసుకోలేకపోతున్నాం'' అన్నాడు ప్రకాశం

''నిజమేనండి అదే ముఖ్యం విషయాన్ని వర్ణించటం కాదు సమస్యకి పరిష్కారం కావాలి నిజమే, సంఘం కావాలి'' అన్నాడు ఆంజనేయులు

అలా వాళ్ళు చాలాసేపు మాట్లాడుకున్నారు తరువాత వెళ్ళిపోయారు

అలాగే రోజులు గడుస్తున్నాయి ఓ రోజు మామూలుగా స్టేషను కొచ్చాడు ప్రకాశం రైటరు అతన్ని పిలిచి, డి వో (ట్రాన్స్‌ఫర్) పాస్‌పోర్టు చేతికిచ్చాడు దాన్నిచూచి నిర్లిప్తంగా నవ్వాడు ప్రకాశం అతనిని ఈసారి లోకల్ నుండి రైల్వేకి ట్రాన్స్‌ఫర్ చేశారు

''ఇంక ఇంతకన్నా పనిష్మెంటు ఏం ఇవ్వగలరు ?'' అన్నాడు కొంచెం కోపంగా

''నాకేం తెలుసు ? అయ్యగారు పాస్‌పోర్టు ఇవ్వమన్నాడు ఇచ్చాను ఇందులో నాదేముంది'' అన్నాడు నసుగుతూ రైటరు

''నీలాటి కుక్కల్తో మాట్లాడటం కూడా అనవసరమే'' అన్నాడు ప్రకాశం ఆ మాటకు రైటరు తల తిరిగిపోయింది ఏదన్నా అంటే ఇంకెంతలావు మాట అంటాడో అని భయపడి వూరుకున్నాడు డూప్లికేటు పాస్‌పోర్టు మీద సంతకం చేసి బైటకొచ్చాడు ఆంజనేయులు అతన్ని అనుసరించాడు

''మీరేం చేశారని, ఇలా ?''

ప్రకాశం విచారంగా నవ్వాడు ''ఏమీ చెయ్యకపోవటమే కారణం ఏదన్నా చేస్తూ వుంటే

పదికాలాలపాటు ఒకేచోట కడుపులో నీళ్ళు కదలకుండా వుండొచ్చు '' అన్నాడు బాధగా, కోపంగా

' ఇప్పుడేమిటి చెయ్యటం వెళ్ళి రిపోర్టు చేస్తారా ?''

''చెయ్యక చేసేదేముంది ? మనం అధికార్లముందు అన్నివిధాలా బలహీనులం అటు డబ్బు వుంటే కోర్టుకు పోయి స్టే తెచ్చుకోవచ్చు లేదా కనీసం రెకమెండేషనన్నా వుంటే, ట్రాన్స్‌ఫర్ కేన్సిలు చేయించుకోవచ్చు ఏదీలేదు అందుకే అన్నారు పేదవాని కోపం పెదవికి చేటని''

ఆంజనేయులు ఏం మాట్లాడలేదు ఏం మాట్లాడాలో తోచలేదు అతనికి యస్పీమీదా రైటరుమీదా కడుపులో మండిపోతోంది ''నా కొడుకులు ఒక్క కలంపోటుతో నిశ్చలమైన బ్రతుకుల్లో ఎంత అల్లకల్లోలం సృష్టిస్తున్నారు అయినా ఆ యస్పీ లంజాకొడుక్కి ఎక్కడ జ్ఞానంలేదు పైగా ఐ పి యస్'' తిట్టాడు కసిగా

''ఇక్కడ ఐ పీ యస్ లేదూ, ఐ ఏ యస్ లేదు ఆంజనేయులూ తన క్రింది వాళ్ళ ఆలోచనలమీద ఆధారపడే తమ సర్వీసునీ, బ్రతుకుల్నీ వెళ్ళదీస్తారు చాలామంది వాళ్ళంతా పుస్తకాల పురుగుల్లాగా చదివి వొచ్చినోళ్ళేగాని, వాస్తవ ప్రపంచాన్ని అర్థం చేసుకున్నవాళ్ళు ఎంతమంది?'' అన్నాడు ప్రకాశం

ప్రకాశంతోపాటు ఆంజనేయులు కూడా ఇంటిదాకా వెళ్ళాడు కొద్దిసేపు కూర్చుని మాట్లాడి వెళ్ళిపోయాడు

ప్రకాశం వెళ్ళి విజయవాడ రైల్వేస్టేషన్లో వున్న పోలీసు స్టేషన్లో డ్యూటీకి రిపోర్టు చేశాడు

ఓ పదిరోజుల తరువాత ఫామిలీని తీసుకువెళ్ళాడు ఆ డ్యూటీలు అతను చెయ్యలేక పోతున్నాడు అలవాటు కాక పైగా వయస్సు పైన పడుతోంది అసలు ఆ వాతావరణమే అతనికి సరిపడలేదు అయినా అట్లాగే రోజులు నెట్టుకొస్తున్నాడు చేసేదేంలేక

సూర్యం బి య్యే పూర్తిచేశాడు ఇంటిదగ్గర వూరకే వుంటున్నాడు ఈ మధ్య కమ్యూనిస్టు మీటింగులికి వెళుతున్నాడు తరుచుగా ఆ సాహిత్యాన్ని చదువుతున్నాడు అతని కొరకు 'హేమ' అనే అమ్మాయి తరచూ వస్తోంది ఆ సాహిత్యం చదివేకొందీ అతని ఆలోచనా విధానం వేగంగా మారుతోంది

ప్రకాశంకు డ్యూటీలు కష్టంగా వున్నయ్ విశ్రాంతి పూర్తిగా కరువయ్యింది బీటుకు రైల్లో బయలుదేరి తిరిగి స్టేషనుకు వచ్చేసరికి దేవుడికి దండం పెట్టుకుంటూ, ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని వస్తున్నాడు ఈలోగా బండికింద ఎవరన్నా పడి చనిపోయినా లేక చంపి ఎవరినన్నా పట్టాలమీద పడవేసినా ఆ శవం దగ్గర దిగి పోవాల్సిందే కాపలా కాయాల్సిందే అది అడవికానీ, ఎడారికానీ, పగలుకానీ, రాత్రికానీ, ఎండకానీ, వర్షంకానీ, ఆ శవంతో పాటు మర్రోజు వరకో, రెండ్రోజుల పాటో ఆఫీసర్లు వచ్చి శవ పంచాయితీ చేసిందాకా అక్కడే వుండాలి ఆ దారుణమైన పరిస్థితిని ఎదుర్కోవటం చాతకాదు ఎవరికీ ఆ విషయం గుర్తొస్తే ప్రకాశానికి గుండెల్లో భయం బయలుదేరుతోంది అతనికి తెలియకుండానే అనాలోచితంగా దేవుడిని గుర్తు తెచ్చుకుంటున్నాడు బీటు చేస్తున్నంతసేపూ బండిలో ఎక్కడా కూర్చోవటానికి వీలుకాదు రిజర్వేషన్ కంపార్టు మెంటుల్లోకి టి టి ఇ లు రానివ్వరు జనరల్ కంపార్ట్‌మెంట్స్‌లో కనీసం ఒంటికాలుమీద నిలబడే చోటుండదు వీటన్నిటికితోడు తాగుబోతులతో, పిక్‌పాకెటర్స్‌తో తలనొప్పి ఇంక ఏ కంపార్టుమెంటులోని ఏ ఆడమనిషిమెడలోని చైను, ఏ స్నాచర్ లాగేస్తాడో అని, బండికింద ఎవరు

సెప్పబోతున్నాడు మరి నీ సంగతివాడికేటెరిక అందరికిమల్లే నువ్వూ 'వూ' అంతావనుకున్నాడు బండ్లో రాటం, వచ్చిందాంట్లో చెరిసగం మామూలేగా సర్లేగాని, ఓ రూపాయుంటే ఇలాగియ్, టీ కొ'ట్టాల'' అన్నాడు

''ఎంతవరకొచ్చింది నీ వ్యవహారం ?'' అన్నాడు ప్రకాశం

''ఏం వ్యవహారామో ఏటో ఉత్తి పున్నానికి నన్ను సస్పెన్షన్ సేసేశారు ఇది ఏడో నెల సాయంత్రంపూట ఇంటికెల్దామంటే బుద్ధి పుట్టటం లేదు ఇంట్లో పిల్లలు, పెళ్ళాం వాళ్ళ ముకాలు సూడలేకపోతున్నా నన్ను సస్పెన్షన్ చేసేశారని తెలిసి టీ కాంటీన్ నంజికొడుకు కూడా డబ్బు లడుగుతున్నాడు, టికి దూటీకి రానీ, నా గొడుకుల్ని ఏం చేయాలో అది సేసేత్తా'' అన్నాడు కోపంగా శాంతయ్య

ఆ మాటకు ప్రకాశం ఏం మాట్లాడలేదు ఒక క్షణమాగి చిన్నగా అన్నాడు ''నా దగ్గర కూడా లెవ్వు బీటు కెళుతూ ఇంట్లో రెండే రెండుంటే అవి జేబులో వేసుకొచ్చా అందులోనే ఓ రూపాయి తీసుకో'' అనిచ్చాడు

అతను తీసుకోలేక బాధపడుతూ తీసుకున్నాడు

''బావగారూ నేరాలు చేయించేవోల్లకాడా, పిక్‌పాకెట్‌లు చేయించే వోల్లకాడా, స్నాచింగ్‌లూ స్మగ్లింగులు చేయించేవాళ్ళు కాడే నెలాకర్లో డొబ్బులుండటం కట్టం జీతం డబ్బులమీద బతుకు బండి లాక్కొచ్చే మీ దగ్గరేడనుండొత్తయ్ '' అన్నాడతను అభిమానంగా

ఇద్దరిమధ్య క్షణకాలం నిశ్శబ్దం తరువాత అతను మాట్లాడటం మొదలుపెట్టాడు మళ్ళీ ప్రకాశం వింటూ నిలబడ్డాడు శాంతయ్య మాట్లాడుతూనే వున్నాడు మాటల్లోనే అతని గొంతు దుఃఖంతో పూడుకుపోయింది కళ్ళల్లో నీళ్ళు నిండాయి తలొంచుకున్నాడు ప్రకాశం శ్రోతగా మిగిలిపోయాడు అతని పరిస్థితిని అర్థం చేసుకున్నాడు బాధపడ్డాడు

''బావగారూ నిజంగా ఈ రూపాయి టీ తాగటానికి కాదు టీ తాగకపోతే ఏమీ చచ్చిపోను రోజూ ఇలా బయట తిరిగి తిరిగి ఇంటి కెల్లేసరికి, చంటిది అలవాటుగా వచ్చి కాళ్ళు చుట్టేసిద్ది 'నాన్నా నాకు పప్పులు తెచ్చావా' అంటుంది దానికెన్ని రోజులు అబద్ధాలు చెప్పగలను? బిడ్డల మొకం చూస్తుంటే కడుపు తరుక్కుపోతోంది ఒక్కోసారి అందరికీ ఏదో ఒహటి పెట్టి, మేమూ ఇంత తిని చచ్చిపోవాలనిపిస్తుంది ఏమిటి నేను చేసిన నేరం ? ఈ నౌకరీలోంచి బయట కెళ్ళినవాడు ఏ పనీ చేసి బతకలేడు వీడిలో ఆ చాకచక్యం ఉండదు కనీసం బ్రోకరుగా కూడా బతకలేడు ''

అతని స్వరంలో కోపం, బాధ మిళితమైపోతున్నాయి మాట్లాడలేక పోయాడు కొద్దిసేపు తన అసమర్థతకు తనపైనే కోపమొచ్చినట్లు, పళ్ళు బిగపట్టాడు

''దానికోసమే ఆ చంటిదానికేదన్నా కొనుక్కుపోదామని నిన్నడిగాను, ఏమనుకోమాక ''

అతని మాటలు ప్రకాశానికి బాధ కలిగించాయి కానీ నిబాయించుకున్నాడు బాధగా శాంతయ్య భుజంమీద చెయ్యివేసి చిన్నగా నొక్కాడు ఆ మాటలు వింటూ వుంటే ప్రకాశానికి తన కూతురు గుర్తొచ్చింది

''ఇదిగో, ఈ రూపాయి కూడా తీసుకో'' అని జేబుగుండీ తీసి రూపాయి ఇవ్వబోయాడు

''అహాఁ వద్దు బావగారూ నాకు నువ్విచ్చింది ఈ రూపాయే కాదు అంతకుమించిన ఓదార్పు పొందాను నాతో తిన్నవాళ్ళూ, నా సొమ్ముతో తాగినవాళ్ళూ, నా సహాయంతో

పెద్దవాళ్ళయినవాళ్ళూ, నన్ను సస్పెండ్ చేశాక కనీసం పలకరించటం మానేశారు అన్నిటికన్నా ఆ బాధ నా గుండెని అనుక్షణం పొడుస్తోంది నేనేమీ తప్పు చెయ్యలేదని అందరికీ తెలుసు పోనీ నేనేదన్నా తప్పు చేస్తే, 'వాడు చేసినదానికి ఆ శాస్తి జరగాల్సిందేలే' అనవచ్చు కనీసం సానుభూతిగా పలకరించే మనిషి లేడు నువ్వు తప్ప మనకి పెద్దగా పరిచయం కూడా లేదు అయినా నీ మాత్రం అభిమానం వాళ్ళకులేదు నామీద'' అన్నాడు బాధగా

అతను మాట్లాడేకొలదీ ప్రకాశం మనస్సు బాధతో నలిగిపోతోంది అతన్ని ఎలా ఓదార్చాలో తోచలేదు

''నువ్వేమీ అధైర్యపడమాక మంచిరోజులు తప్పకుండా వస్తాయి ధైర్యంగా ఉండు'' అన్నాడు

అతను చిన్నగా నిట్టూర్చాడు ''ఇంట్లో వుండలేకపోతున్నా అసలు ఈ ప్రపంచమంతా మమ్మల్ని వెలివేసినట్లు బాధ కలుగుతోంది ఏంటో మమ్మల్ని అంటరానివాళ్ళుగా చూస్తున్నారంతా నాకే గనక కనీసం ఓ పదివేలుంటే ఈ నా కొడుకుల్ని వెంట్రుకతో సమానంగాకూడా చూసేవాడిని కాదు అప్పుడీ ఉద్యోగం కోసం వెంపర్లాడేవాడిని కూడా కాదు వస్తే వచ్చిద్ది, పోతే పోయిద్ది ఏదో చిన్న బిగినెస్సు పెట్టుకుని కడుపులో నీళ్ళు కదలకుండా పిల్లలతో కాలక్షేపం చేసేవాడిని ''

అతని మాటలకు అంతరాయం కలిగిస్తూ ప్రకాశం వెళ్ళవలసిన బండి వచ్చి ప్లాట్‌ఫాం మీద ఆగింది అంతా తొక్కిసలాట క్రమశిక్షణలేని జనం అంతా చికాకు తీవ్రమైన తొందరపాటు చీదర చీదర

''సరేనువ్వెళ్ళిరా బాగా పొద్దుపోయింది అమ్మాయి ఎదురు చూస్తూ వుంటుంది త్వరలోనే మంచిరోజులు వస్తాయి వేరే ఆలోచనలు ఏమీ పెట్టుకోగాక మీకోసం కాదు ఆ పసికూనల కోసం బ్రతక్క తప్పదు మనమింకా మనకోసం బ్రతికే వయస్సా ఇది '' అన్నాడు ప్రకాశం బాధగా, అనునయంగా

''అదే ఆ బంధమే నన్నిట్లా కట్టేసింది ఆళ్ళే లేకపోతే ఈ శరీరం ఏ బండికిందో ముక్కలు ముక్కలయిపోయి వుండేది ఈపాటికి ఎప్పటికైనా పోయేవాడినే'' అన్నాడు గద్గద స్వరంతో శాంతయ్య

''ఛ ఛ తప్పు తప్పు అలాటి ఆలోచనలే రానీయొద్దు అదే నేను చెప్పేది పోయి ఓసారి యస్పీదొరకు కనపడు రోజులెప్పుడూ ఒక్కలాగే ఉండవు ''

''ఎన్నిసార్లో కనబడ్డా చలవ బంగళాల్లో, కాలుకింద పెట్టకుండా కార్లల్లో తిరిగే దొరలకీ, దాతలకీ ఈ అభాగ్యుల కష్టాలు ఏం తెలుస్తాయి సరే కానియ్ ఈ సోదంతా చెప్పి నిన్ను బాధపెట్టటం బాగుండదు నువ్వు పోయి రా '' అన్నాడు శాంతయ్య

'అలాగే' అన్నట్లు తలూపాడు ప్రకాశం

అతను చిన్నగా కదిలిపోయాడు, ప్లాట్‌ఫాం మీది జనసంద్రంలోకి, పట్టుతప్పి కొట్టుకు పోతున్న పడవలా

అతన్ని సస్పెండ్ చేసిన కారణం గుర్తొచ్చింది ప్రకాశానికి

తనలాగే ఓరోజు డే బీటుకు వెళుతున్నాడు అతను బండిలో ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంటులో స్నాచింగ్ జరిగింది స్టేషన్లో బండి ఆగినప్పుడు టి టి ఇ హడావిడిగా బీటు కానిస్టేబుల్ని వెతుక్కుంటూ వచ్చాడు శాంతయ్యని చూడటంతోటే తిట్టటం మొదలుపెట్టాడు 'ఏరా దొంగ

లంజాకొడక, ఇక్కడేం చేస్తున్నావు, అవతల స్నాచింగులు జరుగుతూ వుంటే ' ఇలా సాగిన అతని వాక్ప్రవాహానికి బిత్తరపోయాడు శాంతయ్య మొదట అంతమందిలో అతనలా తిట్టటంతో అవమానంతో కుచించుకుపోయాడు శాంతయ్యలో శాంతం నశించింది కోపంతో వూగిపోయాడు 'నీ పర్మిషన్ లేకుండా లోపలకు అడుగు పెట్టటానికి వీలులేని కంపార్టుమెంటులో అది జరిగితే, అందులో వుండేవాడికి నీకే తెలియదు, పదహారు బోగీలూ, ఇన్ని వేలమంది ప్రయాణీకులకు నేనొక్కడిని, నేనెట్లా తెలుసుకోగలను ఇకపైన ఒక్కమాట మాట్లాడేవంటే లంజాకొడక, మడిచి బండికింద పెట్టి, నిన్నిక్కడే పూడ్చేస్తా' అన్నాడు అతనికనోరు మెదపలేదు మూడోరోజు ఉదయానికల్లా సస్పెన్షన్ ఆర్డర్స్ చేతికొచ్చాయి ఆ టి టి ఇ తిట్టిన తిట్ల గురించి అడిగినవాడు లేడు వాళ్ళకు యూనియన్ వుంది పోలీసులకు లేదు

అదంతా గుర్తుకొచ్చింది ప్రకాశంకు మెదడు ఇంకా అదే ఆలోచించింది 'హు ఎంత దారుణం ఎవరు తిట్టినా పడుండాలి ఎదురుతిరిగి మాట్లాడటానికి వీలులేదు లోపల అంతే, బయటా అంతే' అనుకున్నాడు ఆలోచనలతోనే అడుగులు వేస్తూ బండిని సమీపించాడు నిలబడేటందు కన్నా వీలుండే కంపార్టుమెంటు కోసం ఆ చివర నుండి ఈ చివరివరకూ వెతుకుతూ ఒక పెట్టె ఎక్కాడు

అలాగే రోజులూ, నెలలూ గడిచాయి రైల్వేలో పనిచేసిన ఆ మూడు సంవత్సరాలు ఒక ఎత్తు, మిగిలిన సర్వీసంతా ఒక ఎత్తుగా తోచింది ప్రకాశానికి 'ఇంత భయంకరమైనది కాబట్టే, పనిష్మెంటు మీద దీనిలోకి వేస్తారు' అనుకున్నాడు చాలాసార్లు

రోజులు గడిచిపోతున్నాయి కొడుకులో ఏదో మార్పు వస్తున్నట్లు గమనించాడు ప్రకాశం ఎప్పుడూ ఆ కమ్యూనిస్టు పుస్తకాల్లో మునిగిపోయి వుంటున్నాడు యమ్ ఏ చదివించటానికి డబ్బుల్లేక చదువు ఆపమన్నాడు ప్రకాశం సూర్యం చిన్నచిన్న చిల్లరమల్లర ఉద్యోగాలు చేస్తున్నాడు ఆ వచ్చే కొద్దిపాటి జీతంలో పుస్తకాలకెక్కువ ఖర్చు పెడుతున్నాడు తన పాకెట్ ఖర్చులకి ఇంటిలో అడగటం లేదు ఎప్పుడన్నా కూరలకీ, చిన్నచిన్న ఖర్చులకి వాళ్ళమ్మకు డబ్బులు ఇస్తున్నాడు ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ వున్నట్లు కనపడతాడు లక్ష్మికూడా అప్పుడప్పుడు ఆ పుస్తకాలు చదువుతోంది పుస్తకాలంటే తనకున్న ఆపేక్షవల్ల సూర్యం పుస్తకాలకోసం ఎంత డబ్బులు ఖర్చుపెట్టినా తను వారించడం లేదు అదొక్కటేకాక, సూర్యం మిగతా కుర్రాళ్ళకంటే భిన్నంగా కనిపిస్తాడు ఆకారంలో సన్నగా పీలగా వున్నా ముఖంలో గంభీరత కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది ఎంతసేపూ ఎదుటివాళ్ళ హృదయపులోతుల్ని చదువుతున్నట్లుంటాయి ఆ కళ్ళు చాలామంది కుర్రవాళ్ళల్లా 'సొల్లు' కబుర్లతో కాలక్షేపం చెయ్యటం అసలు కనపడదు

వాళ్ళు అలాటి పుస్తకాలు చదువుతుంటే ప్రకాశానికి ఎందుకో బాధనిపించేది 'ఆ పుస్తకాలు వీళ్ళని బ్రతకటం చాతకాని వాళ్ళుగా చేస్తాయేమో' అనుకునేవాడు కాని చదవొద్దని చెప్పలేదు ఎప్పుడూ

రాత్రిళ్ళు భోజనాల దగ్గర కూర్చున్నప్పుడు సూర్యం చెప్పే విషయాలు బాగా ఆసక్తిగా వుండేవి కాని చాలా విషయాలు అర్థమయ్యేవి కాదు 'కానీ, వాడికి మాట్లాడటంలో గొప్ప నేర్పు వుంది ఆ స్వరం వినాలనిపిస్తుంది కూడా పైగా' అనుకునేవాడు ప్రకాశం సూర్యం చెప్పే విషయాలు వింటుంటే తను ఉద్యోగంలో చేరిన కొత్తల్లో కమ్యూనిస్టులను కాల్చి వేసేందుకు వెళ్ళినప్పుడు విన్న విషయాలు గుర్తుకొస్తుండేవి ఈ మధ్య కాలంలో అవి ఎవరినోటా వినలేదు ప్రకాశం

పిల్లల్ని గురించి ఆలోచించినప్పుడల్లా అతను వాళ్ళ భవిష్యత్తును గురించి కలవరం చెందేవాడు. ఆందోళన పడేవాడు కాని చివరకు 'మన చేతిలో ఏముంది ఎవరెలా మారతారో' అనుకునేవాడు తనలోని ఈ నిర్లిప్తతకు కారణం వెదకబోయేవాడు

రోజులు భారంగా, బాధగా దొర్లుతున్నాయి ప్రకాశం ఆరోగ్యంలో కూడా మార్పు వస్తోంది తన కళ్ళముందే జరుగుతున్న అన్యాయాలను ముభావంగా చూస్తూ వూరుకోవటం మినహా ఏదేమీ చెయ్యలేని నీరస స్థితిలోకి నెట్టబడ్డాడు

ఆ రోజు తనని రైల్వేనుండి ట్రాన్స్‌ఫర్ చేసినట్లు, తిరిగి తన జిల్లాకే పంపిస్తున్నట్లు ఆర్డర్స్ వచ్చాయి వాటిని చూచి బ్రతుకుజీవుడా అని నిట్టూర్చాడు అంతకు మించిన ఆనందం ఏమీ కనపడలేదు

తాము సామానంతా సర్దుకుని వెళ్ళేరోజున హేమ సూర్యం కొరకు బస్టాండువరకు వచ్చింది బస్సు బయలుదేరేంత వరకూ వాళ్ళిద్దరూ ప్లాట్‌ఫాంమీద నిలబడి చాలాసేపు మౌనంగా వున్నారు, కళ్ళతో మాట్లాడుకుంటూ సూర్యానికి ఆ అమ్మాయి ఏదో బహుమతిగా ఇచ్చినట్లుంది కళ్ళల్లో చిప్పిల్లుతున్న నీటిని హేమ బలవంతంగా ఆపుకుంటున్నట్లు తోచింది ప్రకాశానికి బస్సులో లక్ష్మి వాళ్ళమ్మ పక్కన కూర్చుని ఏదో పుస్తకం చదువు కుంటోంది కాని అప్పుడప్పుడూ తలతిప్పి వాళ్ళకేసి చూస్తోంది బస్సు కదిలేటప్పుడు హేమ కళ్ళల్లోని నీరు చటుక్కున జాలువారాయి ఏదో అంది ఆ మాటకు సూర్యం ఏదో చెప్పాడు కళ్ళతోనే వీడ్కోలు చెప్పుకున్నారు

బస్సు బయలుదేరింది

'వాళ్ళిద్దరూ ప్రేమించుకుంటున్నారా ?' అనుమానం కలిగింది ప్రకాశానికి కాని సూర్యాన్ని ఏమీ అడగలేదు ప్రతిదానికీ ఓ రకమైన నిర్లిప్తత అలవాటయి పోయింది ఆ ఆలోచన నుండి దృష్టిని మరల్చాలన్నట్లు కళ్ళద్దాలు తీసి జేబులో పెట్టుకుని గట్టిగా కళ్ళు మూసుకున్నాడు 'ఆ అమ్మాయి వేషే భాషే చూస్తే మధ్య తరగతి అమ్మాయిలాగానే వుంది కాని ఆ పిల్ల మాటతీరు, ఆ అమ్మాయి చాలా తెలివైందని చెపుతోంది' అనుకున్నాడు ప్రకాశం

ఎవరి ఆలోచనల్లో వాళ్ళు మునిగిపోయారు బస్సు కుదుపులతో పోతోంది పచ్చని చెట్లూ, చేమలూ నీరు కమ్మిన సూర్యం కళ్ళకు బూజరగా కనిపిస్తున్నాయి అతని హృదయమంతా బాధతో నిండిపోయింది హేమ రూపం స్మృతిపథంలో స్పష్టంగా నిలబడింది

ప్రకాశం ఇబ్బందిగా కూర్చున్నాడు శరీరంలో సత్తువ తగ్గటం వల్ల ఒకగంటపాటు బస్సు ప్రయాణం చేస్తే వళ్ళంతా హూనమయి పోయినట్లు రెండురోజుల వరకూ ఆ నొప్పులు తగ్గటం లేదు 'ఆరోగ్యం దెబ్బతింది' అనుకున్నాడు కొత్త వూరు చేరారు చిన్నటౌను

ఆ సబ్‌స్టేషన్‌లోని డ్యూటీలు కొంచెం తేలికగా వున్నట్టు తోచాయి కారణం ఆలోచించాడు ఏమీలేదు రైల్వే నుండి రావటం మూలాన ఈ ఉద్యోగాలు కాస్త సుఖంగా వున్నట్టు తోస్తున్నాయి రోజులు గడిచేకొలదీ మళ్ళీ అంతా మామూలే ఏరోజు కారోజు ఇంకా తనకెంత సర్వీసుందో లెఖ్ఖ వేసుకోవటం బాగా అలవాటయి పోయింది 'సర్వీసు అయిపోవచ్చింది ఈ లోపుగానే కూతురికి పెళ్ళి చేసెయ్యాలి కొడుక్కి ఏదన్నా ఉపాధి దొరికితే ఇక ఈ శేష జీవితానికి దిగుల్లేదు' అనుకుంటున్నాడు 'రిటైరయిన తరువాత ఎలాటి సమస్యలూ వుండకూడదు బరువు బాధ్యతలన్నీ ఈలోపే దింపేసుకోవాలి ఆ వచ్చిన నాలుగు డబ్బుల్తో ఎక్కడో చిన్న గుడిసె వేసుకొని శేష జీవితాన్ని చిన్నగా దొర్లించవచ్చు' అనుకునేవాడు చాలామంది లాగా

ఆ రోజు మామూలుగా స్టేషనుకెళ్ళాడు ఉదయమే ఎనిమిది గంటల ప్రాంతంలో యస్సై వచ్చాడు స్టేషను రైటరూ, సార్జిన్ లోపలున్నారు పీసీలు స్టేషన్ ముందున్న వేపచెట్టుకిందనిలబడి పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు ఎవరో ఆడమనిషి పెద్దగా ఏడ్చుకుంటూ చిన్నగా స్టేషన్ కొచ్చింది ఆమెని పట్టుకుని నడిపిస్తూ ఒక కుర్రోడు కూడా వచ్చాడు వాళ్ళు వస్తూనే వేపచెట్టుకింద నిలబడివున్న పీసీలనిచూస్తూ దండం పెడుతూ దగ్గరకొచ్చారు ముసలామె ఒక పీసీ కాళ్ళమీద పడింది దడాలున ఆ ముసలామెకి తలమీద బలమైన దెబ్బ తగిలింది తల పగిలి నెత్తుటితో ముతక చీరంతా తడిచిపోయింది ముఖంనిండా నెత్తురు చారలుకట్టి ఎండిపోయింది ఆ కుర్రవాడి వంటిమీద చినిగి పేలికయిన చొక్కా, రక్తపు మరకలంటిన ముతకపంచా వున్నయ్ అతని మోచేతులు దోక్కుపోయి వున్నయ్.

''ఏమిటి ? ఏమిటి ? '' అన్నాడు ఆ పీసీ, ఆమె మురికిచేతుల్ని తన బూట్లకు తగలనీకుండా వెనక్కు జరుగుతూ

''దొరా పెసిడెంటుగోరి తమ్ముడుగోరు ''

''ఎవరు, ఏ ప్రెసిడెంటు ?'' అడిగాడు అతనే ఆమెతో వచ్చిన కుర్రవాడు ఆ ప్రశ్నకు జవాబు చెప్పాడు అందరిమధ్యా రెండు సెకండ్ల నిశ్శబ్దం ఆ జవాబు విన్నాక చోటు చేసుకుంది ఒకరి ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు

''సరే లోపలికి పో అయ్యగారూ, రైటరుగారూ, సార్జిన్‌గారూ వున్నారు లోపల పోయి రిపోర్టివ్వండి'' అన్నాడు ఒక పీ సీ ఆమె ఆ దుమ్ములోంచి లేచి, బయటనుండే చేతులు జోడించు కుని భయంగా లోపలకు వెళ్ళింది ఆ కుర్రవాడు ఆమెని పట్టుకుని లోపలకు వెళ్ళాడు వాళ్ళవైపే చూస్తూ వుండిపోయారు పీసీలంతా ఆమె తల వెనకభాగం నుండి జాకెట్టులేని నల్లటి వంటిమీదకు ఇంకా నెత్తురు చుక్కలు చుక్కలుగా కారుతోంది వాళ్ళు లోపలకు వెళ్ళిన కొద్దిసేపటికి యస్సై గొంతు పెద్దగా వినపడింది బయటకు

'తంతా, దొంగలంజా, తెల్లారిందా అప్పుడే మీ యమ్మని మీకు ఇంకో పనిలేదు వళ్ళు కొవ్వెక్కిందాకా తినటం, వూరిమీద పడి తన్నుకోవటం ఫో బయటకు నేను లేచానంటే చస్తావ్ దరిద్రపు కేసు పొద్దున్నే మీరేం చెయ్యకపోతే ఎందుకు తంతారు మిమ్మల్ని చిన్న చిన్న దెబ్బలకు కూడా స్టేషనుకు చస్తారు ఆ ప్రెసిడెంటు తమ్ముడు నాకు తెలియదా అతను చాలా పెద్దమనిషి ఏయ్ రైటర్, దీన్ని పంపించు బయటకు' అంటున్నాడు యస్సై పెద్దపెద్దగా

'మెమో రాసి ఆసుపత్రికి పంపిస్తా సార్' అంటున్నాడు రైటరు 'పంపించొచ్చు లేవయ్యా! అదేం చావదు ఇయ్యన్నీ అంత తేలిగ్గా చచ్చే రకాలు కాదు ముందు ఆ డైరీ ఇటివ్వు ఓపెన్ చేస్తా నేను వెంటనే బయలుదేరి ఇనస్పెక్టరు ఆఫీసుకు పోవాలి' అంటున్నాడు విసుక్కుంటూ యస్సై

రైటరుకేం మాట్లాడాలో అర్థం కాలేదు ''కొద్దిసేపు బయట కూర్చోండి'' అన్నాడు వాళ్ళతో

వాళ్ళు బయటకొచ్చారు భయంగా స్టేషను పంచలో ఓ మూలగా కూర్చున్నారు ఏడుస్తూ కొద్దిసేపటికి ఆ ముసలామె కూర్చోలేక చిన్నగా ఒత్తిగిల్లింది

అలాటి సంఘటనలు చూస్తుండటం మామూలే అయినా, చాలా మంది పీసీలకి కడుపు మండిపోయింది యస్సైమీద కాని నోరు తెరిచే పరిస్థితి లేదు అసమర్థ బ్రతుకులు వాళ్ళవి

మధ్యాహ్నం ఒంటిగంటయినా ఆ ముసలమ్మ విషయం ఎవరూ పట్టించుకోలేదు ఒంటి గంట ప్రాంతంలో పొరుగూరి భూస్వామి ఒకడు స్టేషను కొచ్చాడు చాలామంది పీసీలు అతన్ని

నవ్వుతూ పలకరించి నమస్కారాలు చేశారు ప్రకాశం, ఇంకా ఒకళ్ళిద్దరు అతన్ని చూస్తూ నిలబడ్డారు అతను లోపలకు వెళ్ళాడు

'దసరా వస్తోంది, ఈ నా కొడుకుని కాకా పట్టాలి' అంటున్నాడు ఒక పీసీ

'పిసినారి నా కొడుకు పైసా రానివ్వడు ఏడొందల చిల్లర ఎకరాలకు భూస్వామి' అంటున్నాడు ఇంకొకతను వాళ్ళలా మాట్లాడుకుంటూనే వున్నారు లోపల్నుండి డబ్బా రైటరు బైటవున్నవాళ్ళల్లో ఇద్దరు పీసీలని నెంబర్లు పెట్టి పిలిచాడు వాళ్ళిద్దరూ హుషారుగా కదిలి లోపలికెళ్ళి మరుక్షణంలో బయటకొచ్చారు

వాళ్ళనిచూచి ''ఏమిటి విశేషం'' అన్నాడు బయట వున్నవాళ్ళల్లో ఒక పీసీ

''వాడి పొలంలో గొడ్లు పడ్డాయంట అదేందని అడిగితే ఎదురు తిరిగారంట కుర్రాళ్ళు వీడికి'' అన్నారు వాళ్ళు సైకిళ్ళు తీసుకుని బయలుదేరబోతూ

''వాళ్ళనిప్పుడు తీసుకురావాలా ? ఈ ఎండలో ? ఏడుమైళ్ళు పోవాలి, ఏడుమైళ్ళు రావాలి తిండి తినకుండా ఇప్పుడా ?'' అన్నాడు ఒకతను

''అన్నీ అక్కడే జరిగిపోతాయి వాడు యస్సైతో మాట్లాడి బయటకు రాగానే టెండరు వేయటమే అప్పటిదాకా బయట టీకొట్టు దగ్గర కూర్చుంటాం కాసుకుని వస్తాం మరి'' అంటూ బయటకెళ్ళారు పది నిముషాలకు యస్సైతో మాట్లాడి బయటకొచ్చాడు ఆ భూస్వామి

అతను గడప దాటుతుంటే యస్సై కేకేశాడు పెద్దగా 'ఇద్దరు పీసీలు సరిపోతారా? లేకపోతే ఇంకో ఇద్దర్ని తీసుకుపోండి' అని

అతను ఇంక అక్కరలేదన్నట్టు తలూపి, నవ్వుతూ వెళ్ళిపోయాడు

వసార్లో ముసలామె మూలుగుతోంది కొద్దిసేపున్నాక ప్రకాశం లోపలికెళ్ళి రైటరుతో చిన్నగా అన్నాడు, ''సార్ ముందు ఆ ముసల్దాన్ని ఆస్పత్రికి పంపించండి అది చచ్చిందంటే తరువాత మనకే ఇబ్బంది మెమో ఒకటి రాసివ్వండి నేనే తీసుకెళ్తా పాపం పొద్దుననంగా వచ్చింది పైగా హెడ్ ఇంజురీ నమ్మటానికి వీలులేదు''

''అరరే మరిచేపోయానయ్యా దాని సంగతి'' అని డబ్బా రైటరుతో, ''ఇదిగో శేషగిరీ, ఆసుపత్రి మెమో పుస్తకం తీసుకుని ఆ ముసల్దాని దగ్గరకెళ్ళి పేరూ అదీ కనుక్కొని, మెమో రాసి తీసుకురా, నేను సంతకం చేస్తా'' అన్నాడు రైటరు

ఈ సంభాషణ అంతా వింటున్నాడు యస్సై అతనికి ప్రకాశమంటే ఎప్పటినుండో ద్వేషంగా వుంది విసురుగా పిలిచాడు ప్రకాశాన్ని ఆ పిలుపే ప్రకాశంకు భయం, కోపం తెప్పించింది వెళ్ళి సెల్యూట్‌చేసి నిలబడ్డాడు యస్సై విసుగుదలకు కారణమేమిటో అర్థం కాలేదు మొదట

''ముసల్దాని దగ్గర ఎంత తీసుకున్నావ్, అంత దయ చూపిస్తున్నావ్'' అన్నాడు యస్సై సీరియస్‌గా

ఆ మాటకు మొదట ఆశ్చర్యపోయాడు ప్రకాశం మరునిముషంలో అవమానంతో నిండిన కోపంతో నొసలు ముడివేశాడు ఏం జవాబు చెప్పలేదు వెంటనే ఒక క్షణంపాటు ఆలోచించాడు

''ఆ స్థాయికింకా దిగజారలేదు నీలాగా'' అన్నాడు

యస్సై కోపంతో వణికాడు కాని తమాయించుకున్నాడు

''లేకపోతే ఏమిటి పాపం అంత ప్రేమ ?'' అన్నాడు ఎకసక్కెంగా

''మనుషుల మధ్య సంబంధాన్ని డబ్బుతో ముడిపెట్టేవాళ్ళకు మానవత్వం అనేదొకటి

వుంటుందని తెలియదు చెప్పినా అర్థం కాదు ఆ మానవత్వం ఉన్నవాళ్ళకే ఇతరుల బాధ అర్థమయ్యేది'' అన్నాడు గబగబా గంభీరంగా, కోపంగా ఆ మాటలు యస్సైని అవమానపరిచాయి ఏం మాట్లాడాలో తోచలేదు ఏం మాట్లాడితే ఏం జవాబు వస్తుందో అని భయం వేసింది కాని ఏమీ మాట్లాడకపోతే తనింకా వెధవ నయిపోతాననే భయంతో మాటలకోసం తడుముకున్నాడు

''అహాఁ అదా సరేలే మాకు లేదులే మానవత్వం సరేలే వెళ్ళు'' అన్నాడు వ్యంగ్యంగా ఉనాలని ప్రయత్నిస్తూ

''ఆ విషయం ఎన్నోసార్లు రుజువు చేసుకున్నావు'' అని హుందాగా బైటకెళ్ళాడు ప్రకాశం

ఆ మాటలు యస్సై మెదడుమీద సమ్మెటతో కొట్టినట్లు తగిలాయి ఉక్రోషం పట్టలేక పోయాడు

గంభీరమయిన ముఖంతో బయటకెళ్ళి నిలబడ్డాడు ప్రకాశం

''ఎందుకయ్యా! వాడు పెంటని తెలుసుకదా పెంటమీద రాయేస్తే ఏమవుతుంది'' అన్నాడు తోటి పీసీ

''ఏముంది ముకుందం ఇందులో అసలు వాడు మాట్లాడేదాని కేమన్నా అర్థముందా'' అన్నాడు బాధగా ప్రకాశం

''వాడు మనిషయితే అట్లా మాట్లాడతాడా'' అన్నాడు ముకుందం చిన్నగా వాళ్ళు ఆ విషయాన్నే చాలాసేపు మాట్లాడుకున్నారు

''ఏమండోయ్ ఓ వార్త ఇది మంచికొచ్చిందో చెడ్డకొచ్చిందో దేశంలోకి 'ఎమర్జెన్సీ' వచ్చిందంట, నిన్నటినుండి'' అంటూ ఒక పీసీ లోపలికొస్తూ చెప్పాడు

''అంటే ఏమిటి ? ఎక్కడినుండొచ్చింది ?'' అడిగాడు ఒకతను

''ఏమో నేనెప్పుడూ వినలేదు యమర్జన్సీ విధించారంట సెంటర్లో అనుకుంటున్నారు పేపర్లో పడింది ఇదేదో కొత్తగా వుంది'' అన్నాడు అతను

ఆ రోజు స్టేషన్లో యస్సైతో జరిగిన గొడవని రెండ్రోజుల్లో మరిచిపోయాడు ప్రకాశం కాని యస్సై అదనుకొరకు చూస్తున్నాడు అది జరిగిన కొద్ది రోజుల తరువాత పక్కవూరిలో మర్డర్స్ జరిగాయి కొంతమంది బందోబస్తులో వున్నారక్కడ ప్రకాశం కూడా 'టరన్' ప్రకారం బందోబస్తుకి వెళ్ళాడు అక్కడకు

ఈ రోజు బందోబస్తులో వున్నప్పుడు, స్టేషను నుండి సి ఐ గారు రమ్మంటున్నారంటూ హుస్సేన్ వచ్చాడు ప్రకాశం బందోబస్తు నుండి స్టేషను కొచ్చాడు తనకు ఓ కాగితం అందించాడు సి ఐ అందులో తనని కంపల్సరీ రిటైర్మెంటు చేసినట్లు వుందని తెలుసుకున్నాడు ఆ కాగితం తీసుకుని బయటకొచ్చాడు ఇంటికెళ్ళలేకపోయాడు జీవితంలో ఎన్ని వడుదుడుకులు ఎదురయినా నిగ్రహంగా నిలబడిన అతను ఈ దెబ్బను తట్టుకోలేక బ్రాందీషాపు కొచ్చి తాగాడు ఇప్పుడు గతమంతా అతని కళ్ళ ముందు గిర్రున తిరిగింది ఆలోచనలతో అలా వుండిపోయాడు

  

అలా ఎంతసేపున్నాడో తెలియలేదు మనసుకు తగిలిన దెబ్బను ఈ మత్తు ఏ మాత్రం ఏమార్చలేకపోయింది అలాగే కూర్చున్న అతనిని బేరర్ కుర్రోడొచ్చి పలకరించాడు ''సార్, కొట్టు

కట్టేస్తున్నాం రెండు దాటింది టైము'' అన్నాడు

జేబులోంచి డబ్బులు తీసి అతని చేతిలో పెట్టాడు లేచి బెడ్డింగు అందుకుని టోపీ చేత్తో పట్టుకుని బైటకొచ్చాడు చిన్నగా తూలుతూ రిక్షా ఎక్కాడు ఆ తూలుడుకు కారణం మానసిక బలహీనతే ఇంటికొచ్చాడు జరిగిన విషయం క్షణంలో ఇంటిలో తెలిసిపోయింది

ఇంటినిండా విషాదం అలుముకుంది సూర్యంతప్ప తల్లీకూతుళ్ళిద్దరూ రెండుమూడు రోజులపాటు బైటకుకూడా రాలేదు ఉద్యోగం పోయిందన్న బాధకన్నా, నలుగురూ వెలివేసినట్లు, చూస్తున్నారనే అవమానంతో కుచించుకుపోయాడు బైటకొచ్చి తెలిసినవాళ్ళ మధ్య ముఖం చూపించలేక పోయాడు ప్రకాశం అందరూ అతన్ని చూచి నవ్వుకుంటున్నట్లూ, 'ప్రభుత్వం తనని అసమర్థుడ'ని అన్నట్లుగానే వాళ్ళుకూడా అనుకుంటున్నారేమో అనే గిలి అతన్ని మానసికంగా కృంగదీసింది

ఆ భయంకర పరిస్థితి నుండి దూరం కావటానికి త్రాగుడు ఒక్కటే శరణ్యమని నిర్ణయించుకున్నాడు షుమారు ముప్ఫై మూడు సంవత్సరాల సుదీర్ఘ కాలంలో ఎన్నో విపత్కర పరిస్థితుల్లో కూడా ధైర్యంగా నిలబడగలిగిన అతను ఈనాడు జారిపోయాడు తాగాలని అతని మనస్సు తొందర చేస్తోంది ఆ మత్తులో తననుతాను దాచుకోవాలనుకుంటున్నాడు

'తాగి ఆ మత్తులో ఈ వేదనలకు దూరం కావాలి లేదా చచ్చిపోవాలి రెండే మార్గాలు అవేవీకాకుండా ఈ మనుషుల మధ్య, అసమర్థుడిలాగా తలొంచుకుని నిలబడలేను ' ఇవే ఆలోచనలు ఉద్రేకపూరితమైన ఈ ఆలోచనలు విపరీతమైన రక్తప్రసారాన్ని కలిగిస్తున్నాయి కణతలమీది నరాలు ఉద్రేకంలో చిట్లిపోతాయేమో అనే భయం అతన్ని ఆక్రమిస్తోంది రెండురోజులు అలా గడిచిపోయాయి

ఈ రెండు రోజుల్లో భర్తలో చోటు చేసుకున్న ఈ మార్పు ఆమెకు స్పష్టంగా కనిపించింది తీవ్రమయిన ఆందోళనకు ఆమె లోనయ్యింది మర్రోజు మధ్యాహ్నం చిన్నగా ఏడుపు గొంతుతో అంది, ''ఏమిటిది? ఏందయ్యా ఇది? నిన్ను సూత్తుంటే నాకు భయంగా వుంది '' ఇంకేమీ మాట్లాడలేక ఏడుపుని ఆపుకుంటూ ప్రకాశంవైపు చూచింది

అతను తలెత్తి ఒకసారి చూచి తలదించుకున్నాడు

''ఏంది బాధపడతావు ఎట్లా జరగాలనుంటే అట్లా జరిగిద్ది నువ్వు నిజాయితీతో బతకటానికి బతుకంతా దారపోశావు అందుకు పెతిపలంగా గవర్నమెంటు నిన్ను నౌకరీలోనుండి తీసివేసింది నేయానికి సోటేడుంది నువ్వు తప్పు సెయ్యలేదు ఏంది బాధపడతావు బతికినంతకాలం తిని తిరగక ఏందీ మాట్లాడవు '' ఆమె ఏడుపు ఆపుకోలేక పోతోంది కన్నీరు ధారగా కారుతోంది

''ఏం మాట్లాడమంటావు '' అన్నాడు ప్రకాశం భారంగా

ఆమె ముక్కు గట్టిగా చీది, మాసిన పమిట చెంగుతో ముక్కు తుడుచుకుంది ''మాట్లాడకుండా ఏం చేద్దామని? ఎన్నడూలేంది తాగొచ్చావు ఈ సంసారాన్ని ఏం చెయ్యాలని నువ్వేదన్నా అయితే మేమేం కావాలి ఈ బిడ్డలు ఏం కావాలి మన కరమ బాగాలేక ఇట్టా జరిగింది బతుకుతెరువుకు దారి చూసుకోవాలిగానీ, ఇట్టాంటి ఆలోచనలు ఏంది సెప్పు ఇప్పటిదాకా ఇంటా బయట ఏ పనిలోనూ ఒకళ్ళసేత ఏలుపెట్టి సూపించుకోలేదు ఇంత బతుకు బతికి ఇప్పుడు ఇట్టాంటి పని సెయ్యటానికి నీకు మనసెట్టా ఒప్పిందయ్యా ఒకళ్ళకిసెప్పే వాడివి నీకీ పనేంటి? ''

''ఊఁ వూరుకో '' విసుక్కున్నాడు

''ఆఁ వూరుకోక సేసేదేంది నువ్వుగనక ఇంకోసారి ఇట్టాంటి పని సేత్తే నా శవాన్ని సూత్తావ్ '' అంది ఏడుస్తూ

ఆలోచనలు అంతం లేకుండా సాగుతున్నయ్ అతని మనస్సు ఈ ఓటమిని అంగీకరించలేక పోతోంది 'ఎక్కడికక్కడ ఎప్పుటికప్పుడు పోరాటం చేశాడు యోధుడిలాగా అన్యాయం మీద పోరాటం, అక్రమం మీద పోరాటం తన కన్నా ఎంతో బలమైన శత్రువుల మీద పోరాటం 'పోరాటం లేని జీవితంలో సారం ఏముంది' అనుకున్న సందర్భాలెన్నో ఎప్పటికప్పుడు శత్రువు చేతిలో దెబ్బతింటున్నప్పటికీ అది తన విజయంగానే భావించాడు తన ముందు నిలబడలేక శత్రువు తనని దూరంగా నెట్టేశాడూ అంటే అది శత్రువు ఓడిన కిందే లెఖ్ఖ తను గెలిచిన కిందే లెఖ్ఖ అష్టరాల్ ఒక కానిస్టేబులుకీ - అదీ రాజకీయంగా, ఆర్థికంగా, కులపరంగా బలహీనుడయిన, ఎవరి అండాలేని, కనీసం తోటి కానిస్టేబుళ్ళ అండకూడా లేని ఒక కానిస్టేబులికీ - అధికారుల అండా, డబ్బు అండా, రాజకీయపు అండా వున్న అధికారులకీ మధ్య యుద్ధం అంటే, అది సమ ఉజ్జీల మధ్య సాగే యుద్ధం ఎలా అవుతుంది ? వాడు నిజంగా గెలవాలనుకుంటే తనని ఆ స్టేషన్లోనే వుంచాలి నిలబడగలగాలి అదీ గెలుపు ఇప్పటివరకూ తనే గెలిచాడు తాత్కాలికంగా ఇబ్బందులొచ్చినా నిలబడ్డాడు ఎన్నిచేసినా బ్రతుక్కి కావలసిన భద్రత ఇప్పటివరకూ వుంది ఇప్పుడదిపోయింది అదే ముఖ్యాంశం ఇందులో నోటికాడి కూడు లాగేసింది గవర్నమెంటు దీన్ని తట్టుకోవటం చేతకాలేదు' ఆలోచిస్తూ అలాగే చాలాసేపు ఉండిపోయాడు ఎంత మనస్సు దిటవు చేసుకుందామనుకున్నా ఊరట కలగటం లేదు తీవ్రమయిన మానసిక ఒత్తిడి 'రేపటి నుండి ఎట్టా గడిచిద్ది?' అనే ఆలోచన అతన్ని ఊపిరాడనీయటంలేదు

భార్య అన్నం ప్లేటు తెచ్చి స్టూలుమీద పెట్టి చిన్నగా పిలిచింది

ప్రకాశం భోంచేసి లేచాడు దొడ్లోకెళ్ళి నీళ్ళు పుక్కిలించి వూసి, పై కండువాతో మూతి తుడుచుకుని, వచ్చి మంచంమీద కూర్చున్నాడు కూతురు వాకిట్లో కూర్చుని పుస్తకం చదువుకుంటోంది కూతురి ముఖంవైపు చూశాడు ఎప్పుడూ కళకళలాడుతూ కనపడే ఆ ముఖంలో విచారం కొట్టొచ్చినట్టు కనపడుతోంది కూతుర్ని ఎప్పుడూ అలా చూడలేదు తను ఉన్నదాంతోనే లక్ష్మిని అల్లారుముద్దుగా పెంచారు ఉద్యోగంలో ఎన్ని బాధలు ఎదురయినా, స్టేషన్‌లో ఆఫీసర్లతో ఎంత గొడవలు జరిగినా, ఇంటికొస్తే భార్యాబిడ్డల మధ్య అవన్నీ తాత్కాలికంగా మరిచిపోయేవాడు వాళ్ళెప్పుడూ తనని దేనికీ ఇబ్బంది పెట్టలేదు ఉన్నదాన్లోనే సర్దుకు పోయేవాళ్ళు ఇంట్లో ఎన్ని ఇబ్బందులున్నా నవ్వగలిగే కూతురి మనస్తత్వానికి ఆశ్చర్యపోయేవాడు బిడ్డల మూలంగా ఇరుగు పొరుగుతో ఎప్పుడూ చిన్నపాటి గొడవకూడా రాలేదు కొడుకుని, కూతుర్ని చూసుకుని ఎన్నోసార్లు గర్వపడ్డ సందర్భాలున్నయ్ 'మన ఆస్తులు వాళ్ళే' అనేవాడు భార్యతో గర్వం నిండిన స్వరంతో తను ఇంటికొచ్చే సరికి కూతరు స్కూలుకెళ్ళో, పక్కింటికెళ్ళో కాసేపు కనపడకపోతే, చికాకు పడిపోయేవాడు అలాగే వాళ్ళకు కూడా వాళ్ళు పెద్దవాళ్ళయి జ్ఞానమొచ్చిం తర్వాత, తండ్రి ఏ బందోబస్తు డ్యూటీలోనో వుండి రెండు రోజులపాటు ఇంటికి రాకపోతే ఏదో వెలితిగా గుబులుగా వుండేది

ఆలోచనల్లో మునిగి కూతురివైపు చూశాడు మళ్ళీ పుస్తకంలోకి చూస్తున్నా లక్ష్మి దీర్ఘాలోచనలో మునిగిపోయి వుందని గమనించాడు బాధగా నిట్టూర్చి చిన్నగా నడుం వాల్చాడు

గోడవైపు తిరిగి పడుకున్నాడు కూతురు ఏమాలోచిస్తోంది ? భార్య ఎందుకు బాధ పడుతోంది? కొడుకెందుకు అలా పిచ్చిపట్టిన వాడిలాగా మారిపోయాడు ? కేవలం తనని కంపల్సరీ రిటైర్ చెయ్యటం మొక్కటేనా కారణం ? లేక తను తాగి రావటమా ? భార్య మాటల్లో భావం తను తాగిరావటం తను చేసినపని ఇంట్లో శాంతిని దూరం చేసినట్లుగా కనిపించింది తనని అర్థాంతరంగా రిటైర్ చేసిన బాధకు తోడు తనిలాగా తాగిరావటం వాళ్ళ లేత మనస్సులమీద తీవ్రమైన ఘాత కలుగజేసింది ఛ తనెందుకింత తొందరపడిపోయాడు ఆ నిముషంలో ఎన్నోసార్లు తనని తాను తమాయించుకోగలిగిన తను అలా ఎలా తొందరపడ్డాడు ఇది ఆర్థిక అభద్రతా ప్రభావమా?

ఆ సంఘటన జరిగిన మూడు నాలుగు రోజుల తరువాత ఇప్పుడే అతను కాస్త ప్రశాంతంగా ఆలోచించగలుగుతున్నాడు 'ఎంత వెధవ పని ఇంత కాలంగా తను ఎన్నో విషయాల్లో చూపించిన నిగ్రహం ఏమయ్యింది? ఛ ఛా' తనను తాను తిట్టుకున్నాడు తనమీద తనకే అసహ్యం వేసింది వాకిట్లో చెప్పులు విడిచిన శబ్దం ప్రకాశం ఆలోచనల్ని ఆపేసింది

'వాడొచ్చాడనుకుంటా' అనుకున్నాడు

సూర్యం చెప్పులు విడిచి, దొడ్లోకెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కుని వచ్చి పీట వేసుకుని కూర్చున్నాడు వంటగదిలో

''ఇప్పటిదాకా ఎక్కడికెళ్ళావురా ?'' అంది తల్లి

సూర్యం ఏమీ మాట్లాడలేదు

''టైమెంతయ్యింది ?'' తల్లి అడిగింది మళ్ళీ

''నాకు ఆకలిగా లేదు ''

''ఉండదు పిచ్చోడిలాగా తిరుగు '' ఆమె మాటలికి అడ్డు వస్తూ, ''నాన్న తిన్నాడా?'' అన్నాడు సూర్యం

''తిండి తినకుండా ఆ తిరుగుళ్ళేమిటి ? ఆయనకి మంచీ చెడూ తెలియటల్లేదు ఇప్పుడు నువ్వుకూడా అట్లాగే వూరేగు'' అంది ఆమె విసుగ్గా సూర్యం అవేవీ పట్టించుకోనట్టు, తలొంచుకుని అన్నం కలుపుతూ, ''లక్ష్మి తినిందా ?'' అని అడిగాడు

కొడుకు ప్రశ్నకు సమాధానం చెప్పకుండానే కూతుర్ని కేకేసింది, ''రావే వచ్చి తిండి తినూ ''

లక్ష్మి లేచివచ్చి కంచం ముందు కూర్చుంది ''ఆయన్తోపాటు మీరుకూడా నన్ను చంపుకుతినండి మనకి మంచిరోజులు లేవు'' అంది మాణిక్యమ్మ ఏడుపు స్వరంతో

వాళ్ళ సంభాషణ ప్రకాశం మనస్సును పిండివేసింది ఎంత ప్రయత్నించినా నిద్ర రాలేదు సూర్యం అన్నం తిని వెంటనే బయటకు వెళ్ళాడు తల్లీ కూతుళ్ళు చాప వేసుకుని ఒకళ్ళపక్కన ఒకళ్ళు పడుకున్నారు ఇంటిలో మనశ్శాంతి కరువైంది అందరికీ

సాయంత్రం లేచి లుంగీ కట్టుకుని బయటకు వెళ్ళబోయాడు ప్రకాశం

''ఎక్కడికీ?'' అడిగింది భార్య, అనుమానంగా అతని కళ్ళల్లోకి చూస్తూ

ఆ భావాన్ని అర్థం చేసుకున్నట్టు ''ఎక్కడికీ లేదులే ఇప్పుడే వస్తా'' అన్నాడు

ఆమె కొద్దిసేపు ఏమీ మాట్లాడలేదు అతను గడప దాటుతుంటే, ''నీ యిష్టం'' అంది

భర్త ఉద్యోగం పోవటమంటే ఉన్న ఆ ఒక్క ఉపాధీపోవటమే ఇక రోజులు ఎట్లా గడుస్తాయనే

ఆలోచన ఆమెని కుంగదీస్తోంది ఆ అభద్రతా భావమే భర్తని ఆ పాడుపనికి పురికొల్పిందన్న విషయం గ్రహించింది ఆమె అంతంతమాత్రంగా వున్న ఆమె ఆరోగ్యంమీద ఈ ఆందోళన తన ప్రభావాన్ని చూపిస్తోంది ఆర్థిక భద్రత లేకుండా పోవటం ఆ కుటుంబ సభ్యుల్లో ఆందోళననీ, భయాన్నీ నింపివేసింది

ప్రకాశం స్టేషన్‌వైపు వెళ్ళాడు బజార్లో అందరూ తనని గురించే మాట్లాడుకుంటున్నట్లు ఫీలయ్యాడు స్టేషన్లో యస్సై లేడు కొంతమంది స్టాఫు వున్నారు ప్రకాశాన్ని అభిమానించేవాళ్ళు ఆప్యాయతగా, బాధగా పలకరించారు అంతకుముందు నుండే వాళ్ళు ఇదే విషయాన్ని గురించి మాట్లాడుకుంటున్నారు

''ఇద్దరు ముగ్గురు డి యస్పీలనీ, ఇరవై మందిదాకా ఇన్స్పెక్టర్లనీ, ఓ వందమందిదాకా యస్సైలనీ, ఇక పీసీల్నీ హెచ్ సీ ల్నయితే లెఖ్ఖ లేదంట చాలామందిని, చాలా డిపార్టు మెంటుల్లోవాళ్ళని ఇలాగే చేశారంట ఎమర్జన్సీ ఎంతమందిని పొట్టన పెట్టుకుందో చూడు'' అన్నాడు ఒకతను

''అసలెందుకు చేసినట్టు ?'' అడిగాడు ఇంకొకతను

''ఏమో మరి కారణం ఏమీలేదు కాగితంలో'' అన్నాడు ప్రకాశం తనని అడగకపోయినా

''ఏమఖ్ఖరలేదు కాస్త ఆత్మగౌరవం గల ప్రతివాడినీ అధికార్లు రిటైర్ చేశారు ఒకళ్ళిద్దరు యస్పీలనీ, కలెక్టర్లను కూడా చేశారంట 'అసమర్థత' అనే చిన్న నేరం మోపారు వాళ్ళు పనికిరారంట ఈ నౌకరీలు చెయ్యటానికి ఇన్నేసి ఏళ్ళు రిమార్కు లేకుండా సర్వీసు చేసి రేపో ఎల్లుండో రిటైరయ్యేవాళ్ళు అసమర్థులంట 'అవినీతి' అనేవాళ్ళే కానీ దానికి ఆధారాలు కావాలి కాబట్టి, ఏదో ఒక నెపం మోపాలి కాబట్టి 'అసమర్థత' అన్నారు దానికి రుజువులక్కరలేదు రికార్డు అక్కరలేదు పైనోడు రాసిందే వేదవాక్కు ఎమర్జెన్సీ, కాస్తోకూస్తో నిజాయితీ వున్న ఉద్యోగస్తులమీద ఇలా పడిద్దని ఎవరూ అనుకోలేదు'' అన్నాడు ఒక హెచ్ సీ

''ఇలా రిటైరయిన వాళ్ళ కొడుకులకుగానీ, అల్లుళ్ళకుగానీ ఉద్యోగాలిస్తారంట నువ్వు మీ వాడ్ని తీసుకుపోయి దొరకి కనపడు ప్రకాశం'' అన్నాడు ఒక పీసీ

ప్రకాశం ఏమీ మాట్లాడలేదు

''ప్రకాశం కొడుక్కి ఈ ఉద్యోగం ఇష్టంలేదు ఆ కుర్రోడ్ని నేను ఎన్నోసార్లు హెచ్చరించాను అతనికి ఇష్టం లేదని చెప్పాడు'' అన్నాడు ఒక పీసీ

''అవుననుకో దీనెమ్మ ఇది భాడకవ్ ఉద్యోగమే ననుకో కాని మరి అనుకోకుండా పరిస్థితి మారిపోయినప్పుడు చేసేదేముంది'' అన్నాడు ఇంకొకతను

బాగా పొద్దుపోయిందాకా స్టేషన్లో వుండి ఇంటికొచ్చాడు భర్తని చూచి స్థిమితపడింది ఆమె 'నిన్నటివరకూ డ్యూటీలవల్ల రెస్టు లేదనే బాధ, ఈ పూటనుండి అంతా రెస్టే పనేముంది తినటం పడుకోటం' అనుకున్నాడు ప్రకాశం

నాలుగయిదు రోజుల తరువాత అంతా మళ్ళీ కలిసి భోజనానికి కూర్చున్నారు అలా ఎన్నోసార్లు కూర్చుని తిన్నారు అలా తినటం వాళ్ళకెంతో ఆనందం కలిగిస్తుంది అందులోనూ వెన్నెల రాత్రుళ్ళలో అయితే దొడ్డిలో చాపలు వేసుకుని అందరిమధ్యా లాంతరు పెట్టుకొని కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేస్తుంటే ఎంతో ఆనందంగా వుండేది మధ్యాహ్నం పూట తలా ఒక టైముకి తిని వెళతారు కాబట్టి, అందరూ కలిసి భోజనం చెయ్యటానికి వీలుకాదు

ఆరాత్రి అందరూ కలిసి కూర్చున్నప్పుడు సూర్యం చిన్నగా అన్నాడు ''నాన్నా, ఇలా కంపల్సరీ రిటైర్ చేసినవాళ్ళ పిల్లల్ని పోలీసుల్లోకి తీసుకుంటారంట కదా ?''

ఔనన్నట్లు తలవూపాడు ప్రకాశం కూరవేసుకుంటూ తల్లి కొడుకువైపు ఆశ్చర్యంగా, కొత్తగా చూసింది

''నేను వెళతా''

ఆమె ఆ మాట విని ఇంకా ఆశ్చర్యపడింది ప్రకాశం నొసలు చిట్లించి చూశాడు 'అన్నయ్యేనా ఆ మాట అన్నది' అన్నట్టు చూసింది లక్ష్మి

రెండు నిముషాల నిశ్శబ్దం తరువాత ప్రకాశం చిన్నగా అన్నాడు ''నువ్వు చెయ్యలేవురా''

''తప్పదు'' అన్నాడు సూర్యం ముభావంగా

''అందరూ చెయ్యగాలేంది వాడు చెయ్యలేడా ? కాకపోతే ఏమీ పట్టించుకోకుండా వుంటే చాలు'' అంది తల్లి ఆమె మాటల్లో ఆదుర్దా, కొడుకెక్కడ మళ్ళీ మనసు మార్చుకుంటాడో అనే భయం, కొడుకసలు ఆ నిర్ణయానికొచ్చినందుకు సంతోషం అన్నీ ఒకదానితరువాత ఒకటిగా ఆమెస్వరంలో వినిపించాయి

''నేను చెప్పబోయేదీ అదే పట్టించుకోకుండా ఉండటం ఎలా వీలవుతుంది ? ఇప్పుడు వాడు ఆ నిర్ణయానికి వచ్చాడూ అంటే జరిగిన సంఘటన గురించి పట్టించుకోబట్టేగా'' అన్నాడు ప్రకాశం

''అబెలే అసలు తీసుకుంటారంటనా '' అంది మాణిక్యమ్మ ఆదుర్దాగా, భర్త మాటను దాటవేయటానికి అన్నట్టు

''అన్నయ్య నిర్ణయం సరైందే నాన్నా ప్రస్తుతం దీనిలో చేరితే కొంతవరకు ఆర్థిక సమస్యలు చక్కబడతాయి చిన్నగా వేరేదానిలోకి ప్రయత్నం చేసుకోవచ్చు వచ్చిన అవకాశం ''

''అవకాశం వచ్చింది కాని, ఇది ఎంత నీచమైన వృత్తో చేసే వాళ్ళకే తెలుస్తుంది తల్లీ చూసేవాళ్ళంతా దీనిలోతు అర్థం చేసుకోలేరు ఇందులో దిగితే బయటపడటమనేది చాలా కష్టమయిన పని అందరికీ చాతకాదు బయట పడటానికి ఎంతోమంది కుర్రోళ్ళు ఇలాగే రావటం, దుర్వ్యసనాలకు లోనవ్వటం ఇక అదే బాగనుకోటం, ఎదురు దెబ్బలు తగిలి కళ్ళు తెరిచేసరికి జీవితం చుట్టూ సమస్యలు అల్లుకొని కదలటానికి వీలులేకుండా పోవటం ఇక అందులోనే ముక్కుతూ, మూల్గుతూ వుండిపోవటం ''

''కంట్రోల్లో వుండాలి అట్లా తేలిగ్గా వ్యసనాలకు లోనయ్యే వాళ్ళు ఏం సాధించగలరు'' అంది లక్ష్మి

''అంత తేలిగ్గా మాట్లాడకమ్మా మాటలకీ చేతలకీ తేడా వుంటుంది ఉద్యోగరీత్యా అనేకమందితో పరిచయాలు కలుగుతుంటాయి వాళ్ళంతా ఎవరనుకుంటున్నా ? క్లబ్బులోళ్ళు, ఆడపిల్లల్ని పెట్టి కంపెనీలు నడిపే వాళ్ళు, సారాయి కాసేవాళ్ళు, ఇంకా ముఖ్యంగా నేరస్థులు వీళ్ళందరి పరిచయాల్తో జీవితం ఎలా తయారవుతుందో వూహించు ఏ రకమైన అడ్డూ ఆపూ వుండదు అటు చట్టానికి భయపడే పనిలేదు, ఇటు తల్లిదండ్రుల కంట్లో పడవు కాస్తో కూస్తో సంపాదనా వుంటుంది ఇట్లాంటి వాటన్నిటిని తట్టుకొని నిలబడిన వాడు మొనగాడు అలా ఎవరన్నా వున్నా స్నేహితుల గొడవలు ఎక్కువ అది పెద్ద దెబ్బ వీటన్నిటి నుండీ దూరంగా వుండగలిగినప్పుడు, వాడేదైనా సాధించగలుగుతాడనుకో ఇక్కడ ఇంకో విషయం వుంది

కొంతమంది తమలోలేని మంచిగుణాన్ని ఇతర్లలోచూచి, తమ అల్పత్వాన్ని తామే సహించలేక ఆ మంచివాడ్ని ఏదో ఒక విధంగా దిగజార్చటానికి ప్రయత్నిస్తారు వీటన్నిటినీ తట్టుకుని నిలబడే మానసిక, శారీరక శక్తి కావాలి నా సర్వీసు మొత్తంలో ఇన్ని లక్షణాలు వున్నవాళ్ళు ఎంతమంది తగిలారంటే, వాళ్ళని వేళ్ళమీద లెఖ్ఖించవచ్చు అలాటివాళ్ళు సహజంగానే అన్యాయానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేస్తారు ఫలితం అధికారుల ఆగ్రహానికి గురికావటం దానిద్వారా ఎట్లాంటి విష పరిస్థితులు జీవితంలో ఎదురవుతాయో మీకు ప్రత్యక్షంగా తెలుసుకదా! '' అన్నాడు ప్రకాశం

కొద్దిసేపు ఎవరూ ఏమీ మాట్లాడలేదు

''ఇందులో ఎన్నో భయంకరమైన స్థితిగతులున్నా, ఆర్థిక పరమైన ఇబ్బందుల్ని తొల గించుకోటానికి మనం ఆ భయంకరమైన పరిస్థితులకు కూడా తలవొగ్గి వుండాల్సిందే చేతనైతే ఆ పరిస్థితుల్ని మార్చటం, లేకపోతే తల ఒగ్గటం అంతేకదా'' అన్నాడు సూర్యం

ఆశ్చర్యంగా చూశాడు ప్రకాశం

''అవున్నాన్నా ఇంతకాలం నువ్వు ఇందులోనే వుండిపోవటానికీ, నేనిప్పుడు ఇందులో చేరాలని నిర్ణయించుకోవటానికి మన ఆర్థిక పరిస్థితులే కదా కారణం'' అన్నాడు సూర్యం మళ్ళీ

ఆ రాత్రి వాళ్ళు చాలాసేపు ఆ విషయాన్ని గురించి మాట్లాడుకున్నారు మాటలమధ్యలో ప్రకాశం అన్నాడు ''అయ్యా, నాకేదో కాస్తో కూస్తో డబ్బొచ్చిద్ది దాంతో ఏదో చిన్న వ్యాపారం చేసుకుని బతకొచ్చు నువ్వు ఈ నౌకరీ చెయ్యలేవు ''

''నీకెంతొస్తుంది నాన్నా జీ పీ యఫ్ ఏమీ లేనట్లే ఉన్నదంతా అమ్మ జబ్బులకు, చిల్లర మల్లర అప్పులకు సరిపోయింది గ్రాడ్యుటీ వచ్చిద్ది ఎంత ? దాంతో ఏం ఉద్యోగం కొనుక్కోగలం? ఏం పొలం కొనగలం ? ఏం వ్యాపారం చేయగలం ? కనీసం గట్టి కొంపేసుకోవటానికి కూడా చాలవు అవి లక్ష్మి మేరేజికన్నా సరిపోతాయా పోని? అది చేతికొచ్చేసరికి ఎన్నినెలలు, ఏళ్ళు పట్టిద్దో?! ఇప్పుడు రిటైర్ అయిన వాళ్ళని చూస్తున్నాంగా ఇప్పుడు ఇన్నొందలు జీతం వస్తావుంటేనే, కనీస అవసరాలు తీరటం లేదు రేపటి నుండి పెన్షన్ శాంక్షను అయ్యిందాకా పైసారాదు ఎట్లా గడవాలి? ఏం తినాలి ? ఏ ఖర్చు మానుకోవాలి ? ఈ క్వార్టరు ఖాళీచేసి ఎక్కడుండాలి ? ఎంత అద్దె కట్టాలి? నువ్వింక ఇప్పుడు ఏం పని చేస్తావు ? '' అతని మాటలు పూర్తికాక ముందే

''అయితే నా పెళ్ళిప్పుడు ముఖ్యమా ? అయినా కట్నం తీసుకునేవాడిని నేను చేసుకుంటానా? '' అంది లక్ష్మి ఆ మాటలు ఆ సందర్భానికి తగ్గట్టులేవు

''అది సరేలే కట్నాల సంగతికాదు మన కుటుంబాలలాంటి కుటుంబాలు ఎన్ని ఈ దేశంలో? ఇంతకన్నా కష్టమైన, హీనమైన బ్రతుకులు ఎంతమందివి ఇలా కట్నాలకు పొయ్యాలన్నా ఏ మూలకి సరిపోతాయి ఆ డబ్బులు మన రాష్ట్రంలోలాగా అన్ని రాష్ట్రాల్లో ఎంత మందిని ఈ ఎమర్జెన్సీ ఉక్కుపాదం నాశనం చేసిందో నలిపేసి'' అన్నాడు సూర్యం ఆవేశంగా

ఆ రాత్రి చాలాసేపటికిగాని వాళ్ళు నిద్రపోలేదు ఎవరి ఆలోచనల్లో వాళ్ళు చాలాసేపు గడిపారు 'వీడు చెప్పినవన్నీ బాగానే వున్నయ్ వాస్తవాన్ని చక్కగా బేరీజు వేశాడు వాడన్నట్లు ఈ వ్యవస్థ మారందే అందరికీ బాధలుపోవు ఆర్థిక పరిస్థితులు మారాలి' అనుకున్నాడు ప్రకాశం

తమ కడుపున పుట్టిన బిడ్డ తమ కష్టసుఖాల్ని గురించి ఆలోచిస్తుంటే, ఆ తల్లికి ఆనందంతో దుఃఖం ముంచుకొచ్చింది 'ఇంతవరకూ ఒక్క చెడు అలవాటు కూడాలేదు కదా' అనుకుని

ఆనందించింది అయితే ఎంతసేపూ ఆ పుస్తకాలేవో చదువుతూ, ఆ కమ్యూనిస్టు మీటింగులికి పోవటమే ఆమెకు బాధగా వుంది కమ్యూనిస్టులు అప్పుడు చేసిన గొడవల్లో తనభర్త ఎన్ని కష్టాలు పడవలసి వచ్చిందో, తామెంత ఇబ్బందుల్ని అనుభవించారో గుర్తువచ్చి అలా అనుకునేది కాని అంతలోనే ఆమె ఆలోచనలు ఇంకోరకంగా మారిపోతుండేవి తన బిడ్డ ఎప్పుడూ మంచి వైపే మొగ్గు చూపిస్తాడని ఆ తల్లికి గాఢమైన నమ్మకం అయినా ఏమనీ లాభం లేదు ఒకవేళ తాము అభ్యంతరం పెడితే వాడు నిజాన్ని దాచేస్తాడు తమకు తెలియకుండా వెళతాడు వాడు మీటింగుకి వెళ్ళి వచ్చిన రోజున భోజనం చేసేటప్పుడు, తను మీటింగులో విన్న విషయాల్ని చెప్పేవాడు ఒక్కోసారి చెల్లెల్ని కూడా బలవంతం చేసి తీసుకెళ్ళేవాడు

అలా కొడుకు ఆలోచనల్లో ఆ తల్లి మునిగిపోయింది

అదే సమయంలోలక్ష్మి గూడా అన్నయ్య గురించి ఆలోచిస్తోంది అలా మీటింగుకి వెళ్ళే కొత్తలో అన్నయ్యకంతా గమ్మత్తుగా వున్నట్లనిపించేదట ఎక్కడే మీటింగు జరిగినా మిస్సవకుండా వెళ్ళే అలవాటయింది బాగా మొదట్లో మొదట్లో వాళ్ళు చెప్పే విషయాలు సరిగా అర్థమయ్యేవి కావట కాని వినాలనిపించేది ఆ పార్టీల కుర్రోళ్ళు పార్టీ బ్యాడ్జీలు జేబులకు తగిలించుకుని హడావిడిగా పనులు చేస్తూ తిరుగుతుండే వాళ్ళు వాళ్ళని జాగ్రత్తగా పరిశీలిస్తే వాళ్ళల్లో ఓ రకమైన ఉద్విగ్నత, తాము చేస్తున్న పనిలో ఆనందం, ఇతరుల్ని స్నేహంగా పలకరించేతత్వం, మిగిలిన వారికంటే తాము అధికులమనే అహంకార ధోరణి లేకపోవటం, ఇలాటివన్నీ అతన్ని బాగా ఆకర్షించాయి ఇవన్నీ ఇంటిదగ్గర చెప్పేవాడు 'మనుషులంతా అలా బ్రతకాలి అందుకే నాకు అలాటి మనుషులంటే ఇష్టం నేనూ అలాగే జీవితాన్ని గడుపుతాను' అనేవాడు తరచుగా మొదట్లో మిగిలిన పార్టీల మీటింగులకి కూడా వెళ్ళేవాడు వాళ్ళు చెప్పేది అన్నయ్యకి బాగానే అర్థమయ్యేది కానీ వాళ్ళు చెప్పేది ఎంతసేపూ తమ పార్టీకే ఓట్లివ్వమని, తమ పార్టీ గెలిస్తే ప్రజలకు అది చేస్తుంది, ఇది చేస్తుంది అని పారం అప్పజెప్పినట్లు చెప్పేవాళ్ళు ఆ పార్టీల కార్యకర్తలంతా ప్రజలమీదా, పనివాళ్ళమీద పెత్తనం చెయ్యటానికి వచ్చినట్లు ప్రవర్తించేవాళ్ళుట దీనికి పూర్తిగా వ్యతిరేకంగా వుండేవి కమ్యూనిస్టు పార్టీ మీటింగులు అనేవాడు మీటింగులు జరిగేచోట కమ్యూనిస్టు సిద్ధాంత గ్రంధాలు, పార్టీ సాహిత్యం అమ్మేవాళ్ళు మొదట్లో అవి చదువుతుంటే ఏమాత్రం బుర్రకి ఎక్కేదికాదు, విసుగుపుట్టేది పదిపేజీల్లో ఒకటీరెండు వాక్యాలు అర్థమయ్యేవి ఆ రెండు వాక్యాలే వాస్తవ జీవితంలోని అంశాలకు అద్దంపడుతూ కనపడేవి పట్టువిడవకుండా చదివేవాడు అసలే పుస్తకాల పురుగుగా పేరుబడ్డ అన్నయ్యకు ఈ పుస్తకాల్ని చదవటం మొదలుపెట్టాక, అంతకు ముందువరకూ కాలేజి లైబ్రరీలలో, జిల్లా గ్రంధాలయాలలో చదివిన పుస్తకాలు చాలావరకు కేవలం కాలక్షేపం పుస్తకాలుగా కనిపించాయట ఇప్పుడు చదువుతున్న ఈ పుస్తకాల్లో పేర్లూ, వూర్లూ అన్నీ కొత్తే విషయమైతే పూర్తిగా కొత్త ఇంతకుముందు ఎప్పుడూ కనీసం వినని మాటలు అవన్నీ రాత్రి భోజనాలప్పుడు అందరికీ చెప్పేవాడు వాటి అర్థాలు వివరించటానికి ప్రయత్నించేవాడు వినేవాళ్ళకి విసుగుపుట్టేది మొదట్లో తర్వాత్తర్వాత అలవాటయిపోయింది

'ఇంత కఠినమైన మాటల్తో వున్న, తేలిగ్గా అర్థంకాని విషయాల్ని, తేలికమాటల్తో జనమంతా మాట్లాడే భాషలో చెపితే అందరికీ అర్థమయ్యేద్ది' అనేవాడు తండ్రి సూర్యంకూడా అదే విషయం ఆలోచించేవాడు 'ఇంత కఠినంగా వున్న సబ్జక్ట్‌ని తేలికగా ఎవరన్నా రాస్తే బావుండు' అనుకునేవాడు ఆ మాటలు పదేపదే లక్ష్మితో అనేవాడు

అవన్నీ లక్ష్మి గుర్తుకు తెచ్చుకుంది

పక్కమంచం మీద తల్లికూడా ఆమె జ్ఞాపకాల్లో మునిగిపోయింది

చాలా విషయాలు గుర్తొచ్చి ఆమెకు చాలాసేపు నిద్ర పట్టలేదు 'ఈ బిడ్డల జీవితాలు ఎలా గడుస్తాయో' అనుకుంది ఆమె చాలాసార్లు అనుకున్నట్లు తరువాత మళ్ళీ, 'మా బతుకులకన్నా బాగానే వుంటయ్, మాలాగా సదువు సందెలు లేని మూరుకులు కాదు వాళ్ళ బతుకులు పచ్చగా వుండాలి' అనుకుంది చాలాసేపటికిగాని నిద్రలోకి జారిపోలేదు

సూర్యం ఆలోచనలు కూడా అతనికి నిద్రపట్టకుండా చేస్తున్నాయి 'తప్పదు ముందు తిండి గడవాలి తరువాతే అన్నీ కానిస్టేబులు ఉద్యోగంలో చేరటం తప్ప ఇంకో మార్గం లేదు తనిప్పుడు ఆ పని చెయ్యక పోతే ఆర్థిక ఇబ్బందులు ముందు అమ్మని చంపేస్తాయి దాని ప్రభావం నాన్న ఆయుష్షుమీద పడిద్ది లక్ష్మి బతుకు బండలయిపోయిద్ది మన యిష్టాయిష్టాలకిక్కడ తావులేదు పరిస్థితుల ఇష్టప్రకారం, అవి శాసించిన ప్రకారం ఇప్పుడు నిర్ణయం తీసుకోవాలి మూడోనాటికి అన్నీ అనుకూలిస్తే అప్పుడాలోచిద్దాం ప్రస్తుతానికి ఆశల్నీ, ఆశయాల్నీ తాత్కాలికంగా అవతల పెట్టడమే పోయిన ఆర్థిక భద్రత తిరిగి చేకూరాలి' అనుకున్నాడు

మర్రోజు ఆ కుటుంబంలో ఓ ఆనందపూరితమైన చలనం కనిపించింది సూర్యం నిన్నరాత్రి తీసుకున్న నిర్ణయం తాలూకు ప్రభావమది ఉదయమే లేస్తూ హుషారుగా కాలకృత్యాలు పూర్తి చేసుకున్నాడు ప్రకాశం అయిదారు రోజులపాటు మంచంలో వుండి లంకణాలు తీసుకున్న వ్యక్తికి కొంచెం హుషారు వస్తే వచ్చే చలనంలాంటిది అది జీవితంలో అన్నీ పోగొట్టుకున్నాననుకున్న వ్యక్తికి, హఠాత్తుగా ఐశ్వర్యం చేతికందితే కలిగే సంతోషంలాంటిదది శుభ్రంగా గడ్డం చేసుకుని, శ్రద్ధగా చాలాసేపు స్నానం చేసి, ఉతికిన బట్టలు తొడుక్కుని స్టేషనుకు వెళ్ళాడు ప్రకాశంలోని ఆ మార్పుకు భార్య ఆనందపడింది అంతకుముందు కలిగిన అంతలావు కష్టంకూడా ఈ ఆనందంలో చిన్నదిగా తోచింది ఎక్కడికి వెళ్ళాలో తోచక స్టేషనుకు వెళ్ళాడు ప్రకాశం సూర్యం మామూలుగానే సద్దన్నం తిని, లక్ష్మితోపాటు కొంచెం కాఫీ తాగి స్నేహితుల దగ్గర కెళ్ళాడు లక్ష్మి స్నానంచేసి, మిగిలిన కాఫీ వెచ్చబెట్టుకొని తల్లికి కొంచెం వుంచి, తనింకోసారి తాగి, చదివేసిన పుస్తకాలు ఇచ్చి కొత్తవి తెచ్చుకోవటానికి లైబ్రరీ కెళ్ళింది ఇంట్లో తల్లి ఒక్కతే మిగిలింది అందరూ బయటకు వెళ్ళిన తరువాత మిగిలిన కొంచెం కాఫీ తాగి తలుపు గడియవేసి పక్కింటికెళ్ళింది ఆమె తన కొడుకు తీసుకున్న నిర్ణయాన్ని, పక్కింటి ఆమెతో చెప్పిందాకా ఆమె తపన ఆగలేదు

''పోనీలే వదినా, ఈ కష్టసమయంలో అబ్బాయి మనసు మార్చుకొని, ఈ నౌకరీకి పోతానంటే అంతకంటే కావాల్సిందేంది'' అంది పక్కింటావిడ సంతోషంగా, సానుభూతిగా

''మాకన్నా వాడెక్కువ బాధపడుతున్నాడు వదినా'' అంది తల్లి కొడుకుమీద వాత్సల్యం పొంగిపొరలుతుంటే

కొద్దిసేపటికి ఇరుగుపొరుగు ఆడవాళ్ళు అక్కడకు చేరుకున్నారు ఆ నాలుగురోజులూ వాళ్ళ ముఖాలు చూడలేకపోయిన ఆమె, ఈరోజు వాళ్ళతో కులాసాగా కబుర్లాడింది మాటల సందర్భంలో ఒకామె, ''నీ కొడుక్కేమ్మా, బుద్ధిమంతుడు ఈ రోజుల్లో పుట్టాల్సినోడు కాదు మాకూ వున్నారు నలుగురేసి చొప్పున ఎందుకు ? ఒక్కడున్నా చాలు అట్టాంటి పిల్లోడు'' అంది

ఆ మాటలు మాణిక్యమ్మని సంతోషంతో కుదిపివేశాయి ఆనందంతో ఎంతోసేపు మాట్లాడింది ఆమె వాళ్ళతో బాగా పొద్దెక్కింది అప్పటికే ''వత్తా వదినా ఇంతవరకు పొయ్యి

ఎలిగించలేదు'' అంటూ లేచింది

ఇంతలో బయటనుండి లక్ష్మికేక వినిపించింది ''అదిగోనమ్మా సిసింద్రీ ఫో ఫో'' అన్నారు వాళ్ళంతా నవ్వుతూ ఆమెకూడా నవ్వుకుంటూ ఇవతల కొచ్చింది

భర్తకీ, కొడుక్కీ ఇష్టమైన కూరలు వండింది ఆ పూట

మధ్యాహ్నం భోజనానికి కూర్చున్నప్పుడు ప్రకాశం కొడుకుతో, ''అన్నీ కనుక్కున్నాను వచ్చే నెల ఏడో తారీకు ఉదయం పదిగంటలకల్లా జిల్లా పోలీసు ఆఫీసు దగ్గర హాజరు కావాలంట, వాళ్ళవాళ్ళ పిల్లల్ని తీసుకుని సర్టిఫికెట్‌లతో సహా ఉండాలంట ఒక పిటీషను రాసుకుని, ఈ యస్పెగారితో, సి ఐ గారితో సబ్‌మిట్‌చేయించుకుని, వీలయితే డి యస్పీతో కూడా, తీసుకుపోతే ఇంకా మంచిదంట అంతా చెప్పారు స్టేషన్లో'' అన్నాడు

''డి యస్పా? వాడేగా ఈ సబ్‌డివిజన్‌లో వాళ్ళందరికీ ఈ గతి పట్టించింది వాడి దృష్టిలో కాస్త తలబిరుసు అన్నవాళ్ళందరినీ అసమర్థుల కింద జమకట్టి తీసేయించాడు వాడికి మీ నెంబర్లిచ్చింది మీ యస్పై, సి ఐ లేగా ముప్పైమూడు సంవత్సరాలు నిప్పులా ఉద్యోగం చేసిన మీరు అసమర్థులు నిన్నకాక మొన్న డిపార్టుమెంటులోకి వచ్చినవాళ్ళు సమర్థులూ, నీతిపరులు'' అన్నాడు ఆవేశంగా సూర్యం కాని అంతలోనే తమాయించుకొన్నాడు ఎవరూ ఏమీ మాట్లాడలేదు కాసేపు

''నాన్నా, నీలాగా ఎన్నోవేలమంది ఇలా నష్టపోయారు కదా, వాళ్ళంతా కలిసి ఏదన్నా చెయ్యకూడదా?'' అంది లక్ష్మి

''ఏదన్నా అంటే ఏం చెయ్యమని?!'' అడిగింది తల్లి

''ఏదన్నా అంటే, అదే, మీకు జరిగిన అన్యాయానికి ఏ వూరేగింపో, మీటింగో, నిరాహారదీక్షో, ఇంకా ఇలాటివి ''

''అలాటివి చేస్తే లోపల వేస్తారు పిట్టల్లా కాల్చినా అడిగే హక్కు లేదు ఈ యమర్జెన్సీలో నక్సలైట్లని కాలవటల్లా ఒకపక్కన '' అన్నాడు సూర్యం

''అవునా?!'' అంది లక్ష్మి ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవిచేస్తూ

''అవును మన జిల్లాకి పెద్దగా ఆ తాకిడిలేదుగాని, మిగిలినచోట్ల నక్సలైట్లని ఎమర్జెన్సీ రాకముందే వందల సంఖ్యలో కాల్చి చంపటం, 'ఎన్‌కౌంటర్లు' అని పేపర్లో వేయించటం జరుగుతోంది ఇక ఇప్పుడు ఈ ఎమర్జెన్సీలో అడ్డూ ఆపూ లేదు'' అన్నాడు సూర్యం

''ఏదీ, అప్పుడు నువ్వు కొత్తగా ఉద్యోగంలో చేరినప్పుడు కమ్యూనిస్టు మూమెంటని చెప్పావే, అప్పుడు వాళ్ళని చంపినట్లేనా ఇప్పుడుకూడా వీళ్ళని కూడా '' అడిగింది భార్య

''అవునవును అదింకా నయంకదూ'' అన్నాడు ప్రకాశం

అదే విషయాన్ని గూర్చి వాళ్ళు చాలాసేపు మాట్లాడుకున్నారు

''మరి నీకు రిటైర్‌మెంటు ఆర్డరు సర్వ్ చేసిన ఇనస్పెక్టరుకు కూడా మరుసటిరోజు అదేరకంగా కంపల్‌సరీ రిటైర్‌మెంటు ఆర్డరు సర్వ్ చేశారన్నావుగా మరిప్పుడు అన్నయ్య రాసుకునే పిటీషనుమీద ఎవరు సబ్‌మిట్ చేస్తారు ?'' అంది లక్ష్మి

''ఎవరో ఒకళ్ళు ఇన్‌చార్జిగా వుంటారు కదమ్మా'' అన్నాడు ప్రకాశం

రకరకాల విషయాలు చోటు చేసుకున్నాయి వాళ్ళ సంభాషణల్లో సూర్యం అన్ని విషయాలూ ఆలోచిస్తూ మాట్లాడాడు తను ఈ పోలీసు నౌకరీలో చేరాల్సిందే, 'తప్పదు'

అన్నాడు ఆ దృఢమైన మాట విన్నాక తల్లి మనస్సు కుదుటపడింది 'ఇంక మనస్సు మార్చుకోడులే' అని సంతోషంగా నిట్టూర్చింది ఏడో తారీకు కోసం ఎదురు చూచింది ఆరో తారీకు రాత్రి ఆమెకు నిద్రకూడా సరిగా పట్టలేదు

హేమకు వివరాలతో ఉత్తరం రాశాడు సూర్యం మరుసటిరోజు

ఏడో తారీకున జిల్లా పోలీసు ఆఫీసు దగ్గరకు వెళ్ళారు తండ్రీ కొడుకులు వా ళ్ళ ఇంటిదగ్గర నుండి బయలుదేరేటప్పుడు తల్లి కొడుకుతో ''అయ్యా! దేవుడికి దండం పెట్టుకో'' అంది

ఆ మాటకు సూర్యం నవ్వాడు చిన్నగా ''నా సంగతి తెలిసికూడా ప్రార్థన చేసుకోమంటావేమిటమ్మా'' అన్నాడు

''అదొక్కటీ మార్చుకోయ్యా, దేవుడు లేడంటావేరా ?'' అంది ఎప్పటిలాగానే తల్లి

''లేడు కాబట్టి లేడంటున్నాడు'' అంది లక్ష్మి నవ్వుతూ

''సరేలే జాగ్రత్తగా పోయిరండి'' అంది తల్లి

''అమ్మా, నువ్వు ఎదుర్రా నాన్నా'' అన్నాడు ప్రకాశం కూతురితో ప్రేమగా

లక్ష్మి సిగ్గుపడుతూ ఎదురొచ్చింది సూర్యం నవ్వాడు

వాళ్ళు జిల్లా ఆఫీసు దగ్గరకు వెళ్ళేసరికి, ప్రకాశంలాగే కంపల్‌సరీ రిటైర్డ్ కానిస్టేబుళ్ళు వాళ్ళవాళ్ళ కుర్రోళ్ళని వెంట పెట్టుకొని వచ్చారు వాళ్ళంతా రిజర్వ్ ఇనస్పెక్టరు ఆఫీసుకు ఎదురుగావున్న పున్నాగపూల చెట్టుకింద కూర్చునీ, నిలబడీ వున్నారు పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ ప్రకాశం రాక చూచి చాలామంది అతన్ని ఆప్యాయంగా పలకరించారు వీళ్ళుకూడా వెళ్ళి అక్కడున్న ఎండుగడ్డి నేలమీద కూర్చున్నారు కొంత మంది యస్పీ ఆఫీసు దగ్గర వేపచెట్ల కింద తచ్చాడుతున్నారు ''ఊఁ ఏమిటి విశేషాలు'' అన్నాడు ఒకతను పక్కనున్నతనితో

''ఏముంది ప్రస్తుతానికిదే మనమంతా వర్గి చవటలమట వున్న వాళ్ళేమో నిజాయితీ పరులట'' అన్నాడు ఇతను

''అంటే యమర్జన్సీలో చట్టం తలకిందులుగా అమలుజరుపబడుతోందని అర్థం అవుతోందికదా మనందరికీ'' అన్నాడు మొదటతను

వాళ్ళ సంభాషణ చురుకుగా సాగింది సూర్యం వాళ్ళ మాటలు వింటూ, వాళ్ళని గమనిస్తూ కూర్చున్నాడు

''ఇప్పటికి షుమారు ముప్ఫై సంవత్సరాలకు పూర్వం మనమంతా ఇదే చెట్టుకింద కలిశాం మళ్ళీ ఇప్పుడు కలిశాం, ఈ మధ్యకాలంలో ఎప్పుడన్నా బందోబస్తులో మినహాయించి '' అన్నాడు ఒకతను గతంలోకి పోతూ

''అవును అప్పుడు మనం ఇక్కడే సెల్యూట్‌చెయ్యటంనేర్చుకున్నాం అప్పుడీచెట్టు చిన్నది ఇప్పుడు మహా వృక్షమయ్యింది'' అన్నాడు ప్రకాశం

''మన బానిసతనం మనతో అంతరించలేదు ఇప్పుడు మన పిల్లల్తో బానిసత్వం చేయించబోతున్నాం కట్టుబానిసత్వం చట్టప్రకారం సాగుతోంది'' అన్నాడు ఒకతను బాధగా ఆవేశంగా అంతా విని వూరుకున్నారు

వాళ్ళు కూ ర్చున్నచోటుకి బాగా దూరంగా పోలీసు బాయిస్ హాస్టలు కనపడుతోంది హాస్టలు ముందు గ్రౌండులో పది సంవత్సరాల వయస్సు నుండి పదిహేను సంవత్సరాల వయస్సువరకు వున్న మగ పిల్లలు ఎక్సర్‌సైజులు చేస్తున్నారు

''వాళ్ళంతా ఎవరు ?'' అడిగాడు ఒక కుర్రోడు వాళ్ళ నాన్నని అందరూ అటు చూశారు

''సర్వీసులో వుండి చనిపోయిన పీసీల, హెచ్‌సీల పిల్లలు అది హాస్టలు వాళ్ళకు ఈడొచ్చినాక డిపార్టుమెంటులో చేర్చుకుంటారు బయట నుండి తీసుకోవటంకన్నా అలా పోలీసు పిల్లల్నే డిపార్టుమెంటులోకి తీసుకోవటం వలన ఇంకా బాగా అణుకువగా వుంటారు అధికార్లకు'' అన్నాడు ఒకతను

''సరే అదలా వుంచండి మనల్ని గురించి ఇక్కడ ఇప్పుడు పట్టించుకునే నాధుడెవరూ కనపడటం లేదే'' అన్నాడుప్రకాశం

''దొరగారూ అదే యస్పీ దొరగారు, పాపం దొరసానిని వదిలిపెట్టి రావద్దూ'' అన్నాడు ప్రతిమాటా వత్తి పలుకుతూ ఒకతను వెటకారంగా

''యస్పీ వచ్చాక, ఆరైపోయి కనపడి విషయం చెబితే అప్పుడాయన ఏం చెపితే అది జరిగిద్ది అప్పటిలోగా తలా ఒక పావలా శనక్కాయలు వేయించుకుని తింటూ కూర్చుందాం'' అన్నాడు ఇంకొకతను

ఆ మాటకు అంతా నవ్వారు

''ఇప్పుడిలా రిటైరయిన వాళ్ళంతా వచ్చినట్టేనా'' అన్నాడు ప్రకాశం

''అందరెందుకొస్తారు ? మగపిల్లలుండాలి వాళ్ళు చదువుకుని, ఒడ్డు పొడుగూ వుండాలి అలాటి వాళ్ళకే ఛాన్సు ఆడపిల్లలున్న వాళ్ళకూ, మగపిల్లలు చిన్నపిల్లలు వున్నవాళ్ళకు అగచాట్లే'' అన్నాడు ఒకతను

''ఇంక వాళ్ళకెట్లా జరిగిద్దో పాపం '' అన్నాడు ఒకతను బాధగా

''ఎట్లాగేముంది రిటైరయ్యినోళ్ళల్లో ఎవరన్నా కాస్తో కూస్తో పొలంపుట్రా సంపాదించుకొన్న వాడైతే తప్ప, లేకుంటే ఏ ప్రయివేటు కంపెనీలోనో నైట్ వాచ్‌మెన్‌గా కాలం గడపటమే బతికినంత కాలం కుక్కల్లా కాపలా కాయటమేగా ఎక్కడో ఒకచోట అంతకు మించి ఇంకోపని మాత్రం ఏంచెయ్యగలం ఇప్పుడిక్కడున్న వాళ్ళల్లో ఒకళ్ళిద్దరికి మినహాయించి తతిమ్మావాళ్ళకు సెంటు భూమి లేదు నెత్తిమీద నీడలేదు మహాతల్లికి ఇంతమంది వుసురు ఎన్నడు తగిలిద్దో'' అన్నాడు ఒకతను కోపంగా

''ఆఁ ఆమేం చేసింది మద్దెనున్నోళ్ళు సేత్తుంటే'' అన్నాడు ఒకతను

''పోనీయండి ఇప్పుడదంతా ఎందుకులేగాని '' అంటూ సర్దాడు ఇంకొకతను

టైం పన్నెండు దాటిపోయింది భోజనానికిపోతే యస్పీ వస్తాడేమోననే ఉద్దేశ్యంతో అంతా కాసుకుని కూర్చున్నారు అమ్మటాని కొచ్చిన మిరపకాయ బజ్జీలూ, అలసంద గుగ్గిళ్ళూ, సెనక్కాయలు తింటూ నీళ్ళు తాగి అలాగే వుండిపోయారు రెండు గంటలప్పుడు యస్పీ వచ్చాడు వీళ్ళంతా ఆఫీసు ముందున్న చెట్టుకింద గుమికూడారు

ఆరై ఆఫీసులోని గుమస్తావచ్చి కుర్రోళ్ళందరినీ పిలిచి, పిటీషన్‌లు తీసుకున్నాడు తరువాత అందరినీ కొలతలు కొలిచారు వట్టి డ్రాయర్లమీద నిలబెట్టి ఎత్తుచాలని వాళ్ళని వెళ్ళిపొమ్మన్నారు ఛాతిచాలని వాళ్ళని, బాగా ఎక్సర్‌సైజుచేసి ఒకనెల తరువాత రమ్మని పంపారు వాళ్ళంతా వెళ్ళి యస్పీకి కనపడ్డారు మొరపెట్టుకున్నారు కాని లాభం లేకపోయింది సెలక్టయిన వాళ్ళతో, 'మెడికల్ టెస్టుకు రమ్మనమని కాగితాలు పంపిస్తాము' అనిచెప్పి పంపారు సూర్యం సెలక్టయ్యాడు ప్రకాశానికి ఆనందంగా వుంది భోజనం టైము దాటిపోవటంవల్ల హోటల్‌కు

వెళ్ళి టిఫిన్ చేసి, బస్సు దొరికి ఇంటికి చేరేసరికి రాత్రి పదయ్యింది తల్లీ, చెల్లీ, ఎదురుచూస్తూ కూర్చున్నారు గడపలోనే స్నానాలు పూర్తిచేసి భోజనాలకు కూర్చునే సరికి పదకొండయ్యింది జరిగిన విషయాలు పూసగుచ్చినట్లు చెప్పాడు ప్రకాశం ఆ రాత్రి బాగా పొద్దుపోయిందాకా కబుర్లు చెప్పుకున్నారు ఆనందంగా ఎప్పటికోగాని నిద్రరాలేదు అందరికీ

వారం తిరక్కుండానే మెడికల్ టెస్ట్‌కు రమ్మని కాగితం వచ్చింది ప్రకాశం, సూర్యం వెళ్ళారు గవర్నమెంటు ఆసుపత్రికి అందరినీ తీసుకెళ్ళాడు ఆరై మనిషికి ఇరవై రూపాయల చొప్పున వసూలు చేశారు ఎందుకని అడిగితే, 'ఆసుపత్రిలోని స్టాఫుకు ఇవ్వాలని' చెప్పారు సాయంత్రానికి టెస్ట్ అయిపోయింది అందరినీ ఇళ్ళకు వెళ్ళిపొమ్మని చెప్పారు అప్పాయింట్ చేసుకున్నట్టు త్వరలోనే కాగితాలు వస్తాయనీ, ట్రైనింగుకి పోవటానికి సిద్ధంగా వుండాలని చెప్పారు ఆ రాత్రి ఇంటికి చేరేసరికి రాత్రి పదకొండయ్యింది హేమనుండి లెటరు వచ్చింది

తరువాత ఒక పది రోజులకు, 'కానిస్టేబులుగా నియమిస్తున్నట్టూ, ఆరునెలల ట్రైనింగుకి వెళ్ళటానికి రమ్మ'నమని ఆర్డరు కాగితం వచ్చింది సూర్యంకు ఆర్డరు కాగితం వచ్చినరోజు అందరికీ ఎంతో ఆనందం కలిగింది సూర్యం మాత్రం మామూలుగానే వున్నాడు

జిల్లా పోలీసు ఆఫీసుకు వెళ్ళబోయే ముందురోజు సూర్యం ఫ్రెండ్సందరికీ చెప్పాడు ఇరుగు పొరుగు వారికి చెప్పాడు కావలసిన యన్నీ పెట్టెలో సర్దుకున్నాడు తనకిష్టమైన పుస్తకాలు పెట్టెలో పెట్టుకున్నాడు ఖర్చులకి కొంత డబ్బిచ్చాడు ప్రకాశం చక్కారాలు వండి సంచిలో పెట్టింది తల్లి భోజనం చేయటానికి పళ్ళెం, గ్లాసూ, స్నానానికొక చెంబు పెట్టుకున్నాడు అవన్నీ చూస్తుంటే ప్రకాశంకు తన ట్రైనింగ్ పీరిడ్ గుర్తొచ్చి నవ్వుకున్నాడు భోజనంలో వేసుకోవటానికి ఒక హార్లిక్స్ సీసానిండా నెయ్యి, ఒక సీసాలో నిమ్మకాయ పచ్చడి నింపింది తల్లి పక్కబట్టలు, వేసుకునే బట్టలు, తలనూనె, బ్రష్, పేస్టూ అన్నీ సంచిలో పెట్టింది లక్ష్మి స్నానాలకు ఓ సబ్బు, బట్టలు వుతుక్కోవటానికి ఓ సబ్బు పెట్టెలో ఖాళీలేక బుట్టలో పెట్టింది తల్లి

''అన్నీ పెట్టారు కానీ లైటేది?'' అన్నాడు ప్రకాశం

''అదక్కడ కొనుక్కుంటాలే నాన్నా ఇక్కడ నుండి తీసుకెళ్ళే సరికి చిమ్నీ పగిలిపోవటమో, లైటు పాడయ్యి పోవటమో జరిగిద్ది ఇంకా అక్కడ బట్టలు, బూట్లు ఇస్తారాయె వీటికే పెట్టెచాలలేదు'' అన్నాడు సూర్యం హేమ రాసిన ఉత్తరాలన్నీ పెట్టెలో పెట్టుకున్నాడు

''ఇస్తే ఏం వాటితోపాటు కిట్టుబాక్సూ ఇస్తారుగా ఓ నాలుగు మేకులు పొట్లంకట్టి తీసుకెళ్ళు బట్టలు తగిలించుకోవటానికి గోడకు కొట్టుకోటానికి'' అన్నాడు ప్రకాశం

మర్రోజు తినటంకోసం పులిహోర చేసి బుట్టలో పెట్టింది తల్లి ఆ రాత్రి కోడిని కోసి పలావు వండుకున్నారు

చీకటితో లేచి ఫస్ట్‌బస్‌కు బయలుదేరారు తండ్రీ కొడుకులు తల్లీ, చెల్లి బస్టాండు కొచ్చారు ఫ్రెండ్స్ కొంతమంది వచ్చారు అందరి దగ్గరా వీడ్కోలు తీసుకున్నాడు బస్సు బయలుదేరుతుంటే తల్లి కళ్ళల్లో నీళ్ళు వూరాయి ప్రేమగా కొడుకి చేతిని రెండు చేతుల్లోకి తీసుకుంది ''జాగ్రత్త నాన్నా'' అంది ఆమె కంటిలోని కన్నీటిబొట్లు సూర్యం చేతిమీద పడ్డాయి వెచ్చగా

''ఏం ఫరవాలేదులేమ్మా! నువ్వేం దిగులు పడమాక'' అన్నాడు

''వెళ్ళిన వెంటనే ఉత్తరం వెయ్యన్నాయ్'' అంది లక్ష్మి

''తప్పకుండా'' అన్నాడు సూర్యం

బస్సు బయలుదేరింది బస్సు కనుమరుగయ్యిందాకా వుండి వెనక్కి తిరిగారు
కొడుకు పక్కనే కూర్చున్నాడు తండ్రి సూర్యంకు మనస్సంతా బాధ ఆక్రమించింది కొడుకు యొక్క మనస్థితిని అంచనా వేయటానికి ప్రయత్నిస్తూ మౌనంగా వున్నాడు ప్రకాశం ఒక అరగంట మౌనం తరువాత చిన్నగా అన్నాడు ''సూరీ, నీకు కిట్టుబాక్సు ఇచ్చిన మరుక్షణం నుండీ పరిస్థితులు ఒక్కసారిగా మారిపోతాయి అవి నువ్వు వూహించలేని విధంగా వుంటయ్ ఓ రకంగా చెప్పాలంటే నీ స్వేచ్ఛా స్వాతంత్రాలకు ఆనకట్ట పడిపోతుంది నీ ట్రైనింగులోనే ఎన్నో సంఘటనలు నీకు ఇష్టం లేనివి ఎదురవుతాయి అవన్నీ నీకు కష్టం కలిగిస్తాయి చాలావరకు నీకిష్టమైన, సంతోషం కలిగించే సంఘటనలు చాలా అరుదు నీవు చేసే ప్రతిపనీ, తీసుకునే ప్రతి నిర్ణయం కూడా నీపై, నీమీద ఆధారపడ్డ మాపై దాని ప్రభావం పడుతుంది ఈ డిపార్టుమెంటులో ఇంతకాలం నేనున్నా, నాలాటివాళ్ళు ఎంతమందిమి ప్రయత్నం చేసినా ఇదిలాగెందుకుందో అర్థం చేసుకోలేకపోయాం నువ్వు ప్రయత్నించు, నీ ఉనికికి దెబ్బ తగలనంతవరకు ఈ వ్యవస్థను మార్చాలి తప్పదు ఒకచోట పని చేసేవాళ్ళు ఎందుకు ఒకళ్ళమీద ఒకళ్ళు చాడీలు చెప్పుకుంటూ, ఒకళ్ళనొకళ్ళు దొంగదెబ్బ తియ్యాలనుకుంటూ వుంటారో, ఆఫీసర్లెందుకు తమకన్నా తక్కువవాళ్ళని హీనంగా చూస్తారో కనుక్కోలేకపోయాను వ్యక్తిగతంగా ఎదురుతిరగటం ద్వారా ఓ అయిదు శాతం మార్చినా, నేను పూర్తిగా నష్టపోయాను నువ్వు చదువుకున్నవాడివి పైగా మార్క్సిజాన్ని చదువుకుంటున్న వాడివి జీవితాన్ని ఎలా మలుచుకుంటావో ఇంతకన్నా చెప్పేదేమీ లేదు మన క్షేమాన్ని కాంక్షించేవాళ్ళెవరూ ఈ సొసైటీలో నాకు తారసపడలేదు ఇప్పటివరకూ నువ్వు తండ్రి చాటు బిడ్డవే ఈ లోకంలో ఎలా నెగ్గుకొస్తావో నీకు నువ్వే నిర్ణయించుకోవాలి '' అని ఆపాడు
సూర్యం విని మౌనంగా వూరుకున్నాడు
పదిగంటలకల్లా తండ్రీ కొడుకులు జిల్లా పోలీసు ఆఫీసుకు చేరుకున్నారు ఆ మధ్యాహ్నమే సూర్యానికి యూనిఫారం, బెల్టు, నెంబరు, బూట్లు, లారీ, ఆ కిట్ అంతా ఉంచుకోవటానికి ఓ కిట్టు బాక్సు, దానితోపాటు ఒక కంబళీ, సాక్సులు, కాళ్ళకు చుట్టుకునే పట్టీలు, రెండు నల్లరంగు పాలీష్ డబ్బాలు, ఒక ఎర్రరంగుది, రెండు బ్రష్‌లు, జనపనారతో నేసినట్లున్న ఒక చలి బన్నీను, రెండు పీ టీ బన్నీన్లు , ఒక పోలీసు గైడు పుస్తకం ఇచ్చారు వాళ్ళిక అప్పటినుండే పీసీలుగా మారిపోయారు అక్కడున్న అధికార్లు ఇస్తున్న ఇన్‌స్ట్రక్షన్స్‌ని వింటున్నారు
తమ స్వంత ఆలోచనలు ఆగిపోవటం ప్రారంభమయ్యింది ఆ క్షణం నుంచే
వాళ్ళతోపాటు వచ్చిన పెద్దవాళ్ళు పిల్లలకు ఏవేవో జాగ్రత్తలు చెపుతున్నారు ప్రకాశం కూడా సూర్యానికి ఏవేవో చెపుతున్నాడు అన్నిటినీ అతను పరధ్యానంగా వింటూ వూ కొడుతున్నాడు
'పరిస్థితులు ప్రత్యక్షంగా తన జీవితాన్ని ఆదేశించటం ఆరంభమయ్యింది' అనుకొన్నాడు సూర్యం
ముందుగా చెప్పిన ప్రకారం అంతా తమతమ పెట్టెల్ని రిక్షాలమీద వేసుకుని రైలుస్టేషనుకు ఆ సాయంత్రం అయిదింటికల్లా చేరారు ''అనంతపురం వెళ్ళే బండి ఎనిమిదింటి కొచ్చిద్దంట'' అన్నాడు ఒకతను
అక్కడే పెట్టెల మీద కూర్చుని, పంపుదగ్గర నుండి నీళ్ళు తెచ్చుకుని, భోజనాలు చేశారు కొంతమంది భోజనాలు తెచ్చుకోనివాళ్ళు గబగబా హోటల్‌కెళ్ళి భోంచేసి వచ్చారు స్టేషన్లో లైట్లు వెలిగాయి

రెండు గంటలు ఆలశ్యంగా, పొగలు కక్కుతూ, రణగొణ ధ్వని చేస్తూ ప్లాట్‌ఫాం మీదికొచ్చి ఆగింది అనంతపురం వెళ్ళేరైలు గబగబా పెట్టేబేడా పెట్టెలో సర్దేశారు అంతా ఎక్కేశారు కంగారుగా, భయంగా కింద ప్లాట్‌ఫాం మీద నిలబడి కిటికీల్లోంచి తమతమ పిల్లలకు జాగ్రత్తలు చెపుతున్నారు పెద్దవాళ్ళు బండి కెదురుగా ఎర్రదీపం హెచ్చరికగా వెలుగుతూ ప్రమాదాన్ని గుర్తు చేస్తోంది

''నీ ఆరోగ్యం చాలా ముఖ్యం కుర్రవాళ్ళతో కలిసి అటూ ఇటూ పోగాక'' అన్నాడు ప్రకాశం కొడుకు చేతిని పట్టుకొని, నర్మగర్భితంగా

'అలాగే' అన్నట్టు తలూపాడు సూర్యం అర్థమైనట్టు

''వెళ్ళగానే ఉత్తరం రాయి''

తలూపాడు సూర్యం చిక్కటి చీకటిలో ఎర్రదీపం స్థానంలో పచ్చదీపం ప్రత్యక్షమయ్యింది

''అమ్మ ఆరోగ్యం, నీ ఆరోగ్యం జాగ్రత్త ఆ పెన్షన్ కాగితాలు త్వరగా ఆఫీసు కెళ్ళేటట్టు చూడు'' అన్నాడు సూర్యం గార్డు వేసిన విజిల్ పీలగా వినిపించింది

అలాగే అన్నట్టు చిన్నగా తలూపాడు తండ్రి

రైలు కూతవేసింది కర్ణకఠోరంగా కోపంగా, భారంగా కదిలింది

ప్లాట్‌ఫాం వెనక్కు జరిగిపోతోంది దాంతోపాటు దానిమీదివాళ్ళు కూడా వెనక్కి, వెనక్కి జరుగుతున్నారు

ప్రకాశం రెండడుగులు బండితోపాటు వేశాడు

''జాగ్రత్త బాబూ '' అన్నాడు '' ఉంటా మరి'' అన్నాడు

''నువ్వింక ఉండు నాన్నా వెంటనే ఇంటికెళ్ళు లాస్ట్ బస్‌కి అమ్మ ఎదురు చూస్తుంటుంది నాకేం ఫరవాలేదు మీరేం దిగులు పెట్టుకోవద్దు ఇంక వుండుమరి'' అన్నాడు సూర్యం

అతని మాటలు రణగొణ ధ్వనిలో సరిగా వినపడలేదు ప్రకాశంకు

ప్రకాశం నిలబడిపోయాడు

సూర్యం కిటికీలోంచి చెయ్యి వూపుతున్నాడు

ప్రకాశం కూడా చెయ్యి వూపుతూ చాలాసేపు ఉండిపోయాడు అలాగే బండి కలిసిపోయింది చిక్కటి చీకట్లో నీటిపొర అడ్డువచ్చిన కంటికి తిరిగి ఎర్రదీపం వికృతంగా, భయం కలిగేలా కనిపించింది

బరువెక్కిన హృదయంతో, నీళ్ళు నిండిన కళ్ళతో, వెనక్కు తిరిగి భారంగా అడుగులేస్తూ స్టేషను బయటకొచ్చాడు ప్రకాశం



**మొదటి భాగం అయిపోయింది**



## వివరణలు

1 పీసీ - పోలీసు కానిస్టేబులు
2 హెచ్‌సీ - హెడ్ కానిస్టేబులు
3 సిఐ - సర్కిల్ ఇనస్పెక్టరు ఇనస్పెక్టర్ అన్నా సర్కిల్ ఇనస్పెక్టరు అన్నా ఒక్కరే కొన్ని పోలీసు స్టేషన్లను కలిపి ఒక సర్కిల్ అంటారు ఆ సర్కిల్‌కు ఇనస్పెక్టరు అధికారి గా వుంటాడు సబ్ ఇనస్పెక్టర్ నుండి ప్రొమోషన్ ఇనస్పెక్టరు సర్కిల్‌కి ఇనస్పెక్టర్‌గాబట్టి సర్కిలినస్పెక్టర్ అంటారు
4 పాస్‌పోర్టు - పోలీసు డిపార్టుమెంటులోని క్రిందిస్థాయి ఉద్యోగులయిన కానిస్టేబుల్, హెడ్ కానిస్టేబుళ్ళను డ్యూటీల మీద బయటకు పంపేటప్పుడు, వారు చేయవలసిన డ్యూటీ ఏమిటో వివరంగా ఒక కాగితం మీద రాసి ఆ స్టేషను అధికారిగానీ ఇన్‌చార్జిగానీ సంతకం చేసి ఇచ్చే అధికార పత్రం
5 యస్సై - సబ్ ఇనస్పెక్టరు

6 సార్జెన్ - హెడ్ కానిస్టేబులన్నా, సార్జెన్ అన్నా ఒక్కటే ఆంధ్రా, రాయలసీమ ప్రాంతాల్లో ఈ రెండు మాటలూ వాడుకలో వున్నాయి తెలంగాణా, హైదరాబాద్ సిటీలో కొన్ని చోట్ల 'జమేదార్' అనే పదం ఇంకా వాడుకలో వుంది కానిస్టేబులు నుండి ప్రొమోషన్ హెడ్ కానిస్టేబుల్

7 బట్ సెల్యూట్ - కానిస్టేబుల్, హెడ్ కానిస్టేబుల్ దగ్గర తుపాకీ వున్నప్పుడు, చేతితో సెల్యూట్ చేయ కూడదు తుపాకిని ఎడం భుజం మీ పెట్టుకొని, ఎడం చేత్తో తుపాకీ మడిమ అంచుని పట్టుకొని, కుడి అరచేతితో తుపాకీ మడం మీద ఛట్‌మని శబ్దం వచ్చేలాగా కొట్టాలి దానిని బట్ సెల్యూట్ అంటారు బట్ అంటే తుపాకీ మడిమ

8 రైటరు - స్టేషన్లోని రికార్డు వర్క్ చూడటానికి, నియమింపబడే కానిస్టేబుల్ లేక హెడ్ కానిస్టేబుల్ సబ్ స్టేషన్లలో కానిస్టేబుల్, టౌన్ స్టేషన్లలో హెడ్ కానిస్టేబుల్ రైటరుగా వుంటాడు సాధారణంగా

9 మల్ల - కడు బీదవాళ్ళు, అన్నం తినటానికి ఉపయోగించే మట్టితో చేసిన మూకుడు లాంటి పాత్ర

10 కిట్ బాక్స్ - కానిస్టేబులుగా చేరిన వ్యక్తికి, అతనికి ఇచ్చే వస్తువుల్నీ- అంటే బూట్లూ, బెల్టూ, యూనిఫారం, బ్లాంకెట్టు, పాలీష్ డబ్బాలూ, పోలీసుగైడూ లాంటివి పెట్టుకోవటానికి ఇచ్చే ఇనపరేకు పెట్టె

11 బేరక్ - సైనికులూ, పోలీసులూ శిక్షణా కాలంలో నివశించటానికి వుండే పొడవాటి శాలలు

12 పేరెడ్ - కవాతు శరీరాన్ని ధృడపరచేందుకు చేయించే కసరత్తు పోలీసు, మిలటరీ శిక్షణలో ఇది వుంటుంది పోలీసు స్టేషన్లలో కూడా ప్రతి బుధ, శుక్ర వారాలలో ఉదయం పూట పేరెడ్ వుంటుంది

13 లా క్లాసు - కానిస్టేబుళ్ళకవసరమయిన చట్టాలను గురించిన ప్రాధమిక పరిజ్ఞానాన్నీ, పోలీసు స్టేషన్లలో చేయవలసి వచ్చే డ్యూటీల విషయాలను ఈ లా క్లాసుల్లో చెపుతారు

14 రోల్‌కాల్ - కానిస్టేబుళ్ళ ట్రయినింగు కాలంలో వారిని రెండు పుటలా హాజరు వేసుకోవటాన్ని, స్టేషన్లలో ఉదయం ఏడుగంటలకు, సాయంత్రం ఐదుగంటలకు హాజరు పిలవటాన్ని రోల్‌కాల్ అంటారు

15 పీటీ బన్నీను - పేరెడ్ టైమ్‌లో వేసుకునే మందపాటి కాటన్ బన్నీను ఫిజికల్ ట్రైనింగ్ బన్నీను అంటారు

16 సెంట్రీ - కాపలాదారుడు ట్రయినింగ్ పిరియడ్‌లో బేరక్‌లలోని రిక్రూట్‌లు అంతా పేరెడ్‌కూ, లాక్లాసులకు వెళ్ళినప్పుడు ఆయా బేచ్చీల లోని ఒక రిక్రూట్ కానిస్టేబులు వాళ్ళ బేరక్‌కు కాపలా కాస్తాడు అదే డ్యూటీ స్టేషన్లలో తుపాకీ పట్టుకొని చేస్తారు

17 రిక్రూట్ - ప్రొహిబిషన్ పూర్తికాని పోలీసు కానిస్టేబులు

18 పహరా - పోలీసు స్టేషన్లనూ, కేంపులనూ, అధికార్ల బంగాళాలనూ ట్రెజరీలాంటి వాటిని కాపలా కాయటం ఖయిదీలుండే జయిళ్ళకు కూడా ఈ పహారా డ్యూటీ లుంటాయి ఈ డ్యూటీకి గార్డు డ్యూటీలని పేరు గార్డు డ్యూటీల్లో నలుగురు కానిస్టేబుళ్లుంటారు ఒకళ్ళతరువాత ఒకళ్ళుగా ఒక్కొక్కళ్ళూ మూడేసిగంటలు డ్యూటీ చెయ్యాలి తుపాకీ పట్టుకొని నిలబడి కొన్ని సందర్భాల్లో రెండేసిగంటలుంటుంది పహారా

కానిస్టేబులు తోపాటు మిగిలిన ముగ్గురు కానిస్టేబుళ్ళు హాజరులో వుండాలి వీళ్ళని వెయిటింగ్ పీసీలు అంటారు నలుగురికీ డ్యూటీలు మార్చటానికి ఒక సీనియర్ కానిస్టేబుల్‌గానీ, హెడ్‌కానిస్టేబులుగానీ వుంటాడు పహారా పీసీలు ఉదయం ఆరుగంటల నుండి తొమ్మిదింటివరకు ఒకళ్ళు, తొమ్మిదినుండి పన్నెండు గంటల వరకు ఒకళ్ళు - ఇలా మూడేసిగంటలు సెంట్రీ డ్యూటీ చేశాక మూడు గంటలు రెస్ట్ వుంటుంది ఆ మూడు గంటల రెస్ట్ తరువాత వచ్చి యూనిఫారం వేసుకొని వెయిటింగ్‌లో వుండి, అధికారులు చెప్పే వుద్యోగాలు చేస్తూ వుండాలి ఈ మూడుగంటల రెస్ట్ కూడా సాయంత్రం ఆరు గంటల వరకూ డ్యూటీ చేసిన వాళ్ళకే సాయంత్రం ఆరు నుండి రాత్రి తొమ్మిది గంటల వరకూ సెంట్రీ డ్యూటీ చేసినతను ఇంటికెళ్ళి భోంచేసి రావటానికి ఒక్క గంట రెస్ట్ మాత్రమే వుంటుంది ఈ లెఖ్ఖన గార్డు డ్యూటీలోని పీసీలు రోజుకు ఇరవై ఒక్క గంట చొప్పున ఉద్యోగం చేయాలి గార్డు డ్యూటీ చేయాల్సి వచ్చే స్టేషన్లలో గార్డు డ్యూటీ నెలకు షుమారు ఇరవై రోజులు వుంటుంది మిగిలిన పది రోజులు నైటుబీట్లు, ఎస్కార్టులు ఇలా వేరే డ్యూటీలు వుంటాయి

19 మాబులేషన్ - మొబలైజేషన్ అనే ఇంగ్లీషు పదం తెలుగు నుడికారంలో చిక్కుకుపోయి మాబులేషన్‌గా మారింది ఇది కూడా డ్యూటియే ఇదికేవలం జిల్లాల హెడ్ క్వార్టర్సులో వుండే రిజర్వ్ పోలీసులకు మాత్రమే పరిమితం సంవత్సరానికొకసారి, జిల్లాలో వివిధ ప్రాంతాల్లో వుండి బందోబస్తులు చేస్తున్న రిజర్వ్ పోలీసులను, ఆర్డర్లీలుగా వున్న వారిని పిలిపించి రెండు వారాల పాటు కవాతు అభ్యాసం చేయించి, తుపాకులతో జిల్లా హెడ్ క్వార్టరులో వీధుల్లో మార్చింగ్ చేయించటంతో ఇది మూగుస్తుంది బ్రిటిష్ వాడు తన బలాన్ని ప్రజలకు ప్రదర్శించేందుకు పెట్టిన విధానమిది ఆ రెండు వారాలూ, రిజర్వ్ పోలీసులు చేయాల్సిన డ్యూటీలు సివిల్ పోలీసులు చేస్తారు

20 డబ్బా రైటరు - పోలీసు స్టేషనులో రైటరుకు సహాయంగా వుండే ఒక కానిస్టేబుల్ని ఆంధ్రా ప్రాంతంలో డబ్బారైటరనీ, తెలంగాణా ప్రాంతంలో టింగు రైటరనీ ఎగతాళిగా పిలిచే అలవాటు బ్రిటీష్ కాలం నుండీ కొనసాగుతోంది. యస్సై, రైటర్ ఇష్టా ఇష్టాల మీదా, దయాదాక్షిణ్యాల మీదా డబ్బారైటరు ఆ పోస్టులో వుంటాడు లేకుంటే మిగతా కానిస్టేబుళ్ళతో పాటు యూనిఫారం వేసుకొని అతనూ మామూలు డ్యూటీలు చెయ్యాల్సిందే

21 ట్వూనైన్‌టీ పోర్స్ - వ్యభిచార గృహాలలో దొరికే వాళ్ళపై ఇండియన్ పీనల్ కోడ్ లోని సెక్షన్ 294 క్రింద కేసు నమోదు చేస్తారు సాధారణంగా అందువలన వాళ్ళను ఆ సెక్షన్ నిక్‌నేమ్‌తో పిలవటం డిపార్టుమెంటులో పరిపాటయిపోయింది

